

# సంస్కృత సాహిత్య చరిత్ర

డా॥ ముదిగంటి గోపాలరెడ్డి "వేదాలంకార్"
డా॥ ముదిగంటి సుజాతా రెడ్డి



పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

# సంస్కృత సాహిత్య చరిత్ర

(వైదిక వాఙ్మయం - లౌకిక వాఙ్మయం - విమర్శనాత్మకం)



డా॥ ముదిగంటి గోపాలరెడ్డి "వేదాలంకార్"

డా॥ ముదిగంటి సుజాతా రెడ్డి





1997

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

హైదరాబాదు - 500 004

**SANSKRITA SAAHITYA CHARITRA**

(Vaidika vangmayam - Loukika vangmayam - A Critical Approach) by

Dr. Mudiganti Gopala Reddy, Dr. Mudiganti Sujata Reddy.

---



ప్రచురణ సంఖ్య : 190

ప్రథమ ముద్రణ : 1986

ద్వితీయ ముద్రణ : 1997



ప్రతులు : 2000

**వెల : రూ. 100/-**



**ప్రతులకు :**

డైరెక్టర్, ప్రచురణల విభాగం,

**పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం,**

లలితకళాక్షేత్రం,పబ్లిక్ గార్డెన్స్, నాంపల్లి

హైదరాబాదు-500 004.

**ముద్రణ :**

**శ్రీ దత్తసాయి గ్రాఫిక్స్**

నల్లకుంట, హైదరాబాదు, ఫోన్ : 7633275, 3020719.

ISBN 81-860 73 - 24 - 8.

ఆచార్య నాయని కృష్ణకుమారి
ఉపాధ్యక్షులు
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం,



లలిత కళాతోరణం, పబ్లిక్ గార్డెన్స్,
హైదరాబాద్ - 500 004.

# సమర్పణ

బోధన పరిశోధన, ప్రచురణ అనే మూడు విషయాలు లక్ష్యంగా, తెలుగు సాహిత్యం, భాష, చరిత్ర, కళలు - సంస్కృతి వంటి రంగాలలో కృషి సల్పడానికి 1985వ సంవత్సరంలో తెలుగు విశ్వ విద్యాలయం ఆవిర్భవించింది. పూర్వం ఉన్న ఆంధ్రప్రదేశ్ సాహిత్య, సంగీత, నాటక, నృత్య, లలితకళా అకాడమీలు ఇందులో విలీనం కావడం వలన పైన పేర్కొన్న లక్ష్యాలతో పాటు మరెన్నో బాధ్యతలు దీనికి సంక్రమించాయి. అన్ని విశ్వవిద్యాలయాల వలే కేవలం పఠన పాఠనాలతో సరిపెట్టుకునే అల్ప పరిధి కాదు దీనిది. మన సంస్కృతిని ప్రపపంచం నలుమూలలకూ వ్యాప్తి చేయడానికి ఉద్దేశింపబడిన "సాంస్కృతిక విశ్వవిద్యాలయ"మిది. ప్రచార సాధనకు పరికరమే ప్రచురణ.

ప్రచురణ కార్యక్రమానికి అనుగుణంగా, ఈ విశ్వవిద్యాలయంలో యిప్పటికెన్నో ప్రముఖ గ్రంథాలను ప్రచురించింది. వ్యాఖ్యా స్రవంతి శీర్షికన సుప్రసిద్ధ పండితులచే ప్రాచీన కావ్య ప్రబంధాలకు వ్యాఖ్యానాలు వ్రాయించి ప్రచురించింది. ఇప్పటి వరకు ఈ ప్రణాళికలో కుమార సంభవం, కాశీ ఖండం, శివరాత్రి మాహాత్మ్యం వంటి గ్రంథాలను వ్యాఖ్యా సహితంగా ముద్రించింది.

తెలుగులో పేరుపొందిన ప్రాచీన ఆధునిక గ్రంథాలను ఇంగ్లీషు, హిందీ భాషల లోనికి అనువాదం చేయించి ప్రచురించింది.

తెలుగులో విజ్ఞాన సర్వస్వ సంపుటాలను తయారుచేయించే కార్యక్రమంలో 'విశ్వసాహితి'ని 'హిస్టరీ అండ్ కల్చర్ ఆఫ్ ది ఆంధ్రాస్' అనే పేరుతో ఆంగ్లంలో ఒక సంపుటాన్ని ప్రచురించింది.

భాషాభివృద్ధి కృషిలో భాగంగా తెలుగు భాషా చరిత్ర, ద్రావిడ భాషలు అనే గ్రంథాలను పునర్ముద్రించింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంఘీక సంక్షేమ శాఖ వారి సహకారంతో డాక్టర్ బి. ఆర్. అంబేద్కర్ రచనలు ప్రసంగాలను పది సంపుటాలుగా ప్రచురించింది.

సంస్కృతానికీ తెలుగుకూ ఉన్న అవినాభావ సంబంధం అందరికీ తెలిసినదే. ఆ భాషలో ప్రపంచ ప్రసిద్ధి చెందిన ఉత్తమోత్తమ కావ్య నాటకాదులు, వివిధ ప్రక్రియలు ఎన్నో ఉన్నాయి. భారతీయ సాహిత్యంలో వివిధ భాషల్లో ఉన్న ఎన్నో గొప్ప రచనలకు మూలాలు సంస్కృత భాషలోనివే. ఇది మన దేశానికే సంబంధించిన "సాంస్కృతిక భాష" - ఆ భాషకు సంబంధించిన సాహిత్య చరిత్రను అన్ని భాషలూ వెలువరించ వలసినదే. తెలుగులో ఆ పనిని, విద్యారంగంలో పేరుగన్న దంపతులు డా॥ ముదిగంటి గోపాలరెడ్డి, డా॥ సుజాతా రెడ్డి గార్లు సంయుక్తంగా పూర్తి చేశారు. దాని తొలి ముద్రణను 1986లోనే విశ్వ విద్యాలయం వెలువరించింది. ఇప్పుడు తిరిగి ఈ మలి ముద్రణను మీ ముందుంచుతున్నది. చిన్న చిన్న సవరణలు రచయితలే చేసి ముద్రణకనుకూలమైన ప్రతిని అందించినందుకు రచయితల నభినందిస్తున్నాను. ఈ గ్రంథాన్ని పాఠకలోకానికి విశ్వవిద్యాలయం పక్షాన సమర్పిస్తున్నాను.

హైదరాబాదు
28-3-1997

**నాయని కృష్ణకుమారి**

# అంకితం



## శ్రీ దేవులపల్లి రామానుజరావు

"ఇజా"లతో, పాత కొత్తలతో పనిలేకుండా
సాహిత్యాభిమానాన్ని ప్రకటిస్తూ.....
వయోభేదం లేక మౌలికతను చూసి
గుణపక్షపాతులై హర్షించే సాహిత్య ప్రియులు.....
ఎప్పుడూ చిరునవ్వులతో అవ్యాజానురాగంతో
పల్కరించి అభిమానం చూపే సౌజన్యమూర్తులు.....
పరులను నొప్పించకుండానే తమ అభిప్రాయాలను
మొగమాటం లేక ప్రకటించే నిర్భీక వర్తనులూ.....
నిరాడంబర వ్యక్తి
శ్రీ దేవులపల్లి రామానుజరావు గారికి
ఈ పుస్తకాన్ని అంకితంగా ఇయ్యడానికి సంతోషిస్తున్నాం.

-రచయితలు

# శ్రీః

సంస్కృతభాష ఎంత ప్రాచీనమైందో సంస్కృత వాఙ్మయం అంత విస్తృతమైనది. గాంధార దేశం మొదలు బ్రహ్మదేశం వరకు నేపాల కాశ్మీరాది సుదూరోదీచ్య దేశాలు మొదలు కన్యాకుమారి వరకు కొన్ని వేల సంవత్సరాల నుండి సకల భారతదేశాఖండత్వానికి ప్రతీకగా నిలచిన అత్యద్భుత భాష సంస్కృతం. అతిక్లిష్ట విషయాలను కూడా ఒక నిశ్చిత పద్ధతిలో అత్యల్పమైన మాటలలో ప్రసాదించే శక్తి ఈ భాషకున్నంతగా మరియే భాషకూ లేదని చెప్పడంలో అతిశయోక్తి లేదు. అందుచేతనే అతి పురాతన కాలంనుంచి ఒకటి రెండు శతాబ్దాల క్రితం వరకూ మానవుని మేధాశక్తి కనుగొన్న విషయాలన్నీ సంస్కృత వాఙ్మయంలో చోటు చేసుకొన్నాయి. కులమత ప్రాంతాది భేదాలు ఏవీ లేకుండా సువిశాల భారతదేశంలో ఈ భాషా వాఙ్మయాలు అమితాదరణ పొందడానికి కారణం, తాదృశ భేదాలేవీ లేకుండా భారతదేశంలోని మేధావులందరూ తమతమ రచనలచేత దీనిని సుసమృద్ధం చేయడమే. ఈ వాఙ్మయంలో లేని విషయాలు లేవు. ఐహికములూ, పారలౌకికములూ అయిన ఫలాలనుద్దేశించిన అనేక కర్మలను బోధించే వేదాల వ్యాఖ్యాన రూపమైన పూర్వ మీమాంసా శాస్త్రం, ఆధ్యాత్మిక విద్యను బోధించే ఉత్తర మీమాంసా శాస్త్రం, సాంఖ్యయోగ న్యాయవైశేషికాది దర్శన శాస్త్రాలు, వ్యాకరణం, ఖగోళశాస్త్రం, గణితశాస్త్రం, ఆయుర్వేదం, యుద్ధ శాస్త్రం, భౌతిక శాస్త్రం, రసాయన శాస్త్రం, పశ్వాయుర్వేదం, వృక్షాయుర్వేదం, సంగీత శాస్త్రం, నాట్యశాస్త్రం, అర్థశాస్త్రం, కామశాస్త్రం, స్థాపత్యశాస్త్రం, వాస్తు శాస్త్రం, తంత్ర శాస్త్రం, మంత్ర శాస్త్రం, సాహిత్య శాస్త్రం, ఇతిహాసాలు, పురాణాలు, వివిధ కావ్య నాటకాది సాహిత్య గ్రంథాలు, --ఈ విధంగా అపారమైనది ఈ వాఙ్మయం. ఒకమాటలో చెప్పవలసివస్తే ప్రపంచంలోని ప్రాచీన వాఙ్మయాలలో దీనికిదే సాటి.

1840 సంవత్సరంలో ఎల్ఫిన్స్టీన్ అనే పాశ్చాత్య పండితుడు తన కాలంనాటికి లభ్యమయే సంస్కృత గ్రంథాలు లెక్కవేసి వాటిసంఖ్య గ్రీక్ - లాటిన్ భాషలు

రెండింటిలోనూ ఉన్న మొత్తం గ్రంథాల సంఖ్యకంటె అత్యధికమైందని అన్నాడు. అయితే ఆ నాటికి పాశ్చాత్య దృష్టిలోనికి వచ్చిన సంస్కృత గ్రంథాల సంఖ్య అత్యల్పమే. 1830 ప్రాంతానికి ఫ్రెడరిక్ వంటి పండితులు కనుగొన్నది 350 గ్రంథాలు మాత్రమే. 1852లో సంస్కృత సాహిత్యేతిహాసం వ్రాసిన వేబర్ 500 గ్రంథాలను పరామర్శించాడు. తరువాత ఆయనకు కొన్ని గ్రంథాలు లభించాయి. ఆ విధంగా ఆయన మొత్తం 1300 గ్రంథాలు కనుగొన్నాడు. 1840 ప్రాంతంనాటికే ఎల్ఫిన్స్టన్ ఆ విధంగా చెప్పినాడంటే కాలాంతరంలో లభించిన గ్రంథాలను చూచి ఉంటే ఆయన ఇంకా ఎంతగా ఆశ్చర్యపడి ఉండేవాడో! 1891 ప్రాంతంలో థియోడర్ అవుఫ్రెస్టు కెటాలోగుస్ కెటాలోగారుం అనే గ్రంథ సూచికలో దాదాపు 32000 గ్రంథాలు పేర్కొన్నాడు. మహా మహోపాధ్యాయ పండిత హరప్రసాదశాస్త్రి నేపాల్‌నుంచి కూడా అనేక గ్రంథాలను సేకరించి 40,000 గ్రంథాలకు పైగా పేర్కొన్నాడు. ఇది 1916 సంవత్సరం నాటిమాట. అది మొదలు రాహులసాంకృత్యాయన మొదలైన పండితులు మధ్య ఆసియా, టిబెట్టు, నేపాలు మొదలైన ప్రాంతాలలో భద్రంగా రక్షింపబడి, అజ్ఞాతంగా ఉండిపోయిన అనేక సంస్కృత గ్రంథాలను కనుగొన్నారు. ఇంకా ఎన్నో గ్రంథాలు ఆయా లిఖిత గ్రంథాలయాలలోను, కొందరు సంస్థానాధిపతుల వైయక్తిక గ్రంథాలయాలలోను అవిజ్ఞాతంగా ఉన్నాయి. 1978లో శ్రీ కె.టి. పాండురంగి ప్రకటించిన "The wealth of Sanskrit Manuscripts in India and Abroad" అనే పుస్తక ప్రకారం ఆయా గ్రంథాలయాదులలో 500570 (ఐదున్నర లక్షలకుపైగా) సంస్కృత గ్రంథాలు ఉన్నాయి. వీటిలో సమానప్రతులు (duplicate copies)గా నాలుగులక్షల గ్రంథాలు తీసివేసినా కనీసం ఒక లక్షగ్రంథాలు ఉంటాయి. ఇంత విస్తృతమైనది ప్రాచీన సంస్కృత వాఙ్మయం. అందుచేతనే జవహర్‌లాల్ నెహ్రూ "డిస్కవరీ ఆఫ్ ఇండియా" అనే గ్రంథంలో ప్రతి భారతీయుడూ గర్వించవలసిన అద్భుత సంపద సంస్కృత భాషా వాఙ్మయాలు అని వ్రాసి ఉన్నాడు. —"If I was asked what is the greatest treasure which India possesses and what is her richest heritage, I would answer unhesitatingly - it is the Sanskrit language and literature and all that it contains. This is a magnificient inheritance and so long as this endures and influences the life of our people, so long the basic genius of India will Continue" (Discovery of India).

"భారతదేశానికున్న గొప్ప సంపద ఏది? దాని అత్యద్భుతమైన పారంపర్యం ఏది? అని ఎవరైనా నన్ను అడిగితే - సంస్కృత భాషా వాఙ్మయాలూ వాటిలో సునిక్షిప్తాలై ఉన్న విషయాలే అని నేను నిస్సంశయంగా సమాధానం చెపుతాను. ఇదే ఈ దేశానికున్న అత్యద్భుత పారంపర్యాగతమైన ధనం. ఇది భారతీయుల జీవనవిధానాన్ని ప్రభావితం చేస్తూన్నంత కాలమూ భారతీయుల మౌలిక చేతన సుస్థిరంగా ఉంటుంది" అని దీని భావం.

ఇంత విస్తృతమైన ఈ సంస్కృత వాఙ్మయాన్ని మన సౌకర్యం కోసం ఈ క్రింది విధంగా విభజించవచ్చును.

1. వైదిక సాహిత్యము
2. వేదాంగసాహిత్యము (శిక్షా-వ్యాకరణ ఛందో-నిరుక్త జ్యోతిష-కల్పాలు)
3. ఇతిహాసాలు (రామాయణ మహాభారతాలు)
4. పురాణాలు (18 మహాపురాణాలు, 18 ఉపపురాణాలు, 18 ఉపోప పురాణాలు మొ॥ )
5. ధర్మ శాస్త్రము
6. అర్థ శాస్త్రము
7. కామ శాస్త్రము
8. దర్శనాలు (ఆరు ఆస్తిక దర్శనాలు ఆరు నాస్తిక దర్శనాలు)
9. బౌద్ధ సాహిత్యము
10. జైన సాహిత్యము
11. ఆయుర్వేదము
12. గాంధర్వ వేదము
13. ధనుర్వేదము
14. శిల్ప వేదము (ఈ నాలిగింటికీ ఉపవేదాలని పేరు)
15. తంత్ర శాస్త్రము
16. కావ్యనాటకాదులు
17. సాహిత్య (అలంకార) శాస్త్రము
18. శిలాశాసనాదులలోని సాహిత్యము

వీటిలో ఒక్కొక్క శాఖకు సంబంధించిన గ్రంథాల చరిత్ర వ్రాయాలంటే కూడా అది విస్తృతమైన గ్రంథం అవుతుంది. భారతీయ పండితులకు ఆయా

శాస్త్రాదులకు సంబంధించిన గ్రంథాలు, వ్యాఖ్యోపవ్యాఖ్యానాదులు రచించే అలవాటు ఉన్నది కాని వాఙ్మయంలోని ఒక్కొక్క శాఖను తీసికొని దానికి సంబంధించిన చరిత్రను తెలిపే గ్రంథాలు వ్రాసే అలవాటు లేదు. ఈ పద్ధతి పాశ్చాత్య పండితుల నుండి మనం నేర్చుకున్న కొన్ని మంచి విషయాలలో ఒకటి.

సంస్కృత వాఙ్మయాన్ని వైదిక వాఙ్మయము, లౌకిక వాఙ్మయమూ (classical sanskrit literature)అని రెండు భాగాలుగా విభజించడం అలవాటు. ఆ ప్రకారం ఎందరో పాశ్చాత్య విద్వాంసులు, తదనుసారులైన భారతీయ మనీషులూ కూడా సంస్కృత వాఙ్మయ చరిత్రగ్రంథాలు రచించారు. వీటిలో కొన్ని అన్ని ప్రక్రియలనూ సంక్షిప్తంగా పరిచయం చేసేవి ఉన్నాయి. ఆయా ప్రక్రియలను తీసికొని విశేషరూపంలో చర్చించేవి కొన్ని ఉన్నాయి. భారతీయ దర్శనాలు, వ్యాకరణం, న్యాయశాస్త్రం, అలంకార శాస్త్రం, గణితశాస్త్రం, పురాణాలు మొదలైన వాటి చరిత్రను వర్ణించేవి రెండవతరగతికి చెందినవి. ఆయా శాస్త్రాల విశేషాధ్యయనం చేసే వారికోసం ఉద్దిష్టమైన గ్రంథాలు అవి. అవి కూడా ఆంగ్లభాషలోనూ, హిందీ మొదలైన భారతీయ భాషలలోనూ ప్రామాణికంగా వ్రాయబడి ఉన్నాయి.

విశ్వ విద్యాలయాలలో సంస్కృత భాషావాఙ్మయాల అధ్యయనం చేసే వారందరికీ సాధారణంగా ఉపయోగించేదీ, అపేక్షితమైనదీ అయినది సాహిత్య చరిత్ర; అనగా కావ్య నాటకాదుల చరిత్ర, కొంతవరకు వైదిక వాఙ్మయ చరిత్ర; కావ్యనాటకాదులకు సంబంధించిన దవడంచేత అలంకారశాస్త్ర చరిత్రకూడా అవసర మైనదే. వీటికి సంబంధించిన గ్రంథాలు ఆంగ్ల భాషలోనూ హిందీ మొదలైన భాషలలోనూ కూడా ఉన్నాయి. సర్వాంగ సంపూర్ణమూ, ప్రామాణికమూ అయిన ఇలాంటి వాఙ్మయచరిత్ర తెలుగులో ఈనాటివరకూ వెలువడలేదంటే, తెలుగు సర్వతోముఖాభివృద్ధికి ఎంతో ప్రయత్నం జరుగుతున్నదని చెప్పే ఈ కాలంలో ఆశ్చర్యకరంగా ఉంటే ఉండవచ్చును కాని ఇది యథార్థమైన విషయం. మా మిత్రులు డా. యమ్. గోపాలరెడ్డిగారు, వారి పత్ని డా॥ సుజాతగారు నిరంతర ప్రయత్న ఫలితంగా ఈ గ్రంథం రచించి తెలుగులో ఆ లోపాన్ని తీర్చడం చాలా ముదావహం

సాధారణంగా సంస్కృత వాఙ్మయ చరిత్రలు వ్రాసిన పాశ్చాత్య పండితులు, భారతీయ విద్వాంసులూ కూడా ఒకే గ్రంథంలో వైదిక లౌకిక వాఙ్మయాలకి

సమప్రాధాన్యం ఇచ్చి వ్రాయడం అరుదుగా జరుగుతున్నది. అయితే ఈ గ్రంథంలో లౌకిక వాఙ్మయంతో పాటు వైదిక వాఙ్మయాన్ని కూడా విస్తృతంగా వర్ణించడం జరిగినది. 168 పేజీలలో వైదిక వాఙ్మయమూ వేదాంగాలూ, వేదాలలోని దేవతలు, ఆర్యానార్య వాద పరిశీలన మొదలైన విషయాలు చక్కగా ప్రతపాదింపబడినవి. 171-184 పేజీలలో పురాణాల సంక్షిప్త పరిచయం ఉన్నది. 187-192 పేజీలలో స్మృతి వాఙ్మయ పరిచయంకూడా సంక్షిప్తంగా చేయబడినది.

దాదాపు 15 పేజీలలో (195-209) చర్చించబడిన సంస్కృతభాషా సాహిత్యాల వైశిష్ట్యము, సంస్కృతభాషకు పాశ్చాత్యులు చేసిన సేవా మొదలైన విషయాలు ప్రామాణికంగాను పఠితలకు నూతన విషయగ్రహణోపయుక్తాలుగానూ ఉన్నాయి.

భారతదేశ సంస్కృతిని రామాయణ మహాభారతాలు ప్రభావితం చేసినట్లుగా మరి ఏ గ్రంథాలూ, ఏదేశ సంస్కృతినీ కూడా ప్రభావితం చేయలేదు. మనదేశ సంస్కృతిమీద వాటికున్న ప్రభావం ఈనాటికి కూడా కనబడుతున్నది. "మూలరూపంలోనే కాకుండా అనువాదాల రూపంలోనూ, కొన్ని మార్పులు చేసిన రూపాలలోనూ ఈ రామాయణ మహాభారతాలు మానవజీవితాన్ని ప్రభావితం చేసినట్లుగా మరే గ్రంథమైనా చేసినట్లు నాకు తెలియదు'' అని జవహర్లాల్ నెహ్రూ ఈ ఇతిహాసాల వైశిష్ట్యాన్ని Discovery of India లో సూచించినాడు. I do not know of any books anywhere which have exercised such a continuous and pervasive influence on the mass mind as these two (Ramayana and Mahabharata). Dating back to a remote antiquity they are still a living force, in the life of the Indian people, not in the original Sanskrit, except for a few intellectuals, but in translations and adaptions and in those innumerable ways in which tradition and legend spread and become a past of the texture of a people's life" (Discovery of India)

ఈ రామాయణ భారతాలలో రామాయణం త్రేతాయుగానికి చెందినదవడంచేత ప్రాచీనమైనదనీ, ద్వాపర యుగాంతానికి చెందిన మహాభారతం అర్వాచీనమని సాంప్రదాయికుల నిశ్చితాభిప్రాయం. కథల పౌర్వాపర్యాలమాట ఎలా వున్నా గ్రంథాలకు సంబంధించినంత వరకు భారతమే రామాయణం కంటె ప్రాచీనమనే

పాశ్చాత్య విద్వాంసులు కొందరున్నారు. ఇంక ఈ గ్రంథాలలో ఏ భాగాలు ప్రక్షిప్తాలు, ఏవి మౌలికాలు అంటూ అనేక వాదాలు ఉన్నాయి. లంక మొదలైన రామాయణ వర్ణిత ప్రదేశాదుల నిర్ధారణ గూర్చిన వివాదాలు ఉండనే ఉన్నాయి. ఇవి ఎవరూ నిర్ణయించకలిగినవి కాదు. ఇలాంటి విషయాల నన్నింటినీ సూచిస్తూ 36 పేజీలలో (210-246) ఈ ఇతిహాసాల విస్తృత పరిచయం ఇవ్వబడింది.

సంస్కృత వాఙ్మయంలో మహాకావ్యాలకు చాలా ప్రాధాన్యం ఉన్నది. భారతీయ సంప్రదాయం ప్రకారం మహాకావ్య రచనా రీతికి నాంది పలికినవాడు వాల్మీకి మహర్షి. ఆయన రచించిన ఆది కావ్యాన్ని అనుకరిస్తూ అనేక మహా కావ్యాలు బయలుదేరినాయి. అయితే ఆ ప్రాచీన మహాకావ్యాలన్నీ కాలగర్భంలో కలిసిపోయినాయి. కాళిదాసు అశ్వఘోషుని కంటె ప్రాచీనుడు అనే వాదాన్ని అంగీకరిస్తే మనకీనాడు సంపూర్ణ రూపంలో లభిస్తున్న వాటిలో అతి ప్రాచీనమైనవి కాళిదాసుని కావ్యాలే. 'మహాకావ్యాలు' అనే శీర్షిక క్రింద మహాకావ్యాల పుట్టుపూర్వోత్తరాలను చర్చించి దాదాపు యాభైమంది (50) కవులను, వారి కావ్యాలను గూర్చిన విమర్శ 87 పేజీలలో (249-336) చేయబడినది. కొందరు పాశ్చాత్య పండితుల గ్రంథాలలోనికి ఎక్కని ఎందరో మహాకవులను కూడా ఈ భాగంలో చేర్చడం జరిగినది.

అతి ప్రాచీనకాలం నుంచీ భారతీయుల మన్ననలు అందుకొన్న సాహిత్య ప్రక్రియ రూపకం. రూపకాల బీజాలు వేదాలలోనే ఉన్నాయని భారతీయ పండితులు సయుక్తికంగా ప్రదర్శించి రూపక రచనా విధానం పూర్తిగా భారతీయమే అని నిరూపించగా, ప్రపంచంలో ఉన్న ఏ మంచి విషయానికైనా ఉత్పత్తి స్థానం గ్రీస్ దేశమే అని చెప్పే కొందరు పాశ్చాత్య విమర్శకులు "భారతీయుల రూపకకళ గ్రీస్ దేశీయ రూపకకళపై ఆధారపడినదని వాదించారు. "రూపకాలు" అనే శీర్షికగల 205 పేజీల భాగంలో రచయితలు ఈ విషయాలన్నీ చక్కగా చర్చించి దాదాపు తొంభై ముగ్గురు (93) కవులను, వారి రూపకాలను గూర్చి ముచ్చటించారు(339-543).

సంస్కృతాలంకారికుల సిద్ధాంతం ప్రకారం హృదయాన్ని స్పందింప చేయగల అర్థాన్ని ప్రతిపాదించే ఒక చిన్నవాక్యం కూడా కావ్యమే. ఇది ఒక పంక్తి కావచ్చు, శ్లోకం కావచ్చు, శ్లోక సముదాయం కావచ్చు. వీటికి లఘు కావ్యాలని పేరు. "లఘుకావ్యాలు-శ్లోక సంగ్రహగ్రంథాలు" అనే శీర్షిక క్రింద (547-636 పేజీలు) ఇలాంటి కావ్యాల

పరిచయం ఇవ్వబడింది. సందేశకావ్యాలు, శతకాలు, స్తోత్రాలు, గీతికావ్యాలు ఇవన్నీ ఈ లఘుకావ్యాల కోటికి చెందుతాయి. ఆయా కావ్యాలలో ఉన్న రసవత్తరమైన శ్లోకాలు ఏర్చి కూర్చినవి "సంగ్రహ గ్రంథాలు". ఏతాదృశ గ్రంథరచనా సంప్రదాయం పన్నెండవ శతాబ్దినుంచీ ప్రచారంలో ఉన్నది. తాదృశ గ్రంథాల పరిచయం ఈ భాగం చివర ఉన్నది.

ఛందోబద్ధమైతేనే కవిత్వం అనే భ్రాంతి ఎప్పుడైనా ఏ ఇతర భాషా సాహిత్యాలలో ఉండేదేమో కాని సంస్కృత సాహిత్యానికి సంబంధించినంతవరకు మాత్రం అలాంటి అభిప్రాయం ఏనాడూలేదు. ఛందోబద్ధ రచన ఎంత ప్రాచీనమో గద్యరచన కూడా అంత ప్రాచీనమైనదే. ఋగ్వేదాదులలో ఛందః ప్రయోగం కనబడితే యజుర్వేద - ఐతరేయ బ్రాహ్మణాదులలో గద్య నిర్మాణమే అత్యధికంగా గోచరిస్తుంది. నిజానికి పద్యం వ్రాసి పరితల తలలూపించవచ్చు కాని గద్యం వ్రాసి వాళ్ళచేత ఓహో అనిపించుకోవటం చాలా కష్టమైన పని. అందుచేతనే "గద్యం కవీనాం నికషం వదన్తి" అనే ఉక్తి సంస్కృతంలో ఉన్నది. "గద్యరచనయే కవులకు గీటురాయి" అని దీని అర్థం. అలాంటి గద్యకావ్యాలు కూడా లౌకిక వాఙ్మయంలో అనేకం ఉన్నాయి. వాటి స్వరూప స్వభావాలను ప్రతిపాదిస్తూ సుబందు బాణ దండ్యాది రచనలను గూర్చి విస్తృతంగాను, తదితర రచయితల గ్రంథాలను గూర్చి సంక్షిప్తంగాను 34 పేజీలలో (639-673 పే.) చర్చించబడింది.

ఐతిహాసిక విషయాలను కథావస్తువుగా గ్రహించి రచించిన కొన్ని కావ్యాలు అతి ప్రాచీనకాలం నుంచీ సంస్కృత సాహిత్యంలో ప్రచారంలో ఉన్నాయి. చారిత్రక కావ్యాలు అనే శీర్షిక క్రింద 40 పేజీలలో (677-717 పే.) ఈ రచయితలు అతి ప్రాచీనమైన "హర్షచరితం" మొదలు అత్యాధునికమైన "శివ రాజ్యోదయం" వరకు దాదాపు 42 కావ్యాలను గూర్చి చర్చించినారు. ఈ విషయాలన్నీ పాశ్చాత్య పండితులు వ్రాసిన గ్రంథాలలో లభించని విషయాలు.

గద్యపద్యాలు రెండూ చక్కగా మేళవించి వ్రాసిన కావ్యం చంపూకావ్యం. "గద్యపద్యోభయమయం చమ్పూరిత్యభిధీయతే" (దండి) గద్యపద్యాల కలయిక మాధ్వీక మృద్వీకాల (ద్రాక్షామధువుల) కలయికవలె రసవత్తరంగా ఉంటుందంటాడు ఒక మహాకవి. ఈ ప్రక్రియనే మన తెలుగు కవులు తమ ప్రబంధాలలో స్వీకరించారు.

అలాంటి చంపూకావ్యాల చర్చ 31 పేజీలలో (723-754 పే.) చేయబడినది. చంపూకావ్యాలు అసంఖ్యాకంగా వున్నాయి. ఈ భాగంలో 46గురు కవుల రచనల పరిచయం ఉన్నది.

'కథాకావ్యాలు' అనే శీర్షికతో 22 పేజీలలో (757-779 పే.) 'బృహత్కథ' మొదలైన 20 కథాకావ్యాల పరిచయం ఇవ్వబడింది.

ప్రపంచంలోని నీతికథా సాహిత్యంలో పంచతంత్రానికి ఉన్న ప్రాముఖ్యం అనితర సాధారణమైనది. ఏ భాషలలోనైతేనేమి ముద్రించిన ప్రతుల సంఖ్యనుబట్టి ప్రపంచంలో ముద్రితాలైన గ్రంథాలలో పంచతంత్రానిది రెండవ స్థానమంటారు. (మొదటి స్థానం బైబిలుదట). ఆ పంచతంత్రాన్ని గూర్చి 14 పేజీలలో (779-793పే.) చర్చించడం యుక్తంగా ఉన్నది.

అతివిస్తృతమైన అర్థాన్ని చిన్న వాక్యంలో ఇమడ్చడానికి ఆనుకూల్యమూ, ఒకే వాక్యానికి అనేకమైన అర్థాలు వచ్చేటట్లు ప్రయోగించడానికి తగిన శక్తి సంస్కృత భాషకున్న అనితరభాషా సాధారణమైన వైశిష్ట్యాలు. వీటిని చక్కగా వాడుకొని కొందరు మహాకవులు బుద్ధికి మేత ఇచ్చే అనేక కావ్యాలు రచించారు. వీటిలో ఏకాక్షర ద్వ్యక్షరాది శ్లోకాలూ, ఏదో ఒక చిత్రంగీసి దానిపై ఒక పద్ధతిలో అమర్చడానికి వీలుగా ఉండేటట్లు రచించిన శ్లోకాలూ ఈ కోవకు చెందుతాయి. దీనిని మించిన ఘనకార్యం ఒక కావ్యం అంతా రెండు, మూడు, నాలుగు, ఐదు అర్థాలుకూడా వచ్చేట్లు వ్రాయడం. ఇలాంటి రచనల సంక్షిప్త పరిచయం "చిత్రకావ్యాలు" అనే విభాగంలో (797-804 పే.) చేయబడినది.

కావ్యాలు లక్ష్యాలైతే అలంకారశాస్త్రం లక్షణశాస్త్రం. ఈ రెండింటికీ అవినాభావసంబంధమున్నది. సంస్కృత భాషలో అలంకారశాస్త్ర చరిత్ర అతి ప్రాచీనమైనది. క్రీస్తుకు పూర్వం భరతుడు రచించిన నాట్యశాస్త్రం దీనికి ఇపుడు లభ్యమౌతున్న అతిప్రాచీన మూలగ్రంథం. అంతకు పూర్వంకూడా అనేక గ్రంథాలు ఉన్నట్లు భరతుడు సూచించి ఉన్నాడు. కాని అవి ఇపుడు అలభ్యములు. ఆ అలంకార శాస్త్రగ్రంథాల పరిచయం 64 పేజీలలో (807-871 పే.) ఇవ్వబడింది. చివరి తొమ్మిది పేజీలలో వైదిక లౌకిక నిఘంటువుల సంక్షిప్త వర్ణనం ఉన్నది.

ఈ విధంగా దాదాపు నలభై ఏడు (47) గ్రంథాలను పరిశీలించి, ప్రధాన విషయాలేవీ జారిపోకుండా చూచుకుంటూ, సులభమైన శైలిలో అతివిస్తృతమైన సంస్కృత వాఙ్మయ చరిత్రను రచించిన శ్రీ గోపాలరెడ్డి దంపతుల పరిశ్రమ సర్వదా ప్రశంసనీయము. ఈ ఉత్తమ గ్రంథం సంస్కృత విద్యార్థులకే కాక సంస్కృత వాఙ్మయ స్వరూప జిజ్ఞాసువులైన ఇతరులకు కూడ పూర్తిగా ఉపకరించగలదని నా దృఢ విశ్వాసం.

ఈ గ్రంథాన్ని ప్రచురించాలని మూడు నాలుగు సంవత్సరాలక్రితం నిర్ణయించిన, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి ఆనాటి అధ్యక్షులైన డా. గోపాలరెడ్డిగారు, కార్యదర్శులైన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు, వారి నిర్ణయం వమ్ముకాకుండా సఫలం అయ్యేటట్లు చేసిన తెలుగు విశ్వవిద్యాలయోపాధ్యక్షులు ఆచార్య తూమాటి దోణప్పగారు, అందరికంటె ప్రధానంగా ఏతద్గ్రంథ రచయితలు - వీరందరూ సంస్కృతాభిమానులైన తెలుగువారికి ధన్యవాదార్హులు.

ఉస్మానియా విశ్వవిద్యాలయం
హైదరాబాదు.
30-7-1986

**పుల్లెల శ్రీరామచంద్రుడు**

# మామాట

పశ్చిమ జర్మనిలోని టుబింగెన్ గ్రంథాలయంలోని ఓరియంటల్ విభాగంలో భారతాధ్యయనానికి సంబంధించిన పుస్తకాలు చాలా వున్నవి. టుబింగెన్ యూనివర్శిటీలోని భారతాధ్యన శాఖ చాలా ప్రాచీనమైంది, ప్రసిద్ధమైంది. అక్కడ రుడాల్ఫ్ రోథ్, గ్లాసెనవ్, పాల్ థీమే వంటి ప్రసిద్ధ సంస్కృత పండితులు ఆచార్య పీఠాన్నలంకరించారు. అక్కడ గోపాలరెడ్డి గారు 2 1/2 సంవత్సర కాలం (1966-68) సంస్కృత హిందీ భాషలను బోధించేవారు. నేను యూనివర్శిటీ గ్రంథాలయంలో 2 1/2 సంవత్సరాల కాలం (1966-68) ఓరియంటల్ విభాగంలో పనిచేసాను. భారతాధ్యయనానికి సంబంధించిన పాశ్చాత్య, భారతీయ ప్రకాశకులు పంపిన గ్రంథసూచికల్లోని పుస్తకాలను గ్రంథాలయంలో వున్నవి లేనివి పరిశీలించి కొనేటందుకుగాను పట్టికను తయారు చేయటం, ఒకవేళ వున్నా కొత్త వ్యాఖ్యానంతో గాని కొత్త ప్రకాశకులయితే గాని కూడా కొనేటందుకు పట్టికలో చేర్చడం వంటి పనులను చేసేదాన్ని. అదేగాక కొన్న పుస్తకాలను చూసి ఆ పుస్తకాలు ఏ విషయానికి సంబంధించినవో తెలియటానికి ప్రతి పుస్తకానికి విషయ పరిచయం వ్రాయటం కూడా చేసేదాన్ని. తర్వాత ఖాళీ వున్నప్పుడు గ్రంథాలయంలో పుస్తకాలను తీసుకొని చదివేదాన్ని. అట్లా భారతాధ్యయనానికి సంబంధించిన పండిత విమర్శకుల పుస్తకాలతో నాకు పరిచయమేర్పడింది. ఆ పుస్తకాలను చదివి నేను తెలుసుకొన్న విషయాలను, అవి చదువుతుంటే నాలో కలిగిన నూతన భావాలను తెలుగులో చెప్పాలన్న తపన కలిగేది. అప్పుడే నేను ఎంతో నోట్స్ తయారు చేసాను. తర్వాత భారతదేశానికి వచ్చింతర్వాత పుస్తక రూపంగా వ్రాయటం జరిగింది. తర్వాత నా పఠన పాఠనాలు తెలుగు సాహిత్యమైనా మక్కీకి మక్కీగా అనువాదాలు చేసిన సంస్కృత కావ్యనాటకాదులతో పరిచయం చాలా నాకు ఏర్పడింది. ఈ పుస్తకం ఎక్కువ ఆధికారికంగా విమర్శనాత్మకంగా రూపొందటానికి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో సంస్కృత శాఖలో ఆచార్యులైన నా భర్త గోపాలరెడ్డిగారు ముందుకు రావలసి వచ్చింది.

జర్మన్, ఇంగ్లీషు భాషల్లో పాశ్చాత్య, భారతీయ పండిత పరిశోధక విమర్శకులు వ్రాసిన సంస్కృత సాహిత్యచరిత్ర గ్రంథాలు చాలా వున్నవి. అవన్నీ 19వ శతాబ్దంలోను 20వ శతాబ్దం ఆరంభం అంటె దాదాపుగా మొదటి ప్రపంచ యుద్ధం వరకే వ్రాయబడినవి. జర్మన్, ఇంగ్లీషు భాషల్లోని సాహిత్య చరిత్రలు హిందీలోకి అనువాదం కూడా చేయబడినవి.

హిందీలో ఇప్పుడు సంస్కృత సాహిత్యాన్ని గూర్చి చాలా చాలా కృషి జరిగి తదధ్యయనానికి సంబంధించిన పుస్తకాలు, సాహిత్య చరిత్రలు చాలా సంఖ్యలో ప్రచురిత మౌతున్నవి. తెలుగులో సంస్కృత సాహిత్యాధ్యయనానికి సంబంధించిన పుస్తకాలు చాలా తక్కువ సంఖ్యలో వ్రాయబడుతున్నవి. అంతేగాక సంస్కృత సాహిత్య చరిత్ర తెలుగులో శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు ఎప్పుడో వ్రాసింది ఒక్కటే లభిస్తున్నది. తెలుగులోని ఈ లోటు మమ్మల్ని ఈ రచనకు ప్రేరేపించింది.

ఈ సాహిత్య చరిత్రలో మేము ఎన్నో సంప్రదాయ విరుద్ధమైన అభిప్రాయాలను ప్రకటించాం. వాల్మీకి, కాళిదాసు, కుమారదాసు కాల దేశ జాత్యాది విషయాలల్లో ఎన్నో నూతనాభిప్రాయాలను ప్రతిపాదించాం. వేదరచనాకాలం, వైదిక -జరోష్ట్రియన్ మతాల సంబంధం. వేదవ్యాఖ్యానాలల్లో భిన్నార్థాలు, వైదిక దేవతల స్వరూప పరిణతులు, మహాభారత రామాయణ కావ్యాల వెనుకముందులు, రూపకోత్పత్తిమొ॥న విషయాలను గూర్చి కూడా ఎన్నో నూతనాభిప్రాయాలను చెప్పటం జరిగింది. ఈ పుస్తకాన్ని కేవల కవుల చరిత్రగానే కాక విమర్శనాత్మకంగా, సమీక్షాత్మకంగా రూపొందించాం. ఈ పుస్తకం నిర్దుష్టతను పండితులే నిర్ణయించగలరు.

ఈ పుస్తకం ప్రచురణకు ప్రోత్సాహాన్నిచ్చి అప్పటి ఆం.ప్ర. సాహిత్య అకాడమీ పక్షాన ప్రచురించడానికి అవకాశాన్నిచ్చిన అకాడమీ అధ్యక్షులు డా॥ బెజవాడ గోపాలరెడ్డి గారికి, కార్యదర్శులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారకి మా కృతజ్ఞతాభివందనాలు. ఇంతలో ఆం. ప్ర. సాహిత్య అకాడమీ రద్దయి తెలుగు విశ్వవిద్యాలయంగా రూపొందింది. అయినా తెలుగు విశ్వవిద్యాలయం వారు ఈ పుస్తక ప్రచురణను కొనసాగించారు. వారికి మా కృతజ్ఞతలు. ఈ పుస్తకానికి అడగగానే తమ అభిప్రాయాలను వ్రాసి ఇచ్చిన డా. పుల్లెల రామచంద్రుడు గారికి మా హార్దిక ధన్యవాదాలు.

ఈ పుస్తకంలో అక్కడక్కడ తప్పులు దొర్లడం తప్పలేదు. తప్పొప్పుల పట్టికలో పాఠకులు వాటినిచూచి సవరించుకొని చదువగలరు.

**డా॥ ముదిగంటి సుజాతారెడ్డి, డా॥ ముదిగంటి గోపాలరెడ్డి "వేదాలంకార్"**

2-2-1105/21 "రోహిణమ్" ఆగస్టు 1996

తిలక్‌నగర్, హైదరాబాదు-44.

# ద్వితీయ ముద్రణకు మామాట

మేము వ్రాసిన "సంస్కృత సాహిత్య చరిత్ర" రెండోసారి ముద్రింపబడుతుందని తెలిసి చాల ఆనందించాము. మొదటిసారిగా ముద్రించిన తర్వాత ఈ పుస్తకం పది సంవత్సరాలుగా పండితులకు, సాధారణ పాఠకులకు, విద్యార్థులకు పఠనయోగ్యమై విశేషాదరణను పొందింది. ఈ పుస్తకం బాగుందని, విషయ స్ఫోరకంగా వుందని చాలామంది పాఠకులు ఆంధ్రరాష్ట్రం ఇంకా ఇతర ప్రదేశాలనుంచి తెలుగు పాఠకులు మాకు ఉత్తరాలు వ్రాసారు, స్వయంగా కలిసినప్పుడు చెప్పారు. ఈ పుస్తకం దాదాపు రెండువేల కాపీలు అమ్ముడుపోవడం తెలుగు పుస్తకాల ప్రచురణలో ఒక అసాధ్య విషయమే. అదే దీని ప్రాచుర్యాన్ని తెలుపుతున్నది.

రెండో ప్రచురణలో భాష , విషయంలో కొన్ని చిన్న సవరణలు చేయడం అక్కడక్కడ కొద్ది సమాచారం చేర్చడం చేసాము. సంస్కృత సాహిత్యం గురించి తెలుగులో ఎక్కువ విమర్శలు గాని సాహిత్య చరిత్రలు గాని లేకపోవడం అనే లోటును ఈ పుస్తకం రెండో ముద్రణ మరింత తీరుస్తుందని ఆశిస్తున్నాము.

హైందవ, బౌద్ధ, జైన మతాలకు సంబంధించిన రచనలెన్నో సంస్కృత భాషలో ప్రాచీనకాలంనుంచి వున్నవి. ఆధునిక కాలంలో క్రైస్తవ మతానికి సంబంధించిన రచనలు సంస్కృతంలో వ్రాయబడినవి. వాటిల్లో పేర్కొనదగినవి ఆచార్య పి.సి. దేవాస్సియ వ్రాసిన "క్రీస్తు భాగవతం" అనే ఐతిహాసిక మహాకావ్యం, ఆచార్య కె.పి. ఉరుమేస్ వ్రాసిన 'గిరిగీతం' అనే ఖండకావ్యం. మొదటిది జీసస్ క్రైస్టు చరిత్రను చెప్తున్నది. రెండోది కొత్త టెస్టుమెంటులోని "సెర్మన్ ఆన్ ద మౌంటు" అనబడే క్రైస్తు పర్వతం మీద చేసిన ఉపదేశాన్ని వర్ణిస్తున్నది. బైబిల్ గ్రంథం, భారత రాజ్యాంగం సంస్కృత భాషలోకి అనువదింపబడినవి. ఈ విధంగా సంస్కృత భాష సజీవంగా వుండి ఆ భాషలో కావ్య రచనలు నిరంతరంగా సాగుతూనే వున్నవి. అటువంటి భాషకు సంబంధించిన సాహిత్య చరిత్రను గురించి తెలుసుకోవడం అందరికీ కావలసిందే.

1986 లో మొదటిసారిగా ప్రచురితమై చాలాకాలం నుంచి అందుబాటులో లేకుండా వున్న ఈ "సంస్కృత సాహిత్య చరిత్ర" గ్రంథాన్ని పునర్ముద్రించాలని నిర్ణయించిన తెలుగు విశ్వవిద్యాలయం అధికారులకు ముఖ్యంగా వైస్ ఛాన్సలర్ ఆచార్య నాయని కృష్ణకుమారి గారికి మా కృతజ్ఞతాభివందనాలు.

**డా॥ ముదిగంటి సుజాతారెడ్డి, డా॥ ముదిగంటి గోపాలరెడ్డి "వేదాలంకార్"**

2-2-1105/21 "రోహిణమ్"

తిలక్‌నగర్, హైదరాబాదు-44.

# విషయ సూచిక

## వైదిక వాఙ్మయం

## లౌకిక వాఙ్మయం

## మహాకావ్యాలు

## రూపకాలు

## గద్యకావ్యాలు



## చారిత్రక కావ్యాలు

## చంపూ కావ్యాలు

## కథాకావ్యాలు

## నీతికథలు



## చిత్రకావ్యాలు



## అలంకార శాస్త్రగ్రంథాలు

# వైదిక వాఙ్మయం

## వేదాలు - వైదిక సాహిత్యం

విషయదృష్టితో పరిశీలించినట్లయితే వేదాలకు, వైదిక సాహిత్యానికి భేదమున్నది. 'వేదాలు' అంటే మంత్ర సంహితలైన నాలుగు గ్రంథాలు మాత్రమే. 'వైదిక' అంటే వేద సంబంధమైన విజయవిజ్ఞానయుక్తమైన గ్రంథాలన్ని చేరుతవి. అవి - బ్రాహ్మణ, ఆర్యణక, ఉపనిషత్తులు. ఇంకా వేద పఠనానికి, అవగాహనకు ఉపయోగపడే వేదాంగాలు కూడా వైదిక సాహిత్యంలో చేరుతవి.

వేదాలు సమస్త హిందూజాతికి ప్రాచీనమైన పవిత్రగ్రంథాలు. 'వేద' శబ్దం 'విద్' - జ్ఞానే అన్న ధాతువునుంచి నిష్పన్నమైంది. దేని ద్వారా జ్ఞానప్రాప్తి కలుగుతుందో అది వేదమనబడుతుంది. వేదాలు సమస్త జ్ఞానానికి స్రోతస్సులని భారతీయుల నమ్మకం. జ్ఞాన ప్రతిపాదకమైన 'వేద' శబ్దం తర్వాత వివిధ విషయ గ్రంథాలకు జోడింపబడుతూ వచ్చింది. ఉదాహరణకు నాట్యవేదం, ఆయుర్వేదం, ఇతిహాసవేదం, పురాణవేదం ఇత్యాది.

## ఈశ్వరీయ జ్ఞానం

వేదాలు అపౌరుషేయాలని ప్రసిద్ధి. అంటె అవి వ్యక్తులచేత వ్రాయబడలేదని అంటారు. జ్ఞానం శాశ్వతమైంది. ఈశ్వరీయమైంది. అటువంటి జ్ఞానాన్ని తపఃసంపన్నులైన ఋషులు దర్శించి ప్రకటింపగలిగారు. కాని వారు ఆ జ్ఞానానికి కర్తలు కారు. అందుచేతనే వేదాలను అపౌరుషేయాలని అన్నారు.

వేదాలకు 'శ్రుతు' లని కూడా పేరు. 'శ్రుతి' అంటె 'వినుట' అని అర్థం. ఋషులు వేదజ్ఞానాన్ని పరమాత్మ నుంచి విన్నారు కాబట్టి వేదాలకు శ్రుతులని పేరు కలిగింది. వేదాలు లిఖితరూపంలో కాక శ్రవణరూపంలోనే పూర్వకాలంలో ప్రచారంలో వుండేవి కాబట్టి వాటికి శ్రుతులని పేరు కలిగిందని మరొక వ్యాఖ్యానం.

ఈశ్వరుడు లేడనే వారినైనా భారతీయులు సహించారు కాని వేదప్రామాణ్యాన్ని ఏ మాత్రమైనా అంగీకరించని వారిని సహించలేక పోయారు. వేద ప్రామాణ్యాన్ని అంగీకరించే వారు ఆస్తికులు, వేదప్రామాణ్యాన్ని అంగీకరించని వారు నాస్తికులుగా పరిగణింపబడినారు.

తపఃసంపన్నులైన వ్యక్తులు వేదాలను దర్శించారని మన ప్రాచీనుల విశ్వాసం. ఆ వ్యక్తులే ఋషులు. ఆ ఋషులలో పురుషులతోపాటు స్త్రీలు కూడ వున్నారు. దర్శనవ్యాకరణ గ్రంథాలు సూత్రాలలో, కావ్య మహాకావ్యాలు శ్లోకాలల్లో కూర్చబడినట్లే వేదాలు మంత్రరూపంలో నిబద్ధింపబడినవి. మంత్ర సంకలనాలకు సంహితలని పేరు. వేదాలు నాలుగు సంహితల రూపంలో వున్నవి. ఒక్కొక్క వేదానికి నాలుగు విభాగాలుంటవి. అవి -సంహిత, బ్రాహ్మణ, ఆరణ్యక, ఉపనిషత్తులు. మూల రూపంలో వేదం ఒక్కటే. యజ్ఞాలల్లో ఉపయోగించే వాటి భిన్న భిన్న ఉపయోగాలను బట్టి మంత్రాలను క్రమబద్ధంగా విభజించి వేదాలను నాలుగు అని అంటారు. వాటికే సంహితలని పేరు. కాలక్రమాన వేద సంహితలు వివిధ ఋషి సంప్రదాయయుక్తమై వివిధ శాఖలుగా ఏర్పడినవి. ఈ వేద శాఖల్లో అక్కడక్కడ ఉచ్చారణలోను కొన్ని మంత్రాలను అంగీకరించటంలోను, అంగీకరించకపోవటంలోను మతభేదం వున్నది. మహాభాష్యకారుడు పతంజలి ఋగ్వేదానికి 21, యజుర్వేదానికి 101, సామవేదానికి 1000, అథర్వ వేదానికి 9 శాఖలున్నవని పేర్కొన్నాడు. చాలమట్టుకు ఈ శాఖాసంప్రదాయాలు అధ్యయనం చేసేవాళ్ళులేక కాలగర్భంలో లుప్తమైనవి. శాఖలెన్నివున్నవో అన్ని సంహిత, బ్రాహ్మణ, ఆరణ్యక, ఉపనిషత్ గ్రంథాలు, అన్నే శ్రౌత, గృహ్య సూత్రాలు వుండేవి. ఒక్కొక్క శాఖకు చెందినవారికి వారి వారి ప్రత్యేకమైన వైదిక కర్మలు, గృహ్య సంస్కార విధానాలు వుండేవి.

# సంహితలు

## 1. ఋక్సంహిత

నాలుగు వేదాలల్లో ఋగ్వేదం ప్రముఖమైంది. ఋగ్వేదంలోని భాష, భావాదులు మిగతా వేదాలల్లో వాటికన్న అతి ప్రాచీనమని పాశ్చాత్యుల అభిప్రాయము. యజ్ఞ సమయాలల్లో ప్రయోగింపబడే మంత్ర విధానాలను దృష్టిలో పెట్టుకొని సంహితలు సంకలనం చేయబడినవి. అంతేగాని వాటి ప్రాచీన అతి ప్రాచీన భేదాన్ని బట్టి కాదు. సంహితల సంకలనాన్ని కృష్ణద్వైపాయనుడు చేశాడని, అందుకే అతనికి వేదవ్యాసుడు- అంటె వేదాలను విభజించినవాడనే పేరు కలిగిందన్ని అంటారు. వ్యాసుడు తన నలుగురు శిష్యుల చేత నాలుగు వేదాలను అధ్యయనం చేయించాడు. పైలునికి ఋగ్వేదాన్ని, జైమినికి సామవేదాన్ని, వైశంపాయనునికి యజుర్వేదాన్ని, సుమంతునికి అథర్వవేదాన్ని వ్యాసుడు చెప్పాడట. వారు తమ శిష్యులకు, ఆ శిష్యులు తమ శిష్యులకు - ఇట్లా శిష్యప్రశిష్యుల్లో వేదాలు ప్రచారమౌతూ వచ్చినవి.

వేదాలు నాలుగు అయినా 'త్రయీ' అని అనడం కూడ వున్నది. వేదాలల్లో ఋక్కు, యజస్సు, సామగీతి - అని మూడు రకాల మంత్రాలున్నవి. అందుకే నాలుగు వేదాలను ఋక్కు, యజస్సు, సామగీతి - అని మూడుగా విభజించి 'త్రయీ' అని అంటారు. "తేషామృగ్ అర్థ వశేన పాద వ్యవస్థా" - అర్థాన్ని బట్టి పాదవ్యవస్థ ఏర్పడే ఛందోబద్ధమైన మంత్రాలను ఋక్కులని, "గీతషు సామాఖ్యా"- పాడబడే ఋక్కులను సామమని, "శేషే యజుః శబ్దః" - ఋక్కు, సామంకాక మిగిలినవి యజుస్సులని జైమిని అర్థం చెప్పాడు.

ఋగ్వేద విభాగం రెండు విధాలుగా జరుగుతుంది -

1) అష్టక క్రమం. మొత్తం ఋగ్వేదం ఎనిమిది అష్టకాలుగా విభజింపబడింది. ఒక్కొక్క అష్టకంలో ఎనిమిది అధ్యాయాలున్నవి. ఋగ్వేదమంతా 64 అధ్యాయాలుగా విభాగింపబడింది. ఒక్కొక్క అధ్యాయం వర్గాలుగా కూడ విభాగింపబడింది. మొత్తం ఋగ్వేదంలో 2006 వర్గాలున్నవి. ఒక్కొక్క వర్గంలో కొన్ని మంత్రాలుంటవి. అంటే - ఒక వర్గంలో ఒక్క మంత్రం మొదలుకొని తొమ్మిది మంత్రాల వరకూ వుంటవి. 2) రెండవ విభాగ పద్ధతి ఎక్కువ శాస్త్రీయంగా వుండి ప్రసిద్ధమైంది. మొత్తం ఋగ్వేదం 10 మండలాలుగా విబజింపబడింది. అందుకే ఋగ్వేదాన్ని 'దశతయీ' అని నిరుక్తాది గ్రంథకారులు పిలిచారు. ఒక్కొక్క మండలంలో అనేక అనువాకాలు వుంటవి. ఈ అనువాకాలు తిరిగి సూక్తాలుగా విభజింపబడినవి. ఒక్కొక్క సూక్తంలో కొన్ని మంత్రాలు వుంటవి. ఋగ్వేదం 10 మండలాలల్లో 85 అనువాకాలు, 1017 సూక్తాలు వున్నవి. ఇవిగాక 11 సూక్తాలు 'వాలఖిల్య' పేరుతో ప్రసిద్ధమైనవి. కాని వాటి పదపాఠం లభించటం లేదు. వేదంలోని మంత్రాలనే కాక అక్షరాలను కూడా సర్వానుక్రమణిక అనే గ్రంథాలల్లో లెక్కించి పెట్టారు. అటువంటప్పుడు కొత్త మంత్రాలే కాదు కొత్త అక్షరాలు కూడ అదనంగా చేరటానికి అవకాశం లేదు. ఈ అక్షరగణనలో వాలఖిల్య సూక్తాలు లేవు. 80 సూక్తాలుగల అష్టమ మండలంలోని 49 మొదలుకొని 59 వరకుగల సూక్తాలను వాలఖిల్య సూక్తాలు అంటారు. మహర్షి శౌనకుని అనుసారంగా ఋగ్వేదంలో మొత్తం 10580 ఋక్కులున్నవి. శబ్దాల సంఖ్య 153826, అక్షరాల సంఖ్య 432000. ఋగ్వేదంలోని ఋక్కుల గణనలో మతభేదం కన్పిస్తున్నది. కాని ఈ సంఖ్యాభేదం శాఖల భేదాన్నిబట్టి ఏర్పడింది. అంతేగాక అర్వాచీనుల గణనలో సంఖ్యాభేదం నాలుగు పాదాలుగల కొన్ని ఋక్కులను రెండు పాదాలుగా లెక్కించటం చేత కూడ ఏర్పడింది.

ఋగ్వేదంలో 2వ మండలం మొదలుకొని 7వ మండలం వరకు గల భాగం అత్యంత ప్రాచీనమైందని పాశ్చాత్యుల అభిప్రాయం. భాష, ఛందస్సులను బట్టి మరియు అర్వాచీన దేవతల ప్రసక్తి, నవీన దార్శనిక తథ్యాలు వుండటం చేత దశమమండలం అర్వాచీనమని ఆధునికుల అభిప్రాయం. ఒక్కొక్క మండలం ఒక్కొక్క ఋషితోగాని ఋషివంశజులతోగాని సంబద్ధమై వున్నది. ఋషి వంశాలతో ఆయా మండలాలు సంబంధించి వుండటం చేత పాశ్చాత్యులు వాటిని "ఫ్యామిలీ బుక్స్" - వంశమండలాలని పిలిచారు. ప్రథమ మండలంలో విశ్వామిత్ర పుత్రుడు మధుచ్ఛందుని ద్వారా దర్శింపబడిన ఋక్కులున్నవి. అదే విధంగా ద్వితీయ మండలంలో గృత్సమదుడు, తృతీయలో విశ్వామిత్రుడు, చతుర్థలో వామదేవుడు, పంచమలో అత్రి, షష్ఠలో భరద్వాజుడు, సప్తమలో వసిష్ఠుడు, అష్టమలో కణ్వ అంగిరసులు దర్శించిన ఋక్కులున్నవి. నవమ మండలంలోని సోమస్తుతి అనేక ఋషులచేత చేయబడింది. సోమరసాన్ని సిద్ధం చేయటం, దాన్ని తాగటంవల్ల కలిగే ఆనందోల్లాసాలు ఈ మండలంలో వర్ణింపబడినవి. 'సోమ' ను 'పవమాన' అని కూడా పిలుస్తారు. అందుకే నవమ మండలానికి పవమానమండలమని కూడ పేరు.

ఋగ్వేదంలో వున్న మంత్రాలను ఋక్కులంటారు. ఈ ఋక్కులు నాలుగు పాదాలు, మూడు పాదాలు, రెండు పాదాలుగల ఛందస్సుల్లో వున్నవి. గాయత్రి, జగతి, బృహతి, పంక్తి, త్రిష్టుపు, అనుష్టుపు మొదలైన ఛందస్సులు ఋగ్వేదంలో ప్రయోగింపబడినవి.

మహాభాష్యకారుని అనుసారం ఋగ్వేదానికి 21 శాఖలు వున్నవి. వాటిల్లో 5 ప్రముఖమైనవి అని చరణవ్యూహకారుడు చెప్పాడు. అవి - శాకల, వాష్కల, అశ్వలాయన, శాంఖాయన, మాండూకాయన. వీటిల్లో శాకల శాఖయే ప్రచలితమై కన్పిస్తున్నది. వాష్కల సంహిత దొరకటం లేదు. శాకల సంహితలో 1017 సూక్తాలుండగా వాష్కల సంహితలో 1025 సూక్తాలున్నవి. ఆశ్వలాయన సంహిత, దాని బ్రాహ్మణ గ్రంథాలు క్రీ.శ. 17వ శతాబ్దం వరకు ఉపలబ్ధమైనవి. కాని ఇప్పుడు దొరకటం లేదు. కాని ఈ శాఖ యొక్క గృహ్య, శ్రౌత సూత్రాలు మాత్రం దొరుకుతున్నవి. శాంఖాయన సంహిత కూడ ఇప్పుడు దొరకటం లేదు. కాని దాని బ్రాహ్మణ, ఆరణ్యకాలు దొరుకుతున్నవి. శాంఖాయన, కౌశీతకి శాఖలు ఒక్కటే అని పండితుల అభిప్రాయం. మాండూకాయన శాఖా గ్రంథాలు కూడ దొరకటం లేదు.

ఋగ్వేదంలో అనేక దేవతా స్తోత్రాలు వున్నవి. దేవతల స్తుతులు సుందర భావాలల్లో కూర్చబడినవి. అటువంటి చోటుల్లో చక్కని కవి హృదయాన్ని దర్శించవచ్చును.

ఋగ్వేదంలో ప్రస్తుతింపబడిన దేవతలల్లో అగ్ని, ఇంద్ర, వరుణ, ఉషస్సు, సవిత, పూష మిత్ర, విష్ణు, రుద్ర, మరుత్, పర్జన్యులు ప్రముఖమైనవారు. సోమరస ప్రస్తుతి, ప్రసక్తులు నవమ మండలంలో ఏకత్రీకృతమైనవి. ఋగ్వేదంలో దేవతాస్తుతులే కాక దార్శనిక, లౌకిక విషయ చర్చలు కూడ వున్నవి. కొన్ని సూక్తాలు నిగూఢార్థ నిబద్ధమై విభిన్నమైన వ్యాఖ్యానాలకు తావు ఇచ్చేటట్లుగా వున్నవి. ఋగ్వేదంలోని సంవాద సూక్తాలల్లో ఊర్వశిపురూరవ (10-85), యమయమీ (10-10), సరమ పణి (10-130) సంవాదాలు ప్రసిద్ధమైనవి. రమ్యమైనవి. ఋగ్వేదంలోని కొన్ని సూక్త విషయాలు తర్వాత పురాణాలల్లో కథలుగా ప్రపంచింపబడినవి. నాసదీయ, హిరణ్యగర్భ వాక్సూత్రాలు ప్రసిద్ధమైన దార్శనిక సూక్తాలు. దశమ మండలంలోని పురుషసూక్తం కూడా దార్శనికార్థానికి ప్రసిద్ధమైంది. పరమాత్మ స్వరూపుడైన పురుషుని ఆధ్యాత్మిక కల్పన దీనిలో చాలా గొప్పగా చేయబడింది. అనేక దేవతల స్తుతులు గలిగిన అనేక దేవతాత్మకమైన వైదిక మతంలో ఋగ్వేదకాలం నాడే ఏకేశ్వర రూపమైన పరమాత్మ కల్పన చేయబడింది. "పురుష ఏవేదం సర్వం యద్ భూతం యచ్చ భవ్యమ్" - పురుషుడే సమస్త విశ్వం, ప్రాచీన కాలంలో ప్రభవించినాడు, భవిష్యత్తులోను ప్రభవించగలడు - అన్నదానిలో ఏకేశ్వరవాదం, ప్రతీకవాదం చాల చక్కగా చెప్పబడింది. దశమ మండలంలో అనేక లౌకిక వ్యవహారానికి, చికిత్సా విధానానికి సంబంధించిన సూక్తాలు కూడా వున్నవి. శ్రాద్ధ, వివాహాది భౌతిక విషయచర్చలు కూడా వున్నవి. దశమ మండలం 34వ సూక్తంలో జూదంలో ఓడిపోయిన జూదగాని హృదయభావవర్ణన సహజంగా వున్నది. ఒకచోట సోమరసాన్ని తాగి మత్తెక్కినవాని పరిస్థితి వర్ణన చక్కగా చేయబడింది -

> హంతాహమ్ పృథివీమిమాం నిదధానీహవా ఇహవా
> కువిత్సోమస్యాపామితి. 10-119-9

"నేను సోమరసాన్ని తాగాను. ఈ పృథ్విని తీసి ఇటు నుంచి అటు, అటు నుంచి ఇటు పెట్టాలి అని అనిపిస్తున్నది." సోమరసంపానం వల్ల కలిగిన బలోత్సాహం దీనిలో చాల రమ్యంగా చెప్పబడింది.

జూదం ఆడవొద్దు, వ్యవసాయం చేయి అన్న ఉపదేశం ఈ కింది మంత్రంలో చేయబడింది. ఇది ఆ కాలంలో జూదం ఆట ఎంత ప్రచలితమైందో తెల్పుతున్నది-

> అక్షైర్మా దీవ్యః కృషిమిత్ కృషస్వ
> విత్తేరమస్వ బహు మన్యమానః - 10-43-13

దశమ మండలం 162 సూక్తం రక్షోహాసూక్త మనబడుతుంది. దీనిలో రాక్షసుల విఘ్నాలనుంచి రక్షింపబడే ఉపాయాలు చెప్పబడినవి. 161, 163 సూక్తాలల్లో శరీరంలోని వివిధ అంగాలు శాస్త్రీయంగా వివరింపబడినవి. తర్వాత యక్ష్మ (క్షయ) రోగం నుంచి విముక్తిని పొందే విధం చెప్పబడింది -

ముంచామి త్వాహవిశా జీవనాయక మజ్ఞాత యక్ష్మాదుత రాజయక్ష్మాత్
గ్రాహిర్జ గ్రాహయది వై తదేనం తస్యా ఇంద్రాగ్నీ ప్రముముక్తమేనమ్.
10-161-1

"హే రోగి! అజ్ఞాత రాజయక్ష్మ రోగం నుంచి నిన్ను యజ్ఞానుష్ఠానం ద్వారా ముక్తున్ని చేస్తాను. ఈ విధంగా నీ ప్రాణరక్ష చేయబడుతుంది. పాప గ్రహమేదైనా ఈ రోగిని పట్టుకొన్నట్లయితే ఇంద్రుడు, అగ్ని ఆ పాశం నుంచి విడిపించెదరు గాక!"

ఋగ్వేదంలో ఓషధుల భిషక్కుల ప్రసక్తికూడ వున్నది. సపత్ని నుంచి భర్తను పొందే ఓషధుల ప్రసక్తి కూడ వున్నది. 173, 174 సూక్తాలలో రాజ ధర్మాలు, రాజ నీతులు వివరింపబడినవి. ఋగ్వేదంలో దానస్తుతి భవ్యంగా వున్నది. దానమహిమ, దానం యొక్క ఆవశ్యకతలు దీనిలో వర్ణింపబడినవి.

## 2. యజుస్సంహిత

ఋగ్వేదంలో విభిన్నమైన దేవతల స్తుతి. యజ్ఞకర్మల్లో ఉపయోగించే మంత్రాలు, కర్మకాండను గూర్చి చెప్పే మంత్రాలు, ఉపాసన సూక్తాలు, దార్శనిక లౌకిక వ్యవహార సంబంధమైన, చికిత్సోపయోగకరమైన మంత్రాలున్నవి. యజుర్వేదంలో ప్రధానంగా దేవతలను ఆహ్వానించే, యజ్ఞవిధులను చెప్పే మంత్రాలున్నవి. అయా యజ్ఞకర్మల్లో ఉపయోగించే మంత్రాలు యజుర్వేదంలో చెప్పబడి వున్నవి. ఋగ్వేదంలోని మంత్రాలే చాలమట్టుకు దీనిలో వున్నవి. ఒకే ఛందస్సులో వున్న మంత్రాలు ఒక్క చోట, ఒకే దేవతాస్తుతి గల మంత్రాలు ఒక్క చోట, యజ్ఞంలో గానం చేయబడే మంత్రాలన్నీ ఒక్కచోట వుండేటట్లుగా యజుర్వేదసంహిత సంకలనం చేయబడింది.

యజుర్వేదం యజుస్సుల కూర్పుకలది. "అనియతాక్షరావసానో యజుః"- అక్షరాల నియతి లేనిది యజుస్సు. " గద్యాత్మకో యజుః" - ఋక్కు, సామంలకన్న భిన్నమైంది అంటె గద్యాత్మకమైన మంత్రాలే యజుస్సులని చెప్పబడుతున్నది.

యజుర్వేదంలో రెండు భేదాలున్నవి - కృష్ణ యజుర్వేదం, శుక్ల యజుర్వేదం. ఛందోబద్ధమైన మంత్రాలు, గద్యం రెండు వుండటం చేత కృష్ణ యజుర్వేదమని, కేవలం ఛందోబద్ధమైన మంత్రాలుండటంచేత శుక్లయజుర్వేదమని పేర్లు ఏర్పడినవి. యజుర్వేదానికి ఆదిత్య సంప్రదాయం, బ్రహ్మ సంప్రదాయ మని రెండు సంప్రదాయాలున్నవి. ఆదిత్య సంప్రదాయానికి ప్రతినిధి శుక్ల యజుర్వేదం. దీనిలో యజ్ఞవిధులకు అవసరమయ్యే మంత్రాలే వున్నవి. బ్రహ్మ సంప్రదాయానికి ప్రతినిధి కృష్ణ యజుర్వేదం. దీనిలో మంత్రాలతోపాటు వాటిని ఉపయోగించే పద్ధతిని తెలిపే బ్రాహ్మణాలుకూడ కలిసివున్నవి. యాజ్ఞవల్క్య మహర్షికి సూర్యునివల్ల పగలు జ్ఞానబోధ కలగటంచేత (సూర్యుని అనుగ్రహంతో యజుస్సులు వ్యక్తం కావటంచేత అని అర్థం) యజుర్వేదం రెండవ భాగానికి శుక్ల యజుర్వేదమనే పేరు ఏర్పడిందని ఐతిహ్యం. కేవలం విశుద్ధమైన మంత్రాలుండటంచేత ఈ భాగానికి శుక్ల అని పేరు కలిగిందని, మంత్రాలతోపాటు బ్రాహ్మణ భాగాలు కలిసివుండటంచేత ఇంకొక భాగానికి కృష్ణ అని పేరు కలిగిందని ఆధునిక విమర్శకులు అభిప్రాయం. యజుర్వేదానికి 101 శాఖలు వుండేవి. కాని ఇప్పుడు 5 శాఖలే దొరుకుతున్నవి.

## శుక్ల యజుస్సంహిత

శుక్ల యజుర్వేదసంహితకు వాజసనేయి సంహిత అనే పేరు కూడ ప్రసిద్ధమైంది. వాజసేని పుత్రుడు యాజ్ఞవల్క్యునిచేత దర్శింపబడటంచేత దీనికి వాజసనేయిసంహిత అని పేరు కలిగింది. వాజి రూపంలో సూర్యుడు యాజ్ఞల్క్యునికి ఉపదేశించటంచేత దీనికి వాజసనేయి పేరు వచ్చిందని ఒక ఐతిహ్యం. శుక్ల యజుర్వేదంలో 40 అధ్యాయాలున్నవి. వాటిల్లో చివరి 15 అధ్యాయాలు ఖిలరూపాలని ప్రసిద్ధి. శుక్ల యజుర్వేదానికి మాధ్యందిన, కాణ్వ అనే రెండు శాఖలు ప్రధానమైనవి. మాధ్యంధినసంహితలోకన్న కాణ్వసంహితలో 111 మంత్రాలు ఎక్కువ వున్నవి. ఈ సంహితలో చాతుర్మాస్య విధుల్లో ఉపయోగించే మంత్రాలు; వాజపేయ, రాజసూయ, పితృమేధ, పురుషమేధ, అశ్వమేధ యాగ విధానాలు; యజ్ఞవేదిక నిర్మాణపద్ధతి వివరింపబడినవి. 40వ అధ్యాయం ఈశావాస్య ఉపనిషత్తు అనబడుతుంది. ఈవిధంగా సంహితలో ఉపనిషద్భాగం వుండటం దీనిలోనే కన్పిస్తున్నది. 16వ అధ్యాయంలో శతరుద్రీయహోమం వివరించబడింది. దీనిలో రుద్రుని వర్ణన చక్కగా వున్నది. ఇది రుద్రాధ్యాయమని ప్రసిద్ధమైంది.

## కృష్ణ యజుస్సంహిత

చరణవ్యూహకారుని అనుసారం కృష్ణ యజుర్వేదానికి 86 శాఖలు వున్నవి. కాని ఇప్పుడు 4 శాఖలే లభిస్తున్నవి. తైత్తిరీయ, మైత్రాయణి, కఠ, కపిష్ఠిలకఠ సంహితలు. ఈ సంహితలు గద్య పద్యాత్మకాలు. కృష్ణ యజుర్వేదం 7 కాండాలుగా విభజించబడింది. 18000 మంత్రాలు దీనిలో వున్నవి. కఠసంహిత కఠజాతి వారిలో వ్యాప్తిలో వుండేది. అందుకే దానికాపేరు కలిగింది. కఠజాతి యొక్క వేదపాఠం పరమ శుద్ధమైందని పతంజలి మహాభాష్యంలో పేర్కొని వున్నాడు. ఈ కఠజాతి నివసించడం చేతనే ఇప్పటి గుజరాతు రాష్ట్రంలో కొంతభాగం "కఠియవాడ" గా పిలువబడుతున్నది. కఠ, కపిష్ఠల సంహితలు విభిన్నంగా వున్నవి. కపిష్ఠల సంహిత ఋగ్వేదంవలె అష్టక అధ్యాయాలుగా విభాగింపబడింది. తైత్తరీయ శాఖ మహారాష్ట్ర ఆంధ్ర ద్రావిడ దేశాలల్లో ఎక్కువ ప్రచలితమైంది. వేదభాష్యకారుడు సాయణునిశాఖ తైత్తిరీయశాఖయే అందుకే అతడు దానికి విశదవ్యాఖ్యానాన్ని వ్రాశాడు. కృష్ణ యజుర్వేదంలోను వివిధ యజ్ఞ యాగాది విధులు, ఇంకా వాటిల్లో ఉపయోగింపబడే మంత్రాలు కూర్పబడినవి. సోమ, వాజపేయ, రాజసూయ, పురుషమేధ, అశ్వమేధాది యాగాల విశద వర్ణనలు దానిలో వున్నవి. చివరి అధ్యాయంలో ఈశోపనిషత్తు కూర్పబడి వున్నది.

## 3. సామ సంహిత

" సాచ అమశ్చేతి తత్సామ్నః సామత్వమ్" అని బృహదారణ్యా కోపనిషత్తు. 'సా' అంటె ఋక్కు అని అర్థం. 'అమ' అంటె గాంధారాది స్వరాలు. అప్పుడు 'సామ' అంటె ఋక్కుల యొక్క స్వరప్రధానమైన గానమని అర్థం. ఏ ఋక్కులను సామ రూపంలో గానం చేస్తారో వాటిని వైదికులు 'సామయోని' అంటారు. "గీతిషు సామాఖ్యా" అని జైమిని 'సామ' శబ్దానికి 'గాన' మనే అర్థాన్ని చెప్పాడు.

'సామ' శబ్దానికి సుందర సుఖకర వచనమని కూడ అర్థం. సంగీతం సుఖకరమైంది. ఆనందదాయకమైంది. 'సామ' శబ్దానికి అందుకే సంగీతమనే అర్థం చెప్పవచ్చును. ఉద్గాత తన సామవేద గానం ద్వారా దేవతలను ప్రశంసిస్తాడు. విశేషంగా సామగానం సోమరసం తయారుచేసేటప్పుడుగాని చంద్రలోకవాసి దేవతల స్తుతి సమయంలోగాని చేయబడుతుంది. సామగానం లేకుండ యజ్ఞసిద్ధి కలుగదని శతపథ బ్రాహ్మణంలో చెప్పబడింది. సామవేదంలో ఎక్కువ ఋగ్వేదంలోని మంత్రాలే వున్నవి. కేవలం 75 మంత్రాలు మాత్రం స్వతంత్రంగా కూర్పబడినవి. సామవేదంలో మొత్తం 1875 మంత్రాలున్నవి. సామవేదం

మహత్త్వపూర్ణమైందిగా పరిగణింపబడింది. "సామాని యో వేత్తి స వేద తత్త్వం" - ఎవరైతె సామవేదాన్ని అభ్యసిస్తారో వారే వేద రహస్యాన్ని గ్రహించగలుగుతారు. భగవద్గీతలో శ్రీకృష్ణుడు తనను "వేదానాం సామవేదోస్మి" అని చెప్పుకొన్నాడు. ఋగ్వేదంలో, అథర్వ వేదంలో సామవేద ప్రశంస కన్పిస్తున్నది. దీన్నిబట్టి వేదాలల్లో ఋగ్వేదమే ప్రాచీనతరమైందనే విషయంలో పండితులు సందేహాన్ని ప్రకటించారు. ఋక్కులే గానం చేయబడినప్పుడు 'సామం' అనబడుతవి. యజ్ఞయాగాది కర్మలల్లో ఉద్గాత అనబడే ఋత్విజుడు సామవేదాన్ని గానం చేస్తాడు.

వేదాలల్లో మూడు రకాలైన మంత్రాలున్నవి - ఋక్కు, యజుస్సు, సామగీతి. ఋక్కులు గేయ, అగేయాలని రెండు రకాలు. సామవేదంలో గేయ ఋక్కులు, గేయ యజుస్సులు రెండు వున్నవి. సామవేదంలోని ఋక్కును 'ఆర్చిక' అని యజుస్సును 'స్తోక' అని అంటారు. దేశ కాల పాఠ గురుభేదాన్ని బట్టి వీటిల్లో తిరిగి అనేక భేదాలు ఏర్పడినవి. మహర్షి జైమిని సామవేద ద్రష్ట అని విద్వాంసుల అభిప్రాయం.

సామవేదానికి 1000 శాఖలు వుండేవని " సహస్ర వర్త్మా సామవేదః" అన్న వాక్యాన్ని బట్టి తెలుస్తున్నది. సామం గానప్రధానమైంది. అనంతమైన సంగీత విద్యనుబట్టి పరిశీలించినట్లయితే సహస్ర శాఖలున్నవనటం అతిశయోక్తి కాదు. ఇప్పుడు 15 శాఖలు మాత్రమే మనకు తెలుసు - రాణాయన, సత్యముగ్ర, వ్యాస, భాగురి, ఔలుండి, గౌల్మలవి, భాను, మానేపమన్యవ, కారాటి, మశక, గార్గ్య, వార్షగణ్య, కౌథుమ, శాలిహోత్ర, జైమిని. కాని వీటిల్లో మూడు మాత్రమే ఇప్పుడు దొరుకుతున్నవి. అవి - కౌథుమీయ, రాణాయనీయ, జైమినీయ. వీటిల్లో కౌథుమీయ శాఖ గుజరాతులోని నాగర బ్రాహ్మణుల్లో ఇంకా తమిళదేశంలో ప్రచారంలో వున్నది. రాణాయనీయ శాఖ మహారాష్ట్రలో, జైమినీయ శాఖ తమిళదేశంలో ప్రచారంలో వున్నవి. కౌథుమీయ సంహిత అన్నిటికంటె లోక ప్రియమైంది. కౌథుమీయ, రాణాయనీయ శాఖలకు ఉచ్చారణలో కొద్ది భేదం తప్ప వేరే ఎక్కువ భేదం లేదు. జైమినీయ సంహిత యొక్క సంహిత, బ్రాహ్మణ, శ్రౌత, గృహ్య సూత్రాలన్నీ లభిస్తున్నవి.

సామవేదాన్ని గానం చేసే పద్ధతులను తెలిపే పుస్తకాలు వున్నవి. వాటిని "గణా 'లని అంటారు. మంత్రాలను గానం చేసేటప్పుడు మాత్రలను దీర్ఘం, ప్లుతం, పునరావృత్తి చేసే విధానాలు, ఇంకా ఇతరమైన మార్పుల నియమాలు వీటిల్లో ఇయ్యబడినవి. విశేషంగా సోమరసాన్ని సిద్ధం చేసేటప్పుడు, దేవతలను స్తుతించేటప్పుడు సామగానాన్ని చేసేవారు. సామగాన సమయంలో దుందుభి, వేణు, వీణాది వాద్యాలు ఉపయోగింపబడేవి. సామవేదం నుంచే గాంధర్వ వేదం పుట్టింది. గాంధర్వ వేదంలో 16000 రాగ రాగినులు నిర్మింపబడినవి.

దేవకీపుత్రుడైన శ్రీకృష్ణునికి అంగిరస మహర్షి వేదాంతోపదేశం చేస్తు మొదట సామవేద గానవిధిని నేర్పినాడట. ఆ విధి పేరు 'ఛాలిక్య' విధి. శ్రీకృష్ణుడు ఆ విధిలో ప్రావీణ్యం సంపాదించి తన మురళి మీద పాడినాడని ఛాందోగ్యోపనిషత్తులో చెప్పబడింది.

## 4. అథర్వ సంహిత

ఋగ్వేదాదులు ఆముష్మిక ఫలాన్ని ఇచ్చేవి కాగా అథర్వవేదం ఐహిక ఫలాన్ని ఇచ్చేది. ఐహిక జీవితాన్ని సుఖమయం చేసుకొనే సాధనలు దీనిలో వున్నవి. అథర్వుడనే ఋషి పేరుతో దీనికి అథర్వ వేదమనే పేరు కలిగిందని అంటారు. సృష్టి ఉత్పత్తి కొరకు బ్రహ్మ తపస్సు చేశాడని, తపఃపూతమైన బ్రహ్మ శరీరం నుంచి అథర్వన్ అంగిరసులు జన్మించారని, ఆ అథర్వన్ అంగిరసుల వంశజులచేత అథర్వవేదం దర్శింపబడిందని, అందుకే ధానికి అథర్వవేదం లేక అథర్వాంగిరస వేదమనే పేరు కలిగిందని గోపథ బ్రాహ్మణంలో చెప్పబడింది. ప్రాచీన కాలంలో అగ్న్యారాధకుడైన పురోహితున్ని "అథర్వన్ ' అని పిలిచే వారని, 'అథర్వన్'కు అవసరమయ్యే మంత్రాలు దీనిలో వుండటం చేత దీనికి ఆపేరు కలిగివుంటుందని ఆధునికుల అభిప్రాయం. తర్వాత తర్వాత 'అథర్వన్' అన్న శబ్దం మామూలు పురోహితుడనే అర్థంలో కన్పిస్తున్నది కూడ. విషయ దృష్టితో అథర్వవేదం అథర్వన్ అంగిరస భాగాలుగా విభజింపబడుతున్నది. అథర్వన్ భాగంలో మంత్ర తంత్ర ఔషధాలను గురించి చెప్పే మంత్రాలు వున్నవి. మారణ, ఉచ్చాటన విషయాలు గల మంత్రాలు అంగిరస భాగంలో వున్నవి. మంత్ర, ఔషధ, ఉచ్చాటన (చేతబడి)లు గల మంత్రాలే కాక అథర్వవేదంలో యజ్ఞ సంబంధి, బ్రహ్మవిద్యా సంబంధి విషయాలు కూడ వున్నవి. అథర్వ వేదానికి బ్రహ్మ వేదమని కూడ పేరు. బ్రహ్మజ్ఞానం వుండటం చేతనే దీనికి ఆ పేరు కలిగిందని అంటారు.

అథర్వవేదం ఏ రాజు రాజ్యంలో పాఠం చేయబడుతుందో ఆ రాజు రాజ్యంలో ఉపద్రవాలు వుండవని ప్రాచీనుల విశ్వాసం. అథర్వవేద జ్ఞానంతోనే పురోహితుడు రాజుకు శాంతి సంపదలను సమకూర్చగలుగుతాడు. అథర్వ వేదంలో చాలా మంత్రాలు ఐహిక సుఖాలసాధనకు, చేతబడులు మొదలైనవాటికి ఉపయోగపడేవి వున్నవి. అందుకే అథర్వ వేదానికి గౌరవ స్థానమియ్యక ప్రాచీనులు వేదాలు మూడు (త్రయి) అని అన్నారని ఆధునికులు తలంచారు. అథర్వ వేదంలో రోగాలను పోగొట్టే చికిత్సా విధానం, శత్రువులకు చేసే ప్రతీకారాలు వివరంగా చెప్పబడినవి. రోగాలు నానావిధ క్రిములవల్ల కలుగుతాయనే ఆధునిక విజ్ఞానావిష్కృత విషయం అథ్వరవేదం 1-5, 2-35 సూక్తాలల్లో చెప్పబడింది. సూర్యకిరణాల ద్వారా క్రిముల వినాశం జరుగుతుందని కూడ చెప్పబడింది (1-12, 4-37).

అనేక విధాలుగా రోగాలను నయం చేసే పద్ధతులు, సర్ప విషానికి విరుగుడులు కూడ చెప్పబడినవి. సమకాలిక రాజనైతిక విషయాలెన్నో అథర్వవేదంలో చెప్పబడినవి. అదేవిధంగా వివాహసంబంధ విషయాలెన్నో సూక్తాలలో వ్యక్తీకరింపబడినవి. వీటినిబట్టి ఆనాటి వివాహ వ్యవస్థ ఎట్లా వున్నదో ఊహించవచ్చును. ఒక మంత్రంలో కుటుంబ క్లేశాలను దూరం చేయమని అగ్ని, సూర్యులను ఇట్లా ప్రార్థించారు -

యత్ తే ప్రజాయాం పశుషు యద్వా గృహేషు
నిష్ఠిత మఘ కృద్భిరఘం కృతమ్
అగ్నిష్ట్వా తస్మాదేనసః సవితా చ ప్రముంచతామ్ - 14-2-62.

అథర్వ వేదంలో వశీకరణ విద్యలు కూడ చెప్పబడినవి. భారతదేశం అంటే ఆర్యదేశం సరిహద్దులకు బయటవున్న దేశాలల్లోని ధార్మిక సిద్ధాంతాల ప్రభావం అథర్వ వేదంలో కన్పిస్తున్నదని బాలగంగాదర తిలక్ అభిప్రాయపడినాడు. ఉదాహరణకు చాల్డియా, తురానియన్ ల ధార్మిక సిద్ధాంతాలు దీనిలో ప్రతిబింబించినవని ఆయన అంటాడు. ఈ విదేశీయుల ప్రభావం వుండటం చేతనే కావచ్చును అథర్వవేదం పవిత్రమైందిగా భావింపబడలేదని కూడ ఆయన అన్నాడు.

అథర్వవేదంలో 20 కాండాలున్నవి. భృగుమహర్షి శిష్యుడు అథర్వుడు. అథర్వుడు 20 మంది పుత్రులు 20 కాండాలను నిర్మించారట. అథర్వవేదంలో 760 సూక్తాలు 5987 మంత్రాలు వున్నవి. పతంజలి అథర్వవేదానికి 9 శాఖలున్నవని పేర్కొన్నాడు- "నవధాథర్వణో వేదః" అవి - పిప్పలాద, స్తౌద, మౌద, శౌనకీయ, జాజల, జలద, బ్రహ్మవద, దేవదర్శ, చారణ వైద్య. వీటిల్లో పిప్పలాద, శౌనక శాఖలు మాత్రం ఇప్పుడు దొరుకుతున్నవి. మిగిలినవి నామమాత్రావశేషంగానే వున్నవి. పిప్పలాద శాఖ ఎక్కువ ప్రచారంలో వున్నది.

అథర్వ వేదంలోని మంత్రసంకలనం విషయానుగుణంగా జరిగింది. మొదటి ఏడు కాండాలల్లోని సూక్తాలు చాల చిన్న చిన్నగా వున్నవి. అంటె వీటిల్లో 4, 5, 6, 7, 8 మంత్రాల చొప్పున మాత్రమే వున్నవి. షష్ఠకాండంలోని 142 సూక్తాలల్లో ఒక్కొక్క సూక్తంలో మూడు మంత్రాలు మాత్రమే వున్నవి. సప్తమ కాండంలోని 128 సూక్తాలల్లో ఒక్కొక్క సూక్తంలో 1,2 మంత్రాలు మాత్రమే వున్నవి. తర్వాత కాండాలల్లోని సూక్తాలల్లో మంత్రాల సంఖ్య ఎక్కువగా వున్నది. అథర్వవేదంలో 1/5 వంతు అంటె 1200 మంత్రాల వరకు ఋగ్వేదం లోనివే. అవి ఋగ్వేదంలోని ప్రథమ, అష్టమ, దశమ మండలాలల్లో వున్నవి. వేదాలల్లో అథర్వవేదం చివర పేర్కొనబడేది. కాబట్టి ఇదంతా అర్వాచీనమని అనుకోవటానికి వీల్లేదు. వీటిలోని కొన్ని భాగాలు చాల ప్రాచీనమయినవి. అంతేగాక, దీనిలోని ఎన్నో మంత్రాలల్లో

ప్రాచీన మానవ సమాజానికి చెందిన విశ్వాసాలు, క్రియాకలాపాలు కూర్చబడినవి. మొత్తం మీద అథర్వవేద విషయాన్ని ఆధ్యాత్మ, ఆదిభూత, ఆధిదైవత అని మూడు విధాలుగా విభజింపవచ్చును. ఆధ్యాత్మ ప్రకరణాలల్లో బ్రహ్మపరమాత్మ జ్ఞానం, ఆశ్రమ ధర్మాలను గూర్చి చెప్పబడింది. అధిభూత ప్రకారణాలల్లో రాజులు, రాజ శాసనాలు, యుద్ధాలు, శత్రు పరాయజ ఉపాయాదులు చెప్పబడినవి. అధిదైవత ప్రకరణాలల్లో వివిధ దేవతల స్తుతి, యజ్ఞ విధులు చెప్పబడినవి. భైషజ్యాని, ఆయుష్యాణి, ప్రాయశ్చిత్తాని, స్త్రీ కర్మాణి, రాజకర్మాణి, భూమి, బ్రహ్మణ్యాని సూత్రాలు అథర్వ వేదంలోనివి. ఋగ్వేదంలో వలెనే అథర్వవేదంలో కొన్ని అందమైన కావ్య భాగాలు వున్నవి. సమకాలిక జనజీవితాన్ని అథర్వవేదం ఎంతగానో ప్రతిబింబింపజేస్తున్నది.

అథర్వ వేదం 15 వ కాండం 'వ్రాత్యకాండం' అని పిలువబడుతున్నది. వ్రాత్యుల కర్మకాండలు ఈ కాండంలో చెప్పబడినవి. 'వ్రాత్యులు' ఎవరు అనే విషయంలో చాల తర్జన భర్జనలు పండితుల్లో జరిగినవి. వీరు ఆర్యుల్లోనే ఒక తెగ అని కొందరు, వీరు అనార్య జనులని కొందరు, ఆర్యులేగాని అనార్య సంపర్కం కలవారని కొందరు భావించారు. అథర్వ వేదాన్నిబట్టి వ్రాత్యులు ఆచార నియమాలు లేనివారని తెలుస్తున్నది. వీరు ఒకవేళ అనార్యజాతుల్లోని మతగురువులై వుంటారేమో.

అథర్వవేదంలోని దార్శనిక సూక్తాలు ఉపనిషత్తులకు పూర్వపీఠికల వంటివని పండితులు అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. ఎందుకంటె, ఈ సూక్తాలకే తర్వాత ఉపనిషత్తుల్లో చాలామట్టుకు వ్యాఖ్యానాలు చేయబడినవి.

అథర్వ వేదంలోని చాలా భాగాలల్లోని భాష ఛందస్సులు ఋగ్వేదంలోని భాష ఛందస్సులకన్న అర్వాచీనమైనవిగా కన్పిస్తున్నవి. ఋగ్వేదంలో భారతదేశం వాయవ్య ప్రాంతం, మధ్యదేశంలోని భౌగోళిక ప్రదేశాల ప్రసక్తియే కన్పిస్తున్నది. అథర్వ వేదంలో భారతదేశం ప్రాచ్యభూములు కూడ పేర్కొనబడినవి. ఆర్యులు వాయవ్యప్రాంతం నుంచి అథర్వవేదం నాటికి ప్రాచ్య భూముల్లోకి చొచ్చుకొనిపోయారని దీన్నిబట్టి తెలుస్తున్నది. అథర్వ వేదంలో బెంగాల్ అడవుల్లో కనిపించే పెద్దపులుల ప్రసక్తి వున్నది. ఋగ్వేదం పురుషసూక్తంలో చాతుర్వర్ణ్య ప్రసక్తి వున్నది. అథర్వ వేదంలో బ్రాహ్మణులు విశేష గౌరవం కలవారుగా చెప్పబడినారు. అథర్వ వేదంలో కృషిప్రధానమైన మానవ సమాజం చిత్రింపబడింది. అంటె ఋగ్వేదం నాటి సంచారజాతి అథర్వవేదం నాటికి కృషిప్రధానమైన జాతి సంపర్కం చేత స్థిరపడి, వారి మత విశ్వాసాలు, సిద్ధాంతాల చేత ప్రభావితమైందని చెప్పవచ్చును. కాబట్టి అథర్వవేదంలోని భాగాలు కొన్ని ఋగ్వేదంలోనివే అయినా, ఇంకా మరికొన్ని

భాగాలు ఋగ్వేదం అంత ప్రాచీనమైనవే అయినా చాలా భాగాలు ఋగ్వేదంకన్నా అర్వాచీనమైనవని చెప్పవలసివుంటుంది.

## వేద ద్రష్టలైన ఋషులు

ప్రాచీన భారతీయ సంప్రదాయాన్ననుసరించి వేద మంత్రాలు ఋషుల చేత దర్శింపబడినవే కాని రచింపబడినవి కావు. అందుకే ఋషులు మంత్ర రచయితలుగా కాక మంత్రద్రష్టలుగా చెప్పబడినారు. 'దృష్ట' మంటే చూడబడిందని అర్థం. 'దృష్ట' మన్నది కృతం, ప్రోక్తం కంటే భిన్నమైంది. అంటె వేదమంత్ర రచనలో మనుష్యుల ప్రయత్నం గాని, సంబంధంగాని లేదు. అందుకే అవి అపౌరుషేయాలు అని అనబడుతవి. ఋషులకు అలౌకిక ప్రతిభ వున్నది. ఆ అలౌకిక సామర్థ్యంతో వారు ప్రతిభాచక్షువులను తెరచి సత్యాన్ని దర్శించారు. అంతేగాక 'విద్' - విజ్ఞానం శాశ్వతమైంది. అట్లా శాశ్వతమైన జ్ఞానాన్ని ఋషులు దర్శించగలిగారే కానీ దానికి వారు సృష్టికర్తలు కాదు. " ఋషిః దర్శనాత్" " మంత్ర ద్రష్టారో ఋషియో బభూవుః" - ఋషులు సత్యాన్ని అనుభవించి దర్శించినవారే కాని, దాని కర్తలు కాదని అర్థం. మంత్రగతార్థాలను దర్శించినవారే కాని, దాని కర్తలు కాదని అర్థం. వేదాలల్లో ఎక్కడాకూడ మంత్రద్రష్టల పేర్లు చెప్పబడలేదు. అందుకే సంహితల వల్ల మనకు మంత్ర ద్రష్టలెవరో తెలియదు. తర్వాతకాలంలో కూర్చబడిన 'సర్వానుక్రమణిక' లనబడే గ్రంథాల్లో మంత్రద్రష్టలైన ఋషుల పేర్లు చెప్పబడినవి. కాత్యాయనుని సర్వానుక్రమణిలో అగ్నిదేవుని స్తుతిగల మంత్రాలు 'మధుచ్ఛంద' పేరుగల ఋషిచేత ద్రష్టమైనవని చెప్పబడింది. 'మధుచ్ఛంద' ఋషికే 'శతర్చిన్' అని కూడ పేరు. సర్వానుక్రమణిక టీకాకారుడు షడ్గురు శిష్యుడుకూడ ఋగ్వేదంలోని ప్రథమమండలంలోని 102 మంత్రాలను శతర్చిన్ ద్రష్టమని చెప్పాడు. ద్వితీయ మొదలుకొని అష్టమమండలం వరకు గల ఋగ్వేద మంత్ర ద్రష్టలు గృత్సమద, విశ్వామిత్ర, గౌతమ, అత్రి, భరద్వాజ, వశిష్ట, కణ్వాది ఋషులు. అక్కడక్కడ క్షత్రియరాజుల ప్రసక్తికూడ వున్నది. నవమ దశను మండలాలల్లో పాంచాలదేశ రాజు సహదేవుని కుమారుడు సోమకుడు, భీష్ముని చిననాన్న దేవాపి పేర్లున్నవి. దశమ మండలంలో ద్రష్టలుగా కవయ, అరుణ, వైతాహవ్య, సుదాస, పైజవన, మాంధాత్రి, యౌవనాశ్వ, వత్సప్రి, బాలనందన, ఊర్ధ్వగ్రావా మొదలైనవారున్నారు. ఇంకా పవమాన, ప్రాగాథ కుటుంబాలకు చెందిన ఋషులున్నారు. మంత్ర ద్రష్టల్లో స్త్రీలుకూడ వున్నారు. ఋగ్వేదంలో వలెనే ఇతర వేదాలల్లోను మంత్రద్రష్టలైన ఋషులపేర్లు చెప్పబడలేదు. ఆయా వేదాలకు చెందిన సర్వానుక్రమణిక గ్రంథాల్లోనే వారి పేర్లు చెప్పబడినవి.

# వేదపాఠం

భారతీయుల అలౌకిక, లౌకిక విద్యలన్నిటికి వేదం మూలస్థానం. భారత దేశంలో ఎన్నో మత సంప్రదాయాలు వచ్చినవి. వాటన్నిటికి మూలస్రోతస్సు వేదమే. దేవుని అస్తిత్వాన్ని అంగీకరించినా అంగీకరించకపోయినా భారతీయులు సహించారు కాని వేద ప్రామాణ్యాన్ని అంగీకరించకపోతే వారిని నాస్తికులని పిలిచారు. భారతీయ ధార్మిక జీవనంలో వేదాలకి చాల మహత్త్వపూర్ణమైన స్థానమున్నది. విజ్ఞాన భాండాగారాలైన వేదాలను ఖిలం కాకుండా రక్షించాలనే కోరిక ప్రాచీన ఋషుల్లో పండితుల్లో కలిగింది. అందుకే అనేకమైన జాగ్రత్తలు వారు తీసుకొన్నారు. వారు తీసుకొన్న జాగ్రత్తలు ఎంతో సమర్థవంతంగా వున్నవి. ఆ జాగ్రత్తలవల్లనే లిఖితరూపంలో లేకుండానే వేదాలు ఈనాటికి మూలరూపం ఏ కొద్దిగానైనా చెక్కు చెదరకుండా వేల సంవత్సరాలుగా నిలిచివున్నవి. భారతదేశమంతా ఏ భాషను మాట్లాడేవారు అయినా వేదాల స్వరోచ్చారణలో భేదం లేకుండా వేదపాఠం చేస్తున్నారు. ఒక్క అక్షరం కూడా మార్పు చెందకుండా వేదాల విశుద్ధమైన స్వరోచ్చారణలో ఈ నాటికి ఏ మార్పు రాలేదంటే మన ప్రాచీనులు ఏర్పరచిన సువ్యవస్థయే కారణం. వివిధ పద్ధతుల్లో చట్రంలో బిగించినట్లుగా మంత్రాలను, మంత్రపదాలను పఠించే పద్ధతిని 'పాఠం' అంటారు. ఈ వివిధ పాఠపద్ధతుల నియమాలే వేదాలు ఒక్క అక్షరమైనా స్ఖలితం కాకుండా నిలిచిపోవటానికి తోడ్పడినవి. ఈ పాఠ పద్ధతులను తెలిపేకొరకు ప్రత్యేకమైన గ్రంథాలుకూడ వ్రాయబడినవి. వాటిని ప్రాతిశాఖ్య గ్రంథాలని అంటారు. క్రమపూర్వకంగా మంత్రాలను, మంత్ర వర్ణాలను పాఠం చేసే పాఠ పద్ధతులు 8 వున్నవి - జటా, మాలా, శిఖా, రేఖా, ధ్వజ, దండ, రథ, ఘనాపాఠాలని వాటి పేర్లు.

జటా మాలా శిఖా ధ్వజో దండోరథో ఘనః
అష్టౌ వికృతయః ప్రోక్తాః క్రమపూర్వా మహర్షిభిః

మంత్రాలను మామూలుగా చదవటాన్ని 'సంహితా పాఠ' మంటారు. ప్రతిపదాన్ని విడదీసి వేరు వేరుగా చదివినట్లయితే దాన్ని పదపాఠ మంటారు. పద పాఠాన్నే ఆధారంగా చేసుకొని క్రమాన్ని మార్చి పదాలను చదివినట్లయితే జటాది పాఠభేదాలు ఏర్పడుతవి. పదక్రమాలమ మార్చినప్పుడల్లా ప్రతిపదంలోని స్వరం మారి ఉచ్చారణలో భేదం ఏర్పడుతుంది. ఎట్లా అంటే - సంహితా పాఠంలో వున్న స్వరితం పదపాఠంలో గాని ఇతర పాఠాలల్లో గాని అనుదాత్తంగానో లేక ఏకశ్రుతిగానో ఉచ్చరింపబడుతుంది. అంటె పదపాఠంలో పదాలు

ఒకటై వుంటవి కానిస్వరాలల్లో భేదం వస్తుంది. క్రమంగా రెండు పదాలను పఠించుకుంటూ పోవటం క్రమపాఠ మనబడుతుంది. అనులోమ, విలోమ క్రమంలో పదాలు మూడుసార్లు పఠింపబడినట్లయితే అది జటాపాఠ మనబడుతుంది. జటాపాఠంలోని అనులోమ, విలోమ క్రమానికి ముందు వచ్చే పదాన్ని కలుపుతూపోతు చదివినట్లయితే అది శిఖాపఠ మనబడుతుంది. పదాలను అనులోమ విలోమ క్రమంలో చాలాసార్లు చదివినట్లయితే అది ఘనాపాఠ మనబడుతుంది. ఘనాపాఠం నాలుగు విధాలుగా వుంటుంది. దానిలో ఒకటి – శిఖాపాఠంలోని పదాలను తిప్పి తిరిగి పఠించే పద్ధతి.

ఈ పాఠపద్ధతుల వ్యవస్థవల్లనే వేదాలు మౌఖికంగా లిఖిత రూపంలో లేకున్నా ఒక్క అక్షరమైనా లోపించకుండా, ఉచ్చారణలో భేదం రాకుండా నిలిచిపోయినవి. ఈ విలక్షణమైన పాఠపద్ధతులు వేదరక్షణాకార్యాన్ని సమర్థవంతంగా నిర్వహించినవి. వేదపాఠ పద్ధతులు ఈనాటి కంప్యూటర్ల పద్ధతికి అనువైనట్లుగా శాస్త్రీయంగా వున్నవి. దాన్ని బట్టి ప్రాచీన భారతీయుల మేధాసంపద ఎంత గొప్పదో తెలుస్తున్నది.

## వేద భాష్యాలు

వేదాలు అతి ప్రాచీనమైనవి. కొన్ని వేల సంవత్సరాల కిందటి గ్రంథాలు. వాటిల్లోని భాష ఇప్పుడు మనకు అర్థంకాదు. దానిలో వున్నది సంస్కృతమే. ఆ సంస్కృతభాషను వైదికసంస్కృతభాష అంటారు. వైదిక భాష వ్యవహారంలో ఒకప్పుడు వుండేది. అంటే అప్పటి వ్యవహారిక భాషలోనే వేద మంత్రాలు రచింపబడినవి. రానురాను వ్యవహారంలో వైదికభాష చాల మార్పులను చెందుతూ వచ్చింది. ప్రాకృత భేదాలు దానిలో ఏర్పడినవి. ప్రజలు వైదికభాషకు వికృత రూపాలైన వివిధ ప్రాకృతభాషలను మాట్లాడుతున్నప్పుడే వీటన్నిటియొక్క సంస్కృత రూపమైన స్వచ్ఛమైన ఒక భాషను శిక్షితులైన జనులు మాట్లాడేవారు. ఆ భాషకే పాణిని వ్యాకరణాన్ని రచించాడు. దానిలోనే మహాభారత రామాయణాది లౌకికవాఙ్మయసృష్టి జరిగింది. ఈ భాషకే సంస్కృత భాష అన్న పేరు ప్రసిద్ధమైంది. సంస్కృతభాష మనకు బ్రాహ్మణ గ్రంథాలల్లోనే దర్శనమిస్తున్నది. అందుకే బ్రాహ్మణ, ఉపనిషదాది గ్రంథాలు అవగాహనకు చాల దూరంగా లేవు. వేదసంహితల్లోని భాష అవగాహనకు దూరమైంది. వేదరచన కాలంనాటి ప్రజల ఆర్థిక ధార్మిక సాంఘిక పరిస్థితులు కూడ భిన్నమైనవి. వారి జీవన పరిస్థితుల నడుమ ప్రయోగింపబడిన పదాల, సమాసాల, వృత్తాంతాల అర్థాలు తర్వాత విస్మరింపబడినవి. తర్వాత కాలంలో మారిన ఆర్థిక ధార్మిక సాంఘిక పరిస్థితుల్లో ఆ పదాల, సమాసాల, వృత్తాంతాల అర్థాలు మారిపోయినవి. భాషా నిర్మాణ పద్ధతి కూడ మారింది. వైదిక భాషలోని కాలభేదాలు

(tense) తర్వాత భాషలో సులభతరమైనవి. అంటే లౌకికభాష వైదికభాష అంత క్లిష్టంగా లేక సులభీకరణం చేయబడింది. దానితో వేదాల మూలార్థం అర్థం కావటం కష్టమైంది. అప్పుడు వేదాల అభ్యాసానికి, అవగాహనకు తోడ్పడేటందుకు వేదాంగాలు పుట్టినవి. యాస్కుని నిరుక్తంలో వేదమంత్రాలల్లోని పదాలకు వ్యుత్పత్త్యర్థం చెప్పబడింది. అంటే వేదమంత్రాలల్లోని కఠినమైన దురూహ్యమైన పదాలను వివరించటానికి నిరుక్తం పుట్టింది. ఈ నిరుక్తంకన్న ముందు నిఘంటు గ్రంథాలు పుట్టినవి. వీటిల్లో కఠినమైన పదాలు క్రమబద్ధంగా సంకలితమైనవి. కఠినమైన వేద పదాలను వివరించటానికి, స్పష్టం చేయటానికి నిఘంటువులు మొదట ప్రయత్నించినవి. తర్వాత ప్రాతిశాఖ్యాది గ్రంథాలు వేదపదాలను, స్వరాలను, సంధులను గూర్చి వివరించినవి. ఈవిధంగా వేదాలు అర్థం కాకుండాపోయిన సమయంలో వాటి అవగాహనకు తోడ్పడే నిఘంట్వాది గ్రంథాలు వ్రాయబడినవి. యాస్కుడు నిరుక్తంలో వేదపదాల అర్థవిషయంలో ఇతర ఆచార్యుల అభిప్రాయాలను చాలాచోట్ల పేర్కొన్నాడు. కాబట్టి యాస్కుని (క్రీ.పూ. 8వ శ॥) నాటికే వేదపదాలకు అర్థం బోధించటంలో అభిప్రాయభేదాలు ఏర్పడినవని తెలుస్తున్నది. తర్వాత వేదపదాలే కాదు, పూర్తిగా మంత్రాలే వ్యాఖ్యానం లేకపోతే అర్థం కాకుండాపోయినవి. దానితో పండితులు వేదాలకు వ్యాఖ్యానాలను వ్రాయటం ఆరంభించారు.

బౌద్ధ జైనమతాల వ్యాప్తితో, వాసుదేవకృష్ణాది భక్తిమత ప్రచారంతో వైదిక మతానికి, వైదిక కర్మకాండకు ప్రాధాన్యం తగ్గింది. క్రీ.శ. 7వ శతాబ్దంలో కుమారిలభట్టు వేద ప్రాధాన్యాన్ని పునఃస్థాపించాడు. అదే కాలంలో వేదాలకు మొదటిసారిగా మాధవభట్టు, స్కందస్వామి మొదలైనవారు భాష్యాలను రచించారు. అంటే ఆ సమయానికి వేదాలు పూర్తిగా అర్థం కాకుండా పోయినవని, ప్రజల్లో తత్‌జ్ఞానాన్ని వ్యాపింపజేయాలంటే అవి అర్థమయ్యేటట్లుగా భాష్యాలు వ్రాయవలసిన అవసరం కలిగిందని చెప్పవచ్చును. స్కందస్వామి తర్వాత అనేక పండితులు వేదాలకు భాష్యాలను రచించటానికి పూనుకొన్నారు.

## ఋగ్వేదభాష్యాలు

### స్కంద స్వామి

స్కందస్వామి గుజరాతులోని వలభి ప్రాంతంవాడు. ఇతని తండ్రి పేరు భర్తృధ్రువుడు. ఇతని గురువు శతపథ బ్రాహ్మణ భాష్యకారుడు హరిస్వామి. హరిస్వామి తన భాష్యకాలాన్ని కలియుగం 3740 అని చెప్పుకొన్నాడు. దీన్నిబట్టి స్కందస్వామి కాలం క్రీ.శ. 625 ప్రాంతమని చెప్పవచ్చును.

స్కందస్వామి ఋగ్వేద భాష్యం చాల వివరంగా వున్నది. ప్రతి మంత్రద్రష్ట ఋషి పేరు, దేవత పేరును ఇచ్చాడు. నిఘంటు, నిరుక్తాదుల నుంచి ప్రమాణాలను స్కందస్వామి ఉద్ధరించాడు. వ్యాకరణసంబంధ వివరణలు కూడ వున్నవి. భాష్యం సరళమైన భాషలో విశదంగా వున్నది. స్కందస్వామి ఋగ్వేదభాష్యం పూర్తిగా ఇప్పుడు లభించటం లేదు. ఋగ్వేదానికి సగభాగం అంటే నాల్గవ అష్టకం వరకే స్కందస్వామి విరచిత భాష్యం లభిస్తున్నది. మిగిలినది ఇద్దరు ఆచార్యులు పూర్తి చేశారు. స్కందస్వామి భాష్య ప్రభావం సాయణుని భాష్యంమీద చాల వున్నది.

## నారాయణుడు

స్కందస్వామి ఋగ్వేద భాష్యాన్ని పూర్తిచేసిన ఆచార్యుల్లో ఇతడు ఒకడు. సామభాష్యకారుడు మాధవుని తండ్రి అయిన నారాయణుడు, ఇతడున్ను ఒక్కరే అని అంటారు. కానీ దీనికి ప్రమాణమేమి లేదు. ఇతడు క్రీ.శ. 7వ శతాబ్దం ప్రాంతం వాడు.

## ఉద్గీథుడు

వేంకట మాధవుడు తన ఋగ్వేద భాష్యంలో స్కందస్వామి, నారాయణుడు, ఉద్గీథుడు ముగ్గురు ఋగ్వేద భాష్యాన్ని రచించారని తెలిపాడు. ఋగ్వేదం మొదటి భాగాలకు స్కందస్వామి భాష్యం వ్రాయగా మధ్యభాగాలకు నారాయణుడు, చివరి భాగాలకు ఉద్గీథుడు భాష్యం వ్రాశారు. ఉద్గీథుడు కర్ణాట దేశంలోని వనవాసి ప్రాంతంవాడనని చెప్పుకొన్నాడు. ఇతని భాష్యప్రభావాన్ని సాయణుని భాష్యంమీద చూడవచ్చును.

## మాధవభట్టు

మాధవ నామంతో నలుగురు భాష్యకారులు కన్పిస్తున్నారు. ఒకరు సామవేద సంహితకు భాష్యం వ్రాసిన మాధవుడు. ముగ్గురు మాధవులు ఋగ్వేదానికి భాష్యం వ్రాశారు. ఈ ముగ్గురిలో ఒకడు సాయణ మాధవుడు, రెండవ మాధవుడు వేంకట మాధవుడు. వీరుగాక మరొక మాధవుడు వున్నాడు. అతడే ఈ మాధవభట్టు. ఇతడు ఋగ్వేదం మొదటి 8 అష్టకాలకు వ్రాసిన భాష్యం మద్రాసు విశ్వవిద్యాలయం వారు ప్రచురించారు. ఇతని భాష్యం సంక్షిప్తంగా, విపులార్థ బోధకంగా, సారగర్భితంగా వున్నది. ఈ మాధవ భట్టు, వేంకట మాధవుడు ఒక్కరే అని కొందరు విద్వాంసులు తలంచారు. కాని దీన్ని అందరూ అంగీకరించలేదు. ఇద్దరి శైలి భిన్నంగా వున్నది. మాధవభట్టు గొప్ప పండితుడు. అతని ఋగ్వేదార్థజ్ఞానం చాల మహత్త్వపూర్ణమైంది. ఋగ్వేద భాష్యాన్ని

వ్రాయటానికి పూర్వం అతడు 11 అనుక్రమణిక గ్రంథాలను రచించాడు. ఆ గ్రంథాలు ఋగ్వేద మంత్రాలల్లోని పదాల అర్థాలను బోధిస్తున్నవి. వీటిల్లో 2 అనుక్రమణికలు మాత్రమే దొరికినవి. ప్రచురితమైనవి. వీటిల్లో నామ, క్రియలు సంగ్రహింపబడినవి. మాధవభట్టు ఋగ్వేదభాష్యాన్ని స్కందస్వామి, సాయణ, వేంకటమాధవులు అనుసరించారు. కాబట్టి మాధవుడు స్కందస్వామి (క్రీ.శ. 7వ శ॥) కన్న పూర్వుడని అంగీకరించవలసి వుంటుందని కొందరు విమర్శకుల అభిప్రాయం.

## వేంకట మాధవుడు

వేంకటమాధవుడు ఋగ్వేదానికి ఒక్కటికాక రెండు భాష్యాలను వ్రాశాడని కొందరు పండితుల అభిప్రాయం. ఇతడు ఆంధ్రదేశం వాడు. గొప్ప పండితుడు. కౌశిక గోత్రజుడు. ఇతని పితామహుడు మాధవుడు. తండ్రి వేంకటాచార్యుడు. వేంకట, గోవిందులు ఇతని కొడుకులు. సంకర్షణుడు ఇతని తమ్ముడు. ఇతడు సాయణుని కన్న పూర్వుడని పండితుల అభిప్రాయం. దాదాపు క్రీ.శ. 1050-1150 ప్రాంతం వాడని పండితుల నిర్ణయం. వేంకటమాధవుని భాష్యం సంక్షిప్తరూపంలో వున్నది. మంత్రపదాల అర్థం మాత్రమే ఇచ్చి మంత్రార్థాలను స్పష్టం చేయటానికి ప్రయత్నించాడు. స్కందస్వామి భాష్యం కన్న ఇతనిది సంక్షిప్తరూపంగా వున్నది. వేంకటమాధవునికి బ్రాహ్మణ గ్రంథాల జ్ఞానం విశేషంగా వున్నది. వేదమంత్రాల నిగూఢార్థాలను విప్పి చెప్పటంలో అతడు బ్రాహ్మణ గ్రంథాల సహాయాన్ని తీసుకున్నాడు. వేదాల యథార్థజ్ఞానం బ్రాహ్మణ గ్రంథాల వల్లనే కలుగుతుందని ఇతని విశ్వాసం. బ్రాహ్మణ గ్రంథాలను ఆధారంగా తీసుకున్న ఇతని భాష్యానికి ప్రత్యేకస్థానమున్నది. ఈ భాష్యాన్ని మోతీలాల్ బనారసీదాసు, ఢిల్లీవారు ప్రచురించారు.

## ధానుష్కయజ్వ

మూడు వేదాలకు ధానుష్కయజ్వ వ్రాసిన భాష్యాలున్నవని తెలుస్తున్నది. "త్రివేదీ భాష్యకారు" డని "త్రయీ నిష్ఠవృద్ధ" అని ఇతన్ని వేదాచార్యుడు తన సుదర్శనమీమాంసలో పేర్కొన్నాడు. ఇతడు వైష్ణవాచార్యుడు. ఇతని కాలం క్రీ.శ. 14వ శ॥కి పూర్వం. కాని ఇతని భాష్యాలు దొరకలేదు.

## ఆనందతీర్థుడు

ఆనందతీర్థునికే మధ్వాచారుడని పేరు. ఇతడు ద్వైతసిద్ధాంత స్థాపకుడు, మధ్వ వైష్ణవసంప్రదాయ ప్రవర్తకుడు. ఇతని వ్యాఖ్యానం పద్యరూపంలో వున్నది. ఋగ్వేదం

ప్రథమ మండలంలోని 40 సూక్తాలకు ఇతడు వ్యాఖ్యానం వ్రాశాడు. ఆధ్యాత్మికార్థాలను ఇతడు చక్కగా వివరించాడు. ఇది మాధ్వ సంప్రదాయానికి అనుకూలంగా వ్రాయబడింది.

## ఆత్మానందుడు

ఋగ్వేదంలో అస్యవామీయసూక్తానికి ఆత్మానందుడు భాష్యాన్ని వ్రాశాడు. ఇతడు సాయణునికి తరువాతవాడు. స్కందస్వామి భాష్యం యజ్ఞపరమైంది. నిరుక్తాదులు దేవపరమైనవి. తన భాష్యం ఆధ్యాత్మవిషయకమైందని ఆత్మానందుడు చెప్పుకొన్నాడు.

## సాయణాచార్యులు

సాయణుడు విజయనగర రాజులు బుక్క, హరిహరరాయలకు సమకాలికుడు. వారికి అమాత్యుడుగా, సేనానిగా వున్నాడంటారు. అయితే కొందరు సాయణ, మాధవులు వేరు వేరు వ్యక్తులు, వారు అన్నదమ్ములు అని, వారిలో సాయణుడు వేద భాష్యకారుడు, అతని అన్న మాధవుడు అమాత్యుడు, సేనాపతి, పండితుడు అని వాదం. సాయణుడు విద్యారణ్యస్వామి ఒక్కరే అని అంటారు. మాధవుడే సన్యాశ్రమంలో సాయణుడయ్యాడని మరోవాదం. మొత్తం మీద సాయణుడు క్రీ.శ. 14వ శ॥ వాడు. గొప్ప పండితుడు. మీమాంసజ్ఞానం కలవాడు. ఇతడు నాలుగు వేదాలకు వ్యాఖ్యానం వ్రాశాడు. అవి అన్ని ఇప్పుడు దొరుకుతున్నవి.

సాయణుడు చాలచోట్ల ఋగ్వేదాది భాష్యాలను 'మాధవీయ' అని పేర్కొన్నాడు. చివరకు తాను వ్రాసిన ధాతువృత్తినికూడ 'మాధవీయ ధాతువృత్తి' అని పిలిచాడు. దీన్ని బట్టి కొందరు పండితులు సాయణ, మాధవులు ఒకే వ్యక్తి అని విశ్వసించారు. కాని ఇది సర్వ సమ్మతం కాదు. రాజు బుక్కరాయల ప్రేరణతో తన అన్న, రాజుగారి మంత్రి అయిన మాధవుని ప్రోత్సాహంతో సాయణుడు వేద భాష్యాలను రచించివుంటాడు. అన్నమీది గౌరవభావంతో అతడు తన రచనలకు 'మాధవీయ' అని నామకరణం చేసాడేమో! సాయణుడే విద్యారణ్యస్వామి అని ప్రసిద్ధి.

సాయణుడు తైత్తిరీయ (కృష్ణ యజుర్వేద), ఋగ్వేద, సామవేద, కాణ్వ (శుక్ల యజుర్వేద), అథర్వ వేద సంహితలకు ఐదింటికి, 13 బ్రాహ్మణ గ్రంథాలకు వ్యాఖ్యానాలను రచించాడు. ఒక్క చేతి మీదుగా ఇన్ని వ్యాఖ్యాన రచనలు అంతకు పూర్వం జరుగలేదు. ఉద్దండ పండితుడైన సాయణుడు ఈ కార్యాన్ని మహత్త్వపూర్ణంగా పూర్తిచేశాడు. వ్యాఖ్యాన సమయంలో అతడు పురాణేతిహాస స్మృత్యాదుల నుంచి ప్రమాణాలను ఉద్ధరించాడు.

పూర్వాచార్యుల భాష్యాలను, నిరుక్తాది గ్రంథాలను పరిశీలించి అతడు యథోచితంగా గ్రహించాడు. సాయణుని భాష సులభగ్రాహ్యంగా, సుందరంగా వున్నది. సాయణుని భాష్యాలు ఆధునిక ప్రాచ్య పాశ్చాతులకు వేదావగాహనలో చాలా తోడ్పడినవి. అతడు వివరించిన విషయాలనే పాశ్చాత్య విమర్శకులు చాలా మట్టుకు ప్రమాణంగా గ్రహించారు. సాయణుని భాష్యాలు ఎక్కువ యజ్ఞపరంగాను, ఆధ్యాత్మికపరంగా తక్కువగానూ వున్నవి. వైదిక కర్మలను సాయణుడు బాగా తెలిసినవాడు. కాబట్టి తత్పరమైన అర్థాలను అతడు ఎక్కువగా వివరించాడు. ఆధ్యాత్మికార్థాలను వెదికేవారికి ఇతని భాష్యాలు కొంత నిరాశాజనకంగానే వున్నవి.

## దయానంద సరస్వతి

క్రీ.శ. 19వ శ॥ వాడు. ఆర్యసమాజ స్థాపకుడు. వేదాలు అనాది అని విశ్వసించినవాడు. ఇంద్ర, అగ్ని, వరుణాది దేవతల పేర్లు యౌగికార్థంలో పరమాత్మ అర్థంలో వాడబడినవని వేదాలకు ఆధ్యాత్మికార్థాలను బోధించినవాడు దయానందుడు. బ్రాహ్మణగ్రంథాలను అతడు ప్రామాణికంగా తీసుకోలేదు. వేదమంత్రాలల్లో సమస్త విజ్ఞానం నిక్షిప్తమై వున్నదని అతని అభిప్రాయం. చివరకు ఆధునిక శాస్త్రీయావిష్కరణలైన రైలు, టెలిఫోన్, విమానాల విజ్ఞానం కూడ వేదాలల్లో వున్నదని దయానంద స్వామి, ఇంకా తదనుయాయుల విశ్వాసం. అంటె ఆధ్యాత్మిక జ్ఞానమేకాక విజ్ఞానం కూడ వున్నదని వారి నమ్మిక. తదనుసారంగానే వేదమంత్రాలకు అర్థాలను ఆయన చెప్పాడు. ఇతడు ఋక్ యజుర్వేదాలకు సరళమైన సంస్కృతభాషలో వ్యాఖ్యానాలను రచించాడు.

## అరవింద ఘోష్

అరవింద ఘోష్ మొదట దేశభక్తుడు. దేశ స్వాతంత్ర్య యోధుడు, విప్లవ వీరుడు. తర్వాత గొప్ప ఆధ్యాత్మిక వేత్తగా పేరు సంపాదించుకొన్నాడు. ఆధునిక తత్త్వవేత్తల్లో అతడు అగ్రగణ్యుడు. వేదార్థాలు నిగూఢంగా వున్నవని వాటి మీది శ్రద్ధవల్ల వాటి అర్థాలు అవగతం కాగలవని అతడు అన్నాడు. అరవిందుడు వేదమంత్రాలకు ఆధ్యాత్మిక యౌగికమైన అర్థాలను చెప్పాడు. ఉదాహరణకు వేదాలల్లో ప్రయోగింపబడిన 'గౌః' పదానికి ప్రకాశమని 'అశ్వ' పదానికి శక్తి అని, 'ఘృత' పదానికి తేజస్సు అని అతడు అర్థాలను చెప్పాడు. వేదాలు కర్మకాండ ప్రతిపాదకాలు అనటాన్ని అరవిందుడు పూర్తిగా నిరాకరించాడు.

## ఆనందకుమార స్వామి

విమర్శకుల్లో, కళావేత్తల్లో ఇతడు ప్రసిద్ధుడు. పండితుడు. ఇతని తండ్రి సింహళ దేశీయుడు. తల్లి బ్రిటిషు వనిత. ఇతని ప్రారంభ విద్యాభ్యాసం ఇంగ్లండులోనే జరిగింది. భారతీయ కళలను, ప్రాచీన భారతీయాత్మను విప్పిచెప్పటంలో అతనికి మంచి నేర్పు వున్నది. "ఏ న్యూ అప్రోచ్ టు ది వేదాస్" అన్న పుస్తకంలో అతడు వేదాలకు విశిష్టవ్యాఖ్యానం చేశాడు. వేదాలలో మార్మికత (mysticsim) వున్నదని అతని విశ్వాసం. బౌద్ధ క్రైస్తవ మహమ్మదీయ మత గ్రంథాలల్లోని అనుభూతులే వేదాలల్లోను వున్నవని అతడన్నాడు.

## సామవేద భాష్యాలు

సామవేదానికి పూర్తిగా వ్యాఖ్యానం వ్రాసినవారు ముగ్గురు కన్పిస్తున్నారు -

## మాధవుడు

మాధవుడే సామసంహితకు మొదటి భాష్యకారుడు. సామవేదంలోని పూర్వ ఆర్చికలకు, ఉత్తర ఆర్చికలకు రెండు భాగాలకు ఇతడు వ్యాఖ్యానాన్ని వ్రాశాడు. బాణుని " రజోజుషే జన్మని సత్త్వ వృత్తయే..." అన్న కాదంబరి కావ్య శ్లోకం మాధవుని సామభాష్యారంభంలో కన్పిస్తున్నది. ఈ శ్లోకాన్ని మాధవుడే మంగళాచరణ శ్లోకంగా రచించాడని, దాన్ని బాణుడు తీసుకొన్నాడని పండితుల అభిప్రాయం. అంటె అప్పుడు మాధవుడు క్రీ.శ. 7వ శ॥ కి పూర్వుడు అవుతాడు. మాధవుని సామవేద భాష్యం చాల వివరంగా వున్నదని పండితుల అభిప్రాయం. ఈ భాష్యం తాళపత్ర ప్రతులరూపంలో లభిస్తున్నది. కాని ముద్రితం కాలేదు. సత్యవ్రత సామశ్రమి తన "సాయణభాష్యం" లో అక్కడక్కడ వివరణ కొరకు దీన్ని ఉద్ధరించి వున్నాడు.

## భరతస్వామి

సామవేదానికి భరతస్వామి భాష్యం కూడ ముద్రితం కాలేదు. సామవేదంలోని అన్ని మంత్రాలకు ఇతడు వ్యాఖ్యానం వ్రాశాడు. భరతస్వామి కాశ్యపగోత్రజుడు. ఇతని తండ్రి నారాయణుడు. ఇతడు శ్రీరంగం నివాసి, హోయసలరాజు రామనాథుని సమకాలికుడు. రామనాథుడు చోళమండలాన్ని జయించి హోయసలరాజ్యంలో కలుపుకొన్న వీరుడు. శ్రీరంగం రామనాథుని అధికారాధీనంలో వుండేది. అప్పుడు భరతస్వామి

కాలాన్ని క్రీ.శ. 1295 ప్రాంతమని చెప్పవచ్చును. భరతస్వామి సామవేదభాష్యం మీద మాధవుని భాష్య ప్రభావం కన్పిస్తున్నది. ఇతని భాష్యం సంక్షిప్తంగా, చక్కగా వున్నది.

## గుణవిష్ణువు

గుణవిష్ణువు సామవేదంలో నిత్యనైమిత్తిక విధులకు ఉపయోగపడే మంత్రాలకు మాత్రమే వ్యాఖ్యానాన్ని రచించాడు. ఇతని వ్యాఖ్యానం మిథిల, బెంగాల్ ప్రదేశాలల్లో బాగా వ్యాప్తిలో వున్నది. కాబట్టి ఇతడు ఆ ప్రాంతం వాడే కావచ్చును. గుణవిష్ణువు భాష్యం గురించి సాయణునికి తెలుసునని వారిద్దరి భాష్యాలను పరిశీలించిన స్పష్టం కాగలదు. గుణవిష్ణువు భాష్యాన్ని సాయణుడు కొంతవరకు అనుసరించాడు. గుణవిష్ణువు లక్ష్మణసేనుని కాలంవాడని, కాబట్టి క్రీ.శ. 12వ శ॥ వాడని పండితుల నిర్ణయం. గుణవిష్ణువు ఛాందోగ్య మంత్ర భాష్యాన్ని కూడ రచించాడు. ఇది సామవేదం కౌథుమశాఖకు వ్రాయబడింది. ఇది కలకత్తా నుంచి ప్రచురితమైంది.

# శుక్ల యజుర్వేద భాష్యాలు

## ఉవ్వటుడు

ఇతడు వజ్రటుని కొడుకు. అవంతీపుర నివాసి. భోజుని కాలంవాడు అంటే క్రీ.శ. 11వ శ॥ వాడు. పేర్లను బట్టి వీరు కాశ్మీర దేశీయులని తెలుస్తున్నది. ఇతడు కావ్య ప్రకాశకారుడు మమ్మటుని అనుజుడని తెలుస్తున్నది. ఉవ్వటుడు మాధ్యందిన యజుర్వేద సంహితకు భాష్యాన్ని వ్రాశాడు. ఇతడు వేద మంత్రాలకు ఆధ్యాత్మికపరమైన అర్థాలను ఇచ్చాడు. ఈ భాష్యమే కాక ఇతడు యజుః ప్రాతిశాఖ్యకు టీక, ఋక్ సర్వానుక్రమణికకు వ్యాఖ్య, ఈశావాస్య ఉపనిషత్తుకు వ్యాఖ్యలు రచించాడు. ఇతడు గొప్ప వేదపండితుడు.

## మహీధరుడు

శుక్లయజుర్వేదం మాధ్యందిన సంహితకు మహీధరుడు వేదదీపమనే వ్యాఖ్యానాన్ని రచించాడు. ఇతడు కాశీ నివాసి. ఇతడు ఉవ్వటుని వ్యాఖ్యానాన్ని అనుసరించాడు. కాని ఉవ్వటుని వ్యాఖ్యానాని కన్న ఇతని వ్యాఖ్యానం స్పష్టంగా విశదంగా వున్నది. ఇతడు వైదికుడైనా తంత్రశాస్త్రం తెలిసినవాడు. మంత్ర మహోదధి అనే తంత్రశాస్త్రాన్ని కూడ రచించాడు. ఇతని కాలం క్రీ.శ. 16వ శతాబ్దం.

## హలాయుధుడు

శుక్ల యజుర్వేదం కాణ్వసంహితకు భాష్యాన్ని హలాయుధుడు రచించాడు. ఇతడు సాయణునికి పూర్వుడు. ఇతని భాష్యం పేరు 'బ్రాహ్మణ సర్వస్వం'. ఇతడు బెంగాల్ రాజు లక్ష్మణసేనుని ఆస్థాన పండితుడు, ధర్మాధికారి. అప్పుడు ఇతని కాలం క్రీ.శ. 12వ శతాబ్దం అనటం నిశ్చయం. సాయణుడు మాధ్యందిన సంహితకు భాష్యాన్ని వ్రాయలేదు. అతడు కాణ్వసంహితకే భాష్యాన్ని వ్రాశాడు. హలాయుధుడు గొప్ప వేదపండితుడు. ఇతడు వేద భాష్యాన్నే కాక, మీమాంస సర్వస్వం, వైష్ణవ సర్వస్వం, శైవ సర్వస్వం, పండిత సర్వస్వం మొదలైన గ్రంథాలను రచించాడు. ఇతడు శైవ, వైష్ణవ ఆగమాలను తెలిసిన వాడు. మీమాంసకుడు కూడ.

## అనంతాచార్యుడు

ఇతడు వైష్ణవుడు. క్రీ.శ. 16వ శ॥ వాడు. ఇతడు కాణ్వసంహిత ఉత్తరార్ధ భాగానికి భాష్యాన్ని వ్రాశాడు. మహీధరుని వ్యాఖ్యాన ప్రభావం ఇతని మీద కన్పిస్తున్నది. అక్కడక్కడ కొన్ని మంత్రాలను విష్ణుపరంగా అన్వయం చేసి చెప్పాడు. శుక్ల యజుః ప్రాతిశాఖ్యకు కూడ ఇతడు వ్యాఖ్యను వ్రాశాడు.

## ఆనందబోధ భట్టోపాధ్యాయుడు

కాణ్వసంహిత చతుర్థ దశకానికి ఇతని వ్యాఖ్యానం ప్రచురితమైంది. కాని పూర్తి సంహితకు ఇతడు వ్యాఖ్యానం వ్రాసినట్లు తెలుస్తున్నది. ఇతడు వాసుదేవపురి నివాసి. వ్యాఖ్యానంలో పుష్టికొరకు ఇతడు బ్రాహ్మణ గ్రంథాల నుంచి ఉద్ధరణలను ఇచ్చాడు. ఇతని భాష సరళంగా వున్నది. ఇతని మీద ఉవ్వటుని వ్యాఖ్యాన ప్రభావం కన్పిస్తున్నది. అయినా ఇతని భాష్యం మౌలికమైందని చెప్పాలి.

# కృష్ణ యజుర్వేద భాష్యాలు

## కుండినుడు

కుండినుడు తైత్తిరీయ సంహితకు భాష్యం వ్రాసినట్లు తెలుస్తున్నది. ఇతడు గుప్తులకాలం వాడని పండితుల అభిప్రాయం.

## భవస్వామి

ఇతడు కూడ తైత్తిరీయ సంహితకు భాష్యం వ్రాసినట్లు ఆధారాలున్నవి. కాని ఇది అలభ్యం.

## గృహదేవుడు

ఇతడు కూడ తైత్తిరీయ సంహితకు భాష్యాన్ని వ్రాశాడు. దేవరాజ యజ్వ తన నిఘంటు భాష్యంలోను, ఆచార్య రామానుజుడు తన వేదార్థ సంగ్రహంలోను గృహదేవున్ని పేర్కొన్నారు. కాబట్టి ఇతడు క్రీ.శ. 12వ శ॥ కి పూర్వుడు. క్రీ.శ. 9వ శ॥ వాడు అని కొన్ని ఆధారాలచేత నిశ్చయింపబడింది.

## క్షరుడు

క్షరుడు కూడ తైత్తిరీయసంహితకు భాష్యాన్ని వ్రాసినట్లు తెలుస్తున్నది. దీన్ని గురించి సాయణుడు మాధవీయధాతువృత్తిలో తెలిపివున్నాడు

## భట్ట భాస్కరుడు

భాస్కరుడు క్రీ.శ. 12వ శ॥కి పూర్వుడు. సాయణుడు ఇతనిని పేర్కొన్నాడు. ఇతడు తైత్తిరీయ సంహితకు భాష్యాన్ని వ్రాశాడు. ఈ భాష్యం పేరు జ్ఞానయజ్ఞం. ప్రమాణంగా భాస్కరుడు అనేక వైదిక గ్రంథాలను ఉద్ధరించాడు. యజ్ఞపరమైన అర్థమే దీనిలో వివరింపబడింది. అక్కడక్కడ ఆధ్యాత్మిక, ఆధిదైవికార్థాలను కూడ భాస్కరుడు వివరించాడు. ఇతడు గొప్ప వైదిక పండితుడు.

## వైదిక సాహిత్యాన్ని గూర్చి పాశ్చాత్యుల కృషి

క్రీ.శ. 1805లో కోల్‌బ్రూక్ 'ఏషియాటిక్ రిసెర్చ్' అనే పత్రికలో వేదాల మీద ఒక వ్యాసాన్ని వ్రాశాడు. ఆ వ్యాసంలో అతడు అనేక వైదిక గ్రంథాల వివరణను ఇచ్చాడు. పాశ్చాత్యులకు వేదాలతో పరిచయాన్ని ఈ వ్యాసమే మొట్టమొదట కలిగించింది. దీనికి పూర్వం ఒక ఫ్రెంచి మిషనరీ 'రాబర్ట్ డీ నేబిలిస్' యజుర్వేదం యొక్క కల్పిత ప్రతిని ఫ్రాన్స్ దేశానికి తీసుకొనిపోయాడు. ఈ ప్రతిని ప్రసిద్ధ ఫ్రెంచి రచయిత వాల్టేర్ చూచి హిందువుల విద్యాబుద్ధులను విశేషంగా ప్రశంసించాడు. ఈ ప్రతి కల్పితమైందని తెలిసిన తర్వాత యూరోపియన్లలో సంస్కృత భాషమీద అశ్రద్ధ, అవిశ్వాసం ఏర్పడినవి. ఈ అశ్రద్ధ,

అవిశ్వాసాలను కోల్‌బ్రూక్ వ్యాసం చాలవరకు తొలగించకలిగింది. పాశ్చాత్య పండితులు చాలామంది వైదిక సాహిత్య పరిశీలన వైపుకు ఆకర్షింపబడినారు. క్రీ.శ. 1830 ప్రాంతంలో రోజెన్ అనే జర్మన్ విద్వాంసుడు ఋగ్వేదానికి సంపాదకత్వం వహించాడు కాని అతడు ఆకస్మికంగా మరణించటంతో ఆ పని ఆగిపోయింది. క్రీ.శ. 1846లో రుడాల్ఫ్ రోథ్ అనే జర్మన్ పండితుడు "వేద స్పాహిత్య చరిత్ర" అనే పుస్తకాన్ని రచించాడు. ఈ చిన్న పుస్తకం చాలమంది యూరోపుపండితుల దృష్టిని వేదసాహిత్యం వైపుకు మరల్చింది. రోథ్ సాయాణాదుల భారతీయ సంప్రదాయానుసారమైన వేద భాష్యార్థాలను పూర్తిగా నిరాకరించి భాషా శాస్త్రం, తులనాత్మక ధార్మికాధ్యయనాలను సహాయకంగా తీసుకొని వేదార్థాన్ని వివరించటానికి పూనుకొన్నాడు. ఈ పద్ధతిని ఉపయోగించి అతడు సెయింటు పీటర్స్‌బర్గ్ సంస్కృత - జర్మన్ కోశాన్ని సిద్ధం చేశాడు. ఇది బృహత్కార్యం. దీనిలో వైదిక, సంస్కృత శబ్దాలు పరిశీలింపబడినవి. సందర్భ వివరణ కొరకు వైదిక, లౌకిక వాఙ్మయం నుంచి ఉద్ధరణలు ఇయ్యబడినవి. ఇదే విధంగా లౌకిక సంస్కృత శబ్దాలను బోట్ లింక్ పరిశీలించాడు. సంస్కృత శబ్దాల చరిత్రను తెలుసుకోటానికి ఈ నిఘంటువులు చాల ఉపయోగిస్తున్నవి. రోథ్ తర్వాత అతని సహపాఠులు, శిష్యులు వైదిక సాహిత్యాన్ని గూర్చి చాల కృషిచేశారు. రోథ్ శిష్యుల్లో చార్లెస్ లాన్‌మన్, డబ్ల్యు. డి. విట్నీ, (క్రీ.శ. 1827-1894), హెన్రిచ్ త్సిమ్మర్ (క్రీ.శ. 1851-1910), రిచర్డు గార్బే (క్రీ.శ. 1867-1927), కార్ల్., ఎఫ్. గెల్డెనర్ (క్రీ.శ. 1851-1929) ముఖ్యులు. వీరిలో గెల్డెనర్ ఋగ్వేదాన్ని జర్మన్ భాషలోకి అనువదించాడు. ఈనాటికి ఇది చక్కని అనువాదంగా పరిగణింపబడుతున్నది

మాక్స్ ముల్లర్ అనే జర్మన్ విద్వాంసుడు సంస్కృత సాహిత్యం గురించి చేసిన కృషి శ్లాఘనీయమైంది. మాక్స్‌ముల్లర్, రోథ్‌లు ఇద్దరు ప్యారిస్‌లో యూజీన్ బుర్నోఫ్ అనే ఫ్రెంచి పండితుని శిష్యులు. ఇతని ప్రేరణచేతనే ఈ ఇద్దరు వేదాధ్యయన, పరిశోధనలను చేపట్టారు. ముల్లర్ ఋగ్వేదాన్ని సాయణభాష్యంతో విమర్శనాత్మకమైన పీఠిక టిప్పణులతో మొదటిసారిగా ప్రచురించాడు. దీన్ని అతడు క్రీ.శ. 1849లో ఆరంభించి క్రీ.శ. 1875లో పూర్తి చేశాడు. ఈ ఋగ్వేద ప్రతి పాశ్చాత్య దేశాలల్లో వేద అధ్యయనాధ్యాపన కార్యాలకు పునాది వేసిందని చెప్పాలి. క్రీ.శ. 1890-92లో ఇదే తిరిగి సంస్కరింపబడి ప్రచురించబడింది. మాక్స్‌ముల్లర్ " ప్రాచీన వైదిక సంస్కృత సాహిత్య చరిత్ర" అన్న పుస్తకంలో వైదిక సాహిత్యాన్ని సవిమర్శకంగా పరిశీలించాడు. అతడు ప్రచురించిన "పవిత్ర ప్రాచ్య గ్రంథమాల" లోని పుస్తకాలల్లో పాశ్చాత్య పండితుల అనువాదాలతో వైదిక గ్రంథాలు కొన్ని ప్రచురింపబడినవి. వేబర్ అనే జర్మన్ సంస్కృత పండితుడు యజుర్వేద తైత్తిరీయ

సంహితకు సంపాదకత్వం వహించి ప్రచురించాడు. అతడు "ఇండిషే స్టూడియన్" అన్న పత్రికను నడిపి వైదిక గ్రంథపరిశోధనాకార్యాన్ని నిర్వహించాడు. క్రీ.శ. 1862-63లో అవుఫ్ రెష్ట అన్న జర్మన్ పండితుడు ఋగ్వేదాన్ని మిక్కిలి సంశోధించి చక్కని ప్రతిని రోమన్ లిపిలో ప్రచురించాడు. ష్రాయిడర్ అన్న జర్మన్ విద్వాంసుడు మైత్రాయణీసంహితను క్రీ.శ. 1881-86లోను, క్రీ.శ. 1900-11లో కాఠకసంహితను ప్రచురింపజేశాడు. వీటికి సంపాదకత్వం వహించటంలో ష్రాయిడర్ చక్కని విమర్శనాత్మక దృష్టిని ప్రదర్శించాడు. స్టీవెన్సన్ అనే పండితుడు రాణాయనీయ సామసంహితను క్రీ.శ. 1842లో ఇంగ్లీషు అనువాదంతో ప్రచురించాడు. క్రీ.శ. 1848లో బేన్ఫీ కౌథుమ సామసంహితను జర్మన్ అనువాదంతో ప్రచురించాడు. క్రీ.శ. 1856లో రోథ్, విట్నీ అనే జర్మను పండితులు అథర్వ వేదాన్ని ప్రచురించారు. బ్లూమ్‌ఫీల్డ్ మరియు నార్బే అనే జర్మనీ పండితులు జీర్ణావస్థలో కాశ్మీరంలో దొరికిన పిప్పలాద అథర్వసంహితను క్రీ.శ. 1901లో ప్రచురింపజేశారు. మూలప్రతిని ఫోటో కాపీలుగా దీన్ని వారు ప్రచురించారు. ఇంకా ఎన్నో బ్రాహ్మణ, శ్రౌతసూత్ర, ప్రాతిశాఖ్యాది వైదిక గ్రంథాలను పాశ్చాత్య పండితులు ఆ ప్రతులను సంపాదించి పరిశోధించి ప్రచురించి వైదిక సాహిత్యానికెంతో సాటిలేని సేవ చేశారు.

హోగ్ అనే పండితుడు ఐతరేయ బ్రాహ్మణాన్ని ఇంగ్లీషు అనువాదంతో, విమర్శనాత్మకమైన పీఠికతో క్రీ.శ. 1863లో ప్రచురించాడు. అవుఫ్ రెష్ట కూడ ఐతరేయ బ్రాహ్మణాన్ని రోమన్ లిపిలో క్రీ.వ. 1879లో ప్రచురించాడు. లిండ్నెర్ అనే పండితుడు కౌశీతకి బ్రాహ్మణాన్ని క్రీ.శ. 1887లో ప్రచురించాడు. వేబర్ మాధ్యందిన శతపథ బ్రాహ్మణాన్ని క్రీ.శ. 1855లో ప్రచురించాడు. ఇంకా సామవేద సంబంధి బ్రాహ్మణ గ్రంథాలెన్నో ఇంగ్లీషు, జర్మన్ భాషానువాదాలతో ప్రచురింపబడినవి. స్టెన్జలర్ అనే పండితుడు అశ్వలాయన, పారస్కరగృహ్య సూత్రాలను ప్రచురించాడు. హిల్లెబ్రాంటు శాంఖాయన శ్రౌత సూత్రాన్ని, క్యాలండ్ బౌధాయన శ్రౌతసూత్రాన్ని గార్బే ఆపస్తంబ శ్రౌత సూత్రాన్ని, క్నొయెర్ మానవశ్రౌత సూత్రాన్ని, వేబర్ కాత్యాయన శ్రౌత సూత్రాన్ని, బ్లూమ్‌ఫీల్డు కౌశీతకి శ్రౌత సూత్రాన్ని సంపాదీకరించి ప్రచురించారు.

వైదిక గ్రంథాలు ఎన్నో పాశ్చాత్య భాషల్లోకి అనువదింపబడినవి కూడ. క్రీ.శ. 1850లో హెచ్. హెచ్. విల్సన్ సాయణభాష్యంతో ఋగ్వేదాన్ని ఇంగ్లీషులోకి అనువదించి ప్రచురించాడు. గ్రాస్‌మన్ అనే పండితుడు ఋగ్వేదాన్ని జర్మన్ భాషలోకి పద్యానువాదం క్రీ.శ. 1876-77లో చేశాడు. రోథ్ చెప్పిన వ్యాఖ్యానాలను అనుసరించి ఈ అనువాదం

చేయబడింది. కాని సాయణ భాష్యాన్ని గ్రాస్‌మన్ అనుసరించలేదు. గ్రాస్‌మన్ ముఖ్యంగా గణితశాస్త్రజ్ఞుడు అయినా అతడు వినోదంగా (mental recreation) సంస్కృతాన్ని అభ్యసించి ఋగ్వేదపదకోశాన్ని (వ్యోర్టర్ బుఖ్ డెస్ రుగ్వేద) రచించాడు. తర్వాత ఋగ్వేద అనువాదానికి పూనుకొన్నాడు. అల్ఫ్రెడ్ లుడ్విగ్ విపులమైన వ్యాఖ్యతో క్రీ.శ. 1876-1888లో ఋగ్వేదాన్ని జర్మన్ భాషలోకి గద్యానువాదం చేశాడు. గ్రిఫిత్ ఋగ్వేదాన్ని పద్యరూపంలో ఇంగ్లీషులోకి అనువదించాడు. ఇది క్రీ.శ. 1889-1892లో ప్రచురింపబడింది. దీనిలో గ్రిఫిత్ సాయణభాష్యసహాయాన్ని తీసుకొన్నాడు. ఓల్డన్‌బెర్గ్ అనే జర్మన్ పండితుడు ఋగ్వేదానికి చక్కని విశదమైన వ్యాఖ్యానాన్ని క్రీ.శ. 1901-12లో జర్మన్‌భాషలో ప్రచురించాడు. దీనిలో ఓల్డెన్‌బెర్గ్ మొదట పూర్వాచార్యుల అభిప్రాయాలను ఇచ్చి, తర్వాత విమర్శనాత్మకమైన తన వివరణను ఇచ్చి వున్నాడు. ఋగ్వేద ఛందస్సుల వివేచనను అతడు మరొక గ్రంథంలో చేసి వున్నాడు. ఋగ్వేదాన్ని ప్రాచీన నవీన దృష్టితో తులనాత్మకంగా గ్రహించటానికి ఓల్డన్‌బెర్గ్ వ్యాఖ్యానం చాలా ఉపయోగిస్తుంది. విమర్శనాత్మకమైన, ప్రామాణికమైన ఈ వ్యాఖ్యానం చాల మహత్త్వపూర్ణమైంది. ఋగ్వేదానుశీలనకు ఇది ఎంతగానో తోడ్పడుతుంది. గ్రిఫిత్ క్రీ.శ. 1889లో మాధ్యందిన యజుర్వేదసంహితను పద్యాత్మకంగా ఇంగ్లీషులోకి అనువదించాడు. కీథ్ క్రీ.శ. 1914లో తైత్తిరీయ సంహితను ఇంగ్లీషులోకి అనువాదించాడు. గ్రిఫిత్ సామవేదాన్ని, అథర్వవేదాన్ని కూడ ఇంగ్లీషులోకి అనువదించాడు. వ్హిట్నీ, లాన్‌మన్‌లు ఇద్దరు అథర్వ వేదానికి ఆంగ్లానువాదం ప్రచురించారు. థియోడార్ బెన్ఫే క్రీ.శ. 1848లో సామవేదాన్ని జర్మన్ భాషలోకి అనువదించాడు. అవుఫ్ రెష్ట అథర్వవేదాన్ని జర్మన్ భాషలోకి అనువదించాడు. జూలియస్ గ్రిల్ అనే థియోలజీ ప్రొఫెసర్ అథర్వవేదంలోని కొన్ని మంత్రాలకు జర్మన్ అనువాదాన్ని చేశాడు. విమర్శనాత్మకమైన పీఠికలతో ఈ అనువాద గ్రంథాలు వైదిక సాహిత్య ప్రియులకు చాల ఉపయోగకరంగా వున్నవి.

బ్రాహ్మణ గ్రంథాలు కూడ ఇంగ్లీషులోకి అనువదింపబడినవి. కీథ్ ఋగ్వేదం యొక్క రెండు బ్రాహ్మణ గ్రంథాలను అనువదించాడు. క్యాలండ్ తాండ్య మహా బ్రాహ్మణాన్ని, ఎగ్గేలింగ్ శతపథబ్రాహ్మణాన్ని ఆంగ్లభాషలోకి అనువదించారు. కర్మకాండల వివరణతో కూడిన బ్రాహ్మణగ్రంథాలు పాశ్చాత్యుల దృష్టిని ఎక్కువ ఆకర్షించినవి. కొన్ని బ్రాహ్మణగ్రంథాలు జర్మన్ భాషలోకి కూడ అమువదింపబడినవి. బ్రాహ్మణ, గృహ్య సూత్రాల మీద విశేషమైన కృషి చేసిన వాడు ఓల్డెన్ బెర్గ్. బ్రాహ్మణ గ్రంథాలను సమీక్షిస్తు ఓల్డెన్ బెర్గ్ "దీ వెల్ట్ అన్‌షావుంగ్ డెర్ బ్రాహ్మణ టెక్ష్టే" పుస్తకాన్ని రచించాడు. ఎన్నో గృహ్య

సూత్రాలను ఇతడు జర్మన్ భాషలోకి అనువదించాడు. హిల్లేబ్రాంట్ శ్రౌతసూత్రాలను విశేషంగా అధ్యయనం చేసినవాడు. ఇతడు క్రీ.శ. 1879లో "ఫుల్‌మూన్ ఎండ్ న్యూమూన్ సాక్రిఫైసస్ ఇన్ యానిషెంట్ ఇండియా" మరియు క్రీ.శ. 1879లో "రిచ్యుయల్ లిటరేచర్" అని ప్రాచీన వైదిక యజ్ఞయాగాది కర్మలను విశదంగా వివరిస్తూ పుస్తకాలను రచించాడు. ఉపనిషద్గ్రంథాలు కూడ పాశ్చాత్యులను విశేషంగా ఆకర్షించినవి. (దీన్ని గూర్చి ఉపనిషత్తులను ప్రకరణంలో విశేషంగా చెప్పబడింది.) వేదాంగ గ్రంథాలైన నిరుక్త, ప్రాతిశాఖ్యాది గ్రంథాలు కూడ ఇంగ్లీషు, జర్మన్ భాషల్లోకి అనువదింపబడినవి.

వైదిక వ్యాకరణ, ఛందస్సులను గూర్చి కూడ పాశ్చాత్యులు విశేషమైన కృషి చేశారు. మ్యాక్‌డోనెల్ వైదిక వ్యాకరణం (Vedic Grammer) చాల ఉత్తమమైంది. ఇది క్రీ.శ. 1910లో జర్మనీ నుంచి ప్రచురితమైంది. దీని సంక్షిప్తరూపం విద్యార్థుల కొరకు ప్రచురింపబడింది. పాణిని అష్టాధ్యాయిలో వైదిక ప్రయోగాలను కొన్నిటిని "బహుళం ఛందసి" అని చెప్పబడిన వాటిని కూడ ఈ వ్యాకర్త వ్యాఖ్యానించాడు. ఈ వ్యాకరణం ప్రామాణికమైందిగా వున్నది. విట్నీ లౌకికభాషకు వ్యాకరణం వ్రాస్తూ, దానిలో వైదిక భాషా వ్యాకరణాన్ని కూడ తులనాత్మకత కొరకు ఇచ్చాడు. డా॥ వాక్కర్నాగెల్ జర్మన్ భాషలో వైదిక వ్యాకరణాన్ని రచించాడు. భాషాశాస్త్ర సంబంధ వివరణలతో కూడిన ఈ వ్యాకరణం కొత్త పద్ధతిలో వున్నది. ఇది చాలా ముద్రణలను అందుకొన్నది. ఇది సర్వోత్తమమైన వ్యాకరణమని పండితుల అభిప్రాయం.

ప్రొ.వేబర్ తన 'ఇండిషే స్టూడియెన్' అనే పత్రిక ఎనిమిదవ సంచికలో వైదిక ఛందస్సులను గూర్చి చక్కని విశదమైన చర్చ చేశాడు. ప్రొ. అర్నాల్డ్ ఋగ్వేద ఛందస్సులను పరిశీలించి, క్రీ.శ. 1905లో "వైదిక మీటర్" అనే పుస్తకాన్ని వ్రాశాడు.

వైదిక విషయాలమీద పాశ్చాత్యులు చేసిన కృషి చాలా శ్లాఘనీయమైంది. వైదిక గ్రంథాలను సంపాదీకరించి ప్రచురించటం, పాశ్చాత్య భాషల్లోకి విమర్శనాత్మకమైన పీఠికలతో అనువదించటం, వైదిక వ్యాకరణ ఛందస్సుల నధ్యయనం చేయటమే కాక వైదిక గ్రంథాలను సులభగ్రాహ్యం చేయటానికీ ఎన్నో గ్రంథాలను వారు రచించారు. గ్రాస్‌మన్ సంస్కృత జర్మన్ భాషల కోశం ఈ విషయంలో గణనీయమైంది. గ్రాస్‌మన్ ఋగ్వేదకోశంలో ఋగ్వేదం లోని ప్రతి స్థలం పరిచయం చేయబడింది. మరియు శబ్దార్థ నిర్ణయం కూడ చేయబడింది. దీని ఆధారంగా ఋగ్వేదాన్ని సులభంగా అర్థంచేసుకోవచ్చును. మ్యాక్ డోనెల్, కీత్‌లు 'వైదిక్ ఇండెక్స్' అనే గ్రంథంలో వైదిక సంబంధ విజ్ఞాన సర్వస్వాన్ని

తయారుచేశారు. దీనిలో వేదకాలం నాటి ఐతిహాసిక, భౌగోళిక, సామాజిక, ఆర్థిక విషయాలు చాల చక్కగా చెప్పబడినవి. పాశ్చాత్య పండితులు వేదాలల్లోని గాథలను పరిశీలించి వాటిని ఇతర జాతుల్లోని గాథలతో తులనాత్మకంగా (కంపారిటివ్ మైథాలజీ) అధ్యయనం చేశారు. ఈ గాథల్లోని ధార్మిక సిద్ధాంతాలను ఇతర ధార్మిక సిద్ధాంతాలతో పోల్చారు. ఈ విషయంలో మాక్స్‌ముల్లర్, మ్యాక్‌డోనెల్, హిల్లే బ్రాంట్ ప్రముఖులు కృషి చేశారు. వేదగాథలను హిల్లేబ్రాంట్ జర్మన్ భాషలో మూడు భాగాలుగా "వేదిషే మిథోలోగీ' ' పేరుతో ప్రచురించాడు. ఇతడు వైదిక యజ్ఞయాగాదికర్మలను 'వేదిషే రిచ్యుయల్' గ్రంథంలో వివరించాడు. ఓల్డెన్‌బెర్గ్ వేదాలల్లోని ధార్మికతను గూర్చి చక్కని విషయాలతో కూడిన గ్రంథాన్ని రెండు భాగాలుగా రచించాడు. ఋగ్వేదానికి అతడు వ్రాసిన సాహిత్య సంబంధి వివరణలు కూడ రెండు భాగాలుగా ప్రచురించబడినవి. పిశెల్, లుడెర్స్‌లు కూడ వైదిక పరిశోధనలు చేసిన పండితులు. వేదాలల్లోని వరుణ దేవుని గూర్చి లుడెర్స్ వ్రాసిన పరిశోధన గ్రంథం అసంపూర్ణంగా వుండి పోయింది. మ్యాక్‌డోనెల్ 'వేదిక్ మిథోలజీ' అన్న గ్రంథంలో వేదగాథలను ఇంగ్లీషులో రచించాడు. "రిలీజన్ అండ్ ఫిలాసఫీ ఆఫ్ వేద అండ్ ఉపనిషద్స్" అన్న పుస్తకంలో కీథ్ వేద, ఉపనిషత్తుల్లోని ధార్మిక, తాత్త్విక విషయాలను గూర్చి వివరించాడు. ఇది రెండు భాగాలుగా హార్వర్డ్ నుంచి ప్రచురితమైంది.

ప్రాచీన "అనుక్రమణికా" గ్రంథాలవంటి సూచిగ్రంథాలను కూడ పాశ్చాత్యులు తయారు చేశారు. వైదిక గ్రంథాల శుద్ధప్రతులను తయారు చేయటానికి ఈ గ్రంథాలు ఉపయోగపడుతవి. బ్లూమ్ ఫీల్డ్ " వైదిక్ కాన్‌కార్డెన్స్" అన్న పుస్తకంలో వేద ఋక్కుల ప్రతిపాదం మరియు యజుర్వాక్యాల సూచిని ఇచ్చాడు. దీనిలో పాఠభేదాలు కూడ పరిశీలింపబడినవి. బ్లూమ్‌ఫీల్డ్ మరొక గ్రంథం " ఋగ్వేదీయ రెపిటీషన్స్"లో ఋగ్వేదంలోని మంత్రాలు గాని, పాదాలు గాని ఎక్కడెక్కడ పునరావృతం చేయబడినవో వాటిని ఇచ్చాడు. జి.ఏ. యాకోబ్ 66 ఉపనిషత్తుల్లోని, భగవద్గీతలోని వాక్యాల సూచిని తయారు చేశాడు. లూయీ రేనో అన్న ఫ్రెంచ్ పండితుడు వేదాల, వైదిక విషయాల మీద వ్రాయబడిన గ్రంథాల, వ్యాసాల సూచిని 'బిబ్లిఓగ్రాఫీ వైదిక్' పేరుతో క్రీ.శ. 1931లో ప్రచురించాడు. ఈ గ్రంథాలన్నీ వైదిక విజ్ఞాన బోధకు చాల తోడ్పడేటటువంటి గ్రంథాలు.

వైదిక సాహిత్య చరిత్రలు పాశ్చాత్యులు వ్రాసినవి ఎన్నో వున్నవి. వీటిల్లో రోథ్ జర్మన్ భాషలో వ్రాసిన వైదిక సాహిత్యచరిత్ర మొదటిది. దీనికి తర్వాత ఆంగ్లానువాదం వచ్చింది. మాక్స్‌ముల్లర్, మ్యాక్‌డోనెల్, వింటర్‌నిట్స్‌లు ప్రత్యేకంగా వైదిక సాహిత్యాన్ని పరిశీలిస్తూ ఇంగ్లీషు జర్మన్ భాషల్లో సాహిత్య చరిత్రలను వ్రాశారు.

# వేదవాఖ్యానాలల్లో భిన్నార్థాలు

వేదాలు సుదూర భూతకాలంలో వ్రాయబడినవి. రాను రాను ప్రజల భాషలో మత సాంఘిక రాజకీయ పరిస్థితుల్లో చాల మార్పులు వచ్చినవి. చాల తరాలు గడిచినవి. ప్రజల ఆలోచనావిధానంలోను మార్పులు వచ్చినవి. వైదిక భాష చాల మార్పులు చెందుతూ వచ్చింది. దానితో వేదాలు అర్థం కావటం కష్టమైంది. దానికి నిఘంటువులు, భాష్యాలు అవసరమైనవి. అయితే, వేదాలకు వ్రాసిన భాష్యాలు అర్థం చెప్పిన తీరులు చాల భిన్నంగా వున్నవి. ఈ వ్యాఖ్యాన భిన్నత్వమెట్లా ఏర్పడింది? - అంటే - వైదిక భాష, మతం రూపాలు మారుతూ వచ్చినవి. ఆచార్యులల్లో అభిప్రాయభేదాలు కలిగినవి. వేద మంత్రాల్లోని కొన్ని పదాలు పూర్తిగా వాడుక నుంచి తొలగిపోయినవి. వాటికి అర్థం చెప్పటం సాధ్యంకాలేదు. ఆచార్యులు ఎవరికి తోచిన అర్థాలను వారు నిర్ణయించారు. ఉదాॱॱకు "అమ్యక్, జారయాయి, కాణుకా, జర్భరీ తుర్ఫరీ" మొదలైన పదాలు. ఈ పదాలు వాడుకలో లేవు. వాటికి అర్థాన్ని నిర్ణయించి చెప్పటం కష్టం.

వేదకాలం నాటి జాతులు, తెగలు రాను రాను లేకుండా పోయినవి. కొత్త జాతులు, తెగలవారు భారతదేశంలోకి నిరంతరంగా ప్రవేశిస్తూనే వచ్చారు. వారి సంప్రదాయాలు, ధార్మికాలోచనలు ఇక్కడి వారిమీద ప్రభావాన్ని చూపినవి. ఆ జాతులు, తెగలు ఒకదానిలో ఒకటి అంతర్లీనమై కొత్త జాతులు, తెగలు కొత్త సంప్రదాయాలు ఆచారాలు వ్యవహారాలు ఏర్పడినవి. దానితో వేదాలల్లో పేర్కొనబడిన జాతులు, తెగలు వారి ఆచార వ్యవహారాలు వారి పరస్పర సంబంధాలు స్మరణకు లేకుండా పోయినవి. తరువాతి ఆచార్యులు శాస్త్ర పురాణ ఇతిహాసాల ఆధారంగా వేద మంత్రాల అర్థాలను నిర్ణయించడానికి పూనుకొన్నా ఎక్కడో తప్పటడుగు వేయక తప్పలేదు. తర్వాత ఆచార్యుల అర్థ నిర్ణయంలో మతభేదం రాక తప్పలేదు..

వేదకాలం నాటి వివిధ జాతులు, తెగలు తమ తమ మత ధార్మిక సంప్రదాయాలు కలిగివుండేవి. వారికి పూజ్యమైన దేవతలు భిన్నంగా వుండేవారు. జాతుల, తెగల పరస్పర మేళనంతో మత ధార్మిక సంప్రదాయాలు మారినవి. వారికి పూజ్యమైన దేవతలు ఒకరితో ఒకరు కలిసి అభేదం కలగటం లేదా పరస్పర మేళనంచేత కొత్త దేవతల కల్పన జరిగి పాత దేవతల రూపు రేఖలను మరచిపోవటం జరిగింది. సుదూర భూతకాలంలోని జాతుల

తెగలకు పూజ్యమైన దేవతల స్వరూపాలను, పూజా విధులను నిర్ణయించటం కష్టం. ఎంతగా మతధార్మిక పరిస్థితులు సూత్రచ్ఛేదం కాకుండా యుగయుగాలుగా సంక్రమిస్తూ వచ్చినా జాతుల సమ్మేళనంలో, సంస్కృతుల ఆదాన ప్రదానంలో విచార పద్ధతిలో మత ధార్మిక పరిస్థితుల్లో మార్పులు రాకతప్పదు. అటువంటప్పుడు ప్రాచీన కాలంలోని సూక్ష్మమైన విషయాలు కొన్ని జనుల జ్ఞాపకానికి, అవగాహనకు దూరం కాక తప్పదు. అట్లా జరగటం చేతనే వేద మంత్రాల వ్యాఖ్యానంలో మత భేదాలు ఏర్పడినవి. వేదాలల్లో ప్రస్తుతింపబడిన కొందరు దేవతల పేర్లు వేరైనా స్వరూప స్వభావాలు ఒక్కతీరుగా వుండి ఆ దేవతలు ఒక్కరా వేరా విప్పి చెప్పటానికి కష్టంగా వున్నది. వేదాలల్లో ప్రస్తుతింపబడిన దేవతలు ఒకొకసారి వారి పేర్లు ప్రచారంలో లేకుండా విస్మృతాలైనారు. ఉదా॥కు బ్రహ్మణస్పతి, పూషన్, మిత్రా దేవతల నిర్ణయం చేయటం కష్టం. వేదాలల్లో స్తుతింపబడిన బృహస్పతి తర్వాత పురాణాలల్లో చెప్పబడిన ఇంద్రుని గురువు బృహస్పతి ఒక్కరా వేరా చెప్పటం కష్టం. వరుణుడు జలాధిపతియా? నైతిక మార్గ నిర్దేశకుడా? - వేదాలల్లోని స్తుతులనుబట్టి తేల్చి నిర్ణయించటం కష్టం. సవితృ స్వరూప వర్ణననుబట్టి అతడు ఎటువంటి దేవతయో, అతని పనులేమిటో చెప్పటం కష్టం. దీనితో వ్యాఖ్యాతల వ్యాఖ్యానంలో భేదం రావటానికి అవకాశమున్నది. కొన్ని దేవతల ప్రస్తుతలనుబట్టి ఆ దేవతల స్వరూపస్వభావాలను నిర్ణయించటం కష్టంగా వున్నది. కొన్ని దేవతా ప్రస్తుతులు అస్పష్టంగా వుండటం చేత అది ఏ దేవతయో చెప్పటం కష్టమైంది. తర్వాత ఒకే సాహసకార్యాన్ని వేరు వేరు దేవతలు ఆచరించినట్లుగా చెప్పటం చేత అవగాహనలో స్పష్టత లేకుండా పోయింది. దేవతా నిర్ణయాన్ని నిరుక్తాది గ్రంథాలు వివరించటానికి పూనుకొన్నా ఆ వివరణలు చాలినంతగా లేవు. నిరుక్తకాలం నాటికే వైదిక మంత్రాలు, దేవతలు అస్పష్టమైనవి. మత భేదానికి గురియైనవి, నిర్తుకారుడు యాస్కుడు మత భేదాలను చర్చిస్తూ 17 మంది పూర్వాచార్యుల అభిప్రాయాలను గూర్చి ప్రసంగించాడు. ఆ ఆచార్యుల గ్రంథాలేవి మనకు ఇప్పుడు దొరకటం లేదు. కాని వారు వేద పదాలకు, సమాసాలకు, దేవతలకు అర్థ నిర్ణయం, స్వరూప వివరణ చేసేటప్పుడు వేరు వేరు విధంగా వ్యాఖ్యానాలు చేసారు. వాటిల్లో యాస్కుని వివరణలే ఎక్కువ మందికి అంగీకార్యం కావటం చేత అతని గ్రంథమే బహుళ జనాదరణ పొంది నిలిచింది. కాని ఆధునికులకు ఒకొకసారి నిరుక్తకారుని వివరణ కూడ సమ్మతంగా కనిపించదు. ఈ విధంగా అనేక కారణాలచేత మంత్రాల అర్థ వివరణలో భేదం ఏర్పడుతూ వచ్చింది.

వేదాలల్లోని కొన్ని పదాలు, సమాసాలు రకరకాలుగా అర్థం చెప్పటానికి వీలుగా వున్నవి. మరికొన్ని పదాలు, సమాసాలు అవగాహనకు పూర్తిగా దూరమైనవి. ఇప్పుడు 'శిశ్నదేవ' అనే సమాసానికి వేరువేరుగా అర్థాలను చెప్పుకోవచ్చును. శిశ్న అంటే లింగమని, శిశ్న దేవ అంటే లింగపూజకులని ఆధునికులు అర్థం చెప్తున్నారు. దీన్నిబట్టి వేదకాలం నాడే పురుషాంగమైన లింగాన్ని దేవతగా భావించి పూజించేవారు వుండేవారని చెప్తున్నారు. కాని ప్రాచీన సంప్రదాయకులు 'శిశ్నదేవ' అంటే 'శిశ్న' (లింగం)ను దేవతగా భావించేవారు అంటే కామక్రీడల్లో ఆసక్తులైనవారు, 'అబ్రహ్మచారులు' అని అర్థం చెప్పారు. ఇట్లా ఈరెండు అర్థాలల్లో చాలా భేదం కన్పిస్తున్నది. ఇదే విధంగా ఎన్నో పదాల సమాసాల అర్థవివరణలో మతభేదం వున్నది. దానితో మంత్రాల అర్థాల్లోను చాల భేదం కన్పిస్తున్నది.

భారతీయ సంప్రదాయానుసారం వేదాలు భారత దేశంలోనే పుట్టినవి; వాటిల్లో దేవతారాధన, యజ్ఞయాగాది కర్మకాండలు, ఆధ్యాత్మికాది విద్యలు సమస్తం చెప్పబడినవి. కాబట్టి వేద మంత్రాలను తదనుగుణంగానే వివరిస్తూ పోయారు. అతి ప్రాచీనకాలంలోని జాతుల సంచారం, వారి చరిత్రలు విస్మృతమైనవి. దీనితో వేదాలు భారతీయులకు కేవలం అతి పవిత్రమైన మత గ్రంథాలుగా, విజ్ఞానభాండాగారాలుగా నిలిచిపోయినవి. వాటి యొక్క స్వచ్ఛతను కాపాడేందుకు రకరకాల పద్ధతులు ఏర్పడినవి. విజాతీయులు వాటి రూపాన్ని, ఉచ్చారణను ఎక్కడ చెరిపేస్తారో అనే భయంతో వారికి వేద పఠనం నిషిద్ధమనే నిర్బంధాన్ని ఏర్పరిచారు. ఈ నిర్బంధం ఎందుకు పుట్టిందో అందరూ మరచిపోయారు. దానితో విపరీత వ్యాఖ్యానాలు పుట్టినవి. కుల వ్యవస్థ గట్టిపడటంతో వేదాల పఠనం కొన్ని అగ్రజాతులకే పరిమితమైంది. క్రమ క్రమంగా వేదాధ్యయనం చేసేవారు సన్నగిల్లారు. ఇంకా వేద మంత్రాలకు అర్థం చెప్పగలిగేవారు లేకుండా పోయారు. ఏదో కొందరు ఆచార్యులు వేదాలకు అర్థాలను వివరించగలిగేవారు. ఆ ఆచార్యులు సమకాలిక పరిస్థితులకు అనుగుణంగా మంత్రాలకు అర్థాలను వివరిస్తూపోయారు. కాని మంత్రాల మూల అర్థాలను చెప్పలేకపోయారు.

వేద రచనల తర్వాత భారతదేశంలో ఎన్నో మత దార్శనిక సంప్రదాయాలు కొత్తవి లేచినవి, బౌద్ధ జైనాది మతసంప్రదాయాలు వేద ప్రామాణ్యాన్ని అంగీకరించలేదు. కాని అద్వైత విశిష్టాద్వైత ద్వైతాది సంప్రదాయానుయాయులు తమ సిద్ధాంతాలను వేదబద్ధం చేయటానికి ప్రయత్నించారు. అప్పుడు తమ మతదార్శనిక సిద్ధాంతాలకు అనుగుణంగా

వేదమంత్రాలకు ఉపనిషత్తులకు వ్యాఖ్యానాలను రచించారు. మధ్వాచార్యులు ఋగ్వేదానికి వ్రాసిన భాష్యం ఇటువంటిదే. శంకరరామానుజాది ఆచార్యులు ఉపనిషదాదులకు వ్రాసిన వ్యాఖ్యానాలు కూడ ఇటువంటివే. సంస్కృత పదాలు నానార్థబోధక సమర్థాలైనవి. మరియు సమాసాలకు వేరువేరు అర్థాలను చెప్పవచ్చును. ఒకొకసారి పదానికి సమాసానికి లేనిపోని అర్థాలను కూడ ఆచార్యులు తమ పాండిత్య ప్రతిభ చేత సాధించిన సందర్భాలు వున్నవి. ఈవిధంగా ఒకే మంత్రానికి వేరు వేరు అర్థాలు చెప్పే అవకాశం కలిగింది.

వేద మంత్రాలు కొన్ని నిగూఢమైన అర్థాలతో వ్రాయబడినవి. ప్రాచీన కాలంలో ఋషులు ఏ దృష్టితో ఆ మంత్రాలను వ్రాశారో ఇప్పుడు విప్పి చెప్పలేము. ఇప్పుడు మాత్రం ఆ మంత్రాలు నానా అర్థాలను బోధించటానికి సమర్థవంతంగా వున్నవి. కాబట్టి ఎవరికి ఇష్టం వచ్చిన అర్థాన్ని వారు ఆ మంత్రాలకు వ్యాఖ్యానించి చెప్పారు. ప్రహేళికల వలె వుండే ఆ మంత్రాల అర్థం ఇదే అని కచ్చితంగా చెప్పటానికి వీల్లేదు.

ఉదా॥కు

చత్వారి శృంగాత్రయో అస్యపాదాద్వే శీర్షేసప్తహస్తాసో అస్య
త్రిధా బద్ధో వృషభోరోరవీతి మహాదేవో మర్త్య అవివేశ

ఋగ్వే. 4-58-3

ఈ మంత్రానికి శబ్దార్థం చెప్పాలంటే ఈవిధంగా వుంటుంది - " దీనికి నాలుగు కొమ్ములు, మూడు పాదాలు, రెండు శిరస్సులు, ఏడు చేతులు, మూడు విధాలుగా బంధింపబడిన ఈ వృషభం పెద్దగా అరుస్తున్నది. మహాదేవుడు మర్త్యలోకంలో ప్రవేశించాడు." దీనిలో చెప్పబడిన మహాదేవ వృషభం ఎవరన్నది పెద్ద చిక్కు ప్రశ్న. కొందరి అభిప్రాయంలో మహాదేవుడు యజ్ఞం - " దానికి నాలుగు కొమ్ములు నాలుగు వేదాలు, మూడు కాళ్ళు మూడు సవన సమయాలు, రెండు శిరస్సులు ప్రాయణీయ, ఉద్గయనీయమనే హవనాలు, ఏడు చేతులు ఏడు ఛందస్సులు. ఈ యజ్ఞం మంత్ర, బ్రాహ్మణ కల్పం - వీటి ద్వారా త్రిధా బంధింపబడింది. యజ్ఞరూపి అయిన మహాదేవుడు యజనార్థం మనుష్యుల్లో ప్రవేశించాడు-" ఈ అర్థాన్ని నిరుక్తకారుడు యాస్కుడు చెప్పాడు. మరి కొందరు మహాదేవున్ని సూర్యునిగా చేసి అర్థాన్ని వివరించారు - నాలుగు కొమ్ములు నాలుగు దిశలు, మూడు పాదాలు మూడు వేదాలు, రెండు శిరస్సులు రాత్రి-దినం, ఏడు చేతులు ఏడు

కిరణాలు, సూర్యుడు పృథ్వి, అంతరిక్షం, ఆకాశం ఈ మూడింటిచేత త్రిధాసంబద్ధుడు, మరియు గ్రీష్మ, వర్ష, శిశిర ఋతువులను కలిగిస్తాడు. అందుకే అతడు త్రిధాబద్ధుడని చెప్పబడింది. ఇక పతంజలి మహాభాష్య ప్రకారం - మహ దేవుడు శబ్దం. నాలుగు కొమ్ములు నాలుగు విధాల శబ్దాలు, అంటే నామ, ఆఖ్యాత, ఉపసర్గ, నిపాతాలు, మూడు పాదాలు మూడు కాలాలు-భూత, వర్తమాన, భవిష్యత్తులు. రెండు శిరస్సులు రెండు విధాల భాషలు - నిత్య, కార్య. ఏడు చేతులు ప్రథమాది ఏడు విభక్తులు. హృదయం, గళం, ముఖం - ఈ మూడు స్థానాల నుంచి శబ్దం పుడ్తుంది కాబట్టి శబ్దం త్రిధాబద్ధం అర్థవృష్టిని కలిగించేది కాబట్టి శబ్దం వృషభ మనబడింది. తర్వాత రాజశేఖరుడు తన కావ్యమీమాంసలో ఈ మంత్రానికి కావ్య పురుషపరంగా అర్థాన్ని చెప్పాడు. సాయణాదుల భాష్యంలో దీని అర్థం మరో విధంగా వున్నది. ఈ విధంగా నిగూఢార్థయుక్తంగా వ్రాయబడిన మంత్రాలు ఎన్నో విధాలుగా వ్యాఖ్యానింపబడటానికి అవకాశాన్నిస్తున్నవి.

వేదాలల్లో దేవతాది స్తుతిసమయంలో చెప్పిన కొన్ని వృత్తాంతాలు, గాథలు ఇప్పుడు దురవగాహనకు గురియైనవి. అప్పటి పరిస్థితులు మనకు తెలియవు కాబట్టి ఆ విషయాలను స్పష్టంగా ఏకమతంగా చెప్పటం కష్టం. ఆ వృత్తాంతాలు, గాథలు వేరువేరుగా వ్యాఖ్యానం చేయటానికి వీలుగా వున్నవి. ఉదా॥కు ఇంద్రుడు వృత్రుని చంపినట్లుగా చాలచోట్ల ప్రశంసింపబడినాడు. ఈ వృత్రుడు అంధకార రూపుడని, అహిరూపుడని, అసురడని రకరకాలుగా చెప్పబడింది. ఇంద్రుడు మరుద్గణాల సహాయంతో వృత్రుని సంహారం చేశాడని చెప్పబడింది. వృత్రుడు గోవులను దాచిపెట్టాడని, జలాలను అడ్డగించాడని, నదులను అడ్డగించాడని చెప్పబడింది. అప్పుడు వజ్రధారి, తేజస్వి, ఉత్తమ బాహువులు గల ఇంద్రుడు వృత్రుని ఛేదించాడని స్తుతింపబడింది. అయితే ఈ వృత్తాంతం రకరకాలుగా వివరింపబడింది. వృత్రుడు అసురడని, అతడు ఆర్యుల గోవులను పర్వతగుహలో బంధించాడని, ఇంద్రుడు మరుద్గణాల సహాయంతో వాటి జాడ కనుక్కొని, వృత్రుని చంపి గోవులను విడిపించాడని ఒక వివరణ. ఆకాశంలో వ్యాపించిన మేఘమే వృత్రుడని, మేఘం వర్షించకుండ జలాలను బంధించగా ఇంద్రుడు మరుత్తుల సహాయంతో మేఘాన్ని ఛేదించి వృష్టిని కల్పించి ప్రాణులకు ఆనందాన్ని కలిగించాడని మరొక వ్యాఖ్యాన సారాంశం. ప్రతి వర్షర్తువులో జరిగే ప్రకృతి విచిత్రాన్నే ఋషులు రూపకారోపణ చేసి

వర్ణించారని వారి అభిప్రాయం. ఇక పురాణాల్లో ఇంద్రుడు దేవతల రాజు. అసురుడైన వృత్రుని యుద్ధంలో అతడు చంపాడని వ్యాఖ్యానింపబడింది. ఇంద్రవృత్రాసురుల యుద్ధం భాగవతాది పురాణాల్లో విశదంగా వర్ణింపబడింది. ఈవిధంగా ఇప్పుడు వృత్రుడు అసురజాతికి చెందిన వ్యక్తియా, లేక మేఘమా, లేక జలాలను అడ్డగించిన పర్వతమా- ఏది నిర్ణయించి ఇదమిత్థమని చెప్పటం సాధ్యం కాదు.

వైదిక భాష వాడుకలో లేకపోవటం చేత ప్రాచీనమైన భాషాపదాలకు స్పష్టమైన అర్థాన్ని నిర్ణయించటంలో భేదం రావచ్చును. వైదిక పదాలకు వివిధార్థాలు వున్నవి. అంతేగాక, ఆ పదాలను సమాసాలను రకరకాలుగా వ్యాఖ్యానించటానికి కూడ అవకాశమున్నది. దానిచేత కొందరు వేదాలు యజ్ఞయాగాది కర్మకాండలను చెప్పే మత ధార్మిక గ్రంథాలని వ్యాఖ్యానించారు. మరి కొందరు ఆధ్మాత్మిక ప్రధానమైన అర్థాలను వివరించారు. భారతీయ సంప్రదాయం ప్రకారం వేదాలు సమస్తజ్ఞానానికి మూలకందాలు. సమస్త విజ్ఞానం వేదాలల్లో వున్నదని విశ్వసించి దయానందసరస్వతి ఆధునిక శాస్త్రీయావిష్కరణలైన రైలు, టెలిఫోను విజ్ఞానం కూడ వేదాలల్లో వున్నదని వ్యాఖ్యానం చేశాడు. పాశ్చాత్యుల అభిప్రాయంలో వేదాలు కేవలం మతగ్రంథాలు. ఆర్యులు ప్రకృతి శక్తులను ఆరాధిస్తూ చెప్పిన ప్రస్తుతులే వేదమంత్రాలని, ఆర్యుల పూజావిధానమైన కర్మకాండ కూడా వాటిల్లో చెప్పబడిందని వారు అంటారు. తులనాత్మక భాష, మత, ధార్మిక చరిత్రల ఆధారంగా, ప్రపంచ చరిత్ర ఆధారంగా వారు వేదాలకు వ్యాఖ్యానాలను చేశారు కాని వారు కేవలం సాయణాదుల భాష్యాలను ఉన్నదున్నట్లు గ్రహించలేదు. ఇక అరవిందుడు వేదాలల్లో తత్త్వ చింతన, ఆధ్యాత్మిక విజ్ఞానమున్నట్లుగా వ్యాఖ్యానం చేశాడు. యోగ, తపస్సుల శక్తిచేత ఋషులు తమ పవిత్ర హృదయాలల్లో ప్రతిఫలించిన ఆధ్యాత్మిక జ్ఞానాన్ని ప్రకటించారని అరవిందుని అభిప్రాయం. ఆనందకుమారస్వామి ఆధునిక విమర్శకుడు. " ఏ న్యూ అప్రోచ్ టు ది వేదాస్" అన్న పుస్తకంలో అతడు వేదాలల్లో 'మిస్టిక్' (మార్మిక) అర్థాలు చెప్పబడినవని, మధ్యయుగాలల్లో దాంతే, బ్లేక్ మొదలైన ఆధ్యాత్మిక కవుల వాణి వంటిదే వేదవాణి అని అభిప్రాయపడినాడు.

వేదాలు అతి పవిత్రమైన గ్రంథాలని. వాటిల్లో అతి దురూహ్యమైన విషయాలు ఉన్నవనే విశ్వాసం ప్రజల్లో వ్యాపించింది. అందులో వేదాలు అందరూ చదువదగినవి కావని,

శూద్రులు, స్త్రీలు వాటిని తాకనేరాదు, వినవేరాదు అని ఒక విశ్వాసం ప్రబలింది. అటువంటప్పుడు వేదాలు మనము చదివే గ్రంథాలు, మనకు అర్థమయ్యే గ్రంథాలు కావనే నమ్మకం చాలా మందిలో కలిగింది. పాశ్చాత్యుల కృషితో ఈవిశ్వాసం చదువుకొన్నవారిలో పోయినా, ఇంకా చాలా మందిలో అదే భావం ప్రబలివున్నది. ఇతర మతాలకు చెందిన మత గ్రంథాల వంటివే వేదగ్రంథాలు, వాటిల్లో మన ప్రాచీనుల మత తాత్త్విక ఆలోచనలు, దేవతాస్తుతులు నిబద్ధమైనవి; వ్యాఖ్యానం సహాయంతో, కొద్దిపాటి కృషితో అందరూ వాటిని అర్థంచేసుకోవచ్చును అనే భావాన్ని అందరిలో కలిగించాలి. అప్పుడే ఆ ప్రాచీన గ్రంథాలు ఈ సాంకేతిక యుగంలో నష్టం కాకుండా నిలువగలుగుతవి.

## బ్రాహ్మణాలు

'బ్రహ్మ' పదానికి అనేక అర్థాలు వున్నవి. వాటిల్లో 'మంత్ర' మనేది ఒక అర్థం. 'బ్రహ్మవై మంత్రః' అని శతపథ బ్రాహ్మణంలో చెప్పబడింది. వైదిక మంత్రాలను వివరించేవి కాబట్టి ఈ గ్రంథాలకు బ్రాహ్మణ గ్రంథాలని పేరు కలిగిందని అంటారు. 'బ్రహ్మ' పదానికి యజ్ఞమని మరొక అర్థం. యజ్ఞ విధులు ఈ గ్రంథాలల్లో వివరింపబడటంచేత వీటిని బ్రాహ్మణ గ్రంథాలంటారని అంటారు. వేద మంత్ర ద్రష్టలను ఋషులు అని అంటారు. బ్రాహ్మణద్రష్టలనేమో ఆచార్యులు అని అంటారు. బ్రాహ్మణ గ్రథాలల్లో మంత్రాల, యజ్ఞకర్మల వ్యాఖ్యానం చేయబడింది. యజ్ఞకర్మల యొక్క వైజ్ఞానిక, ఆధిభౌతిక, ఆధ్యాత్మిక మీమాంస ఈ గ్రంథాలల్లో చక్కగా చేయబడింది. అంటే యజ్ఞయాగాదుల సాంగోపాంగ వర్ణనలు దీనిలో వున్నవి. యజ్ఞాలను ఎప్పుడు ఎట్లా చెయ్యాలన్న వివరణలు వీటిల్లో ఇయ్యబడినవి. ప్రాచీనకాలంలో యజ్ఞవిధులు ఒక విధమైన ఆరాధన పద్ధతులే. అవి ఆనాటి ప్రజల ధార్మిక ఆధ్యాత్మిక జ్ఞానాన్ని తెలిపేవి. ప్రాచీనుల నిష్ఠనియమాలను యజ్ఞకర్మలు ప్రతిబింబింపజేస్తున్నవి. ఆధునిక కాలంలో ఆ యజ్ఞకర్మలు నిస్సారంగా, నిరర్థకంగా తోచవచ్చును. కాని ప్రాచీన సమాజంలోని ప్రజల ఆచారనియమాలకు, సత్యవ్రతాదులకు ప్రతీకలుగా అవి వుండేవి. బ్రాహ్మణాలల్లో ప్రతిపాద్య విషయాలను గూర్చి శాబరభాష్యంలో ఇట్లా చెప్పబడింది -

హేతుఃనిర్వచనం నిందా ప్రశంసా సంశయో విధిః
పరక్రియా పురాకల్పో వ్యవధారణ కల్పనా
ఉపమానం దశైతే తు విధయో బ్రాహ్మణస్యతు.

దశవిధ విషయాలను బ్రాహ్మణాలు ప్రతిపాదించినా, వాటిల్లో 'విధి' యే ప్రధానమైంది. మిగతావి దానికి అంగభూతాలుగానే వివరింపబడినవి. యజ్ఞయాగాది కర్మలు ఈ గ్రంథాలల్లో చాలా విస్తరంగా వివరింపబడినవి. ఇంత విస్తరంగా వున్న యజ్ఞ విజ్ఞానాన్ని ఒకొకసారి సరిగ్గా అర్థం చేసుకోవటం కూడ కష్టమే అవుతుంది. విస్తరించిన యజ్ఞవిధులను వాటి అనుష్ఠానాన్ని సులభం చేయటానికే తర్వాత శ్రౌత సూత్రగ్రంథాలు పుట్టినవి.

ప్రస్తుతం లభ్యమయ్యే బ్రాహ్మణగ్రంథాలకన్న ఎన్నో రెట్లు ఎక్కువ బ్రాహ్మణ గ్రంథాలు వుండేవి. అవన్నీ కాలగర్భంలో కలిసిపోయినవి. యజ్ఞ కర్మల విధానంలో గల విభేదాలనుబట్టి, మత భేదాలనుబట్టి వేరు వేరు బ్రాహ్మణ గ్రంథాలు వచ్చినవి. ఏ యజ్ఞంలో ఏ మంత్రాలను ఉపయోగించాలి, మంత్రాలకు యజ్ఞాలకు గల సంబంధాలు ఈ గ్రంథాలల్లో వివరంగా సూక్ష్మంగా చెప్పబడినవి. ఈ వివరణలో సందర్భానుకూలంగా కథలుకూడ చెప్పబడినవి. పురూరవ ఊర్వశుల కథ (శత. బ్రా 11-5-1). జలౌఘ వృత్తాంతం (శత. బ్రా.1-8-1), హరిశ్చంద్రోపాఖ్యానం (శత. బ్రా.7-2) ఇట్లా చెప్పబడినవే. ఋగ్వేదంలోని పురూరవ ఊర్వశుల కథయే శతపథ బ్రాహ్మణంలో విశదంగా చెప్పబడింది. జలప్రళయ వృత్తాంతం శతపథబ్రాహ్మణ గ్రంథంలో చెప్పబడింది. ఇటువంటి జలప్రళయ గాథ ఇతర ప్రాచీన జాతుల్లోను వ్యాప్తిలో వున్నది. ఐతరేయ బ్రాహ్మణంలో చెప్పబడిన హరిశ్చంద్ర, శునశ్శేపుల కథ ఋగ్వేదంలో 1:24-30 సూక్తంలో వున్నది. ఈ కథ ఆ తర్వాత పురాణాలల్లో విస్తరింపబడి కన్పిస్తున్నది. ఆఖ్యానశిల్పం బ్రాహ్మణ గ్రంథాలల్లో వికసిత రూపంలో కన్పిస్తున్నది. ఈ గ్రంథాలు గద్యాత్మకంగా వున్నవి.

బ్రాహ్మణ గ్రంథాలు వేదాలల్లో భాగంగానే పరిగణింపబడినవి. కాబట్టి ఇవి వేదఋక్కుల తర్వాత చాలాకాలానికి వ్రాయబడినవి కాక వేదకాలానికి చెందినవిగానే పరిగణించవలసి వుంటుంది. "మంత్ర బ్రాహ్మణో యజ్ఞస్య ప్రమాణమ్", అని, "మంత్రబ్రాహ్మణాత్మకో వేదః" అని ఆపస్తంబుడు సంహిత, బ్రాహ్మణాలను కలిపి వేదంగా గ్రహించాడు.

విషయ దృష్టితో పరిశీలించినట్లయితే బ్రాహ్మణగ్రంథాలను నాలుగు భాగాలుగా చేయవచ్చును - విధి విభాగం, అర్థవాద విభాగం, ఉపనిషత్ విభాగం, ఆఖ్యాన విభాగం. విధి విభాగంలో కర్మకాండ సంబంధమైన వివరణ వున్నది. దీనిలో వేదమంత్రాల అర్థ మీమాంస, వైదిక పదాల నిష్పత్తిని గూర్చిన చర్చలు వున్నవి. ఏ మంత్రాలను ఎక్కడ ఏ ఉద్దేశ్యంలో ఉపయోగించవలెనో వివరింపబడింది. అర్థ విభాగంలో యజ్ఞవిధులను గూర్చిన చర్చలు వున్నవి. యజ్ఞాలను చేయటంవల్ల కలిగే ఫలితాలు మొదలైనవి చెప్పబడినవి.

ఉపనిషత్ విభాగంలో బ్రహ్మతత్త్వాన్ని గూర్చిన విషయ చర్చలు వున్నవి. ఆఖ్యాన విభాగంలో ఋషివంశాలు, రాజవంశాలు, తత్సంబంధమైన ఆఖ్యానాలు చెప్పబడినవి.

## బ్రాహ్మణ గ్రంథాల ప్రయోజనం

యజ్ఞం సమస్త కార్యాలల్లోకెల్లా శ్రేష్ఠమైందిగా బ్రాహ్మణ గ్రంథాలు చెప్తున్నవి- "యజ్ఞోవై శ్రేష్ఠతమమ్ కర్మ", "సర్వస్మాత్ పాప్మనో నిర్ముచ్యతే య ఏవం విద్వానగ్నిహోత్రం జుహోతి" - యజ్ఞకర్మవల్ల సమస్త పాపాలు పోతవి. యజ్ఞాల వల్ల వైయక్తిక ఉద్ధరణయేకాక ప్రజోద్ధరణకూడ జరుగుతుంది. "యజ్ఞాలల్లో దేవతలకియ్యబడిన హవిస్సులు వాయువులో లీనమై అంతరిక్షంలో వ్యాపించి సూర్యునివరకు చేరుకొని మేఘాలల్లో కలిసిపోయి వర్షించి భూమిని అభిషిక్తంచేసి పంట బాగా పండేటట్లుగా, ప్రజలు సుఖంగా వుండేటట్లుగా చేస్తవి" - అని బ్రాహ్మణ గ్రంథాల విశ్వాసం. ఈ విశ్వాసం చాల శాస్త్రీయమైంది. వైజ్ఞానిక యుగంలో వాయు కాలుష్యంతో బాధపడ్తున్న మనం దీన్ని గుర్తించవలసి వుంది. సూక్ష్మరూపంలో యజ్ఞక్రియలను విశదీకరించిన బ్రాహ్మణగ్రంథాలు వైదికసాహిత్యంలో ఉత్తమమైనవి. ఈ గ్రంథాలల్లో సత్యమహిమ వేనోళ్ళ చాటబడింది.

ప్రాచీన కాలంలో భారతీయుల ధార్మిక పరిస్థితిని తెలుసుకోటానికి బ్రాహ్మణ గ్రంథాలు చాల ఉపయోగపడ్తున్నవి. యజ్ఞ కర్మల భేదాలను నిర్వహణ విధానాలను తెలుసుకోటానికి ఈ గ్రంథాలు చాలా తోడ్పడుతున్నవి. బ్రాహ్మణ గ్రంథాలను ఆధారంగా తీసుకొనే ఆచార్యులు వేదాలకు భాష్యాలు వ్రాశారు. ఈ గ్రంథాలల్లో వైదిక కాలంనాటి మత సాంఘిక పరిస్థితులు చక్కగా ప్రతిబింబించినవి. బ్రాహ్మణాల అనుశీలనం లేకుండా వైదిక ప్రజల సంస్కృతిని అర్థం చేసుకోలేము. వైదిక ప్రజలు ఎంత శ్రద్ధ నిష్ఠానియమాలతో దీక్ష గ్రహించి యజ్ఞయాగాదులను నిర్వహించేవారో బ్రాహ్మణ గ్రంథాలవల్ల తెలుస్తున్నది. ఋతువులకు అనుకూలమైన యజ్ఞ నియమవ్రతాలను వారు గ్రహించేవారు. బ్రాహ్మణ కాలంలో యజ్ఞయాగాదుల అనుష్ఠానాన్ని గూర్చి పండితులల్లో చర్చలు జరుగుతుండేవి. అటువంటి శాస్త్ర చర్చల నుంచి మీమాంసాదార్శనికతత్త్వం పుట్టిందని పండితుల అభిప్రాయం.

బ్రాహ్మణ గ్రంథాలు చాలామట్టుకు కురుపాంచాల దేశంలో సరస్వతీ నదీ ప్రాంతంలోనే వ్రాయబడినవి. తాండ్య బ్రాహ్మణంలో సారస్వత ప్రదేశం విశేషంగా చెప్పబడింది. మనుస్మృతి అనుసారం దృషద్వతి, సరస్వతీ నదుల మధ్య ప్రదేశమే బ్రహ్మావర్తం. ఈ బ్రహ్మావర్తమే యజ్ఞ కర్మలకు నిలయంగా వుండేది. ఇక్కడనే

యజ్ఞకర్మలు నానావిధాలుగా వికసించినవి. బ్రాహ్మణ రచనా కాలాన్ని వాటిల్లో చెప్పబడిన నక్షత్రస్థానాలనుబట్టి జ్యోతిషశాస్త్రం ఆధారంగా నిర్ణయించటానికి ప్రాచ్యపాశ్చాత్యాచార్యులు పూనుకొన్నారు. కృత్తికలు ఉదయించింతర్వాత చాలాసేపు తూర్పు దిశలో కన్పిస్తవని చెప్పబడినదాన్ని ఆధారంగా వింటర్‌నిట్జ్ బ్రాహ్మణ రచనా కాలాన్ని క్రీ.పూ. 1100 అని నిర్ణయించాడు. బ్రాహ్మణ గ్రంథాలు ఇంతకన్న ప్రాచీనమైనవని కొందరి అభిప్రాయం. శంకర బాలకృష్ణదీక్షితుని అనుసారం వీటి కాలం క్రీ.పూ. 3000 నుంచి 2000 వరకు. బ్రాహ్మణ గ్రంథాలు మొత్తంమీద వేదమంత్రాల ఆవిర్భావ కాలంలోనే మరియు కించిద్ పశ్చాత్కాలంలోనే రచింపబడినవని చెప్పటం సమంజసం. కృష్ణయజుర్వేదానికి చెందిన మైత్రాయణి, కాఠక సంహితల్లో బ్రాహ్మణ భాగాలు పరిశిష్టరూపంగా వున్నవి. కాబట్టి కొన్ని బ్రాహ్మణ గ్రంథాలు వేదసంహితలంత ప్రాచీనమైనవని చెప్పవచ్చును.

బ్రాహ్మణ గ్రంథాలు గద్యంలో వ్రాయబడినవి. ఈ గద్యం సరళసులభంగా వున్నది. దీర్ఘమైన సమాసాలు లేక భాష సరసంగా నడిచింది. ఆఖ్యానాలు సుందరమైన శైలిలో వ్రాయబడినవి. బ్రాహ్మణ గ్రంథాల భాష సంహితల్లోని భాషకు, లౌకిక భాషకు మధ్యరకంగా వున్నది. ఆ భాషలో కూడ పరిచయం లేని పదాలు కన్పిస్తవి. ఈ పదాలు తర్వాత ప్రచారంలో లేకపోవటం చేత దురూహ్యంగా వుండటం సహజం.

భక్తి ఉద్యమం వ్యాప్తితో వైదిక కర్మకాండలు వెనుకకు పట్టినవి. అప్పటికే వైదిక కర్మకాండలు నిరర్థకమై, ప్రజలకు దురవగాహ్యమైనవి. భక్తి మత వ్యాప్తితో ఇంకా పూర్తిగా అవి విస్మరింపబడినవి. దానితో బ్రాహ్మణ గ్రంథాల ప్రయోజనం నశించింది. కేవలం కొందరు పండితులు మాత్రమే అధ్యయనం చేసేవారు. సాయణాది వేద భాష్యకారులకు మంత్ర వివరణలకు బ్రాహ్మణ గ్రంథాలు ప్రధానమైన ఆధారాలైనవి. కాని తర్వాత రానురాను అవి ప్రచారంలో లేకుండా పోయినవి. ఆధునిక యుగంలో బ్రాహ్మణ గ్రంథాలను వెతికి వెలికి తీసిన ఘనత పాశ్చాత్య విద్వాంసులకే చెందుతుంది.

ఒక్కొక్క సంహితకు వేరువేరు బ్రాహ్మణ గ్రంథాలు రచింపబడినవి. 1130 వైదిక సంహితలకు అన్నే బ్రాహ్మణ గ్రంథాలు వుండేవి. కాని సంహితలతోపాటు అవి లుప్తమైనవి. ఇప్పుడు 18 వరకు బ్రాహ్మణ గ్రంథాలు దొరుకుతున్నవి.

## ఋగ్వేద బ్రాహ్మణ గ్రంథాలు

ఋగ్వేద సంహితలకు సంబంధించిన రెండు బ్రాహ్మణ గ్రంథాలు లభిస్తున్నవి.- ఐతరేయ, శాంఖాయన బ్రాహ్మణ గ్రంథాలు.

ఐతరేయ బ్రాహ్మణాన్ని మహిదాసు ఐతరేయుడు రచించాడు. ఇతడు ఋషి మహిదాసుకు, ఇతరా అనే శూద్ర కన్యకు జన్మించినవాడు. ఇతరా కుమారుడు కాబట్టి ఇతడు ఐతరేయుడైనాడని సాయణుని వివరణ. జరోస్ట్రియన్ల మతగ్రంథం అవెస్తాలో 'ఐత్రేయ' అన్న పదం ఋత్విజుడు అన్న అర్థంలో ప్రయోగింపబడి కన్పిస్తున్నది. దీని రచయిత అటువంటి ఋత్విజుడు కాబట్టి దీనికి ఆ పేరు కలిగిందని ఆధునికుల అభిప్రాయం. ఈ గ్రంథంలో 40 అధ్యాయాలు వున్నవి. 8 పంచికలుగా విభజింపబడింది. ప్రతి పంచిక 'కండిక'లుగా విభజింపబడింది. దీనిలో మొత్తం 285 కండికలున్నవి. యజ్ఞంలో ఋత్విజుని యొక్క కార్యకలాపాలను ఈ గ్రంథం విశేషంగా వివరిస్తున్నది. ఋత్విజునికి 'ఐత్రేయ' అని మరొక పేరు అని అవెస్తాను బట్టి తెలుస్తున్నది. ఋత్విజునికి ఉపయోగపడే విధంగా వుండటం చేత ఈ బ్రాహ్మణానికి ఐతరేయ బ్రాహ్మణమని పేరు కలిగి వుంటుంది. ప్రథమ ద్వితీయ పంచికల్లో అగ్నిష్టోమయాగం వివరింపబడింది. తృతీయ చతుర్థ పంచికల్లో ప్రాతః మాధ్యందిన సాయం సవనాలు వివరింపబడినవి. పంచమ పంచికలో ద్వాదశాహ యాగాలు వివరింపబడినవి. షష్ఠ పంచికలో కొన్ని వారాల వరకు సాగే సోమయాగాలు, సప్తమ పంచికలో రాజసూయ యాగం, అష్టమ పంచికలో ఇంద్ర మహాభిషేకం, చక్రవర్తి మహాభిషేకాలు వివరింపబడినవి. సప్తమ పంచికలో హరిశ్చంద్ర-శునశ్శేపుల కథ వున్నది. అష్టమ పంచికలో పురోహితుని ధార్మిక, రాజనైతిక విధులు వివరింపబడినవి. దీనిలో పరీక్షిత్తు కుమారుడు జనమేజయుని ప్రసక్తి వున్నది. ఉత్తర కురు ప్రసక్తి కూడ వున్నది. ఈ బ్రాహ్మణానికి సాయణ, షడ్గురు శిష్య, గోవిందస్వాములు వ్రాసిన మూడు వ్యాఖ్యానాలు లభిస్తున్నవి.

శాంఖాయన బ్రాహ్మణానికే కౌషీతకీ బ్రాహ్మణమని పేరు. దీనిలో 30 అధ్యాయాలు వున్నవి. ఈ గ్రంథం తిరిగి 226 ఖండాలుగా విభాగింపబడింది. కుషీతకి కుమారుడు కౌషీతకి అనే ఋషి దీనిలో ప్రధాన ఆచార్యుడు - 'ఉపాదేష్ట' అందుకే దీనికీపేరు కలిగివుంటుంది. ఇది ఐతరేయ బ్రాహ్మణాన్ని కొన్ని చోట్ల అనుసరిస్తున్నది. కొన్ని చోట్ల భిన్నిస్తున్నది. ఈ రెండు బ్రాహ్మణాల తులనాత్మకాధ్యయనం పరిశోధనీయమైన అంశం. యజ్ఞాల ప్రాముఖ్యత, శాస్త్రీయ వివేచనలు దీనిలో వున్నవి. దీనికి మాధవుని కొడుకు వినాయకుడు వ్రాసిన భాష్యం వున్నది. ఈ బ్రాహ్మణకాలం నాటికి విష్ణు రుద్ర దేవతలకు ప్రాధాన్యం హెచ్చింది. అగ్ని గౌణస్థానాన్ని గ్రహించాడు. "యజ్ఞోవై విష్ణుః" అని విష్ణువు యజ్ఞానికి ప్రతీక అయినాడు.

# యజుర్వేద బ్రాహ్మణ గ్రంథాలు

యజుర్వేద సంహితలల్లో శుక్ల యజుర్వేదానికి చెందిన శతపథ బ్రాహ్మణం కృష్ణయజుర్వేదానికి చెందిన తైత్తిరీయ బ్రాహ్మణం లభిస్తున్నవి.

శుక్లయజుర్వేద మాధ్యందిన, కాణ్వ సంహితలకు చెందిన శతపథ బ్రాహ్మణాలు రెండు వున్నవి. రెండు శతపథ బ్రాహ్మణాలల్లో ప్రతిపాద్యమైన విషయం ఒక్కటే అయినా వీటి క్రమంలో కొంత భేదమున్నది. మాధ్యందిన శతపథంలో 14 కాండాలు 100 అధ్యాయాలున్నవి. కాణ్వ శతపథంలో 17 కాండాలు, 104 అధ్యాయాలున్నవి. శతపథ బ్రాహ్మణం బృహదాకారం కలది. దీనిలో అనేక యజ్ఞయాగాదుల సాంగోపాంగ వర్ణన వున్నది. ఇతర బ్రాహ్మణాలల్లో ఇట్లా లేదు. వేద కాలంలో సూక్ష్మరూపంలో వున్న యజ్ఞకాండ రాను రాను ఎట్లా విస్తృతమైందో ఈ బ్రాహ్మణంలో చూడవచ్చును. శతపథ బ్రాహణంలో విషయం క్రమబద్ధంగా శాస్త్రీయంగా వివరింపబడింది. ఈ బ్రాహ్మణంలోని మొదటి తొమ్మిది కాండాలు వాజసనేయ సంహితలోని 18 అధ్యాయాలకు వ్యాఖ్యానరూపంగా వున్నవి. దీని మొదటి 9 కాండాలకు మరియు చివరి 14 కాండాలకు మహర్షి శాండిల్యుడు రచయిత అని చెప్పబడింది. దీని చివరి 5 అధ్యాయాలల్లో బృహదారణ్యకోపనిషత్తు నిబంధింపబడింది. ఈ బ్రాహ్మణానికి హరిస్వామి, సాయణ, కవీంద్ర సరస్వతులు వ్రాసిన భాష్యాలున్నవి. ఈ భాష్యాలకు టీకలు కూడ లభిస్తున్నవి.

శతపథ బ్రాహ్మణంలో 12000 ఋచలు, 8000 యజుస్సులు, 4000 సమయులు వున్నవి. యజ్ఞయాగాదులను విపులంగా వివరించే గ్రంథం కాబట్టి వైదిక కర్మకాండల అవగాహనకు ఇది చక్కగా తోడ్పడుతుంది. కద్రూ, సువర్ణ, పురూరవ ఊర్వశీ, అశ్వినీ కుమారుల కథలు దీనిలో వున్నవి. దీనిలోని ఆఖ్యానాలెన్నో తర్వాత మహాభారతంలో చోటు చేసుకొన్నవి. తర్వాత సంస్కృత సాహిత్యంలో వికసించిన నాటక, చంపూ, కావ్యాది ప్రక్రియరూపాల సూత్రాలు దీనిలో చెప్పబడినవి. ఈ బ్రాహ్మణం ఒక విజ్ఞానసర్వస్వం వంటిది. గద్య ప్రక్రియను విశేషంగా పరిశీలించిన ఓల్డెన్‌బెర్గ్ తైత్తిరీయ సంహితలోని గద్యం ప్రాచీనమైందని, శతపథ బ్రాహ్మణంలోని గద్యం అర్వాచీనమైందని చెప్పాడు. వాక్కర్‌నాగెల్ తైత్తిరీయ బ్రాహ్మణాన్ని ప్రాచీనతమమైందిగా అంగీకరించాడు. ఇప్పుడు లభించే బ్రాహ్మణ గ్రంథాలల్లో శతపథమే ప్రాచీనతమమైందని కీథ్ అభిప్రాయం. ఈ అభిప్రాయమే యుక్తియుక్తమైందని భారతీయ పండితుల అభిప్రాయం.

శతపథ బ్రాహ్మణ కాలం నాటికి వైదిక కర్మకాండలు గండకీనదీ తీరం వరకు ప్రసరించినట్లు దీనిలోని ఆ నది ప్రసక్తినిబట్టి తెలుస్తున్నది. మిథిలాపతి జనకుని ప్రసక్తి కూడ ఈ బ్రాహ్మణంలో వున్నది. దుష్యంత, భరతులు అశ్వమేధం చేసినవారుగా పేర్కొనబడినారు. జనమేజయుని పేరు కూడ దీనిలో వున్నది. యాజ్ఞవల్క్యుని గురువు ఉద్దాలక ఆరుణి పాండిత్య ప్రశంస దీనిలో చాల గొప్పగా చేయబడింది.

కృష్ణయజుర్వేదానికి తైత్తిరీయ బ్రాహ్మణం ఒక్కటే దొరుకుతున్నది. దీనికి కాఠక బ్రాహ్మణమున్నట్లు తెలుస్తున్నది కాని అది అలభ్యం. తైత్తిరీయ బ్రాహ్మణం కూడ ప్రాచీన బ్రాహ్మణాలల్లో ఒకటి. ఇది మూడు కాండాలుగా విభజింపబడింది. ఇవి తిరిగి 25 ప్రపాఠకాలుగా 1308 అనువాకాలుగా విభజింపబడినవి. దీనిలో వాజపేయ, రాజసూయ, నరమేధాది యజ్ఞాలవిధులు వివరంగా చెప్పబడినవి. ఈ బ్రాహ్మణంలో నచికేతుడు అగ్నివిద్య ద్వారా మోక్షము పొందినట్లు చెప్పబడింది. వరాహ అవతార ప్రసక్తి కూడ దీనిలో స్పష్టంగా చేయబడింది. జ్యోతిషశాస్త్ర సంబంధి విషయాలెన్నో దీనిలో చెప్పబడినవి. యజ్ఞ సమయాలల్లో బ్రాహ్మణులు యజ్ఞ, దార్శనిక సంబంధ శాస్త్ర చర్చలు చేసేవారని దీనిలో చెప్పబడింది.

## సామవేద బ్రాహ్మణ గ్రంథాలు

ఇతర వేదాలకన్న సామవేదానికి ఎక్కువ బ్రాహ్మణ గ్రంథాలు కన్పిస్తున్నవి. మొత్తం 9 బ్రాహ్మణాలు సామవేదానికి వున్నవి. అవి - తాండ్య, షడ్వింశ, సామవిధాన, ఆర్షేయ, దేవతాధ్యాయ, ఉపనిషద్, సంహితోపనిషద్, వింశ, జైమినీయ బ్రాహ్మణాలు.

తాండ్య బ్రాహ్మణం తాండి అనే పేరు గల ఋషి యొక్క సంతతి మరియు అతని శిష్యుల చేత ప్రచారం చేయబడింది. ఇది సామవేదానికి ప్రధానమైన బ్రాహ్మణ గ్రంథం. దీనికి మహా బ్రాహ్మణం, ప్రౌఢ బ్రాహ్మణం, పంచవింశ బ్రాహ్మణం అని పేర్లువున్నవి. యజ్ఞకర్మల్లో ఉద్గాత యొక్క కార్యకలాపాలను ఈ బ్రాహ్మణం వివరిస్తున్నది. ఒక్కరోజు మొదలుకొని వేయి సంవత్సరాల వరకు నడిచే యజ్ఞాలను గూర్చిన వివరణ దీనిలో వున్నది. యజ్ఞ ప్రాధాన్యాన్ని గూర్చి వివిధ ఆచార్యుల అభిప్రాయాలు దీనిలో ఇయ్యబడినవి. తాండ్య బ్రాహ్మణంలో వ్రాత్యయజ్ఞవివరణ కూడ వున్నది. వ్రాత్యులు అనార్య జాతులవారని ఆధునికుల అభిప్రాయం. వారి ఆచార వ్యవహారాలు, ధార్మిక వ్రత నియమాలు

ఆర్యులకన్న భిన్నమైనవి. వారి వేషధారణ, ఆచార వ్యవహారాలు ఈ బ్రాహ్మణంలో వర్ణింపబడినవి. తాండ్య బ్రాహ్మణంలో కురుక్షేత్రం, సరస్వతీనదీప్రాంతాలు పేర్కొనబడినవి. కురుక్షేత్రం మొదలుకొని నైమిషారణ్య ప్రదేశంవరకు గల ప్రదేశం యజ్ఞభూమి అని పేర్కొనబడింది. దీనిలో ప్రముఖమైన ఐతిహాసిక ఉపాఖ్యానాలు కూడ వున్నవి. విశ్వామిత్రుడు భరతులతో కూడి రోహిత నదీ ప్రాంతాన్ని జయించినట్లు చెప్పబడింది.

షడ్వింశబ్రాహ్మణంలో అనేక ఉత్పాతాలకు శాంతివిధానాలు చెప్పబడినవి. అందుకే దీనికి అద్భుత బ్రాహ్మణమని కూడ పేరు. ఇది 5 ప్రపాఠకాలుగా విభజింపబడింది. ఇది పంచవింశ బ్రాహ్మణం యొక్క పరిశిష్ట భాగం. అందుకే దీనికి షడ్వింశ బ్రాహ్మణమని పేరు. దీనిలో సమకాలిక మతధార్మిక పరిస్థితులు చక్కగా ప్రతిబింబించినవి.

సామవిధాన బ్రాహ్మణంలోని విషయం ఇతర బ్రాహ్మణ గ్రంథాలల్లో కన్నా భిన్నంగా వున్నది. శత్రువులను ధ్వంసం చేసే ఉపాయాలు, ఒక వ్యక్తిని గ్రామం నుంచి పారదోలేందుకు రకరకాల మంత్రప్రయోగాలు దీనిలో వివరింపబడినవి. నానా ఉత్పాతాలకు శాంతివిధానాలు చెప్పబడినవి. వేద మంత్రాలను ఆభిచారిక ప్రయోగాల కొరకు ఉపయోగించటం ప్రచారంలో వున్నది. ఋగ్వేద మంత్రాలకు "ఋగ్విధానం"లో, యజుర్వేద మంత్రాలకు "యజుర్విధానం"లో ఈవిధంగా ఆభిచారిక ప్రయోగాలు వివరింపబడినవి. కాని ఈ రెండు బ్రాహ్మణ గ్రంథాలుగా పేర్కొనబడలేదు.

ఆర్షేయ బ్రాహ్మణంలో 82 ఖండాలు వున్నవి. సామగానం యొక్క శాస్త్రీయ వివేచనకు ఈ గ్రంథం చాల ఉపయోగిస్తుంది. దీనిలో సామవేద గాయకులైన ఋషుల పరిచయం ఇయ్యబడింది.

దేవతాధ్యాయబ్రాహ్మణం చాల చిన్నది. దీనిలో సామవేదంలోని దేవతలు- అంటే అగ్ని, ఇంద్ర, ప్రజాపతి, సోమ, వరుణ, త్వష్టా, అంగీరస, పూషా, సరస్వతి మొదలైన దేవతల వర్ణన వున్నది. ఈ దేవతల ప్రస్తుతితో కూడిన మంత్రాలు దీనిలో ఇయ్యబడినవి. ఇదేగాక ఛందస్సు, నిరుక్త సంబంధమైన వివరణలు కూడ దీనిలో వున్నవి.

ఉపనిషద్ బ్రాహ్మణం 10 ప్రపాఠకాలుగా విభాగింపబడింది. ఇది రెండు భాగాలుగా విభాగింపబడింది - మంత్ర బ్రాహ్మణం, ఛాందోగ్యోపనిషత్తు. మంత్ర

బ్రాహ్మణానికే ఛాందోగ్య బ్రాహ్మణమని పేరు. ఇది జర్మన్ భాషలోకికూడ అనువదింపబడింది. దీనిలో 257 మంత్రాలున్నవి. దీనిలో వివాహ, గర్భాధాన, సీమంతోన్నయన, చూడాకర్మ, ఉపనయనాది కర్మలు వివరింపబడినవి. ఇంకా భూతదేవబలులు, పితృపిండదానాదులు చెప్పబడినవి. సందర్భానుకూలంగా సంహిత, బ్రాహ్మణాలనుంచి మంత్రాలు తీసుకోబడినవి. కొన్ని మంత్రాలు కొత్తవి కూడ వున్నవి. వీటి భాష సరళసులభంగా వున్నది. దీనికి గుణవిష్ణు, సాయణుల భాష్యాలున్నవి. ఈ బ్రాహ్మణం చివరి 8 ప్రపాఠకాలకు ఛాందోగ్యోపనిషత్తు అని పేరు.

సంహితోపనిషద్ బ్రాహ్మణంలో సామగాన వివరణ ఇయ్యబడింది. సామగానానికి అవసరమయ్యే మంత్రాల సముదాయం దీనిలో వుండటంచేత దీనికీ పేరు కలిగింది. ఇది సామవేదీయులకు ప్రధాన గ్రంథం. దీనిలో 5 ఖండాలున్నవి. ప్రతిఖండం సూత్రాలుగా విభాగింపబడింది. ఈ బ్రాహ్మణానికి సాయణ, ద్విజరాజభట్టులు రచించిన భాష్యాలు వున్నవి.

వంశ బ్రాహ్మణం చాలా చిన్నది. దీనిలో మూడు ఖండాలున్నవి. సామవేదాచార్యుల వంశపరంపర వివరింపబడింది. ఋషుల వంశచరిత్రలను తెలుసుకునేందుకు ఈ గ్రంథం ఉపయోగిస్తుంది.

జైమినీయ బ్రాహ్మణం ఇప్పుడు పూర్తిగా లభిస్తున్నది. ఇది శతపథ బ్రాహ్మణంవలె బృహత్కాయం కలది. యజ్ఞానుష్ఠానం చాల విశదంగా దీనిలో వివరింపబడింది.

## అథర్వవేద బ్రాహ్మణ గ్రంథాలు

అథర్వవేదానికి తొమ్మిది శాఖలు వున్నవి. కాని ఒక్క బ్రాహ్మణ గ్రంథమే దొరుకుతున్నది. దాని పేరు గోపథ బ్రాహ్మణం. ఇది పూర్వగోపథం, ఉత్తర గోపథం అని రెండు భాగాలుగా విభాగింపబడింది. పూర్వ గోపథంలో 5 ప్రపాఠ ు వున్నవి. ఉత్తర గోపథంలో 6 ప్రపాఠకాలు వున్నవి. మొత్తం గ్రంథం 258 కండికల ా విభజింపబడింది. ఈ బ్రాహ్మణ గ్రంథం అర్వాచీన రచన అని పండితుల అభిప్రాయం. దీనిలో అథర్వవేద ప్రశస్తి చాలవున్నది. అథర్వంనుంచే మూడు వేదాలు పుట్టినవని, ఓంకారోత్పత్తి, మరియు ఓంకారం నుంచి సమస్త సృష్టి ఉద్భవించిందని ఈ గ్రంథంలో చెప్పబడినవి. యజ్ఞాన్ని

నిర్వహించే నాలుగు విధాలైన ఋత్విజుల కార్యకలాపాలు దీనిలో వివరింపబడినవి. అశ్వమేధ, పురుషమేధాది యజ్ఞాల వివరణ కూడ దీనిలో వున్నది. అక్కడక్కడ ఆఖ్యానాలు కూడ వున్నవి. ఇవి చక్కని శైలిలో వ్రాయబడినవి. ఈ గ్రంథంలో కురుపాంచాల, అంగ, మగధ, కాశి, కోసల, సాల్వ,మత్స్య, వత్స, ఉశీనర దేశాల ప్రసక్తి వున్నది. దీని రచయిత గోపథ ఋషి అని చెప్పబడుతున్నది కాని ఆ పేరు ఋషినామావళిలో ఎక్కడా లేదు. ఈ బ్రాహ్మణ గ్రంథంలో తాత్త్విక సంబంధ విషయాలు కూడ వున్నవి. ఎన్నో వైదిక పదాలకు స్వతంత్రమైన వ్యుత్పత్తి అర్థాలు దీనిలో వివరింపబడినవి. దీనిలోని కొన్ని విషయాలు శతపథ, తాండ్య బ్రాహ్మణాలల్లో చెప్పబడినవే.

## ఆరణ్యకాలు

ఆరణ్యక, ఉపనిషద్గ్రంథాలు బ్రాహ్మణాలకు పరిశిష్టరూపం వంటివి. అరణ్యాలల్లో ప్రశాంతంగా నివసిస్తూ మననం చేసుకోవలసిన విషయాలు ఆరణ్యకాలల్లో వున్నవి. అందుకే వీటికి ఆరణ్యకాలని పేరు కలిగింది. "అరణ్య ఏవ పాఠత్వా దారణ్యక మితీర్యతే' '- అరణ్యాలల్లో పఠింపబడేవి కాబట్టి వాటికి ఆరణ్యకాలని-ఐతరేయ బ్రాహ్మణంలో సాయణాచార్యులు ఇచ్చిన నిర్వచనం. బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ సన్యాసాశ్రమాలు మన పూర్వులు అనుసరించిన చతురాశ్రమ ధర్మాలు. అరణ్యావాసం చేసే వానప్రస్థులకు యజ్ఞయాగాది విధానాలను గూర్చి చెప్పేవి ఆరణ్యకాలు. సంసారబంధాలకు దూరంగా, జన నివాసాలకు దూరంగా వనాలల్లో వుంటూ ఋషులు బ్రహ్మవిద్యా సాక్షాత్కారం చేసుకున్నారు. ఆ విద్యయే ఆరణ్యకాలల్లో సంగ్రహింపబడింది. ఈ గ్రంథాలు అరణ్యాలల్లో వ్రాయబడినవే కాక అరణ్యాలల్లో అధ్యయనం చేయబడేవి కాబట్టి వీటికి ఆరణ్యకాలని పేరు కలిగిందని చెప్పవచ్చును. గృహస్థాశ్రమంలో చేయదగిన యజ్ఞయాగాది విధులు బ్రాహ్మణాలల్లో చెప్పబడగా, వానప్రస్థాశ్రమంలో చేయదగిన యజ్ఞవ్రత కర్మాది విధులను గూర్చి ఆరణ్యకాలు చెప్తున్నవి. ఆరణ్యకాలల్లో కేవలం యజ్ఞకర్మల విజ్ఞానమే కాక ఆధ్యాత్మిక తత్త్వాలు కూడ వివరింపబడినవి. ప్రాణవిద్యా ప్రతిపాదన కూడ వీటిల్లో జరిగింది. ఆరణ్యాలల్లోని ప్రశాంతవాతావరణంలో ప్రాణవిద్య వికసించటానికి అవకాశం కలిగింది. వేదసంహితల్లోనే ఈ విద్య ప్రతిపాదింపబడింది అంటారు. కాని ఆరణ్యకాలల్లోనే దీని బీజాలు అంకురించినవి. ఇంద్రియాలన్నిటిలో ప్రాణం శ్రేష్ఠమైంది. ప్రాణశక్తిద్వారానే ప్రపంచమంతా తన స్థానంలో వున్నదని, అది విశ్వధారకమని రక్షకమని ఆరణ్యకాలు చెప్తున్నవి. చక్కని అఖ్యానాల ద్వారా ఈ విషయాలు బోధింపబడినవి. ప్రాణం దేవాత్మకం, ఋషిరూపమని చెప్పబడింది. ఆరణ్యకాలల్లో చెప్పబడిన ఆధ్యాత్మిక విషయాలే ఉపనిషత్తుల్లో

వికసిత రూపంలో కన్పిస్తున్నవి. అసలు ఉపనిషత్తులు ఆరణ్యకాలకు చివర పరిశిష్టరూపంగా వున్నవి. కొన్ని ప్రాచీనమైన ఉపనిషత్తులు ఆరణ్యకాలల్లో అంగరూపంగానే కన్పిస్తున్నవి. ఆరణ్యకాల సంఖ్య 130 వరకు వుండేది. కాని చాలావరకు అవి లుప్తమైనవి. ఇప్పుడు 8 ఆరణ్యకాలు మాత్రమే లభిస్తున్నవి - ఐతరేయ - శాంఖాయన, తైత్తిరీయ, బృహద, మాధ్యందిన బృహద, కాణ్వబృహద, జైమినీయోపనిషద్, ఛాందోగ్య ఆరణ్యకాలు.

ఋగ్వేదానికి చెందిన ఐతరేయారణ్యకం ఐతరేయబ్రాహ్మణానికి పరిశిష్టరూపంగా లభిస్తున్నది. ఐతరేయారణ్యకం అసలు ఐదు ఆరణ్యాకాల సంగ్రహమని అంటారు. ఈ ఐదు వేరు వేరు గ్రంథాలుగా పరిగణింపబడేవని వాటి ప్రారంభ పాఠవిధిని బట్టి తెలుస్తున్నది. వీటిల్లో పురుష వివేచన, సంహితాపద క్రమ పాఠవిధానాలు, నిరుక్త, వ్యాకరణ వివేచనలు వున్నవి. ప్రాణ విద్య, మహావ్రతాచరణలు వివరించ బడినవి. దీనిలోని చతుర్థ పంచమ షష్ఠాధ్యాయాలు ఐతరేయ ఉపనిషత్తుగా పిలువబడుతున్నవి. ఐతరేయారణ్యకం ఐతరేయబ్రాహ్మణంలో భాగమే కాబట్టి అవి ఏకకాలంలోనే వ్రాయబడినవని కీథ్ అభిప్రాయం. వ్యాకరణ, నిరుక్త శాస్త్రాల వికాసాన్ని ప్రాచీనమైన ఆరణ్యకాలల్లో చూడవచ్చును.

శాంఖాయనారణ్యకం ఐతరేయారణ్యకం వలె ఋగ్వేదానికి చెందింది. దీనిలో 15 అధ్యాయాలున్నవి. 3-6 అధ్యాయాలు కౌషీతకి ఉపనిషత్తుగా పిలువబడు తున్నవి.

తైత్తిరీయారణ్యకం తైత్తిరీయసంహితకు సంబంధించింది. దీనిలో 10 పరిచ్ఛేదాలున్నవి. విషయాన్ని బట్టి పరిచ్ఛేదాలకు నామకరణం జరిగింది. పరిచ్ఛేధాలు ప్రపాఠకాలుగా విభజింపబడినవి. 7,8,9 ప్రపాఠకాలను తైత్తిరీయోపనిషద్ అంటారు. 10వ ప్రపాఠకం మహానారాయణీయోపనిషద్ అని పిలువబడుతున్నది. ఈ ఆరణ్యకంలో స్వాధ్యాయం. పంచమహాయజ్ఞాలు వివరింపబడినవి. అభిచార విద్యకు ఉపయోగపడే మంత్రాలు కూడ దీనిలో ఇయ్యబడినవి. కశ్యపశబ్దానికి సూర్యుడని దీనిలో అర్థం చెప్పబడింది. 'పశ్యక' శబ్దమే వర్ణవ్యత్యయమై 'కశ్యప'గా మారిందని చెప్పబడింది. పరాశరవ్యాసుని పేరు దీనిలో పేర్కొనబడింది. సంధ్యాకాలంలో విడువబడిన అర్ఘ్యజలాల మహిమచేత సూర్యుని మీదికి వచ్చే మందేహ రాక్షసులు సంహరింపబడుతారని దీనిలో చెప్పబడింది.

బృహదారణ్యకం శుక్లయజుర్వేదానికి చెందింది. దీనిలో ఆత్మతత్త్వ విచారణ ఎక్కువగా వుండటంచేత ఇది ఉపనిషత్తుగాను పిలువబడుతున్నది. కృష్ణయజుర్వేదం మైత్రాయణిశాఖకు చెందిన మైత్రాయణ్యారణ్యకం ఉపనిషత్తుగా పిలువబడుతున్నది.

సామవేదం యొక్క తవలకార ఆరణ్యకంలో 4 అధ్యాయాలున్నవి. నాల్గవ

అధ్యాయంలో దశమ అనువాకానికే కేనోపనిషత్తు అని పేరు. ఈ ఆరణ్యకానికే జైమినీయోపనిషద్ బ్రాహ్మణమని పేరు.

అథర్వవేదానికి ఆరణ్యక గ్రంథాలు చాలా వుండేవి. కాని అవి లభ్యం కాలేదు. అథర్వవేదానికి ఉపనిషత్తులు చాలా వున్నవి. కాని అవి ఆరణ్యక గ్రంథాలల్లోని భాగాలు కాక స్వతంత్రమైనవి.

ఆరణ్యక గ్రంథాలల్లో కర్మ, జ్ఞానమార్గాల సమన్వయాన్ని చూడవచ్చును. ఉపనిషత్తులో విస్తరించిన బ్రహ్మజ్ఞానం, ఆత్మవిద్యలకు మూల రూపాలు ఆరణ్యక గ్రంథాలల్లో కన్పిస్తున్నవి. ఆరణ్యక గ్రంథాలకు భాష్యాలు కూడ వ్రాయబడినవి. ఐతరేయ, కౌషీతకి ఆరణ్యకాలకు శంకర, సాయణుల భాష్యాలు లభిస్తున్నవి. శాంకర భాష్యానికి ఆనందగిరి, ఆనందతీర్థ, నారాయణేంద్ర సరస్వతి, నృసింహాచార్యాదులు టీకలు వ్రాసారు. బృహదారణ్యకానికి శంకర, రామానుజ, సాయణుల భాష్యాలు వున్నవి. శాంకరభాష్యానికి ఆనందతీర్థాదులు వ్రాసిన టీకలుకూడ వున్నవి. తైత్తిరీయారణ్యకానికి సాయణ, భాస్కరమిశ్ర, వరదరాజుల భాష్యాలు లభిస్తున్నవి.

## ఉపనిషత్తులు

ఉపనిషత్తులు ఆరణ్యకాలల్లోని భాగాలే. ఇవి వేదంయొక్క అంతిమభాగాలు కాబట్టి 'వేదాంత' మనే పేరుతో పిలువబడుతున్నవి. మానవుల ఆధ్యాత్మిక జ్ఞానానికి ఈ గ్రంథాలు అంతిమ రూపాలు. ఉపనిషత్తుల్లో కర్మకాండ నిషేధింపబడటం కాని, ఖండింపబడటం కాని జరుగలేదు. జ్ఞానప్రాప్తి కొరకు యజ్ఞాదికర్మలు సాధనాలని అవి అంగీకరిస్తున్నవి. కాని మోక్షప్రాప్తి మాత్రం కేవలం జ్ఞానంచేతనే లభిస్తుందని అవి ప్రతిపాదిస్తున్నవి. భారతీయుల సుధీ విశేషానికి ప్రతీకలు ఉపనిషత్తులు. వీటిల్లో చెప్పబడిన గంభీరమైన ఆధ్యాత్మిక విద్యయే జైన, బౌద్ధాది మతాలకు ఆధారభూతమైంది. జైన, బౌద్ధులు కర్మకాండను ఖండించి నైతిక జ్ఞానమార్గాలకు ప్రాధాన్యాన్నిచ్చారు. ప్రపంచంలో ఏ జాతి చేరుకోని ఉన్నతజ్ఞానశిఖరాలను భారతీయులు ఉపనిషద్గ్రంథాలల్లో చేరుకున్నారు. వారి మస్తిష్క పరిణతికి అవి తార్కాణాలుగా వున్నవి. పాశ్చాత్యులు ఉపనిషత్తుల్లోని జ్ఞానమార్గానికి నతమస్తకులైనారు.

'ఉపనిషద్' శబ్దం, "ఉప ని" అనే ఉపసర్గలు చేరి "సద్" అనే ధాతువు నుంచి వచ్చింది. 'సద్' ధాతువుకు అనేకార్థాలు వున్నవి - "షద్ల్ఱ విశరణ గత్యవసాదనేషు" - 1)

విశరణ = నాశనంచెందుట, 2) గతి = ప్రాప్తి, తెలుసుకొనుట, 3) అవసాదన = శిథిలం, సమాప్తి చెందుట అని అర్థాలు. అప్పుడు ఉపనిషత్తులు బ్రహ్మవిద్యాద్యోతకాలు, ముముక్షువుల అవిద్యను నాశనం చేసేవి, బ్రహ్మప్రాప్తిని కలిగించేవి, దుఃఖాలను శిథిలం చేసేవి. అందుకే వాటికి ఉపనిషత్తులని పేరు కలిగిందని అర్థాన్ని చెప్పవచ్చును. ఆ పై వివరణను అనుసరించి 'ఉపనిషద్' శబ్దం 'సద్' ధాతువునుంచి పుట్టింది. ఉప+ని అంటే కూర్చొని సంపాదించే జ్ఞానమని, అంటే గురుచరణాల సమీపంలో కూర్చొని సంపాదింపబడే జ్ఞానంతో ఉపనిషత్తులు కూడినవని, అందుకే వాటికి ఆ పేరు కలిగిందని అర్థాన్ని చెప్ప వచ్చును. ఎవరైతే ఆత్మవిస్మృతిపూర్వకమైన శ్రద్ధాభక్తులతో బ్రహ్మవిద్యను గ్రహిస్తారో వారికి గర్భవాస, జనన, మరణ, జర, రుజాది సంసారదుఃఖాలు నశిస్తాయని శంకరాచార్యుల అభిప్రాయం. ఉప=వ్యవధానం లేకుండా, ని=సంపూర్ణంగా, షద్= జ్ఞాన ప్రాప్తిని కలిగించేవి కాబట్టి ఈ గ్రంథాలకు ఉపనిషత్తులని పేరు అని మరొక వివరణ. అంటే దేశకాలవస్తుపరిచ్ఛేదం లేకుండా ఇవి బ్రహ్మజ్ఞానాన్ని బోధించేవని అర్థం.

## ఉపనిషత్తుల సంఖ్య

ముక్తకోపనిషత్తు ప్రకారం మొత్తం ఉపనిషత్తులు 108. మద్రాసులో అడయార్ లైబ్రరీవారు ప్రచురించిన ఉపనిషత్తులు 179 వరకు వున్నవి. బొంబాయిలోని గుజరాతి ప్రింటింగ్ ప్రెస్‌వారు ప్రచురించిన ఉపనిషత్ వాక్యమహాకోశంలో ఉపనిషత్తుల సంఖ్య 223 వరకు పోయింది. మూల ఉపనిషత్తులు ఎన్నో నిర్ణయించటం కష్టం. శంకర, రామానుజాచార్యుల సమయానికి ఉపనిషత్తుల సంఖ్య 30 మాత్రమే. క్రీ.శ. 14వ శ॥ వరకు వీటి సంఖ్య 60 వరకు పెరిగింది. ధార్మిక సంప్రదాయాలు పెరిగేకొద్దీ ఉపనిషత్తుల సంఖ్య పెరుగసాగింది. శైవ వైష్ణవ శాక్తాది సంప్రదాయకులు తమ సిద్ధాంతాలను ప్రచారం చేసేకొరకు ఉపనిషద్రచనలు చేసారు. ఉపనిషద్గ్రంథాలన్నీ సమానంగా ఉత్తమమైనవని, ప్రభావ మహత్త్వం కలవని చెప్పటానికి వీల్లేదు. ముక్తకోపనిషత్తులో ఉపనిషత్తుల క్రమం ఈవిధంగా చెప్పబడింది;

ఈశ కేన కఠ ప్రశ్న ముండ మాండూక్య తైత్తిరిః
ఐతరేయం చ ఛాందోగ్యం బృహదారణ్యకం దశ.

పైన చెప్పబడిన పది ఉపనిషత్తులే ప్రాచీనమైనవని, ప్రామాణికమైనవని అంగీకరింపబడినవి. శంకరాచార్యుడు ఈ పదింటికే భాష్యం వ్రాసాడు. ఇవిగాక కౌషీతకి, శ్వేతాశ్వతర, మైత్రాయిణి అనే మూడు ఉపనిషత్తులు కూడ ప్రాచీనమైనవి. ప్రామాణికమైనవి కూడ. శంకరుడు కౌషీతకి, శ్వేతాశ్వతరోపనిషత్తులను పేర్కొన్నాడు కాని వాటికి భాష్యం

వ్రాయలేదు. ఈ త్రయోదశోపనిషత్తులే ప్రాచీన వేదాంతతత్త్వ ప్రతిపాదకాలైనవి. ఇతర ఉపనిషత్తులన్నీ ఆయా మత సంప్రదాయాల సమర్థనకొరకు పుట్టినవి మాత్రమే. అట్లా పుట్టినవాటిలోనే వైష్ణవ, శైవ, శాక్త, యోగ విషయక ఉపనిషత్తులు వున్నవి. పాల్ దయస్సన్ అనే జర్మన్ పండితుడు ఉపనిషత్తులను నాలుగు రకాలుగా విభాగించాడు - 1)గద్య బ్రాహ్మణ గ్రంథాలల్లో పరిశిష్టరూపంగా వున్న ప్రాచీనమైన గద్య ఉపనిషత్తులు. ఇవి క్లిష్టంగా లేవు. సరళంగా చెప్పబడినవి- బృహదారణ్యక, ఛాందోగ్య, తైత్తిరీయ, ఐతరేయ, కౌషీతకి, కేన ఉపనిషత్తులు దీనిలో చేరుతవి. 2) ప్రాచీనమైన పద్య ఉపనిషత్తులు. వీటిలోని పద్యాలు వైదిక ఋక్కులకు దగ్గరగా వున్నవి. ఈశ, కఠ, శ్వేతాశ్వతర, మహానారాయణ ఉపనిషత్తులు దీనిలో చేరుతవి. 3) అర్వాచీన గద్య ఉపనిషత్తులు. ప్రశ్న, మైత్రాయణీయ, మాండూక్య ఉపనిషత్తులు దీనిలో చేరుతవి. 4) తాంత్రికోపాసనలతో కూడిన అథర్వణ సంబంధ ఉపనిషత్తులు. సామాన్య, యోగ, సాంఖ్య, వేదాంత, శైవ, వైష్ణవ, శాక్త ఉపనిషత్తులు దీనిలో చేరుతవి.

డా. బెల్వేల్కర్, రానడేలు మిక్కిలి పరిశోధించి ప్రాచీన ఉపనిషత్తుల సంఖ్యను నిర్ణయించటానికి పూనుకొన్నారు. అవి - ఛాందోగ్య, బృహదారణ్యక, కఠ, ఈశ, ఐతరేయ, తైత్తిరీయ, ముండక, కౌషీతకి, కేన, ప్రశ్నోపనిషత్తులు ప్రథమ శ్రేణివిగాను, శ్వేతాశ్వతర, మాండూక్య, మైత్రాయణీయోపనిషత్తులు ద్వితీయ శ్రేణివిగాను, బాష్కల, ఛాగలేయ, ఆర్షేయ, శౌనకోపనిషత్తులు తృతీయ శ్రేణివిగాను వారు విభాగించారు. వీరి విభాజన సమంజసంగాలేదని బల్దేవ ఉపాధ్యాయ మరొక విభాజనను ప్రతిపాదించాడు - ఛాందోగ్య, బృహదారణ్యక, ఈశ, తైత్తిరీయ, ఐతరేయ, ప్రశ్న, ముండక, మాండూక్యోపనిషత్తులు ప్రథమ శ్రేణివిగాను, ఇవి ఆరణ్యకాలల్లో అంతర్భాగంగా వుండటంచేత తప్పక ప్రాచీనమైనవిగాను చెప్పవచ్చునన్నాడు. కఠ, కేనోపనిషత్తులను ద్వితీయ శ్రేణిని గాను, శ్వేతాశ్వతర, కౌషీతకి, మైత్రాయణి, మహానారాయణోపనిషత్తులను తృతీయ శ్రేణివిగాను ఉపాధ్యాయ చేసిన విభజన. ఉపనిషత్తుల్లో కురుపాంచాలం మొదలుకొని విదేహ రాజ్యం వరకు ప్రాంతాలు పేర్కొనబడినవి. అంటే వాటి జన్మస్థానం ఈ ప్రాంతాలే అని చెప్పాలి. గాంధారాది ఉత్తర పశ్చిమ ప్రాంతాలు స్మరింపబడలేదు. అంటే అవి అప్పటికి సుదూర ప్రాంతాలైనవన్నమాట. వివిధ వైదిక దేవతలకు మారుగా ఉపనిషత్తుల్లో నామరూపమైన బ్రహ్మమే సృష్టికర్తగా, పాలనకర్తగా రూపొందింపబడింది. అనేక దేవతలకు బదులుగా నిరాకారరూపమైన పరబ్రహ్మతత్త్వం ఉపనిషత్తుల్లో ఊహింపబడింది. ఏకేశ్వరవాదన ప్రబలంగా కన్పిస్తుంది. ఇట్లాంటి విషయవివేచనతో కూడిన ఉపనిషత్తులు ప్రాచీనమైనవని నిస్సందేహంగా అంగీకరించవచ్చును. వీటిల్లో ప్రకృతి, పురుష, బ్రహ్మ, త్రివిధ గుణాల

(సత్వ, రజః, తమస్సులు) తో కూడిన సాంఖ్య సిద్ధాంతాల ప్రతిపాదన కన్పిస్తున్నది. తర్వాతి ఉపనిషత్తుల్లో విష్ణువుకుగాని, శివునికిగాని ప్రాధాన్యం ఇయ్యబడింది. అవి అర్వాచీనమనటం తథ్యం.

## రచనాకాలం

వేదాలకు అంతిమ భాగాలైన ఉపనిషత్తుల్లో వైదిక యజ్ఞయాగాది కర్మల ప్రసక్తిగాని, వివరణగాని లేదు. తత్త్వజ్ఞాన సంబంధమైన విద్యకే దీనిలో ప్రాధాన్యమియ్యబడింది. తత్త్వచింతనలో విదేహ జనకుడు, కైకయ అశ్వపతి, పాంచాల ప్రవాహణుడు, జైవలి, కాశిరాజు అజాత శత్రువు మొదలైన రాజులు ఆసక్తికలవారు. ప్రాచీనమైన ఉపనిషత్తుల్లో మధ్య దేశంలోని కురుపాంచాల రాజ్యాల ప్రసక్తి ఎక్కువ కన్పిస్తున్నది. తర్వాత ఉపనిషత్తుల్లో తూర్పున వున్న విదేహ రాజ్యం విశేషంగా పేర్కొనబడింది. అంటే, ఉపనిషత్ జ్ఞానారంభం మధ్యదేశంలో జరిగి, కాశి, విదేహవరకు వ్యాపించిందని చెప్పాలి. ఉపనిషత్తుల తాత్త్వికచింతనలో ముందడుగు వేసినవారు క్షత్రియులు.

ఉపనిషద్గ్రంథాలల్లో చర్చితవిషయం ఒక్కటే అయినా, వాటి రచనాక్రమం ఒక్క తీరుగా లేదు. మంత్ర సంహితలతో, బ్రాహ్మణారణ్యక గ్రంథాలతో ప్రాచీనోపనిషత్తులకు ఘనిష్ఠమైన సంబంధమున్నది. ఇక అర్వాచీన మైన ఉపనిషత్తులు తర్వాత ఉద్భవించిన విచారధారలను, మతాభిప్రాయాలను ప్రతిబింబింప జేస్తున్నవి. కాని, కొన్ని ఉపనిషద్గ్రంథాలు ప్రాచీనమో, అర్వాచీనమో నిర్ణయించి చెప్పడం కష్టం. భాషాప్రయోగాన్ని బట్టి కూడ వాటి పౌర్వాపర్యాలను నిర్ణయించి చెప్పటం సాధ్యం కాదు. ప్రముఖమైన ఉపనిషత్తులన్నీ క్రీ.పూ. 6వ శ॥ అంటే బుద్ధుని కాలం నాటికే రచింపబడినవని ప్రాచ్య పాశ్చాత్య పండితులు ఏకగ్రీవంగా అంగీకరించారు. తర్వాత క్రీ.శ. 16, 17 శ॥ల వరకు ఉపనిషత్తుల రచన కొనసాగుతూనే వున్నది. అల్లా ఉపనిషత్తు క్రీ.శ. 17వ శతాబ్దంలో వ్రాయబడిందని అంటారు. ఉపనిషత్తుల కాలం మొత్తం మీద క్రీ.పూ. 2500 ప్రాంతంలో ఆరంభమైందని పండితుల అభిప్రాయం. మైత్రాయణీ ఉపనిషత్తు రచన క్రీ.పూ. 2000 ప్రాంతంలో జరిగిందని బాలగంగాధర తిలక్ నిర్ణయం.

## ప్రతిపాద్య విషయం

విషయదృష్టితో పరిశీలించినట్లయితే వైదిక సాహిత్యాన్ని మూడుగా విభజింపవచ్చును- కర్మ, ఉపాసన, జ్ఞానం. కర్మ విషయాలను సంహిత, బ్రాహ్మణ గ్రంథాలు చెప్తున్నవి. సంహిత, ఆరణ్యకాలల్లో ఉపాసన చెప్పబడింది. జ్ఞాన విషయాలు ఉపనిషత్తుల్లో

ప్రతిపాదింపబడినవి. విద్యలు రెండు విధాలని వేదాంతుల అభిప్రాయం - పర, అపర విద్యలు. వీటిల్లో పరావిద్య శ్రేష్ఠమైంది. దానికే బ్రహ్మ విద్య అని పేరు. ఈ పరావిద్యను ప్రతిపాదించేవి ఉపనిషద్గ్రంథాలు. అపరావిద్య కర్మ ప్రధానమైంది. అంటే అది కర్మవిద్య, కర్మవిద్యాఫలం వినశ్వరమైంది కాగా, బ్రహ్మ విద్యాఫలం అవినశ్వరమైంది. అపరావిద్య మోక్షకారకం కాకపోవచ్చును కాని, పరావిద్య తప్పక మోక్షప్రదాయిని.

ప్రకృతి, పురుష, పరమాత్మల వివేచన ఉపనిషద్గ్రంథాలలో ప్రతిపాదింప బడిన ప్రధాన విషయం. మూలతత్త్వమైన ప్రకృతి నుంచి ప్రపంచం యొక్క అస్తిత్వ మేర్పడింది. దీనికే మాయ అని కూడ పేరు. పరమాత్మ నిత్యమైంది. పురాతనమైంది. శాశ్వతమైంది. అది జన్మ మృత్యు రహితమైంది. శరీరం వినాశనమొందినా దాని అస్తిత్వంలో మార్పులేదు. అది తిరిగి జన్మిస్తుంది. పాలల్లో వెన్న వ్యాపించి వున్నట్లుగా ప్రపంచంలో పరమాత్మ వ్యాపించి వున్నది. అగ్ని నుంచి స్ఫులింగాలు పుట్టినట్లుగా ఆ పరమాత్మ నుంచి జీవులు ఉద్భవిస్తారు. ఈవిధంగా ఉపనిషత్తుల్లో ప్రతిపాదింప బడిన ఆధ్యాత్మిక విషయాలే తర్వాత వివిధ దర్శనాలుగా వికాసం చెందినవి. బ్రహ్మ, జీవులకు వుండే సంబంధాన్ని నిర్ణయించటంలో ఈ దర్శనాలు విభిన్నాభిప్రాయాలను వెలిబుచ్చి భిన్నత్వాన్ని పొంది స్వతంత్ర తత్త్వశాస్త్రాలుగా వికసించినవి. విషయదృష్టితో పరిశీలించినట్లయితే ఉపనిషత్తులను 6 భాగాలుగా చేయవచ్చును. 1) వేదాంత సిద్ధాంత ప్రతిపాదితాలు 2)యోగ సిద్ధాంత ప్రతిపాదితాలు 3) సాంఖ్య సిద్ధాంత ప్రతిపాదితాలు 4) వైష్ణవ సిద్ధాంత ప్రతిపాదితాలు 5)శైవ సిద్ధాంత ప్రతిపాదితాలు 6) శాక్త సిద్ధాంత ప్రతిపాదితాలు. ప్రతి సిద్ధాంతం. ప్రతి ధార్మిక సంప్రదాయం తమ ఆలోచనలను ప్రతిపాదించే ఉపనిషద్గ్రంథం వుండాలనే అభిప్రాయంవల్ల వాటి సంఖ్య పెరుగుతూ వచ్చింది.

ఉపనిషద్గ్రంథాలు కొన్ని వేదాలకు సంబంధించినవి కావు. కొన్ని మాత్రం ఏదో ఒక వేదానికి జోడింపబడినవి. మరికొన్ని ఉపనిషద్గ్రంథాలను బలవంతంగా ఏదో ఒక వేదానికి జోడింపజేసే ప్రయత్నంకూడ జరిగింది. ఋగ్వేద సంబంధమైనవి 10, శుక్ల యజుర్వేదానికి సంబంధించినవి 19, కృష్ణయజుర్వేదానికి సంబంధించినవి 32, సామవేదానికి సంబంధించినవి 16, అథర్వవేదానికి సంబంధించినవి 31 ఉపనిషత్తులు వున్నవి.

## ముఖ్యమైన ఉపనిషత్తుల పరిచయం

శంకర, రామానుజ, నింబార్క, వల్లభ, మధ్వ మొదలైన ఆచార్యులందరు 12 ఉపనిషత్తులకు భాష్యాలు వ్రాసినారు. ఉపనిషత్తుల్లో ఇవే ప్రముఖమైనవిగా గుర్తింపబడినవి.

## ఈశావాస్యోపనిషత్తు

శుక్ల యజుర్వేదంయొక్క మాధ్యందిన సంహితలోని చివరిదైన 40వ అధ్యాయం పేరే ఈశావాస్యోపనిషత్తు. ఆరంభవాక్యంలో 'ఈశావాస్యమ్' అన్న శబ్దం వుండటంచేత దీనికీ పేరు కలిగింది. దీనిలో కేవలం 18 శ్లోకాలు వున్నవి. బ్రహ్మవిద్యను గూర్చిన చర్చ దీనిలో అద్వితీయంగా చేయబడింది. ఇది మంత్రభాగంలో చేరివుండటం చేత దీనికి మంత్రోపనిషత్తు అనికూడా పేరు. ఇది సంహితా భాగం కాబట్టి ఈశ్వరీయమైంది. కాని ఇతర ఉపనిషత్తులవలె ఆర్షం - అంటే ఋషిప్రోక్తం కాదు. అందుకే ఉపనిషత్తుల్లో ఇది ప్రముఖస్థానాన్ని పొందింది.

## కేనోపనిషత్తు

సామవేదం యొక్క జైమినీయ సంహితకు చెందిన బ్రాహ్మణ గ్రంథంలో 9వ అధ్యాయమే కేనోపనిషత్తు. ఇది 'కేన' శబ్దంతో ఆరంభమౌతున్నది. కాబట్టి దీనికీ పేరు కలిగింది. దీనికి 'బ్రాహ్మణోపనిషత్తు' అని కూడ పేరు. దీనిలో 4 ఖండాలున్నవి. బ్రహ్మతత్త్వాన్ని తెలుసుకొన్నవారు మోక్షప్రాప్తిని పొందుతారని దీనిలో ప్రతిపాదింపబడింది.

## కఠోపనిషత్తు

కృష్ణయజుర్వేదం యొక్క కఠసంహితలోని భాగమే కఠోపనిషత్తు. దీనిలో 2 అధ్యాయాలు 6 వల్లులున్నవి. ఇది గంభీరమైన అద్వైత తత్త్వానికి ప్రసిద్ధమైంది. నచికేతుని వృత్తాంతం దీనిలోనే వున్నది. దీని ఆరంభంలో ఉద్దాలక ఋషి విశ్వజిత్ యజ్ఞాన్ని చేసిన వృత్తాంతం వున్నది.

## ప్రశ్నోపనిషత్తు

అథర్వవేదం యొక్క పిప్పలాదసంహితకు చెందిన బ్రహ్మణ గ్రంథంలోని భాగమే ప్రశ్నోపనిషత్తు. పిప్పలాదుడనే ఋషిని ఆరుగురు ఋషులు బ్రహ్మవిద్యావిషయసంబంధి ప్రశ్నలను అడిగి తెలుసుకుంటారు. ప్రశ్నోత్తర రూపంలో వుండటంచేత దీనికీ పేరు కలిగింది.

## ముండకోపనిషత్తు

ఇది అథర్వవేదం యొక్క శౌనక సంహితకు చెందింది. ఇది 3 ముండకాలుగా

విభజింపబడింది. ఒక్కొక్క ముండకంలో రెండు ఖండాలున్నవి. బ్రహ్మ తన జ్యేష్ఠపుత్రుడు అథర్వునికి బ్రహ్మవిద్యను ఉపదేశించటం దీనిలోని విషయం. 'వేదాంత' శబ్దం మొదటిసారిగా దీనిలో ప్రయోగింపబడి కన్పిస్తున్నది.

## మాండుక్యోపనిషత్తు

ఇది అథర్వ వేదానికి సంబంధించింది. దీనిలో 12 మంత్రాలు మాత్రమే వున్నవి. ఆకారం చిన్నదైనా సిద్ధాంత ప్రతిపాదన విషయంలో చాల మహత్త్వపూర్ణమైంది. దీనిలో ఓంకారం యొక్క వ్యాఖ్య చేయబడింది.

## తైత్తిరీయోపనిషత్తు

కృష్ణయజుర్వేదం యొక్క తైత్తిరీయ సంహితకు చెందిన తైత్తిరీయారణ్యకం లోని చివరి - 7, 8, 9 ఖండాలకే తైత్తిరీయోపనిషత్తు అని పేరు. ఒక్కొక్క ఖండానికి ఒక్కొక్క పేరు వున్నది -శిక్షావల్లి, బ్రహ్మానందవల్లి, భృగువల్లి. ఈ ఉపనిషత్తులో శిష్య, ఆచార్యులకు సంబంధించిన శిష్టాచారాలు, బ్రహ్మవిద్య, ఓంకారమాహాత్మ్యాలు చెప్పబడినవి.

## ఐతరేయోపనిషత్తు

ఋగ్వేదం యొక్క ఐతరేయారణ్యకంలోని 4,5,6 అధ్యాయాలకే ఐతరేయోపనిషత్తు అని పేరు. దీనిలో సృష్టి, జీవి, బ్రహ్మ - ఈ మూడు తత్త్వాలను గూర్చిన చర్చలు వున్నవి.

## ఛాందోగ్యోపనిషత్తు

సామవేదం యొక్క కౌథుమశాఖకు సంబంధించిన కౌథుమబ్రాహ్మణంలో చివరి 10 అధ్యాయాలకే ఛాందోగ్యోపనిషత్తు అని పేరు. ఉపనిషత్తుల్లోకెల్లా ఇది ప్రౌఢగంభీరమైంది. దీని చివరి మూడు అధ్యాయాలు ఆధ్యాత్మిక దృష్టితో మహత్త్వపూర్ణమైనవి. దీనిలో సందర్భానుకూలంగా ఆఖ్యానాలు వున్నవి. యాజ్ఞవల్క్యుడు ఈ ఉపనిషత్తులో ప్రధాన ఉపదేష్ట. ఆరుణి, సత్యకామ, రైక్వులకు సంబంధించిన కథలెన్నో దార్శనిక రహస్యాలను బోధిస్తున్నవి.

## బృహదారణ్యకోపనిషత్తు

ఇది పరిమాణంలోనేకాక తత్త్వజ్ఞాన ప్రతిపాదనలోను గంభీరమైంది. ప్రామాణికమైంది.

ఇది ప్రాచీనమైన ఉపనిషత్తుల్లో ఒకటి. దీనిలో 6 అధ్యాయాలున్నవి. శుక్లయజుర్వేదం యొక్క శతపథ బ్రాహ్మణంలోని చివరి 6 అధ్యాయాలకే బృహదారణ్యకోపనిషత్తు అని పేరు. పేరును బట్టే ఇది ఆరణ్యక, ఉపనిషత్తులు - రెండూ చేరివున్న గ్రంథమని తెలుస్తున్నది. అంతేగాక, బృహదాకారం కలదని కూడ తెలుస్తున్నది. ఆరణ్యక భాగం కన్న దీనిలో ఉపనిషద్భాగం ఎక్కువ. సృష్టి, బ్రహ్మతత్త్వాలను గూర్చిన చర్చలు దీనిలో వున్నవి. సందర్భానుకూలంగా చక్కని ఆఖ్యానాలున్నవి. మొదటి అధ్యాయంలో మృత్యువు సమస్త వస్తువులను ఆక్రమించటం, ప్రాణంయొక్క శ్రేష్ఠత, సృష్టి విషయ సంబంధి విషయాలు చర్చింపబడినవి. రెండవ అధ్యాయంలో గార్గ్య, కాశిరాజు అజాత శత్రువుల సంవాదమున్నది. దీనిలోనే యాజ్ఞవల్క్యుడు, అతని ఇద్దరు భార్యలు - కాత్యాయని, మైత్రేయిలకు సంబంధించిన కథ వున్నది. మూడవ అధ్యాయంలో జనకుని సభలో యాజ్ఞవల్క్యుడు బ్రహ్మవాదులను జయించే వృత్తాంతమున్నది. నాల్గవ అధ్యాయంలో జనకుడు యాజ్ఞవల్క్యుని నుంచి తత్త్వజ్ఞానాన్ని పొందే వృత్తాంతమున్నది. ఐదవ అధ్యాయంలో నీతి, సృష్టి, పరలోక విషయ సంబంధమైన దార్శనిక చర్చలున్నవి. ఆరవ అధ్యాయంలో ప్రవహణ, జైబలి, శ్వేతకేతు, ఆరుణేయుల సంవాదమున్నది.

## శ్వేతాశ్వతరోపనిషత్తు

కృష్ణయజుర్వేదం యొక్క శ్వేతాశ్వతర బ్రాహ్మణంలోని భాగమే శ్వేతాశ్వతరోపనిషత్తు. దీనిలో 6 అధ్యాయాలున్నవి. దీనిలో శైవధర్మ ప్రతిపాదన కన్పిస్తున్నది. 2-5 అధ్యాయాలల్లో శైవ, సాంఖ్య సిద్ధాంతాలు ప్రతిపాదింపబడినవి. చివరి అధ్యాయంలో భక్తితత్త్వం నిరూపింపబడింది. మొదటిసారిగా ఈ ఉపనిషత్తులోనే భక్తితత్త్వం నిరూపింపబడటం గమనింపదగింది. ఎన్నో తాత్త్విక విషయాలు సరళసుందరంగా చెప్పబడినవి.

## కౌషీతక్యుపనిషత్తు

ఋగ్వేదం యొక్క కౌషీతకీబ్రాహ్మణంలోని భాగమే కౌషీతక్యారణ్యకం. ఈ అరణ్యకంలో 15 అధ్యాయాలున్నవి. ఈ అరణ్యకంలోని మూడవ, ఆరవ అధ్యాయాలకే కౌషీతక్యుపనిషత్తు అని పేరు. దీనికి కౌషితకీబ్రాహ్మణోపనిషత్తు అని కూడ పేరు. కౌషితకి అన్న ఋషి ఈ గ్రంథంలో ఉపదేష్ట ఆకారంలో ఇది బృహదారణ్యక ఛాందోగ్యోపనిషత్తుల తర్వాతి స్థానాన్ని ఆక్రమిస్తుంది. దీనిలో 4 అధ్యాయాలున్నవి. జీవ చైతన్యాల తత్త్వం, బ్రహ్మవిద్య దీనిలో ప్రతిపాదింప బడినవి.

# ఉపనిషత్తులు - పాశ్చాత్యులు

క్రీ.శ. 1640లో షాజహాన్ చక్రవర్తి కొడుకు దారాషికోహ్ కాశ్మీర యాత్రకు పోయినప్పుడు అక్కడ అతడు ఉపనిషత్తులను గూర్చి విన్నాడు. తర్వాత అతడు వాటిని అధ్యయనం చేసాడు. ఖురాన్ చదివిన తర్వాత అతని హృదయంలో ఎన్నో సందేహాలు ఉద్భవించినవి. ఆ సందేహాలకు సమాధానాలు వెతుకుతూ అతడు బైబిల్ మొదలైన మతగ్రంథాలను చదివాడు. కాని ఎక్కడా అతనికి వాటి సమాధానాలు దొరకలేదు. చివరకు అతనికి ఉపనిషత్తుల పఠనంతో సరియైన సమాధానాలు దొరికినవి. ఖురాన్‌లో అవ్యాఖ్యాతమైన గూఢ తత్త్వ రహస్యాలకు సమాధానాలు ఉపనిషత్తుల్లోనే వున్నవని, ఖురాన్‌లో పేర్కొనబడిన "కితాబిల్ మక్నునిన్" - (మరుగునవున్న పుస్తకం) ఉపనిత్తులే అని దారాషికోహ్ తన ఉపనిషత్తుల ఫారసీ భాషానువాదం పీఠికలో చెప్పి వున్నాడు. అతడు 50 ఉపనిషత్తులను "సిర్ర-ఏ-అక్బర్" (మహాన్ రహస్యం) అనే పేరుతో ఫారసీ భాషలోకి అనువదించాడు. ఈ అనువాదం ఇప్పుడు లభిస్తున్నది. దీనిలోని ఫారసీభాషా శైలి సరళంగా వున్నదని, విషయ వివరణ సుబోధకంగా చేయబడి ఉదాత్తంగా వున్నదని మున్షీ మహేశ్వరప్రసాద్ తెలిపివున్నాడు. క్రీ.శ. 1657లో కాశిలో రాజప్రతినిధిగా వున్నప్పుడు దారాషికోహ్ 50 ఉపనిషత్తులను అక్కడి పండితుల సహాయంతో ఆరు నెలలు శ్రమించి అనువదించాడట. ఈ సమయంలోనే అతనికి జగన్నాథపండితునితో పరిచయమేర్పడి వుంటుంది. ఆ పండితుని దగ్గర శిక్షణ కూడ పొంది వుంటాడు. ఉపనిషత్కర్తలైన ఋషులకు దారా ఎంతో శ్రద్ధతో అభివాదం చేసాడు. దారా ఉపనిషత్తుల అనువాదగ్రంథాలచేత ముస్లిం ఫకీర్లు చాల ప్రభావితులైనారు. సూఫీమతంలోని అద్వైతభావానికి ఉపనిషత్తుల్లోని అద్వైతభావమే మూలమని చెప్పాలి. వివిధ మతసంప్రదాయాల్లో వుండే విభేదాలు ఉపనిషత్తుల్లోని తాత్త్వికాలోచనలో సమన్వయం కావడం చూస్తాం. ధార్మికైక్యతకు, సర్వమానవ తాత్త్విక చింతనకు నిదర్శనంగా నిలిచినవి ఉపనిషద్గ్రంథాలు.

క్రీ.శ. 1775 ప్రాంతంలో అయోధ్య నవాబు శుజావుద్దౌలా దగ్గర వున్న ఫ్రెంచ్ రెసిడెంటు ఎమ్. గెంటిల్ అనే ఆయన దారాషికోహ్ ఉపనిషత్తుల ఫారసీ భాషానువాద ప్రతిని ఫ్రాన్స్‌లో వుండే ఎంకెటిల్ డుపరే (Anquetial Duperron) అనే ఆయనకు పంపాడు. ఈ అనువాదప్రతి మరొకటి కూడ డుపరేకు దొరికింది. ఈ రెండు ప్రతులను ఆధారంగా పెట్టుకొని ఆయన దాన్ని ఫ్రెంచ్, లాటిన్ భాషల్లోకి అనువదించాడు. లాటిన్ అనువాదం "ఔపనేఖత్" (Oupnekhat) పేరుతో క్రీ.శ. 1801-2లో పారిస్‌నుంచి ప్రచురితమైంది. ఫ్రెంచ్ అనువాదం ప్రచురింపబడలేదు. లాటిన్ అనువాదం అసంపూర్ణంగా, అసమగ్రంగా

వున్నది. అయినా లాటిన్ అనువాదగ్రంథం ఎంతో మంది ఐరోపా విద్వాంసులను ఆకర్షించింది. వారిలో ప్రముఖుడు అర్థర్ షాపనౌవర్. ఆయన ఆ గ్రంథాన్ని చదివి గాఢ్గద్యాన్ని చెందినాడట! క్రీ.శ. 1808లో డుపరే లాటిన్ గ్రంథం జర్మన్ భాషలోకి అనువదింపబడింది. అది ఎంతో మంది జర్మన్ తత్త్వవేత్తలను ఆకర్షించింది. దానిచేత వారు చాల ప్రభావితులైనారు. వారి ఆలోచనాధార కొత్త మార్గాలను పట్టింది. ప్రాచ్యవిద్యలను వారు ఇంకా పరిశోధింపసాగారు. దీని అంతటిచేత ప్రభావితుడై రాజా రామ్‌మోహనరాయ్ క్రీ.శ. 1816-19 నడుమ కొన్ని ఉపనిషత్తులను ఇంగ్లీషులోకి అనువదించి మూల గ్రంథాలతో సహా ప్రచురించాడు. క్రీ.శ. 1820-30 నడుమ ఓథమర్ ఫ్రాంక్ అనే పండితుడు ఉపనిషద్గ్రంథాల సంక్షిప్త సంస్కరణను ప్రచురించాడు. జె.డి. లజుయినాస్ అనే ఆయన " భారతీయ భాష , వాఙ్మయం, ధర్మం, మరియు తత్త్వజ్ఞాన సంబంధి అన్వేషణ" అనే పేరుతో డుపరే లాటిన్ అను వాదాన్ని ఫ్రెంచ్ భాషలోకి అనువదించాడు.

క్రీ.శ. 1850, 1853ల్లో ప్రొఫెసర్ వేబర్ "ఇండిషె స్టుడియెన్" అన్న పుస్తకాన్ని ప్రచురించాడు. 17 భాగాలుగా ప్రచురింపబడిన ఈ పుస్తకంలో దారా షికోహ్ ఉపనిషత్తుల పారసీ అనువాదాలు సంపాదీకరింపబడి ప్రచురింపబడినవి. వీటిల్లో లాటిన్ అనువాదంలో వున్న లోపాలను ఎన్నిటినో వేబర్ ఎత్తి చూపాడు. క్రీ.శ. 19వ శతాబ్దంలో ఓటో బ్హోట్‌లింక్; ఆల్ఫ్రెడ్ హిల్లేబ్రాంట్, యోహన్నస్ హెర్టెల్, ఎడ్వర్డు రోయిర్ అనే జర్మన్ పండితులు ఉపనిషత్తులను అనువాదం చేసారు. పాల్ దయస్సన్ (క్రీ.శ. 1845-1919) ఉపనిషత్తుల విషయంలో చేసిన కృషి చెప్పుకోదగ్గది. ఆయన వాటి మీద మంచి అధికారం కలవాడు. అతడు 60 ఉపనిషత్తుల జర్మన్ అనువాదాలను క్రీ.శ. 1897లో ప్రచురించాడు. ఇది అనేక ముద్రణలను అందుకొని జర్మన్ దేశీయులకు ఆదరణయోగ్యమైంది. అంతేగాక క్రీ.శ. 1899లో "దీ ఫీలోసఫీ డెర్ ఉపనిషదన్" అన్న పుస్తకాన్ని దయస్సన్ రచించాడు. మాక్స్‌ముల్లర్ "సేక్రెడ్ బుక్స్ ఆఫ్ ది ఈస్ట్" అన్న గ్రంథమాలలో 12 ఉపనిషద్గ్రంథాలను ఆంగ్లానువాదాలతో ప్రకటించాడు. హెర్మన్ ఓల్డెన్‌బర్గ్ క్రీ.శ. 1915లో "దీ లెహెరే డెర్ ఉపనిషదన్ ఉండ్ దీ ఆన్‌షాఫుంగ్ డెస్ బుద్ధిజమున్" (The doctrine of the Upnishads and the beginings of Buddhism) అన్న పుస్తకాన్ని ప్రచురించాడు. క్రీ.శ. 1921లో ఆర్.ఇ.హ్యూబుమ్ సంపాదీకరించి ఆక్స్‌ఫర్డునుంచి మూల ఉపనిషద్గ్రంథాలను ప్రచురించాడు.

ఇక భారత దేశంలో రాజారామ్‌మోహనరాయ్ తర్వాత రాజా ద్విజేంద్రలాల్ మిశ్రా శాంకరభాష్యంతో పాటు 12 ప్రముఖమైన ఉపనిషద్గ్రంథాలను ఇంగ్లీషులోకి అనువదించి ప్రచురించాడు. శ్రీపాదకృష్ణవెల్వాల్కర్ ఆంగ్లానువాదంతో ఉపనిషత్తులను సంపాదీకరించి

ప్రచురించాడు. ఫారసీ భాషలోని ఉపనిషత్తులు ఉర్దూ భాషలోకి "అలగ్ ప్రకాశ్" పేరుతో అనువదింపబడినవి. ఈవిధంగా దారా షికోహ్ ఉపనిషత్తుల అనువాదంచేత ఉపనిషద్జ్ఞానం యూరోపు పండితులను, తత్త్వవేత్తలను ఆకర్షించి, ప్రభావితులను చేసి, ప్రపంచ వ్యాప్తిని పొందింది.

## వేదాంగాలు

వైదిక కర్మకలాపాలను ప్రతిపాదించే సంహిత, బ్రాహ్మణ, ఆరణ్యక గ్రంథాలను, ఇంకా బ్రహ్మ విద్యను బోధించే ఉపనిషత్తులను తెలుసుకోవటంలో ఉపయోగపడేవి వేదాంగాలు. 'అంగ' శబ్దానికి 'ఉపకారక'మని అర్థం. "అంగ్యంతే జ్ఞాయంతే, అమూభిరితి అంగాని" - ఒక వస్తు స్వరూపాన్ని తెలుసుకోవటానికి సహాయపడేవని అర్థం. వేదాల భాష, భావాలు, విషయాలు రానురాను దురూహ్యాలైనవి. వేదార్థాలను, తత్ప్రతిపాదిత కర్మకాండలను గ్రహించటానికి ప్రత్యేకంగా శాస్త్ర గ్రంథాల సృష్టి జరిగింది. ఆ శాస్త్ర గ్రంథాలకే వేదాంగాలని పేరు. వేదాంగాలు వేదాలను సరియైన మార్గంలో అర్థం చేసుకోవటానికి పుట్టినవని చెప్పవచ్చును. దుర్గ్రాహ్యాలైన వేదాలను ఇష్టంవచ్చినట్లుగా వ్యాఖ్యానం చెప్పగలిగే పరిస్థితి ఏర్పడింది. అందుకని వాటి సరియైన అర్థ నిర్ణయానికి వేదాంగ సాహిత్యం ఋషుల చేత సృష్టింపబడింది. వేదాంగాలు ఆరు- శిక్ష, కల్పం, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం. ఋష్యాశ్రమాలల్లో వేదాల అధ్యయన, అధ్యాపన క్రియలకు సహాయకంగా ఈ వేదాంగాలు సృష్టింపబడినవి. వేదాలను చదివి వాటి అర్థాలను చెప్పటానికి క్రమంగా ఈ షట్వేదాంగాల అధ్యయనం అవసరమైంది. వేదాంగాలను గూర్చిన ప్రసక్తి మనకు గోపథబ్రాహ్మణం, బౌధాయనధర్మసూత్రం, గౌతమ సూత్రం, రామాయణాదుల్లో కన్పిస్తున్నది. దీన్ని బట్టి వేదాంగాలు కేవలం అర్వాచీన గ్రంథాలనే అభిప్రాయం నిలవటంలేదు. విషయం, భాష, ఆలోచనా పద్ధతుల్లో ఒక విశిష్టతను ఈ షట్ వేదాంగాలు సంతరించుకొన్నవి. వేదాలకు, వీటికి విషయం భాషల దృష్టితో పరిశీలించినట్లయితే కాలభేదం చాల వున్నదని చెప్పకతప్పదు. మంత్రసంహితల నుంచి ఉపనిషత్తుల వరకు గల సాహిత్యం వైదిక సాహిత్య మనబడుతుంది. కాని అట్లాకాక మంత్రసంహితల నుంచి వేదాంగాల వరకు గల సాహిత్యాన్నంతా వైదిక సాహిత్య మనవచ్చును. అప్పుడు వైదిక సాహిత్యాన్నంతా రెండు యుగాలుగా విభజించవచ్చును. పూర్వ వైదికయుగం, ఉత్తర వైదిక యుగం. పూర్వ వైదిక యుగంలో ఉపనిషత్తుల వరకు గల సాహిత్యాన్ని తీసుకోవాలి. అప్పుడు వేదాంగ సాహిత్యాన్నంతా ఉత్తరవైదికయుగంగా చెప్పవచ్చును. బ్రహ్మస్వరూపమైన వేదాలకు ఆరు వేదాంగాలు ఆరు శరీరాంగాలవంటివని పాణిని పేర్కొన్నాడు. ఆ వేద

భగవానునికి శిక్ష ముక్కు, కల్పసూత్రాలు చేతులు, వ్యాకరణం నోరు, నిరుక్తం చెవులు, ఛందస్సు కాళ్ళు, జ్యోతిషం కండ్లు.

## శిక్ష

మంత్రాలను ఉచితమైన రీతిలో సక్రమంగా ఉచ్చరించటానికి శిక్షా గ్రంథాలు సృష్టించబడినవి. వైదిక యజ్ఞయాగాదులను వివరించటానికి ఎట్లా అయితే బ్రాహ్మణ గ్రంథాలు ఏర్పడినవో అదే విధంగా వైదిక సాహిత్యాన్ని అధ్యయన అధ్యాపన సమయంలో పాటించవలసిన ఉచ్చారణ విధిని చెప్పటానికి శిక్షాగ్రంథాలు ఏర్పడినవి. సంస్కృతంలో ఒక్కొక్క శబ్దానికి శాస్త్రీయమైన వ్యుత్పత్త్యర్థం సాధింపబడి ఎట్లా నిర్ణయింబపడిందో అదేవిధంగా ఉచ్చారణ; ఉచ్చారణస్థానాలు శాస్త్రీయ పద్ధతిలో నిర్ణయింపబడినవి. సమస్త సంస్కృత సాహిత్యంలో శబ్దోచ్చారణకు మహత్తత వున్నది. వేదాలల్లో శబ్ధోచ్చారణకే కాక స్వర ప్రక్రియకు కూడ మహత్తత ఇయ్యబడింది. వేదపాఠం చేసేటప్పుడు నిర్దుష్ట శబ్దోచ్చారణ, స్వరప్రక్రియ పాటింపబడటం అవసరం. ఉచ్చారణ స్ఖాలిత్యం, స్వరభ్రష్టత వల్ల అనేక అనర్థాలు కలుగుతాయని ప్రాచీనుల విశ్వాసం. అందుకే ఉచ్చారణకు, స్వరప్రక్రియకు చాల ప్రాధాన్యమున్నది. కాబట్టి వాటిని గురించి చెప్పే శిక్షాశాస్త్రం యొక్క ఆవశ్యకత ఏర్పడింది. గురువు ఏ పద్ధతిలో మంత్రాన్ని ఉచ్చరిస్తాడో అదే పద్ధతిలో శిష్యుడు అనుసరిస్తు ఉచ్చరించాలి. అందుకే వేదాలకు 'అనుశ్రవః' అని పేరు. అనుశ్రవః- "అనుపశ్చాత్ శ్రూయతే యః స అనుశ్రవః" - అంటె " గురువు యొక్క ఉచ్చారణానంతరం దాన్ని అనుసరించి వినబడునది" అని అర్థం. లిపిబద్ధమైన గ్రంథాల ఆధారంగా వేదపఠనం అందుకే నిందాపాత్రంగా పరిగణింపబడింది.

వేద పఠనానికి స్వరజ్ఞానం చాల అవసరం. స్వరాలు మూడు - ఉదాత్త, అనుదాత్త, స్వరితములు. ఉదాత్తస్వరం ఉచ్చైస్వరంతో ఉచ్చరింపబడుతుంది. పాణిని అందుకే దాన్ని "ఉచ్చైరుదాత్తః" అని అన్నాడు. అనుదాత్తస్వరం తక్కువ స్వరంలో ఉచ్చరింపబడుతుంది. స్వరితస్వరం ఉదాత్త అనుదాత్త స్వరాలకు నడుమ ఉచ్చరింపబడుతుంది. "నీచైరనుదాత్తః, సహాహారః స్వరితః' , అని పాణిని లక్షణం చెప్పినాడు. స్వర నియమాన్ని (Phonology) ఇంత శాస్త్రీయంగా ఎక్కడా, ఎవరూ చెప్పలేదు. వేద శబ్దాలకు అర్థాలను నిర్ణయించటానికి స్వర నియమం చాల ముఖ్యం. స్వరంలో కొద్ది భేదం చేత అర్థంలో పూర్తిగా భేదమనేది రావచ్చును. దానివల్ల యజ్ఞ యాగాలల్లో గొప్ప అనర్థం ఏర్పడవచ్చును. దీన్ని గురించి ఒక కథ చాలా ప్రసిద్ధమైంది వున్నది-వృత్రుడు తన శత్రువైన ఇంద్రుని వినాశాన్ని కోరి ఒక యజ్ఞాన్ని చేయదలచాడు. దానికి కావలసిన ఋత్విజాలను పిలిచాడు. యజ్ఞంలో ప్రధాన

మంత్రం "ఇంద్రశత్రుర్వర్ధస్వ" అంటే ఇంద్రుని యొక్క శత్రువు విజయాన్ని పొందుగాక! అని అర్థం. 'ఇంద్రశత్రుః' అంతోదాత్త స్వరంలో ఉచ్చరింపబడినప్పుడే 'ఇంద్రస్యశత్రుః' అని షష్ఠీ తత్పురుష సమాసం సాధింపబడుతుంది. కాని ఋత్విజుల అజాగ్రత్త వల్ల అంతోదాత్తంగా కాక ఆదిఉదాత్తంగా ఉచ్చరింపబడింది. ఈ స్వర పరివర్తనవల్ల ఆ శబ్దం తత్పురుష సమాసం కాక బహువ్రీహిగా ఏర్పడింది. అప్పుడు దాని అర్థం " ఇంద్రః శత్రుః యస్య" అంటే, "శత్రువైన ఇంద్రుడు" అని అర్థం ఏర్పడింది. దానివల్ల యజ్ఞ యజమాని వృత్రునికే వినాశం సంభవించింది-

మంత్రోహీనః స్వరతో వర్ణతో వా
మిథ్యా ప్రయుక్తో న తమర్థమాహ
స వాగ్వజ్రోయజమానం హిన స్తి
యంథేంద్రశత్రుః స్వరతో஽పరాధాత్ - పా.శి. 52 శ్లో.

శిక్షా శాస్త్రాల సంఖ్యను ఇప్పుడు నిర్ణయించి చెప్పటం కష్టం. మహాభారతం శాంతి పర్వంలో గాలవ విరచిత శిక్షాశాస్త్ర ప్రసక్తి వున్నది. దాని ప్రసక్తి పాణిని అష్టాధ్యాయిలో కూడ వున్నది. కాని అది అలభ్యం. రెండవది భారద్వాజ శిక్షా శాస్త్రం. దీనికి నాగేశభట్టు టీకను కూడ వ్రాశాడు. ఇది ప్రచురితమై లభిస్తున్నది. మూడవది చారాయణీయ శిక్ష. దీన్ని చారాయణుడు వ్రాశాడని ప్రతీతి. పాణినికి పూర్వుడైన ఆపిశలి వ్రాసిన శిక్షాశాస్త్రాన్ని గూర్చిన ప్రసక్తి రాజశేఖరుని కావ్యమీమాంసలో, వృషభదేవుని వాక్యపదీయటీకలోను వున్నది. ఆపిశలుని శిక్షాశాస్త్రంలో ఎనిమిదవ ప్రకరణంలో 23వ సూత్రంలోని చాలా భాగాన్ని హేమచంద్రుడు శబ్దానుశాసనంలో ఉద్ధరించి వున్నాడు. ఇది ప్రచురితమై లభిస్తున్నది. శౌనకీయ శిక్షాశాస్త్రం మరొకటి. ఇది మద్రాసు అడయారు లైబ్రరీలో వున్నది. శిక్షాశాస్త్ర గ్రంథాలల్లో పాణినీయ శిక్షాశాస్త్ర గ్రంథం ప్రముఖమైంది. పాణినీయ శిక్షాశాస్త్రం పాణిని విరచిత శిక్షా సూత్రాల మీద ఆధారపడింది. గ్రంథం చివర దాక్షీపుత్ర అని పేర్కొనబడింది. దాన్ని బట్టి ఇది వ్యాకర్త పాణిని వ్రాసిందని ప్రసిద్ధికెక్కింది. పాణిని శిష్యప్రశిష్యవర్గానికి చెందిన వైయాకరణుడెవరో వ్రాసి వుంటాడని బలదేవ ఉపాధ్యాయ అభిప్రాయం. దీనికి అనేక టీకలున్నవి. పుస్తకం చిన్నదైనా విషయ దృష్టితో చాల మహత్త్వపూర్ణమైంది. చంద్రగోమి పాణిని తర్వాతివాడు. పాణిని అష్టాధ్యాయి ఆధారంగా అతడు వ్యాకరణాన్ని కూడ వ్రాశాడు. అదే,విధంగా పాణినీయ శిక్షా సూత్రాలను ఆధారంగా పెట్టుకొని శిక్షా సూత్రాన్ని కూడ వ్రాశాడు. నారదీయ శిక్ష సామవేద స్వరాలను గూర్చి తెలుసుకోవటానికి చాల ఉపకరిస్తుంది. సామవేదానికి ఇంకా గౌతమీ శిక్ష, లోమశీ శిక్షలు వున్నవి. ఇవి చాల చిన్నవి. మాండుకీ శిక్ష అథర్వ వేదానికి సంబంధించింది. దీనిలో 179 శ్లోకాలున్నవి.

అథర్వవేద స్వరవర్ణాల వివేచన దీనిలో చక్కగా వున్నది. నాలుగు వేదాలకు వేరు వేరు శిక్షాగ్రంథాలు వుండేవి. ఆ వేదాల మంత్రోచ్చారణ విధులు, స్వర ప్రక్రియలు వీటిల్లో చెప్పబడినవి. ప్రత్యేక వేదానికి ప్రత్యేకమైన ఉచ్చారణా పద్ధతి వుండేది. మూర్ధన్య 'ష' శుక్ల యజుర్వేదంలో రేఫయుక్తంగా ఊష్మవర్ణంతో కూడి 'ఖ' లాగ ఉచ్చరింపబడుతుంది. ఇతర వేదాలల్లో మూర్ధన్యంగానే వున్నది. ఉదా॥కు 'సహస్ర శీర్షాపురుషః'' అన్న ఋగ్వేదంలోని మూర్ధన్య 'ష' మాధ్యందిన సంహితలో 'సహస్ర శీర్ఖా పురుఖః'' అని ఉచ్చరింపబడుతుంది. ఉచ్చారణ భేదాలు వుండటంచేత తప్పక ఒక్కొక్క సంహితకు వేరువేరు శిక్షా శాస్త్ర గ్రంథాలు ఏర్పడినవి. కాని అన్ని గ్రంథాలు ఇప్పుడు లభించడం లేదు. పైన చెప్పిన శిక్షా గ్రంథాలే కాక ఇంకా ప్రచురితమైన శిక్షా గంౖథాలు కొన్ని వున్నవి. యాజ్ఞవల్క్యశిక్ష - ఇది శుక్ల యజుర్వేదానికి సంబంధించింది. ఇంకా శుక్ల యజుర్వేదానికి వాసిష్ఠీ శిక్ష. మాండవ్య శిక్ష గ్రంథాలున్నవి. వాసిష్ఠీ శిక్షానుసారం శుక్లయజుర్వేదంలో ఋగ్వేదమంత్రాలు 1437, యజుస్సులు 2823 వున్నవి. కేవలం ఓష్ఠ్య వర్ణాలను గూర్చిన చర్చ మాండవ్య శిక్షలో వున్నది. కాత్యాయని శిక్షలో 13 శ్లోకాలు మాత్రం వున్నవి. పారాశరీ శిక్షలో 160 శ్లోకాలున్నవి. అమోఘనందిని శిక్షలో 130 శ్లోకాలున్నవి. మాధ్యందిన శిక్షలో కేవలం ద్విత్వవర్ణాల నియమాలు చర్చింప బడినవి. వర్ణరత్నప్రదీపికలో 227 శ్లోకాలున్నవి. కేశవీశిక్షను ఆస్తీక గోత్రజుడు కేశవదైవజ్ఞుడు వ్రాశాడు. స్వరాంకుశ శిక్షను జయంతస్వామి వ్రాశాడు. దీనిలో 25 శ్లోకాలున్నవి. రామకృష్ణ విరచిత షోడశశ్లోకి శిక్ష. ప్రాతిశాఖ్య ప్రదీపశిక్ష, క్రమసంధాన శిక్ష, గలదృక్ శిక్ష, మనఃస్వరశిక్ష గ్రంథాలు ప్రచురితమైనవి. ప్రచురణకు నోచుకోని శిక్షాగ్రంథాల లిఖితప్రతులెన్నో గ్రంథాలయాలల్లో పడివున్నవి. శిక్షాగ్రంథాలల్లో ఆధునికమైనవి కూడ వున్నవి. ఉదా॥కు మల్లశర్మ శిక్ష క్రీ.శ. 1724 నాటిదని తేది ఇయ్యబడింది.

శిక్షా శాస్త్రంలో వర్ణ్య విషయాలు ఆరు వున్నవి. అవి - వర్ణ, స్వర, మాత్ర, బల, సామ, సంతానాలు. వర్ణాలనగా అక్షరాలు. పాణిని అనుసారం సంస్కృతంలో 64 వర్ణాలున్నవి. స్వరాలనగా ఉదాత్త , అనుదాత్త, స్వరిత స్వరాలు. మాత్రలనగా స్వరోచ్చారణలో పట్టేకాలం. హ్రస్వోచ్చారణకు ఒక మాత్ర కాలం, దీర్ఘోచ్చారణకు రెండుమాత్రల కాలం, ప్లుతోచ్చారణకు మూడు మాత్రల కాలం పడ్తుంది. బలమనగా స్వరోచ్చారణ సమయంలో వాయువు ముఖంలో తగిలి ఏ స్థానం నుంచి బయటికి వస్తుందో ఆ స్థానం. అక్షరాలను ఉచ్చరించేటప్పుడు చేసే ప్రయత్నాన్ని ప్రయత్నమంటారు. ఇది రెండు రకాలు - అభ్యంతరం, బాహ్యం. దోషరహితంగా మధురంగా ఉచ్చరించటం సామం. పదాల కలయిక అంటే స్వతంత్ర అస్తిత్వం గల పదాలు శ్రీఘ్రంగా ఉచ్చరింపబడినప్పుడు సంధిరూపంలో ఉచ్చరింపబడటమే సంతానం. వ్యాకరణ శాస్త్రంలోనే

దీనిగూర్చి విశదంగా చెప్పబడి వున్నది. కాబట్టి శిక్షాశాస్త్రంలో దీన్ని గూర్చి ఎక్కువ లేదు. శిక్షా గ్రంథాల పరిశీలనలవల్ల ప్రాచీనకాలంలోనే ఋషులు భాషాశాస్త్ర సంబంధి విషయాలను ఎన్నిటినో శాస్త్రీయ పద్ధతిలో ఆలోచించి కూర్చారని తెలుస్తున్నది. ఉచ్చారణవిద్య (Phonology) ను గూర్చి ఆనాడే శాస్త్రీయ పద్ధతిలో ప్రాచీన పండితులు ఆలోచించారు. వేద మంత్రాల ఉచ్చారణ భారతదేశమంతటా ఒక్క తీరుగా వున్నదంటే, కాలానుగుణంగా మార్పు చెందలేదంటే మన ఋషులు ఏర్పరిచిన ఉచ్చారణ నియమాలే కారణం. కఠినమైన నియమాలకు లోనై ప్రాచీనులు వేదాలను దైవికమైన పవిత్ర రూపాలుగా ఆరాధించారు. వేదోచ్చారణలో ఏకాస్త తప్పు అయినా దాని ఫలితంగా కఠినమైన శిక్షను అనుభవిస్తామని వారు నమ్మారు. ఆ నియమపాలన, ఆరాధన రూపమైన దీక్ష ప్రశంసనీయమైనవి. అందుకే దీక్ష నియమపాలనలు లేనివారు వేదాలను చదువకూడదనే నియమాన్ని ప్రాచీనులు చాల కఠినంగా ఏర్పరిచారు. వేదోచ్చారణ విషయంలో శిక్షాశాస్త్రాల ప్రాధాన్యం చాల వున్నది.

## ప్రాతిశాఖ్య గ్రంథాలు

శిక్షాగ్రంథాలకు అంగరూపంగా ప్రాతిశాఖ్యలు సృష్టింపబడినవి. ఉచ్చారణ, స్వరవిధానం, సంధివిధానం, హ్రస్వ దీర్ఘ విధానాలు - మొదలైన విషయాలను గూర్చి ప్రాతిశాఖ్య గ్రంథాలు చర్చిస్తున్నవి. సంస్కృత భాషా వ్యాకరణశాస్త్రారంభం ప్రాతిశాఖ్యలతోనే జరుగుతున్నది. పూర్తిగా వ్యాకరణ గ్రంథాలు కాకున్నా అనేక వ్యాకరణసంబంధి విషయాలను అవి చర్చిస్తున్నవి. ప్రాచీనకాలంలోని అనేక వైయాకరణుల పేర్లు వారి అభిప్రాయాలు ఈ గ్రంథాలల్లో పేర్కొనబడినవి. వ్యాకరణ సంబంధమైన సమస్త పారిభాషిక పదజాలం వీటిల్లో వున్నది.

ఒక్కొక్క సంహితకు వేరువేరు ప్రాతిశాఖ్య గ్రంథాలున్నవి. ఋక్ ప్రాతిశాఖ్య ప్రాచీనమైన వాటిల్లో ఒకటి. దీనికి పారిషదసూత్రమని కూడా పేరు. శౌనకుడు దీని రచయిత అని ప్రసిద్ధి-పార్షద లేక పరిషత్తులో ప్రచారం చేయబడేది కాబట్టి దీనికి పారిషద సూత్రమని పేరు వచ్చింది. ఇది పద్యబద్ధమై సూత్రరూపంలో వున్నది. స్వర, వర్ణ, వ్యంజనాదులను గూర్చిన విశిష్టమైన చర్చలు దీనిలో వున్నవి. వాజసనేయి ప్రాతిశాఖ్య శుక్లయజుర్వేదానికి చెందింది. దీని రచయిత కాత్యాయనుడు. వార్తికకారుడు కాత్యాయనుని కన్న ఇతడు భిన్నమైనవాడు. ఈ కాత్యాయనుడు పాణిని కన్న ప్రాచీనుడు. స్వరశబ్ద వివేచనలు దీనిలో చక్కగా చేయబడినవి. దీనిలో ప్రయోగింపబడిన పారిభాషిక పదాలను పాణిని గ్రహించి అష్టాధ్యాయిలో ప్రయోగించుకొన్నాడు. ప్రతిజ్ఞా, భాషిక సూత్రగ్రంథాలు దీనికి పరిశిష్ట గ్రంథాలు. తైత్తిరీయ ప్రాతిశాఖ్య, తైత్తిరీయ సంహితకు చెందింది. దీనిలో

24 అధ్యాయాలున్నవి. వర్ణ, స్వర, శబ్దవివేచనలు వ్యవస్థిత రూపంలో చర్చింపబడినవి. ఇక సామవేదానికి చెందిన ప్రాతిశాఖ్యల్లో ప్రధానమైనవి, ప్రచురితమై లభించేవి - పుష్పసూత్రం, ఋక్ తంత్రం. పుష్పసూత్ర రచయిత పుష్పఋషి. సామవేదంలోని గానోపయోగి మంత్రాలను గూర్చిన వివేచన వీటిల్లో వున్నది. ఋక్తంత్ర రచయిత శాకటాయనుడు. యాస్క, పాణినులు శాకటాయనుని స్మరించివున్నారు. వర్ణోచ్చారణ, అక్షర పరివర్తనం, సంధి విధానాలు దీనిలో చర్చింపబడినవి. భట్టోజి దీక్షితుడు తన శబ్దకౌస్తుభంలో దీని రచయితగా ఔద్రవ్రజిని పేర్కొన్నాడు. ఒకవేళ శాకటాయన అన్నది గోత్ర నామం, ఔద్రవ్రజి అన్నది వ్యక్తినామం కావచ్చును. అథర్వవేదీయ ప్రాతిశాఖ్యలు - శౌనకీయ చతురధ్యాయిక. అథర్వవేద ప్రాతిశాఖ్య సూత్రం. శౌనకీయ ప్రాతిశాఖ్యను అమెరికన్ సంస్కృత పండితుడు డా. విట్నీ ఇంగ్లీషు అనువాదంతో ప్రకటించాడు. ఆ ప్రచురిత ప్రతిలో తత్కర్తగా శౌనకుడని చెప్పబడటంచే ఈ ప్రాతిశాఖ్యకు అదే పేరు ప్రసిద్ధమైంది. వారణాసిలో లభించిన ప్రతిలో దానిపేరు కౌత్సవ్యాకరణమని వున్నది. కాబట్టి దీని రచయిత కౌత్సుడు కావచ్చును. పాణిని శిష్యుడు కౌత్సుడు మహాభాష్యంలో పేర్కొనబడినాడు. అథర్వవేద ప్రాతిశాఖ్యసూత్ర గ్రంథం చాల చిన్నది. దీనిది ఒక బృహత్సారం క్రీ.శ. 1940లో లాహోర్ నుంచి ప్రచురితమైంది.

## కల్పసూత్ర గ్రంథాలు

వేదాంగ సాహిత్యంలో కల్పసూత్ర గ్రంథాలకు ప్రముఖమైన స్థానమున్నది. ఇవి అతి ప్రాచీనమైన గ్రంథాలుగా చెప్పబడుతున్నవి. వైదిక సాహిత్యానికి ఇవి సమకాలికమైన రచనలని, కాబట్టి ఇవి దానిలోనే చేరాలనే అభిప్రాయాన్ని కూడ పండితులు వెలిబుచ్చారు. కాని వేదాలు అపౌరుషేయాలుగా, వేదాంగాలు పౌరుషేయాలుగా పరిగణింపబడటంవల్ల ఇది సాధ్యం కాదు. బ్రాహ్మణ గ్రంథాలల్లో యజ్ఞ యాగాదుల వివరణ విస్తృతంగా, ప్రౌఢంగా వున్నది. కాని రాను రాను ఈ వివరణ కూడ కఠినంగా, దుర్గమంగా ఏర్పడింది. కాలక్రమంగా వాటిని క్రమబద్ధం చేయవలసిన అవసరం ఏర్పడింది. ఆ ఉద్దేశంతో వ్రాయబడినవే కల్పసూత్ర గ్రంథాలు "కల్పో వేదవిహితానాం కర్మణామానుపూర్వ్యేణ కల్పనాశాస్త్రమ్" - వేదవిహితమైన కర్మలను క్రమబద్ధంగా వ్యవస్థిత రూపంలో కల్పన చేసే శాస్త్ర గ్రంథాలని అర్థం. యజ్ఞయాగాదులను, వివాహ ఉపనయనాది కర్మలను, నియమాలను అవసరమైన మంత్రాల పూర్వకంగా ప్రతిపాదించేవి కల్పగ్రంథాలు. ఇవి ఋత్విజుల ఉపయోగార్థం బయలుదేరినవి. ఇవి సూత్రరూపంలో వుండటంచేత విపులమైన వేదవిధులను కంఠస్థం చేయటానికి సులభమైంది. తక్కువ శబ్దాలల్లో ఎక్కువ అర్థాన్ని

బోధించటమే సూత్రం యొక్క ప్రయోజనం. విషయ దృష్టితోనే కాక స్వరూపం, భాషల దృష్టితోను ఈ గ్రంథాలు మహత్త్వపూర్ణమైనవి. 'సూత్ర' పద్ధతిలో విషయాన్ని చెప్పటం ప్రపంచంలో ఒక విశిష్టమైన పద్ధతి. దాన్ని అతి ప్రాచీన కాలంలోనే సాధించిన ఘనత భారతీయులకు దక్కుతుంది. భాషాదృష్టితో పరిశీలించినట్లయితే వీటిల్లోని భాష వైదికభాషకన్నా భిన్నంగా వున్నది. లౌకిక భాషాభివృద్ధి కల్ప గ్రంథాలతోనే ఆరంభమైందని చెప్పాలి. అందుకే విషయం. భాష, శైలి, ఆలోచనా విధానం - వీటన్నిటిని పరిశీలించి నట్లయితే కల్పసూత్ర గ్రంథాలు సంస్కృతంలో ఒక విశిష్టమైన స్థానాన్ని కలిగివున్నవి. అందుకే సామాన్యంగా సూత్రగ్రంథాల రచనాకాలాన్ని సూత్రయుగంగా ప్రత్యేకంగా పరిగణించటం జరుగుతున్నది. మొత్తం సూత్రగ్రంథాలను నాలుగు విభాగాలుగా చేయవచ్చును-

1. **శ్రౌతసూత్రాలు:-** బ్రాహ్మణ గ్రంథాలల్లో చెప్పబడిన కర్మకాండలు సార రూపంగా వీటిల్లో చెప్పబడినవి. శ్రుతి ప్రతిపాదితమైన 14 యజ్ఞాలను ఇవి వివరిస్తున్నవి.

2. **గృహ్యసూత్రాలు :-** వీటిల్లో గార్హస్థ్య జీవిత సంబంధమైన విధి విధానాలు చెప్పబడినవి. గర్భాధానం మొదలుకొని అంత్యేష్టివరకు గల గృహస్థ జీవిత సంబంధమైన కర్మకలాపాలు, వాటి విధానాలు వీటిల్లో వివరింపబడినవి. ఏడు విధాలైన గృహయజ్ఞాలు అంటే - పితృ, పార్వణ, అష్టిక, శ్రావణి, ఆశ్వాయుజి, ఆగ్రహాయణేయ, చైత్రీ యజ్ఞాలు వివరింపబడినవి. ఇవిగాక దేవ, భూత, పితృ, మహా, మనుష్య అనే పంచమహాయజ్ఞాలను గూర్చి చెప్పబడింది. వీటిల్లో గృహనిర్మాణం, గృహప్రవేశం, ప్రయాణ ముహూర్తాలు మొదలైన వెన్నో వివరింపబడినవి.

3. **ధర్మ సూత్రాలు:-** చాతుర్వర్ణ్యాశ్రమాలు వీటిల్లో వివరింపబడినవి. రాజు పాటించవలసిన కర్తవ్యాలు కూడ చెప్పబడినవి.

4. **శుల్వ సూత్రాలు:-** యజ్ఞవేదుల నిర్మాణ పద్ధతులు వీటిలో చెప్పబడినవి. ప్రాచీన భారతీయులు జ్యామితి విద్యలో సాధించిన జ్ఞానాన్ని వీటిల్లో చూడవచ్చును.

## శ్రౌత గృహ్య సూత్రగ్రంథాలు

శ్రుతుల్లో ప్రతిపాదింపబడిన-దర్శ, పూర్ణమాస, పితృపిండ ఆగ్రయణేష్టి, చాతుర్మాస్య, నిరూఢపశు, సోమ, సత గవామయన, వాజపేయ, రాజసూయ, సౌత్రామణి, అశ్వమేధ, పురుషమేధ, ఏకాహయాగ, అహీన- అనే యాగకర్మలు క్రమబద్ధంగా వీటిల్లో వివరింపబడినవి.

ధార్మిక దృష్టితో పరిశీలించినట్లయితే ఈ గ్రంథాలు చాల మహత్త్వపూర్ణమైనవి. సమకాలీన ధార్మిక జీవితానికి ఇవి అద్దం పడ్తున్నవి. బ్రాహ్మణ గ్రంథాలల్లో యజ్ఞకర్మల వివరణ వున్నది. కాని శ్రౌత గ్రంథాలల్లో ఏ శాఖకు చెందినవారు ఏ యజ్ఞాలు చేయాలన్నది వివరింపబడడమేగాక బ్రాహ్మణాలల్లోలేని కొన్ని యజ్ఞకర్మలు అదనంగా వీటిల్లో చెప్పబడినవి. శ్రౌతసూత్రాలల్లో యజ్ఞయాగాలు మూడు ఇంకా మూడింటికంటె ఎక్కువ అగ్నులతో చేసేవి వివరింపబడినవి. గృహ్యాసూత్రాలల్లో కేవలం గృహంలో చేసుకునే యజ్ఞకర్మలు, ఉపనయనాది గార్హస్థ్య జీవితానికి సంబంధించిన కర్మలు వివరింపబడినవి.

సూత్రరచనాకాలంనాటికి ఆర్యులు సంచారజీవితాన్ని మానేసి స్థిరనివాసం ఏర్పరచుకొన్నారని చెప్పవచ్చును. వారి గృహస్థజీవితంలో అనేకమైన మార్పులు వచ్చినవి. యజ్ఞయాగాది కర్మలు అనేకం ఏర్పడినవి. ఈ కర్మలను, నిత్య, ఐహిక ఆముష్మిక జీవితాన్ని సక్రమ పద్ధతిలో నడిపే అవసరం ఏర్పడింది. అటువంటి తరుణంలోనే వారి ఆచార వ్యవహారాలను, యజ్ఞవ్రత నియమాలను విధించే సూత్రగ్రంథాల రచనలు చేయబడినవి.

ఋగ్వేద సంబంధమైనవి రెండు శ్రౌత సూత్రాలు ప్రసిద్ధమైనవి - అశ్వలాయన, శాంఖాయన. శ్రౌత సూత్రాలను అనుసరిస్తూ గృహ్యా సూత్రాలు చెప్పబడేవి. శ్రౌత గృహ్యాసూత్రాల పేర్లే కాక రచయితలు కూడ ఒక్కరే. అశ్వలాయనుడు శౌనకుని శిష్యుడని ప్రసిద్ధి. ఆశ్వలాయన శ్రౌత సూత్రంలో 12 అధ్యాయాలున్నవి. విషయం, భాషల దృష్టితో పరిశీలించినట్లయితే శాంఖాయన శ్రౌతసూత్రం ప్రాచీనమైంది. దీనిలో 18 అధ్యాయాలున్నవి. దీనిలో శాంఖాయన బ్రాహ్మణాన్ని అనుసరించి యజ్ఞాదులు వివరింపబడినవి దాని రచయిత సుయజ్ఞుడు. వీటిల్లో అనేక విధాలైన యజ్ఞయాగాది కర్మలు వివరింపబడినవి. పై శ్రౌత సూత్రాలకు రెండు గృహ్యాసూత్రాలు ప్రసిద్ధమైనవి - ఆశ్వలాయన. శాంఖాయన. ఆశ్వలాయన గృహ్యాసూత్రంలో 4 అధ్యాయాలున్నవి. వివిధ గృహ్యా సంస్కారాలు దీనిలో వివరింపబడినవి. మూడవ అధ్యాయంలో వేదాధ్యయనవిధి వివరింపబడింది. శాంఖాయన గృహ్యాసూత్రంలో 6 అధ్యాయాలున్నవి. గృహ్యా సంస్కారాలతో పాటు గృహనిర్మాణ, గృహప్రవేశాది విధులు కూడ దీనిలో వున్నవి. ఋగ్వేద సంబంధమైన మరొక శ్రౌతసూత్రగ్రంథం కౌషీతకి శ్రౌత సూత్రం. ఇది ప్రచురితం కాలేదు. కాని కౌషీతకి గృహ్యాసూత్రం ప్రచురింపబడింది. కౌషీతకి శాంఖాయన గృహ్యాసూత్ర గ్రంథాలల్లో విషయవివరణలో చాల సామ్యమున్నది. కాని ప్రతిపాదిత విషయంలో భేదమున్నది. కౌషీతకి గృహ్యా సూత్రం రచయిత శాంభవ్యుడు. అందుకే దీనికి శాంభవ్య గృహ్యాసూత్రమని కూడ పేరు. దీనిలో 5 అధ్యాయాలున్నవి. వివాహాది గృహ్యాసంస్కారాలు దీనిలో వివరింపబడినవి.

శుక్లయజుర్వేదానికి ఒక్కటే శ్రౌత సూత్రమున్నది - కాత్యాయన శ్రౌతసూత్రం. దీనిలో 26 అధ్యాయాలున్నవి. ఇతర సూత్రాలతో పోలిస్తే ఇది పెద్దది. బ్రాహ్మణాన్ని అనుసరించి యాగ కర్మలు వివరింపబడినవి. దీనికి కర్కాచార్యుని భాష్యం కూడ వున్నది. శుక్ల యజుర్వేదానికి రెండు గృహ్యాసూత్రాలున్నవి- పారస్కర, బైజవాప. పారస్కర గృహ్యాసూత్రంలో 3 కాండాలున్నవి. దీనిలో వివాహ, గర్భాధాన, అన్నప్రాశన, చూడాకర్మ, ఉపనయన, సమావర్తన, పంచమహాయజ్ఞ, శ్రవణకర్మ, శ్రాద్ధాది అనేక కర్మలు వివరింపబడినవి. ఈ గృహ్యాసూత్రానికి 5 భాష్యాలున్నవి - కర్క, జయరామ, హరిహర, గదాధర, విశ్వనాథ. బైజవాప గృహ్యాసూత్రం ప్రచురితం కాలేదు.

కృష్ణయజుర్వేదానికి 6 శ్రౌతసూత్రాలు లభిస్తున్నవి. బౌధాయన, అపస్తంబ, హిరణ్యకేశి, వైఖానస, భారద్వాజ, మానవ. మొదటి ఐదు తైత్తిరీయ శాఖకు, చివరిది మైత్రాయణిశాఖకు చెందినవి. వీటిల్లో బౌధాయన. ఆపస్తంబ కల్ప గ్రంథాలకు శ్రౌత, గృహ్య, ధర్మ, శుల్వ సూత్ర గ్రంథాలు నాలుగు పూర్తిగా లభిస్తున్నవి. ఈ నాలిగింటిని ఒక గ్రంథం యొక్క నాలుగు విభాగాలుగా భావించవచ్చును. వీటి రచయితలు వరుసగా బౌధాయన, ఆపస్తంబులు. ఆపస్తంబ శ్రౌత సూత్రంలో బౌధాయన, మానవ సూత్రాల ప్రసక్తి వుండటంచేత అవి ప్రాచీనతమమైనవని చెప్పవచ్చును. బౌధాయన శ్రౌత, గృహ్య, ధర్మ, శుల్వ సూత్ర గ్రంథాలు ప్రచురితమైనవి. బౌధాయమని భాష పాణినీయ సంస్కృత భాష కన్న భిన్నమైనదని పండితుల అభిప్రాయం. కాబట్టి బౌధాయనుడు క్రీ.పూ 800ప్రాంతం వాడని చెప్పవచ్చునంటారు. బౌధాయన శ్రౌతసూత్రంలో 4 అధ్యాయాలున్నవి. దీనిలో బ్రహ్మచర్య, అష్టవిధ వివాహాలు, పాయశ్చిత్తకర్మలు, ఆస్తిహక్కు నిర్ణయం, చాతుర్వర్ణ్యాశ్రమాలు, శ్రాద్ధాదికర్మలు, చాంద్రయణాది వ్రతాలు వివరింపబడినవి. ఆపస్తంబ శ్రౌతసూత్రంలో 3 అధ్యాయాలున్నవి. తైత్తిరీయ బ్రాహ్మణంలోని యాగవిధులన్నీ దీనిలో వివరింపబడినవి. వివాహ, ఉపనయన, ఉపాకర్మ, సమావర్తన, మధుపర్క,సీమంతోన్నయన మొదలైన కర్మలు వివరింపబడినవి.

హిరణ్యకేశి శ్రౌతసూత్రం ఆపస్తంబ సూత్రానికన్న అర్వాచీనమైంది. దీనికి సత్యాషాఢమని పేరు. వైఖానస, భరద్వాజ, మానవ సూత్రాలే కాక శాండిల్య, మావిల, మైత్రేయ, కాఠక,వారాహ శ్రౌత, గృహ్య సూత్రాలు కూడ కృష్ణయజుర్వేదానికి సంబంధించినవి వున్నవి.

సామవేదానికి ఆర్షేయ లేక మశక కల్పసూత్రం వున్నది. సామగానానికి సంబంధించిన అనుష్ఠానాలు దీనిలో వివరింపబడినవి. ఇంకా సామవేదానికి లాట్యాయన

శ్రౌత సూత్రమున్నది. ఇది కౌథుమ శాఖకు చెందింది. దీనిలో ఆర్షేయ కల్పసూత్రం పేరుండటం చేత ఇది అర్వాచీనమని చెప్పవచ్చును. ద్రాహ్యాయణ శ్రౌతసూత్రం రాణాయన శాఖకు, జైమినీయ శ్రౌతసూత్రం జైమిని శాఖకు చెందినవి. కౌథుమశాఖకు చెందిన గోభిల గృహ్యసూత్రం చాల విశిష్టమైంది. ఖాదిర గృహ్యసూత్రం రాణాయనీయ శాఖకు చెందింది. జైమినీయ గృహ్యసూత్రంలో రెండు ఖండాలున్నవి. దీనికి శ్రీనివాసాధ్వరి వ్రాసిన టీక వున్నది. ఇవిగాక గౌతమ, ఛాందోగ్య గృహ్యసూత్రాలు ప్రచురితం కానివి వున్నవి.

అథర్వవేదానికి వైతాన శ్రౌతసూత్రం వున్నది. ఇది గోపథ బ్రాహ్మణాన్ని అనుసరించి చెప్పబడింది. కాని ఇది ప్రాచీనమైంది గాని, మౌలికమైంది గాని కాదని పండితుల అభిప్రాయం. కౌశిక గృహ్య సూత్రం అథర్వవేదానికి ఒకేఒక్క గృహ్యసూత్రం. దీనిలో 14 అధ్యాయాలున్నవి. దీనికి హారిల, కేశవుల టీకలున్నవి. దీనిలో ఇంద్రజాల విద్య వివరింపబడింది. ఇది అథర్వవేదంలోని అనేక కర్మ విధానాలను వివరిస్తున్నది. ఔషధసంబంధి విషయాలు కూడ దీనిలో వున్నవి.

## ధర్మసూత్ర గ్రంథాలు

ధర్మసూత్ర గ్రంథాలలో చాతుర్వర్ణ్యాలు. వర్ణసంకరత, ఆస్తి పంపకం, స్త్రీ పారతంత్రత, రాజధర్మాలు వర్ణింపబడినవి. శ్రౌతగృహ్యసూత్రాలు వ్యక్తి యొక్క ధార్మిక గృహస్థ ధర్మాలను గూర్చి చెప్పగా ధర్మసూత్ర గ్రంథాలు సామాజిక నీతినియమాలను గూర్చి చెప్తున్నవి. ధర్మసూత్ర గ్రంథాలల్లో సంఘంలోని ఆచారనియమాలు, వర్ణాశ్రమ ధర్మవిధానాలు చర్చింపబడినవి. వైవాహిక రీతులు, భోజనపానాదులు, ప్రాయశ్చిత్తాది విధులు, అంటరానితనం - వీటన్నిటి వివరణలు ఇయ్యబడినవి. ఇవేగాక రాజ్యవ్యవస్థ, రాజ ధర్మాలు, ఆస్తి పంపకాల వివరాలు కూడ వీటిలో వున్నవి. శ్రౌత సూత్రాల ననుసరించి గృహ్యసూత్రాలు, గృహ్య సూత్రాల ననుసరించి ధర్మసూత్రాలు వుంటవి. కాని ఇప్పుడు ధర్మసూత్రాలు చాలామట్టుకు దొరకటం లేదు. అన్ని గృహ్యసూత్రాలకు ధర్మసూత్రాలు వ్రాయబడినవో లేదో కూడ నిర్ణయించి చెప్పటం ఇప్పుడు సాధ్యం కాదు. ఆశ్వలాయన, శాంఖాయన, మానవ ధర్మసూత్రాల పేర్లు తెలుసు కాని అవి దొరకలేదు. మానవ ధర్మసూత్రాల ఆధారంగానే మనుస్మృతి వ్రాయబడింది. వేరువేరు వేద శాఖలకు వేరు వేరు ధర్మసూత్ర గ్రంథాలు వుండేవని కుమారిలుడు ఉట్టంకించి వున్నాడు. కాని అవన్నీ దొరకలేదు.

ధర్మసూత్ర గ్రంథాలల్లో గౌతమ ధర్మసూత్రం ప్రాచీనతమమైందని చెప్పబడుతున్నది. ఇది సామవేదానికి సంబంధించింది. దీనిలో 28 అధ్యాయాలున్నవి. దీనిలో వర్ణధర్మం, నిత్యకర్మలు, ప్రాయశ్చిత్త కర్మలు, రాజ ధర్మాలు మొదలైనవి వివరింపబడినవి.

కృష్ణయజుర్వేదానికి చెందిన బౌధాయన ధర్మసూత్రం గౌతమ ధర్మ సూత్రం కన్నా అర్వాచీనమైంది. ఆపస్తంబ ధర్మసూత్రం కన్నా ప్రాచీనమైంది.

ఆపస్తంబ కల్పసూత్రంలోని 28, 29 ప్రశ్నలే ఆపస్తంబ ధర్మసూత్రం. దీనిలో అపాణినీయ ప్రయోగాలు వుండటంచేత పాణినికన్న ఆపస్తంబుడు పూర్వుడని చెప్పబడుతున్నది. ధర్మనిర్ణయ విషయంలో ఆపస్తంబుడు కాణ్వ, కుణిక, కుత్స, కౌత్స, కౌత్స పుష్కరసాది, వార్ష్యాయణి. శ్వేతకేతు. హారీత మొదలైన ఆచార్యుల అభిప్రాయాలను పేర్కొన్నాడు. దీనిలో వర్ణసంకర ప్రసక్తిలేదు. నియోగ పద్ధతిని రచయిత నిందించాడు. వివాహాలలో ప్రాజాపత్య వివాహం ఉత్తమమైందిగా చెప్పబడింది. ఆపస్తంబుడు దక్షిణ దేశీయుడని డా. బ్యూలర్ చెప్పాడు. అపస్తంబుడు యమునా తీరంలో నివసించే సాల్వదేశస్త్రీలను ప్రశంసించటం చేత అతడు యమునాతీరంలో సాల్వ జనపదానికి చెందినవాడని చాలామంది పండితుల అభిప్రాయం. కాని దక్షిణదేశంలో ముఖ్యంగా ఆంధ్రదేశంలో ఆపస్తంబ సూత్రానుయాయులు చాల ఎక్కువగా వుండటం చేత ఆపస్తంబుడు ఆంధ్రుడని, ఆంధ్ర దేశీయులు యమునాతీరంనుంచి గోదావరి తీరానికి వలస వచ్చారని ఒక వాదం.

హిరణ్యకేశి ధర్మసూత్రంలో ఆపస్తంబధర్మసూత్రంలోని విషయ వివరణలే గ్రహింపబడినవి. విష్ణుధర్మసూత్రం కౌషీతకి శాఖకు చెందింది. వసిష్ఠ ధర్మసూత్రం చిన్నదైనా మహత్త్వపూర్ణమైంది. ధర్మకర్తల్లో వసిష్ఠునికి విశిష్ట స్థానమున్నది. కుమారిలుడు వసిష్ఠ ధర్మసూత్రాన్ని ఋగ్వేద సంబంధిగా పేర్కొన్నాడు. ఋగ్వేదీయులకు స్వతంత్రమైన ధర్మసూత్రమేదీ లేకపోవటంచేత దీన్ని స్వంతం చేసుకొని వుంటారు. దీనిలో ఋగ్వేదమంత్రాలతోపాటు తైత్తిరీయ సంహిత మంత్రాలుకూడా ఉదాహరింపబడినవి. వసిష్ఠ ధర్మసూత్రం మూలగ్రంథంలో చాల మార్పులు చేర్పులు జరిగినవి. కొన్ని ప్రతుల్లో 6, కొన్నిటిలో 12, మరికొన్నిటిలో 30 అధ్యాయాలున్నవి. 30 అధ్యాయాల గ్రంథమే ఈనాడు ప్రమాణంగా తీసుకోబడుతున్నది. మనుస్మృతి నుంచి 40 శ్లోకాలు దీనిలో ఉద్ధరింపబడినవి. ప్రస్తుతమున్న మనుస్మృతి మూల గ్రంథంనుంచి వసిష్ఠుడు ఈ శ్లోకాలను ఉద్ధరించాడని పండితుల అభిప్రాయం.

## శుల్వసూత్ర గ్రంథాలు

శుల్వసూత్రాలు శ్రౌత సూత్రాలకు అంగరూపాలైన గ్రంథాలు. శ్రౌత సూత్రాలు శ్రుతి ప్రతిపాదితమైన యజ్ఞయాగాదులను వివరించగా శుల్వసూత్రాలు యజ్ఞకుండాదుల

నిర్మాణ విధులను వివరిస్తున్నవి. వీటిల్లో భారతీయులు రేఖా గణితంలో సాధించిన ప్రగతిని చూడవచ్చును. ఒక్కొక్క శాఖకు ప్రత్యేకంగా శ్రౌత గృహ్య ధర్మసూత్రాల వలెనే శుల్వసూత్రాలు కూడ వుండేవి. కాని వైదిక కర్మకాండకు సంబంధించినవి కాబట్టి శుల్వసూత్రాలు యజుర్వేదం యొక్క వివిధ శాఖలకు సంబంధించినవే ఇప్పుడు లభిస్తున్నవి. శుక్ల యజుర్వేదానికి కాత్యాయన శుల్వసూత్రమొక్కటే లభిస్తున్నది. కృష్ణయుజుర్వేదానికి ఆరు శుల్వ సూత్రాలు లభిస్తున్నవి. అవి - బౌధాయన, ఆపస్తంబ, మానవ, మైత్రాయణీయ, వారాహ, వాధూల. ఇవిగాక మశక, హిరణ్యకేశి శుల్వసూత్రాల పేర్లు ఆపస్తంబ శుల్వసూత్రంలో పేర్కొనబడినవి. కాని అవి లభించలేదు. లబ్దమైన ఏడు శుల్వసూత్రాలల్లో బౌధాయన శుల్వసూత్రమే అన్నిటికన్న విశాలమైంది. అదే అన్నిటికన్న ప్రాచీనమైంది కూడ కావచ్చును. దీనిలో 3 భాగాలున్నవి. 625 సూత్రాలున్నవి. దీనిలో యజ్ఞవేదికల నిర్మాణవిధి, ఆ నిర్మాణంలో పాటించవలసిన రేఖా గణిత పద్ధతులు, వివిధ వేదికల ఆకార విధానాలు, వాటి నిర్మాణంలోగల భేదాలు వివరంగా చెప్పబడినవి. ఆపస్తంబ శుల్వసూత్రంలో 6 భాగాలున్నవి. అవి తిరిగి 21 అధ్యాయాలుగా విభజింపబడినవి. 223 సూత్రాలున్నవి. దీనిలోకూడ వివిధ యజ్ఞవేదికల నిర్మాణ పద్ధతులు, పాటింపవలసిన రేఖాగణిత సిద్ధాంతాలు, వేదికల వివిధ ఆకారాలు వివరింపబడినవి. దీనిలో భాష, వివరణ పద్ధతులు సరళంగా వున్నవి. మానవ శుల్వసూత్రం గద్య పద్యాత్మకంగా వున్నది. ఆకారంలో చిన్నది. పూర్వ గ్రంథాలలో లేని అనేక కొత్త వేదికల నిర్మాణపు క్రియలు దీనిలో చెప్పబడినవి. మైత్రాయణీయ, వారాహ, వాధూల శుల్వసూత్రాలలో వర్ణ్యవిషయం ఒక్కటే. దాదాపు వాటిలోని శ్లోకాలు కూడ ఒక్కటే. ఈ శుల్వసూత్రాలకు అనేక టీకలు కూడ వున్నవి.

## కల్పసూత్రాల రచనాకాలం

భారతీయుల బుద్ధి విశేష పరిణతికి సూచకమైంది సూత్రప్రక్రియ. మౌఖికంగా నేర్చుకొన్న విద్య ఆరునెలల్లోనే విస్మరింపబడేదని, వ్యక్తితోపాటు మౌఖిక జ్ఞానం విలుప్తమయ్యేదని నారద పురాణంలోని ఒక కథనుబట్టి తెలుస్తున్నది. అట్లా "శ్రుతి" పూర్వకమైన జ్ఞానం విలుప్తం కాకుండా రక్షించేకొరకు ప్రాచీన ఋషులు సూత్ర ప్రక్రియను కనుగొన్నారు. ఈ సూత్ర గ్రంథాలకు టీకలు, వ్యాఖ్యానాలు బయలుదేరేనాటికి లిపి, లేఖన సామగ్రులు ఉపయోగంలోకి వచ్చినవని చెప్పవచ్చును. అంతకుముందు గల వైదిక సాహిత్యమంతా మౌఖికంగా, శ్రుతిరూపంలోనే నేర్చుకోబడేది. సింధునాగరికతకాలం నాడు లిపి వుండేదని తెలుస్తున్నా, దాదాపు ఆ నాగరికతకు సమకాలికమైన వైదిక సాహిత్యకులు లిపిని ఉపయోగించుకోలేదు. పాణిని అష్టాధ్యాయిలో ఒక సూత్రంలో కల్ప

సూత్రాల ప్రసక్తి వుండడాన్నిబట్టి ఈ సాహిత్యం తత్పూర్వమే (అంటే క్రీ.పూ. 500) ఆరంభమై వికసించిందని చెప్పవచ్చును. పాణిని ప్రాచీన, అర్వాచీన అని కల్పసూత్ర గ్రంథాలను నిర్దేశించివున్నాడు. కాశికాకారుడు కూడ ప్రాచీన కల్పసూత్రాల శ్రేణిలో పైంగ, ఆరుణ్యరాజ సూత్రాలను, అర్వాచీన కల్ప సూత్రాల శ్రేణిలో ఆశ్మరథ సూత్రాలను పేర్కొన్నాడు. కుమారిలభట్టు "అరుణ పరాశరశాఖా బ్రాహ్మణస్య కల్ప రూపత్వాత్" అని కూడ అన్నాడు. బౌధాయన శ్రౌత సూత్రంలో కూడ పైంగలాయని బ్రాహ్మణం గూర్చి చెప్పబడింది. కాశ్యప, కౌశిక కల్పసూత్రాలను గూర్చి పాణిని ప్రసంగించాడు కాని అవి మనకు దొరకలేదు. కాఠక, కాలాపక, మౌదక, పైప్పలాద, ఆథర్వణ ధర్మ సూత్రాలను గూర్చి పతంజలి ప్రసంగించాడు. ఇవి కూడా ఇప్పుడు అనుపలబ్ధాలు.

సూత్రకారుల్లో బౌధాయన, ఆపస్తంబ, వసిష్ఠులు ప్రముఖమైన ఋషులు. వీరిలో బౌధాయనుడు పాణినికి పూర్వుడని తెలుస్తున్నది. గౌతముడు క్రీ.పూ. 500-600, ఆపస్తంబుడు క్రీ.పూ. 400-500, వసిష్ఠుడు వీరిద్దరికి మధ్యకాలంవాడని పండితుల అభిప్రాయం. చింతామణి వినాయకవైద్య, డా॥ గోరఖ్ ప్రసాద్‌ల అభిప్రాయంలో సూత్రాల కాలం క్రీ.పూ. 1300 ప్రాంతం. ప్రధాన ఉపనిషత్తుల రచన తర్వాతనే సూత్ర రచనలు ఆరంభమైనవి కాబట్టి సూత్రాల కాలం క్రీ.పూ. 900- 400 నడుమ అని చెప్పవచ్చును. క్రీ.పూ. మొదటి శతాబ్దం వరకు అక్కడక్కడ సూత్ర ప్రక్రియకు చెందిన రచనలు చేయబడుతూనే వున్నవి.

## వ్యాకరణం

వేదాంగాలల్లో ఒకటైన వ్యాకరణం వేద మంత్రాలల్లోని శబ్దాల అర్థాలను బోధించటమే కాక, ఆ శబ్దాలు కాలగర్భంలో కలిసిపోకుండ రక్షించినవి కూడ. "వ్యాక్రింయతే వ్యుత్పాద్యంతే శబ్దా అనేనేతి వ్యాకరణమ్" - శబ్దాల వ్యుత్పత్తిని గూర్చి చేప్పేది వ్యాకరణం. కాని తర్వాత వ్యాకరణం శబ్దాల వ్యుత్పత్తిని కాక పద స్వరూపాన్ని గూర్చి చెప్పి, అర్థ నిర్ణయాన్ని చేస్తూ వచ్చింది. "ముఖం వ్యాకరణం స్మృతమ్" - వేద భగవానునికి వ్యాకరణం ముఖం వంటిది. దీన్నిబట్టి వ్యాకరణం వేదాంగాలల్లో ముఖ్యమైందని తెలుస్తున్నది. ముఖం లేకుండా భోజన వ్యాపారం లేదు. భోజనం లేనిదే శరీరం లేదు. శరీరం లేనిది ప్రాణరక్ష జరుగదు. ఋగ్వేదంలో వ్యాకరణ శాస్త్ర ప్రశంస ఈ క్రింది మంత్రంలో వున్నదని అంటారు -

చత్వారి శృంగా త్రయో అస్యపాదా
ద్వేశీర్షే సప్తహస్తా సో అస్య
త్రిధా బద్ధో వృషభో రోరవీతి
మహాదేవో మర్త్య ఆవివేశ. 4-58-6.

వ్యాకరణానికి నాలుగు కొమ్ములున్నవి. అవి - నామ, ఆఖ్యాత, ఉపసర్గ, నిపాతాలు. వర్తమాన భూత భవిష్యత్తులు దానికి మూడు పాదాలు. సుప్; తిఙ్‌లు రెండు శిరస్సులు. ఏడు విభక్తులు ఏడు చేతులు, వ్యాకరణ రూపమైన వృషభం ఉరస్సు, కంఠం, శిరస్సు స్థానాలలో బంధింపబడింది. మరొకచోట ఇట్లా చెప్పబడింది - వ్యాకరణం తెలియని వ్యక్తి - చూస్తుండికూడ చూడనివానితో, వింటూవుండికూడ విననివానితో సమానం. స్త్రీ అందమైన వస్త్రాలను ధరించి పతికి తనను తాను అర్పించుకొన్న విధంగా వాణి వ్యాకరణంతో కూడి విద్వాంసుని చేరుకుంటుంది. వరరుచి వ్యాకరణం యొక్క ప్రయోజనాలు ఐదు విధాలు అని చెప్పాడు. పతంజలి ఆ ప్రయోజనాలను 13 వరకు పెంచాడు. వాటిలో కొన్ని ప్రయోజనాలు - రక్ష, ఊహ, ఆగమ, లఘు, అసందేహ, అపభాషణ, దుష్టశబ్ద, అర్థజ్ఞాన, ధర్మలాభ, నామకరణ.

రక్ష అంటే వేదాల రక్షణ. ఊహ అంటే కొత్త పదాలను కల్పించటం. ఆగమ అంటే శ్రుతి అధ్యయనానికి ప్రమాణ రూపంగా నిలవటం. లఘు అంటే శబ్ద సముద్రాన్ని తరించటానికి వ్యాకరణమే లఘు ఉపాయం. అంటే వ్యాకరణ పఠన పాఠనాలు ఆత్యావశ్యకమని చెప్పటం. అసందేహం అంటే శబ్ద విషయకమైన సందేహాలను వ్యాకరణం తీరుస్తుంది. అపభాషణం అంటే శబ్దాల అశుద్ధ ఉచ్చారణను దూరం చేస్తుంది. దుష్ట శబ్దం అంటే శబ్దాల శుద్ధి అశుద్ధులను బోధిస్తుంది. అర్థ జ్ఞానం అంటే శబ్దార్థాల బోధకు తోడ్పడుతుంది. ధర్మలాభం అంటే వ్యవహారంలో శుద్ధమైన శబ్దాలను ప్రయోగించటంచేత వ్యక్తి స్వర్గలోకంలో అనంతమైన ఫలాన్ని అనుభవిస్తాడు. నామకరణం అంటే పిల్లల నామకరణంలో దోషంలేని జ్ఞానాన్ని కలిగిస్తుంది.

వైదిక శబ్దాల వ్యుత్పత్తి, అర్థ వివేచనలు చేయబడిన ప్రాతిశాఖ్య గ్రంథాలు వ్యాకరణ శాస్త్రం యొక్క తొలి రూపాలు. ఈ ప్రాతిశాఖ్యలకు మూల సూత్రాలు బ్రాహ్మణ, కల్పసూత్ర గ్రంథాలలో వున్నవి. కాబట్టి వ్యాకరణ రచనకు వైదికసాహిత్యం నుంచే అతి ప్రాచీనకాలంలోనే ప్రేరణ లభించిందని, అవసరం కూడ ఏర్పడిందని చెప్పాలి. గోపథ బ్రాహ్మణంలో వ్యాకరణ సంబంధమైన ధాతు, ప్రాతిపదిక, నామ, ఆఖ్యాత, లింగ, వచన, విభక్తి మొదలైన పారిభాషిక పదాలు పేర్కొనబడినవి. దాన్నిబట్టి గోపథం నాటికే వ్యాకరణ శాస్త్రం వికసించిందని చెప్పవచ్చును. కాని ఈనాడు లభ్యమయ్యే వ్యాకరణ గ్రంథాలల్లో పాణినీయ వ్యాకరణమే ప్రాచీనమైంది. పాణిని స్వయంగా ఐంద్ర వ్యాకరణాన్ని పేర్కొన్నాడు. కాని అది అనుపలభ్యం. శాకటాయన ఋక్ తంత్రాన్ని బట్టి వ్యాకరణాన్ని బ్రహ్మ బృహస్పతికి, బృహస్పతి ఇంద్రునికి, ఇంద్రుడు భరద్వాజునికి, భరద్వాజుడు ఋషులకు, ఋషులు బ్రాహ్మణులకు బోధించారని తెలుస్తున్నది. వైదిక సాహిత్యానికి ఇంద్రుడు

ప్రథమ వైయాకరణుడని ప్రసిద్ధి. వ్యాకరణాల పరిమాణ ప్రసక్తిని గూర్చి ఈ కింది శ్లోకం ప్రసిద్ధంగా ప్రచారంలో వున్నది.

సముద్రవద్ వ్యాకరణం మహేశ్వరే
తదర్ధ కుంబోద్ధరణం బృహస్పతౌ ।
తద్భాగ భాగాచ్చ శతం పురందరే
కుశాగ్ర బిందూత్పతితం హి పాణినౌ.

మహేశ్వర వ్యాకరణం సముద్రంవలె విశాలమైంది. బృహస్పతి వ్యాకరణం ఘటజలం వంటిది. దీనిలో శతాంశం ఐంద్రవ్యాకరణం. ఇక కుశాగ్రభాగం నుంచి పడే జలబిందువు వంటిది పాణిని వ్యాకరణం.

**ఐంద్రవ్యాకరణం** - ఐంద్రవ్యాకరణాన్ని గూర్చి కాశికావృత్తికి తత్త్వ విమర్శిని అన్న వ్యాఖ్యను వ్రాసిన ఉపమన్యుడు "తథాచోక్తమ్ ఇంద్రేణ అంతర్వర్ణ సముద్భూతాధాతవః పరికీర్తితాః" అని ప్రసంగించివున్నాడు. వరరుచి ఇంద్ర నిఘంటువులో ఐంద్రవ్యాకారణాన్ని గూర్చి చెప్పివున్నాడు -

పూర్వం పద్మభువా ప్రోక్తం శ్రుత్వేంద్రేణ ప్రకాశితమ్
తద్ బుధేభ్యో వరరుచిః కృతవానింద్రనామకమ్.

బోపదేవుడు తన కవికల్పద్రుమంలో సంస్కృత వ్యాకరణ సంప్రదాయంలో ఐంద్ర వ్యాకరణానికి ప్రథమ స్థానాన్నిచ్చాడు -

ఇంద్రశ్చంద్రః కాశ కృత్స్నాపిశలీ శాకటాయనః
పాణిన్యమర జైనేంద్రా జయంత్యష్టాది శాబ్దికాః

తమిళ వ్యాకరణం తొల్కాప్పియం ఐంద్రవ్యాకరణాన్ని ఆదర్శంగా పెట్టుకొనబడి రచింపబడిందని డా॥ బర్నల్ అభిప్రాయం. వరురుచి వ్యాకరణంలో పేర్కొనబడిన "భవంతీ, అద్యతనీ, హ్యస్తనీ" మొదలైన పారిభాషిక పదాలు పాణిని "లట్, లుంగ్, లిట్" ల కన్న ప్రాచీనమైనవని, అవి ఐంద్ర వ్యాకరణంలో కన్పించేవని కైయటాది పండితులు పేర్కొన్నారు.

పాణినికి పూర్వం వ్యాకరణకారులు చాలా మంది వున్నారు. పాణిని స్వయంగా పేర్కొన్న వైయాకరణులు - 1. ఆపిశలి: కాత్యాయన పతంజలుల కాలంలో ఆపిశలి వ్యాకరణం చాలా ప్రచారంలో వున్నట్లు తెలుస్తున్నది 2. కాశ్యపుడు: ఆపిశలి వ్యాకరణ

సూత్రాలు కొన్ని ఉద్ధరణల రూపంలోనైనా లభిస్తున్నవి. కాని కాశ్యపుని సూత్రాలేవి దొరకలేదు. 3. గార్గ్యుడు : అష్టాధ్యాయి, ప్రాతిశాఖ్య గ్రంథాలల్లో గార్గ్యుని అభిప్రాయాలు చెప్పబడినవి కాని అతని సూత్రాలేవి దొరకలేదు. 4. గాలవుడు, చాక్రవర్మణుడు : వీరిద్దరి సూత్రాలు దొరకలేదు. కాని వీరి అభిప్రాయాలను పాణిని పేర్కొన్నాడు 5. భారద్వాజుడు, పాణిని, పతంజలి ఇతని అభిప్రాయాలను పేర్కొన్నారు. భారద్వాజుని వార్తికలను కాత్యాయనుడు, పతంజలులు ఉద్ధరించారు. 6. శాకటాయనుడు: పాణిని ఇతని మూడు అభిప్రాయాలను పేర్కొన్నాడు. ఇతడు ప్రసిద్ధ వైయాకరణుడు. కాని అతని వ్యాకరణం లభించలేదు. 7. శాకల్యుడు: ఇతడు ఋక్పదపాఠాన్ని వ్రాశాడే కాని వ్యాకరణం వ్రాయలేదని కొందరి పండితుల అభిప్రాయం. కాని ఇతని అభిప్రాయాన్ని పాణిని పేర్కొన్నాడు. 8. సేనకుడు: పాణిని ఒక్కచోట ఇతన్ని ఉద్ధరించాడు. 9. స్ఫోటాయనుడు: ఇతన్ని కూడ పాణిని ఒక్కచోట ఉద్ధరించాడు. స్ఫోటవాదాన్ని ఇతడే ప్రతిపాదించాడని పండితుల ఊహ. వీరేగాక పాణిని పేర్కొనని ప్రాచీన వైయాకరణులు ఇంకా వున్నారని పండితుల అభిప్రాయం. 10. భాగురి: ఇతని వ్యాకరణ సంబంధ అభిప్రాయాలను భాషావృత్తికారాదులు పేర్కొని వున్నారు. 11. పౌష్కరసాది: మహాభాష్యకారుడు ఇతన్ని పేర్కొన్నాడు. 12. నారాయణుడు : మహాభాష్యకారుడు ఇతన్ని పేర్కొన్నాడు. 13. కాశకృత్స్నుడు : ప్రాచీన వైయాకరణులు ఇతని వ్యాకరణ సూత్రాలను పేర్కొని వున్నారు. 14. శంతనుడు. 15. వైయాఘ్రపద్యుడు. 16. మాధ్యందిని. 17. శాడి. 18. శౌనకి, 19. వ్యాడి మొదలైనవారు. వీరిని పాణిని పేర్కొనక పోయిన ఇతర వైయాకరణులు ఉద్ధరించివున్నారు. వీరిలో కొందరు పాణినికి పూర్వవర్తులు, కొందరు అపరవర్తులు వున్నారు.

**పాణిని వ్యాకరణం** - ప్రాచీన వ్యాకరణాలల్లో ఇదే ఇప్పుడు మనకు దొరుకుతున్నది. పూర్వవ్యాకరణాల కన్న ఇది సువ్యవస్థితరూపంలో వుండి అధిక ప్రచారంలో వుండటంచేత ఇది తత్పూర్వవ్యాకరణ గ్రంథాలను తలదన్ని నిలిచి వున్నది. పూర్వవ్యాకరణాలు ప్రచారంలో లేక వినష్టమైనవి. పాణిని వ్యాకరణంలో 4000 అల్పాక్షర సూత్రాలున్నవి. పాణిని సంస్కృత భాషను ఆపోశనం పట్టిన వాడు. సంస్కృతభాషను శాస్త్రీయపద్ధతిలో వ్యాకరించిన ఘనత పాణినికి దక్కుతుంది. ఆ వ్యాకరణంయొక్క శాస్త్రీయ పద్ధతికి, తత్కర్త మేధాశక్తికి ప్రాచ్య పాశ్చాత్యులు జోహార్లు అర్పించారు. ఈ వ్యాకరణంలో 8 అధ్యాయాలుండటంచేత అష్టాధ్యాయి అని పేరు ఏర్పడింది. పాణిని శివున్ని ఆరాధించి ఈ వ్యాకరణాన్ని రచించాడు. ధాతువులను గూర్చి ధాతుపాఠంలో, పదాలనుగూర్చి గణపాఠంలో, పదాల స్వరూపాలను గూర్చి ఉణాది సూత్రాలల్లో పాణిని వివరించాడు.

పాణిని సంగ్రహరూపంలో వీటిని చెప్పిన విధం ప్రశంసనీయంగా వున్నది. ఉణాది సూత్రాలను కాత్యాయనుడు సవరించాడని కొందరు అంటారు. మరికొందరు ఉణాది సూత్రాలు కాత్యాయనుడే వ్రాశాడని కూడ అంటారు. పాణిని క్రీ.పూ. 8వ శతాబ్దంవాడని గోల్డ్‌స్టుకర్ అభిప్రాయం. క్రీ.పూ. 4వ శతాబ్దంవాడైన కాత్యాయనుడు వార్తికలను రచించాడు. కథాసరిత్సాగరంలోని కథ ప్రకారం పాణిని, కాత్యాయనులు సహపాఠకులు, వీరి గురువు వర్షుడు. వ్యాడి, ఇంద్రదత్తులు కూడ పాణినికి సహపాఠకులు. 'లింగానుశాసనం', 'వరరుచిసంగ్రహం' అనే వ్యాకరణ గ్రంథాలు వ్రాసిన వరరుచి, మరియు కాత్యాయనుడు ఒక్కరే అని అంటారు. వరరుచికావ్యం వ్రాసిన వరరుచి, వ్యాకర్త వరరుచి ఒక్కరే కాని కాత్యాయనుడు, వరరుచి వేరువేరు వ్యక్తులని మరికొందరు పండితుల అభిప్రాయం. పాణిని సూత్రాలల్లోని లోటుపాటులను పరిశీలించి కాత్యాయనుడు సవరించి కొత్త సూత్రాలను వ్రాశాడు. వాటికే వార్తికలని పేరు. వీటిని 1245 వరకు పతంజలి మహాభాష్యంలో పేర్కొన్నాడు. క్రీ.పూ. 150 ప్రాంతంలో పతంజలి మహాభాష్యం వ్రాశాడు. పతంజలి అష్టాధ్యాయికి వ్యాఖ్యానం వ్రాస్తూ కాత్యాయనుడు పాణినిని విమర్శించేటప్పుడు చేసిన పొరపాట్లను ఎత్తిచూపాడు. పాణిని వ్యాకరణసూత్రాలకు కాత్యాయనుని వార్తికలేకాక ఎన్నో విమర్శ వ్యాఖ్యానాల రూపమైన గ్రంథాలు వ్రాయబడినవి. కాని అవేవి మనకు మిగుల లేదు. అష్టాధ్యాయికి వ్రాయబడిన భాష్యాలల్లో మహాభాష్యం విశిష్టమైంది, మహత్త్వపూర్ణమైంది. విషయ వివరణ పద్ధతి సరసమనోహరంగా కథనోపకథన శైలిలో వున్నది. పాణిని, కాత్యాయనుడు, పతంజలి ముగ్గురు మునిత్రయం అనే పేరుతో ప్రసిద్ధిచెందారు. పాణిని 'యవనాని' అని యవనుల లిపిని పేర్కొన్నాడు. కాబట్టి అతనికి యవనులతో పరిచయమున్నదని, అంటె అలెగ్జాండర్ దండయాత్ర తర్వాతనే యవనులు భారతీయులకు పరిచితులు కాబట్టి పాణిని క్రీ.పూ. 4వ శతాబ్దానికి తర్వాతవాడని లెవీ మొదలైన పండితులు అభిప్రాయపడినారు. క్రీ.పూ. 4వ శతాబ్దానికన్న పాణిని పూర్వుడని చెప్పటం కీథ్ అభిమతం కూడ కాదు. అతని అభిప్రాయంలో పాణిని క్రీ.పూ. 300 ప్రాంతం వాడు, కాత్యాయనుడు క్రీ.పూ. 250-200 ప్రాంతంవాడు. పాణిని క్రీ.పూ. 500 నాటివాడని మాక్‌డోనెల్ అభిప్రాయం. పాణిని బౌద్ధమత సంబంధమైన కొన్ని పారిభాషిక పదాలనుగూర్చి చర్చించాడని, కాబట్టి అతడు క్రీ.పూ. 500 ప్రాంతం వాడని వాసుదేవశరణ అగ్రవాల్ నిర్ణయించాడు. పాణిని భారతదేశం వాయవ్య ప్రాంతంలోని 'అటక్' సమీపంలోని 'శాలాతుర' గ్రామానికి చెందినవాడు. అది ఇప్పటి అఫ్ఘనిస్థానంలో వున్నదని పండితుల అభిప్రాయం. యవనులు అలెగ్జాండర్ దండయాత్రకన్న పూర్వమే భారతదేశంతో సంబంధమున్నవారు. మొదటి డేరియస్ (క్రీ.పూ. 521-485) మొదలైన ఇరానియన్ రాజులు యవనులతో చేసిన

యుద్ధాల్లో భారతీయ సైన్యం పాల్గొన్నట్లు చారిత్రకాధారాలున్నవి. అలెగ్జాండర్‌కు పూర్వమే యవనులు కాంభోజులతో పాటు వాయవ్య ప్రాంతంలోవున్నట్లు మహాభారతం, పురాణాలనుబట్టి తెలుస్తున్నది. అలెగ్జాండరు భారతదేశంలోకి ప్రవేశించినప్పుడు యవనుల వలసదేశం ఒకటి కనుక్కొని అతడు ఆశ్చర్యపోయాడు. కాబట్టి అలెగ్జాండరుకు పూర్వమే భారతీయులకు యవనులతో పరిచయమున్నది. పాణిని వాయవ్య ప్రాంతంవాడు కాబట్టి యవనులతో, వారి లిపితో పాణినికి పరిచయముండి వుంటుంది. అతని దేశానికి సమీపంలో యవన నివాసస్థానాలు కూడ వుండి వుంటవి. అందుకే 'యవనంధు' అని పేర్కొని యవనుల బావితోగల పరిచయాన్ని ప్రకటించాడు.

పాణిని తర్వాత వ్యాకరణశాస్త్రాధ్యయనం విశేష ప్రచారంలో వుండేది. వ్యాకరణ శాస్త్రసంబంధమైన గ్రంథాలు అనేకం వ్రాయబడినవి. కాని చాలా మట్టుకు ఆ గ్రంథాలు నష్టమైనవి. అట్లా నష్టమైన గ్రంథాల్లో వ్యాడి విరచిత 'సంగ్రహ' మనే వ్యాకరణ గ్రంథం. దీనిలో ఒక లక్ష శ్లోకాలుండేవట! ఈ గ్రంథాన్ని గూర్చి పతంజలి పేర్కొనివున్నాడు. పతంజలి మహాభాష్యం తర్వాత శ్రీ.శ. 6వ శతాబ్దానికి చెందిన కాశ్మీరపండితులు వామన, జయాదిత్యులు పాణిని అష్టాధ్యాయికి వ్యాఖ్యానం వ్రాశారు. ఈ వ్యాఖ్యానానికి 'కాశికావృత్తి' అని పేరు. ఈ కాశికావృత్తికి తిరిగి అనేక వివరణలు, వ్యాఖ్యలు వ్రాయబడినవి. 'న్యాస' మనేది ఒక విధమైన వ్యాఖ్యాన పద్ధతి. అటువంటి 'న్యాస' లు కూడ ఈ వృత్తికి వ్రాయబడినవి. కాని చాలామట్టుకు ఇవన్నీ నష్టమైనవి. క్రీ.శ. 700 ప్రాంతంవాడైన జినేంద్రబుద్ధి వ్రాసిన కాశికా వివరణ పంజిక అనే న్యాసమొక్కటి ఇప్పుడు లభిస్తున్నది. హరదత్తుడు (క్రీ.శ. 12 వ శ॥) కాశికావృత్తికి పదమంజరి అనే టీకను వ్రాశాడు. ఇది లభిస్తున్నది. చాల ప్రచారంలో వున్నది.

వ్యాకరణశాస్త్ర సాహిత్యంలో మహాభాష్యం తర్వాత గొప్ప గ్రంథం 'వాక్యపదీయం.' దీన్ని క్రీ.శ. 6వ శతాబ్దంవాడైన భర్తృహరి రచించాడు. వ్యాకరణం యొక్క దార్శనిక రూపాన్ని మనం దీనిలో దర్శించవచ్చును. భర్తృహరి శబ్దాద్వైతాన్ని స్థాపించినవాడు. అతడు స్ఫోటవాది. మహాభాష్యానికి అతడు మహాభాష్యప్రదీపిక అనే వ్యాఖ్యను కూడ వ్రాశాడు. కాని అది అనుపలభ్యం.

సింహళ దేశీయుడైన బౌద్ధభిక్షువు ధర్మకీర్తి 'రూపావతారమనే' వ్యాకరణ గ్రంథాన్ని రచించాడు. పాణిని వ్యాకరణం దీనిలో సులభపద్ధతిలో ప్రస్తుతీకరింపబడింది. ఇతడు క్రీ.శ. 12వ శతాబ్దంవాడు. అదే శతాబ్దం వాడైన బౌద్ధ భిక్షువు శరణదేవుడు దుర్ఘట వృత్తి అనే వ్యాకరణాన్ని రచించాడు. దీనిలో ప్రసిద్ధ కవులు ప్రయోగించిన పదస్వరూపాలను

గూర్చి చర్చ వున్నది. విమల సరస్వతి (క్రీ.శ. 14వ శ॥) రూపమాల అనే వ్యాకరణంలో పద స్వరూపాలను గూర్చి చర్చించాడు. క్రీ.శ. 11వ శతాబ్దంవాడైన కైయటుడు కాశ్మీర దేశీయుడు. ఇతడు మహాభాష్యానికి భాష్య ప్రదీపమనే వ్యాఖ్యను వ్రాశాడు. ఈ భాష్యప్రదీపానికి నాగేశభట్టు ఉద్యోతమనే వివరణను రచించాడు. నాగేశభట్టు సమకాలికుడైన అన్నమభట్టు కూడ కైయటుని భాష్య ప్రదీపానికి ఉద్యోతనమనే వివరణను వ్రాశాడు. క్రీ.శ. 1450 ప్రాంతంవాడైన రామచంద్రాచార్యుడు ప్రక్రియా కౌముది అనే పేరుతో అష్టాధ్యాయి సూత్రాలను ప్రక్రియను అనుసరించి ఒక క్రమపద్ధతిలో అమర్చాడు. ఇది వ్యాకరణశాస్త్ర అధ్యయనానికి చక్కగా తోడ్పడగల గ్రంథం. ఇదే విధంగా క్రీ.శ. 1600 ప్రాంతం వాడైన నారాయణ భట్టు ప్రక్రియాసర్వస్వమనే పేరుతో పాణిని సూత్రాలను అమర్చాడు. పాణిని వాద నక్షత్రమాల పేరుతో అప్పయ్య దీక్షితుడు (క్రీ.శ. 1600 ప్రాంతం) వ్యాకరణ విషయాలను చర్చించాడు. క్రీ.శ. 17వ శతాబ్దంవాడైన భట్టోజి దీక్షితుడు గొప్ప వ్యాకరణ శాస్త్రజ్ఞుడు. ఇతడు అప్పయ్య దీక్షితుని శిష్యుడు. అప్పయ్య దీక్షితుల శిష్యుడు కాకముందు ఇతడు కాశిలో శేషశ్రీకృష్ణుని దగ్గర వ్యాకరణాన్ని చదువుకొన్నాడు. శేషశ్రీకృష్ణుడు గొప్ప వైయాకరణుడు. వ్యాకరణ మర్మజ్ఞుడు. అతడు తెలుగువాడు కాని కాశిలో స్థిరనివాసమేర్పరచుకొన్నాడు. అప్పయ్య దగ్గర భట్టోజి వేదాంతాన్ని అభ్యసించాడు. శేష శ్రీకృష్ణుని దగ్గర భట్టోజి, జగన్నాథులు సహపాఠకులు. ప్రక్రియా కౌముదిని అనుసరించి భట్టోజి సిద్ధాంతకౌముదిని వ్రాశాడు. ఇది చాల ఉత్తమమైన వ్యాకరణ గ్రంథం. దీనికి ప్రౌఢమనోరమ అనే వ్యాఖ్యానాన్ని కూడ అతడు వ్రాశాడు. పాణిని అష్టాధ్యాయికి భట్టోజి శబ్దకౌస్తుభమనే వ్యాఖ్యానాన్ని కూడ వ్రాశాడు. శబ్దకౌస్తుభానికి నాగేశాదులు వ్రాసిన 5 వ్యాఖ్యానాలున్నవి. దీనికే భాస్కర దీక్షితుడు శబ్దకౌస్తుభదూషణం, పండితరాయలు జగన్నాథుడు శబ్దకౌస్తుభఖండన మనే ఖండన గ్రంథాలు వ్రాశారు. పాణిని లింగానుశాసనానికి భట్టోజి లింగానుశాసనవృత్తి వ్రాశాడు. వ్యాకరణంలోని దార్శనికతత్త్వాలను వివరిస్తూ అతడు వైయాకరణమతోన్మజ్జనాన్ని వ్రాశాడు. భట్టోజి సిద్ధాంతకౌముదివలెనే వరదరాజు (క్రీ.శ. 1650) మధ్య సిద్ధాంతకౌముది, లఘుసిద్ధాంతకౌముది రచించాడు. ఇతడు భట్టోజి శిష్యుడు. భట్టోజి దీక్షితుని మేనల్లుడు కొండుభట్టు వైయాకరణ మతోన్మజ్జనానికి వైయాకరణ భూషణమనే వ్యాఖ్యను వ్రాశాడు.

భట్టోజి దీక్షితుని మనుమడు హరి దీక్షితుడు. హరి దీక్షితుని శిష్యుడు నాగేశభట్టు. ఇతడు క్రీ.శ. 17వ శతాబ్దం వాడు. ఇతడు సిద్ధాంతకౌముదికి లఘు శబ్దేందుశేఖరం, బృహచ్ఛబ్దేందుశేఖరమనే వ్యాఖ్యానాలు వ్రాశాడు. కైయటుని మహాభాష్య ప్రదీపికకు ఇతడు మహాభాష్య ప్రదీపోద్యోతమనే వ్యాఖ్యను కూడ వ్రాశాడు. అతడు

మంజూష, లఘుమంజూష, పరమలఘుమంజూష అనే వ్యాకరణ గ్రంథాలను వ్రాశాడు. ఇతడు స్ఫోటవాది. ఇతడు పరిభాషేందుశేఖరంలో పరిభాషలను వివరించాడు. ఇంకా ఇతడు యోగ, ధర్మశాస్త్ర అలంకార శాస్త్ర సంబంధి గ్రంథాలను రచించాడు. సిద్ధాంత కౌముదికి జ్ఞానేంద్ర సరస్వతి (క్రీ.శ. 1750 ప్రాంతం) తత్త్వబోధిని, వాసుదేవ దీక్షితుడు (క్రీ.శ. 1750 ప్రాంతం) బాలమనోరమ అనే వ్యాఖ్యలను రచించారు. ఇవి వ్యాకరణ అధ్యయనాన్ని సులభం చేసినవి.

ఆధునిక కాలంలో సంస్కృత వ్యాకరణాధ్యయనాన్ని పాశ్చాత్యులు చేపట్టి చాల కృషి చేశారు. బోట్‌లింక్ పాణిని అష్టాధ్యాయిని క్రీ.శ. 1839లో జర్మన్‌భాషా వ్యాఖ్యానంతోను మరియు క్రీ.శ. 1887లో జర్మన్‌భాషానువాదంతోను ప్రచురించాడు. అప్పటినుంచి జర్మనీ దేశంలో పాణిని, కాత్యాయన, పతంజలి రచనలు చాల శ్రద్ధతో చదువబడినవి. వేబర్, గోల్డ్‌ష్టుకర్, కీల్‌హోర్న్, ఎగ్గెలింగ్, లీబిష్, ఫ్రాంకే మొదలైన జర్మన్ విద్వాంసులు వ్యాకరణాన్ని అధ్యయనం చేశారు. ఆధునిక కాలంలో పాల్ థీమే గొప్ప వ్యాకరణ శాస్త్రజ్ఞుడు. ఈయన జర్మన్ భాషలో విద్యార్థులకు సంస్కృతవ్యాకరణాలను రచించాడు. అడాల్ఫ్ స్టెన్స్లెర్ వ్రాసిన "ఎలిమెంటార్ బుక్ డెర్ సంస్కృత్ స్ప్రాఖే" అన్నది ప్రముఖమైంది. కీల్‌హోర్న్ వ్రాసిన వ్యాకరణం కూడ ప్రసిద్ధమైంది. వాకెర్ నాగెల్ వ్రాసిన " ఆల్టిండిషే గ్రామాటిక్" కూడ చెప్పుకోదగింది.

## నిరుక్తం

"అర్థావబోధే నిరపేక్షతయా పదజాతం యత్ర ఉక్తం తద్ నిరుక్తం" అని సాయణుడు - అర్థాన్ని బోధించే పదసమూహం యొక్క సంగ్రహమే నిరుక్తమని చెప్పాడు. దీన్ని బట్టి నిరుక్తంలో శబ్దం గౌణమై అర్థం ప్రధాన మౌతున్నది. వ్యాకరణంలో శబ్దాలను గూర్చిన చర్చ అధికంగా వుంటుంది. అర్థావబోధ కలిగించటం వ్యాకరణం యొక్క ఉద్దేశం కాదు. వేదార్థాన్ని తెలుసుకోవడానికి నిరుక్తం అత్యావశ్యకమైన అంగం. 'నిరుక్త' మంటే 'వ్యుత్పత్తి' అని అర్థం. ప్రతి శబ్దం వ్యుత్పన్నమని ఆతని అభిప్రాయం. ప్రాచీన వైయాకరణుల్లో శాకటాయనుని మతం కూడ ఇదే. శాకటాయనున్ని నిరుక్తకారుడు యాస్కుడు స్మరించాడు. ఒకొకసారి ఒక్క పదానికి వేరు వేరు వ్యుత్పత్త్యర్థాలు కూడ ఇయ్యబడినవి. పదాల వ్యుత్పత్త్యర్థాలను నిర్ణయించటం భారతదేశంలో ప్రాచీనకాలంలోనే వైజ్ఞానికపద్ధతిలో జరిగింది. ఈ పద్ధతి పాశ్చాత్యులను మిక్కిలి ఆకర్షించింది. వారివారి భాషాపదాలకు అర్థాలను తెలుసుకోవాలనే జిజ్ఞాస వారికి దీని అధ్యయనం ద్వారా కలిగింది. 'దుహితా'

శబ్దానికి "దుహతి ఇతి దుహితా"- '(ఆవు) పాలను పిండేది' - అని అర్థం. అంటే ఇంట్లో ఆవు పాలను పిండటం కూతురు బాధ్యత అయినట్లు ఈ వ్యుత్పత్త్యర్థాన్ని బట్టి తెలుస్తున్నది. 'దుహిత' శబ్దం గ్రీకు, లాటిన్, జర్మన్; ఇంగ్లీషు, పారసీభాషలన్నిటిలో సమానంగా వున్న శబ్దం. జర్మన్‌భాషలో "టోఖ్టర్" అని, ఇంగ్లీషులో "డాటర్" అని, ఫారసీ భాషలో "దుఖ్తర్' ' అని ఇప్పటికీ వాడుకలో ఈ పదం వున్నది. ఇదే విధంగా ఇండో - యూరోపియన్ భాషలోని సామాన్య పదాలను, వాటి వ్యుత్పత్త్యర్థాలను గ్రహించి పాశ్చాత్య విద్వాంసులు ఆదిమ ఆర్యుల జీవిత విధానాన్ని నిర్మించటానికి ప్రయత్నించారు.

శబ్ద వ్యుత్పత్తిని చెప్పటం నిరుక్త శాస్త్ర ప్రయోజనం. వేదమంత్రాలను అర్థం చేసుకోవటానికి వాటిల్లోని పదాల వ్యుత్పత్త్యర్థం తెలుసుకోవటం చాల అవసరం. మొదట వ్యాకరణాలు కూడ శబ్దాల వ్యుత్పత్తిని గూర్చి చేప్పేవి. కాని అవి కేవలం వ్యుత్పత్త్యర్థాలను చెప్పటానికి పుట్టినవి కావు. నిరుక్తం కేవలం వేద శబ్దాలను వివరించటానికే పుట్టింది. కాని నిరుక్తకారునికి వ్యాకరణ జ్ఞానం చాల అవసరం- "నా వైయాకరణాయ" అని యాస్కుడు అన్నాడు. నిరుక్తం నిఘంటువుకు టీక వంటిదని చెప్పవచ్చును. మొదట నిఘంటుగ్రంథాలు పుట్టినవి. ఈ నిఘంటువుల్లో కఠినమైన వేద శబ్దాలు క్రమబద్ధంగా సంకలితమైనవి. అటువంటి నిఘంటువులు పూర్వ కాలంలో చాలా వుండేవి. ఇప్పుడు ఒక్కటి మాత్రమే మిగిలింది. దాన్ని కశ్యపుడు కూర్చినాడని మహాభారతంలో చెప్పబడింది. యాస్కుడు ఈ నిఘంటువుకు వ్రాసిన నిరుక్తమే మనకు ఇప్పుడు లభిస్తున్నది. నిఘంటువును కూడ యాస్కుడే కూర్చినాడని అంటారు. నిరుక్త గ్రంథాలు కూడ పూర్వకాలంలో చాల వుండేవి. కాని అవన్ని వినష్టమైనవి. దుర్గాచార్యుని అనుసారం 14 నిరుక్తగ్రంథాలుండేవి. యాస్కుడు 12మంది నిరుక్తకారులను పేర్కొన్నాడు, వారు - అగ్రాయణ, ఔపమన్యవ, ఔదుంబరాయణ, జీర్ణనాభ, కాత్థక్య, క్రౌష్టుకి, గార్గ్య, గాలవ, తైటీకి, వార్ష్యాయణి, శాకపూణి, స్థౌలాష్ఠీవి, పదమూడవ నిరుక్తకారుడు స్వయంగా యాస్కుడు. మరి దుర్గాచార్యుడు పేర్కొన్న పధ్నాల్గవ నిరుక్తకారుడెవరో తెలవదు. యాస్కుడు శాకపూణి అభిప్రాయాలను చాల ఉట్టంకించాడు. బృహద్దేవత, పురాణాదుల్లో కూడ శాకపూణి పేర్కొనబడినాడు. యాస్కుడు శాకపూణిని తన కన్న విరుద్ధాభిప్రాయాలు కలవాడిగా పేర్కొన్నాడు. ఇక ఇతర నిరుక్తకారుల అభిప్రాయాలు ఎట్లా వుండేవో మనకంతగా తెలియరాలేదు. ఈ నిరుక్తకారుల గ్రంథాలేవీ మనకు దొరకలేదు. ఇప్పుడు ఒక్క యాస్కుని నిరుక్తమే దొరుకుతున్నది. ఇదే వేదాంగాంతర్గతమైన నిరుక్తశాస్త్రానికి ప్రతినిధిగా వున్నది. నిరుక్తంలో 12 అధ్యాయాలున్నవి. ఇవిగాక చివరి రెండు పరిశిష్ట రూపమైన అధ్యాయాలున్నవి. అంటే మొత్తం నిరుక్తంలో 14

అధ్యాయాలున్నవి. సాయణ, ఉవ్వటాది ఆచార్యులు ఈ 14 అధ్యాయాల నుంచి ఉద్ధరణలను ఇచ్చారు. 12 అధ్యాయాలకే యాస్కుడు కర్త అని సాయణుడు అంగీకరించాడు. యాస్కుడు పాణినికి పూర్వుడనటం నిశ్చయం. అంటే అతడు క్రీ.పూ 7,8 శతాబ్దాల వాడనుకోవచ్చును. మహాభారతం శాంతిపర్వంలో నిరుక్తకారుడు యాస్కుడు స్మరింపబడినాడు. గ్రంథారంభంలో యాస్కుడు నిరుక్తశాస్త్ర సిద్ధాంతాలను గూర్చి ప్రసంగించాడు. అతని కాలం నాటికే వేదార్థనిర్ణయంలో మతభేదాలు ఏర్పడినవి. ఆ మతభేదాలు ఈవిధంగా పేర్కొనబడినవి - ఆధిదైవత, ఆధ్యాత్మ, ఆఖ్యాన, ఐతిహాసిక, నైదాన, నైరుక్త, పరివ్రాజిక, యాజ్ఞిక. యాస్కుని నిరుక్తగ్రంథ ప్రభావం తరువాతి వేదభాష్యకారుల మీద చాల కన్పిస్తున్నది. అసలు సాయణాదులు యాస్కుని ఆధారంగానే వేదార్థ నిర్ణయం చేయగలిగారు.

నిరుక్తం నిఘంటువుకు టీకా రూపమైనా రానురాను నిరుక్తం కూడ అర్థం కావటం కష్టమైంది. దానికి కూడ భాష్యం అవసరమైంది. భాష, విషయాలు దుర్గ్రాహ్యాలు కావటమే కాక పాఠభేదాల కారణం చేత, అక్కడక్కడ గ్రంథం నష్టం కావటం చేత గ్రంథాన్ని అర్థం చేసుకోవటం కష్టమైంది. క్రీస్తుపూర్వం నుంచే నిరుక్తానికి భాష్యాలు వ్రాయటం ప్రారంభమైంది. అటువంటి ఒక వ్యాఖ్యానాన్ని గూర్చి పతంజలి ప్రసంగించివున్నాడు. ఇప్పుడు మాత్రం దుర్గాచార్యుడు వ్రాసిన వృత్తి ఒక్కటే లభిస్తున్నది. దుర్గాచార్యుడు నిరుక్తానికి నలుగురు వార్తిక కారులను ఉట్టంకించాడు. అంటే నిఘంటువుకు భాష్యరూపమైన నిరుక్తానికి కూడ వార్తికలు వ్రాయబడినవని దీన్ని బట్టి తెలుస్తున్నది. దుర్గాచార్యుని వ్యాఖ్య లేకపోతే ఈనాడు నిరుక్తాన్ని అర్థం చేసుకోవటం చాల కష్టమైవుండేది. దుర్గాచార్యుని గూర్చి మనకేమీ తెలియరాలేదు. అతని భాష్యప్రతి క్రీ.శ. 1522 ప్రాంతంది దొరికింది. దీన్నిబట్టి అతడు తత్పూర్వుడని మాత్రం చెప్పవీలవుతున్నది. అతని జన్మస్థానమేదో నిర్ణయించటం కష్టం. ఇంకా మరి ఇద్దరు వ్యాఖ్యాతల పేర్లు కూడా తెలుస్తున్నవి.

నిరుక్తంలో ప్రతిపాదింపబడిన సిద్ధాంతాలను చెప్పే మరొక గ్రంథం నిరుక్త సముచ్చయం. దీన్ని వరరుచి వ్రాశాడని అంటారు. దీనిలో 100 మంత్రాలున్నవి. నిరుక్తం, దాని వ్యాఖ్యానం, నిరుక్తసముచ్చయం ఆధారంగానే మధ్యయుగాల్లో ఆచార్యులు వేదమంత్రాలకు వ్యాఖ్యానాలను చేయగలిగారు. వేదాధ్యయనానికి చాల మహత్త్వపూర్ణమైన గ్రంథాలు ఇవి.

నిరుక్తం శబ్దాల వ్యుత్పత్తిని గూర్చి చెప్పేదేకాక దానిలో వ్యాకరణం, భాషా విజ్ఞానం, సాహిత్యం, సామాజికశాస్త్రం, చరిత్ర మొదలైన విషయ పరిజ్ఞానం చాల లభిస్తున్నది.

ఆధునిక శాస్త్రమైన భాషావిజ్ఞానం ఇటువంటి గ్రంథాల పరిచయంతోనే మాక్స్‌ముల్లర్ మొదలైన పాశ్చాత్యపండితుల చేత ఆరంభం చేయబడి వికసించింది.

## ఛందస్సు

పాణినీయశిక్షలో "ఛంద: పాదౌతు వేదస్య" - ఛందస్సు వేదానికి పాదమని చెప్పబడింది. మనుష్యుడు పాదాల సహాయంతో నిలువబడినట్లుగా, నడచినట్లుగా వేదపురుషుడు ఛందస్సు సహాయం లేకుండా నడువలేడు. వేదాల విశుద్ధమైన, లయబద్ధమైన ఉచ్చారణకు, పాఠానికి ఛంద:శాస్త్రాధ్యయనం అవసరం. ఇది లేకుండ మంత్రాల యొక్క ఫలం లభించదని ప్రాచీనుల విశ్వాసం. ప్రత్యేకమైన సూక్తానికి దేవత. ఋషితో పాటు ఛందస్సు జ్ఞానం కూడ అవసరం. "ఛంద:" శబ్దానికి రుచికరమైంది, శ్రుతిపేయమైన లయబద్ధమైన వాణి అని అర్థం. "ఛందయతి పృణాతి రుచతే ఇతి ఛంద:" ఏ వాణిని వింటే మనస్సు ఆహ్లాదాన్ని చెందుతుందో ఆ ఛందోమయి వాణి వేదం - "ఛందయతి, ఆహ్లాదయతి, ఛంద్యం తే ఝే నవా ఛంద:" "ఛందయతి మంత్ర ప్రతిపాద్య యజ్ఞాదీన్ ఇతి ఛంద:" - ఆసురబంధమైన విఘ్నాల నుంచి వేదాన్ని రక్షించే కవచం వంటిది ఛందస్సు అని ప్రాచీనుల విశ్వాసం. యాస్కుడు ఈ అర్థాన్నే గ్రహించాడు.

వైదిక సంహితలో అధికభాగం ఛందోమయం. కృష్ణయజుర్వేదం, అథర్వవేదంలో కొన్ని భాగాలు గద్యనిబద్ధాలుగా వున్నవి. ఇవిగాక మిగిలిన వైదిక సంహితా భాగాలన్నీ ఛందోబద్ధాలే. హృదయగత సూక్ష్మ సుకుమార భావాలు లయరూపంలో రావటం సహజం.

వైదిక ఛందస్సులు అక్షరగణంమీద ఆధారపడినవి. వాటిల్లోని అక్షరాల గురులఘువుల్లో ఒక క్రమంగాని, విశేషనియమంగాని లేదు. లౌకిక ఛందస్సు వైదిక ఛందస్సునుంచే ఉద్భవించినా, దాని గురువు లఘు నియమంలో క్రమం వున్నది. వైదిక ఛందస్సులో పాదనియమం కూడ లేదు. వేదంలో ఒక్కపాదం, రెండు, నాలుగుపాదాలే వుండాలనే నియమం లేదు. వేదంలో ఒక్క పాదం. రెండు పాదాలూ ఇంకా ఎక్కువ పాదాలుగల వివిధ ఛందస్సులున్నవి. మూడుపాదాల ఛందస్సులు వేదంలో అధికంగా వున్నవి. గాయత్రి, ఉష్ణిక్ ఛందస్సులు మూడు పాదాలు కలవి. పంక్తి అనే ఛందస్సు ఐదు పాదాలు కలది. వైదిక ఛందస్సును గూర్చి సాంగోపాంగ అధ్యయనం జరుగవలసిన అవసరం చాల వున్నదని, అది చాల గంభీరమైన విషయమని బలదేవ ఉపాధ్యాయ అభిప్రాయం. వేదాలల్లోను ప్రధాన ఛందస్సుల్లో వర్ణసంఖ్య ఇట్లా వున్నది - గాయత్రి 24, ఉష్ణిక్ 28, అనుష్టుపు 32, బృహతీ 36, పంక్తి 40, త్రిష్టుపు 44, జగతి 48, అతిజగతి 52, శక్వరి 56, అతిశక్వరి 76, కృతి 80, ప్రకృతి

84, ఆకృతి 88, వికృతి 92, సంస్కృతి 96, అభికృతి 100, ఉత్కృతి 104 - ఇట్లా వర్ణసంఖ్య నియతమైవున్నా, అప్పుడప్పుడు పాదంలో ఒక అక్షరం తక్కువగా వుండవచ్చును. ఒక్కొక్కసారి ఒక అక్షరం ఎక్కువగా వుండవచ్చును. అట్లా తక్కువగా వున్నదానిని 'నిచృత్' అని, ఎక్కువగా వున్న దానిని 'ఘరిక్' అని అంటారు. ఉదా॥కు మూడు పాదాలుగల గాయత్రిలో అక్షరాల సంఖ్య 3x8=24 కాని 23 అక్షరాలు గలదాన్ని నిచృత్ గాయత్రి అని అంటారు. ఇదేవిధంగా రెండు అక్షరాలు తక్కువ వున్నదాన్ని విరాట్, రెండు అక్షరాలు యెక్కువ వున్నదాన్ని స్వరాట్ అని అంటారు. విరాట్ గాయత్రిలో 22 అక్షరాలు. స్వరాట్ గాయత్రిలో 26 అక్షరాలు వుంటవి. ఒక్కొక్కసారి ఒక అక్షరం తక్కువ వుండి ఛందస్సు కుంటినడకతో నడిచినప్పుడు సంయుక్తాక్షరాన్ని విడదీసిగాని, సంధ్యక్షరాన్ని విడదీసిగాని చదవటం వున్నది. ఉదా॥కు "పిబతి సౌమ్యమధు" అన్న త్రిపదా ఉష్ణికా పాదంలో 8 అక్షరాలచోట 7 అక్షరాలే వున్నవి. పాదపూరణార్థం "సౌమ్య" అన్న పదాన్ని 'సోమిఅ' అని చదువుతుంటారు. "దివం గచ్ఛస్వః పదేతే" అన్న పాదంలో 'స్వ': ను 'సుఅ' అని చదువుతుంటారు. అదే విధంగా 'త్వం' వుంటే 'తుఅం' అని 'ఇంద్ర' వుంటే 'ఇందర' అని, 'జ్యేష్ఠ' అనివుంటే 'జయ్యిష్ఠ' అని, 'ప్రబ్రహ్మైత్వితి' అని వుంటే 'బ్రహ్మఏతు ఇతి' అని , 'న్వోవ' అని వుంటే 'నోఅవ' అని విడదీసి ఉచ్చరించటం జరుగుతుంది.

కాత్యాయనుడు సర్వానుక్రమణిలో ఋగ్వేదంలోని సంపూర్ణ మంత్ర ఛందస్సుల సంఖ్యను ఇట్లా ఇచ్చాడు -

గాయత్రి-2467, ఉష్ణికు-341, అనుష్టుపు-855,
బృహతి-181, పంక్తి-312, త్రిష్టుపు - 4253
జగతి-1358, మొత్తం -9767.

ఈ పట్టికనుబట్టి ఋగ్వేదంలో త్రిష్టుపు లోకప్రియమైన ఛందస్సుగా కనిపిస్తున్నది. ఆ తర్వాత గాయత్రి. జగతి ఛందస్సులు లోకప్రియమైనవి.

ఇతర శాస్త్రాలన్నిటికి శివుడు ప్రథమ ప్రవర్తకుడైనట్లే ఛందశ్శాస్త్రానికి కూడ అతడే ప్రథమ ప్రవర్తకుడు. శివుని దగ్గర నుంచి బృహస్పతి ఛందోజ్ఞానాన్ని సంపాదించాడు. బృహస్పతి నుంచి దుశ్చ్యవనుడు, అతని నుంచి ఇంద్రుడు, ఇంద్రుని నుంచి మాండవ్యుడు ఆ శాస్త్రాన్ని గ్రహించారు. ఇప్పుడు లభించే ఛందశ్శాస్త్ర విషయకమైన గ్రంథాలల్లో ఋక్ ప్రాతిశాఖ్యమే ప్రాచీనమైంది. దీనిలో ప్రధాన చర్చిత విషయం వ్యాకరణమే అయినా, పుస్తకం చివర వైదిక ఛందస్సులను గూర్చిన చర్చవున్నది. ఇది అసమగ్రంగా వున్నది. ఇక

పూర్తిగా ఛందస్సులను గూర్చి చర్చించే మొదటి గ్రంథం పింగలుని ఛందశ్శాస్త్రం. ఇది సూత్రరూపంలో వ్రాయబడింది. దీనిలో 8 అధ్యాయాలున్నవి. మొదటి నాలుగింటిలో వైదిక ఛందస్సు, తర్వాత లౌకిక ఛందస్సులు వివరింపబడినవి. దీనిలో వైదికఛందస్సుల వివరణే కాక లౌకికఛందస్సుల వివరణ కూడ వున్నది. ఇది సర్వాంగపూర్ణమైన ప్రౌఢ ఛందశ్శాస్త్ర గ్రంథం. దీనికి భట్ట హలాయుధుడు వ్రాసిన మృతసంజీవినీ అనే వ్యాఖ్య వున్నది. పింగలుని ఛందశ్శాస్త్ర గ్రంథం యొక్క రూపాంతరమైన "ప్రాకృత పింగలం" లభిస్తున్నది. దీనిలో ప్రాకృత భాషా ఛందస్సులు వివరింపబడినవి. తర్వాత అపభ్రంశ భాషలో కవి స్వయంభు (క్రీ.శ. 7వ శ॥) వ్రాసిన "స్వయంభు ఛందః" గ్రంథమున్నది. కాళిదాసు పేరుతో "వృత్తరత్నావళి" "శ్రుతబోధ" అనే గ్రంథాలు కన్పిస్తున్నవి. కాని వీటి రచయిత కవి కాళిదాసు కాకపోవచ్చును. జ్యోతిష విషయకమైన బృహత్సంహితలో వరాహమిహిరుడు ఒక అధ్యాయంలో ఛందస్సులను గూర్చి చర్చించాడు. జనాశ్రయ (క్రీ.శ. 7వ శ॥) విరచిత 'ఛందోవిచితి', క్షేమేంద్ర (క్రీ.శ. 11వ శ॥) విరచిత 'సువృత్త తిలకం', హేమచంద్ర (క్రీ.శ. 2వ శ॥) విరచిత 'ఛందోऽనుశాసనం', కేదారభట్ట (క్రీ.శ. 15వ శ॥) విరచిత 'వృత్తరత్నాకరం', దుర్గాదాస (క్రీ.శ. 16వ శ॥) విరచిత 'ఛందోమంజరి', దామోదరమిశ్ర (క్రీ.శ. 16 వ శ॥) విరచిత 'వేణీ భూషణం', దుఃఖభంజన (క్రీ.శ. 16వ శ॥ ) విరచిత 'వాగ్వల్లభ' మొదలైన ఛందో గ్రంథాలు వున్నవి. ఇంకా అనేక హస్తలిఖిత ప్రతులు ప్రచురణ భాగ్యం పొందనివి ప్రాచీన, ఆధునిక గ్రంథాలున్నవి.

## జ్యోతిషం

వేదాంగాలల్లో జ్యోతిషం ఆరవది. వేదపఠనానికి జ్యోతిషం కూడ అత్యావశ్యకమైంది. పవిత్రమైన యజ్ఞయాగాదులను ఆరంభించే, సమాప్తి చేసే సుమూహూర్తాన్ని నిర్ణయించే కొరకు జ్యోతిషం సహాయం అవసరమైంది. యజ్ఞయాగాదులు మంచి ఫలితాలను ఇయ్యాలంటే కేవలం ఉచిత విధివిధానమే కాదు - ఉచిత నక్షత్రం, సమయం కూడ అవసరం. వేదాంగాలల్లో జ్యోతిషం చివరిదైనా నెమిలికి శిఖ శిరస్సుమీద వున్నట్లు వేదాంగాలల్లో ఇది మూర్ధన్య స్థానాన్ని వహిస్తుందని వేదాంగ జ్యోతిషశాస్త్రంలో చెప్పబడింది. కొన్ని యజ్ఞాలు కొన్ని ఋతువులతో, మాసాలతో, పక్షాలతో సంబంధించినవి. కాలనియమాన్ని పాటించటానికి కాలాన్ని గణించటం చాల అవసరమైంది. నక్షత్రాల సహాయంతో కాల నిర్ణయం చేయటం, గ్రహాల అనుకూల ప్రతికూలత్వాన్ని నిర్ణయించటం జరుగుతుంది. రానురాను నక్షత్ర గ్రహాల గతివిధులను, భూభ్రమణాదులను గూర్చి ఋషులు అధ్యయనం చేసారు. దానితో జ్యోతిషం శాస్త్రీయ పద్ధతిలో వికసించింది. జ్యోతిషాన్ని అభ్యసిస్తేనే

యజ్ఞయాగాదుల సంపూర్ణజ్ఞానం కలుగుతుంది.

వేదాంగ జ్యోతిషగ్రంథానికి రెండు భిన్న పాఠప్రతులు దొరుకుతున్నవి. ఒకటి ఋగ్వేద జ్యోతిషం. దీనిలో 40 లేక 44 శ్లోకాలున్నవి. రెండవది యజుర్వేద జ్యోతిషం. దీనిలో 36 శ్లోకాలున్నవి. చాలావరకు శ్లోకాలు రెండింటిలో సమానంగానే వున్నవి. ఈ రెండు గ్రంథాలు కూడ ఏదో ఒక బృహద్గ్రంథం యొక్క అవశిష్టరూపాలని పండితుల అభిప్రాయం. వేదాంగజ్యోతిషానికి ప్రాచీనుల, ఆధునికుల వ్యాఖ్యానాలున్నవి. ఈ వ్యాఖ్యానాలల్లో ఎన్నో మతభేధాలు కన్పిస్తున్నవి.

ప్రాచీన వ్యాఖ్యాతల్లో కాశీనివాసి, దాక్షిణాత్యుడైన సోమాకరుడు ప్రసిద్ధమైనవాడు. అతని వ్యాఖ్యానానికి ఆధునిక ప్రాచ్య పాశ్చాత్య విద్వాంసులు భాష్యాలు, టీకలు, టిప్పణులు వ్రాశారు. వాటిలో కృష్ణశాస్త్రి గోడ్బోలే, జనార్దన బాలాజి మోదక్, శంకర బాలకృష్ణ దీక్షిత్, సుధాకర ద్వివేది, శ్యామ్ శాస్త్రి, వేబర్, సర్ విలియం జోన్స్, వ్హిట్నీ, కోల్‌బ్రుక్, బెంట్లే, డేవీస్, మాక్స్ ముల్లర్, థీమే ప్రముఖమైనవారు.

వేదాంగ జ్యోతిష గ్రంథాన్ని బట్టి దాని రచయిత "లగధు"డని తెలుస్తున్నది. ఈ పేరు సంస్కృతంవలె లేకపోవటంచేత అతడెవరో విదేశీయుడని, జ్యోతిషజ్ఞానం భారతీయులకు విదేశీయులవల్ల కలిగిందని ఒక వాదం బయలుదేరింది. ఆ పుస్తకంలో మొదటి శ్లోకంలో వున్న 'శుచి' అన్న శబ్దాన్ని బట్టి అదే రచయిత పేరని కొందరు నిర్ణయించారు. కాని ఇది అంత సమంజసంగా లేదు. ఈ పుస్తకంలో చెప్పబడిన అక్షాంశాలను ఆధారంగా తద్రచయిత కాశ్మీరవాసిగాని అప్ఘనిస్థాన దేశీయుడుగాని కావలెనని పండిత విమర్శకుల అభిప్రాయం. దీని రచనాకాలంలోను అభిప్రాయాభేదాలున్నవి. భారతీయ పండితుల అభిప్రాయానుసారం దీని రచనా కాలం క్రీ.పూ. 1200. విలియం జోన్స్ మొదలైన పాశ్చాత్య విద్వాంసుల అభిప్రాయానుసారం క్రీ.పూ. 1181. డీలీస్, కోల్‌బ్రుక్ అనుసారం క్రీ.పూ. 1391 కి పూర్వం. తిలక్ క్రీ.పూ. 1400-1200 అని నిర్ణయించాడు.

వేదాంగ జ్యోతిషజ్ఞానం మొట్టమొదట బ్రహ్మకు లభించిందని, దాన్ని అతడు తన కుమారుడు వసిష్ఠునికి చెప్పాడని చెప్పబడింది. అది వసిష్ఠ సిద్ధాంతంగా ప్రఖ్యాతమైంది. మరొక కథనుబట్టి విష్ణువు సూర్యునికి జ్యోతిషజ్ఞానాన్ని ఇచ్చాడు. పులిశుడు ఒక సిద్ధాంతాన్ని వేరుగా నిర్మించి ఋషులకు ఇచ్చాడు. సూర్యుడు శాపగ్రస్తుడై యవనజాతిలో జన్మించి రోమక సిద్ధాంతాన్ని నిర్మించాడని ఒక కథ.

తర్వాత వికసించిన జ్యోతిషశాస్త్రానికి వేదాంగ జ్యోతిష గ్రంథమే మూల గ్రంథమైంది. తర్వాత జ్యోతిషశాస్త్రం సంహిత, గణిత, జాతక విభాగాలుగా వికసించింది. ఆర్యభట,

వరాహమిహిర, బ్రహ్మగుప్త, భాస్కరాచార్య మొదలైన జ్యోతిషవేత్తలు జ్యోతిషశాస్త్ర వికాసానికి చాల తోడ్పడినారు.

## అనుక్రమణిక గ్రంథాలు

వేద మంత్రాల రక్షణ కొరకు అనుక్రమణిక గ్రంథాలు రచింపబడటం జరిగింది. వీటిల్లో వేదఋషి, దేవత, ఛందస్సు మొదలైన వాటి సూచి సిద్ధంచేయబడింది. అటువంటి సూచి గ్రంథాలకు 'అనుక్రమణిక' గ్రంథాలని పేరు. ఒక్కొక్క వేదానికి ప్రత్యేకంగా అనుక్రమణిక గ్రంథాలు కూర్చబడినవి. అనుక్రమణి కర్తల్లో శౌనక, కాత్యాయనులు ప్రముఖమైనవారు. అనుక్రమణిక గ్రంథాలు వేదాంగాలల్లో చేరకున్నా వేద రక్షణకు ఇవి చాల తోడ్పడినవి. శౌనకుడు ఋగ్వేదానికి పది అనుక్రమణిక గ్రంథాలను కూర్చినట్లు ఋక్సర్వానుక్రమణి వృత్తికారుడు షడ్గురు శిష్యుడు పేర్కొన్నాడు. అవి ఆర్షానుక్రమణి, ఛందోను క్రమణి, దేవానుక్రమణి, అనువాక్ అనుక్రమణి, సూక్తానుక్రమణి, ఋక్ విధానం, పదవిధానం, బృహద్దేవత, ప్రాతిశాఖ్య, శౌనకస్మృతులు. వీటిల్లో మొదటి ఐదు అనుక్రమణులు. ఋగ్వేదంలోని ఋషి, ఛందస్సు, దేవత, అనువాక, సూక్త సంఖ్య. నామ, విశేష విషయ వివరణలు అనుష్టుపు ఛందస్సులో కూర్చబడినవి. ఋగ్విధానంలో ఋగ్వేదమంత్రాల ఫలసిద్ధిని గూర్చి చర్చింపబడింది ఇది ఒక విధంగా బ్రాహ్మణ గ్రంథాల కోవకు చెందుతుంది. ఈ విధంగా మంత్రాల ఫలసిద్ధిని గూర్చి చెప్పే విధాన గ్రంథాలు ఇతర వేదాలకు కూడ వున్నవి. శౌనకీయ ప్రాతిశాఖ్యం ప్రాతిశాఖ్యగ్రంథాల కోవకు చెందింది. బృహద్దేవత ఋగ్వేదంలోని దేవతలను గూర్చి చెప్పే గ్రంథం. దీనిలో 12 వందల శ్లోకాలున్నవి. 8 అధ్యాయాలుగా విభాగింపబడింది. దీనిలో ఋగ్వేద సూక్త సంబంధమైన ఆఖ్యానాలు కూడ చెప్పబడినవి. అందమైన కావ్య శైలిలో చెప్పబడిన ఆఖ్యానాలను సంస్కృత కథాసాహిత్యానికి ఆది గ్రంథాలుగా అంగీకరించవచ్చును. ఈ కథలు అనేకం మహాభారత కథలను పోలి వున్నవి. కాత్యాయనుడు సర్వానుక్రమణిలో, సాయణుడు వేదభాష్యంలో ఈ కథలనే ఉద్ధరించారు. ఈ గ్రంథ రచనాకాలం యాస్కుని తర్వాత, కాత్యాయనునికి పూర్వమని చెప్పవచ్చును. అపాణినీయ పదప్రయోగాలుండటం చేత పాణినికి పూర్వమనటం స్పష్టం. కాబట్టి శౌనకుడు క్రీ.పూ. 10-8 శతాబ్దాల నడుమ జీవించాడని నిర్ణయించవచ్చును. బృహద్దేవతలో మతపుష్టి కొరకు అనేక పూర్వాచార్యుల అభిప్రాయాలు చెప్పబడినవి. వారిలో యాస్క, శాకటాయన, శాకపూణి, గాలవ మొదలైనవారున్నారు. దీనిలో చాల చోట్ల ఆచార్య శౌనకుని పేరు పేర్కొనబడింది. అందుచేత దీని రచయిత శౌనకుడు కాదని మాకడోనెల్ అభిప్రాయపడినాడు. షడ్గురుశిష్యుడు బృహద్దేవతకు కర్త శౌనకుడనే పేర్కొన్నాడు .

# సర్వానుక్రమణి

సర్వానుక్రమణిని కాత్యాయనుడు రచించాడు. ఋగ్వేద సంబంధి అనేక విషయాలను తెలుసుకోవటానికి ఈ గ్రంథం చాల ఉపయోగపడ్తున్నది. ఇది సూత్ర రూపంలో వ్రాయబడింది. ఒక్కొక్క సూత్రంలో పద, ఋచల సంఖ్య, సూక్తం యొక్క ఋషి, మంత్ర, దేవతలు చెప్పబడినవి. ఇదేగాక మాధవ భట్టు వ్రాసిన ఋగ్వేదానుక్రమణి కూడ వున్నది. సర్వానుక్రమణికర్త కాత్యాయనుడున్ను, శుక్లయజుర్వేద శ్రౌతసూత్రకర్త కాత్యాయనుడున్ను ఒక్కరే అని బలదేవ ఉపాధ్యాయ అభిప్రాయం. ఇతడు, వైయాకరణుడైన కాత్యాయనుడు భిన్నమైన వ్యక్తులు.

సామవేదీయ అనుక్రమణి గ్రంథాలు అనేకం హస్తలిఖిత ప్రతుల రూపంలో వున్నవి. సామవేదీయ అనుక్రమణి గ్రంథాలల్లో కొన్ని ప్రముఖమైనవి - కల్పానుపదసూత్రం. ఉపగ్రంథసూత్రం, అనుపదసూత్రం, నిదానసూత్రం, ఉపనిదానసూత్రం, పంచవిధానసూత్రం, లఘుఋుక్ తంత్ర సంగ్రహం, సామసప్తలక్షణం మొదలైనవి

అథర్వవేదీయ అనుక్రమణిక గ్రంథాలు - చతురధ్యాయి, ప్రాతిశాఖ్య, పంచపటలిత, దంత్యోష్ఠవిధి, బృహత్సర్వానుక్రమణికలు. బృహత్సర్వానుక్రమణిలో 20 కాండాలున్నవి. దీనిలో అథర్వవేదంలోని మంత్ర, ఋషి, దేవతా, ఛందస్సుల వివరణలు ఇయ్యబడినవి. ఇవేగాక అథర్వవేదార్థబోధనలో ఉపయోగపడే నక్షత్ర కల్పం, అంగిరసకల్పం, శాంతికల్పం, అథర్వవశిష్టం మొదలైన గ్రంథాలున్నవి. శౌనకవిరచితమైన చరణవ్యూహసూత్రంలో చతుర్వేద శాఖల క్రమంలో ఖండవివరణలున్నవి. ద్యాద్వివేది విరచిత నీతిమంజరిలో ఋగ్వేదంలోని ఆఖ్యానాలు, అవి బోధించే నీత్యుపదేశాలు చెప్పబడినవి. ఇది అర్వాచీన గ్రంథం. క్రీ.శ. 1494లో రచింపబడింది. సాయణుని భాష్యాన్ని ఇతడు పేర్కొన్నాడు. బృహద్దేవత తర్వాత ఋగ్వేదీయమైన ఆఖ్యానాల పరిచయానికి ఈ గ్రంథం మహత్త్వపూర్ణమైంది.

# వేదరచనాకాలం

ప్రాచీన భారతీయ సంప్రదాయానుసారం వేదాలు అపౌరుషేయాలు, అనాదియైనవి. అందుకని వాటి రచనా కాలాన్ని వారెప్పుడూ నిర్ణయించటానికి ప్రయత్నించ లేదు. యాస్కుని నాటికి వేదాలల్లో ఐతిహాసికత వున్నదన్న అభిమతమున్నా, వాటి రచనా కాలాన్ని గూర్చి ఎవరూ పట్టించుకోలేదు. ఆధునికయుగంలో వేదరచనాకాలాన్ని నిర్ణయించటానికి పండితులు ప్రయత్నించారు. కాని వారిలో అభిమతైక్యత కుదరలేదు. అయినా అవి

గౌతమబుద్ధుని కన్న చాల పూర్వ రచనలని, మహాభారత రచయిత వ్యాసుని నాటికి వాటి రచన పూర్తి అయిందని మాత్రం అందరూ అంగీకరించారు. మంత్రసంహితల్లో భాషను పరిశీలించి ఋగ్వేదంలోని మంత్ర రచనా కాలానికి, అథర్వవేదంలోని మంత్ర రచనా కాలానికి నడుమ చాల ఎడమున్నదని పండితులు నిర్ణయించారు. అసలు ఋగ్వేదంలోని పది మండలాలల్లోని భాష ఒక్క తీరుగా లేదని, ఒక్క కాలానికి చెందినది కాదని పండితులు అభిప్రాయపడ్డున్నారు. ఋగ్వేదంలోని దశమ మండలం భాషాదృష్టితో పరిశీలించినట్లయితే ముందున్న తొమ్మిది మండలాల్లోని భాషకన్న భిన్నంగా వున్నదని, అది వాటికన్న అర్వాచీన రచన అని పండితులు నిర్ణయించారు. వేదాలల్లోని మంత్రసూక్తాలన్నీ ఏకకాల కృతాలు కావని, వాటి రచనలో కొన్ని వందల సంవత్సరాల భేదం వున్నదని ఆధునిక పండితుల అభిప్రాయం. వేదాల రచనాకాలాన్ని నిర్ణయించటానికి మొదట ప్రయత్నంచిన వారు పాశ్చాత్యులు. వారిలోను ఋగ్వేదాన్ని విశేషంగా అధ్యయనం చేసి తద్రచనా కాలాన్ని నిర్ణయించటానికి మొదట ప్రయత్నించినవాడు మాక్స్‌ముల్లర్.

**మాక్స్‌ముల్లర్ మతం** - బుద్ధుడు క్రీ.పూ. 477లో నిర్యాణం చెందాడు. అప్పటికే బౌద్ధ ధర్మం వ్యాప్తి చెందింది. అంటే క్రీ.పూ. 6వ శతాబ్దం నాటికి బుద్ధుని జననం, బౌద్ధ ధర్మోదయం జరిగింది. బౌద్ధమతం ఉదయించకముందే వైదిక సాహిత్యోదయమైందని మాక్స్‌ముల్లర్ అభిప్రాయం. వైదిక సాహిత్యాన్నంతటిని అతడు నాలుగు యుగాలుగా విభజించాడు - ఋక్‌యుగం, మంత్రయుగం, బ్రాహ్మణయుగం, సూత్రయుగం. ఒక్కొక్క యుగం వికసించటానికి రెండు వందల సంవత్సరాల సమయాన్ని అతడు నిర్ణయించుకొన్నాడు. సూత్రయుగం క్రీ.పూ. 600-200 నడుమ అని అతడు నిర్ణయించి, క్రమంగా బ్రాహ్మణయుగాన్ని క్రీ.పూ. 800-600 అని, మంత్రరచనాకాలాన్ని క్రీ.పూ. 1000-800 అని, ఋక్ రచనా కాలాన్ని క్రీ.పూ. 1200-1000 అని నిర్ధారించాడు. వేదరచనా కాలాన్ని నిర్ణయించటం సులభకార్యం కాదని అతనికి తెలుసును. కాలనిర్ణయంలో గల సాధక బాధకాలను పరిశీలిస్తూ మాక్స్ ముల్లర్ వేదాలు ప్రపంచసాహిత్యంలో ఆది గ్రంథాలని, ప్రపంచంలో జ్ఞానోదయారంభం వాటిలో జరిగిందని అంగీకరించాడు. ఎక్కువ భాషాదృష్టితోనే పరిశీలించి మాక్స్‌ముల్లర్ వేదాల కాలనిర్ణయాన్ని చేయటానికి పూనుకొన్నాడు. తర్వాత కోల్‌బ్రుక్, విల్సన్, కీత్, మాక్‌డోనెల్ మొదలైన పాశ్చాత్య పండితులు మాక్స్‌ముల్లర్ కాలనిర్ణయాన్ని అంగీకరించారు. కాని భారతీయ ప్రాచీన రచనలను కేవలం క్రీ.పూ. 1200 నాటివని నిర్ణయించటం సమంజసం కాదని, అది పక్షపాతపూర్ణమైందని భారతీయ విద్వాంసులు కొందరు ఖండించారు. ప్రపంచంలోనే ప్రాచీన రచనలుగా చెప్తూ వాటి

రచనాకాలాన్ని క్రీ.పూ. 1200 అని మాత్రమే చెప్పటం సరిగ్గా లేదు. అయితే మాక్స్‌ముల్లర్ నాటికి పురాతత్వశాస్త్రసత్యాలు చాలా మట్టుకు బయటపడలేదు. లభ్యమైన ఆ శాస్త్రసత్యాలనైనా మాక్స్‌ముల్లర్ వేదకాల నిర్ణయానికి పరిగణించినట్లు లేదు.

**వింటర్‌నిట్స్ మతం** - వైదిక రచనాకాలాన్ని వింటర్‌నిట్స్ మొదట క్రీ.పూ. 2500-200 నడుమ అని నిర్ణయించాడు. తర్వాత అతడు ఈ అభిప్రాయాన్ని అంగీకరించటంలో ఒక బాధ వున్నదని అభిప్రాయపడినాడు. ఋగ్వేదంలోని భాషకున్ను క్రీ.పూ. 7వ శతాబ్దం నాటిదైన జరోష్ట్రియన్ల పవిత్రగ్రంథం "అవెస్తా"లో వున్న, మరియు క్రీ.పూ. 6వ శతాబ్దం నాటి ఇరానియన్ శిలాశాసనాల్లో వున్న భాషలకున్ను చాల సామ్యం వుండటం చేత ఋగ్వేదనిర్మాణకాలాన్ని క్రీ.పూ. 2500 అని నిర్ణయించటానికి వీల్లేదని అతడు అభిప్రాయపడినాడు. పాణిని వ్యాకరణంలో నిర్దేశింపబడిన మరియు క్రీ.పూ. 3వ శతాబ్దం నాటి అశోకుని శిలా శాసనాల్లోని భాషకు వేదాల్లోని భాషకు చాల దూరం లేదని, వాటి నడుమ వేల సంవత్సరాలు వుండటానికి సాధ్యంకాదని వింటర్‌నిట్స్ అభిప్రాయం. కాని క్రీ.పూ. 2000, 2500 నాటి నుంచే వేదరచనాబీజాలు వున్నవని మాత్రం అతడు అభిప్రాయపడినాడు. వైదిక సాహిత్యమంతా క్రీ.పూ. 2500-500 నడుమ పూర్తి అయిందని అతడు తేల్చాడు. వేదాల ప్రాచీనత్వాన్ని తోసి పుచ్చినా చివరకు దాని ఆరంభకాలాన్ని క్రీ.పూ. 2500 నాటి వరకు తీసుకొని పోక అతనికి తప్పలేదు.

**బాలకృష్ణ దీక్షిత్ మతం** – దీక్షిత్ జ్యోతిషశాస్త్ర సహాయంతో వేద రచనాకాలాన్ని నిర్ణయించటానికి పూనుకొన్నాడు. శతపథ బ్రాహ్మణంలో చెప్పబడిన కృత్తికానక్షత్ర స్థానాన్ని బట్టి ఆ బ్రాహ్మణరచనాకాలాన్ని విక్రమశకానికి పూర్వం 3000 అని చెప్పాడు తైత్తిరీయ సంహితలో చెప్పబడిన కృత్తికాస్థానాన్ని బట్టి ఆ సంహిత శతపథబ్రాహ్మణానికి ప్రాచీనరచన అని తెలుస్తున్నదని, అప్పుడు ఋగ్వేదరచనా కాలాన్ని విక్రమశకానికి పూర్వం 3500 కు ప్రాచీనమే గాని అర్వాచీనం కాదని నిర్ణయించాడు.

**యాకోబి మతం** – యాకోబి జ్యోతిషశాస్త్ర ప్రవీణుడు. వైదిక సాహిత్యంలో చెప్పబడిన నక్షత్రాల స్థితినిబట్టి అతడు వేదాల కాల నిర్ణయానికి పూనుకొన్నాడు. కల్పసూత్రంలోని వివాహ ప్రకరణంలో "ధ్రువ ఇవ స్థిరా భవ" అన్న వచనాన్ని ఆధారంగా తీసుకొని ధ్రువ నక్షత్రం క్రీ.పూ. 2700 సంవత్సరంలో అట్టి స్థితిలో వున్నదని నిర్ణయించి తదాధారంగా వేదాల రచనాకాలాన్ని క్రీ.పూ. 4500 అని అతడు నిర్ణయించాడు.

**బాలగంగాధర తిలక్ మతం** - యాకోబి వలెనే తిలక్ జ్యోతిషశాస్త్రం ఆధారంగా వేదరచనా కాలాన్ని నిర్ణయించటానికి పూనుకొన్నాడు. నక్షత్రాల స్థితి కాలాన్ని బట్టి తిలక్ సంహిత, బ్రాహ్మణాదుల రచనాకాలాన్ని నిర్ణయించాడు. మంత్ర సంహితల కాలంలో మృగశిరనక్షత్రం రాత్రిపవళ్ళను సమానంగా విభజించి లెక్కించటానికి తోడ్పడే స్థితిలో వుండేదని, జ్యోతిషశాస్త్రానుసారం తిలక్ ఆ స్థితిని లెక్కించి మంత్ర సంహితల రచనాకాలాన్ని క్రీ.పూ. 6500 అని నిర్ణయించాడు. మంత్ర రచనలకు కొన్ని వందల సంవత్సరాలు కాక కొన్ని వేల సంవత్సరాలు పట్టిందని క్రీ.పూ. 8500 నాటి నుంచే మంత్రరచనలు చేయటం ఆరంభమైందని అతని అభిప్రాయం.

ఇరాన్ (పర్షియా) దేశంలో వెలసిన జరతుష్ట్రమతానికిన్ని, వైదిక మతానికిన్ని చాల పోలికలు కన్పించినవి. వైదికార్యులవలెనే జరతుష్ట్రమతానుయాయులు అగ్న్యారాధకులు. వారికి పవిత్రమైన గ్రంథం 'జెంద్ అవెస్తా'. ఆ గ్రంథంలో పేర్కొనబడిన దేవతలు వేదాల్లో పేర్కొనబడినవారే. వేదాల్లోని యమ, మిత్ర, వరుణ, అగ్ని, ఇంద్ర, వృత్ర, సోమ మొదలైన దేవతలు అవెస్తాలో ప్రధానమైన దేవతలు. సోమలత పర్వతాలల్లో పెరుగుతుందని, సోమలత పెరిగే స్థలం స్వర్గమని, శ్యేనం ద్వారా సోమరసం తేబడుతుందని, సోమరసాన్ని పాలల్లో కలుపుకొని తాగుతారని అనేక విషయాలు వేదంలోవలెనే అవెస్తాలోను చెప్పబడినవి. సోమరసపానం ఇండో- ఇరానియన్ ఆర్యులు కలిసి జీవించిన కాలంనాటి ఆచారమని మాక్‌డోనెల్ మొదలైనవారు తేల్చారు. అవెస్తాలో 'సోమ' 'హోమ'గా పేర్కొనబడింది. అవెస్తాలో ఇంద్రుడు పేర్కొనబడినా, అతనికి వైదికార్యులిచ్చిన ఉన్నతస్థానం ఇయ్యబడలేదు. ఇంద్రుడు వృత్రుని చంపినవాడుగా, వృత్రఘ్నుడుగా అవెస్తాలో పేర్కొనబడినాడు. అవెస్తాలోని పద్యపాదాలను కొద్దిపాటి స్వరనియమాలను (Phonetic laws) పాటిస్తూ ఋక్కులుగా చదువవచ్చును. భాషలో సామ్యమేకాక ఛందస్సుల్లోను, కవిత్వం, భావప్రకటనల్లోను చాల సామ్యాలున్నవని మాక్‌డోనెల్ అభిప్రాయం. ఈ సామ్యాలను దృష్టిలో పెట్టుకొని మాక్‌డోనెల్, వింటర్‌నిట్స్ మొదలైన పాశ్చాత్య పండితులు ఋగ్వేదకాలాన్ని క్రీ.పూ. 4000-3000 వరకు తీసుకొని పోవటానికి నిరాకరించారు. బుద్ధుని జననంనాటికి ఉపనిషత్పర్యంతమైన వైదిక సాహిత్యోదయం జరిగిందని వారు ఏకకంఠంతో అంగీకరించినా క్రీ.పూ. 6వ శతాబ్దంనాటిదైన అవెస్తా మరియు ఆనాటివే అయిన పర్షియన్ శిలాశాసనాలల్లోని భాషకు ఋగ్వేదభాషకు చాల సామ్యాలుండటంచేత ఋగ్వేదరచనా కాలం అతి ప్రాచీనమైందిగా అంగీకరించటానికి వారికి అపత్తి కలుగుతున్నది. ఇటువంటి పరిస్థితిలో పశ్చిమ ఏశియాలోని ఆధునిక టర్కీ దేశంలో దొరికిన మట్టి ఫలకాలు ఈ వాదానికున్న ప్రతిబంధకాన్ని తొలగించేవిగా వున్నవి.

ఈ మట్టి ఫలకాలు హిట్టైట్ రాజుకు, మితాన్ని రాజుకు నడుమ క్రీ.పూ. 1367లో జరిగిన సంధి ఒప్పంద సమయంలో వ్రాయబడినవి. ఈ సంధి ఒప్పందం హిట్టైట్ రాజు 'సుబ్బిలు-ఉ-మా'కును మితాన్ని రాజు 'మత్తిఉజా'కును నడుమ జరిగింది. మత్తిఉజా తండ్రి 'దశ్రత్త'

'దశ్రత్త' సోదరుడు 'అర్తశుమార' చంపబడగా అతడు రాజైనాడు. దశ్రత్తకు మరొక సోదరుడు 'అర్తతమ'. వీరి తండ్రి పేరు 'శుతర్ణ'. దశ్రత్త రాజు కావటం అర్తతమకు ఇష్టం లేదు. కాని దశ్రత్తుని ఏమీచేయలేక ఊరుకొన్నాడు. ఎప్పుడైతే దశ్రత్తుని తర్వాత మత్తిఉజా రాజైనాడో అప్పుడు అర్తతమ కొడుకు 'శుతతత్ర' అతన్ని రాజ్యభ్రష్టుని చేసి సింహాసనాన్ని ఆక్రమించుకొన్నాడు. హిట్టైట్ రాజు 'సుబ్బిలుఉమా' మితాన్ని వంశంతో తనకున్న పూర్వ వైరాన్ని విస్మరించి తన కూతురును మత్తిఉజాకు ఇచ్చి వివాహం చేసి, మితాన్ని సింహాసనంమీద అతన్ని కూర్చోబెట్టినాడు. ఆ వివాహ సందర్భంలో సుబ్బిలుఉమాకు మత్తిఉజాకు నడుమ జరిగిన సంధి సమయంలోని ఒప్పందాలు మట్టి ఫలకాలమీద వ్రాయబడినవి. ఈ మట్టి ఫలకాలు పశ్చిమ ఏశియాలోని ఆధునిక టర్కీ దేశంలో 'బోగజ్‌కుయి' అన్న ప్రదేశంలో దొరికినవి. కాబట్టి వాటిని బోగజ్‌కుయి మట్టిఫలకాలని అంటారు. ఈ సంఘటన క్రీ.పూ. 1367 నాటిది. ఈ సంధి ఒప్పంద సమయంలో బాబిలోనియాలో హిట్టైట్ రాజులు పూజించే దేవతలే కాక మితాన్ని రాజులు పూజించే వరుణ, ఇంద్ర, నాసత్యదేవతలు సాక్షులుగా పేర్కొనబడినారు. ఈ దేవతలు వేదాల్లోని దేవతలు కావటం గమనార్హం. తర్వాత మితాన్ని రాజుల పేర్లు 'అర్తతమ, శుతతత్ర, దశ్రత్త' అనేవి అర్తతమ, శుతర్ణ, దశరథ అనే సంస్కృత నామాలుగా వున్నవి. దీని ఆధారంగా మితాన్ని రాజులు ఆర్యులు, వైదిక దేవతారాధకులని తెలుస్తున్నది. అయినా మితాన్ని ఆర్యులు ఏ దేశానికి చెందినవారన్న విషయంలో చారిత్రకుల్లో, సాహిత్య విమర్శకుల్లోను అభిప్రాయబేధాలున్నవి. మితాన్ని రాజులు ఇండో-ఇరానియన్ ఆర్యుల శాఖలోని వారని, ఇరాన్ దేశం నుంచి వలసపోయినవారని కొందరు అభిప్రాయపడగా, వారు పూర్తిగా భారతీయార్యులే అని భారతదేశం నుంచి వలసపోయినవారే అని మరికొందరు అభిప్రాయపడినారు. మేయర్, పి. గైల్స్ అనే చారిత్రకులు బోగజ్‌కుయి మట్టి ఫలకంలో పేర్కొనబడిన దేవతలు ఇండో - ఇరానియన్ యుగానికి చెందిన వారుగా గుర్తించారు. అంటే భారతీయార్యులు ఇరానియన్ ఆర్యులు చీలిపోక ముందు కలిసి జీవిస్తున్న కాలంనాడు వారిచేత ఆరాధింపబడిన దేవతలని వారి అభిప్రాయం. ఇండో-ఇరానియన్ ఆర్యశాఖలోని ఒక కుటుంబమే మితాన్ని రాజులు అని వారు చెప్పారు. మితాన్ని రాజులు ఇండో - ఇరానియన్ ఆర్యశాఖకు కాక పూర్తిగా వారు భారతీయార్య శాఖకు చెందినవారని ఓల్డెన్‌బెర్గ్ అనే సంస్కృత విద్వాంసుని అభిప్రాయం. మట్టి ఫలకంలో చెప్పబడిన వరుణ, మిత్ర,

ఇంద్ర, నాసత్య దేవతల పేర్లు, ఉచ్చారణలు భారతీయుల వైదిక దేవతల పేర్లకు, ఉచ్చారణలకు దగ్గరగా వున్నవని, వీరు ప్రత్యేకంగా భారతీయ దేవతలే అని యాకోబి, కోనో, హిల్లేబ్రాంట్, వింటర్‌నిట్జ్‌లు అభిప్రాయబడినారు. ఆర్యులు ఏదో ఒక్కసారే కాక దశల వారిగా భారతదేశంలో ప్రవేశించటమేకాక కొంతమంది భారతదేశం నుంచి పశ్చిమ ఏశియాకు పోయి రాజ్యాలను స్థాపించారని మితాన్ని రాజుల చరిత్ర చెప్తున్నది. ఋగ్వేదకాలం నాడు సప్త సింధులో నివసించిన ఆర్యులకు పశ్చిమ ఏశియాలోని దేశాలతో ఎక్కువ పరిచయ సంబంధాలుండేవి. క్రమక్రమంగా వారు భారత ప్రాచ్యభూములకు వ్యాపించేకొద్ది పూర్వపరిచయాలు తగ్గుతూ వచ్చినవి. కాబట్టి సప్తసింధులో వున్ననాడే భారతీయార్య కుటుంబాలు పశ్చిమ ఏశియా దేశాలకు పోయి రాజ్యాలు స్థాపించినారనటంలో ఏమి అసంభావ్యత లేదు. క్రీ.పూ. 1380-1362 నడుమ ఈజిప్టును పాలించిన నాల్గవ 'ఆమెన్‌హెతప్' అనేరాజు గొప్ప సూర్యారాధకుడు. అంతకుముందు ఈజిప్టు రాజులు పూజించిన దేవతల ఉనికిని అతడు నిరాకరించి 'ఆతెన్' అన్న సూర్యున్ని ఏకైక దేవునిగా అంగీకరించి పూజించాడు. ఈరాజు తల్లి ఆర్యరాజులైన మితాన్ని వంశ రాకుమార్తె కాబట్టి ఈ సూర్యారాధన ఆమె నుంచే అతనికి సంక్రమించి వుంటుంది. 'ఆమెన్‌హెతెప్' తనను తాను 'అఖెనాతెన్' (Pleasing to the Sun disk) అని పిలుచుకొన్నాడు. సర్.ఇ.ఏ.బడ్జ్ అనే చారిత్రకుని అభిప్రాయానుసారం అఖెనాతన్ సూర్యారాధన వైదికార్యుల మిత్ర, సావిత్రి, సూర్య ఆరాధనలను పోలి వున్నది. సూర్యుని శక్తి, సౌందర్యాలను గూర్చి అఖెనాతన్ చెప్పిన సూక్తాలు వేదాల్లోని సూక్తాల్లోని భావాలను పోలివున్నవని సర్‌బడ్జ్ అభిప్రాయపడినాడు. ఏషియా మైనర్‌లో పరిపాలించిన కస్సైట్ అనే వంశరాజులు కూడ 'మరుత్తష్' పేరుతో మరుత్తులను, 'సురియష్' అన్న పేరుతో సూర్యున్ని ఆరాధించినట్లు తెలుస్తున్నది. మితాన్ని రాజుల లాగానే కస్సైట్ రాజులు కూడ భారతీయార్యులే. వీరివి సమకాలిక రాజవంశాలే. ఇంద్రుడు భారతీయార్యులకే ప్రధానదేవత. ఇరానియన్లకు కాదు. బోగజ్‌కుయి మట్టిఫలకంలో సంధికి సాక్ష్యంగా ఇంద్రుడు కూడ పేర్కొనబడినాడు. కాబట్టి మితాన్ని రాజులు భారతీయార్యులు కావటంలో ఏమి సందేహం అవసరం లేదు. దీన్నంతాబట్టి భారతీయ వైదికదేవతలను ఆరాధించే ఆర్యరాజవంశాలు పశ్చిమ ఏశియాలో క్రీ.పూ. 14వ శతాబ్దం నాటికే వుండేవని తేలుతున్నది. అంటే ఋగ్వేద దేవతలు, ఆ దేవతల స్తుత్యారాధన క్రీ.పూ. 14వ శతాబ్దం నాటికే వున్నదని కచ్చితంగా చెప్పడానికి వీలవుతున్నది. అటువంటప్పుడు క్రీ.పూ. 6వ శతాబ్దం ప్రాంతందైన 'అవెస్తా' లోని భాషకు ఋగ్వేద భాషకు సామ్యమున్నదని, కేవలం దాని ఆధారంగా వేద రచనా కాలం క్రీ.పూ. 700-200 అనే వింటర్‌నిట్జ్, హెర్టెల్ వంటి పండితుల నిర్ణయం సరికాదని తేలుతున్నది.

క్రీ.పూ. 6వ శతాబ్దం నాటిదని అంగీకరింపబడిన జరోష్ట్రియన్ల పవిత్ర గ్రంథమైన అవెస్తాలోని భాషను, ఋగ్వేదంలోని భాషకు గల సామ్యాన్ని, సామీప్యాన్ని బట్టి ఋగ్వేద రచనాకాలాన్ని క్రీ.పూ. 1000-1200 అని కూడా నిర్ణయించటం మరొకవిధంగా కూడ సమంజసంగా లేదు. క్రీ.పూ. 1000 ప్రాంతం వాడైన యాస్కుని నాటికి వైదిక శబ్దాలు దేవతలు కొన్ని అవగాహనకు దూరమైనవి. మరికొన్నిటి అర్థనిర్ణయంలో మతభేదం ఏర్పడింది. ఉదా॥కు 'నాసత్య' దేవత నిర్ణయంలో అభిప్రాయభేదం కన్పిస్తున్నది. 'నాసత్య' అంటే "అసత్యం కాని" అంటె సత్యస్వరూపుడైన దేవత అని కొందరు అర్థాన్ని నిర్ణయించారు. యాస్కుడు 'నాసత్య' అంటే ముక్కు(నాస) నుంచి పుట్టినవాడని అర్థం చెప్పాడు. దీన్నిబట్టి శబ్దార్థ నిర్ణయంలో, దేవతల స్వరూప నిర్ణయంలో వైదికకాలం నాటి నిజమైన అభిప్రాయాలు విస్మృతాలై యాస్కునినాటికి అభిప్రాయభేదాలు ఏర్పడినవని తెలుస్తున్నది. కాబట్టి వేదరచనలకు యాస్కునికి నడుమ కొన్ని వందల సంవత్సరాలు జరిగిపోయినాయని, అందుకే నిజమైన అర్థాలు విస్మృతాలైనాయని చెప్పవలసివుంటుంది. యాస్కునికి పూర్వుడైన కౌత్సుడు దురవగాహ్యం, అర్థవిహీనం, భిన్నార్థాలుగల వేదమంత్రాలకు అర్థం చెప్పబూనుకోవటం వ్యర్థమని చెప్పాడు. దీన్నిబట్టి యాస్కుని(క్రీ.పూ. 10వ శతాబ్దం) నాటికే కాదు, అంతకుపూర్వమే వేదాలు దురవగ్రాహ్యాలు, ఏకాభిప్రాయం కుదరనివి అయినవి. ఇట్లా జరగటానికి కారణం, అప్పటికే అవి ప్రాచీన రచనలు కావటం, మరియు వైదిక ప్రజలకు ఇతర జాతులతో, సంస్కృతులతో బాగా పరిచయమేర్పడి ప్రభావితులు కావటం అని ఊహించవచ్చును. ఇదంతా జరగటానికి కొన్నివందల సంవత్సరాలైనా పట్టివుండవచ్చును. వేదవ్యాసుడు మహాభారత కాలంనాటివాడు. అంటే క్రీ.పూ. 12వ శతాబ్దం ప్రాంతంవాడన్నమాట. అతడు వైదిక మంత్రాలను క్రమరూపంలో విభజించి సంకలనం చేసినవాడు. అప్పుడు వేదవ్యాసుని నాటికి మంత్రరచన సమాప్తమైనదని తెలుస్తున్నది. దీన్ని బట్టి వేదమంత్రాల్లోని అర్వాచీన మంత్రాల రచన దాదాపుగా క్రీ.పూ. 12వ శతాబ్దం ప్రాంతంలో జరిగిందని నిర్ణయించవచ్చును. వేదమంత్రాలన్నీ ఒక్క కాలంలో వ్రాయబడినవి కావని, భాషాదృష్టితో, ఉచ్చారణల దృష్టితో, దేవతా ప్రాధాన్య విభేదం దృష్టితో పరిశీలిస్తే స్పష్టమౌతున్నది. ఋగ్వేదంలోని సూక్తాల్లోనే ఈ విభేదం కనిపిస్తున్నదంటే ఋగ్వేద, అథర్వ వేదాల్లో వున్న విభేదం చెప్పనవసరంలేదు. ఋగ్వేదంలోని ఉచ్చారణలు అథర్వవేదం నాటికి మారిపోయినవి. అథర్వవేదంలోని శబ్దాల ఉచ్చారణ లౌకిక సంస్కృతోన్ముఖమై కన్పిస్తున్నది. కాబట్టి వేదమంత్రాల ప్రారంభ రచనలకు, అంతిమ రచనలకు మధ్య కొన్ని వందల సంవత్సరాల ఎడమున్నదని అంగీకరించవలసి వుంటుంది. వేదాలను సంకలనం చేసిన వేదవ్యాసుని కాలం మరియు బోగజ్కుయి మట్టి

ఫలకం కాలం ఆధారంగా వేదరచనా సమాప్తికాలాన్ని క్రీ.పూ. 1500-1200గా చెప్పవచ్చును. మొత్తం మంత్ర రచనలకు 500, 1000 సంవత్సరాలు పట్టిందనుకుంటే వేద రచనాకాలాన్ని క్రీ.పూ. 2000-2500 అని నిర్ణయించవచ్చును.

జరోష్ట్రియన్ల పవిత్ర గ్రంథం అవెస్తా క్రీ.పూ. 6వ శతాబ్దంలో వ్రాయబడిందని పండితుల అభిప్రాయం. జరోష్ట్రియన్ మత ప్రవర్తకుడు జరతుష్ట్ర ఆ కాలం వాడు కాదని విమర్శకుల నిర్ణయం. జరోష్ట్రియన్ మతం జరతుష్ట్రకంటె ప్రాచీనమైంది. క్రీ.పూ. 6వ శతాబ్దంవాడైన జరతుష్ట్ర జరోష్ట్రియన్ మతాన్ని సంస్కరించి బోధించిన ఆచార్యుడు. కాని ఆ మతాన్ని కొత్తగా బోధించినవాడు కాదు. కాబట్టి జరోష్ట్రియన్ మతం క్రీ.పూ. 6వ శతాబ్దం నాటికన్న ప్రాచీనమైంది అంటే ఋగ్వేద కాలానికి సమకాలికమైంది. అటువంటప్పుడు 'అవెస్తా' భాష ఋగ్వేద భాషల్లో సామ్యమున్నట్లయితే, ఋగ్వేదాన్ని క్రీ.పూ. 6వ శతాబ్దానికి చెందిందని లాగే అవసరం లేదు. జరోష్ట్రియన్ ఆర్యులు, ఋగ్వేదార్యులు కలిపివున్నప్పుడు వారి మతం ఒక్కటిగా వుండేది. వారి ఆరాధ్యదేవతలు ఒక్కటిగా వుండేవారు. వారు విడిపోయిన తర్వాత ఋగ్వేదార్యులు సింధుప్రాంతంలో ప్రవేశించినప్పుడే తమవెంట ఆరాధ్యదేవతల స్తుతిపూర్వకమైన సూక్తాలను తెచ్చుకొనివుంటారు. ఆ తర్వాత సింధు ప్రాంతంలో ఇంకా క్రమక్రమంగా ప్రాచ్య భూముల్లోని భారతీయ ప్రజలతో సంబంధమేర్పడినప్పుడు ఆ ప్రజల భాషల ప్రభావంచేత వారి భాషలో చాల తొందరగా చాలా మార్పులు ఏర్పడివుంటవి. అందుకే ఋగ్వేదంలోని వివిధ సూక్తాలల్లోని భాషలో చాల భేదం కన్పిస్తున్నది. అథర్వణవేద మంత్రాల భాషలో ఇంకా చాల భేదం అందుకే కన్పిస్తుంది. అంటే ఆ వివిధ సూక్తాల భాషలో మార్పు కాలభేదం వల్లనే కాక ఇతర జాతులతో సంపర్కం వల్లను వచ్చి వుంటుంది. మరియు అథర్వణవేదంలోని కొన్ని మంత్రాలు సంస్కృత భాషను గ్రహించిన ఆర్య అనార్య సంకరజాతులవారో, అనార్యజాతులవారో వ్రాసినవి కూడ కావచ్చును. తన్మూలంగానే భాషలోనేకాక వర్ణ్య విషయంలోను భేదం కన్పిస్తున్నది.

## ఇండో - యూరోపియను ఆర్యుల మతం

పాశ్చాత్యులు ఎప్పుడైతే వైదిక ధర్మాన్ని గూర్చి తెలుసుకున్నారో అప్పుడు వారికి ప్రాచీన యూరోపియన్ల మతానికి వైదికమతానికి చాల పోలికలు కనిపించినవి. అట్లా పోలికలు వుండటానికి కారణం ప్రాచీన వైదిక మతానుయాయులు, ప్రాచీన యూరోపియన్లు ఒక్క స్థానానికి, ఒక్క జాతికి చెందివుండటమే అని వారు నిశ్చయించారు. ఆ జాతికి వారు ఆర్యులని నామకరణం చేసారు. సత్పురుషున్ని, సచ్చరిత్రున్ని, నాగరికత గల వ్యక్తిని 'ఆర్య' అని సంబోధించటం ప్రాచీన భారతంలో వుండేది. అదే 'అజ్జ , జీ, అచ్చ, అయ్య'

అని భారతీయ దేశభాషల్లో రూపాంతరం చెంది కన్పిస్తున్నది. కాని ప్రాచీన భారతీయసాహిత్యంలో ఎక్కడా జాతి పేరుతో 'ఆర్య' శబ్దం వాడబడలేదు. వేదాలల్లో "పంచజనాః. పంచమానుషాః, పంచక్షితయః" మొదలైన పేర్లతో ఐదు జాతులు మాత్రం పేర్కొనబడినవి. వారు -యదు, తుర్వస, అను, ద్రుష్య, పురు అనబడే జాతులు. ఇవిగాక తృత్సు, నహుష, సృంజయ, వృచీవంత, భరత (భరతజాతిలోనే పురు మరొక శాఖ) జాతులు ఋగ్వేదంలో పేర్కొనబడినవి. కాని వీరందరు 'ఆర్య' జాతి పేరుతో ఎక్కడా పేర్కొనబడలేదు. "ఆర్యజాతి" నామకరణం ఆధునిక పాశ్చాత్య విద్వాంసులు చేసింది. 'ఇరాన్' అన్న ప్రాంతం పేరు 'ఆర్య' శబ్దం నుంచే వచ్చిందని ఆ ప్రదేశంలో చాలా కాలం ఆర్యులు నివాసమేర్పరుచుకోవటంచేత దానికి ఆ పేరు కలిగిందని అంటారు. భారత దేశంలో మధ్య దేశానికి ఆర్యావర్తమనే పేరు ప్రాచీన కాలంలో వుండేది. అక్కడ నాగరికత చెందిన, యజ్ఞయాగాదులను అనుష్ఠించేవారు నివసించటం చేత దానికి ఆ పేరు కలిగివుంటుంది. కాని-జాతి పేరుగా మాత్రం కాదు. మొత్తం మీద యజ్ఞయాగాదులను అనుష్ఠించే జాతి ప్రత్యేకంగా బయట నుంచి వలస వచ్చిందని, వారికి ఆర్యులని పాశ్చాత్యులు నామకరణం చేశారు. ఇక్కడ నుంచే ఒక శాఖ విడిపోయి ఏశియామైనర్ (ఆధునిక టర్కీ) కు వలసపోయి అక్కడ మితాన్ని, కస్సైట్ వంశాల పేర్లతో రాజ్యం చేశారని, భారతదేశంలో సప్త సింధువులో వున్న ఆర్యులు భరతాది వంశాలుగా ప్రసిద్ధమైనారని ఓల్డెన్‌బెర్గ్, మాక్స్‌ముల్లర్‌వంటి విమర్శకుల అభిప్రాయం. కాని భారతీయ సనాతన విద్వాంసులు దీనికి వ్యతిరేకంగా తమ అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. భారతదేశమే వైదికధర్మానికి జన్మభూమి అని ఇక్కడినుంచే అగ్ని, వరుణ, ఇంద్ర ఆరాధకులైన వైదికజాతులు ఇరాన్ దేశం, ఏశియా మైనర్‌లకు వలసపోయి తమ ధర్మాన్ని వ్యాపింపజేసారని, రాజ్యాలను స్థాపించారని వారు అంటారు. అప్పుడు అఫ్ఘనిస్థానం వరకు భారతదేశంగానే పరిగణింపబడేది. కాబట్టి అప్పటి భారతీయ మత సంస్కృతులు దూర పశ్చిమ ప్రాంతాల వరకు, మధ్య ఏశియా వరకు సులభంగా పాకినవని వారు అభిప్రాయపడినారు. సమస్త ప్రాచీన ధర్మాలకు అంటె జరోష్ట్రియన్, గ్రీకు, రోమన్, యహూది మతాలకు వైదిక ధర్మమే ప్రాతిపదిక, మూలం అని వారి విశ్వాసం.

ప్రకృతి శక్తులను పూజించే, ఆ శక్తులకు హవిస్సులను అర్పించి ఆరాధించే జాతి అంటే ఆర్యజాతి మొదట మధ్య ఏశియా ప్రాంతంలో నివసించే వారని, వారు కాలక్రమేణ యూరోపుకు, ఇరాన్‌కు, పశ్చిమ ఏశియాకు, భారత దేశానికి వలసపోయినారని ఆధునిక విమర్శకుల అభిప్రాయం. అయినా వారిలో ఆర్యజాతి మూల నివాస స్థానమేది అన్న విషయంలో ఏకాభిప్రాయం లేదు. మాక్స్‌ముల్లర్ అనుసారం ఆర్యజాతి మూలనివాస ప్రాంతం మధ్య ఏశియా. ష్రాయిడర్, మేయర్‌లు యూరోపు ఏశియాలు కలిసేచోట అని

అన్నారు. వేండర్ లిథువేనియన్ భాషకు వైదికభాషకు చాల సామ్యమున్నదని చూపి, ఆర్యజాతి మూలనివాసం లిథువేనియా దేశం అని నిర్ణయించాడు. చాలామంది పౌల్ థీమే వంటి జర్మన్ విద్వాంసులు ఉత్తర యూరోపు భూములే ఆర్యజాతి మూలనివాసస్థానమని అంగీకరించారు. డా. గైల్స్ అభిప్రాయానుసారం ఆస్ట్రియా, హంగేరీల ప్రాంతం ఆర్యజాతి మూలస్థానం. భారతీయ విద్వాంసుల్లో బాల గంగాధర్ తిలక్ ఆర్యజాతి మూలస్థానం ఉత్తర రష్యా, అంటే 'ఉత్తర ధ్రువ భూము'లని నిర్ణయించాడు. ఈ విధంగా ఎన్నో అభిప్రాయాలు కన్పిస్తున్నా ఆర్యజాతి మూలనివాసస్థానం మధ్యఏశియా అనటమే బహుళజనాంగీ కారం పొందిన మతం. మధ్యఏశియా నుంచి ఒక శాఖ అతి ప్రాచీనకాలంలోనే యూరోపుకు వలసపోయిందని, తర్వాత ఒక శాఖ ఇరాన్‌దేశం వలసపోయిందని విద్వాంసుల అభిప్రాయం. తర్వాత ఒక శాఖ ఇరాన్‌దేశం మీదుగా భారతదేశానికి వలస వచ్చింది. భారతదేశంనుంచి మళ్ళీ ఒక శాఖ విజయపరంపరలను సాధిస్తూ పశిమ్చఏశియాను చేరుకొన్నది. అయితే ఆర్యజాతి ధార్మిక సంప్రదాయాలను ఆలోచలను చెప్పేవి ప్రాచీనమైనవి వేదగ్రంథాలే. ఆ తర్వాత అవెస్తాలోను ఆర్యజాతి ధార్మిక సంప్రదాయాలు ఆలోచనలు గ్రంథస్థం చేయబడినవి.

ఒకేజాతి మత సంప్రదాయానికి చెందిన ప్రజలు వేరు వేరు ప్రాంతాలకు వలసపోతూ తాము ఆరాధించే దేవతలను ధార్మిక ఆచారాలను కూడ వెంట తీసుకొనిపోయారు. అందుకే వైదిక, జరోష్ట్రియన్, ప్రాచీన యూరోపియన్ల ధర్మాల్లో చాల సామ్యాలు కన్పిస్తున్నవి. ఈ ధర్మాన్ని అనుసరించిన జాతిని అంటే యూరోపు మొదలుకొని పశ్చిమ ఏశియా, ఇరాన్, భారతదేశం వరకు వ్యాపించిన ఈ జాతిని ఇండో-యూరోపియన్లు అంటారు. ఇండోయూరోపియన్లు ప్రకృతి శక్తులను ఆరాధించారు. వారు వికృతమైన దుష్టశక్తులను ఆరాధించలేదు. వారి దేవతలు కాంతివంతమైనవారు. సమస్త ఆర్యజాతుల్లో 'దైవ' శబ్దం వున్నది. అది 'దివ' ధాతువునుంచి నిష్పన్నమైంది. 'దివ' ధాతువుకు కాంతి, ప్రకాశం అని అర్థం. తేజోవంతమైన దివ్య శక్తులను వారు ఆరాధించారు. వారికి ఆదిమ పిత ద్యౌః (అంటే ఆకాశం), ఆదిమ మాత పృథ్వీ. వేదాల్లో 'ద్యావాపృథ్వీ'ల స్తుతి వేరువేరుగాను జంటగాను చాలాచోట్ల చేయబడింది. గ్రీసు దేశంలో 'ద్యౌః' "జూయెస్" లేక "ద్యయెస్" గా చెప్పబడినాడు. అతడు దేవతలందరికి పితృస్థానీయుడు. స్వర్గలోకానికి పెద్ద- ల్యాటిన్ భాషలో 'ద్యయెస్' - 'జూపితరు'గా చెప్పబడినాడు. పితర్ అంటే పిత 'జూ' అంటే ద్యౌః అని రూపాలు. ఆర్యజాతి మొదట ఆకాశం, భూమిని మాతాపితలుగా గ్రహించి పూజించారని దీన్నిబట్టి తెలుస్తున్నది. ఆర్యజాతికి మరొక ప్రముఖ దేవత వరుణుడు. గ్రీసు దేశంలో ఇతడు " యూరోనస్"గా పిలువబడినాడు. ఇండో - ఇరానియన్ కాలంలో 'ద్యౌః' కన్న

వరుణునికే ప్రాధాన్యం. వేదాల్లో వరుణుడు నైతికమార్గాన్ని చూపే దేవతగా ప్రశంసింపబడినాడు. రాను రాను అతని ప్రాధాన్యం తగ్గింది. వరుణుని స్థానంలో ఇరానియన్ ఆర్యులకు "అహురమజ్ద" దేవత ప్రముఖమైన వాడైనాడు. ఇండో - యూరోపియన్ల మరొక ప్రముఖదేవత. అగ్ని. ల్యాటిన్‌లో అగ్నికి 'ఇగ్నిస్' అని పేరు. లిథువేనియన్ భాషలో 'ఉగ్నిస్' అని, రష్యన్‌భాషలో 'ఓగోన్' అని పేరు ఇండో - ఇరానియన్లకు కూడ అగ్ని పవిత్రమైన దేవతగానే వుండేవాడు. భారతీయార్యులు కూడ అగ్న్యారాధకులే కాని తర్వాత తర్వాత భారతీయార్యులకు ఇంద్రుడు ప్రధానదేవత అయినాడు. ఇతర దేవతలకు ప్రాధాన్యం తగ్గింది. అవెస్తాలో ఇంద్రుడు పేర్కొనబడినా అతనికి భారతీయార్యులు ఇచ్చినంత ప్రముఖస్థానాన్ని వారు ఇయ్యలేదు. అంటే భారతీయార్యులు తమతో ఇంద్రున్ని తెచ్చుకున్నా భారతదేశంలో ప్రవేశించినతర్వాత అక్కడి పరిస్థితులనుబట్టి ఆ దేవతకు ప్రాధాన్యం హెచ్చిందనాలి. అదే తర్వాత అనంతర వైదికయుగంలో ఇంద్రునికి ప్రాధాన్యం తగ్గి, విష్ణువుకు ప్రాధాన్యం ఎక్కువై, ఇంద్రుడు కేవలం అమరాధిపతిగా నిలిచిపోయినాడు. ఇండో-యూరోపిన్లకు ఇంకా ప్రముఖమైన సమానదేవత-ఉషస్. గ్రీసు దేశీయులు ఉషస్‌ను 'ఏఒస్', ల్యాటిన్‌లు 'అరోరా' పేరుతో ఆరాధించేవారు. ఊర్ధ్వలోకంలో నివసించే ఈ దేవతలను ఇండో - యూరోపియన్ ఆర్యులు హవిస్సులను అర్పించి ఆరాధించేవారు. ఇంగ్లీషులో దేవున్ని 'God' అని అంటారు. ప్రాచీన ట్యుటానిక్ భాషలో దేవున్ని ఘూతోమ్ (Ghuto-m) అని అనేవారు. 'ఘూతోమ్' నుంచి జర్మన్ భాషలో 'గోట్ట్', ఇంగ్లీషులో 'గాడ్' అన్న శబ్దాలు నిష్పన్నమైనవి. 'ఘూతమ్' శబ్దం సంస్కృత 'హూత' శబ్దంతో సమానమైంది. సంస్కృతంలో కన్పించే 'హ' వర్ణం ట్యుటానిక్ భాషలో 'ఘ'గా మారటం సర్వసామాన్యంగా కన్పిస్తున్నది. సంస్కృత హుతమ్ లేక హూతమ్ అన్న శబ్దం అప్పుడు ట్యుటొనిక్‌లో ఘుతమ్ లేక ఘూతమ్‌గా మారుతుంది. "ది గ్రేట్ ఆక్స్‌ఫర్డు ఇంగ్లీషు డిక్షనరీ" లో 'హూత', శబ్దభవం ఘూతోమ్ , ఘూతోమ్ శబ్దభవం గోట్ట్ అని, గోట్ట్ శబ్దభవం గాడ్ అని అంగీకరింపబడింది. 'హూత' అంటే హోమాదుల ద్వారా ఆహ్వానింపబడే వాడు, అని అర్థం. దీన్ని బట్టి మూల ఆర్యజాతి హవిస్సులను అర్పించి దేవతలను ఆహ్వానించి ఆరాధించేవారని తెలుస్తున్నది. ఇండో-ఇరానియన్లు కూడ అగ్నిలో హవిస్సులను అర్పించి దేవతలను ఆహ్వానించేవారు. అందుకే వారు అగ్నిని పవిత్రమైన దేవతగా భావించారు. మరణానంతరం జీవి పరలోకం చేరుకుంటాడని ఇండో యూరోపియన్లు విశ్వసించేవారు. పితృపూజ ఇండో - యూరోపియను ఆర్యజాతుల్లో అంతటా కన్పిస్తున్నది. గోవు, అశ్వ పదాలు కూడా ఇండో-యూరోపియను భాషలన్నిటిలో సమానంగా కన్పిస్తున్నాయి.

## వైదిక - జరోష్ట్రియను మతాలు

ఇక ఇండో-ఇరానియన్ ఆర్యులు ఒక శాఖగా మూల నివాసస్థానం నుంచి విడిపోయి ఇప్పటి ఇరాన్‌దేశ ప్రాంతంలో చాలాకాలం కలిసి జీవించారు. కాబట్టి ఇండో-యూరోపియన్ల కన్న ఇండో - ఇరానియన్లకు మత ధార్మిక సంప్రదాయాల్లో, భాషా విషయాల్లో ఎక్కువ సామ్యం కన్పిస్తున్నది. వారి ఆరాధ్యదేవతలు కూడ ఒక్కటిగానే వున్నారు. వేదాల్లో పేర్కొనబడిన సూర్యదేవత మిత్రుడు 'జెంద్ అవెస్తా'లో మిహిరుడుగా పేర్కొనబడినాడు. ఇంద్రుడు వేదాలలో కన్నా అవెస్తాలో తక్కువ చూపుతో చూడబడినా, అవెస్తాలో అతడు వున్నాడు. వేదాల్లో ఇంద్రుడు వృత్రాసురుని చంపిన వృత్తాంతం చాల గొప్పగా చాల సార్లు చెప్పబడింది. ఇంద్రుడు 'వృత్రహన్' అంటే వృత్రహంతకునిగా చెప్పబడినాడు. అవెస్తాలో కూడ ఇంద్రుడు వృత్రుని చంపినవాడుగా 'వెరెత్రఘ్న'గా వర్ణింపబడినాడు. వేదాల్లోవలెనే ఇంద్రుడు అవెస్తాలో యుద్ధ దేవతగా చెప్పబడినాడు. ఇంద్రుడు శత్రువుల పుర, దుర్గ భేదనంలో తోడ్పడినట్లుగా గొప్పగా చాలసార్లు వేదాలల్లో వర్ణింపబడినాడు. అనార్యరాజుల విజయంలో ఆర్యులకు ఇంద్రుని అండదండలు చాల అవసరమైనవి. అందుకే భారతీయార్యులకు అతడు ప్రధాన దేవత అయినాడని అంటారు. ఇరానియన్ ఆర్యులు భారతీయార్యుల వలెనే పితరులను ఆరాధించారు. పితరులను వారు 'ఫ్రవసీ' అని అన్నారు. వేదాల్లో యముడు పితరలోకానికి అధిపతి. మృత్యువుకు అధిపతి. అవెస్తాలో అతడు స్వర్గాధిపతిగా చెప్పబడినాడు. యమవైవస్వతుడని వేదాల్లో చెప్పబడగా అవెస్తాలో అతడు 'యిమ వివస్వహత్' అని చెప్పబడినాడు. వేదాల్లో చెప్పబడిన 'సోమ' అవెస్తాలో 'హోమ'గా కన్పిస్తున్నది. 'స' 'హ' గా మారటం సామాన్యమే. భారతీయార్యులకు వలెనే ఇరానియన్ ఆర్యులకు సోమరసం ప్రీతికరమైన పానీయం. దీనికంతటికి బంగారు, వెండి పాత్రలను ఉపయోగించేవారు. ఈ సోమరసమే తర్వాత అమృతంగా చెప్పబడింది. సోమలత పర్వతాల్లో లభిస్తుంది. దాన్ని తెచ్చి, దంచి, రసం తీసి, వడబోసి, పాలతో కలుపుకొని తాగేవారు. యజ్ఞయాగాదుల్లో ఇది ప్రధాన కర్మ. వరుణుడు, నాసత్యలు, అర్యమన్ దేవతలు వేదాలల్లోను అవెస్తాలోను సమానంగా కన్పిస్తున్నారు. వరుణుని ప్రాధాన్యం మొదట ఎక్కువగా వుండేది. అతడు వేదాల్లో మిత్రునితో కలిపి జంటగా "మిత్రావరుణుడు' గా స్తుతింపబడినాడు. అవెస్తాలో సర్వశ్రేష్ఠమైన, ప్రధానమైన దేవత "అహురమజ్దా' ఆ దేవత వరుణుని రూపాంతరమే అని విమర్శకుల అభిప్రాయం. అహుర=అసుర, మజ్దా = మహాన్ అని ఆ శబ్దార్థం. ఋగ్వేదంలో కొందరు దేవతలు అసురులని పిలువబడినారు. 'అసుర' శబ్దంలోని అసు అంటే విశిష్టమైన, ప్రాణ శక్తి సంపన్నమైన, బలంతోకూడిన, సామర్థ్యంతో కూడిన అని అర్థాలు. ఇంద్ర, వరుణ, సవిత, ఉషస్సులు అసురులుగా

ఋగ్వేదంలో వర్ణింపబడినారు. "మహద్ దేవానామసురత్వ మేకమ్" - అని ఋగ్వేదంలో ఒకచోట చెప్పబడింది. అంటే దేవతల్లో కన్పించే సామర్థ్య శక్తి ఒక్కటే అని. ఇక్కడ అసుర శబ్దం 'సామర్థ్య శక్తి' అన్న అర్థంలో ప్రయోగింపబడి వున్నది. భారతదేశంలో 'అసుర' శబ్దం వైదికయుగం తర్వాత రాక్షసులను, దుష్టులను, దేవతల శత్రువులను సంకేతిస్తూ వచ్చింది. అసురులంటే అనార్యులని గ్రహింపబడుతూ రావటం చేత 'అసుర'కు వ్యతిరేకంగా దేవతలకు 'సుర' లనే పేరు ఏర్పడింది. వైదికార్యులకు వలెనే ఇరానియన్ ఆర్యులకు అగ్ని పవిత్రమైంది. వేదాలల్లో చెప్పబడిన అమృతం అవెస్తాలో 'అమేషా'గా పేర్కొనబడింది. వైదికమతానుయాయుల్లో వలెనే జరతుష్ట్రమతానుయాయులు. ఉపనయనం వంటి కర్మను అనుష్ఠిస్తారు. వేదాలల్లో 'ఋతం' యొక్క మహత్త్వం చాల ఎక్కువగా చెప్పబడింది. 'ఋతం' అంటే 'సత్యం, అవినాశమైన శక్తి' - అని అర్థం. 'ఋతం' వల్లనే ఈ సృష్టి ఉత్పత్తి జరుగుతుందని, సృష్టికి ఆదిలో ఋతం వుండేదని చెప్పబడింది. సమస్త దేవతల్లో ఋతమే కారణసత్త రూపంలో వుంటుంది. ఈ సత్త సహాయంతోనే సృష్టి నడుస్తున్నది. సృష్టి చలనానికి ఋతం ఇరుసు వంటిది. అవెస్తాలో కూడ ఋతం యొక్క ప్రభావం చెప్పబడింది. ఋతం అక్కడ 'ఆశ'గా పేర్కొనబడింది. 'తేల్-ఎల్-అమర్నా' అనే రాజు (క్రీ.పూ. 1400 ప్రాంతం) ఋతాన్ని 'అర్త'గా తన శిలా శాసనంలో వర్ణించాడు. ఋతం-అర్త-గాను, అర్త-ఆశగాను మారిందంటారు. ప్రపంచంలో ఒకే ఒక్క మార్గం వున్నది. అది 'ఆశ' మార్గం. అది గాక వేరే ఏ మార్గం లేదు. అన్ని మార్గాలు అసత్యాలైనవి అని అవెస్తాలో చెప్పబడింది. ఇరాన్‌లో ఋతం (సత్యం) అన్నిటికన్నా మించిన శక్తిగా, దేవతగా (క్రీ.పూ. 8వ శతాబ్దం ప్రాంతంలో) ఆరాధింపబడింది. అది ఒక 'కల్ట్ (Cult) ' ధార్మిక సంప్రదాయంగా ఏర్పడింది. జరోష్ట్రియన్ మతంలో ఋత్విజుని 'అథ్రవన్' (అథర్వన్) అని పిలుస్తారు. వైదిక మతానుయాయులకు ఋత్విజుడంటె ఎంత గౌరవమో జరోష్ట్రియన్లకు 'అథ్రవన్' అంటే అంత గౌరవం. వేదాలల్లో చెప్పబడిన 'హోమం' అవెస్తాలో 'హఓమ్'గా పేర్కొనబడింది.

ప్రపంచంలో రెండు తత్త్వాలుంటవని జరోష్ట్రియన్ల విశ్వాసం. ఒకటి - మంచి, రెండు - చెడు. వీటినే సత్తు, అసత్తులని, సత్య, అసత్యాలని అనవచ్చును. సత్తు ఈశ్వర రూపమైంది. దీన్ని అవెస్తాలో "స్పెంతోమైన్యు" అని అన్నారు. అసత్తు రాక్షసరూపమైంది. దీన్ని అవెస్తాలో 'అంగ్రోమైన్యు' అని అన్నారు. ఈ స్పెంతోమైన్యు, అంగ్రోమైన్యులకు నిరంతర సంఘర్షణ జరుగుతుంది. ఎట్లా అయినా చివరకు సత్తుకే విజయం లభిస్తుందని వారి విశ్వాసం. ఇంద్ర, వృత్రుల సంఘర్షణలో ఇదే ప్రతిబింబించింది. వేదాల్లో ఇటువంటి సంఘర్షణ చెప్పబడకపోలేదు. వేదాల్లో కూడ ఇంద్ర వృత్ర సంఘర్షణ ఈ భావంమీద

ఆధారపడిందే. తర్వాత వేదాల్లో చాలాచోట్ల తమస్సును జ్యోతి జయించినట్లుగా చెప్పబడింది. అదికూడ సత్తు, అసత్తుల సంఘర్షణగా ప్రతీకాత్మకమే. దీనినే తర్వాత సురాసుర సంఘర్షణ, దేవతారాక్షస సంఘర్షణగా భారతీయులు చిత్రించారు. లౌకిక వాఙ్మయంలోని నాటక కావ్య ప్రక్రియల్లో ఈ సంఘర్షణమే నాయక, ప్రతినాయకుల రూపంలో చిత్రింపబడింది. ఈ సత్య అసత్య. ధర్మ అధర్మ, సత్తు అసత్తుల సంఘర్షణలో చివరకు మంచికే విజయం లభించినట్లుగా, చెడు నశించినట్లుగా చెప్పబడింది. ఈ సత్తు అసత్తుల సంఘర్షణమే బైబిల్లో దేవుడు - సైతాన్ సంఘర్షణగా చిత్రింపబడి కన్పిస్తున్నది. చైనాలో "డ్రాగన్" అనబడే పెద్ద సర్పం కల్పన వున్నది. యూరోపులో మధ్యయుగాల్లో "రోమాన్స్" కథల్లోకి ఈ "డ్రాగన్" పాకింది. అక్కడ "డ్రాగన్" దుష్టశక్తికి ప్రతీక. మహావీరుడు ధీరుడు అయిన నాయకుడు "డ్రాగన్" ను చంపి నిస్సహాయురాలైన, బంధింపబడిన నాయికను రక్షిస్తాడు. వేదాల్లో వృత్రాసురుడు "అహి" (సర్పం)గా కూడా చెప్పబడినాడు. కాబట్టి వేదాలల్లో, అవెస్తాలో పేర్కొనబడిన "వృత్రు" నికి చైనీయుల సంప్రదాయంలోని "డ్రాగన్" కు మూలకల్పనలో ఎక్కడో సంబంధముండి వుంటుంది. బైబిల్లో "అవ్వ"లో పాపపంకిలాన్ని పుట్టించింది సర్పమే. వైదిక మతానుయాయులు యజ్ఞాన్ని సత్యరూపంగా దర్శించారు. అందుకే అసద్రూపమైన అసురులు, రాక్షసులు, దైత్యులు, దానవులు యజ్ఞాన్ని ఎదిరించినట్లుగా చిత్రించి చివరకు సత్తు చేతిలో వినాశం చెందినట్లుగా చెప్పబడినారు. ఇటువంటి కథలల్లో అక్కడ కూడ సత్యసంఘటనల అంటే చారిత్రక సంఘటనల ఛాయలున్నా చాలమట్టుకు ఆ కథలన్నీ ఈ సత్తు అసత్తుల సంఘర్షణకు ప్రతీకరూపంగానే కల్పింపబడినవి.

## వైదిక దేవతలు

ఆర్యులు శక్తిమంతమైన, దీప్తి మంతమైన, తేజోమయమైన ప్రకృతి శక్తులను ఆరాధించారు. మధ్యప్రాచ్యభూమిలో, ప్రాచీన భారతంలోవలె వీరు మాతృదేవతకు ప్రాధాన్యమియ్యలేదు. ఆటవిక జాతుల్లో కనిపించే దుష్టశక్తుల ఆరాధన కూడ ఆర్యుల్లో కనిపించదు. సూర్య, అగ్ని, వరుణ, మరుత్తులు, విద్యుత్తు, మేఘం, ఉషస్సు మొదలైన ప్రకృతి శక్తులనే వారు దేవతలుగా చేసుకొని స్తుతించారు. కేవలం సూర్య చంద్ర మరుత్తు రాత్రి దినం భూమి ఆకాశాలు వంటి ప్రకృతిదేవతలనే కాక వైదికార్యులు నదులను కూడ ఆరాధించి స్తుతించారు. ఇంకా "ఋతం, శ్రద్ధ, మన్యు, కిమ" వంటి అమూర్తభావాలను దేవతలుగా కూడ వారు ఆరాధించారు. తాము భుజించే ఆహారపదార్థాలను అగ్నిముఖంగా దేవతలకు అర్పించి ఆహ్వానించేవారు. ఆ ప్రకృతి శక్తులు తమలో ప్రవేశించి తమకు బుద్ధి, దీర్ఘాయుష్షు, ఆరోగ్యం, తేజస్సు, శక్తి, వీర్యం ఇయ్యాలని వారు కోరేవారు. తమకు

వీటన్నటిని ఇయ్యమని కోరటమేకాక వారు విశ్వశాంతి, విశ్వబంధుత్వాన్ని కూడ యాచించారు. మానవుల్లో పరస్పరమైత్రి, సౌహార్ద్రభావాలను పెంపొందించమని కోరారు -

మిత్రస్యాహం చక్షుషా సర్వాణి భూతాని సమీక్షే
మిత్రస్య చక్షుషా సమీక్షామహే - యజు 36-18

"నేను స్నేహదృష్టితో అన్ని ప్రాణులను చూచెదనుగాక! అందరూ కూడ పరస్పరం స్నేహదృష్టి కలిగివుందురుగాక!"

సామాన్యంగా వేదాల్లో ఒక్కవ్యక్తి తన కొరకు మాత్రమే దేవతను యాచించటంకాక సామూహికంగా 'మాకు ఇమ్ము' అని కోరినట్లుగానే కన్పిస్తూ వుంటుంది. "మాకు శతసంవత్సరాల జీవితం ఇమ్ము! మాకు శుభాలను ఇమ్ము... " అని ఈ విధంగా ప్రార్థనలు వుంటవి. తమకేకాక అందరికి సుఖాలను, శాంతులను, శుభాలను, ఆరోగ్యాన్ని ఇయ్యమని వైదికార్యులు ప్రార్థించారు. ఇతర మతాలల్లో వ్యక్తి తన కోరికలకే ప్రాధాన్యమిచ్చినట్లుగా కన్పిస్తుంది కాని విశ్వకళ్యాణాన్ని కోరినట్లుగా కన్పించదు

సర్వేఽత్ర సుఖినః సంతు సర్వే సంతు నిరామయాః
సర్వే భద్రాణి పశ్యంతు మా కశ్చిద్ దుఃఖభాగ్ భవేత్.

అని వైదికార్యుల ఆకాంక్ష.

ఒక్కొక్కసారి తాము వ్యక్తిగానో, సామూహికంగానో చేసిన ఘనకార్యాలు ఆయా దేవతా శక్తులకు ఆపాదించి ఆ దేవతలే చేసినట్లుగా కూడ వర్ణించారు. తమ విజయాల్లో దండయాత్రల్లో శత్రువినాశంలో తోడ్పడమనటం ముఖ్యంగా వేద మంత్రాలల్లో కన్పిస్తుంది. ఒకొకసారి ఉషస్సు వంటి దేవతాస్తుతుల్లో భవ్యమైన ప్రకృతి వర్ణనలు మనోహరంగా చేయబడినవి. సత్యరూపమైన, ప్రకాశవంతమైన శక్తులనే ఆర్యులు ఆరాధించారు. ఈ ప్రకృతి శక్తులకు రూపం వున్నట్లుగానూ వారు వర్ణించారు. కాని ఆకారకల్పన ఎక్కడా స్పష్టంగా లేదు. ఉదా॥ కు జ్వాలలు అగ్నికి నాలుకలు, చేతులు అయినట్లుగా వర్ణించారు. కిరణాలు సూర్యునికి చేతులు అయినట్టుగా వర్ణించారు. అంతేగాక తర్వాత హిందూ మతంలో వలె ఎక్కడా దేవతలకు నిర్దిష్టమైన రూపకల్పన మాత్రం చేయబడలేదు. ఎక్కడా వేదాల్లో విగ్రహాలు, మూర్తుల ప్రస్తావన కూడ లేదు. దీన్నిబట్టి ఆర్యులు విగ్రహారాధకులు కారని చెప్పవచ్చును. యజ్ఞమే వారి ప్రధాన పూజావిధానం. యజ్ఞవిధిలో అగ్నిని ప్రజ్వలింపజేసి దానిలో హవిస్సులను దేవతలకు పేరు పేరునా ఆహ్వానించి అర్పించటం. ఆ దేవతల ఘన కార్యాలను అంటే ప్రకృతి శక్తి విధానాలను స్తుతించటం, తమకు శక్తి

విజయాలను ఇయ్యమని యాచించటం మాత్రం చేసేవారు. యజ్ఞంలో సోమరసాన్ని తయారు చేయటం, పానం చేయటం ప్రధాన విధిగా వుండేది. సోమరసపానం చేత దేవతలు మత్తులై ఘన కార్యాలు చేసినట్లుగా వారు ప్రస్తుతించారు. సోమరస పానం ఆర్యుల పూజా విధానంలో ప్రధానమైందిగా కన్పిస్తుంది. ఈ సోమరసపానానికి ఇంత ప్రాధాన్యమెందుకు వచ్చిందో చెప్పటం కష్టం. ఇది ఇరానియన్ ఆర్యుల్లోను కన్పిస్తుంది. గ్రీకు, ట్యుటానిక్ దేవతలు సోమరసం కాకున్నా మధుపానం చేత మత్తులయ్యే వారని వున్నది. చూడబోతే సోమరస పానం ఇండో - యూరోపియన్ ఆర్యుల సంప్రదాయంగా కన్పిస్తున్నది. ఒకవేళ సాముహికమైన యజ్ఞాచరణ సమయంలో మధుపాన గోష్ఠి జరపటం వారికి ప్రీతికరమైంది కావచ్చును. అదే ఇరానియన్ మరియు భారతీయార్యుల్లో సోమరసపానంగా, అదొక పవిత్ర కార్యంగా పరిగణింపబడసాగింది. ఆర్యులురాక ముందు భారతదేశంలో కృషి, వాణిజ్యాలు అభివృద్ధి చెందిన ఉన్నతమైన నాగరికతగల జాతులు నివసించేవి. వారు శీలం, సదాచరణ ప్రధానంగల జాతులు కావచ్చును. అందుకే దేవతలకు ప్రతిపక్షులైన దానవులు, దైత్యులు సదాచారం కలవారుగా, దానశీలురుగా సద్వర్తనులుగా చిత్రింపబడినారు. వారు మధుపానాన్ని హేయంగా చూసివుంటారు. అందుకే ఆర్యులు తమ యజ్ఞకార్యాలల్లో చేసే మధుపానానికి పవిత్రరూపాన్ని ఇచ్చి రక్షించుకొని వుంటారు. వైదిక దేవతల్లో మరొక ప్రత్యేకత ఏమంటే - దేవతలు ఒక్కరొక్కరుగానే గాక జంటలుగా కూడా ఆరాధింపబడటం. మిత్రావరుణ, ద్యావా పృథ్వీ, అశ్వినులు జంటగా పేర్కొనబడినవారు. ఇద్దరికంటె ఎక్కువగా గుంపులుగా కూడా దేవతలు పేర్కొనబడి కన్పిస్తున్నారు. మరత్తులు, రుద్రులు, వసువులు, ఆదిత్యులు ఇటువంటి గుంపులే.

వైదిక దేవతలు మూడు విధాలుగా విభజింపబడినారు - ద్యుస్థానీయులు, అంతరిక్ష స్థానీయులు, పృథ్వీ స్థానీయులు. వరుణ, పూషన్, మిత్ర, సవితృ, సూర్య, విష్ణు, అశ్వ్యాదులు ద్యుస్థానీయ దేవతలు. ఇంద్ర, అపాంనపాత్, పర్జన్య, ఆపః. రుద్ర మరుతాదులు అంతరిక్ష స్థానీయులు. అగ్ని, బృహస్పతి, సోమాదులు పృథ్వీస్థానీయులు.

## ద్యుస్థానీయ దేవతలు

**వరుణుడు :** - వైదికార్యుల ప్రముఖ దేవతల్లో వరుణుడు ఒకడు. ఇతడు ఇండో-ఇరానియన్ ఆర్యుల చేత ఆరాధింపబడిన దేవతయేకాక ఇండో - యూరోపియన్ ఆర్యుల దేవతగా కన్పిస్తున్నాడు. గ్రీకు దేశంలో వరుణుడు 'యూరోనస్'గా చెప్పబడినాడు. వైదికార్యులకు వరుణుడు మహత్త్వపూర్ణమైన దేవత అయినా ఎక్కువ ప్రచలితంగా

ఆరాధింపబడే దేవతగా లేడు. వరుణుని స్తుతితో కూడిన సూక్తాలు 10, 12 మాత్రమే వున్నవి. వరుణుడు ప్రత్యేకంగా కంటె మిత్రునితో జంటగా "మిత్రా వరుణుడు" గా స్తుతింపబడిన సూక్తాల సంఖ్య ఎక్కువగా వున్నది. వేదాలల్లో ఇంద్రుని తర్వాత వరుణుడే ప్రముఖమైన దేవత. వరుణుడు సుందరమైన రూపం కలవాడుగా ప్రస్తుతింపబడినాడు. అతనికి ముఖం, కన్ను, చేతులు, కాళ్ళు వున్నట్టుగా చెప్పబడింది. సూర్యుడే అతనికి కన్ను. ఆ కన్నుతోనే అతడు మానవుల కర్మలను కనిపెడ్తుంటాడు. వరుణుడు అందరి కంటే దూరదృష్టి కలవాడు. అతనికి వేయి కన్నులున్నట్లుగా కూడ ప్రస్తుతింపబడింది. అతడు భుజాలను వూపుతూ నడుస్తుంటాడు. రథం మీద చరిస్తుంటాడు. అతని రథం సూర్యునివలె దేదీప్యమానంగా వెలుగుతుంటుంది. ఆ రథానికి అందమైన గుర్రాలు పూన్చబడినవి. యజ్ఞాలలో అతడు దర్భగడ్డి మీద కూర్చొంటాడు. అతడు బంగారు కవచాన్ని, మెరిసే వస్త్రాలను ధరిస్తాడు. వరుణుడు ఊర్ధ్వలోకంలో సువర్ణ సౌధంలో కూర్చొని వుంటాడు. సహస్ర స్తంభాల చేత, సహస్ర ద్వారాల చేత కూడిన మహాసౌధంలో కూర్చొని అతడు అతీత భవిష్యత్తులోకి చూస్తాడు. పితృగణాలు అతన్ని అక్కడే దర్శిస్తారు. అక్కడ వరుణున్ని పరివేష్ఠించి దూతగణాలు (గూఢచారులు) వుంటవి. అక్కడ నుంచి ఆ దూతలు లోకాలను నిరీక్షిస్తుంటారు. వరుణుడు లోకాలకు సమ్రాట్టు, స్వరాట్టుగా ప్రస్తుతింపబడినాడు. చాలాచోట్ల వరుణుడు అసురుడుగా అసురశక్తి కలవాడుగా చెప్పబడినాడు. అతని అనిర్వచనీయమైన శక్తికి మాయ అని పేరు. ఆ శక్తి ద్వారా అతడు లోకాలను ఏలుతుంటాడు. వృష్టిని కలిగించి ప్రాణులను పోషిస్తుంటాడు. అతని ప్రమేయం లేకుండా లోకంలో ఏమీజరుగదు. ఆకాశంలో ఎగిరే పక్షుల, సముద్రంలో పయనించే ఓడల జాడలు కూడ అతనికి తెలుసును. అతనికి తెలియనిరహస్యమేదీ లోకంలో లేదు. అతనికి తెలియక ఒక ప్రాణి కనురెప్పనైనా వాల్చదు. ఎక్కడ ఏమి జరుగుతుందో అతడు కనిపెట్టుకొని జాగ్రత్తగా పరిశీలిస్తుంటాడు. సూర్యున్ని ఆకాశంలో ప్రకాశింపజేసేవాడు కూడ వరుణుడే. అతడే ఉషస్సును ప్రేరేపిస్తుంటాడు.

మాయావాం మిత్రా వరుణా దివి శ్రితా
సూర్యో జ్యోతిశ్చరతి చిత్రమాయుధమ్
తమభ్రేణ వృష్ట్యా గూహథోదివి
పర్జన్య ద్రప్సా మధుమంత ఈరతే. ఋగ్ 5-63-4

" హే మిత్రా వరుణ! మీ మాయాశక్తి వల్లనే ఆకాశం వున్నది. చిత్ర విచిత్ర కిరణాలతో కూడిన సూర్యుడు మీ శక్తివల్లనే చరిస్తున్నాడు. ఆకాశాన్ని మేఘాలతో, వృష్టితో

కప్పేస్తున్నారు. ఆ శక్తి వల్లనే పర్జన్యుడు మధు సమానమైన జల బిందువులను కురిపించి లోకాలకు శుభసంతోషాలను కలిగిస్తున్నాడు. ఇదంతా మీ మాయాశక్తి యొక్క ప్రభావమే.''

వరుణుడు నైతిక దేవతగా చాల ప్రస్తుతింపబడినాడు. పాపకార్యాలు అతన్ని క్రుద్ధున్ని చేస్తవి. వ్రతభంగం, అన్నృతం అతనికి అయిష్టమైన కార్యాలు. పాపులను అతడు దండిస్తాడు. అతడు తన పాశంతో పాపులను బందిస్తాడు. ఇంకొక వైపు వరుణుడు కరుణాహృదయుడు అని ప్రస్తుతింపబడినాడు. తన అపరాధాలను అంగీకరించిన పాపులను అతడు అనుగ్రహ దృష్టితో చూస్తాడు. అతని కృపాశక్తి అపారమైంది. అతడు పాపబంధాలనుంచి ప్రాణులను, పితరులను విడిపిస్తాడు. ఒకచోట సూక్తకారుడు కట్టుకొయ్య నుంచి పశువుల దొంగ, తాళ్ళను విప్పి ఎట్లా ఎత్తుకొని పోతాడో అట్లా తమ తమ పితరుల పాపాలను మాయం చేయమని వరుణున్ని యాచించాడు -

అవద్రుగ్ధాని పిత్ర్యా సృజానో
అవయావయమ్ చకృమా తనూభిః
అవరాజన్ పశుతృపమ్ న తాయుమ్
సృజా వత్సమ్ న దామ్నః వసిష్ఠమ్ ఋగ్ 7.86.5

ఉపాసకులు తమను పాపాల నుంచి దూరం చేయమనటమే కాక తమకు సంపదలను ఇచ్చి రక్షించమని కూడ వరుణున్ని యాచించారు. ప్రతి చోట వరుణుడు పాపాలను దూరం చేసేవాడు గానే ప్రస్తుతింపబడినాడు. మానవుల గుణదోషాలను వరుణుడు తెలుసుకుంటాడు. ఎట్లా అయితే భూమి మీద చక్రవర్తి గూఢచారుల ద్వారా తన రాజ్యంలోని వార్తలను తెలుసుకుంటాడో అదే విధంగా పైలోకంలో వుండే వరుణుడు ప్రాణుల గుణదోషాలను దూతలద్వారా తెలుసుకుంటుంటాడు. అతడు ప్రాణుల గుణదోషాలను దర్శించి వాటికనుగుణమైన ఫలాలను ఇస్తుంటాడు.

విశాలమైన సముద్రమధ్యభాగంలో ఒక నావమీద అధిష్ఠితుడై వరుణుడు వసిష్ఠుని హృదయంలో సాక్షాత్కరించాడు. దాన్నే అతడు ఇట్లా వర్ణించాడు -

ఆ యద్ రుహావ వరుణశ్చ నావం
ప్రయత్ సముద్రమీరయావ మధ్యమ్
అధి యదపాం స్నుభిశ్చరావ
ప్రప్రేంఖ ఈంఖయావహై శుభేకమ్. ఋగ్. 7-88-3

అసురవరుణుడు ఇండో ఇరానియన్ ఆర్యులకు ప్రధానదేవత. అసురవరుణుడే తర్వాత జరోస్ట్రియన్ మతంలో మహాదేవత 'అహురమజ్ద'గా రూపొందాడు.

వేదాలల్లోని వరుణుని వర్ణనను పరిశీలిస్తే తర్వాత పౌరాణిక యుగంలో అభివృద్ధి చెందిన నారాయణ, విష్ణువుల వర్ణనలకు దగ్గరగా వున్నది. వరుణుడు సత్య, ఋతాలను కాపాడే దేవత. ఆ అభిప్రాయం నుంచే సత్యనారాయణుని రూపం వికసించింది. వ్రతభంగం, అనృతం అంటే ఇష్టం లేనివాడు వరుణుడు. హరిశ్చంద్రుడు తనకు కుమారుడు కలిగితే వరుణునికి బలియిస్తానని, అది నెరవేర్చలేదు. అప్పుడు వరుణుడు అతన్ని జలోదర రోగ పీడితున్ని చేశాడని శతపథ బ్రాహ్మణంలోని కథ. ఇటువంటి వాగ్దాన వ్రతభంగాలు చేసి కష్టాలను తెచ్చుకొని, చివరకు తమ తప్పును గ్రహించి పశ్చాత్తప్తులై భగవదనుగ్రహాన్ని పొందిన మాహాత్మ్యపు కథలే సత్యనారాయణ వ్రత సందర్భంలో వినిపింపబడుతవి. కాబట్టి ఋతప్రియుడైన వరుణ దేవతయే నారాయణుడుగా, సత్యనారాయణుడుగా వికాసం చెందాడని చెప్పాలి. వరుణుడు ఊర్ధ్వలోకంలో సువర్ణ సౌధంలో కూర్చుంటాడని చెప్పబడింది. అదే వైకుంఠలోక కల్పనకు దారి తీసింది. వరుణ శబ్దం 'వృ' ధాతువు నుంచి ఏర్పడింది. 'వృ' అంటే ఆచ్ఛాదన, ఆవరణ అని అర్థం. భూమిని ఆచ్ఛాదించింది, ఆవరించి వున్నది ఆకాశం. "వృణోతి సర్వమ్" అన్న వ్యుత్పత్తి అనుసారం వరుణుడు జగత్తును ఆచ్ఛాదించేవాడు, ఆవరించి వుండేవాడు అని తెలుస్తున్నది. అంటే జగత్తును ఆవరించి వున్న ఆకాశంలో వుండి సమస్త ప్రాణుల కార్యకలాపాలను నిరీక్షించేవాడు, ప్రాణుల కర్మలకు సాక్షిగా వుండేవాడు కాబట్టి ఆ దేవతకు వరుణుడు అని పేరు కలిగి వుంటుంది. సూర్యభ్రమణ శక్తికి ప్రతీక అయిన విష్ణువు తర్వాత కాలంలో ప్రముఖ దేవతగా అవతరించాడు. వరుణ దేవతకు చెప్పబడిన గుణ, లక్షణాలన్నీ విష్ణువులో కన్పిస్తున్నవి. కాబట్టి వరుణుడు తర్వాత విష్ణువుతో కలిసి ఏకేశ్వరుడుగా రూపొందాడని చెప్పవచ్చును. వరుణుడు సముద్ర మధ్యంలో పడవమీద అధిష్ఠించి వసిష్ఠునికి గోచరించాడు. అదే తర్వాత విష్ణువు సముద్రంలో ఆదిశేషుని పడగల మీద పవ్వళించిన రూపంగా వర్ధిల్లింది. జలాధిపతి అయిన వరుణుడు సముద్రంలో పవ్వళిస్తూ, సముద్రరాజు కూతురుని వివాహమాడిన విష్ణువు అయినాడు. సముద్రుని కూతురు జలశక్తికి ప్రతీక కావచ్చును. నావలమీద వ్యాపారం చేసి సంపదలు సేకరించే జాతికి అందుకే లక్ష్మి, నారాయణులు ఇష్టదేవతలుగా పరిణమించారు. వరుణుడు దయాళువు, పాపులను వ్రతభంగంచేసిన వారిని శిక్షించేవాడు. ఆరాధించే వారిని రక్షించే వాడు. పాపకార్యాలను అంగీకరించి పశ్చాత్తాప తప్తులైన వారిని కరుణించే వాడన్న వర్ణనలో తర్వాత వికసించిన భక్తితత్త్వం యొక్క బీజాలు స్పష్టంగా కన్పిస్తున్నవి. ఈ భక్తితత్త్వం నారాయణ, విష్ణువులను

ఆధారంగా చేసుకొన్నటువంటిది. నారాయణ, విష్ణువులు కూడ పాపులను శిక్షించి, ఉపాసకులను రక్షించే దేవతలు. ఇంకా తర్వాత వాసుదేవభక్తి వికసించి వ్యాపించింది. వాసుదేవునికి, యాదవ కృష్ణునికి అభేదం కలిగింది. వరుణుడు నారాయణుడుగా ఏర్పడిన తర్వాత రానురాను విష్ణు నారాయణులకు అభేదం కలిగింది. ఎప్పుడైతే వాసుదేవ కృష్ణభక్తి విష్ణు సంప్రదాయంలో సమ్మిళితమైందో విష్ణువుకు కృష్ణ, వాసుదేవులకు అభేదం ఏర్పడింది. కృష్ణుడు నల్లనివాడు. కాబట్టి సువర్ణ తేజోమయులుగా ప్రస్తుతింపబడిన వరుణ, విష్ణువులు కూడ క్రమంగా నల్లని విష్ణువుగానే రూపొందారు. అందరు ఒకే దేవతయొక్క మారుపేర్లుగా, అవతారాలుగా చెప్పబడినారు. ఇంకా రానురాను ఎంతోమంది మహాపురుషులు, నూతన మత ప్రవర్తకులు నారాయణ, విష్ణువుల అవతారంగా చెప్పబడినారు. భక్తి, అవతారాలు, ఆరాధనలు, పూజాకైంకర్యాలు కాలక్రమేణ వెర్రితలలు చేసి వ్యాపించినవి. యజ్ఞాల స్థానాన్ని పూజలు, కైంకర్యాలు తీసుకొన్నవి.

**మిత్రావరుణులు** - జంటగా ప్రస్తుతింపబడిన సూక్తాలు చాలానే వున్నవి. వారు ప్రత్యేకంగా కంటె కలిసియే ఎక్కువ ప్రస్తుతులకు పాత్రులై నారు. వరుణుని వలెనే మిత్రుడు కూడ ఇండో - ఇరానియన్ ఆర్యుల దేవత. వారిని వైదికార్యులు కూడ ప్రస్తుతించారు. అంటే భారత దేశంలో ఆర్యులు ప్రవేశించిన తర్వాత కూడ ఈ దేవతలు ఇద్దరు వారి ఆరాధనలను కొంత కాలం అందుకొన్నారు. మిత్రుడు వరుణునితో కూడి జంటగా ప్రస్తుతింపబడిన సూక్తాలు చాలా వున్నవి. వరుణుడు ప్రత్యేకంగా 10, 12 సూక్తాలల్లో ప్రస్తుతింపబడగా మిత్రుడు ఒకే ఒక్క సూక్తంలో ప్రస్తుతింపబడినాడు. ఆ ఒక్క సూత్రంలో 5 మంత్రాలు మాత్రమే వున్నవి. ఈ సూక్తంలోని వర్ణనను బట్టి మిత్రుని రూపాన్ని నిర్ధారించటం కష్టం. అతని దేవతాత్వ స్వరూపమేదో అస్పష్టంగా వున్నది. మిత్రుడు సూర్యుని భ్రమణాన్ని నిర్దేశించేవాడు కావచ్చును. దీన్నిబట్టి ఇతడు అనేక సౌర దేవతల్లో ఒకడు అని చెప్పవచ్చును. అవెస్తాలో ఇతడు సూర్య దేవతగానే ప్రస్తుతింపబడినాడు. తర్వాత లౌకిక సంస్కృతంలో 'మిత్ర' శబ్దానికి సూర్యుడు, స్నేహితుడు అనే అర్థాలు కన్పిస్తున్నవి. మిత్రడు స్నేహ విశ్వాసాలకు అధిదేవతగా అవెస్తాలో వర్ణింపబడినాడు. కాబట్టి సూర్యుడు ప్రకృతికి మానవులకు సహాయం చేసేవాడుగా, స్నేహితుడుగా 'మిత్ర' దేవత రూపంలో ఆరాధింపబడి వుంటాడు. మిత్రావరుణులు వేరు వేరుగా వేరు వేరు లక్షణాలు కలిగివున్నట్టుగా వర్ణింపబడినా జంటగా మాత్రం వారు అభేద రూపలక్షణాలు కలవారుగానే వర్ణింపబడినారు. అంటె జంటగా వీరు వరుణుని రూపలక్షణాలు కలవారుగా వర్ణింపబడినారు. వారు యౌవనం కలవారు. వారు మెరిసే దుస్తులను ధరిస్తారు. అంతరిక్షంలో రథమెక్కి సంచరిస్తారు. వారి నివాసస్థానం సువర్ణమయం. వేయిస్తంభాలతో, వేయి ద్వారాలతో

కూడిన సువిశాలమైన భవనం ,వారు గూఢాచారుల ద్వారా జగత్తులో జరిగే సమస్త విషయాలను తెలుసుకుంటారు. వారికి కన్ను సూర్యుడు. సూర్యకిరణాలు వారికి చేతులు. వారు ప్రపంచానికి చక్రవర్తులు, స్వర్గం, భూమి, అంతరిక్షం వారి అధీనంలో వుండి నడుస్తవి. వారు నదులకు, వర్షానికి అధిపతులు. వర్షం వారి దయ వల్లనే కలుగుతుంది. ఒక సూక్తంలో పూర్తిగా వారు వర్షాన్ని కలిగించే దేవతలుగా ప్రస్తుతింపబడినారు. అసత్యాన్ని వారు నిరోధిస్తారు. వారిని ఆరాధించక ఉపేక్షించినవారిని వారు రోగపీడితులను చేస్తారు. మిత్రావరుణులే "అహుర-మజ్ద" గా రూపొందినారని ఏ.ఏ. మాక్డోనెల్ అభిప్రాయం. మిత్రావరుణుల జంటయే పౌరాణిక యుగంలో నర.నారాయణులుగా రూపొందివుంటారు. నారాయణుడు శ్రీ కృష్ణునిగా అవతరించగా నరుడు అర్జునునిగా అవతరించినాడని పురాణాలు చెప్తున్నవి. మిత్రుడంటే సూర్యుడు. మిత్రావరుణుల జంట సూర్యనారాయణునిగా కూడ అవతరించి వుంటుంది.

**పూషన్:-** సౌర దేవతల్లో పూషన్ ఒకడు. ఋగ్వేదంలో పూషన్ 8 సూక్తాలల్లో ప్రస్తుతింపబడినాడు. ఈ సూక్తాలు 5, 6 మండలాల్లో వున్నవి. పూషన్ తలమీద జటలు వున్నట్లు, గడ్డం వున్నట్లు వర్ణింపబడింది. అతని చేతిలో సువర్ణమాల, అంకుశమున్నవి. అతని వాహనాలు మేకలు. అంటే అతని రథానికి మేకలు పూన్చబడుతవి. అతని సోదరి పూషా. పూషన్‌కు పూషా అంటే చాల ప్రేమ. అతడు సూర్యుని కూతురు 'సూర్యా' కు భర్త. అతని నివాస స్థానం స్వర్గం. అతడు ప్రపంచాన్ని నిరీక్షిస్తు రథం మీద రాకపోకలు జరుపుతుంటాడు. అతడు ప్రాణుల విపత్తులను దూరం చేసి రక్షిస్తుంటాడు. తప్పిపోయిన పశువులను ఇంటికి చేరుస్తాడు. అందుకే అతడు "విముచో నపాత్" - ముక్తి పుత్రుడని స్తుతింపబడినాడు. అతడు 'ఆఘృణి' - తేజోవంతుడని స్తుతింపబడినాడు. పూషన్ అన్న శబ్దానికి అర్థం 'పోషణ కర్త'. సూర్యుని పోషణశక్తికి పూషన్ దేవత ప్రతినిధి అని చెప్పవచ్చును.

**సవితృ:-** సవితృ మరొక సౌరదేవత. మిత్రునికన్న సవితృ ఎక్కువ మహత్త్వపూర్ణమైన దేవతగా వేదాలల్లో కన్పిస్తున్నాడు. సవితృ 11 సూక్తాలలో ప్రస్తుతింపబడినాడు. ఈ సూక్తాలలోనే కాక ఇంకా అక్కడక్కడ కూడ సవితృయొక్క ప్రస్తుతి వున్నది. సవితృ హిరణ్మయ దేవత. అతని కన్నులు, చేతులు, నాలుక అన్నీ బంగారు కాంతిగలవి. అతడెక్కే రథం కూడా సువర్ణమయమైంది. రథానికి రెండు, రెండు కంటె మించిన, గోధుమవర్ణంగల, తెల్లని కళ్ళుగల గుర్రాలు పూన్చబడుతవి. ఆ గుర్రాలు చాల వేగమంతమైనవి. రథం మీద స్వర్గం, భూమి నడుమ పయనిస్తూ సవితృ ప్రాణుల పాపదోషాలను దూరం చేస్తాడు. అతడు ఋతాన్ని అనుసరించేవాడు. తన హిరణ్యహస్తాలను ఎత్తి అతడు

అందరిని దీవిస్తాడు. నీళ్ళు, గాలి అతని అధీనంలో వుంటవి. సవితృ హిందువులకు ఉదయకాలం ఉపాసింపబడే దేవత. గాయత్రీమంత్రంలో సవితృ ఉపాసనే వున్నది. గాయత్రీమంత్రం చాల పవిత్రమైంది. సంధ్యాసమయాలల్లో మంత్రాన్ని జపించటం ధర్మమని హిందువులు తలచారు. దీన్ని బట్టి సవితృ ఉపాసన భారతదేశంలో ప్రధానంగా వుండేదని చెప్పవచ్చును. సవితృదేవత సూర్యునికన్నా భిన్నంగా వేదాలల్లో ప్రస్తుతింపబడినా అతడు సౌరదేవతల్లో ఒకడే. సవితృ, సూర్యులు అభిన్నరూపంగా కూడ వర్ణింపబడిన చోటులు వేదాలలో వున్నవి. 'సవితృ' శబ్దం 'సూ' ధాతువునుంచి ఉత్పన్నమైంది. 'సూ' అంటే ప్రేరేపించటమని అర్థం. జగత్తుయొక్క గతికి, సంచారానికి ప్రేరణ ఇచ్చే శక్తియే సవితృదేవత.

**సూర్యుడు** :- సౌరదేవతల్లో సూర్యుడు ప్రముఖమైనవాడు. సూర్యుడు 10 సూక్తాలలో ప్రస్తుతింపబడినాడు. అతడు స్వయంగా మిత్రావరుణులకు కన్నుగా చెప్పబడినా అతనికికూడ కన్ను వుంటుందని చెప్పబడింది. ఆ కన్నుతో అతడు ప్రాణుల శుభ, అశుభకార్యాలను నిరీక్షిస్తుంటాడు. అతడు మనుష్యుల కర్మను ప్రేరేపించే దేవత. "సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ" - సూర్యుడు జంగమ, స్థావరపదార్థాలకు ఆత్మరూపమైనవాడు. 'హరిత' అనే పేరుగల ఏడు ఆడ గుర్రాలను అతడు తన రథానికి పూన్చుకొంటాడు. సూర్యుడు ఆకాశంలో ఎగిరే పక్షిరూపంగా, గృధ్రరూపంగా వర్ణింపబడినాడు. ఇంకా అతడు ఎద్దుగా, తెల్లని గుర్రంగా కూడ వర్ణింపబడినాడు. ఆకాశంలో అతడు మణి. మేఘాలలో దాచిన మిత్రావరుణుల యొక్క ఖడ్గంగా సూర్యుడు చెప్పబడ్డీనాడు. సూర్యుడు చక్రంగాను చెప్పబడినాడు. అతడు ఆకాశంలోని అంధకారాన్ని పారదోలేవాడు. సూర్యునికి 'ద్యుః' తండ్రిగా చెప్పబడినాడు. సముద్రంలో దాక్కొనివున్న సూర్యున్ని దేవతలు పెంచి ఆకాశంలో వుంచినారట. సూర్యుడు అదితి కుమారుడుగా 'ఆదిత్యుడు'గా కూడ పేర్కొనబడినాడు. ఉషస్సు సూర్యుని భార్యగా కొన్నిసార్లు చెప్పబడింది. మరొకచోట ఉషస్సు సూర్యునికి జన్మనిస్తుందని, ఉషస్సు ఒడిలోనుంచి సూర్యుడు వెలుగుతాడని కూడ చెప్పబడింది. సూర్యుడు రోగాలను, చెడ్డ కలలను దూరంచేస్తాడు. అతడు దివ్య పురోహితుడు - "అసుర్య పురోహితః" గా పేర్కొనబడినాడు. 'సూర్య' శబ్దం 'స్వర్' (ప్రకాశం, కాంతి) ధాతువునుంచి ఉత్పన్నమైంది. అవెస్తాలో 'సూర్యుడు' 'హ్వారే' గా పేర్కొనబడినాడు. అతడు అహురమజ్దకు కన్నుగా వర్ణింపబడినాడు. ఋగ్వేదంలో సూర్యుడు మిత్రునికి, వరుణునికి కన్నుగా విశ్వచక్షువు, కర్మసాక్షిగా పేర్కొనబడినాడు.

**విష్ణువు** - తర్వాత పౌరాణిక మతంలో వున్నంత ప్రాముఖ్యం ఋగ్వేదంలో విష్ణువుకు లేదు. ఋగ్వేదంలో అనేక దేవతలు ఆరాధింపబడినారు. అనేక దేవతలకు

ప్రాముఖ్యమున్నది. దేవుడు ఒక్కడే అన్నభావం వేద రచనాకాలం నాడే అంకురించిందనటానికి మనకు పురుషసూక్తంలోని పురుష కల్పనలో కన్పిస్తున్నది. తర్వాత ఉపనిషత్తుల్లో ఏకైక సత్తగా "బ్రహ్మన్" కల్పన జరిగింది. వైదిక యుగం తర్వాత సర్వశక్తిమంతుడైన దేవతా కల్పనకు ప్రయత్నాలు జరిగినవి. ఆ ప్రయత్న ఫలితంగా విష్ణువుకు ప్రాధాన్యం హెచ్చింది. వేదాలలోని అనేక దేవతల్లు చేసే కార్యాలు, వారి శక్తులు విష్ణువులో వున్నట్లుగా రూపకల్పన చేయబడింది. అనేక దేవతలు విష్ణువు యొక్క రూపాంతరాలుగా, అవతరాలుగా చేయబడినారు. ఉదాృకు సూర్యుడు విష్ణువు యొక్క రూపాంతరంగా ఆరాధింపబడినాడు. సూర్యనారాయణ దేవత ఈ రూపాంతర కల్పనయొక్క ఫలితంగా పుట్టిన దేవతయే. ఋగ్వేదంలో వరుణుని విషయంలో వర్ణితమైన విషయాలెన్నో తర్వాత విష్ణువులో కనిపించి వికసించినవి. ఇట్లా దేవతలందరూ ఒక్క శక్తి యొక్క రూపాంతరాలే, అవతరాలే అని వివిధ పురాణాలల్లో ప్రతిపాదింపబడింది. తత్సంబంధంగా ఎన్నో అవతారాల కథలు, ధార్మిక, దార్శనిక ఉపదేశ ప్రతిపాదనలు పురాణాలలో కన్పిస్తున్నవి. శక్తిమంతుడైన ఏకైక భగవదారాధనను పురాణాలు ప్రతిపాదించటానికి ప్రయత్నించినవి. అందుకే ఎవరికి వారే విష్ణువు అని శివుడు అని, దేవి అని, ప్రతిపాదిస్తూ వారి చుట్టూ కథలను, మాహాత్మ్య వృత్తాంతాలను కల్పించి, పెంచి వ్రాశారు. ఈవిధంగా పురాణాలు 18 వరకు పెరిగినవి.

విష్ణువు ఋగ్వేదానుసారం సౌర దేవతల్లో ఒకడు. విష్ణువు ప్రస్తుతి 6 సూక్తాలల్లో వున్నది. 'విష్ణు' శబ్దం 'విశ్' ధాతువు నుంచి ఉత్పన్నమైంది. 'విశ్' అంటే క్రియాశీలత్వమని అర్థం. విష్ణువు సూర్యుని క్రియాశీల శక్తికి ప్రతీక అయిన దేవత. సూర్యుడు ఎప్పుడు ఒక్కచోట వుండేవాడు కాదు. ప్రాతఃకాలం పూర్వదిశలో, మధ్యాహ్నం ఆకాశ మధ్యభాగంలో, సాయంకాలం పశ్చిమ దిశలో కన్పిస్తాడు. సూర్యుని భ్రమణశీలత్వం, క్రియాశక్తి విష్ణువు రూపంగా ఆరాధింపబడింది. ఈ భ్రమణశక్తియే వేదంలో విశేషంగా ప్రస్తుతింపబడింది. విష్ణువు తన మూడు అడుగులతో భూమిని కొలిచి నాడని - " ఏకో విమమే త్రిభిరిత్ పదేభిః' ' అని కీర్తింపబడింది. విష్ణువు ఈ మూడు అడుగులవల్ల 'ఉరుక్రమ' అని 'ఉరుగాయ' అని పిలువబడినాడు. అయితే వేదంలో విశేషంగా పొగడబడిన విష్ణువు యొక్క మూడు అడుగులు ఏవన్న విషయంలో ప్రాచీనాచార్యుల్లో అభిప్రాయభేదాలున్నవి. యాస్కుడు పేర్కొన్న ఔర్ణనాభుని మతానుసారం విష్ణువు మూడు అడుగులు ప్రాతః, మధ్యాహ్న, సాయంకాలాలందు సూర్యుడు ఆకాశంలో వుండే స్థాన బిందువులు. శాకపూణి మతానుసారం మూడు అడుగులు - పృథ్వీ, అంతరిక్షం, ఆకాశం. ఈ మూడు లోకాలను సూర్యుడు కొలిచేదానికి, అతిక్రమణ చేసేదానికి ప్రతీక. శాకపూణి మతమే ఋగ్వేద మంత్రాలల్లో ప్రకటింపబడిందని ఆధునిక పండితుల అభిప్రాయం. విష్ణువు మూడవ పాదం ఊర్ధ్వతమ

లోకంలో వుంటుందని చెప్పబడింది. విష్ణువు వుండే ఊర్ధ్వతమ లోకంలో మధువు ప్రవహిస్తుందని, భూరి శృంగాలుగల చంచలమైన ఆవులు చరిస్తాయని (యత్రగావో భూరి శృంగా అయాసః)అని చెప్పబడింది. అంటే ఇక్కడ సూర్యకిరణాలే ఆవులుగా చెప్పబడినవి. ఆకాశంలో కిరణాల వివిధ ప్రసరణలు భూరి శృంగాలుగా ఉపమింపబడినవి. తర్వాత వైష్ణవ సంప్రదాయంలో విష్ణువు నివసించే వైకుంఠానికి గోలోకమని కూడ ఈ వర్ణన వల్లనే పేరు కలిగింది. మరణించిన తర్వాత విష్ణు భక్తులు ఈ గోలోకం చేరుకొని అక్కడ స్వాదిష్ట వస్తువులను ఉపభోగిస్తు ఆనందిస్తారని భక్తిమతంలో విశ్వాస మేర్పడింది. పౌరాణిక యుగంలో విష్ణువు యొక్క మూడు అడుగుల వర్ణన త్రివిక్రమావతారంగా పరిణమించింది. బలిచక్రవర్తిని అణచటానికై వామన రూపంలో విష్ణువు వచ్చి మూడు అడుగుల భూమిని దానంగా అడుగుతాడు. బలిచక్రవర్తి మూడు అడుగుల భూమిని ఇచ్చిన తర్వాత విష్ణువు పెరిగి పెరిగి ఒక పాదంతో భూమిని, మరొక పాదంతో ఆకాశాన్ని ఆక్రమించి, మరొక పాదానికి చోటు లేక బలిచక్రవర్తి శిరస్సు మీద పెట్టి అతన్ని పాతాళానికి అణగద్రొక్కినాడని వామనావతారంలోని కథ. ఇక్కడ బలిచక్రవర్తి చీకటికి ప్రతీకగా తీసుకొనబడినాడు. ప్రకృతి క్రమంలో జరిగే విషయాలను సత్యసంఘటనలతో ముడిపెట్టే కథలు అట్లా వేద, పురాణాలల్లో చాలా వున్నవి. దానవ చక్రవర్తి అయిన బలిని పారదోలిన వృత్తాంతం సత్య సంఘటన కావచ్చును. సూర్యుడు తన భ్రమణంతో చీకటిని పారదోలే ప్రాకృతిక సంఘటనతో ఈ సత్య సంఘటన ముడిపెట్టబడింది. ఇటువంటి వృత్తాంతాల్లో ఏది ప్రాకృతిక వర్ణనో, ఏది సత్యసంఘటనో పరిశీలన వల్ల తెలుకోవలసివున్నది.

విష్ణువు చక్రంవలె భ్రమిస్తాడు. అతని 90 గుర్రాలకు నాలుగు పేర్లున్న వని చెప్పబడింది. అంటే సంవత్సరానికి 360 రోజులు వీనిలో నిర్దేశింపబడినవి. ఇంద్రుడు వృత్రుని చంపే కార్యంలో విష్ణువుకు తోడుగా వున్నట్లు వేదాలల్లో చాలా చోట్ల వర్ణింపబడింది. ఒక సూక్తంలో విష్ణువు ఇంద్రులు జంటగా కూడ ప్రస్తుతింపబడినారు (6-69). వృత్రాసురవధలో ఇంద్రునికి మిక్కిలి తోడ్పడిన మరుత్తులతోపాటు విష్ణువు ఒక సూక్తంలో (5-87) ప్రస్తుతింపబడినాడు. ఈ సహాయకార్యం చేతనే కావచ్చును పౌరాణిక యుగంలో విష్ణువు ఇంద్రునికి సోదరుడుగా, ఉపేంద్రుడుగా ఆలంకారిక రూపంలో పేర్కొనబడినాడు. వీరు అదితి కశ్యపుల కుమారులుగా చెప్పబడినారు. కశ్యపుఁడన్న శబ్దం 'పశ్యకః' శబ్దవిపర్యయం వల్ల ఏర్పడిందని యాస్కుడే చెప్పినాడు. 'పశ్యకః' అంటే చూసేవాడు అంటే సమస్త ప్రాణుల కర్మలను చూసేవాడు, సాక్షి అని అర్థం. అంటే సూర్యుడని అర్థం. సౌర సంబంధమైన దేవతలందరు కశ్యప అదితులకు జన్మించారని, వారు సోదరులనే కల్పన పౌరాణిక యుగంలో జరిగింది.

**అశ్వీమలు** - అశ్వీనులు ఇద్దరు. ఇంద్ర, అగ్ని, సోముల తర్వాత వేదాలల్లో అశ్వీనులు ప్రధాన దేవతలుగా కన్పిస్తున్నారు. వీరు వేదాలల్లో 50 సూక్తాలల్లో ప్రస్తుతింపబడినారు. ఇవేగాక ఇంకా చాలచోట్ల కూడ అక్కడక్కడ ప్రస్తుతింప బడినారు. అశ్వీనీ దేవతలు ఎప్పుడూ జంటగానే కీర్తింపబడినారు. మిత్రావరుణుల జంటలో వారు వేరువేరుగా కూడ ప్రస్తుతింపబడినారు. కాని అశ్వనీ దేవతలు ఎప్పుడూ విడదీయరాని జంటగానే కన్పిస్తారు. అశ్వీనీ దేవతల వర్ణనలను బట్టి వారు ఎటువంటి దేవతలో నిర్ణయించడం కష్టంగానే వున్నది. వారు ఏ శక్తికి ప్రతీకలో స్పష్టంగా చెప్పబడలేదు. వారు చేసే వివిధ కార్యాలు వర్ణింపబడినవి. వాటినిబట్టి కూడా వారు దేనికి అధిదేవతలో చెప్పలేము. అసలు యాస్కుడే ఈ దేవతల నిర్ణయాన్ని చేయలేకపోయాడు. వారిని గూర్చిన మత భేదాలను యాస్కుడు పేర్కొనివున్నాడు. ఆధునిక పండితులు కూడా వీరి రూపలక్షణాల నిర్ణయానికి పూనుకొన్నారు. 'అశ్వ' సంబంధంచేత వీరు అశ్వికులైన దేవతలు అని కొందరి అభిప్రాయం. ద్యుః యొక్క కుమారులని, అంటే ఉదయ ప్రాతః కాలాల్లో ఆకాశంలో కనిపించే నక్షత్రాలని మరికొందరు ఆధునిక పండితుల అభిప్రాయం. గ్రీకుదేశంలో జ్యాయిన్(ద్యుః)కు ఇద్దరు పుత్రులున్నట్లుగా చెప్పబడింది. వారు లెట్టిక్ దేవతలు అని పిలువబడినారు. వారు హెలెనాకు సోదరులు. వీరు గుర్రాల మీద స్వర్గంలో సంచరిస్తుంటారు. సూర్యుని కూతురును వలలో వేసుకొని వివాహమాడారు. వేదాలలోను కూడ అశ్వీనీ దేవతలు సూర్యుని కూతురును వివాహమాడినట్లు చెప్పబడింది. వేదాలలో అశ్వీనీ దేవతలు ఉషస్సుకు సోదరులని పాశ్చాత్య పండితులు నిర్ణయించారు. అశ్వీనులు 'నాసత్య' పేరుతో కూడ ప్రస్తుతింపబడినారు. పశ్చిమ ఆశియా భూభాగాలను పాలించిన మితాన్ని రాజులు 'నాసత్య' దేవతను ఆరాధించినట్లు బోగజ్‌కుయి మట్టి ఫలకం వల్ల తెలుస్తున్నది. అవెస్తాలోను నాసత్యదేవత అంటే అశ్వీనులు అసురదేవతలుగా చెప్పబడినారు. దీన్నంతా బట్టి అశ్వీనులు చాల ప్రాచీనమైన దేవతలని, ఇండో - యూరోపియన్ల చేత ఆరాధింపబడిన వారని చెప్పవచ్చును. వీరు మొదట అశ్వాలను అధిరోహించిన దేవతలే అయినా ఆర్యులు ఇరాన్, భారతదేశాలకు చేరుకొన్న తర్వాత వారికి వేగవంతమైన గుర్రాలు పూన్పబడిన రథాలే ప్రధాన వాహనాలైనవి. అందుకే వేదంలో అశ్వీనులు ఎక్కువగా రథారోహకులుగానే ప్రస్తుతింపబడినారు.

అశ్వీనీ దేవతలు ప్రాచీనమైన వారైనా యువకులు. వారు "హిరణ్య వర్తని"- సువర్ణమార్గం కలవారుగా, సువర్ణ తేజాలుగా వర్ణింపబడినారు. వారు సుందరులు, కమలహారాల చేత భూషితులు, వారు బలిష్ఠంగా వుంటారు. గరుత్మంతునివలె

ఎగురగలవారు. వారు "దస్రా = అద్భుతులుగా, "నా సత్యా"= సత్యులుగా వర్ణింపబడినారు. సోమునికన్న వీరే మధువుతో సంబంధం కలవారుగా పేర్కొనబడినారు. ఇతర దేవతల కన్న వీరే మధువును ఎక్కువ సేవిస్తారు. వారి దగ్గర మధువుతో నిండిన తిత్తి వుంటుంది. వారి రథం మధు వర్ణంలో, మధువుతో కూడి వుంటుంది. వారి అంకుశం కూడ మధుమయమైందే. వారి రథం గుర్రాల ద్వారా లేక పక్షుల ద్వారా లేక పక్షాలు గల గుర్రాల ద్వారా లాగబడుతుందని చెప్పబడింది. ఈ రథం మీద కూర్చొని వారు ద్యావాపృథ్విని ఒక్క రోజులో పరిక్రమ చేయగల్గుతారు. ఉషస్సు, సూర్యుల ఉదయకాలానికి మధ్య కాలంలో వీరి ఆవిర్భావం జర్గుగుతంది. ఉషస్సు ఉదయం తర్వాత వారు ఉషస్సును అనుగమించి వస్తారు. వారు అంధకారాన్ని పోగొడ్తారు. మానవులకు క్లేశాలను కలిగించే రాక్షసులను పారదోల్తారు. సూర్యుని కూతురు 'సూర్యా' వారికి భార్య. ఆమె వారిని వరించింది. వారి రథంమీద ఆమె కూర్చొని పయనిస్తుంది. వివాహ మంత్రాలల్లో అందుకే వధువును రథం మీద కూర్చొబెట్టుకొని సంతానవతి అయ్యేటట్లు అశీర్వదించమని అశ్వినులు ఆహ్వానింపబడ్తారు. ప్రాణుల కష్టాలను పోగొట్టి వారిని రక్షించటం అశ్వినుల ప్రధాన కార్యం. కష్టాలనుంచి వారు మనుష్యులను శీఘ్రంగా రక్షిస్తారు. వారు దేవతల్లో ప్రవీణులైన వైద్యులు. వారు ఔషధాలతో రోగాలను దూరం చేస్తారు. గుడ్డివారికి చూపునిస్తారు. రోగులను రోగముక్తులను చేస్తారు. వారుచేసే ఈ పరోపకార్యాలు చాల గొప్పగా కీర్తింప బడినవి. వారు చ్యవనఋషి వృద్ధాప్యాన్ని పోగొట్టి యౌవనాన్ని ఇచ్చి అతని భార్యకొరకు అతన్ని సుందరునిగా, యువకునిగా చేసారు. ఇదే పురాణాలల్లో చ్యవన, సుకన్యల కథగా రూపొందింది. "పేదు"కు వారు తెల్లని శ్రీఘ్రగాములైన అశ్వాలను ఇచ్చారు. అంధకారంలో బంధింపబడిన అత్రిని వారు రక్షించారు. భుజ్యును సముద్రతలం నుంచి ఉద్ధరించారు. భుజ్యుయొక్క వేయికొయ్యల ఓడ సముద్ర మధ్యంలో విరిగిపోగా భుజ్యును వారు రక్షించారు. అశ్వినుల ఈ ఘనకార్యం చాల గొప్పగా ప్రస్తుతింపబడింది.

అశ్వినులు 'ద్యుః' యొక్క కుమారులుగా చెప్పబడినారు. కాని మరొకచోట వారు వివస్వంత, సరణ్యుల సంతానంగా కూడ చెప్పబడినారు. బహుశ వివస్వంత, సరణ్యులు ఉదయకాల సూర్యుడు, అస్తకాల సూర్యుడు కావచ్చును. అశ్వినులు తమ రథంమీద సంపదలను, ఆహారాన్ని పెట్టుకొని తెచ్చి యిచ్చే వారుగా ఆరాధింపబడినారు. గుర్రాలను, ఆవులను కలిగిన దేవతలు వారు. వారిని తమకు గుర్రాలను, ఆవులను ఇయ్యమని ఆరాధకులు యాచించారు. మొత్తంమీద అశ్వినులు రోగాలను పోగొట్టి సంపదలను కలిగించే దేవతలు. ఉభయ సంధ్యలను అనుసరించే నక్షత్రాలకు వీరు ప్రతీకలు కావచ్చును.

ఉషస్సు - ఉషస్సు దాదాపు 20 సూక్తాలల్లో ప్రస్తుతింపబడింది. ఈ సూక్తాలు వైదిక ఋషుల కవితాసంపదను చాటేవిగా వున్నవి. అందమైన ఉషస్సు వర్ణనలు కావ్యలక్షణాలు కలిగివున్నవి. వేద సూక్తాలన్నిటిలో ఉషస్సు మీద చెప్పిన సూక్తాలు ఎక్కువ అందంగా వున్నవి. ఉషస్సు శబ్దం 'వశ్' ధాతువు నుంచి ఉత్పన్నమైంది. 'వశ్' అంటే ప్రకాశం. దీప్తి అని అర్థం. ఉషస్సు వర్ణనలో వేద ఋషులు ఆమె దీప్తిమంతమైన భౌతిక రూపాన్ని చాల స్పష్టంగా వర్ణించారు. ఆమె మానవీయ రూపాన్ని వర్ణించినంత చక్కగా ఏ దేవత రూపాన్ని వారు వర్ణించలేదు. ఆమె దివశస్సుకు కూతురుగా చెప్పబడింది - "దివోదుహితరః." ఆమె పూర్వ దిశలో యజ్ఞస్తంభంవలె ప్రకాశిస్తుంది. నర్తకి వలె ఆమె ఉజ్జ్వలమైన వస్త్రాలను ధరిస్తుంది. ప్రకాశించే ఉషస్సు తన వెలుగుతో అంధకారం యొక్క నల్లని వస్త్రాన్ని తీసేస్తుంది. ఆమె ప్రాచీనమైంది. నిత్యనూతనమైంది. ఆమె హిరణ్యావర్ణం కలది. ఆమె సువర్ణమయమైన రథాన్ని ఎర్రని, బలిష్ఠమైన గుర్రాలు లాగుతవి. (ఇక్కడ ఉషఃకిరణాలే గుర్రాలుగా రూపొందింపబడినవి.) అప్పుడు పక్షిగణాలు మరియు మంత్రగాయకులు తమ మధురకంఠంతో ప్రస్తుతిస్తారు. ఆమె ఉదయకాలమందు అగ్ని ఉపాసకులను లేపుతుంది. వారిని అగ్నిహోత్రం కొరకు ప్రేరేపితులను చేస్తుంది. ఈ విధంగా ఆమె దేవతలకు సేవ చేస్తుంది. జగత్తులో ఆమె అందరిని లేపి క్రియావంతులుగా చేస్తుంది. ఉషస్సురాగానే పక్షులు లేచి ఎగిరిపోయి ఆహారాన్ని వెతుక్కొంటవి. ఆమె ప్రతిరోజు ఆకాశంలో ఒక్కచోట కనిపిస్తుంది. ఆమె ఎప్పుడు తన మార్గాన్ని విడిచిపెట్టక ప్రకృతి నియమాన్ని పాటిస్తుంది. ఆమె దేవతల నేత్రాన్ని తెరుస్తుంది. సూర్యుని కొరకు మార్గాన్ని ఏర్పరుస్తుంది. వరుడు వధువును అనుసరించినట్లుగా సూర్యుడు ఉషస్సును అనుసరిస్తాడు. అందుకే సూర్యుడు ఉషస్సుకు భర్తగా పరిగణింపబడినాడు. కాని సూర్యుని కన్న పూర్వమే ఆమె ఉదయం జరుగుతుంది. కాబట్టి ఆమె సూర్యునికి తల్లిగాను పరిగణింపబడింది. తేజరిల్లే సూర్యబాలకున్ని ఆమె తన వెంట తెస్తుంది. ఆమె రజనికి జ్యేష్ఠసోదరిగా చెప్పబడింది. వీరిద్దరు " ఉషాసనక్తా" "నక్తోషసా" అని జంటగా పేర్కొనబడినారు. ఉషః కాలమందు అగ్నిహోత్రం ప్రజ్వలింపబడుతుంది. కాబట్టి అగ్ని ఉషస్సును కాంక్షించేవాడుగా చెప్పబడినాడు. అశ్వినులు ఆమె మిత్రులు. ఉషస్సు వారిని లేపుతుంది. అందుకే అశ్వినులు ఆమెకు మిత్రులుగా చెప్పబడినారు. ఉషస్సును ఋషులు అనేక విశేషణాలతో ప్రస్తుతించారు. "మఘోని" (దానశీలురాలు) విశ్వవారా (సమస్త ప్రాణులచేత వరింపబడునది). ప్రచేతాః (ప్రకృష్టజ్ఞాన సంపన్నురాలు) సుభగా, రేవతి (ధనసంపద కలది) మొదలైన విశేషణాలు ఆమె కొరకు ప్రయోగింపబడినవి. ఆమె అమరత్వానికి చిహ్నం. అందుకే " అమృతస్య కేతుః" అని వర్ణింపబడినది. ఉషస్సు తన ఆరాధకులకు ధనాన్ని, సంతానాన్ని ఇస్తుంది. వారిని రక్షిస్తుంటుంది. దీర్ఘాయుష్షును కలిగిస్తుంది.

ఉషస్సుయే పౌరాణిక యుగంలో సంపదలకు దేవతగా ధనలాభాలను కలిగించే లక్ష్మిగా వికాసం చెందింది. ఆమె వేదాలల్లో సూర్యునికి భార్యగా చెప్పబడింది. పౌరాణిక యుగంలో ఆమె సూర్యరూపుడైన విష్ణువుకు భార్యగా, విష్ణువు యొక్క శక్తిగా పరిగణింపబడింది. పురాణాలల్లో రజని లక్ష్మికి జ్యేష్ఠసోదరిగా, దరిద్రదేవతగా అశుభకారకురాలుగా చేయబడింది.

రాత్రి - రాత్రి ఒక్క సూక్తంలో ప్రస్తుతింపబడింది. రాత్రి ఉషస్సుకు సోదరి. ఈమె కూడ - "దివోదుహితరః". రాత్రి అంటే చీకటి కాదు. నక్షత్రాలతో వెలిగే నక్తం. తన వెలుగుతో ఈమె చీకటిని పారదోలుతుంది. ఈమె రాకతో మనుష్యులు. జంతువులు విశ్రాంతిని తీసుకొంటవి. ఈమె తన ఉపాసకులను రక్షిస్తుంది. దొంగల, తోడేళ్ళబారినుంచి వారిని రక్షించి కాపాడుతుంది. రాత్రి 'నక్తం'గా ఉషస్సుతో జంటగా దాదాపు 20 మంత్రాలలో స్తుతింపబడింది. వేదాలలో రాత్రి చెడ్డగా చెప్పబడలేదు. ఈమె ప్రాణులకు విశ్రాంతినిచ్చేది, కాపాడేదిగానే చెప్పబడింది. కాని తర్వాత ఈమె దురదృష్టదేవతగా పరిణామం చెందింది.

**యముడు** - యముడు పితృలోకానికి అధిపతి. ఇతన్ని గూర్చి మూడు సూక్తాలున్నవి. ఇవిగాక 10-10 వ సూక్తంలో యమయమిల మధ్య జరిగిన సంవాదమున్నది. యమి యమునిసోదరి. యముడు వరుణ, అగ్ని, బృహస్పతులతో జంటగా వారికి స్నేహితుడుగా పితృలోకాధిపతిగానే ప్రస్తుతింపబడినాడు. మొదట అతడు ఆదిమానవుడుగా, మానవులకు ఆదిపితరుడుగా చెప్పబడినాడు. "యమ యమి"లు అవెస్తాలో "యిమ, యిమి"గా పేర్కొనబడినారు. వారి నుంచే మానవసంతతి వచ్చిందని జరోష్ట్రియన్లు అంటారు. అంటే "యమయమి"లు బైబిల్‌లోని "ఆదామ్ అవ్వల" వలె మానవ లోకంలో ఆదిమ దంపతులు. అవెస్తాలో యముడు భూలోకాధిపతిగా వర్ణింపబడినాడు. భారతీయార్యులనాటికి యముడు స్వర్గలోక పితృలోకాధిపతి అయినాడు. పౌరాణిక యుగంలో అతడు స్వర్గానికి కాక నరకానికి అధిపతిగా, మృత్యుదేవతగా పరిణమించాడు. అతడు అంగిరసులతో యజ్ఞానికి వచ్చి సోమరసాన్ని సేవిస్తాడు. యముడు ఆకాశంలో ఎక్కడో వుంటాడు. అతని నివాసస్థానం దేవతల నివాసస్థానంలోనే వుంటుంది. అతడు గీతాలు వేణునాదాలతో చుట్టబడి వుంటాడు. అతని కొరకు ప్రత్యేకంగా సోమరసం తీయబడుతుంది. అతడు దీర్ఘాయుష్షును ఇచ్చేవాడు. యముడు వివస్వంత, సరణ్యుల కొడుకు. అతడు మొదట మానవుడుగా వుండి శరీరాన్ని విడిచిపెట్టి పితృదేవతలు నివసించే లోకానికి మార్గ దర్శకుడైనాడు. మరణం అతని మార్గం. వరుణునికి వలెనే ఇతని దగ్గర పాశముంటుంది. గుడ్లగూబ, పావురాలు అతని వార్తావాహకులుగా పేర్కొనబడినవి.

నాలుగు కన్నులు, వెడల్పు ముక్కులుగల సరమా కొడుకులైన కుక్కలు ఇతన్ని అనుసరించి వుంటవి. పితృలోక మార్గాన్ని ఇవి రక్షిస్తుంటవి. యముని దూతలుగా అవి మనుష్యుల్లో తిరుగుతుంటవి.

## అంతరిక్షస్థాన దేవతలు

**ఇంద్రుడు -** ఋగ్వేదంలోని సూక్తాలల్లో నాలుగు వంతుల్లో ఒకవంతు ఇంద్రుని స్తుతియే వున్నది. ఇంత ఎక్కువగా ఏ దేవత ప్రస్తుతింపబడలేదు. భారతదేశంలో వైదికార్యులకు ఇంద్రుడు ప్రముఖమైన దేవతగా పరిణమించాడు. ఇంద్రుని భౌతికరూపవర్ణన ఉపమాలంకార సహాయంతో భవ్యంగా చిత్రింపబడింది. అతని శరీరం యొక్క భిన్నభిన్నావయవాల ప్రసక్తి కన్పిస్తుంది. అతడు సోమపానప్రియుడు. సోమరసంతో తన కడుపు నింపుకుంటాడు. అందుకే అతడు 'సోమపా' అని పిలువబడినాడు. సోమపానంచేత అతనికి ఉత్సాహం శక్తి వర్ధిల్లుతవి. దానితో అతడు శత్రువీరులను మట్టుపెడ్తాడు. వృత్రవధ సమయంలో అతడు మూడు చెరువుల నిండా సోమరసాన్ని తాగాడని చెప్పబడింది. ఋగ్వేదంలోని ఒక సూక్తంలో (10-11) పూర్తిగా అతని సోమరసపానోల్లాసం వర్ణింపబడింది. అతడు పసుపు (హరిత) రంగు కలవాడు. అతనికి వెంట్రుకలు, గడ్డం వున్నవి; అవికూడా బంగారు పసుపువర్ణం కలవి. ఇంద్రుడు తన పరాక్రమంతో దేవతల నందరిని పరాస్తం చేసినవాడు. ఉద్భవించగానే వైదిక దేవతల్లో అగ్రగణ్య స్థానాన్ని పొందినవాడు. చలించే భూమిని, కదిలే పర్వతాలను అతడు స్థిరం చేసాడు. అతడు బలశాలి, సుందరుడు. అతని హనువు (దవడ) చాల సుందరమైంది. అతని బాహువులు వజ్ర సమానమైనవి (వజ్ర బాహు:). అతడు తనచేతిలో వజ్రాన్ని ధరిస్తాడు. అతడు శత్రువుల పురాలను (దుర్గవేష్టితమైన నగరాలను) ధ్వంసం చేస్తాడు. అందుకే అతడు "పురభిత్" అయినాడు. ఏడు తాళ్ళచేత బంధింపబడి అదుపులోకి తేబడే ఎద్దు వంటివాడట ఇంద్రుడు (వృషభః సప్తరశ్మిః). అంటే చాల బలశాలి అన్నమాట. ఇంద్రుని వజ్రాయుధాన్ని త్వష్టర్ లోహంతో చేసి ఇచ్చాడు. అది బంగారు పసుపు వర్ణం కలది. ఒకొకసారి వజ్రాయుధం రాతితో చేసించని కూడ చెప్పబడింది. ఈ ఆయుధం కారణంగా అతడు వజ్రబాహు, వజ్రిగా పిలువబడినాడు. అతనికి హరిత వర్ణంగల రెండు గుర్రాలతో లాగబడే సువర్ణ రథమున్నది. దాని మీద ఎక్కి ఇంద్రుడు యుద్ధం చేస్తాడు. ఇంద్రుడు తనను ఆరాధించేవారి శత్రువులను చంపి వారికి విజయాలను కలిగిస్తాడు. ఇంద్రుడు దస్యులను చంపిన వాడు. ఆరాధకులు తమకు విజయాన్ని కూర్చమని ఇంద్రున్ని ప్రార్థిస్తారు. ఇంద్రుడు వారికి రక్షకుడు. వారికి సంపదలను ఇస్తాడు. విజయాలను కలిగించి శత్రువినాశనాన్ని చేస్తాడు.

ఇంద్రుడు ద్యుః, త్వష్టల కుమారుడుగా చెప్పబడినాడు. అతని భార్య పేరు ఇంద్రాణి. ఇంద్రుడు అనేక దేవతలతో జంటగా కూడా ప్రస్తుతింపబడినాడు. ముఖ్యంగా మరుత్తులతో అతనికి స్నేహ మెక్కువ. అందుకే అతడు మరుత్వంతుడు అని పిలువబడినాడు. అగ్ని వరుణులతోను అతనికి స్నేహమెక్కువే. అగ్ని, పూషన్‌లు అతని సోదరులుగా చెప్పబడినారు. అగ్ని అతని కవల సోదరుడు. ఇంద్రుడు వాయు, సోమ, బృహస్పతి విష్ణువులతోను చేర్చి ప్రస్తుతింపబడినాడు. ఇంద్రుని శక్తి సాటిలేనిది. ఆ శక్తి మనుష్యుల్లోగాని, దేవతల్లోగాని ఎవరికీ లేదు. అందువల్ల అతడు శచీపతి, శక్రుడు (=బలాధ్యక్షుడు), శచీవంతుడు, శతక్రతువు (= నూరుశక్తులతో కూడినవాడు) అని విశేషణాలతో ప్రస్తుతింపబడినాడు. ఇంద్రుని శరీరం చాల పెద్దది. ఈ భూమి ఇంకా పది వంతులు పెద్దదైతే అతని శరీరంతో సమాన మౌతుంది.

ఇంద్రుని ప్రధాన కార్యం వర్షాన్ని కల్పించటం. అతడు అనావృష్టి, అంధకారమనే రాక్షసులను చంపి నీళ్ళకు ముక్తిని కలిగించి అనావృష్టిని పోగొడ్తాడు, తన తేజస్సుతో అంధకారాన్ని పారదోల్తాడు. అతడు మేఘాలను ఛేదించి నీళ్ళకు ముక్తిని కలిగించే వృత్తాంతమే విశేషంగా వేదంలో ప్రస్తుతింపబడింది. ఇంద్రుడు చేసిన మరొక ఘనకార్యం వృత్రుని వధించటం. అందుకే అతడు 'వృత్రహన్'గా చెప్పబడినాడు. ఇంద్రుడు వృత్రుని చంపే వృత్తాంతం వీరరసస్ఫోరకంగా చెప్పబడింది. సుందరమైన కావ్యలక్షణాలు ఈ వృత్తాంత వర్ణనలో కన్పిస్తున్నవి. వృత్రుడు జలాలను గుహలో బంధించి పెట్టాడు. ఇంద్రుడు వజ్రాయుధంతో వృత్రుని చంపి గోరూపమైన జలాలను పర్వతగుహలో నుంచి విడిపించాడు. ఈ సందర్భంలో పర్వతాలను నుగ్గునుగ్గు చేసాడు. వృత్రుడు తన బలాన్ని చూసుకొని గర్వించివున్నాడు. ధూర్తత్వంతో ఇంద్రునికి చిక్కకుండ తప్పించుకుంటూ వచ్చాడు. 40వ సంవత్సరంలో ఇంద్రుడు వృత్రుని వెతికిపట్టి బంధించాడు. వృత్రునివల్ల నదీ ప్రవాహాలు (సప్తసింధు నదుల ప్రవాహాలు) ఆగిపోయినవి. వృత్రవధ తర్వాత (సప్తసింధు) నదులు తిరిగి ప్రవహించటం ప్రారంభమైనవి. దేశంలో సుఖశాంతులు ప్రబలినవి. అయితే ఇంద్ర, వృత్రుల ఘర్షణను ప్రాచీన ఆచార్యులు, నవీన ఆచార్యులు రకరకాలుగా వ్యాఖ్యానించారు. నిరుక్తకారుని కాలం నాటికే వృత్రవృత్తాంత విషయంలో అనేక అభిప్రాయభేదాలు ప్రచలితమై వున్నవి. ఐతిహాసికులు వృత్రుడు ఒక చారిత్రక పురుషుడని, ఒక రాజు అని అతనికి ఇంద్రునికి శత్రుత్వమున్నదని, వారికి జరిగిన యుద్ధమే ఋగ్వేదంలో వర్ణింపబడిందని అంటారు. భాగవత పురాణం షష్ఠస్కంధం 9-13 అధ్యాయాలల్లో ఇంద్ర-వృత్రుల మధ్య జరిగిన యుద్ధం విశదంగా వర్ణింప బడింది. యాస్కుండు ఐతిహాసికఘటన ఈ వృత్తాంతంలో కలదనటాన్ని నిరాకరించి వృత్రుడంటె

ఆకాశంలో వుండే మేఘానికి ప్రతీక అని చెప్పాడు. 'వృత్ర' శబ్దం 'వృష్' ధాతువునుంచి నిష్పన్నమైందని, 'వృష్ అంటే "ఆవరణ" - అంటె ఆవరించేది. జలాలు భూమిమీద పడకుండ ఆపేది మేఘమని యాస్కుడు వివరించాడు. ఇంద్రుడు వృష్టిని కలిగించే దేవత. మేఘరూపియైన వృత్రున్ని భేదించి వృష్టిని ఇంద్రుడు కలిగిస్తాడు. మేఘరూపమైన రాళ్ళను ఒకదానికి ఒకటి రాసి విద్యుద్రూపమైన అగ్నిని ఇంద్రుడు పుట్టిస్తాడు - "అశ్మనోరంతరగ్నిం జజాన" వేదంలో జలాలు గోరూపంగాను చెప్పబడినవి. జలరూపమైన గోవులను వృత్రుడు మేఘరూపమైన పర్వతగుహలో దాచిపెట్టగా ఇంద్రుడు వజ్రంతో ఛేదించి జలరూపమైన గోవులకు ముక్తిని కలిగిస్తాడు. వృత్రుడు 'అహి' (సర్పం) గాను చెప్పబడినాడు. కొన్ని మంత్రాలల్లో ఇంద్రుడు పర్వతాలల్లో నివసించే శంబరున్ని చంపినట్లుగా చెప్పబడింది. వృత్రుడు, శంబరుడు ఒకేదానికి ప్రతీకకావచ్చును. ఆధునిక పాశ్చాత్య విద్వాంసులు ఐతిహాసిక మతంతో కాక యాస్కుని మతంతో ఏకీభవించి ఇంద్రున్ని వృష్టిదేవత గానే అంగీకరించారు. హిల్లేబ్రాంట్ మాత్రం వృత్రుడు మంచుకు ప్రతీక అని చలితో నీళ్ళు గడ్డకట్టుకొని మంచుగా మారిపోతే ఆ మంచును ఛేదించి నదులను ప్రవహింపజేసే దేవత ఇంద్రుడు అని అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు. మొత్తం మీద అతని దృష్టిలోను ఇంద్రుడు వృష్టిదేవతగానే కన్పిస్తున్నాడు.

ఆధునిక భారతీయ విమర్శకుల్లో బాల గంగాధర తిలక్ ఇంద్రుడు సూర్యునికి, వృత్రుడు హిమానికి ప్రతీకలుగా గ్రహించాడు. ఉత్తర ధ్రువంలో చలికాలంలో నదులన్నీ గడ్డ కట్టుకొనిపోతవి. వాటి ప్రవాహం ఆగిపోతుంది. వసంతకాలం సూర్యుడు తన కిరణాలను ప్రసరింపజేసినప్పుడు మంచు కరగి పోతుంది. నదులు తిరిగి ప్రవహిస్తవి. ఇంద్ర వృత్తుల కథ ధ్రువాలల్లోని ఈ ప్రాకృతికమైన మార్పును చెప్పున్నదని తిలక్ వివరించాడు. ఒకవేళ ఇంద్రుడు సూర్యునికి ప్రతీక అయితే అహిరూపమైన వృత్రుడు చీకటికి కూడ ప్రతీక కావచ్చును. సూర్యరశ్మి ద్వారా చీకటి పారదోలబడే ప్రకృతి సంఘటనే ఇంద్రవృత్ర వృత్తాంతంగా పరిణమించి వుంటుంది. వృత్రుని వధతోనే సూర్యుడు, ఉషస్సులు ప్రకాశిస్తవని, సోముని ప్రాప్తి కలుగుతుందని వేదంలో చెప్పబడింది. అందుకే ఇంద్రుడు అంధకారంలో సూర్యున్ని వెతికిపట్టి అతనికి మార్గాన్ని ఏర్పరచినవాడుగా, ఉషస్సు, సూర్యులను కల్పించేవాడుగా వర్ణింపబడినాడు. అంతేగాక ఆర్యులకు సంబంధించిన గోవులను అనార్యజాతికి సంబంధించిన వృత్రుడనే రాజో లేక నాయకుడో పర్వతగుహలో బంధించి వుంటాడు. గోవులను బంధించింది పణులని చెప్పబడింది. కాబట్టి అనార్యజాతివారైన పణులో లేక పణుల రాజో ఆర్యుల గోవులను బంధించివుంటారు. ఇంద్రునికి గోవుల జాడలను కనుక్కోవటంలో సరమ తోడ్పడింది. ఇంద్రారాధకులైన

ఆర్యులు ఆ గోవులను విడిపించుకొన్న ఐతిహాసిక సంఘటనను, మేఘాలను ఛేదించి వృష్టినికల్పించే మరియు అంధకారాన్ని తొలగించి వెలుగును కలిగించే ప్రాకృతిక సంఘటనతో కలిపి ఆలంకారికంగా, రూపకాత్మకంగా వేదఋషులు వర్ణించి వుంటారు. అంటే వేదఋషులు ప్రధానంగా వర్ణించింది ప్రాకృతిక సంఘటనయే కాని దానిలో ప్రతీకాత్మకంగా రూపకారోపణచేసి చారిత్రక సంఘటనను కూడ వారు చెప్పారు. అందుకే ఈ తికమకంతా.

ఇంకా ఇంద్రుడు చేసిన కొన్ని ఘనకార్యాలు వేదంలో చెప్పబడినవి. వాటిల్లో కొన్ని అస్పష్టరూపంగా వుండి అర్థనిర్ణయానికి దూరంగా కూడ వున్నవి. ఇంద్రుడు ఉషస్సురథాన్ని ఛిన్నాభిన్నం చేసాడు. అంటే సూర్యుని ఉదయం ఆలస్యమైనప్పుడు ఉషస్సే, ఆ ఉదయానికి అడ్డుగా నిలిచిందని, అప్పుడు ఇంద్రుడు ఉషస్సు రథాన్ని ఛిన్నాభిన్నం చేసాడని చెప్పబడింది. ఇంద్రుడు సూర్యుని గుర్రాలను కూడ ఆపినవాడుగా చెప్పబడినాడు. గుర్రాలను ఆపడంవల్ల సూర్యుని రథచక్రం ఊడిపోయి సూర్యగమనం ఆగిపోయి దానితో సూర్యాస్తమయం ఆలస్యం చేయబడుతుంది. గ్రీష్మర్తువులో సూర్యుడు ఎక్కువ సేపు కన్పిస్తాడు. దానికి కారణం ఇంద్రుడు గుర్రాలను ఆపడంగా, సూర్యుని రథచక్రం ఊడిపోవటంగా ఋషులు కల్పన చేసివుంటారు. సోమరసప్రాప్తిలో ఇంద్రుని సహాయం కూడ వున్నది. గరుత్మంతుడు అమృతాన్ని ఊర్ధ్వలోకం నుంచి తెచ్చి ఇంద్రునికి ఇచ్చాడు. ఇంద్రుడు సోమానికి స్వామిగా చెప్పబడినాడు. అతడు ద్యుఃలోకాన్ని, భూమిని చర్మంలాగ పరిచాడు. అతడు ఆ రెండు లోకాలను ఇరుసుకు బిగించిన చక్రాలవలె వేరు వేరుగా వుండేటట్లు ధరించేవాడు. ద్యుఃలోకాన్ని, భూమిని రాక్షసుడు కలిపివేయగా వాన్ని చంపి వాటిని వేరుచేసి ఆధారమై ఇంద్రుడు ధరించాడని ఒక్కచోట వర్ణింపబడింది. చలనరూపమై అస్థిరంగా వున్న వస్తువులను అతడు అచలనరూపంగా, స్థిరంగా చేసి నిలిపాడు. ఇంద్రుడు చాలాచోట్ల వృషభంతో ఉపమింపబడినాడు. వృషభం శక్తికి, వీర్యానికి ప్రతీక. కాబట్టి దేవతలను వృషభంతో పోల్చటమున్నది. అందులో ఇంద్రుడు ఎక్కువగా వృషభంతో పోల్చబడినాడు. ఇంద్రుడు పాపం చేసినవారిని తన బాణాలతో బాధిస్తాడు. గర్వించిన వాళ్ళను శిక్షిస్తాడు.

ఇంద్రుడు కేవలం ఆర్యులు భారతదేశంలో ప్రవేశించిన తర్వాత కల్పింపబడిన దేవత కాదు. అతడు ఇండో-ఇరానియన్ ఆర్యుల దేవత. అవెస్తాలోను ఇంద్రుడు 'వృత్రఘ్న' వృత్రసంహారకుడుగా దర్శనమిస్తున్నాడు. కాని ఇంద్రుడు దివ్యరూపంగల దేవతగా ఇండో-ఇరానియన్లచేత ఆరాధింపబడలేదు. అతడు అప్పుడు తక్కువ చూపుతోనే చూడబడినాడు. భారతీయార్యుల్లోనే ఇంద్రునికి ప్రాముఖ్యం హెచ్చింది. తమను అడ్డగించే శత్రువులైన దస్యాది అనార్యులను చంపి విజయాలను కలిగించే దేవతగా వారు ఇంద్రున్ని

ఆరాధించసాగారు. ఇంద్రుడు గొప్ప విజేత, క్రూర హింసకుడు, సంహారకుడు. అతడు వేదంలో వరుణునివలె దివ్యరూపంగల దేవతగా కనిపించడు. వరుణునివలె అతడు నైతిక దేవత కూడా కాదు. అతడు ఎన్నో అనైతిక అధర్మ కృత్యాలను ఆచరించినవాడుగాను చెప్పబడినాడు. తిండిబోతు, తాగుబోతు, తాగి మదోన్మత్తుడై సంహారం చేసేవాడు. అతడు తన తండ్రి త్వష్టను చంపినవాడుగా చెప్పబడినాడు. అందుకే పౌరాణిక యుగంలో ఇంద్రునికి పూర్తిగా ప్రాధాన్యం తగ్గింది. అతని సంహారాలుగాని అనైతిక అధర్మ మార్గాలుగాని పౌరాణిక మతానుయాయులకు రుచించలేదు. నైతిక ధర్మదేవతలైన వరుణునికి విష్ణు సూర్యులకు ప్రాధాన్యం కలిగింది. ఏకేశ్వరారాధనోన్ముఖమైన హిందూ మతంలో ఆ దేవతలే విష్ణువుగా నారాయణుడుగా పరిణమించారు.

**అపాంనపాత్:-** ఈ దేవత (2-35) ఒక్క సూక్తంలో ప్రస్తుతింపబడినాడు. ఇదేగాక ఇంకా అక్కడక్కడ కూడా ప్రస్తుతింపబడినాడు. అపాంనపాత్ అంటె జలాల పుత్రుడని అర్థం. ఇతడు యువకుడు, దీప్తిమంతుడు. ఉజ్జ్వలమైన ఈ దేవత ఇంధనాలేవి లేకుండానే జలాల్లో వెలుగుతాడు. జలాలు ఇతన్ని ఆదరించి నాలుగు వైపులా వుంటవి. విద్యుత్‌చేత ఆదరింపబడిన ఈ దేవత సువర్ణమయమైన రంగు రూపం కలవాడు - "హిరణ్యావర్ణః", "హిరణ్యారూపః" అతడు ఆకాశంలో మెరుస్తూ వుంటాడు. అతనికి మనోవేగంగల గుర్రాలున్నవి. అతడు మూడు చోట్ల శీఘ్రగామి(ఆశుహేమన్) గా స్తుతింపబడినాడు. ఈ విశేషణం అగ్నికి ఒక్కసారి మాత్రం ప్రయోగింపబడింది. అపాంనపాత్ అగ్ని గాను స్తుతింపబడినాడు. నీళ్ళలో వుండే అగ్నియే యజ్ఞాగ్నిగా భూలోకంలో అవతరిస్తుందని చెప్పబడింది. అగ్నితో పాటు అపాంనపాత్ వృత్రుని విజయంలో ఇంద్రునికి తోడ్పడినాడు. అపాంనపాత్ అగ్ని యొక్క రూపాంతరం అంటె మేఘాలల్లో నిక్షిప్తమై వుండే విద్యుదగ్నికి ప్రతీక అన్నిచెప్పవచ్చును. ఈ దేవత కేవలం భారతీయార్యులచేత ఆరాధింపబడిన దేవతయేకాదు. ఇతని అస్తిత్వం ఇండో-ఇరానియన్ ఆర్యుల నాటికి పోతున్నది. అవెస్తాలో అపాంనపాత్ జలశక్తిగా, జలాల్లో నివసించేవాడుగా, శీఘ్రగామి గుర్రాలు కలవాడుగా, సముద్రగర్భంలోని తేజస్సును ధరించినవాడుగా, స్త్రీలచేత చుట్టబడినవాడుగా కీర్తింపబడినాడు. ఋగ్వేదం లోను నీళ్ళ చేత అతడు పరివేష్ఠింపబడ్డాడు. అగ్నికి రూపాంతరమని, ఇతడే యజ్ఞాగ్నిగా ఉద్భవిస్తాడని నమ్మటంచేత ఇండో - ఇరానియన్లు ఇతన్ని కీర్తించి వుంటారు.

**ఆపస్:-** ప్రకృతిలో దర్శించే దివ్యశక్తులనన్నిటిని ఆర్యులు కీర్తించారు. విద్యుదగ్ని, మేఘాలు, సూర్యుడు, సూర్యుని చలనశక్తి, ఉషస్సు, రాత్రులేకాక నీళ్ళను కూడ దివ్య

రూపంగా వారు ప్రస్తుతించారు. "ఆపః" దేవతలు నాలుగు సూత్రాలల్లో ప్రస్తుతింపబడినారు. ఇంద్రుడు తన వజ్రాయుధ సహాయంతో వారికొరకు మార్గాన్ని ఏర్పరిచాడు. ఇంద్రుడు చూపిన మార్గంలో వారు నడుస్తుంటారు. వారు అంతరిక్షస్థాన, పృథ్వీస్థాన దేవతలుగా కనిపిస్తారు. సముద్రం వారి గమ్యస్థానం. దేవతల నివాస స్థానమే వారి నివాసస్థానం. మిత్రావరుణుల సమీపంలో సూర్యుని పక్కన వారు నివసిస్తారు. వరుణుడు వారి మధ్యలో చరిస్తు మానవుల ఋత సత్య, అనృత అసత్య మార్గాలను తెలుసుకుంటుంటాడు. వారు అగ్నికి తల్లులు. వారు పాపాలను దోషాలను నశింపజేస్తారు. 'ఆపస్' చాలాచోట్ల మధువుతో కలిపి ప్రస్తుతింపబడినారు. వారు తమ పాలను మధువుతో కలుపుతారు. వారి మధువుతో నిండిన అలలు ఇంద్రునికి పానీయమైనవి. అవి తాగి ఇంద్రుడు వీరకృత్యాలను ఆచరించాడు. అంతరిక్షంలోని నీళ్ళు సోమరసంగాను చెప్పబడినవి. యువకుడు యువతుల సాంగత్యంలో సంతోషాన్ని అనుభవించినట్లుగానే సోముడు ఆపస్‌తోచేరి సంతోషిస్తాడు. ప్రియునివలె అతడు వారిని సమీపిస్తాడు. వారు యువతులవలె సోమునిముందు నతమస్తకులౌతారు. నీళ్ళను దివ్యరూపంగా దేవతగా భావించటం ఆర్యులు భారతదేశం రాకముందే ఇరాన్ దేశంలో వుండగానే జరిగింది. అవెస్తాలో 'ఆపస్' దేవతలు 'ఆపో' గా కీర్తింపబడినారు.

**పర్జన్యుడు:-** ఇతడు అంతగా ప్రముఖమైన దేవత కాడు. ఇతన్ని గూర్చి చెప్పినవి మూడు సూక్తాలు కన్పిస్తున్నవి. పర్జన్యుడు అంటె వర్షాకాల మేఘమని అర్థం. ఆరూపంలోనే వేదంలో పర్జన్యుడు ఆరాధింపబడినాడు. పర్జన్యుడు రంకెవేసే ఎద్దుతో ఉపమింప బడినాడు. వృష్టిని కురిపించటమే అతని ప్రధాన కార్యం. మెరుపులు, గర్జనలతో కూడిన జలమయ రథం మీద కూర్చొని అతడు ఆకాశంలో సంచరిస్తాడు. పర్జన్యుడు ఓషధులను మొలపించి రక్షించేవాడు. అతడు ఆవులకు, గుర్రాలకు, స్త్రీలకు సంతాన సంపదను కలిగించేవాడు. అతడు చాలాసార్లు "శక్తిశాలి పిత" (అసురఃపితానః) అని పేర్కొనబడినాడు. జలపూరితమైన పర్జన్యున్ని నీళ్ళ తిత్తితో పోల్చారు. నీళ్ళ తిత్తిని ఎత్తి పర్జన్యుడు వృష్టిని కలిగిస్తాడు. భూమి పర్జన్యునికి భార్యగా పేర్కొనబడింది. పర్జన్యుడు 'ద్యుః' యొక్క కుమారుడుగాను పేర్కొనబడినాడు. సారథి రథాశ్వాలను కొరడాతో కొట్టినట్లుగా పర్జన్యుడు మేఘాలను విద్యుత్తులతో కొట్టి వృష్టిని కలిగిస్తాడు.

**రుద్రుడు:** ఋగ్వేదంలో మూడు సూక్తాలల్లో (1-114, 2-33, 7-46) రుద్రుడు ప్రస్తుతింపబడినాడు. ఇవిగాక అక్కడక్కడ కొన్ని మంత్రాలల్లో ఇతర దేవతలతో దాదాపు 50 సార్లు రుద్రుడు ప్రస్తుతింపబడినాడు. ఋగ్వేదంలో రుద్రుని స్థానం గౌణమైంది. అగ్ని, వరుణ, ఇంద్రాది దేవతలకన్న రుద్రుని మహత్త్వం చాల తక్కువది. ఋగ్వేదంలో కన్న అథర్వవేదంలో రుద్రునికి మహత్త్వస్థానమున్నది. యజుర్వేదంలో పూర్తిగా ఒక అధ్యాయంలో

రుద్రుని స్తుతి వున్నది. దీన్ని రుద్రాధ్యాయమంటారు. కృష్ణయజుర్వేదం తైత్తిరీయసంహితలో చతుర్థకాండంలోని 5,7 వ ప్రపాఠకాలు మరియు శుక్ల యజుర్వేదసంహిత 16 వ అధ్యాయం రుద్రాధ్యాయాల పేరుతో ప్రసిద్ధమైనవి. అథర్వవేదం 11వ కాండం ద్వితీయ సూక్తంలో రుద్రుని స్తుతి వున్నది.

ఋగ్వేదంలో రుద్రుని ఆకారం వర్ణింపబడి లభిస్తున్నది. రుద్రునికి చేతులు (బాహువులు) వున్నట్లు చెప్పబడింది. అతని శరీరం బలిష్ఠమైంది. అతడు 'బభ్రు' వర్ణం కలవాడు. అతని పెదవులు అందమైనవి (సుశిప్రః) అతని నెత్తిమీద వెంట్రుకలు జటలు కట్టినవి. అందుకే అతడు 'కపర్ది' అని పిలువబడినాడు. అతని ఆకారం దేదీప్యమానంగా వెలుగుతుంది. అతడు అనేక రూపాలను ధరిస్తుంటాడు(పురురూపః). అతని శరీరాంగాలు బంగారు ఆభూషణాలతో (నిష్క) అలంకరింప బడినవి. రుద్రుడు ఎక్కువగా మరుత్తులతో చేర్చి చెప్పబడినాడు. రుద్రుడు వారికి తండ్రి. 'పృష్టి' అనే ఆవు పాదుగు నుంచి అతడు వారిని పితికాడని చెప్పబడింది. అతడు వృషభంతో పోల్చబడినాడు. మరియు స్వర్గలోకంలోని ఎర్రని వరాహంతోను పోల్చబడినాడు(అరుష). అతడు తరుణుడు. అతడు శూరులకు అధిపతి, శీఘ్రగమనం కలవాడు. అతని శక్తి అఖండమైనది, అద్వితీయమైనది, అజేయమైనది. అతడు తరుణుడే కాదు అజరుడుకూడా. రుద్రుడు రథమెక్కి తిరుగుతాడు. యజుర్వేదంలోని రుద్రాధ్యాయంలో, అథర్వవేదం రుద్రసూక్తంలో రుద్రుని స్వరూపం చాల విశదంగా వర్ణింపబడింది. రుద్రుని ముఖం, చక్షువులు, త్వచ, అంగాలు, ఉదర, జిహ్వా, దంతాలు వర్ణింపబడినవి. అతడు సహస్ర నేత్రాలు (సహస్రాక్షః) కలవాడుగా చెప్పబడినాడు. అతని మెడ నీలవర్ణంలో వుంటుంది (నీలగ్రీవః). అయినా ఉజ్జ్వలంగా ప్రకాశిస్తుంది (శితికంఠః). అతడు జటాజూటం కలవాడుగానే కాక ముండితకేశుడుగాను చెప్పబడినాడు (వ్యుప్తకేశః). అతని వెంట్రుకలు ఎర్రగా గాని నీలవర్ణం (హరికేశః)లో గాని వుంటవి. అతడు శిరస్సు మీద ఉష్ణీషాన్ని ధరిస్తాడు. అతడు కపిలవర్ణంగల శరీరం కలవాడు. రుద్రాధ్యాయానుసారం రుద్రుడు ఒక గొప్పయోధుడుగా వీరుడుగా కన్పిస్తాడు. అతడు ధనుర్బాణాలు ధరిస్తాడు. అతని ధనుస్సు పేరు పినాకం. అది బంగారంతో చేయబడింది. అది సహస్రమానవులను చంప గలుగుతుంది. బాణాలను పెట్టే అమ్ములపాదిని కూడా అతడు ధరిస్తాడు. అతని చేతిలో ఖడ్గం కూడ మెరుస్తుంటుంది. ఆ ఖడ్గాన్ని పెట్టే "ఇషుధి" కూడ అతని దగ్గర వున్నది. అతడు శిరస్త్రాణాన్ని, కవచాన్ని కూడ ధరిస్తాడు. అతడు "కృత్తి వసనుడు" (కృత్తివాసాః). అతని అస్త్రాలు చాల భయంకరమైనవి. వాటి నుంచి రక్షింపబడేకొరకు ఋషులు ప్రార్థనలు చేసారు.

రుద్రుడు బలశాలి, క్రూరుడు. తనను అంగీకరించని వారిని అతడు తన బాణాలతో ఛిన్నాభిన్నం చేస్తాడు. తనను ఆరాధించేవారికి అతడు ఉపకారకుడు. అందుకే అతనికి 'శివ' అనే పేరు కలిగింది. రుద్రుడు "త్ర్యంబకు" డని ఋగ్వేదంలో ఒక మంత్రంలో మరియు శుక్లయజుర్వేదంలోను చెప్పబడింది. త్ర్యంబకుడంటె మూడు కన్నులు కలవాడని ప్రాచీన భాష్యకారులు తెలిపారు. కాని ఆధునిక పాశ్చాత్య పండితులు ముగ్గురు తల్లులు కలవాడు అని వ్యాఖ్యానించారు. ఈ ముగ్గురు తల్లులెవరో చెప్పటం కష్టం. వాజసనేయి సంహితలో అంబిక పేరు కన్పిస్తున్నది. అంబిక రుద్రునిభార్యగాకాక సోదరిగా చెప్పబడింది - "ఏష తే రుద్ర భాగః సహస్వసాఽంబికయా, తం జుషస్వ స్వాహైష రుద్రభాగ ఆఖుస్తేపశుః" (3-57). అరణ్యక, ఉపనిషద్గ్రంథాలల్లో రుద్రుని భార్య పేర్లు పేర్కొనబడినవి. తైత్తిరీయారణ్యకంలో "పార్వతి", కేనోపనిషత్తులో "ఉమా, హైమవతి" పేర్లు కన్పిస్తున్నవి.

ఋగ్వేదంలో రుద్రునికి అంత ప్రాముఖ్యమున్నట్లు కన్పించదు కాని యజుర్వేద, అథర్వవేద సంహితల్లో రుద్రుని ప్రాధాన్యం పెరుగుతూ వచ్చింది. రుద్రాధ్యాయంలో రుద్రుడు లేని స్థానం లేదని; స్వర్గలోకం, అంతరిక్షం, భూలోకం పైన, కింద, అంతటా అతని ఆధిపత్యమున్నదని చెప్పబడింది. రుద్రునికి భవ, శర్వ, పశుపతి, ఉగ్ర, భీమాది విశేషణనామాలు ప్రయోగింపబడినవి. అథర్వవేదంలో ఈ పేర్లతోపాటు పశుపతి, భూతపతి పేర్లు కూడ పేర్కొనబడినవి. "పశు" అంటె జంతువులని అర్థం కాదని 'పశు' అంటె మనుష్యులు కూడ చేరుతారని అక్కడ చెప్పబడింది. సమస్త జగత్తు రుద్రుని సత్తతో నిండిందని, రుద్రుడు జగత్తులోని సమస్త పదార్థాలకు స్వామి అని చెప్పబడింది. అతడు అన్నానికి, పొలాలకు, అరణ్యాలకు అధిపతి. దొంగలు దోపిడిగాండ్రకు కూడ అతడు ప్రభువు. రుద్రుడు అగ్ని, ఓషధులు, లతలల్లోనే నివసించేవాడు కాదు, సమస్త జగత్తులను అతడు సృష్టించినవాడని కూడ చెప్పబడింది.

యో అగ్నేరుద్రాయ అప్స్వంత
ర్య ఓషధీర్వీరుధ ఆవివేశ
య ఇమా విశ్వా భువనాని చాక్లృపే
తస్మై రుద్రాయనమో అస్త్వగ్నయే. అథర్వ. 7-87-1

బ్రాహ్మణకాలంలో రుద్రుని మహత్త్వం ఇంకా అధికమైంది. ఐతరేయ బ్రాహ్మణంలో రుద్రుని మహత్త్వం ఒకటి రెండు చోట్ల చెప్పబడింది. ప్రజాపతి కూతురు సహగమనాన్ని గూర్చి చెప్పే తదవసరంలోనే రుద్రుని ఉత్పత్తి జరిగిందని చెప్పబడింది.

అక్కడ రుద్రుని గూర్చి ఎక్కువ గౌరవంగా చెప్పబడకపోయినా "ఏషదేవోఽభవత్" అని సన్మానపూర్వకంగానే పేర్కొనబడినాడు (ఐ. బ్రా. 3-3-33). ఈ వృత్తాంతం సతీమరణం, రుద్రుడు యజ్ఞభంగం కొరకు వీరావతార మెత్తే కథకు మూలం కావచ్చును.

బృహదారణ్యక, మైత్రీ, మహానారాయణ, శ్వేతాశ్వతరాది ప్రాచీనోప నిషత్తుల్లో రుద్రుని మహత్త్వవర్ణన కన్పిస్తున్నది. శ్వేతాశ్వతరోపనిషత్తులో రుద్రుడు జగన్నిర్మాణకర్త, విశ్వాధిపతి, మహర్షి, దేవతల ఉత్పాదకుడు, ఐశ్వర్య సంపన్నుడని కీర్తింపబడినాడు. "ఏకో రుద్రో నద్వితీయాయ తస్థుః" అనికూడా చెప్పబడింది. అర్వాచీనోపషత్తుల్లో అతని అద్వితీయత్వం గొప్పగా చెప్పబడింది. అతడు అథర్వశిరుడు, కఠరుద్రుడు, పాశుపతబ్రహ్మ, రుద్రహృదయ అనే పేర్లతో ప్రస్తుతింపబడినాడు. శివపరకమైన ఉపపనిషత్తులు అనేకం వ్రాయబడినవి.

'రుద్ర' శబ్దం 'రుద్' అనే ధాతువునుంచి నిష్పన్న మైందని చెప్పబడుతున్నది. 'రుద్' అంటె 'ఏడ్చుట' అని అర్థం. ప్రజాపతి సృష్టిని చేయటం ఆరంభించి ఒక బాలున్ని చేశాడు. ఆ బాలుడు పుట్టూనే తనకు నామకరణం చేయమని ఏడ్వటం ఆరంభించాడట! అందుకే ఆ బాలునికి రుద్రుడని పేరు పెట్టబడిందని (మదరోదీత్ తస్మాత్ రుద్రః) శతపథ బ్రాహ్మణంలో ఒకకథ చెప్పబడింది. పది ఇంద్రియాలు, మనస్సును ఏకాదశ రుద్రులుగా బృహదారణ్యా కోపనిషత్తు వర్ణించింది. ఈ ఏకాదశేంద్రియాలు ఎప్పుడైతే శరీరాన్ని విడిచిపెట్టి పోతాయో అప్పుడు బంధువులు ఏడుస్తారు. అందుకే వాటికి రుద్రనామం కలిగిందని కథ.

పాశ్చాత్య విద్వాంసులు ఋగ్వేదంలోని ఇతరదేవతల వలెనే రుద్రుడు ప్రాకృతికశక్తికి ప్రతీక అని విశ్వసించారు. వేబర్. మాక్‌డోనెల్ మొదలైన వారు రుద్రుడు తుఫాను దేవత అని నిర్ణయించారు. హిల్లేబ్రాంట్ రుద్రుడు గ్రీష్మ కాలానికి ప్రతీక అని అభిప్రాయపడినాడు. మృతాత్మలో ప్రధాన వ్యక్తికి దేవత్వాన్ని కల్పించి రుద్రుడుగా నిలబెట్టారని ష్రాయిడెర్ అభిప్రాయం. రుద్రుడు పర్వత, వనాలకు ప్రతీక అయిన దేవత అని ఓల్డెన్‌బెర్గ్ అభిప్రాయం. రుద్రుని సంబంధం ఏదో విధంగా పర్వతాలతో వున్నదనటం నిశ్చయం. అందుకే అతని భార్య "పార్వతి". తర్వాత "పార్వతి" "హైమవతి" అయింది. రుద్రునికి చేతులు, జటలు మొదలైనవి వున్నట్లు వర్ణింపబడినా, అతని స్వరూపమిది అని నిర్ణయించటం సాధ్యంకాదు. రుద్రుని వర్ణనను బట్టి అతడు వినాశకారి అయిన తుఫాను అని చెప్పటమే సమంజసమని మాక్‌డొనెల్ అంటాడు. అతడు వినాశకారి దేవతగా ప్రస్తుతింపబడినా,

అతనిలో మంచిగుణాలు కూడా వున్నట్లు చెప్పబడినవి. రుద్రుని దగ్గర గొప్ప రోగనివారణ శక్తి వున్నది. అతనికి అనేక రోగ నివారణోపాయాలు, ఔషధాలను గూర్చి తెలుసును. రుద్రుడు తన దగ్గరున్న వేలకొద్ది ఔషధాలతో "తక్మన్" (జ్వరం) ఆది రోగాలను, విషదోషాలను పోగొడ్తాడు. అతడు భిషగ్ శ్రేష్ఠుడు. రుద్రుడు పశువువలె ఉగ్రుడు, భయంకరుడు మాత్రమే కాదు, భక్తుల విపత్తులను తొలగించి శుభాలను కూడ కలిగించేవాడు. కోపంలో మమ్మల్ని గాయపరచవద్దు, చంపవద్దని రుద్రున్ని ఋషులు ప్రార్థించారు. రుద్రుని ఆరాధించే మమ్మల్ని గాని మా ఆవులను గాని చంపవద్దని ఋషులు అతన్ని కోరారు. "జలాష" (చల్లదనాన్ని కలిగించేవాడు), "జలాషభేషజ" (చల్లని మందులను ఇచ్చేవాడు) అని రుద్రునికి విశేషణాలు ప్రయోగింపబడినవి. అతడు శమ్-కరుడు (శుభాలను తెచ్చేవాడు). అతడు మృడుడు (కరుణకలవాడు). కాబట్టి రుద్రుడు దుష్టశక్తి కాదని , అతడు దయాగుణం గల దైవశక్తియే అని తెలుస్తున్నది. రుద్రుడు అగ్నికి ప్రతీక అని, అగ్నియొక్క భౌతికరూపం ఆధారంగానే రుద్రుని కల్పన చేయబడిందని బలదేవ ఉపాధ్యాయ మొదలైన భారతీయ పండితులు ప్రతిపాదించారు. పైకి లేచే అగ్నిశిఖయే లింగరూపంగా ఆరాధింపబడిందని వారంటారు. అగ్ని యజ్ఞవేదిక మీద ప్రజ్వరిల్లుతుంది. అందుకే లింగం వేదికమీద ప్రతిష్ఠింపబడుతుంది. దీన్నె యోనిగా తర్వాత ఆధునిక పండితులు వ్యాఖ్యానించారు. అగ్నికి ఘృతం ఆహుతిగా ఇయ్యబడుతుంది. శివలింగానికి జలం అభిషేకం చేయబడుతుందని, శివభక్తులు భస్మాన్ని ధరించటం కూడా శివుడు అంటె అగ్ని కాల్చగా మిగిల్చిన పవిత్రమైన బూడిదను ధరించటమే అని ఉపాధ్యాయ వివరించారు. ఋగ్వేదంలో రుద్రుడు అగ్నిగా ప్రస్తుతింపబడినాడు కూడ - "తమగ్నే రుద్రో". అథర్వవేదంలో "తస్మై రుద్రాయనమో అస్త్వగ్నయే" అని చెప్పబడింది. రుద్రుని అష్టమూర్తులు భౌతిక పదార్థాలకు ప్రతీకలైనవి- రుద్రుడు అగ్నిరూపుడు, శర్వుడు జలరూపుడు, పశుపతి ఓషధిరూపుడు, ఉగ్రుడు వాయురూపుడు, అశని విద్యుద్రూపుడు, భవుడు పర్జన్యరూపుడు. మహాదేవుడు చంద్రరూపుడు, ఈశానుడు ఆదిత్యరూపుడు. ఈవిధంగా రుద్రుడు ప్రకృతిలో సమస్త పదార్థాలల్లో నివసించే అగ్నికి, అగ్నియొక్క తేజస్సుకు ప్రతీకగానే కన్పిస్తున్నాడు. రుద్రుని ప్రాచ్యదేశీయులు శర్వుడని, బాహ్లీకులు భవుడని పిలుస్తారని శతపథ బ్రాహ్మణంలో చెప్పబడింది. ఇవన్నీ నిజానికి అగ్నికి పేర్లని కూడ చెప్పబడింది.

అగ్నికి రెండు రూపాలున్నవి. ఒకటి ఘోరరూపం, రెండవది అఘోర రూపం. భయంకరమైన ఘోరరూపంతో అతడు జగత్తులను వినాశం చేయగల సమర్థుడు. అఘోరరూపంతో అతడు జగత్తులను పాలిస్తుంటాడు. రక్షిస్తుంటాడు. ఈ సృష్టిలో అగ్ని లేకుంటే ప్రాణుల్లో ప్రాణసంచారమే జరుగదు. మేఘాలల్లోని విద్యుత్తు సంహారకారిణి

కావచ్చును కాని ఇంకొకవైపు జలవృష్టిని కలిగించి ప్రాణులకు ఆహారాదులను సృష్టించే శక్తి కూడ దానికి వున్నది. సూక్ష్మ దృష్టితో పరిశీలించినట్లయితే ప్రళయంలో సృష్టిబీజాలు, సంహారంలో ఉత్పత్తిబీజాలు అంతర్భూతమై వుంటవి. అందుకే ఉగ్రరూపుడు, ప్రళయకారి, రుద్రుడు, మంగల సాధకుడు శివరూపుడు గాను ప్రస్తుతింపబడినాడు. ఉత్పత్తి బీజాలుగల ప్రళయరూపి ఉగ్రశక్తి విశ్వవ్యాప్తమై నాట్యం చేస్తుంటుంది. ఆ భావమే తర్వాత నటరాజమూర్తి కల్పనకు, శివుని నృత్య కల్పనకు దారి తీసింది.

రుద్రుడు అనార్యుల దేవత అని సామాన్యంగా భావింపబడుతున్నది. మొదట అతనికి దేవతల హవిస్సుల్లో భాగం లేకుండె ననటం, అతడు వినాశకారి దేవతగా చెప్పబడటం అమంగళరూపుడుగా చిత్రింపబడటం-అంతా అతడు అనార్యదేవత అని చెప్తున్నదని అంటారు. కాని వేదాలల్లో ఎక్కడా అతడు విజాతీయుల దేవత అన్న జాడలు కన్పించవు. కాని తర్వాత పౌరాణికయుగంలో అతడు యోగీశ్వరుడు అని. హిమాలయాలు అతని నివాసస్థానమని చెప్పబడటం వేదాలల్లో కనిపించదు. కాబట్టి ఆర్యులు భారతదేశం రాకముందు ఇక్కడ నివసించే, సాంస్కృతికంగా, ఆర్థికంగా ఉన్నతులైన ప్రజలచేత పూజింపబడే దేవత వేదాలలో కనిపించే అగ్నిరూపుడైన రుద్రునితో అభేదం ఏర్పడి ఒక్క దేవతగా రూపొంది ఉంటాడు. అనార్య జాతి ఆరాధించే దేవతను ఆర్యులు గ్రహించి అతన్ని ఆరాధించి ప్రస్తుతించి తమ యజ్ఞయాగాదుల్లో అతనికిన్న తమ దేవలతో పాటు హవిస్సులను అర్పించివుంటారు. తర్వాత విష్ణువవలె రుద్రుడును మహాన్ దేవతగా రూపొందాడు. అతని చుట్టు అనేక కథలు అల్లబడినవి. విష్ణువవలె రుద్రుడు అవతారాలు ఎత్తినట్లు చూపబడలేదు. కాని వివిధ ప్రళయరూపి దేవతలు అతని రూపాంతరాలుగా మాత్రం చెప్పబడినారు. అదేవిధంగా స్త్రీ దేవతారాధకులైన వివిధ జాతుల వారి శక్తి దేవతలు అతనికి భార్యలుగా పార్వతి యొక్క రూపాంతరాలుగా రూపొందారు. ~~ఈ~~శక్తిదేవతల్లో చాలమట్టుకు దుష్టశక్తులు, క్రూరశక్తులు, వినాశకారి శక్తులు మాత్రమే. ఆ శక్తులను ప్రసన్నం చేసుకునేందుకు ఆదిమజాతుల వారు ఆరాధించి, బలులను అర్పించేవారు. ఆ శక్తులన్నీ ఒక్క పార్వతి యొక్క రూపాంతరాలుగా అవతరింపజేసారు. అందుకే భారతీయులు ఒక్క దేవతలో అనేక దేవతల శక్తులను, అనేక దేవతా శక్తుల్లో ఏకేశ్వరుని చూడగలుగుతారు. పౌరాణిక యుగంలో రుద్రుడు శివునితో పూర్తిగా అభేదంగా చెప్పబడినాడు. రుద్ర కన్న శివనామమే ఎక్కువ ప్రచలితమైంది. తర్వాత అతనికి నంది (ఎద్దు) ప్రధాన వాహనమైంది. అతడు 'పినాక పాణి'గా చెప్పబడినా అతని ప్రధాన ఆయుధం శూలంగా పరిణమించింది. అందుకే అతడు శూలి అయినాడు. అతనికి నాట్యం చాల ప్రియమైంది. అందుకే అతడు నటరాజుగా చెప్పబడినాడు. నాట్యకళకు, వ్యాకరణ శాస్త్రాదుల కెన్నిటికో అతడు

ఆద్యుడుగా చెప్పబడినాడు. శివుని త్రిపురాసుర విజయం పురాణాలల్లో చాల గొప్పగా ప్రస్తుతింపబడింది. ఈ త్రిపురాలు ఆర్య అనార్య సమ్మిశ్రితమైన జాతులు, అంటే భారతీయులకు శత్రువులైన విజాతీయుల పురాలు కావచ్చును. శివునికి ఈ విజయంలో విష్ణువు, ఇంద్రుడు మొదలైన సమస్త దేవతలు తోడ్పడినారని చెప్పబడింది. అంటే ఆ విజాతీయులను జయించడానికి భారతీయ జాతులన్నీ ఏకమైనవని ఊహ చేయవచ్చును. యోగ విద్యకు, కళలకు, విద్యలకు, నిలయమైన రోగనివారణ శక్తులుగల అనార్యదేవతయే అగ్నియొక్క రూపాంతరమైన వేదప్రస్తుతమైన రుద్రునిలో అంతర్లీనం చెంది పౌరాణికమైన శివుడు రూపొందాడు. సాంఖ్యయోగ అద్వైతాది సిద్ధాంతాలు అనార్యులవే కావచ్చును. అందుకే వాటికి శివునికి అవినాభావ సంబంధమేర్పడింది.

**మరుత్తులు:-** ఋగ్వేదంలో మరుత్తులు ప్రముఖమైన దేవతలుగా కన్పిస్తారు. వారు 33 సూక్తాలల్లో ప్రస్తుతింపబడినారు. అంతేగాక ఇంద్ర, అగ్ని పూషన్‌తో కలిపి కూడ ప్రస్తుతింప బడినారు. ఇంద్రునితో కలిపి 7 సూక్తాలల్లో, అగ్నితో కలిపి ఒక సూక్తంలో, పూషన్‌తో కలిపి ఒక్క సూక్తంలో కీర్తింపబడినారు. వారు ఒక్కరు ఇద్దరు దేవతలు కాదు. ఒక గణంగా గుంపుగా, చెప్పబడినారు. గోరూపమైన పృష్ణి వారికి తల్లి. వారు రుద్రుని పుత్రులుగా చెప్పబడినారు. వాయువుచేత ఉద్భవింపబడ్డారు, 'ద్యుః'కు కుమారులుగాను కీర్తింపబడినారు. వారందరు సోదరులు. సమాన వయస్కులు. వారందరి జన్మస్థానం ఒక్కటే. వారందరు నివసించే స్థానం కూడ ఒక్కటే. వారు భూమిమీద, ఆకాశంలో, ద్యుఃలోకంలో వర్ధిల్లారు. రోదసీ దేవి వారి రథం మీద ఎప్పుడు నిలిచి వుంటుంది. అందుకే ఆమె వారికి పెండ్లికూతురుగా చెప్పబడింది కూడ. మరుత్తులు తేజోమయులు. దివ్యకాంతి కలవారు. ఎర్రగా అగ్నివలె ప్రకాశిస్తుంటారు. స్వతః ప్రకాశవంతులు. వారు మాలలను, సువర్ణమయ మేఖలలను సువర్ణమయ ఆభూషణాలను, శిరస్త్రాణాలను ధరిస్తారు. అందుకే వారి కాంతి కన్నులను మిరమిట్లు కొల్పేటట్లుగా వుంటుంది. వారు సామాన్యంగా విద్యుత్తుతో కూడిన వారుగా వర్ణింపబడినారు. వారికి మెరుపులే ఆయుధాలు. 'ఋష్టి విద్యుత్' అంటె విద్యుత్ మాలలు కలవారు. అప్పుడప్పుడు ధనుర్బాణాలను కూడ ధరిస్తారు. గర్జన ధ్వనులు కలవారు. వారి ధాటి పర్వతాలను, ద్యావాపృథ్విని కంపింప జేస్తవి. వృష్టిని కలిగించటం వారి ప్రధాన కార్యం. వృష్టిని కురిపించేటప్పుడు వారు ప్రపంచాన్ని అంధకారంతో కప్పేస్తారు. సూర్యుని కన్నును వృష్టితో కప్పేస్తారు. వారి గుర్రాలు ఎర్రగా వుంటవి. మనోవేగం కలవి. వారు చాల బలశాలురు, యువకులు, అజరులు, సింహాల వలె భయంకరమైనవారు, చిన్న పిల్లలు, దూడల వలె కేళీప్రియులు. వృత్ర వధ సమయంలో ఇంద్రునికి చాల తోడ్పడినారు. రుద్రునివలె వారు కష్టాలను

తొలగించేవారు, రోగ నివారణ చేసేవారు, ఓషధులను కురిపించే వారుగా ప్రస్తుతింపబడినారు. వారు వనగజాలవలె చెట్లను కూలుస్తారు. వనాలను నాశనం చేస్తారు.

**వాత:-** అంటే వాయువు. వాత కూడ దేవతగా పరిగణింపబడి రెండు చిన్న సూక్తాలల్లో ప్రస్తుతింపబడినాడు. వాతయేకాక వాయువు కూడ మరొక సూక్తంలో ప్రస్తుతింపబడినాడు. 'వాత' ఇతర దేవతలతోను ప్రస్తుతింపబడి వున్నాడు. 'వాత' శబ్దం 'వా' అనే ధాతువునుంచి నిష్పన్నమైంది. 'వా' అంటే వీచుట అని అర్థం. వాత దేవత ఒక్కొక్కసారి పర్జన్యునితో కలిపి "వాత పర్జన్య" అని జంటగా కూడ చెప్పబడినాడు. అదే విధంగా వాయువు ఇంద్రునితో కలిపి " ఇంద్రవాయు" అని జంటగా చెప్పబడినాడు. దేవతల యొక్క ఉచ్ఛ్వాస నిశ్వాసాలే (ఆత్మాదేవానామ్) వాత దేవత. రుద్రునివలెనే వాతకూడ రోగనివారణ గుణం కలవాడు. ఇంకా దీర్ఘాయుష్షు కలిగించేవాడు. అతడు అమరత్వానికి నిధి. అతడు ఎర్రని కాంతులను ప్రసరింపజేస్తాడు. ఉషస్సు వెలిగేటట్లుగా చేస్తాడు. అతడు వేగశాలి. ధ్వనితో కూడివుంటాడు (వీస్తుంటాడు). సామాన్యంగా అతడు ఉరుములు మెరుపులతో కలిసినవాడుగా చెప్పబడినాడు. అతడు రథంమీద ప్రయాణం చేస్తాడు. వాత దేవత ఆకాశంలో ఉరుములను కలిగిస్తూ, భూమిమీద ధూళిని లేపుతు ప్రయాణం చేస్తాడు. అతడు ఎప్పుడు విశ్రాంతి తీసుకోడు. అతడు నీళ్ళకు స్నేహితుడు. అతడు ఈ జగత్తుకు బీజంవంటివాడు. అతడు తన ఇష్టాన్ని అనుసరించేవాడు. అతని రూపం కనబడదు. ఒక స్త్రీ ఉత్సవానికి పోయినట్లుగా జలాలు అతని వెంట దగిలి వస్తుంటవి.

**ద్యావాపృథ్వీ:-** ద్యుఃలోకం, పృథ్వి వీరిద్దరు జంటగానే అన్నిచోట్ల ప్రస్తుతింపబడినారు. ఋగ్వేదంలో వీరు ఆరు సూక్తాలల్లో ప్రస్తుతింపబడినారు. వీరి జంటలో ద్యుః ఒక్కసారి కూడ ప్రత్యేకంగా స్వతంత్రంగా ప్రస్తుతింపబడలేదు. కాని పృథ్వి (భూమి) ఒక సూక్తంలో మాత్రం ప్రస్తుతింపబడింది. ద్యుః భూలోకాలు రోదసిగా కూడ చాలసార్లు పేర్కొనబడినవి. "ద్యావాపృథ్వి" పితరులుగా, జనయిత్రులుగా పిలువబడినారు. వారు పితర, మాతరలుగా వేరు వేరుగా కూడ పేర్కొనబడినారు. వారు సమస్త ప్రాణుల సంరక్షించేవారు. దేవతలకు మాతాపితలు. వారు దేవతలచేత సృష్టింపబడినవారుగా కూడ చెప్పబడినారు. ద్యుః వీర్యంగల వృషభంగాను, పృథ్వి ఆవుగాను పేర్కొనబడినారు. వారు అజరులు, వారు మహోమహులు, అంతటా వ్యాపించి వుండేవారు, వారు చాల విశాలమైనవారు. ధనసంపదలను, ఆహారాన్నిచ్చేవారు. కీర్తిని బలాన్ని భూములను ప్రదానం చేసేవారు. వారు ఒకప్పుడు నైతిక దేవతలుగాను ప్రస్తుతింపబడినారు. వారు బుద్ధి కలవారు, ఋజువర్తనులు. మాతాపితలుగా వారు ప్రాణులను రక్షిస్తారు. సహాయం చేస్తారు. వారు ఎప్పుడు క్రియాశీలురై వుంటారు.

అంతరిక్ష స్థానంలోని పై దేవతలేకాక ఇంకా ఋభులు, మాతరశ్విన్, ధాతర్, విధాతర్ (సృష్టించువాడు), విశ్వకర్మ (సమస్తాన్ని సృష్టించువాడు), ధార్తర్ (ఆధారమైనవాడు), త్రాతర్ (రక్షించువాడు), త్వష్టర్, ప్రజాపతి మొదలైన దేవతలు అక్కడక్కడ ప్రస్తుతింపబడినారు. ఋభులు ముగ్గురు జంటగా వుండే దేవతలు. వారి పేర్లు ఋభు, విభ్వా, వాజ. వారు సుధన్వుని కుమారులు. వారు అశ్వినుల రథాన్ని నిర్మించారు. ఆ రథం అశ్వాలు లేకనే పయనిస్తుంది. దానికి మూడు చక్రాలుంటవి. ఇంద్రునికి రెండు గుర్రాలను వారు ఇచ్చారు. ఎండిపోయిన చర్మం నుంచి వారు అమృతాన్నిచ్చే ఆవును చేస్తారు. ముసలివారైన తమ తల్లిదండ్రులను వారు తిరిగి యౌవనవంతులుగా చేస్తారు. ఋభులను గురించి చెప్పబడిన చాలా విషయాలు అద్భుతంగా వుండి ఇప్పుడు మన అవగాహనకు చాల దూరంగా వున్నవి. అప్పుడు ఋషులు ఏ విషయాలను మనస్సులో పెట్టుకొని వ్రాశారో ఇప్పుడు మనం చెప్పలేము. మొత్తం మీద ఋభులు త్వష్టర్ వలెనే దేవతల శిల్పులు, వారు ఇంద్రునికి దగ్గరి వారుగా స్నేహితులుగా చెప్పబడినారు. వారి చేతులు పనితనం కలవని చెప్పబడింది. మాతరశ్విన్ అగ్నియొక్క రూపాంతరమని చెప్పాలి. మాతరశ్విన్ గురించి ప్రత్యేకంగా మంత్రాలు లేవు కాని అక్కడక్కడ పేర్కొనబడినాడు. ఇతడే భృగువులకు ద్యుఃలోకంనుంచి అగ్నిని తెచ్చియిచ్చినవాడు. ఇతడు అగ్నిని పుట్టించేవాడుగా పేర్కొనబడినాడు. ఒకవేళ మాతరశ్విన్ అగ్నిని రగిల్చే యంత్రానికి ప్రతీక కావచ్చును. త్వష్ట్ర లేక త్వష్టర్ పనితనం గలవాడు. ఇతడే ఇంద్రుని వజ్రాయుధాన్ని చేసాడు. బృహస్పతి ఖడ్గానికి పదనుపెట్టాడు. ఇతడు చేసిన చషకాన్నే ఋషులు నాలుగుగా చేసారట (దీని అర్థం అస్పష్టం). ఇతని కూతురు సరణ్యు యమయమీలకు తల్లి. ఇతడు ప్రజాపతి. మానవులకు అధిపతిగా స్తుతింపబడినాడు. వీరేగాక ఇంకా అమూర్తభావాలు కూడ దేవతలుగా వేదంలో ప్రస్తుతింపబడినవి - మన్యు (కోపం), శ్రద్ధా (నమ్మకం), కామ (కోరిక), కాల (సమయం), ప్రాణ (ప్రాణం), శ్రీ (సౌందర్యం), అనుమతి (favour), అరమతి (devotion) , సూనంత (Bounty) , అసునీతి (spirit life) , నిఋతి (decease), మొదలైనవి. వీటిల్లో కొన్ని అథర్వవేదంలో మాత్రమే పేర్కొనబడి కన్పిస్తున్నవి. 'కామ' బాణాలనువేసి మనుష్యుల హృదయాలను గాయపరుస్తుంటాడని ఆలంకారికంగా చెప్పబడింది. ఈ భావమే తర్వాత పౌరాణిక యుగంలో "మన్మథుడు, కాముడు" భావనకు దారితీసి వుంటుంది. ఇంకా అదితి, దితి అనే దేవతల ప్రసక్తికూడ వేదాలల్లో వున్నది. అదితి దేవతలకు తల్లిగా చెప్పబడింది. అదితి కుమారులు కాబట్టి వారు ఆదిత్యులైనారు. అదితి అంటె "అ-దితి" స్వాతంత్ర్యం అని, బంధాన్ని విడిపించేది అని అర్థం. అదితి అందుకే ప్రధానంగా శారీరక కష్టాలను, పాపాలను పోగొట్టేదిగా చెప్పబడింది. అమూర్త దేవతల్లో అదితి ప్రధానమైన దేవత. దేవతలు అదితి కుమారులుగా చెప్పబడినారంటే వారు

బంధనాలు లేనివారని, స్వతంత్రులనే అర్థంలో చెప్పబడి వుంటుంది. అదితికి ప్రతిరూపంగా దితి చెప్ప బడింది. దితి మూడుసార్లు ఋగ్వేదంలో పేర్కొనబడింది. రెండుసార్లు అదితితో కలిపి చెప్పబడింది. దితి ప్రసక్తి చాల తక్కువ వున్నది. కాని తర్వాత పౌరాణిక యుగంలో దితి దైత్యులకు (రాక్షసులకు) తల్లిగా చెప్పబడింది. కాని ఋగ్వేదంలో దితికి రాక్షసులకు ఎక్కడా సంబంధం చెప్పబడలేదు.

## పృథ్వీస్థాన దేవతలు

అగ్ని:- పృథ్వీస్థాన దేవతల్లో అగ్ని ప్రముఖమైనవాడు. ఇంద్రుని తర్వాత అగ్నియే వైదికార్యులకు ప్రధానమైన దేవత. యజ్ఞాగ్నికి ప్రతినిధి రూపమే అగ్నిదేవత. అగ్ని దాదాపుగా 200 సూక్తాలల్లో ప్రస్తుతింపబడినాడు. అగ్ని అనేక పశువులతో సమానమైనవాడని చెప్పబడింది. అతడు గర్జించే వృషభంతో పోల్చబడినాడు. అగ్ని ఉత్పత్తి సమయంలో ఒక దూడ వంటివాడు. ప్రజ్వలింపబడినతర్వాత అతడు దేవతలను తెచ్చే అశ్వం వంటివాడు. అతనికి నాలుకలు, చేతులు వున్నట్లు కూడ చెప్పబడింది. అతనికి బంగారు వర్ణంలో గడ్డం, దంతాలు, అందమైన దవడలు వున్నవి. అగ్నిజ్వాలలే అతనికి వెంట్రుకలు, చేతులు, నాలుకలుగా చెప్పబడినవి. అంతేగాని అతని రూపం ఇతర దేవతలవలెనే అస్పష్టమైనది. వైదికార్యులు విగ్రహారాధకులు కాదు. అందుకే ఎక్కడా ఏ దేవత కూడ తర్వాత పౌరాణిక యుగంలో వలె స్పష్టమైన రూపు రేఖలతో వర్ణింపబడలేదు. అగ్ని దివ్యపక్షిగా, గరుత్మంతుడుగా చెప్పబడినాడు. నీళ్ళల్లో నివసించే అగ్ని బాతు వంటివాడు. అతనికి రెక్కలున్నట్లు చెప్పబడింది. పక్షి చెట్లమీద నివసించినట్లుగా అగ్ని కాష్ఠంలో నివసిస్తాడు. కర్రలు, నెయ్యి అతని భోజనం. ఆజ్యమే అతనికి పానీయం. అతనికి రోజుకు మూడుసార్లు భోజనం పెట్టబడుతుంది. అగ్ని దేవతలకు ముఖం. ఇతని ద్వారానే దేవతలు హవిస్సులను గ్రహిస్తారు. అతని జ్వాలలు గరిటెల వంటివి. వాటితోనే అతడు దేవతలకు హవిస్సులను పంచిపెడ్తాడు. దేవతలకు హవిస్సులను అందియ్యటమే కాక అగ్నికి కూడ హవిస్సులు అర్పింపబడుతవి. సోమరసాన్ని తాగడానికై అతడు ఆరాధకులచేత ఆహ్వానింపబడినాడు. అగ్ని సూర్యకిరణాల వలె, ఉషస్సు కాంతివలె, విద్యుత్కాంతివలె ప్రకాశిస్తాడు. అతడు రాత్రి కూడ తన కాంతులతో చీకటిని పారదోల్తాడు. అగ్ని అరణ్యాలను కాల్చినప్పుడు అతని మార్గం నల్లగా వుంటుంది. మంగలివాడు గడ్డాన్ని గీసినట్టుగా అతడు అరణ్యాలను ధ్వంసం చేస్తాడు. అతని జ్వాలలు ధ్వనించే అలల వంటివి. అతని గర్జన ఆకాశంలో ఉరుము వంటిది. అతని ఎర్రని పొగ ఆకాశం వరకు లేచి ఆకాశానికి ఆధారంగా నిలిచిన స్తంభం వలె వుంటుంది. అతడు ధూమకేతువు అని పిలువబడినాడు. వెలిగే బంగారు రథం

అతనికి వాహనం. దానికి హరితవర్ణ అశ్వాలు పూన్చబడుతవి. అతడు యజ్ఞానికి సారథి వంటివాడు. తన గుర్రాల మీద దేవతలను తీసుకొనివస్తాడు. అందుకే అతడు దూతగా దేవతలచేత, మానవులచేత నియమింపబడినవాడుగా ప్రస్తుతింపబడినాడు. అగ్ని ద్యావాపృథ్వికి కొడుకుగా చెప్పబడినాడు. అతడు జలాలకు కూడ సంతానమే. అగ్ని 'ఇళా' కుమారుడని కూడ చెప్పబడింది. ఇంద్రుడు, సూర్యుడు, విష్ణువులు అగ్నిని ఉద్భవింపజేసేవారుగా చెప్పబడినారు. దేవతలు మనుష్యుల కొరకు అతన్ని పుట్టించి ఇచ్చారు. మరొకసారి అగ్ని సమస్త దేవతలకు తండ్రి అని చెప్పబడినాడు. హవిస్సులను గ్రహించి ఇచ్చేవాడు కాబట్టి అట్లా చెప్పబడి వుంటాడు. మాతరిశ్విన్ మానవ కళ్యాణానికై అతన్ని భూలోకంలోకి తెచ్చినట్లుగా చెప్పబడింది. గ్రీకు పౌరాణిక గాథల్లోను ఈ వృత్తాంతం చెప్పబడింది. అక్కడ "ప్రమోథియస్" అగ్నిని మానవులకు ఇచ్చినట్లు చెప్పబడింది. ఇంద్రుడు, అగ్ని కవలలుగా చెప్పబడినారు. వీరిద్దరు జంటగా చాలాచోట్ల ప్రస్తుతింపబడినారు. అరణి అగ్నికి తలిదండ్రులుగా మరియు తల్లులుగా పేర్కొనబడింది. అగ్నియొక్క పుట్టుక అనేకచోట్ల చాలా మందికి జరిగినట్లుగా చెప్పబడుతూ వచ్చింది. అంటే అగ్ని యొక్క వివిధ రూపాలను తీసుకొని అట్లా చెప్పబడిందని అనుకోవాలి. పది మంది కన్యలకు అతడు జన్మించాడని చెప్పబడింది. అంటే చేతి పదివేళ్ళచేత అతడు వెలిగింపబడినాడని తెలుసుకోవాలి. అగ్నిని పుట్టించాలంటే శక్తి కావాలి. అందుకే అతడు శక్తికి కొడుకుగా "సాహసః" అని చెప్పబడినాడు. అతనికి జలాలు గర్భం. అందుకే అతని మరో రూపం "అపాంనపాత్". అగ్ని ఊర్ధ్వలోకంలో జన్మించినట్ల చెప్పబడింది. ప్రతి ఉదయకాలమందు ప్రజ్వలింపజేయబడ్తాడు. కాబట్టి అతడు ఎప్పుడు తరుణుడే. అతడే మొదటి యజ్ఞకర్త. సూర్యుడు కూడ అగ్ని యొక్క రూపాంతరంగా ప్రస్తుతింపబడినాడు. అందుకే అగ్ని ఆకాశంలో వెలుగుతాడని చెప్పబడింది. అంతరిక్షానికి పైన అతడు జన్మించాడు. అందుకే జగత్తులోని సమస్త విషయాలను అతడు కనిపెడుతుంటాడు. అగ్ని మూడు విధాలుగా వెలుగుతాడు. అతనికి మూడు మార్గాలున్నవి. అతని జన్మ కూడ మూడు విధాలుగా జరిగింది. అతనికి మూడు శరీరాలు మూడు శిరస్సులున్నవని వర్ణింపబడింది. ఇదే తర్వాత త్రిమూర్తి కల్పనకు దారి తీసిందని మాక్‌డొనెల్ అభిప్రాయం. కాని అగ్ని గార్హపత్య, ఆహవనీయ, దక్షిణ అని మూడు విధాలుగా వుంటుందని చెప్పబడింది. ఈ మూడింటినే ఇక్కడ అగ్నికి మూడు శరీరాలుగా, మూడు శిరస్సులుగా, మూడు మార్గాలుగా చెప్పబడి వుంటుంది. సృష్టి ద్యుఃలోకంగా, భూలోకంగా, విభజింప బడింది. అగ్ని ఆ రెండు లోకాల్లోను జన్మించిన వాడు కాబట్టి "ద్విజన్మన్" అని ప్రస్తుతింపబడినాడు. తర్వాత అగ్నికి అనేక జన్మలున్నట్లు కూడ చెప్పబడింది. అగ్ని గృహంలో వెలిగేవాడు, మానవునికి చాల

అవసరమైనవాడు. అందుకే అతడు గృహపతి అని పిలువబడినాడు. అతడు గృహస్థుకు అతిథి వంటివాడు. అతడు అమరుడు కాని మనుష్యులలో జీవిస్తుంటాడు. అగ్ని తదారాధకులకు కుమారుడుగా, సోదరుడుగా, జనకుడుగా చెప్పబడినాడు. అగ్ని యజ్ఞాన్ని నిర్వహించేవాడు కాబట్టి హోత్రుడని అధ్వర్యుడని బ్రహ్మన్ అని ఋత్విజుడని విప్రుడని చెప్పబడినాడు. ఇంకా అగ్ని 'వైశ్వానరః' (మానవులందరికి స్నేహితుడు) అని, 'తనూనపాత్' (శరీరజన్ముడు) 'నరాశంసః' (మానవులచేత ప్రశంసింపబడువాడు) అని వర్ణింపబడినాడు. అతడు పురోహితుడుకూడ. ఇంద్రుడు మహాయోధుడు అయినట్లుగానే అగ్ని మహా ఋత్విజుడు. యజ్ఞ విధులన్నీ తెలిసినవాడు కాబట్టి అగ్ని గొప్ప మేధావి అని సర్వజ్ఞుడని చెప్పబడినాడు. అతడు అందుకే "జాతవేదస్" - ప్రాణులను గూర్చి తెలిసినవాడని పేర్కొనబడినాడు. అగ్ని ఆరాధకులకు శుభాలను సంపదలను కలిగిస్తాడు. అగ్ని సమస్త దేవతలకన్న గొప్పవాడని ఒకొకసారి ప్రస్తుతింపబడినాడు. అతని సృష్టిశక్తి చాల కీర్తింపబడింది. అగ్ని యజ్ఞాలల్లో హవిస్సులను దేవతల కొరకు మోసుకొని పోయేవాడు కాబట్టి అతడు హవ్యవాహనుడు. అతడు మానవ కళేబరాలను కాల్చేవాడు కాబట్టి "క్రవ్యాద". అంతేగాక అతడు దుష్టశక్తులను పారదోల్తాడు. అగ్ని యొక్క ఘనకార్యాలు చాలా చెప్పబడినవి. అతడు యజ్ఞవిముఖులైన, దుర్బుద్ధులైన, కటువక్తలైన 'పణు'లను దూరంగా తరిమివేసి నాశనం చేశాడు. అంధకారంలో వున్నవారికి శ్రేష్ఠమైన మార్గాన్ని చూపాడు. అతడు సంపదలకు స్వామి, దుష్టులను శిక్షించేవాడు (ఋక్ 7-6-2-2,3,4). అగ్ని గుర్రం వలె వేగశీలి, దేవతలకు మిత్రుడు, సూర్యునివలె ప్రకాశించే వాడు.

అగ్ని దేవత ఇండో - ఇరానియనార్యులు ఒక చోట కలిసి జీవించిన నాటి దేవత మాత్రమే కాదు. ఇండో - యూరోపియనార్యులు కలిసి జీవించిననాడు కూడ అతడు ఆరాధింపబడినాడని తెలుస్తున్నది. ఇరానియన్లకు అగ్ని చాలా పవిత్రమైందని అవెస్తాను బట్టి తెలుస్తున్నది. ఇంద్రుని కన్న, ఇతర దేవతల కన్న ఇరానియన్లకు అగ్నియే ప్రధానమైన దేవత. శక్తిమంతుడు, కాంతిమంతుడు, బుద్ధిమంతుడైన దేవతగా అతడు ఆరాధింపబడినాడు. ఇప్పటికిని జరోష్ట్రియన్లకు అగ్ని చాల పవిత్రమైంది.

అగ్ని శబ్దం అగ్ లేక అక్ అనే ధాతువు నుంచి నిష్పన్నమైంది. అగ్ లేక అక్ అంటే ప్రేరేపించుట అని అర్థం.

ఒకప్పుడు ఆర్యులందరికి అగ్ని పవిత్రమైన ప్రముఖమైన దేవతగా వుండేది కావచ్చును. కాని ఇతర దేవతల ప్రాధాన్యం హెచ్చే కొద్దీ అగ్ని వారికి హవిస్సులను మోసుకొని పోయే వాడుగానే స్థానాన్ని సంపాదించుకొన్నాడు. . దానితో ఆర్యులు

ప్రత్యక్షంగా అగ్నిని ఆరాధించటం మానివేసారు. అగ్నిలో హవిస్సులను వివిధ దేవతలకు అర్పించి దానితో ఆర్యులు దేవతారాధనలు చేసేవారు. దేవతలకు ఆరాధకుల హవిస్సులను అందించేది కాబట్టి అగ్ని చాలపవిత్రమైందిగా, ఆరాధ్యమైందిగా ఆర్యులు భావించేవారు. జరోస్ట్రియన్లు అదే విధంగా భావించారు. వైదికార్యుల భావన అదే విధంగా కన్పిస్తున్నది. ప్రాచీనకాలంలో అగ్నిని ఆరాధించే - అంటె అగ్నిని వెలిగించి హవిస్సులను అర్పించే - గృహాలు ఇరాన్‌లో వుండేవి. ఇప్పటికి శిథిలావస్థలో ఆ గృహాలు ఇరాన్‌లో కన్పిస్తవి. గుట్టల మీద లేక పట్టణంలో ఈ గృహాలు కట్టబడేవి. వీటిని 'అతష్-కదే' అని పర్షియన్ భాషలో పిలుస్తారు. అటువంటి కట్టడాలు యజ్ఞశాలల పేరుతో భారతదేశంలోను వుండేవి కావచ్చును. కాని అటువంటివేవి తవ్వకాలల్లో బయటపడలేదు. తాత్కాలికంగా వేదికలను, యజ్ఞశాలలను నిర్మించి వైదికార్యులు యజ్ఞవిధులను నిర్వహించేవారేమో భారతీయులు విగ్రహారాధకులుగా మారినతర్వాత అగ్ని యొక్క ప్రాధాన్యం తగ్గింది. దేవతలకు అర్పించే పదార్థాలను విగ్రహాల ముందు పెట్టే ఆచారం రావటంతో వాటిని అగ్నిలోవేసి ఆరాధించే మార్గం వెనుకకు పట్టింది. ప్రతి శుభకార్యానికి ముందు వినాయకున్ని ఆరాధిస్తారుకాని అగ్నిని ఆహ్వానించే ఆచారం పోయింది. దేవాలయాల్లోను విగ్రహారాధనలే కాని అగ్నిపూజలు లేవు.

**బృహస్పతి:-** బృహస్పతి 11 సూక్తాలల్లో ప్రస్తుతింపబడినాడు. ఇంకా అక్కడక్కడ ఇతని ప్రసక్తి వున్నది. ఇంద్రునితో చేర్చబడి రెండు సూక్తాలల్లో ప్రస్తుతింపబడినాడు. బృహస్పతికి బ్రహ్మణస్పతి (మంత్రానికి పతి) అని కూడా పేరు. ఇతని శారీరక వర్ణన ఎక్కువగా కనిపించదు. అతడు సువర్ణం వలె ప్రకాశించేవాడు. అతనికి వాడియైన కొమ్ములు, నల్లని వీపు వున్నట్లు మాత్రం చెప్పబడింది. అతడు చేతిలో ధనుర్బాణాలను, బంగారు పరశువును ధరిస్తాడు. అతని రథానికి ఎర్రని గుర్రాలుంటవి. అతడు దైత్యులను నాశనం చేసి గోశాలలను తెరుస్తాడు. అతడు వెలుగును లోకంలో ప్రసరింపజేస్తాడు. బృహస్పతి ప్రార్థనలను, మంత్రాలను ప్రేరేపించేవాడు. అందుకని అతడు లేకుండ యాగానుస్థానం నిష్ఫలమౌతుంది. అతడు దేవతలకు తండ్రి అని చెప్పబడినాడు. బృహస్పతి వ్యోమలోకంలో తేజఃపుంజం నుంచి ఆవిర్భవించాడని, అతనికి ఏడు ముఖాలున్నవని చెప్పబడింది. అతడు ఏడు కిరణాలు కలవాడు. అతడు ఏడు కిరణాలతోను, గర్జన (రవేణ) తోను అంధకారాన్ని జయించాడు. అగ్నివలె అతడు గృహపురోహితుడు, గానం చేసేవాడు (ఋక్వతా). గానంచేసే వారి చేత పరివేష్ఠింపబడి వుండేవాడు. ఒకొకసారి అతడు అగ్నిగా కూడ చెప్పబడినాడు. కాని ఎక్కువగా అతడు ఇంద్రునితో కలిసివుండేవాడుగానే చెప్పబడినాడు. అందుకే ఇంద్రుని ఘనకార్యాలు అతనికి కూడ అంటగట్టబడినవి.

ఇంద్రుని మఘవన్ (దానశీలుడు), వజ్రి అనే పేర్లు అతనికి కూడ వాడబడినవి. గుహలో దాచబడిన ఆవులను విడిపించే కార్యం అతనికి కూడ చెప్పబడింది. భయంకరమైన వృత్రాసురుని అతడు గర్జనతో భేదించి ఆవులకు ముక్తిని కలిగించాడు. అతడు అంధకారాన్ని పారదోలి వెలుగును వ్యాపింపజేస్తాడు. బృహస్పతి తనను ఆరాధించేవారికి దీర్ఘాయువును ఇస్తాడు. ఇంకా అతడు సంపదలను కలిగించేవాడు. శత్రువుల వినాశం చేసేవాడు. బృహస్పతి సోమపానం చేసేవాడుగాను చెప్పబడినాడు.

వర్ణనలనుబట్టి బృహస్పతి అగ్నియొక్క రూపాంతరంగా కన్పిస్తాడు. అగ్నివలెనే యజ్ఞానుష్ఠానం మీద అధికారం కల దివ్య ఋత్విజుడు. 'బృహస్పతి' శబ్దం 'బృహ్' ధాతువునుంచి నిష్పన్నమైంది. బృహ్ అంటె వర్ధిల్లటమని అర్థం. సంపద యొక్క వృద్ధిని కలిగించేవాడు కాబట్టి అతనికీ పేరు కలిగింది. తర్వాత పౌరాణిక యుగంలో బృహస్పతి ఇంద్రునికి, దేవతలకు ఆచార్యుడుగా చెప్పబడినాడు. ఆ రూపంలో అతనిపాత్ర ఎక్కువగా ఏమి వేదంలో కనిపించదు. వేదాలల్లోని బృహస్పతి దేవతయే తర్వాత కాలంలో గణపతి, గణేశుని భావనకు దారి తీసిందని విమర్శకుల అభిప్రాయం. గజాననం, స్థూల శరీరం గల గణపతి అనార్యుల దేవత అని సామాన్యంగా భావింపబడుతుంది. కాని బృహస్పతి ఋగ్వేదంలో 'గణపతి'గా పిలువబడినాడు. బృహస్పతి, ఇంద్రుడు - వీరిద్దరు అంగిరసగణానికి ఆధిపత్యం వహించారు. కాబట్టి బృహస్పతి గణపతిగా పేర్కొనబడినాడు కూడా. బృహస్పతి కేవలం వైదికార్యుల దేవతగానే కన్పిస్తున్నాడు. సప్తసింధు దేశంలో ఆర్యులు అడుగిడక ముందు ఈ దేవతారాధనను వారు చేసినట్లు లేదు. అవెస్తాలో ఎక్కడా బృహస్పతి ప్రసక్తి లేదు. వైదికార్యులు అగ్నియొక్క ఒక రూపంగా బృహస్పతిని ఆరాధించి వుంటారని మాక్‌డొనెల్ అభిప్రాయం. దివ్య పురోహితుడుగా, ప్రార్థనలకు అధిపతిగా అగ్ని యొక్క రూపాంతరమే బృహస్పతి పేరుతో ప్రత్యేక దేవతగా పరిణమించిందని అతడు అంటాడు. బృహస్పతియే త్రిమూర్తులల్లో 'బ్రహ్మ' రూపంగా వికసించిందని మాక్ డొనెల్ అభిప్రాయం.

**సోముడు** :- ఋగ్వేదంలో సోమయాగం ప్రధానమైన యజ్ఞ విధి. అందుకే సోమదేవత ప్రముఖమైన దేవతల్లో ఒకడుగా పరిగణింపబడినాడు. అగ్ని తర్వాత సోముడు ఋగ్వేదంలో ఎక్కువగా ప్రస్తుతింపబడినాడు. దాదాపు 120 సూక్తాలల్లో సోముని స్తుతి వున్నది. వీటిల్లో ఎక్కువ సూక్తాలు 9వ మండలంలో వున్నవి. 10, 12 మాత్రం ఇతర మండలాల్లో వున్నవి. సోముడు ఒక లత. కాబట్టి అతని శారీరకావయవాలు వర్ణింపబడలేదు. సోమరసం తాగటంవల్ల కలిగే మత్తు, మదం, ఆనందోల్లాసాలు అధికంగా

వర్ణింపబడినవి. సోమలత పర్వతాలల్లో లభిస్తుందని చెప్పబడింది. అది "మూజవంత" మనే పర్వతం మీద లభిస్తుందట. ఆ పర్వతం సప్తసింధువుకు ఉత్తర-పశ్చిమ దిశలో వున్నది. ఆర్యులు పూర్వదిశగా సాగిపోతున్న కొద్ది సోమలతను తెచ్చి అమ్మేవారట కూడ. దాని వ్యాపారం కూడ జరిగేది. సోమలత పెరిగే ప్రాంతం కొరకు భారతీయార్యుల ఇరానియనార్యుల నడుమ పోట్లాటలు, యుద్ధాలు జరిగి వుంటవి. అవే అమృతమథన వృత్తాంతంగా, దేవాసురుల యుద్ధాల కథలుగా పరిణమించి పురాణాల్లోకి ఎక్కినవి కావచ్చును.

సోమలత మొదట స్వర్గలోకంలో ఉద్భవించింది. అందుకే సోముడు 'ద్యుః' కు పుత్రుడు అని చెప్పబడింది. అది స్వర్గంలో శుభ్రం చేయబడుతుంది. సోముడు స్వర్గానికి అధిపతి. అతడు స్వర్గంలో ఊర్ధ్వస్థానంలో నివసిస్తాడు. అక్కడి నుంచి భూమిమీదికి అతడు వచ్చాడు. గద్ద లేక గరుత్మంతుని ద్వారా సోముడు భూమిమీదికి తేబడ్డాడని 4-26-27 సూక్తాలల్లో చెప్పబడింది. సోముడు అమృతప్రదాయుడు కాబట్టి అతడు వనస్పతి అని పిలువబడినాడు. అతడు మానవులకు, దేవతలకు, అధిపతి - రాజు. ఋగ్వేదం, అథర్వవేదంలో సోముడు చంద్రునితో అభేదం చేసి కూడ చెప్పబడినాడు. బ్రాహ్మణ గ్రంథాలల్లో ఈ అభేదం అంతటా కన్పిస్తుంది. తర్వాత పౌరాణికయుగంలో అమృతానికి, సోమునికి అభేదం చేయబడింది. సోముని స్థానాన్ని అమృతం తీసుకొన్నది. సోమరసం స్థానంలో అమృతాన్ని దేవతలు సేవిస్తారని చెప్పబడింది. అమృతాన్ని తాగి దేవతలు అజరామరులైనారని చెప్పబడింది.

సోముడు భయంకరమైన, వాడియైన శస్త్రాలను చేతిలో ధరిస్తాడని చెప్పబడింది. అతడు ధనుస్సును మరియు వేయి ముఖాలుగల బాణాన్ని ధరిస్తాడు. అతడు వాయువులచేత లాగబడే రథాన్ని ఎక్కి తిరుగుతాడు. ఇంద్రుని రథం మీద అతనితో పాటు ఎక్కి కూడ తిరుగుతాడని చెప్పబడింది. సోముడు ఇంద్ర, అగ్ని, పూషన్, రుద్రదేవతలతో కూడనవాడుగా, వారికి స్నేహితుడుగా పేర్కొనబడినాడు. అతడు ముఖ్యంగా ఇంద్రునికి ప్రియమైన స్నేహితుడు. యజ్ఞంలో సోముడు ఆహ్వానింపబడ్డాడు. అతనికి హవిస్సుల్లో భాగం కూడ వున్నది.

సోమలతను రాయితో దంచి రసాన్ని తీస్తారు. ఆ రసాన్ని ఊర్ణవస్త్రంతో వడకట్టి ఒక కాష్ఠపాత్రలో పడ్తారు. గడ్డి (బర్హి)ని పరచి సోమరసాన్ని కాష్ఠ పాత్రలో దానిమీద పెట్టి దేవతలకు ఇస్తారు. సోమరసాన్ని తీయటంకాని, దేవతలకు అర్పించటం కాని దీన్నంతా వైదికార్యులు చాల రకాలుగా రహస్యపూర్ణకార్యంగా చాల మార్మికత్వంతో (mystical) వర్ణించారు. సోమరసాన్ని తీయటాన్ని వారు ఒక పవిత్ర కార్యంగా భావించినట్లు కన్పిస్తుంది.

సోమరసంలో ఒకొకసారి పాలు కూడా కలిపి సేవింపబడినట్లుగా చెప్పబడింది. సోమరసం చాల మదాన్ని ఉత్సాహాన్ని కలిగిస్తుంది. సోమరసం మధువుగాను పేర్కొనబడింది. కాని ఎక్కువసార్లు అది 'ఇందు' (వెలిగే బిందువు)గా పేర్కొనబడింది. సోమలతను నలపటానికి లేక దంచటానికి ప్రత్యేకంగా రాళ్ళు వుండేవి. వాటిని 'అద్రి' అని 'గ్రావ' అని పిలిచేవారు. రసాన్ని ఊర్ణవస్త్రంతో వడగట్టేటప్పటి ధారను 'పవమాన, పునాన' అని కూడా పిలిచారు. ఇందులో వడగట్టబడిన సోమరసం "శుక్ర, శుచి" (ప్రకాశం, స్వచ్ఛం) అని కూడ పిలువబడింది. దీనిలో నీళ్ళను గాని పాలను గాని కలుపుకొని తాగేవారు. పాలవల్ల అది తీయదనాన్ని పొందేది. ఇట్లా కలుపబడే పాలను, నీళ్ళను 'మృజ' అని అనేవారు. అంతేగాక సోమరసం మూడు రకాలుగా మిశ్రిత మయ్యేదని చెప్పబడింది. పాలు, పెరుగు, యవలగంజితో కలుపబడి సోమరసం సేవింపబడేది. పాలతో కలిపితేదాన్ని 'గవాశిర' మని, పెరుగుతో కలిపితే 'దధ్యాశిర' మని యవలగంజితో కలిపితే 'యవాశిర' మని పిలిచేవారు. సోమరసం రోజుకు మూడుసార్లు తీయబడేది. పొద్దున మధ్యాహ్నం సోమరసాన్ని సేవించటానికి ఇంద్రుడు ఆహ్వానింపబడేవాడు. సాయంత్రం ఋభులు ఆహ్వానింపబడేవారు. ఇంద్రుడు, వాయువులు సోమరసాన్ని సేవించటానికి ప్రత్యేకంగా ఆరాధకులచేత ఆహ్వానింపబడినట్లుగా వేదంలో కన్పిస్తుంది. అందులో ఇంద్రుడు సోమరసాన్ని తాగటానికి విశేషంగా ఆహ్వానింపబడినాడు. అతడు సోమపానప్రియుడు. కడుపునిండ సోమరసాన్ని తాగి అతడు మదోన్మత్తుడై ఉత్సాహభరితుడై శత్రువినాశనాన్ని చేస్తాడు. సోమరసాన్ని బాగా తాగి అతడు వృత్రుని చంపి గోవులను విడిపించాడు. సోముడు ఇంద్రునికి సహయోగి, స్నేహితుడు.

సోముడు జలగర్భం నుంచి పుట్టాడని చెప్పబడింది. జలాలు అతనికి తల్లులు, చెల్లెళ్ళు. సోముడు నదులకు రాజు, ప్రభువు. అతడు నీళ్ళను ఉద్భవింపజేస్తాడు. వృష్టిని కల్పిస్తాడు. జలాల నడుమ వుండే వృషభంగా సోముడు చెప్పబడినాడు. జలాలంటే గోవులకు ప్రతీక. సోముడు వేగవంతుడు. సామాన్యంగా అతని వేగం అశ్వవేగంతో, పక్షివేగంతో పోల్చబడింది. దంచి ఒత్తి తీసేటప్పుడు సోమరసం శబ్దంచేస్తూ కింద పడ్తుంది. ఆ శబ్దం మేఘగర్జనతో, తేన్పుశబ్దంతో పోల్చబడింది. సోముని పసుపుపచ్చని కాంతి విశేషంగా వర్ణింపబడింది. సామాన్యంగా అతని కాంతి సూర్యుని కాంతితో సమానంగా చెప్పబడింది. సోమరస పానంవల్ల అమరత్వం సిద్ధిస్తుందని చెప్పబడింది. అందుకే అది అమృతంగా చెప్పబడింది. ఇది దేవతలకేకాక మనుష్యులకు కూడ అమరత్వాన్ని కలిగిస్తుంది. సోమరసానికి ఓషధీగుణాలు కూడ వున్నవి. రోగాలను పోగొడ్తుంది. గుడ్డివానికి చూపునిస్తుంది, కుంటివాన్ని నడిచేటట్లు చేస్తుంది. బుద్ధిని తీక్షణం చేస్తుంది.

ఉత్సాహాన్ని కలిగిస్తుంది. మంత్ర రచనలకు ప్రేరణను ఇస్తుంది. కవులను నడిపిస్తుంది, మంచి ఆలోచనలను కలిగిస్తుంది (సుమేధాః). తండ్రి కొడుకుకు, స్నేహితుడు స్నేహితునికి మంచి చేసినట్లుగా సోమరసాన్ని తాగినప్పుడు మాకు మంచి చేయమని తదారాధకులు సోముని ప్రార్థించారు. సంపదల నియ్యమని, వసంతకాలంలో సూర్యుడు దినాలను దీర్ఘం చేసినట్లుగా మా జీవితాలను దీర్ఘం చేయమని, మథనం చేత అగ్ని ప్రజ్వలించినట్లుగా మమ్మల్ని ప్రజ్వలింపజేయమని కూడ ప్రార్థించారు. పురోహితుల్లో ఇది ఋషి వంటిది. సోముడు గొప్ప బుద్ధిగల ఋషి. అతనికి దేవతలను గూర్చి తెలుసును. సోమరసాన్ని తాగి ఇంద్రుడు అజేయుడౌతాడు.

సోముని ప్రసక్తి మనకు జరోష్ట్రియన్ల మతగ్రంథం అవెస్తాలోను కన్పిస్తున్నది. 'సోమ'ను వారు 'హోమ' అని పిలిచారు. ఇండో-ఇరానియన్ ఆర్యులు కలిసి జీవించిననాటికే సోమారాధన కన్పిస్తున్నది. ఋగ్వేదంలో వలెనే అవెస్తాలోను సోమలతను ఒత్తిలేక దంచి సోమరసాన్ని తీసే పద్ధతి, ఆ సోమరసం పసుపుపచ్చగా వుంటుందని, పాలతో కలిపి తాగుతారని, సోమలత పర్వతాలల్లో లభిస్తుందని, అసలు దాని నివాసస్థానం స్వర్గమని చెప్పబడింది. సోమారాధన ఇండో - ఇరానియన్ ఆర్యులనాటిదేకాదు. ఇండో - యూరోపియన్ ఆర్యులనాడే ప్రచారంలో వుండేదని, ఆనాడు అదొక మధువుగా పరిగణింపబడేదని మాక్‌డొనెల్ తెలిపాడు. వేదంలో సోముడు మధువు అని కూడ పేర్కొనబడినాడు. గ్రీకు భాషలో కూడ ఈ 'మధు' వు పేర్కొనబడింది. ఇది మొదటినుంచి ఆర్యజాతిలో ప్రచలితమైన ఒక విధమైన తియ్యని పానీయం కావచ్చును. అది మదోన్మత్తతను కూడ కలిగిస్తుంది కావచ్చును. ఇండో-ఇరానియన్ ఆర్యుల దేవతలే పానప్రియులు కాదు. గ్రీకు దేవతలు కూడ పానప్రియులే. అదేవిధంగా సెల్టిక్‌ల దేవతలు కూడ పానప్రియులు. సెల్టిక్‌ల ప్రధాన దేవత "థోర్" ద్యుః కు సమానమైనవాడు. అతడు స్వర్గలోకంలో ఎప్పుడు తాగుతూ, మత్తుడై వుండి వీరోచిత కార్యాలను చేస్తుంటాడు.

వైదికానంతర కాలంలో సోమలత పరిచయాన్ని భారతీయులు మరచి పోయారు. సోమయాగాదుల్లో సోమలతకు ప్రతీకగా దాని స్థానంలో మరొక తీగను ప్రయోగించసాగారు. భారతీయులు బౌద్ధ జైన మత ప్రభావాలతో శాకాహారులైనారు. అదేవిధంగా మత్తు పానీయాలను సేవించటం కూడ చెడ్డగా భావింపబడేది. కాబట్టి క్రమంగా మత్తును కలిగించే సోమరసం విస్మృతమై వుంటుంది.

**నదులు:-** వేదాలల్లో పర్వతాలు దేవతలుగా ప్రస్తుతింపబడలేదు. కాని నదులకు చాల ప్రాధాన్యమియ్యబడింది. నదులు దేవతలుగా ప్రస్తుతింపబడినవి. నదులను

వేదర్షులు చాల కావ్యాత్మకంగా ప్రస్తుతించి వున్నారు. సప్త సింధు ప్రదేశంలోని సింధు మొదలైన ఏడు నదులు, గంగా, యమున, సరస్వతి నదులు వేదాలల్లో కీర్తింపబడినవి. సరస్వతీనది చాల పవిత్రమైందిగా చాల చోట్ల ప్రస్తుతింపబడింది. ఈ నది యమునా శతుద్రీ (సతలజ్) నదుల మధ్య ప్రవహించేది. అది ఇప్పుడు ఎండిపోయింది. అదృశ్య రూపంలో వచ్చి గంగా యమునల్లో త్రివేణీ సంగమ స్థానంలో కలుస్తుందని ఇప్పుడు విశ్వసిస్తున్నారు. సరస్వతి దివ్యమాత, బుద్ధిని కలిగిస్తుంది. సరస్వతీ నదిని ఒక దివ్య స్త్రీగా వైదికార్యులు ప్రస్తుతించారు. ప్రకృతిలోని వివిధ దివ్య శక్తులను ఆరాధించి కీర్తించిన ఆర్యులకు నదులు కూడ దివ్యరూపులుగానే కన్పించినవి. అందుకే వారు నదులను కూడ ఆరాధించి కీర్తించారు.

ప్రకృతి యొక్క దివ్య శక్తులను, వివిధ గతులను, విచిత్ర లీలలను ఆర్యులు దేవతలుగా ప్రస్తుతించారు. ఉదయించే సూర్యుడు, సూర్యుని క్రియాశీలన శక్తి, సృష్టి సమర్థమైన శక్తి, అట్లాగే జలాలు, మేఘాలు మొదలైన వాటిని వివిధ ప్రకృతి శక్తులను సూక్ష్మ వివేచనను చేసి వివిధ దేవతలుగా ఆరాధించారు. ప్రకృతిలోని వివిధ శక్తులను తమకు ఆ శక్తులను ప్రదానం చేయమని ప్రార్థించారు. ఆర్యులు ఇతర ఆటవికులవలె, సంచారజాతుల వలె, ఇంకా అనేక ఆదిమజాతుల వలె, దుష్టశక్తులను, వికృత రూపాలను ఆరాధించలేదు. వారి ఆరాధనా విధానం కూడ ఉత్కృష్టమైంది. బలులను ఇచ్చే హింసాత్మకమైన, ఆటవికమైన ఆరాధనా విధానాలను వారు అనుసరించలేదు. యజ్ఞకల్పన చాల ఉత్తమమైన కల్పన. యజ్ఞాలల్లో పశుబలులు చివరకు నరబలి కూడ వుండేదని అంటారు. కాని ఇది తర్వాత వికసించిన రూపమని, మొదట యజ్ఞాలు హింసాత్మకమైనవి కావని కొందరి విమర్శకుల విశ్వాసం. తమకు నిత్యజీవితంలో అవసరాలను తీర్చే నదులను, గోవులను కూడ ఆర్యులు దేవతారూపులుగా ప్రస్తుతించారు. ఒక చోట ఒక ఆరాధకుడు తనకు గోవులే ఇంద్రుడు అని గోవులే సోమరసం అని అన్నాడు. తమకు సంతానాభివృద్ధి కలిగించమనే కాక తమకు గోసంపదను వృద్ధి చేయమని, తమ గోవులకు శుభాలను కలిగించమని ఆయా దేవతలను వైదికార్యులు ప్రార్థించారు. గోవులు అంటె వారికి చాల శ్రద్ధ. ఆ శ్రద్ధయే ఈ ప్రార్థన రూపంలో బయటపడింది. గోవులు తనకు భగుడని తనకు ఇంద్రుడని, తనకు సోమరసం యొక్క మొదటి చుక్క అని చెప్పే మంత్రం-

గావో భగో గావ ఇంద్రోమే అచ్ఛాన్
గావః సోమస్య ప్రథమస్య భక్ష :
ఇమా యా గావః స జనా స ఇంద్ర
ఇచ్ఛా మీద్ధృదా మనసా చిదింద్రమ్. ఋక్ 6-28-5

వైదికార్యులు ప్రకృతిలోని వివిధ శక్తులను వివిధ దేవతలుగా ఆరాధించారు. దీన్ని బట్టి వారు బహుదేవతావాదులని (Polytheism) కొందరు అభిప్రాయపడినారు. అయితే వైదికార్యులు ఒక దేవతను ప్రార్థించేటప్పుడు గాని ప్రస్తుతించేటప్పుడు గాని ఆ దేవతయే సర్వశక్తిమంతుడని, అతడే ఇతర దేవతలకన్న మించినవాడని కీర్తించారు. ఒకొకసారి ఇతర దేవతలందరూ, ప్రస్తుతింపబడే దేవత యొక్క రూపాంతరాలు అని కూడ చెప్పబడుతూ వచ్చింది. లేకపోతే ప్రస్తుతింపబడే దేవతకు ఇతర దేవతలు సహాయోగులు, స్నేహితులుగా చెప్పబడినారు. ఉదా॥కు ఇంద్రున్ని ప్రస్తుతించేటప్పుడు అగ్ని, వాయువు, మరుత్తులు అతనికి సహకరించే వారుగా చెప్పబడినారు. అతడే ప్రధాన దేవతగా ప్రస్తుతింపబడినాడు. అగ్నిని ప్రస్తుతించేటప్పుడు అగ్నియే సర్వశక్తి సంపన్నుడుగా, మహాఋత్విజుడుగా, సృష్టికర్తగా చెప్పబడినాడు. అదే విధంగా వరుణున్ని ప్రస్తుతించేటప్పుడు అతడు ఊర్ధ్వలోకంలో వుంటాడని, శక్తి సంపన్నుడని, ప్రాణులకు అధిపతి అని కీర్తింపబడినాడు. అంటే ఏ దేవతను స్తుతించేటప్పుడు ఆ దేవతకే వైదికార్యులు ప్రాధాన్యమిచ్చి వర్ణించారు. అయితే దీనిని బహుదేవతావాదం (Polytheism) అనే దానికన్న "హెనోథియిజమ్" (సర్వేశ్వరవాదం) అనటం సమంజసమని మాక్స్‌ముల్లర్ అభిప్రాయపడి కొత్తగా నామకరణం చేసాడు. "హెనోథియిజమ్"కే "క్యథనోథియిజమ్" అని మరొక పేరు. "హెనోథియిజమ్" (సర్వేశ్వరవాదం) వేదమతంలో క్రమక్రమంగా ఏకేశ్వరవాదం (monotheism) గా పరిణమిస్తున్నట్లు వేదంలోనే ఆధారాలు కన్పిస్తున్నవి. పురుషసూక్తంలోని విరాట్ పురుష కల్పన ఏకేశ్వరారాధన వైపు వైదికార్యులు మొగ్గు చూపినట్లుగా ప్రకటిస్తున్నది. మాటిమాటికి వేదంలో "మహద్ దేవానా మసురత్వమేకమ్"- దేవతల మహత్‌శక్తి (అసురశక్తి) ఒక్కటె అని చెప్పబడుతూ వచ్చింది. అసుర శబ్దం మహత్‌శక్తి అన్న అర్థంలో ప్రయోగింపబడింది. "ఏకం సద్ విప్రా బహుధా వదంతి" అన్న వేదోక్తిలోను ఏకేశ్వరవాద బీజాలు కన్పిస్తున్నవి. అంటే వేరు వేరు శక్తులను వేరు వేరు పేర్లతో ఆరాధించినా వారందరిలో వుండే మహత్‌శక్తి ఒక్కటె అని ఆ మహత్‌శక్తినే వేరు వేరు పేర్లతో పిలుస్తున్నామని వైదికార్యులు గ్రహించారు. అంటే బృహద్రూపమైన సృష్టి లయశక్తులను వారు తెలుసుకొన్నారు. పేర్లు వేరైనా ఆ శక్తి ఒక్కటె అన్న గొప్ప సత్యాన్ని వారు గ్రహించారు. ఉపనిషత్తుల్లో ఈ సత్యాన్ని ఇంకా పూర్తిగా చూడవచ్చును. అందుకే వారు వివిధ జాతుల దేవతలను అంగీకరించి తమ మతంలో లీనం చేసుకోగలిగారు. మరియు ఆయా జాతుల దేవతల ప్రవృత్తులను బట్టి ఆయా దేవత యొక్క రూపాంతరాలుగా అవతారాలుగా చేసి దానిచుట్టు కథలు అల్లి తమ మతంలో చేర్చుకోగలిగారు. వారి దైవశాస్త్రం (theology) సంపూర్ణంగా ఈ దృష్టితోనే వికసించింది. అందుకే పౌరాణికయుగంలో ఎందరో దేవతలు ఎన్నో రూపాలుగా ఎన్నో

అవతారాలుగా కీర్తింపబడినారు. ఒక దేవతను స్తుతించేటప్పుడు అతడే విశ్వరూపుడని అతనికి ఇతర దేవతలందరు దాసులని చెప్పబడింది. దీనితో ఇందరు దేవతల్లో ఏ దేవత సర్వశక్తి సంపన్నుడో నిర్ణయించటం కష్టమైంది. ప్రతి ఒక్కరు తాము ఆరాధించే దేవతయే శక్తి సంపన్నుడుగా ఏకైక దేవతగా ఆరాధించటం మొదలుపెట్టారు. ఇక ఆయా దేవతారాధక సాంప్రదాయికులు కూడా తమ తమ ఆరాధ్యదేవతనే గొప్పవానిగా, సృష్టికర్తగా, సర్వశక్తి సంపన్నుడుగా చెప్పుకోవటం సహజమైంది. దానితో స్థూలదృష్టికి అర్థంకాని గందరగోళం కొంత ఏర్పడింది. వేదాలల్లో ఆలంకారికంగా, ప్రతీకాత్మకంగా చెప్పబడిన విషయాలు తర్వాత విచిత్రమైన కథలుగా పురాణాలల్లో సృష్టించబడినవి. అగ్ని జలాలకు కొడుకు అని చెప్పటం, సూర్యుడు ఉషస్సుకు కొడుకు అని, భర్త అని చెప్పటం ఇటువంటి ప్రకృతిలో కనిపించే ఆలంకారిక వర్ణనలే. వీటికి పౌరాణికయుగంలో ఏమేమో కథలు సృష్టింపబడినవి. వాటిని అర్థం చేసుకొనే శక్తి క్రమక్రమంగా భారతీయుల్లో నశించటమో లేక తెలుసుకొనికూడ వాటిని విచిత్రంగా రహస్య పూర్ణంగా విస్తరింపజేయటమో చేసారు. మొత్తం మీద భారతీయులు బహుదేవతారాధకులైనా దేవతాశక్తి ఒక్కటే అన్న సత్యాన్ని ఒంటపట్టించుకొన్న వాళ్ళు. అందుచేతనే వారు ఎన్నో విజాతీయ మతాలను, ఆలోచనలను జీర్ణం చేసుకోగలిగారు. వారు పైకి బహుదేవతారాధకులుగా కనిపించినా ఏకైక దైవశక్తిని అంగీకరించిన ఏకేశ్వరవాదకులే. ఇతర మతాలకన్న హిందూమతంలో ఏకేశ్వర సిద్ధాంతం సంపూర్ణంగా వికసించి వ్యాపించిందని చెప్పవచ్చును.

## వేదాలల్లో కవితా సౌందర్యం

వేదర్షులు దేవతాస్తుతులను నీరసమైన భాషలో అసుందరంగా చేయలేదు. చక్కని భాషను, అందమైన భావాలను మనం వేదమంత్రాలల్లో దర్శించవచ్చును. ఋగ్వేద మంత్రాలల్లో ఎంతటి కవితా సౌందర్యమున్నదో తర్వాతి రచన అనబడే లౌకిక విషయాధిక్యత గల అథర్వవేదంలోని మంత్రాలల్లోను అంతటి కవితా సౌందర్యమే కన్పిస్తున్నది. ఛందోబద్ధమైన వేదమంత్రాలు చాలాచోట్ల కవిత్వపు ముసుగును వేసుకొని కన్పిస్తున్నవి. వేదాలల్లో ధార్మిక, దార్శనిక, ఆధ్యాత్మిక తత్త్వాలతో కూడిన భాగాలు ఎన్నో వున్నవి. నిజమే! కాని వారు ఆరాధించిన దేవతలలో ప్రకృతిశక్తులను, ప్రకృతిలోని వివిధమైన, విచిత్రమైన లీలలను దర్శించి మనోహరమైన పద్ధతిలో వర్ణించారు. ప్రాతఃకాలంలో పూర్వదిశలో వెలుగు గోచరించటం, క్రమక్రమంగా సూర్యుడు రంగురంగుల కిరణాలను ప్రసరింపజేస్తు ఉదయించటం, రాగరంజితమై సాయంకాలం అస్తమించటం, చీకటి, నక్షత్రాలతో వెలిగే రాత్రి, చంద్రుడు, మేఘాలు, ఆకాశం ఈ అందమైన దృశ్యాలన్నీ వేదర్షుల భావుకతను

రేకెత్తించినవి. వారు కేవలం ధార్మిక గురువులు, మతాచార్యులు కాదు. వారు కవితాహృదయం కలిగిన అమృతహృదయులు. అందుకే సుందరమైన భావాలతో స్తుతిపాఠాలను చేసారు. వర్షాకాలంలో రాత్రిపూట బెకబెకమనే కప్పలు కూడా వారిని ఆకర్షించినవి. వాటిని ఒక సూక్తంలో వేదపాఠంచేసే బ్రాహ్మణులతో పోల్చి వర్ణించారు. ఇక వర్షాకాలంలో మేఘావృతమైన ఆకాశం, ఉరుములు, మెరుపులు, వర్షాపాతం ఇవన్నీ వారి కవితాహృదయాన్ని కదిలించి వేసినవి. వర్షపాత దృశ్యాన్నంత వారు రూపకాత్మకంగా నాటకంగా వర్ణించి తృప్తులైనారు. ప్రతీకాత్మకంగా, రూపకారోపణ చేసి చెప్పిన విషయాలెన్నో తర్వాత కాలంలో కథలుగా అవతరించి విస్తరించినవి. ప్రాకృతిక, నైతిక, ధార్మిక రూపమైన విషయాలను ప్రతీకాత్మకంగా వేదర్షులు చెప్పినదాన్ని విప్పి చెప్పేందుకు తర్వాత చిలువలుపలువలుగా పెరిగిన అర్థం పర్థంలేని కథలుగా అవతరించినవి. ఆధునిక పాఠకులకు అటువంటి పౌరాణిక కథలు విడదీయ వీలులేని చిక్కులతో దర్శనమిస్తున్నవి. ఆ పౌరాణిక కథలు చారిత్రక సంఘటనలా, కవి కల్పిత రూపకారోపణలా, ప్రాకృతిక లీలలా ఏది విడమర్చి చెప్పటం అసాధ్యంగా పరిణమించింది.

వేదమంత్రాలల్లోని భాష సరళ సుందరమైంది. సమాసాలు లేవు. వైదిక సంస్కృత భాష అవికసితరూపంలో ఏంలేదు. పూర్ణ వికసితరూపంలోనే కన్పిస్తున్నది. భావాలల్లోగాని, భావవ్యక్తీ కరణలోగాని అపరిపక్వత, అసమగ్రత లేదు. భాష వివిధ భావాలను వ్యక్తీకరించే అనేక పదజాలంతో కూడి వున్నది. ప్రాచీన సుమేరియన్, ఈజిప్టు దేశాలల్లో లభించే మృత్ శిలాఫలకాదుల్లోని భాష, భావాలను పరిశీలించినట్లయితే వేదాలల్లోని భాష, భావాలు పరిపక్వదశను చేరుకొన్నట్లుగా, సుసంస్కృతమైనవిగాను వున్నవని చెప్పవచ్చును. వేదమంత్రాలల్లో ప్రస్తుతింపబడిన దేవతలు చాలా మట్టుకు ప్రకృతికి సంబంధించినవారు - అగ్ని, మరుత్తులు, సూర్యుడు, ఉషస్సు, పర్జన్యుడు, అపాంనపాత్ మొదలైన దేవతల వర్ణనలల్లో సహజ ప్రకృతి వర్ణనలు కన్పిస్తున్నవి. అతిశయోక్తుల జోలికిపోకుండ వైదిక ఋషులు ప్రకృతిలీలను ఉదాత్తంగా, సుందరంగా వర్ణించారు. దీనిలో వేద మంత్రాలు అప్రతిమానమైన సహజకవితా సౌందర్యానికి నిలయాలైనవి. ఋగ్వేదంలోని ఒక్క దశమమండలం తప్ప మిగతా అంతా వివిధ దేవతల స్తుతి. ఆ దేవతల వివిధ కృత్యాల, గుణమహిమల వర్ణనలు వున్నవి. అక్కడక్కడ శబ్దచమత్కారాలను వేదమంత్రాలల్లో చూడవచ్చును. వేదఋషులు కేవలం యజ్ఞయాగాదులను చేయించే పురోహితాదులే కాదు. వారికి చక్కని కవితా హృదయమున్నది. మతం, కవిత్వం రెండు పెనవేసుకొన్న వేదగ్రంథాలు నిజంగా అపూర్వసమ్మేళనంతో కూడినవని చెప్పాలి. వివిధ ఛందస్సులల్లో

నిబద్ధమైన ఈ కవిత్వం క్రమబద్ధమై లయబద్ధమై హృదయాకర్షకంగా వున్నది. వేదఋషులకు భాష మీద మంచి అధికారమున్నది. సుందరమైన శబ్దజాలాన్ని కూర్చటమే కాక ఎక్కడా అనవసరమైన శబ్దాలను ప్రయోగించలేదు. వేదమంత్రాలల్లో వ్యర్థపదాలేవి కనిపించవు. అలంకార బాహుళ్యం గాని శబ్దాడంబరతగాని లేక వేదాలల్లోని కవిత్వం చాల సహజ సరళసుందరంగా వున్నది. ప్రకృతికి సంబంధించిన దేవతల వర్ణనలు భవ్యంగా వుండటమే కాదు; సత్యం, శ్రద్ధ, కామం మొదలైన అమూర్త భావాలకు అధిపతులైన నాసత్యాది దేవతల వర్ణనలు కూడ భవ్యంగా చేయబడినవి. అగ్ని ఇంద్రాది దేవతలను వేదఋషులు తమకు సువీరులైన పుత్రులను, ధనసంపదలను, ఆరోగ్యాన్ని, దీర్ఘాయుష్షును, యుద్ధ విజయాలను ప్రసాదించమని ప్రార్థించారు. కొన్ని మంత్రాలల్లో దార్శనిక నిగూఢార్థాలు, మార్మికత (mysiticism) లున్నవి. అథర్వణ వేదాదుల్లో రాజకీయ, ఆయుర్వేదాది లౌకిక విషయాలు, చేతబడులు, ఇంద్రజాల విద్యలను గూర్చి కూడ చెప్పబడింది. ఈ విషయాలనన్నిటిని ప్రస్తుతీకరించటంలో వేదఋషులు చాల ప్రావీణ్యాన్ని చూపారు. వేదఋషుల కవితా హృదయం మనకు ఇంద్ర వృత్రుల సంఘర్షణ, సూర్య, ఉషః, మరుతాది దేవతల స్తుతిలో ఎక్కువ దర్శనమిస్తున్నది. పర్జన్య, మండూక సూక్తాలల్లో వర్షర్తువర్ణన చాల చక్కగా జరిగింది. సుకుమారమైన భావవ్యక్తీకరణ ఉషస్సువర్ణనలో వుండగా, ఆరభటీవృత్తి మరుత్తు, పర్జన్యాది వర్ణనల్లో కన్పిస్తున్నది. ఉరుముల, మెరుపుల, మేఘాల వర్ణనలు, ఇంద్రవృత్రుల సంఘర్షణ వర్ణనలు కన్నులకు కట్టేటట్లుగా చేయబడినవి. నదుల వర్ణనలు కూడ చాల గొప్పగా చేయబడినవి. యమయమి, ఊర్వశీపురూరవ, సరమపణుల సంవాద ఘట్టాలు మంచి నైపుణ్యంతో కావ్యశైలిలో వ్రాయబడినవి.

వేదఋషులు అక్కడక్కడ రూపక, ఉపమాద్యలంకారాలను ప్రయోగించి విషయాన్ని రమణీయతరం, సులభగ్రాహ్యం చేసారు. సూర్యుడు ఆకాశంలోని మణిగా వేదకవికి కనిపించాడు - "దివోరుక్మ ఉరుచక్షురుదేతి" (ఋక్ 7-63-4). ఇటువంటి ఉపమలు వేదమంత్రాలల్లో సర్వసామాన్యంగా కన్పిస్తవి. సుందరమైన సహజమైన ఉపమలనే వేదఋషులు ప్రయోగించారు. అవైనా వారికి అప్రయత్నంగా దొర్లినవే కాని ప్రయత్నపూర్వకంగా, కృత్రిమంగా ప్రయోగించినవి కావు. "సింధోరివ ప్రవణే నిమ్న ఆశవో వృషచ్యుతా మదాసో గాతుమాశత" - (ఋక్ 9-69-7) - నదులు సముద్రాన్ని చేరుకొన్నట్టుగా సోమరసం ఋత్విజుల ద్వారా నిష్పీడితమై ఇంద్రున్ని చేరుకుంటుందట.

అంధకారాన్ని కల్పించే వృత్రాసురున్ని ఇంద్రుడు వృక్షస్కంధంవలె వజ్రాయుధంతో నరికివేశాడని ఒక వర్ణన -

అహన్వృత్రం వృత్రతరం వ్యంసమింద్రో వజ్రేణ మహతా వధేన
స్కంధాం సీవకులిశేనా వివృక్ణాహిః శయత ఉపపృక్పృథివ్యాః.

ఋక్ (1-32-5)

ఈ క్రింది మంత్రంలో విపాశా, శతుద్రి నదులను విశ్వామిత్రుడు సుందరంగా ఇట్లా వర్ణించాడు -

ప్రపర్వతానాముశతీ ఉపస్థాదశ్వేఇవ విషితే హాసమానే
గావేవశుభ్రే మాతరా రిహాణే విపాట్ శతుద్రీ పయసాజవేతే

(ఋక్ 3-33-1)

"జలయుక్తమైన విపాశా, శతుద్రి నదులు పర్వతాంకం నుంచి బయలుదేరి సముద్రంలో కలవాలనే కోరికతో అశ్వశాల నుంచి విముక్తమై స్పర్ధతో పరిగెత్తే రెండు గుర్రాలవలె, రెండు ఆవులవలె ప్రకాశిస్తు వేగంగా సముద్రంవైపు ప్రవహిస్తున్నవి". ఈవిధంగా ప్రయోగింపబడిన ఉపమల్లో ఆనాటి భారతీయుల జీవిత విధానమెంతో ప్రతిబింబించి ప్రకటితమైంది.

వేదాలల్లో అనేకచోట్ల ప్రతీకాత్మకంగా రూపకారోపణలో వర్ణనలు చేయబడి సుందరంగా వున్నవి. ఉషస్సు వర్ణనలో సూర్యుడు ఉషస్సుకు భర్తగాను, కొడుకుగాను చెప్పబడినాడు. సూర్యుని కంటె ముందు వస్తుంది కాబట్టి ఉషస్సు సూర్యుని కంటె పెద్దది మరియు ఉషస్సు ఒడిలో నుంచి సూర్యుడు ఉదయిస్తాడు కాబట్టి సూర్యుడు ఉషస్సుకు కొడుకుగా చెప్పబడినాడు. ఉషస్సు ప్రతినిత్యం సూర్యున్ని అనుసరించి వుండేది కాబట్టి సూర్యునికి ఆమె భార్య అని చెప్పబడింది. ఈ రెండు కూడా ఆలంకారికంగా చెప్పినవే. విష్ణువు తన మూడు అడుగులతో భువనాలను కొలిచినాడనేది కూడా ఉదయ, మధ్యాహ్న, సాయంకాల సమయాలల్లో ఆకాశస్థితమైన సూర్యస్థానాలను గూర్చి ఆలంకారికంగా చెప్పటమే. ఈ ఆలంకారికంగా చెప్పబడిన విషయాలే తర్వాత భాగవతాది పురాణాలల్లో అవతారాదికథలుగా వర్ధిల్లినవి. ఇంద్ర - వృత్ర సంఘర్షణ కూడ ప్రాకృతిక సంఘర్షణగా రూపకారోపణచేసి చెప్పబడింది. వృత్రుడు మేఘానికి, అహికి, అంధకారానికి ప్రతీకగా పేర్కొనబడినాడు. వృత్రుడు గోవులను బంధించిన వృత్తాంతం మేఘాలు జలాలను బంధించిన దానికి ప్రతీకగా చెప్పబడింది. ఇంద్రుడు మేఘాలనుంచి జలాలను విముక్తం చేసినట్లుగా వృత్రుని చంపి గోవులను విడిపించి నాడని రూపకారోపణ వేద మంత్రాలల్లో ఇంద్రునిస్తుతి సందర్భంలో వర్ణింపబడింది. ఇటువంటి ప్రాకృతిక రూపకారోపణ చేసిన కథలు తర్వాత పురాణాలల్లోను చాల కనిపిస్తున్నవి.

వేదాలల్లో సహజ సుందరమైన ప్రకృతి వర్ణనలు, వాస్తవిక చిత్రణలు కూడ వున్నవి. ఒక సంవత్సరకాలం సుప్తావస్థలో వుండి వర్షాకాలం రాగానే రంగురంగుల మండూకాలు నిద్రనుంచి లేచి అరుస్తవి. ఆ అరుపులను మంత్రకారుడు పర్జన్యస్తుతిగా ఉత్ప్రేక్షించాడు. మండూకాలు వర్షజలాలతో తడుపబడి సంతోషంతో ఒకదాన్ని మరొకటి పిలుచుకుంటూ అరుస్తవి. ఇన్నాళ్ళు ఎండవేడికి కంతల్లో దూరిన మండూకాలు బయటకి వస్తవి. నిండిన సరోవరజలాలల్లో సోమయాగంలో స్తోతవలె శబ్దం చేస్తు అరుస్తవి. " శిష్యుడు గురువును అనుకరించినట్లు మండూకాలు ఒకదాని శబ్దాన్ని మరొకటి అనుకరిస్తవి. అందంగా అరుస్తూ నీళ్ళల్లో గంతులు వేస్తు ఎగురుతు వుంటవి" -

యదేషామన్యోఅన్యస్య వాచం శాక్తస్యేవ వదతి శిక్షమాణః
సర్వం తదేషాం సమృధేవ పర్వ యత్సువాచో వదథ నాధ్యప్సు.

ఋక్ 7-103-5

వర్షాకాలం రాగానే విజృభించే మండూకాలు వర్షానికి ప్రతీకలు. వర్షం కురిస్తే సంపదలు కలుగుతవి. కాబట్టి మండూకాలను తమకు సంపదలను ప్రదానం చేయమని వేదఋషులు ప్రస్తుతించారు. ఈ మండూకాల వర్ణన సహజసుందరంగా వుండి పాఠకులను అలరిస్తున్నది. వేదకాలంలో జూదం ఆడటం చాల ప్రచలితంగా వుండేది. జూదం ఆడి చాలామంది సర్వస్వాన్ని పోగొట్టుకొని బాధలు పడేవారు. అట్లా జూదంలో సర్వస్వాన్ని కోల్పోయిన ఒక వ్యక్తి స్థితిని వేదకవి వాస్తవికంగా, హృదయ విదారకంగా చిత్రించాడు. "జూదరి భార్య ఎప్పుడు హృదయ సంతాపం కలిగివుంటుంది. అతని సంతానం కూడా అడిగేవారు లేక వీథుల్లో పడి తిరుగుతారు. సంతానం యొక్క విచారంతో జూదరి భార్య మరింత దుఃఖతప్తురాలు అవుతుంది. జూదరి ఎప్పుడు ఇతరుల ఆశ్రయంతోనే రాత్రులను గడుపుతాడు. వానికి ఎవరు ధనాన్ని అప్పుగా ఇచ్చినా అది తిరిగి వస్తుందో లేదో అనే సందేహంలో పడిపోవలసిందే"-

జాయాతప్యతే కితవస్యహీనా మాతా పుత్రస్య చరతః క్వస్విత్
ఋణావా బిభ్యద్ధన మిచ్ఛమానో z న్యేషామస్త ముపనక్తమేతి.

(ఋక్ 10-34-10)

వేదకాలంనాడు వేద ఋక్కులను కొందరు వ్యక్తులు దేవతారాధన కొరకై రచించారు. మంత్ర రచనలను చేసి దేవతారాధన చేసిన వారికి వారి మనోకామన ఫలించినట్లు కూడ కథలున్నవి. మంత్రద్రష్ట అయిన అపాల కథ ఈవిధంగానే వున్నది. అపాల అత్రి మహర్షి కూతురు. ఆమె ఒక విధమైన చర్మరోగంతో బాధపడ్తుంది. ఎన్ని ఔషధాలను సేవించినా

ఆమె కది నయంకాలేదు. ఆమె చర్మం చిన్న చిన్న తెల్లని మచ్చలతో నిండి వుండేది. ఇక ఆమె వైద్యాన్ని మానేసి అత్రి ఆమె విద్యాభ్యాసం మీద శ్రద్ధవహించాడు. చివరకు ఆమె వివాహం కృశాశ్వునితో జరిగింది. ఆమె చర్మ లోపాన్ని చూసి కృశాశ్వుడు ఆమెను ఆదరించలేదు. ఆమె దగ్గరకు రాలేదు. అపాల తండ్రి ఇంటికి తిరిగి వచ్చి ఇంద్రుని ఉపాసించి చర్మరోగ విముక్తురాలైంది. అదే విధంగా మంత్రద్రష్ట అయిన మరొక ఋషి శ్యావాశ్వుడు. రథవీథి అనే రాజు కూతురును ప్రేమించి వివాహమాడాలనుకొన్నాడు. కాని రాణి శ్యావాశ్వుని సద్గుణాలచేత ప్రభావితమైనా అతడు ఋషికానిది తన కూతురుని ఇయ్యనని చెప్పింది. శ్యావాశ్వుడు తరంత పురుమీల్హ, విదదాశ్వరాజులు ఇచ్చిన సంపదల చేత ధనవంతుడైనాడు. ఋషి కాలేదు. చివరకు అతడు తేజోవంతులైన మరుత్తులను దర్శించి వారిని ప్రస్తుతించి వేదద్రష్టఋషి అయ్యాడు. రథవీథి కూతురును వివాహమాడాడు. ఈ రెండు కథలను బట్టి వేదమంత్ర రచనలకు ప్రాచీన ఋషులు ఎంతటి ఆరాధన, సాధనలు చేసారో తెలుస్తుంది. నరప్రశంస చేసే వారికన్న మంత్ర ద్రష్టలైన ఋషులకు సంఘంలో అధిక గౌరవ స్థానముండేది. వారు కవుల వలెనే కవితా సాధనను కూడ చేసి వుంటారు. సాధన ద్వారా వారు ఆంతరమైన దివ్యదృష్టిని సంపాదించి వుంటారు. అందుకే తర్వాత యుగంలో "నా నృషిః కురుతే కావ్యమ్" అన్న ఉక్తి పుట్టింది. ఋషులు మంత్ర ద్రష్టలు అనగానే ముక్కు మూసుకొని ప్రాపంచిక విషయాలతో సంబంధం లేకుండా మానవులకు దూరంగా తపస్సు చేసుకునే వారనే అభిప్రాయం మనలో పాతుకొని పోయింది. కాని వేదకాలంలో ఋషి అంటె మంత్రద్రష్ట, కవి అని అర్థం. ప్రాచీన ఋషులు దేవతారాధన కొరకై మంత్రాలను రచించినా వారు భావుకత కలిగిన కవులు. అందుకే చక్కని భావ సౌందర్యం, భాషా సౌష్ఠవం గల ఛందోబద్ధమైన మంత్రాలను చెప్పగలిగారు. ప్రాచీన వేదద్రష్టల కావ్య సంప్రదదాయమే వ్యాస, వాల్మీకి, కాళిదాసాది కవుల్లో కొనసాగి కన్పిస్తున్నది.

## యజ్ఞ విధి

యజ్ఞం ఆర్యుల ఆరాధనా విధానం. వేదకాలంలో యజ్ఞవిధి చాల సరళంగా వుండేది. రానురాను యజ్ఞవిధులు అనేక రకాలుగా విస్తరించినవి. యజ్ఞభేదాలు కూడ అధికమైనవి. మంత్ర పూర్వకంగా అగ్నిని ప్రజ్వాలింపజేసి, వెలిగే ఆ అగ్నిలో తమ ఇష్టదేవతలను వైదికార్యులు మంత్రపూర్వకంగా ఆహ్వానించి హవిస్సులను అర్పించేవారు. అవసరాన్ని బట్టి సందర్భాన్నిబట్టి యజ్ఞయాగాది అనుష్ఠానాలు క్లిష్టమైనవి. బహుముఖంగాకూడ విస్తరించినవి. బ్రాహ్మణకాలంనాటికే యజ్ఞ విధులు విస్తరించినవి అంటె ఇంకా సూత్రకాలంలో

ఇంకా తర్వాత కాలంలో అవి వెర్రితలలుగా అతిగా విస్తరించినవి. అట్లా అర్థం పర్థం లేకుండా విస్తరించిన యజ్ఞ యాగాదులను ఖండించే కొరకే బౌద్ధమతం పుట్టింది.

వైదికార్యులకు యజ్ఞవిధి ప్రధానమైన ధార్మికకృత్యం. వారు తెగలుగా నివసించినప్పుడు సామూహికంగా చేసే దేవతారాధనే యజ్ఞక్రియ అని చెప్పవచ్చును. అప్పుడు యజ్ఞక్రియ వారి సాంఘిక ధార్మిక జీవనానికి ప్రధానకేంద్రంగా వుండేది. వారు ఒక్కచోట చేరి సామూహికంగా ఉత్సవాలను, విజయాలను యజ్ఞరూపంగా జరుపుకొని ఆనందించేవారు. ఆ యజ్ఞక్రియే బ్రాహ్మణకాలంలో సూత్రకాలంలో పూర్తిగా ధార్మిక రూపాన్ని ధరించి అనేక విధాలుగా విస్తరించింది. వైదికార్యులు నిర్వహించే యజ్ఞాలల్లో సోమయజ్ఞం లేక సోమయాగం అతిప్రచలితమైంది. ఈ సోమయాగం జరోష్ట్రియన్ మతానుయాయుల్లోను ప్రచలితమై వుంది. అంటె యజ్ఞవిధి ఇరానియన్, ఇండో ఆర్యులు కలిసి జీవించివున్నప్పుడే వికసించి విస్తరించిందని చెప్పాలి. సోమయాగం కాలగణనను బట్టి మూడు రకాలుగా వుంటుంది. 1) ఏకాహం. ఒక్కరోజు మాత్రమే చేయదగింది. 2) అహీనం, రెండు రోజుల నుంచి 12 రోజుల వరకు చేయదగింది. 3) సత్రం. 13 రోజుల నుంచి ఒక్క సంవత్సరం వరకుగాని వేయి సంవత్సరాల వరకుగాని చేయదగింది. సోమయాగంలో ప్రధానంగా సోమలత నుంచి తీసిన రసాన్ని ఆహుతిగా ఇచ్చి దేవతలను ఆహ్వానిస్తారు. ఇప్పుడు సోమలత లభించకపోవటం చేత దాని స్థానంలో 'పూతీక' యనే పేరుగల లతను వాడుతుంటారు. సోమయాగంలో 4 మంది ఋత్విజులుంటారు. వారికి సహాయక ఋత్విజులు వుంటారు. యజ్ఞ విధిని గూర్చి బాగా తెలిసినవారిని ఋత్విజులు అంటారు. వీరు యజ్ఞక్రియను సశాస్త్రీయంగా నడిపేటటువంటివారు. ఋత్విజులు నాలుగు విధాలుగా వుంటారు. అంటే నాలుగు వేదాలకు సంబంధించిన వారన్నమాట. ఋగ్వేదానుసారం, దేవతలను ఆహ్వానించేవారిని "హోత" అంటారు. యజుస్సుల ద్వారా యజ్ఞక్రియను సంపన్నం చేసేవారిని "అధ్వర్యు" అంటారు. సామమంత్రాలను గానం చేసే వారిని "ఉద్గాత" అంటారు. అథర్వవేదాన్ని తెలిసిన, యజ్ఞకర్మను పర్యవేక్షించే వారిని "బ్రహ్మ" అంటారు. ఈ నాలుగు విధాలైనవారికి ఒక్కొక్కరికి ముగ్గురు సహాయకులు వుంటారు. ఈవిధంగా సోమయాగం షోడశఋత్విజుల చేత నిర్వహింపబడుతుంది. వీరి ప్రత్యేక విధినిర్వహణనుగూర్చి శ్రౌతసూత్ర గ్రంథాలలో వివరంగా చెప్పబడివుంది. మంత్రాలను చదువుతూ దేవతలను ఆహ్వానిస్తు హవిర్ద్రవ్యాలను అర్పిస్తారు. దేవతలకు అగ్ని - ముఖంగా భావింపబడింది. అగ్నిలో వేసిన హవిస్సులు ఆయా దేవతలకు అర్పింపబడినట్లుగా, ఆ దేవతలకు అందినట్లుగా భావిస్తారు. హవిస్సులను అగ్నిలో అర్పించే క్రియను 'ఆహుతి'అంటారు. 'ఆహుతి' అంటే వైదిక భాషలో "ఆహ్వానం" అని

అర్థం. మంత్రాలను చదువుతూ దేవతలను ఆహ్వానించి అర్పింపబడేవి కాబట్టి "ఆహుతి' ' అని అంటారు. మంత్రం యొక్క ప్రభావం చాలగొప్పది. "మననాద్ వై మంత్రా" అని అందుకనే అర్థం చెప్తారు. మంత్రం శక్తిసంపన్నమైన శబ్దాల రాశి. మంత్ర ప్రభావంచేత హవిస్సులు దేవతలకు అంది భోగ్యమౌతవి. మంత్ర ఫలం లభించాలంటే సరియైన రీతిగా శబ్దోచ్చారణ వుండాలి. అప్పుడే మంత్ర పఠన ఫలితం పూర్తిగా లభిస్తుంది. మీమాంసకులు వేదమంత్రాలకు చాలా ప్రాధాన్యాన్నిచ్చారు. అవి నిగూఢమైన శక్తి కలవని వారు విశ్వసించారు. వేద మంత్రాలను దేవతామూర్తులుగా భావించారు. మీమాంసకులు భగవంతుని కన్న వేదమంత్రాలకు, యజ్ఞక్రియలకు ప్రాధాన్యం ఇచ్చారు. అసలు మీమాంస దర్శనవికాసంతోనే వేదమంత్రాలకు అతి నిగూఢ శక్తులున్నవని, అవి సమస్త జ్ఞానానికి భాండాగారాలని, అవి అతి పవిత్రమైనవనే అభిప్రాయాలు అతిశయోక్తి అని అనిపించేంతవరకు పెరిగిపోయినవి. ఉచ్చారణాదులు చెడిపోతే వేదరక్షణ కష్టమౌతుందని, అందరినీ వేదమంత్రాలు చదువకూడదనే నియమం కూడా మీమాంసదర్శన వికాసంతో చాల విపరీతార్థంతో ప్రచారంలోకి వచ్చింది. వేదపఠనం శూద్రులు, స్త్రీలు చేయరాదని, చివరకు వారు దాన్ని వినరాదని, వింటే వాళ్ళ చెవుల్లో సీసం కరిగించిపోయాలని ఏవేవో విపరీతమైన అభిప్రాయాలు తర్వాత యుగాల్లో అతిగా విధించారంటే వేదమంత్రాలకు వారు లేనిపోని శక్తులను పవిత్రతను ఊహించటమే కారణమని చెప్పాలి. ప్రాణుల్లో వుండే ఆత్మ అంతా ఒక్కటే అని బోధించిన శంకరాచార్యుడు కూడ "స్త్రీ శూద్రౌ నాధీ యాతాం ఇతి శ్రుతేః" అని చెప్పటం శోచనీయం. అసలు వేదాలమూలార్థాలు అర్థంకావటం ఆగిపోయిందగ్గరనుంచే ఇటువంటి విపరీతమైన అభిప్రాయాలు వ్యాప్తిలోకి వచ్చినవి. ఉపనిషదాదుల్లోని కథలను బట్టి పరిశీలిస్తే వేదపఠనం శూద్రులు చేయకూడదనే నియమం ఆ కాలంలో వున్నట్లే కనబడదు. విజాతీయులు అధికంగా భారతదేశంలో ఆయా కాలాల్లో ప్రవేశించి స్థిరపడటం, దానితో భారతీయులకు తమ ప్రాచీన ధార్మిక గ్రంథాలను పరిరక్షించుకోవాలన్న ఆకాంక్ష కూడ ఇటువంటి విపరీతమైన అభిప్రాయాలు ప్రచలితం కావటానికి దోహదం చేసివుంటవి.

యజ్ఞవిధి అంతా అయిపోయింతర్వాత ఋత్విజులకు 'దక్షిణ' కూడ ఇయ్యబడేది. "నిర్దక్షిణోహతో యజ్ఞః" అన్న దాన్ని బట్టి దక్షిణ యజ్ఞం యొక్క పూర్ణతకు చాల ప్రధానాంగమని తెలుస్తున్నది. వైదికయుగంలో ఆవులు ఎక్కువగా దక్షిణరూపంలో ఇయ్యబడేవి. యజ్ఞంలో ఋత్విజుల నియామకం, వేదమంత్రపాఠం, తదుచ్చారణవిధులు చాల శ్రద్ధగా పాటింపబడేవి. వీటిల్లో దేనిలో త్రుటి ఏర్పడినా యజ్ఞఫలం లభించదని ప్రాచీనుల విశ్వాసం. అందుకే వారు యజ్ఞవిధిని చాల శ్రద్ధగా భయభక్తులతో వైభవపూర్వకంగా నిర్వహించేవారు.

వైదికకాలం నాటి యజ్ఞ విధులలో సోమయాగమే కాక ఇతర యాగాలు కూడ వుండేవి. అవి -

**అగ్నిష్టోమం:-** ఈ యజ్ఞం చివర "యజ్ఞా యజ్ఞావో అగ్నయే" అన్న సామ మంత్రగానం చేయబడుతుంది. ఆ సామగానానికి అగ్నిష్టోమమని పేరు. అందుకని ఈ యజ్ఞానికి అగ్నిష్టోమమని పేరు. ఈ యజ్ఞం 5 రోజుల వరకు నడుస్తుంది.

**ఉక్థ్యం :** ఈ యజ్ఞం చివర కూడ ఉక్థ్యమనే పేరుగల సామ మంత్రాలు గానం చేయబడుతవి. అందుకే ఈ యజ్ఞానికి ఉక్థ్యమని పేరు.

**షోడశీ:-** ఈ యజ్ఞంలో ఉక్థ్యం తర్వాత షోడశి అనే స్తోత్రం చేయబడుతుంది. అందుకే దీనికీ పేరు కలిగింది.

**అతిరాత్రం:-** షోడషీ స్తోత్రం తర్వాత అతిరాత్రమనే సామ మంత్రాలు గానం చేయబడుతవి. అందుకే దీనికి అతిరాత్రమని పేరు. పై నాలుగు యజ్ఞాలను సామూహికంగా జ్యోతిష్టోమ యాగమంటారు. తైత్తిరీయ బ్రాహ్మణంలో త్రివృత్, పంచదశ, సప్తదశ, ఏకవింశ ఈ నాలుగు స్తోమాలను "జ్యోతిః" పేరుతో పిలుస్తారు. ఈ యాగంలో ఇవే ప్రయోగింపబడుతవి కాబట్టి దీనికీ పేరు.

**అత్యగ్నిష్టోమం :-** ఈ యాగంలో అగ్నిష్టోమం తర్వాత ఉక్థ్యపాఠం లేకుండానే షోడశి విధానం అనుష్ఠింపబడుతుంది. వీటన్నిటిలో ప్రధానమైంది, ప్రకృతిరూపమైంది అగ్నిష్టోమం. అందుకే శ్రౌత సూత్రాలల్లో అగ్నిష్టోమ వివరణ చాల కన్పిస్తుంది. యజ్ఞం త్రివరణ రూపమైంది - ప్రాతః యజ్ఞం, మాధ్యందిన యజ్ఞం, సాయం యజ్ఞం. పై యాగాలే కాక గవామయన, వాజపేయ, రాజసూయ, అశ్వమేధ యాగాలు ప్రధానమైవి.

**పంచాగ్నులు:** - యజ్ఞాలల్లో పంచాగ్నులందు ఆహుతి చేయబడాలని చెప్పబడింది. యజ్ఞ క్రియల్లో ఉపయోగింపబడే అగ్ని శ్రౌతాగ్ని అనబడుతుంది. శ్రౌత సూత్రాలల్లో ప్రతిపాదింపబడిన యజ్ఞానుష్ఠానాలన్నీ శ్రౌతాగ్ని ద్వారా జరుపబడుతవి. శ్రౌతాగ్ని మూడు విధాలుగా వుంటుంది. ఆహవనీయ, గార్హపత్య, దక్షిణ. ఇవి ప్రజ్వాలింపజేయబడే కుండాల ఆకారాలు వేరువేరు విధంగా వుంటవి. ఆహవనీయాగ్ని కుండం చతురాకారంగా, గార్హపత్యాగ్ని కుండం వర్తులాకారంగా, దక్షిణాగ్నికుండం అర్ధ చంద్రాకారంగా వుంటవి. ఈ మూడింటిలో ఆహవనీయం ముఖ్యమైంది. దీనిలోనే దేవతలకు ఆహుతి ఇయ్యబడుతుంది. గార్హపత్యాగ్ని హవిస్సులను వండేందుకు ఉపయోగిస్తుంది. దక్షిణాగ్నిలో పితృకర్మలు చేయబడుతవి. అంటె పితృ దేవతలకు హవిస్సులు అర్పింపబడుతవి. ఇవిగాక స్మార్తాగ్ని

వుంటుంది. స్మార్త కర్మల్లో ఉపయోగింపబడే అగ్ని. దీనికి గృహ్యాగ్ని అని పేరు. గృహ్యా సూత్రాలల్లో చెప్పబడిన ఔపోసనాది కర్మల్లో ఈ అగ్ని ఉపయోగింపబడుతుంది. ఈ నాలుగు అగ్నులు కాక ఐదవది సభ్యాగ్ని. ఇది శ్రౌత సూత్రకర్మలకే ఉపయోగిస్తుంది. కాని ఇది ప్రజ్వలింపజేయబడే స్థానం సభా మంటపం; అందుకే దీనికి సభ్య (సభా+యత్) అని పేరు. యజ్ఞ క్రియల్లో పురోడాశాది పక్వాన్నాలను హవిస్సులుగా ఉపయోగిస్తారు. పురోడాశాదులే కాక పాలు, పెరుగు, యవలు, బియ్యం, నెయ్యి ఆహుతులుగా అగ్నిలో అర్పింపబడుతవి. కొత్త పంట వచ్చినప్పుడు పండిన వివిధ ధాన్యాలనుకూడ ఆహుతులుగా అర్పించి యజ్ఞ క్రియలను ఆచరించేవారు. యజ్ఞక్రియలు విస్తరించేకొద్ది పశువులను కూడ బలిగా అర్పించటం ఆరంభమైంది. అజ, మేష, ఋషభం - ఈ పశువులను మొదట యజ్ఞ పశువులుగా ఉపయోగించేవారు. తర్వాత అశ్వాన్ని, నరున్ని కూడ యజ్ఞ పశువుగా ఉపయోగించ సాగారు. పశువుల్లో మానవుడు కూడ చేరుతాడని, పశువుల్లో మానవుడు ఉత్తమమైన పశువు అని మానవున్ని కూడ యజ్ఞ పశువుగా ఉపయోగించసాగారు. ఖదిర లేక బిల్వంతో చేయబడిన యూపానికి యజ్ఞ పశువును కట్టేసి వుంచేవారు. ఈ పశువును శస్త్ర ఘాతం లేకుండానే నోరు, ముక్కు మూసి అంటె ఉచ్ఛ్వాస నిశ్వాసాలను ఆపివేసి చంపేవారు. ఈ చంపే విదానాన్ని "సంజ్ఞపన" మని అంటారు. పశువు మరణించింతర్వాత ప్రత్యేకాంగాలను తీసి అగ్నిలో హవిస్సులుగా అర్పించేవారు. ఈవిధంగా క్రీ.పూ. 6వ శతాబ్దం నాటికే అంటే బౌద్ధ మతోద్గమం నాటికే యజ్ఞ ప్రక్రియలు అనేక రకాలుగా విస్తరించి వ్యాపించినవి. అందుకే వెర్రితలలు వేసి అర్థంలేకుండా విస్తరించిన యజ్ఞకర్మలను బుద్ధుడు నిరసించాడు. కాని బౌద్ధమతం వ్యాప్తి వెనుకకుపట్టగానే క్రీ.పూ. 2 - క్రీ.శ. 7,8 శతాబ్దాల నడుమ అంటే శుంగ, శాతవాహన, ఇక్ష్వాకు, విష్ణుకుండిన, గుప్తవంశరాజుల పరిపాలన కాలంలో యజ్ఞక్రియలు తిరిగి బాగా విస్తరించినవి. అప్పటివరకు వేదసాహిత్యం చాలామట్టుకు అర్థంకావటం మానివేసింది. బ్రాహ్మణులు ఏవిధంగా వ్యాఖ్యానిస్తే ఆ విధంగా యజ్ఞయాగాదులు నిర్వహింపబడేవి. దానితో యజ్ఞప్రక్రియలు మునుపటికన్న క్లిష్టమై అతివిస్తరమై ప్రచారంలోకి వచ్చినవి. అటువంటి క్లిష్టమైన, విస్తరమైన ధన, కాల వ్యయంతో కూడిన యజ్ఞక్రియలు రాజులు మహారాజులకే యోగ్యకర్మలుగా అయినవి. ఒకప్పుడు సామూహికంగా ఉత్సవరూపంగా బయలుదేరిన, దేవతలను ప్రస్తుతిస్తూ తమ దగ్గరున్న పదార్థాలను హవిస్సులుగా దేవతలను ఆహ్వానించి అర్పించే యజ్ఞసంస్థ ఋత్విజుల వ్యాఖ్యానాలతో విస్తరించి విస్తరించి విరాడ్రూపాన్ని ధరించి భక్తిమత ఉద్గమంతో అంతరించింది.

# పురాణాలు

వేదాలల్లో నిక్షిప్తమైన జ్ఞానసంపదే పురాణాలల్లో కథలరూపంగా వ్యాఖ్యానింప బడింది. వైదిక యుగం నాటి ధార్మిక, సాంఘిక పరిస్థితులు పురాణాల కాలం నాటికి చాల మార్పులకు లోనైనవి. పౌరాణిక యుగం నాటికి అనేక విదేశీయజాతులు భారతదేశాన్ని తమ స్వదేశంగా చేసుకొని స్థిరపడినవి. వారు ఇక్కడి ధార్మిక జీవనాన్ని గ్రహించటమే కాక తమ ధార్మికాలోచనల ప్రభావాన్ని కూడ ఇక్కడి మతధర్మాల మీద వేసారు. వైదికయుగంలో ప్రాధాన్యం వహించిన అగ్ని ఇంద్ర వరుణాది దేవతలు పురాణాల కాలం నాటికి గౌణమై వారి స్థానాన్ని విష్ణువు శివుడు మొదలైనవారు గ్రహించారు. ఒకవైపు వేదవిజ్ఞానాన్ని, దార్శనికాభిప్రాయాలను వ్యాఖ్యానిస్తున్నా పురాణాలు విష్ణు శివుల ప్రాధాన్యతను, సత్తాను ఒక విధంగా స్థాపిస్తున్నవి. ఆ ఉద్దేశంతోనే విష్ణు, శివ, శాక్తమొదలైన దేవతాసంప్రదాయాలకు చెందిన వివిధ పురాణాలు ఆవిర్భవించినవి.

పురాణాలల్లో వైదికానంతర యుగం నాటి భారతీయుల ఆచార వ్యవహార విచారాలు, ధార్మిక సాంఘిక రాజకీయ జీవిత విధానాలు, దార్శనిక సిద్ధాంతాలు ప్రతిబింబించినవి. పురాణాలు భారతీయుల ధార్మిక, సాంఘిక, రాజకీయ, దార్శనిక జీవనానికి విజ్ఞానకోశ గ్రంథాలని చెప్పవచ్చును.

## పురాణాల ప్రాచీనత

ప్రాచీన భారతీయ సంప్రదాయాన్ననుసరించి వేదాలు ఎంత ప్రాచీనమైనవో పురాణాలు అంత ప్రాచీనమైనవి, అథర్వ సంహితను బట్టి పురాణ, ఋక్, సామ, ఛంద, యజుస్సులు - అన్నీ ఒకేసారి ఆవిర్భవించినవి. తడిసిన కట్టె నుంచి పొగలేచినట్లుగా మహాభారతం నుంచి వేదాలు, ఇతిహాస, పురాణ, ఉపనిషత్, సూత్ర, ఆఖ్యాన, వ్యాఖ్యానాలు ఉద్భవించినవని శతపథబ్రాహ్మణం, బృహదారణ్యకాలు చెప్తున్నవి. దీనికి భాష్యం చేస్తు శంకరాచార్యులు - పురుషున్నించి అప్రయాసంగా నిశ్వాసం ఎట్లా వెళ్లుతుందో అట్లా అనాయాసంగా ఇవి ఆవిర్భవించినవని అన్నాడు. పురాణాలు ప్రాచీనమైనవని బ్రాహ్మణ, ఉపనిషత్తులు అంగీకరించినవి. పురాణాన్ని పంచమ వేదంగా ఛాందోగ్యోపనిషత్తు అంగీకరించి నాలుగు వేదాల పక్కన దానికి

స్థానాన్ని ఇచ్చింది. చతుర్దశ విద్యలల్లో పురాణ విద్య ప్రముఖమైందని యాజ్ఞవల్క్యస్మృతి కారుడు చెప్పాడు. పురాణ, న్యాయ, మీమాంస, ధర్మశాస్త్రం మరియు నాలుగు వేదాలు, షట్ వేదాంగాలు - ఇవి స్మృతికారుని దృష్టిలో చతుర్దశవిద్యలు. మొదట బ్రహ్మ పురాణాలను స్మరించి తర్వాత వేదాది శాస్త్రాలను స్మరించాడని బ్రహ్మాండపురాణంలో చెప్పబడింది. పురాణాలను అధ్యయనం చేయంది వేదాల తత్త్వాన్ని తెలుసుకోవటం కష్టం అని ప్రాచీన భారతీయుల అభిప్రాయం.

పురాణాలు అర్వాచీన రచనలని, గుప్తరాజుల కాలంలో అవి వ్రాయబడినవని కొందరు ఆధునికుల అభిప్రాయం. కాని బ్రాహ్మణ, ఉపనిషత్తుల్లో పురాణాల ప్రశంస వుండగా పురాణాలు క్రీ.శ. 400 ప్రాంతం రచనలని చెప్పటం సమంజసం కాదని ఆధునిక విమర్శకుల్లో చాలామంది అభిప్రాయ పడేవారున్నారు. చారిత్రకమైన మౌర్య, ఆంధ్ర, గుప్తరాజుల ప్రశంస పురాణాల్లో వున్నది. కాబట్టి పురాణాలు ఏదో ఒక్క కాలంలో రచింపబడినవని నిర్ణయించటానికి వీల్లేదు. ఉపనిషత్తుల రచనలవలె పురాణాలు వివిధ కాలాల్లో వ్రాయబడినవని చెప్పవలసివుంటుంది. పురాణాల సంప్రదాయం మౌఖికంగా అతిప్రాచీనకాలం నుంచే ప్రచలిత రూపంలో వుండివుంటుంది. అంటె వేదమంత్రాల రచనాకాలంలోనే పురాణ సంప్రదాయం మౌఖికంగా ప్రచారంలో వుండివుంటుంది. మత్స్య, శివపురాణాల ననుసరించి మొట్టమొదట ఒక్కటే పురాణం వుండేదని తెలుస్తున్నది. ఆ ఒక్క పురాణం నుంచే ఇతర పురాణాలు ఆవిర్భవించి వుంటవి. నాలుగు లక్షల శ్లోక పరిమితమైన ఆ మొదటి పురాణాన్ని వ్యాసుడు 18 భాగాలుగా విభాగించాడని, ఆ 18 విభాగాలే 18 పురాణాలు అయినవని అంటారు. పురాణాలన్నిటిలోని విషయం, నిర్మాణ విధుల్లో వున్నసామ్యాన్ని పరిశీలించి పై కథను అనుసంధానించుకొన్నట్లయితే పురాణాలన్నీ ఏదో ప్రాచీనమైన ఒక్క పురాణాన్ని ఆదర్శంగా పెట్టుకొని వేరు వేరు సంప్రదాయాలకు అనుగుణంగా ఆయా దేవతల మహత్తతను స్థాపిస్తు ఆవిర్భవించినవని చెప్పవచ్చును. బ్రాహ్మణ కాలంలోను పురాణ విద్య వున్నది. మరియు గుప్తవంశజుల ప్రసక్తి పురాణాలల్లో కన్పిస్తున్నది. దీన్ని బట్టి పురాణాల రచనాకాలం బ్రాహ్మణ కాలం నుంచి గుప్తరాజుల పరిపాలనాకాలం వరకు విస్తరించిందని చెప్పవచ్చును. అంటె అప్పుడు ఆ కాలాన్ని దాదాపుగా క్రీ.పూ. 1200 నుంచి క్రీ.శ. 500 వరకు అని నిర్ణయించవచ్చును. ఆ తర్వాత కూడ వ్రాయబడిన పురాణాలు వున్నవి. ఉదా॥కు భాగవతపురాణం అర్వాచీన రచన అని చాలా మంది విమర్శకుల అభిప్రాయం. అర్వాచీన కాలంలో చాలా సంఖ్యలో స్థానిక దేవతల, క్షేత్ర, వ్రత మాహాత్మ్యలను తెలిపే ఉపపురాణాలు వ్రాయబడినవి.

వేదాలల్లో సంక్షేపంగా చెప్పబడిన విషయాలే పురాణాలల్లో విశదీకరింపబడి వ్యాఖ్యానింపబడి ప్రస్తుతీకరింపబడినవి. అయినా వివిధ జాతుల సమ్మేళనం వల్ల హిందూమతంలో వచ్చిన మార్పులను అంటె వైదికానంతర మతధర్మాలను పురాణాలు ప్రస్తుతీకరిస్తున్నవి. వైదిక దేవతలను, వైదిక యజ్ఞయాగాదులను పురాణాలు ప్రశంసించటం లేదు. వీటిల్లో ప్రశంసింపబడిన దేవతలు వైదిక యుగానంతరం ప్రచారంలోకి వచ్చినవారు. అంటె పూర్తిగా యజ్ఞయాగాది సంస్థ నశించిన తర్వాత పురాణాలు ఆవిర్భవించినవని చెప్పటం కాదు. ఒకవైపు యజ్ఞయాగాది కర్మలు వ్యాప్తిలో వున్నప్పుడే ఆ మతానికి సమానాంతరంగా విష్ణు, శివ, శక్త్యారాధనలు బయలు దేరినవి. ఒకవైపు వేదాలల్లోని జ్ఞానాన్ని పురాణాలు విశదీకరించి, వ్యాఖ్యానించి బోధిస్తున్నా ఇంకొకవైపు అవి కొత్త దేవతల ఆరాధనా విశేషాలను బోధిస్తున్నవి. గుప్తుల కాలంలో ఇంకా ఆ తర్వాత ప్రచలితమైన వైదిక దేవతారాధనకు భిన్నమైన హిందూ సంప్రదాయానికి పురాణాలు ప్రతినిధిత్వాన్ని వహిస్తున్నవి. బ్రాహ్మణ భక్తి, దానాలు, దక్షిణలు, క్షేత్రాలు, క్షేత్రమాహాత్మ్యాలు, వ్రత, పూజావిధానాలు, దేవతామాహాత్మ్యాలు, శివ విష్ణు శక్త్యారాధనలతో కూడిన హిందూమత విశేషం పురాణాలల్లో కన్పిస్తున్నది కాబట్టి వైదికానంతర మతధర్మాలను పౌరాణికమతం పేరుతో పిలుస్తున్నాం. పౌరాణిక మతవికాసంతోనే దేవతల విగ్రహాలు, దేవాలయాలు, దేవాలయనిర్మాణశిల్పం మొదలైనవి ఆరంభమై వికసించినవి. వైదికమతంలో ప్రకృతి శక్తులనే ఆరాధించి యజ్ఞక్రియల ద్వారా ఆ దేవతలకు హవిస్సులను అర్పించారే కాని ప్రకృతి శక్తులకు అధిష్ఠాతలైన అగ్ని వరుణాదులకు విగ్రహకల్పన చేయబడలేదు.

## పురాణాల సంఖ్య

మత్స్య శివపురాణాలను బట్టి మొదట ఒకే ఒక్క పురాణం వుండేదని, తర్వాత దాని నుంచి వివిధ పురాణాలు ఆవిర్భవించినవని తెలుస్తున్నది. ఇప్పుడు పురాణాలను రెండుగా విభజిస్తున్నారు. మహాపురాణాలు, ఉపపురాణాలు. ప్రసిద్ధమైన మహాపురాణాలు- మత్స్య, మార్కండేయ, భవిష్య, భాగవత, బ్రహ్మాండ, బ్రహ్మవైవర్త, బ్రాహ్మ, వరాహ, వామన, వాయు (దీనికే శివపురాణమని పేరు), విష్ణు, అగ్ని, నారద, పద్మ, లింగ, గరుడ, కూర్మ, స్కంద. మహాపురాణాలు ఏవి అన్న నిర్ణయంలో అభిప్రాయ భేదాలు కన్పిస్తున్నా మహాపురాణాలు 18 అని ప్రసిద్ధి. విష్ణుపురాణంలో అష్టాదశ పురాణాల సూచి, క్రమం ఇట్లా ఇయ్యబడింది. బ్రహ్మ, పద్మ, విష్ణు, శివ, భాగవత, నారద, మార్కండేయ, అగ్ని, భవిష్య, బ్రహ్మవైవర్త, లింగ, విష్ణు, వరాహ, స్కంద, వామన, కూర్మ, మత్స్య, వరుణ, బ్రహ్మాండ.

భాగవతం అన్నప్పుడు విష్ణు, కృష్ణుల భక్తి మాహాత్మ్య చరిత్రలను చెప్పే భాగవతమా లేక దేవీ మాహాత్మ్యాన్ని చెప్పే దేవీభాగవతమా అనే విషయంలో తర్జన భర్జనలు జరిగినవి. దేవీమాహాత్మ్యాన్ని చెప్పే దేవీభాగవతపురాణమే అష్టాదశపురాణాలల్లో చేరుతుంది కాని కృష్ణుని లీలలను వర్ణించే భాగవతం కాదని కాశీనాథ భట్టు మొదలైన పండితుల అభిప్రాయం. దేవీభాగవతమే ప్రామాణికమైందని, అదే "ఆర్షమ"ని నిర్ణయిస్తు కాశీనాథభట్టు "దుర్జనముఖ చపేటిక" అనే గ్రంథాన్ని రచించాడు. భాగవతాన్ని వోపదేవుడనే వైయాకరణుడు వ్రాసాడని ఒక వాదం వున్నది. భట్టోజి దీక్షితుని శిష్యుడు రామాశ్రమ పండితుడు భాగవతం వోపదేవకృతం కాదని అది ఆర్షమని, అదే మహాపురాణాలల్లో చేరుతుంది కాని దేవీభాగవతం కాదని "దుర్జనముఖ చపేటిక" గ్రంథాన్ని ఖండిస్తూ ఒక గ్రంథాన్ని రాసాడు. మరొక పండితుడు ఈ ఖండన గ్రంథాన్ని ఖండిస్తు దేవీభాగవతమే మహాపురాణాలల్లో పరిగణింవదగిందని "దుర్జన ముఖ పద్మపాదుక' అనే గ్రంథాన్ని వ్రాసాడు. రామానుజాచార్యులు విష్ణుపురాణాన్నే కాని భాగవతాన్ని ఆధికారికం (authority) గా తీసుకోకపోవటంచేత అప్పటికది బాగా ప్రచారంలోకి రాలేదని, కాబట్టి తద్రచనాకాలం క్రీ.శ. 10-12 శతాబ్దాల నడుమ కావచ్చునని నిర్ణయించవచ్చునని పండితవిమర్శకుల అభిప్రాయం. మిగతా పురాణాల కన్న భాగవతంలో వైశిష్ట్యత, సాహిత్యపు విలువలు కన్పిస్తున్నవనటంలో సందేహం లేదు. దాని రచనాపద్ధతి కూడా మిగతా పురాణాల కన్న కొంత భిన్నంగా వున్నదనటం స్పష్టం. పద్దెనిమిది మహాపురాణాలల్లో 7 ఐతిహాసిక వృత్తాంతాలను కూడా చెప్తున్నవి. మిగిలినవి కేవలం ధార్మిక విషయాలను ప్రతిబింబింపజేసేవి. కొన్నిటిలో కేవలం వ్రతాలు, క్షేత్రమాహాత్మ్యాలు, తత్సంబంధి కథలు మాత్రమే వున్నవి. అష్టాదశ పురాణాలను మూడు విధాలుగా విభజించటం కన్పిస్తున్నది - విష్ణువు ఆధిక్యతను చెప్పే పురాణాలు. వీటిని సాత్త్విక పురాణాలని అంటారు. అవి - విష్ణు, నారద, భాగవత, గరుడ, పద్మ, వరాహ పురాణాలు. శివుని ఆధిక్యతను చెప్పేవి. వీటిని తామసపురాణాలని అంటారు. అవి - మత్స్య, కూర్మ, లింగ, శివ, స్కంద, అగ్ని పురాణాలు. బ్రహ్మ ఆధిక్యతను చెప్పేవి. వీటిని రజోపురాణాలని అంటారు. అవి- బ్రహ్మాండ, బ్రహ్మవైవర్త, మార్కండేయ, భవిష్య, వామన, బ్రహ్మ పురాణాలు.

గరుడ పురాణంలో ఉపపురాణాల పేర్లు ఈ విధంగా ఇయ్యబడినవి. సనత్కుమార, స్కాంధ, శివధర్మ, ఆశ్చర్య, నారదీయ, కాపిల, వామన, ఔశనస, బ్రహ్మాండ, వారుణ, కాళిక, మాహేశ్వర, సాంబ, సౌర, పారాశర, మారీచ, భార్గవ పురాణాలు. దేవీభాగవతంలో ఇయ్యబడిన ఉపపురాణాల పేర్లు భిన్నంగా వున్నవి. అవి - స్కాంద, వామన, బ్రహ్మాండ, మారీచ, భార్గవ పురాణాల స్థానంలో శివ, మానవ, ఆదిత్య, భాగవత, వాశిష్ఠ పురాణాలు.

ఇంకా వివిధ పురాణాల్లో ఇయ్యబడిన పేర్లను బట్టి ఉపపురాణాల సంఖ్య 30 వరకు పోతున్నది - సనత్కుమార, నరసింహ, నారదీయ, శివధర్మ, దుర్వాస, కపిల, మానవ, ఉషనస, వారుణ, కాళికా, సాంబ, నందికేశ్వర, సౌర, పారాశర, ఆదిత్య, బ్రహ్మాండ, మాహేశ్వర, భాగవత, వాశిష్ఠ, కౌర్మ, భార్గవ, ఆది, ముద్గల, కల్కి, దేవి, మహాభాగవత, బృహద్ధర్మ, పరానంద, పశుపతి, హరివంశ పురాణాలు. వీటిల్లో హరివంశపురాణం మహాభారతానికి ఖిలపర్వంగా అంగీకరింపబడుతున్నది. ఉపపురాణాలల్లో ఎక్కువ క్షేత్ర, దేవతల మాహాత్మ్యాలు, వ్రతపూజావిధానాలు, దేవతాస్తోత్రాలు వున్నవి.

## పురాణాల రచనాకాలం

పురాణాల ప్రాచీనతనుగూర్చి చర్చించేటప్పుడు కొంతవరకు పురాణాల రచనాకాలాన్ని గూర్చి చర్చించివున్నాం. కాని ఇక్కడ కొన్ని చారిత్రకాధారాలతో పురాణాల రచనాకాలాన్ని నిర్ణయించడానికి పూనుకొనటం జరుగుతున్నది. పురాణాల రచనాకాలాన్ని నిర్ణయించటానికి కొన్ని విషయాలు మనకు తోడ్పడుతున్నవి - 1) కుమారిలభట్టు, శంకరాచార్యులు (క్రీ.శ. 8, 9 శతాబ్దాలవారు) పురాణాలను గూర్చి చర్చించారు. బాణుడు (క్రీ.శ. 7వ శ॥) కాదంబరి, హర్షచరిత్రల్లో పౌరాణికులను గూర్చి ప్రసంగించాడు మరియు వాయుపురాణ పఠనాన్ని గూర్చి పేర్కొన్నాడు. దీన్నిబట్టి ఆ కాలంనాటికి పురాణాలున్నవని, వాటిని జనులకొరకు చదివే పౌరాణికులుండేవారని, ప్రజలు పురాణాలను జ్ఞానం కొరకేకాక శ్రద్ధాభక్తులతో తమ అభీష్టసిద్ధికై చదివేవారు, వినేవారని తెలుస్తున్నది. కాదంబరిలోని చంద్రాపీడుని తల్లి సంతానప్రాప్తి కొరకు పురాణ శ్రవణానికి పోయేదని బాణుడు చెప్పాడు.

2. విష్ణు పురాణంలో మౌర్య రాజుల, మత్స్య పురాణంలో ఆంధ్రరాజుల, వాయుపురాణంలో గుప్తరాజుల ప్రశంస వున్నది. ఒక్కొక్క రాజు ఎన్ని సంవత్సరాలు పరిపాలించాడనే విషయాన్ని కూడా ఈ పురాణాలు పేర్కొంటున్నవి. దీన్ని బట్టి ఈ పురాణాలు ఆయా రాజవంశాల కాలంలో వ్రాయబడినవని చెప్పవచ్చును.

3. పురాణాలల్లో మహాభారతంలోని ఆఖ్యానాలు వున్నవి వున్నట్లుగా చెప్పబడినవి. దీన్ని బట్టి పురాణాలు మహాభారతం తరువాతి రచనలని మాక్ డొనెల్ నిర్ణయించాడు.

4. కౌటిల్యుని అర్థ శాస్త్రంలో పురాణాల ప్రసక్తి కన్పిస్తున్నది. రాజకుమారులకు పురాణాల జ్ఞానం అవసరమని అతడు చెప్పాడు.

5. సూత్ర గ్రంథాలల్లో పురాణ సంహితల ప్రసక్తి వున్నది. వాటి నుంచి ఉద్ధరణలు కూడ ఇయ్యబడినవి. ఆపస్తంబ ధర్మసూత్రంలో పురాణాల నుంచి ఉద్ధరణలు వున్నవి.

గౌతమ ధర్మసూత్రంలో రాజులు న్యాయనిర్ణయంలో పురాణాలను కూడా అధికార గ్రంథాలుగా గ్రహించాలని చెప్పబడింది.

6. ఉపనిషత్తుల్లో ఇతిహాస పురాణ ప్రసక్తి వున్నది. అవి పంచమవేదంగా కూడ అంగీకరింపబడినవి.

7. అథర్వ సంహితలో చతుర్వేదాల తర్వాత పురాణాల ఉత్పత్తి జరిగిందని చెప్పబడింది.

ఈ విధంగా పురాణ రచనా సంప్రదాయం వైదిక సాహిత్య యుగం వరకు పోతున్నది. అయితే పురాణాలల్లో గుప్త వంశ ప్రశస్తి, హర్షవర్ధనుని ప్రసక్తి వుండటం చేత క్రీ.శ. 7వ శతాబ్దం నాటివరకు ప్రముఖమైన పురాణాల కూర్పు జరుగుతూనే వున్నదని చెప్పవచ్చును. క్రీ.శ. 7వ శతాబ్దం తర్వాత కూడ పురాణాలు రచింపబడక పోలేదు.

ఋషి వంశాలకు సంబంధించిన బిరుదావళి వేదాల్లో వుండగా రాజవంశాల బిరుదావళి పురాణాలల్లో వున్నదని పార్జిటర్ అభిప్రాయం. " ఏనిషంట్ ఇండియన్ హిస్టారికల్ ట్రాడిషన్స్'' అన్న గ్రంథంలో పార్జిటర్ భారతీయచరిత్ర రచనలో పురాణాలకు మహత్త్వ పూర్ణమైన స్థానాన్నిచ్చాడు. పురాణాల రచనా సంప్రదాయం విలక్షణమైంది. ఈజిప్టు, సుమేరియన్ వ్రాతలు గాని గ్రీకు, రోమనుల వ్రాతలు గాని వారి వారి సంప్రదాయానుసారం చరిత్రను చెప్తున్నవి. వాటికి భిన్నమైన ఒక విలక్షణమైన పద్ధతిలో పురాణాలు వ్రాయబడినవి. ప్రత్యేకమైన భారతీయుల పురాణాల సంప్రదాయాన్ని అర్థం చేసుకోలేనివారు వాటిల్లో చరిత్ర లేదని, అవన్ని ఒట్టి కల్పనలని అంటున్నారు. పురాణాల సంప్రదాయ పద్ధతిని అవగాహన చేసుకొని భారతీయ చారిత్రక సత్యాలను నిర్ణయించవలసిన అవసరం ఇంకా ఎంతో వున్నది. పురాణాలల్లో పేర్కొనబడిన జాతులు, వంశాలు, వంశచరిత్రలు, రాజులు, రాజవంశచరిత్రలు, రాజ్యాలు, జనపదాలు ఎన్నో పరిశీలింపవలసిన అవసరం వున్నది. పురాతత్త్వ ఆధారాలు లేవని, పురాణాలల్లో చెప్పబడిన చారిత్రక విషయాలెన్నో అబద్ధాలని, కల్పితాలని, అతిశయోక్తులని తోసిపుచ్చబడినవి. కాని పురాతత్త్వ వస్తుప్రాప్తితో వాటిల్లో కొన్ని విషయాలు చారిత్రక సత్యాలని పునఃపరిశీలింప బడిన ఘట్టాలు కూడ వున్నవి. అట్లాంటప్పుడు పురాణాలల్లోని చారిత్రక విషయాలు సత్యాలు కావని పూర్తిగా నిరాకరించటం సమంజసం కాదు. ఏదో ఒకనాడు పురాతత్త్వ వస్తువుల సహాయంతో పురాణాలల్లో చెప్పబడిన విషయాలు సంపూర్ణసత్యాలుగా బయటపడగలవని ఆశించవచ్చును. పురాణాలల్లో ఒక్కొకసారి విషయాలు విభిన్నంగా, పరస్పర విరుద్ధంగా చెప్పబడక పోలేదు. అంటె కొన్ని విషయాలల్లో అభిప్రాయభేదం వున్నది. మరియు రాజుల, రాజ్యాల చరిత్రలు

ఒక్కొకసారి కల్పితేతివృత్తాలవలె అద్భుతంగా చెప్పబడినవి. ఇంకా కొన్ని సార్లు చెప్పే విషయంలో అస్పష్టత, గందరగోళం లేక పోలేదు.

వి.ఏ. స్మిత్ అనుసారం విష్ణుపురాణం మౌర్యవంశ క్రమాన్ని (క్రీ.పూ. 374-190). మత్స్య పురాణం ఆంధ్రవంశ క్రమాన్ని (క్రీ.పూ. 212-క్రీ.శ. 338), వాయుపురాణం గుప్తవంశ క్రమాన్ని (క్రీ.శ. 275-510) చాల చక్కగా సత్యంగా వివరిస్తున్నవి. ప్రసిద్ధమైన ఈ వంశాల, రాజుల చరిత్రలే కాక శూద్ర మ్లేచ్ఛరాజుల అంటే ఆభీర, గర్దభ, శక, యవన, తుషార, హూణవంశ రాజులను గూర్చి కూడ పురాణాలు చెప్తున్నవి. హిందూ మతాన్ని అంటే వైదిక, పౌరాణిక మతాన్ని అంగీకరించి అనుష్ఠించి, వ్యాపింపజేసిన రాజుల చరిత్రలను పురాణాలు చెప్తున్నవి. హిందూమతం కాక జైన, బౌద్ధామతాలను అనుష్ఠించి వ్యాపింపజేసిన రాజులను ఒకొకసారి పేర్కొన్నా వారి చరిత్రలకు పురాణాలు ప్రాధాన్యాన్ని ఇయ్యలేదు. ఒకొకసారి వైదికేతరమతాలను అనుసరించిన రాజులను దుర్మార్గులుగా, రాక్షసాంశ సంభూతులుగా కూడ పురాణకారులు చిత్రించారు. ఒకొకసారి భారతీయ చరిత్రలో అంతగా ప్రాముఖ్యం వహించని రాజుల, రాజవంశాల చరిత్రలను గొప్పగాచేసి వర్ణించారు. ఆ రాజులు వైదిక మతానుయాయులు కావటమే దానికి ప్రధాన కారణమని చెప్పవచ్చును.

పార్జిటర్ పురాణ గ్రంథాలను బాగా అధ్యయనం చేసినవాడు. ప్రధానమైన పురాణాలన్ని క్రీస్తు శకారంభం నాటికే వ్రాయబడినవని అతడు అభిప్రాయపడినాడు. క్రీ.శ. 2వ శతాబ్దం నాటికి పురాణాల రచన సమాప్తమైందని బాల గంగాధర తిలక్ అభిప్రాయం. అట్లా పూర్తి అయినట్లయితే హర్షవర్ధనుని నాటి వరకు గల రాజవంశాల చరిత్రలు వాటిల్లో వుండటం అసంభవమౌతుంది. పురాణాలల్లో అగ్ని పురాణం అన్నిటికంటే ప్రాచీనమైందని చాలామంది పండితుల అభిప్రాయం. విమర్శకులు దాని రచనాకాలం విషయంలో భిన్నాభిప్రాయాలు కలిగి వున్నారు. కాణే అగ్ని పురాణం క్రీ.శ. 700 నాటి రచన అని, దానిలోని కావ్యశాస్త్ర సంబంధి విషయాలు క్రీ.శ. 900 తర్వాత చేర్చబడినవని అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు. అగ్ని పురాణంలోని కావ్యశాస్త్ర సంబంధి విషయాలు దండి తర్వాత, ఆనందవర్ధనునికి పూర్వం క్రీ.శ. 9వ శ॥ ప్రాంతంలో వ్రాయబడినవని సుశీలకుమార్ డే అభిప్రాయం. కన్హయ్యాలాల్ పోద్దార్ అగ్ని పురాణంలోని కావ్యశాస్త్ర విషయాలు విలక్షణంగా వున్నవని, ఆ భాగం నాట్యశాస్త్రం తర్వాత భామహ దండ్యాదులకు పూర్వమే వ్రాయబడినవని అన్నాడు. హజారా పురాణాలను గూర్చి చాల కృషి చేసినవాడు. అతడు మార్కండేయ, బ్రహ్మాండ, విష్ణు, మత్స్య, భాగవత, కూర్మ పురాణాలు ప్రాచీనమైన మహాపురాణాలని గంభీర పరిశోధన పూర్వకంగా స్థాపించాడు. విష్ణుపురాణం క్రీ.శ. 400, వాయు పురాణం క్రీ.శ. 500, భాగవత పురాణం క్రీ.శ. 600-700, కూర్మ పురాణం క్రీ.శ.

700 ప్రాంతంలో వ్రాయబడినవని అతడు చెప్పాడు. అగ్ని పురాణం క్రీ.శ. 800 ప్రాంతం రచన అని, కాని దానిలోని కొన్ని భాగాలు ప్రాచీనమైనవని అతడు అంగీకరించాడు. నారదీయ, బ్రహ్మ పురాణాలు క్రీ.శ. 10వ శ॥ రచనలు అని మూల నారదీయ పురాణం ఇప్పుడు అలభ్యమైనా అది క్రీ.శ. 10 వ శ॥ నాటి కూర్పు అని అతని అభిప్రాయం. స్కంద పురాణం క్రీ.శ. 8వ శ॥ నాటి రచన అని దానిలోని కొన్ని భాగాలు అర్వాచీనాలైనవని హజారా అభిప్రాయం. గరుడ పురాణం క్రీ.శ. 10వ శ॥లో పద్మ పురాణం క్రీ.శ. 1200-1500 నడుమ వ్రాయబడినవని అతని అభిప్రాయం. బ్రహ్మ వైవర్త పురాణం క్రీ.పూ. 700 నాటి రచన అయినా ప్రస్తుత రూపం క్రీ.శ. 16వ శ॥లో ఏర్పడిందని హజారా అభిప్రాయం. ఈ పురాణం మీద జయదేవుని గీతగోవిందం ప్రభావం కన్పిస్తున్నదనీ, దీనిలో క్రీ.శ. 16 శతాబ్దం నాటి సాంఘిక జీవనం ప్రతిబింబించి కన్పిస్తున్నదని పండితుల అభిప్రాయం. విష్ణు ధర్మోత్తర పురాణం రచన క్రీ.శ. 7వ శ॥లో జరిగిందని, ఇది కాశ్మీర దేశంలో వ్రాయబడిందని బ్యూలర్ అభిప్రాయం. నృసింహపురాణం క్రీ.శ. 400-500 నడుమ, సౌరపురాణం క్రీ.శ. 950-1050 నడుమ వ్రాయబడినవని విద్వాంసుల అభిప్రాయం.

ఇదంతా పరిశీలించినట్లయితే మూలపురాణవిద్య వేదకాలంలోనే ఆరంభమైందని, కాని ఆ విద్య మౌఖికరూపంలోనే వుండేదని లిఖితరూపంలో అవి క్రీ.శ. 400 ప్రాంతం నుంచి రూపొందుతూ వచ్చి క్రీ.శ. 16వ శ॥ వరకు కొనసాగినవని చెప్పవచ్చును. మొదట ఒకటి రెండు గ్రంథాల రూపంలో వున్న పురాణాలు భిన్న భిన్న కాలాల్లో భిన్న భిన్నమైన పేర్లతో వ్రాయబడుతూ విస్తరించినవి. మౌఖికంగా వున్న ఒక పురాణం అనేక ప్రక్షిప్తాలతో విస్తరింపబడి మరొక పేరుతో మరొక పురాణంగా వికసించేది. వ్రాతసామగ్రి అభివృద్ధి చెందింతర్వాత పురాణాలు వ్రాత రూపాన్ని సంపాదించుకొన్నవి. అయినా అప్పుడు కూడ స్థిరరూపాన్ని ధరించలేదు. కాలక్రమంగా ప్రక్షిప్తాలతో ప్రాచీన పురాణాలు పెరగటమే కాక కొత్త కొత్త పురాణాలుగా కూడ క్రీ.శ. 11వ శతాబ్దం వరకు రూపొందుతూనే వున్నవి. ఆ తర్వాత వాటి రచనల ఉద్ధృతత్వం తగ్గినా ఆగిపోలేదు. క్రీ.శ. 16వ శతాబ్దం వరకు వాటిల్లో ప్రక్షిప్తాలు, చేరుతూనే వున్నవని చెప్పవచ్చును.

## పురాణ లక్షణాలు

పురాణం పంచలక్షణమని ప్రసిద్ధం. మహా పురాణాలల్లో చెప్పబడిన ఐదు విషయాలు ఇవి - సర్గ (సృష్టిజ్ఞానం), ప్రతిసర్గ (పునఃసృష్టి), వంశ (ఋషుల వంశావళి), మన్వంతర (విభిన్న మనువుల కాలగణన), వంశానుచరిత్ర (సూర్యచంద్ర వంశజుల చరిత్ర)-

సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ
వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణమ్.

పై ఐదు విషయాలేకాక పురాణాలల్లో శివ, విష్ణు పారమ్యాలను చెప్పే అనేక కథలు, ఆ దేవతల మహిమలు తర్వాత వర్ణాశ్రమధర్మం, శ్రాద్ధాదికర్మలు, వ్రతనియమ మాహాత్మ్యాలు, సాంఖ్యయోగాదిదర్శన సిద్ధాంతాలు వివరింపబడినవి. మొదట పురాణం అంటే పైన పేర్కొన్న సృష్టిప్రతిసృష్టుల విధం, ఋషుల, రాజుల వంశ చరిత్రలు, మన్వంతర వృత్తాంతాలు మాత్రమే వుండేవి కాని తర్వాత తర్వాత ఆయా దేవతా మాహాత్మ్యాదులు చేర్చబడి విస్తరించినవి కావచ్చును. ప్రాచీనకాలంలో పురాణవిద్య అంటే పై ఐదు విషయాల వివరణయే కావచ్చును. కాని క్రమంగా పురాణాల స్వరూపం మారిపోయి దేవతామహిమ, క్షేత్రవ్రత మాహాత్మ్య ప్రతిపాదకాలు అయినవి. అందుకే మొదట ఒకటి రెండు సంఖ్యతో పరిమితమై పై ఐదు విషయాల వివరణతో కూడిన పురాణాలు రాను రాను ఆయా సాంప్రదాయికుల సిద్ధాంతాలను ప్రతిపాదించేవిగా మారి సంఖ్యలో పెరుగుతూ వచ్చినవి.

పురాణాన్ని ఇతిహాసంగా కూడ పేర్కొంటూ పురాణేతిహాసం లేక ఇతిహాస పురాణం అని అనటం కూడ వున్నది. అసలైతే ఇతిహాసం, పురాణం రెండు భిన్నమైన విషయాలు; అవి రెండు స్వతంత్ర ప్రక్రియలు. శంకర, సాయణాచార్యుల వంటి భాష్యకారులు ఇతిహాసం, పురాణం రెండింటిని భిన్నమైన ప్రక్రియలుగానే పేర్కొన్నారు. వేదాలల్లోని దేవాసుర సంగ్రామాదులు ఇతిహాసమని, సృష్టిక్రియాదులను చెప్పే అంశాలు పురాణమని వ్యాఖ్యాతలు చెప్పారు - "జగతః ప్రాగవస్థామనుక్రమ్య సర్గ ప్రతిపాదకం వాక్యజాతం పురాణమ్" (ఐతరేయ బ్రాహ్మణానుక్రమణిక). దీన్నిబట్టి కూడ సృష్టి ప్రతిసృష్టులను చెప్పేదే పురాణవిద్య అని క్రమంగా దీనిలో సూర్యచంద్ర వంశజుల చరిత్రతో కూడిన ఇతిహాస భాగాలు కూడ అధికంగా చేర్చబడటంచేత పురాణేతిహాసమన్న పేరు వచ్చిందని తెలుస్తున్నది. కాలక్రమంగా పురాణేతిహాసాలల్లో ధార్మికత్వం పెరిగిపోయి అవి ధార్మిక గ్రంథాలుగా రూపాన్ని ధరించినవి. సృష్టి క్రియాదులను చెప్పే రూపంలో పురాణవిద్య వైదికకాలంలో ఆరంభమైవుంటుంది. తర్వాత దీనిలో మన్వంతరాలు, ఋషుల రాజుల వంశ చరిత్రలు చేర్చబడి పురాణేతిహాసాలుగా పరిణమించినవి. తర్వాత దేవతామాహాత్మ్యాదులు చేర్చబడి ధార్మిక గ్రంథాలుగా రూపొందినవి.

## పురాణాల కర్త

విష్ణుపురాణంలో చెప్పబడిన కథనుబట్టి వేదవ్యాసుడు పురాణాన్ని నిర్మించి తన శిష్యుడు సూత లోమహర్షణునికి చెప్పాడు. లోమహర్షణుడు తిరిగి పురాణాన్ని తన

ముగ్గురు శిష్యులు అకృతవ్రణ, సావర్ణి, శాంశంపాయనులకు చెప్పాడు. లోమహర్షణుడు చెప్పిన మహాపురాణాన్ని ముగ్గురు శిష్యులు మూడు పురాణ సంహితలుగా వ్యాపింపజేసారు. తర్వాత తర్వాత శిష్య పరంపరలో ఆ మూడు- అష్టాదశ పురాణాలుగా, ఉప పురాణాలుగా విస్తరించినవి. ఈ పురాణ పరంపరలో బ్రహ్మపురాణం మొదటిదని చెప్పబడింది. మరొక కథను అనుసరించి కల్పాంత సమయంలో ఒక్కటే పురాణం వుండేది. దాన్ని బ్రహ్మ ఋషులకు చెప్పాడు. అట్లా బ్రహ్మ బోధించిన పురాణం బృహద్రూపంలో వుండటంచేత మనష్యుల అవగాహనకు దూరమౌతుందని ఆలోచించి వేదవ్యాసుడు 4 లక్షల పరిమితమైన ఆ బృహత్ పురాణాన్ని 18 భాగాలుగా విభాగించాడు. ఆ భాగాలే అష్టాదశ పురాణాలుగా ప్రసిద్ధమైనవి. ఒక్క మూలపురాణ సంహితయే వేదవ్యాసునిచేత 18 భాగాలుగా విభాజితమై అష్టాదశపురాణాలుగా ప్రచలితమైనవన్న వృత్తాంతం దేవీ భాగవతం, భాగవతం, వరాహ, పద్మ పురాణాలల్లో చెప్పబడివున్నది. దీన్నిబట్టి వేదం వలెనే పురాణ విద్య బ్రహ్మ చేత ఇయ్యబడిందని, క్రమ క్రమంగా పురాణ విద్య విస్తరించిందని, వేదవ్యాసుడు విస్తరించిన పురాణాన్ని, వేదాలవలెనే సంపాదీకరించి 18 భాగాలుగా విభాజించాడని చెప్పవచ్చును. పై కథలను బట్టి పురాణాలు కాలక్రమంగా మారుతూ వచ్చినవని ఎన్నో నూతన విషయాలు వాటిల్లో చేరుతూ పోయినవని తెలుస్తున్నది. వేదాలు ఒక అక్షరం మారకుండా ప్రాచీన ఋషులు ప్రకృష్టంగా దాన్ని నిర్మించారు. పదక్రమాది పాఠాది కవచాలను ఏర్పరిచి వేదంలో మార్పు రాకుండా జాగ్రత్తలు తీసుకొన్నారు. కాని పురాణవిద్య లౌకిక విద్య. అందుకే అది కాలానుగుణంగా కొత్త విషయాలను చేర్చుకుంటూ పోయి పెరుగుతూ వచ్చింది. అష్టాదశ పురాణాలను సూక్ష్మంగా పరిశీలించినట్లయితే వాటి వర్ణ్య విషయంలో, నిర్మాణ శైలిలో సామ్యాలు కన్పిస్తవి. అవన్నీ ఒక్క మూల పురాణ సంహిత నుంచి విస్తరించినవే కాబట్టి సామ్యాలు కన్పిస్తున్నవి. ప్రస్తుతం పురాణాలల్లో విభిన్నత కన్పిస్తున్నదంటె వాటిని విస్తరింపజేసిన అజ్ఞాత వ్యక్తులు భిన్న భిన్న సంప్రదాయాలకు చెందినవారు కావటమే కారణం. విష్ణుపురాణం, శివపురాణం, బ్రహ్మపురాణం, దేవీ భాగవతం మొదలైనవి ఆయా సంప్రదాయాల ననుసరించే నామకరణం చేయబడినవి.

## జైన పురాణాలు

హిందువుల వలెనే జైనులు, బౌద్ధులు కూడ తమతమ ధార్మిక, దార్శనిక సిద్ధాంతాలను ప్రతిబింబింప జేసే పురాణాలను నిర్మించుకొన్నారు. అష్టాదశ పురాణాల లాగానే జైనుల్లో చతుర్వింశతి పురాణాలున్నవి. ఈ చతుర్వింశతి పురాణాలల్లో వారి చతుర్వింశతి (24) తీర్థంకరుల చరిత్రలు నిబద్ధమైనవి. హిందూపురాణాలవలె జైనపురాణాలు పంచలక్షణ

సమన్వితాలు కావు. " పురాతనం పురాణం స్యాత్తన్మహ దా(శ్రయాత్" అంటె పురాణం మహాపురుషుల ప్రాచీన కథలను చెప్పేది అని అర్థం. జైనుల 24 పురాణాల పేర్లు - అది పురాణం, అజిత నాథ పురాణం, సంభవనాథ పురాణం, అభినందపురాణం, సుమతినాథ పురాణం, పద్మ ప్రభపురాణం, సుపార్శ్వపురాణం, చంద్రప్రభపురాణం, పుణ్యాదంతపురాణం, శీతలనాథ పురాణం, శ్రేయాంశపురాణం, వాసుపూజ్యపురాణం, విమలనాథ పురాణం, అనంతజిత పురాణం, ధర్మనాథ పురాణం, శాంతినాథ పురాణం, కుంథునాథ పురాణం, అరనాథ పురాణం, మల్లినాథ పురాణం, మునిసువ్రత పురాణం, నేమినాథ పురాణం, నేమినాథ పురాణం, పార్శ్వనాథ పురాణం, సమ్మతి పురాణం. ఈ 24 పురాణాలల్లో ఆదిపురాణం, పద్మప్రభ పురాణం, అరిష్టనేమి పురాణం (దీనికే హరివంశపురాణమని పేరు), ఉత్తరపురాణం సుప్రసిద్ధమైనవి. వీటిల్లో ఆది, ఉత్తరపురాణాలు జైనులకు విశేషమహత్త్వ పూర్ణమైనవి.

ఆది పురాణంలో జైనులకు ప్రథమతీర్థంకరుడైన ఋషభదేవుని చరిత్ర వున్నది. అతని జీవిత విశేషాలకు సంబంధించిన కథలెన్నో దీనిలో నిబద్ధింపబడినవి. ఋషభదేవుడు ఇక్ష్వాకువంశరాజు. నాభిరాజుకు మరుదేవి రాణికి జన్మించినవాడు. ఋషభదేవుడు 84 లక్షల సంవత్సరాలు జీవించి మోక్షప్రాప్తిని చెందాడట. భాగవతంలో కూడ ఇతని మహిమగాథ చెప్పబడింది. భాగవతంలో భగవంతుని 22 అవతరాలు గణింపబడినవి. అప్పుడు 22 అవతారాలల్లో ఋషభ దేవుడు ఎనిమిదవ అవతారంగా చెప్పబడినాడు. ఋషభదేవుని భార్య ఇంద్రుని కూతురు జయంతి అని చెప్పబడింది. ఆమెవల్ల అతనికి భరత, కృశాశ్వ మొదలైన నూరుగురు కుమారులు ధర్మాత్ములు, వేదజ్ఞులు, భాగవత ధర్మానుయాయులైన వారు జన్మించారు. ఋషభదేవుడు కూడ భగవద్గుణ సంపన్నుడుగా చెప్పబడినాడు. ఆదిపురాణంలో 47 పర్వాలున్నవి. దీని రచయిత జినసేనుడు. పురాణారంభంలో కవి నయకేశరి, సిద్ధసేన. వాదిచూడామణి, సమంతభద్ర, శ్రీదత్త, యశోభద్ర, చంద్రోదయకర, ప్రభాచంద్ర, మునీశ్వర, శివకోటి, జటాచార్య, కథాలంకార కార, కాణభిక్షు, కవితీర్థ, భట్టారక, వీరసేన, జయసేన మొదలైన గురుజనులను స్మరించాడు. దీనివల్ల ఆదిపురాణ రచనా కాలాన్ని నిర్ణయించవచ్చును. ఈ పురాణంలో శంకరుని అద్వైత ఖండన కన్పిస్తున్నదని కాబట్టి ఇది అతని తర్వాతి రచన అని పండితుల అభిప్రాయం. క్రీ.శ.942 లో కన్నడ కవిపండితుడు కన్నడ భాషలో ఒక ఆదిపురాణాన్ని రచించాడు. అది పూర్తిగా జినసేనుని పురాణానికి అనువాదం కాకపోయినా దాన్ని అనుసరించినటువంటిది. కాబట్టి క్రీ.శ. 942 కి పూర్వమే ఆదిపురాణ రచన జరిగిందని చెప్పవచ్చును.

ఆదిపురాణం యొక్క ఉత్తర భాగమే ఉత్తర పురాణం. జినసేనుడు ఆదిపురాణంలో 44 పర్వాలు వ్రాసిం తర్వాత పరమపదించాడు. ఆ తర్వాత మూడు పర్వాలను మరియు చివరి భాగమైన జినచరిత్రను అతని శిష్యుడు గుణభద్రుడు వ్రాశాడు. దానికే ఉత్తర పురాణమని పేరు. ఇది జైనుల 24 పురాణాలకు సారరూపమైంది. అంటే దీనిలో అన్ని పురాణాల సారం కన్పిస్తున్నది. దీనిలో రెండవ తీర్థంకరుడు అజితనాథుని మొదలుకొని మహావీరుని వరకు గల తీర్థంకరులను గూర్చిన కథలు వున్నవి.

జైన బౌద్ధ పురాణాల్లో ఎక్కువ అతిశయోక్తులు లేవని చెప్పవచ్చును. ముఖ్యంగా చారిత్రక సంఘటనలను చెప్పేటప్పుడు వారు సత్యానికి సమీపంగా వున్నారు. తేదీలు సంవత్సరాలు చెప్పేటప్పుడు కూడ వారు చెప్పినవి విశ్వసనీయంగా వున్నవి. అందుకే రాధాకుముద ముఖర్జీ వంటి భారతీయ చరిత్రకారులు ప్రాచీన భారతదేశ చరిత్ర నిర్మాణంలో బౌద్ధ జైన రచనలను విశ్వాసపాత్రమైన ఆధారాలుగా తీసుకొన్నారు.

# స్మృతులు

"శ్రుతి" అని ఆ తర్వాత 'స్మృతి' అని పేర్కొనటం మనం చూస్తుంటాము. 'శ్రుతి' అంటె -వేద బ్రాహ్మణ ఆరణ్యక ఉపనిషత్ సాహిత్యమంతా దానిలో చేరుతుంది. స్మృతి అంటె - షట్వేదాంగాలు, ధర్మశాస్త్రాలు, ఇతిహాస పురాణాలు, అర్థశాస్త్రం, నీతిశాస్త్రం మొదలైనవి దానిలో చేరుతవి. 'శ్రుతిస్మృతు' లన్నప్పుడు ఈ గ్రంథసాహిత్యమంతా చేరుతుందన్నమాట. కాని స్మృతి శబ్దానికి పై వ్యాపకార్థమే కాక కేవలం ధర్మశాస్త్రాలన్న అర్థం కూడ వున్నది. రాజు, ప్రజలు వారి అధికారాలు, కర్తవ్యాలను మరియు సామాజిక వ్యవస్థ, వర్ణాశ్రమ ధర్మాలను, నీతిని, సదాచారాన్ని, రాజనీతి వ్యవహారాలను బోధించే గ్రంథాలు ధర్మశాస్త్రాలని అనుబడుతవి. ఆ ధర్మశాస్త్రాలనే ప్రత్యేకంగా స్మృతులనే పేరుతో పిలవటం వున్నది.

పురాణాల, ఉపపురాణాల సంఖ్యవలెనే స్మృతులసంఖ్య కూడ చాలవున్నది. కాని అష్టాదశ మహాపురాణాల వలెనే అష్టాదశస్మృతులు స్మృతుల్లో ప్రముఖమైనవి. ఈ స్మృతులు వాటి నిర్మాతల పేర్లమీదుగా నామకరణం చేయబడినవి. అష్టాదశస్మృతికర్తలు - మనువు, యాజ్ఞవల్క్యుడు, అత్రి, విష్ణువు, హారీతుడు, ఉశనస్సు, అంగిరుడు, యముడు, కాత్యాయనుడు, బృహస్పతి, పరాశరుడు, వ్యాసుడు, దక్షుడు, గౌతముడు, వశిష్టుడు, నారదుడు, భృగు, అంగిరసుడు. ఈ స్మృతికారులు వ్రాసిన ధర్మశాస్త్రాలు మూలరూపంలో లభిస్తున్నాయని చెప్పలేము. పై స్మృతికారుల ధర్మశాస్త్రాలల్లో మనువు రచించిన మానవధర్మ శాస్త్రం అతిప్రాచీనమైందని అంటారు. మానవజాతికి మనువు ఆదిమపురుషుడు అని సంహిత, బ్రాహ్మణ గ్రంథాలల్లో చెప్పబడింది. మానవధర్మశాస్త్రంలోని కొన్ని అంశాలు ప్రాచీన గ్రంథాలల్లో లభిస్తున్నవి. ఈ అంశాలు ఇప్పుడు లభ్యమయ్యే 'మనుస్మృతి' తో కలవటం లేదు. కాబట్టి మానవధర్మశాస్త్రం, మనుస్మృతులు ఒక్కటే గ్రంథం కావని, మానవధర్మ శాస్త్రం ఆధారంగా మనుస్మృతి వ్రాయబడిందని పండిత విమర్శకుల అభిప్రాయం. మిగతా స్మృతి గ్రంథాలన్ని మనుస్మృతినే ప్రామాణికంగా పేర్కొంటూ వున్నవి. అసలు మూల రూపంలో మానవధర్మశాస్త్రం ఒక్కటే స్మృతిగ్రంథం వుండేదని దాని ఆధారంగా, ఆదర్శంగా ఇతర స్మృతి గ్రంథాలు వ్రాయబడినవని పండితుల నిర్ణయాభిప్రాయం.

మహాభారతం శాంతిపర్వంలో బ్రహ్మప్రోక్తమైన దండనీతిశాస్త్రం యొక్క ప్రసక్తి వున్నది. ఆ నీతిశాస్త్రం ఒక లక్ష అధ్యాయాలు కలదని, దానిలో ధర్మార్థకామమోక్ష సంబంధమైన వివరణలు వున్నవని చెప్పబడింది. తర్వాత శివుడు ఆ నీతిశాస్త్రాన్ని పదివేల

అధ్యాయాలుగల "వైశాలక్ష" మనే సంక్షిప్త గ్రంథంగా రచించాడట. తిరిగి ఇంద్రుడు ఐదువేల అధ్యాయాలు గల సంక్షిప్త గ్రంథంగా రూపొందించి దాని పేరు "బాహుదంతకశాస్త్ర' 'మని పేరు పెట్టాడట. దీన్నే శుక్రాచార్యుడు ఒక వేయి అధ్యాయాలు గల "ఔశనసీనీతి' ' లేక "శుక్రనీతి" గ్రంథంగా నిర్మించాడట. తర్వాత కాలానుగుణంగా ఆ నీతిశాస్త్రం సంక్షిప్త రూపాన్ని ధరిస్తు ప్రచారంలోకి వచ్చిందట. - ఈ మహాభారత కథను బట్టి మూల ధర్మశాస్త్ర గ్రంథం ఒక్కటే అని అదే కాలక్రమంగా వివిధ రూపాలను ధరిస్తూ వచ్చిందని చెప్పవచ్చును. మను, వశిష్ఠ, విష్ణు మొదలైన ఋషులు వ్రాసిన స్మృతి గ్రంథాలన్ని బ్రహ్మప్రోక్తమైన దండనీతి శాస్త్రం మీద ఆధారపడినవే అని తెలుస్తున్నది. మారుతున్న ధర్మం, నీతి, సాంఘిక విలువలను ప్రతిబింబింపజేసే కొరకై దండనీతి శాస్త్రమే ఆయా యుగాలల్లో వేరువేరు గ్రంథాలుగా రూపొందివుంటుంది. మహాభారతంలోని దండనీతి శాస్త్రంలో అర్థశాస్త్రం, రాజనీతి, సామాజిక శాస్త్రం, శిల్పశాస్త్రం, రసాయన శాస్త్రం మొదలైన ఎన్నో విషయాలు చెప్పబడినవి. ఈ బృహద్రూపమైన సర్వ విషయ సమన్వితమైన శాస్త్రం లౌకిక విజ్ఞానాన్ని అంతటిని బోధిస్తున్నది.

అల్బెరూనీ అనే అరబీయాత్రికుడు స్మృతి గ్రంథాలను గూర్చి ప్రసంగించివున్నాడు. వేదాలనుంచి స్మృతి గ్రంథాలు ఉద్భవించినవని అతడు పేర్కొన్నాడు. అతడు పేర్కొన్న 20 మంది స్మృతికారుల పేర్లు ఇట్లావున్నవి. (వారిని అతడు బ్రహ్మపుత్రులని పేర్కొన్నాడు) - ఆపస్తంబుడు, పరాశరుడు, శతపథుడు, సామవర్తుడు, దక్షుడు, వసిష్ఠుడు, అంగిరసుడు, యముడు, విష్ణువు, మనువు, యాజ్ఞవల్క్యుడు, అత్రి, హారీతుడు, లిఖితుడు, శంఖుడు, గౌతముడు, బృహస్పతి, కాత్యాయనుడు, వ్యాసుడు, ఉషనసుడు. వీరిలో దేవల, శుక్ర, భార్గవ, బృహస్పతి, యాజ్ఞవల్క్య, మనువులను అల్బెరూని వ్యాసుని శిష్యులుగా పేర్కొన్నాడు. అల్బెరూని పేర్కొన్న స్మృతికారుల పేర్లు సరిగ్గాలేవని విమర్శకుల అభిప్రాయం. కాని అతని కాలంలో ఈ స్మృతికారుల గ్రంథాలు ప్రచారంలో వున్నట్లు మాత్రం తెలుస్తున్నది.

## స్మృతి గ్రంథాలల్లోని విషయం

ప్రాచీన భారతీయుల సామాజిక, ధార్మిక, రాజకీయసంబంధమైన జీవిత విధానాలను తెలుసుకోటానికి స్మృతి గ్రంథాలు చాల తోడ్పడుతున్నవి. స్మృతి గ్రంథాలు ప్రాచీన భారతీయుల ఆచారవ్యవహారాలను, నీతిధర్మ విషయాలను, రాజనీతిని నిర్ణయించేటటువంటి గ్రంథాలు. ఇవి పై విషయాలల్లో ప్రామాణికమైన గ్రంథాలు. రాజులు, నీతివేత్తలు, న్యాయవేత్తలు ఈ గ్రంథాలను ఆధారంగా విషయ నిర్ణయం చేసేవారు. ప్రాచీన భారతీయులు ధర్మబద్ధమైన జీవితాన్ని గడిపేవారు. ఆ ధర్మం ఇప్పుడు సంగతమైందా

కాదా అన్న విషయం వేరు. ప్రతియుగంలో ధర్మం, నీతిరూపాలు మారుతుంటవి. కాబట్టి తాము ధర్మబద్ధం, సదాచారమనుకొన్నదాన్ని ప్రాచీన భారతీయులు కఠినంగా అనుసరించేవారు. అటువంటి వారి కఠిన నియమాలతోకూడిన జీవితాన్ని నియంత్రించెసే నడిపేవి స్మృతి గ్రంథాలు. భారతదేశంలోకి ఎడతెగకుండా విదేశీయజాతుల వలసలు, దండయాత్రలు జరుగుతూనే వున్నవి. విభిన్నమైన జాతుల సమ్మేళనం, సమన్వయాలకు ధర్మశాస్త్ర గ్రంథాలు నియమాలను ఏర్పరుస్తూ పోయినవి. అందుకే ఆయా యుగాల్లో ఆయా ధర్మశాస్త్ర గ్రంథాలు వ్రాయవలసిన అవసరం కూడ ఏర్పడింది.

స్మృతుల రచన సూత్రగ్రంథాల తర్వాత జరిగింది. అంతకు ముందు భారతీయుల ఆచార వ్యవహారాలను, నీతిధర్మాలను నియమించే గ్రంథాలు వేద, బ్రాహ్మణ, ఆరణ్యకాలు. పౌరాణిక యుగంలో ధార్మిక వ్యవహారాలు విస్తరించినవి. జాతులు, జాతుల సమ్మేళనం విస్తరించింది. దానితో నీతిధర్మ విషయాలు పెరుగుతూ వచ్చినవి. వాటినన్నిటిని బోధించే కొరకు ప్రత్యేక గ్రంథాలు అవసరమైనవి. దానితో నీతిధర్మాలను నియమించే స్మృతి గ్రంథాలు వ్రాయబడినవి.

స్మృతి గ్రంథాలల్లో ఆచారవ్యవహారాలను, కర్మానుష్ఠాన వ్యవహారాలను గూర్చి చెప్పబడింది. బ్రాహ్మణ ఆరణ్యకాలు కేవలం వైదిక కర్మలవరకే సీమితమైనవి. తర్వాత బృహద్రూపాన్ని ధరించిన వివిధ జాతుల ధార్మికానుష్ఠానాన్ని గూర్చి స్మృతి గ్రంథాలు బోధిస్తున్నవి. సూత్ర గ్రంథాలల్లో వర్ణాశ్రమ ధర్మం, కర్తవ్యాకర్తవ్య విషయాలు కూడ ప్రతిపాదింపబడినవి. స్మృతి గ్రంథాలు మానవుల సమస్త ధర్మాలు అంటె సామాజిక, నైతిక, రాజకీయ ధర్మాలను గురించి చర్చిస్తున్నవి. మనుస్మృతిలో రాజధర్మం, అర్థశాస్త్ర విషయాలు చర్చింపబడి కన్పిస్తున్నవి. అంటె మానవుని వ్యక్తిగత కర్మానుస్ఠానానికి కాక స్మృతి గ్రంథాలు మానవుని సామాజిక కర్మానుష్ఠానానికి ప్రాధాన్యాన్ని ఇచ్చిన వన్నమాట. స్మృతి గ్రంథాలు రాజులకు పరిపాలన వ్యవస్థను, న్యాయనిర్ణయాన్ని కూడ బోధించేటటువంటి గ్రంథాలు. రాజవ్యవస్థ విస్తరించే కొద్ది ధర్మశాస్త్రాల సంఖ్య, విషయ వివరణలు పెరుగుతూ వచ్చినవి. ఒక విధంగా స్మృతి గ్రంథాలు ఆయా యుగాల రాజ్యాంగ గ్రంథాలని చెప్పవచ్చును.

## స్మృతుల రచనాకాలం

స్మృతుల రచనాకాలాన్ని తేల్చిచెప్పటం కష్టమే అయినా అవి ఒక్క కాలంలో జరుగలేదనటం నిశ్చయం. వాటి రచనాకాలం చాల విస్తరించింది. స్మృతుల సుదీర్ఘ

రచనాకాలాన్ని విమర్శకులు మూడు యుగాలుగా విభజించారు. ప్రారంభయుగం క్రీ.పూ. 600-200. మధ్యయుగం క్రీ.పూ. 200 క్రీ.శ. 800. తృతీయయుగం క్రీ.శ.900-1800. ప్రారంభయుగం ధర్మసూత్రాల నిర్మాణ కాలమని చెప్పాలి. ధర్మసూత్ర గ్రంథాలు స్మృతులకు మూలరూపమైన గ్రంథాలని అనాలి. మధ్యయుగం ధర్మసూత్రాలకు వ్యాఖ్యానాల రచనాకాలమని చెప్పాలి. సంక్షిప్తంగా, సంకేతరూపంగా వ్రాయబడిన సూత్రాల భాషకు వ్యాఖ్యానాలు అవసరమైనవి. వ్యాఖ్యానాలు లేక వాటిని అర్థం చేసుకోవటం కష్టం. స్మృతి గ్రంథాలు పద్యరూపంలో వ్రాయబడినవి. అటువంటి స్మృతుల రచన క్రీ.పూ. 2వ శతాబ్దం నుంచి ప్రారంభమై క్రీ.శ. 18వ శతాబ్దం వరకు కొనసాగింది. తృతీయ యుగంలో స్వతంత్రమైన స్మృతుల రచన సాగినది. స్మృతుల రచన శుంగవంశ రాజుల కాలంలో ఆరంభమైందని, గుప్తరాజుల కాలంలో స్మృతుల రచన చాల విరివిగా సాగిందని, తద్రచన క్రీ.శ. 18వ శతాబ్దం వరకు జరుగుతూనే వున్నదని పండిత విమర్శకుల అభిప్రాయం. అంటే పురాణాలవలెనే ఆధునికకాలం వరకు స్మృతుల రచన కొనసాగుతూనే వున్నది. ధర్మసూత్ర గ్రంథాలకు పాండిత్య స్ఫోరకమైన వ్యాఖ్యానాలు మధ్య యుగంలో వ్రాయబడినవి. తర్వాత రానురాను కొత్త ధర్మశాస్త్ర గ్రంథాల అవసరం ఏర్పడింది. దానితో కొత్త సిద్ధాంతాలను ప్రతిపాదిస్తూ కొత్త ధర్మశాస్త్ర గ్రంథాల రచన ప్రారంభమైంది. తర్కపూర్ణమైన సరళ పద్యశైలిలో ఈ ధర్మశాస్త్ర గ్రంథాలు వ్రాయబడినవి.

స్మృతులల్లో మనుస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి - ఈ రెండు మహత్త్వపూర్ణమైన రచనలు. ఈ రెండు స్మృతులు భారతదేశమంతటా అంగీకారయోగ్యాలైన ధర్మశాస్త్ర గ్రంథాలు. సామాజిక వ్యవస్థ, రాజధర్మం, రాజశాసన సంబంధమైన విషయాలమీద ఈ రెండు గ్రంథాలు భారతీయులందరికి అతి ప్రామాణికమైన ప్రాచీన స్మృతి గ్రంథాలు. ఈ రెండు ప్రాచీన ధర్మసూత్ర విషయ పరంపరను కూడ వివరిస్తున్నవి. బ్యూలర్ మనుస్మృతి కూర్చబడిన కాలం క్రీ.పూ. 200-100 నడుమ అని నిర్ణయించాడు. అంటే మనుస్మృతి రచన అంతకంటే ప్రాచీనమైందని ఇప్పుడు మనకు లభ్యమయ్యే రూపం ఈ కాలంలో ఏర్పడిందని బ్యూలర్ అభిప్రాయం. జాయస్వాల్ మనుస్మృతి రచనాకాలం క్రీ.పూ. 150-120 నడుమ అని చెప్పాడు. డా॥ జ్యాలీ యాజ్ఞవల్క్య స్మృతిని క్రీ.శ. 1883లో ప్రచురించాడు. అతడు తద్రచనాకాలాన్ని క్రీ.శ. మొదటి శతాబ్దమని నిర్ణయించాడు. ఈ రెండు స్మృతులు శాతవాహన రాజుల కాలంలో వ్రాయబడినవని విమర్శకుల అభిప్రాయం. కొందరు విమర్శకులు మనుస్మృతి చాల ప్రాచీనమైందని విశ్వసిస్తూ, దాని రచన మహాభారత యుద్ధానికి పూర్వమే జరిగిందని అంటున్నారు. కాని మూల రచన అంత పాతదైనా దానిలో చాల ప్రక్షిప్తాంశాలు చేరినవని యుధిష్ఠర్ మీమాంసకుని అభిప్రాయం. 'విష్ణుస్మృతి'

మనుస్మృతి మీద ఆధారితమై వ్రాయబడింది. కాబట్టి విష్ణుస్మృతి మనుస్మృతి తర్వాత వ్రాయబడిందని చెప్పవచ్చును. విష్ణుస్మృతి రచన పద్యశైలిలోకాక సూత్రపద్ధతిలో జరిగింది. అందుకని కొందరు పండితులు దాన్ని ధర్మసూత్ర గ్రంథాలల్లో చేరిందానిగా అంగీకరిస్తున్నారు. కాని ఈ చేర్పు సర్వాంగీకారమైన విషయం కాదు. బృహస్పతి స్మృతి క్రీ.శ. 100-300 నడుమ వ్రాయబడిందని కాణే అభిప్రాయం. నారదస్మృతి క్రీ.శ. 5వ శతాబ్దంలో వ్రాయబడిందని పండితుల అభిప్రాయం. ప్రముఖమైన స్మృతుల్లో నారదస్మృతియే చివరిదని అంటారు. పరాశరస్మృతి, కాత్యాయన స్మృతులు గుప్తులకాలంలోనే కూర్చబడినవి.

స్మృతి గ్రంథాలకు వ్యాఖ్యానాలు, టీకలు కూడ వ్రాయబడినవి. యాజ్ఞవల్క్య స్మృతికి వ్రాయబడిన 'మితాక్షరా' అన్న టీక పాండిత్యపూర్ణంగా సరళసుందర శైలిలో వ్రాయబడింది. ఈ టీక స్వతంత్ర గ్రంథమంత ఉత్తమంగా వున్నది. యాజ్ఞవల్క్య స్మృతికే అప్రచురితమైన టీకలు కూడ ఒకటి రెండు వున్నవి. మనుస్మృతికి మేధాతిథి (క్రీ.శ. 825-900) కుల్లూక భట్టులు (క్రీ.శ. 12 వశ.) వ్రాసిన ప్రసిద్ధమైన టీకలున్నవి. ఇవేగాక భాగురి, భర్తృయజ్ఞ, దేవస్వామి, అసహాయులనే ప్రాచీన టీకాకారుల పేర్లు వినిపిస్తున్నవి. అదేవిధంగా ఇతర స్మృతులకు కూడ టీకలు, భాష్యాలు, చాలామట్టుకు గుప్తుల కాలంలోనే వ్రాయ బడినవి.

## స్మృతి గ్రంథాల నిర్మాణం

కల్పసూత్రాలకు చెందిన ధర్మసూత్రాల ఆధారంగానే స్మృతి గ్రంథాలు వ్రాయబడినవి. ఈ ధర్మసూత్ర గ్రంథాలే కాక స్మృతికారులకు మహాభారత రామాయణాలు, పురాణాలు, లోకాచారం, మొదలైనవి కూడ ఆధారమైనవి. పరంపరాగతమైన నీతిధర్మ వ్యవహారాలనే కాక స్మృతికారులు సమకాలీన ఆచార వ్యవహారాలను కూడ ప్రమాణంగా తీసుకొన్నారు. స్మృతి గ్రంథాలల్లో విషయాలను నాలుగు విధాలుగా విభాగించవచ్చును - ఆచార నియమాలు, వ్యవహార విషయాలు, ప్రాయశ్చిత్త విధానాలు, కర్మఫలాదుల వివరణలు. వర్ణాశ్రమ విధి విధానాలు కూడ విశదంగా స్మృతుల్లో చెప్పబడినవి.

కొన్ని స్మృతి గ్రంథాలు లఘు, బృహద్రూపాలల్లోను లభిస్తున్నవి. నారద స్మృతికి లఘు, బృహద్ సంస్కరణలు రెండు వున్నవి. అదేవిధంగా పరాశర స్మృతికి లఘు సంస్కరణ వున్నది. దానికి ప్రసిద్ధ వ్యాఖ్యాత మాధవాచార్యులు కూడ టీకను వ్రాసాడు. బృహస్పతి స్మృతి ఇప్పుడు మనకు పూర్ణ రూపంగా లభించటం లేదు. మొత్తం మీద స్మృతులసంఖ్య 152 వరకున్నదని నిర్ణయింపబడింది.

స్మృతి గ్రంథాలకు భాష్యాలు, టీకలేకాక స్వతంత్రరూపమైన వివరణ గ్రంథాలు కూడ వ్రాయబడినవి. వాటిల్లో క్రీ.శ. 12 శ॥కి చెందిన జీమూతవాహనుని "ధర్మరత్నం", లక్ష్మీధరుని "స్మృతికల్పతరువు" హలాయుధుని "బ్రాహ్మణ సర్వస్వ" గ్రంధాలున్నవి. క్రీ.శ. 13వ శ॥లో దేవణ్ణభట్టు "స్మృతి చంద్రిక" ను, వరదరాజు "స్మృతి సంగ్రహం"ను, హేమాద్రి "చతుర్వర్గ చింతామణి"ని ఓరుగల్లు చక్రవర్తి ప్రతాపరుద్రుడు "సరస్వతీ విలాసం"ను రచించారు. క్రీ. శ 14వ శ॥లో విశ్వేశ్వరుడు "మదనపారిజాతం' ' చండేశ్వరుడు "స్మృతిరత్నాకరం"ను, మాధవుడు "కాలమాధవీయం"ను రచించారు. క్రీ.శ. 15వ శ॥లో వాచస్పతి " చింతామణి" ని , క్రీ.శ. 16వ శ॥లో రఘునందనుడు "అగ్ని పరీక్ష"ను, వైద్యనాథ దీక్షితుడు "తిథి నిర్ణయం"ను, కమలాకరభట్టు " నిర్ణయ సింధువు' ' ను, నీలకంఠ దీక్షితుడు "భాగవత భాస్కరం" ను, మిత్రమిశ్రుడు "వీరమిత్రోదయం"ను రచించారు. ధర్మశాస్త్ర విషయక రచనల పరంపర ఇంకా కొంత కాలం వరకు అంటె క్రీ.శ. 18వ శ॥ వరకు కొనసాగింది.

# లౌకిక వాఙ్మయం

## సంస్కృత భాష

సంస్కృత భాష ప్రపంచంలోని ప్రాచీన భాషలల్లో ఒకటి. ప్రాచీన భాషలల్లో సంస్కృత భాషలోనే ప్రాచీనతమమైన సాహిత్యం లభిస్తున్నది. మెసపటోమియా, ఈజిప్టు, చైనా దేశాలల్లో సంస్కృతి అంకురించి అభివృద్ధి చెందకపూర్వమే భారతదేశంలో వేదబుక్కులు మహర్షుల దివ్యదృష్టి నుండి పుట్టినవి. సురభాష , దేవభాష అని సంస్కృత భాషకు ప్రాచీనమైన పేర్లు. దీనిచేత ఈ భాష సురులచేత, దేవతలచేత మాట్లాడబడే భాష అని తెలుస్తున్నది. పురాణాలల్లో సుర, అసుర అని రెండు తెగలున్నట్లు చెప్పబడింది. వీరే అద్దైత్యులు దైత్యులు, దేవతలు రాక్షసులు అని కూడ పిలువబడినారు. సురులు, దేవతలు, అద్దైత్యులు మధ్యఏశియా నుంచి వలస వచ్చిన ఆర్యజాతికి చెందినవారని చారిత్రకులు కొందరు అభిప్రాయాన్ని ఏర్పరచుకొన్నారు. క్రీ.శ. 1920 ప్రాంతంలో బయటపడిన హరప్పా మొహంజదారో సంస్కృతి అనార్య ద్రావిడ జాతికి చెందిందని వారు బలమైన కారణాలు ఏవి దొరకకున్నా సరే, ప్రచారం చేయటం ప్రారంభించారు. కాని పురాణ కథలల్లో సురాసురులు అన్నదమ్ములని చెప్పబడింది. వారికి తల్లులు వేరైనా తండ్రి ఒక్కడే. అటువంటప్పుడు వారు వేరు వేరు జాతికి చెందినవారని, వేరువేరు భాషలను మాట్లాడేవారని నిర్ణయించి చెప్పటం సమంజసం కాదు. అతి ప్రాచీనకాలంలో భారతీయులు, ఇరానియన్లు ఇప్పటికంటె ఎక్కువ సంబంధ బాంధవ్యాలతో జీవించేవారని, వారి భాషలకు, మతాలకు గల సామ్యమే చెప్తున్నది. వారు ఒకప్పుడు ఒకే జాతిగా, తెగగా వుండేవారు. కాలక్రమంగా వారిలో కొందరు ఇరాన్ దేశాన్ని విడిచిపెట్టి అఫ్ఘనిస్థానం మీదుగా సింధుప్రాంతానికి వలస వచ్చారు. అట్లా వలస వచ్చిన కొంత కాలానికి వారి భాషలో, మతంలో, భేదం పెరుగతూ వచ్చింది. కొత్త జాతులతో, భాషలతో, మతాలతో, సంస్కృతులతో పరిచయం, భౌగోళిక వాతావరణ పరిస్థితుల్లోని మార్పులు వారిని ఇంకావిడదీసినవి. కాని వారు విడిపోయింతర్వాత చాలాకాలం వరకు సంబంధబాంధవ్యాలుండటమే కాక ఏదో ఒక విషయంమీద వారికి తగువులాటలు సంభవిస్తుండేవి. భారతీయార్యులు సురులుగా, ఇరానియన్ ఆర్యులు అసురులుగా పిలువబడేవారు. భారతీయులు తమను 'దేవత'లు గాను చెప్పుకొన్నారు. 'అసుర' శబ్దం వేదాలల్లో ప్రాచీన ఇరానియన్ భాషలోలాగే 'సామర్థ్యశక్తి' అన్న అర్థంలోనే, మంచి అర్థంలోనే వాడబడింది. కాని రానురాను 'అసుర' శబ్దం ప్రాచీన ఇరానియన్లు " మహాన్ శక్తి, సామర్థ్య శక్తి" అన్న అర్థంలోనే వాడుతూ వచ్చారు. కాని ఎందుకో

భారతీయార్యుల భాషలో క్రమంగా 'అసుర' శబ్దం చెడ్డ అర్థంలో వాడబడుతూ వచ్చింది. దీనికి కారణం భారతీయార్యులకు ఇరానియన్లతోగల వైరం కావచ్చును. వైరులైన వారిచేత పూజ్యార్థంలో ప్రయోగింపబడే 'అసుర' శబ్దం విపరీతంగా చెడ్డ అర్థంలో గ్రహింపబడసాగింది. ఇరానియన్ ఆర్యుల ప్రధాన దేవత పేరు "అహుర (=అసుర) మజ్ద (=మహాన్)". 'అహుర' ను పూజించే ఇరానియన్ ఆర్యులను భారతీయార్యులు 'అసుర'లని పిలువసాగారు. వారు "అసుర"లైతె వీరు 'సుర'లని కొత్త శబ్దం కల్పింపబడింది. ఇరానియన్, భారతీయ ఆర్యుల నడుమ జరిగే ఘర్షణలు 'దేవాసుర' లేక 'సురాసుర' సంగ్రామాలుగా చెప్పబడినవి. అందుకే వేదభాష్యకారులు కొందరు వేదాలల్లో పురాణాలల్లో చెప్పబడిన దేవాసుర వృత్తాంతాలు 'ఐతిహాసిక' మని పేర్కొన్నారు. ఇరానియన్ ఆర్యులను మాత్రమే చెప్పి అసుర శబ్దం తర్వాత పురాణాలల్లో వేదేతరమతానుయాయులకు, విజాతీయులకు కూడ వాడబడి దైత్య, దానవ, రాక్షస జాతులకు సమానార్థక పదమైంది. ఇరానియన్ల ప్రాచీన జరోష్ట్రియన్ మత గ్రంథాలల్లోని, ఋగ్వేదాదుల్లోని గాథలను పరిశీలించినట్లయితె సురాసురవాదం బలపడగలదు. వేదాలల్లో ప్రధాన దేవతగా స్తుతింపబడిన ఇంద్రుడు వారి గాథల్లో అప్రధానపాత్ర ధరిస్తున్నాడు. వృత్రాసురున్ని ఇంద్రుడు వధించిన ఋగ్వేదగాథ వారి గాథల్లో వేరే రూపాన్ని ధరించి కన్పిస్తున్నది. వారి గాథల్లో వృత్రాసురుడు నాయకుడు. పార్సీ భాష నుంచి ఉర్దూ లోకి వచ్చిన "దేవ్ కా దేవ్" అనే ఉక్తికి ఎత్తులావు వున్న మనిషి అని అర్థం. ఇది భారతీయ భాషల్లో దైత్యాకారుడన్న ఉక్తితో సమానమైంది. దీన్ని బట్టి ఇరానియన్లకు శత్రువులు దేవతలు, భారతీయులకు శత్రువులు దైత్యులని తెలుస్తున్నది. సురాసురలు ఒకే తెగకు చెందినవారు కావటంచేతనే మన పురాణ కథలు వారిని అన్నదమ్ములుగా చెప్తున్నవి. ఆ అన్నదమ్ముల నడుమ వుండే అంటె ఒక్క జాతి సంస్కృతులకు చెందిన రెండు తెగలకు నడుమవుండే ఈర్ష్యాసూయలు, కలహాలు మన వేద పురాణాల్లో గాథల రూపంలో చెప్పబడినవి. జరోష్ట్రియన్ మతగ్రంథమైన అవెస్తాలోని భాష, వేదాలల్లోని భాష - ఈ రెండు చాల సమీప సంబంధంగల భాషలు. అసలు అవి ఒకే భాష యొక్క రెండు మాండలికరూపాలని విమర్శకులు చెప్తున్నారు. అంత సామ్యం ఆ భాషలల్లో వున్నది. ఈ రెండు ప్రాచీన భాషలకును యూరోపులోని ప్రాచీన భాషలైన గ్రీకు లాటిన్ భాషలకును ఇంకా జర్మన్ ఫ్రెంచి రష్యన్ భాషలకును చాల సామ్యంవున్నది. ఈ భాషలన్ని ఒకే ఒక్క భాషనుంచి విడివడిన భాషలని, ఈ భాషాభాషీయులంతా ఒకేచోట వుండేవారని, వారు గుంపులు గుంపులుగా ఇతర ప్రాంతాలకు వలసవెళ్ళారని భాషాశాస్త్రవేత్తల, చారిత్రకుల అభిప్రాయం. అందులో ఒక గుంపు ఇరాన్ దేశం మీదుగా భారతదేశం చేరుకున్నారు. అట్లా వచ్చేటప్పుడు కొంతమంది ఇరాన్‌లోనే వుండిపోయారు. ఈ

భాషలన్ని ఒక్క కుటుంబానికి చెందినవని ఆ భాషాకుటుంబానికి ఇండో- యూరోపియన్ అని నామకరణం చేసారు. జర్మన్ భాషావేత్తలు దీన్నే ఇండో-జర్మన్ భాషా కుటుంబమని అన్నారు. గ్రీకు లాటిన్‌ల కన్న సంస్కృత భాష అతి సుందరమైంది, సుసంస్కృతమైందని పాశ్చాత్య విమర్శకులు అభినందించారు. గ్రీకు లాటిన్‌లకు లేని ఈ భాషాభివృద్ధి సంస్కృతానికి ద్రావిడ, ముండా మొదలైన భారతదేశంలోని జాతుల భాషలతో కలిగిన సంపర్క ఫలితమే కావచ్చును. ద్రావిడ భాషలల్లోగల అనేక శబ్దాలు సంస్కృతం నుంచి గ్రహింపబడినవని ఈనాడు చెప్పబడేవి అసలు ఆ భాషల నుంచి సంస్కృతంలోకి గ్రహింపబడినవని కొందరు పండితుల అభిప్రాయం. సంస్కృత భాషలో ధాతువులను వ్యాకరణవేత్తలు నిర్మించి, ఏ శబ్దాన్నైనా ఆ ధాతువుల్లో ఏదో ఒకదాని నుంచి సిద్ధింపజేసే అద్భుత నిర్మాణాన్ని చేసారు. దానివల్ల ఎన్నో పరభాషా పదాలు సంస్కృత జన్యాలుగా నిరూపింపజేసే అవకాశం ఏర్పడుతున్నది. ఈ అద్భుత నిర్మాణ క్రియా కౌశలం అనితర లభ్యమైంది. ప్రాచీన కాలంలో ఎన్నో విదేశీయ జాతులు భారతదేశం మీదికి దండెత్తి వచ్చినవి. వారందరు సంస్కృత భాషను గ్రహించారు. అట్లా గ్రహించేటప్పుడు వారి భాషకు చెందిన ఎన్నో శబ్దాలు, స్వరభేదాలు సంస్కృత భాషలో చేరినవనటంలో ఏమీ సందేహం లేదు. ఇట్లా సంస్కృత భాష వివిధ భాషల సంపర్కంచేత గ్రీకు లాటిన్‌లకన్న సుసంపన్నమైన భాషగా రూపొందింది.

## సంస్కరింపబడిన భాష సంస్కృత భాష

వేదరచనాకాలంనాడు కూడ ప్రజాసామాన్యం మాట్లాడే ప్రాకృత భాష వుండేదని, ఆ ప్రాకృత భాషా ప్రభావం అక్కడక్కడ వేదాలల్లోను కన్పిస్తుందని భాషావేత్తల అభిప్రాయం. ఎప్పుడైనా జనసామాన్యం మాట్లాడే భాషకును, సాహిత్యంలో ప్రయోగింపబడే భాషకును భేదం వుండకతప్పదు. జనులు మాట్లాడుకునే భాషయే సుసంస్కృత రూపంలో సాహిత్యంలో ప్రయోగింపబడుతుంది. వేదకాలంలో ప్రజలు మాట్లాడే ప్రాకృతానికి, వేదాలల్లో ప్రయోగింపబడిన భాషకు ఎక్కువ భేదం లేకపోవచ్చును. ఆ ప్రాకృతం మాట్లాడేవారికి ఈ వేదభాష సులభగ్రాహ్యమై వుంటుంది. రానురాను ప్రజల భాషలల్లో మార్పురావటం సహజం. చారిత్రక, భౌగోళిక భేదాలనుబట్టి జనులు మాట్లాడే ప్రాకృత భాషలో అనేక మార్పులు, మార్పులేగాక భేదాలు ఏర్పడినవి. అట్లా మార్పులు, భేదాలు ఏర్పడినా సాహిత్య భాషగా ఒక సంస్కృతమైన, శుద్ధమైన భాషయొక్క అవసరముంటుంది. అట్లా శుద్ధఉచ్చారణతోకూడిన, శిక్షితులచేత మాట్లాడబడే సంస్కృత మైన భాషే "సంస్కృతభాష" అనే పేరుతో పిలువబడసాగింది. దీన్నే లౌకిక సంస్కృత భాష అని కూడా

అంటున్నాము. ఈ సంస్కృతభాషకు వేదాలల్లో ప్రయోగింపబడిన వైదిక సంస్కృత భాషకు చాల వ్యత్యాసం వచ్చింది. వైదిక సంస్కృతభాషకన్న లౌకిక సంస్కృతభాష అక్లిష్టమైంది. ముఖ్యంగా వ్యాకరణ దృష్టితో పరిశీలించినట్లయితే ఎన్నో శబ్దరూపాలు, విభక్తిరూపాలు, కాలభేదాలు (Tenses) వైదికభాషలో వున్నవి సంస్కృత భాషలో లేకుండాపోయినవి. లౌకిక సంస్కృతంలో నూతన శబ్దజాలం వైదికభాషలో లేనివి వచ్చిచేరినవి. వైదికభాషలో ఉన్నవి ఎన్నో శబ్దాలు ప్రయోగంలో లేకుండా పోయినవి. కొన్ని వైదికశబ్దాలు ప్రాకృతంలోవున్నా అవి లౌకిక సంస్కృతంలో లేని సందర్భాలు కూడ ఉన్నవి. ఒక్కొక్కసారి వికృతిచెందిన వైదిక సంస్కృతశబ్దం ప్రాకృతంలో వుండి అది తిరిగి శుద్ధ ఉచ్చారణరూపంలో మార్పును చెంది లౌకికసంస్కృతంలో చేరినవి. ఈ విధంగా భాషలో కాలక్రమంగా భేదం ఏర్పడి వైదిక సంస్కృతభాష లౌకిక సంస్కృతభాషగా మార్పు చెందింది. లౌకికసంస్కృతం మనకు వేదవాఙ్మయాంతర్గతమైన బ్రాహ్మణారణ్యక గ్రంథాలల్లోనే కన్పిస్తున్నా ఉపనిషత్తులు, స్మృతిసూత్ర గ్రంథరచనాకాలంనాటికి అది పూర్తిగా ప్రచారంలోని వచ్చింది. ఆ సంస్కృతభాష ఆనాటి జనుల వాడుకలో వున్న నిత్యజీవితంలోని భాషకు స్వచ్ఛఉచ్చారణతోకూడిన సంస్కరింపబడిన భాషారూప మనటంలో సందేహం లేదు. ఈ స్వచ్ఛ ఉచ్చారణతోకూడిన సంస్కరింపబడిన భాషను శిక్షితులైనవారు, సంఘంలో ఉన్నతవర్గాలకు చెందినవారు నిత్యం ప్రయోగించే వారనటంలో సందేహంలేదు. అందుకే పాణిని ఒకొకమారు శబ్దప్రయోగంలో ప్రాంతీయభేదాలను గూర్చి ప్రసంగించాడు. సంస్కరింపబడిన భాషను నియమబద్ధంచేసే ప్రయత్నాలు చాలా ప్రాచీన కాలంలోనే జరిగినవి. ఆ ప్రయత్నంలో సంపూర్ణ విజయాన్ని సాధించినవాడు పాణిని. తర్వాత ప్రాకృత భాషలు క్రీ.శ. 4వ శ. నాటికి అపభ్రంశరూపంగా మారినా తిరిగి అపభ్రంశభాషలు ఆధునిక భాషలుగా మారినా పాణినిచేత వ్యాకరణబద్ధం చేయబడిన సంస్కృత భాష రూపం చెడిపోకుండా ఉన్నత వర్గాల నిత్యజీవితంలో మాట్లాడుకొనే మరియు సాహిత్యంలో ప్రయోగింపబడే ఒక మానక భాషగా నిలిచిపోయింది. చక్కని శాస్త్రీయ పద్ధతిలో పాణిని రచించిన వ్యాకరణమే దీనికి కారణం కావచ్చును.

## సంస్కృతభాషా వైశిష్ట్యం

భారత దేశానికి ఉద్యోగ నిమిత్తమై వచ్చిన ఆంగ్లేయులు భారతీయ భాషా సంస్కృతులందు అభిరుచిని చూపి వాటిని అర్థం చేసుకోటానికై కృషి చేసారు. ముఖ్యంగా సంస్కృతభాష వారి దృష్టిని ఆకర్షించింది. సంస్కృతభాషకును గ్రీకు లాటిన్ పారసీభాషలకు గల సంబంధాన్ని వారు గుర్తించారు. ఈ గుర్తింపు ప్రపంచ చరిత్రాధ్యయనంలోనే ఒక

సంచలనాత్మకమైన మార్పును తెచ్చింది. శాస్త్రవిజ్ఞానంలో ఆవిష్కరింపబడిన న్యూటన్, డార్విన్ సిద్ధాంతాలు ఎంత ప్రముఖమైనవో ఈ భాషా సామ్యాన్ని కనిపెట్టి తులనాత్మక భాష, మత, పౌరాణిక గాథల పరిశీలనకు దారితీయటం కూడ అంత ప్రముఖమైన ఆవిష్కారమనే చెప్పాలి. శాస్త్రబద్ధమైన సంస్కృత భాషానిర్మాణం, ప్రాచీనమైన, విలక్షణమైన సంస్కృత సాహిత్యం పాశ్చాత్యుల మెప్పులను పొంది పునర్జీవితమై భారత జాతి పునర్జాగరణలోనే ప్రధాన పాత్ర వహించింది. మహమ్మదీయ దండయాత్రల వరకు రాజభాషగా, సాహిత్యభాషగా, శిక్షిత నాగరికుల భాషగా ఆసేతు హిమాచలం గౌరవాన్ని పొందింది సంస్కృతభాష. అటువంటి సంస్కృతభాషే ఉపఖండాన్నంతా ఒక్క సంస్కృతి కిందకు తెచ్చి ఒక్క దేశంగా మనేటట్లుగా చేసింది. భారతీయులందరిని ఏకసూత్రబద్ధులయ్యేటట్లుగా చేసే శక్తి ఇప్పటికీ దానికే వున్నది. సంస్కృత భాష నిర్జీవమైంది కాదు. ఇప్పటికి ఆ భాషలో మాట్లాడగలిగినవారు, రచనలు చేయగలిగినవారు వున్నారు. ఇంకా ఆ భాషకు పరభాషా పదాలను జీర్ణించుకొనే క్షమత వున్నది. ఏ భాషా పదాలనైనా, ఎటు వంటి భావాన్నైనా గ్రహించి ప్రకటించే అద్భుత జీవశక్తి దానిలో వున్నది. ఇప్పటికీ దేశభాషలకు ఉపజీవ్యభాషగా వున్నది.

సంస్కృతభాషలో అతిప్రాచీనకాలంలోనే సాహిత్య సృష్టి జరిగింది. అతి ప్రాచీనకాలంలో దీనికి వ్యాకరణం రచింపబడింది. ప్రపంచంలో ఏ భాషలోలేని క్రమబద్ధమైన, శాస్త్రీయమైన శబ్దజాల నిర్మాణం జరిగింది. అతి ప్రాచీన కాలంలోనే సంస్కృతభాష బాగా అభివృద్ధి చెందిందంటె దానికి పరభాషాసంపర్క కారణం కావచ్చును. ఈ పరభాష భారతదేశంలో అంతకుముందే నివాసమేర్పరుచుకొని పరిశ్రమలలో, వాణిజ్యంలో, కృషిరంగంలో ముందంజవేసిన ద్రావిడజాతి మాట్లాడే భాషే కావచ్చును. ఋగ్వేదాదుల్లోనే ద్రావిడ భాషా పదాలు వున్నవని పాశ్చాత్య పండితుల అభిప్రాయం. మూలద్రావిడ భాష తమిళ తెలుగు కన్నడ భాషలుగా స్థిరపడకముందే సంస్కృత భాషమీద తన ప్రభావముద్రను వేసి ఉంటుంది. హిందీ మొదలైన ఉత్తర భారత భాషల వాక్యనిర్మాణాదులమీద ద్రావిడ భాషాప్రభావం ఉన్నదని భాషాశాస్త్రజ్ఞుల అభిప్రాయం. ఒకప్పుడు ద్రావిడ భాషాభాషీయులు ఉత్తర భారతంలో విస్తరించి వుండిరనటం చారిత్రక సత్యం. ఇండో-ఇరానియన్ భాషావర్ణాలకు సంస్కృత భాషలోని వర్ణాలకు భేదమున్నదని, ముఖ్యంగా హల్సముదాయంలో మూర్ధన్యాలు సంస్కృతభాషలో కొత్తగా చేరినవని, ష తర్వాత వచ్చే దంత్యాలు మూర్ధన్యంగా మారటం, 'ర', ఋ'ల తర్వాత వచ్చిన దంత్యాలు మూర్ధన్యాలుగా మారటం, ఈ ధ్వనుల మార్పు ద్రావిడ భాషాప్రభావంచేతనే జరిగిందని భాషావేత్తల అభిప్రాయం. సంస్కృత భాషలో ఇతర ఇండో-యూరోపియన్ భాషల్లోకన్నా ముందే ఉన్నతమైన భావప్రకటన

జరిగిందనీ, దాని అభివృద్ధికి, సాహిత్యసృష్టికి కారణం భారతదేశంలో ఆర్యజాతికన్న పూర్వమే నివాస మేర్పరుచుకొన్న ద్రావిడ జాతి మాట్లాడే ద్రావిడభాషాప్రభావమే కావచ్చును. ఈ విధంగా సంస్కృత భాష తనతో సంపర్కం ఏర్పడిన భాషల రూపాలను తనలో సమైక్యం చేసుకోగలిగింది. కాబట్టే విభిన్న జాతుల సమ్మేళనమైన భారతీయులకది గౌరవపాత్రమైన భాషగా నిలిచింది. ఎన్నో భాషల శబ్దాలను జీర్ణించుకొన్న సంస్కృత భాష తిరిగి భారతీయ భాషలకన్నిటికి పుష్టిని కలిగించే మూలస్రోతస్సుగా మారింది.

## సంస్కృత సాహిత్యం

యాస్కుడు, పాణిని సంస్కృతాన్ని "భాష" గా పేర్కొన్నారు. కాని పాణినికి పూర్వమే రామాయణంలో "సంస్కృత" భాష అని పేర్కొనబడింది. కాబట్టి పాణిన్యాదులచేత వ్యాకరణబద్ధం చేయబడి సంస్కరింపబడిన తర్వాతనే దీనికి సంస్కృత భాష అన్న పేరు వచ్చిందనలేము. ఎప్పుడో ఏ కాలంలోనో దీనికి సంస్కృతమన్న నామకరణం జరిగింది. వేదాల మొదలుకొని ప్రయోగింపబడిన భాషను ఇప్పుడు సంస్కృత భాష అని ఆ రచనలన్నిటిని సంస్కృత సాహిత్యం లేక సంస్కృత వాఙ్మయం అని అంటున్నాము.

సంస్కృత సాహిత్యాన్ని ప్రధానంగా మూడు యుగాలుగా విభాగింప వచ్చును- 1) వేదవాఙ్మయం 2) స్మృతి వాఙ్మయం 3) లౌకిక వాఙ్మయం. వేద, బ్రాహ్మణ, ఆరణ్యక. ఉపనిషద్గ్రంథాలన్ని వేదవాఙ్మయ మనబడుతుంది. పురాణ, సూత్ర, ధర్మశాస్త్ర, వేదాంగాలు స్మృతి వాఙ్మయమనబడుతుంది. మహా భారత రామాయణ గ్రంథాలు, కాళిదాసాది కవుల సమస్త కావ్యనాటకాదులు లౌకిక వాఙ్మయమన బడుతుంది. ఈ మూడు యుగాలకు చెందిన వాఙ్మయంలోని ప్రక్రియల్లోనే భేదం కాక ప్రయోగింపబడిన సంస్కృత భాషలోను భేదమున్నది. వేద వాఙ్మయంలోని సంస్కృతభాష సమాసత లేక అక్లిష్టంగా వున్నది. ఇన్ని యుగాల తర్వాత భాషలో మార్పు వచ్చి మనకు క్లిష్టంగా వున్నా సమకాలిక ప్రజలకది సులభగ్రాహ్యమైన సరళశైలే కావచ్చును. వేదవాఙ్మయంలోని భాషలో క్రియా విధానాదులు స్మృతి, లౌకిక వాఙ్మయంలో కన్నా మనకిప్పుడు క్లిష్టంగా వున్నవి. వైదిక వాఙ్మయంలో పరస్మైపద ఆత్మనే పదాలు ఎక్కువగా ప్రయోగింపబడినవి. ఈ రూపాలన్ని లౌకిక వాఙ్మయంలో కనిపించవు. భాష వైదిక కాలం నాటికన్న ఈ కాలంలో సులభతరమైంది. కాని వైదిక వాఙ్మయంలోని సులభ సరళశైలి లౌకిక వాఙ్మయంలో క్రమక్రమంగా అధిక సమాసతను సంతరించుకోసాగింది.

# సంస్కృత సాహిత్య వైశిష్ట్యం

ఒక దేశం యొక్క సంస్కృతి సౌభాగ్యాలు దాని సాహిత్యంలో ప్రతిబింబిస్తవి. దేశసంస్కృతి తత్ సాహిత్యానికి జీవకళను ప్రసాదిస్తుంది. దేశ సంస్కృతి యొక్క ఉత్థానపతనాలను పరివర్తన పరివర్ధనాలను తత్ సాహిత్యంలో చూడవచ్చును. సమస్త భారతదేశం యొక్క సంస్కృతి సంస్కృత సాహిత్యంలో ప్రతిబింబించి కనిపిస్తున్నది. భారత హృదయానికి సంస్కృత సాహిత్యం దర్పణం వంటిది. భారతాత్మ సంస్కృత సాహిత్యంలో నిండివున్నది. భారతీయుల భౌతిక, అధ్యాత్మిక జీవితం సంస్కృత సాహిత్యంలో ప్రత్యక్షమవుతున్నది. భారతీయుల సామాజిక, రాజకీయ, మత, కళ, శాస్త్రాభివృద్ధులన్నీ సంస్కృత సాహిత్యంలో సురక్షితాలైనవి. ఒక దేశం యొక్క సుదీర్ఘ కాలానికి చెందిన భౌతిక, అధ్యాత్మిక జీవనం ఒకేఒక్క భాషా సాహిత్యంలో ప్రతిఫలించి మరెక్కడా ప్రపంచంలో ఇట్లా కనిపించదు.

ప్రాచీనత్వం, వ్యాపకత్వం దృష్టితో సంస్కృత సాహిత్యం ప్రపంచంలో విశిష్ట స్థానాన్ని సంపాదించుకొన్నది. క్రీస్తుపూర్వం 3000 సంవత్సరాలనాడే ఋగ్వేదంతో ఆరంభమైన సంస్కృత సాహిత్య సృష్టి ఇప్పటివరకు నిరంతరంగా కొనసాగుతూనే వున్నది. ఇటువంటి నిరంతర సృష్టి ఏ సాహిత్యంలోను కనిపించదు. దర్శన, నీతి, రాజనీతి, అర్థ, జ్యోతిష, గణిత, ఆయుర్వేద, కావ్య, నాటకాది రచనలెన్నో సంస్కృత భాషలో వున్నవి. ఇక లౌకిక సాహిత్యాన్ని తీసుకున్నట్లయితే ఆ సాహిత్యంలో కనిపించని ప్రక్రియ లేదు. ఆధునికమైన నవల, కథానిక, వ్యాస, సాహిత్య విమర్శనలు వంటి ప్రక్రియలు కూడ సంస్కృతంలో ప్రవేశించినవి.

ఒకజాతి గుణశీలాన్ని తీర్చిదిద్దటంలో సంస్కృత సాహిత్యం ప్రభావం చూపినంతగా మరేసాహిత్యం తన ప్రభావాన్ని చూపలేదు. తపస్సు, త్యాగం, ఉదారత, ఆశావాదం, మానవత, సర్వసమానత్వం వీటన్నిటిని భారతీయులకు బోధించేది సంస్కృత సాహితమే! ప్రజలకు బోధించడమే వేద పురాణ కావ్య నాటకాదుల ప్రయోజనం. ధర్మానికి, సత్యానికి విజయంకలుగుతుందని, దానశీలత అన్ని ధర్మాలకన్న మించిందని సంస్కృతసాహిత్యం చెప్తున్నది. ఆదర్శ జీవితాన్ని ఆదర్శశీలాన్ని ఆశావాదాన్ని చిత్రించటమే సంస్కృతసాహిత్య ప్రధాన లక్షణం. అందుచేతనే సుఖాంతమైన కథలు మనకు సంస్కృతసాహిత్యంలో కన్పిస్తున్నవి. ధర్మాధర్మానికి, సత్యాసత్యాలకు, దేవత్వ రాక్షసత్వాలకు నడుమ ఘర్షణను సృష్టించి చివరకు ధర్మం, సత్యం, దేవత్వం జయించినవని చూపించటమే సంస్కృత కావ్య నాటకాదులల్లో జరిగింది. గ్రీకు సాహిత్యంలోవలె మానవజీవితాన్ని వున్నది వున్నట్టుగా చిత్రించటం సంస్కృతసాహిత్యం యొక్క ఆదర్శం కాదు. అందుకే పాశ్చాత్య సాహిత్యంలోవలె

సంస్కృతసాహిత్యం సహజ జీవితచిత్రణలతో నిండిలేదు. మానవునికి ఆశావాదిత్వాన్ని బోధించటమే సంస్కృతసాహిత్య ప్రయోజనం. అందుకే సంస్కృత కావ్య నాటకాదులల్లో దేవత్వ మానవత్వాలకు ప్రతినిధియైన నాయకుడు, రాక్షసత్వానికి ప్రతినిధియైన ప్రతినాయకుడు కనిపిస్తారు. నాయక ప్రతినాయకుల మధ్య ఘర్షణ కల్పింపబడి దేవత్వ మానవత్వాలు విజయాలు సాధించినట్లుగా కథలను సుఖాంతం చేయటం సంస్కృత సాహిత్యంలో కన్పిస్తుంది. ఇప్పటికి భారతీయ సాహిత్యంలో ఇదే పద్ధతి అనుసరించటం జరుగుతున్నది.

సంస్కృత భాష, సాహిత్యం భారతీయ దేశభాషలపైననేగాక సింహళం, బర్మా, మలేసియా, ఇండోనేషియా, కంపూచియా, వియత్నాం, చైనా, జపాన్, మంగోలియా, మధ్యఏశియా దేశాలల్లోని భాష, సాహిత్యాలమీద తన ప్రభావ ముద్రను వేసింది. వైదిక, పౌరాణిక, హిందూధర్మవ్యాప్తిలోనే సంస్కృత సాహిత్యం ప్రముఖపాత్ర వహించటం కాదు, బౌద్ధ జైనమత వ్యాప్తిలోను దానికి ప్రముఖ పాత్ర వున్నది. బౌద్ధ జైనులు ప్రచారసాధనంగా మొదట్లో కొంతకాలం సామాన్య జనుల భాషలైన పాళీప్రాకృతాలను తీసుకొన్నా తర్వాత తర్వాత వారు సంస్కృతభాషను, ప్రక్రియలనే గ్రహించారు. ఈ విషయంలో బౌద్ధులు ముందజం వేసారు. జైనులు వారిని అనుసరించారు. హిందూ తత్త్వవేత్తలతో శాస్త్ర చర్చలలో వాదించటానికి తిరిగి వారు సంస్కృతాన్ని చేపట్టవలసివచ్చింది.

సంస్కృత సాహిత్యం ధర్మ ప్రధానమైందని దానిలో ఐతిహాసిక తథ్యాలకు స్థానం లేదని కొందరి అభిప్రాయం. ఈ విధంగా అభిప్రాయపడేవారు ప్రాచీన భారతీయుల ఐతిహాసక దృష్టికోణాన్ని తెలుసుకోలేదని చెప్పాలి. ఋగ్వేదంలోనే ఇతిహాసోల్లేఖనం వున్నది. " ఇతిహాస మాచక్షతే" అని "ఇతి ఐతిహాసికాః" అని అన్న యాస్కుని మాటలు వేదాలల్లోను ఇతిహాసం కలదని బలపరుస్తున్నవి. ఇతిహాసం తెలవనివానికి వేదం భయపడుతుందని అన్నదాన్నిబట్టి వేదార్థజ్ఞానానికి ఇతిహాసాధ్యయనం అత్యావశ్యకమని తెలుస్తున్నది. ఇతిహాసపురాణం పంచమవేదమని ఛాందోగ్యోప నిషత్తులో చెప్పబడింది. పురాణాలు ప్రధానంగా ఇతిహాసగ్రంథాలే అని వాటి పంచలక్షణాలే చెప్తున్నవి. భరతవంశానికి చెందిన కౌరవపాండవుల కథగల మహాభారతం ఇతిహాస కావ్యమే. ఇంకా లౌకిక సాహిత్యంలో రాజతరంగిణి వంటి అచ్చమైన చారిత్రక గ్రంథాలుకూడా రచింపబడినవి. ఆదర్శయుతమైన, మానవోపయోగమైన సంఘటనలనే భారతీయులు గ్రంథస్థం చేసారు. ఆయా యుగాలల్లో ధర్మరూపాన్ని చెప్పటమే వారి ప్రధాన ఆశయం. కాని రాజుల రాజ్యారోహణ, రణ విజయ పరాజయాదులను కాలక్రమాణుగుణంగా జరిగింది జరిగినట్లుగా గ్రంథస్థం వారు చేయలేదు.

# సంస్కృత సాహిత్య చరిత్ర

సంస్కృత సాహిత్య చరిత్ర చాలా విశాలమైంది. విశాలమైన సంస్కృత సాహిత్యాన్నంతా ప్రధానంగా రెండు విభాగాలుగా చేస్తుంటారు - 1) వైదిక వాఙ్మయం 2) లౌకిక వాఙ్మయం. వైదిక వాఙ్మయ విభాగంలో సంహిత బ్రాహ్మణ ఆరణ్యక ఉపనిషత్ పురాణ వేదాంగాదులను గూర్చి వుంటుంది. లౌకిక వాఙ్మయ విభాగంలో మహాభారత రామాయణాలు కాళిదాసాది కవుల పండితుల కావ్య ఖండకావ్య రూపక అలంకార శాస్త్రాదులను గూర్చి వుంటుంది. ఆ పరిపాటిని అనుసరించే ఈ గ్రంథంలో వైదిక లౌకిక వాఙ్మయాలు విమర్శనాత్మకంగా పరిశీలింపబడినవి.

# పాశ్చాత్యుల సంస్కృత భాషాధ్యయనం

సంస్కృత భాషా సాహిత్య చరిత్రలో పాశ్చాత్యుల సంస్కృతాధ్యయనం ఒక ప్రముఖమైన ఘట్టమని చెప్పవచ్చును. స్వదేశంలో ప్రాచీనభాష, సాహిత్యాలు మరువబడి దాని వైభవ తేజస్సులు మరుగునపడిపోయిన తరుణంలో పాశ్చాత్యులు సంస్కృతభాషా సాహిత్యాలను వెలికితీసి పునరావిష్కరణచేసి ఉద్ధరించారు. ఈ పునరావిష్కరణ భారతీయుల పునరుజ్జీవనానికి ఎంతగానో చేయూతనిచ్చింది. వేద కావ్య నాటకాది సాహిత్య రంగాలల్లో పాశ్చాత్యులు బయట పెట్టిన విషయాలు భారతీయులకు గర్వకారణాలైనవి. ఇక సంస్కృత భాషానిర్మాణంలోని గొప్పతనాన్ని ప్రపంచానికి చాటటమేకాక సుదూర ప్రాంతాలల్లోని యూరోపియన్ భాషలతో దానికి గల సంబంధాన్ని బయటపెట్టటంచేత దాస్యశృంఖలాలల్లో మగ్గి ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయిన భారతజాతికి అదొక సంజీవని అయింది. యూరోపియన్ సంస్కృతి సాహిత్యాలకు మూలస్రోతస్సులైన ప్రాచీన సుసంస్కృత భాషలైన గ్రీకు, లాటిన్‌భాషలతో సంస్కృతానికిగల సామ్యం పాశ్చాత్యులనుకూడా ఆశ్చర్యపరిచింది. చరిత్ర యొక్క అధ్యయనమే ఈ ఆవిష్కరణతో మారిపోయింది. ఈజిప్టు, సుమేరియన్ నాగరికతావశేషాల ఆవిష్కరణలకన్న కూడ సుదూర ప్రాంతాలల్లోని ఈ భాషలకుగల అతిసామీప్య సంబంధాల ఆవిష్కరణ అద్భుతాశ్చర్యాలను కలిగించి జాతుల చరిత్ర నిర్మాణానికి తోడ్పడింది. సంస్కృత భాషావిష్కరణ, వేదసాహిత్య పరిచయం పాశ్చాతుల దృష్టికోణంలోను మార్పుతెచ్చింది. ప్రపంచంలో ఈజిప్టు , సుమేరియన్ జాతులే ప్రాచీనమైనవని, సంస్కృతి విశేషాలు కలవని అనుకొంటున్న సమయంలో వైదికభాష అయిన ప్రాచీనమైన సంస్కృతభాషతో యూరోపియన్ భాషలకు సంబంధసామ్యాలు కన్పించి ఆ భాషలను మాట్లాడేవారు ఒక్క జాతికి చెందినవారని తెలిసింది. ఆ జాతిజనులు సంచారజాతి అయినా ఒక చక్కనిభాష, మతం ప్రపంచంలో ఎక్కడ లేనివి వారికి వున్నవని

తెలియ వచ్చింది. ఒక విధంగా ఈ ఆవిష్కరణవల్ల యూరోపియన్లకు కూడ తమ జాతి భాషల ప్రాచీనతను తెలుసుకోడానికి సాధ్యమైంది. ఇండో-యూరోపియన్ భాషకు చెందిన సంస్కృతంలోగల వేద గ్రంథాలు అతి ఉన్నతమైన సుసంస్కృతమైన భాషాభావాలు, ధార్మిక ఆలోచనలు కలిగినవి. ఇటువంటి ఉన్నతమైన భావాలుగల వేదగ్రంథాలే ప్రపంచంలో ప్రాచీనమైన గ్రంథాలు. ఇటువంటి ప్రాచీన గ్రంథాలల్లోని భాషకు, యూరోపిన్ భాషలతో సామ్యం వుండటం యూరోపియన్ జాతుల చరిత్రను ఇంకా వెనుకకు నెట్టగలిగింది. యూరోపియన్లలో ముఖ్యంగా జర్మనీదేశంలోని వారికిది నూతనోత్సాహాన్ని నూతన జాతీయస్పృహను కలిగించింది. జర్మనీదేశంలో ఈ ఆలోచనా విధానం ఇంక కాస్త ముందుకుపోయి ఆర్యజాతి "సూపర్‌రేస్" అని మిగతావాళ్ళు ఎందుకూ పనికిరానివారనే విపరీతమైన భావాలు బయలుదేరినవి. హిట్లర్ ఇటువంటి ఆలోచనావిధానానికి ప్రోత్సాహాన్నిచ్చి యూదులు మరణకాండను నడిపాడు, రెండవ ప్రపంచయుద్ధానికి బాటలువేసాడు.

పాశ్చాత్యులకు సంస్కృతం మీద అభిరుచి క్రీ.శ. 17 వ శతాబ్దం ఉత్తరార్ధంలో ఆరంభమైంది. క్రీ.శ. 1651లో అబ్రహం రాజర్ భర్తృహరి శ్లోకాలను డచ్ భాషలోకి అనువదించాడు. క్రీ.శ. 1650 లో హైనిరిచ్ రోథ్, క్రీ.శ. 1732లో జర్మన్ జసూట్‌ఫాదర్ యోహాన్ ఎర్నస్టు, హాంక్స్ లేడన్‌ల్లు సంస్కృతానికి వాక్యరణాలను వ్రాసారు. ఈ వ్యాకరణాలు తర్వాత పాశ్చాత్యులు వ్రాసిన వ్యాకరణాలకు ప్రాతిపదికగా- తోడ్పడినవి. వారన్‌హేస్టింగ్స్ కాలంలో " వివిధార్ణవసేతు" అనే న్యాయశాస్త్రగ్రంథం "ఏనోట్ ఆఫ్ జెంటూ లా" అనే పేరుతో క్రీ.శ. 1776లో ఇంగ్లీషులోకి అనువదింపబడి ప్రచురితమైంది. మొదట క్రైస్తవ ఫాదరీలు మరియు బ్రిటిష్ పరిపాలనలో వున్న హిందువుల తగువు తగాదాలను తీర్చేందుకై నియమింపబడిన ఇంగ్లీషు న్యాయవాదులు సంస్కృత భాషను అభ్యసించారు. తర్వాత చార్లెస్ విల్కిన్స్ భగవద్గీత, హితోపదేశాలను, మహాభారతంలోని శకుంతల కథను ఇంగ్లీషులోకి అనువదించాడు. క్రీ.శ. 18వ శతాబ్దం ఉత్తరార్ధం నుంచి సంస్కృత భాష అన్నా సాహిత్యమన్నా ఆంగ్లేయులు అభిరుచిని చూపటం ప్రారంభించారు. ఈ అభిరుచి సర్ విలియం జోన్స్‌తో ఆరంభమైందని చెప్పాలి. ఈయన ద్వారానే సంస్కృతభాష అంటే పాశ్చాత్యులకు ముఖ్యంగా ఆంగ్లేయులకు కుతూహలాభిరుచులు కలిగినవి. అంతవరకు పాశ్చాత్యుల చేత మన్ననలను అందుకొని, ప్రాచీన మానవ బుద్ధి వైభవానికి ప్రతీకగా నిల్చిన గ్రీక్ లాటిన్ భాషల కన్న సంస్కృతభాష సుసంపన్నమైందని, సుపరిష్కృతమైందని జోన్స్ తెలుసుకున్నాడు. ఆయన అంతకు ముందే గ్రీక్, లాటిన్, పర్షియన్ భాషలచేత పరిచితుడు. ఈ భాషల నిర్మాణానికి సంస్కృత భాషా నిర్మాణానికి చాల పోలికలున్నవని ఆయన

బయటపెట్టి పాశ్చాత్యుల కుతూహలాన్ని రేకేత్తించాడు. సర్ విలియం జోన్స్ క్రీ.శ. 1778లో కాళిదాసు శాకుంతలాన్ని అనువదించాడు. ఈ ఆంగ్లానువాదం ఆధారంగానే జార్జ్ ఫోర్స్టర్ క్రీ.శ. 1791లో జర్మన్ అనువాదాన్ని చేసాడు. ఈ జర్మన్ అనువాదాన్ని చదివిన గొయిటె వంటి జర్మన్ మహాకవులకు భారతీయ సాహిత్యం మీద గౌరవాభిమానాలు ఏర్పడినవి. విలియం జోన్స్ క్రీ.శ. 1792 లో కాళిదాసు ఋతుసంహారాన్ని అనువదించి ప్రచురించాడు. తర్వాత మనుస్మృతిని కూడ ఆయన అనువదించి ప్రచురించాడు. తర్వాత సంస్కృత భాషకు విశిష్టసేవను చేసినవాడు హెన్రీథామస్ కోల్‌బ్రూక్. ఆయన హిందూ ధర్మగ్రంథాలను బాగా అధ్యయనం చేసి "A digest of Hindu law on contracts and succession" అనే గ్రంథాన్ని వ్రాయటమే కాకుండ అమరకోశం, అష్టాధ్యాయి, హితోపదేశం, కిరాతార్జునీయం వంటి గ్రంథాలను సంపాదీకరించి ప్రచురింపజేసాడు.

అలెగ్జాండర్ హామిల్టన్ భారతదేశంలో సంస్కృతాన్ని అభ్యసించి ఇంగ్లండుకు తిరిగి పోతూ పారిస్ నగరం చేరుకున్నాడు. క్రీ.శ. 1802లో ఆంగ్లేయులెవరు పారిస్ వదిలి వెళ్ళిపోరాదని నెపోలియన్ ఆజ్ఞప్రకారం హామిల్టన్ అక్కడే చిక్కుకొని పోయాడు. ఆ కాలంలో హామిల్టన్ పారిస్‌లో యూరోపియన్ విద్యార్థులకు సంస్కృతాన్ని నేర్పాడు. ఇది యూరోపియన్లకు సంస్కృతాన్ని నేర్చుకునే అమూల్యావకాశాన్ని కలిగించింది. హామిల్టన్ దగ్గర సంస్కృతాన్ని నేర్చుకొన్న వారిలో జర్మన్ దేశీయుడు ఫ్రెడిరిక్ ఫన్ శ్లేగల్ వున్నాడు. ఆయన "On the language and wisdom of the Indians" అన్న గ్రంథాన్ని జర్మన్‌భాషలో రచించాడు. దానిలో ఆయన రామాయణ, భగవద్గీత, మనుస్మృతుల్లో నుంచి అనువాదాలు చేసాడు. ఫ్రెడరిక్ సోదరుడు ఆగస్టు విల్‌హెల్మ్ ఫన్ శ్లేగల్ జర్మన్ భాషలో ప్రసిద్ధమైన కవి. ఆయన చేజీ అనే ఫ్రెంచ్ విద్వాంసుని దగ్గర సంస్కృతాన్ని అభ్యసించాడు. ఆయన ఇదివరకే గ్రీక్ లాటిన్ భాషల్లో పండితుడు. షేక్స్పియర్ నాటకాలను జర్మన్‌భాషలోకి ఆయన అనువదించాడు. ఏభయ్యోపడిలో సంస్కృతాన్ని నేర్చుకొని తత్సాహిత్యాధ్యయనంలోనే కాలాన్ని గడిపాడు. ఆగస్టు విల్‌హెలెమ్ ఎన్నో సంస్కృత గ్రంథాలను సంస్కరించి జర్మన్ భాషానువాదాలతో ప్రచురించాడు. ఈయన కాళిదాసు సాహిత్యంచేత బాగా ప్రభావితుడైనాడు. చేజీ మరొకవిద్యార్థి ఫ్రాన్స్ బోప్. విల్‌హెలెమ్ 'ఇండోలాజీ'కి పునాది వేసినవాడు కాగా బోప్ తులనాత్మక భాషాధ్యయనానికి ఆద్యుడని చెప్పాలి. బోప్ "conjugation system" అన్న పుస్తకాన్ని వ్రాసాడు. మరియు ఆయన రామాయణ, మహాభారతాలల్లోని భాగాలను అనువదించి ప్రచురించాడు. ఆయన వ్రాసిన సంస్కృతవ్యాకరణ గ్రంథాలు తర్వాత జర్మన్‌దేశీయులు సంస్కృతాన్ని అభ్యసించటానికి చాల తోడ్పడినవి. విలాహెల్మ్ ఫన్‌హుంబోల్టు ప్రష్యన్ రాజ్యంలో సాంస్కృతిక మంత్రిగా

వుండేవాడు. ఆయన గొప్ప పండితుడు. బాస్క్, అజెటెక్, పాతజావా భాషలను ఆయన నేర్చుకొన్నాడు. ఆయనను భారతీయ తత్త్వశాస్త్రాలు చాల ఆకర్షించినవి. భగవద్గీత ఆయనను బాగా ప్రభావితం చేసింది. ఫ్రెడరిక్ రుకెర్ట్, ఫి.ఫన్ బ్యోలెన్ మొదలైన వారు కవితాహృదయం కలవారు. వారు సంస్కృత కావ్యాలంటే అభిరుచిని చూపారు. క్రీ.శ. 1829లో ఫ్రాన్స్‌బోప్ మహాభారతంలోని నలదమయంతుల కథను జర్మన్ భాషలోకి అనువదించాడు. ఏ. హోల్స్‌మన్ క్రీ.శ. 1845-47 నడుమ మహాభారత కథల నెన్నిటినో అనువాదం చేసాడు. ఇతని సోదరుని కుమారుడు ఆడాల్ఫ్ హోల్ట్‌మన్ మహాభారత కథను, దాని కర్త, రచనా కాలాన్ని గూర్చి చాల పరిశోధన చేసాడు. జె. దాల్‌మన్; పాల్‌దయస్సన్, ఆర్. గార్బే మొదలైనవారు మహాభారతం లోని ధర్మ, దార్శనిక భాగాలను జర్మన్‌భాషలోకి అనువాదం చేసారు. హెచ్. ఓల్డెన్‌బెర్గ్ మహాభారత స్వరూపాన్ని, రచనాకాలాన్ని గూర్చి క్రీ.శ. 1922లో పరిశోధన చేసి గ్రంథాన్ని ప్రచురించాడు. ఆగస్టు విల్‌హెలెమ్ ఫన్ శ్లేగల్ రామాయణాన్ని సంస్కరించి లాటిన్‌లోకి అనువాదం చేసాడు కాని ఇది అసంపూర్ణంగా మిగిలి పోయింది. హెర్‌మన్ యాకోబి రామాయణ కథను, ఐతిహాసికతను గూర్చి చర్చిస్తూ క్రీ.శ. 1893లో "Ramayana Geschichte und Inhalt" అన్న పుస్తకాన్ని ప్రచురించాడు. పురాణాలను గూర్చి కూడ అధ్యయనం చేసినవారు వున్నారు. విలాహెలమ్ జాన్, హైన్రిచ్ చిమ్మర్. విల్లిబాల్డ్ కిర్ఫెల్ మొదలైనవారు పురాణ గ్రంథాల శాస్త్రీయ పరిశీలనకు పునాదులు వేసారు. సంస్కృత కథాసాహిత్యం కూడ పాశ్చాత్యులను బాగా ఆకర్షించింది. థియోడార్ బెన్ఫే పంచతంత్రాన్ని క్రీ.శ. 1859లో జర్మన్‌లోకి అనువాదం చేసాడు. అంతకుముందు క్రీ.శ. 1812-1822 నడుమ యాకోబ్, విల్‌హెల్మ్ గ్రిమ్ అనే సోదరులు జర్మన్ కథలను సేకరించి ప్రచురించివున్నారు. పంచతంత్ర కథల పరిచయం బెన్ఫే అనువాదంతో జర్మనీదేశీయులకు కలిగింది. అయితే యూరోపులో ప్రచారంలో వున్న కథలెన్నో భారత దేశంలోనే పుట్టి పర్షియా, మధ్య ఏషియాల మీదుగా యూరోపు చేరుకొన్నవని ఈ రెండుకథల పుస్తకాల తులనాత్మక పరిశీలనవల్ల తేలింది. హెర్‌మన్‌బ్రూక్ హౌజ్ క్రీ.శ. 1839లో కథాసరిత్సాగరంలోని భాగాలను అనువాదం చేశాడు. రిచర్డ్ శ్మిట్ శుకసప్తతి కథలను, తంత్రాఖ్యాయికను జర్మన్‌లోకి అనువాదం చేసాడు. హెర్టల్ పంచతంత్రాన్ని గూర్చి చాలయేండ్లు పరిశోధన చేసాడు. వివిధ ప్రాంతాలల్లో దొరికిన వివిధ పంచతంత్ర ప్రతులను పరిశీలించి పరిశోధనలు చేసాడు. తంత్రాఖ్యాయిక, హితోపదేశాలను జర్మన్ అనువాదంతో ప్రచురించాడు.

జర్మన్ జాతీయ కవి గొయిటే శాకుంతల అనువాదాన్ని చదివి అనుభవించిన దివ్యానందాన్ని కవిత్వంలో వెల్లడించిన వృత్తాంతం అందరికి సువిదితమే. అంతేగాక

గొయిటె తన సాహిత్య పిపాసువులైన స్నేహితులకు రామ సీత, హనుమంతులకు సంబంధించిన కథలను చెప్పేవాడట. ప్రసిద్ధ జర్మన్ సంగీతజ్ఞుడు బీతోఫెన్ తన నోటుబుక్కులో భగవద్గీత శ్లోకాలను వ్రాసుకొన్నాడట.

థియొడార్ అవుఫ్‌రెష్టు అన్న జర్మన్ పండితుడు Catalogus Catalogodum అన్న పేరుతో సంస్కృత కవుల కావ్యాల పట్టికలను తయారుచేసి క్రీ.శ. 1891, 1896, 1903 ల్లో ప్రచురించాడు. ఇది చాల మహత్త్వపూర్ణమైన గ్రంథం. లుడర్స్ సంస్కృతంలో గొప్ప పండితుడు. తన పాండిత్యంతో అందరిని ముగ్ధులను చేసేవాడు. ఎంతోమంది శిష్యులు ఆయనచేత ప్రేరేపితులైనారు. మోనియర్ విలియమ్స్ కూర్చిన "సంస్కృత-ఇంగ్లీషు డిక్షనరీ" నిఘంటు గ్రంథం కూర్పు ప్రశంసనీయమైంది. ఆటోఫెన్‌ట్వోట్‌లింక్, రుడాల్ఫ్ ఫన్ రోథ్‌లు క్రీ.శ. 1852-1875 నడుమ "సెంట్‌పీటర్స్‌బర్గు డిక్షనరీ"ని 7 భాగాలుగా ప్రచురించారు. ఇది పై నిఘంటువు కన్న విశాలమైంది. ఏ.బి. కీథ్ వైదిక, లౌకిక వాఙ్మయాల మీద అభిరుచిని చూపి కృషి చేసాడు. కీథ్, లుడర్స్‌లు నాటక సాహిత్యాన్ని గూర్చి కూడ చాల కృషి చేసారు. పాశ్చాత్య పండితులు ఉద్యోగ ధర్మంగా భారతదేశంలో నివసిస్తు సంస్కృతాధ్యయనం చేసి తత్ పునర్వికాసానికి తోడ్పడిన వారు చాలా మంది వున్నారు. జె.ఎ. ఫ్లీట్, విన్సెంట్ ఏ. స్మిత్, సర్ అలెగ్జాండర్ కన్నింగ్‌హామ్, సర్‌జాన్ హెచ్. మార్షల్, సర్ ఎమ్. ఏ. స్టైన్, సర్‌జార్జ్ గ్రియర్‌సన్ , జె. ఫెర్గూసన్ మొదలైనవారు ఇటువంటివారే. వీరిలో చాలామంది చరిత్ర, పురాతత్త్వ విషయాలల్లోను చాల కృషి చేసి కొత్త విషయాల నెన్నింటినో బయటపెట్టారు.

సంస్కృత భాషా సాహిత్యాల ఉద్ధరణ భారత ప్రజల పునరుజ్జీవన ఉద్యమానికి తోడ్పడిందనటంలో సందేహంలేదు. అదే విధంగా పాశ్చాత్యుల దృష్టి కోణంలోను ప్రాచీన భారతీయవిజ్ఞానం చాల మార్పును తెచ్చింది. వారి ఆధునికీకరణంలో అది చాల తోడ్పడింది. గ్రీక్, రోమ్, కొత్త టెస్టమెంట్‌ల విజ్ఞానంలోనే మునిగి తేలుతున్న పాశ్చాత్యులకు సంస్కృత భాషా సాహిత్యాలు కొత్త విజ్ఞానద్వారాలను తెరిచింది. మానవతావాదం వారికి ప్రాచీన భారతీయ వాఙ్మయంలోనే కనపడింది. దాని పరిచయంతో సంకుచితమైన వారి ఆలోచనావిధానాల ద్వారాలు తెరచుకొన్నవి. కొత్త విషయాలను, విజ్ఞానాన్నీ, ఆహ్వానించటం నేర్చుకున్నారు. ఇది వారి బుద్ధి వికాసానికి వైజ్ఞానిక వ్యాప్తికి బాటలు వేసిందనటంలో సందేహం లేదు.

# మహాభారతం

ప్రపంచ సాహిత్యంలోని ఐతిహాసిక కావ్యాలల్లో (Epics) మహాభారతం అతివిశాలమైంది. గ్రీకుభాషలోని ఇలియడ్, ఒడిస్సీ అన్న ఐతిహాసిక మహాకావ్యాలను రెండింటిని కలిపినా అవి మహాభారతం కన్న చిన్నవే. ప్రాచీన జర్మన్ భాషలోని నిబిలుంగెన్, పర్షియన్ భాషలోని షానామాలకన్న మహాభారతం విశాలమైందేకాక అతి ప్రాచీనమైంది. మహాభారతంలో లక్షకుపైగా శ్లోకాలున్నవి. బొంబాయి మహాభారత సంస్కరణ ప్రతిలో ఒక లక్ష మూడువేల ఐదువందల యాభై శ్లోకాలున్నవి. కలకత్తా సంస్కరణప్రతిలో ఒక లక్ష ఏడువేల నాలుగు వందల ఎనభై శ్లోకాలున్నవి. వీటిల్లో హరివంశం కూడ చేరివున్నది. ఇంతటి బృహద్రూపం ప్రపంచంలో మరే కావ్యానికి లేదు. మహాభారతానికి మొదట ఇయ్యబడిన పేరు "జయ" అని దానిలోని మంగళాచరణ శ్లోకమే చెప్తున్నది.

"నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్."

పాండవుల విజయగాథ దీనిలో చెప్పబడటంచేత మహాభారతానికి "జయ' ' అని నామకరణం చేయబడిందేమో! "జయ" ఇతిహాసానికి కొంతకాలం తర్వాత "భారత"మని పేరు ప్రచారంలోకి వచ్చింది. భరత వంశీయులైన కౌరవ పాండవుల కథ దీనిలో చెప్పబడటంచేత దీనికి భారతమనే పేరు కలిగింది. అదే కారణం ఆదిపర్వంలో చెప్పబడింది - "భరతానాం మహజ్జన్మ మహాభారత ముచ్యతే" (ఆది 62-39) " భరతానాం యతశ్చాయ మితిహాసో మహాద్భుతః" (ఆది 62-40) కాలక్రమంగా వివరణకొరకు అనేక నైతిక ఆఖ్యానాదులు, ధర్మోపదేశాలు మొదలైనవి చేర్చబడి భారతం విశాలకాయాన్ని సంతరించుకొన్నది. అప్పుడు దానికి "మహాభారత" మనే పేరు వచ్చింది. పాణిని (క్రీ.పూ. 5వ శ॥) అష్టాధ్యాయిలో భారత, మహాభారతాలను రెండింటిని గూర్చి ప్రసంగించటంచేత అప్పటికే భారతం మహాభారత రూపాన్ని ధరించిందని చెప్పటానికి వీలవుతున్నది. జయేతి హాసంలోని

8800 శ్లోకాలు భారతంలో 24000 శ్లోకాల వరకు పెరిగినవి. ఇక మహాభారతంలో లక్ష శ్లోకాలకు పైగా వున్నవి. దీన్ని బట్టి జయేతిహాసం కాల క్రమంగా ఎంతగా పెరిగిందో తెలుసుకోవచ్చు.

## మహాభారత రచయిత

జయేతిహాసాన్ని రచించింది వేదవ్యాసుడనటంలో ఏమి సందేహం లేదు. అతడు గ్రంథకర్తే కాక ప్రత్యక్షంగా కౌరవపాండవులకు బంధువు. వ్యాసుడు సత్యవతి, పరాశరులకు జన్మించినవాడు. సత్యవతి దాశరాజు కూతురు. ఆమెకు మత్స్యగంధి అని పేరు. పరాశరుడు ఆమె మత్స్యవాసనను పోగొట్టి సువాసన కలదానిగా చేసాడు. అప్పుడు ఆమెకు యోజనగంధి అని పేరు కలిగింది. ఆమెను తర్వాత కురురాజు శంతనుడు వివాహమాడాడు. అప్పుడు ఆమె పేరు సత్యవతి అయింది. పరాశరుడు గొప్ప ఋషి. ఆ ఋషికి సత్యవతికి వ్యాసుడు ఒక ద్వీపంలో జన్మించాడు. అందుకే అతనికి "ద్వైపాయను" డని పేరు. 'కృష్ణ' అన్నది అతని అసలు పేరు. వేదవిభజన చేయటం చేత అతనికి " వేదావ్యాసు" డని పేరు వచ్చింది. వ్యాసుడు సద్యోగర్భంలో పుట్టినవాడు. పుట్టుకతోనే పండితుడు. కావ్యంలోని సంఘటనలను వ్యాసుడు ప్రత్యక్షంగా చూచినవాడు. మహాభారతంలో అనేక సందర్భాలల్లో అతడు రంగస్థలంపైకి ప్రవేశిస్తాడు. పాండవులు అరణ్యావాసం చేస్తున్నప్పుడు వ్యాసుడు వారి దగ్గరికి పోయి ఉపదేశం చేసి వారిని ఆశ్వస్తులను చేస్తాడు. పాశుపత ప్రాప్తికై ఉపాయాన్ని చెప్తాడు. దుర్యోధనునికి యుద్ధం చేయవద్దని నచ్చచెప్తాడు. కురుక్షేత్ర యుద్ధ సమయంలోను వ్యాసుడు చాలసార్లు కనిపిస్తాడు. యుద్ధానంతరం ధర్మరాజుకు వ్యాసుడు ఆశ్వాసనమిచ్చి అతన్ని శరీరత్యాగ ప్రయత్నం నుంచి మరలించి, రాజోచిత కర్తవ్య పాలనను బోధిస్తాడు. వ్యాసుని తపః ప్రభావం చేత కురుక్షేత్ర యుద్ధంలో మరణించిన కౌరవ పాండవ వీరులు గంగాజలాలల్లో కనిపిస్తారు. కృష్ణ ద్వైపాయనుడని పేరుగల వేద వ్యాసుని చేత వ్రాయబడటం చేత మహాభారతానికి "కార్ష్ణవేద" మని కూడ పేరు.

అక్షుద్రాన్ దాన శీలాంశ్చ సత్య శీలా నథాస్తికాన్
కార్ష్ణం వేదమిమం విద్వాన్ శ్రావయిత్వార్థమశ్నుతే

అది 61-18

సమస్త వేదోపనిషత్తుల జ్ఞానరహస్యాలను, సమస్త శాస్త్రసారాన్ని ఈ మహాకావ్యంలో గుప్త పరిచానని వ్యాసుడే స్వయంగా బ్రహ్మతో ఇట్లా అంటాడు-

బ్రహ్మన్ ! వేద రహస్యంచ యచ్చాన్యత్ స్థాపితం మయా
సాంగోపనిషదాం చైవ వేదానాం విస్తర క్రియా. అది 1-62

అంతేగాక ఇతిహాస పురాణాలను మథించి వాటి సారాన్ని దీనిలో పొందు పరచాడట! భూత వర్తమాన భవిష్యత్తుల వర్ణనలు కూడ దీనిలో వున్నవట!

ఇతిహాస పురాణానా మున్మేషం నిర్మితం చ యత్
భూతం భవ్యం భవిష్యం చ త్రివిధం కాలసంజ్ఞితమ్. ఆది 1-63

మహాభారతంలో ప్రధానంగా కౌరవ పాండవుల చరిత్ర వున్నా సందర్భానుకూలంగా దేవతల, మహర్షుల, చక్రవర్తుల, మనువుల, గంధర్వ, రాక్షసుల చరిత్రలు కూర్చబడినవి. ధర్మ స్వరూప దర్శనం దీనిలో చేయబడింది. పుణ్య క్షేత్రాల, వన పర్వత నదుల, సముద్రాల మాహాత్మ్య ప్రతిపాదన కూడ దీనిలో వున్నది. అందుకే మహాభారతమొక జ్ఞాన భాండాగారం వంటిది. అది ఒక విశ్వకోశం వంటిది. విజ్ఞాన సర్వస్వం వంటిది.

యథా సముద్రో భగవాన్ యథా మేరుర్మహా గిరిః
ఉభేఖ్యాతే రత్ననిధీ తథాభారత ముచ్చతే. ఆది 62-48

## మహాభారత రచనా కాలం

మూల మహాభారతాన్ని వ్యాసుడు ఎప్పుడు రచించాడన్న విషయాన్ని నిర్ణయించి చెప్పటం కష్టం. అందులో ప్రక్షిప్త భాగాల కాల నిర్ణయాన్ని చేయటం ఇంకా దుస్సాధ్యమైన పని. మహాభారతంలో కనిపించే రాజుల, వంశాల, కొందరు వ్యక్తుల పేర్లు, కథలు వేదకాలంలో ప్రసిద్ధికెక్కినవి వున్నవి కాని అంతమాత్రాన మహాభారతం వేదకాలానికి సంబంధించిందని చెప్పటానికి వీల్లేదని వింటర్‌నిట్స్ అభిప్రాయం. భాషాదృష్టితో పరిశీలిస్తే మహాభారతం వైదిక సాహిత్య యుగానికి అర్వాచీన రచన అని చెప్పవచ్చును. మహాభారత కర్త వ్యాసుడు వేదాలను క్రమపద్ధతిలో విభజించి కూర్పు చేసినటువంటివాడు. ఈ కూర్పు బుక్కుల రచన జరిగిన చాలా కాలానికే జరిగి వుంటుంది. వేద వ్యాసుడు కౌరవ పాండవులకు సమకాలికుడు. కురుక్షేత్ర యుద్ధానంతరం కొద్ది కాలం తర్వాతనే వ్యాసుడు ఈ గాథను రచించి వుంటాడు. కాని కురుక్షేత్ర యుద్ధ కాల నిర్ణయంలోను విమర్శకులల్లో, చారిత్రకులల్లో చాల మతభేదాలున్నవి.

## మహాభారత యుద్ధకాలం

వాకాటకవంశానికి చెందిన సర్వసేనుడు (క్రీ.శ. 330-345) ప్రాకృత కావ్యం హరివిజయాన్ని హరివంశం ఆధారంగా రచించాడు. దీన్నిబట్టి మహాభారతం అనుబంధంతో సహా క్రీ.శ. 2వ శతాబ్దం నాటికి ఇప్పటి లక్ష శ్లోక పరివ్యాప్త రూపాన్ని ధరించిందని చెప్పవచ్చును. భాసుడు మహాభారత కథను తీసుకొని మధ్యమవ్యాయోగ, ఊరుభంగాది

నాటకాలను వ్రాసాడు. క్రీ.పూ. 5వ శతాబ్దం నాటి పాణిని నాటికి మహాభారతమున్నది (6-2-38). అశ్వలాయన గృహ్యాసూత్రంలో భారతం, మహాభారతం (3-4) రెండు పేర్లు పేర్కొనబడినవి. సాంఖ్యాయన శ్రౌతసూత్రంలో భారతయుద్ధ ప్రసక్తి ఉన్నది. యజుర్వేదానికి చెందిన కాఠక సంహితలో విచిత్ర వీర్య ధృతరాష్ట్రుల పేర్లున్నవి. ఛాందోగ్యోపనిషత్తులో దేవకీపుత్రుడు కృష్ణుడు పేర్కొనబడినాడు. వీటన్నిటినిబట్టి మహాభారత కథ దాదాపు క్రీ.పూ. 10 వ శతాబ్దానికి పూర్వమే జరిగిందని తెలుస్తున్నది. క్రీ.శ. 634 నాటిదైన రెండవ పులకేశి ఐహోళెశాసనంలో భారతయుద్ధ ప్రసక్తి వున్నది.

త్రింశత్సుత్రి సహస్రేషు భారతాహవాదితః
సప్తాబ్దశతయుక్తేషు గత్వేషబ్దేషు పంచసు
పంచాశత్సు కలౌకాలే షట్సు పంచశతాసు చ
సమాసు సమతీతాసు శకానామపి భూభుజామ్. 33, 34 శ్లోకాలు

క్రీ.శ. 634 నాటికి మహాభారతయుద్ధం జరిగి 3735 సంవత్సరాలు అయిందట. అంటే అప్పుడు మహాభారతయుద్ధం 3735-634 = 3101 క్రీస్తుపూర్వం నాడు జరిగిందని తేలుతున్నది. మహాభారతంలోని అంతస్సాక్ష్యాలను బట్టి ముఖ్యంగా నక్షత్రస్థానాలను బట్టి భారతయుద్ధకాలాన్ని నిర్ణయించటానికి కొందరు ప్రయత్నించారు. భారత యుద్ధారంభ సమయంలో గ్రహాలన్నీ అశ్వినీ నక్షత్రానికి దగ్గరగా ఉన్నట్లు మహాభారతంలో చెప్పబడిందని, ఇటువంటి నక్షత్రస్థితి క్రీస్తుపూర్వం 3101 ప్రాంతంలోనే సంభవించిందని పండితుల అభిప్రాయం. చంద్రగుప్తుని అస్థానంలో ఉన్న గ్రీకు రాయబారి మెగస్థనీసు హెరక్లిస్ అంటే శ్రీకృష్ణుడు సంద్రకొట్టస్ అంటే చంద్రగుప్తునికి 138 తరాల క్రిందవాడని పేర్కొన్నాడు. తరానికి 20 సంవత్సరాలు వేసుకొన్న శ్రీకృష్ణుని సమయం క్రీ.పూ. 3080 అవుతుంది. వరాహమిహిర, కల్హణుల మతానుసారంగా భారతయుద్ధం క్రీ.పూ. 2449 నాడు అయింది. ఆర్యభటానుసారంగా క్రీ.పూ. 3102.

భారత రచన క్రీ.పూ. 3100లో జరిగిందని, క్రీ.పూ. 2000 వరకు సౌతి మొదలైన వారిచే అది మహాభారత రూపాన్ని ధరించిందని సి.వి. వైద్య అభిప్రాయం. బాలగంగాధరతిలక్ అభిప్రాయానుసారం - మహాభారత రచన క్రీ.పూ. 5000 వరకు వెళ్ళింది. కాని పాశ్చాత్యులు మహాభారతానికి ఇంత ప్రాచీనతను ఇయ్యటానికి అంగీకరించలేదు. మహాభారతం జయేతిహాస రూపంగా కూడ వైదిక యుగంలో లేదని వారి నిశ్చితాభిప్రాయం. కాబట్టి భారతీయ సంప్రదాయానుసారం కలియుగ గణన క్రీ.పూ. 3102లో ఆరంభమైనది.

ఆ ప్రాంతంలోనే అంటె అంతకు కొద్దికాలంముందే భారత యుద్ధం జరిగిందని శ్రీకృష్ణుని నిర్యాణంతో ద్వాపరయుగమంతమై కలియుగారంభం జరిగిందని భారతీయ సాంప్రదాయం. దీన్ని పాశ్చాత్యులుగాని, కొందరు భారతీయ విమర్శకులు గాని అంగీకరించటంలేదు. మహాభారతంలో యవన. మ్లేచ్ఛులు చెప్పబడటంచేత అలెగ్జాండరు (క్రీ.పూ. 4వ శ॥) దండయాత్రతోనే భారతీయులకు యవనులతో సంపర్కం కలిగిందని భారతరచన ఆ తర్వాత జరిగిందని కొందరు పాశ్చాత్య విమర్శకులు ఊహ చేసారు. యవనమ్లేచ్ఛులు తర్వాత ప్రక్షిప్తమైన జాతిపేర్లు కావచ్చునని మరికొందరు పాశ్చాత్య విమర్శకులు ఈ వాదాన్ని నిరాకరించారు. మహాభారతంగాని భారతంగాని జయేతిహాసంగాని వైదిక యుగంలో లేకున్నా కొన్ని గాథలు ఆ కాలానికి చెందినవి. దీనిలో పేర్కొన్న కొందరు రాజులు వేదాలల్లో పేర్కొనబడినారని వింటర్‌నిట్స్ అభిప్రాయం. మహాభారతంలోని కథలు కొన్ని రూపాంతరం చెంది బౌద్ధ జైన సాహిత్యంలో చేరినవి. క్రీస్తుపూర్వం 6వ శతాబ్దానికి పూర్వమే దీని రచన జరిగింది కాని అంతగా ప్రచారం పొందలేదని వింటర్‌నిట్స్ అభిప్రాయం. పురాణాలనుబట్టి యుధిష్ఠరునికి చంద్రగుప్తమౌర్యునికి నడుమ 36 తరాలు గడిచినవి. తరానికి 20 ఏండ్లుతీసుకొన్న 36×20 = 720 ఏండ్లు. చంద్రగుప్తుని కాలం క్రీ.పూ. 322 ప్రాంతం. అప్పుడు 322+720 = 1042 క్రీ.పూ. భారత యుద్ధకాలమని తేలుతున్నది. సాంఖ్యాయన శ్రౌతసూత్రంతో భారత యుద్ధ ప్రసక్తి వున్నది. కాబట్టి సూత్రగ్రంథాల రచనాకాలానికి పూర్వమే భారత రచన జరిగిందని చెప్పాలి. ఇది దాదాపు క్రీ.పూ. 11, 12 శతాబ్దాలని చెప్పవచ్చును. ఈ లెక్క పురాణాల లెక్కకు సరిపోతున్నది. చారిత్రకులు, పురాతత్త్వవేత్తలు మహాభారతకథ ఇనుపయుగానికి చెందిందని అందుచేత భారతయుద్ధం క్రీ.పూ. 1200-1000 ప్రాంతంలో జరిగివుంటుందని అభిప్రాయపడ్తున్నారు. వీరి గణన పురాణాలు చెప్పిన కాలానికి దాదాపుగా సరిపోతున్నది. కాబట్టి కేవలం ఉహలకు తావీయకుండ చారిత్రకుల గణనను మాత్రమే తీసుకుంటె మహాభారత యుద్ధకాలం క్రీ.పూ. 1200-1100 నడుమ జరిగిందని, వ్యాసుడు దాదాపుగా అదే సమయంలో మహాభారత కావ్యాన్ని రచించాడని అంగీకరించవలసి వుంటుంది. క్రీ.శ. 7వ శ॥ నాటికి అంటే బాణుని కాలంలో మహాభారతం దేవాలయాలల్లో పవిత్ర గ్రంథంగా పరిగణింపబడసాగిందని తెలుస్తున్నది. క్రీ.శ. 500 నాటికి మహాభారతం పవిత్ర గ్రంథంగా పరిగణింపబడసాగిందని దానికి శాసనాధారాలున్నవని వింటర్ నిట్స్ చెప్పాడు. క్రీ.శ. 700 ప్రాంతంవాడైన కుమారిలుడు మహాభారతాన్ని అధికారగ్రంథంగా ఉద్ధరణలు కూడా ఇచ్చాడు. అప్పటికే అది స్మృతిగ్రంథంగా గౌరవాన్ని పొందసాగింది.

## మహాభారతకథ సత్యకథేనా?

మహాభారతకథ నిజంగా జరిగిందా లేక కవి కల్పితమా అన్న విషయంలో పండితులల్లో అభిప్రాయ భేదాలున్నవి. మహాభారతంలో పాండవులు ఇంద్రాదుల వంటి దేవతల కుమారుల కావటం, ఇంకా అనేక దివ్యసంఘనటలు దానిలో వుండటంచేత మహాభారత కథ చారిత్రక సంఘటనకాదని కొందరంటారు, ఇలియడ్‌వంటి గ్రీకు మహాకావ్యంలోను దేవతలు పాల్గొనే ఘట్టాలు, అతిమానుష సంఘటనలున్నవి. అయినా ఇలియడ్‌లో వర్ణింపబడిన ట్రాయ్ యుద్ధం నిజంగా జరిగిందని, అది చారిత్రక సత్యమని ఋజువైంది. హోమర్‌చేత వర్ణింపబడిన ట్రాయ్‌యుద్ధం కవిమాత్ర కల్పనకాక సత్యసంఘటనకాగా వ్యాసవర్ణితమైన కురుక్షేత్రయుద్ధం కవిమాత్రకల్పనగా తోసిపుచ్చటానికి వీల్లేదు. వ్యాసుడు స్వయంగా తన కృతిని “ఇతిహాసం”గా చెప్పుకున్నాడు. “ఇతి హాస” (ఈ విధంగా జరిగింది) అని ఇతిహాసానికి అర్థం. జరిగిన సంఘటనలను గ్రంథస్థం చేయటమే ఇతిహాసం యొక్క లక్ష్యం. అటువంటప్పుడు భారతకథను కేవలం కల్పనామాత్రంగా చెప్పటానికి వీల్లేదు.

మహాభారతకథ కేవలం కవికల్పిత కావ్యంగా భారతీయ సంప్రదాయం ఎప్పుడు అంగీకరించలేదు. ఈ కథ, కథలోవచ్చే వ్యక్తులు, సంఘటనలు సంహిత, సూత్ర, వ్యాకరణాది గ్రంథాలల్లో పేర్కొనబడి లభిస్తున్నవి. యజుర్వేదానికి చెందిన కాఠకసంహితలో విచిత్రవీర్య, ధృతరాష్ట్రుల పేర్లు పేర్కొనబడినవి. అథర్వవేదంలో పరీక్షిత్తు రాజ్యపరిపాలన ప్రసక్తివున్నది. కాని ఆ వ్యక్తులు మహాభారతానికి సంబంధించినవారే అని గట్టిగా చెప్పలేము. ఛాందోగ్యోనిషత్తులో దేవకీపుత్రుడైన కృష్ణుడు పేర్కొనబడినాడు. సాంఖ్యాయన శ్రౌతసూత్రంలో కురుక్షేత్రయుద్ధం, దానిలో కౌరవులు నశించినట్లుగా చెప్పబడింది. అశ్వలాయన గృహ్యసూత్రంలో “భారత, మహాభారతా” లు గ్రంథంగా పేర్కొనబడినవి. పాణిని యుధిష్ఠర, భీమ, విదుర పేర్లనుగూర్చి చర్చించాడు. “మహాభారత” మన్న సమాసాన్ని గూర్చి వివరించాడు. (6-2-38). పాణిని పేర్కొన్న “శిశుక్రందీయ” మన్న ఉపాఖ్యానం బాలుడైన శ్రీకృష్ణునికి సంబంధించిందిగా కన్పిస్తున్నది. అర్థశాస్త్రకారుడు కౌటిల్యుడు దుర్యోధునుడు ఇతరుల రాజ్యాన్ని కబళించటంచేత వినాశాన్ని పొందాడని చెప్పాడు. పతంజలి భీమ నకుల సహదేవులను పేర్కొన్నాడు. కౌరవ పాండవుల నడుమ జరిగిన యుద్ధాన్ని గూర్చి ప్రసంగించాడు. ఇంకా అతడు పేర్కొన్న “కంసవధ” అన్న నాటకం కృష్ణునికి సంబంధించిందని పేరునిబట్టి స్పష్టంగా చెప్పవచ్చును. మహాభారత యుద్ధం చారిత్రక సత్యమేనని బౌద్ధ జైన సంప్రదాయాలు అంగీకరిస్తున్నవి. జైన సంప్రదాయానుసారంగా 22వ తీర్థంకరుడు నేమినాథుడు శ్రీకృష్ణునికి చిన్నాయన కొడుకు.

బౌద్ధసాహిత్యంలో కురుజనపదం కీర్తింపబడింది. కురుదమ్మ జాతక కథ కురుప్రజల శీలాన్ని పొగడ్తున్నది.

భారత కథలోని కురుక్షేత్రప్రాంతం కురుజనపదంగా ప్రసిద్ధమైంది. చాల ప్రాచీనమైంది. వేదాలల్లో కురుజనపదం చాలసార్లు పేర్కొనబడింది. పాండవుల ప్రసక్తి మాత్రం మనకు ఎక్కడా వేదాలల్లో కనిపించదు. కురుజనపదంతోపాటు పాంచాల జనపదం సంహితాదుల్లో చెప్పబడుతూ వుంటుంది. ఈ రెండు "కురు పాంచాల జనపదం' ' గా పేర్కొనబడినవి. ఈ రెండు జనపదాలు కలిసి ఒక్క గణసంఘం (Confederation) గా ఏర్పడి వుండేవి. ఏ కారణం చేతనో ఈ రెండు జనపదాల నడుమ యుద్ధం చెలరేగిందని ఆ వైరకథయే మహాభారత మూలరూపమని సి. లాస్సన్, ఏ. వేబర్, మాక్‌డొనెల్ వంటివారు అభిప్రాయపడినారు. భారత కథ కురుపాంచాలుర మధ్య జరిగిన ఒకానొక చిన్న యుద్ధమై వుంటుందని అదే రానురాను మహాకథగా పెంచబడిందని, ద్వంద్వయుద్ధం మాత్రం చేతనే జాతుల చరిత్ర గతి నిర్ణయింపబడే కాలంలో కోట్లకొలది సైన్యం పాల్గొని 18 రోజులు యుద్ధం చేసినారనటం అసంభవమని హెచ్.డి. సంకాలియా అభిప్రాయం. మహాభారత కథ ఆరంభంలో ద్రోణాచార్యుడు ద్రుపదుని మీద ప్రతీకారం తీర్చుకోవాలనుకోవటం, కురుపాండవులకతడు అస్త్రవిద్యా గురువుగా వుండి గురు దక్షిణగా ద్రుపదుని బంధించి తెమ్మనటం, ద్రుపదుని కూతురు ద్రౌపది వివాహం, ద్రౌపది పాత్ర ప్రాధాన్యం మొదలైన ఘట్టాలు పై విమర్శకుల, చారిత్రకుల అభిప్రాయాలను బలపరుస్తున్నాయేమో చెప్పలేము.

## మహాభారత కథ ప్రతీకాత్మకమా?

జె. దాల్‌మన్, ఏ. లుద్విగ్‌వంటివారు మహాభారత కథ ధర్మాధర్మాల, చీకటి వెలుగుల నడుమ జరిగిన సంఘర్షణకు ప్రతీక అని భావించారు. హెచ్. ఓల్డన్‌బెర్గ్ అభిప్రాయంలో మహాభారత మూలకథలో కృష్ణపాత్ర లేదు. కృష్ణుని పూజ, ప్రాధాన్యాలు హెచ్చింతర్వాత ఆ పాత్ర కథలో చొప్పింపబడి, మూలకావ్యం పెంచబడిందని అతని అభిప్రాయం. కాని ఇప్పుడు మనం కృష్ణుడు లేని మహాభారతాన్ని ఊహించలేము. కౌరవులు రాక్షసాంశసంభూతులు పాండవులు ఇంద్రాది దేవతలకు పుట్టినవారు. దీన్ని బట్టి కౌరవులు విజాతీయులైతే పంచ పాండవులు ప్రముఖమైన ఐదు భారతీయ రాజవంశాలకు ప్రతీకలు కావచ్చును. విజాతీయుల నెదిరించటానికై శ్రీకృష్ణుడు భారతీయ రాజులను సంఘటిత పరిచాడేమో! ఇక ద్రౌపది సామ్రాజ్యలక్ష్మికి ప్రతీక. మహాభారతంలో ద్రౌపది పంచభర్తృక ఎట్లా అయిందో వివరించే కథలో ఆమె సామ్రాజ్యలక్ష్మిగాను, పంచపాండవులు ఐదుగురు ఇంద్రులుగాను చెప్పబడినారు కూడ.

# మహాభారత బృహద్రూపం

మహాభారత మూలకావ్యమైన జయేతిహాసం వేదాలల్లోని "నారాశంసి" రూపానికి దగ్గరగా వుండి తర్వాత బృహద్రూపాన్ని ధరించిందని విమర్శకుల అభిప్రాయం. హోమర్ రచించిన ఇలియడ్, ఒడిస్సీ అనే గ్రీకు మహాకావ్యాలను రెండింటిని కలిపినా మహాభారతం వాటికన్నా ఎనిమిదంతలు పెద్దది. గ్రీకుభాషలోని ఇలియడ్, జర్మన్ భాషలోని "నిబిలుంగెన్' ' మరణాంత గాథవంటిదే మహాభారతవీరుల కథ అని వింటర్‌నిట్స్ అభిప్రాయం. ఒక పక్షానికి విజయం లభించినా సర్వవినాశం మధ్య ఆ విజయం వారికి సుఖశాంతులను ఇయ్యలేక పోయింది.

వేదవ్యాసప్రోక్తమైన జయేతిహాసకావ్యం మహాభారతం యొక్క మూలరూపం-మొదటి సంస్కరణ అని చెప్పవచ్చును. దీన్ని అతడు తన నలుగురు శిష్యులు పైల, సుమంత, జైమిని, వైశంపాయమలకు మరియు తన కొడుకు శుకునికి చెప్పాడు. వారు తర్వాత దాన్ని నలుమూలల వ్యాపింపజేసారు. వారిలో జైమిని, వైశంపాయనప్రోక్తమైన మహాభారతాలు ఇప్పుడు మనకు దొరుకుతున్నవి. వాటిల్లో జైమిని మహాభారతంలో అశ్వమేధపర్వం మాత్రమే దొరుకుతున్నది. ఈ లబ్ధపర్వాన్నే వైశంపాయనుని కథతో పోలిస్తే కథా సంవిధానంలో చాల భేదం కన్పిస్తున్నది. అటువంటప్పుడు మూలగ్రంథం నలుగురు శిష్యుల చేతుల్లోనే చాల రూపం మారిందని ఊహించవచ్చును. అర్జునుని ప్రపౌత్రుడు జనమేజయుడు సర్పయాగం చేసాడు. ఆ యాగానికి వేదవ్యాసుడుకూడ వచ్చాడు. అప్పుడు జనమేజయుడు కౌరవ పాండవుల కథను వినిపించమని వేదవ్యాసుణ్ణి కోరాడు.

కురూణాం పాండవానాంచ యథాభేదోz భవత్ పురా
తదస్మై సర్వమాచక్ష్వ యన్మత్తః శ్రుతవానసి

ఆది 60-22

"వైశంపాయన! కౌరవ పాండవుల కథను నా ద్వారా నీవు వినివున్నావు కదా. ఇప్పుడు దాన్ని జనమేజయునికి వినిపించు" అని వేదవ్యాసుడు ఆ కథాశ్రవణ భారాన్ని వైశంపాయనునికి అప్పగించాడు.

వైశంపాయనుడు కథను వినిపించేటప్పుడు జనమేజయునికి కొన్ని సందేహాలు కలిగినవి. వైశంపాయనుడు ఆ సందేహ నివృత్తి చేసిన భాగాలు కూడ ఆ కావ్యంలో చేరినవి. అంటే వైశంపాయనునిచేత చెప్పబడిన భారత కథ మహాభారతం యొక్క రెండవ సంస్కరణరూపమని చెప్పాలి. ఈ సమయంలోనే జయేతిహాసానికి భారతమని పేరు

కలిగిందేమో! జయేతిహాసంలో 8800 శ్లోకాలుండగా, భారతంలో 24000 వరకు పెరిగినవి. జనమేజయుని సర్పయాగ సమాప్తి తర్వాత కొంతకాలానికి నైమిశారణ్యంలో ద్వాదశ సంవత్సరాలవరకు సాగే యజ్ఞ మొకటి ఆరంభమైంది. ఆ యజ్ఞానికి అనేక మహర్షులు విచ్చేశారు. వారిలో రోమహర్షణుని కొడుకు సౌతి ఉగ్రశ్రవుడు కూడ వున్నాడు. ఈ సౌతి జనమేజయుని సర్పయాగ సందర్భంలో వైశంపాయనుడు చెప్పిన భారత కథను వినివున్నాడు. శౌనక మహర్షి ప్రార్థనను అంగీకరించి దాన్ని సౌతి మహర్షులకు వినిపించాడు. ఆ కథాశ్రవణ సందర్భంలో శ్రోతలకు కలిగిన అనుమానాలను తీర్చటానికై, తాను మంచి పౌరాణికుడు కావటంచేత అనేక అభిప్రాయాలను, వివరణలను, ఉపాఖ్యానాలను చేర్చివున్నాడు. ఇది మహాభారతం మూడవ సంస్కరణరూపం. వైశంపాయన, సౌతుల ఉపోద్ఘాతం, ప్రాక్కథనాలే మహాభారతం ఆదిపర్వంలో చాలా భాగాన్ని ఆక్రమించినవి. ఆదిపర్వం 63వ అధ్యాయంలో వున్న వ్యాసుని జన్మకథతోనో, 94వ అధ్యాయంలోని పురువంశ వర్ణనతోనో భారత కథ ఆరంభమైవుంటుందని సూక్ష్మ పరిశీలనచేత చెప్పవచ్చును. మహాభారతాన్ని 18 బృహత్పర్వాలుగా, తిరిగి పర్వాలను అధ్యాయాలుగా విభజించి ఇప్పుడున్న క్రమరూపాన్నిచ్చింది సౌతియే అని పండితుల అభిప్రాయం. ఇప్పుడున్న బృహద్రూప మహాభారతమంతా వైశంపాయన సౌతుల చేతుల్లోనే ఏర్పడి స్థిరపడిందనలేము. సౌతి తర్వాత కూడ అనేక ఉపాఖ్యానాలు, వ్యాఖ్యానాలు, ఉపదేశాలు దానిలో చేర్చబడినవి. క్రీ.పూ. 6వ శతాబ్దం తర్వాత బౌద్ధ జైన నీతి కథలు కూడ దీనిలో చోటు చేసుకున్నవని వింటర్‌నిట్స్ అభిప్రాయం. మహాభారతం విష్ణుపారమ్యాన్ని బోధించేదని, కాని తర్వాత తర్వాత మధ్య మధ్యలో శివసంబంధ కథలు కూడ చేర్చబడినవని కూడ అతని అభిప్రాయం. పాణిని నాటికి (క్రీ.పూ. 5వ శ॥) భారతానికి మహాభారతమనే పేరు కూడ వచ్చింది. అప్పటికే మహాభారతం యొక్క రూపం చాలా మట్టుకు స్థిరపడింది. మహాభారతంలో పేర్కొనబడిన యవనకాంభోజాదిజాతులు వారి నివాసాదులను గూర్చిన ప్రసక్తి బుద్ధుని జననానికి పూర్వమున్న పరిస్థితులకు దగ్గరగా వున్నది. కాబట్టి మహాభారతం పెరుగుదల చాలమట్టుకు బుద్ధుని జననానికి కించిత్పూర్వం అంటే క్రీ.పూ. 6వ శ॥ నాటికి జరిగిందని చెప్పవచ్చును. అయినా దాని పెరుగుదల మాత్రం ఆగలేదు. క్రీ.శ.2వ శతాబ్దం వరకు అనుబంధరూపంగా హరివంశం కూడా మహాభారతానికి చేర్చబడిందని నిశ్చితంగా చెప్పవచ్చును. క్రీ.పూ. 6 క్రీ.శ. 2 శతాబ్దాల నడుమ మహాభారతంలో ఆఖ్యానాలు, కథలే ఎక్కువ చేర్చబడినవి కాని రూపంలో ఎక్కువ గంభీరమైన మార్పులు జరుగలేదు. క్రీ.శ. 330-345 నడుమ పాలించిన వాకాటకరాజు సర్వసేనుడు హరివంశం ఆధారంగా హరివిజయమనే ప్రాకృతకావ్యాన్ని రచించాడు. అంటే క్రీ.శ. 330కి పూర్వమే హరివంశం సంస్కృతంలో వున్నదని చెప్పవలసి

వుంటుంది. అంటే కనీసం క్రీ.శ. 2 వ శతాబ్దం నాటికి హరివంశం రచన జరిగిందని నిర్ణయించవచ్చును. శ్రీకృష్ణభక్తులు శ్రీకృష్ణుని మహత్త్వాన్ని తెలిపే ఘట్టాలను చేర్చినట్లుగానే శివభక్తులు శివుని ప్రాధాన్యాన్ని తెలిపే ఘట్టాలను, కథలను మహాభారతంలో చేర్చారు. ద్రోణపర్వంలో అర్జునుడు కృష్ణుని సలహా ననుసరించి శివున్ని ధ్యానిస్తు సమాధిగతుడు కావటం, వన పర్వంలో అర్జునుడు శివున్ని మెప్పించి పాశుపతాస్త్రాన్ని పొందటం, సౌప్తిక పర్వంలో అశ్వత్థామ శివుని అనుగ్రహంతో ఖడ్గాన్ని పొందటం, కృష్ణుడు శివభక్తునిగా పేర్కొనబడటం, గదా పర్వంలో లింగపూజ మహిమాదులు చెప్పబడటం మొదలైనవెన్నో ఘట్టాలు శివసంబంధమైనవి వున్నవి. కృష్ణ, శివ ప్రాధాన్యాలను తెలిపే ఘట్టాలే కాక దేవి, కార్తికేయ, సూర్యాది దేవతల ప్రభావాలను తెలిపే కథలు మహాభారతంలో చేర్చబడినవి. భగవద్గీతలో ఉపనిషత్తుల సారం నిక్షిప్తమైంది. ఈ విధంగా మహాభారతం సర్వమతతత్త్వ అనుయాయులకు చదువదగిన గ్రంథంగా ఏర్పడి విస్తరించింది. మహాభారతం ఆదిపర్వం పౌష్యోపాఖ్యానాదుల్లో నగ్నక్షపణకుల ప్రసక్తి వున్నది. క్షపణకులని జైన సన్యాసులననే వారు. నగ్నక్షపణకులంటె నగ్నజైన సన్యాసులై వుంటారు. బౌద్ధ మత ప్రసక్తి మహాభారతంలో స్పష్టంగా లేకున్నా శాంతిపర్వంలో కొంతవరకు బౌద్ధ ధర్మ ప్రసక్తి అస్పష్టంగా వున్నది. ఈ భాగాలన్నీ బౌద్ధజైనమత వ్యాప్తి తర్వాత అనగా క్రీస్తుపూర్వం 6వ శతాబ్దం తర్వాత ప్రక్షిప్తాలని చెప్పవచ్చును. ఈ విధంగా మహాభారతం పెరిగి పెరిగి లక్ష శ్లోకాలతోకూడి బృహద్రూపాన్ని ధరించింది. ప్రధానంగా ఉత్తర, దక్షిణ భారతదేశాలల్లో మహాభారతం యొక్క విభిన్నమైన ప్రతులు దొరికినవి. వాటినిబట్టి అసలు మహాభారతంలో కొత్త విషయాలను చేర్చటం అనేది క్రీ.శ. 2వ శతాబ్దం తర్వాత కూడ పూర్తిగా ఆగలేదనే చెప్పవలసి వుంటుంది.

ప్రధానకథకు సంబంధంలేని ఆఖ్యానాలు, వృత్తాంతాలు కూడ మహాభారతంలో చేర్చబడినవి. ఉదా॥కు ఆదిపర్వంలోని పౌష్య, పౌలోమి ఆఖ్యానాలు, గదాపర్వంలో సరస్వతినది పుట్టుక, అది ప్రవహించే పుణ్య క్షేత్రాల వర్ణనలు, వనపర్వంలో 750 శ్లోకాలల్లో విస్తరించిన శ్రీరాముని కథ, భీష్మపర్వంలో భూప్రమాణ వివరణ, ద్రోణపర్వంలో త్రిపురాసురసంహారం ఇంకా ఎన్నో. ఇటువంటి ప్రక్షిప్తాలతో మహాభారతం పెరిగిపోయి తన కావ్యత్వాన్ని కోల్పోయింది. జయేతిహాసమన్న పేరునుబట్టి పాండవుల విజయంతోనే కథ ముగియవలసి వుండగా ఇంకా పాండవుల స్వర్గారోహణ వరకు కథ పెరిగింది. పాండవుల విజయంతో కథ ముగిసినట్లయితే భారతకథా రూపమే వేరుగా ఉండేది. అప్పుడు దానిలోని అంగి రసరూపమే మారివుండేది. ఇప్పటిలాగ శాంతరసం ప్రధానం కాక వీరరసం ప్రధానమై అంగిరసంగా వుండేది. కురుక్షేత్ర యుద్ధానంతరం పాండవుల దుఃఖం,

రాజ్యాన్ని పాలించినా వారిలో ఆవరించిన నిరాశా నిస్పృహ నిస్తబ్ధతలు, వారి మరణవృత్తాంతం పాఠకుల్లో ఒక విధమైన నిర్వేదాన్ని నింపుతున్నవి. శత్రువినాశం చేసిన పాండవుల తర్వాతి వృత్తాంతం నీరసమై, అధ్యాత్మిక జ్ఞానబోధనలతో నిండి వీరరసపోషకంగా లేదు. పాండవులు శత్రువులను వినాశం చేయటంతో పాఠకుల్లో నిండిన ఉత్సాహమనే స్థాయిభావం ఈ తర్వాతి వృత్తాంతాలవల్ల ప్రశమింపబడు తున్నది. యుద్ధంవల్ల కలిగిన దుష్ఫలితాలు అనేక రకాలుగా చిత్రింపబడటంచేత పాఠకుల్లో నిరీహత్వం లేక శమం లేక తృష్ణాక్షయమనే స్థాయిభావం నిలిచిపోతున్నది. ఒకవేళ పాండవుల శత్రువిజయంతో కథ ఆగిపోయినట్లయితే శత్రువినాశానికి, ధర్మకార్యసాధనకు పాఠకుల హృదయాలు ఉత్సాహపూర్ణమై వుండేవి. ఇప్పుడు అది సాధ్యంకాదు. పాండవులను గూర్చి జనమేజయుని జిజ్ఞాసే మహాభారతం పెరుగుదలకు కారణం కావచ్చును. చివరి పర్వాలల్లో అనేక ధర్మశాస్త్ర సంబంధ విషయాల సుదీర్ఘ వర్ణనలున్నవి. వీటిల్లో కొన్ని భాగాలు వైశంపాయన సౌతుల తర్వాత శ్రవణకుల జిజ్ఞాసను, సందేహాలను తీర్చటానికై పౌరాణికులచేత చేర్చబడినవి కావచ్చును. అంతేగాక మహాభారతంలో ఒకే వృత్తాంతం మళ్ళా మళ్ళా చెప్పబడటం కూడ జరిగింది. ఉదా॥కు ఆస్తీకుని కథ, పాండురాజు ఋషిని చంపేఘట్టం, కర్ణుని జన్మవృత్తాంతం, సృంజయుని కథ, అణిమాండవ్యుని కథ, ద్రోణద్రుపదుల వృత్తాంతం, కర్ణుని కుండలాలను ఇంద్రుడు గ్రహించటం, శ్యమంత పంచకవృత్తాంతం మొదలైనవి. ఇవేగాక కొన్ని అసంభవమైన వృత్తాంతాలు, శ్రోతల అభిరుచిననుసరించి పుట్టినవి మహాభారతంలో చోటు చేసుకొన్నవి. ఉదా॥కు వనపర్వంలో భీమాంజనేయుల కలయిక, యుద్ధం. ఇక మహాభారతంలో నాయకుడైన శ్రీకృష్ణునిబాల్యాది వృత్తాంతాలేవి మహాభారతంలో చెప్పబడలేదు. ఆ లోటును తీర్చటానికై హరివంశం ప్రత్యేకంగా వ్రాయబడి మహాభారతానికి అనుబంధంగా చేర్చబడింది. ఈ విధంగా అనేక ప్రక్షిప్తాలతో జయేతిహాసం బృహద్రూపాన్ని ధరించి మహాభారతంగా పరిణ మించింది. జయేతిహాసం తన మూలరూపాన్ని పూర్తిగా మార్చుకొన్నది. ఇప్పుడు ప్రక్షిప్తాలేవి, మూల వ్యాసరచన ఏది అని నిర్ణయించి కచ్చితంగా చెప్పటం సాధ్యం కాదు.

## మహాభారత వస్తువైశిష్ట్యం

మహాభారతంలో భరతవంశానికి చెందిన కౌరవపాండవుల కథ ప్రధానంగా వున్నది. ఈ ప్రధానకథ కాక నీతి ధర్మ మత సంబంధమైన ఉపాఖ్యానాలెన్నో దానిలో వున్నవి. రాజుల, ఆశ్రమవాసుల యొక్క కర్తవ్యాదులెన్నో విస్తృతంగా వర్ణింపబడినవి. మహాభారతంలోని శాంతి, అనుశాసనిక పర్వాలు పూర్తిగా పారమార్థిక విషయాలతో నిండి వున్నవి. ఇంతేగాక

ప్రసిద్ధమైన భగవద్గీత మహాభారతాంతర్గతమైందే. కురుక్షేత్రయుద్ధారంభ సమయంలో మిత్ర బంధువర్గాన్ని చూచి యుద్ధమంటె రోసి నిరీహుడైన అర్జునునికి శ్రీకృష్ణుడు ధర్మబోధన చేసి కర్తవ్యోన్ముఖుని చేసాడు. అటువంటి భగవద్గీత తర్వాత అన్ని హిందూమత సంప్రదాయాలకు పఠనీయగ్రంథమైంది. దీనికి బ్రహ్మసూత్రాలతో పాటు శంకర రామానుజుల వంటి ఆచార్యులందరూ వ్యాఖ్యానాలు వ్రాసారు. సమస్త మానవధర్మం దీనిలో ఇమిడివుండి, ఇది మానవులందరికి అవశ్యపఠనీయ గ్రంథంగా వున్నది. జీవాత్మ, పరమాత్మ, ప్రకృతుల స్వరూపం, మానవుని కర్తవ్యం, భౌతిక ఆధ్యాత్మిక ఔన్నత్యాదుల రూపం-వీటి విస్తృత వివేచన దీనిలో చేయబడింది. సమస్తవేదధర్మ శాస్త్రాదుల సారం దీనిలో ఇమిడి వుండటంచేత హిందువులకిది అతిపవిత్ర గ్రంథమైంది.

మహాభారతంలోని శ్లోకాలను రోజుకొకటియైనా చదవాలని, మహాభారత శ్రవణం చేత శుభాలు కలుగుతాయని ఆ గ్రంథంలోనే ఇట్లా చెప్పబడింది -

శ్లోకం వాప్యనుగృహ్ణీత తథార్ధ శ్లోకమేవవా
అపిపాదం పఠేన్నిత్యం నచ నిర్భారతో భవేత్ అది 62-42

మహాభారతకథ ప్రాచీనకాలంలోనే ద్వీపాంతరాలకు పాకింది. కంపూచియా దేశంలోని శిలాశాసనం ద్వారా మహాభారత ప్రతులు రెండు క్రీ.శ. 600 ప్రాంతంలో అక్కడి దేవాలయాని కియ్యబడినట్లుగా తెలుస్తున్నది. మరియు ఆ దేవాలయంలో ప్రతినిత్యం మహాభారత పఠన శ్రవణం జరిగేటట్లుగా నియమం చేయబడిందట. క్రీ.శ. 990 ప్రాంతంనాటికే మహాభారతం జావాభాషలోకి అనువాదం చేయబడింది. మహాభారతంలోని ఉపాఖ్యానాలెన్నో బౌద్ధగ్రంథాలల్లో చోటుచేసుకొని మధ్య ఏశియా, చైనా, జపాన్, మంగోలియా మొదలైన దేశాలల్లో వ్యాపించినవి. మహాభారతం క్రీ.శ. 17వ శ॥లో పర్షియన్ భాషలోకి అనువదింపబడింది. అదేకాక క్రీ.శ. 1982లో డా. సయ్యద్ మహమ్మద్ రెజా జలాలీనయనీ మరియు డా. ఎస్.ఎస్ శుక్లాలు కలిసి మహాభారతాన్ని పర్షియన్ భాషలోకి అనువదించి ప్రచురించారు.

వైదికయుగానంతరపు భారతీయ సంస్కృతి చరిత్రలను తెలుసుకోవటానికి మహాభారతం చాల తోడ్పడుతున్నది. ఆనాటి రాజకీయాలు, రాజ్య పరిపాలన విధానాలు, యజ్ఞయాగాది కర్మలు, మతం, ధర్మం, నీతి, దర్శనతత్త్వ రహస్యాలు, సాంఘిక జీవనవిధానం, వర్ణవ్యవస్థ మొదలైన ఎన్నో విషయాలు మహాభారతంలో ప్రతిబింబించినవి. అంతేగాక మానవుని ఆంతర ప్రవృత్తుల వైవిధ్యం చాల సహజంగా దీనిలో చిత్రింపబడింది. వ్యక్తిలో వుండే లోభం, ఈర్ష్య, కాంక్షాదుల స్వరూపాలు చక్కగా చిత్రింపబడి కన్పిస్తున్నవి.

మహాభారతంలోని పాత్రలు నిత్యజీవితంలోని మానవులుగానే కన్పిస్తారు కాని ఆదర్శ వ్యక్తులుగా కాదు. ఇటువంటి సహజ మానవ నైజచిత్రణతో కూడిన పాత్ర చిత్రణ భారతీయ సాహిత్యంలో చాల తక్కువగా కన్పించేటటువంటిది. కాల విపర్యయం, మానవ జీవితంలోని ఒడిదుడుకులు, మానవప్రకృతి వైవిధ్యం, సంభాషణలు సహజంగా గొప్పగా చిత్రింపబడినవి. రాజకీయపుటెత్తులు, పైయెత్తుల విధానం చెప్పబడింది. ఆయా సందర్భాలలో ధర్మసత్యాల రూపనిర్ణయం దీనిలో చేయబడింది. అనేకోన్ముఖమైన హిందూధర్మం యొక్క స్వరూపం దీనిలో చక్కగా ప్రకటింపబడింది. వీటితోపాటు ఆర్థిక, భౌగోళిక, సామాజిక మొదలైన లౌకిక శాస్త్రసంబంధ విషయాలెన్నో దీనిలో ప్రకటింపబడినవి. లౌకిక, ఆధ్యాత్మిక, పారలౌకిక విద్యలన్నీ దీనిలో వున్నవి. అందుకే మహాభారతం విజ్ఞాన సర్వస్వమనటానికి తగివున్నది.

అనంతర కావ్యనాటకాదుల్లో కనిపించే కేవలం ఆదర్శవ్యక్తి చిత్రణలు మహాభారతంలో కనిపించవు. దీనిలోని పాత్రలు మానవ సహజమైన లోటుపాట్లతో కన్పిస్తవి. మానవ జీవితంలోని ఉత్థానపతనాలు అతి సహజంగా చిత్రింపబడినవి. దీనిలోని పాత్రలు కర్మసిద్ధాంతాన్ని నమ్మి నిర్వీర్యులుకాక ధర్మం, సత్యాలకు కట్టుబడి సమర్థులైవుండికూడ కష్టాలను అనుభవిస్తారు. ఇట్లా కష్టాలను అనుభవించినా చివరకు ధర్మసత్యాలకే విజయం లభించినట్లుగా కవి చిత్రించాడు. మానవులు లోభమోహాదులకులోనై ఎట్లా దుర్గతిపాలవుతారో కవి కౌరవాపజయంతో సూచించి కావ్యాన్ని ధర్మనీతి బోధకంగా సాధించాడు. మహాభారతంలోని ఒక్కొక్క పాత్ర ఒక్కొక్క ప్రత్యేక వ్యక్తిత్వాన్ని తీసుకొని మనముందు నిలుస్తుంది. ధర్మరాజు ధర్మమూర్తి అయినా అతనిలోను మానవసహజమైన కొన్ని లోపాలున్నట్లుగా చిత్రింపబడినవి. ద్రౌపది, శకుంతలలు నిస్సహాయలైన సుకుమార సుందరీ మణులు కారు. అదేవిధంగ దుర్యోధన కర్ణ. ధృతరాష్ట్ర, భీష్మ, ద్రోణ, అశ్వత్థామ, భీమార్జునాది పాత్రలెన్నో నిత్యజీవితంలోని వ్యక్తులల్లో కన్పించే లోపాలతో కన్పిస్తవి.

మహాభారతంలో ఆనాటి సాంఘిక, సామరికపరిస్థితులెన్నో ప్రతిబింబించి కన్పిస్తున్నవి. బహుభార్యాత్వంతో పాటు బహుపతీత్వం ప్రచారంలో వుండేది. ఇప్పటికి ఉత్తరప్రదేశ్ రాష్ట్రం ఉత్తరప్రాంతంలోని గఢ్వాల్‌లో అన్నదమ్ములు ఉమ్మడిగా భార్యను లేక భార్యలను కలిగివుండటం ప్రచారంలో వున్నది. నాగరికత కలిగినచోట్ల ఆచారం సన్నగిల్లినా ఇంకా ఆ ఆచారం ప్రచారంలో కన్పిస్తున్నది. దక్షిణదేశంలోని నీలగిరికొండల్లో వుండే తోడా జాతిలోను బహుపతీత్వం ప్రచారంలో వున్నది. ద్రుపదుని పాంచాల దేశం ఇప్పటి ఉత్తరప్రదేశ్‌లోని తూర్పు ఉత్తర భాగాలల్లో వ్యాపించి వుండేది. కాబట్టి బహుపతీత్వం పాంచాలదేశంలో ప్రచారంలో వుండేదని, ఆ ఆచారాన్ననుసరించే ద్రౌపది పాండవులను

భర్తలనుగా గ్రహించిందని చెప్పాలి. ప్రాచీన కాలంలో వంశాభివృద్ధికొరకు సంతానం గృహస్థునకు చాల ప్రధానమైంది. సంతానం లేని ముఖ్యంగా పుత్రుడులేని, వారికి ప్రత్యేకంగా ఒక నరకం కూడా వుండేది. సంతానం లేకపోతే ఇహలోకంలోగాని పరలోకంలోగాని సద్గతుల్లేవని మన పూర్వీకుల అభిప్రాయం. జీవితంలో సంతానాన్ని పొందటం ఒక అతి ప్రధానాంశం. కాబట్టి సంతానం లేనివారు సంతానం కాకముందే భర్త చనిపోతే వంశాభివృద్ధిని కోరేవారు నియోగపద్ధతిని అవలంబించటానికి ధర్మశాస్త్రాలు అనుమతి నిచ్చినవి. భర్త అనుమతితో, పెద్దల అభిమతంతో పరపురుషుని ద్వారా సంతానం పొందటమే నియోగపద్ధతి. దీనికొరకు నిరీహులైన, సాత్త్వికులైన, కామాసక్తులుకాని వ్యక్తులనే ఎన్నుకొనేవారు. పిల్లలు లేకపోతే దత్తత తీసుకోవటం, వెలనిచ్చి కొనుక్కోవటం, కూతురు కొడుకును గ్రహించటం మొదలైన దశవిధ సంతానంలో నియోగ పద్ధతి నవలంబించి పొందిన సంతానం కూడ చేర్చబడింది. ఈ నియోగ పద్ధతి నవలంబించియే అంబిక, అంబాలిక, కుంతి మొదలైనవారు సంతానవతులై భర్తల వంశాన్ని నశించకుండ కొనసాగించారు. మహాభారతం కాలంనాడు యుద్ధవిద్య చాల అభివృద్ధి చెందింది. ముఖ్యంగా ధనుర్విద్య పరాకాష్ఠ నందుకొన్నది. వివిధ శస్త్రాస్త్రప్రయోగాలు అద్భుతమైనవి వుండేవి. రథాలను యుద్ధరంగంలో ఎక్కువ ఉపయోగించేవారు. గుర్రాలను నడిపే విద్యగాని, యుద్ధంలో వాటిని ఎక్కువ ఉపయోగించటం కాని కనిపించదు. రథాలను వివిధ గతులతో నడిపే విద్య చాల అభివృద్ధి చెందింది. రథాలను నడిపేందుకు ప్రత్యేకంగా ఒక వర్ణమే ఏర్పడింది. కృష్ణుడు, శల్యుడు రథచోదక విద్యలో ఆరితేరినవారు అని చెప్పబడింది. చతురంగబలంలో రథాలే ప్రాధాన్యం వహించేవి. గుర్రాలతో పాటు ఏనుగులు చతురంగబలంలో చేరినా గుర్రాల వలెనే ఏనుగుల ఉపయోగం కూడ ఎక్కువ వున్నట్లు కన్పించదు. తర్వాత మగధ సామ్రాజ్య కాలంలో ఏనుగులను యుద్ధంలో ప్రయోగించినంతగా మహాభారత కాలంలో ప్రయోగించినట్లు లేదు. గజబల ప్రాశస్త్యాన్ని వారు అంతగా గుర్తించలేదు. మహాభారత కాలం తర్వాత గజబల ప్రాధాన్యం ఎక్కువైంది. గ్రీకువీరుడు అలెగ్జాండరు అశ్వసైన్యం భారతీయుల గజసైన్యం ముందు నిలువలేకపోయింది. పూరుడు (పోరస్) అలెగ్జాండర్‌ను తన గజసైన్య బలంతోనే ఎదిరించగలిగాడు. మగధదేశపు గజబల విస్తారాన్ని గూర్చి విని అలెగ్జాండరు తన విజయయాత్రను కొనసాగించకుండ వెనుకకు తిరిగి పోయాడు. ఈనాడు యుద్ధంలో ట్యాంకులెట్లాంటివో ఆనాడు గజబలం అట్లా పనిచేసేది. తర్వాత తురుష్కుల దండయాత్రలు సాగినవి. వారు తీవ్రవేగంగల గుర్రాలకు ప్రాధాన్యమిచ్చారు. పాతదైన సామరిక పద్ధతులతోకూడిన హిందూ రాజుల సైన్యం రాటుదేరిన తురుష్కులను, వారి అశ్వసైన్యాన్ని ఎదిరించలేక వీగిపోయారు. అశ్వబల

ప్రాధాన్యాన్ని తర్వాత హిందూ రాజులు కూడ గుర్తించి తమ అశ్వసైన్యాన్ని పెంపొందించుకొన్నారు. మహాభారత కాలంలో విలువిద్య తర్వాత గదాయుద్ధం, మల్లయుద్ధం ఎక్కువ ప్రాధాన్యం వహించినవి. ఖడ్గవిద్య చాల తక్కువ. యుద్ధరంగంలో వ్యూహాలను పన్నటం ప్రధానాంగం. యుద్ధం చేసే సమయం పగలు. పగటిపూట కూడ నిర్ణీతకాలంలోనే యుద్ధం జరిగేది. రాత్రిపూట యుద్ధం భారతీయ సంప్రదాయ ప్రకారం వర్జితం. యుద్ధపు కట్టుబాట్లను తుచ తప్పకుండ అందరూ పాటించేవారు. అలెగ్జాండరు హఠాత్తుగా జీలం నదిని దాటి అర్ధరాత్రి పూరుని (పోరస్) సైన్యాన్ని ఎదుర్కొన్నాడు. వర్షంలో రాత్రి యుద్ధానికి సిద్ధపడని పౌరవ వంశ రాజు చాల కష్టనష్టాలను ఎదుర్కోవలసి వచ్చినది. ఇటువంటి అధర్మ యుద్ధాలను భారతీయులు అనుసరించలేదు.

## మహాభారతంలో ఉపాఖ్యానాలు

మహాభారతంలో 4/5 భాగం ఉపాఖ్యానాలు నిండివున్నవి. కౌరవ పాండవుల విశాలమైన కథలో పాఠకులకు విసుగుకలిగించని అనేక ఉపాఖ్యానాలు చేర్చబడినవి. సత్యధర్మాదుల స్వరూపనిరూపణకొరకు, వివరణ వ్యాఖ్యానాల కొరకు తర్వాత ఎన్నో ఉపాఖ్యానాలు మహాభారతంలో చేర్చబడివుంటవి. గంగావతరణ, శకుంతల, సావిత్రి, దమయంతి, త్రిపురాసుర సంహార, యయాతి, శిబి, శ్రీరామ, పరశురామ, ఋష్యశృంగాదుల కథలెన్నో రమ్యమైనవి మహాభారతంలో వున్నవి. వీటిల్లో కొన్ని వేదవ్యాసుడే రచించినవై వుంటవి. మహాభారతంలోని ఉపాఖ్యానాలెన్నో తర్వాత కవులకు కావ్యేతివృత్తాలుగా ఉపయోగపడినవి. ఎన్ని ఆఖ్యానోపాఖ్యానాలున్నా మహాభారతంలోని ప్రధానకథ ఎప్పుడూ తన ప్రాధాన్యాన్ని కోల్పోలేదు. ఉపాఖ్యానాలనే మహారణ్యంలో పాఠకుడెప్పుడూ ప్రధానకథ అనే రాజమార్గాన్ని విడిచిపెట్టి తప్పిపోడు. అనేక పాత్రలు, అనేక సంఘటనలతో కూడిన కథను కవి ఎంతో నేర్పుతో రచించాడు. ఇటువంటి బృహత్కావ్యాన్ని నిర్వహించటం అసామాన్య ప్రతిభకు తార్కాణం.

## మహాభారతానికి వ్యాఖ్యానాలు

మహాభారతం సర్వసుబోధకమైన సరళసులభశైలిలో వ్రాయబడింది. ఐనా దీనికి వ్యాఖ్యానాలు బయలుదేరినవి. సర్వజ్ఞ నారాయణుని వ్యాఖ్యానం మనకు తెలిసిన వ్యాఖ్యానాలల్లో మొదటిది. ఇతడు క్రీ.శ. 14వ శతాబ్దం ఉత్తరార్ధంలో జీవించాడు. ఈ వ్యాఖ్యానంలో కొన్నిభాగాలు మాత్రమే దొరుకుతున్నవి. రెండవది అర్జున మిశ్రుని టీక. అర్జునమిశ్రుడు సర్వజ్ఞనారాయణుని పేర్కొన్నాడు. మూడవది క్రీ.శ. 16వ శతాబ్దంనాటి

నీలకంఠుని వ్యాఖ్యానం. ఇతడు మహారాష్ట్ర దేశీయుడు. ఈ వ్యాఖ్యానాలేకాక ఆనందతీర్థుని(మధ్వాచార్యుల) మహాభారత తాత్పర్య నిర్ణయం, అప్పయ్య దీక్షితుని మహాభారత తాత్పర్య సంగ్రహం వంటి విమర్శనాత్మక గ్రంథాలు రచింపబడినవి. క్రీ.శ॥ 11వ శతాబ్దంవాడైన క్షేమేంద్రుడు భారత మంజరి అనే పేరుతో, క్రీ.శ. 11వ శతాబ్దంవాడైన అగస్త్యుడు బాలభారతమనే పేరుతో మహాభారత కథాసంగ్రహాలను రచించారు.

## మహాభారత శైలి

క్రీస్తుపూర్వం 4వ శతాబ్దంలో అలెగ్జాండరు దండయాత్రతో భారతీయులకు గ్రీకులతో, గ్రీకుభాషతో పరిచయం ఏర్పడిందని, హోమర్ ఇలియడ్ ఒడిస్సీ కావ్యాల ప్రేరణతో మహాభారతం రచింపబడిందని కొందరు పాశ్చాత్య విమర్శకుల అభిప్రాయం. గ్రీకు లాటిన్ భాషాసంస్కృతులు ఉపజీవ్యంగా కలిగిన పాశ్చాత్యవిమర్శకులకు ఇటువంటి అభిప్రాయం కలగటంలో ఆశ్చర్యంలేదు. భారతదేశంలో సాహిత్య సంస్కృతి వికాసాలు గ్రీకు సాహిత్య సంస్కృతి సంపర్క ఫలితమని నమ్మటం గాలిలో మేడలు కట్టటం వంటిదే అవుతుంది. మహాభారతం ఇలియడ్ ఒడిస్సీల కన్న అతి ప్రాచీనమైంది. ఇప్పటికి మహాభారతం భారతీయుల జీవనానికి జీవనాడి వంటిది. భారతీయ ధర్మ, నీతి మార్గాలకది ప్రేరకమైనటువంటిది. అటువంటి మహత్తర శక్తి ఇప్పుడు ఇంకా ఇలియడ్, ఒడిస్సీలకున్నదనటం సందేహాస్పదం.

మహాభారతంలోని సంస్కృతం తరువాతి లౌకిక సంస్కృతంకన్నా కొంత భిన్నంగా వున్నదని, కొన్ని భాగాలల్లో సంస్కృతం చాలా ప్రాచీనమైందని విమర్శకుల అభిప్రాయం. పాణిని సూత్రాలకు భిన్నమైన గచ్ఛధ్వం వంటి ప్రయోగాలు వున్నవి. మహాభారతంలోని సంస్కృతం ఆనాడు వ్యవహారంలో వున్న సంస్కృతభాషయే అయినా మహాభారతమంతటా భాషాశైలులు ఒక తీరుగా వున్నవని చెప్పలేము. ఒక్కొక్కచోట దీనిలోని సంస్కృతభాష వైదిక గద్యానికి దగ్గరగా వున్నదని, మరికొన్ని భాగాలు పురాణాలకు దగ్గరగాను వున్నవని వింటర్‌నిట్స్ అభిప్రాయం. మహాభారతంలో ఉపజాతి వృత్తాలు అక్కడక్కడ కనిపించినా మొత్తం మీద అనుష్టుపు ఛందస్సెక్కువగా వాడబడింది. తరువాత లౌకికకావ్యాలల్లో కనిపించే క్లిష్టశైలి, క్లిష్ట భావాలంకారాలు మహాభారతంలో లేవు. మహాభారత శైలి పురాణాల శైలికి దగ్గరగా వున్నది. అట్లా అని కావ్యశైలి మహాభారతంలో అసలే లేదని చెప్పలేము. ప్రకృతి వర్ణనలు, సహజ యుద్ధవర్ణనలు, కరుణరసప్లావితమయ్యే శోకఘట్టాలు, రౌద్రాది రసపూర్ణమైన ఘట్టాలు, స్త్రీ వర్ణనలు (లౌకిక కావ్యాలల్లో వలె అంగాంగ వర్ణన కాదు), రమ్యశృంగార సన్నివేశాలు మహాభారతంలో కావ్యశైలిలో రచింపబడినవి వున్నవి. అక్కడక్కడ

ఉపమారూపకాది అలంకారాలు సుందరంగా ప్రయోగింప బడినవి. మహాభారతమంతా కాకున్నా కొన్ని భాగాలల్లో రమ్యమైన ఆలంకారికశైలి కన్పిస్తున్నది.

మహాభారతంలో ధర్మ నీతి ఉపదేశ సన్నివేశాలు, వేదాంత బోధనలు సరళశైలిలో రచింపబడినవి. భగవద్గీతలోని విషయంగాని, భాషగాని ఉపనిషత్తులకు దగ్గరగా వున్నది. కృష్ణపూజా ప్రాధాన్యం హెచ్చింతర్వాత, కృష్ణుడు దాన్ని అర్జునునికి ఉపదేశించినట్లుగ మహాభారతంలో చేర్చబడి వుంటుంది. యాదవులను ఒక గణరాజ్యంగా సంఘటితం చేసి, ఆనాటి రాజకీయాలల్లో ప్రధాన పాత్ర వహించిన కృష్ణుడు రాజనీతి కుశలుడేకాక సాంఖ్యాది దర్శనజ్ఞాన సంపన్నుడైనవాడు. దర్శనాల సంఘటిత సారరూపమైన అతని ఉపదేశాల తాత్పర్యమే భగవద్గీత రూపాన్ని ధరించి వుంటుంది. ఆనాడు ఎంతో మంది రాజులకు, ముఖ్యంగా యాదవగణాలకు మార్గదర్శకుడైన కృష్ణుడు మహాత్ముడుగా, విష్ణువు అవతారంగా పరిగణింపబడ సాగాడు. అతని ఉపదేశాలు భగవద్గీత రూపంగా మహాభారతంలో చోటు చేసుకొన్నవి. దీన్ని ఎవరు రచించి ప్రక్షిప్తం చేసారో తేల్చి చెప్పలేము.

# రామాయణం

రామాయణాన్ని రచించిన కవి వాల్మీకి. వాల్మీకి గంగాతీరంలో నివసిస్తు రామాయణాన్ని లవ కుశులకు చెప్పాడని, వారు దాన్ని రాముని అశ్వమేధయాగశాలలో గానం చేసారని రామాయణంలోనే చెప్పబడింది.

రామాయణంలో 24000 శ్లోకాలున్నవి. అది ఏడు కాండాలుగా విభాగింపబడింది - బాల, అయోధ్య, అరణ్య, కిష్కంధ, సుందర, యుద్ధ, ఉత్తర కాండాలు. ఈ ఏడు కాండాలన్ని వాల్మీకి విరచితం కావని ఆదునికవిమర్శకుల అభిప్రాయం. ఒకటవ, ఏడవ కాండాలు వాల్మీకి రచించినవి కావని, అవి ప్రక్షిప్తాలని విమర్శకులు అనేక ఆధారాలను చూపారు. రామాయణ కథ ఐదు కాండాల వరకే పరిమితమై వున్నదని, రెండు కాండాలు అంటె 1, 7 కాండాలు తర్వాత కాలంలో చేర్చబడినవని యాకోబి అభిప్రాయం. 2 నుండి 6 కాండాలల్లో చెప్పిన విషయాలను ఖండించేవిధంగా ఎన్నో విషయాలు మొదటికాండంలో వున్నవని, ప్రధానకథ అంతా 6వ కాండం వరకే చెప్పబడగా ఏడవ కాండం యొక్క ఆవశ్యకత లేదని అతని అభిప్రాయం. 1, 7వ కాండాలల్లో కథాసంవిధానం మిగతా వాటికన్న భిన్నంగా వున్నది. వీటిల్లో ఋష్యశృంగ, విశ్వామిత్ర, అహల్య, గంగావతరణ, ఆంజనేయ, రావణ సంబంధ అవాంతర కథలెన్నో వున్నవి. ఇటువంటి అవాంతరకథలు 2నుంచి

6కాండాలల్లో కన్పించవు. మహాభారతం వలెనే రామాయణాన్ని పెంచటానికి ప్రయత్నాలు జరిగినవని దీన్నిబట్టి తెలుస్తున్నదని, ఉత్తరకాండం శైలి శిథిలంగా ఉన్నదని, ఈ కారణాలన్నిటిచేత రామాయణంలో కాండాలన్నీ ఏక కవి కృతులు కావని యాకోబి అభిప్రాయం. వాసుదేవున్ని లేక కృష్ణుని విష్ణువతారంగా భావించి పూజింపబడటం బాగా ప్రచారంలోకి వచ్చింతర్వాత రాముని సైతం విష్ణ్వంశావతారంగా చెప్పే శ్లోకాలు, వృత్తాంతాలు తదనంతరం రామాయణంలో చేర్చబడినవని అతని అభిప్రాయం. బాల, ఉత్తర కాండాలల్లోనే వాల్మీకి రామునికి సమకాలికుడుగా కన్పిస్తాడు. ఇది నమ్మతగ్గది కాదని, తర్వాతవారెవరో వాల్మీకి ప్రాచీనతను స్థాపించటానికి చేసిన కల్పన ఇది అని, దీన్ని బట్టే వాటిని ప్రక్షిప్తాలుగా చెప్పవచ్చునని యాకోబి అంటాడు. యుద్ధ కాండంలోను వాల్మీకి తర్వాత యుద్ధ వర్ణనలు పెంచబడినవని కూడ అతని అభిప్రాయం. వింటర్ నిట్స్ అభిప్రాయంలోను 1,7 కాండాలు ప్రక్షిప్తాలే. ఈ రెండు కాండాలల్లోనే రాముడు విష్ణువు అవతారంగా ప్రతిపాదింపబడినాడు. మొదటి కాండంలోని కొన్ని విషయాలు తర్వాత కాండాలతో సరిపోవటం లేదని, ఈ రెండు కాండాలల్లోనే పౌరాణిక గాథలు కూర్చబడినవని కాబట్టి 2 నుంచి 6 కాండాలను రచించిన వాల్మీకి వీటిని వ్రాయలేదని అతని అభిప్రాయం. హోల్ట్స్‌మన్ అభిప్రాయం కూడ ఇదే. వాల్మీకి క్రౌంచపక్షి వియోగ దుఃఖంవల్ల కలిగిన ఆవేదనతో ప్రథమ శ్లోకాన్ని రచించాడు. ఆ శ్లోకం అనుష్టుపు ఛందస్సులో వున్నది. తర్వాత వాల్మీకి రామాయణాన్నంతా అదే ఛందస్సులో రచించి వుంటాడని, తర్వాత వివిధ ఛందస్సులు చేర్చబడి రామాయణం పెంచబడిందని కొందరు విమర్శకుల అభిప్రాయం.

భారతీయ సంప్రదాయానుసారంగా రామాయణాన్నంతా వాల్మీకి రచించాడు. రామాయణ వృత్తాంతం జరగకముందే భవిష్యత్తులో జరుగబోయే కథనంతా నారదుడు వాల్మీకికి చెప్పాడట! బ్రహ్మ ఆదేశానుసారంగా నారదుడు చెప్పినదాన్ని వాల్మీకి కావ్యంగా వ్రాసాడు. ఆనంద వర్ధనుని వంటి ఆలంకారికులు (క్రీ.శ. 9వ శ॥) వాల్మీకియే ఉత్తరకాండతోసహా 7 కాండాలు గల రామాయణాన్ని రచించాడని అంగీకరించారు. ఇక వాల్మీకి అనుష్టుపు ఛందస్సులోనే రచించాడని మిగతా ఛందస్సులు ప్రక్షిప్తాలని అంగీకరించినట్లయితే అనేక అందమైన శ్లోకాలు వాల్మీకి విరచితం కాదని చెప్పవలసి వుంటుంది. ఇక రాముడు విష్ణువు అవతారంగా చెప్తున్నాయన్న శ్లోకాలు, వృత్తాంతాలు పాఠకుల మనోధర్మాన్ని బట్టి అట్లా గోచరిస్తున్నవని, తర్వాత రచనల్లో రాముడు దేవుడుగా చిత్రింపబడినాడే గాని వాల్మీకి రామాయణంలో అట్లా జరుగలేదని కొందరి అభిప్రాయం. కాని రామాయణంలో అసలే ప్రక్షిప్తాలు లేవని చెప్పలేము. రామాయణంలో 500 సర్గలు 24000 శ్లోకాలున్నవని బాల కాండంలో చెప్పబడింది -

ఆదిప్రభృతివై రాజన్ పంచసర్గ శతాని చ
కాండాని షట్ కృతాని సోత్తరాణి మహాత్మనా.

కాని ఇప్పటి రామాయణంలో 650 సర్గలు 24000 కు పైగా శ్లోకాలున్నవి. అంతేగాక కొన్ని లుప్తమై కొన్ని ప్రక్షిప్తాలు కూడ కావచ్చును. కాబట్టి మహాభారతంలో వలె విస్తృతంగా ప్రక్షిప్తభాగాలు రామాయణంలో లేకున్నా, అది ప్రక్షిప్తాలకు దూరం కాలేదని మాత్రం గట్టిగా చెప్పవచ్చును.

## వాల్మీకి

వాల్మీకి రామాయణకర్త అనటంలో సందేహమేమి లేదు. వాల్మీకి మొదట కిరాతకుడు. దారులుకొట్టి దొంగగా జీవించేవాడని, హఠాత్తుగా ఒకానొక సంఘటన చేత అతని హృదయంలో మార్పు వచ్చిందని ఐతిహ్యం. ఆధ్యాత్మరామాయణంలో వాల్మీకి మొదట బ్రాహ్మణుడే కాని కిరాతుల్లో కలిసిపోయి శూద్ర స్త్రీని వివాహమాడి సంతానాన్ని పొందాడని, దొంగగా జీవిస్తుండగా సప్తర్షులవల్ల అతనిలో మార్పు వచ్చిందని చెప్పబడింది. తైత్తిరీయ ప్రాతిశాఖ్యంలో వాల్మీకి పదకారునిగా పేర్కొనబడినాడు. కాని ఈ పదకారుడైన వాల్మీకి, కవివాల్మీకి ఒక్కరే అని నిరూపించలేము. ప్రాచీనకాలంలో భారతదేశపు తూర్పు సముద్ర తీరభాగమంతా చోళమండలంగా పేర్కొనబడేది. బ్రిటిష్‌కాలంలో అది కోరమండలంగా మారింది. ఈ సముద్ర తీరప్రాంతవాసులను చోళులని అనేవారు. చోళ శబ్దమే సంస్కృతంలో 'చోర' శబ్దంగా మారిందేమో. చోళులు దారులు కొట్టి నివసించేవారని ఈ అర్థ పరిణామంవల్ల తెలుస్తున్నది. వాల్మీకి చోళజాతికి చెందినవాడు కాబట్టి అతడు పూర్వాశ్రమంలో దోపిడికాడని కథ ప్రచారంలోకి వచ్చిందేమో చెప్పలేము. రామాయణానుసారంగా కవి వాల్మీకి ఆశ్రమం గంగానది సమీపంలో తమసానదీతీరంలో వున్నదని చెప్పబడింది. కాని అతని ఆశ్రమం గంగానది కాక ఇప్పటి బుందేల్‌ఖండ్‌లోని బందాజిల్లాలో అలహాబాదు సమీపంలో యమునానది తీరంలో ఒక పర్వతంమీద వుండేదని కొందరు అభిప్రాయపడ్తున్నారు. ఇదే చిత్రకూటమని కొన్ని రామాయణ ప్రతుల్లో పేర్కొనబడిందని వారంటారు. ఒకవేళ ఇదే నిజమైతే వాల్మీకి ఆశ్రమం అయోధ్యసమీపంలోనే వుండేది. అందుకే తరవాతి వారు వాల్మీకిని రామునికి సమకాలికునిగా కల్పనచేసి వుంటారు. వాల్మీకి రామాయణంలో పేర్కొన్న స్థలాలను జాతుల పేర్లనుబట్టి భారత దేశంలో పశ్చిమ ప్రాంతాలతో కాక తూర్పు, దక్షిణం, ప్రాంతాలతో, ముఖ్యంగా అయోధ్య మొదలుకొని ఒరిస్సా, గోదావరి ప్రాంత ప్రదేశాలతోనే అతనికి పరిచయమున్నట్లు తెలుస్తున్నది. కాబట్టి వాల్మీకి తూర్పు, దక్షిణ, ఆగ్నేయ ప్రాంతాలకు చెందినవాడనే చెప్పవచ్చును.

## రామాయణ రచనాకాలం

మాక్‌డొనెల్ అభిప్రాయానుసారం రామాయణ రచన క్రీ.పూ. 500 కు పూర్వమే జరిగింది. వింటర్‌నిట్జ్ వంటి పాశ్చాత్య సాహిత్యచరిత్రకారులు రామాయణ రచన బుద్ధుని తర్వాతనే క్రీ.పూ. 3వ శ॥లో వ్రాయబడిందని నమ్ముతున్నారు. అతడు రామాయణ కథ మీద బౌద్ధమత ప్రభావం వున్నదని అంగీకరించాడు. అందుచేత బౌద్ధమతం బాగా వ్యాపించిన తర్వాతనే రామాయణం వ్రాయబడిందని అంటాడు. మాక్‌డొనెల్, యాకోబీలు రామాయణాన్ని బౌద్ధయుగానికి పూర్వరచనగానే భావించారు. యవనుల ప్రసక్తి బాల, కిష్కింధ కాండాలల్లో వుండటం వల్ల భారతీయులకు యవనులతో సంపర్కం కలిగింతర్వాత అంటే అలెగ్జాండర్ దండయాత్ర తర్వాత క్రీ.పూ. 3వ శ॥లో రామాయణం వ్రాయబడిందని కీథ్ అభిప్రాయం. రామాయణంలో యవనులతోపాటు శకులు కూడ పేర్కొనబడినారు. అటువంటప్పుడు రామాయణం శకుల దండయాత్రల తర్వాత క్రీ.పూ. 2వ శ॥ లో వ్రాయబడిందని చెప్పవలసి వుంటుంది. కాని ఇది సమంజసమైన కాలం కాదు. యవన శకుల పేర్లు ప్రక్షిప్తాలుగా రామాయణంలో చేరివుండవచ్చును. అది అసాధ్యమని చెప్పలేము. రామాయణ రచనా కాలాన్ని నిర్ణయించటానికి కొన్ని అంతస్సాక్ష్యాలు దొరుకుతున్నవి.

1) రామాయణంలో కౌశాంబి, కాన్యకుబ్జ, కాంపిల్య నగరాల ప్రసక్తి వున్నది కాని పాటలీపుత్ర ప్రసక్తిలేదు. పాటలీపుత్రం క్రీ.పూ. 380 ప్రాంతాన కాలాశోకునిచేత నిర్మింపబడింది.

2) రామాయణంలో అయోధ్యకు సాకేతమనే పేరు చెప్పబడలేదు. దానికి సాకేతమన్న పేరు బౌద్ధ జైనులచేత పేర్కొనబడింది. గ్రీకులుకూడ దాన్ని సాకేతమని పేర్కొన్నారు. పతంజలి మహాభాష్యంలోను సాకేతమని పేర్కొన బడింది.

3) రామాయణంలో మిథిల, విశాల రాజ్యాలు వేరువేరుగా చెప్పబడినవి. ఈ రెండు బుద్ధునికాలంలో వైశాలి అన్న పేరుతో సంఘటితమైనవి.

4) రామాయణంలో ఎక్కడా బౌద్ధ జైన మతాలప్రసక్తి ప్రత్యక్షంగాను పరోక్షంగాను కనబడటంలేదు.

పై సాక్ష్యాధారాలనుబట్టి రామాయణరచన బుద్ధునికి పూర్వమే జరిగిందని చెప్పవచ్చును. మరియు అష్టాధ్యాయికర్త పాణిని (క్రీ.పూ. 5వ శ॥) రామాయణ కావ్యాన్ని పేర్కొనకపోయినా దానిలోని పాత్రలను కొన్నిటిని పేర్కొన్నాడు. కాబట్టి రామాయణరచన

క్రీ.పూ. 5,6 శ॥ లకు పూర్వమే జరిగిందని చెప్పవచ్చును. మోనియర్ విలియమ్స్ రామాయణ రచనాకాలం క్రీ.పూ. 5 వ శ॥కి పూర్వమేకాని తర్వాతకాదని అంగీకరించాడు. మాక్‌డొనెల్ అభిప్రాయం కూడా ఇదే. యాకోబి రామాయణ రచనాకాలాన్ని క్రీ.పూ. 800-900 ప్రాంతమని అంగీకరించాడు. బుద్ధునికాలంలో ఇక్ష్వాకువంశరాజు ప్రసేనజిత్తు శ్రావస్తిని రాజధానిగా చేసుకొని పాలిస్తున్నాడు. ఇక్ష్వాకుల రాజధాని అయోధ్యనుంచి లవుని కాలంలో శ్రావస్తికి మారినట్లుగా రామాయణ ఉత్తరకాండలో వున్నది. ఇక్ష్వాకులు శక్తిమంతంగావుండి పరిపాలిస్తున్న సమయంలో వాల్మీకి జీవించివుంటాడని అంటె అది క్రీ.పూ. 5 శ॥కి పూర్వమే అని యాకోబి అభిప్రాయం. అశోకుని సమయంలో ప్రజలభాష ప్రాకృతం. బౌద్ధ జైనులు ప్రాకృతానికే ప్రాధాన్యమిచ్చారు. ప్రాకృతంకన్న సంస్కృతభాష బాగా వాడుకలో వున్నప్పుడే రామాయణ రచన జరిగిందని అది క్రీ.పూ. 800-900 ప్రాంతమని యాకోబి నిర్ణయించాడు.

## రామాయణకథ ప్రతీకాత్మకమా?

రామాయణకథ నిజంగా జరిగిందా లేదా అనటంలో చాల అభిప్రాయ భేదాలున్నవి. పురాతత్త్వ సంబంధమైన ఆధారాలేవి లేందే ఇది జరిగిందని అంగీకరించటానికి చారిత్రకులు ఒప్పుకోవటం లేదు. కొందరు విమర్శకులు, చారిత్రకులు మహాభారతకథ జరిగిందేకాని రామాయణకథ జరిగిందికాదని, కవి కల్పితమని అంటారు. మరికొందరు విమర్శకులు దీన్ని ప్రతీకాత్మకమైన కథగా అంగీకరిస్తున్నారు.

వాల్మీకి బౌద్ధ దశరథ జాతక కథను గ్రహించి గ్రీకు మహాకావ్యం ఇలియడ్ ఆధారంగా విస్తరింపజేసి కావ్యంగా రచించాడని వేబర్ అభిప్రాయం. గ్రీకు ఇలియడ్ ప్రభావం రామాయణ కావ్యంమీద వున్నదన్న వేబర్ అభిప్రాయాన్ని వింటర్‌నిట్స్ నిరాకరించాడు. బౌద్ధమతం బాగా వ్యాపించి తర్వాత బౌద్ధధర్మ గ్రంథాలు వ్రాయబడింతర్వాత రామాయణ రచన సాగిందని, రాముని పాత్ర చిత్రణలో బౌద్ధమత ప్రతిపాదిత సౌమ్య ఉదార ఉదాత్త దయాగుణాలను చూడవచ్చునని కాని మొరుకువాడైన వీరున్నికాదని, ప్రత్యక్షంగా వాల్మీకి బుద్ధుని పేరునుగాని బౌద్ధబోధనలనుగాని ఎక్కడా చెప్పకపోయినా అంతఃప్రవాహంగా బౌద్ధ ధర్మ నీతి సచ్చరిత్రల ప్రభావాన్ని చూడవచ్చునని, ముఖ్యంగా రాముని పాత్ర చిత్రణలో దీన్ని చూడవచ్చునని వింటర్‌నిట్స్ అభిప్రాయం.

వేబర్ రామాయణ గాథను ప్రతీకాత్మకమని అంటాడు. అతని అభిప్రాయంలో సీత ఆర్యుల పశుపాలక వృత్తికి ప్రతీక. ఆర్యోత్తముడైన రాముడు దానికి రక్షకుడు. ఆర్యులను ఎదిరించే ఆదిమజాతులు రాక్షసులు. రామాయణంలోని రాముడు, శ్రీకృష్ణుని

సోదరుడు హలధారియైన బలరాముడు ఒక్కరే అని వేబర్ అభిప్రాయం. బలరాముడే రామునిగా రూపొందాడని ఆయన అంటాడు. దక్షిణ భారతంలో బ్రాహ్మణ బౌద్ధ ధర్మాలకుజరిగిన సంఘర్షణకు రామాయణగాథ ప్రతీక అని టాల్‌బాయస్ వీలర్ అభిప్రాయపడ్డాడు. లంకలోని బౌద్ధులు రాక్షసులుగా చెప్పబడినారని బౌద్ధమతాన్ని స్వీకరించిన లంక మీదికి రాముడు దండెత్తిపోవటమే రామాయణగాథ అని అతని అభిప్రాయం. ఆర్యులు దక్షిణభారతం మీదికి చేసిన దండయాత్రలల్లో మొదటి దండయాత్ర కథయే రామాయణ కావ్యరూపం ధరించిందన్న అభిప్రాయాన్ని లాస్సన్ ప్రకటించాడు. ఆర్య సంస్కృతి దక్షిణ భారతంలో ముఖ్యంగా లంకలో ఎట్లా వ్యాపించిందో రామాయణగాథ చాటుతున్నదని వేబర్ కూడ అంగీకరించాడు. ఋగ్వేదంలో వున్న ఇంద్ర వృత్రాసురుల కథ రామాయణ రూపాన్ని ధరించిందని యాకోబి మతం. అతని దృష్టిలో ఇంద్రవృత్రుల కథ కల్పితం, రామాయణ కథ కూడ కల్పితమే. వృత్రుడు ఒక అసురుడు, ఇంద్రుని శత్రువు. ఇంద్రుని ఆవులను దొంగిలించి అతడు సముద్రంలో దాచాడు. ఇంద్రుడు సరమ అనే కుక్కను ఆవుల జాడను కనుక్కునేటందుకు పంపాడు. సరమ ఆవుల జాడను తెలుసుకొని ఇంద్రునికి చెప్పాడు. ఇంద్రుడు మరుద్దేవతల సహాయంతో వృత్రుని మీద ఆక్రమణచేసి అతన్ని వధించి ఆవులను విడిపించాడు. యాకోబి మతానుసారం రాముడు ఇంద్రుడు, సీత గోవులు, గోవులకు పతి ఇంద్రుడు కదా! రావణుని కొడుకు ఇంద్రజిత్తు అనటం సార్థకంగా వున్నదని యాకోబి అభిప్రాయం. ఎందుకంటే ఇంద్రున్ని జయించిన వృత్రుడని ఆ పేరు సూచిస్తున్నది. మరుద్దేవతలు వానరులు, సరమ ఆంజనేయునిగా ఈ కథలో మారింది. ఋగ్వేద కథకు, రామాయణ కథకు యాకోబి సాధించిన సామ్యం ప్రశంసనీయంగా వున్నది కాని ఈ అభిప్రాయం సర్వజనాంగీకారమైంది మాత్రం కాదు. ఈ సామ్యం అంత యుక్తి యుక్తం గాను లేదు.

దక్షిణభారతంలో వ్యాపించివున్న శైవమతాన్ని వైష్ణవమతం జయించి విస్తరించటమే రామాయణగాథ పరమార్థమని స్వామి బ్రహ్మవర్తనుడనే పండితుడు తలంచాడు. రావణుడు శివభక్తుడు. రాముడు విష్ణువు అవతారం. రాముడు శివధనుస్సును విరచటం, పరశురాముని తేజస్సును గ్రహించటం దీన్నే సూచిస్తున్నదని ఆయన అంటాడు.

లంక అన్న పదానికి సంస్కృతంలో వ్యుత్పత్త్యర్థం (etymology) లేదు. బ్రౌన్ తెలుగు నిఘంటువులో లంకకు ద్వీపమనే అర్థమియ్యబడిందని యాకోబి చెప్తూ సింహళానికున్న లంక అన్న సంజ్ఞానామమే ద్వీపమనే జాతినామంగా తెలుగులో మారిందంటాడు. కాని జాతినామంగా వున్న లంక అన్న తెలుగు పదం రామాయణంలో సంజ్ఞానామంగా మా ందని చెప్పాలి. తెలింగ తీర ప్రాంతంలో ద్వీపాలు ఏవి లేవని యాకోబి గుర్తించాడు.

తీరప్రాంతంలోని సముద్రంలో ద్వీపాలేవీ లేవు నిజమేకాని గోదావరి డెల్టా ప్రాంతంలో అనేక ద్వీపాలవంటి దిబ్బలున్నవి. ఈ దిబ్బలకు లంకలనే పేర్లు ప్రసిద్ధంగా వాడుకలో వున్నది. రామాయణంలో చెప్పబడిన లంక వీటిల్లోనే ఒకటి కావచ్చును. దండకారణ్యం సింహళానికంటే ఈ ప్రాంతానికే దగ్గరగా వుంటుంది. రాక్షసజాతి యక్ష నాగ గంధర్వ కిన్నర కింపురుషులతోపాటు పురాణాలల్లో చెప్పబడుతుంటుంది. ఈ జాతులు ప్రాచీనకాలంలో తూర్పు, ఆగ్నేయ, ఈశాన్య దిశలందున్నట్లుగా పురాణాలల్లోని కథనాన్ని బట్టి తెలుస్తున్నది. రాముని కాలంనాటికి ఈ జాతులు సముద్రతీర ప్రాంతం గోదావరి కృష్ణా డెల్టా భూములవరకు వ్యాపించివుంటవి. గోదావరికి చెందిన లంకల్లోనే నగరాలను నిర్మించుకొని వుంటారు. వాల్మీకి లంకను ఎన్నో చోట్ల నగరంగా మాత్రమే చెప్పటం కూడ గమనార్హం. రామున్ని పడవమీద నదిని దాటించిన గుహుడు గుహ్యాజాతికి చెందినవాడు. రామునికి ఎంగిలిపండ్లు తినిపించిన శబరి శబర (సవర) జాతికి చెందింది. ఈ రెండు జాతులు నివసించిన భూములు ఇప్పటి ఒరిస్సా ఆంధ్ర ప్రాంతాలే. రాముడు సీతాలక్ష్మణులతో ఆశ్రమాన్ని నిర్మించుకొని నివసించింది గోదావరినదీ తీరంలోనే. కాబట్టి గోదావరీ డెల్టా భూమియే రామాయణంలో వర్ణించబడిన రాక్షస రాజ్యమని చెప్పాలి. అతి సారవంతమైన గోదావరి కృష్ణా డెల్టా భూములు తప్పక ప్రాచీన కాలంలోనే కృషి వాణిజ్యాలు ప్రధానమైన జాతులకు నివాసభూమియై నాగరికతతో కూడివుంటవి. అతి ప్రాచీన కాలంలో ఒరిస్సా, ఆంధ్ర ప్రాంతాలల్లో ఆటవికులు చిన్నచిన్న గుంపులుగా ఏర్పడి భౌగోళిక రక్షణ సరిహద్దులు గల చిన్నచిన్న భూములను తమ అధికారంలో వుంచుకొని పరిపాలన సాగించేవారు. ఒకొక్కసారి ఉత్తరభూముల నుంచి వచ్చిన క్షత్రియ జాతి వీరులు ఈ ఆటవికగుంపుల మీద అధికారాధిపత్యాలు వహిస్తూవుండేవారు. ఋగ్వేదానికి చెందిన ఐతరేయ బ్రాహ్మణంలో ఆంధ్ర పుళింధ్ర పుండ్ర మూతిబ మొదలైన జాతులు పేర్కొనబడినవి. వీరు దక్షిణ బెంగాల్, ఒరిస్సా, ఆంధ్రకోస్తా ప్రాంతాలల్లో నివసించే జాతులవారే! ఆంధ్ర పుళింధ్ర పుండ్ర మూతిబ మొదలైన ఆదిమజాతుల మీద క్రమక్రమంగా వైదికమతానుయాయులైన క్షత్రియ వీరులు ఆధిపత్యాన్ని సంపాదించుకోసాగారు. భారతదేశం నుంచి నిరాశాతప్తులైన, రాజ్య నిరాసితులైన క్షత్రియ రాజకుమారులు దూర ప్రాచ్య భూములకు (సుమత్రా, జావా, మలయేసియా, థాయిల్యాండు మొ॥నవి) పోయి అక్కడి రాజకుమార్తెలను వివాహమాడియో లేక భుజబలంతోనో రాజ్యాలను స్థాపించి ఏలారు. అదేవిధంగా క్షత్రియ వీరులు భారతదేశ దక్షిణ భూములకు వచ్చి రాజ్యాలను స్థాపించి వుంటారు. అంటె పరిపాలిత ప్రజలు ఆదిమ వాసులే కాని రాజు, ఉన్నతోద్యోగులు మాత్రం విజాతీయులు. అంటె ఉత్తర దేశానికి చెందిన క్షత్రియులు. రావణాసురుడు బ్రహ్మకులంలో పుట్టాడని చెప్పబడింది. వాలి ఇంద్రుని

కొడుకు, సుగ్రీవుడు సూర్యునికొడుకు అని చెప్పబడింది. ఉన్నతకుల సంజాతుడైన రావణుడు దక్షిణ దేశంలో రాజ్యాన్ని ఏర్పరచుకొని వుంటాడు. సారవంతమైన గోదావరి డెల్టాలోని ఏదో ఒక లంకయే అతని రాజ్యమై వుంటుంది. వైదికధర్మ విదూరులైన అతని రాజ్యప్రజలను రాక్షసులని, అతన్ని రాక్షసరాజు అని అనివుంటారు. క్రీ.శ. 4,5 శతాబ్దాల నాటి విశాఖదత్తుడు తన ముద్రారాక్షసం నాటకంలో జైనుడైన నందరాజుల మంత్రిని "రాక్షసు"డని పిలిచాడు. అవైదికమతానుయాయులను ముఖ్యంగా జైన మతనుయాయులను "రాక్షసు" లని పిలవడం కన్పిస్తుంది. జైనుడై శాస్త్రపాండిత్యం కలవాన్ని బ్రహ్మరాక్షసుడని అన్నారు. పాడుబడిన జైనులగుళ్ళను రాక్షసగుళ్ళు అని జనులు పిలవడం వున్నది. జైనశైవాల ప్రాగ్రూపం ఒక్కటేనేమో! సింధునాగరికతనాటి మతమదేనేమో! మొత్తం మీద రాక్షసులు వైదికధర్మ విదూరులు కాబట్టి దుర్మార్గులుగా చిత్రింపబడివుంటారు. వైదికధర్మభిన్నమైన ధర్మం, వర్ణాశ్రమ ధర్మానికి భిన్నమైన నైతిక జీవనవిధానం వారికి ఉండివుంటుంది. రావణుడు శాస్త్రవేత్తగా చెప్పబడినాడు. అతడు గొప్ప శివభక్తుడు కూడ. యజ్ఞయాగాది విధులు లేని శైవధర్మాన్ని రాక్షసులు అవలంబించి వుంటారు. రాక్షస జాతి నైతికంగా ధార్మికంగా భిన్నమైనది. విభీషణుని వంటి శరణాగతుల సహాయంతో ఆ భిన్న ధార్మిక నైతిక విధానాలను జయించటమే రామాయణ కావ్యంలో చిత్రించబడిందని చెప్పాలి. ఇటువంటి ధార్మిక నైతిక విధానాల మీద విజయమే కాక రామాయణంలో ఆదర్శవంతమైన గృహస్థజీవిత విధానం చిత్రించబడింది. వాల్మీకి రామాయణకథ అతడు చెప్పినట్లుగా తుచ తప్పకుండ జరిగి వుండకపోవచ్చును. కాని ఏదో కొంత సత్య సంఘటన మీదనే అతని కథ ఆధారపడి వుంటుంది. కావ్యకళ కొరకు అతడు చేసిన మార్పులు తప్పక చాల వుండి వుంటవి. ప్రభు ధర్మాన్ని, ఆదర్శ గార్హస్థ్యజీవితాన్ని వాల్మీకి భవ్యంగా చిత్రించదలచుకొన్నాడు. సమాజానికి నీతి ధర్మం శీలం సదాచరణ మొదలైన వాటిని బోధించాలనే తపన ఫలితంగానే ఈ కావ్యం పుట్టి వుంటుంది. అటువంటప్పుడు వాల్మీకి సత్య సంఘటనలల్లో ఏవో కొన్ని మార్పులను చేసివుంటాడనటమే సహజం.

## రామాయణ మహాభారతాలల్లో ఏది ముందు?

ప్రాచీన భారతీయ సంప్రదాయాన్ననుసరించి రామాయణం మహాభారతం కన్న ప్రాచీనమైన రచన. రామాయణ కథ మహాభారతంలో చెప్పబడింది కాని మహాభారత కథగాని పాత్రలుగాని రామాయణంలో ఎక్కడా చోటు చేసుకోలేదు. అంతేగాక రామాయణంలో వర్ణింపబడిన రాజకీయ పరిస్థితులు మహాభారతం కన్న ప్రాచీనమైనవిగా కన్పిస్తున్నవి. మరియు రామాయణంలో వర్ణింపబడిన భారతదేశం గాని దానిలోని రాజ్యాలు

రాజులు గాని మహాభారతానికి పూర్వమైనవని అనిపిస్తున్నవి. దక్షిణభారతంలో వానరులున్నట్లుగాను, అక్కడ నాగరికత వికసించనట్లుగాను వాల్మీకి వర్ణనలనుబట్టి తెలుస్తున్నది. మహాభారతం నాటికి దక్షిణభారతంలో రాజ్యాలు వెలసినవి. ఆ రాజులు కురుక్షేత్ర యుద్ధంలో పాల్గొన్నారు. మహాభారతంలో యుద్ధ విధానం సైతం రామాయణంలో కన్న అభివృద్ధి చెందినట్లు గోచరిస్తున్నది. ఈ కారణాలన్నీ రామాయణం మహాభారతం కన్న పూర్వ రచన అని తేలుతున్నది. భారతీయ సంప్రదాయాన్ననుసరించి రామావతారం కృష్ణావతారం కన్న ముందు, దీన్ని అనుసరించి కూడ రామాయణమే ప్రాచీనమైందని సమర్థించవచ్చును. రామాయణమే మొదట రచింపబడిందని యాకోబి సమర్థించాడు. రామాయణం ప్రభావంతోనే మహాభారతం మహా కావ్య రూపాన్ని ధరించిందని అతని అభిప్రాయం, కాని చాలామంది ఆధునిక ప్రాచ్య పాశ్చాత్య విమర్శకులు రామాయణమే అర్వాచీనమని తలంచారు. రామున్ని దేవునిగా భావించటం కృష్ణున్ని దేవునిగా కొలవటం కన్న చాల తర్వాత ఆరంభమైందని చారిత్రక విమర్శకుల అభిప్రాయం. మహాభారతంలో చెప్పబడిన కథలు కొన్ని వేదమతం బాగా ప్రచారంలో వున్నప్పటివని, రామాయణంలో వేద ప్రతిపాదిత మతం ఎక్కడా కనబడదని, జనకుడు ఉపనిషత్తుల్లో ప్రసిద్ధమైన రాజా అని కాబట్టి రామాయణం మహాభారతం కన్న అర్వాచీన రచన అని వింటర్ నిట్స్ అభిప్రాయం. లోకంలో ప్రచారంలో వున్న రామ సంబంధ కథలే బౌద్ధ జాతక కథకు వాల్మీకి రామాయణ కథకు ఆధారమైనవని వింటర్ నిట్స్ అంటాడు. వేద సంబంధ కథలే రామాయణ కథారూపాన్ని ధరించనవని వేబర్, యాకోబీల అభిప్రాయాన్ని బట్టి వేదకాలానికి, రామాయణ కాలానికి చాల వ్యత్యాసం వున్న దనడానికి వీలున్నదని వింటర్ నిట్స్ అంటాడు. మహాభారతంలో రామాయణ కథ వుండటంచేత, హరివంశంలో రామాయణ నాటక ప్రసక్తి వుండటంచేత మహాభారతం అర్వాచీనమని చెప్పటానికి వీల్లేదు. రామాయణం యొక్క ప్రాచీనతను నిరూపించటానికే ఎవరో రామాయణ కథను దానిలో చేర్చివుంటారు. మహాభారతం నిరంతరంగా పెరుగుతూ వచ్చింది. క్రీ॥ శ॥ 2 శ॥ నాటికది ప్రస్తుత రూపాన్ని సంతరించుకొన్నది. మహాభారతం తుది రూపాన్ని ధరించకముందే రామాయణ రచన జరిగింది. అంటే రామాయణ రచన తర్వాత కూడ మహాభారతంలో ప్రక్షిప్తాలు చేరుతూనే వున్నవి. రామాయణ రచన తర్వాతనే మహాభారతం తుదిరూపాన్ని దిద్దుకోవటంచేత మహాభారతం అర్వాచీనమనే వాదం బయలుదేరిందేమో! మహాభారతంలోని రామోపాఖ్యానం పూర్తిగా ఎటువంటి మార్పులు లేక వాల్మీకి కథనే అనుసరిస్తున్నది. ఎన్నో వాల్మీకి శ్లోకాల భావాలు మహాభారతంలో వున్నదున్నట్లుగా దింపబడినవి. దీన్ని బట్టి వాల్మీకి వ్యాసున్ని అనుకరించాడని కాక రామాయణం బాగా ప్రచారం పొందింతర్వాత ఎవరో వాల్మీకి కథను

మహాభారతంలో చేర్చి వుంటారని అనాలి. హోప్కిన్స్ అభిప్రాయంలోను రామాయణమే అర్వాచీనం. రామాయణం ఏక సూత్రంలో వుండి చక్కని కావ్యశిల్పం కలిగి వుండటమే దీన్ని సమర్థిస్తున్నదని అతను అంటాడు. మహాభారతంలో శ్లోకాలతోపాటు అక్కడక్కడ గద్యం ప్రయోగింపబడింది. ఈ రచనా విధానాన్ని బట్టి మహాభారతమే ప్రాచీన రచన అని నిర్ణయించవచ్చునని ఓల్డెన్‌బెర్గ్ అంటాడు. ఒకొక్కచోట మహాభారతభాష వైదిక గద్యానికి దగ్గరగా వున్నదని వింటర్‌నిట్జ్ గమనించి మహాభారతం ప్రాచీన రచనగా అంగీకరించాడు.

మహాభారత కథా సంఘటనల కన్న రామాయణ కథా సంఘటనలు ప్రాచీనమైనవని, వాల్మీకి అది దృష్టిలో వుంచుకొని కథను, కథలోని పరిస్థితులను ఆయుధాది విశేషాలను, సామరిక పద్ధతులను వర్ణించటానికి ప్రయత్నించాడేమో. అందుకే దీనిలోని యుద్ధవిధానాలు చాల ప్రాచీనమైనవిగా కన్పిస్తున్నవి.

మహాభారతం ఆలంకారిక శైలిలో కావ్యరూపంలో లేదు. జయేతిహాసం వేదాలల్లోని నారాశంసి గాథలకు దగ్గరగా వున్నది. అదీగాక మహాభారతం ప్రధానంగా ఇతిహాస రచన. రామాయణంలో శైలి ఆలంకారికమైంది. దీనిలో కావ్య సామగ్రి అంతా ఏకత్రితమైంది. అంగి అంగరసాల పోషణ జరిగింది. ఉపాఖ్యానాలు, ధర్మ నీతి బోధనలతో మహాభారతం పురాణాల రచనా విధానానికి దగ్గరగా వున్నది. కాబట్టి రామాయణమే ఆదికావ్యమని వాల్మీకియే ఆదికవి అని అంగీకారయోగ్యమైంది. మహాభారతంలో కన్న రామాయణ కథాసంవిధానంలో ఐక్యత కన్పిస్తున్నది. భాష, కవిత్వం, ఛందస్సులల్లో పరిపూర్ణత కన్పిస్తున్నది. భావప్రకటనలో గల వక్రోక్తి నైపుణ్యం మహాభారతంలో రామాయణంలో వలె లేదు. రామాయణంలోని కావ్యకళయే తర్వాత కాళిదాసాదుల చేతిలో వికసించి స్థిరపడింది.

మహాభారతం, రామాయణాలల్లో చిత్రింపబడిన సామాజిక పరిస్థితులు విభిన్నంగా వున్నవి. మహాభారతం కథాసంఘటనలు మధ్య, పశ్చిమ, వాయవ్య భారత దేశంలో జరిగినవి. అది వీరుల యుగంగా కన్పిస్తున్నది. మహాభారతం యుద్ధాలు, రాజ్యవిస్తరణలతో నిండివున్నది. దానిలో ఒక మోటుదైన అవికసిత నాగరికత చిత్రింపబడగా రామాయణంలో వికసితమైన గొప్పనాగరికత కన్పిస్తున్నదని వింటర్‌నిట్జ్ అభిప్రాయం. ఆగ్నేయ తూర్పు దక్షిణ భారతదేశంలో రామాయణకథ సంఘటనలు జరిగినవి. మహాభారతానికి రంగభూమి మధ్యపశ్చిమ వాయవ్యంగా విస్తరించిన భూములు కాగా రామాయణానికి రంగభూమి తూర్పు దక్షిణ భారతదేశం. మహాభారత నాగరికతకు రామాయణ నాగరికతకు చాల అంతరం వున్నది. అయితే సూక్ష్మంగా పరిశీలిస్తే కనిపించే భేదం

కాలభేదాన్నిబట్టి ప్రాంతభేదాన్నిబట్టి కావ్య ప్రక్రియ భేదాన్ని బట్టి ఏర్పడిందని చెప్పవచ్చును. రామాయణంలో యుద్ధాదులు అంత అభివృద్ధి దశను అందుకోలేదని అనిపించినా ఇతర విషయాలను అంటె ముఖ్యంగా సదాదరణ, శీలం మొదలైనవాటి చిత్రణను భాష భావవ్యక్తీకరణలు తీసుకుంటె రామాయణం అర్వాచీన రచన అని తేలగలదు.

## రామాయణ కథ రూపాంతరాలు

వ్యక్తులజీవిత చరిత్రలను తీర్చిదిద్దగల రామాయణకథ భారతదేశం నలుమూలల్లోనేకాక ఖండాంతరాలల్లోను ప్రాచీన కాలంలోనే వ్యాపించింది. అట్లా వ్యాప్తి చెందేటప్పుడు ఆ కథ కాల, ప్రాంతభేదాలనుబట్టి ఎన్నో రూపాలను సంతరించుకొన్నది. భారతదేశంలో వివిధ ఆస్తికనాస్తిక మతాల ప్రభావాలనుబట్టి, ప్రాంతీయ భేదాలనుబట్టి రామాయణకథ నానా రూపాలను ధరించింది. బౌద్ధులల్లో జైనులల్లో రామాయణకథ ప్రచలితమైంది. బౌద్ధసాహిత్యంలో దశరథజాతకకథ పేరుతో రామాయణకథ రూపాంతరంచెంది కన్పిస్తున్నది. బౌద్ధజాతకకథ అయిన దశరథ జాతకకథలోని రాముడు బుద్ధుని పూర్వ జన్మావతారంగా చెప్పబడినాడు. ఈ కథానుసారంగా దశరథుడు వారాణసి రాజు. అతనికి 1600 మంది భార్యలున్నారు. పట్టపురాణికి ఇద్దరు కొడుకులు, ఒక కూతురు పుట్టారు. కొడుకుల పేర్లు రామలక్ష్మణులు కూతురుపేరు సీత. పట్టపురాణి మరణించగా రాజు మరొక రాణిని పట్టపురాణిగా చేసుకున్నాడు. ఆమెకు కలిగిన కుమారుడు భరతుడు. రాజు ఇచ్చిన వరం ప్రకారం ఆ రాణి తనకొడుకుకు రాజ్యమియ్యమని కోరింది. అటువంటప్పుడు రామ లక్ష్మణులకు రాజధానిలో క్షేమంలేదని వారిని 12 సంవత్సరాలు అరణ్యవాసం చేసి తన మరణానంతరం వచ్చి రాజ్యమేలుకొండని దశరథుడు ఆదేశిస్తాడు. రామలక్ష్మణులతోపాటు వారి చెల్లెలు సీత కూడ పోతుంది. దశరథుడు 12 సంవత్సరాలకు మరణిస్తాడని జ్యోతిషులు చెప్తారు. కాని 9 సంవత్సరాలకే అతడు మరణిస్తాడు. భరతుడు అరణ్యానికి పోయి తండ్రి మరణవార్తను రామునికి వినిపిస్తాడు. రాముడు నిర్వికారచిత్తంతో ఆ వార్తను వింటాడు. స్థితప్రజ్ఞుడైన రాముని శీలాన్ని చిత్రించటమే ఈ కథ ప్రధానోద్దేశం. భరతునికి రాముడు తన పాదుకలనిచ్చి వీటిని రాజస్థానంలో వుంచమని, 3 సంవత్సరాల తర్వాత తాను వచ్చి రాజ్యభారాన్ని గ్రహిస్తానని చెప్పి పంపిస్తాడు. తండ్రి ఆదేశానుసారంగా 12 సంవత్సరాల అరణ్యవాసాన్ని పూర్తిచేసుకొని రాముడు సీతాలక్ష్మణులతో వారాణసి తిరిగి వస్తాడు. మంత్రులు సీతను రామునికి పట్టపురాణిని చేసి రాజ్యాభిషేకం చేస్తారు. తర్వాత రాముడు 16,000 సంవత్సరాలు రాజ్యం చేస్తాడు.

జైన సాహిత్యంలోను రామాయణ కథ చాల ప్రాధాన్యం వహించింది. విమలసూరి (క్రీ.శ. 3వ శ॥) అన్న జైనకవి మహారాష్ట్ర ప్రాకృతంలో రామాయణ కథను "పఉమచరిఅ" అనే కావ్యంగా రచించాడు. దాన్ని ఆధారంగా కన్నడభాషలో నాగచంద్రుడు రామచంద్రచరిత్ర పురాణాన్ని రచించాడు. " పఉమచరిఅ"లో రామాయణ కథ చాలమట్టుకు వాల్మీకి రామాయణ కథను పోలివున్నా కవి జైనధర్మానుగుణంగా మార్పులను కూడ చేసాడు. దశరథునికి నలుగురు భార్యలనటం నలుగురికి నలుగురు కుమారులు జర్మించటం, రాముని నిష్క్రమణ తర్వాత దశరతుడు జినదీక్షను పొందటం, జనకునికి సీత, ప్రభామండలుడన్న కవలలు జన్మించటం, ఒక రాక్షసుడు ప్రభామండలున్ని ఎత్తుకొని పోవటం, ప్రభామండలుడు సీతను వివాహమాడదలచి చెల్లెలని తెలుసుకొని ఊరడిల్లటం, లక్ష్మణుడు దండకారణ్యంలో శత్రుందముని కూతురు జితపద్మను వరించి వివాహమాడటం, రామునిచేతిలో కాక లక్ష్మణుని చేతిలో రావణుడు చావటం, గర్భవతి అయిన సీతను ఆమె దాయాదవర్గంలోనివాడే (అంటే వాల్మీకి కాక) రక్షించటం, పతివ్రతను త్యజించిన రామునిమీదికి లవకుశులు యుద్ధానికి పోవటం, నారదుడు ఆ కవలలు రాముని బిడ్డలే అని తెలపటం మొదలైన అవాల్మీక సంఘటనలు పఉమచరిఅలో ఉన్నవి. జైనధర్మంలో అహింసాసిద్ధాంతం చాల ప్రధానమైంది. అహింసావ్రతంచేత కర్మ నశిస్తుంది. కర్మక్షయంచేత నిర్వాణం కలుగుతుంది. రామునిలో కర్మక్షయాన్ని కవి వర్ణించి అతన్ని స్థితప్రజ్ఞ లక్షణాలు కలవానిగా చిత్రించాడు. అందుకే రావణున్ని రాముడుకాక లక్ష్మణుడు చంపినట్లుగా కవి కల్పన చేశాడు. ఇదిగాక రవిసేనుడన్న జైనకవి సంస్కృతంలో రామాయణాన్ని వ్రాసాడు. దానిలో సీత రావణుని కూతురు, దానిలోను రాముడుకాక లక్ష్మణుడే రావణున్ని చంపుతాడు.

రామాయణ కథ టిబెట్, చైనా, మంగోలియా, జపాన్, థాయిలాండ్, కంపూచియా, బర్మా, సింహళ, ఇండోనేషియా వంటి సుదూర దేశాలకు వ్యాపించింది. ఆయా దేశాలల్లో కథ ఆయా ఆచార వ్యవహారాల కనుగుణంగా మారుతూ వచ్చింది. ఆయా దేశాల జానపద కథల, పాత్రల ప్రభావం కూడ రామాయణ కథ, పాత్రల మీద కన్పిస్తుంది. ఉదా॥కు కంపూచియాలో వ్యాప్తిలోవున్న రామాయణ కథలో సీత రావణుని కూతురు, మారీచుడుకాక ఇంద్రుడు బంగారు లేడి రూపాన్ని ధరించి వస్తాడు. సుగ్రీవుని కన్నీటి ధారలచేత ఏర్పడిన నదీప్రవాహాన్ని అనుసరించి వచ్చి రాముడు అతన్ని కలుసుకుంటాడు. హనుమంతుడు రామునికిని "సన్‌బెన్‌సే" అన్న స్త్రీకి పుట్టిన కుమారుడు, సేతువు నిర్మాణానికి ఏడు సంవత్సరాలు పట్టింది. రావణుని బొమ్మను చిత్రించటంచేత సీత రామునిచేత

త్యజింపబడింది. ఇటువంటి విచిత్ర కల్పనలెన్నో దేశాంతరాలల్లో వ్యాపించిన రామాయణాలల్లో కన్పిస్తున్నవి.

వాల్మీకి రామయణ కథను, కథా ఘట్టాలను తీసుకొని తర్వాత సంస్కృత కవులు, దేశభాషా కవులు కావ్యాలుగా, రూపకాలుగా రచించారు. అట్లా కావ్య, రూపకాలుగా మార్చుకొనేటప్పుడు ఆయా ప్రక్రియలకు అనుగుణంగా మార్పులు చేశారు. అంతేగాక సమకాలిక నీతిధర్మాల కనుగుణంగా, ప్రజల అభిరుచిని, జానపదుల కథలను అనుసరించి, ఒక్కొక్కసారి అద్భుత చమత్కారసాధన కొరకు కథలో మార్పులు, చేర్పులు చేస్తూవచ్చారు.

## ఆధ్యాత్మ రామాయణం

ఆధ్యాత్మ రామయణంలో సీతకాక మాయసీత రావణునిచేత చెరగొని పోబడుతుంది. సీత పవిత్రతను కాపాడేందుకే ఈ కల్పన చేయబడింది. "హెలెన్'అన్న ప్రసిద్ధ గ్రీకు నాటకంలో నిజమైన హెలెన్ ట్రాయ్‌కు తీసుకొని పోబడినట్లుగా కాక, ట్రాయ్ యుద్ధం జరిపించాలనే ఉద్దేశంతో దేవతలు మాయా హెలెన్‌ను సృష్టించి పారిస్ చేత తీసుకొని పోబడినట్లుగా కల్పన చేయబడింది. యుద్ధం జరుగుతున్నప్పుడు నిజమైన హెలెన్ ఈజిప్టులో వుంటుంది. యుద్ధమంతా అయిపోయింతర్వాత హెలెన్ భర్త మెనిలస్ ట్రాయ్ నుంచి వస్తూ ఓడ విరిగి ఈజిప్టు చేరుకొని ఆటవికుల చేతిలో చిక్కుకొని నిజమైన హెలెన్ సహాయంతో రక్షింపబడుతాడు. అక్కడి నుంచి వాళ్ళిద్దరు పారిపోయి స్వదేశం చేరుకొని సుఖంగా వుంటారు. నైతికసూత్రం కొరకు గ్రీకు కవులు ఇట్లా మాయాపాత్రలను సృష్టించటమున్నది. అదేవిధంగా ఆధ్యాత్మ రామాయణంలోను మాయాసీత పాత్ర సృష్టి చేయబడింది.

## రామాయణ లోక ప్రియత్వం

భారతదేశంలో ఏ దేశ భాషలోనైనా రామాయణ కావ్యానికిగాని, రామాయణ కథకుగాని ఉన్నంత లోకప్రియత్వం మరి దేనికి లేదు. రామాయణ కథ దేశభాషల్లోనే కాదు సంస్కృతంలోనే అనేక కవులచేత కావ్య నాటకాలుగా వ్రాయబడి లోకాదరణను పొందింది. మానవ, ప్రభుధర్మాలకు రాముడు, సోదరధర్మానికి భరత లక్ష్మణులు, సతీధర్మానికి సీత ఆదర్శమూర్తులుగా గుర్తించని సంఘం, జాతి భారతదేశంలో లేదు. రామాయణ కథనేకాక రాముని పూర్వజుల ధర్మచరిత్రలను కాళిదాసు రఘువంశ మహాకావ్యంగా రచించాడు.

వాల్మీకి భాష, కవితా ప్రభావాలు కాళిదాసు మీద వున్నవనటం సర్వసువిదితం. రామాయణ కథ సేతుబంధ, భట్టి, జానకీహరణం వంటి కావ్యాలుగా రచింపబడినవి. ఇక రామాయణ కథ రూపకాలుగా వ్రాయబడింది. అవి లెక్కలేనన్నివిగా వున్నవి. వాటిలో ప్రముఖమైనవి - ప్రతిమ, అభిషేక, యజ్ఞఫల, మహావీరచరిత్ర, ఉత్తర రామచరిత్ర, అనర్ఘరాఘవ, బాలరామయణ, ప్రసన్న రాఘవ మొదలైనవి. వీటిల్లో పాత్రచిత్రణ, రసపోషణ, నాటకీకరణం కొరకై కవులు ఎన్నో మార్పులు చేసారు. భోజలక్ష్మణకవులు రామాయణాన్ని చంపూకావ్యంగాను వ్రాసారు. అంతేగాక వాల్మీకి రామాయణకావ్యం తర్వాత అనేక కవుల కావ్యాలకు మూలప్రేరణ అయిందనటంలో సందేహం లేదు.

భారతీయ ధార్మిక నైతిక గార్హస్థ్య జీవితాలకు రామాయణం అద్దం పడ్తున్నది. మాతాపితల, సోదర, మిత్ర, సేవక, పరిజన, పతిపత్నీ ధర్మాలను ఈ కావ్యం వ్యంగ్యం చేస్తున్నది. రామాయణం భారతీయ గృహస్థాశ్రమ ధర్మాన్ని బోధించే మహాకావ్యమని బల్దేవ ఉపాధ్యాయ పరిగణించారు. గార్హస్థ్యజీవితం యొక్క ఆదర్శ పూరితమైన ఉజ్జ్వల చిత్రణ మనకు దీనిలో కన్పిస్తున్నది. హిందూమతం ఇతర మతాలవలె నైతిక విలువలను బోధించేమతం కాదని పాశ్చాత్యులంటారు. కాని రామాయణ మహాభారతాలు లౌకిక జ్ఞానాన్ని, నైతిక ధార్మిక విలువలను బోధించే మహాగ్రంథాలు. యుగయుగాలుగా జాతి చరిత్రను చక్కదిద్దే రామాయణ మహాకావ్యాన్ని ఏదో ఆధునిక ఆర్థిక విలువల, యాంత్రిక పరిశ్రమల నడుమ లేచిన సిద్ధాంతాలను ఆదర్శంగా పెట్టుకొని విమర్శించటం అంత సమంజసమైన పనికాదు. జాతీయ కావ్యాలకు విపరీతార్థాలను చెప్పి ప్రజలను పెడత్రోవలను పట్టించటం ఏమంత ఉచితం కాదు. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత పాశ్చాత్య దేశాలల్లో ధార్మిక, నైతిక, గార్హస్థ్య జీవిత విధానాలల్లో చాలా మార్పులు వచ్చినవి. వాటిని ఆధారంగా, స్త్రీ పురుషుల స్వేచ్ఛా జీవితం ఆదర్శంగా రామాయణాన్ని దుయ్యబట్టటం ఉచితం కాదు.

## రామాయణ మహాకావ్యత్వం

రామాయణం సంస్కృతంలో ఆదికావ్యమనటంలో ఏమి సందేహం లేదు. మూల మహాభారతం నారాశంసిగాథ రూపంలో వున్న ఇతిహాసకావ్యం. తర్వాత దానిలో అనేక ఉపాఖ్యానాలు, ధర్మోపదేశాలు చేర్చబడి బృహద్రూపాన్ని పొందింది. ఒక పురాణ రూపాన్ని

ధరించింది. ఏకసూత్రతత అనే కావ్య ప్రధానతత్త్వం దానిలో లోపించింది. కావ్యకళ చాలామట్టుకు మృగ్యమైంది. కాని ఎడారిలో ఒయాసిస్సుల్లాగ మహాభారతంలో అక్కడక్కడ కథాకథనచాతుర్యం, వర్ణనలు, ఆలంకారికశైలి లేకపోలేదు. కాని అవి దానికి మహాకావ్యరూపాన్ని సంపూర్ణంగా ఇయ్యలేకపోయినవి. అంతేగాక దానిలోని కథ దాయాదుల నడుమ జరిగిన రాజ్యవిభాగ సంబంధ కథ. చాల విశాలమైంది. అనేక పాత్రలు దానిలో వున్నవి. దానిచేత కథ ఒక మహారణ్యం వలె కన్పిస్తున్నది. రామాయణంలో వలె విభావానుభావాదుల చేత పోషింపబడిన ప్రధాన రసంతో, అవాంతర కథలు ఎక్కువగా లేక ఆద్యంతం సంఘటనలతో ముందుకు నడుస్తున్న ఫలోన్ముఖమైన వస్త్వైక్యత గల ప్రధానకథ మహాభారతంలో లేదు. ఈ గుణాలన్నిటిని కలిగిన రామాయణం సంస్కృతంలో ప్రప్రథమ కావ్యంగా నిలుస్తున్నది.

రామాయణంలో ప్రధానరసం కరుణరసం. అసలు రామాయణ కావ్యోత్పత్తి కరుణం నుంచే ఉద్భవించింది. రామాయణంలో ఆరంభంనుంచి అంతం వరకు కరుణరసం అభివ్యంజితమై వున్నది. సందర్భానుకూలంగా శృంగార, వీర, అద్భుత, హాస్య, రౌద్రాదులు పోషింపబడినవి. రామాయణం రసాభివ్యక్తికే ప్రాధాన్యమిచ్చింది. ఇక ధార్మిక నైతిక విలువలను బోధిస్తున్నదంటె అది కాంతాసమ్మిత రూపంలోనే. మహాభారతం కాంతాసమ్మితత్వంగా కాక మిత్రసమ్మిత రూపంగా వుందని చెప్పాలి. మహాభారతంలో రాజకీయాలు, ఎత్తుకు పైయెత్తులు వీటికే ప్రాధాన్యం. మహాభారతం మనస్సును ఆలోచించేటట్లు చేస్తుంది. రామాయణం హృదయాన్ని కదిలించివేస్తుంది.

## రామాయణ శైలి

వాల్మీకిశైలి ప్రసాదగుణభరితమైంది. అతనిశైలి వస్తురస వ్యంజకంగా వున్నది. లలిత సరళపదాల కూర్పు వాల్మీకి ప్రత్యేకత. వాల్మీకి కవిత్వ మంతా ధారాశుద్ధితో మాధుర్య భరితమై పాఠకులను అలరిస్తున్నది. సందర్భానుకూలంగా వాల్మీకి ఉపమ, ఉత్ప్రేక్ష, రూపకాద్యలంకారాలను ప్రయోగించాడు. అక్కడక్కడ అప్రయత్నంగా ప్రయోగింపబడిన శబ్దాలంకారాలు కవిత్వానికి శోభనిచ్చినవి. వస్తువర్ణనలల్లోను వాల్మీకిది అందెవేసిన చేయి. అతడు చేసిన ఋతువర్ణనాదులు మనోహరాలైనవి. ఏ వస్తువును వర్ణించినా కనులకు కట్టేట్లుగా ప్రసన్న శైలిలో వాల్మీకి వర్ణించాడు. సరళ శైలిచేత అతని కవిత్వం కవితా గుణాన్ని పోగొట్టుకోలేదు. పుర, ఉద్యాన పర్వత, అరణ్య, ఋతు, చంద్రోదయ, ఆశ్రమ, యుద్ధాది వర్ణనలు తర్వాత మహాకావ్యాలకు ఆదర్శమైన వర్ణ్య వస్తువులైనవి. ఈ వర్ణనలన్ని సహజరమణీయంగా వున్నవి. కవిత్వమంతా రసప్లావితమైంది.

## రామాయణంలో సమకాలీన సమాజ చిత్రణ

రామాయణంలో రాముని సచ్చరిత్ర చిత్రణ ప్రధానంగా జరిగినా ఆయాచోట్ల సమకాలిక సమాజ చిత్రణ కూడ లభిస్తున్నది. సాంస్కృతిక, ధార్మిక, నైతిక, రాజనైతిక, ఆర్థిక సంబంధ సమాజ స్వరూపాన్ని వాల్మీకి అనేకచోట్ల చిత్రించాడు. ప్రాచీన భారతదేశంలోని సౌహార్ద, పరోపకారాలతో కూడిన ప్రజల జీవితాన్ని రామాయణం గొప్పగా చిత్రిస్తున్నది. ప్రాచీన కాలంలో భారతదేశంలో కుటుంబ వ్యవస్థ, జీవన విధానాలను తెలుసుకోవటానికి రామాయణం ఆదర్శమైన గ్రంథం. రాజనీతి, సమకాలిక రాజకీయాలు ప్రధానంగా మహాభారతంలో చిత్రింపబడినవి. రామాయణంలో గార్హస్థ్య జీవితంలోని నీతి ధర్మాలు చిత్రింపబడినవి. పితృవాక్పరిపాలన, మిత్ర భ్రాతృప్రేమ, పతీపత్నుల ప్రేమస్నేహాలు ఎట్లాంటివో రామాయణంలో చెప్పబడినవి. భారతీయుల నిస్స్వార్థమైన, కాంక్షారహితమైన మానవ ప్రేమ, అతిథిప్రేమలను వాల్మీకి ఎంతో బాగా చిత్రించాడు. రామాయణాన్ని చదివిన విదేశీయులకు భారతీయుల సమాజ, కుటుంబ జీవనక్రమం సుబోధకం కాగలదు. జాతి హృదయాన్ని బంధించి కావ్యరూపంలో పెట్టిన వాల్మీకి ధన్యుడు. అందుకే అతడు మనకు కాళిదాసువలె ప్రియమైనవాడు. జాతియొక్క నాడిని తెలుసుకొని స్పందింపజేసే శక్తి వారిద్దరికున్నది. అటువంటివారే జాతీయ కవులనబడ్తారు.

రామాయణ కాలంలో సమాజం ధార్మిక ప్రవృత్తి కలది. సత్యవాక్పరి పాలన వారి ప్రధాన కర్తవ్యం. ముఖ్యంగా రాజు సత్యధర్మాలను అనుష్ఠించే వాడుగా ఉండాలి. రాజు ప్రజలకు ఆదర్శంగా నిలవాలి. అప్పుడే రాజ్యం సుఖసంతోషాలతో కూడి వుంటుంది. రామాయణ కాలంలో స్త్రీలకు గౌరవ సన్మానాలుండేవి. అన్ని ధర్మకర్మానుష్ఠానాలు భార్యతో కలిసే భర్త నిర్వహించేవాడు. కుటుంబంలో స్త్రీదే ప్రధానపాత్ర. స్త్రీలు ఆ కాలంలో ధర్మపరాయణలుగా, నీతికుశలురుగా, పాండిత్యం కలవారుగా ఉండేవారు. పతి సేవయే స్త్రీకి ప్రథమ కర్తవ్యం. పత్నికి సుఖసంతోషాల నియ్యటమే భర్త ప్రథమ ధర్మం. కాని ధర్మానుష్ఠాన సమయంలో భర్త భార్య పుత్రులు అనే మోహాన్ని త్యజించి కఠోరంగా ప్రవర్తించగల నియమపాలనాశక్తి వారికుండేది. తల్లిదండ్రులకు సంతానం మీద అతివాత్సల్యం, సంతానానికి తల్లిదండ్రులమీద భక్తి గౌరవాలుండేవి. బహుభార్యాత్వం ప్రచారంలో లేదని చెప్పలేము. కాని పురుషుని పరస్త్రీ వ్యామోహం సంఘంలో నిరసింపబడేది. వైవాహిక జీవితాన్ని సుఖమయం చేసుకోవాలంటే భార్యభర్తల నడుమ ప్రేమ వుంటే సరిపోదు. ఒకరి మీద ఒకరికి విశ్వాసముండాలి. స్త్రీలకు భర్తలను వరించే హక్కు వుండేది. కాని గాంధర్వ ప్రణయ వివాహాలున్నట్లు కన్పించదు.

ఋషులు, మునులు అరణ్య ప్రాంతాలల్లో ఆశ్రమాలను ఏర్పరచుకొని నివసించేవారు. వారి కర్మానుష్ఠానాదులు సక్రమంగా నడిచేటట్లుగా చూసే బాధ్యత రాజుపై వుండేది. యుద్ధంలో ధనుర్బాణాలే ప్రధాన ఆయుధాలు. ఎక్కువగా రథ, భట సైన్యమే వుండేది. ప్రయాణాదులకు రథాలనే ఉపయోగించేవారు. రాజు పురోహిత మంత్రుల సహాయంతో రాజ్యాన్ని పరిపాలించేవాడు. రాజు యథేష్టంగా ఆచరించేవాడుకాదు. ప్రజాభిమతానుసారంగా అతడు నడుచుకోవలసివుండేది. ఈ విధంగా రామాయణ కాలంనాటి సమాజం అన్ని విధాల ఉన్నతదశలో వుండి సుఖశాంతులతో వుండేదని తెలుస్తున్నది. ఇదంతా వేదరచనానంతరపు ఉపనిషత్కాల సంస్కృతికి దగ్గరగా వున్నట్లు గోచరిస్తున్నది.

# మహా కావ్యాలు

## కావ్యోత్పత్తి - వికాసాలు

వేదాలల్లో కొన్ని సూక్తాలల్లోనే మనకు ఆదిఋషుల కావ్యహృదయం గోచరిస్తున్నది. కతిపయ అలంకారాలతో కూడిన హృదయ రంజకాలైన భావాలు, వస్తువర్ణనలు వేదాలల్లో వున్నవి. వేదాలల్లో కేవలం ధార్మిక, తత్త్వ సంబంధ విషయాలు లేవు. వేదకాలం నాటి దేవతలు చాలా మట్టుకు ప్రకృతిశక్తులే. ఈ ప్రకృతి శక్తులను స్తుతించేటప్పుడు ఋషులు నీరసమైన శుష్కమైన భాష, భావాలను కాక అలంకారాలతో కూడిన సరసమైన రమణీయమైన కావ్యశైలిని ప్రయోగించారు. ఋగ్వేదంలోని ఉషస్సూక్తం ఆదిఋషుల ఉన్నత కవితా ప్రతిభకు చక్కని ఉదాహరణగా నిలుస్తున్నది. అదేవిధంగా నారాశంసి అనబడే ఋక్కులల్లోను, ఉదారులైన రాజుల స్తుతులల్లోను అందమైన కావ్యశైలి కన్పిస్తున్నది. తర్వాత బ్రాహ్మణ గ్రంథాలల్లోను ఆయా రాజుల జీవితసంఘటనలు కావ్యశైలిలో, సరసకవిత్వంలో వ్రాయబడినవి. ఐతరేయ బ్రాహ్మణంలోని శునశ్శేపాది ఆఖ్యానాలల్లో ఇటువంటి కావ్య గుణాలను దర్శించవచ్చును. వేద బ్రాహ్మణాదుల్లోని పాత్రలను, ఆఖ్యానాలను ఆధారంగా గ్రహించి లౌకిక సంస్కృత కవులు కావ్యనాటకాలను రచించారు. ఉదా॥కు కాళిదాసు విక్రమోర్వశీయ నాటకం. వేదాదుల్లోనే సరససుందర భావాలతో కూడిన కావ్యశైలి కన్పిస్తున్నా సంస్కృత సాహిత్యంలో కావ్యరచనా సంప్రదాయం వాల్మీకి రామాయణంతో ఆరంభమౌతున్నది. రామాయణం కన్న ముందు మహాభారత రచన జరిగింది. కాని మహాభారతం వివిధ యుగాలల్లో జరిగిన ప్రక్షిప్తాలతో అనంతంగా పెరుగుతూ వచ్చింది. కొంత వరకు కావ్యత్వం వున్నా దానిలో పురాణ ధర్మనీతి శాస్త్రాదుల లక్షణాలు ప్రాధాన్యం వహించినవి. అది అఖ్యానోపాఖ్యానాలతో విశాల కాయాన్ని సంతరించుకొన్నది. ఈ ఆఖ్యానోపాఖ్యానాలు తరువాతి కవుల కావ్యవస్తువులకు మూలస్రోతస్సులైనవి. ఏకనాయకాశ్రితమైన ఆద్యంతం వస్తుసమైక్యత కలిగి అంగాంగిరస పోషణలుగల కావ్యాన్ని రచించే ప్రథ వాల్మీకి రామాయణంతోనే ఆరంభమైంది. ఇతివృత్త నిర్వహణలోను కావ్యశైలిలోను మహాభారతం కాక వాల్మీకి రామాయణం ఆదర్శమైంది. రామాయణంలో సరసకవిత్వం, ప్రకృత్యాది వర్ణనలు, సుందరశైలి. ఛందోరామణీయకత కావ్యేతివృత్తానికి పోషకాలైనవి. భావానుగుణమైన, రసానుగుణమైన భాషను శైలిని వాల్మీకి ప్రయోగించాడు. ఈ గుణాలే తర్వాత కావ్యకవులకు ఆదర్శాలైనవి.

బౌద్ధమత వ్యాప్తితో, శకుల దండయాత్రలతో సంస్కృత పురోభివృద్ధి ఆగిపోయిందని, కుషాణులు భారతదేశంలో రాజ్యాన్ని సుస్థిరం చేసుకొన్న తర్వాత వారి ఆస్థానంలో సంస్కృతభాష, సాహిత్యాలు పునరుజ్జీవితమైనవని మాక్స్‌ముల్లర్‌వంటి పాశ్చాత్య విమర్శకులు అభిప్రాయపడినారు. లౌకిక సంస్కృత సాహిత్య వికాసం కుషాణులతోనే ఆరంభమైందని వారంటారు. వాల్మీకి తర్వాత వెలసినకవి అశ్వఘోషుడు అని అభిప్రాయపడినట్లయితే ఈ వాదంలో కొంత సత్యమున్నదని చెప్పవచ్చును. కాళిదాసు అశ్వఘోషునికి ముందు క్రీ.పూ. ప్రథమ శతాబ్దమని అంగీకరించినట్లయితే కుషాణులకు పూర్వమే సంస్కృత సాహిత్యం పునరుజ్జీవితమైందని చెప్పాలి. అయినా కొంతకాలం సంస్కృత పురోభివృద్ధి ఆగిందని చాలామంది విమర్శకులు అంగీకరించేవాదం కాదు. విజాతీయుల దండయాత్రలతో సంస్కృత సాహిత్యగతి ఒకప్పుడు మందంగా, మరొకప్పుడు వేగంగా సాగిందని చెప్పటం సత్యమే కాని బౌద్ధమత వ్యాప్తితో, విజాతీయుల దండయాత్రలతో పూర్తిగా దానిగతి నిరోధింపబడిందనటం హాస్యాస్పదం. అట్లా అయినా వాల్మీకి తర్వాత కావ్యకళను చేపట్టి ఉద్ధరించినవాడుగా కాళిదాసే కన్పిస్తున్నాడు. వాల్మీకి కాళిదాసుల నడుమ దాదాపు 800 సంవత్సరాలు సంస్కృతంలో ఏ మహాకావ్యరచన జరుగలేదన్నది అసంభవంగానే కన్పిస్తున్నది. ఆ సమయంలో రూపకాలు ఆఖ్యానాలు, కావ్యాలు రచింపబడినవని ఒకటి రెండు నిదర్శనాలున్నవి. పాణిని (క్రీ.పూ. 5వ శ॥) పాతాళవిజయం, జాంబవతీ పరిణయం అనే కావ్యాలను రచించినట్లు సుభాషిత గ్రంథాలు, అలంకారశాస్త్రాలనుబట్టి తెలుస్తున్నది. రాజశేఖరుడు ఆ కావ్యాల రచయిత, వ్యాకరణకారుడు పాణిని ఒక్కరే అని అంగీకరించాడు. భండార్కర్. పీటర్సన్ వంటి ఆధునిక విమర్శకులు కావ్యకర్త పాణిని, అష్టాధ్యాయికర్త పాణిని వేరు వేరు వ్యక్తులని అభిప్రాయపడినారు. పాణిని వ్యాకరణ సూత్రాలకు విరుద్ధమైన ప్రయోగాలు వాటిల్లో కన్పిస్తున్నవని, కాబట్టి తత్‌కావ్యకర్త వ్యాకరణకారుడైన పాణిని కాదని వారన్నారు. అంతేగాక పాతాళవిజయం, జాంబవతీ పరిణయం అన్నవి ఒకే కావ్యానికి గల రెండు పేర్లు కూడా కావచ్చు అని వారు తలంచారు. పిశెల్ మొదలైన విమర్శకులు వైయాకరుణుడు పాణినియే కావ్యకర్త అని అంగీకరించారు. సదుక్తికర్ణామృతంలో కాళిదాసు భవభూతి సు బంధులతో పాటు వైయాకరణుడు పాణిని కావ్యకర్తగా స్తుతింపబడినాడు. తర్వాత పతంజలి (క్రీ.పూ. 150 ప్రాంతం) మహాభాష్యంలో కావ్యశైలిలో కూర్చబడిన శ్లోకాలను ఉద్ధరించాడు. వరరుచి లేక కాత్యాయనుడు కావ్యకర్త అని పతంజలి ఉద్ధరణను బట్టి తెలుస్తున్నది. రాజశేఖరుడు వరరుచికావ్యం పేరు కంఠాభరణమని తెలిపాడు. వరరుచి పాటలీపుత్రనగర రాజు మహానందుని మంత్రి అని ప్రసిద్ధి. కాత్యాయన గోత్రజుడు కావటంచేత అతనికి కాత్యాయనుడని కూడ పేరు. ఈ వరరుచి సమయం

భండార్కర్‌ను అనుసరించి క్రీ.పూ. 400 ప్రాంతం. పతంజలి మహాభాష్యంలో కంసవధ, బలివధ అన్న నాటకాలను, వాసవదత్త, సుమనోత్తర, భైమరథి అన్న అఖ్యాయిక కావ్యాలను పేర్కొన్నాడు. ఇవి గద్యకావ్యాలో పద్యకావాలో చెప్పలేము. అయినా దీన్ని బట్టి కాళిదాసుకు పూర్వం అంటే వాల్మీకి తర్వాత కావ్యాలు వ్రాయబడినవి, కాని అవి లుప్తమైనవన్న నిర్ణయానికి రావచ్చును.

దాదాపు పతంజలి కాలంవాడే అయిన పింగళుడు లేక పింగళనాగుడు ఛందస్సూత్రమనే ఛందశ్శాస్త్ర గ్రంథాన్ని వ్రాసాడు. దానిలో వైదిక ఛందస్సుల కన్న లౌకిక ఛందస్సులకే ప్రాధాన్యమియ్యబడింది. లౌకిక ఛందస్సులను గూర్చి అతడు చర్చించినాడంటే అప్పటికి ఒక రామాయణ కావ్యమే కాక ఇతర కావ్యాలు కూడ వుండేవని చెప్పవచ్చును. పతంజలి తర్వాత కొద్ది కాలానికే నివసించిన కాళిదాసులో ఈ కావ్యకళ సంపూర్ణంగా వికసించి మన్ననలను పొంది వుంటుంది. అప్పుడు కాళిదాసు కావ్యాల ముందు ప్రాచీన కావ్యాలు సూర్యుని ముందు దివిటీల వలె వెలవెలపోయి వుంటవి. వాటిని ఆదరించేవారు లేక కాలగర్భంలో కలిసిపోయి వుంటవి. కాళిదాసు వాల్మీకి తర్వాత కొన్ని శతాబ్దాల తర్వాత వెలిసినా వాల్మీకి కావ్యకళను చిగిరించి పుష్పించేటట్లు చేసి వాల్మీకికి చక్కని వారసుడైనాడు.

కొందరు సంస్కృత సాహిత్యకారులు సంస్కృత కావ్య సంప్రదాయం ప్రాకృత కావ్య సంప్రదాయం నుంచి వికసించిందని అభిప్రాయపడ్తున్నారు. ప్రజలభాష అయిన ప్రాకృతంలో మొదట కావ్యాలు వ్రాయబడినవని వారి అభిప్రాయం. క్రీ.పూ. 2వ శ॥ నుంచి క్రీ.శ. 2 వ శ॥ వరకు సంస్కృతంలో కావ్యశైలిలో రచన ఏదీ జరుగలేదని, ఈ కాలంలో ప్రాకృతభాష రాజాస్థానాలల్లో గౌరవం పొంది దానిలో కావ్యాలు వ్రాయబడినవని, ఈ కావ్యశైలికి ఉదాహరణలు హాలుని గాథా సప్తశతి బృహత్కథలు అని వింటర్‌నిట్స్ అభిప్రాయం. గాథాసప్తశతి, బృహత్కథవంటి కావ్యరచనలే కాక బౌద్ధుల థేరిగాథలల్లో కావ్యశైలి కన్పిస్తున్నదని, నాసిక్ శిలాశాసనంలో (క్రీ.శ. 154 ప్రాంతం) చక్కని ప్రాకృత శైలిలో గల ప్రాకృతగద్యం వున్నదని ఇటువంటి ప్రాకృత కావ్యశైలీ సంప్రదాయం సంస్కృతంలోకి పాకిందని ప్రాకృతాభిమానులైన విమర్శకుల తలంపు. కాని ఇది పూర్తిగా సమర్థింపదగిన వాదం కాదు. వేదాలల్లోనే మనకు కావ్యశైలి దర్శనమిస్తున్నది. తర్వాత వ్యాస వాల్మీకి కవులల్లో సంస్కృత కావ్యసంప్రదాయం వికసించి పాణిని పతంజలి నాటికి ప్రచలితమైంది. క్రీ.పూ. ప్రథమ శతాబ్దిలో కాళిదాసు వంటి కవులల్లో సంపూర్ణవికాసం చెందింది. ప్రజలు మాట్లాడే భాష అయినా ప్రాకృతంలో సుసంస్కృతమైన భావాలు గల వక్రోక్తి భరితమైన, నానా అలంకార శోభితమైన కావ్యశైలి మొదట ఆరంభమై తర్వాత సంస్కృతంలోకి ప్రవేశించిందనటం

సమంజసంగా లేదు. బౌద్ధులు మొదట జనుల భాష పాళీ ప్రాకృతాలను తమ సాహిత్య భాషగా గ్రహించినా తర్వాత శాస్త్ర వాదాలల్లో వైదిక పండితాదులతో చర్చలు చేయటానికి తిరిగి వారు సంస్కృతాన్నే అభ్యసింపవలసి వచ్చింది. మెలమెల్లగా వారు ప్రాకృతాన్ని విడిచి సంస్కృతాన్ని చేపట్టారు. అశ్వఘోషాది బౌద్ధ కవులు సాహిత్యభాషగా సంస్కృతాన్నే గ్రహించారు. సమస్త భారతీయ సంస్కృతి సాహిత్య శిల్పాది కళలు బౌద్ధమత వికాసం తర్వాతనే వికసించినవని నమ్మే విమర్శకులు కొందరున్నారు. అలెగ్జాండరు దండయాత్రతో గ్రీకు శాస్త్ర సాహిత్య కళలతో సంపర్కమేర్పడిం తర్వాత భారత దేశంలో శాస్త్ర సాహిత్య కళలు అభివృద్ధి ఉన్ముఖమైనవని కొందరు గుడ్డిగా నమ్మితే బౌద్ధమత వికాసంతోనే భారతదేశంలో సాహిత్యాది కళలు వికసించిన వని గుడ్డిగా నమ్మే విమర్శకులు కూడ వున్నారు.

## మహాకావ్య సంప్రదాయం

"మహత్ కావ్యమ్" మహాకావ్యమౌతుంది. మహాకావ్యమంటే గొప్ప లేక పెద్ద కావ్యమని అర్థం. భాషను నేర్చిన మానవుడు భావావేశంతో హృదయానుభూతులను గానం చేసిననాడే కావ్యసంప్రదాయం పుట్టింది. కావ్యశైలి వేద బ్రాహ్మణాది సాహిత్యంలో కన్పిస్తున్నది. తర్వాత వ్యాసునిలో మహాకావ్య సంప్రదాయం కొంతవరకు తొంగిచూచింది. ఇక వాల్మీకిలో మహాకావ్య సంప్రదాయం ఒక స్వరూపాన్ని ఏర్పరచుకొని నిలిచింది. అట్లా స్వరూపాన్ని ఏర్పరచుకొన్న మహాకావ్యానికే కాళిదాస భారవ్యాది కవులు నగిషీలు చెక్కి తీర్చిదిద్దారు.

## మహాకావ్య లక్షణాలు

లబ్ధ కావ్యశాస్త్రాలల్లో భామహుని కావ్యాలంకారంలో మొదటిసారిగా మహాకావ్య లక్షణాలు చెప్పబడినవి. మహాకావ్యం సర్గబంధంతో కూడి మహాపురుషుని చరిత్ర నిబద్ధమై, అర్థసౌష్ఠవంతో కూడి, మంత్రణ, దౌత్య, యుద్ధ, నాయకాభ్యుదయాది వర్ణనలు కలిగి పంచసంధి సమన్వితమై వుండాలని భామహుడు లక్షణాలను నిర్దేశించాడు. తర్వాత దండి, అగ్నిపురాణకారుడు, హేమచంద్రుడు, రుద్రటుడు, విశ్వనాథుడు, విద్యానాథుడు, మొదలైన అలంకార శాస్త్రకారులు మహాకావ్య లక్షణాలను దాదాపు ఇదేవిధంగా చెప్పారు. భామహుని తర్వాత మహాకావ్య వర్ణ్యవస్తువుల సంఖ్య పెరిగింది.

విశ్వనాథుడు మహాకావ్యలక్షణాలనీ విధంగా చెప్పాడు -

సర్గబంధో మహాకావ్యం తత్రైకో నాయకః సురః
సద్వంశః క్షత్రియో వాపి ధీరోదాత్త గుణాన్వితః
ఏకవంశభవా భూపాః కులజా బహవోఽపి వా
శృంగార వీరశాంతానా మే కోంగీ రస ఇష్యతే
అంగాని సర్వే ఽపి రసాః సర్వే నాటక సంధయః
ఇతిహాసోద్భవం వృత్తమన్యద్వాసజ్జనాశ్రయమ్
చత్వారస్తస్య వర్గాః స్యుస్తేష్వేకం చ ఫలంభవేత్
ఆదౌనమస్క్రియా శీర్వా వస్తు నిర్దేశ ఏవ వా
క్వచిన్నిందా ఖలాదీనాం సతాం చ గుణకీర్తనమ్
ఏక వృత్తమయైః పద్యైరవసానే ఽన్య వృత్తకైః
నాతి స్వల్పా నాతి దీర్ఘాః సర్గా అష్టాధికా మతా
నానా వృత్తమయః క్వాపి సర్గః కశ్చన దృశ్యతే
సర్గాంతే భావి సర్గస్య కథాయాః సూచనంభవేత్
సంధ్యాసూర్యేందు రజనీప్రదోష ధ్వాంతవాసరాః
ప్రాతర్మధ్యాహ్న మృగయాశైలర్తు వనసాగరాః
సంభోగ విప్రలంభౌచ మునిస్వర్గ పురాధ్వరాః
రణ ప్రయాణోపయమ మంత్ర పుత్రోదయాదయః
వర్ణనీయా యథాయోగం సాంగోపాంగా అమీ ఇహ

సాహిత్యదర్పణమ్ : 6 : 315 - 324

**సర్గలు** - మహాకావ్యం సర్గలుగా విభజింప బడాలని లాక్షణికులందరు అంగీకరించారు. వాల్మీకి రామాయణం సర్గలుగానే విభజింప బడింది. సర్గలు సుదీర్ఘంగా వుండకూడదని దండి చెప్పాడు. విశ్వనాథుని అనుసారంగా మహాకావ్యంలో ఎనిమిది సర్గలుండాలి. కాని కవులు ఈ నియమాన్ని పాటించినట్లు లేదు. ప్రతిసర్గ చివర రాబోయే సర్గలోని విషయసూచన చేయాలని, సర్గలోని వర్ణ్య విషయానుసారంగా సర్గలకు నామకరణం చేయవచ్చునని విశ్వనాథుడు చెప్పాడు. ఇట్లా నామకరణం వాల్మీకి రామాయణంలో జరిగింది. సర్గలో అంతటా ఒకే విధమైన ఛందస్సును ప్రయోగించి, సర్గ చివర విభిన్నమైన ఛందస్సులను ప్రయోగించాలని దండ్యాదుల అభిమతం. చాలామట్టుకు కవులు ఈ నియమాన్ని అనుసరించారు. విశ్వనాథుడు సర్గలో ఒకే ఛందస్సుకాక విభిన్నమైన ఛందస్సులను కూడ ప్రయోగించవచ్చునని అన్నాడు. దీన్ని కూడ కవులు చాలామంది అనుసరించారు.

**ఇతివృత్తం - నాయకుడు -** ఇతివృత్తం సదాశ్రయమై వుండాలని భామహుని మతం. ఉదాత్తచరిత్ర మహాకావ్యంలో నిబంధించబడాలని ఆలంకారికులందరు అంగీకరించారు. ఇతివృత్తం పంచసంధులతో కూడి వుండాలని భామహదండ్యాదు లందరు చెప్పారు. ఏదో ఒక విధమైన వస్త్వైక్యత సాధింపబడాలని, ఇతివృత్తం బీజారోపణాదులతో నాటకంలో వలె ఏకసూత్రంలో బంధింపబడి పాఠకుల కుతూహలాన్ని నిలుపాలనే ఉద్దేశంతో లాక్షణికులు పంచసంధులను విధించారు. రఘువంశాది కావ్యాలల్లో ఇతివృత్తం సూర్యవంశరాజుల చరిత్ర అన్న ఏకసూత్రంలో బంధింపబడింది. దీనిలో పంచసంధులు పాటింపబడలేదు. కాని ఏకనాయకాశ్రితాలైన కిరాతార్జునీయ శిశుపాలవధవంటి కావ్యాలల్లో సంధుల ననుసరిస్తు ఇతివృత్తక్రమం వికసించటాన్ని చూడవచ్చును. మహాకావ్యంలో కథ ప్రఖ్యాతంగాని కల్పితంగాని, కొంత ప్రఖ్యాతం, కొంత కల్పితంగాని వుండవచ్చునని రుద్రుటుడంటాడు. మహాకావ్యం నాయకాభ్యుదయాన్ని గురించి చెప్పేది కాబట్టి దానిలో నాయకునిదే ప్రధాన పాత్ర అని తెలుస్తున్నది. కావ్యారంభంలో నాయక ప్రశంస చేయాలని, కావ్యమంతటా అతని చరిత్ర విస్తరించాలని భామహ రుద్రటాదుల అభిప్రాయం. రుద్రటుని అనుసారం నాయకుడు రాజు అయి వుండాలి. అతడు ప్రఖ్యాతుడైనా కావచ్చును లేదా కల్పితవ్యక్తి అయినా కావచ్చును. అతడు ధర్మార్థకామాలల్లో ఆసక్తుడై వుండాలి. అతడు గుణవంతుడు, కులవంతుడు కావాలి. విశ్వనాథుని అనుసారంగా నాయకుడు దేవతాపురుషుడుగాని ఉన్నత వంశజుడైన క్షత్రియుడుగాని కావాలి. విశ్వనాథుడు బహునాయకులు కావ్యంలో వుండవచ్చునని అనుమతించాడు. బుద్ధచరిత్ర, సౌందరనంద, సేతుబంధ, కిరాతార్జునీయ, శిశుపాలవధాధి కావ్యాలు ఏకనాయకాశ్రితమైనవి. రఘువంశం మొదలైనవి బహునాయకాశ్రితాలైనవి. ఏకనాయకాశ్రితమైన కావ్యాలు కొన్నిటిలో నాయకుని చరిత్రలో ఏదో ఒక ఘట్టాన్ని తీసుకొని రచించటం జరుగుతుంది. సౌందరనంద, శివుపాలవధాది కావ్యాలు ఇటువంటివే. మరికొన్నిటిలో నాయకుని సంపూర్ణ చరిత్ర అంటే జన్మం మొదలుకొని చిత్రింపబడుతుంది. బుద్ధచరిత్ర, గౌడవధ ఇటువంటి కావ్యాలే. వీటిల్లో నాయకుని చరిత్ర కథాత్మకం (narrative) గా వుంటుంది. ఏకనాయకాశ్రితమైన కావ్యాలల్లోలాగ పంచసంధులతో కూడ కథావికాసం వీటిల్లో సామాన్యంగా వుండదు. జైనసంబంధమైన "చరిత్ర" కావ్యాలు ప్రాకృత అపభ్రంశభాషల్లోని కావ్యాలు చాలామట్టుకు ఇట్లా వుంటవి.

**రసం -** మహాకావ్యాలల్లో శృంగారంకాని వీరంకాని ప్రధానరసంగా పోషింపబడాలని లాక్షణికుల అభిమతం. విశ్వనాథుడు శాంతరసాన్ని కూడ మహాకావ్యంలో అంగిరసంగా

పోషించవచ్చునని చెప్పాడు. బుద్ధచరిత్రాదుల్లో శాంతమే అంగిగా వున్నది. మహాకావ్యంలో నాయకాభ్యుదయం కూర్చబడాలని లాక్షణికులు చెప్పటంచేత నాయకుడు అధర్మానుయాయులైన వారిని జయించి, విజేతయై ధర్మరక్షణ చేయటం ప్రధానంగా వర్ణింపవలసివుంటుంది. నైషధీయ చరిత్రవంటి కావ్యాలల్లో నాయకుని ప్రణయం, పరిణయంమాత్రమే చిత్రింప బడినవి. కాని మిగతా సంస్కృత మహాకావ్యాలల్లో ఎక్కువ యుద్ధం, నాయకుని విజయమే చిత్రింపబడింది. రఘువంశంలో రఘు, అజ, శ్రీరాములయుద్ధం ధర్మస్థాపన, కుమారసంభవంలో కుమారస్వామి జననం, తారకాసుర విజయం దేవతలను రక్షించటం, కిరాతార్జునీయంలో కిరాతార్జునుల యుద్ధం, అర్జునుని పాశుపతాస్త్రప్రాప్తి, శివుపాలవధలో కృష్ణుడు శిశుపాలుని వధించటం ప్రధానంగా చిత్రింపబడినవి. అంటే సంస్కృతకావ్యాలల్లో ఎక్కువగా వీరమే అంగిరసంగా కన్పిస్తున్నది. తర్వాత శృంగారం అంగిరసస్థానాన్ని సంపాదించింది.

**కథలో మార్పులు** - కావ్యేతివృత్తం రెండు విధాలుగా వుంటుంది. ప్రఖ్యాతం, కల్పితం. కల్పితేతివృత్తం కవి మస్తిష్కం నుండి పుట్టింది. అది అతని కల్పనా ప్రతిభ మీద ఆధారపడింది. ప్రఖ్యాతేత్రివృత్తం అంటే కవి పురాణాదుల నుంచి తీసుకొన్న కథావస్తువు. అంటే అట్లా తీసుకొన్న కథావస్తువులో కవి తాను గ్రహించిన ప్రక్రియ కనుగుణంగా, రసపోషణ కొరకై మార్పులను చేయవచ్చునని లాక్షణికులు అంగీకరించారు. కావ్యకారుడు విభావానుభావసంచారుల ఔచిత్యంచేత రమణీయమైన కథాశరీరాన్ని గ్రహించాలని ఇతివృత్తగతమైన అనౌచిత్యాలున్న వాటిని తొలగించి రసోచితంగా మార్చాలని ఆనందవర్ధనుడు అంటాడు.

ఇతివృత వశాయాతాం త్యక్త్వా z ననుగుణాం స్థితిం
ఉత్ప్రేక్ష్యాz ప్యంతరాభీష్ట రసోచిత కథోన్నయః ధ్వన్యా 3-11

రసానుగుణంకాని ఇతివృత్తాన్ని విడిచిపెట్టాలని లేక మార్చాలని ఆనంద వర్ధనుని అభిమతం.

**వర్ణనలు** - మహాకావ్యంలో వర్ణనలు ప్రధానాంగం. పుర, ఉద్యాన, పర్వత, నది, వనవిహార, జలవిహార, ఆశ్రమ, మృగయా, దౌత్య, ప్రయాణ, యుద్ధ, సూర్య చంద్రోదయాస్తమయ, సంయోగ వియోగ శృంగారాది వర్ణనలు సందర్భాను కూలంగా నాతివిస్తరంగా వర్ణించాలని ఆలంకారికులు నిర్దేశించారు. సమయోచితమైన వర్ణనలను కాళిదాసు భారవిమాఘ బాణ శ్రీహర్షాది కవుల కావ్యాలల్లో చూడవచ్చును. కాని వాల్మీకి

కాళిదాసులలో వున్నంత నాత్యలంకార చమత్కృతులతో కూడిన ప్రకృత్యాది వర్ణనలు రాను రాను లోపించినవనే చెప్పాలి. భారవి మాఘులనాటికి కావ్యంలో వర్ణనాప్రాధాన్యం. ఉక్తివైచిత్రి ప్రాధాన్యం ఎక్కువైనట్లుగా చూడ వచ్చును. ఇంకా తరువాత కవులల్లో వర్ణనా బాహుళ్యం విపరీతంగా పెరిగి కథా సంవిధానానికి తావు లేకుండ పోయింది. ఒకరిని మించి ఒకరు ఉక్తి కథనాచమత్కృతికే పోటిపడి ప్రాముఖ్యాన్ని ఇయ్యసాగారు.

ఈ విధంగా వేదాలల్లోని నారాశంసిగాథల నుంచి ఇతిహాస కావ్యం, ఇతిహాస కావ్యం నుంచి కథాప్రాముఖ్యం, వర్ణనా సౌందర్యం, రసవ్యంజకతలతో కాంతా సమ్మిత రూపంగా నీతి ధర్మబోధకమైన మహాకావ్య స్వరూపం వికసించింది. ఈ మహాకావ్య పరంపరలో ఆద్యుడు ఆదికవి వాల్మీకికాగా తద్వికాసానికి కారకుడు కవి కులగురువు కాళిదాసు.

## కాళిదాసు

(కాళిదాసు కాలనిర్ణయాన్ని గురించి రూపక ప్రకరణంలో చర్చింపబడింది)

కాళిదాసు రచనలల్లో రెండు మహాకావ్యాలున్నవి. 1) కుమార సంభవం 2) రఘువంశం.

### కుమార సంభవం

రఘువంశం కన్న కుమారసంభవం మొదట వ్రాయబడిందని విమర్శకుల అభిప్రాయం. రఘువంశం ఆరంభంలో అతడు చూపిన వినయం అతని పరిపక్వతను ప్రకటిస్తున్నది. కుమార సంభవం ఆరంభంలో తనను గురించి గాని కావ్యాన్ని గురించిగాని ఏమి చెప్పలేదు. కావ్యారంభం వస్తునిర్దేశంతోనే ఆరంభమైంది.

కుమార సంభవంలో 17 సర్గలున్నవి. వీటిల్లో మొదటి 8 సర్గలే కాళిదాస విరచితాలని, మిగిలినవి ఎవరో అతని శైలిని అనుకరిస్తు రచించి చేర్చారని ఒక అభిప్రాయమున్నది. మల్లినాథుడు 8 సర్గలకు మాత్రమే వ్యాఖ్యానాన్ని వ్రాయటం ఈ అభిప్రాయాన్ని ముఖ్యంగా బలపరుస్తున్నది. కాళిదాసు కావ్యరచనోద్దేశం కుమారుని జననం వరకే చెప్పటం కాని కుమారుడు తారాకాసురున్ని జయించటం కాదని, కావ్యనామమే దాన్ని సూచిస్తున్నదని విమర్శకుల అభిప్రాయం. 9వ సర్గ తర్వాతగల శివపార్వతుల శృంగారక్రీడ వర్ణనలు అనౌచిత్యంగా వున్నవని వాటిని కాళిదాసు వంటి కవి వ్రాసివుండడని కొందరు

విమర్శకుల అభిప్రాయం. కాని 8వ సర్గలో కథ హఠాత్తుగా ఆగిపోతున్నది కాబట్టి కాళిదాసు 8 సర్గల తర్వాతి కావ్యాన్ని కూడ వ్రాసి వుంటాడని కొందరు తలంచారు. కాని 8వ సర్గలోని శివపార్వతుల రతివర్ణనతో కుమారసంభవ సూచన జరిగిందని అక్కడే ఔచితీ మంతంగా కాళిదాసు కావ్యసమాప్తి చేసివుంటాడని, 8 సర్గల వరకే కాళిదాసు రచన అని గాఢంగా నమ్మేవారు సమర్థిస్తున్నారు. 8వ సర్గలో శివపార్వతుల రతిని వర్ణించటంచేత కాళిదాసు కుష్ఠురోగ పీడితుడైనాడని దానిచేత కావ్యం అసంపూర్ణంగా మిగిలిపోయిందని ఒక కింవదంతి. లోకానికి మాతాపితలైన, సృష్టికర్తలైన శివపార్వతుల సంభోగాన్ని మానవీయ రూపాన్నిచ్చి వర్ణించటం అనౌచిత్యమని కొందరు విమర్శకుల అభిప్రాయం. ఈ సర్గం యొక్క ఔచిత్యానౌచిత్య విషయంలో ఆలంకారికులల్లో మతభేదమున్నది. మమ్మటాదులు దీన్ని అనౌచిత్యంగా గ్రహించారు. కాని ఆనందవర్ధనుని వంటివారు - మహాకవులెందరో దేవతల శృంగారాన్ని వర్ణించారని, దానిలో గ్రామ్యత్వమేమి లేదని, దానిలోని అనౌచిత్యం కవి ప్రతిభచేత కప్పివేయబడ్తుందని చెప్పి కాళిదాసుయొక్క శివపార్వతుల సంభోగ శృంగారవర్ణనలో దోషం లేదని సమర్థించారు. శైలి, భాష, అలంకార రచనలు అన్నీ కాళిదాసు రచనను పోలివుండగా 9 నుంచి 17 సర్గల వరకు కాళిదాసు వ్రాయలేదనటం సమంజసం కాదని, మరోకవి ఎంత అనుకరించినా అనుకరణ అనుకరణలాగానే మిగిలిపోతుంది కాని ముమ్మూర్తులా అట్లా వుండదని 17 సర్గలు కాళిదాసు రచనే అని విశ్వసించేవారు అంటారు. మల్లినాథుడు చివరి 9 సర్గలకు వ్యాఖ్యానం వ్రాయలేదంటే దానికి కారణం మరేదైనా అయివుంటుందని వారి అభిప్రాయం. మల్లినాథునికి పూర్వం అరుణగిరినాథుడు రఘువంశంలో 8 సర్గలకే వ్యాఖ్యానం వ్రాసాడు. కాబట్టి అక్కడ రాని అనుమానం ఇక్కడ రావటానికి వీల్లేదు.

కుమారసంభవ కథను శివ, పద్మపురాణాలనుంచి కాళిదాసు తీసుకొన్నాడని అంటారు. ఈ పురాణాలు ఏ కాలానివో నిర్ణయించటం కష్టం. క్రీ.పూ. ప్రథమ శతాబ్దానికి ఈ పురాణాలున్నవో లేవో కూడ నిర్ణయించి చెప్పలేనప్పుడు కాళిదాసు కథను అక్కడి నుంచి తీసుకొన్నాడని తేల్చలేము. శివపార్వతుల వివాహం, కుమారసంభవాది వృత్తాంతాలు లోకంలో ఏదో రూపంలో తప్పక వ్యాప్తిలో వుండివుంటవి. అంతేగాక మహాభారతంలో కూడ కుమారసంభవ కథ వున్నది. మహాభారత కథతో పోలిస్తే కాళిదాసు అనేక నూత్నకల్పనలు చేసాడని చెప్పవచ్చును.

కుమార సంభవకథ హిమాలయ వర్ణనతో ఆరంభమౌతున్నది. పార్వతి జననం, విద్యాభ్యాసం, శివుని తపస్సు, మదనదహనం, పార్వతి తపస్సు, వటువు వేషంలో శివుడువచ్చి పార్వతిని పరీక్షించటం, శివుడు పార్వతిని స్వీకరించటం, శివపార్వతుల వివాహం, వారి శృంగార క్రీడలు, కుమారుని జననం, కుమారుడు తారకాసురుని జయించటం మొదలైన ప్రధాన సన్నివేశాలు ఈ కావ్యంలోవున్నవి. కావ్యారంభంలోని హిమాలయవర్ణన, తృతీయసర్గలోని వసంతర్తు వర్ణన, చతుర్థసర్గలోని రతీవిలాపం, పంచమసర్గలోని శివపార్వతుల సంవాదం, కవి యొక్క ప్రతిభా జనిత సన్నివేశాలు.

కాళిదాసు రచనలను పరిశీలించి నట్లయితే అతడు శైవుడుగా కన్పిస్తాడు. పేరును బట్టి కాళీ ఆరాధకుడని కూడ ఊహింపబడుతున్నది. శివభక్తుడు కాబట్టి శివపార్వతుల కథను తీసుకొని మహాకావ్యంగా రచించాడు. కాళిదాసు శివభక్తుడైనా హరివిద్వేషి కాడు. "రామాభిధానో హరిరిత్యువాచ" (రఘు 13-1) అని హరి అవతారమైన రాముని వంశచరిత్రను రఘువంశ కావ్యంగా రచించాడు.

## రఘువంశం

దిలీపుడు మొదలుకొని అగ్నివర్ణుని వరకు రఘువంశ రాజుల వృత్తాంతం రఘువంశ మహాకావ్యంలో నిబంధింప బడింది. రఘువంశ రచనకు పూనుకోవటానికి కాళిదాసుకు చాల సంకోచం కలిగినట్లుగా వున్నది. తాను ఆ వంశచరిత్రకు న్యాయాన్ని కూర్చకలుగుతానో లేదో అని అనుమానం, తన ప్రతిభమీద సందేహం అతనికి కలిగినవి. అదే అతని పరిపక్వదశను సూచిస్తున్నది. కాళిదాసు రఘువంశ రాజుల ఉదాత్త గుణాలను పేర్కొని అవే తనను వారి చరిత్రను వ్రాయటానికి ప్రేరేపించినవని తెలిపాడు. (1-9).

రఘువంశంలో 19 సర్గలున్నవి. రఘువంశ రాజులల్లో ప్రముఖమైనవారి చరిత్రను విశదంగాను, మిగతావారి చరిత్రను సంగ్రహంగాను వర్ణించి మరీ అప్రధానమైన వారిని నామమాత్రంగా పేర్కొని కవి రఘువంశ కావ్యాన్ని రచించాడు. మొదటి 9 సర్గలల్లో దిలీప, రఘు, అజ, దశరథుల చరిత్రలు వర్ణింపబడినవి. తర్వాత 9 నుండి 15 సర్గలల్లో శ్రీరాముని చరిత్ర వున్నది. చివరి నాలుగు సర్గలల్లో కుశుడు మొదలుకొని అగ్నివర్ణుని వరకు గల 24 రాజుల చరిత్ర వర్ణింపబడింది. వాల్మీకాదుల రచనలచేత ప్రేరేపితుడై కాళిదాసు రఘువంశాన్ని రచించాడని ఈ క్రింది శ్లోకాన్ని బట్టి చెప్పవచ్చును.

అథవా కృతవాగ్ద్వారే వంశేz స్మి న్పూర్వ సూరిభిః
మణౌ వజ్రసముత్కీర్ణే సూత్ర స్యే వాస్తి మేగతిః

రఘువంశ రాజులల్లో దిలీప, రఘు, అజ, శ్రీరాముల చరిత్రలనే కాళిదాసు విశదంగా, ఉత్తమంగా రచించాడు. దిలీపుని సేవాపరాయణతను, రఘుమహారాజు దాన నిరతిని, అజుని కోమల స్వభావాన్ని, శ్రీరాముని ఆదర్శ.జీవితాన్ని కవి సర్వోత్తమంగా చిత్రించాడు. సుదక్షిణ దౌహృదవర్ణన, రఘువు దిగ్విజయవర్ణన, అజుని ప్రయాణవర్ణన, అజుని చూడటానికి వచ్చిన పుర స్త్రీల వర్ణన, పంచమ సర్గలో ప్రభాత వర్ణన, ఇందుమతీ స్వయంవర వర్ణన, ఇందుమతీ అజుల వివాహ వర్ణన, వీటన్నిటిని కవి దీర్ఘంగా ఆలంకారిక శైలిలో ఉదాత్తంగా రచించాడు. ఈ కావ్య వర్ణనలు తర్వాతి కవులకు ఆదర్శాలైనవి.

రఘువంశ కావ్యంలో 19 కాక 25 సర్గలుండేవని అంటారు. కాని మల్లినాథుని వ్యాఖ్యానంతో మనకు 19 సర్గలే ఇప్పుడు లభిస్తున్నవి. పురాణాలల్లో అగ్నివర్ణుని తర్వాత ఇంకా 27 మంది రాజులున్నట్లు చెప్పబడింది. వారిని వర్ణించక అగ్నివర్ణుని విలాస జీవిత వర్ణనతో కవి హఠాత్తుగా కావ్యాన్ని ముగించి వేసాడు. కాబట్టి రఘువంశం చివరి భాగాలు లుప్తమైనవని కొందరు విమర్శకుల ఊహ. కాని అగ్నివర్ణుని తర్వాత ఎంతమంది రాజులున్నా వారిలో ఎవరు ఉదాత్త చరిత్ర కలిగి చెప్పుకోదగినవారు లేరు. అటువంటి వారి చరిత్రను చెప్పుకుంటు పోయినట్లయితే కావ్యం యొక్క ఉదాత్తత దెబ్బతింటుది. అగ్ని వర్ణుని వాసనామయ విలాసపూర్ణ జీవితంవల్ల ఆ వంశమంతరించిందని కవి సూచిస్తు వదిలివేసాడనాలి. కుమార సంభవంలో వలె విలాసశృంగార వర్ణనలను కాళిదాసు రఘువంశంలో చేయలేదు. వర్ణాశ్రమ ధర్మరక్షకులైన ఆదర్శ ప్రభువుల చరిత్రలను ఉదాత్తంగా చిత్రించి ఆదర్శ జీవన క్రమాన్ని కాళిదాసు పాఠకులకు బోధించాడు. అక్కడక్కడ శృంగార వర్ణనలున్నా అవి లలిత మనోజ్ఞంగానే వున్నవి కాని కుమారసంభవంలో వలె అతిగా లేవు.

కాళిదాసు కావ్యాలల్లోకెల్లా రఘువంశం ప్రసిద్ధమైంది. కాళిదాసును రఘుకారుడని కూడ పిలుస్తుంటారు. ("క ఇహ రఘుకారే న రమతే"). మహాకావ్య లక్షణాలన్ని రఘువంశంలో సమాహితమైనవి. ఇది కిరాతార్జునీయ, శిశుపాల వధాదుల వలె ఏక నాయకాశ్రితం కాకపోయినా, విభావానుభావాదుల చేత అంగిరస పోషణ ఆద్యంతం జరుగకపోయినా ఇది ఉదాత్తరాజుల చరిత్ర అనే ఏక సూత్రంలో నిబంధింపబడిన మహాకావ్యం. దీనిలో ధీరోదాత్తులైన రఘుకులోత్పన్నులైన రాజుల చరిత్రలను మహాకావ్య శైలిలో కాళిదాసు కూర్చాడు. అందుకేనేమో విశ్వనాథుడు మహాకావ్యం బహునాయకాశ్రితం కూడ కావచ్చునని అంగీకరించాడు.

రఘువంశంలో అంగిరసం వీరం. అగ్నివర్ణుని వృత్తాంతంలో శృంగారం, అజుని విలాపంలో కరుణ, ఆశ్రమ వర్ణనల్లో శాంతం, రఘు మహారాజు సర్వస్వ త్యాగంలో దానవీరం, రఘు, అజ, రాముల యుద్ధ సందర్భాలల్లో వీరం పోషింపబడినవి. కాళిదాసు రఘువంశంలో కథోపకథనాన్ని ప్రసన్న మధుర శైలిలో రమ్యంగా చేసాడు. ఆద్యంతం ఒక్క వ్యక్తి కథ నిబంధింపబడక పోయినా ఎక్కడా విసుగు పుట్టకుండ వేరు వేరు వ్యక్తుల చరిత్రను అతిరమ్యంగా కాళిదాసు కూర్చాడు. పాత్రచిత్రణ, సంవాద ఘట్టాలు, ప్రకృతి వర్ణనలు సహజంగా వున్నవి.

రఘువంశానికి అనేక టీకలు రచింపబడినవి. సుబోధకమైన సరళశైలిలో వున్నా ఈ కావ్యానికి ఎన్నో టీకలు వున్నవి. దీన్ని బట్టి ఈ కావ్యం యొక్క అంతస్సౌందర్యం ఎంత గొప్పదో ప్రకటమౌతున్నది. శబ్ద, అర్థ, అలంకారాలల్లోని వ్యంగ్య సౌందర్యాన్ని ఈ టీకలు బయటపెడ్తున్నవి. సంస్కృత కావ్య పఠనారంభాన్ని విద్యార్థులకు రఘువంశంతో చేయటం ప్రచారంలో వున్నది.

## కాళిదాసు కవిత్వం

కాదంబరీకర్త బాణుడు కాళిదాసు సూక్తివైచిత్రిని ఇట్లా ప్రశంసించాడు -

నిర్గతాసు న వా కస్య కాళిదాసస్య సూక్తిషు
ప్రీతిర్మధుర సాంద్రాసు మంజరీష్వివ జాయతే.

"రసమాధుర్యంచేత నిండిన కాళిదాసు సూక్తులు మంజరివలె ఎవరికి ఆనందాన్ని కలిగించవు?

ముక్తకకారుడు గోవర్ధనాచార్యుడు కాళిదాసు కవితను ఈవిధంగా ప్రశంసించాడు-

సాకూత మధుర కోమల విలాసినీ కంఠకూజిత ప్రాయే
శిక్షా సమయేపి ముదే రతిలీలా కాళిదాసోక్తిః.

"కాళిదాసు సూక్తి సాభిప్రాయం, మధురమైన కోమల విలాసిని కంఠస్వరం వలె పాఠకులకు ఒకవైపు ఉపదేశాన్నిస్తు రసానంద సాగరమగ్నులను చేస్తుంది."

కాళిదాసు కవిత్వం మధురమైంది. ప్రసాద అర్థవ్యక్తి గుణాలతో కూడిన వైదర్భిశైలి అతనిది. సరళసుందర భావకల్పనలు, సరసోదాత్తకోమలమైన భావాభివ్యక్తి, అలంకారాల

సహజ స్వాభావికమైన కూర్పు, సహజ మానవ హృదయ చిత్రణ, సహజసుందరమైన ప్రకృతివర్ణనలు, సూక్ష్మ పరిశీలనాశక్తితో కూడిన వివిధ వర్ణనలు, అశ్లీలతలేని కోమల సుందరమైన స్త్రీ వర్ణనలు, స్వభావోక్తులతో కూడిన సంవాదాలు కాళిదాసు కవిత్వాన్ని అద్వితీయం చేసినవి. అక్కడక్కడ అనౌచిత్యదోషాలను ఆలంకారికులు కాళిదాసు కవిత్వంలో ఎత్తిచూపినా అతనిది సాటిలేని మేటి కవిత్వమనే ఆలంకారికులు అంగీకరించారు. కాళిదాసు కవిత్వం అనితర సాధ్యమైన మార్గంలో నడిచింది.

"అనాఘ్రాతం పుష్పం కిసలయమలూనం కరరుహై
రనావిద్ధం రత్నం మధునవ మనాస్వాదిత రసమ్
అఖండం పుణ్యానాం ఫలమివ చ తద్రూపమనఘమ్"

ఇది శకుంతల సౌందర్యవర్ణన. శకుంతల సౌందర్యం వంటిదే కాళిదాసు కవితా సౌందర్యం. కాళిదాసు కవులల్లో అద్వితీయుడని ఒకానొక కవి ఇట్లా చమత్కరించాడు -

పురా కవీనాం గణనాప్రసంగే కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసా
అద్యాపి తత్తుల్యకవే రభావా దనామికా సార్థవతీ బభూవ.

"కవులెవరెవరని లెక్కించటం చిటికెనవేలుతో ఆరంభించి ఒకటి - కాళిదాసు, రెండు - ? యేకవి పేరు తగిలేదు. అందుకే చిటికెనవేలునుంచి రెండవ వేలుకు అనామిక అంటే నామరహితం అనే పేరు సార్థకమైందని కవి అంటాడు.

కాళిదాసు ప్రతిభాసంపన్నుడైన కవి. దేవతానుగ్రహలబ్ధం, వ్యుత్పత్త్యభ్యాసజనితం అని ప్రతిభ రెండు విధాలు. ఈ రెండింటిలో దేవతానుగ్రహలబ్ధ ప్రతిభ శ్రేష్ఠతరమైందని కొందరు లాక్షణికుల అభిప్రాయం. కాళిదాసు మొదట విద్యాగంధంలేని గొర్రెలను కాసే గొల్లవాడని, పాండిత్యంగల ఒకానొక రాకుమారి గర్వభంగం చేయదలచి సభాపండితులు గొల్లవానికి పండితవేషం వేసి వివాహం చేసారని, వివాహానంతరం అతని విషయం బయటపడిందని, ఆమె ఆదేశానుసారం కాళిమాతను సేవించి కాళిప్రసాదంచేత కవితాశక్తి పొందాడని ఒక ఐతిహ్యం. ఒకవేళ కాళిదాసు మొదట చదువుకోక తిరుగుతూవుండి, తర్వాత ఏకారణంచేతనో మార్పువచ్చి కాళిభక్తుడై శాస్త్రాదులను చదువుకొని వుంటాడని, అట్లా అతని కవితా ప్రతిభ ప్రకటమై కావ్యరచన చేసాడని ఈ ఐతిహ్యంద్వారా ఊహించవచ్చును. వివాహమాడిన రాకుమారి కాళిదాసును "అస్తి కశ్చిద్ వాగ్ విశేషః" అని అడిగిందని ప్రతిభాలాభం తర్వాత అతడు "అస్తి"తో ఆరంభించి కుమారసంభవాన్ని, "కశ్చిద్" తో ఆరంభించి మేఘసందేశాన్ని, "వాక్"తో ఆరంభించి రఘువంశాన్ని చెప్పాడని అంటారు.

కాళిదాసు కేవలం ప్రతిభగల కవే కాదు, అతడు వ్యుత్పత్తి సంపన్నుడు కూడ, లావణ్యంలేని రూపసంపద, రూపసంపదలేని లావణ్యం ఎట్లా సౌందర్యాధిక్యాన్ని వెల్లడింపజాలవో అదేవిధంగా ప్రతిభావ్యుత్పత్తులు ఒకదానితో ఒకటిచేరి వుంటాయన్న రాజశేఖరుని మతాన్ననుసరించి కాళిదాసు సహజ ప్రతిభతోపాటు వ్యుత్పత్తి సంపద కూడ కలవాడు. సాంఖ్యయోగాది దర్శన శాస్త్రాలల్లో, వ్యాకరణ, జ్యోతిష, రాజనీతి శాస్త్రాలల్లోను కాళిదాసుకు మంచి ప్రవేశమున్నది. పురాణ కథలతో అతనికి మంచి పరిచయమున్నది. కుమారసంభవం ద్వితీయ సర్గలో, రఘువంశం దశమ సర్గలోగల ఈశ్వరస్తుతిలో సాంఖ్య సిద్ధాంతాల ప్రతిపాదనను చూడవచ్చును. కాళిదాసు శివభక్తుడైనా నిరాకారుడు, నిర్గుణుడైన పరమాత్మ స్వరూపుడైన ఈశ్వరున్ని ఆరాధించాడు. తరువాత కవులవలె కాళిదాసు పాండిత్య ప్రదర్శనతో విషయాన్ని క్లిష్టం చేయలేదు. అతని లలిత వైదర్భిశైలిలో సహజ సరళసుందర మనోజ్ఞభావాలు నిండివున్నవి.

## కాళిదాసు ఉపమలు

"ఉపమా కాళిదాసస్య" అని ప్రసిద్ధి. కాళిదాసు ప్రయోగించిన ఉపమలు వస్తుయథార్థస్థితిని పాఠకులముందు నిలపటానికి సమర్థమైనవి. అతడు గ్రహించిన ఉపమాద్రవ్యాలన్ని ప్రకృతికి సంబంధించినవే. వ్యాకరణ శాస్త్ర సంబంధమైన ఉపమలు అక్కడక్కడ వున్నవి కాని అవి చాల తక్కువ.

యఃకశ్చన రఘూణాంహి పరమేకః పరంతపః
అపవాద ఇవోత్సర్గం వ్యావర్తయితు మీశ్వరః

"ఏవిధంగా వ్యాకరణంలో అపవాదసూత్రం వ్యాపకసూత్రాన్ని కూడ చెల్లకుండ చేస్తుందో అదేవిధంగా రఘువంశంలోని ప్రతిబాలుడు కూడ శత్రువును జయించ గలుగుతాడు".

ఇటువంటి శాస్త్రసంబంధమైన ఉపమలు కాళిదాసులో చాల తక్కువ. ప్రకృతిలోని రమణీయమైన వస్తువులనే ఉపమానవస్తువులుగా అతడు గ్రహిస్తుంటాడు.

ఆవర్జితా కించిదివ స్తనాభ్యామ్
వాసోవసానా తరుణార్కరాగమ్
పర్యాప్తపుష్ప స్తబకావ నమ్రా
సంచారిణీ పల్లవినీ లతేవ.

"ఎర్రని వస్త్రాలను ధరించి స్తనభారంచేత కొద్దిగా వంగిపోయి శివున్ని సేవించటానికి నడచివచ్చే పార్వతి పూలగుత్తులభారంచేత వంగిన ఎర్రగా చిగిర్చిన సంచారిణీలతవలె వున్న"దట.

నివాత పద్మస్తిమితేన చక్షుషా
నృపస్యకాంతం పిబతః సుతాననమ్
మహోదధేః పూర ఇవేందు దర్శనాత్
గురుః ప్రహర్షః ప్రబభూవనాత్మని

దీనిలో రెండు ఉపమలున్నవి. పుత్రజనన వార్తవిని దిలీపుడు వెంటనే అంతఃపురానికి పోయి వాయువు స్తంభించటంచేత నిశ్చలమైన కమలాలవలె నిశ్చలమైన కండ్లతో సుతాననాన్ని చూడసాగాడు. కాని అతని హృదయంమాత్రం పుత్రదర్శనం చేత చంద్రుని చూచిన మహాసముద్రంవలె ఉప్పొంగిపోయిందట!

తతో మందానిలోద్ధత కమలాకర శోభినా
గురుం నేత్రసహస్రేణ నోదయామాస వాసవః

ఇంద్రుడు తన వేయికండ్లను తిప్పి బృహస్పతివైపు చూచాడు. ఆ కదలిక మందపవనంచేత కమలవనం కదిలినట్లుగా వున్నదని కాళిదాసు ఉపమించాడు. కమలాలు, కలువలు, మందపవనాలు, పూలు, పూలగుత్తులు, చిగురుటాకులు, సరస్సులు, నదీప్రవాహాలు, తుమ్మెదలు, వాటి ఝుంకారాలు, పశుపక్షులు, లతలు ఇవి కాళిదాసుకు ప్రియమైన ఉపమాసామగ్రులు. కాళిదాసు రఘువంశంలో ఒకచోట దీపశిఖను ఉపమానంగా గ్రహించి అందమైన శ్లోకాన్ని చెప్పాడు. ఆ అందమైన ఉపమానంతో అతనికి దీపశిఖకాళిదాసు అన్న పేరు వచ్చింది -

సంచారిణీ దీపశిఖేవ రాత్రౌ యం యం వ్యతీయాయ పతింవరా సా
నరేంద్రమార్గాట్ట ఇవ ప్రపేదే వివర్ణభావం స స భూమిపాలః

ఇందుమతీ స్వయంవరానికి వచ్చిన రాజులు వరుసగా కూర్చొనివున్నారు. ఆమె ఒక్కొక్కరిని నిరాకరిస్తూ ముందుకు సాగిపోతున్నది. ఆమె ముందుకు అడుగేస్తున్నప్పుడు ఆమె తననే వరిస్తుందని ఆశతో ప్రతి ఒక్కరి ముఖం వెలిగిపోతున్నది. ఆమె వారిని దాటి ముందుకు వెళ్ళిపోగానే వారి ముఖాలు ఖిన్నమై పోతున్నవి. అట్లా ముందుకు సాగే ఇందుమతిని కవి సంచారిణి దీపశిఖతో పోల్చాడు. దీపశిఖ ముందుకు పోతూవుంటే వెనుక చీకటిని విడిచి పెడ్తుంది. అదే విధంగా ఇందుమతి నిరాకరిస్తు రాజుల ముఖాలను నిరాశామలినం చేస్తున్నదని కవి ఉపమానం.

## కాళిదాసు ఉత్ప్రేక్షలు

కాళిదాసు ప్రయోగించిన కొన్ని ఉత్ప్రేక్షలు సుందరంగా ఊహావైచిత్రితో, కూడివున్నవి. ఉపమ తర్వాత కాళిదాసుకు ఉత్ప్రేక్షయే అభిమానాలంకారం.

పుష్పం ప్రవాళోపహితం యది స్యాత్ ముక్తాఫలం వాస్ఫుట విద్రుమస్థమ్.
తతోను కుర్యాత్ విషదస్య తస్య తామ్రౌష్ఠ పర్యస్త రుచః స్మితస్య

పార్వతి ఎర్రని పెదవి మీద చిరునవ్వు ఎర్రని చిగురాగులలో పువ్వును, ఎర్రని ప్రవాళం మీద తెల్లని ముత్యాన్ని పోలి వున్నదట!

సైషాస్థలీ యత్ర విచిన్వతా త్వాం భ్రష్టం మయా నూపురమేకముర్వ్యామ్,
అదృశ్యత త్వచ్చరణారవింద విశ్లేషదుఃఖాదివ బద్ధమౌనమ్.

నీ కొరకు వెతుకుతు భూమి మీద పడివున్న నీ నూపురాన్ని ఇదిగో! ఇక్కడే కనుక్కొన్నాను. నీ చరణాల నుంచి విడిపోయిన దుఃఖంతో మూగవోయినట్లుగా నిశ్శబ్దంగా అది పడివున్నది.

సా రాజహంసై రివ సంనతాంగీ గతేషు లీలాంచిత విక్రమేషు
వ్యనీయత ప్రత్యుపదేశలుబ్ధై రాదిత్సుభి ర్నూపురసించితాని

యౌవన భారంతో విలాసంగా పార్వతి నడిచేటప్పుడు ఆమె నూపురాల నుంచి వెలువడే మధురధ్వనిని నేర్చుకోవాలనే కోరికతో రాజ హంసలు తమ విలాస పూరితమైన నడకలను మొదలే ఆమెకు నేర్పినట్లున్నదట!

కాళిదాసు ఉపమలు వస్తు సౌందర్యాన్ని ప్రకటిస్తు లలిత రామణీయకంగా వుండగా ఉత్ప్రేక్షలు అతని ఊహా సౌందర్యాన్ని ప్రకటిస్తున్నవి.

## కాళిదాసు అర్థాంతరన్యాసాలు

కాళిదాసు ఎన్నో చోట్ల అర్థాంతరన్యాసాలంకారాలను రమ్యంగా ప్రయోగించాడు. వాటిల్లో ఎన్నో సుభాషిత సూక్తులవలె వుండి అతని లౌకిక జ్ఞానాన్ని ప్రకటిస్తున్నవి. కొన్ని ఉదాహరణలు -

"ఏకోహి దోషో గుణ సన్నిపాతే"
"నిమజ్జతీందోః కిరణేష్వివాంకః"

"శామ్యేత్ ప్రత్యపకారేణ నోపకారేణ దుర్జనః"
"క్షుద్రేపి నూనం శరణం ప్రపన్నే మమత్వముచ్చైః శిరసాం సతీవ"
"విషవృక్షోపి సంవర్ధ్య స్వయం ఛేత్తు మసాంప్రతమ్"
"పదం హి సర్వత్ర గుణైర్నిధీయతే"

కాళిదాసు ఇంకా రూపక, సమాసోక్తి, అతిశయోక్తి, దృష్టాంత, తుల్యయోగిత, వ్యతిరేకాది అర్థాలంకారాలనేకాక యమకాది శబ్దాలంకారాలనుకూడ ప్రయోగించాడు. రఘువంశం నవమసర్గ అంతటా యమకాన్ని కాళిదాసు ప్రయోగించాడు. ఈ సంప్రదాయాన్ననుసరించే తర్వాత భారవి మాఘులు తమ కావ్యాలల్లో ఒక సర్గమంతా చిత్రకవిత్వాన్ని రచించారు.

## కాళిదాసు ప్రకృతి వర్ణనలు

కోమల సుందరమైన ప్రకృతిని కాళిదాసు అనేకచోట్ల వర్ణించాడు. పర్వత, వన, ఋతు, ఆశ్రమ వర్ణనలు సహజంగా వుండి అతడు ప్రకృతికి ఎంత సమీపమైన వాడో తెలుపుతున్నవి. ఆశ్రమపదాలతో ప్రత్యక్ష పరిచయంలేని వారెవరు అంత అందంగా, సహజంగా వర్ణించలేరు. కాళిదాసు నగర విలాస జీవితాన్నే ఎక్కువగా చిత్రించాడని, పల్లె ప్రజల జీవితాన్ని అతడు వర్ణించలేదని, ఇక అతడు వర్ణించిన వన, ఆశ్రమాది ప్రకృతివర్ణనలు అతడు భావనావీథిలో దర్శించి వర్ణించినవని కొందరు విమర్శిస్తుంటారు. వాల్మీకి తర్వాత ప్రకృతి సౌందర్యాన్నంతా చిత్రవిచిత్రమైన రంగులతో భాషలో బంధించిన ఘనత కాళిదాసుకే దక్కుతుంది. కాళిదాసు ఉజ్జయినీ నగరవాసి. మధ్యప్రదేశ్‌లో ఎన్నో అరణ్యాలు, పశుపక్షులున్నవి. కాళిదాసునాటికి ఋష్యాశ్రమ ప్రాంతాలు ఇంకా తప్పక ఉండి వుంటవి. ప్రకృతిని, ఆశ్రమ సౌందర్యాలను కాళిదాసు స్వయంగా దర్శించి వాటిలో లీనమైపోయినవానివలె వర్ణించాడు. కాళిదాసు యొక్క కవితావిలాసాన్ని శృంగార వర్ణనల తర్వాత ప్రకృతి వర్ణనల్లోనే చూడవచ్చును. అతడు ప్రయోగించిన ఉపమానాలు అనేకం ప్రకృతి సంబంధమైనవే. రాతిచేత అడ్డగింపబడిన నదీ ప్రవాహం అక్కడే సుడులు తిరుగుతూ ఉండటం అతడు చూచాడు. దాన్ని ఉపమానంగా తీసుకుని పార్వతి మనఃస్థితిని పాఠకులకు అవగాహనమయ్యేటట్లుగా ఇట్లా వర్ణించాడు -

తం వీక్ష్య వేపథుమతీ సరసాంగ యష్టిః
నిక్షేపణాయ పదముద్ధృత ముద్వహంతీ
మార్గాచల వ్యతికరాకులితేవ సింధుః
శైలాధిరాజతనయా న యయౌ న తస్థౌ.

పార్వతిని పుష్పస్తబకాలతో కూడిన, ఎర్రగా చిగిర్చిన లతతో పోలుస్తాడు. అభిజ్ఞాన శాకుంతలలో శకుంతల ప్రకృతికన్యవలె కన్పించటమేకాదు, కుమార సంభవంలో పార్వతి కూడ ఒక ప్రకృతికన్యవలెనే చిత్రింపబడింది. శివునికొరకు ఆమె తపస్సు చేయటానికై అరణ్యంలో ఆశ్రమాన్ని ఏర్పరచుకొంటుంది. అక్కడ ఆమె చెట్ల పెంపకం, ప్రేమతో వాటికి నీళ్ళు పోయటం, మక్కువతో లేళ్ళకు నీవారధాన్యాన్ని తినిపించటం మొదలైన వర్ణనలల్లో కాళిదాసు ప్రకృతి ప్రేమ ప్రతిఫలించింది. పార్వతి శివుని దగ్గరికిపోతూ ముత్యాల, రత్నాలహారాలను ధరించలేదు. వాటి స్థానంలో అన్నీ పూలనే ధరించింది -

అశోకని ర్భర్త్సిత పద్మరాగ మాకృష్ట హేమద్యుతి కర్ణికారమ్
ముక్తాకలాపీ కృత సిందువారం వసంత పుష్పాభరణం వహంతీ.

అట్లా అలంకరించుకొన్న పార్వతి సంచారిణీ లతవలె వున్నదట! ఇట్లా ప్రకృతి రమ్యమైన పుష్పాభరణాలను ధరించిన నాయిక కాళిదాసులో తప్ప మరెక్కడా కనిపించదు.

కుమార సంభవం ప్రథమ సర్గలోని హిమాలయ వర్ణన, తృతీయ సర్గలోని వసంతర్తు వర్ణన, రఘువంశం పంచమ సర్గలోని ప్రభాత వర్ణనలు కాళిదాసు ప్రకృతి వర్ణనలకు చాలా చక్కని ఉదాహరణలు. హిమాలయ వర్ణనను కవిరమ్యంగా సహజంగా చేసాడు.

ఆమేఖలం సంచరతాం ఘనానాం
ఛాయామధః సానుగతాం నిషేవ్య
ఉద్వేజితా వృష్టిభిరాశ్రయంతే
శృంగాణి యస్యాత పవంతి సిద్ధాః

హిమాలయం మీద సంచరించే సిద్ధులు వర్షం కురవగానే ఎండ కాసేటటువంటి హిమాలయ శిఖరాలకు వెళ్ళిపోతారట. ఈ వర్ణనవల్ల హిమాలయాలు మేఘ మండలాన్ని దాటి పైకి వ్యాపించాయని ధ్వనితం. వస్తు ధ్వనితో కూడిన రమ్యమైన దృశ్యవర్ణనలకిది ఒక ఉదాహరణ. వసంతర్తువులో లేళ్ళు పరుగెత్తటాన్ని కాళిదాసు ఇట్లా వర్ణించాడు.

మృగాః ప్రియాళ ద్రుమ మంజరీణాం
రజఃకణైర్విఘ్నిత దృష్టి పాతాః
మదోద్ధతాః ప్రత్యనిలాః విచేరు
ర్వనస్థలీ ర్మర్మరపత్ర మోక్షాః

"ప్రియాళువులనే పూల పరాగం నిండటంచేత కండ్లు మూసుకొని మదించిన లేళ్ళు రాలిన ఎండుటాకుల మీద మర్మర ధ్వనులు చేస్తు అటుయిటు పరుగెత్తు తున్నవి".

పండిన ఆకులు రాలిపోయి వసంతర్తువులో చెట్లు నూతనంగా చిగిర్చినవి. ప్రియాళువులు చిగిర్చి పుష్పించినవి. లేళ్ళు ఉన్మత్తంగా పరుగులు తీస్తున్నవి.

వసంతర్తు ప్రవేశంతో అశోకం ఆమూలాగ్రం పుష్పించటాన్ని కాళిదాసు గమనించివుంటాడు.

అసూతసద్యః కుసుమాన్యశోకః
స్కంధాత్ప్రభృత్యేవ సపల్లవాని
పాదేన నాపైక్షత సుందరీణాం
సంపర్కమాసింజిత నూపురేణ

స్త్రీల నూపురధ్వనులతో కూడిన కాలి తాకులు లేకుండానే ఆశోకం ఎర్రగా నిండుగా పుష్పించదట! కాళిదాసు ప్రకృతిని ఆలంబన, ఉద్దీపన విభావాలుగా కూడ వర్ణించాడు. కుమార సంభవంలో వసంతర్తువర్ణన శృంగారోద్దీపనంగా వర్ణింపబడింది.

రఘువంశం ద్వితీయసర్గలో దిలీపుడు తన్మయుడై ప్రకృతి దృశ్యాలను చూస్తుండిపోయాడని వర్ణింపబడింది. రమణీయ జలాశయం నుంచి వరాహం బయటికి రావటం, నెమళ్ళు గంతులు వేయటం, హరిణాలు పచ్చని గడ్డిమీద విశ్రమించి వుండటం మొదలైన దృశ్యాలను దిలీపుడు చూస్తూ వుండిపోయాడని కాళిదాసు వర్ణన -

సపల్వలో త్తీర్ణ వరహాయుథా న్యావాసవృక్షోన్ముఖబర్హిణాని
యయౌ మృగాధ్యాసిత శాద్వలాని శ్యామాయమానాని వనాని పశ్యన్.

కాళిదాసు కూడ అటువంటి ప్రకృతి దృశ్యాలను తన్మయుడై వీక్షించి వుంటాడు! కాళిదాసు ప్రకృతి వర్ణనలల్లో తర్వాత కవుల వర్ణనలల్లో కనిపించే కృత్రిమత్వం గాని అలంకార చమత్కారాలుగాని లేవు. ప్రకృతి దృశ్యాలను వున్నదివున్నట్లుగా సహజంగా వర్ణచిత్రంవలె గీసి చూపిస్తాడు.

వృంతాత్శ్లథం హరతి పుష్పమనోకహానాం
సంసృజ్యతే సరసిజైరరుణాంశుభిన్నై :
స్వాభావికం పరగుణేన విభాతవాయు :
సౌరభ్యమీప్సురివ తేముఖ మారుతస్య
తామ్రోదరేషు పతితం తరుపల్లవేషు
నిర్ధౌతహారగుళికా విశదం హిమాంభః
ఆభాతి లబ్దపరభాగ తయాధరోష్ఠే
లీలాస్మితం సదశనార్చిరివ త్వదీయమ్.

ప్రాతఃకాల వాయువులు వృక్షశాఖలను వూపి పూలను వృంతాల నుండి రాల్చి సూర్యకిరణాల తాకిడిచేత వికసించిన కమలాలను స్పృశిస్తు వీస్తున్నవి. తుషార కణాలు మంచి ముత్యాలవలె నిర్మలాలై చెట్లయొక్క ఎర్రని ఆకులమీద వ్రాలి (అజుని) ఎర్రని పెదవుల మీద పడిన దంత కాంతులవలె ప్రకాశిస్తున్నవి. ఇక్కడ ప్రకృతి ఉపమేయం, అజుని దంతకాంతులు ఉపమానం!

## కాళిదాసు స్త్రీ వర్ణనలు

కోమల స్త్రీ విలాసాన్ని కాళిదాసు ఎన్నో చోట్ల వర్ణించాడు. అతనికి స్త్రీ ప్రకృతిరూపిణియై కనబడుతుంది. ప్రకృతివలెనే కాళిదాసు స్త్రీలు నిసర్గ సౌందర్యవతులు. ఆభరణహీనలైనా వారు సుందరంగానే వుంటారు. అభిజ్ఞానశాకుంతలంలోని శకుంతల కాళిదాసు యొక్క ఆదర్శ స్త్రీ పాత్ర. శకుంతల వంటి వారే కుమార సంభవంలోని పార్వతి, రఘువంశంలోని ఇందుమతి సీతలు, పార్వతి సుకుమారి. సంచారిణీలత వంటిది. అందమైనది. తన సౌందర్యంచేత శివుని హృదయాన్ని జయించుకొన్నా అది శాశ్వత స్థానాన్నిచ్చేది కాదని గ్రహించింది. తన తపశ్శక్తి చేతనే శివుని హృదయంలో శాశ్వత స్థానాన్ని గ్రహించాలనుకొన్నది. అభిమానం, పట్టుదల ఆమెలో కన్పిస్తున్నవి. ఆమె ఎంత సుకుమారియో అంత దృఢ హృదయురాలు. మునులు కూడ ఆశ్చర్యపోయేటట్లుగా ఆమె తీవ్ర నియమాలతో తపస్సు చేసింది. కఠిన నియమాలచేత ఆమె మనోదార్ఢ్యం సడలలేదు. పైగా మరింత దృఢ సంకల్పవతియైంది. అదంతా పరీక్షించి శివుడు ఆమెను సగౌరవంగా స్వీకరించాడు. ఇక ఇందుమతి కోమల రూపం కలది. భర్త ప్రేమను ఆమె ఎంతగా పొందిందో ఆమె మరణించినప్పుడు అతని విలాపమే చెప్తున్నది. సుదక్షిణ రాణియైవుండి భర్త దిలీపునితో పాటు ఆశ్రమంలో కఠిన జీవితాన్ని గడుపుతూ గోపాలనవ్రతయై జీవించింది. అదేవిధంగా సీత రామునితో కఠిన వనవాస జీవితాన్ని గడిపింది. రామునితోడిదే జీవనమనుకొన్నది. అటువంటి సీతను రాముడు అడవులకు పంపాడు. అది కాళిదాసును సైతం కలచివేసింది. అందుకే సీతాముఖంగా కవి ఇట్లా అంటాడు -

వాచ్య స్త్వయా మద్వచనాత్స రాజా
వహ్నౌ విశుద్ధామపి యత్సమక్షమ్
మాం లోకవాదశ్రవణా దహాసీః
శ్రుతస్య కిం తత్సదృశం కులస్య.

ఈ ఆచరణ మీ పవిత్ర సూర్యకులానికి తగిందా? అని కాళిదాసే రామున్ని నిలదీసి అడుగుతున్నాడా అనిపిస్తుంది. సీతా పరిత్యాగ ఘట్టం కరుణరసపూరితం. సీతను

ఆదర్శంగా గ్రహించే కాళిదాసు శకుంతల పాత్రను మలిచాడు. ఆమె కూడ సీత వలెనే శంకింపబడి పరిత్యాజ్య అయింది. రాముడు లోకాపవాదానికి భయపడి సీతను పరిత్యజించగా దుష్యంతుడు దైవిక ఘటనచేత శంకుంతలను త్యజించాడు. సీత భూదేవి కూతురు. భర్తచేత పరిత్యజింపబడి వాల్మీకి ఆశ్రమంలో ఆశ్రయం పొంది కుమారులను కన్నది. శకుంతల అప్సరస మేనక కూతురు. ఇరువురి తల్లులు దివ్యాంగనలే. శకుంతల మారీచుని ఆశ్రమంలో ఆశ్రయం పొంది కుమారుని కన్నది. ఇరువురు భర్త విరహించే తపస్విని జీవితం గడిపారు. సీత చివరకు రామునితో సమాగమం కలుగకుండానే మరణించింది. కాని శకుంతల భర్త పరిగృహీతయైంది.

కాళిదాసు స్త్రీ పాత్రలల్లో ఆదర్శ భారతనారి సంపూర్ణ రూపం గోచరిస్తుంది. భారతనారిలోని సహనం, ప్రేమానురాగాలు, త్యాగం, నిస్వార్థత తపస్సు. కఠోర నియమ పాలనావ్రతం, సత్యసంధత, జ్ఞాన సంపద, సేవానిరతి, కోమలత, స్నేహం, క్షమ, మొదలైన గుణాలన్ని కాళిదాసు స్త్రీలో రాశిపోసుకొని వున్నవి. భర్తయందనురాగం గల పతివ్రత అయిన భారతనారి యొక్క అంతః స్వరూపాన్ని కాళిదాసు చాల భవ్యంగా చిత్రించాడు. రతీదేవి సైతం పతిలేని జీవితం వ్యర్థమని చితిలో ప్రవేశించాలనుకుంటుంది. భర్త పరిత్యజించగా తపస్వినివలె జీవించిన పవిత్ర స్త్రీ మూర్తులనే కాక అజ విలాపంలో, భర్త అనురాగాన్ని పొందిన స్త్రీ మూర్తిని చిత్రించి భార్యలేని జీవితాన్ని భారత పురుషుడెట్లా నిరర్థకమనుకుంటాడో కవి వర్ణించాడు. కాళిదాసు కేవలం స్త్రీల బహిస్సౌందర్యాన్నే కాక వారి అంతస్సౌందర్యాన్ని విశేషంగా చిత్రించాడు. కాళిదాసుకు స్త్రీలు పుష్పించిన లతల వలె వికసించిన కమలాలవలె కన్పిస్తారు. పుష్పాలంకృత అయి శివున్ని సమీపించే పార్వతి సంచారిణీలతకాగా భర్తృపరిత్యాజ్యమైన సీత అనిలవిద్ధమైన లత వలె భూమిమీద పడిపోయిందట. కాళిదాసు అక్కడక్కడ స్త్రీ యొక్క అంగాంగ వర్ణనను చేసాడు కూడ. ఉదా॥ కు కుమార సంభవంలో ప్రథమ సర్గలో పార్వతి వర్ణన. తరువాతి కవులు తమ నాయికా వర్ణనలను నఖశిఖ పర్యంతంగా ఉత్ప్రేక్షాద్యలంకార ప్రతిభను చాటుతు చేసారు. అవి కృత్రిమంగాను జుగుప్సాకరంగాను కూడ వున్నవి. కాళిదాసు స్త్రీ వర్ణనలు అట్లాకాక ఔచిత్యభంగం కాకుండా సుందర లలిత మనోజ్ఞంగా వున్నవి.

## కాళిదాసు సంవాద ఘట్టాలు

కాళిదాసు మహాకావ్యాలల్లో కొన్ని చక్కని నాటకీయ సంవాదఘట్టాలున్నవి. రఘువంశం ద్వితీయసర్గలోని సింహ దిలీప సంవాదం, తృతీయ సర్గలోని రఘు ఇంద్రుల

సంవాదం, పంచమసర్గలోని కౌత్సరఘుల సంవాదం, షోడషసర్గలోని కుశ అయోధ్యలక్ష్మి సంవాదం మరియు కుమారసంభవంలో పంచమసర్గలోని శివపార్వతుల సంవాదం మొదలైనవి కాళిదాసు సంభాషణాశైలికి నిదర్శనాలు. కాళిదాసు కావ్యకారుడే కాక మంచి నాటకకారుడు కూడ. నాటకీయ పద్ధతిని అనుసరించి కవి కొన్ని రమ్యమైన సంభాషణలను మహాకావ్యాలల్లో చేర్చి వున్నాడు. నాటకీయ శైలిలో గల ఈ సంవాద ఘట్టాలు మహాకావ్యంలో అతి రమ్యంగా వున్నవి.

## కాళిదాసు విలాసం

జయదేవుడు కాళిదాసు కవిత్వాన్ని సరస్వతికి విలాసంగా పేర్కొన్నాడు. ఇది నిజంగా ఉచితమైనదే. కాళిదాసు కవిత్వమంతటా శృంగార విలాసమే గోచరిస్తున్నది. కాళిదాసుకు ఇతర రసాలకన్న శృంగారమంటె అభిమానం. ఆ రసాన్నే అంతటా ఆదరించాడు. కాళిదాసు ప్రకృతిలో సైతం స్త్రీ పురుష శృంగార విలాసాన్ని దర్శించాడు. కుమారసంభవంలోని వసంతర్తు వర్ణనలో పశుపక్షి కీటకాదుల శృంగార చేష్టలను వర్ణించాడు. లలిత సుందరమైన ప్రకృతిలో అంతటా ఈశ్వరుని శృంగారమయ సృష్టియే అతనికి గోచరిస్తుంది. ఆ కవి గుణంచేత సరసుడు. కోమలహృదయుడు. అందుచేత సర్వస్వం సరసమయం, కోమలంగానే అతనికి గోచరిస్తుంది. చివరకు తారకాసురుని దుండగాలను వర్ణించేటప్పుడు కూడ కవి కోమలభావాలనే చెప్పాడు. తారకాసురుని క్రూరత్వాన్ని చెప్పదలచుకొని కాళిదాసు ఏమంటాడో చూడండి-

తేనామరవధూహస్తైః సదయాలూన పల్లవాః
అభిజ్ఞా శ్ఛేదపాతానాం క్రియంతే నందనద్రుమాః

"దేవతా స్త్రీలు కల్పవృక్షాల యొక్క కోమలమైన చిగురుటాకులను తమ కోమలమైన చేతులతో జాగ్రత్తగా తెంపి తమ చెవుల్లో అలంకరించుకుంటారు. అటువంటి వృక్షాలను తారకుడు నరికించివేస్తున్నా" డట! " విషవృక్షో Zపి సంవర్ధ్య స్వయం చ్ఛేత్తు మసాంప్రతమ్' ' అనే కాళిదాసుకు నందనద్రుమాలను అకారంణంగా నరికించివేసాడని, తత్కారణంగా తారకాసురుడు అతి క్రూరుడు అని పాఠకులముందు నిలిపాడు. కాళిదాసు వర్ణించిన శృంగారం జుగుప్సాకరమైంది. అనౌచిత్యమైంది కాదు. చివరకు కోమలభావాలతో కూడిన రతీవిలాపం, అజవిలాపం చక్కని శృంగారభావాలతో కూడి తద్వారా కరుణరసాన్ని ఒలికిస్తున్నవి.

# అశ్వఘోషుడు

క్రీ.శ. 1893 వరకు అశ్వఘోషుడు బౌద్ధవేదాంతిగానే పరిచితుడుకాని కవిగా కాదు. అతని కావ్యనాటకాలు బయటపడిం తర్వాత అతన్ని కాళిదాసాదికవుల కోవలోకి చేర్చటం జరిగింది. భారతదేశంలోనే కాక చైనా దేశంలోను అశ్వఘోషున్ని గురించి అనేక కథలు ప్రచారంలో వున్నవి కాని నిజంగా అతని జీవిత విశేషాలు చాల కొద్దిగానే మనకు తెలుస్తున్నవి. సౌందరనందం చివరగల "ఆర్యసువర్ణాక్షిపుత్రస్య సాకేతకస్య భిక్షోరాచార్యస్య భదంతాశ్వఘోషస్య మహాకవే ర్మహావాదినః కృతిరియమ్" అన్న వాక్యాన్నిబట్టి అశ్వఘోషుడు సువర్ణాక్షికుమారుడని, సాకేత అంటే అయోధ్యానగర వాసి అని బౌద్ధ ఆచార్య పదవి నందుకొన్నవాడని మహాకవి అని ప్రసిద్ధి చెందినవాడని తెలుస్తున్నది. సువర్ణాక్షి అన్న పేరు విచిత్రంగా వున్నదని, బంగారురంగు కన్నులుగలవారు విదేశీయులని అప్పుడు అశ్వఘోషుని తల్లి గ్రీకు వనిత అని కొందరు విమర్శకులు ఊహలు చేసారు. కాని అతని రచనలను బట్టి అతడు వేద ధర్మ శాస్త్రాదులను అధ్యయనం చేసినవాడని తెలుస్తున్నది. కాబట్టి అతడు బ్రాహ్మణ కులజుడని తర్వాత బౌద్ధధర్మ దీక్షను గ్రహించాడని చెప్పవచ్చును. వసుమిత్రాచార్యుని దగ్గర బౌద్ధమతదీక్షను స్వీకరించాడని చైనీయుల వ్రాతలవల్ల తెలుస్తున్నది. అతడు మహాయాన శాఖకు చెందినవాడని అతని రచనలను బట్టి తెలుస్తున్నది. అశ్వఘోషుడు తన పాండిత్య కవిత్వ శక్తినంతా బౌద్ధధర్మ వ్యాప్తిలోనే వెచ్చించాడు. అతడు సంగీతంలోను ప్రవీణుడట! తన సంగీత మాధుర్యంచేత ప్రజలను ఆకర్షించేవాడట! అశ్వఘోషుడు కావ్యనాటకాలే కాక అనేక ధర్మ గ్రంథాలను కూడ వ్రాసాడు.

## అశ్వఘోషుని కాలం

అశ్వఘోషుని జీవిత కాలాన్ని నిర్ణయించటానికి రెండు ప్రధానమైన ఆధారాలున్నవి 1) అశ్వఘోషుని కావ్యం బుద్ధచరిత్ర యొక్క చీనా భాషానువాదం క్రీ.శ. 414-421 ప్రాంతంలో ధర్మరక్ష లేక ధర్మక్షేమ లేక ధర్మాక్షరుడనే భారతీయ పండితుని చేత చేయబడింది. కాబట్టి అశ్వఘోషుని కాలం అంతకు పూర్వమే అని చెప్పవచ్చును.

2) మధ్యఏషియాలో దొరికిన అశ్వఘోషుని శారీపుత్ర ప్రకరణ వ్రాత ప్రతులను బట్టి అది కుషాణ కాలానికి, బహుశా కనిష్కుని లేక హువిష్కుని కాలానికి చెందిందని లూడర్స్ నిర్ణయించాడు.

అభిధర్మానికి "విభాష" అన్న వ్యాఖ్య కనిష్కుని రాజ్యకాలంలో జరిగిన బౌద్ధమహాసభల సమయంలో రచింపబడిందని ప్రతీతి. ఇది అశ్వఘోషుని చేత వ్రాయబడింది. చైనా సంప్రదాయాన్ననుసరించి అశ్వఘోషుడు కనిష్కునికి సమకాలికుడు. చారిత్రక స్పృహగల చైనీయుల సంప్రదాయం సత్యమే అని పాశ్చాత్య ప్రాచ్య విమర్శకులు అంగీకరిస్తున్నారు. కనిష్కుని రాజ్యకాలం క్రీ.శ. 75-150 నడుమ అని చారిత్రకుల నిర్ణయం. క్రీ.పూ. 50 క్రీ.శ. 100 నడుమ అశ్వఘోషుని కాలం అని చెప్తు జాన్స్టన్ ఇ. హెచ్. క్రీ.శ. ప్రథమ శతాబ్దపు పూర్వార్ధమే అశ్వఘోషుని జీవిత కాలమని నిర్ణయించాడు. కనిష్కుడు పాటలీపుత్రం మీదికి దండెత్తి ఆ రాజును జయించి ఆరు కోట్ల ధనాన్ని పరిహారంగా అడిగాడని అప్పుడారాజు మూడు కోట్లకు మారుగా బుద్ధుని భిక్షాపాత్రను, మిగిలిన మూడు కోట్లకు మారుగా అశ్వఘోషుని అర్పించాడని, కనిష్కుడు అట్లా అశ్వఘోషుని సంపాదించుకొని తన రాజధాని పురుషపురానికి (పెషావర్) తీసుకొనిపోయి అతని ప్రేరణచేత బౌద్ధమతాన్ని స్వీకరించాడని తర్వాత కనిష్కుడు బౌద్ధమత వ్యాప్తికై పాటుపడ్డాడని ఐతిహ్యం. చైనా, టిబెట్, జపాన్, మధ్య ఏషియా మొదలైన అనేక దేశాలల్లో బౌద్ధధర్మ ప్రచారానికై కనిష్కుడు బౌద్ధ బిక్షువులను పంపాడు. బౌద్ధమత వ్యాప్తికి అశోకుని తర్వాత కనిష్కుడే కారకుడు.

## అశ్వఘోషుడు కాళిదాసుకు పూర్వవర్తియా ?

అశ్వఘోషుడు కాళిదాసు కన్న పూర్వుడని పాశ్చాత్య సాహిత్య చరిత్ర కారులందరు అంగీకరించారు. కాళిదాసు గుప్తుల కాలంవాడని అంగీకరించినట్లయితె అతడు అశ్వఘోషునికి తరువాత వాడే అవుతాడు. కాని కాళిదాసు క్రీ.పూ. ప్రథమ శతాబ్దివాడని అంగీకరించినట్లయితే అశ్వఘోషునికి అతడు పూర్వుడవుతాడు. కాలాన్ని విడిచిపెట్టి వారి కావ్యాలను పరిశీలించి ఎవరు ఎవరిని అనుకరించారని విచారించి, ఎవరు పూర్వవర్తి ఎవరు పరవర్తి అని నిర్ణయించవచ్చునేమో చూద్దాము. కాళిదాస అశ్వఘోషుల కవిత్వాలను పరిశీలించి పాశ్చాత్య విమర్శకులందరు అశ్వఘోషుని కవితా ప్రభావం కాళిదాసు మీద వున్నట్లుగా తేల్చారు. జాన్స్టన్ అభిప్రాయంలో అశ్వఘోషుని శైలి ప్రభావం కాళిదాసు మీదనే కాక భాసుని మీద కూడ వున్నది. కాళిదాసు వాల్మీకి భాసులను అనుకరించాడనటం నిస్సందేహం. కాని ఆ కవుల కవిత్వంలోని భావాలంకారాలను సన్నివేశాలను కాళిదాసు ఎక్కడా వున్నదున్నట్లుగా అనుకరించి గ్రహించలేదు. అదే కాళిదాసు అశ్వఘోషుల కవిత్వంలో భావాలంకారాలు సన్నివేశాలు ఉన్నదున్నట్లుగా అనుకరింపబడినవి. వాల్మీకి భాసులను ఉన్నదున్నట్లు అనుకరించని కాళిదాసు అశ్వఘోషున్ని మాత్రం ఉన్నదున్నట్లుగా

అనుకరిస్తాడా? ఎంతో మౌలికతను ప్రదర్శించిన కాళిదాసు అశ్వఘోషుని వంటి బౌద్ధకవిని అనుకరిస్తాడా? అనే అనుమానాలు రాకమానవు. అశ్వఘోషుడు కేవలం కవేకాదు, ప్రసిద్ధమైన తాత్త్వికుడు. అంతేగాక అశ్వఘోషుడు బౌద్ధకవి కాబట్టి ఇతర కవులుగాని, ఆలంకారికులుగాని అతనికియ్యవలసిన గౌరవాన్ని ఇయ్యలేదని చెప్పాలి. ఆలంకారికులల్లో రాజశేఖరుడు కావ్యమీమాంసలో బుద్ధచరిత్రలోని శ్లోకాలను మాత్రం ఉద్ధరించాడు. దండి భామహులకు అశ్వఘోషుని పరిచయమున్నట్లు చెప్పబడుతున్నది కాని అది అస్పష్టం, సందిగ్ధం. దీన్నిబట్టి తర్వాత సాహిత్యంమీద అశ్వఘోషుని ప్రభావం చాలా తక్కువ అని చెప్పవచ్చునని జాన్స్టన్ అంగీకరిస్తూనే ఇంకొకవైపు కాళిదాసు మీద అశ్వఘోషుని ప్రభావాన్ని అంగీకరించటం సమంజసంగా లేదు.

## అశ్వఘోషుని రచనలు

అశ్వఘోషుడు మొదట దార్శనికుడు. ఆ తరువాతనే కవి. అతడు అనేక బౌద్ధ దార్శనిక గ్రంథాలను రచించాడు. అవి చాలామట్టుకు చైనా భాషానువాదాలుగానే మిగిలిపోయినవి. సూత్రాలంకారం, మహాయానశ్రద్ధోత్పాదం, వజ్రసూచి మొదలైనవి అతని బౌద్ధధర్మ సంబంధి రచనలుగా చెప్పబడుతున్నవి. ధర్మప్రచారం కొరకు కావ్యరచనను కూడ అతడు చేపట్టాడు. కవిత్వం ద్వారా ప్రజల హృదయాన్ని సులభంగా చేరవచ్చునని గ్రహించిన కవి అతడు. బుద్ధచరిత్ర, సౌందరనందాలు రెండు మహాకావ్యాలు. శారీపుత్ర ప్రకరణం రూపకం. ఇవిగాక 20 స్రగ్ధరా శ్లోకాల సంగ్రహమైన గండీస్తోత్రం అశ్వఘోషుని రచన అని చెప్పబడుతున్నది. దీనిలో బుద్ధుని స్తుతి వున్నది. హోల్స్టైన్ అనే పండిత విమర్శకుడు చైనా లిపి నుంచి దీనికి ప్రతిలిపిని తయారుచేసి ముద్రింపించాడు. సిల్వీ లెవీ అనుసారం "రాష్ట్రపాలు"డనే గేయనాటకం అశ్వఘోషుని రచన. కొద్ది అవశేషం మాత్రం దీనిది దొరికింది.

## బుద్ధ చరిత్ర

బుద్ధ చరిత్రలో బుద్ధుని జీవిత చరిత్ర నిబంధింపబడింది. ఇప్పుడు సంస్కృత భాషలో లభించే బుద్ధ చరిత్రలో 17 సర్గలున్నవి. 17 సర్గల్లో చివరి 4 సర్గలు క్రీ.శ. 19వ శతాబ్దంలో అమృతానందునిచేత రచింపబడినవి. క్రీ.శ. 5వ శతాబ్దంలో చైనా భాషలోకి అనువాదం చేయబడిన బుద్ధచరిత్రలో 28 సర్గలున్నవి. బుద్ధుడు తల్లిగర్భంలో ప్రవేశించటం మొదలుకొని అతని పరినిర్వాణం వరకు కథ చెప్ప బడింది. బుద్ధుని అవశేషాల కొరకు

జరిగిన యుద్ధాలు, అశోకుని కాలంలో జరిగిన బౌద్ధ మహాసభలు కావ్యం చివర వర్ణింపబడినవి. ఈత్సింగ్ బుద్ధచరిత్ర బృహద్గ్రంథమని తెలిపాడు. క్రీ.శ. 7 లేక 8 వ శతాబ్దంలో ఇది టిబెట్టు భాషలోకి అనువాదం చేయబడింది. చైనా, టిబెట్టు భాషల్లోని బుద్ధచరిత్రను ఆధారంగా అసంపూర్ణంగా వున్న సంస్కృత బుద్ధచరిత్రను నిర్మించే అవకాశమున్నది. బుద్ధుని జీవిత చరిత్రకు ఆధారంగా కవి ఏ స్రోతస్సును తీసుకున్నాడో చెప్పలేము. లలితవిస్తరం నుంచి తీసుకొని కావ్యోచితమైన మార్పులను చేసాడని కొందరు విమర్శకుల అభిప్రాయం.

గౌతమబుద్ధుడు రాజప్రాసాదాన్ని విడిచిపెట్టి వెళ్లిపోయే సందర్భంలో అనేక పురస్త్రీలు అతన్ని దర్శించేందుకు వస్తారు. దార్శనికుడైన అశ్వఘోషుడు ఆ స్త్రీల శృంగార చేష్టలను రమ్యంగా వర్ణించి, వారు గౌతముని నిశ్చయాన్ని మరల్చి లోభపెట్టలేక పోయారని సూచించాడు. అదేవిధంగా బుద్ధుని తపస్సు, మారుడు సపరివారుడై వచ్చి బుద్ధుని విచలితున్ని చేయబూనటం మొదలైన ఘట్టాలు రమ్యంగా వున్నవి. మన్మథుడు బుద్ధుని మీద ప్రయోగించిన బాణం నిష్ఫలం కావటం చూచి ఇట్లా అనుంటాడు -

> శైలేంద్ర పుత్రీం ప్రతి యేవ ఇద్ధో దేవో z పి శంభుశ్చలితో బభూవ
> న చింతయత్యేష తమేవ బాణం కిం స్యా దచిత్తో న శరః స ఏషః

"ఏ బాణమైతే తగిలి శివుడు పార్వతిని చూచి విచలితుడైనాడో ఆ బాణాన్నే ఇతడు (బుద్ధుడు) లెక్క చేయటం లేదు. ఏమిటి! ఇతనికి హృదయమే లేదా? లేక ఈ బాణం ఆ బాణం కాదా?" కాళిదాసు కుమారసంభవ ఘట్టాన్ని దృష్టిలో పెట్టుకొనే, అశ్వఘోషుడు ఈ శ్లోకాన్ని వ్రాసివుంటాడు. బుద్ధుని చరిత్రలో సందర్భానుకూలంగా ప్రకృత్యాది కావ్యవర్ణనలను కవి చేర్చాడు. కథ, వర్ణనలను మహాకవి వలె రచిస్తు కవి అక్కడక్కడ బౌద్ధ ధర్మాలను, బౌద్ధ దార్శనిక విషయాలను సరసమధురంగా సరళ శైలిలో చెప్పాడు. అశ్వఘోషుని ప్రకృతి వర్ణనలు వాల్మీకి కాళిదాసు ప్రకృతి వర్ణనలవలె రమ్యంగా సహజంగా వున్నవి. కీథ్ మతానుసారంగా అశ్వఘోషుని మీద వాల్మీకి కవితాప్రభావం అధికంగా కన్పిస్తున్నది. ఇతివృత్తం, చరిత్ర చిత్రణ, అలంకారాలల్లోని ఉపమానాది సామగ్రులు, శైలీ పదావళి మొదలైన విషయాలల్లో బుద్ధ చరిత్రమీద రామాయణ

ప్రభావం వున్నది. అంతేగాక అశ్వఘోషుడు సాకేతపుర నివాసి. రామునికి సాకేతపురానికున్న సంబంధాన్ని బట్టి అతడు రామాయణంచేత బాగా ప్రభావితుడై వుంటాడని చెప్పవచ్చును. బుద్ధుడు శాక్యవంశజుడు. శాక్యులు ఇక్ష్వాకు వంశానికి చెందినవారు. బుద్ధుని ప్రసిద్ధ ఇక్ష్వాకువంశరాజుగా సగర్వంగా ఒక శ్లోకంలో అశ్వఘోషుడు చెప్పాడు కూడ. రామాయణంచేత, రాముని చరిత్ర చేత ప్రేరేపితుడయ్యే అశ్వఘోషుడు బుద్ధుని చరిత్రను కావ్యంగా వ్రాసి వుంటాడు.

కావ్యదృష్టితో బుద్ధ చరిత్రలోని 1, 5, 8 సర్గలు మరియు 19 వ సర్గలోని మారవిజయ ఘట్టాలు చెప్పుకోదగ్గవి.

## సౌందరనందం

బుద్ధుని సోదరుడు నందుడు బౌద్ధమతాన్ని స్వీకరించటం దీనిలోని ఇతివృత్తం. దీనిలో 18 సర్గలున్నవి. ఇది సంపూర్ణంగా లభిస్తున్నది. బుద్ధచరిత్ర కన్న ఇది ప్రౌఢంగా వున్నది. దీని రచన నాటికి కవి అనుభవం సంపాదించిన వాడై వుంటాడు. బుద్ధచరిత్రలో వలెనే దీనిలోను పునరుక్తి దోషాలున్నవి. అయినా దీనిలో బౌద్ధ ధర్మ సంబంధమైన అమూల్యమైన ఉపదేశాలున్నవి. బుద్ధుని జీవితచరిత్రలోని కొన్ని సంఘటనలు బుద్ధచరిత్రలో చెప్పినవాటిని, సంక్షిప్తంగా చెప్పిన వాటిని, అసలే చెప్పని వాటిని కవి దీనిలో విశదంగా చెప్పాడు. నందుడు బాల్యం నుంచి బుద్ధునికన్న భిన్న ప్రకృతి కలవాడు. నందుడు సుఖాలను కాంక్షించేవాడు. సాంసారిక జీవితమన్న ఆసక్తికలవాడు. భార్య సుందరి అంటె మిక్కిలి ప్రేమ. అటువంటి నందుని మనస్సును మార్చి బుద్ధుడు బౌద్ధధర్మదీక్షను ఇస్తాడు. నందుడు ఐహికసుఖాలను విడిచిపెట్టి తపోనిరతుడౌతాడు. కావ్య శైలిలో కవి ఈ కథను మహాకావ్యంగా వ్రాసాడు. చతుర్థ, దశమ సర్గలల్లో సుందరీ నందుల శృంగార క్రీడలను కవి సరసంగా వర్ణించాడు. దార్శనిక విషయాలను ఎంత సరళసులభంగా వర్ణించాడో కవి ఈ శృంగారాన్ని అంత సరసమధురంగా రసవ్యంజకంగా వర్ణించాడు. దీనిలో సందర్భానుకూలంగా కావ్యోచిత వర్ణనలున్నవి.

## అశ్వఘోషుని కవిత్వం

అశ్వఘోషుని కవిత్వం వాల్మీకి కాళిదాసుల కవిత్వంవలె వైదర్భీరీతిలో నడిచింది. వాల్మీకి కాళిదాసుల కవిత్వంవలెనే అశ్వఘోషుని కవిత్వ కృత్రిమత్వం లేక నిసర్గసౌందర్యంతో ఒప్పుతున్నది. అశ్వఘోషుని కవిత్వంలో ప్రసాదమాధుర్య అర్థవ్యక్తి గుణాలు అడుగడుగునా

కన్పిస్తవి. చక్కని సహజ ప్రకృతివర్ణనలు, సహజ మానవహృదయచిత్రణ, నిత్యజీవితంలో అడుగడుగునా అవసరమయ్యే ఉపదేశాలు, సుందరమైన ఉపమానాలు, నానారసపోషణ అతని కవిత్వంలోని ప్రత్యేకతలు. అశ్వఘోషుడు ప్రయోగించిన ఉపమానాలు స్వాభావికమైనవి. అనుపమమైనవి. కాళిదాసు ఉపమలు ఎంత సుందరంగా, హృదయాకర్షకంగా వుంటవో అశ్వఘోషుని ఉపమలు అంతే సుందరంగా, హృదయాకర్షకంగా వుంటవి.

తస్యాముఖం పద్మసపత్నభూతం పాణౌస్థితం పల్లవ రాగ తామ్రే
ఛాయామయస్యాంభసి పంకజస్య వనౌ నతం పద్మమివోపరిష్టాత్

"పద్మానికి వైరిఅయిన ఆమె (సుందరి)ముఖం, చిగురుటాకువలె ఎర్రనైన చేతిలో ఆనుకొని పద్మం సరస్సులోని తన ప్రతిబింబం మీదికి ఒరిగినట్లున్నది." - చిత్రాత్మకమైన పై ఉపమానం ఆహ్లాదకరంగా వున్నది. "బాలే తవ ముఖాంభోజే కథ మిందీవరద్వయమ్' ' అన్న కాళిదాసు దనబడే చాటుశ్లోకాన్ని పై శ్లోకం జ్ఞాపకానికి తెస్తున్నది. ఒక్కొక్కసారి అశ్వఘోషుడు చూపే దృష్టాంతాలు సరళంగా విషయబోధకంగా వుంటవి-

బాలస్య ధాత్రీ వినిగృహ్య లోష్టం యథోద్ధరత్యాస్యపుటప్రవిష్టం
తథోజ్జి హీర్షుః ఖలురాగశల్యంతత్వామవోచం పరుషంహితాయ.

"దాది పిల్లవాన్ని ఏవిధంగా గట్టిగా పట్టుకొని నోటిలోని మన్నును తీసివేస్తుందో అదేవిధంగా నీలో వున్న రాగాన్ని తీసివేయాలని గట్టిగా మాట్లాడినాను." అని నందునితో బుద్ధుడు అంటాడు.

సకామరాగేణ నిగృహ్యమాణో ధర్మానురాగేణ చ కృష్యమాణః
జగామ దుఃఖేన నివర్తమానః ప్లవః ప్రతిస్రోత ఇవాపగాయాః

"ప్రేమానురాగం వెనుకకు లాగగా ధర్మానురాగం ముందుకు లాగగా అతడు (నందుడు) అయిష్టంగా వెనుకవెనుకకు తిరిగిచూస్తు నదీప్రవాహాని కెదురుగా పోయే పడవవలె ముందుకు నడిచెను" ఇటువంటి భావంగల మరొకశ్లోకం-

తం గౌరవం బుద్ధగతం చకర్ష భార్యానురాగః పునరాచకర్ష
సో ऽనిశ్చయాన్నాపి యయౌ నతస్థౌ తరంస్తరం గేష్వివ రాజహంస :

"బుద్ధుని మీది గౌరవం అతన్ని (నందున్ని) ముందుకు లాక్కొనిపోగా భార్యమీది అనురాగం అతన్ని వెనుకకు లాగుతున్నది. ఈ విధంగా ముందుకుగాని వెనుకకుగాని పోలేక అతడు అలలమధ్య రాజహంసవలె ఉండిపోయాడు." ఈ అలంకారాన్ని, భావాన్ని

కాళిదాసు కుమారసంభవంలో చూడవచ్చును. శివుడు వటురూపాన్ని విడిచిపెట్టి నిజరూపంతో ప్రత్యక్షమై వెళ్ళిపోబోయే పార్వతి చేయిని పట్టుకొంటాడు. అక్కడ నిలువక వెళ్ళిపోవటానికి ఉద్యుక్తురాలైన పార్వతి, వటువు నిజంగా శివుడని తెలుసుకొని సిగ్గుతో అక్కడ నిలువలేకపోయింది, మరియు అతన్ని విడిచి పెట్టి వెళ్ళిపోలేకపోయింది. అటువంటి ఆమె మనఃస్థితిని కాళిదాసు అడ్డుగా వున్న పర్వతంచుట్టు సుళ్ళు తిరిగే నదీ ప్రవాహంతో పోల్చాడు -

మార్గాచల వ్యతికరాకులితేవ సింధుః
శైలాధిరాజతనయా న యయౌ న తస్థౌ.

అశ్వఘోషుని భావాన్ని ఆలంకారాన్ని కాళిదాసు ఈశ్లోకంలో అనుకరించాడని అంటారు. కాని కాళిదాసు ఉపమకు పెట్టింది పేరు. కాళిదాసునే అశ్వఘోషుడు అనుకరించాడని చెప్పాలి. సుందరీ నందుల వియోగాన్ని అశ్వఘోషుడు రాత్రి చంద్రుల వియోగంతో పోల్చాడు -

తాం సుందరీం చేన్నలభేత నందః సా వా నిషేవేత న తం నతభ్రూః
ద్వంద్వం ధ్రువం తద్వికలం న శోభేద న్యోన్య హీనావివ రాత్రిచంద్రౌ.

అశ్వఘోషుడు గంభీరమైన వేదాంతార్థాలను చక్కటి సరళమైన ఉపమలద్వారా సులభంగా పాఠకుల హృదయాలకు హత్తుకొనేటట్లుగా చెప్పటంలో సమర్థుడు -

కలభఃకరిణా ఖలూద్ధృతో బహుపంకాద్ విషమాన్నదీతలాత్
జలతర్షవశేన తాం పునః సరితాం గ్రాహవతీం అతీర్షత!

"సంసారనుంచి దూరమై తిరిగి సంసారంలో ప్రవేశించటం, బురదచేత నిండిన నదినుంచి తల్లి ఏనుగుచేత బయటికి తీయబడిన కలభం తిరిగి దప్పికతో కూడినదై మొసళ్ళతో నిండిన నదిలో ప్రవేశించటం వంటిది".

శరణే స భుజంగమే స్వప్న ప్రతిబుద్ధేన నరేణ బోధితః
తరుణః ఖలు జాతవిభ్రమః స్వయముగ్రం భుజగం జిఘృక్షతి!

"ఇంట్లోకి సర్పంరాగా పండుకున్న వ్యక్తి, అంతకుముందు మెలకువతో వున్న వ్యక్తి లేపుతున్నా వెంటనే మెలకువ సరిగా రాక నిద్రమబ్బులో సర్పాన్ని పట్టుకొనబోయినట్లుగా సాధుపురుషుల ఉపదేశాలను వినికూడ మనుష్యుడు విషయరూపమైన సర్పాన్ని పట్టుకొనటానికి ప్రయత్నిస్తాడు"

అశ్వఘోషుడు శాంత కరుణ శృంగార రసాలను చక్కగా పోషించాడు. సుందరీనందుల విరహం, గౌతమబుద్ధుడు సన్యాసి కాగా అతని భార్య యశోధర, మాతాపితల దుఃఖం మొదలైన సందర్భాలల్లో కరుణరసం పోషింపబడింది. సుందరీనందుల ప్రేమ వర్ణనలో; బుద్ధుని పురవీథిలో దర్శించిన స్త్రీల వర్ణనలో శృంగారరసం వ్యంగ్యమైంది. బుద్ధచరిత్ర సౌందరనంద కావ్యాలలో శాంతం అంగిరసంగా పోషింపబడింది.

కాళిదాసు శైలిలోవున్న సౌష్ఠవం (Refinement) అశ్వఘోషుని శైలిలో లేదని కొందరి అభిప్రాయం. కాళిదాసు భారవ్యాదుల కావ్యాల్లోని కావ్య పరమావధి అశ్వఘోషుని కావ్యాలల్లో లేదని చెప్పాలి. బుద్ధచరిత్రకన్న సౌందరనందం ఎక్కువ కావ్యాత్మకంగా వున్నది. సౌందరనందంలో కవిత్వం లలితభావాలు కలిగి కావ్యమయంగా వున్నది. అశ్వఘోషుని వస్తువు, శైలి, భావాలల్లో మౌలికత వున్నది. బుద్ధచరిత్ర పాండిత్య కౌశలం చూపించటానికి కాక మానవులహితం, సుఖం కొరకు వ్రాయబడిందని కవే చెప్పుకొన్నాడు. కాబట్టి అశ్వఘోషుని రచనలన్ని బౌద్ధధర్మ ప్రతిపాదనకే కాని కేవలం కావ్య సౌందర్యం కొరకు వ్రాసినవి కావు.

హిందూమతమంటె అశ్వఘోషునికి ద్వేషమున్నట్లులేదు. అతడు హిందూ పురాణ శాస్త్రాదులు బాగా తెలిసినవాడు. మొదట అతడు హిందువే. అప్పుడాతడు వేదశాస్త్రాదులను అభ్యసించివుంటాడు. ఏ కారణంచేతనో అతడు బౌద్ధుడుగా మారాడు. శారిపుత్రప్రకరణం కథనుబట్టి అతని బౌద్ధ ధర్మదీక్షను కొంతవరకు ఊహించవచ్చు. దీనిలో శారిపుత్ర, మౌద్గలాయనులనే యువకులు బుద్ధనిచేత బౌద్ధధర్మ దీక్షను గ్రహించే వృత్తాంతమున్నది. తన కావ్యవర్ణనలల్లో అనేక రామాయణ మహాభారత పౌరాణికాది గాథలను పేర్కొన్నాడు. అశ్వఘోషుని రచనలు క్రీ.శ. 7,8 శతాబ్దాలవరకు బహుళ వ్యాప్తిలో వున్నట్లు ఈత్సింగ్ అనే చైనా యాత్రికుని వ్రాతలను బట్టి తెలుస్తున్నది. అతని రచనల ప్రతులు మధ్యఏషియాలో లభించటం చేత అక్కడివరకు వ్యాప్తిచెందినవని చెప్పవచ్చును. మధ్య ఏషియాలో లభించటమే కాక చైనా, టిబెట్టు భాషల్లోకి అనువదింపబడినవి. బౌద్ధమత వ్యాప్తితో అతని రచనలు బహుళ జనాదరణ పొందినవని చెప్పవచ్చును. బౌద్ధమతం భారత దేశంలో వ్యాపించి వున్నంతకాలం అశ్వఘోషుని రచనలు వ్యాప్తిలో వున్నవని తర్వాత వాటికి ఆదరణ తగ్గిందని ఊహించవచ్చును. కాని భారతదేశంలో అతని రచనలకు ఆదరణ తగ్గినా బౌద్ధమతం ప్రాధాన్యత కలిగిన మధ్య ఏషియా, చైనా, టిబెట్టు దేశాలల్లో వ్యాప్తిలో వుండేవని ఆయా భాషల్లోని అనువాదాలనుబట్టి తెలుస్తున్నది.

## అశ్వఘోషుని తర్వాత కవులు

అశ్వఘోషుని తర్వాత చాలాకాలం వరకు, దాదాపు గుప్తుల కాలంవరకు సంస్కృత కవులెవ్వరు తెలియరావటంలేదు. అంటె దాదాపు 400 సంవత్సరాలు. ఇన్ని వందల సంవత్సరాలు కవులే పుట్టలేదని, కావ్యరచనే జరుగలేదని ఊహించటానికి కష్టంగా వున్నది. గుప్తుల రాజ్యారంభంతో హిందుమతోద్ధరణ, దానితోబాటు సంస్కృతభాషోద్ధరణకూడ జరిగినట్లున్నది. అశ్వఘోషుని తర్వాత గుప్తులకు ముందు విదేశీయులైన శకుల (సిథియన్లు) దండయాత్రలతో సాహిత్య వ్యవసాయం వెనుకపట్టు పట్టిందని మాక్స్‌ముల్లర్ అంటాడు. సంస్కృతభాష గుప్తుల కాలంలో పునర్జీవితమైందని అతని అభిప్రాయం. కాళిదాసు గుప్తుల కాలంవాడని నమ్మిన మాక్స్‌ముల్లర్ గుప్తులకాలం సంస్కృత సాహిత్య చరిత్రలో స్వర్ణయుగంగా భావించాడు. కాళిదాసును క్రీ.శ. 6వ శతాబ్దంవాడని మాక్స్‌ముల్లర్ అభిప్రాయం సమంజసంగా లేకున్నా గుప్తుల అధికార ప్రాబల్యానికి ముందు దేశం విదేశీయుల దండయాత్రలతో శాంతి సౌఖ్యాలు లేక స్థిరమైన రాజులు లేక సాహిత్య కృషి బాగా జరుగలేదేమో. ఒకవేళ జరిగినా ఆ కావ్యాలు మనవరకు రాలేదేమో చెప్పలేము.

క్రీ.శ. 345 ప్రాంతంలో వేయబడిన ఆలహాబాదు శాసనంలో సముద్ర గుప్తుని ప్రశస్తివున్నది. ఈ శాసనాన్ని హరిషేణుడనే కవి రచించాడు. దానిలోని శైలి వైదర్భీరీతిలో వుండి రమ్యంగా వున్నది. దానిలో శ్లోకాలతోపాటు గద్యం కూడ వున్నది. కవితా నైపుణ్యం గల హరిషేణుడు సముద్రగుప్తుని ఆస్థానంలో వుండి ఏవైన కావ్యాలు వ్రాసాడేమో తెలియదు.

క్రీ.శ. 472 సంవత్సరంలో వేయబడిన మందసర్ సమీపాన లభించిన శాసనం ఒకటి వున్నది. దీన్ని వత్సభట్టి అన్నకవి రచించాడు. దీనిలో శైలి గౌడీ రీతిలో నడిచింది. వత్సభట్టి కవిత్వం మీద మేఘసందేశ, ఋతుసంహార కావ్యాల ప్రభావం కన్పిస్తున్నది. దీనిలో వసంత, వర్షర్తుల దీర్ఘవర్ణన లున్నవి. ఈ వత్సభట్టి ఏమైన కావ్యాలు వ్రాసాడేమో చెప్పలేము.

## బుద్ధ ఘోషుడు

ఈ కవి మొదట బ్రాహ్మణుడు. బౌద్ధమతాన్ని స్వీకరించాడు. పద్య చూడామణి అన్న కావ్యాన్ని రచించాడు. దీనిలో 10 సర్గలున్నవి. దీనిలో బుద్ధుని జీవిత చరిత్ర వున్నది. ఇది అశ్వఘోషుని బుద్ధచరిత్ర కన్న కొంత భిన్నంగా వున్నది. ఈ కావ్యంలో శైలి సరళసుందరంగా వున్నది. ఈ కవి ఇంకా అనేక బౌద్ధ గ్రంథాలను రచించాడు. వీటిల్లో

కొన్ని చైనా మొదలైన భాషల్లోకి అనువదింపబడినవి. ఈ కవి కాలం క్రీ.శ. 400 ప్రాంతమని బౌద్ధసాహిత్యం ఆధారంగా నిర్ణయింపబడింది.

## భీమకవి లేక భట్టభౌమకవి

ఈ కవి క్రీ.శ. 500 ప్రాంతంవాడు. రావణార్జునీయం లేక అర్జున రావణీయమనే మహాకావ్యాన్ని రచించాడు. 27 సర్గలల్లో కవి రావణ, కార్త్యవీర్యార్జునుల యుద్ధాన్ని వస్తువుగా తీసుకొని వర్ణించాడు. దీనిలో వ్యాకరణ నియమాలను లక్ష్యరూపంగా కవిత్వం చెప్పబడిందట. అంటే ఇది భట్టి కావ్యంవలె శాస్త్రకావ్యం. కాశికావృత్తికారుడు (క్రీ.శ. 550 ప్రాంతం) ఈ కావ్యాన్ని ఉదహరించటం చేత ఈ కవి క్రీ.వ. 500 ప్రాంతం వాడని అంగీకరించవచ్చునని శ్రీ వరదాచారి అభిప్రాయం. ఇతడు భీమకవి, భౌమకవిగాను పేర్కొనబడినాడు.

## భర్తృమేంఠుడు

భర్తృమేంఠుడు లేక మేంఠకవి హయగ్రీవవధ అన్న మహాకావ్యాన్ని రచించినట్లుగా కల్హణుడు రాజతరంగిణిలో చెప్పాడు. మేంఠకవిని మాతృగుప్తుని ఆస్థానకవిగా కల్హణుడు పేర్కొన్నాడు. మాతృగుప్తుడు క్రీ.శ. 5వ శతాబ్దంలో కాశ్మీరాన్నేలిన రాజు. మేంఠకవి మాతృగుప్తుని ఆస్థానానికి పోయి తన కావ్యాన్ని చదివి వినిపించగా మాతృగుప్తుడు ఉదాసీనంగా మౌనం వహించాడు. అప్పుడు మేంఠకవి నిరాశుడై తన కావ్యపత్రాలను కట్టుకొంటుండగా మాతృగుప్తుడు పుస్తకం కింద, లావణ్యమెక్కడ రాలిపోతుందో, కావ్యరసం ఎక్కడ జారి భూమిమీద పారుతుందో అని ఒక బంగారు పళ్ళాన్ని తెచ్చి పెట్టాడట. రాజుయొక్క రసహృదయానికి, గుణగ్రాహతకు మేంఠకవి సంతోషించాడు. ఈ సంఘటన తర్వాత భర్తృమేంఠుడు మాతృగుప్తుని ఆస్థానంలోని వుండిపోయాడు.

భర్తృమేంఠుని హయగ్రీవవధ కావ్యం లభించకపోవటం సంస్కృత సాహిత్యప్రియుల దుర్భాగ్యమని చెప్పాలి. అలంకార గ్రంథాలల్లో ఉదాహరింపబడిన శ్లోకాలే అతని కవిత్వ ప్రతిభను ప్రకటిస్తున్నవి. వాల్మీకి కవియే మేంఠునిగా ఆ తర్వాత భవభూతిగా జన్మించాడని, ఆ వాల్మీకియే రాజశేఖరుడుగా జన్మించాడన్న రాజశేఖరుని ప్రశంసను బట్టి మేంఠకవి వాల్మీకి భవభూతుల వంటి ఉచ్చకోటికి చెందిన కవి అని చెప్పవచ్చును.

విష్ణువు హయగ్రీవుని వధించే వృత్తాంతం హయగ్రీవవధ కావ్యంలో వున్నది. ప్రతి నాయకుడైన హయగ్రీవుని వర్ణనతో కావ్యం ఆరంభమౌతున్నదట. దీనినొక దోషంగా

మమ్మటుడు ఎత్తిచూపాడు. లభించిన శ్లోకాలను బట్టి మేంఠుని కవిత్వం సమాసభరితమై సుందరంగా వున్నదని చెప్పవచ్చును.

## ప్రవర సేనుడు

ప్రవరసేనుడు సేతుబంధమనే ప్రాకృతకావ్యాన్ని రచించాడు. దానికే రావణవధ, దశముఖవధ అని కూడ పేర్లు. దీనిలో మహారాష్ట్ర ప్రాకృతం ప్రయోగింపబడింది. సంస్కృత వాఖ్యానం కూడ దీనికి చేర్చబడింది.

ప్రవరసేనుడు ఎవరు అన్న విషయంలో అభిప్రాయంభేదం మొదట్లో వుండేది. ప్రవరసేనుడు కాశ్మీరరాజు అని, అతని ఆస్థానంలోనే కాళిదాసకవి వుండేవాడని, కాళిదాసే సేతుబంధకర్త అని కొందరు తలంచారు. కాని ఇది అంతగా నిలిచేవాదం కాదు. కాళిదాసు నాటకాలల్లో ప్రయోగించిన ప్రాకృతానికి ప్రవరసేనుని కావ్య ప్రాకృతానికి కూడా పొత్తులేదు. ప్రవరసేనునికి ప్రాకృతభాషమీద మంచి అధికారమున్నట్లు కన్పిస్తున్నది. అంతేగాక సేతుబంధంలోని భావాలకు కాళిదాసు రచనల్లోని భావాలకు ఎక్కడా సామ్యం లేదు. బాణ దండి కవులు సేతు బంధకర్తగా ప్రవరసేనున్నే పేర్కొన్నారు -

కీర్తిః ప్రవరసేనస్య ప్రయతా కుముదోజ్జ్వలా
సాగరస్య పరంపారం కపిసేనేవ సేతునా హర్ష. చ 1-14 శ్లో.

మహారాష్ట్రాశ్రయాం భాషాం ప్రకృష్టం ప్రాకృతం విదుః
సాగరః సూక్తిరత్నానాం సేతుబంధాది యన్మయమ్. కావ్యాద 1-34

క్షేమేంద్రుడు ఔచిత్య విచారచర్చలో సేతుబంధం మొదటి సర్గలోని రెండవ శ్లోకాన్ని ఉద్ధరించి దాని రచయిత ప్రవరసేనుడనే పేర్కొన్నాడు. బరోడా ఓరియంటల్ ఇనిస్ట్యూట్‌లోని సేతుబంధ ప్రతిలో దాని కవి ప్రవరసేనుడని పేర్కొనబడినాడు. అంతటా సేతుబంధకర్త ప్రవరసేనుడని పేర్కొనబడి వుండగా, క్రీ.శ. 1559 ప్రాంతంవాడైన రామదాస భూపతి ఆ కావ్యానికి వ్యాఖ్యానం వ్రాస్తు దాని రచయిత కాళిదాసు అని భ్రమపడినాడు. ఆ భ్రమయే పైవాదానికి దారితీసింది. కాని ఇది నిరాధారమైన వాదం.

కాశ్మీరాన్నేలిన ప్రవరసేనుడు కాక వాటాటక వంశానికి చెందిన ప్రవసేనుడే ఈ కావ్యకర్త అని విమర్శకులు తలస్తున్నారు. వాకాటక వంశంలోను ఇద్దరు ప్రవరసేనులున్నారు. వారిల్లో కుంతల ప్రాంతాన్ని జయించి కుంతలేశ్వరుడన్న బిరుదాన్ని ధరించిన రెండవ ప్రవరసేనుడే సేతుబంధకర్త అని సర్వసమ్మతమైన వాదం. రెండవ చంద్రగుప్తుని కూతురు

ప్రభావతిని వివాహమాడింది ఈ ప్రవరసేనుడే. అప్పుడు అతని కాలం క్రీ.శ. 415 ప్రాంతం అని చెప్పవచ్చును.

ప్రవరసేనుడు వాల్మీకి కాళిదాసుల మార్గాన్ననుసరించి వారి కావ్యశైలిలోనే సేతుబంధాన్ని రచించాడు. అతని కవిత్వం వారి కవిత్వం వలెనే స్వాభావికమై, సరళమై ప్రసాదగుణభరితమై వున్నది. కవి యమకాలంకారాన్ని చాల చోట్ల వాడాడు. ఈ కావ్యంలో 15 ఆశ్వాసాలున్నవి.

## భారవి

భారవి సంస్కృత ప్రౌఢ కవులల్లో ఒకడు . అతడు కిరాతార్జునీయమనే మహాకావ్యాన్ని రచించాడు. ఆలంకారికశైలికి ఒక విధంగా అతడే గురువని చెప్పవచ్చును. కాళిదాసు కుమారసంభవ రఘువంశాలను భారవి ఆదర్శంగా గ్రహించినట్లు కన్పించినా అతడు సర్వస్వతంత్రమైన వినూత్నశైలిని సంస్కృత సాహిత్యంలో సృష్టించాడు. శక్తిమంతమైన పద ప్రయోగం, భావప్రకటనలు భారవితోనే ఆరంభమైనవి. తర్వాత శ్రీహర్షాది కవులా మార్గాన్ననుసరించారు.

## భారవి కాలం

క్రీ.శ. 700 ప్రాంతంవాడైన మాఘుడు భారవిని పూర్ణతయా అనుకరించినాడంటె భారవి అంతకంటె పూర్వుడని, చెప్పవచ్చును. క్రీ.శ. 634 రెండవ పులకేశి నాటిదైన ఐహోళె శాసనంలో కాళిదాసుతోపాటు భారవి ప్రసక్తి వున్నది. దానిచేత భారవి క్రీ.శ. 634కి పూర్వుడని నిశ్చయంగా చెప్పవచ్చును. అవంతి సుందరి కథానుసారం భారవి విష్ణువర్ధనుని ఆస్థాని. అవంతిసుందరీ కథలో భారవి దండికి ప్రపితామహుడని చెప్పబడింది. దండి దాదాపుగా బాణునికి సమకాలికుడు. అంటె క్రీ.శ. 7వ శతాబ్దం పూర్వార్ధంవాడు. అప్పుడు భారవి క్రీ.శ. 6వ శతాబ్దం పూర్వార్ధంవాడు కావచ్చును. వామనుడు తన కావ్యాలంకార సూత్రవృత్తిలో భారవి శ్లోకాన్ని ఉద్ధరించాడు. దీన్నిబట్టి భారవి వామనుని కాలం (క్రీ.శ. 7వ శతాబ్దం) నాటికి ప్రసిద్ధుడైనాడని తెలుస్తున్నది. క్రీ.శ. 634 ఐహోళె శాసనాన్ని బట్టి కూడ భారవి అప్పటికే కాళిదాసుతో సమానంగా కీర్తిని సంపాదించుకొన్నాడని చెప్పవచ్చును. అవంతిసుందరి కథానుసారంగా భారవి పేరు దామోదరుడు. భారవికి కంచితో, పల్లవరాజులతో సంబంధమున్నట్లు చెప్పబడుతున్నది. పల్లవరాజు సింహవిష్ణువు (క్రీ.శ. 575-600) ఆస్థానంలో భారవి చాలా కాలం వున్నాడని కొందరు విమర్శకుల అభిప్రాయం. భారవికి చాలామంది పుత్రులున్నారని వారిలో మనోరథుడొకడని, మనోరథుని నాల్గవ

కుమారుడైన వీరదత్తుని కుమారుడు దండి అని అవంతిసుందరికథ చెప్తున్నది. కాని దామోదరుడు భారవి ఒక్కరే అనటంగాని, దండి భారవి ప్రపౌత్రుడనటంగాని ఇతరాధారాలు లేక నమ్మటానికి వీలులేదు. క్రీ.శ. 634 నాటి ఐహోళె శాసనంలో భారవి కాళిదాసుతో సమానంగా స్తుతింపబడటంచేత దక్షిణదేశంలోనే అతని కీర్తి వ్యాపించిందని, చాళుక్యులతో అతనికి సంబంధమున్నదని, ఒకవేళ కుబ్జవిష్ణువర్ధనునికి సన్నిహితుడై బాదామిలో వుండి అతడు వేంగికి రాజప్రతినిధిగా వచ్చినప్పుడు అతనితోపాటు వేంగికి వచ్చాడేమో అని మాత్రం ఊహించవచ్చును. కుబ్జవిష్ణువర్ధనుని కాలం క్రీ.శ. 615 ప్రాంతం. కాబట్టి భారవి ఆంధ్రదేశంలోని వేంగిని పాలించిన తూర్పు చాళుక్యవంశ ప్రతిష్ఠాపకుడైన విష్ణువర్ధనుని ఆస్థాన కవిగా క్రీ.శ. 6వ ఉత్తరార్ధంలో నివసించినట్లుగా ఆంధ్రదేశవాసిగా చెప్పవచ్చును. శివుడు మల్లరూపంలో అర్జునున్ని పరీక్షించిన కథ ఆంధ్రదేశంలో బాగాప్రచారంలో వున్నది. ఆంధ్రదేశంలో కోయలకు శివుడు మల్లరూపంలో ఆరాధ్యమై వుంటాడు. బెజవాడలోని ఇంద్రకీలం మీద అర్జునుడు తపస్సు చేసాడని ఐతిహ్యాం. పూర్వం ఆంధ్రదేశంలో మల్లేశ్వరం అనే ఒక గొప్ప క్షేత్రముండేది. శ్రీశైలంలో వెలసిన శివుడు కూడా మల్లేశ్వరుడు కావచ్చును. ఎప్పుడో ఆ మల్లికార్జునుడనే పేరు - 'మల్ల' అన్నది 'మల్లిక'గా రూపాంతరం చెంది ప్రచారంలోకి వచ్చివుంటుంది. ఆంధ్రదేశంలో విశేషంగా ప్రచారంలోవున్న మహాభారత ప్రసిద్ధమైన ఈ వృత్తాంతాన్ని భారవి తన కావ్యవస్తువుగా గ్రహించి వుంటాడు. దానిచేత కూడా అతడు ఆంధ్రదేశవాసి అని చెప్పవచ్చును.

## కిరాతార్జునీయం

కిరాతార్జునీయం భారవి ఏకైక రచనగా కన్పిస్తున్నది. అదియే అతని ప్రతిభకు నిదర్శనమై యశస్సాధానికి మూలస్తంభంగా వున్నది. ఈ కావ్యంలో ఇతివృత్తం మహాభారతం నుంచి గ్రహింపబడింది. జూదంలో ఓడిపోయి యుధిష్ఠిరుడు సోదరసమేతుడై ద్వైతవనంలో వుంటుంటాడు. దుర్యోధనుని రాజ్యపరిపాలన విధానాన్ని తెలుసుకునేటందుకు ఒక వనచరున్ని గుప్తచరునిగా పంపిస్తాడు. అతడు తిరిగి వచ్చి సువ్యవస్థితమైన దుర్యోధనుని రాజ్యపాలనను గురించి చెప్తాడు. ఇది ప్రథమ సర్గలోని ఇతివృత్తం. తర్వాత రెండు సర్గలలో యుధిష్ఠిర,భీమ, ద్రౌపదుల సంభాషణలున్నవి. భీముడు, ద్రౌపది ఇద్దరు యుధిష్ఠిరున్ని యుద్ధానికి ఉత్తేజపరుస్తారు. కాని యుధిష్ఠిరుడు ప్రతిజ్ఞాపాలనను విడిచి దుర్యోధనునితో యుద్ధం చేయటానికి నిరాకరిస్తాడు. ఇంతలో వేదవ్యాసుడు అక్కడికి వచ్చి అర్జునున్ని ఇంద్రకీలపర్వతం మీద ఇంద్రున్ని గూర్చి తపస్సు చేయమని సలహా ఇస్తాడు. అర్జునుడు ప్రయాణమై ఇంద్రకీలానికి పోయి తపస్సు చేస్తాడు. దేవతా స్త్రీలు అర్జునుని తపోభంగం

చేయటానికి ప్రయత్నించి విఫలురౌతారు. అక్కడ దేవతా స్త్రీల జలకేళి, వనవిహార, సంభోగశృంగారాదులను భారవి వర్ణించాడు. ఇంద్రుడు స్వయంగా వచ్చి అర్జునున్ని స్థిరచిత్తతతో శివున్ని గూర్చి తపస్సు చేయమని ఆదేశిస్తాడు. అర్జునుడు ఇంకా స్థిరచిత్తుడై తపస్సు చేస్తాడు. అర్జునున్ని పరీక్షించేందుకై శివుడు కిరాతవేషంలో వచ్చి మాయాసూకరాన్ని అర్జునునిమీదికి పంపుతాడు. అర్జునుడు తనను రక్షించేకునేటందుకు సూకరాన్ని బాణం వేసి చంపుతాడు. అదే సమయంలో కిరాతుడు బాణం వేసి దాన్ని కూలుస్తాడు. ఆ సూకరం నాదంటె నాదని ఇద్దరికి పోట్లాట జరుగుతుంది. చివరకు అర్జునుడు బాహుయుద్ధానికి తలపడ్తాడు. అర్జునుని సాహసపరాక్రమాలకు సంతోషించి శివుడు పాశుపతాస్త్రాన్ని అతనికి ఇస్తాడు.

కావ్యంలో తీసుకొన్న కథ చిన్నది. ఆ చిన్న కథను అనేక వర్ణనలతో కలిపి 18 సర్గల మహాకావ్యంగా భారవి రచించాడు.

## కావ్య వర్ణనలు

కాళిదాసాదుల్లోని పుర శైల ఋతు వర్ణనాదులే కాక భారవి జలకేళి, వన విహార, మధుపాన, ప్రయాణ వర్ణనలను అధికంగా వర్ణ్య వస్తువులుగా గ్రహించాడు. వర్ణనలకు ప్రాధాన్యమిచ్చిన కవులల్లో భారవియే ప్రథముడు. హిమాలయ ఋతు వన ప్రయాణ సూర్యోదయాస్తమయ, చంద్రోదయాస్తమయాది వర్ణనలను భారవి ప్రౌఢమైన భాషలో, ఉక్తిచమత్కారంతో దీర్ఘంగా రచించాడు. ముఖ్యంగా చతుర్థ సర్గ మొదలుకొని దశమసర్గ వరకు వర్ణనలే అధికంగా వున్నవి. చతుర్థ సర్గలోని శరదృతు వర్ణన సహజంగా హృదయంగమంగా వున్నది. అలంకార ప్రియుడైన భారవి ఉపమ, శ్లేష, ఉత్ప్రేక్షాది అలంకారాలను వర్ణనలల్లో ప్రయోగించాడు.

## కవిత్వం

నారికేలఫల సన్నిభమ్ వచో భారవేః సపది తద్విభజ్యతే
స్వాదయంతు రసగర్భ నిర్భరం సారమస్య రసికాయథేప్సితమ్

అని మల్లినాథుడు భారవి కవిత్వాన్ని ప్రశంసించాడు. భారవి కవిత్వం నారికేళ పాకంతో నడిచింది. నారికేళాన్ని పగులగొడ్తే రుచికరమైన రసం లభించినట్లుగా భారవి రసగర్భ నిర్భరమైన కఠినవచాలను విడగొట్టినట్లయితె పాఠకులకు అంతా రసమయమై గోచరిస్తుంది. భారవిది ప్రౌఢ గంభీరమైన కవిత్వం. భారవికి భాషమీద సంపూర్ణాధికారం వున్నది. కాబట్టి అతని కవిత్వంలో భాష, శబ్ద సంయోజనం చక్కగా కుదిరింది.

భారవి అలంకార శైలిని ప్రయోగించటమే కాక పంచదశ సర్గలో చిత్ర కవిత్వరచనా ప్రతిభను కూడ ప్రదర్శించాడు. సర్వతోభద్ర, యమక, విలోమాది చిత్రకావ్యశైలులను ప్రయోగించాడు. ఏకాక్షర శ్లోకాన్ని రచించాడు, గోమూత్రికాది బంధాలను ప్రయోగించాడు.

కిరాతార్జునీయంలో భారవి అనేకవిధాలైన ఛందస్సులను ప్రయోగించినా అతనికి ప్రియమైనది వంశస్థ అని చెప్పవచ్చును. సువృత్తతిలకంలో క్షేమేంద్రుడు వంశస్థఛందస్సు యొక్క విచిత్రత భారవిప్రతిభను ఇనుమడింపజేసిందని అంటాడు-

వృత్తచ్ఛత్రస్య సా కాపి వంశస్థస్య విచిత్రతా
ప్రతిభా భారవేర్యేన సచ్ఛాయేనాధికీ కృతా.

శక్తిమంతమైన శబ్దాలను ప్రయోగించటంలో భారవికి అగ్రతాంబూలమియ్యవచ్చును. ప్రథమసర్గలోని వనేచరుని మాటలు, తర్వాత సర్గలల్లోని భీమద్రౌపది యుధిష్ఠిరుల సంభాషణల్లో సశక్తమైన శబ్దసంయోజనంతో, అర్థగౌరవంతో కూడిన పాత్రోచితమైన భాష ప్రయోగింపబడింది. అతడు చిత్రించిన ద్రౌపది, మహాభారతంలోని ద్రౌపదికి భిన్నంగా వుంటుంది. భారవి ద్రౌపది పతిభక్తి కలది. ధర్మరాజును యుద్ధానికి ఉత్సాహితున్ని చేసిన వీరవనిత. భీముడు కూడ ఒక విభిన్నమైన వ్యక్తిత్వంతో కనిపిస్తాడు. భారవి భీముడు రాజనీతిజ్ఞానం కలవాడు. భారవి చిత్రించిన పాత్రలన్నింటిలో ఆత్మగౌరవం కనిపిస్తుంది. భారవి చిత్రించిన భీమ ద్రౌపది ధర్మరాజుల వ్యక్తిత్వాలను తెలుగు సాహిత్యంలో అగ్రస్థానీయుడైన తిక్కన అనుకరించి మహాభారత రచన చేసాడు. అంటె భారవి పాత్ర చిత్రణా ప్రభావం తిక్కన మీద స్పష్టంగా వున్నదని చెప్పవచ్చును.

భారవి కవిత్వంలో అనేక లోకోక్తులు, నీతి సూక్తులు వున్నవి. అవి కవి యొక్క వ్యవహారకుశలతను, అనుభవాధిక్యతను ప్రకటిస్తున్నవి. భారవి మంచి రాజనీతిజ్ఞానం కలవాడు. భారవి శృంగారరసపోషణ కన్న వీరరసాన్ని పోషించటంలో నేర్పును చూపాడు. వీరరసం అతని అభిమానరసం. కిరాతార్జునీయంలో అంగిరసం వీరమే. దానిచేత భారవి గంభీర ప్రకృతి కలవాడని చెప్పవచ్చును. భారవి ఉపమ, ఉత్ప్రేక్ష, శ్లేషాదులను ప్రయోగించాడు. అయినా అతనికి అర్థాంతరన్యాసాలంకారమన్న అధిక ప్రీతి.

## భారవి అర్థాంతరన్యాసాలంకార ప్రీతి

ఒక విషయాన్ని చెప్పి సామాన్య విషయంచేత, సామాన్య విషయాన్ని చెప్పి విశేషవిషయం చేత సమర్థించటమే అర్థాంతరన్యాసాలంకారం. ఈ అలంకారయోజన భారవి యొక్క అపారలోకజ్ఞానాన్ని చాటుతున్నది.

క్రియాసుయుక్తైర్నృప! చారచక్షుషో న వంచనీయాః ప్రభవోనుజీవిభిః
అతోర్హసి క్షంతుమసాధుసాధువా హితం మనోహారి చ దుర్లభంవచః

"ఓ మహారాజా! నేను మంచి చెడు ఏది మాట్లాడినా నన్ను మీరు క్షమించాలి. ఎందుకంటె లోకంలో హితకరమైనవి మనోహరమైనవి అయిన మాటలు దుర్లభమైనవి".

సఖా స యుక్త : కథిత : కథం త్వయా
యదృచ్ఛయా ఽసూయతి యస్తతపస్యతే
గుణార్జనోచ్ఛ్రాయ విరుద్ధ బుద్ధయః
ప్రకృత్యమిత్రా హి సతామసాధవః

"తపస్వి మీద ఇష్టంవచ్చినట్లుగా దోషారోపణ చేసేవాడు స్నేహితుడెట్లా అవుతాడు. అసజ్జనులు స్వాభావికంగానే సజ్జనులకు శత్రువులవుతారు"

"వసంతి హి ప్రేమ్ణి గుణా న వస్తుని"
"లంఘ్యతే న ఖలు కాలనియోగః"
"సువృణోతి ఖలు దోషమజ్ఞతా"
"భవంతి గోమాయు సఖా న దంతినః"
"నిజమేవ సత్త్వముపకారి సతామ్"

మొదలైనవి కొల్లలుగా కిరాతార్జునీయకావ్యంలో భారవి అర్థాంతరన్యాసాలను రచించాడు. కిరాతార్జునీయం మొత్తం 1030 శ్లోకాలల్లోని 115 శ్లోకాలల్లో అర్థాంతరన్యాసాలంకారం కన్పిస్తున్నది.

## భారవి అర్థగౌరవం

భారవి కవిత్వం అర్థగౌరవానికి ప్రసిద్ధి చెందింది. తక్కువ శబ్దాలల్లో ఎక్కువ అర్థాన్ని చెప్పటమే అర్థగౌరవం. దీన్నే ఇంగ్లీషులో brevity అంటారు. ప్రాచీనకాలంలో దర్శన ధర్మశాస్త్రాదులు తక్కువ శబ్దాలల్లో ఎక్కువ అర్థాన్ని నిక్షిప్తం చేయటానికై సూత్రపద్ధతిలో వ్రాయబడినవి. భారవి మితభాషి. చెప్పిన కొద్ది శబ్దాలల్లో అపారమైన అర్థాన్ని ఇమిడించగల శక్తి అతనికున్నది. ఇదే గుణం తెలుగు కవులల్లో తిక్కనకు అలవడింది.

అర్థగౌరవం చేత అంటె తక్కువ శబ్దాలను ప్రయోగించటం చేత భారవి కవిత్వంలో శబ్దార్థ సౌందర్యంలో లోపం రాలేదు. పైగా వాటి సౌందర్యం హెచ్చింది, శబ్దసౌందర్యం భారవి ప్రతిశ్లోకంలోను వుట్టిపడ్తున్నది. ఓజో పూర్ణమైన శబ్దసంయోజన భారవి ప్రత్యేకత.

స్తువంతి గుర్వీమభిధేయ సంపదం విశుద్ధి ముక్తేరపరే విపశ్చితః
ఇతి స్థితాయాం ప్రతిపూరుషం రుచౌ సుదుర్లభాః సర్వమనోరమాగిరః

"కొందరు అర్థ సంపత్తిని ప్రశంసిస్తారు. మరికొందరు శబ్దసంయోగాన్ని ఇష్టపడ్తారు. ఈ విధంగా మనుష్యులు భిన్న రుచికలవారు. అందరి మనస్సులను ఆకర్షించే కవిత్వాన్ని వ్రాయటం సులభం కాదు" అని చెప్పిన భారవి తన కవిత్వంలో రెండింటిని అంటె అర్థగౌరవాన్ని, శబ్ద సౌందర్యాన్ని సమానంగా సాధించి అందరిని మెప్పించాడు. భారవి ప్రయోగించిన భాష ఉదాత్తమై, పాఠకులను తీవ్రంగా ప్రభావితం చేయగల సామర్థ్యం కలది. భారవికవిత్వం ఓజః పూర్ణమైనా ప్రసాదగుణ భరితమైంది. అర్థక్లిష్టత కూడా లేదు.

## ఆతపత్ర భారవి

ఉత్ఫుల్ల స్థలనళినీవనాదముష్మాదుద్ధూతః సరసిజ సంభవః పరాగః
వాత్యాభిర్వియతి వివర్తితః సమంతాదాధత్తే కనకమయాతపత్రలక్ష్మీమ్.

"స్థలనళినుల నుంచి లేచిన పరాగం గాలిచేత లేవగొట్టబడి ఆకాశంలో మండలాకారంగా వ్యాపించింది. అది సువర్ణసూత్ర నిర్మితమైన ఆతపత్రం (గొడుగు) యొక్క శోభను అనుకరిస్తున్నది" ఈ శ్లోకంలోని ఆతపత్ర భావన సుందరంగా వుండి భారవికి ఆతపత్ర భారవి అనే కీర్తిని తెచ్చిపెట్టింది.

## కిరాతార్జునీయ ప్రశంస

కిరాతార్జునీయం ప్రతిసర్గ చివరి శ్లోకంలో భారవి లక్ష్మి అన్న శబ్దాన్ని ప్రయోగించాడు. అందుకే దీన్ని "లక్ష్మ్యంత కావ్య" మని అంటారు. భారవిని అనుకరిస్తు మాఘు, శ్రీహర్ష కవులు తమ కావ్యంలో ప్రతిసర్గ చివరి శ్లోకంలో శ్రీ, ఆనంద శబ్దాలను ప్రయోగించారు. మాఘుని శిశుపాల వధను "శ్ర్యంత" కావ్యమని, శ్రీహర్షుని నైషధాన్ని "ఆనందాంత" కావ్యమని అంటారు.

మహాభారతంలో ఒక ఘట్టాన్ని తీసుకొని భారవి మహాకావ్య నిర్మాణం చేసాడు. అతని వర్ణనా ప్రతిభ అసామాన్యమైంది. పాత్రల చిత్రణను అతడు ఒక చిత్రకారునివలె స్పష్టమైన రేఖలతో చిత్రించాడు. వీర రసాన్ని విభావానుభావాల పుష్టితో వ్యక్తం చేసాడు. శృంగారాదులకు అంగరసాలుగా పరిమితంగా తన కావ్యంలో స్థానమిచ్చాడు. ఈ కావ్యంలో నాయికకు స్థానం లేదు. ప్రతినాయకుడు కూడ దీనిలో అధర్మానికి ప్రతీక అయిన దుష్టపాత్ర కాదు. నాయకుడు అర్జునుడు ధీరోదాత్తుడు. ఇటువంటి ఇతివృత్తాన్ని

తీసుకొని మహాకావ్యాన్ని రచించిన భారవి ఎంతో ప్రశంసనీయుడు. దండి విశ్వనాథ రుద్రటాదులు కిరాతార్జునీయాన్ని దృష్టిలో పెట్టుకొనే మహాకావ్య లక్షణాలను నిర్దేశించారని చెప్పవచ్చును.

కిరాతార్జునీయంలోని శ్లోకాలను వామన, ఆనందవర్ధన, మహిమభట్ట, మమ్మట, రుయ్యక, భోజ, విశ్వనాథాదులెందరో ఆలంకారికులు ఉద్ధరించారన్న ఆ కావ్యమెంత ప్రచారాన్నందుకొన్నదో చెప్పవచ్చును.

కిరాతార్జునీయం యొక్క ప్రత్యేకతను, వ్యాప్తిని చెప్పే మరొక అంశం వున్నది. దీనిలోని సౌందర్యాన్ని విప్పి చెప్పాలనే కుతూహలంతో చాలామంది వ్యాఖ్యానాలు వ్రాసారు. మల్లినాథుని వ్యాఖ్యానంతో కలిపి కిరాతార్జునీయానికి 36 వ్యాఖ్యానాలున్నవి. ఈ వ్యాఖ్యానాలే ఆ కావ్యప్రశస్తిని లోకప్రియతను చాటుతున్నవి. భారవికాలంలోనే దుర్వినీతుడనే పండితుడు ఈ కావ్యానికి వ్యాఖ్యానం వ్రాసాడు. కిరాతార్జునీయ కావ్యం సామాన్య పాఠకులకు, పండితులకు కూడ హృదయాహ్లాదాన్ని కలిగించేటటువంటిది. శబ్ద సౌందర్యంతో, అర్థ గౌరవంతో గంభీర భావాలతో, వర్ణనాచమత్కృతులతో, రసవ్యంజకతతో, పాత్ర చిత్రణాకౌశలంతో కిరాతార్జునీయం గొప్ప కావ్యంగా రసికజనుల చేత గౌరవింప బడుతున్నది. "ప్రకృతి మధురా భారవి గిరః" అని ఒకానొక కవి భారవి కవిత్వాన్ని ప్రశంసించాడు.

## భారవి వ్యక్తిత్వం

కిరాతార్జునీయం రాజనీతి ప్రధానంగా గల కావ్యం. సంస్కృత సాహిత్యంలో రాజనీతి ప్రాధాన్యం వహించిన మహాకావ్యమది ఒక్కటే అని చెప్పవచ్చును. భారవి తన ఆశ్రయదాత అయిన రాజుకు మంత్రాలోచనను చెప్పే వాడుగా ఆస్థానంలో ప్రధానపాత్ర వహించి వుంటాడనటంలో సందేహం లేదు. భారవి మితభాషి, గంభీర స్వభావుడుగా కన్పిస్తాడు. శృంగార ప్రియుడు కాడు. శృంగార సన్నివేశాలను వర్ణించినా అతడు కాళిదాసు వలె సరసంగా ఆస్వాద్యయోగ్యంగా చేయలేకపోయాడు. అతనిది క్షాత్రగుణం. ఓజః పూర్ణమైన అతని పదావళి అతన్నొక వీరుపురుషునిగా నిలబెడ్తున్నది. కాని పిరికివాడు కాదు. భారవి స్వాభిమాన పూర్ణుడు. యాచన, దైన్యం, పలాయనం అతనికి రుచించని విషయాలు. యశస్సు అతని దృష్టిలో గొప్పది. నిర్భీకత, పరాక్రమత అతనిలో మూర్తీభవించినవి. చివరకు అతని చేతిలో ద్రౌపది కూడ ధైర్యంగా, కుశలతతో మాట్లాడుతుంది. ధైర్యంగా నిలిచి పురుషార్థాలను సాధించాలంటాడు భారవి. కష్టాలు వచ్చినప్పుడు దైన్యం వహించి పలాయనం చేయటం అతనికిష్టంలేదు. ఈ గుణాలన్నిటిని కవి తన నాయకుడు

అర్జునునిలో నిక్షిప్తం చేసి ఒక ఉత్తమ నాయకునిగా సృష్టించాడు. అంటె మరొక విధంగా చెప్పాలంటె అర్జునుని పాత్రలో భారవి మూర్తీభవించి కనిపిస్తున్నాడు.

## భట్టి

భట్టికవి రావణవధ కావ్యాన్ని రచించాడు. కవిపేరు మీదుగా ఈ కావ్యాన్ని భట్టికావ్యమని పిలుస్తుంటారు. ఇంకా దీనికి భర్తృకావ్యం, రామకావ్యం, రామ చరిత్ర అని కూడ పేర్లు వ్రాత ప్రతులల్లో కన్పిస్తున్నవి. కాని మల్లినాథ, జయమంగళ, కుముదానందాది వ్యాఖ్యాతలు దీన్ని భట్టికావ్యంగానే పేర్కొన్నారు. భట్టి పేరు కూడ కవిభట్టి, భట్టి పండిత, భట్టి బ్రాహ్మణ, భట్టి మహాబ్రాహ్మణ, మహా బ్రాహ్మణ అని రకరకాలుగా వ్రాతప్రతుల్లో కన్పిస్తున్నది.

## భట్టికవి నిర్ణయం - కాలం

ఎన్.ఎల్. వెస్టర్‌గార్డ్ భట్టికావ్య రచయిత భర్తృహరి అని అభిప్రాయపడినాడు. భర్తృనుంచే భట్టి ఏర్పడిందని అతడంటాడు. రోథ్, బోట్‌లింక్‌లు కూడ ఇదే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. అవుఫ్‌రెష్ట్ అభిప్రాయంలో భట్టి మరియు శతకకారుడు భర్తృహరి భిన్న వ్యక్తులు. కీథ్, హోర్న్లేలు భర్తృహరిని భట్టికావ్య రచయితగా అంగీకరించలేదు. ఆర్.సి. మజుందార్ భట్టికావ్యకర్త భట్టి మరియు మందసర్ శాసనకర్త అయిన వత్సభట్టి ఇద్దరు ఒక్కరే అన్నాడు. కాని మందసర్ శాసనంలోని వ్యాకరణదోషాలను దృష్టిలో పెట్టుకొని కీథ్ ఈ అభిప్రాయాన్ని అంగీకరించలేదు. భట్టి భర్తృహరి ఒక్కరే అని ఈ కవి విక్రమాదిత్యుని సమకాలికుడు (అంటె క్రీ.పూ. ప్రథమ శతాబ్ది) అని, విక్రమార్కుని కథల్లో వచ్చే భట్టి ఇతడే అని రోథ్ అభిప్రాయపడినాడు. ఈ వాదాన్ని ఎవరు అంగీకరించలేదు. మొత్తంమీద కవిభట్టి భర్తృహరిగాని వత్సభట్టిగాని లేక విక్రమార్కుని సమకాలికుడైన భట్టిగాని కాదు. ఇతడు పూర్తిగా భిన్నమైన వ్యక్తి. భట్టి వలభిని పరిపాలించిన శ్రీధరసేనుని ఆస్థాన కవి. వలభిని పాలించిన వారిలో నలుగురు శ్రీధరసేనులున్నారు. వీరిలో రెండవ శ్రీధరసేనుడు శైవుడు. పరమ మాహేశ్వరుడు. శైవుడైన భట్టికవి ఇతని ఆస్థానంలోనే వుండివుంటాడు. రెండవ శ్రీధరసేనుని కాలంలో వేయబడిన ఒక శాసనంలో భట్టికవికి ఆ రాజు భూదానమిచ్చినట్లు చెప్పబడింది. ఈ భట్టి భట్టికావ్యకర్తయే. అప్పుడు భట్టి జీవితకాలాన్ని క్రీ.శ. 6వ శతాబ్దం ఉత్తరార్ధమని నిర్ణయించవచ్చును. మాఘకవి భట్టిని అనుకరించాడనటం స్పష్టం. తర్వాత భామహునికి భట్టికావ్యం సుపరిచితం అని అతడు చెప్పిన కావ్య విభేదాలను బట్టి తెలుస్తున్నది. దీన్నిబట్టి కూడ భట్టి కాలం మాఘ భామహులకు పూర్వమని

చెప్పవచ్చును. భామహుడు క్రీ.శ. 6వ శ॥ ఉత్తరార్ధంవాడు కాబట్టి భట్టి దాదాపుగా భామహునికి సమకాలికుడని చెప్పవచ్చును. భట్టి భారవిని అనుకరించటంచేత భారవికి అతడు కించిత్ అర్వాచీనుడని చెప్పవలసి వుంటుంది.

## భట్టి రచనలు

భట్టి రావణ వధ కావ్యం కాక పాణిని సూత్రాలకు వ్యాఖ్యానం వ్రాసాడని జినేంద్రబుద్ధి కాశికావివరణ పంజికను బట్టి తెలుస్తున్నది.

## భట్టి కావ్యం

భట్టికావ్యంలో 22 సర్గలున్నవి. ఇతివృత్తం రాముని చరిత్ర. భట్టి వాల్మీకి రామాయణ కథను అనుసరించాడు. అక్కడక్కడ చిన్న మార్పులను మాత్రం ప్రవేశపెట్టాడు. ఉత్తరకాండ కథను తీసుకోలేదు. వ్యాకరణాన్ని సరళంగా బోధించటమే భట్టికావ్యరచన ప్రధానోద్దేశం. శబ్దవ్యుత్పత్తి శబ్దప్రయోగ జ్ఞానాన్ని పాఠకులకు చెప్పటమే అతని ప్రధానలక్ష్యం. ఇటువంటి శాస్త్రకావ్యాలు భట్టికి పూర్వం చాలా వ్రాయబడినవని పతంజలి ఇచ్చిన ఉదాహరణ శ్లోకాలనుబట్టి తెలుస్తున్నది. కావ్యభేదాలను ఇతివృత్తాన్ని బట్టి భామహుడు నాలుగు విధాలుగా విభజించాడు.

వృత్తదేవాది చరితశంసీ చోత్పాద్య వస్తుచ
కళా శాస్త్రాశ్రయంచేతి చతుర్ధాభిద్యతే పున:

1) దేవాదుల చరిత్ర (దీన్ని ప్రసిద్ధ వస్తువుగా గ్రహించవచ్చును. 2) కవి కల్పితేతి వృత్తం 3) కళాశ్రితేతివృత్తం 4) శాస్త్రాశ్రితేతివృత్తం. చివరి రెండు కావ్యాలు కళలు, వ్యాకరణాలంకారాది శాస్త్రాలను ఆశ్రయించినట్టివి. వ్యాకరణ శాస్త్రాన్ని బోధించే భట్టి కావ్యం ఈ శాస్త్ర కావ్యాల కోవలోకి చెందిందే. భామహుని నాటికి ఇటువంటి కావ్యాలు వుండివుంటవి. అందుకే అతడు కావ్యవిభజనలో వీటిని చేర్చాడు. లబ్ధ శాస్త్రకావ్యాలలో భట్టికావ్యమే మొదటిది.

భట్టికావ్యంలోని కొన్ని సర్గలకు నామకరణం చేశాడు. మొదటి ఐదు సర్గల వరకు తిఙ్గంతరూపాలు చెప్పబడినవి. వీటికి ప్రకీర్ణకాండమని పేరు, ఆరు నుంచి తొమ్మిది సర్గల వరకు అధికారసూత్రాల ననుసరించి అనేక లక్ష్యరూపాలను ఇచ్చాడు. వీటికి అధికారకాండమని పేరు. పదినుంచి పదమూడు సర్గల వరకు గుణాలంకారాలకు లక్ష్యాలు ఇయ్యబడినవి. వీటికి ప్రసన్నకాండమని పేరు. పద్నాలుగునుంచి ఇరవైరెండు సర్గల వరకు

లడాది తొమ్మిది లకారాల విశిష్ట రూపాలను చూపాడు. వీటికి తిజ్ఙంతకాండమని పేరు. ఈ విధంగా భట్టి వ్యాకరణ సంబంధమైన, అలంకార సంబంధమైన విషయాలను, రాముని ఇతివృత్తంతో జోడించి కావ్యాన్ని రచించాడు. అంటె కవి జోడుగుఱ్ఱాలమీద ప్రయాణం చేశాడు. శాస్త్రం, కావ్యం అన్న రెండు కత్తి అంచుల మీద చలించకుండ నడిచి చూపాడు. అక్కడక్కడ కవి వ్యాకరణ ఉదాహరణలకొరకు శ్లోకాలు వ్రాయవలసివచ్చింది. కొన్ని వర్ణనలు ప్రత్యేకంగా వాటికొరకే వ్రాయటంవల్ల కొంతవరకు కృత్రిమత్వం రాకపోలేదు. అయినా భట్టికావ్యం సరసంగానే నడిచింది.

## భట్టి కవిత్వం

భట్టి శైలి ప్రసన్నంగా లేకపోయినా కుంటుపడక ధారాళంగా నడిచింది. రసవ్యంజకమైన శైలినికూడ కవి అక్కడక్కడ ప్రయోగించాడు. యమకాలంకారాల ప్రయోగంచేత కావ్యశైలిలో కొంత మాధుర్యం వచ్చింది. ఒకవైపు కథను చెప్పేటువంటి మరొకవైపు వ్యాకరణాన్ని బోధించేటువంటి శబ్దాలను ఎన్నుకోవటంలో కవి తన నైపుణ్యాన్ని ప్రదర్శించాడు. ఈ శబ్దప్రయోగం అనాయాసంగా జరిగిందే కాని ఎక్కడా కృత్రిమత్వం లేదు. ఇతర కావ్యాలల్లో లేని ఎన్నో శబ్దాలు నానుడులు ఇతని కావ్యంలో చోటుచేసుకొన్నవి. అక్కడక్కడ అప్రసిద్ధ పదాలను కవి ప్రయోగించి తనకు భాషమీదవున్న అధికారాన్ని చూపాడు. భట్టి దీర్ఘసమాసాలను వాడలేదు. అతనికి వైదర్భీ శైలి అంటే అభిమానంగా కన్పిస్తున్నది.

భట్టికవి అనేకచోట్ల భారవిని అనుకరించాడు. భారవిలోని శబ్దసంయోజనం, అర్థగౌరవాలు భట్టిలో లేకున్నా ఎన్నో చోట్ల భారవి అనుకరణలు భట్టికావ్యంలో వున్నవి. భారవిని అన్ని విధాల అనుకరించిన మాఘుడు భట్టిని అనుకరించాడు. ముఖ్యంగా భట్టి ప్రభాతవర్ణనను మాఘుడు అనుకరించాడు. అయోధ్య, లంక, ఋతు మొదలైన వర్ణనలను భారవివలె దీర్ఘంగా చేయలేదు. మహాకావ్యోచిత వర్ణనలను భట్టి సందర్భానుకూలంగా ప్రవేశ పెట్టాడు.

నతజ్జలం యన్న సుచారు పంకజం న పంకజం తద్ యదలీనషట్పదమ్
నషట్పదోఽసౌ న జుగుంజ యః కలం న గుంజితం తన్న జహార యన్మనః

ఇది శరదృతు వర్ణన. "కమలాలు వికసించని సరస్సులు సరస్సులు కావు. భ్రమరాలు భ్రమించని కమలాలు కమలాలు కావు. ఝుంకారాలు చేయని భ్రమరాలు భ్రమరాలు కావు. మానవుల హృదయాలను ఆకర్షించని భ్రమర ఝుంకారాలు భ్రమర ఝుంకారాలు కావు"

దరుత్తరేపంక ఇవాంధకారే మగ్నం జగత్ సంతత రశ్మిరజ్జు:
ప్రనష్ట :మూర్తి: ప్రవిభాగముద్యన్ ప్రత్యుజ్జహారేవ తతో వివస్వాన్ !!

"సమస్త ప్రపంచం గాఢాంధకారమనే బురదలో కూరుకొనిపోగా ఉదయాచలం మీద ఉదయించే సూర్యుడు తన కిరణాలనే రజ్జువులను పరచి ప్రాణులను పైకి లాగుతున్నట్లున్నా" డట! దీనిలోని ఉత్ప్రేక్ష చాల రమణీయంగా వున్నది. అదే విధంగా ఉపమాలంకార సౌందర్యానికొక ఉదాహరణ -

హిరణ్మయీ సాలలతేవ జంగమా చ్యుతా దివ: స్థాస్నురివాచిరప్రభా
శశాంక కాంతేరధిదేవతాకృతి: సుతాదదేతస్యసుతాయ మైథిలీ॥

"జంగమమైన సువర్ణలతవలె స్థిరంగా ప్రకాశించే విద్యుత్తువలె చంద్రుని శోభగల అధిష్ఠాత్రీదేవి వలె సీత వున్న "దట!

సరసాం సరసాం పరిముచ్యతనుం పతతాం పతతాం కకుభో బహుశ:
సకలైఃసకలై: పరిత: కరుణై రుదితై రుదితైరివ ఖం నిచితమ్ ॥
నగజా నగజా దయితాదయితా విగతం విగతం లలితం లలితమ్
ప్రమదా ప్రమదా Zమహతా మహతా మరణం మరణం సమయాత్
సమయాత్ ॥

హనుమంతుడు లంకను దహించేటప్పటి వర్ణనలు. అగ్నిజ్వాలలు వ్యాపించిన లంక ఎంత గందరగోళంగావున్నదో యమకాలంకారమే వ్యంగ్యం చేస్తున్నది.

భట్టి ఎంత ప్రసిద్ధపదాలను వాడినా, సరళసులభంగా రచించినా, శాస్త్ర వివరణలచేత కావ్యవస్తువు సుప్రసన్నంగా లేదనే చెప్పాలి. వ్యాకరణ చక్షువులు గల వారికి తన కావ్యం దీపం వంటిదని భట్టియే స్వయంగా చెప్పాడు -

దీపతుల్య: ప్రబంధోZయం శబ్దలక్షణ చక్షుషామ్
హస్తామర్ష ఇవాంధానాం భవేద్ వ్యాకరణాదృతే ॥

"దీపం గుడ్డివానికి వస్తుదర్శనాన్ని కలిగించదు. అదే విధంగా వ్యాకరణ చక్షువులుంటేనే ఈ కావ్యం దీపంవలె కథనవస్తువును దర్శింపజేస్తుంది." వ్యాఖ్యానం లేకుండ ఈ కావ్యాన్ని అవగాహన చేసుకోవటం సామాన్య పాఠకులకు సాధ్యం కాదు. అందుకేనేమో భట్టికావ్యానికి 22 వ్యాఖ్యానాలున్నవి. ఈ వ్యాఖ్యానకారుల్లో పెద్దిభట్టు ఒకడు. పెద్దిభట్టు తెలుగువాడు. భట్టికావ్యానికే కాక ఇతడు కిరాతార్జునీయం, శిశుపాలవధ,

సూక్తివారధి, నైషధాలకు కూడ వ్యాఖ్యానాలు వ్రాసాడు. పెద్దిభట్టు మల్లినాథుడే అని అవుఫ్‌రెష్టు అభిప్రాయపడినాడు. కాని పెద్దిభట్టు మల్లినాథుని మనుమడు, కపర్ది అనేవాని కుమారుడు. మల్లినాథుడు కూడ భట్టికావ్యానికి "సార్వపథీనా" అన్న వ్యాఖ్యానం వ్రాసాడు. శ్రీధరుడనేవాడు భట్టికావ్యానికి తెలుగు భాషలో వ్యాఖ్యానం వ్రాసాడు. మరొకటి భట్టిరూప ప్రకాశమనే వ్యాఖ్యానాన్ని శ్రీనాథుడు వ్రాసాడు. ఈ శ్రీనాథుడు ప్రసిద్ధమైన తెలుగుకవి శ్రీనాథుడే అని కృష్ణమాచారియర్ అభిప్రాయపడినాడు కాని వ్యాఖ్యాత శ్రీనాథుడు తన తండ్రి పేరు శ్రీకరాచార్యుడని చెప్పుకోవటం చేత తెలుగుకవి శ్రీనాథుని తండ్రి పేరు భీమన కావటంచేత వారిద్దరు బిన్నమైన వ్యక్తులే. వ్యాఖ్యాత శ్రీనాథుడు రఘువంశం, నైషధాలకు కూడ వ్యాఖ్యానాలు వ్రాసాడు.

## భట్టి పాండిత్యం

భట్టికవి వ్యాకరణాలంకారశాస్త్రాలు, నాట్య సంగీత శాస్త్రాలు, వేదవేదాంగాలు, అర్థ ధర్మశాస్త్రాలు బాగా తెలిసినవాడు. భట్టి భారవివలె రాజనీతిని తెలిసినవాడుగా కన్పిస్తాడు. విభీషణుని మాటలల్లో కవి తన రాజనీతికుశలతను ప్రకటించాడు. సంభాషణలను నడపటంలో భట్టి మంచి నైపుణ్యాన్ని చూపాడు. ఎంత పాండిత్యశాస్త్ర జ్ఞాన భరితమైనా ఈ కావ్యం పండితులకు కొరకరాని కొయ్యమాత్రం కాదు.

## కుమార దాసు

జానకీహరణం కర్తుం రఘువంశే స్థితే సతి
కవిః కుమారదాసశ్చ రావణశ్చ యది క్షమౌ

రఘువంశం (కాళిదాసుకావ్యం మరియు సూర్యవంశం) వుండగా జానకీ హరణం (కావ్యరచన మరియు సీతను అపహరించటం) చేసే సామర్థ్యం కుమారదాసుకూ, రావణునికీ, మాత్రమే వున్నది - అని రాజశేఖరుడు చమత్కారంగా కుమారదాసును ప్రశంసించాడు. కుమారదాసు కావ్యం జానకీహరణం మహాకావ్యం. కాళిదాసు తర్వాత కాలంలో వ్రాయ బడిన మహాకావ్యాలల్లో ఇది ప్రముఖమైంది. క్రీ.శ. 1966 వరకు జానకీహరణం మొత్తం కావ్యం ప్రచురణ భాగ్యానికి నోచుకోలేదు. కావ్యం పూర్తిగా లభించకపోవటమే దీనికి ప్రధానకారణం. అనేక ఆలంకారికులు, వ్యాఖ్యాతలు, శ్లోకసంగ్రహకర్తలు ఈ కావ్యం నుంచి శ్లోకాలను ఉద్ధరించారు. అంటె ఈ కావ్యం బహుళ జనాదరణను పొందిందనే చెప్పవచ్చును. కాని క్రీ.శ. 1920 వరకు పూర్తిగా మనకీకావ్యం లభించలేదు. క్రీ.శ. 1920లో మద్రాసులోని గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్టు లైబ్రరీ వారు ఉత్తరట్రావంకూర్‌లోని

ఒక నంబూద్రి కుటుంబం దగ్గర జానకీహరణ కావ్యప్రతిని సంపాదించి లైబ్రరీలో భద్రపరిచారు. తర్వాత మళయాళ లిపిలోను, దేవనాగరలిపిలోను జానకీహరణ కావ్యప్రతులు ట్రావంకూర్; అడయార్, లండన్ లైబ్రరీలల్లో దొరికినవి. ఈ ప్రతుల సహాయంతో పూర్తి కావ్యాన్ని తయారు చేయటానికి ఇప్పుడు వీలవుతున్నది. ఈ కావ్యంలో మొత్తం 20 సర్గలున్నవి. ఈ 20 సర్గల కావ్యాన్ని క్రీ.శ. 1966లో ఆలహాబాదు నుంచి శ్రీకృష్ణదాసు ముద్రించాడు. క్రీ.శ. 1967లో సింహళదేశ పండితులు పరణవిత, గొదకుంబరలు విపులమైన పీఠికతో ఈ కావ్యాన్ని ప్రచురించారు. ఈ పీఠికలో చాల విషయాలు ఇంతకు ముందు వెలుగులోకి రానివి చెప్పబడినవని డా.వి. రాఘవన్ తెలిపాడు.

## కుమారదాసు కాలం

కుమారదాసు సింహళ దేశీయుడు. కాళిదాసు కుమారదాసులు సమకాలికులు స్నేహితులని ఐతిహ్యం. పరాక్రమ బాహుచరిత్ర అని సింహళభాషలో వ్రాయబడిన కావ్యంలో (క్రీ.శ. 14వ శ॥) మరియు పూజావళి (క్రీ.శ. 13వ శ॥) అన్న కావ్యంలో కుమారదాస కాళిదాసులు సమకాలికులని చెప్పబడింది. ఆ కథ ప్రకారం కుమారదాసు సింహళరాజు. భారతదేశ కవి కాళిదాసన్న అతనికి చాలా అభిమానం. "ఒకసారి కుమారదాసు కాళిదాసును సింహళానికి ఆహ్వానించగా కాళిదాసువచ్చి ఒక వేశ్యయింట్లో వున్నాడని, ఆ వేశ్య యింటికి రాజు కుమారదాసు కూడ వచ్చేవాడని, ఒకసారి రాజు వేశ్య పడకగదిలో గోడమీద ఒక శ్లోకభాగాన్ని వ్రాసి దాన్ని పూర్తిచేసిన వారికి బహుమానం ఇస్తానని అన్నాడని, కాళిదాసు దాన్ని పూరించాడని, వేశ్య ధనాశతో కాళిదాసుని చంపి ఆ శ్లోకాన్ని తానే పూరించినట్లుగా రాజుకు చెప్పిందని. కాని కుమారదాసు అది నమ్మక ఆమె నుంచి నిజాన్ని రాబట్టాడని,. స్నేహితుని మరణాన్ని గురించి విని విచారంతో కుమారదాసు చితిని ఏర్పాటు చేయించి కాళిదాసు శవంతో తాను అగ్ని ప్రవేశం చేసి మరణించా" డని కథ ప్రచారంలో ఉన్నది.

కుమారదాసు గోడమీద "కుసుమే కుసుమోత్పత్తి శ్రూయతే నతు దృశ్యతే'అని వ్రాయగా దాన్ని కాళిదాసు "బాలే తవ ముఖాంభోజే దృష్ట మిందీవరద్వయమ్" అని పూరించాడట. సింహళ సంప్రదాయాన్ననుసరించి కుమారదాసు తన ఐదు గురు రాణులతో, మంత్రితోపాటు అగ్ని ప్రవేశంచేసి మరణించినచోట "మాతర" అని, సప్తబోధివృక్షాలున్నవని అంటారు.

సింహళ దేశాన్ని క్రీ.శ. 512-521 నడుమ పరిపాలించిన కుమార ధాతు సేనుడే కుమారదాసు అని సాహిత్య చరిత్రకారులు కొందరు తలచారు. కాని మహావంశంలో ఈ

రాజు కవిగా పేర్కొనబడలేదు. రాజశేఖరుడు కుమారదాసు గుడ్డివాడని అతడు కాళిదాసు తర్వాత జీవించాడని చెప్పాడు. కుమారదాసు భారవిని కూడా అనేకచోట్ల అనుకరించాడు. శిశుపాలవధ కవితానుకరణలు కూడా జానకీహరణంలోవున్నవి; కాని అవన్ని మాఘుడే కుమారదాసును అనుకరించినవని కీథ్ నిర్ణయించాడు. దీన్ని బట్టి కుమారదాసు భారవిమాఘుల నడిమి కాలంలో వున్నవాడని చెప్పవచ్చును. డా॥ సి.ఆర్. స్వామినాథన్ తన జానకీహరణ సిద్ధాంతవ్యాసంలో కుమారదాసు భారవి దండికవులకు తరువాతివాడు అని నిర్ణయించాడు. దండి కావ్యాదర్శంలో చెప్పిన చిత్రకవిత్వ భేదాలు జానకీహరణంలో ప్రయోగింపబడినవని అందుకే అతడు దండికి తరువాతివాడని స్వామినాథన్ అభిప్రాయం. కుమారదాసు కాలనిర్ణయానికి కొత్తగా బయటపడిన శాసనమొకటి తోడ్పడుతున్నది. క్రీ.శ. 9వ శతాబ్దానికి చెందిన శాసనం సింహళంలో 'మదిళ్ళ' అనే చోట లభించింది. దానిలో కుమారదాసును గురించి చాలా విషయాలు విశదంగా వున్నవి - కుమారదాసు తండ్రి రాజకీయమైన అల్లర్లలో చంపబడగా బాలుడైన కుమారదాసు శ్రీవిజయకు తీసుకొని పోబడినాడట. అక్కడ అతనికి కుమారుధాతుసేనుడని నామకరణం చేయబడింది. అతడు కొంతకాలం అక్కడే వుండి సంస్కృతాన్ని అభ్యసించాడు. కొంతకాలం తర్వాత తన బంధువు మానవర్మతో అతడు పల్లవ రాజధాని కాంచీనగరానికి వచ్చాడు. కాంచిలో కుమార ధాతుసేనుడు హిందూమత ప్రభావంతో తన పేరును కుమారదాసుగా మార్చుకొన్నాడట. దండితో చేరి అతడు కాంచిలో సంస్కృతాన్ని అభ్యసించాడు. ఏ ఘటిక [1] లోనో వారిద్దరు సహాధ్యాయులై వుంటారు. కాంచిలోనే అతడు జానకీహరణ కావ్యాన్ని వ్రాయటం ఆరంభించాడు. మానవర్మ పల్లవరాజు రెండవ నరసింహ వర్మ సహాయంతో సింహళరాజ్యాన్ని సంపాదిస్తాడు. మానవర్మతోపాటు కుమారదాసు సింహళంలోని అనురాధపురం చేరుకొని యువరాజుగా పట్టాభిషిక్తుడయినాడు. అక్కడ జానకీహరణాన్ని అతడు పూర్తిచేసాడట. మానవర్మ తర్వాత అతని కొడుకు ఐదవ అగ్రబోధికి భయపడి కుమారదాసు శ్రీ విజయరాజ్యంలో తిరిగి ఆశ్రయం పొందుతాడు. శ్రీవిజయరాజు కుమారదాసును ఆదరిస్తాడు. ఆ రాజు బౌద్ధమతావలంబి కాబట్టి బౌద్ధమత సంబంధమైన కావ్యాన్ని వ్రాయమని అడుగుతాడు. ఆ రాజు కోరికమీద కుమారదాసు అశ్వఘోషుని సౌందరనంద ఇతివృత్తాన్ని తీసుకొని "శ్రీఘన నంద" అనే కావ్యాన్ని వ్రాసాడు. కొంతకాలం తర్వాత కుమారదాసు సింహళం వచ్చి అక్కడే మరణించాడు. ఈ వృత్తాంతాన్ని బట్టి కుమారదాసు దండికి సమకాలికుడని తెలుస్తున్నది. అయినా దండి కుమారదాసు కన్న వయస్సులో పెద్దవాడై వుంటాడని డా.రాఘవన్ అభిప్రాయం. దీన్ని బట్టి కుమారదాసు

1. ఘటిక అని నాడు విద్యా కేంద్రాలకు పేరు

కాలాన్ని క్రీ.శ. 7వ శతాబ్దమని నిర్ణయించవచ్చును. ఇక కుమారదాసు కాళిదాసులు సమకాలికులు స్నేహితులనటం కేవలం ఐతిహ్యమే. ఒకవేళ కుమారదాసు స్నేహితుడు కాళిదాసు ప్రసిద్ధమైన కాళిదాసుకవి కాక ఆ పేరును ధరించిన మరొక వ్యక్తి అయి వుండవచ్చును.

## జానకీహరణేతివృత్తం

వాల్మీకి రామాయణ కథనే కుమారదాసు తీసుకొని 20 సర్గల కావ్యంగా రచించాడు. కాళిదాసు రఘువంశమే ఈ కవిని ఈ కావ్యరచనకు ప్రేరేపించి వుంటుంది. కుమారదాసుకు వాల్మీకి కాళిదాసులంటె చాల అభిమానం. వాల్మీకి శ్లోకభావాలను వున్నదున్నట్లుగానే ఒక్కొక్కసారి కుమారదాసు గ్రహించి ప్రతిశ్లోకాలను రచించాడు. ఒక్కొక్కసారి వాల్మీకి శ్లోకభావాలను వున్నదున్నట్లుగా తీసుకొని తన శ్లోకాలల్లో చేర్చుకున్నాడు -

భరతశ్శోకసంతప్తో రామమాదాయ పాదయోః
ఉక్త్వార్యేతి సకృద్దీనః పునర్నోవాచ కించన

ఇది కుమారదాసు శ్లోకం. దీని మూలశ్లోకం -

దుఃఖాభితప్తో భరతో రాజపుత్రో మహాబలః
ఉక్త్వార్యేతి సకృద్దీనం పునర్నోవాచ కించన ।

రెండవపాదంలోని వాల్మీకి భావాన్ని తాను మెరుగ్గా చెప్పలేనని కాబోలు కుమారదాసు ఆ పాదాన్ని వున్నదున్నట్లుగా తీసుకొన్నాడు. ఒక్కొక్కసారి వాల్మీకి భావాలకు మెరుగులు దిద్ది కుమారదాసు ప్రతిశ్లోకాలను రచించిన ఘట్టాలు కూడ వున్నవి.

## వాల్మీకి కథలో కుమారదాసు చేసిన మార్పులు

1) విశ్వామిత్రుడు రాక్షససంహారార్థం రామున్ని పంపమని అడిగినప్పుడు వాల్మీకి దశరథుడు వెనుకముందు చేస్తాడు. కాని కుమారదాసు దశరథుడు వెంటనే అంగీకరించి ఆపైన రామునికి క్షత్రియుధర్మాలను బోధిస్తాడు. ఈ మార్పు దశరథ పాత్రకు ఔన్నత్యాన్ని కలిగించింది.

2) సుబాహువుతోపాటు మారీచుడు రాముని చేతిలో మరణించినట్లుగా కుమారదాసు చెప్పాడు. మారీచుడు బంగారులేడి రూపంలో వచ్చే విషయాన్ని వదిలిపెట్టి ఆ ఘట్టాన్ని సంక్షిప్తంగా కుమారదాసు రచించాడు.

3) స్వయంవరానికి పూర్వమే సీతారాములు పరస్పరం వీక్షించు కొన్నట్లుగా, అనురాగ పీడితులైనట్లుగా కుమారదాసు కల్పించాడు. ఈ పూర్వానురాగ ప్రసక్తిని తర్వాత మురారి, కంబన్, తులసీదాస కవులు వర్ణించారు. ఇవేగాక చిన్న చిన్న మార్పులను కూడ కుమారదాసు కథలో చేసాడు.

## కుమారదాసు - కాళిదాసు

పరశురామ వృత్తాంతాన్ని కుమారదాసు కాళిదాసు రఘువంశాన్ననను సరించి రచించాడు. కుమారదాసు రాముని చరిత్రను ప్రత్యేకంగా మహాకావ్యంగా వ్రాస్తున్నాడు. కాబట్టి కొన్ని వర్ణనలు, ఘట్టాలు రఘువంశంలో కన్నా విస్తరంగా వున్నవి. ఇతివృత్తాన్ని మహాకావ్యోచితం చేసేందుకై వర్ణనలను ప్రవేశపెడ్తు కవి రఘువంశాన్నే కాక కుమారసంభవాన్ని కూడ అనుకరించాడు. తారకాసురుని వల్ల దేవతలు పడే పాట్లను, రఘువంశంలో రావణాసురునివల్ల దేవతలు పడే కష్టాలను దృష్టిలో పెట్టుకొని కుమారదాసు రావణాసురుని వల్ల దేవతలు పడే బాధలను వర్ణించాడు. కుమారసంభవం 8వ సర్గలోని శివపార్వతుల విహారాన్ననుసరించి జానకీహరణం 8వ సర్గలో సీతారాముల విహారాన్ని వర్ణించాడు. కాళిదాసు రతీవిలాపాన్ని అనుకరించి మండోదరి దుఃఖాన్ని వర్ణించాడు. రఘువంశంలోని రఘు కౌత్స వృత్తాంతాన్ని దృష్టిలో పెట్టుకొని సూర్యుడు కుబేరున్ని ధనమడిగే ఘట్టాన్ని కుమారదాసు రచించాడు. ఇంకా అక్కడక్కడ మేఘసందేశ, శాకుంతలాల అనుకరణలు కూడ కన్పిస్తున్నవి. కాళిదాసు కవిత్వం కుమారదాసులో బాగా జీర్ణించుకొనిపోయింది. కాళిదాసు భావాలను, శబ్దాలను కుమారదాసు గ్రహించి అవే భావాలను, అవే శబ్దాలను అదే సన్నివేశంలో కూడ ప్రయోగించాడు.

## కుమారదాసు - భారవి

కుమారదాసు కవిత్వంలో భారవి గాంభీర్యాన్ని చూడవచ్చును. కుమారదాసు కాంచిలో నివసించి శిక్షాభ్యాసం చేసిన వాడు. భారవి కూడ కంచి నివాసి అని అంటారు. కుమారదాసు కన్న భారవి ఈషత్పూర్వుడు. కాబట్టి కుమారదాసు భారవి కవిత్వంచేత ఆకర్షితుడై వుంటాడు. మహాకావ్యపరిణామంలో భారవి యోగదానమెంతైనా వున్నది. భారవి మహాకావ్యప్రక్రియ చేత కుమారదాసు ఆకర్షితుడై రాముని చరిత్రను మహా కావ్యంగా మలచటానికి పూనుకొని వుంటాడు. కావ్యవర్ణనల విషయంలో భారవిప్రభావం కుమారదాసు మీద ఎంతైనా వున్నది. జానకీహరణం మూడవ సర్గలోని స్త్రీల జలక్రీడలు భారవి ననుసరించి రచించిందే. ఎన్నో చోట్ల కుమారదాసు భారవి ఉపమలను గ్రహించాడు.

ఒక్క ఉదాహరణ - "హేమకుంభ ఇవ పూర్వపయోధేర్మ్మనమజ్జ శనకైస్తుహినాంశు:" అన్న భారవి ఉపమానాన్ని అనుకరించి కుమారదాసు

"గగన సరసి చంద్రరూప్యకుంభే
వ్యపసరతిస్మ నిపాతితే రజన్యా" అని అంటాడు.

## కావ్యవర్ణనలు

మహాకావ్యోచితమైన పుర నాయక నాయిక సూర్యోదయాస్తమయ చంద్రోదయ రాత్రి ఉద్యానవన జలక్రీడ మధుపాన ఋతు మంత్రణ దౌత్య యుద్ధాది వర్ణన లను కుమారదాసు సందర్భోచితంగా చేసాడు. ఇవి సుదీర్ఘంగా లేక ఉచితరీతిలో వున్నవి. కౌసల్య సీతలను కవి నఖశిఖపర్యంతంగా - వర్ణించి తర్వాత కవులకు అనుకరణీయుడైనాడు. కౌసల్య ఊరువులను చేసేటప్పుడు బ్రహ్మ కండ్లు తెరచి వున్నట్లయితే తన సృష్టియొక్క అందానికి అతడు మన్మథబాణాలకు గురియై తద్రచనను పూర్తిచేసి వుండేవాడు కాదు, ఒకవేళ కండ్లు మూసుకొని చేసినాడన్న అంత సౌందర్యాన్ని సృష్టించగలిగి వుండేవాడు కాదని అనుమానం కలుగుతుందని కుమారదాసు అంటాడు -

దృష్టౌ హతో మన్మథబాణపాతై : శక్యం విధాతుం న నిమీల్యచక్షు :
ఊరూ విధాత్రా ను కథం కృతౌ తావిత్యాస తస్యాం సుమతేర్వితర్క:

సీత నఖశిఖపర్యంత సౌందర్యాన్ని చూచి రాముడనుకుంటాడు -

చిత్రీయతే తన్మయదాత్మయోనే: తీవ్రా మయి వ్యాహతిరాయుధానామ్
కుర్వీత సీతాకృతి వీక్ష్యరత్నం పుష్పాయుధ: స్వాత్మని శస్త్రపాతమ్.

వర్ణనలల్లో భావాలల్లో వాల్మీకి కాళిదాసు భారవిల అనుకరణలే కాక కుమారదాసు స్వంతవి, మౌలికమైన వర్ణనలు భావాలు ఎన్నో వున్నవి. అతనివని ప్రత్యేక ముద్ర వేసుకొన్న భావవైచిత్రులు, అలంకార చమత్కారాలు వున్నవి.

సందర్భోచితంగా కవి శృంగార కరుణ వీరాది రసాలను పోషించాడు. శృంగార వీరరసాలు ప్రధానమైనవి. శృంగారంలో సంభోగ శృంగారాన్నే కవి వర్ణించాడు. రామ పరశురాముల సమావేశంలో కవి భయానక వీర రౌద్ర రసాలను పోషించాడు. విశ్వామిత్రుని ఆశ్రమవర్ణనలో శాంతరసం వ్యంజితమైంది, విభావానుభావాదుల వర్ణనల ద్వారా రసోత్పత్తిని కలిగించటంలో కవి దిట్ట.

ఒక సర్గలో పూర్తిగా భారవి శబ్ద వైచిత్రిని ప్రదర్శించినట్లుగానే కుమార దాసు 18 వ సర్గలో తన శబ్ద వైచిత్రి ప్రయోగ నైపుణ్యాన్ని ప్రదర్శించాడు. దీనిలో యమకాలను, చక్ర గోమూత్రిక మురజాది బంధాలను, నిరోష్ఠ్య, అనులోమ, ప్రతిలోమ కవిత్వాన్ని రచించాడు. కావ్యంలో అక్కడక్కడ శ్లేషను కూడ ప్రయోగించాడు.

ఇతర కవులను అనుకరించినా కుమారదాసు ప్రతిభావ్యుత్పత్తులు గల కవి. ఆలంకారికులు అతని శ్లోకాలను ఉదాహరించారు. విద్యాకరుని సుభాషితరత్నకోశంలో, జల్హణుని సూక్తిము క్తావళిలో, శృంగార పద్ధతిలో, శ్రీధరదాసుని సుదుక్తి కర్ణామృతంలో వల్లభదేవుని సుభాషితావళిలో జానకీహరణం నుంచి శ్లోకాలు ఎత్తి వ్రాయబడినవి. దీన్ని బట్టి ఈ కావ్య ప్రశస్తి ఎంతటిదో తెలుస్తున్నది.

# మాఘుడు

## మాఘుని కాలం

శిశుపాలవధ మాఘుని మహాకావ్యం. మాఘుని తండ్రి పేరు దత్తకుడు. తాతపేరు సుప్రభదేవుడు. సుప్రభదేవుడు వర్మలాతు (క్రీ.శ. 625 ప్రాంతం) డన్న రాజు దగ్గర మంత్రిగా వుండేవాడు. దీనినమసరించి మాఘుడు క్రీ.శ. 650 ప్రాంతంవాడని చెప్పవచ్చును. మాఘుడు భోజుని (క్రీ.శ. 1010-1050) సమకాలికుడని ఒకానొక కథ ననుసరించి కొందరు విమర్శకులు భావించారు. కాని అది చారిత్రక సత్యం కాదు. ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకంలో మాఘుని శ్లోకాలను ఉదాహరించాడు. కాబట్టి నిశ్చయంగా మాఘుడు క్రీ.శ. 9వ శతాబ్దానికి పూర్వుడే అవుతాడు. వసంత్‌గఢ్‌లో లభించిన శిలాశాసనం ప్రకారంగా కీల్‌హోర్న్ నిర్ణయించిన సుప్రభదేవుని కాలనిర్ణయాన్ననుసరించి సుప్రభదేవుని మనుమడైన మాఘుని జీవితకాలాన్ని క్రీ.శ.650-700 ప్రాంతమని చెప్పటం ఉచితం. మాఘుడు వైశ్యుడు. దాతృత్వగుణం కలవాడు. తన దానగుణం చేత సంపత్తినంతా పోగొట్టుకొని దారిద్ర్యాన్ని అనుభవించాడని అంటారు.

## శిశుపాలవధ

శిశుపాలవధలో 20 సర్గలున్నవి. దీనిలో శ్రీకృష్ణుడు శిశుపాలున్ని వధించే వృత్తాంతమున్నది. దీనికి మూలం మహాభారతం, మహాభాగవతంలోను లభిస్తున్నది. యుధిష్ఠిరుని రాజసూయ యాగానికి వచ్చిన శిశుపాలుడు ఆహ్వానిత అతిథుల ముందు శ్రీకృష్ణున్ని నిందించి అతనిచేత చంపబడ్డాడు. ఈ కథను కవి భారవి కిరాతార్జునీయ కథా

సంవిధానాన్ని అనుసరించి విస్తరింపజేసి మహాకావ్యంగా రచించాడు. కిరాతార్జునీయంలోని కథాక్రమాన్ని మాఘుడు ఎట్లా అనుసరించాడో చూద్దాము -

శిశుపాలవధ, కిరాతార్జునీయాల కథాసంవిధాన సామ్యం

| శిశుపాలవధ కథాసంవిధానం | కిరాతార్జునీయ కథాసంవిధానము |
|---|---|
| 1. నారదుడు ఇంద్రుని సందేశాన్ని శ్రీ కృష్ణునికి వినిపిస్తాడు. | 1. వనేచరుడు దుర్యోధనుని రాజ్య పరిపాలనను గురించి ధర్మరాజుకు చెప్తాడు. |
| 2. నారదుడు శ్రీకృష్ణునికి కర్తవ్యాన్ని నిర్దేశిస్తాడు. | 2. వ్యాసుడు పాండవులకు మార్గ దర్శనం కావిస్తాడు. |
| 3. శ్రీకృష్ణ బలరామ ఉద్ధవుల మంత్రణ, రాజనీతిశాస్త్ర పరిచయం. | 3. పాండవుల ద్రౌవది మంత్రణ. రాజనీతిశాస్త్ర పరిచయం. |
| 4. శ్రీకృష్ణుడు ధర్మరాజు చేసే రాజసూయ యాగానికి ప్రయాణం. | 4. అర్జునుడు దివ్యాస్త్ర లాభానికై ఇంద్రకీలానికి ప్రయాణం. |
| 5. రైవతక పర్వత వర్ణన | 5. హిమాలయ పర్వత వర్ణన |
| 6. శ్రీకృష్ణుని సేనా పరివారం యొక్క పుష్పాపచయ, జలకేళి, మధుపాన, వనవిహార, సురత వర్ణనలు. ఈ సందర్భంలోనే ఋతు, సూర్యాస్తమయ, సంధ్య, చంద్రోదయ, రాత్రి వర్ణనలు. | 6. అర్జునుని పరీక్షించుటకు వచ్చిన అప్సరసల పుష్పాపచయ, జలకేళి, మధుపాన, వనవిహార, సురత వర్ణనలు. ఈ సందర్భంలోనే ఋతు, సూర్యాస్తమయ, సంధ్య, చంద్రోదయ రాత్రి వర్ణనలు. |
| 7. శిశుపాలుని దూత, సాత్యకుల వివాదం. | 7. శివుని దూత అర్జునుల వివాదం. |
| 8. చిత్ర కావ్య శైలిలో శ్రీకృష్ణ శిశుపాలుర సైనిక యుద్ధం. | 8. చిత్రకావ్యశైలిలో ప్రమథగణం అర్జునుల యుద్ధం. |
| 9. శ్రీకృష్ణ శిశుపాలుర యుద్ధం (చిత్రకావ్య శైలిలో) | 9. శివార్జునుల యుద్ధం. (చిత్రకావ్య శైలిలో) |

ఈ విధంగా వర్ణనాక్రమంతో సహా మాఘుడు భారవి కథాసంవిధానాన్ని అనుకరించి రచించాడు. భారవి రచించిన దీర్ఘమైన రాజనీతిని ప్రకటించే సంభాషణలను, రమ్యమైన ప్రకృతి వర్ణనలను, అలంకార భావ కల్పనలను, ఛందోయోజనలను అనుకరిస్తూ ఒక్కొక్కసారి భారవిని మించవలెననే అహమ హమికతో మాఘుడు శివుపాలవధ కావ్యాన్ని రచించాడు. ఆ ప్రయత్నంలో మాఘుడు సఫలుడైనాడనే చెప్పాలి. భారవి శైవుడు కాబట్టి శివసంబంధమైన మహాభారతాంతర్గత కథను ఎన్నుకొన్నాడు. మాఘుడు వైష్ణవుడు కాబట్టి విష్ణు కథను ఎన్నుకొన్నాడు. ఇద్దరికి మహాభారతమే స్రోతస్సు. భారవి మాఘులు సమకాలికులు కారు. వారిద్దరి నడుమ ఒక శతాబ్ది కాలమైనా భేదమున్నది. భారవి దాక్షిణాత్యుడు. అతనికి వేంగి నేలిన విష్ణువర్ధనుని, పల్లవరాజు సింహ విష్ణువు ఆస్థానాలతో సంబంధమున్నట్లు చెప్పబడుతున్నది. మాఘుడు ఔత్తరుడు, ఘూర్జర దేశస్థుడు. అటువంటప్పుడు మాఘునికి భారవిని మించవలెననే స్పర్ధ ఎందుకు కలిగిందో చెప్పలేము. మాఘుడు వైష్ణవుడు. భారవేమో శైవుడు. ఆ స్పర్ధతో ఏమైన మాఘుడు భారవి కావ్యాన్ని మించదలచుకున్నాడేమో చెప్పలేము. లేకపోతే భారవి కావ్యవైభవం చేత ఆకర్షితుడై అటువంటి కావ్యాన్నో, లేక దాన్ని మించిన కావ్యాన్నో వ్రాయాలనే కోరిక మాఘునికి కలిగివుంటుంది. ఇది వైర భక్తి వంటిదని చెప్పాలి.

## మాఘుని కవిత్వం

ఉపమా కాళిదాసస్య భారవే రర్థగౌరవమ్
దండినః పదలాలిత్యం మాఘే సంతి త్రయోగుణాః

కాళిదాసులోని ఉపమల విశిష్టత, భారవిలోని అర్థగౌరవం, దండిలోని పదలాలిత్యం ఈ మూడు గుణాలు మాఘునిలో చోటు చేసుకొన్నవని ప్రాచీన విమర్శకుల అభిప్రాయం. మాఘుడు భారవిని ఎన్నో విధాలుగా అనుకరించినా అతని కవిత్వం, పాండిత్యం, మౌలికతతో కూడి విశిష్టంగా వున్నది. మాఘుని కవిత్వం కాళిదాసు కవితవలె ప్రసాదగుణభరితం కాదు. భారవి కవిత్వంవలె ఓజోగుణ ప్రధానమైంది. అతని అలంకారశైలి ప్రౌఢమైంది. భారవిలో ఆరంభమైన అలంకారశైలి మాఘునిలో పరిపక్వతను సంపాదించుకొన్నది. భారవి వంశస్థవృత్తాన్ని ఆదరించినట్లుగా మాఘుడు మాలినీవృత్తాన్ని ఆదరించాడు. మాఘుడు వ్రాసిన సంభాషణలు సశక్తమైనవి. మాఘుడు అక్కడక్కడ దీర్ఘ సమాసశైలిని ప్రయోగించాడు. భారవి కన్న మాఘుని కవిత్వంలో శబ్దమాధుర్యమున్నది. మాఘుని వర్ణనలు సుదీర్ఘంగా సజీవంగా రమణీయంగా వున్నవి. అలంకారాల రమ్య ప్రయోగం కన్పిస్తున్నది. "మాఘే మేఘే గతమ్ వయః" అని మల్లినాథుడన్నాడట. రసవంతమైన, పాండిత్యస్ఫోరకమైన,

వ్యంగ్యవైభవాలతో కూడిన ఈ కావ్యాలపఠనంతోనే వయస్సు నిండిందని ఆ ఉక్తి సారాంశం కావచ్చును.

"నవ సర్గ గతే మాఘే నవశబ్దో న విద్యతే" అని పండిత లోకంలో ప్రచారంలో వున్నది. శిశుపాలవధలోని తొమ్మిది సర్గాలను చదివిం తర్వాత ఇక నూతన శబ్దం సంస్కృతంలో వుండదని ప్రసిద్ధి. మాఘుడు అపారమైన శబ్దార్థజ్ఞానం కలవాడు. ప్రసిద్ధ అప్రసిద్ధపదాలను ఎన్నిటినో అతడు ప్రయోగించాడు. కాళిదాసు భారవి కవుల మహాకావ్యలల్లో ప్రయోగింపబడిన అర్థంలో వాడాడు. కాని కొన్ని శబ్దాలను వారు ప్రయోగించిన ముఖ్యార్థంలో కాక గౌణార్థంలో ప్రయోగించాడు. మరియు కాళిదాసు భారవి కవులు ప్రయోగించని నూతన పదాల నెన్నిటినో మాఘుడు ప్రయోగించాడు. ఉదా॥ భూరుహమంటె చెట్టు అని ప్రసిద్ధార్థం. కాని మాఘుడు 'ప్రాణులు' అనే అర్థంలో ఆ శబ్దాన్ని వాడాడు. "నరేంద్ర" అంటె రాజా అని ప్రసిద్ధార్థం; కాని మాఘుడు విషవైద్యుడన్న అర్థంలో వాడాడు. ద్విజిహ్వ కర్థం పాము అని ప్రసిద్ధమైంది. మాఘుడు నిందకుడున్న అర్థంలో ప్రయోగించాడు. ఈ విధంగా ఎన్నో నూతనార్థంలో శబ్దాలను కవి ప్రయోగించాడు.

మాఘుని పదవిన్యాసం, శబ్దమాధుర్యం చెప్పుకోదగ్గవి. మాఘుని పదలాలి త్యాన్ని ప్రకటించే ఒక శ్లోకం-

మధురయా మధు బోధిత మాధవీ మధు సమృద్ధి సమేధిత మేధయా
మధుకరాంగనయా ముహురున్మద ధ్వని భృతా నిభృతాక్షర ముజ్జగే.

మకారావృత్తి, వృత్త్యనుప్రాసలు శ్లోకాన్ని మధురతరం చేసినవి.

మాఘేన విఘ్నితోత్సాహా నోత్సహంతే పదక్రమే
స్మరంతో భారవే రేవ కవయః కపయో యథా

" మాఘమాసపు చలిలో సూర్యుని వేడిమిని సేవించినా కోతులు కాళ్లు వంకర పోయి తిరుగాడ లేకపోతాయి. అదేవిధంగా మాఘుని పదరచనను చూచి భారవి పదాలను ఎంత అనుకరించినా కవేతరులు కవితా రచనలో అసమర్థులవుతారు" అంటె మాఘుడు భారవిని అనుకరించినా అతడు శ్రేష్ఠకవి కాగలిగాడు. మాఘుని వలె కవేతరులు భారవిని అనుకరించబోయి నవ్వులపాలు అవుతారని పై శ్లోకార్థం. మాఘుడు భారవిని కేవలానుకరణ చేయలేదు. తన కవిత్వప్రతిభను, పదవిన్యాస కళను అడుగడుగునా ప్రదర్శిస్తుంటాడు. గౌడీరీతిలో నడిచిన అతని కవిత్వం వికటబంధంతో కూడింది. మాఘుని కవిత్వంలో భారవి అనుకరణలే కాక కాళిదాసులోని కవితామార్దవం, భావుకత్వాలు, భట్టిలోని వ్యాకరణ

పాండిత్యం ఏకత్రితాలైనవి. ప్రాచీన పండితులు భారవి కవిత్వానికన్న మాఘుని కవిత్వం శ్రేష్ఠమైందని తలంచినట్లు హరిహరుని సుభాషితావళిలోని శ్లోకాన్ని బట్టి తెలుస్తున్నది -

నైతచ్చిత్ర మహం మన్యే మాఘమాసాద్య యన్ముహుః
ప్రౌఢతాతి ప్రసిద్ధాపి భారవే రవసీదతి

" మాఘమాస ప్రవేశంతో సూర్యుని తేజస్సు ఎట్లా సన్నగిల్లుతుందో అదేవిధంగా మాఘుని కవిత్వం ముందు భారవి కవిత్వ ప్రౌఢిమ సన్నగిల్లింది".

## కావ్య వర్ణనలు

శిశుపాలవధలో మహాకావ్యోచిత వర్ణనలన్నీ వున్నవి. భారవి వర్ణనాక్రమాన్ని అనుసరిస్తు మాఘుడు కిరాతార్జునీయంలో వున్నన్ని కావ్యవర్ణనలను తాను చేసాడు. మాఘుడు పాండిత్యగరిమ కలవాడు కావటంచేత వర్ణనలల్లో ప్రౌఢభావవైచిత్రితో కూడిన అలంకార చమత్కారాలు వున్నవి. వ్యాపించిన పరాగాన్ని ఆతపత్రంతో పోల్చి రమ్యంగా చెప్పటం చేత భారవికి ఆతపత్ర భారవి అని కీర్తి కలిగింది. అందుకుముందు రమ్యమైన దీపశిఖను ఉపమానంగా చేసి చెప్పటంచేత కాళిదాసుకు దీపశిఖ అన్న పేరు కలిగింది. అదే విధంగా సూర్యచంద్రులను ఘంటలుగా చేసి రమ్యవర్ణన చేయటం చేత మాఘునికి ఘంటామాఘుడనే కీర్తి వచ్చింది. ఆ ప్రసిద్ధ శ్లోకమిది -

ఉదయతి వితతోర్ధ్వ రశ్మిరజ్జౌ
అహిమరుచౌ హిమధామ్ని యాతిచాస్తమ్
వహతి గిరిరయం విలంబిఘంటా
ద్వయ పరివారిత వారణేంద్ర లీలామ్

"పొడవైన ఊర్ధ్వముఖాలైన కిరణాలు అనే తాళ్ళుగల ఉదయించే సూర్యుడు మరియు అస్తమించే చంద్రునిగల (రైవతక) పర్వతం, కిందికి వేలాడే రెండు ఘంటలచేత అలంకరింపబడిన గజం వలె శోభిల్లుతున్నది".

భారవిలో కన్న మాఘునిలో ఋతు, సూర్యాస్తమయ, సూర్యోదయ, ప్రభాతాది వర్ణనలు దీర్ఘంగా వున్నవి. భారవిలో కన్న వర్ణనలు చమత్కారపూర్ణం గాను వున్నవి. భారవిలో లేని పురస్త్రీల వర్ణనను మాఘుడు అదనంగా చేసాడు. పురస్త్రీల వర్ణన కాళిదాస అశ్వఘోషాదికవులు చేసివున్నారు. కాని ఏ కారణం చేతనో భారవి దాన్ని వదిలివేసాడు. మాఘుని ప్రభాతవర్ణన ప్రసిద్ధమైంది. ఈ వర్ణనలో అనేక అందమైన భావాలున్నవి -

ద్రుతతర కరదక్షా: క్షిప్తవైశాఖశైలే
దధతి దధని ధీరా నారవాన్వారిణీవ
శశినమివ సురౌఘా: సారముద్ధర్తుమేతే
కలశి ముదధి గుర్వీం వల్లవా లోడయంతి

"(ప్రభాత కాలంలో) గోపకులు దధిని పెద్దకుండలో వేసి, కవ్వంతో ధ్వని పూర్వకంగా, దేవతలు మందరాచలంతో గంభీరధ్వనియుక్తంగా సముద్రాన్ని చంద్రుని కొరకు మథించినట్లుగా, మథించి వెన్నను తీస్తున్నారు"

శబ్దమాధుర్యం, ఓజోగుణ భరితమైన వాయువర్ణన -

వికచ కమలగంధై రంధయన్ భృంగమాలా: సురభిత మకరందం మంద మావాతి వాత:
ప్రమదమదన మాద్యద్యౌవనోద్దామరామారమణ రభస ఖేద స్వేద విచ్ఛేద దక్ష:

శిశుపాలవధకు 8 వ్యాఖ్యానాలున్నవి. వీటిల్లో మల్లినాథుని వ్యాఖ్యానం "సర్వంకష' ' శ్రేష్ఠమైంది.

## మాఘుని పాండిత్యం

భారవిలో అపార లోకానుభవం, లౌకిక జ్ఞానం కనిపించగా మాఘునిలో అపార శాస్త్రపాండిత్య జ్ఞానం కన్పిస్తుంది. వేదవేదాంగాలను మాఘుడు అభ్యసించాడు. అతడు వ్యాకరణ శాస్త్రంలో ప్రకాండ పండితుడు. అంతేగాక మాఘుడు రాజనీతి, ధర్మశాస్త్రాలను, మంత్రతంత్రాలను, యోగసాంఖ్యదర్శనాలను, పురాణ, ఇతిహాస, ఛంద:, జ్యోతిష, అలంకారశాస్త్ర, కామశాస్త్ర, ఆయుర్వేద శాస్త్ర, సంగీత సాముద్రిక హయ గజ శాస్త్రాలను, నాస్తిక దర్శనాలను బాగా అభ్యసించి నిష్ణాతుడైనవాడని శిశుపాలవధ పరిశీలనవల్ల తెలుస్తున్నది. ప్రకృతి వర్ణనలనుబట్టి అతడు సూక్ష్మతీక్ష్ణదృష్టి కలవాడని చెప్పవచ్చును. ఒకొకసారి గంభీరమైన క్లిష్టవిషయాలను సరళంగా చెప్పగలిగిన నేర్పు కలవాడు. అనేక చోట్ల శాస్త్రపాండిత్యంతో కూడిన అలంకార రచనలున్నా అవి అతిక్లిష్టంగాగాని కృత్రిమంగా గాని లేవు. రెండవ సర్గలోని బలరామ ఉద్ధవుల సంభాషణలో మాఘుని రాజనీతి పరిచయం ఎంత గంభీరమైందో తెలుస్తున్నది.

## హరిచంద్రుడు

15వ తీర్థంకరుడైన ధర్మనాథుని జీవిత చరిత్రను ఈ కవి "ధర్మశర్మాభ్యుదయ' మహాకావ్యం రచించాడు. ఇతని కవిత్వం మీద మాఘ వాక్పతి రాజుల ప్రభావం

కన్పించటంచేత యీ కవి కాలం క్రీ.శ. 800 ప్రాంతమని వరదాచారి అభిప్రాయం. క్రీ.శ. 1287 నాటి ఇతని మహాకావ్యంయొక్క హస్తలిఖిత ప్రతి ఒకటి లభించటంచేత కొందరు విమర్శకులు ఇతన్ని క్రీ.శ. 12వ శతాబ్దంవాడుగా గ్రహించారు. ఇతని శైలి వైదర్భీరీతిలో సరససుందరంగా వున్నది. ఇతడు జైనుడు కావచ్చును.

## నీతివర్మ

నీతివర్మ కీచకవధ అన్న పంచసర్గల కావ్యాన్ని రచించాడు. భోజుడు (క్రీ.శ. 1005-1054) ఈ కావ్యాన్ని గురించి చెప్పటంచేత ఈ కవి క్రీ.శ. 9వ శతాబ్దంవాడుగా సాహిత్య చరిత్రకారులు ఊహించారు. భీముడు కీచకుని వధించే వృత్తాంతం దీనిలో వున్నది. ఈ కావ్యంలో అనుప్రాసలు, శ్లేషలు అధికంగా ప్రయోగింపబడినవి.

## రత్నాకరుడు

### హరవిజయం

రత్నాకరుడు హరవిజయమనే మహాకావ్యాన్ని రచించాడు. దీనిలో 50 సర్గలున్నవి. 4320 శ్లోకాలున్నవి. చాల పెద్ద కావ్యం. శివుడు అంధకాసురుని వధించిన ఇతివృత్తం దీనిలో వున్నది. పార్వతి శృంగారకేళిలో శివుని కండ్లు మూయగా అంధుడైన అంధకాసురుడు జన్మించాడట. అంధకాసురుడు శివున్ని ఆరాధించి కనుచూపును పొంది, తన శక్తిచేత గర్వించి ముల్లోకాలను బాధింపసాగాడు. దేవతలు శివున్ని ప్రార్థించగా శివుడు వాన్ని వధించాడు. ఇంత చిన్న కథను గ్రహించి కవి 50 సర్గలు గల మహాకావ్యాన్ని రచించాడు. దీనిలో 11 సర్గల వరకు శివుడు తన మంత్రులతో అంధకాసురుని చంపటానికై మంత్రణం చేయటమే వున్నది. తర్వాత 7 సర్గలలో శివ, అంధకాసురుల సంవాదం వున్నది. దీర్ఘమైన సన్నివేశాలతో, సంవాదాలతో, వర్ణనలతో కవి కథను పెంచి వ్రాసాడు.

### రత్నాకరుని కాలం

రత్నాకరునికి "రాజానక, వాగీశ్వర, విద్యాధిపతి" అని బిరుదాలున్నవి. క్షేమేంద్ర రాజశేఖరాది లాక్షణికులు రత్నాకరుని కావ్యాన్ని మరియు అతని వసంతతిలక వృత్తాన్ని ప్రశంసించివున్నారు. కల్హణుడు రత్నాకరుని కాశ్మీర దేశీయునిగా పేర్కొన్నాడు. రత్నాకరుడు కాశ్మీరరాజు బిప్పట జయాపీడుని (క్రీ.శ. 800) అస్థానంలో వుండి అవంతివర్మ (క్రీ.శ. 855-894) రాజ్య కాలంలో ప్రసిద్ధిని పొందాడు. కాబట్టి రత్నాకరుడు అదే కాలానికి చెందినవాడని నిశ్చయంగా చెప్పవచ్చును.

## రత్నాకరుని పాండిత్య కవిత్వాలు

రత్నాకరుడు నీతి, వేదాంత, కామశాస్త్ర, పురాణ, ఇతిహాస, నాట్య, సంగీత, అలంకార శాస్త్రాలల్లో ప్రవేశం కలవాడు. చిత్రకావ్య రచనా నిపుణుడు. లాక్షణికులు విధించిన మహాకావ్య లక్షణాలన్నీ హరవిజయంలో కన్పిస్తున్నవి. కవి తన కావ్యాన్ని గురించి ఇట్లా చెప్పుకొన్నాడు -

లలిత మధురాః సాలంకారాః ప్రసాదమనోహరాః
వికట యమక శ్లేషోద్గార ప్రబంధ నిరర్గలాః

ప్రతి సర్గ చివరి శ్లోకంలో భారవి " లక్ష్మి" ని, మాఘుడు "శ్రీ"ని, శ్రీహర్షుడు "ఆనంద" ను ప్రయోగించినట్లుగానే రత్నాకరుడు "రత్న" శబ్దాన్ని ప్రయోగించాడు. తన కావ్యాన్ని అతడు "చంద్రార్ధచూడ చరితాశ్రయచారు" అని ప్రశంసించుకొన్నాడు.

## గౌడాభినందుడు

అభినందుడు లేక గౌడాభినందుడు జయంతభట్టు (క్రీ.శ. 880) అన్న తార్కికుని కుమారుడు. ఈ కవి కాదంబరీ కథాసారమనే పేరుతో బాణుని కాదంబరి కథను సంక్షిప్తంగా వ్రాసాడు. దీనిలో 8 సర్గలున్నవి.

## అభినందుడు

ఈ అభినందుడు కాశ్మీర దేశీయుడు. శతానందుని కుమారుడు. 36 సర్గలు గల "రామచరిత్ర" అనే మహాకావ్యాన్ని వ్రాసాడు. ఇది అసంపూర్ణంగా మిగిలిపోవటంచేత ఇద్దరు కవులు చెరి రెండు సర్గలు వ్రాసి పూరించారు. మొత్తం వీనిలో 40 సర్గలున్నవి. మహిమభట్టు (క్రీ.శ. 1025) భోజ (1005-1050 క్రీ.శ.) లకు ఈ కావ్యం పరిచితం. కాబట్టి ఈ కవికాలం క్రీ.శ. 9వ శ॥ ప్రాంతమని చెప్పవచ్చును. దీనిలోని కవిత్వం సరళసుబోధకంగా వున్నది. ఈ కావ్యం గాయక్‌వాడ్ ఓరియంటల్ సిరీజ్‌లో ప్రచురితమైంది. ఈ కవి రచించిన అనుష్టుపు ఛందస్సులను క్షేమేంద్రుడు తన సువృత్తతిలకంలో ప్రశంసించివున్నాడు.

## శివస్వామి

కల్హణుని అనుసారం శివస్వామి అవంతివర్మ (క్రీ.శ. 855-894) ఆస్థానకవి. శివస్వామి శైవుడైవుండి బౌద్ధ సాహిత్యంలో ప్రసిద్ధమైన అవదాన శతకంలోని కథ

ఆధారంగా "కప్పణాభ్యుదయం" అన్న మహాకావ్యాన్ని రచించాడు. ఇతడు రత్నాకరునికి, ఆనందవర్ధనునికి సమకాలికుడు. ఇతని కావ్య మలభ్యం. కాని లాక్షణికులు ఉదాహరించిన శ్లోకాలను బట్టి ఇతనిది యమ కాదులతో కూడిన చిత్రకవిత్వమని తెలుస్తున్నది. ఈ కవి మీద భారవి మాఘుల ప్రభావం కన్పిస్తున్నది.

## క్షేమేంద్రుడు

క్షేమేంద్రుడు కాశ్మీర దేశీయుడు. కాశ్మీర రాజా అనంతు (క్రీ.శ. 1024-1033) ని కాలంలోను, అతని పుత్రుని (క్రీ.శ. 1033-1089) కాలంలోను నివసించాడు. క్షేమేంద్రునికి వ్యాసదాసు అని నామాంతరమున్నది. ఇతడు అభినవగుప్తుని శిష్యుడు. క్షేమేంద్రుడు రామాయణ మహాభారతాలను సంక్షిప్తంగా రామాయణమంజరి, భారతమంజరి అనే పేర్లతో రచించాడు. గుణాఢ్యుని పైశాచీ ప్రాకృతంలో వున్న బృహత్కథను సంక్షేపంగా సంస్కృతంలో బృహత్కథామంజరిగా రచించాడు. ఇతనికి పైశాచీ భాషలో వున్న బృహత్కథ దొరికిందో లేదో లేక లోకంలో వ్యాప్తిలో వున్న బృహత్కథ కథలను బట్టి దీన్ని రచించాడో ఏదీ చెప్పలేము. బృహత్కథామంజరి పద్యరూపంలో వున్నది. దీనిలో 1800 స్తబకాలున్నవి. ఇదేగాక అతడు "బోధిసత్త్వావదాన కల్పలత"ను కూడ రచించాడు. విష్ణువు దశావతారాల చరిత్రను కావ్యంగాను మరియు బాణుని కాదంబరిని పద్య కాదంబరి కావ్యంగాను ఈ కవి రచించాడు. ఇవేగాక అతడు శశివంశ మహాకావ్యం, అమృతతరంగ కావ్యం మరియు అనేక రచనలను చేసినట్లు తెలుస్తున్నది. అవి అలభ్యాలు. అతడు నాటకకారుడు కూడ. అతడు ఆలంకారశాస్త్ర గ్రంథాలను కూడ రచించాడు. (ఆయా ప్రకరణాలల్లో వాటిని గురించి చర్చింపబడింది). క్షేమేంద్రుడు సువృత్తతిలకమనే ఛందోగ్రంథాన్ని కూడ రచించాడు. సంస్కృతంతో సామాన్య పరిచయంగలవారు, బృహద్రచనలను చదవటానికి ఓపికలేని వారికి వీలుగా సరళసులభశైలిలో ఈ కవి అనేక కావ్యాలను రూపొందించాడు. ప్రజలకు నీతిని, శీలాన్ని బోధించే "చారుచర్య, నీతికల్పతరు, చతుర్వర్గసంగ్రహ, కళావికాస" మనే గ్రంథాలను కూడా రచించాడు. అతడు సామాన్యుల కొరకు ఉపయోగకరమైన రచనలను చేయటంచేత అతన్ని ప్రజాకవి అనవచ్చును.

## మంఖకుడు

మంఖకుడు కూడ కాశ్మీర దేశీయుడు. ఈ కవి ఆలంకారికుడైన రుయ్యకుని శిష్యుడు. కాశ్మీరరాజా జయసింహుని (క్రీ.శ. 1129-1150) ఆస్థానకవి. ఈ కవి కల్హణ, బిల్హణ, జల్హణులకు సమకాలికుడు. మంఖకుడు మంత్రిపదవి నధిష్ఠించాడని కల్హణుడు

చెప్పాడు. ఈ కవి శ్రీకంఠ చరిత్రను రచించాడు. దీనిలో 25 సర్గలున్నవి. శివుడు త్రిపురాసురులను జయించే వృత్తాంతం దీనిలో వున్నది. దీనిలోని కావ్యశైలి సరసమధురంగా వున్నది. మంఖకుడు కాళిదాసు శైలిని అనుకరించాడు.

## హేమచంద్రాచార్యుడు

హేమచంద్రుడు క్రీ.శ. 1088-1172 నడుమ జీవించినట్లుగా కీథ్ నిర్ణయించాడు. ఇతడు ప్రాకృతంలోను గొప్ప ప్రవేశం కలవాడు. ఇతడు జైనుడు. జైనుడైనా హిందూ ధర్మమన్నా వేదాదులన్నా గౌరవం కలవాడు. సమకాలిక సమయంలో జైనులకు హిందువులకు సామరస్యాన్ని సాధించినవాడు. ఈ కవి అనిల్వావాడ నేలిన జయసింహ, కుమారపాల రాజుల ఆస్థానంలో వున్నాడు. కుమారపాలుడు ఇతని ప్రేరణచేతనే జైనమతాన్ని గ్రహించాడట. రాజు కుమారపాలుని జీవితచరిత్రను కుమారపాలచరిత్ర లేక ద్వ్యాశ్రయ కావ్యమనే పేరుతో రచించాడు. కుమారపాల చరిత్ర అనే చారిత్రక కావ్యాన్నే కాక వ్యాకరణ గ్రంథాలను, నిఘంటువులను కూడ రచించాడు. అనేక రచనలను చేసిన ప్రతిభావంతుడు. హేమచంద్రుడు "త్రిషష్టి శ్లాకాపురుష చరిత్ర" అన్న మహాకావ్యాన్ని రచించాడు. దీనిలో 20 సర్గలున్నవి. ఈ కావ్యంలో 63 గురు జైనమహాపురుషుల జీవిత చరిత్రలు నిబంధింపబడినవి.

## వాగ్భట్టు

వాగ్భట్టు "నేమి నిర్మాణం" అనే కావ్యాన్ని రచించాడు. 22వ తీర్థంకరుడైన నేమినాథుని జీవిత వృతాంతం దీనిలో వర్ణింపబడింది. దీనిలో 15 సర్గలున్నవి. ఈ కావ్యశైలి సరసమధురం. ప్రసాదగుణభరితమై వున్నది. ఈ కవి కాలం క్రీ.శ. 1140 ప్రాంతం. వాగ్భట్టు మహాకవియే కాక ఆలంకారికుడు కూడ.

## శ్రీహర్షుడు

శ్రీహర్షుడు "నైషధ చరితమ్" అన్న మహాకావ్యాన్ని రచించాడు. ఈ కవి హీర, మల్లదేవుల కుమారుడు. "కాశ్మీరైర్మహితే చతుర్దశతయీం విద్యాం విదద్భిర్మహా కావ్యే (16-130)" అన్న ఉక్తినిబట్టి శ్రీహర్షుడు కాశ్మీరదేశీయుడని అంటారు. రాజశేఖరుడు ఇతన్ని కాశ్మీరదేశీయునిగా పేర్కొనలేదు. కాని శ్రీహర్షుడు కనౌజ్‌రాజు జయచంద్రుని ఆస్థానకవి అనటంలో ఏమి సందేహం లేదు. శ్రీహర్షుడు నైషధాన్ని వ్రాసి కాశ్మీరదేశానికి తీసుకొనిపోయి అక్కడి సరస్వతీదేవి చేతిలో పెట్టాడని, ఆమె దాన్ని స్వీకరించగా కాశ్మీరరాజు మాధవ దేవుని

దగ్గర తన కావ్యం సరస్వత్యభినందితమైనట్లు రాజముద్ర వేసిన లేఖను తీసుకొని తిరిగివచ్చాడని ఐతిహ్యం. ఈ కథ ఆధారంగా పండితుడైన శ్రీహర్షుడు ఎప్పుడో ఒకప్పుడు పండిత నిలయమైన కాశ్మీరదేశానికి పోయివుంటాడని చెప్పవచ్చును. శ్రీహర్షుని ఆశ్రయదాత ప్రసిద్ధుడైన పృథ్వీరాజ్ చౌహాన్‌కు మామ జయచంద్రుడే. జయచంద్ర పృథ్వీరాజులు బద్ధశత్రువులు. కాని జయచంద్రుని కూతురు సంయుక్త పృథీరాజును ప్రేమించింది. స్వయంవరానికి పృథ్వీరాజు రాకపోయినా అతని విగ్రహానికి పుష్పహారం వేసి సంయుక్త అతన్ని వరించింది. తర్వాత పృథ్వీరాజు ఆమెను తన నగరానికి తీసుకొనిపోయాడు. ఈ సంఘటనచేత ప్రేరితుడై కాబోలు శ్రీహర్షుడు నలదమయంతుల ప్రేమకథను ఇతివృత్తంగా ఎన్నుకొని నైషధ మహాకావ్యాన్ని రచించాడు. జయచంద్రుని కాలం క్రీ.శ. 1139-1195. శ్రీహర్షుని జీవితకాలం కూడ ఇదే అని చెప్పవచ్చును. శ్రీహర్షుడు కవియే కాక గొప్ప పండితుడు, దార్శనికుడు. శ్రీహర్షుని తండ్రి హీరుడు నైయాయికుడైన ఉదయనాచార్యునితో శాస్త్రవాదంలో ఓడిపోయాడట. మరణ సమయంలో తండ్రి ఇచ్చిన ఆదేశానుసారంగా హర్షుడు గంగాతీరంలో ఒక సంవత్సర కాలం చింతామణి మంత్రాన్ని జపించాడు. అప్పుడతనికి త్రిపురసుందరి ప్రత్యక్షమై అపూర్వ ప్రతిభను ప్రసాదించింది. తత్ ప్రతిభాన్వితమైన వాక్కులు ఏ పండితులకు అర్థం కాలేదు. తిరిగి త్రిపురసుందరి అనుగ్రహంచేత అతడు అందరికి బోధపడే ప్రతిభాపాండిత్యాలను సంపాదించాడు. తర్వాత పండిత సభలో హర్షుడు ఉదయనాచార్యుని శాస్త్రవాదంలో ఓడించాడని ఐతిహ్యం. ఆ పండిత సభలో ఉదయనాచార్యుడు హర్షున్ని ఇట్లా సవాలు చేసాడట-

> హింస్రాః సంతి సహస్రశోఽపి విపినే శౌండీర్య వీర్యోద్ధతా
> స్తస్యైకస్య పునః స్తుతీ మహిమహః సింహస్య విశ్వోత్తరమ్
> కేళిః కోల కులైర్మ దోమదకలై : కోలాహలం నాహలై :
> సంహర్షో మహిషైశ్చ యస్యముముచే సాహంకృతేహుంకృతే.

ఉదయనాచార్యుని ఈ సవాలుకు హర్షుడిట్లా ప్రత్యుత్తరమిచ్చాడట-

> సాహిత్యే సుకుమార వస్తునిదృఢ న్యాయగ్రహ గ్రంథిలే
> తర్కేవా మయి సంవిధాతరి సమం లీలాయతే భారతీ
> శయ్యా వాస్తు మృదూత్తర చ్ఛదవతీ దర్భాంకురైరాస్తృతా
> భూమిర్వా హృదయంగమో యది పతిస్తుల్యారతి ర్యోషితామ్.

## శ్రీహర్షుని రచనలు

శ్రీహర్షుడు నైషధ మహాకావ్యాన్నేకాక ఇతర గ్రంథాలను కూడ రచించాడు-

1. స్థైర్యవిచారమ్ - దార్శనిక గ్రంథం - దీనిలో క్షణికవాదాన్ని హర్షుడు నిరాకరించాడు.
2. ఖండన ఖండఖాద్యమ్ - గొప్ప దార్శనిక గ్రంథం. దీనిలో తార్కిక పద్ధతిలో వేదాంత సిద్ధాంతాలను ధృవపరచాడు. న్యాయదర్శనాన్ని ఖండించాడు. ఈ జటిల గ్రంథానికి అనేక టీకలున్నవి.
3. విజయ ప్రశస్తి - జయచంద్రుని తండ్రి విజయచంద్రుని ప్రశస్తి దీనిలో వున్నది.
4. గౌడోర్వీశ ప్రశస్తి - గౌడరాజు ప్రశస్తి దీనిలోవున్నది.
5. ఛిందిప్రశస్తి - ఛిందదేశరాజు ప్రశస్తి దీనిలో వున్నది.
6. నవసాహసాంక చరిత - చంపూ కావ్యం. భోజరాజు తండ్రి సింధు రాజు ప్రశస్తి దీనిలో వున్నది.
7. అర్ణవ వర్ణనమ్ - సముద్ర వర్ణనతో కూడిన లఘుకావ్యం.
8. శివశక్తిసిద్ధి - తంత్రశాస్త్ర సంబంధ కృతి.
9. ఈశ్వరాత్రిసంధి - దీన్ని గురించి తెలియదు.

## నైషధ చరితం

దార్శనిక లోకంలో ఖండన ఖండ ఖాద్యమ్ శ్రీహర్షునికి ఎంత కీర్తినితెచ్చి పెట్టిందో సాహిత్య లోకంలో నైషధ చరితం అతనికంత కీర్తిని తెచ్చి పెట్టింది. ఈ మహాకావ్యంలో 22 సర్గలున్నవి. దీనిలో నలదమయంతుల ప్రేమకథ వున్నది. ఈ కావ్యంలో క్రమంగా - నాయకుడు నలుని వర్ణన, నలుని విహారం, హంసను నలుడు పట్టుకొనటం, దాని అభ్యర్థన మీద విడిచిపెట్టటం, హంస దమయంతి దగ్గరికి పోవటం, దమయంతికి చిక్కటం, ఏకాంతంలో దమయంతికి నలున్ని వర్ణించి చెప్పటం, దమయంతికి నలుని మీద అనురాగం కలగడం, విరహం, భీముడు కూతురు దమయంతి స్వయంవరాన్ని చాటటం, ఇంద్ర వరుణ అగ్ని యములు దమయంతి స్వయంవరానికి బయలుదేరి రావటం, నలునికి తిరస్కరిణీ విద్యనిచ్చి తమ దూతగా దమయంతి దగ్గరకి పంపటం, నలుని దౌత్యం, స్వయంవర వర్ణన, నలుగురు దిక్పాలురు నలునివేషంలో నలుని పక్కన కూర్చోవటం, స్వయంగా సరస్వతియే స్వయంవర మంటపంలో రాజులను వర్ణించి చెప్పటం, ఐదుగురు నలులను సరస్వతి చమత్కార పూర్ణంగా వర్ణించి చెప్పటం, చివరకు దేవతల

అనుగ్రహంచేత దమయంతి నలున్ని కనుక్కొని వరించటం, నలదమయంతుల వివాహ వర్ణన, విందు వర్ణన, కలియొక్క విజృంభణ, నలదమయంతుల ప్రథమ రాత్రి, వారి విహారాలు-వున్నవి. నలదమయంతుల కథ మహాభారతంలోనే కాక సోమదేవుని కథాసరిత్సాగరంలోను కన్పిస్తున్నది. మహాభారతకథ కన్న కథాసరిత్సాగరకథ కొంత భిన్నంగా వున్నది. శ్రీహర్షుడు తన కథను మహాభారతం నుంచే తీసుకొన్నాడని రెండుకథల పరిశీలనవల్ల తెలుస్తున్నది. మహా భారతకథలో కవి ఎక్కువ మార్పులను చేయలేదు. నలదమయంతుల వివాహం వరకు కథను శ్రీహర్షుడు గ్రహించి శృంగారమయమైన కావ్యంగా రచించాడు. మహాకావ్యోచితంకాని అనేక సంఘటనలతో కూడిన కరుణరసాన్వితమైన ఉత్తర కథను గ్రహించక శ్రీహర్షుడు ఔచిత్యాన్ని పాటించాడు.

## శ్రీహర్షుని కవిత్వం

భారవితో ఆరంభమైన ఆలంకారికశైలి మాఘునిలో పరిపక్వత నందుకొని శ్రీహర్షునిలో పరమావధిని చేరుకున్నది. సంస్కృత మహాకావ్య పరంపరలో నైషధమే చివరిమెట్టు. తర్వాత వ్రాయబడిన మహాకావ్యాలన్ని సూర్యుని ముందు దివిటీలవలె వెలవెల బోయినవి. "ఉదితే నైషధేకావ్యే క్వ మాఘః క్వచ భారవిః" అని అనేంతవరకు పోయింది. శ్రీహర్షుని కావ్యం సామాన్య సరసహృదయులకొరకు వ్రాయబడిన కావ్యం కాదు. పాండిత్య ప్రౌఢిమ ప్రతిభాగౌరవంతో కూడిన ఆ కావ్యం సరసహృదయులైన పండితుల కొరకు వ్రాయబడింది. " నైషధమ్ విద్వదౌషధమ్" అని ప్రసిద్ధి. అంటె విద్వాంసుల యొక్క గర్వమనే రోగాన్ని పోగొట్టే ఔషధం నైషధం. విద్వాంసుల పాండిత్య ప్రకర్షకు అది నికషోపలం వంటిది.

యథాయూనస్తద్వత్ పరమరమణీయాపి రమణీ
కుమారాణా మంతఃకరణహరణం నైవకురుతే
మదుక్తి శ్చేదంతర్మదయతి సుధీభూయ సుధియః
కిమస్యా నామస్యాద రసపురుషానాదరభరైః

"ఎట్లా అయితే అందమైన రమణి సౌందర్యం బాలుని అంతఃకరణాన్ని ఆకర్షించటానికి సమర్థం కాదో అదేవిధంగా అరసపురుషులను నా కావ్యం ఆకర్షించదు. గొప్పబుద్ధి కలవారినే అది ఆనందింప జేస్తుంది" - అని శ్రీహర్షుడు తన కావ్య ప్రౌఢిమను గురించి చెప్పుకొన్నాడు. అంతేగాక తన కావ్యంలో గ్రంథగ్రంథు లున్నవని కవే చెప్పుకొన్నాడు. కావ్యార్థంలోని ముడులను విప్పటానికి శాస్త్ర పాండిత్యమైనా వుండాలి. కాకపోతే వ్యాఖ్యాన

సహాయమైనా కావాలి. శాస్త్రగ్రంథాలను గురుచరణాల దగ్గర నేర్చుకొన్నట్లుగా ఈ కావ్యాన్ని అభ్యసించవలసి వుంటుంది.

శ్రీహర్షునిది నారికేళపాకం. ఓజోగుణ పూర్ణమైన కవిత్వం. అక్కడక్కడ దీర్ఘసమాస రచనను చూడవచ్చును. శ్లేషను చాల ఎక్కువగా ప్రయోగించాడు. శ్లేష పాండిత్య ప్రకర్షలు వీటిచేత అతని కవిత్వం క్లిష్టమైంది. ఉక్తివైచిత్రి ప్రతిశ్లోకంలోను కన్పిస్తున్నది. ఉక్తివైచిత్రిమూలకమైనవి అలంకారాలు. కాబట్టి ప్రతిశ్లోకంలోను ఒకటో రెండో అలంకారాలు తప్పక వున్నవి. ఊహౌన్నత్యంతో కూడిన కవి భావకల్పనలు అద్భుతంగా, అశ్రుత పూర్వంగా వున్నవి.

" నైషధే పదలాలిత్యమ్" అని ప్రాచీన విమర్శకులు హర్షుని పదలాలిత్యాన్ని పొగిడారు. అనుప్రాసలు, యమకలు శ్రీహర్షుని కవిత్వానికి లాలిత్యాన్ని కలిగించినవి. ఈ పదలాలిత్యం శృంగారరస పోషకంగా వున్నది. శ్రీహర్షుడు తన శైలి వైదర్భీరీతి అని స్తుతించుకొన్నాడు (3-116, 14-92). కాని నైషధ కావ్యశైలి గాఢబంధత్వం చేత కూడిన గౌడీరీతియే అని చెప్పవలసి వుంటుంది. కవియొక్క శ్లేష ప్రీతి, యమకాలంకారాలు, శాస్త్రపాండిత్య ప్రతిభతో కూడిన భావకల్పనలు, ఊహౌన్నత్యం గల అలంకారచమత్కారాలు కావ్యశైలిని ప్రౌఢం చేసినవి. శ్రీహర్షుని పాండిత్య ప్రతిభను ప్రదర్శించే శ్లోకాలను ఎన్నింటినో ఉదాహరించవచ్చును. శ్రీహర్షుడు పాండిత్య గాంభీర్యం కలవాడైనా పరిహాసప్రియుడు. అతని పరిహాసప్రియతను వివాహం తర్వాత విందు భోజనం వర్ణనలో చూడవచ్చును.

భారవి మాఘులు అంగి రసంగా వీరరసాన్ని పోషించగా శ్రీహర్షుడు శృంగార రసాన్ని అంగిగా పోషించాడు. విప్రలంభ సంయోగ శృంగారాలను వర్ణించాడు. ఆద్యంతం విభావానుభావాల పుష్టితో కూడిన అంగిరసాన్ని భారవి మాఘుల కావ్యాలల్లో వలెనే ఈ కవి పోషించాడు. శ్రీహర్షుడు కరుణ, భయానక, హాస్యాదులను అంగరసాలుగా పోషించాడు.

## కావ్య వర్ణనలు

శ్రీహర్షుడు సందర్భోచితంగా మహాకావ్యవర్ణనలన్ని చేసాడు. శ్రీహర్షుని వివాహ వర్ణన ఉత్తరభారతీయుల, ముఖ్యంగా పశ్చిమ ప్రాంతీయుల ఆచారాల సూక్ష్మ చిత్రణతో సాగింది. శ్రీహర్షుని ప్రకృతి వర్ణనలు సుందరంగా వున్నవి. అవి ఉద్దీపన విభావంగా వర్ణింపబడినవి. నలుని సౌందర్యవర్ణన, దమయంతి నఖశిఖపర్యంతవర్ణన (రెండుసార్లు), వనవిహార, పుర, విప్రలంభ, సూర్యాస్తమయ, అంధకార, చంద్రోదయాది వర్ణనలు సుదీర్ఘంగా వున్నవి. నలుని సౌందర్య వర్ణన గాని, దమయంతి నఖశిఖపర్యంత

వర్ణన గాని చమత్కారపూర్ణమైన భావ కల్పనలతో కూడి వున్నవి. ఒక్క వస్తువును ఎన్నిసార్లు వర్ణించినా శ్రీహర్షునికి తనివితీరదు. అవి చదివిన పాఠకులకు కూడ విసుగు పుట్టదు. ఒకే వస్తువును ఎన్ని సార్లు వర్ణించినా చెప్పిన భావాన్ని చెప్పకుండా వినూత్న భావాలను కూర్చగల శక్తి అతనిలో వున్నది. అందుకే కవి "ఏకామత్యజతో నవార్థఘటనామ్" (19-38) అని అన్నాడు. వక్రోక్తి భరితమైన అతని కవిత్వం కావ్యకళాపారమ్యాన్ని చేరుకొన్నది.

## నైషధానికి వ్యాఖ్యానాలు

వ్యాఖ్యానసహాయం లేకుండ నైషధాన్ని సంపూర్ణంగా అర్థంచేసుకోవటం కష్టం. దీనికి 23 వ్యాఖ్యానాలు వ్రాయబడినవి. వీటిల్లో నారాయణభట్టు వ్రాసిన "నైషధ ప్రకాశం", మల్లినాథుడు వ్రాసిన "జీవాతు" వ్యాఖ్యానాలు సర్వశ్రేష్ఠమైనవి.

## శ్రీ హర్షుని పాండిత్యం

శ్రీహర్షుడు మహాపండితుడు. మహావైయాకరుణుడు, మహాదార్శనికుడు. అతడు షడ్దర్శనాలను అభ్యసించినవాడు. కాని అతడు స్వయంగా అద్వైత వేదాంతి. ఖండనఖండ ఖాద్యంలో అతడు అద్వైతాన్ని ప్రతిపాదించాడు. చార్వాక బౌద్ధాది నాస్తిక దర్శనాలను కూడ అతడు అభ్యసించాడు. అతడు స్వయంగా అద్వైతవేదాంతి కాబట్టి ఇతర దర్శనాలను పరిహాసం చేస్తుంటాడు -

ముక్తయేయః శిలాత్వాయ శాస్త్రమూచే సచేతసామ్
గోతమం తమ వేక్ష్యైవ యథా విత్థతథైవ సః

"సుఖదుఃఖాలను అనుభవించే ప్రాణులు కూడ ముక్తి అవస్థలో ప్రాణహీనమైన రాళ్ళవలె విశేషగుణరహితులవుతారని బోధించిన గోతముడు నిజంగా గోతముడే (గో+తమ=ఎద్దు, మూర్ఖుడు)!" ఇక్కడ హర్షుడు న్యాయదర్శనాన్ని గేళి చేసాడు. వై శేషికులను విమర్శించిన తీరు -

ధ్వాంతస్య వామోరు విచారణాయాం వైశేషికం చారు మతం మతం మే
ఔలూక మాహుః ఖలు దర్శనం తత్ క్షమం తమస్తత్త్వ నిరూపణాయ.

"ఔలూక (చీకటి) నామాన్ని ధరించినవాడు కాబట్టి వై శేషిక దర్శనకారుడు అంధకారాన్ని పదవ ద్రవ్యంగా పరిగణించాడు."

కలి ద్వారా కవి తనకు గల చార్వాకదర్శన పరిచయాన్ని ప్రకటించాడు. శ్రీహర్షునికి

పురాణాలతో బాగా పరిచయమున్నది. ఎన్నో పౌరాణిక కథల ప్రసక్తిని అతడు వర్ణనలల్లో తెచ్చాడు. శ్రీహర్షుని వ్యాకరణ పాండిత్యాన్ని ప్రకటించే శ్లోకాలు ఎన్నో నైషధంలో వున్నవి.

క్రియేత చేత్సాధు విభక్తి చింతా వ్యక్తిస్తదా సాప్రథమాభిదేయా
యా స్వౌజసాం సాధయితుం విలాసై స్తావత్ క్షమా నామపదం బహుస్యాత్

హంస నలున్ని వర్ణిస్తున్నది. దీనిలో కలి "అ పదం న ప్రయుఞ్జీత" "ఏకవచన ముత్సర్గత: కరిష్యతే" అన్న వ్యాకరణ సమ్మత సిద్ధాంతాలను సూచించాడు.

స్వం నైషధాదేశ మహో విధాయ కార్యస్య హేతోరితి నానల: సన్
కిం స్థాని వద్భావ మధత్త దుష్టం తాదృక్కృత వ్యాకరణ: పున: స:

ఇంద్రాదులు నల రూపాన్ని ధరించి స్వయంవరానికి రావటాన్ని కవి పై శ్లోకంలో వర్ణిస్తు " స్థానివ దాదేశో ऽనల్విధౌ" అన్న పాణిని సూత్రాన్ని సూచించాడు. ఇట్లా శ్రీహర్షుని వ్యాకరణ పాండిత్యంతో కూడిన కల్పనా చమత్కారాలు ఎన్నో నైషధంలో వున్నవి. శ్రీహర్షుడు వ్యాకరణ, దార్శనిక శాస్త్రాలనే కాక అలంకార శాస్త్రాన్ని, కామశాస్త్రాన్ని బాగా అభ్యసించినాడు.

గొప్ప దార్శనికుడైన పండిత కవి శ్రీహర్షుడు లౌకికమైన భౌతికమైన నలదమయంతుల ప్రేమను విలాస జీవితాన్ని చిత్రించే ఇతివృత్తాన్ని తీసుకొని కావ్యాన్ని రచించాడంటె సమ్మతించటానికి కొంత వెనుక ముందాడవలసి వస్తుంది. ఏదైనా మహదర్థాన్ని ఈ కథలో నిక్షిప్తం చేసాడేమోనని అనుమానం వస్తుంది. నల దమయంతుల ప్రేమ, సంగమాన్ని జీవాత్మ పరమాత్మల సంగమానికి ప్రతీకగా కవి గ్రహించి వుంటాడు. నల దమయంతుల కలయికకు కారణమైన హంస జీవాత్మ పరమాత్మలను కప్పివేసిన అజ్ఞానాంధకారాన్ని తొలగించి వాటి కలయికకు తోడ్పడే గురువుకు ప్రతీక. ఇటువంటి అద్వైత సిద్ధాంతాన్ని దృష్టిలో పెట్టుకొనే శ్రీహర్షుడు ఈ కథను నడిపించాడనాలి.

కావ్య ప్రకాశకారుడు మమ్మటుడు శ్రీహర్షునికి మేనమామ అని అంటారు. నైషధాన్ని చూచి "ఈ కావ్యాన్ని మొదటే చూచినట్లయితే నా అలంకారశాస్త్రంలో దోష ప్రకరణానికి ఉదాహరణలను వేరే చోట వెతుక్కోవలసిన అవసరముండేది కాదు గదా" అని అన్నాడంటారు. ఈ కథను బట్టి ప్రాచీన విమర్శకులల్లో కొందరు నైషధ కావ్యంలో అన్నీ దోషాలు, అనౌచిత్యాలు వున్నట్లు భావించినట్లుగా తెలుస్తున్నది. కాళిదాసు నిసర్గ కావ్య సౌందర్యాన్ని ప్రేమించేవారు దీనిలోని క్లిష్ట భావ కల్పనను, అలంకారాల భారాన్ని, వర్ణనా ప్రాచుర్యాన్ని చూచి అట్లా అని వుంటారనే అనుకోవాలి కాని నైషధకావ్యంతో సంస్కృత మహాకావ్యప్రక్రియ ఉచ్చదశను చేరుకొన్నదనే చెప్పాలి.

## కృష్ణానందుడు

"సహృదయానంద" మనే మహా కావ్యాన్ని ఈ కవి రచించాడు. దీనిలో 15 సర్గలున్నవి. దీనిలో నలుని చరిత్ర నిబంధింపబడింది. వైదర్భీరీతిలో నడిచింది. ఈ కవి క్రీ.శ. 13 వ శతాబ్దారంభంలో నివసించాడు.

## జయ రథుడు

"హరచరిత్రచింతామణి" అన్న మహాకావ్యాన్ని ఈ కవి రచించాడు. దీనిలో 32 సర్గలున్నవి. శివుని, శివుని భక్తుల కథలున్నవి.

## అమర చంద్రుడు

మహాభారత కథను బాలభారతంగా సులభ శైలిలో ఈ కవి రచించాడు. దీనిలో 44 సర్గలున్నవి. కాళిదాసు రఘువంశ శైలిని కవి అనుకరించాడు. 1250 ప్రాంతం వాడు.

## దేవప్రభ సూరి

ఈ కవి " పాండవ చరిత్ర" అనే మహా కావ్యాన్ని రచించాడు. దీనిలో 18 సర్గలున్నవి. పాండవుల సచ్చరిత్ర దీనిలో వున్నది. ఈ కవి కూడ క్రీ.శ. 1250 ప్రాంతం వాడే.

## చంద్రప్రభ సూరి

" ప్రభావ చరిత్ర" అనే కావ్యాన్ని ఈ కవి రచించాడు. ప్రభావకుడు జైన సన్యాసి. అతని జీవితచరిత్ర దీనిలోని ఇతివృత్తం. కవి క్రీ.శ. 13వ శతాబ్దం వాడు.

## వీరనంది

క్రీ.శ. 13 వ శతాబ్దం వాడు. "చంద్రప్రభ చరిత్ర" అనే కావ్యాన్ని రచించాడు. దీనిలో 18 సర్గలున్నవి. దీనిలో కనక ప్రభుడనే రాజు మరియు చంద్ర ప్రభుడనే జైనముని చరిత్రలు వున్నవి.

## సర్వానందుడు

"జగదూచరిత్ర" అనే కావ్యాన్ని రచించాడు. దీనిలో 17 సర్గలున్నవి. క్రీ.శ. 1265

ప్రాంతంలో గుజరాతులో సంభవించిన క్షామ సమయంలో జగదూ అన్న జైనముని ప్రజలకు చేసిన సహాయం దీనిలోని ఇతివృత్తం.

## వాసుదేవుడు

మలబారు నివాసి. ఈ కవి 21 కావ్యాలను రచించాడు. కాని వాటిల్లో యుధిష్ఠర విజయం, నలోదయ కావ్యాలే ప్రసిద్ధమైనవి. యుధిష్ఠర విజయంలో 8 ఆశ్వాసాలున్నవి. దీనిలో ధర్మరాజు విజయాలు చెప్పబడినవి. నలోదయంలో 4 అశ్వాసాలున్నవి. రాజ్యప్రాప్తి తర్వాత నలుని జీవితం దీనిలో వర్ణింపబడింది. ఈ కవికి యమకాలంకారమన్న ప్రీతి.

## శాకల్య మల్లకవి

ఓరుగల్లును ఏలిన కాకతీయవంశరాజు రెండవ ప్రతాపరుద్రుని (క్రీ.శ. 1294-1325) కాలంవాడు. పండితకవి. ఇతడు కొంతకాలము విజయనగరరాజు మొదటి హరిహరరాయల ప్రాపున కూడ ఉన్నాడని హరిహర మహారాజ స్తోత్రపరమైన ఒక శ్లోకం ప్రసంగరత్నావళి అనే శ్లోకసంగ్రహంలో ఉద్ధరింపబడిందాన్ని బట్టి తెలుస్తున్నది. ఇతడు శ్రీరామునికథ గల ఉదార రాఘవమనే కావ్యాన్ని రచించాడు. దీనిలో తొమ్మిది సర్గలు మాత్రమే ఇప్పుడు లభించినవి. కథ శూర్పణఖ వృత్తాంతం వరకున్నది. శ్రీరాముని కటాక్షంచేత తనకు కవిత్వం వచ్చిందని ఈ కవి చెప్పుకున్నాడు. ఇతని కావ్యం భట్టికావ్యంవలె శాస్త్రకావ్యం. వ్యాకరణ సూత్రాలకు లక్ష్యాలను చూపటానికై ప్రౌఢ ప్రయోగాలు చేయబడినవి. దీనికి చండీపండితకృత ప్రద్యోతినీ వ్యాఖ్య, రాంపల్లి గోపీనాథకృత వ్యాఖ్యలు వున్నవి. ఈ కవి నిరోష్ఠ్యంగా కూడ రామునికథను కావ్యంగా చెప్పాడు.

## అగస్త్యుడు

### అగస్త్యుని పరిచయం, కాలం

ఓరుగల్లు నగర (దీనికే సంస్కృతంలో ఏకశిలా నగరమని పేరు) నివాసి. కాకతీయ వంశానికి చెందిన రెండవ ప్రతాపరుద్రుని (క్రీ.శ. 1294-1325) సమకాలికుడు. రెండవ ప్రతాపరుద్రుని ఆస్థాని అయిన విద్యానాథుడనే ఆలంకారికుడు ప్రతాపరుద్రయశోభూషణం అన్న అలంకార శాస్త్ర గ్రంథాన్ని వ్రాశాడు. కాని అగస్త్యుడు రెండవ ప్రతాపరుద్రుని ఆస్థానకవి అని చెప్పటానికి ఆధారాలేమి లేవు. కొందరు విమర్శకులు విద్యానాథుని అసలు పేరు అగస్త్యుడని, విద్యానాథుడన్నది బిరుదనామమని తలంచారు. వారి ఊహకు ఈ క్రింది శ్లోకం ఆధారంగా లభించింది.

ఔన్నత్యం యది వర్ణ్యతే శిఖరిణః కుప్యంతి నీచైః కృతా
గాంభీర్యం యది కీర్త్యతే జలధయః క్షభ్యంతిగాధీకృతాః
తత్త్వాం వర్ణయితుం బిభేమి యది వా జాతో౽స్మ్యగస్త్యస్థిత
స్తత్త్వాశ్వై ర్గుణరత్న రోహిణగిరే శ్రీవీరరుద్రప్రభో

"నీ ఔన్నత్యాన్ని వర్ణిస్తే పర్వతాలు నామీద కోపిస్తవి. నీ హృదయ గాంభీర్యాన్ని వర్ణిస్తే సముద్రాలు క్షుబ్ధమౌతవి. కాని నేను భయపడే అవసరం లేదేమో. ఎందుకంటే నేను అగస్త్యున్ని కదా నీకు" - అని విద్యానాథుడన్నాడు. అది ఆలంకారికంగానే చెప్పాడని ఒకవేళ అతడే కావ్యరచయిత అగస్త్యుడే అయినట్లయితే ఎక్కడో ఒకచోట తన కావ్యాలను గురించి చెప్పి వుండేవాడని అందుచేత విద్యానాథ అగస్త్యులు ఒక్కరుకారని నిర్ణయించవచ్చును.

ఈ అగస్త్యుడు సౌగంధికాహరణ వ్యాయోగకర్త విశ్వనాథునికి, కాదంబరీ కళ్యాణ నాటకకర్త నరసింహునికి మేనమామ అనటం నిస్సందేహం. విశ్వనాథుని శిష్యురాలే మధురావిజయ రచయిత్రి గంగాదేవి. గంగాదేవి తన గురువు విశ్వనాథునితోపాటు అగస్త్యున్ని స్మరించింది. అగస్త్యుడు 74 కావ్యాలు రచించిన మహాకవి పండితునిగా ఆమె పేర్కొన్నది -

చతుస్సప్తతి కావ్యోక్తి వ్యక్తవైదుష్యసంపదే
అగస్త్యాయ జగత్యస్మిన్ స్పృహయేత్కో న కోవిదః

గంగాదేవియే కాక రాజచూడామణి దీక్షితుడనే కవి తన రుక్మిణీ కళ్యాణంలో అగస్త్యున్ని సారస్వత మర్మవేది అయిన పండితకవిగా స్తుతించాడు-

జడాశయానాం హృదయం జగత్యాం యస్యోదయాద్యాతి తమామ్ ప్రసాదమ్
స ఏవ సారస్వతమర్మవేదీ విభాతిమౌళే విదుషామగస్త్యః

సౌగంధికాహరణంలో విశ్వనాథుడు కూడ అగస్త్యున్ని మహాకవిగా కీర్తించాడు. విశ్వనాథుడు రెండవ ప్రతాపరుద్రుని ఆస్థానకవి కాబట్టి అగస్త్యున్ని కూడ అదే కాలంవాడని నిశ్చయంగా చెప్పటానికి వీలవుతున్నది. కాకతీయుల ఆశ్రయంలో దక్షిణదేశంలో సంస్కృతభాష తగిన ప్రోత్సాహంతో వర్ధిల్లింది. మహమ్మదు గోరీ జయచంద్రుని అల్లుడు పృథ్వీరాజును జయించి ఢిల్లీ సింహాసనాన్ని ఆక్రమించుకొన్నది మొదలు ఉత్తర భారతం మహ్మదీయుల పాలనకు ఆటపట్టైంది. సంస్కృతభాషకు ఆశ్రయం లేకుండాపోయింది. అటువంటి పరిస్థితులల్లో దక్షిణ భారతంలో క్రీ.శ. 14వ శతాబ్దారంభంలో జరిగిన ఖిల్జీ దండయాత్రల వరకు సుస్థిరమైన రాజ్యాన్ని ఆంధ్రదేశంలో

స్థాపించిన తెలుగువారు కాకతీయులు. వారు సంస్కృత భాషకు ఆశ్రయదాతలైనారు. వీరి ఆశ్రయంలో కవులు, నాటకకారులు, ఆలంకారికులు, నాట్యశాస్త్రకారులు, చారిత్రక కావ్యకర్తలెందరో వెలిసారు. సంస్కృత సాహిత్య పురోగతి ఆగిపోకుండ, కుంటుపడకుండ నిరాఘాటంగా జరిగింది. కాకతీయుల పతనానంతరం రెడ్డిరాజులు విజయనగరరాజులు. సంస్కృత భాషకు ఆశ్రయదాతలైనారు. విజయనగర కాలంలోనే వేదాలకు భాష్యంకూడ వ్రాయబడింది.

అగస్త్యుడు తన జీవితకాలంలో ఒక సంస్థగా వెలిసి శిష్యప్రశిష్యులను తయారుచేసాడేమో. అందుకే అతనికి రాజాశ్రయం అవసరం లేకుండాపోయింది. ఆ కారణంచేతనే అతడు రెండవ ప్రతాపరుద్రుని అస్థానాన్ని ఆశ్రయించి వున్నట్టు లేదు. మహాకవిగా, మహాపండితుడుగా అతడు గొప్ప కీర్తిని సంపాదించుకొన్నాడు. పేరుకుతగ్గట్టుగానే వివిధ శాస్త్ర సాహిత్య సముద్రాలను ఆపోశనం పట్టినవాడు. అతడు 74 గ్రంథాలను రచించాడు. కాని ఇప్పుడు మనకు మూడు కావ్యాలను గురించే తెలుస్తున్నది. వాటిల్లో బాలభారతం, నలకీర్తికౌముది అన్నవి పద్యమహాకావ్యాలు. కృష్ణ చరిత్ర గద్యకావ్యం (ఇది గద్యకావ్య ప్రకరణంలో పరిశీలింపబడుతుంది.)

## అగస్త్యుని రచనలు

అగస్త్యుడు మహాభారతాన్ని సంక్షిప్తంగా బాలభారతమనే పేరుతో మహాకావ్యంగా రచించాడు. దీనిలో 20 సర్గలున్నవి. అగస్త్యుడు కాళిదాసు వైదర్భీ రీతి ననుసరించి సరళసుందర శైలిలో దీన్ని రచించాడు. సందర్భానుకూలంగా కావ్య వర్ణనలను ప్రవేశపెట్టాడు. వసంత ఋతువులో పుష్పపరాగం గాలిచేత లేచి మన్మథుడు చల్లిన మోహనచూర్ణం వలె వియోగదశలో వున్న ప్రియులను చలింపజేస్తుంది.

సమీరణోత్థానవదూత రేణవో వసంతలక్ష్మీపటవాసపాంసవః
ప్రపేదిరే మన్మథమంత్రవారినో వియోగిసమ్మోహన చూర్ణముష్టితామ్.

పరాగం వసంతలక్ష్మి చల్లిన రంగులవలె వున్నదట! కవి భావాలను సరళంగా సుందరంగాను చెప్తాడు. క్లిష్టమైన భావకల్పనలు ఈ కవిలో లేవు. అందుకే అతని కవిత్వం కాళిదాసు కవిత్వాన్ని స్మరింపజేస్తున్నది. భారతయుద్ధ సమయంలో చంద్రుడు తన వంశజుల చావును చూడలేక తొందరగా అస్తమించాడని ఒకచోట కవి ఉత్ప్రేక్షించాడు -

శీతాంశుర్నిజకులజన్మనాం నృపాణాం సంగ్రామే నిధనమపేక్షితుం నశక్తః
శృంగాణి క్షణమవలంబ్య రశ్మిహస్తై రస్తాద్రేఃపయసాంనిధిం ప్రపేదే

అగస్త్యుని ఉపమానాలు సరళసుందరంగా సమయోచితంగా వుంటవి. దుశ్శాసనుడు ఈడ్చితెచ్చే ద్రౌపదిని కవి కౌరవవినాశాన్ని సూచించే మేఘంవలె వున్నదంటాడు. వెంట్రుకలు చెల్లాచెదరైన, నల్లనిదైన ద్రౌపదిని మేఘంతో పోల్చటం, కన్నీరు కార్చే ఆమెను వర్షించే మేఘంగా సూచించటం రమ్యంగా వున్నది. కవిశైలి సరళంగాను, అలంకారాలు అక్లిష్టం గాను సామాన్య పాఠకులకు కూడ సులభంగా అర్థమయ్యేటట్లు వుండి బాలభారతమన్న పేరును సార్థకం చేస్తున్నది. మహాభారతంలోని కౌరవపాండవుల ప్రధాన కథను చిన్నచిన్న మార్పులతో కావ్యరూపంగా అగస్త్యుడు రచించాడు.

బాలభారతానికి విజయనగరాన్నేలిన శ్రీకృష్ణదేవరాయల మంత్రి సాళువ తిమ్మన "మనోహర" మనే వ్యాఖ్యానాన్ని రచించాడు. బాలభారతం ఆధారంగానే తమిళంలో విల్లిభారతం వ్రాయబడిందని డా. రాఘవన్ అభిప్రాయం.

అగస్త్యుని రెండవ కావ్యం నలకీర్తికౌముది. దీనిలో రెండవ, నాల్గవ సర్గలు మాత్రమే లభించినవి. వీటి లిఖితప్రతులు కాకినాడని వాసి శ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారి దగ్గర వుండగా వారు ఒక ప్రతిని ఇండియా ఆఫీస్ లైబ్రరీకి ఇచ్చి, తర్వాత తెలుగు అకాడమీ జర్నల్ (1931 Vol XIX) లో ప్రచురించారని డా. శ్రీరామమూర్తి తెలిపాడు. లబ్ధ సర్గాలను బట్టి ఇది మహాకావ్యమని తెలుస్తున్నది. రెండవ సర్గ - నలుడు విదర్భనగరంలో ఇంద్రాదుల దూతయై ప్రవేశించటంతో ఆరంభమౌతున్నది. నాల్గవ సర్గలో నలుడు వివాహానంతరం మామగారింట్లో ఒక నెల రోజులుండి తిరిగి నిషధ నగరానికి వచ్చినట్లుగా చెప్పబడింది. దీన్ని బట్టి కావ్య స్వరూపం చిన్నదే అని ఊహించవచ్చును. నాల్గవ సర్గలో 16 నుంచి 23 శ్లోకాలల్లో నలుడు నూతన వధువుతో నిజ నగరానికి రాగా అతన్ని దర్శించే పుర స్త్రీల వర్ణన వున్నది. ఈ వర్ణన రఘువంశంలోని పురస్త్రీల వర్ణనను పోలి వున్నది. పురస్త్రీల వర్ణన కాళిదాసు తర్వాత కవులు మహాకావ్య వర్ణ్యవస్తువుగా గ్రహించి వర్ణించినట్లుగా వున్నది. ఈ వర్ణనను తెలుగు ప్రబంధ కవులు కూడా కావ్య వర్ణ్యవస్తువుగా గ్రహించారు. నాల్గవసర్గలో పురస్త్రీల వర్ణన తర్వాత వసంతర్తు, సంధ్య, రాత్రి, వర్షర్తు, నలదమయంతుల జలక్రీడలు వర్ణింపబడ్డినవి. లభించిన రెండు సర్గల చివరి శ్లోకాలలో "లక్ష్మి" శబ్దాన్ని ప్రయోగించాడు. భారవి వలెనే ఈ కవి ప్రతి సర్గ చివర "లక్ష్మి" శబ్దాన్ని ప్రయోగించాడు. ఈ కావ్యంలోని రెండవ సర్గలో వున్న 74వ శ్లోకాన్నే రామరాజభూషణుడన్న తెలుగు మహాకవి ప్రసిద్ధికెక్కిన "నానా సూనవితాన వాసనలు" అన్న పద్యంగా అనువదించి తన వసుచరిత్ర కావ్యంలో చేర్చుకొన్నాడు.

ఈ కవి కావ్యాలు 74 వున్నా అందులో మూడే లభించటం మన దురదృష్టం. క్రీ.శ. 12వ శతాబ్దం తర్వాత వెలసిన ప్రతిభావంతులైన కవులల్లో అగస్త్యుడొకడని చెప్పాలి. (కృష్ణచరిత్రను గురించి గద్యకావ్య ప్రకరణంలో చర్చింపబడుతుంది.)

# వేదాంతదేశికులు

## వేదాంతదేశికుల పరిచయం-కాలం-రచనలు

వేదాంతదేశికులు కాంచీపుర నివాసి, ఇతనికాలం 1268-1369. మహాదార్శనికుడు. విశిష్టాద్వైతాచార్యులల్లో ఒకడు. ఇతడు రామానుజులవారి అపరావతారంగా పరిగణింపబడినాడు. శ్రీవైష్ణవ సంప్రదాయవ్యాప్తికి ఇతని బోధనలు బాగా పనిచేసినవి. ఇతని అసలు పేరు వేంకటనాథుడు. ఇతడు సంస్కృత, తమిళభాషలల్లో ప్రకాండపండితుడు. 125 సంస్కృత గ్రంథాలను రచించాడు. వీటిల్లో చాల దార్శనికమైన గ్రంథాలున్నవి. సర్వార్థసిద్ధి, న్యాయపరిశుద్ధి, న్యాయసిద్ధాంజన, మీమాంసపాదుక, అధికరణ సారావళి, శతదూషణి, సచ్చరిత్రరక్ష, నిక్షేపరక్ష, పంచరాత్రరక్ష మొదలైనవి దార్శనిక సంబంధమైన రచనలు. ఇవిగాక రామానుజుల శ్రీభాష్యానికి తత్త్వటీకను, తాత్పర్య చంద్రికలను, యామునాచార్యుల గీతార్థసంగ్రహరక్షను, రామానుజుల గద్యత్రయానికి రహస్యరక్షను, ఈశావాస్యోపనిషత్‌భాష్యమనే వ్యాఖ్యానాలను రచించాడు. "తిరువాయిమొళి" అన్న ద్రవిడ ప్రబంధాన్ని సంస్కృతీకరించాడు. ఈ దార్శనిక గ్రంథాలనేకాక యాదవాభ్యుదయమనే మహాకావ్యాన్ని, సంకల్ప సూర్యోదయమనే నాటకాన్ని, హంససందేశమనే లఘుకావ్యాన్ని, పాదుకాసహస్రం, వరదరాజపంచాశతి, గరుడదండకం అనే ముక్తక కావ్యాలను రచించాడు. రామాయణ కథాసారాన్ని "రఘువీరగద్యం" గా సంస్కృతంలో వ్రాసాడు. విష్ణుస్తుతితో కూడిన అచ్యుత శతకాన్ని ప్రాకృత భాషలో కూర్చి తన ప్రాకృత భాషా జ్ఞానాన్ని కూడ ప్రకటించాడు. వేదాంత దేశికులు ఈ గ్రంథాలనే కాక తమిళభాషలో కూడ గ్రంథాలను రచించాడు. వేదాంత దేశికులు వైష్ణవాచార్యుడే కాక మహాదార్శనికుడు. మహాపండితుడు, మహావ్యాఖ్యాత, మహాకవి అని చెప్పదగినవాడు.

## వేదాంత దేశికుల మహాకావ్యం

యాదవాభ్యుదయ మహాకావ్యంలో 24 సర్గలున్నవి. దీనిలో శ్రీకృష్ణుని జీవిత చరిత్ర వర్ణింపబడింది. కృష్ణుని జీవితంలోని ప్రతి సంఘటన వెనుకవున్న దార్శనికార్థాన్ని కవి చక్కగా సరళశైలిలో వివరించాడు. భారవి మాఘులను అనుసరించి కవి ఆరవ సర్గలో శబ్దాలంకార వైచిత్రిని ప్రయోగించాడు. ఈ కావ్యానికి అప్పయ్యదీక్షితుడు (క్రీ.శ. 16వ శ॥) వ్యాఖ్యానాన్ని వ్రాసాడు. ఈ కవి వర్ణనలల్లో వేదాంతపరమైన ఉపమానాలను చెప్తూ సరసంగా రచించాడు -

వివిధ మునిగణోపజీవ్యతీర్థా విగమిత సర్పగణాపరేణ పుంసా
అభిజిత యమునా విశుద్ధిముగ్ర్యాం శమితమహిర్మత సంప్లవాత్రయీవ.

"మూడు వేదాలను చదువుకొన్నవానిచేత ఇతర మతాలు ఏ విధంగా శమింపజేయబడ్డాయో అదే విధంగా యమునానది సర్పాల నన్నిటిని పారదోలింతర్వాత విశుద్ధమై ప్రకాశిస్తున్నది"

వేదాంతదేశికులకు "వేదాంతాచార్య, కవితార్కికసింహ, సర్వతంత్ర స్వతంత్ర" అన్న బిరుదాలున్నవి. (వేదాంతదేశికుల ఇతర కావ్యాలు ఆయా ప్రకరణాలల్లో పరిశీలింపబడినవి)

## లోలంబరాజు

ఈ కవి " హరివిలాస" మనే కావ్యాన్ని వ్రాసాడు. ఇది ముద్రితమైంది. దీనిలో 5 సర్గలున్నవి. శ్రీకృష్ణుని జన్మం నుంచి ఉద్ధవుని సందేశం వరకే కథ వున్నది. లోలంబరాజు తండ్రి రాజు దివాకర సూరి. భోజుని సమకాలికుడు. ఈ కవి విజయనగరరాజు హరిహరుని ఆస్థానకవి. శ్రీకృష్ణుని బాల్యక్రీడలను, శృంగారలీలలను సరసంగా వర్ణించాడు.

## కవికర్ణపూరుడు

కవికర్ణపూరుడు పారిజాతహరణ మహాకావ్యకర్త. దీనిలో 18 సర్గలున్నవి. ఇదే పేరుతో మరొక ప్రసిద్ధ వైష్ణవ కవి, నాటకకర్త, ఆలంకారికుడు కూడ వున్నాడు. ఈ ఇద్దరు కవులు ఒక్కరే అని చెప్పటానికి తగిన సాక్ష్యాధారాలు లేవు. ఈ కవి "కమతా" నగరాన్ని విశేషంగా పేర్కొన్నాడు. కమతా నగరం ప్రస్తుతం బీహార్‌లోని కామతాపూర్‌గా గుర్తించ బడింది. ఇక్కడ ప్రసిద్ధమైన తామ్రేశ్వరి అనే కాళికాలయం వున్నది. ఈ నగరం పక్కన

ధాల్‌పాని అనే నది ప్రవహిస్తున్నది. ఆ నదిని కవి ధవళాంబరధారగా పేర్కొన్నాడు. కమతా నగరం క్రీ.శ. 1498లో హుస్సేన్‌షాచేత నాశనం చేయబడింది. అయితే కవి ఈ కాలానికి పూర్వుడని, కమతానగరం వైభవోపేతంగా వున్నప్పుడే అతడు జీవించివుండి ఈ కావ్య రచన చేశాడని చెప్పవచ్చును. ఈ కవి అస్సాం, బీహార్ ప్రాంతాలకు చెందినవాడై వుంటాడు.

పారిజాతాపహరణ కథ హరివంశంలో వున్నది. హరివంశంలోనే ఈ కథ రెండు తీరులుగా వున్నది. మొదటి కథ-శ్రీకృష్ణసత్యభామలు గరుత్మంతుని మీద అమరావతికి, అదితీదేవికి నరకుని కుండలాలను ఇయ్యటానికి పోతారు. ఇంద్రుడు వారిని సత్కరిస్తాడు. తిరిగిపోతూ శ్రీకృష్ణుడు పారిజాతవృక్షాన్ని చూసి దాన్ని తీసుకొనిపోతాడు. రెండవ కథ - నారదుడు ద్వారకలో శ్రీకృష్ణునికి పారిజాత పుష్పాన్ని తెచ్చియిస్తాడు. కృష్ణుడు దాన్ని రుక్మిణికిస్తాడు. దానితో సత్యభామకు కోపం వస్తుంది. కృష్ణుడు ఆమెను సాంత్వనపరచి పారిజాత వృక్షాన్నే ఇంద్రలోకం నుంచి తెచ్చి ఆమె పెరట్లో నాటుతానంటాడు. శ్రీకృష్ణుడు సత్యభామ సాత్యకి ప్రద్యుమ్నులతో ఇంద్రలోకం పోతాడు. ఇంద్రునికి వారికి యుద్ధం జరుగుతుంది. కశ్యపుడు మధ్యలో కలిపించుకొంటాడు. పారిజాతవృక్షాన్ని శ్రీకృష్ణుడు భూలోకం తెస్తాడు. మొదటి కథ కొద్దిగా మార్పులతో విష్ణు, భాగవత పురాణాలల్లోను వున్నది. రెండవ కథ తరువాత కవులను విశేషంగా ఆకర్షించింది. కవికర్ణపూరుడు ఈ కథనే తీసుకొని మహాకావ్యంగా వ్రాశాడు.

## పారిజాతాపహరణేతివృత్తం గల కావ్యాలు

కవికర్ణపూరుడే కాక ఇంకా చాలామంది కవులు ఈ ఇతివృత్తాన్ని తీసుకొని కావ్యనాటకాలుగా మలచారు -

1. పారిజాత హరణ మహాకావ్యం 10 సర్గలు - కవిరాజు
2. పారిజాతహరణం - శృంగార ప్రకాశంలో భోజుడు పేర్కొన్న రచన
3. పారిజాతహరణం - యమకకావ్యం - నారాయణ కవి
4. పారిజాతహరణ నాటకం-ఉమాపతి ఉపాధ్యాయ, 14వ శ॥ మిథిలానివాసి
5. పారిజాతహరణ నాటకం-రఘునాథరాయలు. 17వ శ॥ తంజావూరు.
6. పారిజాతహరణ నాటకం-కవిచంద్రరాయ లేదా దివాకరుడు 16వ శ॥
7. పారిజాతహరణ నాటకం-కుమారతాతాచార్యులు. 5 అంకాల నాటకం 17వ శ॥
8. పారిజాతహరణ నాటకం- గోపాలదాసు
9. పారిజాత హరణచంపువు - శేషశ్రీకృష్ణుడు.

కవి కర్ణపూరుడు పారిజాతహరణ కావ్యంలో సందర్భోచితంగా కావ్య వర్ణనలను చేర్చాడు. కొన్ని పాత్రలు, సన్నివేశాలు నూతనంగా సృష్టించబడినవి. నారదునితో పర్వతుడు కూడ వచ్చినట్లు, ఇంద్రుని పక్షంలో అర్జునుడు పోరాడినట్లు కవి కల్పించాడు. శ్రీకృష్ణుడు సాత్యకిప్రద్యుమ్నులతోనే కాక గొప్ప సైన్యంతో బయలుదేరినట్లు కవి చెప్పి సైన్యయాత్రను, ఋతు, చంద్రోదయ, జలక్రీడాదులను ఆ సందర్భంలో వర్ణించాడు. ఈ విషయంలో కవి భారవి మాఘులను అనుసరించాడని చెప్పవచ్చును. అక్కడక్కడ శబ్దాలంకారాలను దీర్ఘ సమాసాలను కవి వాడాడు. "సంధ్యారుణాంబర మనోహరకాంతి రుచ్చైరావిర్బభూవ గలదిందు ముఖీసఖీవ" (4-50) అన్నది ఒక్కటే సమాసం. అక్కడక్కడ ఇటువంటి దీర్ఘ సమాసాల రచనేకాక "విమలం వియదుజ్జ్వలః శశీవిశదం వారి, వికాసి పంకజమ్, సమదాః పరితః తతత్రిణః శరదకారి జగన్ముదాకృతమ్ (11-14)" వంటి అసమస్త పదరచన కూడ వున్నది. శ్రీకృష్ణ సత్యభామలు స్వర్గంనుంచి వచ్చేటప్పుడు కవి రఘువంశాన్ననుసరిస్తు ఆకాశంనుంచి కనిపించే భూములను పాత్రల నోట వర్ణించాడు. ఈ సందర్భంలో కవి కామరూప, కామాఖ్యకు నిలయమైన నీలకూటం, లోహితనది, మాధవ నిలయమైన మణిపర్వతం, కమతానగరం, గౌడదేశం, మిథిల, కాశి, గంగ, యమున, ప్రయాగ, మథుర, వారణావత, కురుక్షేత్రం, ద్వైపాయన సరస్సు, విదర్భ ఆ తర్వాత సముద్రం., ద్వారకలను వర్ణించాడు. కవికి ఈ ప్రదేశాలతో మంచి పరిచయమున్నది కాబట్టి సహజసుందరంగా వర్ణించాడు.

## వామనభట్ట బాణుడు

### వామనభట్ట బాణుని పరిచయం, కాలం

పార్వతీపరిణయ నాటకకర్త కాదంబరి కర్త అయిన బాణుడే అని చాలా కాలం వరకు విమర్శకులు తలంచారు. ఆ నాటకంలో కర్త వామనభట్టబాణుడని ఉండటంచేత నామసామ్యాన్ని బట్టి తత్కర్త ప్రసిద్ధుడైన బాణుడనే సాహిత్య చరిత్రకారులు తలచి తికమకలు పడినారు. కాని తర్వాత ఆ నాటక రచయిత బాణుని పేరును బిరుదంగా ధరించిన ఆంధ్రదేశీయుడైన కవి వామనభట్ట బాణుడని తేల్చబడింది. వామనభట్ట బాణుడు ఆంధ్రదేశంలో కొండవీడు సామ్రాజ్యాన్నేలిన పెదకోమటి వేమారెడ్డికి (క్రీ.శ. 1403-1420) సమకాలికుడు. పెదకోమటి వేమారెడ్డి కొండవీడు నేలిన రెడ్డిరాజుల వంశంలో ప్రసిద్ధులైన రాజులల్లో చివరివాడు. స్వయంగా పండితుడు, కవి. అతని రచనలన్నీ సంస్కృతంలోనే వున్నవి. అమరుక శతకానికి శృంగారదీపిక అన్న టీకను, సప్తశతీసారానికి భావదీపిక అన్న టీకను, సాహిత్య చింతామణి అనే అలంకారశాస్త్ర

గ్రంథాన్ని, సంగీత చింతామణి అనే సంగీతశాస్త్ర గ్రంథాన్ని రచించాడు. ఇవేగాక అతడు కావ్య, భాణ, ప్రహసనాలు వ్రాసాడని సాహిత్య చింతామణిలోని ఉదాహరణ శ్లోకాలనుబట్టి తెలుస్తున్నది. ఈ రాజుకు సర్వజ్ఞ చక్రవర్తి అన్న బిరుదం వున్నది. ఇతని ఆస్థానం ప్రసిద్ధ సంస్కృత తెలుగు కవులకు ఆశ్రయస్థానంగా వుండేది. ఈ రాజు ఆస్థానకవియే వామనభట్ట బాణుడు. ఇతని తండ్రి కోమటియజ్వాన్. పెదకోమటి వేమారెడ్డి తండ్రిపేరు కోమటిప్రభువు. ఆ ప్రభువు పేరు మీదుగానే వామనుని తాత తన కుమారునికి నామకరణం చేసి వుంటాడు. ప్రభువుల పేర్లను ఆశ్రితులు పెట్టుకోవటం కన్పిస్తుంటుంది. దీన్నిబట్టి వామనుని తండ్రి తాతలనుంచి రెడ్డిరాజులను ఆశ్రయించివున్నట్లు తెలుస్తున్నది. వామనుని గురువు విద్యారణ్యుడట. ఇతడు ప్రసిద్ధ విద్యారణ్యస్వామి కాకపోవచ్చును. వామనునికి అభినవ బాణుడనేది బిరుదనామం. బాణునివలెనే ఈ కవిదికూడ వత్సగోత్రం. కవిత్వంలో ఒక్క బాణుడు తప్ప మరేకవి తనతో సాటిరాడని కవి గర్వంగా చెప్పుకొన్నాడు. ఈ రెండు కారణాలచేత కవి బాణుని పేరును బిరుదనామంగా ధరించాడేమో -

బాణాదన్యే కవయః కాణాః ఖలు సరసగద్యసరణీషు
ఇతి జగతి రూఢమయశో వామనబాణోऽz పమార్ష్టి వత్సకులః

ఇది కవి వేమభూపాలచరిత్రలో చెప్పుకున్నాడు. అభినవ బాణుడేకాక ఈ కవికి భాషావల్లభ, కవిసార్వభౌమ అని కూడ బిరుదాలున్నవి.

## రచనలు

వేమభూపాల చరిత్ర-ఇది ఆశ్రయదాత వేమారెడ్డి చరిత్ర. గద్యంలో వున్నది. పార్వతీపరిణయం, కనక లేఖ, బాణాసుర విజయం అన్నవి నాటకాలు. శృంగార భూషణం భాణరూపకం. హంస సందేశం సందేశకావ్యాల కోవలోని లఘుకావ్యం. శబ్ద చంద్రిక, శబ్దరత్నాకర మన్నవి కోశ గ్రంథాలు, మొదటిది అముద్రితం. మద్రాసు, మైసూరు, తంజావూరు మాన్యుస్క్రిప్టు లైబ్రరీలల్లో ప్రతులున్నవి. రెండవది కూడ అముద్రితమే. అడయార్, తంజావూరు మాన్యు స్క్రిప్టు లైబ్రరీలల్లో ప్రతులున్నవి.

నలాభ్యుదయం, రఘునాథ చరిత్ర - ఇవి పద్య కావ్యాలు.

## నలాభ్యుదయం

పేరును బట్టి ఇది నలుని కథ అని తెలుస్తున్నది. ఇది అసంపూర్ణంగా లభించింది. 8 సర్గలు, 9వ సర్గలో మూడు శ్లోకాలు మాత్రమే లభించినవి. అసంపూర్ణంగానే ఇది

త్రివేంద్రం సంస్కృత్ సీరీజ్‌లో ప్రచురింపబడింది. మహాకావ్య వర్ణనలన్నీ దీనిలో వున్నవి. భారవి వలెనే ఈ కవి ప్రతి సర్గ చివరి శ్లోకంలో "లక్ష్మి" అన్న శబ్దాన్ని చేర్చాడు. దమయంతి స్వయంవర వర్ణన కాళిదాసు ఇందుమతి వర్ణనను పోలివున్నది. భారవి వలె అందమైన అర్థాంతరన్యాసాలను కవి ప్రయోగించాడు. కథనం సరళంగా వున్నది. కావ్యశైలి సరసమధురంగా వున్నది.

## రఘునాథ చరిత్ర

దీనిలో 30 సర్గలున్నవి. దీనిలో రాముని వృత్తాంతమున్నది. ఉత్తరకాండ కథను కవి తీసుకోలేదు తంజావూరు, అడయార్ మాన్యుస్క్రిప్టు లైబ్రరీలల్లో రెండు ప్రతులు లభించినవి. ఇది ఇంకా అముద్రిత గ్రంథం. చివరి సర్గలో కొన్ని శ్లోకాలు తప్ప కావ్యమంతా లభిస్తున్నది. మహాకావ్య శైలిలో కవి రామాయణ కథను వ్రాసాడు. పుర, ఋతు, మృగయ, యుద్ధ, విజయాది కావ్యవర్ణనలున్నవి. అక్కడక్కడ కవి రఘువంశాన్ని అనుకరించాడు.

## సుకుమార కవి

సుకుమారకవి కృష్ణ విలాస కావ్యాన్ని రచించాడు. దీనిలో 4 సర్గలున్నవి. శ్రీ కృష్ణుని పరాక్రమ వర్ణన దీనిలో వున్నది. ఈ కవి మలబారు నివాసి, కావ్య శైలి సరళ మనోహరం. మలబారు ప్రాంతపు సంస్కృత కవులల్లో ప్రసిద్ధమైన వాడు.

## అప్పయ్య దీక్షితుడు

ఆలంకారికుడు, గొప్ప దార్శనికుడు. సిద్ధాంత లేశసంగ్రహ, నయమంజరి అని అద్వైత వేదాంతగ్రంథాలు రచించాడు. న్యాయరక్షామణి పేరుతో బ్రహ్మ సూత్రాలకు భాష్యం వ్రాసాడు. ప్రసిద్ధ దార్శనికుడు, వైయాకరణుడు భట్టోజిదీక్షితుడు ఇతని శిష్యుడు. అప్పయ్య దీక్షితుడు కొంతకాలం పెనుగొండలో వేంకటపతి రాయల (క్రీ.శ. 1586-1613) ఆస్థానంలో వుండి ఆ తర్వాత రాజకీయాదికల్లోల పరిస్థితులచేతనేమో మధురానగరానికి తిరుమల నాయకుని ఆహ్వానం మీద పోయి అక్కడ నివసించాడు. తర్వాత ఇతడు నెల్లూరు పరిపాలకుడు చిన్న బొమ్మ నాయకుని (క్రీ.శ. 1549-1578) ఆశ్రయంలో కూడ వున్నట్లు శాసనాధారమున్నది. తర్వాత చిదంబరంలో మరణించాడు. ఇతనివి 104 రచనలున్నవి. అప్పయ్య దీక్షితుడు "శివార్కమణి దీపిక" అని శ్రీకంఠభాష్యానికి వ్యాఖ్యానాన్ని వ్రాసాడు. అప్పయ్య శివాద్వైతి. తన రామాయణ తాత్పర్య సంగ్రహంలో అతడు శైవమత పరంగా అర్థాలను వివరించాడు. ఇంకా అతడు రత్నత్రయ పరీక్ష, శిఖరిణీమాల. శివాద్వైత

నిర్ణయం, తత్త్వ సిద్ధాంత వ్యాఖ్య, నయమణిమాల అనే గ్రంథాలను రచించాడు. అప్పయ్య దీక్షితుని అలంకారశాస్త్ర సంబంధ గ్రంథాలు - కువలయానందం, చిత్రమీమాంస, వృత్తివార్తికాలు. వరదరాజస్తవం ఇతని లఘుకావ్యం. ఇవేగాక రామాయణ సంగ్రహమనే కావ్యాన్ని వ్రాసాడు. దీనిలో శ్రీరామచంద్రుని చరిత్ర నిబద్ధిపబడింది. దీనితో అతడు కవిగా కూడ పేరు సంపాదించుకొన్నాడు. అప్పయ్య దీక్షితుడు తమిళుడైనా అతని ఆశ్రయ దాతలందరు తెలుగు రాజులే.

## ఉత్ప్రేక్షావల్లభుడు

ఈ కవి భిక్షాటనకావ్యాన్ని రచించాడు. ఇది 39 అధ్యాయాల వరకే లభించింది. దీనిలో శివుడు భిక్షుకుని రూపంలో చోళరాజును దానమడిగి, అతన్ని పరీక్షించే వృత్తాంతమున్నది. శివుడు స్వర్గానికి సన్యాసి వేషంలో భిక్షాటనానికి పోయినప్పుడు అక్కడ అప్సరసలు అతన్ని చూచి పొందిన అవస్థలను కవి దీనిలో చక్కగా వర్ణించాడు. కవిత్వం మధురంగా, రసవంతంగా వున్నది. ఈ కవిపేరు అసలు శివభక్తదాసు. కాని ఉత్ప్రేక్షలను మనోహరంగా చెప్పటంచేత అతనికి ఉత్ప్రేక్షా వల్లభుడని పేరువచ్చింది. క్రీ.శ. 16వ శతాబ్దం కవి.

## దేవ విమలగణి

ఈ కవి హీరసౌభాగ్య కావ్యాన్ని రచించాడు. స్వయంగా దీనికి వ్యాఖ్యవ్రాసాడు. దీనిలో 17 సర్గలున్నవి. హీర విజయసూరి అనే జైన సన్యాసి జీవితచరిత్ర దీనిలో వర్ణింప బడింది. అక్బరు చక్రవర్తి ఈ సన్యాసికి జగద్గురు అన్న బిరుదాన్ని ప్రదానం చేసాడు. క్రీ.శ. 1550 ప్రాంతంవాడు.

## రాజమల్లు

ఈ కవి జంబుస్వామి చరిత్రను రచించాడు. దీనిలో 13 సర్గలున్నవి. ఈ కవి కూడ అక్బరుకు సమకాలికుడు. కావ్యారంభంలో పురవర్ణనా సందర్భంలో ఆగ్రా నగరాన్ని వర్ణించాడు. అక్బరు కాలంనాటి ఆగ్రానగరం దీనిలో ప్రతిబింబించింది. జంబుస్వామి మహిమ ఈ కావ్యంలో చెప్పబడింది. ఈ కవి సరసమైన కావ్యోచిత వర్ణనలను చేసాడు. పాత్ర చిత్రణ, చక్కని వర్ణనలు, సూక్తులను ఇతని కావ్యంలో చూడవచ్చును. జంబూ క్షేత్రాన్ని బాగుచేయించిన రాజా తోడర మల్లు కొరకు ఈ కావ్యాన్ని కవి వ్రాసాడు. ఇదేగాక కవి ఇంకా మూడు కృతులను వ్రాసాడు.

## చక్రకవి

జానకీ పరిణయమన్న కావ్యాన్ని వ్రాసాడు. దానిలో 8 సర్గలున్నవి. ముద్రితమై లభిస్తున్నది. సీతారాముల వివాహం వర్ణితమైంది. ఈకవి మధుర తిరుమల నాయకుని (క్రీ.శ. 1623-1659) ఆస్థాన కవి.

## నీలకంఠ దీక్షితుడు

ఈకవి అప్పయ్య దీక్షితుల సోదరుని పౌత్రుడు. మధుర తిరుమల నాయకుని ప్రధాన మంత్రి. శివలీలార్ణవం, గంగావతరణం ఇతని కృతులు. శివలీలార్ణవంలో 22 సర్గలున్నవి. దీనిలో శివుని చతుష్షష్టి లీలలు వర్ణింపబడినవి. గంగావతరణంలో 4 సర్గలున్నవి. గంగ భూమి మీదికి అవతరించే కథ దీనిలో వున్నది.

## మధురవాణి

ఈ కవయిత్రి రఘునాథ నాయకుని (క్రీ.శ. 1633-1673) ఆస్థానంలో వుండేది. తంజావూరు నివాసిని. రఘునాథ నాయకుడు తెలుగులో వ్రాసిన రామాయణ సారాన్ని సంస్కృతీకరించింది. తెలుగు నుంచి సంస్కృతీకరింపబడిన కృతులల్లో ఒకటి అని చెప్పవచ్చును. రామరాజభూషణుని వసుచరిత్ర అనే తెలుగు కావ్యాన్ని శ్రీ కాళహస్తికవి (క్రీ.శ. 17వ శ.) చంపూకావ్యంగా సంస్కృతీకరించాడు. ఈ కావ్యాన్నే కాక మధురవాణి కుమార సంభవం, నైషధాలు అనే చంపూ కావ్యాలను వ్రాసిందని తెలుస్తున్నది. కాని అవి దొరకలేదు. రఘునాథుని కోరిక మీదనే ఈమె రామాయణాన్ని సంస్కృతీకరించింది. దీనిలో 14 సర్గలున్నవి. హనుమంతుడు అశోకవనంలో సీతను కనుక్కునే వరకే అసంపూర్ణంగా లభించింది. నిజంగా దానిలో ఎన్ని సర్గలున్నవో చెప్పలేము. కవిత్వం స్త్రీ సహజమైన సరస మాధుర్యంతో వున్నది. కవయిత్రి తన చిత్రకవిత్వంలోని నేర్పును కూడ చూపింది. ఈ కావ్యానికి లఘుటీకను కూడ ఎవరో వ్రాసారు.

## రామభద్ర దీక్షితుడు

పతంజలి చరిత్రను రచించాడు. దీనిలో 8 సర్గలున్నవి. మహా భాష్య కర్త పతంజలి జీవిత కథ దీనిలో వర్ణింపబడింది. ఈ కవి తంజావూరు నేలిన శహాజీ (క్రీ.శ. 1684-1711) ఆస్థాన కవి. విజయనగర సామ్రాజ్య పతనానంతరం దక్షిణ దేశంలో తంజావూరు, మధుర, జింజిని పరిపాలించిన తెలుగు రాజులు తెలుగు సాహిత్య పోషకులే కాక సంస్కృత సాహిత్య

పోషకులు కూడా. తంజావూరును ఏలిన నాయక రాజులే కాక ఛత్రపతి వంశజులైన మరాఠా రాజులు కూడ తెలుగు, సంస్కృత కవులను పోషించారు. స్వయంగా పండిత కవులై రచనలు చేసారు. వీరి కాలంలో అనేక కావ్యాలు, నాటకాలు, సంగీత శాస్త్ర గ్రంథాలు, వ్యాకరణ, దార్శనిక గ్రంథాలేకాక వివిధ విషయ సంబంధ గ్రంథాలకు వ్యాఖ్యానాలు వ్రాయబడినవి. సంస్కృత కావ్య శాస్త్రాది గ్రంథాలకు వ్యాఖ్యానాలు వ్రాసే ప్రథ దక్షిణదేశంలో ముఖ్యంగా ఆంధ్రదేశంలో ఆరంభమైంది. క్రమంగా సంస్కృత భాషను అర్థం చేసుకొనే సామర్థ్యం ప్రజల్లో తగ్గసాగింది. అంతేగాక విదేశీయుల ఆక్రమణలతో సంస్కృతాధ్యయనం వెనుకబడ సాగింది. దానితో సంస్కృత రచనలను అర్థం చేసుకోవాలంటె వ్యాఖ్యాన దీపికల అవసరమేర్పడింది. అందువల్ల దాక్షిణాత్య సంస్కృత పండితులు వ్యాఖ్యానాలు ఎన్నో వ్రాసారు.

## మందారు భట్టు

క్రీ.శ. 19వ శతాబ్దం కవి. కొచ్చిన్ రాజు ఆశ్రయంలో వున్నాడు. శ్రీహర్షుని నైషధాన్ని అనుకరిస్తు ఉత్తరనైషధ కావ్యాన్ని రచించాడు. దీనిలో 16 సర్గలున్నవి. నలుని ఉత్తర కథ దీనిలో వున్నది.

## కృష్ణరామకవి

శ్రీహర్షుని నైషధాన్ని సంక్షేపంగా సారశతకమనే పేరుతో రచించాడు. క్రీ.శ. 19వ శతాబ్దంవాడు. జయపురవిలాసాదికావ్యాలు వ్రాసాడు.

## ముడింబై నరసింహాచార్యుడు

క్రీ.శ. 1841-1927 కాలం కవి. వీరి వంశం సంగీతసాహిత్యాలకు పట్టుగొమ్మ. ఈ వంశంలో ఒకరికి ఇద్దరు కుమారులు. ఒకరు సాహిత్యంలో, ఒకరు సంగీతంలో ప్రవీణులైనవారుండిరని, వారిద్దరు సాహిత్యముడింబై, సంగీతముడింబై అన్న వంశాలకు కర్తలైనారని చెప్తారు. నరసింహాచార్యుడు 14 రచనలు చేసాడు. వాటిల్లో 5 స్తోత్ర గ్రంథాలు. వాసవి పరాశరీయం ప్రకరణరూపకం. రామచంద్రకథామృత కావ్యాన్ని రచించాడు. ఇది బృహత్కావ్యం. దీనిలో 1200 శ్లోకాలున్నవి. ఈ వంశానికి చెందిన మరొక నరసింహాచార్యులు గరుడాచలచంపువు. సారంగధరచంపువును రచించాడు.

## వట్టిపల్లి నరకంఠీరవ

క్రీ.శ. 1900 ప్రాంతంవాడు. తిరుపతిలో సంస్కృతాచార్యుడుగా పనిచేసాడు. సుబంధు వాసవదత్తను ఆర్యాఛందస్సులో వాసవదత్త కథాసారమనే పేరుతో రచించాడు. 296 శ్లోకాలున్నవి. స్తోత్రాదులను కూడ ఇతడు రచించాడు.

## పరవస్తు వేంకట రంగాచార్యుడు

క్రీ.శ. 1822-1927 ప్రాంతం కవి. సర్వశబ్దసంబోధిని అన్న సంస్కృతాంధ్రకోశం, లఘువ్యాకరణాలనేకాక కుంభకర్ణ విజయం అనే కావ్యాన్ని వ్రాసాడు. ఇతడు మంజులనైషధమన్న 7 అంకాల నాటకాన్ని కూడా వ్రాసాడు.

## ఉమాపతిశర్మ ద్వివేది

పారిజాతాపహరణం కావ్యాన్ని రచించాడు. దీనిలో 21 సర్గలున్నవి. ఈ కవి క్రీ.శ. 20వ శతాబ్దంవాడు.

## రేవా ప్రసాద ద్వివేది

సీతాచరితం అనే కావ్యాన్ని రచించాడు. దీనిలో 10 సర్గలున్నవి. ఈ కవి క్రీ.శ. 1968లో ఈ కావ్యాన్ని రచించాడు. ఈ కావ్యంలోని భాష, శైలి ఉత్కృష్టమైనవి.

# రూపకాలు

## రూపకోత్పత్తి - వికాసాలు

సంస్కృత సాహిత్య చరిత్రలో రూపక సాహిత్యం ప్రధానాంగ రూపమైంది. ప్రపంచ సాహిత్యాన్ని పరిశీలించినట్లయితే సంస్కృత రూపకాలు ఒక విశిష్ట పరంపర కలిగినటు వంటివి. సంస్కృత సాహిత్యంలో లోక ప్రియత్వం దృష్టితో చూచినట్లయితే రూపకాలు ప్రథమ స్థానాన్ని గ్రహిస్తవి. దర్శన, శ్రవణ గుణాలచేత రూపకాలు పండిత పామరులను సమానంగా ఆకర్షించి ఆనందితులను చేయటమే కాక దర్శన, శ్రవణ గుణాలచేత వాటి ప్రభావం సామాజికుల మీద ఇతర కావ్య ప్రక్రియల ప్రభావం కన్న అధికమైంది. సర్వకళల సమాహారం కావటంచేత రూపకాలు కేవలం ఆనందప్రదాయకమైనవే కాక విజ్ఞానదాయకమైనవి కూడా. ఇటువంటి విశిష్టమైన రూపక ప్రక్రియ ఎప్పుడు ఎట్లా ప్రాదుర్భవించి వికసించిందనే విషయంలో ఆధునిక విమర్శకులు చాల ఊహాగానాలు చేసారు. డా. రిజ్వే సంస్కృత రూపకాలు ప్రాచీన 'వీరపూజ' కార్యకలాపాల నుంచి పుట్టి వికసించినవని అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు. ప్రాచీన గ్రీసు దేశంలో మృతవీరులకు శ్రద్ధాంజలులు అర్పించే కార్యకలాపం నుంచి నాటకాల (రూపకాల) ఉత్పత్తి జరిగింది. అదే విధంగా భారత దేశంలోనూ జరిగిందని డా. రిజ్వే ఊహాగానం చేసాడు. రాముని, కృష్ణుని లీలలను నాటకాలుగా ప్రదర్శించటం అతని ఈ ఊహాగానానికి ఆధారం కావచ్చును. కాని గ్రీసుదేశంలో అట్లా జరిగింది కాబట్టి భారత దేశంలోనూ అట్లానే జరిగిందనటం అంత సమర్థనీయమైన విషయం కాదు.

ప్రకృతిలో కనిపించే పరివర్తనలనే ప్రాచీన భారతీయులు మూర్తరూపంగా ప్రదర్శించారని అదే నాటకాల (రూపకాల) ఆరంభమని డా. కీథ్ అభిప్రాయం. మహాభాష్యంలో ఉల్లేఖింపబడిన "కంసవధ" నాటకంలో వసంత ఋతువు హేమంత ఋతువు మీద విజయాన్ని సాధించటం చిత్రించబడిందని కీథ్ అంటాడు. కాని కీథ్ విచిత్రాభిప్రాయానికి ఆధారమేమిలేదు.

సంస్కృత రూపకాలు బొమ్మలాట (Puppet Play) నుంచి ఉద్భవించాయని డా. పిశెల్ విశ్వసించాడు. బొమ్మలకు దారాలను కట్టి ఆ దారాలను ఒక వ్యక్తి పట్టుకొని నేపథ్యంలో వుండి బొమ్మలను ఆడిస్తుంటాడు. దారాలను పట్టుకొని ఆడించే వ్యక్తికి

అందుకే సూత్రధారుడని పేరు వచ్చిందని తర్వాత నాటకాలల్లో ప్రధాన పాత్రధారునికి, నాటక సమాజ నాయకునికి ఇదే పేరు స్థిరపడిందని, ఇదే బొమ్మలాటల నుంచి నాటకాలు పుట్టిన వనటాన్ని సూచిస్తున్నదని హుల్ట్స్ వంటి విమర్శకుల అభిప్రాయం. బొమ్మలాటల నుంచి సంస్కృత నాటకాలు పుట్టినవని పిశెల్ చెప్పగా కోనో, లుడర్స్‌లు ఛాయానాటకాలనుంచి సంస్కృత రూపకాలు పుట్టినవని నిర్ణయించటానికి ప్రయత్నించారు. "దూతాంగద" అనే సుభటుని నాటకాన్ని వారు ఉదాహరణగా తీసుకొని ఈ నిర్ణయానికి వచ్చారు. సుభటుని దూతాంగదమనే నాటకం అంత ప్రసిద్ధమైంది కాదు. అదీగాక ఛాయా నాటకం అది ఒక్కటే సంస్కృతంలో కన్పిస్తున్నది. అటువంటప్పుడు ఛాయా నాటకం నుంచి సంస్కృత నాటకాలు ఆవిర్భవించినవని చెప్పటం హాస్యాస్పదంగా కన్పిస్తుంది.

పశ్చిమదేశాలల్లో ప్రచలితమైన "మేపోల్" నృత్యం వంటిదే భారతదేశంలో "ఇంద్రధ్వజోత్సవం". "మేపోల్" నృత్యం వంటి ఇంద్రధ్వజోత్సవం నుంచే సంస్కృత నాటకాలు పుట్టినవని కొందరు పాశ్చాత్య విమర్శకులు తలంచారు. కాని పాశ్చాత్యదేశాలల్లో మే మాసంలో "మే పోల్" అనే స్త్రీ పురుషులు చేసే నృత్యం సర్వసామాన్యంగా వున్నది. కాని ఇంద్రధ్వజోత్సవం "మే పోల్" నృత్యం వలె సర్వసామాన్యమైంది కాదు. అటువంటప్పుడు ఇంద్రధ్వజోత్సవం నుంచి సంస్కృత నాటకాలు పుట్టినవని చెప్పటంలో అర్థం లేదు.

డా॥ వేబర్, డా॥ విండిష్‌లు సంస్కృత రూపకాలు గ్రీకు రూపకాల ప్రభావంచేత ఆవిర్భవించినవని అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. క్రీ.శ. ప్రథమ, ద్వితీయ శతాబ్దాలల్లో రోమన్లతో భారతీయులకు వ్యాపార సంబంధాలుండేవని, అట్లా భారతీయులకు గ్రీకు నాటకకళతో పరిచయమేర్పడిందని, తత్ఫలితంగా సంస్కృతంలో నాటకాలు వ్రాయబడినవని వీరు ఊహాగానం చేసారు. సంస్కృత నాటకాలల్లో ప్రయోగించే జవనిక లేక యవనిక గ్రీకు ప్రభావాన్ని చెప్తున్నదని వీరు అన్నారు. అసలు నాటకాలు అనేవి గ్రీసుదేశంలోనే పుట్టినవని పాశ్చాత్యులకు ఒక స్థిరాభిప్రాయం ఏర్పడి వున్నది. భారతీయ నాటకాలతో వారికి పరిచయ మేర్పడింతర్వాత కూడ వారు ఆ స్థిరాభిప్రాయ ప్రభావంచేత సంస్కృత నాటకాల మీద గ్రీకు నాటకాల ప్రభావాన్నే దర్శించసాగారు. కాని సంస్కృత నాటకాల చరిత్ర క్రీ.శ. ప్రథమ, ద్వితీయ శతాబ్దాల కన్న అతి ప్రాచీనమైందని ఆధారాలు లభిస్తున్నవి. పాణిని పేర్కొన్న నటసూత్రాలు, భరతుని నాట్యశాస్త్రం ఇవన్నీ సంస్కృత నాటకాలు క్రీ.పూ. 500 కన్న ప్రాచీనమైనవని చాటుతున్నప్పుడు పై వాదం విశ్వాసయోగ్యంగా లేదు. క్రీ.పూ. 500 కన్న ముందు గ్రీకు భాషలో నాటకాలు లేవు, వున్నా ఏ రూపంలో వున్నవో తెలియదు.

అటువంటప్పుడు గ్రీకు నాటకాల ప్రభావంతో సంస్కృత నాటకరచన ఆరంభమైందనటం అంగీకారయోగ్యంగా లేనేలేదు. సంస్కృత నాటకాలల్లో రంగస్థలానికి, ప్రేక్షకులకు నడుమ తెరను ప్రయోగించే ఆచారం లేదు. ఒకవేళ వున్నా ఈ ఆచారం తర్వాత తర్వాత ప్రవేశించింది కావచ్చును. ఇప్పటికి దేశీయ నాటకాలల్లో తెరను ప్రయోగించే ఆచారంలేదు. సంస్కృత నాటకాలల్లో రంగస్థలం మీద నేపథ్యంగా వాడే తెరకు "జవనిక" లేక "యవనిక" అని పేరు. "యవనిక"కు యవనదేశం అంటె గ్రీకు దేశం నుంచి వచ్చిందని లేక గ్రీకుదేశ సంబంధమైందని అర్థం చెప్పి సంస్కృత నాటకాలు గ్రీకు నాటకాల ప్రభావం వల్ల పుట్టినవని చెప్పటం సరిగా లేదు. పూర్వకాలంలో రాజుల అంతఃపురాలల్లో యవన స్త్రీలు దాసీలుగా వుండటం సామాన్యంగా వుండేది. యవన దాసీలు రంగస్థలం మీద నేపథ్యరూపమైన తెరను పట్టుకొని నిల్చునేవారేమో. ఆ కారణంచేత తెరకు "యవనిక" అని పేరు కలిగింది కావచ్చును. అంతేగాని "యవనిక" శబ్దాన్ని పట్టుకొని సంస్కృత నాటకాలు గ్రీకు నాటకాలు నుంచి ఉద్భవించినవని ఊహించటం ఏమి సమంజసంగా లేదు. అదేగాక సంస్కృత గ్రీకు నాటకాల స్వరూప స్వభావాదుల్లో ఎక్కడా సామ్యం కన్పించదు. సంస్కృత నాటకాలు దేవతల, మానవుల ఆదర్శ జీవితాన్ని చిత్రించేవి. వ్యక్తిలో వుండే బలహీనతలను, విధి చేతిలో అతడు కీలుబొమ్మ కావటం, దేవతలు మానవుల జీవితంతో ఆడుకోవటం మొదలైనవాటిని గ్రీకు నాటకాలల్లో వలె సంస్కృత నాటకాలు చిత్రించలేదు. సంస్కృత నాటకాలల్లో నాయకుడు ధీరోదాత్తుడు, సర్వగుణ సంపన్నుడు, తన ఆదర్శం కొరకు దేవతలనైనా ఎదిరించగల సాహసం కలవాడు. సంస్కృత నాటకాలు ముఖ్యంగా సత్య అసత్యాలకు, ధర్మ అధర్మాలకు, న్యాయ అన్యాయాలకు, దేవదానవ శక్తులకు నడుమ జరిగే సంఘర్షణను చిత్రించేవి.. చివరకు సత్యానికి, ధర్మానికి, న్యాయానికి, దేవత్వానికి విజయం కలిగినట్లుగా సంస్కృత నాటకకారులు రచించారు. మానవునికి విధికి నడుమ జరిగే ఘర్షణను గ్రీకులు చిత్రిస్తే మంచికి చెడుకు ఘర్షణను భారతీయులు చిత్రించారు. ఒకొకసారి గ్రీకు నాటకాల్లో మానవుడు విధి చేతిలో అపజయాన్ని పొందటం చావటం కూడా జరిగేది. కాని మంచికి విజయాన్ని కలిగించి మానవుని ఆశాపక్షాన్ని చిత్రించేవి సంస్కృత నాటకాలు. గ్రీకు నాటకాలు నిరాశాపక్షాన్ని చిత్రించేవి. అందుకే గ్రీకు నాటకంలో ఒకొకసారి పాత్రలన్నిటి మరణంతో కథ ముగుస్తుంది. సంస్కృత నాటకాలల్లో అసత్యం, అధర్మం ఎప్పుడూ నశిస్తుంది. సత్యానికి ధర్మానికి ఎప్పుడూ విజయమే. గ్రీకు నాటకాలు వ్యక్తుల ఆదర్శ జీవితాన్ని చిత్రించేవి కావు. విధి చేతుల్లో బొమ్మలై మానవులు అనుభవించే కష్టాలను, బాధలను అవి చిత్రించినవి. గ్రీకు నాటకాలల్లోని పాత్రలు సంస్కృత నాటకాలల్లోవలె

కేవలం మంచి, కేవలం చెడు పాత్రలు కావు. మానవుని సహజ దుర్గుణాలు, బలహీనతలు గ్రీకునాటక పాత్రలల్లో కన్పిస్తవి. విధిచేతుల్లో పాత్రలు వినాశం చెందుతవి. అందుకే గ్రీకునాటకాలల్లో ప్రసిద్ధమైనవి చాలా మట్టుకు ఈ విధంగా పాత్రల వినాశంతో ముగిసేవి. ఇట్లా ముగిసే నాటకాలను విషాదాంతనాటకా (tragedy) లని అంటారు. పాత్రల వినాశంతో కథముగిసే సంస్కృత నాటకాలు లేవు. కాని చెడు చేతిలో మంచి కష్టాలను అనుభవించటం, కొంతసేపటి కొరకు చెడుకే విజయం కలిగినట్లు చిత్రించటం సంస్కృత నాటకాలల్లో జరిగింది. ఇది కొంత వరకు గ్రీకు విషాదాంత నాటకాలను పోలివున్నది (శాశ్వతవిజయం మళ్ళా ఎట్లా అయినా మంచికే కలుగుతుంది.) అభిజ్ఞాన శాకుంతలం, నాగానందం వంటి నాటకాలల్లో ఇటువంటి విషాదాన్ని చూడవచ్చును. ఉత్తరరామచరిత్ర నాటకం నాయికానాయకుల దీర్ఘకాల విరహంతో, ఫలప్రాప్తి అనిశ్చితత్వంతో కరుణరసాత్మకంగా రచింపబడింది. అంతేగాని అది గ్రీకు విషాదనాటకం వంటిది మాత్రం కాదు. సంస్కృత విషాద నాటకాలకు, గ్రీకు విషాదాంత నాటకాలకు ఎక్కడా పోలికలేదు. కాని రెండూ కూడ పాత్రల ఉదాత్త గంభీర చరిత్రలను చిత్రించేవే. ఈ పోలిక యాదృచ్ఛికమే కాని ప్రభావజనితం మాత్రం కాదు.

గ్రీకు నాటకాలు పౌరులకు ఆనందాన్ని కలిగించటమే కాక శత్రువులను ఎదిరించటానికి పురికొల్పేవిగా వుండేవి. మరి భారతీయ సంస్కృత నాటకాలు ప్రేక్షకులను ధార్మికంగా, నైతికంగా ఉన్నతులను చేసి ధర్మార్థ కామమోక్షాలను సమానంగా సాధించేటట్లుగా ఉపయోగపడేవి. గ్రీకు భాషలోని హాస్య వ్యంగ్య నాటకాలు (Satire drama) రాజకీయ సమస్యలను హాస్యంతో కలిపి సునిశిత విమర్శ చేసేవి. సంస్కృతనాటకాలల్లో అటువంటివి లేవు. అవి కేవలం ధర్మాన్ని, నీతిని మాత్రమే బోధించేవి. సంస్కృత నాటకాల ప్రధానాశయం ప్రేక్షకులను ఆదర్శకార్యోన్ముఖులుగా చేయటమే. ఇదే రసానంద వాదంగా పరిణమించింది. వాస్తవిక చిత్రణ సంస్కృత నాటకాల ప్రధానోద్దేశం కాదు. Suggession తో పాటు Imagination వారికి ఇష్టమైంది. సంస్కృత నాటకాలు గ్రీకు నాటకాల కన్నా సంగీత ప్రధానమైనవి. గ్రీకునాటకాల్లో "కోరస్" గీతాలుండేవి. కాని సంస్కృత నాటకాలల్లోని పద్యాలవలె అవి సంగీతభావాత్మకంగా కాక కథాత్మకంగా వుండేవి.

సంస్కృత నాటక లక్షణాలకు, గ్రీకు నాటక లక్షణాలకు ఎక్కడా పోలికలేదు. నాటక ప్రదర్శన పద్ధతిలోగాని, పాత్ర చిత్రణలోగాని, రంగస్థల నిర్మాణంలోగాని రెండిటికి ఎక్కడా పోలికలు లేవు. రెండు ప్రత్యేకమైనవి, విలక్షణమైనవి. సంస్కృత నాటకాలల్లో కన్పించే రస

పోషణ తత్త్వం అచ్చమూ భారతీయమైంది. ఆ తత్త్వం గ్రీకు నాటకాలల్లో కన్పించదు. ఇంకా సంస్కృత నాటకాలల్లో సందర్భానుకూలంగా ప్రకృతి సౌందర్య చిత్రణకు ప్రాధాన్య మియ్యబడింది. చుట్టూవున్న ప్రకృతిచేత గ్రీకు నాటకకారుని హృదయం స్పందించలేదు. కాని భారతీయ నాటకకారుని హృదయం స్పందించింది. గ్రీకు భాషలో గంభీరమైన నాటకాలు, హాస్యనాటకాలు రెండూ విభిన్నమైన రచనలు కాగా సంస్కృత భాషలో ఆ విభజన లేదు. కాని నాయకుడు, ఇతివృత్తం, రసం - వీటి భేదాలనుబట్టి రూపకాల విభజన జరిగింది.

సంస్కృత నాటకాలల్లో మరొక విశేషం భాషాప్రయోగం. పాత్రల భేదాన్ని బట్టి భాష మారుతుంది. అంటె సంఘంలో ఆయా తరగతికి చెందిన వ్యక్తులు ఏ భాషను మాట్లాడుతారో, వాస్తవికతకు లోపం రాకుండా సంస్కృత నాటకకారులు ఆ భాషను ప్రయోగించారు. అట్లా సంస్కృతం, శౌరసేని, మాగధి, పైశాచి మొ॥న ప్రాకృత భేదాలను సంస్కృత నాటకకారులు ప్రయోగించారు. ఇటువంటి విలక్షణత గ్రీకు నాటకాలల్లో లేదు.

గ్రీకు నాటకాలల్లో Unity of action, Unity of place, Unity of time - ఈ మూడు బాగా పాటింపబడినవి. కాని సంస్కృత నాటకాలల్లో unity of time, unity of place లు విశేషంగా పాటింపబడలేదు.

ఈ విధంగా ఎన్నో విలక్షణాలచేత సంస్కృత గ్రీకు నాటకాలు విభిన్నమైనవి. గ్రీకు నాటకాల ప్రభావంచేతనే సంస్కృత నాటకాలు ఉద్భవించినవని చెప్పటం అందుచేత సమర్థనీయంగా లేదు. గ్రీకు శిల్పకళా ప్రభావం భారతీయ శిల్పకళమీద వున్నట్లుగానే కొంత గ్రీకు నాటకాల ప్రభావం సంస్కృత నాటకాల మీద ఏమైనా పడిందేమో చెప్పలేము. అదేవిధంగా వేదాంత, జ్యోతిష, చికిత్సాది శాస్త్రవిషయాలల్లో భారతీయ ప్రభావం గ్రీకులమీద వున్నట్లుగానే సంస్కృత నాటకాలప్రభావం గ్రీకు నాటకాల మీదవున్నా వుండవచ్చును. అంతేగాని గ్రీకు నాటకాల ప్రభావంచేతనే సంస్కృతంలో నాటకాలు పుట్టినవనటం అసంభవం. గ్రీకు సంస్కృత నాటకాలు భిన్న ప్రదేశాల్లో పుట్టి వికసించినవేగాని పరస్పర ప్రభావం కనబడదని వింటర్‌నిట్స్ అభిప్రాయం. గ్రీకు భారతదేశాలల్లో స్వతంత్రంగా దాదాపు ఒక్కకాలంలోనే నాటకకళ పుట్టి వికసించిందని ఆయన అంటాడు. గ్రీకులవలెనే భారతీయులు సంగీతప్రియులు. అతి ప్రాచీన కాలంలోనే భారతదేశంలో మహాపురుషుల చరిత్రలు, ప్రసిద్ధ సంఘటనలు. గీతయుక్తంగా పాడటం, అనుకరణ చేస్తూ అభినయించటం అనేది వుండేది. ఈ సంగీతాత్మకమైన అనుకరణ ఈనాటి భరతనాట్యంలో లాగ ఒక్క వ్యక్తి

చేయటమో లేక అనేక వ్యక్తులు చేయటమో జరిగేది. తర్వాత తర్వాత ఆ వ్యక్తులు ఆయా పాత్రలను తగిన వేషాలను దరించి పాటలేకాక సంభాషణారూపంగా వచనాన్ని ప్రయోగిస్తు అభినయం చేయసాగారు. మతసంబందమైన, దేవతపూజాసంబంధమైన, సాంఘిక సంబంధమైన ఉత్సవాలల్లో ఈ విధమైన అభినయాలు చేయటం జరిగేది. అదే నాటక కళగా వికసించి పెరిగిందని చెప్పాలి.

ప్రొఫెసర్ లెవీ నాటకకళ శకులతో కుషాణుల కాలంలో భారతదేశంలో ప్రవేశించిందని అభిప్రాయపడినాడు. అంతకు ముందు ప్రాకృత భాషలో నాటకాలుండేవని కుషాణుల సంస్కృతాదరణతో సంస్కృత నాటకాలు మొదటిసారిగా వ్రాయబడినవని అతని అభిప్రాయం. తర్వాత మధ్యఏషియాలో దొరికిన సంస్కృత నాటక ప్రతులు లెవీ అభిప్రాయాన్ని ఛిన్నాభిన్నం చేసినవి. అక్కడ దొరికిన నాటకాలను బట్టి భారతదేశంలో నాటకకళ ఎప్పుడో సంపూర్ణంగా వికసించిందని తెలుస్తున్నది. కుషాణరాజులకు చాలా పూర్వమే పాణిని నటసూత్రాలను పేర్కొన్నాడు, భరతుని నాట్యశాస్త్రం రచింపబడింది. అర్థశాస్త్రకారుడు నటులను గూర్చి ప్రసంగించాడు. మహాభాష్యకారుడు నాటకాలను పేర్కొన్నాడు. కుషాణులకు పూర్వమే భాససౌమిల్ల కాళిదాసాది కవులు నాటకాలను వ్రాసారు. అటువంటప్పుడు కుషాణులతో నాటక కళ భారతదేశంలో ప్రవేశించి వికసించిందనటం, అశ్వఘోషునితోనే నాటకరచన ఆరంభమైందనటం హాస్యాస్పదం.

భరతుడు తన నాట్యశాస్త్రంలో నాట్యోత్పత్తిని గూర్చి చర్చించాడు. అతడు చెప్పిన నాట్యోత్పత్తి వృత్తాంతమిది - త్రేతాయుగంలో దేవతలు బ్రహ్మ దగ్గరికి పోయి శూద్రులకు ఉపయోగపడే వేదరచన చేయమని ప్రార్థించారు. అప్పుడు బ్రహ్మ ఋగ్వేదం నుంచి పాఠ్యాన్ని, సామవేదం నుంచి గానాన్ని, యుజుర్వేదం నుంచి అభినయాన్ని, అథర్వణ వేదం నుంచి రసాన్ని తీసుకొని పంచమవేదంగా నాట్యవేదాన్ని సృష్టించాడు. బ్రహ్మ ఆజ్ఞ మీద విశ్వకర్మ నాట్యగృహాన్ని నిర్మించాడు. భూలోకంలో నాట్యకళా ప్రచారానికి భరతముని నియోగింపబడినాడు. ఇంద్రధ్వజోత్సవ సమయంలో మొదటిసారిగా భరతుడు తన శిక్షితులైన పుత్రుల ద్వారా నాట్యాన్ని ప్రదర్శింప జేసాడు. ఈ నాటకోత్పత్తి కథనుబట్టి నాట్యం లేక అభినయం శూద్రులకు ధర్మజ్ఞానబోధ చేయటానికి సృష్టింపబడిందని తెలుస్తున్నది. అంటే వేదపఠనాధికారం లేని జనులు నాటకదర్శనం ద్వారా ధర్మజ్ఞానాలను సంపాదించే వారన్నమాట. ఇంకా నాట్యం దుఃఖార్తులకు, శ్రమార్తులకు, తపస్వి జనులకు విశ్రాంతి కలిగించి, శాంతిని కలిగిస్తుందని భరతుడు అంటాడు -

దుఃఖార్తానాం శ్రమార్తానాం శోకార్తానాం తపస్వినామ్
విశ్రాంతి జననం కాలే నాట్యమేతత్ మయాకృతమ్

భరతుని నాట్యోత్పత్తి కథనుబట్టి నాటక బీజాలు వేదాలల్లోనే వున్నవని, వేదకాలంలోనే గానం, సంగీతం వుండేవని సంగీతానికి అనుగుణంగా నాట్యం చేయటం వుండేదని తెలుస్తున్నది. ఋగ్వేదంలో ఒకచోట ఉషస్సు వర్ణనలో ఉషస్సు ఒక నర్తకిగా ఉపమింపబడింది. దీన్ని బట్టి వేదకాలంలో నాట్యం ఏదో రూపంలో వుండేదని తెలుస్తున్నది. మాక్స్‌ముల్లర్, ఓల్డెన్‌బెర్గ్, దాస్‌గుప్తా వంటి విమర్శకులు భారతీయ నాట్యకళ వైదిక యుగం నుంచి క్రమంగా వికసించిందనే విశ్వసించారు. అంతేగాక ఋగ్వేదంలోని ఇంద్ర - మరుత్, విశ్వామిత్ర - నది, పురూరవ - ఊర్వశి, యమ- యమీ సంవాదాలల్లో నాటక సంభాషణల బీజాలు స్పష్టంగా కన్పిస్తున్నవి. ఈ సంవాదాలు అసలు అభినయ రూపంగా ధార్మిక ఉత్సవాలల్లో ప్రదర్శింపబడేవి కావచ్చును. నాటకానికి ప్రధానాంగాలైన సంభాషణలు, అభినయం, సంగీతం, నృత్యాదులు మనకు వేదాలల్లోనే దర్శనమిస్తున్నవి. కాబట్టి వైదిక కర్మకాండల సమయంలో నాటకాభినయం కూడా తత్ క్రియా కలాపాల్లో భాగంగా వుండేదన వచ్చును. కాత్యాయన శ్రౌత సూత్రంలో సోమపాన సమయంలో అభినయముండేదని చెప్పబడింది కూడా. యజ్ఞకర్మ సమయంలో శత్రు విజయాలు, మహాపురుషుల, మహావీరుల సాహస వీర కృత్యాలు అనుకరణ రూపంలో అభినయింపబడి స్మరింపబడేవి కూడా కావచ్చును. సముద్ర మథనం, త్రిపుర దాహం, కంసవధ, బలి బంధనం వంటి నాటకాలు ఇట్లానే ప్రదర్శింపబడేవి కావచ్చును. ఒకొకసారి శత్రు విజయానందోత్సవంగా నృత్యాభినయం, సామూహిక నృత్యాభినయం చేయబడేవి కావచ్చును. యజుర్వేదం వాజసనేయి సంహితను బట్టి ఆ కాలంలో "శైలూష" అనబడే జాతి నాట్యాభినయమే జీవికగా కలవారుండేవారని తెలుస్తున్నది. యజ్ఞ సమయంలో నృత్య గీతాదుల కొరకు సూత, శైలూష జాతివారు వియోగింపబడేవారని కూడా తెలుస్తున్నది. వీరు నృత్య సంగీతాలతో నాట్యాభినయం చేసేవారు. క్రమంగా సంస్కృత నాటక వికాస తరుణంలో వివిధ జాతులల్లో ప్రచలితమైన నృత్య నాట్యాభినయాలు కూడా తమ ప్రభావాన్ని విశేషంగా చూపి వుంటవి. ముఖ్యంగా అవైదికమతానుయాయులైన జనుల్లో వ్యాపించివున్న కళల ప్రభావం యాజ్ఞికాభినయం మీద పడి ఒక ప్రత్యేక కళగా వివిధ రూపక భేదాలతో నాటక కళ వికసించి వుంటుంది. బ్రహ్మ సృష్టించిన నాట్య వేదానికి శివుడు అధిష్ఠాన దేవత అయినాడనటం ఇదే ప్రభావాన్ని సూచిస్తున్నది.

# రూపకాల ప్రాచీనత

వేదాలల్లోనే రూపక తత్త్వాలన్నీ వున్నవని చెప్పుకొన్నాం. వేదాల తర్వాత బ్రాహ్మణ గ్రంథాలల్లో నృత్య, గీత, సంగీత శబ్దాలు చాలాసార్లు ప్రయోగింపబడి కన్పిస్తున్నవి సంహితా కాలంలో ఆరంభమైన రూపక కళ బ్రాహ్మణకాలంలో, ఇంకా బాగా వికసించింది. రామాయణ, మహాభారత కాలంలో రూపక కళ ఇంకా వికసించినట్లు వాటిల్లో దొరికే నాటక సంబంధ పారిభాషక పదాలే చెప్తున్నవి. రామాయణంలో నట, నర్తక, కుశీలవ, రంగస్థలాది నాటక పారిభాషిక పదాలు కన్పిస్తున్నవి. రామాయణ కాలంలో అయోధ్యా నగరంలో నాటక మండలులున్నట్లు తెలుస్తున్నది. అయోధ్యా కాండంలో నర్తకుల గోష్ఠిని గురించి ప్రసక్తివున్నది. "నారాజకే జనపదే ప్రహృష్ట నట నర్తకాః" - అరాజకమైన జనపదంలో నటులు, నర్తకులు సంతోషంగా వుండరు - అన్న వాల్మీకి మాటలను బట్టి ఆ కాలంలో నటులకు, నర్తకులకు సంఘంలో వున్న ఉన్నత స్థానాన్ని ఊహించవచ్చును. మహాభారతం విరాట పర్వంలో నట, నర్తక, నాయక, సూత్రధార, నర్తక శాలాది పారిభాషిక పదాలు ప్రయోగింపబడినవి. ఇక హరివంశంలో రామాయణ కథ మీద ఆధారపడిన నాటక ప్రదర్శన ప్రసక్తి కూడా వున్నది. పురుషులే స్త్రీ పాత్రలను ధరించే వారని అటువంటి నటులను "భుకుంశు" లని పిలిచేవారని హరివంశాన్ని బట్టి తెలుస్తున్నది.

పాణిని అష్టాధ్యాయిలో "పారాశర్య శిలాలిఖ్యాం భిక్షు నటసూత్రయోః" అని శిలాలి, భిక్షులు వ్రాసిన నట సూత్రాలను పేర్కొన్నాడు. ఈ నటసూత్రాలు నృత్య సంబంధమైనవి మాత్రమే అని వేబర్, స్టెన్ కోనోవ్‌లు తలంచారు. ఇవి నాటక సంబంధ లక్షణాలను చెప్పే సూత్రాలని సిల్విన్ లెవీ, హిల్లేబ్రాంట్‌లు అభిప్రాయపడినారు. భరతుడు తన నాట్యశాస్త్రంలో తనకన్న పూర్వులైన నాట్యశాస్త్రకారులను పేర్కొని వున్నాడు. కాని అవేవి మనకు దొరకలేదు. అదే విధంగా శిలాలి, భిక్షులు వ్రాసిన నటసూత్ర గ్రంథాలు భరతుని నాట్యశాస్త్రం వలె నృత్య, నాటక లక్షణాలను చెప్పే గ్రంథాలే అయివుంటవి. పాణిని నాటికి (క్రీ.పూ. 500) భారత దేశంలో నాట్యనాటక కళలు బాగా వికసించి శాస్త్రబద్ధం కూడా చేయబడినవని నటసూత్రాల ఉనికిని బట్టి తెలుస్తున్నది. మహాభాష్యకారుడు పతంజలి (క్రీ.పూ. 150) కంసవధ, బలిబంధన మన్న నాటకాలను పేర్కొన్నాడు. "ఘాతయతి, బంధయతి" అన్న వర్తమాన క్రియా రూపాలను పతంజలి పేర్కొనటాన్ని బట్టి ఆ నాటకాలు మరుగునపడినవి కాక ఆ కాలంలో ప్రదర్శింపబడేవని స్పష్టమౌతున్నది. క్రీ.పూ. 200 నాటిదైన ఒక నాటకశాల నాగపూర్ సమీపంలోని పర్వతం మీద రాతిలో తొలిచింది

దొరికింది. కాని భారతదేశంలో గ్రీసు, రోమ్ దేశాలల్లో వలె భవ్యమైన ప్రాచీన నాటకశాలలు ఎక్కడ తవ్వకాలల్లో బయటపడలేదు. దానికి కారణాలు ఇవి కావచ్చును - ఒకటి - దేవోత్సవాది సమయాలల్లో తాత్కాలికంగా నిర్మింపబడిన రంగస్థలం మీదనో లేక బయలు ప్రదేశంలోనే ఎక్కువగా నాటకాలు ప్రదర్శింపబడేవి. రెండు -భరతుడు వివరించిన నాటకశాలల నిర్మాణం పట్టణాలల్లో, రాజభవనాలల్లో వుండేవేమో. వాటి అవశేషాలు కూడా మనకు దొరకలేదు. అవి ఎక్కువ కాష్ఠనిర్మితాలై, కాష్ఠ శిల్పాలంకృతాలై వుండటంచేత అవశేషాలు మిగులనంతగా నష్టమై వుంటవి. కావ్యనాటకాదుల్లో మాత్రం మనకు నాటకశాలల ప్రసక్తి చాలా కన్పిస్తున్నది. క్రీస్తుపూర్వం వ్రాయబడిన బౌద్ధ గ్రంథాలను బట్టి నాటకప్రదర్శన కళ బాగా వికసించి వ్యాప్తిలో వున్నట్లు తెలుస్తున్నది. వినయపిటకానికి సంబంధించిన "చల్లవగ్గ" లోని ఒక కథలో "అశ్వజిత్, పునర్వసు" అనే భిక్షువులు కీటగిరిలోని నాటకశాలలో అభినయం చూచి తర్వాత ఆ నర్తకితో ప్రేమలాపాలు సాగించారని తెలిసి మహా స్థవిరుడు వారిని విహారం నుంచి బహిష్కరించాడని వున్నది. మౌర్యుల కాలంలో వ్రాయబడిన అర్థశాస్త్రంలో లలితకళలు, వాటిని అభ్యసించే వారికి ప్రభుత్వం ఇచ్చే రక్షణలు గురించి చెప్పబడింది. నట, నర్తక, గాయక, వాదక, కుశీలవాదుల సమాజాలుండేవని అర్థశాస్త్రాన్ని బట్టి తెలుస్తున్నది. వీరు తమ విద్యలనే జీవనోపాధిగా బ్రతికేవారు. వీరు తమ ఆదాయంలో కొంత భాగాన్ని ప్రభుత్వానికి పన్నుగా కూడా ఇచ్చేవారు. క్రీ.శ. ప్రథమ శతాబ్ది వాడైన వాత్స్యాయనుడు తన కామసూత్ర గ్రంథంలో నాగరికుల మనోరంజనానికై కుశీలవులు నాటకాన్ని ప్రదర్శించటాన్ని పేర్కొన్నాడు. తర్వాత కావ్య నాటకాదుల్లో నాటక సంగీత శాలలు చాలాసార్లు పేర్కొనబడినవి. ఈ ఆధారాలను బట్టి భారతదేశంలో నాటకకళ స్వతంత్రంగా వైదిక కాలంలోనే పుట్టి క్రమక్రమంగా వికసించి భరతుని నాటికి సంపూర్ణ రూపు రేఖలతో స్థిరపడి క్రీ.పూ. ప్రథమ శతాబ్ది నాటికి భాస సౌమిల్ల కాళిదాసుల్లో ఉన్నత శిఖరాలను అందుకొన్నది.

## రూపక భేదాలు

ఇంగ్లీషులోని డ్రామా (Drama) పదానికి సమానార్థకంగా ప్రయోగించబడేది "రూపక" పదం. నటులు ఆయా పాత్రల రూపాలను ఆరోపించుకొని అభినయిస్తారు కాబట్టి దీనికి రూపకమనే పేరు కలిగింది. నాటకమన్నది ఈ రూపక భేదాలల్లో ఒకటి. కాని ఇప్పుడు రూపక పదం ఎక్కువ ప్రచారంలో లేదు. డ్రామా పదానికి సమానార్థకంగా నాటక పదమే వాడబడుతున్నది. నాటకమన్న పదమే ఇప్పుడు ఎక్కువ ప్రచారంలో వున్నది.

అందుకే అంతటా రూపక, నాటక పదాలు పర్యాయ పదాలుగా వాడబడినవి. రస, వస్తు, నాయకాది భేదాలనుబట్టి ప్రాచీన కాలంలో రూపకాలు అనేక విధాలుగా విభజింపబడినవి. రూపక, ఉపరూపకాలని మొత్తం రూపక సాహిత్యమంతా స్థూలంగా రెండు విధాలుగా విభజింపబడింది. అందులో రూపకాలు పదిరకాలుగా వున్నవి -

1. **నాటకం :-** నాటకమనే రూపక భేదంలో కథ అంటె ఇతివృత్తం ప్రసిద్ధమైంది వుండాలి. కాని కవి రసానుకూలంగా కథౌచిత్యం కొరకు మార్పులు చేర్పులు చేయవచ్చును. నాయకుడు ధీరోదాత్తుడు, క్షత్రియుడు, ప్రసిద్ధ రాజ వంశజుడై వుండాలి. అంగిరసం శృంగారం లేక వీరం వుండాలి. ఉత్తర రామచరిత్ర నాటకంలో కరుణరసం అంగిరసం. కొందరు విమర్శకులు నాటక లక్షణానికి విరుద్ధమనేమో దాన్ని కరుణరసంగా కాక విప్రలంభ శృంగారంగా గుర్తించారు. నాటకం రూపకాలన్నిటిలో బృహత్కాయం కలది. దీనిలో 5 నుంచి 10 వరకు అంకాలుంటవి. ఒకే సమయంలో రంగస్థలం మీద నాలుగైదు పాత్రలకన్న ఎక్కువ వుండరాదు. ప్రతి అంకంలో నాయకుడు లేకపోతే నాయిక కనిపించాలి. ప్రతి అంశం పరోక్షంగానైనా అపరోక్షంగానైనా నాయకునికి సంబంధించిన ఇతివృత్తాన్ని ప్రదర్శించాలి. నాటకం దశవిధ రూపకాలల్లో ఎక్కువ ఆదరణీయమైన ప్రసిద్ధమైన భేదం.

2. **ప్రకరణం:-** దీనిలో కథ ప్రసిద్ధమైందికాక కల్పితమైంది వుంటుంది. నాయకుడు రాజవంశీయుడుగాని బ్రాహ్మణుడుగాని వైశ్యుడుగాని మంత్రి కుమారుడు గాని వుండవచ్చును. అతడు ధీరప్రశాంతుడు. నాయిక కులీనురాలుగాని వేశ్యా స్త్రీ గాని లేక ఇద్దరూ గాని వుండవచ్చును. అంగిరసం శృంగారం. నాందీ ప్రస్తావన సంధి సంధ్యంగాలన్ని నాటకంలోవలెనే వుంటవి. ఇది నాటకంవలె ఉదాత్త గంభీరమైంది కాక సామాన్యజీవితానికి సంబంధించిందిగా వుంటుంది. ఇది నాటిక అనే ఉపరూపక భేదం, నాటక ప్రక్రియలకు మధ్యరకమైంది. నాటకంలోవలె ప్రకరణంలో 5 నుండి 10 అంకాలుంటవి. ప్రకరణంలో నాటికలో వలె ఇతివృత్తం తేలికగా ఉంటుంది.

3. **భాణం:-** దీనిలో ఒకే ఒక అంశం వుంటుంది. ఒకే ఒక పాత్ర వుంటుంది. ఆ పాత్ర చతురవ్యక్తిగాని పండితుడు గాని విటుడుగాని అయివుండాలి. అతడు రంగస్థలం మీదికి వచ్చి తాను అనుభవించిన లేదా ఇతరులచేత అనుభూతమైన ధూర్త చరిత్రను వర్ణించి చెప్తాడు. అంగిరసం శృంగారం లేక వీరం. ఆకాశభాషణం సహాయంతో సంభాషణను నడుపుతుంటాడు. ఇది ఆధునిక యుగంలోని ఏకపాత్రాభినయం (Mono-acting) వంటిది.

4. ప్రహసనం:- దీనిలో ఒకటి లేదా రెండు అంకాలుంటవి. హాస్య రసం ప్రధానమైంది. ఇతివృత్తం కల్పితమైంది. నాయకుడు బ్రాహ్మణుడు, సన్యాసి, రాజు, విటుడు - వీరిలో ఎవడైన ఒకడు కావచ్చును. మిగతా పాత్రలన్నీ కూడా విటులు, భిక్షకులు, వేశ్యలు, సేవకులు మొదలైనవారుంటారు. సంస్కృతంలో కొన్ని ప్రహసనాలు సమకాలీన సాంఘిక జీవితాన్ని ప్రతిబింబింపజేసేవిగా, సహజపాత్ర చిత్రణతో వున్నవి. ఉదాత్త గంభీరమైన నాటక ప్రక్రియకన్న ప్రకరణ, ప్రహసనాలు ప్రజల నిత్య జీవితానికి దగ్గరగా వున్న ఇతివృత్తంతో కూడి సమకాలిక జీవితాన్ని తెలుసుకోవటానికి అనువైన గ్రంథాలుగా వున్నవి. వీటిల్లో ఇతివృత్తం, కథాకథనాలు, పాత్రలు మూసలో పోసినట్లుగా కాక వైవిధ్యంతో వాస్తవికతకు దగ్గరగా వుండి ప్రేక్షక పాఠకులను అలరిస్తున్నవి. ఉదాత్తగంభీరమైన నాటక ప్రక్రియ గ్రీకు tragedy నాటకానికి దగ్గరగా వుండగా ప్రకరణ ప్రహసన రూపకాలు గ్రీకు comedy నాటకాలకు దగ్గరగా వున్నవని చెప్పవచ్చును.

5. డిమం:- దీనిలో 4 అంకాలుంటవి. కథ ప్రసిద్ధమైందిగా వుండాలి. పాత్రలు గంధర్వ యక్ష రాక్షస నాగాది మర్త్యేతర జాతులకు చెందినవారు. భూత ప్రేత పిశాచాది పాత్రలుండవచ్చును. దీనిలో 16 పాత్రలుండాలి. వీరు ఉద్ధత స్వభావం కలవారై వుంటారు. దీనిలో ఇంద్రజాలం, మాయ, యుద్ధం, సూర్యచంద్ర గ్రహణాది దృశ్యాలుంటవి. నాందీ ప్రస్తావనలు నాటకంలో వలె వుంటవి. 'డిమ' ధాతువుకు సంఘాతమని అర్థం. నాయకుల సంఘాతం జరుగుతుంది కాబట్టి ఈ రూపక ప్రక్రియకు ఈ పేరు వచ్చింది. శృంగార హాస్యాలు కాక మిగతా రసాలల్లో ఏదైనా ఒకటి ప్రధానంగా వుండవచ్చును.

6. వ్యాయోగం:- దీనిలో ఒకే ఒక అంకముంటుంది. రసపోషణ డిమంలో వలె జరుగుతుంది. కథ ప్రసిద్ధమై వుంటుంది. ఉద్ధతుడైన వ్యక్తిని ఆశ్రయించి ఇతివృత్తముంటుంది. దీనిలో యుద్ధముంటుంది. అది స్త్రీ కొరకుగాని లేక ఏ కారణం కొరకైనా గాని కావచ్చును. పురుష పాత్రలు అధికంగా వుంటవి. ఒక్క రోజు జరిగిన సంఘటన మాత్రమే వుంటుంది.

7. సమవకారం:- దీనిలో 6 అంకాలుంటవి. పన్నెండు నాయక పాత్రలుంటవి. వారు పురాణ ప్రసిద్ధులైన పురుషులై వుంటారు. ప్రస్తావన నాటకంలోవలె వుంటుంది. దీనిలో కథ దేవతలకు దైత్యులకు సంబంధించిందై వుంటుంది. ప్రధాన రసం వీరం. దేవదానవుల సముద్రమథనంవంటి ఇతివృత్తం దీనికి తగింది.

**8. వీథి :-** దీనిలో ఒకే ఒక అంకం వుంటుంది. ఒకటి లేక రెండు పాత్రలుంటవి. శృంగారాది రసాలు సూచ్యంగా మాత్రమే వుంటవి.

**9. అంకం:-** దీనిలో ఒకే ఒక అంకం వుంటుంది. కథ ప్రసిద్ధమై వుంటుంది. కథలో కవి మార్పు చేయవచ్చును. అంగిరసం కరుణం. దీనికి ఉత్సృష్టాంకమని కూడా పేరు. స్త్రీరోదనం ప్రధానంగా వుంటుంది.

**10. ఈహామృగం:-** దీనిలో 4 అంకాలు వుంటవి. కథ ప్రసిద్ధం కొంత, కల్పితం కొంత వుంటుంది. నాయక ప్రతినాయకులు పురాణ ప్రసిద్ధులై వుంటారు. వారు నరులు, దేవతలు కావచ్చును. ప్రతినాయకుడు తనయందు అనురాగంలేని స్త్రీని ఎత్తుకొని పోదలుస్తాడు. నాయకుడు ప్రతినాయకుని అడ్డగిస్తాడు. కాని వధించకూడదు. అలభ్యమైన నాయికను పొందాలని ప్రతినాయకుడు మృగం వలె ఇచ్ఛగిస్తాడు. కాబట్టి ఈ రూపక భేదానికి ఈహామృగమని పేరు కలిగింది.

ఈ ప్రసిద్ధమైన దశవిధ రూపక భేదాలు కాక 18 రకాలైన ఉపరూపక భేదాలు కూడా వున్నవి. వాటిల్లో నాటిక, సట్టకం, త్రోటకం ప్రేక్షణకం, ప్రకరణిక ప్రసిద్ధమైనవి. నాటిక నాటక లక్షణాలను కలిగిందే కాని దానిలో 4 అంకాలు మాత్రమే వుంటవి. కథ ప్రేమకథ వుంటుంది. నాయకుడు రాజు. భార్య వుండగా అతడు మరో స్త్రీని ప్రేమించి చిక్కులపాలు కావటం చివరకు భార్యరాణి రాజు ప్రేయసిని మన్నించి వారిద్దరికి వివాహం చేయటం దీనిలో వుంటుంది. నాటిక తేలికపాటి వృత్తాంతంతో ప్రేక్షకులను ఆలరిస్తుంది. ఇది పాశ్చాత్యుల comedy ప్రక్రియకు దగ్గరిగా వుంటుందని చెప్పవచ్చును. కాని సంస్కృత నాటికలన్నీ మూసపోసినట్లుగా ఒక్కరకమైన ఇతివృత్త నిర్వహణతో కూడి కొత్తదనం లేకుండా తయారైనవి. నాటికలో స్త్రీపాత్ర లెక్కువ. నాయకుడు ధీరలలితుడు. నాయిక ముగ్ధ. అంగిరసం శృంగారం. నాందీ ప్రస్తావన సంధి సంధ్యంగాలన్నీ నాటకంలోవలెనే ఉంటవి. సట్టకం పూర్తిగా నాటికవలెనే వుంటుంది. కాని ఇది ప్రాకృతభాషలో వుంటుంది. రెండిటికి అదే భేదం. రాజ శేఖరుని కర్పూరమంజరి సట్టకం. త్రోటకం నాటిక వంటిదే కాని నాయికానాయకులు దివ్యాదివ్యులై వుంటారు. అంటె దీనిలో దివ్యమానుష సంగమముంటుంది. దీనిలో 5 నుంచి 9 వరకు అంకాలుంటవి. ప్రతి అంకంలో విదూషకుడుంటాడు. కాళిదాసు విక్రమోర్వశీయం త్రోటకం. కాని దీని ప్రథమ చతుర్థాంకాలల్లో విదూషక పాత్ర లేదు. ప్రేక్షణంలో ఒకే ఒక అంశం వుంటుంది. నీచ

నాయక ప్రసక్తి వుంటుంది. బలివధ, త్రిపురమర్దనం, నృసింహ విజయం వంటివి ప్రేక్షణభేదానికి చెందినవి. నాట్యరాసకంలో కల్పిత కథ వుంటుంది. దీనిలో ఒకే ఒక అంకం వుంటుంది. నాయకుడు ధీరోదాత్తుడు. నాయిక వాసకసజ్జిక. అంగిరసం శృంగారం. అంగరసం హాస్యం. ఇది నాట్యరూపకం వంటిది. ప్రకరణిక నాటికవంటిదే కాని దీనిలో నాయికా నాయకులు వైశ్యజాతికి చెందినవారై వుంటారు. ఇంకా హల్లీసకం, గోష్ఠి ప్రస్థానకం, ఉల్లాప్యం, కావ్యం, ప్రేంఖణం, రాసకం, సంలాపకం, శ్రీగదితం, శిల్పకం, విలాసిక, దుర్మల్లిక, భాణిక వంటి ఉపరూక కాలున్నవి. ఇవి చాలామట్టుకు ఈనాటి సంగీతనాట్యరూపకాల (ballet) వంటివి.

ఈ విధంగా అనేక రూపక, ఉపరూపక భేదాలను లాక్షణికులు పేర్కొన్నారంటె ఈ రూపకాలు సూక్ష్మాతి సూక్ష్మభేదాలతో ప్రాచీన కాలంలో బాగా ప్రచలితమై వుండేవని చెప్పవచ్చును. భరతుడు చెప్పిన దశవిధరూపకాలను ఈ కింది విధంగా విభజించ వచ్చును -

1. ఒక్క అంకం కలవి - భాణం మొ॥వి. ఇవి ఏకపాత్రాభినయం వంటివి.
2. ఒక్క అంకం కలవి - ఒకటి లేక రెండు పాత్రలు కలవి. వీథి మొ॥వి.
3. ఒక్క అంకం కలవి - అనేక పాత్రలు కలవి. వ్యాయోగం, ప్రహసనం, అంకం వంటివి.
4. మూడు లేక నాలుగు అంకాలు కలవి - అనేక పాత్రలు కవి. సమవకారం, డిమం, ఈహామృగం మొ॥వి.
5. ఐదు నుంచి పది అంకాలు కలవి - అనేక పాత్రలు కలిగి సంధి సంధ్యంగాలతో కూడిన నాటకం, ప్రకరణం మొ॥వి.

అంకాల సంఖ్య, పాత్రల సంఖ్యనుబట్టి, ఇట్లా విభజించి పరిశీలించినట్లయితే సంస్కృత నాటక క్రమవికాసం స్పష్టంగా అవగాహన కాగలదు.

# భాసుడు

## భాసుని కర్తృత్వం

టి. గణపతిశాస్త్రి క్రీ.శ. 1909లో కేరళలో భాసుని నాటకాల హస్తలిఖిత ప్రతులను కనుక్కునేంతవరకు భాసుడు మనకు నామమాత్రంగానే పరిచితుడైన నాటకకారుడు. కన్యాకుమారికి 20 మైళ్ళ దూరంలోవున్న పద్మనాభపురం సమీపంలోని మణలిక్కరమఠంలో

మహామహోపాధ్యాయ టి. గణపతిశాస్త్రికి భాసుని నాటకాలు పది మళయాళ లిపిలో దొరికినవి. ఈ లిఖిత ప్రతులు 300 సంవత్సరాల పాతవట. తర్వాత ఈయనకే త్రివేంద్రం ప్యాలెస్ లైబ్రరీలో మరి రెండు నాటకాలు దొరికినవి. మద్రాస్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరీలోను మళయాళ లిపిలోనే భాసుని అభిషేక, ప్రతిమా, స్వప్న వాసవదత్త లిఖిత ప్రతులు దొరికినవి. దేవనాగర లిపిలో ఒక ప్రతి కూడా దొరకలేదు. గణపతిశాస్త్రికి దొరికిన 13 భాసుని నాటకాలను "త్రయోదశ త్రివేంద్ర నాటకాని" పేరుతో క్రీ.శ. 1912-13లో త్రివేంద్రం నుంచి ప్రచురించాడు. వెంటనే ఇవి ప్రపంచంలోని సంస్కృతజ్ఞులందరి దృష్టిని ఆకర్షించినవి. అప్పటినుంచి భాసుడు సంస్కృతంలో మొదటి నాటకకారుడుగా కీర్తిని గడించాడు. "ప్రథితయశసామ్ భాస సౌమిల్ల కవిపుత్రాదీనామ్ ప్రబంధాన్...." అని కాళిదాసు మాళవికాగ్నిమిత్రంలో స్మరించిందాన్నిబట్టి భాసుడు కాళిదాసు నాటికి ప్రసిద్ధ నాటకకారుల్లో ఒకడుగా పేరు సంపాదించాడని తెలుస్తున్నది. బాణ, దండి, రాజశేఖర, జయదేవాది కవులు భాసున్ని ప్రశంసించారు. వామన, అభినవగుప్త, రామచంద్ర గుణచంద్రాది ఆలంకారికులు భాసున్ని ఉద్ధరించారు. "సూత్రధారునిచేత ఆరంభింపబడిన భూమికాయుక్తమైన పతాకా శోభితమైన నాటకాలవల్ల భాసుడు గొప్ప యశస్సును సంపాదించాడ"ని బాణుడు ప్రశంసించాడు -

సూత్రధార కృతారంభై ర్నాటకైర్బహు భూమికై :
సపతాకై ర్యశో లేభే భాసో దేవకులై రివ.

దండి " అవంతి సుందరీ కథ" లో భాసుని సులక్షణ లక్షితమైన నాటకాలను ఇట్లా ప్రశంసించాడు -

సువిభక్త ముఖాద్యంకై ర్వ్యక్త లక్షణ వృత్తిభి:
పరతోzపి స్థితో భాసః శరీరై రివ నాటకై :

ప్రాకృత కవి వాక్పతి రాజా భాసున్ని ఇట్లా స్తుతించాడు -

భాసమ్మి జలణమిత్తే కంతీ దేవే అజస్సరహు ఆదే
సో బంధదే అ వందమ్మి హరియందే ఆ ఆణం దో.

జయదేవుడు "భాసో హాసః కవి కులగురుః కాళిదాసో విలాసః" అని కాళిదాసును కవితా కామిని విలాసంగా చెప్పి భాసున్ని కవితా కామిని హాసంగా వర్ణించాడు.

టి. గణపతి శాస్త్రి గారి నాటక ప్రచురణతో ప్రాచీన కవి పండితులచేత పొగడ్తల

నందుకొన్న భాసుని కవిత్వం ఎట్లాంటిదో ఆధునిక పాఠకులకు తెలియవచ్చింది. కాని గణపతి శాస్త్రి ప్రచురించిన నాటకాలు నిజంగా భాసునివేనా అన్న అనుమానం చాలా మంది పండితులకు కలిగింది. ఆ నాటకాలు భాసునివి అవునా? కాదా? అన్న విషయంలో విమర్శకుల్లో పెద్ద దుమారం లేచింది. బ్యార్నెట్, స్టెన్‌కోనో, సిల్వాలెవీ, పి.వి. కాణే, కున్హన్ రాజా, కుప్పు స్వామి శాస్త్రి, దేవధర్ వంటి ప్రముఖ విమర్శకులు అసలు ఈ నాటకాలు భాసునివి కావనే అన్నారు. వింటర్‌నిట్స్, సుఖ్తంకర్, డే మొదలైన విమర్శకులు కొన్ని నాటకాలను భాసునివని అంగీకరించారు. లభ్యమైన నాటకాలు భాసుని రచనలు కావని అనేవారు చూపే తర్కాలివి -

1) రాజశేఖరుడు సూక్తి ముక్తావళిలో భాస నాటకచక్రంలో స్వప్న వాసవదత్త అగ్ని పరీక్షను తట్టుకొని నిలవటాన్ని గూర్చి ప్రసంగించాడు -

భాస నాటక చక్రే ఽపి చ్ఛేకై : క్షిప్తే పరీక్షితుమ్
స్వప్న వాసవదత్తస్య దాహకో ఽ భూన్న పావకః

అయితే రాజశేఖరుడు తప్ప మరెవ్వరూ భాసున్ని స్వప్న వాసవదత్త కర్తగా పేర్కొనలేదని, రాజశేఖరుని ఉక్తిని ఆధారంగా తీసుకొని అది భాసుని రచన అని విశ్వసించటానికి వీల్లేదని కొందరు విమర్శకులు తలంచారు. కాని ఇది సరికాదు. రాజశేఖరుడే కాక అభినవ గుప్త, భోజదేవ, సాగర నంది, రామచంద్ర గుణచంద్ర, శారదా తనయాది ఆలంకారికులు స్పష్టంగా స్వప్నవాసవదత్త భాసుని కృతిగా పేర్కొని శ్లోకాలను ఉద్ధరించారు.

2) అభినవ గుప్త, రామచంద్ర గుణచంద్రులు ఉద్ధరించిన శ్లోకాలు ఇప్పుడు లభించే స్వప్న వాసవదత్తలో లేవు. కాబట్టి ఇప్పుడు లభించిన నాటకం భాసునిది కాదని లేవీ వంటి విమర్శకుల అభిప్రాయం. పై ఆలంకారికులు ఉద్ధరించిన శ్లోకాలు ఇప్పుడు లభించే స్వప్న వాసవదత్తలో లేవు కాని లేఖకుల పొరపాట్ల వల్లనో మరే కారణం వల్లనో ఆ శ్లోకాలు ప్రస్తుతం లభించిన ప్రతి నుంచి తప్పిపోయి వుంటవి.

3) పల్లవ రాజు మహేంద్రవర్మ (క్రీ.శ. 620) మత్త విలాసమనే ప్రహసనాన్ని వ్రాసాడు. ఆ ప్రహసనంలోని ఒక శ్లోకాన్ని కథాసరిత్సాగరకారుడు సోమదేవుడు భాస విరచితంగా పేర్కొన్నాడు. భాసుని 13 నాటకాలల్లోను మరియు మత్తవిలాస ప్రహసనం లోను ఒక్క విధంగా ఆరంభంలో "నాంద్యంతే తతః ప్రవిశతి సూత్రధారః" అన్న వాక్యం

ప్రయోగింపబడింది. అంటె మంగళాచరణం చేయకుండానే నాంది తర్వాత సూత్రధారుని ప్రవేశాన్ని గురించి చెప్పబడింది. దీన్నిబట్టి ఈ 13 నాటకాలను మత్తవిలాస ప్రహసనాన్ని కేరళ నివాసి ఎవరో వ్రాసి వుంటాడని కొందరు విమర్శకులు తలంచారు. ఇది చాలా హాస్యాస్పదమైన అభిప్రాయం. ఒకటి - ప్రసిద్ధంగా మత్తవిలాస కర్త మహేంద్రవర్మ అని అందరూ అంగీకరించారు. మరొకటి- మత్త విలాసంలోని భాషా శైలికిన్ని ఈ 13 నాటకాల భాషా శైలికిన్ని ఎక్కడా సామ్యం లేదు. ఇవేగాక లభించిన నాటకాలు భాసునివి కావనటానికి ఇంకా కొన్ని తర్కాలు చూపబడినవి -

1) పదమూడు నాటకాలల్లో ఎక్కడా భాసుని పేరు చెప్పబడలేదు.

2) ఈ నాటకాలు కేరళలో చాక్యారులనే నటులు ప్రదర్శించే నాటకాలను పోలివున్నవి. కాబట్టి చాక్యారుల ప్రదర్శనార్థమై కేరళకవి ఎవరో ఈ నాటకాలను వ్రాసివుంటాడు.

3) సాంప్రదాయంగా సంస్కృత నాటకాలల్లో కనబడే నాటక ధర్మాలకు ఇవి విరుద్ధంగా వున్నవి.

కొందరు విమర్శకులు ఈ నాటకాలు భాసునివి కావని నిరాకరించక మధ్య మార్గాన్ని అవలంబించారు - లభించిన నాటకాలు భాసుని మూల నాటకాలకు సంక్షిప్త రూపాలని వరదాచారి అభిప్రాయపడినాడు. నాటకాల చివర స్మరింపబడిన రాజసింహుడు క్రీ.శ. 6,7 శతాబ్దాలల్లో దక్షిణదేశాన్ని పాలించిన రాజసింహ బిరుదాం కితుడైన పల్లవ నరసింహవర్మ అని, అతని కాలంలోనే భాసుని నాటకాలు రంగస్థల ప్రదర్శనకు యోగ్యంగా మలచబడినవని, పల్లవరాజ్య పతనానంతరం ఈ నాటకాలు కేరళ దేశానికి తీసుకొని పోబడి అక్కడ సురక్షితంగా వుండి నష్టం కాకుండా దొరికినవని వరదాచారి తలంచాడు. భాసుని మూలనాటకాలకు ఇవి సంక్షిప్తరూపాలనే విషయాన్ని ఎస్.ఎన్.దాస్‌గుప్తా కూడ సమర్థించాడు. ఇప్పుడు లభించిన నాటకాలు కొంతభాగమే భాసుని కృతులని, కేరళకవి ఎవ్వరో భాసుని కృతులకు రూపాంతరాలుగా ఈ కృతులను రచించాడని మహామహోపాధ్యాయ రామావతారశర్మ అన్నాడు. ఈ నాటకాలు కేరళలో చాకార్యులు ప్రదర్శించే నాటకాలకు అనుగుణంగా వారి ప్రదర్శనకు యోగ్యంగా రూపాంతరాలు చెందినవని, అందుకే ఈ నాటకాలు కేరళలో సురక్షితమై దొరికినవని ఆయన అభిప్రాయం. కేరళలో ఈ నాటకాలు "చాక్యారు"ల చేత ప్రదర్శింపబడిన మాట నిజమే అయినా వారి ప్రదర్శనకు యోగ్యంగా

మూల నాటకాలు పూర్తిగా రూపాంతరం చెందినవని, ఆంశికంగా మాత్రమే ఇవి భాస కృతులనటం సత్యదూరం. మూల నాటకాలు తప్పక కాలగతిలో, మరియు ప్రదర్శనకు యోగ్యంగా వుండటానికై మార్పును చెంది వుంటవి. వందల సంవత్సరాల నుంచి ఈ నాటకాలు మార్పుకు గురికాకుండా మూల రూపంలోనే వున్నవనటం అతిశయోక్తియే అవుతుంది. అదీగాక ఇప్పుడు లభించిన నాటకాలల్లో ఎన్నో అసంపూర్తిగా వున్నవి, లోపాలు కూడ వున్నవి. ఉదాహరణకు ప్రతిజ్ఞా యౌగంధరాయణం ప్రస్తావనలో అది ప్రకరణంగా చెప్పబడినా దానిలో నాలుగే అంకాలున్నవి. చారుదత్త నాటకంలో నాలుగు అంకాలున్నా కథ అసంపూర్ణంగా కన్పిస్తున్నది. మరి కొన్ని నాటకాలల్లో విషయ సమర్పణ అంత స్పష్టంగా లేదు నిజమేకాని అంతమాత్రం చేత ఈ నాటకాలు భాసునివి కావే కావనటం సమంజసం కాదు. ఈ నాటకాలన్ని ఏకకవికృతాలనటం నిస్సంశయం. దానికి కింది బలమైన ఆధారాలు చూపవచ్చును-

1) నాటకాలన్నీ "నాంద్యంతే తతఃప్రవిశతి సూత్రధారః" అని అనటంతో ఆరంభమౌతున్నవి. తర్వాత నాటకకారులవలె ఈ కవి నాందీశ్లోకాలను వ్రాయలేదు. బాణుడు భాసున్ని ప్రస్తుతిస్తు " సూత్రధార కృతారంభైః" అని అతని నాటకాల విశేషతను గురించి చెప్పింది ఇదే కావచ్చును.

2) 'ప్రస్తావన' - 'స్థాపన' అని పిలువబడింది. తరువాతి నాటకకారులు 'స్థాపన' అని కాక 'ప్రస్తావన' పదాన్నే వాడారు.

3) ప్రస్తావనలో నాటకకారులు తమ పేరును, తమ పరిచయాన్ని ఇయ్యటం వుంటుంది. కాని వీటిల్లో కవి ఎక్కడా తన పరిచయాన్ని ఇయ్యలేదు.

4) ప్రతి నాటకం భరతవాక్యంలో "ఇమామపి మహీం కృత్స్నాం రాజసింహః ప్రశాస్తునః" అనే వాక్యాన్ని గాని లేక సమానార్థక వాక్యాన్ని గాని ప్రయోగించాడు.

5) నాటకాలన్నిటిలో సన్నివేశ, భావసామ్యాలు వున్నవి. కొన్ని నాటకాల ఆరంభంలో ముద్రాలంకారం గల శ్లోకం సమానంగా కన్పిస్తున్నది.

6) అన్ని నాటకాల్లోని భాష, శైలి, ఛందస్సులు ఒక్కతీరుగ వున్నవి. అపాణినీయ ప్రయోగాలెన్నో వున్నవి. భరతుని నాట్యశాస్త్రంలోని నాటక లక్షణాలు కొన్ని వీటిల్లో పాటింపబడలేదు. భరతుడు ప్రదర్శనకు అయోగ్యం అని చెప్పిన యుద్ధం, వధ,

మరణాదులు రంగస్థలం మీద చూపబడినవి. ఇవి ఈ నాటకాల ప్రాచీనతను ప్రదర్శిస్తున్నవి.

7) దుర్యోధన, కర్ణ, కైకేయి, కంస, రావణాది పాత్రలు ఈ నాటకాలల్లో సానుభూతిపూర్వకంగా చిత్రింపబడినవి. మహాభారత, రామాయణాలల్లో కనిపించే ప్రతినాయక లక్షణాలు వీరిలో లేవు.

పై కారణాలచేత ఈ పదమూడు నాటకాలు ఒక్క కవి వ్రాసినవే అని నిస్సందేహంగా నిర్ణయించవచ్చును. ఆ ఒక్క కవి భాసుడే అని చెప్పటానికి కొన్ని ఆధారాలను కూడా చూపవచ్చును.

1) ప్రస్తావనలో ఎక్కడా నాటకకర్త పేరు చెప్పబడలేదు. అంటె కాలయంత్రంలో పడి కవి పేరు తొలగిపోయినా పోయివుంటుంది. లేదా తర్వాత నాటకకారులు కొందరు తమ పేరును ప్రస్తావనలో పేర్కొననట్లే భాసుడు కూడ పేర్కొనలేదేమో.

2) దక్షిణ భారతంలో సంస్కృత సాహిత్య సృష్ట్యారంభం దాదాపుగా క్రీ.శ. 6వ శతాబ్దం నుంచి జరిగిందని పండితుల అభిప్రాయం. అందులో కేరళ దేశంలో సంస్కృత రచన ఇతర ప్రాంతాలకన్న అర్వాచీనమైంది. లభించిన 13 నాటకాలు అర్వాచీనాలు అని వాటిల్లోని అనేక లక్షణాలను బట్టి చెప్పటానికి వీల్లేదు. భాష, శైలి, పదప్రయోగాలు, నాటకధర్మాలు అన్నీ ఆ నాటకాలు ప్రాచీనమైనవనే చాటుతున్నవి. అటువంటప్పుడు "చాక్యారుల" ప్రదర్శనార్థమై కేరళ కవి ఎవ్వరో ఈ నాటకాలను వ్రాసాడన్న వాదంలో బలం లేదు. భాసుని నాటకాలను ఆధారంగా తీసుకొని తర్వాత కవులు కొన్ని నాటకాలను వ్రాసారనటంలో మాత్రం సందేహం లేదు.

3) సాంప్రదాయికమైన నాటక ధర్మాలు వీటిలో లేవంటే అదే వాటి ప్రాచీనతను చాటుతున్నదని తెలుసుకోవాలి. కాని భాసుని నాటకాలు కావనటానికి అది బలమైన ఆధారం కాదు.

4) భామహ, వామన, భోజరాజ, సాగరనంద్యాది ఆలంకారికులు భాసుని పేరును చెప్పకుండా భాసుని నాటకాలల్లోని సన్నివేశాలను, శ్లోకాలను ఉదాహరించారు. ఆ నాటకాలు భాసుని రచనలుగా లోకంలో ప్రసిద్ధమై వుండటంచేత ప్రత్యేకంగా వారు వాటిని భాసకృతాలని చెప్పటం అనవసరమని అనుకొనివుంటారు.

స్వప్నవాసవదత్త భాసుని కృతి అనటం ప్రసిద్ధం. స్వప్నవాసవదత్త నాటకంలోని నాటకకళ, ప్రాకృత సంస్కృత భాషలు, పదప్రయోగాలు, శైలి, ఛందస్సు, భావాలతీరులే మిగిలిన 12 నాటకాలల్లోను కన్పిస్తున్నవి. కాబట్టి గణపతిశాస్త్రికి దొరికిన 13 నాటకాలు భాసుని నాటకాలుగానే గుర్తించవచ్చునని కీథ్ అభిప్రాయం. భాసుని రచనలు కావనే బలమైన ఆధారాలు దొరకనంతవరకు మనం ఆ నాటకాలను భాసుని రచనలుగా చెప్పటమే సమంజసం.

## భాసుని కాలం

భాసుని కాలమిది అని నిర్ణయించి చెప్పడానికి ఆధారాలేవి లేవు. కాళిదాసు ఇతన్ని స్మరించటంచేత ఇతడు కాళిదాసుకు పూర్వుడని మాత్రం నిశ్చయంగా చెప్పవచ్చును. కాళిదాసు కాలనిర్ణయంలో మత భేదమున్నపుడు భాసుని కాలాన్ని తేల్చి చెప్పటం కష్టం. కాళిదాసు క్రీ.శ. 4వ శతాబ్దం వాడని విశ్వసించేవారు భాసున్ని క్రీ.శ. 3వ శతాబ్దంవాడని చెప్పారు. అప్పుడు భాసుడు అశ్వఘోషునికి అర్వాచీనుడౌతాడు.

భాసుడు కృష్ణుని కథలతో పరిచయం కలవాడు. కాబట్టి వాసుదేవ కృష్ణుని పూజ క్రీ.శ. 2,3 శతాబ్దాలల్లో ఆభీరుల పరిపాలనలో వ్యాప్తిలోకి వచ్చిందని, కృష్ణుడు ఆభీరజాతి దేవుడని, భాసుడు వారి పరిపాలనా కాలంలోవాడే అని వింటర్‌నిట్స్ అభిప్రాయం. కాని క్రీ.పూ. 150 నాటికే కంసవధవంటి నాటకాలు ప్రచారంలోవున్న విషయాన్ని వింటర్ నిట్స్ మరచి వుంటాడు.

భాసుడు ప్రశంసించిన "రాజసింహు"ని ఆధారంగా విమర్శకులు అతని కాలనిర్ణయాన్ని చేయటానికి పూనుకొన్నారు. కాని రాజసింహు డెవ్వరన్న విషయంలో వారికి భేదాభిప్రాయాలున్నవి. స్టెన్ కోనోవ్ రాజసింహుడు క్షత్రప ప్రథమ రుద్రసింహుడని (క్రీ.శ. 2వ శ॥) నిర్ణయించాడు. ఏ.డి. బెర్నెట్ పాండ్య తేరమారన్ మొదటి రాజసింహుడే భాసుడు ప్రశంసించిన రాజసింహుడని కాబట్టి భాసుడు క్రీ.శ. 675 ప్రాంతం వాడని చెప్పాడు.

విల్‌హెలం ప్రింట్స్ భాసుని ప్రాకృతభాషను అధ్యయనంచేసి అతడు కాళిదాసుకు పూర్వుడు అశ్వఘోషునికి తర్వాత వాడని నిర్ణయించారు. లిండ్‌నే భాసుని నాటకధర్మాల (technique of drama) ను పరిశీలించి అతడు అశ్వఘోషునికి దగ్గరి వాడని క్రీ.శ. 2వ శతాబ్దం వాడని స్థాపించాడు. కాల నిర్ణయంలో భాషను తీసుకోవటానికి విమర్శకులు అంగీకరించలేదు. భాసుని ప్రతిమా నాటకంలోని ఒక శ్లోకం అశ్వఘోషుని బుద్ధచరిత్రలో

వున్నదని కాబట్టి భాసుడు అశ్వఘోషుని తర్వాతవాడని అంటె క్రీ.శ. 2వ శ॥ వాడని కీథ్ అభిప్రాయం.

ఇక భాసుడు క్రీస్తుకుపూర్వం వాడని విశ్వసించే వారి అభిప్రాయాలు ఇట్లా వున్నవి- భాసుడు భరతుని నాట్య సంప్రదాయాలు తెలియనివాడు. కాబట్టి అతడు భరతునికి పూర్వుడు. అంటె క్రీ.పూ. 5,6 శతాబ్దాల వాడని కొందరి పండితుల అభిప్రాయం.

భాసుడు ప్రతిమా నాటకంలో బృహస్పతికృత అర్థశాస్త్రాన్ని పేర్కొన్నాడు. అతనికి కౌటిల్యుని అర్థశాస్త్రంతో పరిచయమున్నట్లు లేదు. అంతేగాక కౌటిల్యుని అర్థశాస్త్రంలో ప్రతిజ్ఞాయౌగంధరాయణంలోని ఒక శ్లోకం ఉద్ధరింప బడింది. కౌటిల్యుడు క్రీ.పూ. 3వ శతాబ్దంవాడు కాబట్టి భాసుడు క్రీ.పూ. 4,5 శతాబ్దాలవాడని నిర్ణయించబడింది. పాణిని క్రీ.పూ. 5వ శతాబ్దంవాడు. అపాణినీయ ప్రయోగాలు భాసునిలో వుండటంచేత అతడు క్రీ.పూ. 5,6 శతాబ్దాల వాడని కొందరు భారతీయ పండితుల అభిప్రాయం. భాసుడు ఉదయనుని కథను ఇతివృత్తంగా గ్రహించాడు. ఉదయనుడు బుద్ధునికి సమకాలికుడు, అప్పుడు భాసుని కాలం క్రీ.పూ. 5,6 శతాబ్దాలు. అంటె ఉదయనునికి అతడు సమకాలికుడౌతాడు. సంప్రదాయం ప్రకారం అతడు ఉదయనునికి సమకాలికుడని ఎక్కడా లేదు. కాబట్టి ఆ కాలనిర్ణయం అంతగా అంగీకారయోగ్యంగా లేదు. గణపతిశాస్త్రి అభిప్రాయంలో భాసుని కాలం క్రీ.పూ. 4వ శతాబ్దానికి తర్వాత మాత్రం కాదు. అప్పుడు భాసుని కాలాన్ని కౌటిల్యునికి పూర్వం, ఉదయనునికితర్వాత అంటె క్రీ.పూ. 4,5 శతాబ్దాలని నిర్ణయించవచ్చును. భాసుని నాటకాల్లో ప్రతిబింబించిన ప్రజాజీవనవిధానం దీన్నే సమర్థిస్తున్నది.

## భాసుని జన్మస్థానం - వ్యక్తి పరిచయం

భాసుడు ఏ ప్రాంతానికి చెందినవాడన్న విషయంలోను ఒక నిర్ణయానికి రావటం చాలా కష్టం. ఉదయనుని కథను అతడు తీసుకోవటం చేత అతడు ఉజ్జయినివాడని కొందరు అంటున్నారు. భాసుడు దాక్షిణాత్యుడని కీథ్ అభిప్రాయం.

భాసుడు కులం చేత రజకుడని లోకంలో ప్రచారంలో వున్నది. ఇది ఎంతవరకు సత్యమో చెప్పలేము. భాసుడు కాళిదాసు వలె శివభక్తుడుగా కన్పించడు. అతడు విష్ణువు, ముఖ్యంగా కృష్ణుని భక్తుడు అని అతని నాటకాలను బట్టి తెలుస్తున్నది. భాసునిమీద బౌద్ధమత ప్రభావం కన్పించదు. భాసుని కాలంలో బ్రాహ్మణమతం బాగా వ్యాప్తిలో వున్నట్లు అతని రచనలను బట్టి తెలుస్తున్నది.

# భాసుని రచనలు

భాసుడు మొత్తం 24 రూపకాలను రచించాడని ప్రసిద్ధి -
ధావకాపరనామాయం భాసో భాసయతే జగత్
తత్త్యైరివాది పురుష శ్చతుర్వింశతి రూపకై :

మరొక సంప్రదాయాన్ననుసరించి భాసుడు 30 వరకు రూపకాలు వ్రాసాడు. కాని ఇప్పుడు మనకు 13 నాటకాలు దొరుకుతున్నవి. పుసాల్కర్ అభిప్రాయంలో భాసుని రచనల క్రమం ఇది. దూత వాక్యం, కర్ణభారం, దూతఘటోత్కచం, ఊరుభంగం, మధ్యమ వ్యాయోగం, పంచరాత్రం, అభిషేకం, బాలచరిత్ర, అవిమారకం, ప్రతిమా, ప్రతిజ్ఞాయౌగంధ రాయణం, స్వప్నవాసవదత్త, చారుదత్త.

రాజశేఖరుడు భాసుని నాటకాలను భాసనాటకచక్రంగా పేర్కొన్నాడు. భాసుని నాటకాలను ఇతివృత్తాన్ని బట్టి ఐదు విధాలుగా విభజించవచ్చును.

1. రామకథాశ్రితమైనవి - ప్రతిమ, అభిషేక నాటకాలు.

2. మహాభారత కథాశ్రితమైనవి - పంచరాత్ర, మధ్యమవ్యాయోగ, దూతఘటోత్కచ, కర్ణభార, దూత వాక్య, ఊరు భంగ నాటకాలు.

3. భాగవత పురాణాశ్రితమైనవి - బాల చరిత్ర నాటకం.

4. ఉదయన కథాశ్రితమైనవి - ప్రతిజ్ఞాయౌ గంధరాయణ, స్వప్న వాసన దత్త నాటకాలు.

5. లోక కథాశ్రితమైనవి - దరిద్ర చారుదత్త. అవిమారక నాటకాలు.

**ప్రతిమా నాటకం:-** ఈ నాటకంలో 7 అంకాలున్నవి. దీనిలో దశరథుని మరణం మొదలుకొని రాముని పట్టాభిషేకం వరకు రామాయణ కథ వున్నది. దశరథుడు చనిపోయిం తర్వాత భరతుడు మాతామహుని గృహం నుంచి వస్తూ అయోధ్యానగర బాహ్య ప్రదేశంలో వున్న ప్రతిమా గృహంలో ప్రతిష్ఠింపబడిన తన పూర్వుజాలైన సూర్య వంశరాజుల ప్రతిమలను చూస్తాడు. అక్కడ పూర్వజుల సరసన దశరథుని ప్రతిమను చూచి భరతుడు తన తండ్రి మరణాన్ని గురించి తెలుసుకుంటాడు. అందుచేతనే ఈ నాటకానికి ప్రతిమా నాటకమని పేరు పెట్టటం జరిగింది. ఈ నాటకంలో వాల్మికి రామాయణ కథకు భిన్నమైన కల్పనలెన్నో వున్నవి. సీత బంగారు లేడిని కోరే వృత్తాంతం దీనిలో లేదు. నాటకంలో

రావణుడు మునివేషంలో రాగా సీతారాములు అతనికి అతిథి సత్కారాలు చేస్తారు. రావణుడు తాను వేదశాస్త్ర శ్రాద్ధ కల్పాధీతుడనని చెప్పగా రాముడు దశరథుని శ్రాద్ధం పురస్కరించుకొని తాను పితృదేవతలకు ఎట్లా సంప్రీతిని కలిగించగలనో చెప్పమని అడుగుతాడు. హిమాలయంలో లభించే కాంచన పార్శ్వమనే లేడి మాంసాన్ని పితృదేవతలకు అర్పిస్తే విశేషంగా తృప్తులవుతారని రావణుడంటాడు. అప్పుడే రావణుని మాయా ప్రభావంతో అటువంటి లేడి అక్కడికి వస్తుంది. దాన్ని వెంటాడుతూ రాముడు వెళ్ళిపోతాడు. తర్వాత కథ రామాయణంలో వలెనే వున్నది. రావణుని జయించటానికై రామునికి సహాయంగా భరతుడు సైన్యాన్ని పంపినట్లు భాసుడు చెప్పాడు. కాని ఆ సైన్యాన్ని రాముడు రావణవధానంతరం అయోధ్యకు పోతూ మార్గమధ్యంలో కలుసుకుంటాడు. ఈ నాటకంలో దశరథుని మరణం నాట్యశాస్త్రంలోని నాటక లక్షణాలకు విరుద్ధంగా రంగస్థలం మీద ప్రదర్శింపబడింది.

**అభిషేక నాటకం:-** ఈ నాటకంలో 9 అంకాలున్నవి. రామాయణం లోని కిష్కింధ, సుందర, యుద్ధ కాండాలల్లోని ఇతివృత్తం దీనిలో తీసుకోబడింది. దీనిలో సుగ్రీవ, విభీషణ, శ్రీరాముని పట్టాభిషేకాలు మూడు చెప్పబడటం చేత నాటకానికి "అభిషేక" నాటకమని పేరు పెట్టబడింది. దీనిలోను వాల్మీకి రామాయణాతిరిక్తమైన కల్పనలున్నవి. ఈ నాటకంలోని వాలి వధ నాటక ధర్మాలకు విరుద్ధంగా రంగస్థలం మీద చూపబడింది. దీనిలో భాసుడు రామున్ని నారాయణావతారునిగా చిత్రించాడు.

**బాలచరిత్ర నాటకం:-** ఈ నాటకంలో 5 అంకాలున్నవి. శ్రీకృష్ణుని జననం, బాల్య క్రీడలు దీనిలోని ఇతివృత్తం. అందుకే కవి దీనికి బాలచరిత్ర అని పేరు పెట్టాడు. శ్రీకృష్ణుని చరిత్రను ఆధారంగా చేసుకొని వ్రాయబడిన లబ్ద నాటకాలల్లో ఇది ప్రాచీనతమమైంది. భాసుడు శ్రీకృష్ణుని నారాయణావతారంగా పరమాత్మ స్వరూపునిగా చిత్రించాడు. భాసుడు దీనిలో కృష్ణ భక్తుడుగా కన్పిస్తాడు. ఈ నాటకంలో వృషభాసుర కాళియులతో శ్రీకృష్ణుని యుద్ధం, కంసవధలు రంగస్థలం మీద చూపబడినవి. శ్రీకృష్ణుని బాల్యక్రీడలు చాలా వరకు రంగస్థలం మీద ప్రదర్శింపబడినవి. కాని పాత్రల చేత చెప్పింపబడలేదు. దీనిలో కృష్ణుని చరిత్ర హరివంశ, భాగవత పురాణాలల్లో కన్నా అక్కడక్కడ భిన్నంగా కన్పిస్తున్నది.

**పంచరాత్ర నాటకం:-** ఈ నాటకంలో 3 అంకాలున్నవి. ఇవి దశవిధ రూపకాలల్లో సమవకార భేదానికి చెందింది. దీనిలోని కథ మహాభారత కథాధారితమైందైనా చాలామట్టుకు కవికల్పిత వృత్తాంతమే వున్నది. దుర్యోధనుడు యజ్ఞం చేసి గురువైన ద్రోణాచార్యున్ని

ఏదైనా కోరుకొమ్మని అడుగుతాడు. పాండవులకు అర్ధరాజ్యమియ్యమని ద్రోణుడు కోరుతాడు. శకుని, కర్ణునితో సంప్రదించి దుర్యోధనుడు సమ్మతిస్తాడు. కాని అజ్ఞాతవాసంలో వున్న వారి జాడ ఐదు రోజుల్లో తెలిస్తేనే ఇస్తానని అంటాడు. పాండవుల జాడ తెలియక ద్రోణుడు విచారిస్తాడు. అదే సమయంలో ఒక వార్తాహరుడు వచ్చి కీచక, ఉపకీచకుల వధను గురించి తెలుపుతాడు. వాళ్ళను చంపినవాడు భీముడే అని భీష్ముడు గుర్తించి దుర్యోధనుని నియమాన్ని ఒప్పుకొమ్మని ద్రోణునితో చెప్తాడు. భీష్ముడు ద్రోణున్ని విరాటరాజు గోవులను పట్టుకునేందుకు ప్రేరేపిస్తాడు. గోవులకొరకు జరిగిన పోరాటంలో అర్జునుని సహాయంతో ఉత్తరుడు విజయం సాధిస్తాడు. దుర్యోధనుడు ద్రోణుని కిచ్చిన మాట ప్రకారం పాండవులకు అర్ధరాజ్యమిస్తాడు. ఈ నాటకంలో దుర్యోధన కర్ణులు మంచివాళ్ళుగా చిత్రింపబడినారు. శకుని ఒక్కడే దుష్టుడు. అభిమన్యుడు కౌరవ పక్షంలో పాండవులతో పోరాడుతాడు. కురుక్షేత్ర యుద్ధం జరుగకుండానే పాండవులకు అర్ధరాజ్యమిచ్చినట్లుగా కవికల్పన మహాభారత కథను సూక్ష్మతరం చేసింది.

**మధ్యమవ్యాయోగం:-** ఇది ఏకాంకిక, ఇది దశరూపకాలల్లో వ్యాయోగ భేదానికి చెందింది. పాండవ వనవాసం నాటి వృత్తాంతం దీనిలో వున్నది. కాని ఇతివృత్తం కవికల్పితం. భీముడు తన పుత్రుడైన ఘటోత్కచుని బారినుంచి ఒక బ్రాహ్మణ పుత్రుని రక్షిస్తాడు. హిడింబ ఘటోత్కచునికి భీముడు అతని తండ్రి అని చెప్తుంది. అప్పుడు ఘటోత్కచుడు భవిష్యత్తులో బ్రాహ్మణులకు ఆపద తలపెట్టనని ప్రతిజ్ఞ చేస్తాడు. దీనిలో నాయకుడు కుంతీపుత్ర మధ్యముడు భీముడు. కాబట్టి దీనికి మధ్యమ వ్యాయోగమని కవి నామకరణం చేసాడు.

**దూత ఘటోత్కచం:-** ఇది ఏకాంకిక. భారత యుద్ధంలో అభిమన్యుని మరణానంతరం ఘటోత్కచుడు దుర్యోధనుని దగ్గరికి శ్రీకృష్ణుని ఆదేశంతో రాయబారిగా పోతాడు. దుర్యోధనుడు అతన్ని అవమానిస్తాడు. అప్పుడు ఘటోత్కచుడు అర్జునుని చేతిలో కౌరవుల వినాశం జరుగుతుందని భవిష్యవాణి చెప్తాడు. ఇదీ కల్పితేతివృత్తమే.

**దూతవాక్యం:-** ఇది ఏకాంకిక. ఇది వ్యాయోగ భేదానికి చెందింది. దీనిలో శ్రీకృష్ణుడు పాండవుల దూతయై కౌరవుల దగ్గరికి పోయిన వృత్తాంతమున్నది. భారతేతివృత్తమే ఇది. శ్రీకృష్ణుని విశ్వరూప సందర్శనం దీనిలో చెప్పబడింది. ఈ నాటకంలో ప్రాకృత భాషాప్రయోగం జరుగలేదు.

**కర్ణభారం:-** ఇది ఏకాంకిక. బ్రాహ్మణ వేషధారియై వచ్చిన ఇంద్రునికి కర్ణుడు తన సహజ కవచకుండలాలను ఇచ్చే వృత్తాంతం దీనిలో వున్నది. దీనిలో కర్ణుని దానవీరశూరత చిత్రింపబడింది.

**ఊరుభంగం:-** ఇది ఏకాంకిక. దుర్యోధనుడు భీమునితో గదాయుద్ధం చేసి తొడలు విరిగి పడిపోవటం, అతని మరణం ఈ ఏకాంకికలో వున్నది. ఇందులో దుర్యోధన పాత్ర చిత్రణలో భాసకవి అపూర్వ ప్రతిభను చూపాడు. నాటక ధర్మాలకు విరుద్ధంగా దీనిలో దుర్యోధనుని మరణం రంగస్థలం మీద చూపబడింది. భాసుని ఏకాంకికల్లో కెల్లా ఊరుభంగం నాటక ధర్మాలు, పాత్రచిత్రణ, సంభాషణల దృష్టితో ఉత్తమమైంది. ఇది గ్రీకు ట్రాజెడీలను పోలివున్న ఏకైక సంస్కృత నాటకమని వింటర్‌నిట్స్ అన్నాడు.

**ప్రతిజ్ఞా యౌగంధరాయణం:-** ఈ నాటకంలో 4 అంకాలున్నవి. ప్రస్తావనలో ఇది ప్రకరణంగా చెప్పబడింది. దీనిలో ఉదయనరాజు మంత్రి యౌగంధరాయణుడు నాయకుడు. ఉజ్జయిని రాజు ప్రద్యోతుడు మోసంతో కౌశాంబిరాజు ఉదయనున్ని బంధించగా అతని మంత్రి యౌగంధరాయణుడు విడిపిస్తానని ప్రతిజ్ఞచేస్తాడు. ఉదయనుడు బంధితుడై కారాగారంలో ప్రద్యోతుని కూతురు వాసవదత్తకు వీణను నేర్పుతాడు. వారిద్దరు పరస్పరం ప్రేమించుకుంటారు. వాసవదత్తను విడిచిపెట్టి కారాగార విముక్తుడు కావటానికి ఉదయనుడు అంగీకరించడు. అప్పుడు యౌగంధరాయణుడు ఉదయనునితో పాటు వాసవదత్తను, అతని వీణ ఘోషవతిని, ఏనుగు నలగిరిని విడిపిస్తానని మరోసారి ప్రతిజ్ఞ చేస్తాడు. ఇందుకే ఈ నాటకం ప్రతిజ్ఞా యౌగంధరాయణం అని పిలువబడింది. చివరి కతడు సఫలుడౌతాడు. తర్వాత ప్రద్యోతుడు ఉదయన వాసవదత్తల వివాహాన్ని ఆమోదించి అంగీకరించి కారాగారబద్ధుడైన యౌగంధరాయణున్ని బహుకరిస్తాడు. ఈ నాటకంలో ప్రధానపాత్ర యౌగంధరాయణుడు. అతని బుద్ధి కుశలతతో ఎత్తుకు పైయెత్తులు వేయటం చక్కగా చిత్రింపబడింది. తర్వాత కాలంలో వ్రాయబడిన ముద్రారాక్షస నాటకం ఈ నాటకాన్ని స్మరింపజేస్తుంది. యౌగంధరాయణుడు భాసుని స్వప్నవాసవదత్త నాటకంలోను ప్రధానపాత్ర వహించి ఉదయనుని రాజ్యప్రాప్తికి తోడ్పడుతాడు. ప్రతిజ్ఞాయౌగంధరాయణంలో విదూషక పాత్ర వున్నది. భామహుడు ఈ కథలోని కృత్రిమగజాన్ని దానిలో సైనికులు దాక్కొని వుండటాన్ని స్మరించి, సజీవ గజానికి చర్మ నిర్మిత గజానికి గల భేదాన్ని బాలుడైనా గుర్తిస్తాడు మరి గజవిద్యాకుశలుడైన ఉదయనుడెట్లా గుర్తించలేక భ్రమపడ్డాడని విమర్శించి వున్నాడు -

అంతర్యోధ శతాకీర్ణ సాలంకాయణ నేతృకమ్
తథావిధం గజచ్ఛద్మ నాజ్ఞాసీత్స స్వభూగతమ్
సచేతసో వనేభస్య చర్మణా నిర్మితస్య చ
విశేషమ్ వేద బాలోపి కష్టం కిం న కథం ను తత్.

భాసుని గజకల్పనా వృత్తాంతం నాటకంలో చాల చమత్కారమైన అద్భుత కల్పన. ఈ కల్పన హోమర్ వ్రాసిన గ్రీకు మహాకావ్యంలో ట్రోజన్ గుర్రం, దానిలో దాక్కొని సైనికులుండటాన్ని పోలివున్నది. భాసునికి గ్రీకు మహాకావ్యం కథతో పరిచయముండే ఈ కల్పనను చేసాడా? అని అనుమానం కలుగుతుంది. ఒకవేళ ఆ కథను కర్ణాకర్ణిగా భాసుడు విన్నాడేమో! చెప్పలేము. అలెగ్జాండర్ దండయాత్రకు పూర్వమే భారతదేశంలో గ్రీకుల వలసరాజ్యాలున్నవి. యవనులతో భారతీయులకు పరిచయమున్నది. ఆ యవనులతో పాటు వారి కథలు కూడ భారతదేశంలో ప్రవేశించి వుంటవి. లేదా ఒకవేళ భాసుడు తన ప్రతిభచేతనే ఇటువంటి వృత్తాంత కల్పనచేసి కూడా వుండవచ్చును.

**స్వప్నవాసవదత్త:-** ఈ నాటకంలో 6 అంకాలున్నవి. వాసవదత్త ఉదయనున్ని స్వప్నంలో కలుసుకొంటుంది. కాబట్టి ఈ నాటకానికి స్వప్న వాసవదత్త అనే పేరు పెట్టబడింది. మగధ రాజకుమారి పద్మావతిని ఉదయనుడు వివాహమాడితే రాజ్యక్షేమం కలుగుతుందని జ్యోతిషులు చెప్తారు. కాని ప్రాణప్రదంగా ప్రేమించే వాసవదత్త వుండగా ఉదయనుడు మరో వివాహం చేసుకోడని తెలిసిన మంత్రి యౌగంధరాయణుడు వాసవదత్త సహాయంతో, ఉదయనుడు వేటకు పోయినప్పుడు, గ్రామదాహంలో ఆమె మరణించిందని పుకారు పుట్టిస్తాడు. యౌగంధరాయణుడు వాసవదత్తను తన చెల్లెలని చెప్పి పద్మావతి దగ్గర వుంచుతాడు. ఉదయనుడు దుఃఖంతో చివరకు వివాహానికి అంగీకరిస్తాడు. ఉదయన పద్మావతుల వివాహం జరుగుతుంది. అయినా అతడు వాసవదత్తను మరచిపోలేడు. ఒకరోజు సముద్రగృహంలో ఉదయనుడు నిద్రిస్తుండగా వాసవదత్త అక్కడికి వస్తుంది. ఉదయనున్ని పద్మావతిగా తలంచి అతని పక్కన పడుకొంటుంది. అర్ధజాగ్రదవస్థలో ఉదయనుడు వాసవదత్తను గురించి కలగంటూ కలవరిస్తాడు. వాసవదత్త తన రహస్యం బయటపడుతుందని అక్కడ నుంచి వెళ్ళిపోతుంది. తర్వాత మగధరాజు సహాయంతో ఉదయనుడు రాజ్యాన్ని సంపాదిస్తాడు. అప్పుడు వాసవదత్త జీవించి వున్నదని బయటపడుతుంది. ఈ విధంగా నాటకం సుఖాంతమౌతుంది.

ఈ నాటకంలో భాసుడు వాసవదత్త, పద్మావతి పాత్రలను, ఉదయనుని దక్షిణ నాయకత్వాన్ని, చక్కగా చిత్రించాడు. ఉదయనుని అర్ధజాగ్రదవస్థలో స్వప్నాన్ని, నిజాన్ని కలబోసుకొన్న అనుభవాన్ని కవి చక్కగా కల్పన చేసి చిత్రించాడు. ఇది భాసుని అద్భుతమైన కల్పనల్లో ఒకటి. స్వప్నవాసవదత్త నాటక కథాక్రమాన్ని అనుసరించి తర్వాత ఎన్నో నాటకాలు వ్రాయబడినవి. హర్షదేవుని రత్నావళి ప్రియదర్శిక నాటికల కథలు ఈ నాటక కథనే పోలివున్నవి. ఇంకా అనంగహర్ష మాత్ఋరాజు తాపసవత్సరాజనాటకం కొంతవరకు స్వప్నవాసవదత్త కథ ఆధారంగానే వ్రాయబడింది. అంతేగాక స్వప్న వాసవదత్తలోని ఉదయనుని దక్షిణ నాయకత్వం, కథాక్రమాలను అనుకరిస్తు కాళిదాసు మాళవికాగ్నిమిత్రం వంటి నాటకాలు సంస్కృత సాహిత్యంలో ఎన్నో వున్నవి.

**అవిమారకం:-** ఈ నాటకంలో 6 అంకాలున్నవి. దీనిలో నాయకుని పేరు అవిమారకుడు. అతడు "అవి" అనే పేరు గల రాక్షసున్ని చంపాడు (మారకుడు) కాబట్టి అతనికా పేరు వచ్చింది. సౌవీర రాజకుమారుడైన అవిమారకుడు ఋషి శాపంచేత క్షత్రియత్వం కోల్పోతాడు. అతడు తన మేనమామ కుంతిభోజుని కూతురు కురంగిని ప్రేమించి రహస్యంగా ఆమె అంతఃపురం చేరుకుంటాడు. ఒక సంవత్సరం తర్వాత ఈ రహస్యం బయటపడుతుంది. అప్పుడు కురంగి కార్చిచ్చులో పడి ఆత్మహత్య చేసుకోటానికి ప్రయత్నించగా విద్యాధరుడొకడు ప్రత్యక్షమై అతనికొక మాయాంగుళీయకాన్ని ఇస్తాడు. దాని సహాయంతో అవిమారకుడు ఆత్మహత్యా ప్రయత్నంలో వున్న కురంగిని రక్షిస్తాడు. ఇంతలో శాపం అవధి గడిచిపోతుంది. నారదుడు వచ్చి అవిమారకున్ని కుంతుభోజునికి పరిచయం చేస్తాడు. నారదపాత్ర సహాయంతో కథను సుఖాంతం చేయటం కాళిదాసు విక్రమోర్వశీయంలో అనుకరింపబడింది. అవిమారకంలోను విదూషక పాత్ర వున్నది. ప్రతిజ్ఞా యౌగంధరాయణంలో విదూషక పాత్ర గంభీరమైంది కాక కేవలం హాస్యపాత్ర.

ఈ నాటకం షేక్స్పియర్ రోమియో జూలియట్ నాటకాన్ని తలపిస్తున్నదని కొందరు విమర్శకులు తలచారు. రోమియో జూలియట్‌ల ప్రేమ అవిమారక కురంగిల ప్రేమను పోలివున్నా వారి రెండు వంశాలకున్న వైరం దీనిలో లేదు. భాసుని ఈ నాటకానికి ఏదో లోకకథ ఆధారమై వుంటుంది. తర్వాత ఈ కథ వాత్స్యాయనుని కామసూత్రంలో, గుణాఢ్యుని బృహత్కథలోను చోటు చేసుకొన్నది.

**చారుదత్తం:-** ఈ నాటకంలో 4 అంకాలున్నవి. దీన్ని అభినవగుప్తుడు దరిద్రచారుదత్తమని పేర్కొన్నాడు. వేశ్య వసంతసేన, దరిద్రబ్రాహ్మణుడు చారుదత్తుని ప్రేమించే వృత్తాంతం దీనిలో వున్నది. వసంతసేన తన నగల మూటను చారుదత్తుని ఇంట్లో పెట్టి పోతుంది. శర్విలకుడు కన్నం వేసి ఆ నగలను దొంగలించి ఆ నగలను వసంతసేనకే ఇచ్చి ఆమె దగ్గర దాసిగా వున్న తన ప్రియురాలిని విడిపించు కొంటాడు. ఇక్కడనే నాటక కథ అసంపూర్ణంగా ముగుస్తున్నది. ఇది భాసకవి చివరి రచన కావటంచేత అసంపూర్ణంగా వున్నదని వింటర్‌నిట్స్ అభిప్రాయపడినాడు. కొందరు విమర్శకులు ఇది శూద్రకుని మృచ్ఛకటకానికి సంక్షిప్తరూపమని తలంచారు. కాని ఇది సత్యం కాదు. శూద్రకుడే భాసుని కథను తీసుకొని రాజకీయ, సాంఘిక నేపథ్యంతో కథను పెంచి మృచ్ఛకటిక నాటకాన్ని వ్రాసాడనటం సమంజసం.

## భాసుని ఇతర రచనలు

కిరణావళి, ఉదాత్తరాఘవమనే నాటకాలు భాసుని రచనలంటారు. కాని అవి దొరకలేదు. శ్రీహర్షదేవకృతాలైన రత్నావళి, ప్రియదర్శికలు భాసునిరచనలని చాటువులున్నవి కాని ఇది విశ్వసనీయంకాదు. నాలుగు అంకాలుగల వీణావాస వదత్తమనే నాటకమొకటి అసంపూర్ణ ప్రతి దొరికింది. అది భాసుని రచన అని డా.కున్హన్ రాజా నిర్ణయించటానికి ప్రయత్నించాడు. కాని ఇది సర్వసమ్మతం కాలేదు. రాజవైద్య కాళిదాసుశాస్త్రి "యజ్ఞఫల ' నాటకప్రతిని సంపాదించి క్రీ.శ. 1914లో భాసుని కృతిగా ప్రకటించాడు. ఇది సన్నివేశ, పాత్రపోషణాది విషయాలల్లో భాస నాటకాలను పోలివున్నది. దీనిలో దశరథుని యజ్ఞఫలం ప్రధానేతివృత్తం, విశ్వామిత్ర, జనక, పరశురాముల యజ్ఞఫలాలుకూడ వున్నవి. ఈ నాటకంలో పల్లెజీవితం సహజసుందరంగా వర్ణింపబడింది. కైకేయి పాత్ర వాల్మీకి రామాయణంలోకన్న భిన్నంగా చిత్రింపబడింది. దీనిలో కైకేయికన్న కౌసల్యయే స్వార్థపరురాలుగా కన్పిస్తుంది. కాళిదాసుశాస్త్రికి కఠియవాడ్‌లోని గొండాల్‌లో దేవనాగర లిపిలో వున్న ప్రతి దొరికిందట. ఈ నాటకాన్ని గోపాల దత్తశాస్త్రి అనే ఆయన తాను వ్రాసానని సుఖ్తంకర్, గోడేలకు ఒక వ్రాతప్రతిని చూపి చెప్పాడట. అప్పుడు దొండేకర్ యజ్ఞఫల నాటక కర్తృత్వ నిర్ణయానికి పూనుకొని ఇది గోపాలదత్త శాస్త్రి కాక క్రీ.శ. 1670 ప్రాంతం కవి వ్రాసిన నాటకమని తేల్చాడు. ఇది భాసానుకారియే కాని భాసనాటకం కాదని ఆయన నిర్ణయించాడు.

ఇంకా సుభాషిత గ్రంథాలల్లో భాసుని శ్లోకాలు వున్నవి. కాని అవేవి ఇప్పుడు లభించిన నాటకాలల్లో లేవు. అవి ఇంకా లభించవలసిన నాటకాలల్లోనివి కావచ్చునని పండితుల ఊహ.

## భాసుని నాటకకళ

భాసుడు ప్రతిభాశాలి అయిన నాటకకారుడు. ప్రతి నాటకం ఒక ప్రత్యేకతను కలిగివున్నది. భాసుని నాటకకళ శాస్త్రీయలక్షణాలను దృష్టిలో పెట్టుకొని గిరిగీసుకొని ఆ పరిధిలోనే సీమితమైందికాదు. కథ, సన్నివేశాలు, పాత్రలను అవసరాన్ని బట్టి అతడు నేర్పుతో మలచుకొని చిత్రించాడు. అవన్నీకూడా అతని ప్రతిభాజనితాలేకాని పూర్వరచనల అనుకరణలు కావు. అందుకే అతని నాటకాలు ఇతర నాటకాలకన్నా భిన్నంగా, విలక్షణంగా, మౌలికంగా కన్పిస్తున్నవి. శైలి, ఛందస్సులు, కవితా ప్రతిభలు కూడా అతని నాటకాలను రసవంతం చేసినవి. రామాయణ మహాభారతాతిరిక్తంగా అతడు చేసిన కథా కల్పనలు, సన్నివేశాల సృష్టి, పాత్రల చిత్రణ అద్భుతంగా వున్నవి. మూలంలోని పాత్రలను పూర్తిగా తారుమారు చేసి అతడు వేరు విధంగా చిత్రించిన తీరు ప్రశంసనీయమైంది. పాత్రల మూలరూపాలనే అతడు మార్చివేసాడు. భాసుని సంభాషణల రచన కూడా అప్రతిమానమైంది. ఎక్కడా అనావశ్యకమైన, దీర్ఘమైన సంభాషణలు లేవు. కథా గమనాన్ని నడిపే సంభాషణలు అతి చాతుర్యంతో వ్రాయబడినవి. సరళశైలిలో సుబోధకంగా భాసుని సంభాషణలు హృదయాకర్షకంగా వున్నవి. భాసుని నాటకాలు కేవలం పఠనయోగ్యంగానే కాక ప్రదర్శనకు చాలా యోగ్యంగా వున్నవి. కాబట్టే కేరళ నటులు "చాక్యారు" లు వందల సంవత్సరాల నుంచి వాటిని ప్రదర్శిస్తూ వచ్చారు. వారి ఆదరణ చేతనే ఆ నాటకాలు నష్టం కాకుండా నిలిచినవి.

భాసుని నాటకాలల్లో దూత వాక్యం, మధ్యమ వ్యాయోగం, దూత ఘటోత్కచం, కర్ణభారం, ఊరుభంగం-ఏకాంకికలు. ఈ ఏకాంకిక రచనలను భాసునంత సమర్థవంతంగా తర్వాత కవులెవరూ వ్రాయలేకపోయారు. ఇటువంటి ఏకాంకికలు తర్వాత కాలంలో ఇంకా వ్రాయబడక పోవటం సంస్కృత సాహిత్య దురదృష్టమే అనాలి. భాసుని ఏకాంకికలు చిన్నవైనా చక్కని ఇతివృత్తంతో, పాత్రచిత్రణతో, సంఘటనా మహత్త్వంతో వున్నవి. ఈ ఏకాంకికల్లో ఊరు భంగం చక్కని నాటకకళ కలిగినటువంటిది. కథాఘటన, పాత్రచిత్రణ, విధి విలాసాలు ప్రశస్తంగా చిత్రింపబడినవి. ఆ తర్వాత భాసుని బాలచరిత్ర శ్రీకృష్ణుని

జీవితంలోని సంఘటనలు కూర్చబడిన నాటకం. దీనిలో కథాకథనం లేదు. ఈ సంఘటనల కూర్పులో భాసుడు తన నాటక కళా ప్రతిభనుచూపాడు. అవిమారకం కొంతవరకు నీరసంగా నడిచినా తర్వాత కల్పిత కథలు, ప్రేమ కథలు గల నాటకాలకు ఇది ఆదర్శమైంది. చారుదత్త నాటకం అసంపూర్ణంగా వున్నది కాబట్టి దీన్ని గురించి ఎక్కువ నిర్ణయించి చెప్పలేము. పంచరాత్రం సమవకార భేదానికి చెందిన నాటకం. దీనిలో భాసుని కథాకల్పనా చాతుర్యాన్ని దర్శించవచ్చును. మౌలికమైన కథ, సంఘటనల కల్పనాదృష్టితో ఇది ఒక మంచి నాటకం. అభిషేక నాటకం కొంతవరకు ప్రౌఢమైన నాటకమే. ఇందులో కూడ భాసుని స్వంత కల్పనలను చూడవచ్చును. రామాయణంలోని నీరసమైన కథాభాగాన్ని భాసుడు తన నాటక రచనా చాతుర్యంతో సరసమైన రచనగా తీర్చిదిద్దాడు. వాలి వధను దీనిలో కవి రంగస్థలం మీద చూపాడు. భాసుడు నాటక ధర్మాలకు విరుద్ధంగా ఇట్లా వధ, మరణాలను రంగస్థలం మీద చాల నైపుణ్యంతో రస పోషకంగా, కథా సంఘటనలకు పోషకంగాను ప్రదర్శింపజేసాడు. ఇటువంటి నాటకాలు సంస్కృతంలో ఇంకా ఎక్కువ ఎందుకు వ్రాయబడలేదని భాసుని నాటకాలు చదువుతుంటే అడుగడుగునా విచారం కలుగుతుంది.

భాసుడు రామాయణ కథనంతా నాటకాలల్లో కూర్చటానికి ప్రయత్నిస్తు ప్రతిమా, అభిషేక నాటకాలను వ్రాసాడు. ఇటువంటి ప్రయత్నాన్నే భవభూతి మహావీర చరిత, ఉత్తర రామచరిత నాటకాలల్లో చేసాడు. భాసుని ఈ రెండు నాటకాలల్లో ప్రతిమానాటకం నాటకకళ దృష్టితో వికసితమైన ప్రౌఢ నాటకం. దీనిలోమ భాసుడు తన కల్పనాచాతుర్యాన్ని చూపుతూ కథాసన్నివేశాలను అద్భుతమైన వాటిని సృష్టించాడు. పాత్రచిత్రణ కళాదృష్టితోనూ ఈ నాటకం ఉత్తమమైంది.

భాసుని పరిపక్వమైన నాటకకళాప్రతిభను ఉదయనుని కథనాశ్రయించిన స్వప్నవాసవదత్త, ప్రతిజ్ఞాయౌగంధరాయణ నాటకాలల్లో చూడవచ్చును. సంఘటనల కూర్పు, పాత్రచిత్రణ, సంభాషణల నిర్వహణ, కవిత్వ ప్రౌఢిమ - అన్ని విషయాలల్లోను ఈ నాటకాలు మించినవి. ఈ నాటకాలల్లోని కథాసంవిధాన చాతుర్యం, పాత్రచిత్రణా శిల్పం, కథలోని గంభీర సన్నివేశాలు తర్వాత నాటకకారులను ఎంతగానో ఆకర్షించినవి.

భాసుడు తన నాటకాలల్లో విధి విలాసాన్ని (Irony of fate) చాల చక్కగా చిత్రించాడు. ఊరుభంగంలో తొడలు విరిగి పడివున్న దుర్యోధనుని, అతని కుమారుడు

దుర్జయుడు సమీపించి తండ్రి తొడలమీద కూర్చోబెట్టుకొమ్మని అడగటం, ప్రతిజ్ఞాయౌగంధరాయణం ద్వితీయాంకంలో ప్రద్యోతుడు రాణి అంగారవతితో వాసవదత్తకు తగిన వరులుగా నానాదేశ రాజకుమారుల వంశగుణ పరిచయాన్ని చేసి వారిలో ఎవరు యోగ్యుడని ప్రశ్నించినప్పుడు కంచుకి ప్రవేశించి వత్సరాజు అని అనటం, తర్వాత వత్సరాజే ఆమెను వివాహమాడటం విధి వైచిత్రిగా కన్పిస్తుంది. ఇటువంటి సన్నివేశాలే పతాక సన్నివేశాలుగా గుర్తింపబడినవి. ఇటువంటి సన్నివేశాలు భాసుని నాటకాలల్లో చాలా వున్నవి.

భాసుని నాటకాలు ఏ వృత్తాంతం మీద ఆధారపడి వున్నా అతడు కథలను తన అభిరుచికి అనుగుణంగా స్వతంత్రించి మార్చుకొన్నాడు. ప్రసిద్ధ మహాభారత రామాయణ ఇతివృత్తాలను కూడ అతడు సంకోచించకుండా మార్చాడు. వాటిల్లోని పాత్రల చుట్టు కొత్త కథలను అల్లాడు. స్వతంత్రమైన భాసుని కల్పనలు ఎబ్బెట్టుగా కాక సామాజికులకు కుతూహలం కలిగించేవిగా వున్నవి.

## భాసుని కవిత్వం

భాసుడు నాటక కళానిర్వహణంలోనే కాక కవిత్వ రచనలోను సిద్ధహస్తుడు. నాటకకారునిగానే కాక అతడు కవిగాను కీర్తిని సంపాదించాడు. భాసుని కవిత్వం సలక్షణమైంది. నాటకాలల్లో సందర్భానుకూలంగా అతడు ప్రకృత్యాది వర్ణనలను చేసాడు. అవి కవిత్వావేశంలో దీర్ఘంగా కాక సన్నివేశానికి అనుకూలమైన రీతిలో వున్నవి. భాసుని భావాలు సరళసుందరంగా వున్నవి. తర్వాత కవుల్లో కనిపించే క్లిష్టమైన భావచమత్కారాదులు అతని కవిత్వంలో లేవు. అక్కడక్కడ అతడు చక్కని సరళమైన ఉపమానాలను ప్రయోగించాడు. భాసుని ఉపమానాలు చాలా మట్టుకు ప్రకృతి వస్తువులే-

సూర్య ఇవగతో రామః సూర్యం దివస ఇవ లక్ష్మణోఽను గతః
సూర్య దివసావసానే ఛాయేవ న దృశ్యతే సీతా.

సరళసుబోధకమైన శైలిలో భాసుడు చక్కని ఉపమాలంకారాన్ని రచించాడు. అదే విధంగా స్వాభావికమైన పద్ధతిలో భాసుడు పాత్రల గుణ గణాలను, వేషభూషలను వర్ణించివున్నాడు.

భాసుడు అనవసరంగా శ్లోకాలను ఎక్కువ ఎక్కడా ప్రయోగించలేదు. కథా పురోగతికి ఎక్కడా అతడు తన వర్ణనలతో అడ్డు తగలలేదు. పాత్రలు ఎక్కడా

అనవసరమైన మాటల్లోకి దిగరు. లోకోక్తులను ప్రయోగించి భాసుడు భావవ్యక్తీకరణను మరింత హృదయరంజకం చేసాడు. భాసుని కవిత్వం చదువగానే భావాలు హృదయంలో సూటిగా ప్రవేశించి అనుభూతులను రేపుతవి. భాసుడు అనుభవజ్ఞుడైన బహుముఖ ప్రజ్ఞాశాలి. మానవ జీవిత సంబంధమైన అనేక విషయాలను అతడు సూక్ష్మేక్షికతో పరిశీలించినవాడు. మానవులందరూ అతనికి మంచివారుగానే కన్పిస్తారు. విధి వక్రించటంచేతనే వారు ఆయా విధంగా ప్రవర్తిస్తారని భాసుడు నమ్ముతాడు. కాబట్టే అతడు దుర్యోధన, కర్ణ, కైకేయి మొ॥న పాత్రలను మానవమాత్రులుగా సానుభూతికి పాత్రులుగా చిత్రించాడు. తర్వాత కవులెవ్వరు ఇటువంటి పాత్ర చిత్రణకు పూనుకోలేదు. భాసుని నాటకాలు ఆధునిక ప్రేక్షకులను బాగా ఆకర్షించుకొనేటట్లుగా వున్నవి.

## కాళిదాసాదులమీద భాసుని ప్రభావం

భాస కాళిదాసుల మీద వాల్మీకి ప్రసన్న కవిత్వ ప్రభావమున్నది. కాళిదాసు మీద వాల్మీకి ప్రభావమే కాక భాసుని ప్రభావం కూడ వున్నది. కాళిదాసుకు భాసుడన్న చాల అభిమానమున్నట్లు కన్పిస్తుంది. " ప్రథితయశసాం భాస సౌమిల్ల కవి పుత్రాదీనాం ప్రబంధానతిక్రమ్య వర్తమానకవేః కాళిదాసస్య క్రియాయాం కథం బహుమానః"? - అని కాళిదాసు తన ప్రతిభమీద ఆత్మవిశ్వాసం లేనట్లుగా మాట్లాడాడు. కాళిదాసు మాటలనుబట్టి భాసుడు చాల ప్రముఖకవిగా పరిగణింపబడినట్లు తెలుస్తున్నది. వాల్మీకిని పేరుతో స్మరించని కాళిదాసు భాస సౌమిల్ల కవిపుత్రులను స్మరించి వారి కృతులముందు తన కృతి ఆదరింపబడుతుందో? లేదో? అని అనుమానాన్ని వెలిబుచ్చాడు. సౌమిల్ల కవిపుత్రులను కాళిదాసు ఎంతవరకు ఆదర్శంగా గ్రహించి అనుకరించాడో వారి కృతులు దొరకకపోవటంచేత చెప్పలేము. కాని భాసున్ని కాళిదాసు ఆదర్శంగా తీసుకొని అనుకరించిన సందర్భాలున్నవి. ముఖ్యంగా కాళిదాసు భాసుని నాటక సన్నివేశాలను ఎన్నోచోట్ల తన నాటకాల్లో అనుకరించాడు. కాళిదాసు శాకుంతలం ప్రథమాంకంలో దుష్యంతుడు శకుంతల నిసర్గసౌందర్యాన్ని చూచి "కిమివ హి మధురాణాం మండనం నా కృతీనామ్" అన్న మాటల భావబీజం మనకు ప్రతిమా నాటకం ప్రథమాంకంలో సీత నారచీరలను కట్టుకోగా ఆమె సఖులు " స వ్వ సోహణీయం సురూపంణామ" అన్నమాటల్లో కన్పిస్తున్నది. శకుంతల అత్తవారింటికి పోయేటప్పుడు వృక్షలత మృగాదుల దగ్గర సెలవు తీసుకోవటం ప్రతిమా నాటకం పంచమాంకంలో సీత వృక్షలతాదుల దగ్గర సెలవు తీసుకునే దృశ్యాన్ని పోలివున్నది. శకుంతలకు లేడి పెంపుడుబిడ్డ అన్న భావం ప్రతిమా నాటకంలో వున్నది. శాకుంతలం

ప్రథమాంకంలో శకుంతల సఖులతో వృక్షసేచనం చేసే ఘట్టం ప్రతిమా నాటకం పంచమాంకాన్ని పోలివున్నది. శాకుంతలంలోని దుర్వాసుని శాపవృత్తాంతం - దశరథునికి మునిశాపం, అవిమారకంలోని చండభార్గవుని శాపాలను అనుసరించి కల్పింపబడింది. స్వప్న వాసవదత్తలో వాసవదత్త తన వీణను నర్మదానదీతీరంలో పోగొట్టుకుంటుంది. దాన్ననుసరించి కాళిదాసు శకుంతల తన ఉంగరాన్ని శచీతీర్థంలో పోగొట్టుకున్నట్లుగా కల్పన చేసాడు. ఉదయనుడు వాసవదత్త వీణనుచూచి దుఃఖిస్తూ ఇట్లా అంటాడు-

శ్రుతి సుఖ నినదే కథం ను దేవ్యాః
స్తనయుగళే జఘన స్థలే చ సుప్తా
విమద గజరజో వికీర్ణదండా
ప్రతిభయమధ్యుషితా స్యరణ్య వాసమ్.

అదే విధంగా శాకుంతలంలో దుష్యంతుడు శకుంతల ఉంగరాన్ని చూచి దుఃఖిస్తూ ఇట్లా అంటాడు-

తవ సుచరిత మంగుళీయ నూనం
ప్రతను మయేవ విభావ్యతే ఫలేన
అరుణ నఖ మనోహరాసు తస్యా
శ్చ్యుతమసి లబ్దపదం యదంగులీషు

భాసుని ప్రతిమా నాటకంలోని రఘువంశరాజుల క్రమాన్నే కాళిదాసు రఘువంశంలో గ్రహించి వర్ణించాడు. ఇంకా కాళిదాసు నాటకాల్లోని ఎన్నో సన్నివేశాలు భాసుని నాటకాల్లోని సన్నివేశాలవలె వున్నవి. కాళిదాసు శ్లోకాల భావాలుకూడా కొన్ని భాసుని శ్లోకాల భావాలను పోలివున్నది. ఈ విధంగా కాళిదాసువంటి కవులకు గురుత్వం వహించిన భాసుని ప్రతిభ అసమానమైందని చెప్పాలి.

కాళిదాస భవభూతులు మూడు నాటకాలే వ్రాయగా భాసుడు చాల నాటకాలు వ్రాసాడు. కాళిదాసు మీదనే కాక భవభూత్యాది ఇతరకవుల మీదను భాసుని నాటకాల ప్రభావం కన్పిస్తున్నది. భవభూతి భాసుని వలెనే రామాయణ కథనంతా నాటకాలుగా మలచటానికి ప్రయత్నించాడు. భవభూతి మాలతీ మాధవమనే ప్రకరణం భాసుని అవిమారకాన్ని తలపిస్తున్నది. హర్షదేవుని రత్నావళి ప్రియదర్శికలు పూర్తిగా భాసుని స్వప్న వాసవదత్తను ఆదర్శంగా పెట్టుకొనే వ్రాయబడినవి. అదే విధంగా అతని నాగానందం మీద

కూడ భాసుని ప్రభావం కన్పిస్తున్నది. శూద్రకుని మృచ్ఛకటికం పూర్తిగా భాసుని చారుదత్త నాటకం మీద ఆధారపడిందే. విశాఖదత్తుని ముద్రారాక్షసం మీద భాసుని ప్రతిజ్ఞా యౌగంధరాయణం, స్వప్నవాసవదత్తల ప్రభావమున్నది. ఈ విధంగా భాసుడు తన అపూర్వ నాటక కళాచాతుర్యంతో, కథాకల్పనా నైపుణ్యంతో తరువాత కవులను ప్రభావితం చేసాడు.

## కాళిదాసు

కవికుల గురువు కాళిదాసు పేరును వినని భారతీయుడే వుండడు. కాళిదాసు భారతీయ కవుల్లోనే కాక ప్రపంచకవుల్లోనే అగ్రగణ్యుడు. అతని రచనలు భారతీయుల ప్రశంసలనే కాక పాశ్చాత్యుల ప్రశంసలను కూడ అందుకొన్నవి. భారతీయ ఆత్మను కాళిదాసు చిత్రించినంత సంపూర్ణంగా మరేకవి చిత్రించలేదని చెప్పాలి. భారతదేశపు భౌతికరూపాన్ని అంటె నదీనదాలను, పర్వతాలను, పట్టణాలను, పల్లెలను, ఆశ్రమ ప్రాంతాలను, అరణ్యాలను, వృక్షలతాదులను కాళిదాసు వర్ణించినంత సమగ్రంగా మరే కవి వర్ణించలేదనే చెప్పాలి. కాళిదాసు కవిత్వం సార్వకాలికం, సార్వభౌమికం కూడ.

### కాళిదాసు కాలం

కాళిదాసు కాలనిర్ణయంలో పండితుల్లో చాల అభిప్రాయ భేదాలున్నవి. క్రీ.పూ. 8వ శతాబ్దం నుంచి క్రీ.శ. 11వ శతాబ్దం వరకు అతని జీవితకాలం సాగుతున్నది. రఘువంశంలో చివరి రాజు అగ్నివర్ణుని మరణానంతరం జన్మించిన అతని కుమారునికి కాళిదాసు సమకాలికుడని అంటె క్రీ.పూ. 8వ శతాబ్దంవాడని ప్రసిద్ధ ఫ్రెంచి విమర్శకుడు హిపోటయిల్ ఫాష్ (Hipthotyle Fauche) ఊహాగానం చేసాడు. లోకంలో భోజరాజు కాళిదాసులకు సంబంధించిన కథలెన్నో ప్రచారంలో వున్నవి. వాటినిబట్టి కాళిదాసు ధారానగర రాజు భోజుని ఆస్థానకవి అని క్రీ.శ. 11వ శతాబ్దం వాడని కొందరు విమర్శకులు తలంచారు. కాని ఈ రెండు వాదాలు నిలిచేవి కావు. కాళిదాసు శుంగవంశ రాజు అగ్నిమిత్రుని నాయకునిగాచేసి మాళవికాగ్నిమిత్ర నాటకం వ్రాసాడు. అగ్నిమిత్రుని సమయం క్రీ.పూ. 150 ప్రాంతం. కాబట్టి కాళిదాసు తత్పూర్వుడని నిర్ణయించటానికి వీల్లేదు. అదేవిధంగా కాళిదాసు బాణుని (క్రీ.శ. 7వ శ॥ పూర్వార్ధం) చేత స్తుతింపబడినాడు. మరియు చాళుక్యరాజు రెండవ పులకేశి ఐహోళె శాసనంలో (క్రీ.శ. 634) కాళిదాసు ప్రసక్తి వున్నది. కాబట్టి కాళిదాసు ఆ తర్వాతవాడని చెప్పటానికి కూడా వీల్లేదు. భోజరాజు

ఆస్థానంలో వున్నది కాళిదాస బిరుదాంకితుడైన మరోకవి. అంతేగాని ఈకవిగాదు. ఈవిధంగా క్రీ.పూ. 150 క్రీ.శ. 634 నడుమ ఎక్కడో కాళిదాసు జీవితకాలాన్ని నిర్ణయించవలసి వుంటుంది. కాళిదాసు కాలాన్ని గురించి మూడువాదాలు బలంగా వున్నవి -

1) కాళిదాసు క్రీ.శ. 6వ శతాబ్దివాడనటం

2) కాళిదాసు గుప్తులకాలం వాడనటం

3) కాళిదాసు విక్రమ శకారంభంలో అనగా క్రీ.పూ. ప్రథమ శతాబ్ది వాడనటం.

**1. క్రీ.శ. 6వ శతాబ్ద వాదం:-** ఉజ్జయిన్ని పరిపాలించిన విక్రమాదిత్య బిరుదాంకితుడైన యశోధర్మ ఆస్థానకవి కాళిదాసు అని మాక్స్‌ముల్లర్ ప్రతిపాదించాడు. యశోధర్మ క్రీ.శ. 544 లో శకులను పారదోలి విక్రమ శకాన్ని స్థాపించాడని, స్తంభించిపోయిన సంస్కృతసాహిత్యం అతని కాలంలో పునర్జీవితమైందని మాక్స్‌ముల్లర్ అభిప్రాయం. ఈ వాదాన్ని డా. ఫర్గూసన్, డా. హోర్నలేలు కూడా సమర్థించారు. కాళిదాసు భారతీయ సంప్రదాయానుసారంగా విక్రమాదిత్యుని ఆస్థాని. ఆ విక్రమాదిత్యుడు విక్రమాదిత్య బిరుదాంకితుడైన యశోధర్మయే అని ఈ విమర్శకుల అభిప్రాయం. విక్రమాదిత్యుడు శకారి అని ప్రసిద్ధి. యశోధర్మ కూడా శకులను పారదోలి నూతన శకాన్ని స్థాపించాడని కాళిదాసు అతని ఆస్థాని అని క్రీ.శ. 6వ శ॥ వాడని వారి అభిప్రాయం.

మేఘసందేశంలో 14వ శ్లోకంలో "దిఙ్నాగ" పదాన్ని కాళిదాసు ప్రయోగించాడు. వ్యాఖ్యాత మల్లినాథుడు దిఙ్నాగుడు ఒక బౌద్ధ తత్త్వవేత్త అని అతడు కాళిదాసుకు ప్రతిద్వంద్వి అని, అతనికి కాళిదాసుకు వైరమున్నట్లుగాను పేర్కొన్నాడు. దిఙ్నాగుడు క్రీ.శ. 6వ శ॥ వాడు. కాబట్టి కాళిదాసు యశోధర్మ ఆస్థాని అనటం కుదురుతుందని కొందరు విమర్శకులు తలంచారు. దిఙ్నాగుడు వసుబంధు శిష్యుడు. చైనీయుల వ్రాతలనుబట్టి ఆచార్య వసుబంధు క్రీ.శ. 400 ప్రాంతంవాడు అని తేలింది. కాబట్టి కాళిదాసు క్రీ.శ. 6వ శ॥ వాడని దీని ఆధారంగా నిర్ణయించటం సాధ్యం కాదు. కాళిదాసు శకారి విక్రమాదిత్యుని ఆస్థానకవి అని ప్రసిద్ధి. యశోధర్మ శకులను పారదోలినా శకారి అని పేరును పెట్టుకొన్నట్లు, ఆ పేరుతో ప్రసిద్ధుడైనట్లు లేదు. అదీగాక యశోధర్మ ఓడించింది హూణరాజు మిహిరకులున్ని. శకారి విక్రమాదిత్యుడు యశోధర్మ కాదు. అంతేగాక అతడు విక్రమాదిత్య నామాంకితుడు కాదు, బిరుదాంకితుడు మాత్రమే. యశోధర్మ ఒక నూతన శకాన్ని స్థాపించినట్లు ఎక్కడా ఆధారాలు లేవు. ఒకవేళ శకాన్ని స్థాపించినా దాన్ని తనకన్న 600 ఏండ్ల పూర్వం నుంచి

ఎందుకు ఆరంభించాడో అని అనుమానం కలుగక మానదు. దీన్నంతా పరిశీలిస్తే కాళిదాసు యశోధర్మ ఆస్థానకవి అని చెప్పటంలో బలమైన ఆధారాలు లేవు.

క్రీ.శ. 6వ శతాబ్దంలో వున్న జ్యోతిషశాస్త్రవేత్త వరాహమిహిరుడు వర్షర్తువు ఆషాఢమాసంతో ఆరంభమౌతుందని చెప్పాడు. ఆ మతాన్ననుసరించి కాళిదాసు మేఘసందేశంలో "ఆషాఢస్య ప్రథమ దివసే మేఘమాశ్లిష్టసానుం:" అని వర్షర్తు ఆరంభాన్ని వర్ణించాడని, వరాహమిహిరుడు బృహత్సంహితలో చెప్పిన జ్యోతిష విషయాలను కాళిదాసు రఘువంశంలో గ్రహించి వ్రాసాడని అందుచేత కాళిదాసు క్రీ.శ. 6వ శ॥లో వరాహమిహిరునికి సమకాలికుడని కొందరు విమర్శకులు స్థాపించటానికి ప్రయత్నించారు. ఆషాఢమాసంతో వర్షర్తు ఆరంభం కావటమనేది వరాహమిహిరునికన్న పూర్వమే ప్రచలితమై వున్నదని కేవలం దీని ఆధారంగా కాళిదాసు క్రీ.శ. 6వ శ॥ వాడని చెప్పటం సమంజసం కాదని పండితులు కొందరు విమర్శించారు.

**2) గుప్తుల కాలంవాడనే వాదం :-** ఇది చాలా మంది విమర్శకులకు ఆమోదయోగ్యమైన వాదం. అయినా గుప్తవంశంలో ఏ రాజుకు కాళిదాసు సమకాలికుడన్న విషయంలో పండితుల్లో మళ్ళా అభిప్రాయ భేదాలు చాలా వున్నవి. కాళిదాసు సముద్ర గుప్తుని కాలంవాడని, రఘువంశంలోని రఘుమహారాజా దిగ్విజయ వర్ణన సముద్రగుప్తుని దిగ్విజయ వర్ణనే అని కొందరు తలంచారు. మరి కొందరు రెండవ చంద్రగుప్తుని ఆస్థానంలో కాళిదాసు వున్నాడని నిర్ణయించారు. శకారి విక్రమాదిత్యుని ఆస్థానకవి కాళిదాసు అని లోకంలో ప్రచారంలో వున్నదాన్ని బట్టి కాళిదాసు విక్రమాదిత్య బిరుదాంకితుడైన రెండవ చంద్రగుప్తుని ఆస్థాని అని వీరి అభిప్రాయం. క్రీ.శ. 365లో కఠియవాడ్ శకక్షత్రపులను చంద్రగుప్తుడు సమూలంగా నాశనం చేసాడు. కాబట్టి శకారి అన్న బిరుదం ఇతనికి సరిపోతుందని వీరి మతం. రఘువంశంలో చంద్రగుప్తుని తండ్రి సముద్రగుప్తుని దిగ్విజయాలను వర్ణించాడని, కుమారసంభవ కావ్యం ద్వారా చంగ్రుప్తుని కొడుకు కుమారగుప్తుని జననాన్ని సూచించాడని వీరి వాదం. గుప్తులకాలం భారతదేశ చరిత్రలో స్వర్ణయుగం. అందులో రెండవ చంద్రగుప్తుని కాలం రాజకీయంగా, సాంఘికంగా సుస్థిర సంపన్నమైంది. కాబట్టి కాళిదాసువంటి కవి ఆ కాలంలోనే జీవించివుంటాడని ఆ విమర్శకుల అభిప్రాయం. షేక్స్పియర్ వంటి కవులు బ్రిటిష్ చరిత్రలో స్వర్ణయుగమనబడే ఎలిజబెత్ రాజ్యకాలంలో వున్నారు. దీన్నిబట్టే ఈ విమర్శకులు కాళిదాసుకూడా స్వర్ణయుగమైన చంద్రగుప్తుని రాజ్యకాలంలోనే వున్నాడని చెప్పారేమో. కాళిదాసు రెండవ చంద్రగుప్తుని కాలంవాడన్న

వాదాన్ని కీథ్, మిరాశి, భండార్కర్ వంటి ప్రముఖ విమర్శకులు చాలామంది సమర్థించారు. మరి కొందరు కాళిదాసు కుమారగుప్తుని కాలంవాడని, ఇంకా కొందరు స్కందగుప్తుని కాలం వాడని ప్రతిపాదించారు. కాళిదాసు రెండవ చంద్రగుప్తుని ఆస్థానంలో తన రచనా వ్యాసంగాన్ని ఆరంభించి కుమారగుప్త, స్కందగుప్తుల కాలం వరకు జీవించి వారి ఆస్థానాలను కూడా అలంకరించాడని, అప్పుడు అతని కాలాన్ని క్రీ.శ. 390-460 చెప్పవచ్చునని వింటర్‌నిట్స్ అభిప్రాయం.

భారతదేశ చరిత్రలో స్వర్ణయుగంగా పరిగణింపబడే గుప్తులకాలంలో ముఖ్యంగా విక్రమాదిత్య బిరుదాంకితుడైన చంద్రగుప్తుని ఆస్థానంలో కాళిదాసు వున్నాడన్న వాదం చాలామట్టుకు సమర్థనీయంగా వున్నదనిపించినా దీనికి ఆపత్తిని కలిగించే విషయాలెన్నో కన్పిస్తున్నవి - రెండవ చంద్రగుప్తుడు అంతకుముందున్న మాళవశకాన్నే విక్రమశకంగా మార్చాడని వీరు అంటారు. రెండవ చంద్రగుప్తుని వంటి పరాక్రమవంతుడైన రాజు తనపేరు మీదుగా కొత్త శకాన్ని ఆరంభిస్తాడు కాని మాళవశకాన్ని విక్రమశకంగా మార్చాడని చెప్పటం సమంజసంగా లేదు. అంతేగాక రెండవ చంద్రగుప్తుని కుమారుడు కుమారగుప్తుడు గిర్నార్ శిలాశాసనంలో గుప్త శకాన్నే వాడాడు. అతని తండ్రి ఆరంభించాడనే విక్రమ శకం వున్నట్లయితే అతడు దాన్ని వాడక గుప్తశకాన్ని ఎందుకు వాడుతాడు? అన్న అనుమానం వస్తుంది. శాసనాలల్లో విక్రమశకం తొమ్మిదవ శతాబ్దం నుంచే కన్పిస్తున్నది. కాబట్టి విక్రమశకాన్ని రెండవ చంద్రగుప్తుడు ఆరంభించలేదనే తేలుతున్నది. ఇంకా రెండవ చంద్రగుప్తునికి విక్రమాదిత్యుడన్నది బిరుదనామమే. అంతుకుముందున్న ప్రసిద్ధుడైన విక్రమాదిత్యుడనే రాజు పేరును అతడు బిరుదనామంగా ధరించాడని తెలుస్తున్నది. కాళిదాసు శకారి విక్రమాదిత్యుని ఆస్థానకవి అని ప్రసిద్ధి. రెండవ చంద్రగుప్తునికి శకారి అని బిరుదమున్నట్లు లేదు.

రఘువంశంలో వర్ణింపబడిన రఘుమహారాజు దిగ్విజయవర్ణన సముద్ర గుప్తుని దిగ్విజయాలను ఆధారంగా దేశాలక్రమం వర్ణింపబడిందని విమర్శకుల అభిప్రాయం. ఇదికూడా కేవలం ఊహాగానం మాత్రమే. కాళిదాసు పురాణాలల్లోని దేశాల నామక్రమాన్నే తీసుకొన్నాడు కాని వేరే కాదు, ఇందుమతీ స్వయంవర సందర్భంలో కాళిదాసు మగధ రాజుకు ప్రయోగించిన విశేషణాలు రెండవ చంద్రగుప్తునికి సరిపోతాయని కొందరు తలంచారు. కాని ఇది కూడ భ్రమతో కూడిన ఊహ మాత్రమే. రఘుమహారాజు దిగ్విజయ వర్ణనా సందర్భంలో చేయబడిన "హూణ" ప్రసక్తినిబట్టి హూణులు క్రీ.శ. 4వ శ॥లోనే అంటె

గుప్తుల కాలం లోనే భారతదేశపు సరిహద్దుల్లో కన్పించారని కాబట్టి కాళిదాసు నిశ్చయంగా గుప్తులకాలంవాడని కొందరు విమర్శకులు నొక్కి చెప్తున్నారు. ఈ బలమైన వాదం కూడా యుక్తి సంగతంగా లేదు. ఎందుకంటె హూణులు భారత దేశపు సరిహద్దుల్లో ఎప్పటినుంచో కన్పిస్తున్నారు. వీరి ప్రసక్తి పారసీల "అవెస్తా" మతగ్రంథంలోను మహాభారతంలోను వున్నది. లలిత విస్తరమనే బౌద్ధ గ్రంథంలో ప్రాచీనలిపులను గురించి చెప్తున్నప్పుడు హూణుల ప్రసక్తి వచ్చింది. క్రీ.పూ. 150 ప్రాంతంలో "యూఏచీ" (వీరినే భారతీయులు హూణులని అన్నారు.) జాతి ఆక్సస్ నదికి దక్షిణ ప్రాంతంలోనే నివాస మేర్పరచుకొన్నారని చరిత్ర చెప్తున్నది. కాబట్టి హూణులతో క్రీ.శ. 4వ శ॥లోనే భారతీయులకు పరిచయం ఏర్పడలేదని, దీని ఆధారంగా చేయబడిన కాళిదాసు కాలనిర్ణయం సరికాదని తేలుతున్నది.

కాళిదాసు ప్రయోగించిన "జామిత్ర" శబ్దాన్ని బట్టి అతని కాలం క్రీ.శ. 500 ప్రాంతం అని నిర్ణయించటానికి కొందరు విమర్శకులు పూనుకొన్నారు. "జామిత్ర" శబ్దం గ్రీకు "డాయెమిటన్" నుంచి వచ్చిందని, మొట్టమొదట ఆర్యభట్టు (క్రీ.శ. 500) ప్రయోగించాడని కాబట్టి కాళిదాసు అప్పటివాడో, తర్వాతివాడో కావాలి అని వీరంటారు. ఆర్యభట్టు గుప్తుల కాలం వాడని పండితుల అభిప్రాయం. కాని క్రీ.పూ. 500 ప్రాంతం వాడైన బోధాయనుడు గృహ్యసూత్రంలో "జామిత్ర" శబ్దాన్ని వాడాడు అని తెలుస్తున్నది. కాబట్టి ఈ వాదం కూడా నిలిచేది కాదు.

మందసౌర్‌లో లభించిన వత్సభట్టి లిఖితమైన గుప్తులకాలపు శిలాశాసనం (క్రీ.శ. 473) లోని శైలి కాళిదాసు వైదర్భీశైలిని పోల్చివున్నదని కాబట్టి కాళిదాసు ఆ కాలంవాడే అని కొందరువిమర్శకుల అభిప్రాయం. అసలైతే ఈ ఆధారాన్ని బట్టి వత్సభట్టి కాళిదాసు తర్వాత వాడని, కాళిదాసు శైలీప్రభావాన్ని అతని మీద చూడవచ్చునని చెప్పవచ్చును.

" కుమార సంభవం" కావ్యనామాన్ని కుమార గుప్తుని జననాన్ని పురస్కరించుకొని కాళిదాసు పెట్టాడన్నది కేవలం నామసామ్యంవల్ల చేసిన ఊహ మాత్రమే.

కాళిదాసు ఉజ్జయిని రాజా విక్రమాదిత్యుని ఆస్థానకవి అని ప్రసిద్ధి. కాని గుప్తుల రాజధాని పాటలీపుత్ర నగరం. గుప్తుల కాలంలో ఉజ్జయిని ప్రాంతీయ రాజధానిగా వుండేది. కాని గుప్తులు పాటలీ పుత్రేశ్వరులు, మగధాధీశులుగానే చెప్పుకొన్నారు. ఉజ్జయిని వారికి ప్రధాన నగరం కాదు. అటువంటప్పుడు కాళిదాసు విక్రమాదిత్యుని ఆస్థానకవి అని లోకంలోవున్న కథలనుబట్టి పాటలీ పుత్రేశ్వరుడైన రెండవ చంద్రగుప్త విక్రమాదిత్యుని ఆస్థానకవిగా నిర్ణయించటం సమంజంగా లేదు.

కాళిదాసు రచనల్లో కన్పించే శాంతి సుఖ సంపన్నమయ ప్రజాజీవితం గుప్తరాజుల పరిపాలనాకాలాన్ని సూచిస్తున్నదన్న వాదం కూడ భ్రమ పూర్వకమైంది. గుప్త రాజులకు పూర్వం కూడా ఎన్నో రాజవంశాలు భారతదేశంలో పరిపాలించినవి. ఆ వంశరాజుల పరిపాలనలో భారత ప్రజలు సుఖ సంపన్న జీవితాలను గడిపారు. కాబట్టి కాళిదాసు వర్ణనలు గుప్త కాలానికే సరిపోతున్నవని అతని కాలనిర్ణయాన్ని చేయలేము.

3. **క్రీ.పూ. ప్రథమ శతాబ్దం వాడనే వాదం:-** కాళిదాసు క్రీ.పూ. ప్రథమ శతాబ్ది వాడైన ఉజ్జయిని రాజు మాళవాధిపతి విక్రమాదిత్యుని ఆస్థానకవి అని భారతీయ సంప్రదాయం చెప్తున్నది. ఈ విక్రమాదిత్యుడు శకులను పారదోలి 'శకారి' అన్న బిరుదాన్ని ధరించాడు. క్రీ.పూ. 57లో తన పేరు మీదుగా విక్రమ సంవత్సరాన్ని స్థాపించాడు. శక విజయోత్సవ సందర్భంలోనే అతడు ఈ శకాన్ని ఆరంభించి వుంటాడు. ఈ విక్రమాదిత్యుడు పరాక్రమి, దానగుణ ప్రసిద్ధుడు. ఇతన్ని గురించి ఎన్నో అద్భుత సాహసగాథలు ప్రచారంలో వున్నవి. అయితే అటువంటి ఆ వ్యక్తి చారిత్రక పురుషుడు కాడని, ఆ రాజు వున్నట్లు చారిత్ర కాధారాలేవి లేవని, కాబట్టి కాళిదాసు అతని ఆస్థానంలో వున్నాడనటం ఐతిహ్యమే కాని సత్యం కాదని ఆధునిక విమర్శకులు చాలామంది తోసిపుచ్చారు. జ్యోతిర్విదాభరణమనే జ్యోతిషగ్రంథంలో విక్రమాదిత్యుని ఆస్థానంలో నవరత్నాలుండే వారని, వారిలో కాళిదాసు ఒకడని చెప్పబడింది. ఆ గ్రంథం కాళిదాసు రచనగా భావింపబడుతున్నది. కాని ఆ జ్యోతిష గ్రంథం చాల అర్వాచీనమైంది. దానిలో చెప్పబడిన విక్రమాదిత్యుడు ధారానగర రాజు భోజుడని తేలింది. కాబట్టి విక్రమాదిత్యుడు అనే రాజు ఎప్పుడూ లేడని కొందరు విమర్శకుల వాదం. విక్రమాదిత్యునికి సంబంధించిన శాసనాధారాలుగాని నాణాల ఆధారం గాని ఇంతవరకు దొరకలేదు నిజమే. కాని ఇకముందు దొరకవని నమ్మకమేమున్నది? చారిత్రకాధారాలు లేకున్నా విక్రమాదిత్యుని అస్తిత్వాన్ని గురించి ప్రాచీన సాహిత్యంలో చాలా ఆధారాలున్నవి -

1. క్రీ.పూ. 4వ శతాబ్దంలో అలెగ్జాండరు భారతదేశం మీదికి వచ్చినప్పుడు మాళవ దేశం ఒక గణ రాజ్యంగా వుండేది. వీరు క్షుద్రక గణంతో పొత్తు కలిసి అలెగ్జాండరును ఎదిరించి జరిపిన భీకర పోరాటంలో అలెగ్జాండరు తీవ్రంగా గాయపడినాడు కూడ. ఈ గాయం ఫలితంగానే అతడు తర్వాత బాబిలోనియా నగరంలో జబ్బుపడి మరణించాడని చారిత్రకుల మతం. మాళవగణం ఆ తర్వాత ఉజ్జయిని రాజధానిగా రాజ్యాధికారం చేసింది, ఇటువంటి సాహస పరాక్రమంతో కూడిన మాళవ గణానికి రాజు విక్రమాదిత్యుడు.

2. జైనాచార్యుడు మేరుతుంగ విరచిత పటావళిలో విక్రమాదిత్యుని శక విజయ వృత్తాంతమున్నది. నభోవాహనుని తర్వాత గర్దభిల్లుడు ఉజ్జయినికి రాజైనాడు. గర్దభిల్లుడు అత్యాచారాలు చేయగా కాలకాచార్యుడనే జైన సన్యాసి శకులను ఆహ్వానించి గర్దభిల్లుని నాశనం చేయించాడు. తర్వాత శకులు ఉజ్జయిన్ని 14 సంవత్సరాలు పరిపాలించారు. ఆ తర్వాత గర్దభిల్లుని కొడుకు విక్రమాదిత్యుడు శకులను జయించి ఉజ్జయినికి రాజైనాడు. ఇది మహావీరుని నిర్యాణానంతరం 470 సంవత్సరాలకు (అంటె క్రీ.పూ. 57లో) జరిగిందని చెప్పబడింది.

మరొక "కాలకాచార్య కథానక" గ్రంథాధారాన్ని బట్టి జైన కాలకాచార్యుని సోదరిని గర్దభిల్లుడు ఎత్తుకొని పోయాడని దానితో కోపించి కాలకాచార్యుడు శకులను ఆహ్వానించి గర్దభిల్లుని వినాశం చేయించాడని తెలుస్తున్నది. మొత్తం మీద గర్దభిల్లుడు జైనుల ఆగ్రహానికి గురై ముప్పును తెచ్చుకున్నాడు. అతని కొడుకు విక్రమాదిత్యుడు శకులను జయించి ఉజ్జయిన్ని పునరుద్ధరించాడు. సోమదేవుని కథాపరిత్సాగరంలో విక్రమాదిత్యుడు మహేంద్రాదిత్యుని కొడుకని చెప్పబడింది. విక్రమాదిత్యుడు శివుని గణాలల్లో ఒకడైన మాల్యవంతుడు. మ్లేచ్ఛవినాశార్థం వైదికధర్మ పునరుద్ధరణకు భూమి మీద అవతరించాడు. బౌద్ధజైనమతాల ప్రభావాన్ని అణచి హిందూధర్మస్థాపన చేసాడు. కాబట్టి ఇతన్ని గురించి కథలు గొప్పగా ప్రచారంలో వున్నవేమో. అట్లా హిందూమతోద్ధరణ చేసిన శకారి విక్రమాదిత్యుని ఆస్థానంలోనే కాళిదాసు వుండివుంటాడు.

3. గాథా సప్తశతిలో విక్రమాదిత్యుని ప్రశంస వున్నది -

సంవాహణ సుహరస తోసి ఏణ దంతేణ తుహకరే లక్ఖమ్.
చలణేన విక్కమాయిత్త చరిఅం అణుసిక్ఖి అం అస్సా.

4. ద్వాత్రింశత్పుత్తలిక, రాజావళి మొదలైన రాజస్థాన్‌లో ప్రచారంలో వున్న కథాకావ్యాలల్లో ఇంకా లోకానుశ్రుతిలోను ఉజ్జయిని రాజు శకారి విక్రమాదిత్యుని గురించి అనేక కథలున్నవి.

5. సోమదేవుడు కథా సరిత్సాగరంలో మహేంద్రాదిత్యుని కొడుకు శకారి ఉజ్జయినిరాజు విక్రమాదిత్యున్ని, పాటలీపుత్ర మగధాధీశుడు విక్రమాదిత్యున్ని వేరువేరుగా పేర్కొన్నాడు. కాబట్టి గుప్తరాజు విక్రమాదిత్య బిరుదాంకితుడు రెండవ చంద్రగుప్తుడే, శకారి ఉజ్జయినిరాజు విక్రమాదిత్యుడనే ఆధునికుల వాదం దీన్ని బట్టి తప్పు అని

తెలుతున్నది. పురాణాలల్లో ఉజ్జయిన్ని గర్దభిల్లవంశ రాజులు పరిపాలించినట్లు చెప్పబడింది. గర్దభిల్ల వంశజుడు కాబట్టే విక్రమాదిత్యుని తండ్రి మహేంద్రాదిత్యున్ని కొన్ని కథలు గర్దభిల్లు పేర్కొంటున్నవి.

పుష్యమిత్రుని నాటికి (క్రీ.పూ. 150) పశ్చిమోత్తర దిశలో వున్న యవనులు బలహీనులై నారు. దాదాపు ఈ కాలంలోనే "సిర్-దరియా" నదీ తీరవాసులైన శకులు విజృంభించి బాక్ట్రియా మీదికి దాడులను చేసి యవనరాజ్యాన్ని ఛిన్నా భిన్నం చేసి భారతదేశంలోని మాళవ, గుజరాతు, కఠియవాడ్ ప్రాంతాల వరకు దాడులను జరిపారు. అట్లా విజృంభించిన శకులను ఉజ్జయిని రాజు విక్రమాదిత్యుడు నిర్జించి, పారదోలి, వారి దండయాత్రలను కొద్ది కాలం వరకైనా అరికట్టి శకారాతి బిరుదాన్ని ధరించి వుంటాడు. విక్రమాదిత్యుని తర్వాత శకులు కుషాణ రాజ్యాన్ని స్థిరపరచుకొన్నారు.

ఈ విధంగా విక్రమాదిత్యుడనే రాజు ఉజ్జయిన్ని పరిపాలించినట్లు ఆధారాలు సాహిత్యంలో లభిస్తున్నవి. అటువంటప్పుడు ప్రాచీన భారతీయ సంప్రదాయానుసారంగా కాళిదాసును ఆ రాజు ఆస్థానకవి అని అంగీకరించటంలో ఏమి ఆపత్తి కన్పించటంలేదు. కాళిదాసు ఉజ్జయిని రాజు విక్రమాదిత్యుని ఆస్థానకవియే అని చెప్పటానికి కొన్ని సాక్ష్యాధారాలను చూపించవచ్చును.

1. కాళిదాసు ఉజ్జయిన్ని అభిమానంతో విస్తారంగా మేఘ సందేశాదుల్లో వర్ణించాడు. అతనికి ఉజ్జయిని పరిచయం చాలా వున్నది. కాళిదాసుకు విదర్భాది మధ్య భారతదేశంతో విశేష పరిచయమున్నట్లు కన్పిస్తున్నది.

2. విక్రమోర్వశీయ నాటకం పేరులో "విక్రమ" శబ్దాన్ని తన రాజు పేరమీదుగానే చేర్చి వుంటాడని పండితుల అభిప్రాయం. విక్రమోర్వశీయంలో నాయకుడు పురూరవుడు. అప్పుడు ఆ నాటకానికి పురూరవోర్వశీయమని పేరు పెట్టవచ్చును. కాని కాళిదాసు కథతో సంబంధములేని "విక్రమ" పదాన్ని ఇక్కడ తెచ్చి జోడించాడంటే ఏదో విశేషముండి వుంటుంది. ఆ విశేషం తన ఆశ్రయదాత రాజు పేరు పెట్టాలనే ఉద్దేశం కావచ్చును.

3. కాళిదాసు విక్రమోర్వశీయం ప్రథమాంకంలో "అనుత్సేకఃఖలు విక్రమాలంకారః" అని "దిష్ట్యా మహేంద్రోపకార పర్యాప్తేన విక్రమ మహిమ్నా వర్ధతే భవాన్" అని విక్రమ శబ్దాన్ని విక్రమాదిత్యున్ని, మహేంద్ర శబ్దాన్ని మహేంద్రాదిత్యున్ని సూచిస్తూ ప్రయోగించాడని పండిత విమర్శకుల అభిప్రాయం.

4. కాళిదాసు చిత్రించిన ప్రజాజీవనంమీద బౌద్ధ జైన మతాల ప్రభావం కన్పించటం లేదు. అది శుంగరాజుల కాలంలోను, ఆ తర్వాతను పునరుద్ధరింప బడిన హిందూ సమాజచిత్రణమే అని చెప్పాలి.

5. కాళిదాసు శైలి వాల్మీకాదులకు దగ్గరగా వున్నది. గుప్తులకాలం నాటి ముద్రారాక్షసం, దేవీ చంద్రగుప్త వంటి నాటకాల్లో శైలి సమాసయుక్తమై లాలిత్యాన్ని కోల్పోయింది. ముద్రారాక్షసాది నాటకాల్లో నాటకకళ తక్కువగా శ్రవ్యకావ్య ధర్మాలు చాలా ప్రవేశించినవి. అంటె నాటకాల్లో ప్రదర్శన యోగ్యమైన లక్షణాలు సన్నగిల్లుతున్నవని చెప్పవచ్చును. కాళిదాసు నాటకాలు ప్రదర్శనయోగ్యంగా ఉత్తమ నాటకకళతో వున్నవి. కాళిదాసు చిత్రించిన ఆశ్రమ ప్రాంతాది వర్ణనలు గుప్తులనాటికన్నా శుంగుల నాటికి దగ్గరగా వున్నవి. వీటన్నిటినిబట్టి కాళిదాసు గుప్తుల కాలంనాడు కాక అంతకు చాలా ప్రాచీనుడని చెప్పవచ్చును. అటువంటప్పుడు ఐతిహ్యం ప్రకారం కాళిదాసు క్రీ.పూ. ప్రథమ శతాబ్దం వాడని విక్రమాదిత్యుని ఆస్థాని అని చెప్పుకోవటం సమంజసం.

కాళిదాసు క్రీ.పూ. 2వ శతాబ్దంలో శుంగరాజులకు సమకాలికుడని ఒక వాదం ఉన్నది. భీటా అనే ప్రదేశంలో తవ్వకాలల్లో ఒక మట్టిఫలకం రథారూఢుడైన రాజు, సారథి, ఇద్దరు కృశకాయులైన మునులు, ఆ ప్రక్కనే కూర్చున్న స్త్రీ బొమ్మలు కలది దొరికింది. ఆ రాజు దుష్యంతుడని, స్త్రీ శంకుతల అని, మునులు కణ్వాశ్రమంలోని మునులని విజ్ఞులు తలంచారు. ఆ మట్టిఫలకం శుంగులకాలం నాటిదని చారిత్రకుల అభిప్రాయం. దీన్నిబట్టి కాళిదాసు శుంగులనాటి వాడని స్థిరపడ్తున్నదని కొందరు సాహిత్య విమర్శకులు తలంచారు.

కాళిదాసు శుంగులనాటి వాడనటానికి మరొక బలమైన ఆధారమున్నది- అతడు శుంగరాజు అగ్నిమిత్రుని నాయకునిగా చేసి మాళవికాగ్నిమిత్ర నాటకాన్ని వ్రాసాడు. అగ్నిమిత్రుడు ఉదయన మహారాజువలె ప్రసిద్ధ వ్యక్తి కాదు. అయినా అతన్ని నాయకునిగా చేసి కాళిదాసు నాటకం వ్రాసాడంటె తప్పక అతడు అగ్నిమిత్రుని ఆస్థానంలో వుండే వ్రాసాడని అభిప్రాయం కలుగుతున్నది. అంతేగాక అగ్నిమిత్రుని నాటి సూక్ష్మవిషయాలను కవి విడువక వున్నదున్నట్లు చెప్పాడు. ఒకవేళ మరో విధంగా తెలుసుకుని వ్రాస్తే ఆ అల్ప విషయాలను పాటిస్తూ వ్రాసి వుండేవాడు కాదేమో. ఆ అల్పవిషయాలు కథా దృష్టితో ప్రధానమైనవి కావు. కాబట్టి వదిలివేసినా ఫరవాలేదు. అట్లా వదిలివేయక అల్పవిషయాలను సూక్ష్మదృష్టితో కాళిదాసు చెప్పాడంటె, అతడు అగ్నిమిత్రునికి సమకాలికుడన్న వాదం

బలపడుతున్నది. ఈ వాదాన్ని ప్రతిపాదించి సమర్థించిన వారిలో డా. కున్హన్ రాజా ఒకడు. వారు చూపే సాక్ష్యాధారాలు -

1. మేఘసందేశంలో కాళిదాసు విదిశా నగరాన్ని రాజధాని నగరంగా వర్ణించాడు - "తేషాం దిక్షుప్రథిత విదిశా లక్షణాం రాజధానీమ్". ఆ గుర్తింపును కాళిదాసు ఉజ్జయినికి కూడ ఇయ్యలేదు. శుంగరాజు అగ్నిమిత్రుని కాలంలోనే విదిశ విదర్భదేశానికి రాజధానిగా వుండేది. మాళవికాగ్నిమిత్ర నాటకంలో అగ్ని మిత్రుడు విదర్భకు రాజప్రతినిధిగా విదిశలోనే వున్నట్లు వున్నది. చారిత్రకంగా ఇది సత్యమే.

2. రఘువంశంలో దిలీపుని అశ్వమేధయాగం, రఘు దాని రక్షణకై పోవటం పుష్యమిత్రుని అశ్వమేధయాగం, అశ్వం రక్షణకు అతని మనుమడు వసుమిత్రుడు పోయి యవనులను జయించటాన్ని దృష్టిలో పెట్టుకొని వ్రాసాడని విమర్శకుల అభిప్రాయం. వసుమిత్రుని యాగాశ్వ రక్షణను కాళిదాసు మాళవికాగ్నిమిత్రంలో చెప్పాడు కూడా.

3. మగధపాలకుడైన పుష్యమిత్రుడు "సేనాపతి" అని తనను తాను పేర్కొన్నట్లు మాళవికాగ్నిమిత్రం పంచమాంకంలో "స్వస్తి యజ్ఞశరణాత్సేనాపతిః పుష్యమిత్రో విదిశస్థం పుత్రమాయుష్మంత మగ్నిమిత్రం స్నేహాత్పరిష్వజ్య దమను దర్శయతి" అన్న మాటలవల్ల తెలుస్తున్నది. అయితే పుష్యమిత్రుడు మౌర్యుల సేనాపతి. చివరి మౌర్యరాజు బృహద్రథుని చంపి మగధాధీశుడైనా కూడా తనను తాను "సేనాపతి" అని పేర్కొనట్లు శాసనాధారం వున్నది. ఇంత సూక్ష్మ విషయాన్ని కాళిదాసు విడువక పేర్కొనటం అతని ప్రత్యక్ష పరిచయాన్ని నిరూపిస్తున్నదని ఈ విమర్శకుల వాదం.

4. అంతగా చరిత్ర ప్రసిద్ధం కాని యజ్ఞసేన, మాధవసేనుల దాయాదవైరాన్ని కాళిదాసు మాళవికాగ్నిమిత్రంలో వివరించాడు. విదర్భాధిపత్యానికి వీరిద్దరు పోరాడుతుండగా అగ్నిమిత్రుడు పుష్యమిత్రునికి ప్రతినిధిగా పోయి రాజ్యాన్ని ఇద్దరికి పంచియిచ్చి వారి తగవును తీర్చి రాజకీయ సమస్యను పరిష్కరించాడు. ఇంకా అగ్నిమిత్రుని బావమరది సరిహద్దు రక్షణ కొరకు నియమింపబడినవాడు శూద్రకులజుడని కాళిదాసు చెప్పాడు - ఈ చిన్న విషయాలన్నీ కాళిదాసు చెప్పటం చేత అతడు సుపరిచితమైన సమకాలికేతివృత్తాన్నే తీసుకున్నాడనటాన్ని బలపరుస్తున్నాయని విమర్శకుల అభిప్రాయం.

5. మాళవికాగ్నిమిత్రం భరత వాక్యంలో కాళిదాసు అగ్నిమిత్రుని రాజ్యపాలనను వర్ణించాడు. అట్లా నాయకుని రాజ్యపాలనను వర్ణించటం ముద్రారాక్షసాది నాటకాలల్లో

వున్నది. కాని కాళిదాసు అగ్నిమిత్రుని పాలనను సమకాలికేతివృత్తంగా వర్ణించాడని, అందుచేత ఈ నాటకం అగ్నిమిత్రుని సమయంలోనే కాళిదాసుచేత వ్రాయబడి ప్రదర్శింపబడిందనే కున్హన్‌రాజా అభిప్రాయం.

అగ్నిమిత్రుని వంటి అంతగా ప్రసిద్ధుడుకాని రాజును నాయకునిగా చేసి రాజకీయ సమస్యను నేపథ్యంగా తీసుకొని కాళిదాసు మాళవికాగ్నిమిత్ర నాటకాన్ని వ్రాసాడంటే ఆ వృత్తాంతం జరిగిన కాలంలోనో లేక ఆ వృత్తాంతం ఇంకా తాజాగా స్మృతిపథంలో నిలిచివున్న సమయంలోనో అతడు వ్రాసాడని నిర్ణయించ వలసివుంటుంది. ఒకవేళ కాళిదాసు క్రీ.పూ. 150 ప్రాంతంలో అగ్నిమిత్రునికి సమకాలికుడుగా జీవించాడని దీన్నిబట్టి అంగీకరిస్తే సంప్రదాయం ప్రకారం అతడు ఉజ్జయిని విక్రమాదిత్యుని ఆస్థాని అనటాన్ని తోసిపుచ్చవలసి వుంటుంది. అగ్నిమిత్రుని తర్వాత కూడా విదిశను పాలించిన ఒక శుంగరాజు ఆస్థానంలో కాళిదాసు వుండి అగ్నిమిత్రుడు విదర్భ రాజకీయ సమస్యను పరిష్కరించిన వృత్తాంతాన్ని ఇతివృత్తంగా తీసుకొని కాళిదాసు నాటకంగా వ్రాసి ప్రదర్శింపజేసి వుంటాడని, తర్వాత అతడు విక్రమోర్వశీయ రచన నాటికి ఉజ్జయినిలో విక్రమాదిత్యుని ఆశ్రయంలో చేరివుంటాడని అనుకున్నట్లయితే చాలా ప్రశ్నలకు సమాధానాలు దొరుకుతవి.

## కాళిదాసు జన్మస్థలం

కాళిదాసు కాలనిర్ణయం ఎంత అభిప్రాయభేదంతో కూడుకొన్నదో అతని జన్మస్థల నిర్ణయం కూడ అంత అభిప్రాయభేదంతో కూడుకున్నదే. కాళిపూజ బెంగాల్ ప్రదేశంలో ఎక్కువ ప్రచారంలో వుంది కాబట్టి కాళీభక్తుడైన కాళిదాసు మావాడని బెంగాలీలు వాదించారు. ముర్షిదాబాదు జిల్లాలోని గడ్డాశింగార్‌లో కాళిదాసు జన్మించాడని ఏటేటా ఉత్సవాలు కూడా జరుపుతున్నారు. బెంగాల్ లో నెలలను శుక్ల కృష్ణపక్షాలుగా విభజించరు. కాళిదాసు "ఆషాఢస్య శుక్లపక్షస్య ప్రథమదివసే" అని అనకుండా "ఆషాఢస్య ప్రథమ దివసే" అని అనటం అతడు బెంగాలీ వాడని నిరూపిస్తున్నదని అంటారు. కాని రెండు వాదాలు బలంగా లేవు. కాళీపూజ ఒకప్పుడు మధ్యభారతంలోను బాగా వ్యాపించివుండేది. శివునితోపాటు శివరాణి కాళి, దుర్గ, చాముండికల పేర్లతో పూజలందుకునేది. ఇక రెండవవాదం- "ఆషాఢస్య శుక్లపక్షస్య ప్రథమదివసే" అని అనలేదు కాబట్టి కాళిదాసు బెంగాలీవడనటం హాస్యాస్పదం. కాళిదాసు రఘువంశంలో వరిధాన్యాన్ని ఒకచోట ఉపమానంగా చెప్పాడు కాబట్టి వరి విరివిగా పండే బెంగాల్ ప్రాంతంవాడని అంటారు. కాని ఇదికూడ బలమైన

వాదంకాదు. కాళిదాసుకు బెంగాల్‌లో పుడ్తేనే వరిధాన్యంతో పరిచయం కలుగుతుందనటం సమంజసంగా లేదు. కాళిదాసు ఎక్కడా వంగదేశాన్ని అభిమానంగా వర్ణించలేదు.

కాళిదాసు రచనల్లో హిమాలయాలు ఉన్నత స్థానాన్ని వహించినవని, అతనికి హిమాలయాలు సుపరిచితాలని కాబట్టి అతడు కాశ్మీరవాసి అని లక్ష్మీధర్ ప్రతిపాదించాడు. కాళిదాసు కాశ్మీరాన్ని ఎక్కడా అభిమానంతో వర్ణించలేదు. కాళిదాసు పేరు కాశ్మీర దేశవాసుల నామంవలె లేదు. కల్హణ, బిల్హణ, రుద్రట, కయ్యటాదుల పేర్లు కాశ్మీరదేశీయులవి కాని కాళిదాసనటం కాదు.

మాళవికాగ్నిమిత్రంలో విదర్భదేశాన్ని కాళిదాసు నేపథ్యంగా తీసుకొన్నాడని, మేఘసందేశంలోని యక్షుడు ప్రవాసం గడిపేచోటు రామగిరి విదర్భలోనిదని, కాళిదాసు శైలి వైదర్భి అని, అతడు విదర్భ ప్రాంతంవాడని కొందరు విమర్శకులు తలంచారు.

కాళిదాసు హూణరాజు మిహిరకులుని జయించిన యశోధర్మ (క్రీ.శ. 528) ఆస్థానకవి అని అతడు అందుచేత దశపుర లేక విదిశనివాసి అని మహామహోపాధ్యాయ హరప్రసాదశాస్త్రి, ఎస్.ఎమ్. పరాంజపేలు ప్రతిపాదించారు. విదిశాప్రాంతాన్ని అతడు చాలా విస్తరంగా, చిన్నచిన్న నదీ పర్వతాలను కూడ విడువక వర్ణించటమే దీనికి తార్కాణమని వారి వాదం. కాళిదాసు ఆ ప్రాంతాన్ని సూక్ష్మంగా వర్ణించాడంటె ఆ ప్రాంతాన్ని బాగాతెలిసినవాడని తెలుస్తున్నది.

అలకానగరానికి యక్షుడు ప్రేమసందేశాన్ని పంపుతూ మేఘంతో "నీవు తొందరలో వున్నాసరే, వంకరదారి అయినాసరే ఉజ్జయిన్ని దర్శించమని" చెప్తాడు. ఉజ్జయినిలో ఎత్తైన హార్మ్యాలను పౌరాంగనల కుటిల కటాక్షాలను చూడనివాని జీవితం నిష్ఫలమని కాళిదాసు భావించాడు. ఉజ్జయిని పరిసర ప్రాంతంలోని ప్రకృత్యాదులతో కూడ కాళిదాసు సుపరిచితుడు. ఉజ్జయిని పేరెత్తగానే అతని హృదయం మెత్తనై ఉరకలు వేసింది. ఉజ్జయినిమీద అతనికున్న అభిమానాన్ని అది చాటుతున్నది. మధ్యభారతంలోని ఉజ్జయిని, విదర్భ, విదిశ, మాళవ ప్రాంతాలు అతనికి సుపరిచితాలని చెప్పవచ్చును. కాబట్టి కాళిదాసు జన్మస్థానం ఈ ప్రాంతాల్లోనే వుండివుంటుంది. అతడు విదిశ, ఉజ్జయిని నగరాల్లో చాలా కాలం రాజుల ఆదరణలో నివసించి వుంటాడు.

## కాళిదాసు జీవితవిశేషాలు - పాండిత్యం

కాళిదాసు జీవితాన్ని గూర్చి అతని రచనలనుబట్టి ఏమి తెలియటంలేదు. కేవలం లోకంలో ప్రచారంలో వున్న ఐతిహ్యాలు, రచనల్లోని అంతస్సాక్ష్యాలే అతని జీవితవిశేషాలను తెలుసుకోవటానికి ఆధారాలు. కాళిదాసు జీవితాన్ని చెప్పే కథలు కొన్ని ప్రచారంలో వున్నవి-వాటినిబట్టి కాళిదాసు మొదట ఒక మూర్ఖుడైన గొల్లవాడని తెలుస్తున్నది. విద్యావతి అనే రాకుమారి తనను శాస్త్రవాదంలో ఓడించిన వాన్నే పెండ్లాడుతానని అనగా ఆమెతో ఓడిపోయిన పండితులు ఆమెకు గర్వభంగం చేయదలచి ఉపాయంతో గొల్లవాడైన కాళిదాసుకిచ్చి వివాహం చేసారు. ఆమె తర్వాత అసలు విషయం తెలుసుకొని దుఃఖించి కాళిదాసును ఇంటినుంచి వెళ్ళగొడ్తుంది. కాళిదాసు కాళిమాతను ఆరాధించి ఆమె వరప్రసాదంతో కవితా ప్రతిభను సంపాదించాడట. అందుకే అతనికి కాళిదాసు అని పేరు కలిగిందట! కాళిదాసు తిరిగి విద్యావతి దగ్గరికి పోయి తలుపు తట్టగా ఆమె "అస్తి కశ్చిత్ వాగ్విశేషః" అని అడిగిందట. అప్పుడు కాళిదాసు "అస్తి"తో ఆరంభించి కుమారసంభవాన్ని, "కశ్చిత్"తో ఆరంభించి మేఘసందేశాన్ని, "వాక్"తో ఆరంభించి రఘువంశాన్ని రచించాడట! మరొక కథ ననుసరించి కాళిదాసు సింహళరాజా కుమారదాసు రచించిన "జానకీ హరణ' కావ్యాన్ని ప్రశంసించగా అది విని ఆ రాజు అతన్ని సింహళానికి ఆహ్వానించాడు. అక్కడ రాజు కాళిదాసులకు పరస్పర గాఢమైత్రి ఏర్పడిందట. కాళిదాసుకు అక్కడ ఒక దాసితో (వేశ్యతో?) సంబంధమేర్పడిందట. ఆమె వల్ల కాళిదాసు మృత్యువు పాలయ్యాడట. కొన్ని ఐతిహ్యాలు ఒకొకసారి ఏదో ఒక విషయాన్ని ప్రపంచించటానికి పుడ్తుంటవి. మరికొన్ని ఐతిహ్యాలు వాస్తవిక సత్యం మీద ఆధారపడినవి కూడా వుంటవి. ఇతరాధారాలు లేకుండా ఐతిహ్యాన్ని విశ్లేషించి సత్యాన్ని చెప్పటం కష్టం.

రఘువంశ ప్రథమ సర్గలో వశిష్ఠుని ఆశ్రమాన్ని, పంచమ సర్గలో వరతంతు ఆశ్రమాన్ని, అభిజ్ఞాన శాకుంతలంతో కణ్వ, మారీచుల ఆశ్రమాలను కాళిదాసు చక్కగా సహజంగా వర్ణించాడు. అతడు ప్రాచీన భారతంలోని ఏదో ఒక గురుకులంలో విద్య నభ్యసించి వుంటాడని మహామహోపాధ్యాయ వి.వి. మిరాశి ఈ వర్ణనలను బట్టి చెప్పవచ్చునన్నాడు.

కాళిదాసు రచనలను బట్టి అతడు వేద బ్రాహ్మణ ఉపనిషత్తులను చదివిన వాడని, దార్శనిక శాస్త్రాలను లోతుగా అవలోకించిన వాడని తెలుస్తున్నది. ఇంకా అతనికి అర్థశాస్త్ర, ధర్మశాస్త్ర, నీతిశాస్త్ర, కామశాస్త్ర, అలంకార, నాట్యశాస్త్రాలల్లో మంచి ప్రవేశమున్నది. ఇంకా

అతనికి సంగీత చిత్రకళాదుల జ్ఞానం కూడ వున్నది. ఈ శాస్త్ర జ్ఞానమే కాక లౌకిక జ్ఞానం కలవాడు. కాళిదాసు ప్రకృతి ప్రేమి. చుట్టూ వున్న ప్రదేశాలను సూక్ష్మ దృష్టితో పరిశీలించే శక్తి కూడ అతనికి వున్నది. తన చుట్టూ జరిగే విషయాలను అతడు ఆసక్తితో పరిశీలించే అనురాగహృదయుడుగా కన్పిస్తాడు. తన పరిసరాలల్లో ఏమి జరుగుతుందో తెలుసుకోక కేవలం ఊహాలోకంలో, శాస్త్రాధారంగా విషయాన్ని చెప్పేవాడు కాదు. అందుకే అతడు చెప్పిన అర్థాంతన్యాసాద్యలంకారాలల్లో ఎంతో లోకానుభవం, పరిశీలనా శక్తి ప్రకటమౌతున్నవి.

కాళిదాసు శివాభిమాని అని అతని రచనలను బట్టి తెలుస్తున్నది. ఒకవేళ అతడు ఉజ్జయినిలోని మహాకాలుడైన శివున్ని ఆరాధించేవాడేమో. "ఉజ్జయిన్ని ఏ సమయంలో చేరుకున్నా సరే సూర్యాస్తమయం వరకు ఆగి అప్పుడు జరిగే పూజను దర్శించు. దానితో నీకు అశేష పుణ్యం లభిస్తుంద"ని యక్షుడు మేఘునితో చెప్పిన దాన్ని బట్టి మహాకాల పూజ కాళిదాసుకు ఎంత ప్రియమో తెలుస్తున్నది. కాళిదాసు శివాభిమాని అయినా శ్రీరాముని, అతని వంశజుల చరిత్రను రఘువంశంగా రచించాడు. అతడు కృష్ణ సంబంధ కథనేది తీసుకోలేదు. కాని అతడు శివ కేశవుల విషయంలో సమదృష్టి కలవాడు.

కాళిదాసు శైవుడు, దార్శనిక జ్ఞానం కలవాడు. అట్లా అని అతడు ప్రాపంచిక విషయాలమీద అనురాగం లేనివాడు కాదు. అతడు సరసహృదయుడు. అతని ప్రకృతి, శృంగార వర్ణనలు అతన్నొక విలాసానురాగం గల పురుషునిగా నిలబెడ్తున్నవి. యక్షుడు భార్యా విరహంతో మేఘునిద్వారా సందేశాన్ని పంపటం కాళిదాసు వంటి సరస హృదయుడే చేయగలుగుతాడు. ఆశ్రమాలను ఆశ్రమ జీవితాన్ని ఎంత సహజంగా చిత్రించాడో పట్టణ ప్రజలు, రాజ మందిరాలల్లోని రాజుల జీవితాలను కూడ అతడు అంత సహజంగానే చిత్రించాడు. అతనికి పట్టణాలతో, భోగ విలాసాలతో పరిచయమున్నా పట్టణంలోని హడావుడి జీవితం కన్న ఆశ్రమ ప్రాంతంలోని ప్రశాంత జీవితం మీదనే అభిమానమని శాకుంతలంలోని పంచమాంకంలోని తపస్వి మాటలను బట్టి తెలుస్తున్నది.

కాళిదాసుకు పాండిత్య గర్వం కాని కవితాభిమానం కాని లేదు. అతడు సరళ సరస హృదయుడు, మృదు హృదయుడు. పరుషంగా, కఠినంగా మాట్లాడటం అతని ప్రకృతిలో లేదు. అందుకే కుమారసంభవంలోని తారకాసురుని దుండగాల వర్ణనను కూడ అతడు రమ్య మధురంగా వర్ణించాడు. ఎవరిమీద అతనికి ద్వేషభావమున్నట్లు కన్పించదు. ఆశ్రమ ప్రాంతాలన్నా, మునులన్నా అతనికి అపార గౌరవం. ధర్మరక్షణ రాజుల ధర్మమని అతని విశ్వాసం.

## కాళిదాసు ఆభీరుడా?

కాళిదాసు గొల్లవాడని ప్రచారంలో వున్నది. ఒకవేళ అతడు ఆభీర గణానికి చెందినవాడేమో! ఆభీరులు శక, పహ్లావాదుల వలెనే విదేశీయ జాతి. వారు భారతదేశంలో స్థిరపడింతర్వాత భారతీయతను పాటించారు. వారి గణరాజ్యం మొదట సింధునది ప్రాంతంలో వుండేది. తర్వాత మాళవదేశానికి దక్షిణదిశలో వుండేది. కాశికాకారుడు (4-1-4), మహాభాష్యకారుడు (1-2-52) ఆభీరులను శకయవనాదుల వలెనే శూద్రులుగా పేర్కొన్నారు. ఆభీరులను కేవలం శూద్రులుగానే కాక మహాశూద్రులు లేక ఉచ్చశూద్రులు అని కూడ పేర్కొన్నారు. వీరు వైదికమత దూరులైన విదేశీయజాతి కావటంచేత అట్లా పేర్కొనబడటం జరిగింది. ఆభీరులు పశుపాలన ప్రధానవృత్తిగా కలవారు. కాళిదాసు అట్లాంటి ఆభీరజాతికి చెందినవాడు కాబట్టే గొల్లవాడనే కథలు ప్రచారంలోకి వచ్చివుంటవి. కాళిదాసు బ్రాహ్మణుడని ఎక్కడా ఎప్పుడూ చెప్పబడలేదు. కాళిదాసు కొంత ఈడు వచ్చింతర్వాత సంస్కృతాన్ని అభ్యసించి శాస్త్ర పాండిత్యాన్ని సంపాదించి కవిత్వం చెప్పివుంటాడు. కాళిదాసు నాటికి ఆభీరులు హిందూ సమాజంలో స్థిరపడిపోయారు. హిందూదేశంలోని రాజులకంటె శకవంశాది రాజులు భారతీయతను సంతరించుకొని సంస్కృతాన్ని ప్రోత్సహించారు. ఇక్కడి రాజులు ప్రాకృత ప్రేమికులు కాగా శకాదిరాజులు సంస్కృత ప్రేమికులై సంస్కృత రచనలను చేపట్టి సంస్కృత కవులను పోషించారు. శాతవాహనాది రాజులు ప్రాకృత ప్రేమికులై ప్రాకృత గ్రంథ రచనలను ప్రోత్సహించటమే కాక శాసనాలను కూడ ప్రాకృతంలోనే వేయించారు. అదే రుద్రదామాది శకరాజులు శాసనాలను సంస్కృతంలో వేయించారు. సంస్కృతంలో మొదటి శాసనం రుద్రదాముడనే శకరాజు (క్రీ.శ. 150 ప్రాంతం) వేయించిందే! కాళిదాసు ఎక్కువ కాలాన్ని ఉజ్జయినిలో గడిపివుంటాడు. ఆభీరుల గణరాజ్యం మాళవ గణానికి సమీపంలోనే వుండేది. అందులో ఉజ్జయిని విద్యలకు నిలయం. కాబట్టి కాళిదాసు ఉజ్జయినికి వచ్చి అక్కడే శాస్త్రాభ్యాసాన్ని చేసివుంటాడు. ఆభీరులు చాలావరకు శివాభిమానులు. కాళిదాసు కూడ శివాభిమాని. ఆభీరజాతికి చెందిన కాళిదాసు వివాహం ఏదో విద్యావతి అయిన రాజకుమారితో అయి వుంటుంది. అంతగా చదువురాని కాళిదాసును ఆమె చులకనచేసి వుంటుంది. దానితో అతడు పట్టుదలతో సంస్కృతభాషా సాహిత్య దర్శనాదులను అధ్యయనం చేసివుంటాడు. అతనికి విదర్భ, ఉజ్జయిని రాజ్యాలతో మంచి సంబంధం ఏర్పడింది. అందుకే అగ్నిమిత్రుని కథను తీసుకొని ఒక నాటకాన్ని, తర్వాత 'విక్రమ' పేరుతో ఉజ్జయిని రాజు విక్రమాదిత్యుని కీర్తిస్తు విక్రమోర్వశీయ నాటకాన్ని వ్రాసి వుంటాడు.

## కాళిదాసు నాటకాలు

కాళిదాసు పేర మూడు నాటకాలు కన్పిస్తున్నవి - మాళవికాగ్నిమిత్రం, విక్రమోర్వశీయం, అభిజ్ఞాన శాకుంతలం. అంతరంగ సాక్ష్యాలనుబట్టి, రచనా కౌశలాన్ని బట్టి వీటి రచనా క్రమం ఇదే అని చెప్పవచ్చును. భాస, సౌమిల్ల, కవిపుత్రాది ప్రసిద్ధ కవుల రచనలుండగా వర్తమానకవి చేసిన రచన ఎట్లా ఆదరింప బడుతుందనే జంకు మాళవికాగ్నిమిత్రం ప్రస్తావనలోని మాటలను బట్టి తెలుస్తున్నది. ఈ జంకు విక్రమోర్వశీయ రచనానాటికి లేదు. పూర్వకవుల రసవంతమైన నాటకాలెన్ని వున్నా కాళిదాసు రచించిన 'నవీన' నాటకాన్ని ప్రేక్షకులాదరిస్తారనే ఆత్మవిశ్వాసం విక్రమోర్వశీయ రచన నాటికి కాళిదాసుకు కలిగింది. తర్వాత రసభావవిశేషాలు తెలిసిన పండితులు గల విక్రమాదిత్యుని నిండుసభలో నాటకాన్ని ప్రదర్శించే సంపూర్ణ ఆత్మవిశ్వాసం కాళిదాసుకు శాకుంతలం నాటికి కలిగింది.

## మాళవికాగ్నిమిత్రం

ఈ నాటకంలో 5 అంకాలున్నవి. దీనిలో నాయకుడు శుంగవంశరాజు అగ్నిమిత్రుడు. అతని భార్య ధారిణి. రాజు మాళవిక చిత్రపటాన్ని చూసి మోహితుడౌతాడు. అట్లా అగ్నిమిత్రుని ఆకర్షించిన నాట్యప్రతిభగల సుందరి ఎవరో కాళిదాసు ముందే ప్రేక్షకులకు తెలియనివ్వకుండ చివరివరకు గోప్యంగా పెట్టి కుతూహలాన్ని నిలిపాడు. మాళవిక మాళవరాజా మాధవసేనుని చెల్లెలు. మాధవసేనుడు మాళవికను అగ్నిమిత్రునికిచ్చి వివాహం చేయాలని ఆమెను తీసుకొని బయలుదేరుతాడు. మార్గమధ్యంలో అతని దాయాది యజ్ఞసేనుడు అతన్ని ఎదిరిస్తాడు. మాధవసేనుడు బంధింపబడ్తాడు. మాళవిక తప్పించుకొని పోయి అగ్నిమిత్రుని సైనికులకు దొరుకుతుంది. వారామెను అగ్నిమిత్రుని రాణి ధారిణికి అప్పగిస్తారు. అంతఃపురంలో అగ్నిమిత్రుడు మాళవికను చూసి ప్రేమిస్తాడు. విదూషకుని ఉపాయంతో మాళవిక అగ్నిమిత్రులు కలుసుకొంటారు. మాళవిక అగ్నిమిత్రుని కంటబడకుండ ధారిణి దాచేస్తుంది. మాధవసేనుని పరివారం అగ్నిమిత్రుని దగ్గరికి వస్తారు. వారు మాళవికను గుర్తించి ఆమెను గురించి చెప్తారు. అప్పుడు ధారిణి మాళవికాగ్నిమిత్రుల వివాహాని కంగీకరిస్తుంది.

ఈ నాటకంలోని పాత్రలు, సంఘటనలు చారిత్రకమైనవే అయినా కథా సంవిధాన కల్పన కాళిదాసుదే. కాని ఇటువంటి కథ ఒకటి కథాసరిత్సాగరంలో కన్పిస్తున్నది. దానిలో

నాయకుడు ఉదయనుడు. రాణి వాసవదత్త. ఉదయనుడు ప్రేమించిన స్త్రీ బంధుమతి. వాసవదత్త సోదరుడు బంధుమతిని ఆమెకు బహుకరిస్తాడు. ఉదయనుడు బందుమతిని ప్రేమించాడని తెలిసి వాసవదత్త అసూయచెందుతుంది. చివరకు సాంకృత్యాయనుని సలహామీద బంధుమతిని ఉదయనునికిచ్చి వివాహం చేస్తుంది. ఒకవేళ కథా సరిత్సాగరకారుడే కాళిదాసు కథాక్రమాన్ని దొంగిలించాడేమో చెప్పలేము. కాని ఇటువంటి రాజుల అంతఃపుర ప్రేమలు సామాన్యమై వుంటాయేమో కూడ. ఈ నాటకం శాకుంతలంవలె గంభీరమైన ఇతివృత్తం కలది కాదు. ప్రేమ, హాస్యవృత్తాంతాలతో కథ తేలికగా సాగింది. నేపథ్యంగా రాజకీయ సమస్యను తీసుకొన్నా దానికి ఎక్కువ ప్రాధాన్యమియ్యబడలేదు. ఐదు అంకాలల్లోని మొదటి రెండు అంకాలల్లో అగ్నిమిత్రుడు మాళవిక చిత్రపటాన్ని చూచి ప్రేమించటం, ఇది తెలిసి రాణి మాళవికను రాజా దృష్టినుంచి తప్పించటం, విదూషకుడు నాట్యాచార్యులకు వివాదం పుట్టించి నాట్యపరీక్షను ఏర్పాటు చేసి దానికి రాజును ఆహ్వానించి అక్కడ రాజుకు మాళవికను చూపించటం - ఇంత కథ మాత్రమే చెప్పబడింది. కాళిదాసు నృత్య, సంగీత, చిత్ర కళల ప్రసక్తులతో నాటకాన్ని లలితంగా నడిపాడు. ఇతివృత్తం తేలికగా వుండటం చేత ఈ నాటకం కాళిదాసు కృతి కాదని విల్సన్ అభిప్రాయపడినాడు. కాని కాళిదాసుది ఇది మొదటి నాటకం. కాబట్టి అతడు దీన్ని తన కళాప్రియతను ప్రదర్శిస్తు మధుర సరస హృదయాని కనుగుణంగా వ్రాసాడు. శాకుంతలమేమో అతని పరిక్వబుద్ధిని ప్రకటించే రచన. శైలి, నాటక నిర్వహణాదులు ఇది కాళిదాసు రచన అనే చెప్తున్నవి.

మాళవికాగ్నిమిత్ర నాటకంలో విదూషకుని పాత్రకు ప్రాధాన్యమున్నది. అతడు నాయకుని అంతరంగ మిత్రుడు. విదూషకుడు దీనిలో కేవలం హాస్య పాత్ర కాదు. అతని తీక్షణ బుద్ధివిశేషం చేత అగ్నిమిత్రునికి మాళవికను చూపగలిగినవాడు. నాట్యాచార్యుల నాట్యపరీక్షను పెట్టించిన తీరు విదూషకుని కార్యనిర్వహణ దక్షతకు తార్కాణం. ధారిణి మాళవికను బంధించగా విదూషకుడు పాము కరచినట్లుగా నటించి ధారిణి నాగముద్రికను సంపాదించి మాళవికను విడిపిస్తాడు. విదూషకుని బుద్ధికుశలతతోనే నాటకమంతా నడుస్తుంది. శాకుంతలంలోని విదూషకునివలె ఈ విదూషకుడు మట్టిబుఱ్ఱ కలవాడు, పిరికివాడు కాదు. విక్రమోర్వశీయంలోని విదూషకునివలె కేవలం రాజుకు ప్రియసఖుడు కాదు. తన బుద్ధికుశలతతో నాయకున్ని అతని ప్రియురాలితో కలిపిన కార్యనిపుణుడు.

మాళవికాగ్నిమిత్రం ఇంగ్లీషు, జర్మన్ మొదలైన యూరోపియన్ భాషల్లోకి అనువదింపబడింది. ఈ నాటకం షేక్స్పియర్ 'కామెడీ' నాటకాలను తలపిస్తున్నదని

వింటర్‌నిట్స్ అన్నాడు. ఈ నాటక కథావిధానాన్ని తర్వాత నాటకకారు లెందరో అనుసరించి "నాటిక" అనే ఉపరూపకాలను రచించారు. మాళవికాగ్నిమిత్రంలో 5 అంకాలు వున్నవి. అంతేగాని లేకపోతే 'నాటిక' ప్రక్రియకు కావలసిన లక్షణాలన్నీ దీనిలో ఉన్నవి. దీనిలోని మొదట రెండు అంకాలను కలిపి ఒక అంకంగా చేయవచ్చును. అసలు అవి ఒక్క అంకంగా కన్పిస్తున్నవి. అటువంటప్పుడు ఇది నాలుగు అంకాలు గల 'నాటిక' అనే చెప్పవచ్చును.

## విక్రమోర్వశీయం

ఈ నాటకంలో 5 అంకాలున్నవి. ఇది ఉపరూపక భేదమైన త్రోటకం. నాయకుడు పురూరవుడు, నాయిక అప్సరస ఊర్వశి. పురూరవుని విక్రమం చేత ఊర్వశి పొందబడింది కాబట్టి ఈ నాటకానికి కవి విక్రమోర్వశీయమని పేరు పెట్టాడు. ఊర్వశీ పురూరవుల వృత్తాంతం ఋగ్వేద (10 మండలం 95 సూక్తం) ప్రసిద్ధమైంది. ఈకథే శతపథబ్రాహ్మణంలోను చెప్పబడింది. తర్వాత విష్ణు,మత్స్య,భాగవత పురాణాలల్లోను కన్పిస్తున్నది. ఆ కథను ఆధారంగా తీసుకొని కాళిదాసు ఈ నాటకాన్ని వ్రాసాడు. కాళిదాసు మత్స్యపురాణ కథాక్రమాన్ని అనుసరించాడని విల్సన్ గుర్తించాడు.

అప్సరస ఊర్వశిని కేశి అనే రాక్షసుడు ఎత్తుకొని పోతుండగా ప్రతిష్ఠానాధిపతి పురూరవుడు ఆమెను రక్షిస్తాడు. ఊర్వశీ పురూరవులు పరస్పరం ప్రేమపాశ బద్ధులవుతారు. ఊర్వశి స్వర్గం నుంచి వచ్చి ఒక ఆకు మీద ప్రేమ సందేశాన్ని వ్రాసి పడేస్తుంది. విదూషకుని అజాగ్రత్తవల్ల ఆ ప్రేమలేఖ రాణి ఔశీనరి చేతిలో పడ్తుంది. అది చదివి ఆమెకు కోపం వస్తుంది. పురూరవుడు అనునయ వినయాలతో ఆమెను ఊరడిస్తాడు. ఇంద్రసభలో ఊర్వశి అభినయం చేస్తు అన్యమనస్కురాలై "పురుషోత్తమ" అనటానికి బదులు "పురూరవ" అని అంటుంది. ఆ దోషానికి భరతముని కోపించి ఆమెను భూలోకం పొమ్మని శపిస్తాడు. ప్రియుని చేరుకొని పుత్రవతి అయ్యేంతవరకు వుండమని ఇంద్రుని కోరిక మీద అతడు శాపాన్ని మారుస్తాడు. ఊర్వశి నిషేధింపబడిన వనంలో ప్రవేశించి మణితో లతను తాకగా ఆమె తిరిగి ఊర్వశిగా మారుతుంది. ఊర్వశిని వివాహమాడి పురూరవుడు రాజధానికి వస్తాడు. వారికి ఆయువనే కుమారుడు జన్మిస్తాడు. శాపం ప్రకారం ఊర్వశి భర్తృవియోగంపొంది కుమారున్ని చ్యవనమహర్షి దగ్గర వదులుతుంది. ఊర్వశి విరహంతో దుఃఖితుడైన పురూరవుని దగ్గరికి నారద మహర్షివచ్చి దేవదానవ యుద్ధం జరుగబోతుందని, దానిలో పురూరవుడు ఇంద్రునికి సహాయంచేస్తే ఊర్వశి పురూరవునికి

శాశ్వతంగా లభిస్తుందని చెప్తాడు. ఈ సంతోష వార్తతో నాటకం ముగుస్తుంది. పురాణాలల్లోని మేషవృత్తాంతాన్ని కాళిదాసు తీసుకోక తన అద్భుతకల్పనలతో దీన్ని "నవీన" నాటకంగా తీర్చిదిద్దాడు. శాకుంతలమంత గంభీరంగా లేకున్నా ఈ నాటకం నాటకకళ దృష్టితో రమ్యంగా వున్నది. శైలి ప్రసాదాత్మకంగా వున్నది. వియోగ శృంగారాన్ని కాళిదాసు మర్మస్పర్శిగా చిత్రించాడు. వియోగశృంగార వర్ణన కోమల భావయుక్తంగా వున్నది. చతుర్థాంకమంతా ఈ విరహవృత్తాంతమే వున్నది. కొంతవరకు ఇది సుదీర్ఘంగా వున్నదనాలి. కాని ఈ దీర్ఘవిరహవర్ణనే ఊర్వశీ పురూరవుల పరస్పర గాఢప్రేమను ప్రకటించి కథకు పోషకంగా వున్నది. దీన్ని తర్వాత కవులెందరో అనుకరించారు. ఈ నాటకంలో పాత్రలు తక్కువ. ఉన్నంతవరకు పాత్రల చిత్రణను కవి చక్కగా చేసాడు. త్రోటకలక్షణానుగుణంగా దీనిలో నాయికానాయకులు దివ్యాదివ్యులు. పురూరవున్ని ధీరోదాత్తనాయకునిగా కవి చిత్రించాడు. ఊర్వశి అప్సరస. అలౌకిక సౌందర్యవతి. సుగుణాలరాశి. వీరిద్దరి ఉత్కటమైన పరస్పర ప్రేమే ఈ నాటకంలోని ప్రధానేతివృత్తం. పురూరవుడు తన పరాక్రమంతో ఊర్వశిని రక్షించి పొందటమేకాక చివరకు తన పరాక్రమంచేత ఇంద్రునికి తోడ్పడి ఊర్వశిని శాశ్వతంగా గెలుచుకుంటాడు. కాబట్టి ఈ నాటకానికి విక్రమోర్వశీయమన్న పేరు సార్థకమైంది.

త్రోటకమనే ఉపరూపకభేదంలో 5 గాని 6 గాని 7 గాని అంకాలుండవచ్చును. మానవీయ, దివ్య సంఘటనలతో కూడి వుండాలి. ప్రతి అంకంలో విదూషకుడు కన్పించాలి. విక్రమోర్వశీయంలో ప్రతి అంకంలో విదూషకుడు లేకపోవటం చేత దీన్ని త్రోటకంగా గుర్తించే అవసరం లేదని వరదాచారి అభిప్రాయం. ఉత్తర భారతప్రతులు కొన్నిటిల్లో ఇది త్రోటకంగా చెప్పబడింది. చాలా ప్రతులల్లో ఇది నాటకంగా కూడ పేర్కొనబడింది. కాని నాయికానాయకులు దివ్యాదివ్యులు కాబట్టి దేవలోక సంబంధ సంఘటనలు చెప్పబడటంచేత దీన్ని త్రోటకమనే ఉపరూపక భేదంగా గుర్తించటానికి వీలు కలుగుతున్నది.

ఈ నాటకం లాటిన్, ఇంగ్లీషు, జర్మన్, ఫ్రెంచ్, స్వీడిష్, ఇటాలియన్, జెక్, స్పానిష్ మొదలైన యూరోపియన్ భాషల్లోకి అనువదింపబడింది. ఈ నాటకం మ్యూనిచ్ పట్టణంలో ఓపెరా రూపంలో కూడ ప్రదర్శింపబడిందని హిల్లెబ్రాంట్ తెలిపాడు.

## అభిజ్ఞాన శాకుంతలం

కాళిదాసు నాటకాలల్లో ప్రౌఢమైంది, అతనికి ప్రపంచఖ్యాతిని తెచ్చి పెట్టింది ఈ

నాటకం. "కావ్యేషు నాటకం రమ్యం తత్ర రమ్యా శకుంతలా" అని ప్రాచీన భారతీయులు దీన్ని ప్రశంసించి వున్నారు.

శాకుంతల నాటకంలో 7 అంకాలున్నవి. నాయకుడు హస్తినాపుర రాజు దుష్యంతుడు వేటాడుతూ, వేటాడుతూ పోయి కణ్వాశ్రమాన్ని చేరుకుంటాడు. అక్కడ సఖులతో కూడి వృక్షసేచనం చేసే శకుంతలను చూసి ప్రేమిస్తాడు. ఆమెను గాంధర్వ వివాహం చేసుకుంటాడు. అతడు తిరిగి రాజధానికి పోతు శకుంతలను సగౌరవంగా పిలిపించుకుంటానిని చెప్పి ఒక ఉంగరాన్ని అభిజ్ఞానంగా ఇస్తాడు. శకుంతల దుష్యంతుని ధ్యానంలో వుండి ఆశ్రమానికి వచ్చిన దుర్వాసుని సత్కరించదు. శకుంతల ఎవరి ధ్యానంలో వుండి తనను నిర్లక్ష్యం చేసిందో వారు ఆమెను మరచిపోతారు అని దుర్వాసుడు శపిస్తాడు. తర్వాత శాంతించి అభిజ్ఞాన దర్శనంతో వారికి శకుంతల గుర్తుకు రాగలదని అంటాడు. శకుంతల గర్భం ధరిస్తుంది. శకుంతలను గురించి కణ్వుడు దివ్యదృష్టితో తెలుసుకొని ఆమెను అత్తవారింటికి పంపిస్తాడు. ఇద్దరు ముని కుమారులు, గౌతమి అనే తపస్విని ఆమెతో వుంటారు. తోవలో శచీతీర్థంలో శకుంతల ఉంగరం పడిపోతుంది. దుష్యంతుడు శాపవశంచేత మరచిపోయి శకుంతలను భార్యగా అంగీకరించడు. భర్తచేత నిరాకరింపబడిన శకుంతలను తల్లి మేనక తీసుకుపోయి మారీచుని ఆశ్రమంలో వుంచుతుంది. అక్కడ ఆమెకు భరతుడు జన్మిస్తాడు. శకుంతల పారవేసుకున్న ఉంగరం దొరుకుతుంది. దాన్ని చూచిన తర్వాత దుష్యంతునికి శకుంతల గుర్తొస్తుంది. అప్పుడు అతడు పశ్చాపత్తాపదగ్ధుడౌతాడు. ఒకసారి దుష్యంతుడు ఇంద్రునికి రాక్షస సంహారంలో తోడ్పడి తిరిగి వస్తుంటాడు. ఇంద్రుని ఆదేశానుసారం సారథి రథాన్ని మారీచాశ్రమానికి తీసుకుపోతాడు. అక్కడ దుష్యంతునికి పుత్రునితో, భార్యతో సమాగమం జరుగుతుంది. దానితో కథ సుఖాంతమవుతుంది.

## శాకుంతల కథకు మూలం

శకుంతల కథ మహాభారతంలో, పద్మపురాణంలోను కన్పిస్తున్నది. కాళిదాసు శకుంతల కథను పద్మపురాణం నుంచి తీసుకున్నాడని కొందరు విమర్శకులు తలంచారు. పద్మపురాణకథకు కాళిదాసు నాటక కథకును చాల దగ్గరపోలికలున్నవి. ఈ సామ్యాన్ని బట్టి చాలామంది విమర్శకులు కాళిదాసు శకుంతల కథనే పద్మపుర్షాణకారుడు తీసుకొన్నాడని అభిప్రాయపడినారు. పద్మపురాణకారుని కవిత్వం కొన్నిచోట్ల కాళిదాసు సరసమైన కవిత్వాన్ని పోలివున్నది. నాటకానికి అనుకూలంగా కాళిదాసు శకుంతలకు సఖులను

సృష్టించాడు. అటువంటి నాటకపాత్రలు కూడ పురాణంలో కన్పిస్తున్నవి. దాన్ని బట్టి కాళిదాసు కథనే పురాణకారుడు తీసుకొన్నాడనటం సమంజసం. జాతకకథల్లో కట్టహరిజాతకకథ శకుంతలోపాఖ్యానాన్ని పోలివున్నది. కాశినేలె బ్రహ్మదత్తుడు వేటకని పోయి మధురంగా పాడుతున్న సుందరిని చూసి ప్రేమిస్తాడు. ఆమెతో కలిసివుండి ఆమె దగ్గర సెలవు తీసుకొనేటప్పుడు రాజు తన ఉంగరాన్నిచ్చి పుత్రుడు కలిగినట్లయితే దాన్ని గుర్తుగా రాజధానికి పంపమంటాడు. కొంత కాలానికి ఆమెకు కొడుకు పుడ్తాడు. ఆమె కొడుకును తీసుకొనిపోయి రాజుకు చూపిస్తుంది. ఉంగరాన్ని గుర్తుగా ఇస్తుంది. రాజు గుర్తించికూడ వాడు తన కొడుకు కాదని నిరాకరిస్తాడు. అప్పుడామె "నాకుమారున్ని గాలిలోకి ఎగురవేస్తాను. నేను సత్యవంతురాలినైతే వాడు గాలిలో వుండిపోతాడు, లేకపోతే కిందపడ్తాడ"ని ఎగురవేస్తుంది. కుమారుడు గాలిలో వుండిపోతాడు. అప్పుడు బ్రహ్మదత్తుడు కుమారున్ని అంగీకరిస్తాడు. ఈ కథలోని అంగుళీయక వృత్తాంతాన్ని కాళిదాసు గ్రహించాడని కొందరు తలంచారు. కాని ఎన్నో ప్రసిద్ధ కథల రూపాంతరాలు జాతకకథల్లో కన్పిస్తున్నవి. ఇది కాళిదాసుకు పూర్వరచన అని తేల్చి చెప్పలేము. ఈ కథలో ఉంగరం శాకుంతలంలోలాగ అభిజ్ఞానంగా ఉపయోగపడటం లేదు. అటువంటప్పుడు కాళిదాసు దాన్ని అనుకరించాడనటంలో అర్థం కూడ లేదు.

కాళిదాసు మహాభారత కథనే తీసుకొన్నాడని చాలా మంది విమర్శకుల అభిప్రాయం. మహాభారతాంతర్గత శకుంతల కథకు కాళిదాసు రమ్యమైన కల్పనలను జోడించి నాటకాన్ని వ్రాసాడు. ఈ కల్పనలు నాటక ధర్మాల కనుగుణంగా వుండటమేకాక పాత్రల చరిత్రకు, కథా సంవిధానానికి, ఇతివృత్త గాంభీర్యానికి, రసపోషణకు తోడ్పడినవి. ఒక మహత్తర సందేశాన్ని దృష్టిలో పెట్టుకొనే కాళిదాసు ఈ కల్పనలను చేసాడు. కాళిదాసు చేతిలో శకుంతల ఒక ఉదాత్త వ్యక్తిత్వాన్ని ధరించి సీత పక్కన స్థానాన్ని సంపాదించుకొన్నది. మహాభారత శకుంతల ప్రౌఢ, నిర్భీక, శాస్త్రజ్ఞానం, వాక్చాతుర్యంకలదిగా కన్పిస్తుంది. కాళిదాసు శకుంతల ముగ్ధ, లజ్జాశీలి. అదే విధంగా మహాభారత దుష్యంతుడు లంపటుడు, స్వార్థిగా కన్పిస్తాడు. కాళిదాసు దుష్యంతుడు ధీరోదాత్త నాయకుడు, పరాక్రమశాలి, గంభీరుడు. త్యాగి, కర్తవ్యపరాయణుడు, న్యాయప్రీతి గలవాడు, ఉదారుడు, పాపభీరువు, ప్రేమికుడు. శాపానికి గురియై శకుంతలను మరచిపోయి తర్వాత పశ్చాత్తాపదగ్ధుడైన దుష్యంతుడంటె పాఠకులకు సానుభూతి కలుగుతుంది. తన ప్రమేయం లేకుండా విధి చేతిలో ఆతడు కీలుబొమ్మ అయినాడు. విధి వక్రించటం చేతనే శకుంతలా దుష్యంతులకు

వియోగం కలిగినట్లు కాళిదాసు చిత్రించాడు. దుర్వాసుని శాపం, శకుంతల ఉంగరం తీర్థజలాలల్లో పడిపోవటం ఈ రెండు ఈ నాటకంలో విధివిలాసానికి ప్రతీకలు. మహాభారతంలో 300 శ్లోకాలల్లో వున్న ఉపాఖ్యానాన్ని తీసుకొని కాళిదాసు ఒక అపూర్వమైన నాటకాన్ని రచించాడు. కాళిదాసు తర్వాత ఎందరో కవులు ప్రాచీన కావ్యపురాణాల నుంచి వైచిత్రిలేని కథలను తీసుకొని స్వకల్పనలను చేర్చి కావ్యనాటకాలను సృష్టించారు. ఇటువంటి మిశ్రిత కావ్య సృష్టిని అభినవగుప్తాదులు రసపోషణ దృష్టితో అంగీకారయోగ్యమైందని లక్షణం చేసారు. వాల్మీకి రామాయణ సృష్టి కావ్య ప్రపంచంలో ఎంత గొప్పదో నాటకప్రపంచంలో కాళిదాసు శాకుంతల సృష్టి అంత గొప్పదని చెప్పాలి.

వాల్మీకి రామాయణకథా ప్రభావం కాళిదాసు శాకుంతలనాటకం మీద చాల వున్నదనిపిస్తుంది. వాల్మీకి ఆదర్శ స్త్రీపురుషులను, భార్యాభర్తలను సీతారాముల పాత్రల్లో చిత్రించాడు. తద్వారా స్త్రీ పురుషుల ఆదర్శచరిత్రను ప్రజల ముందుంచాడు. కాళిదాసు మహాభారతంలో అంతగా ఉదాత్తతలేని కథను తీసుకొని నాటకంగా వ్రాసాడు. శకుంతలా దుష్యంతుల పాత్రల్లో ఒక ఆదర్శజీవితాన్ని చిత్రించాడు. భర్తచేత వదిలివేయబడిన శకుంతల మౌనంగా కష్టాలను భరించటం, ఆమె చూపిన క్షమ, ఔదార్యాలు, సుగుణశీలత ఈనాటి సామాజికునికి ఒకొకసారి రుచించకపోవచ్చునేమో కాని కాళిదాసు సమకాలిక సమాజానికి అనుగుణంగా ఒక సచ్ఛీలవతి శకుంతల జీవితాన్ని ఆదర్శవంతంగా చిత్రించాడు. కాళిదాసుకు శకుంతల చిత్రణలో ప్రేరణ సీత పాత్ర నుంచే లభించి వుంటుంది. కాళిదాసుకు వాల్మీకి ఆదర్శకవి. రామాయణ నాయకుడైన రాముని వంశం ఇక్ష్వాకువంశం. ఆ వంశరాజుల చరిత్రను అతడు రఘువంశంగా రచించాడు. అంతేగాక వాల్మీకి పాత్రలను, సన్నివేశ విశేషాలను, కోమల భావాలను కూడా కాళిదాసు ఆదర్శంగా తీసుకొన్నాడు. గర్భవతి అయిన శకుంతలను ఋష్యాశ్రమానికి పంపి అక్కడ పుత్రలాభం జరిగిన తర్వాత పశ్చాత్తాపతప్తుడైన భర్తతో సమాగమాన్ని కలిగించాడు. ఇదంతా ఉత్తర రామాయణంలోని సీతారాముల వృత్తాంతాన్ని పోలివున్నది. మూలంలో లేని ఈ కల్పనవల్ల శకుంతలకు ప్రాచీన మహనీయులైన స్త్రీల పంక్తిలో స్థానం లభించింది. చివరకు దుష్యంతున్ని కూడ కాళిదాసు విధివంచితుడైన ఆదర్శవ్యక్తిగానే చిత్రించాడు. మొదట శకుంతలను విధివశంచేత మరచిపోయి, తనముందు నిల్చిన ఆమెను గుర్తించక స్వీకరించక పోవటం, తర్వాత వుంగరాన్ని చూసి శకుంతల స్మరణకు వచ్చి దుఃఖించటం ఇవన్నీ అతన్ని ఒక విషాదాంత (tragedy) నాటక నాయకునిగా నిలబెడ్తున్నవి. చక్రవర్తి, పరాక్రమశాలి దుష్యంతుడు

విధిచేత వంచితుడై సామాన్య వ్యక్తివలె సానుభూతికి పాత్రుడైనాడు. ఈ రెండు పాత్రలను చిత్రించటంలో కాళిదాసు అద్భుతమైన, అపూర్వమైన ప్రతిభను చూపాడు.

శాకుంతల నాటకం అనేక భారతీయ భాషల్లోకి అనువదింపబడటమే కాక అనేక ప్రాశ్చాత్య భాషల్లోకి అనువదింపబడి గౌరవాదరాలను సంపాదించింది. ఈ నాటకానికి అనేక ఇంగ్లీషు అనువాదాలున్నవి. క్రీ.శ. 1769 లో విలియం జోన్స్ దీన్ని ఇంగ్లీషులోకి మొదట అనువదించాడు. ఈ ఇంగ్లీషు అనువాదాన్ని జార్జ్ ఫార్సటర్ క్రీ.శ. 1791 లో జర్మన్ భాషలోకి అనువదించాడు. ఈ జర్మన్ అనువాదం గొయిథె, షిల్లర్ మొదలైన జర్మన్ సాహితీవేత్తలను మిక్కిలి ఆకర్షించింది. గొయిథె ఈ నాటకాన్ని చదివి ఆర్కిమెడెస్ కొత్త సూత్రాలను కనుక్కొని సంతోషించినంతగా సంతోషించి ఆనందం పట్టలేక గంతులు వేసాడట. ఈ నాటకారంభాన్ని అనుకరిస్తు తన " faustus" లో ఆరంభ దృశ్యాన్ని రచించాడు. ఈ నాటకాన్ని ప్రశంసిస్తు ఒక చక్కటి జర్మన్ గీతాన్ని కూడ వ్రాసాడు. యూరోపియన్లకు పరిచయమై వారిని ఆకర్షించుకొన్న భారతీయ రచనల్లో శాకుంతల నాటకం ప్రముఖమైంది. ఇది ఇంగ్లీషు, జర్మన్ భాషల్లోకే కాక ఫ్రెంచ్, ఇటాలియన్, రష్యన్ మొదలైన భాషల్లోకి కూడా అనువదింపబడింది. గ్రీకు ప్రాచీన నాటకాలతో, మరియు షేక్స్పియర్ నాటకాలతో మాత్రమే పరిచయమున్న యూరోపియన్ సాహితీవేత్తలలో శాకుంతల నాటకం కొత్త గాలివలె వీచి ఒక సంచలనాన్ని సృష్టించింది. పేరుమోసిన సాహితీవేత్తలు క్రీ.శ. 19వ శ॥లోని జర్మనీలో శాకుంతల నాటకాన్ని గురించి తమ గోష్ఠుల్లో ప్రసంగించుకోవటం తరచుగా కన్పించేది. "శకుంతలకన్న మించిన కవితాగానం ప్రాచీన గ్రీకు సాహిత్యంలోగాని మరెచ్చటాగాని కనిపించ"దని షిల్లర్ అనే తత్త్వవేత్త హుంబోల్ట్ పండితునికి వ్రాసాడు. ఈ నాటకం ఇంగ్లండు, జర్మనీ దేశాల్లో చాలసార్లు రంగస్థలం మీద దిగ్విజయంగా ప్రదర్శింపబడింది. రవీంద్రనాథ టాగూర్ తన "ప్రాచీన సాహిత్య" మనే పుస్తకంలో కాళిదాసు శాకుంతలానికి షేక్స్పియర్ టెంపెస్ట్ నాటకానికి ఎన్నో పోలికలున్నవని గమనించాడు. శాకుంతలంలోని నాయిక శకుంతలకు, టెంపెస్టులోని నాయిక మిరాండాకు గుణశీలంలో చాల దగ్గర సామ్యం కన్పిస్తుందని టాగోర్ అన్నాడు.

అభిజ్ఞాన శాకుంతలం లిఖిత ప్రతులు భారతదేశమంతటా ఎన్నో దొరికినవి. వీటన్నిటిని ముఖ్యంగా మూడు రకాలుగా విభజించవచ్చును. బెంగాల్, కాశ్మీర్, దక్షిణభారత ప్రతులు. ఈ ప్రతులు చాల పాఠభేదాలు కలిగివున్నవి. ఏ ప్రతి కాళిదాసు రచనకు దగ్గరగా వున్నదో, ఏది కాళిదాసు కవిత్వమో, ఏది కాదో నిర్ణయించి చెప్పటం

ఇప్పుడు కష్టం. కాళిదాసు మూలరచనకు ఎన్నో చేర్పులు జరిగినవని మాత్రం ఈ పాఠభేదాలవల్ల తెలుస్తున్నది.

## కాళిదాసు నాటక కళ

సంస్కృత సాహిత్యంలో భాసుని నాటకాల తర్వాత కాళిదాసు నాటకాలే లభిస్తున్నవి. భాసునిలో నాటక ధర్మాలు కొన్ని భరతముని ప్రోక్తమైన నాటక ధర్మాలకు విరుద్ధంగా వున్నవి. కాని కాళిదాసు నాటికి భరతముని నాట్యశాస్త్రం బాగా ప్రచారం పొందింది. విక్రమోర్వశీయం నాటకంలో కాళిదాసు భరతమునిని ఒక పాత్రగా కూడ ప్రవేశపెట్టాడు. కాళిదాసు నాటికి భారతీయ నాటకకళ సంపూర్ణ వికాసాన్ని చెందింది. అటువంటి వికసిత నాటకకళను కాళిదాసు నాటకాలల్లో చూడవచ్చును. కాళిదాసు శ్రవ్య కావ్యరచనలో ఎంత మేటియో దృశ్యకావ్య రచనలోను అంత మేటియే. నాటకానికి అనుగుణంగా కథను మార్చుకోవటంలో చాల నేర్పును చూపాడు. పాత్రల చిత్రణ, సంభాషణలు అన్ని ఔచితీమంతంగా రచింపబడినవి. సంభాషణల్లోని శ్లోకాలు క్లిష్టంగా లేక సులభ గ్రాహ్యమైన శైలిలో మధురంగా వున్నవి.

పాత్ర చిత్రణ, సన్నివేశ, సంభాషణల సామ్యాన్ని ఎట్లా భాసుని నాటకాలన్నిటిలో చూడవచ్చునో కాళిదాసు నాటకాలు మూడింటిలోను అటువంటి సామ్యాన్ని చూడవచ్చును. కాళిదాసు నాటకాలు ఉత్తరోత్తరంగా విశిష్టత సంపాదించుకోవటం గమనార్హం. కాళిదాసు మూడు నాటకాలల్లోను శృంగారం అంగిరసం. నాయికా నాయకుల పరస్పర ప్రేమ నాటకారంభంలో చెప్పబడింది. ఆ తర్వాత ప్రేమ అవాంతర ప్రతికూల ఘటనలతో సిద్ధించదు. నాటకం చివర ఫలసమాగమం చెప్పబడింది. కాళిదాసు ముగ్గురు నాయికలు ముగ్ధలు. లజ్జాశీలురు, కాళిదాసు ముగ్గురు నాయకులు ధీరోదాత్తులు, పరాక్రమవంతులు. వివాహితులు కూడ. నిస్సహాయస్థితిలో వున్న నాయికను నాయకుడు రక్షించినట్లుగా, పరస్పర ప్రేమ కలిగినట్లుగా కాళిదాసు మూడు నాటకాలల్లోను చిత్రించాడు.

కాళిదాసు నాటకకళలో ప్రవీణుడు. అతని నాటకాలల్లో ఎక్కడా వ్యర్థమైన అంకంగాని సన్నివేశం గాని సంభాషణ గాని కన్పించదు. అనవసరమైన పాత్రలు కూడ లేవు. మొదటి రెండు నాటకాలల్లో కన్నా శాకుంతలంలో కాళిదాసు నాటకకళ పరిపక్వావస్థను చేరుకొన్నది. సామాజికుని కుతూహలాన్ని నిలిపేటట్లుగా అతడు

కథను అల్లుకుంటూ పోతాడు. సంభాషణలు పాత్రోచితంగా వున్నవి. పాత్రల స్వభావచిత్రణలో కాళిదాసు తన సూక్ష్మ పరిశీలనా శక్తిని ప్రదర్శించాడు.

కాళిదాసు నాయికలను అమాయకురాండ్రుగా, స్వచ్ఛమైన చరిత్ర కలవారిగా సుగుణవతులుగా చిత్రించాడు. అతని స్త్రీ పాత్రలు ఆదర్శ భారతస్త్రీలుగా కన్పిస్తారు. ముఖ్యంగా శకుంతల మొదట అమాయకురాలు, ప్రేమమూర్తిగా కన్పిస్తుంది. తర్వాత విధివైచిత్రి చేత భర్తృ విరహాగ్నిలో తపిస్తూ ప్రేమతపస్సు చేసింది. శకుంతలా దుష్యంతుల పునస్సమాగమ సమయంలో దుష్యంతుడు పశ్చాత్తాపతప్తుడై శకుంతల కాళ్ళమీదపడి క్షమాభిక్షను వేడినట్లుగా కాళిదాసు చిత్రించి పవిత్ర స్త్రీ మూర్తికి తన గౌరవ నివాళులు అర్పించాడు. కాళిదాసు నాటకాలల్లో ఆదర్శ గృహస్థ జీవితాన్ని కాక ఉన్నతాదర్శమైన ప్రేమను చిత్రించాడు. అతని నాయికలు ఆదర్శ గృహిణులుగా కాక ఆదర్శ ప్రేమమూర్తులుగా కన్పిస్తారు. ప్రధానంగా శకుంతల దుష్యంతున్ని మొదటి చూపులోనే ప్రేమించి అతనిచేత నిరాకరింపబడి తన పవిత్రమైన ప్రేమతో అతన్ని తిరిగి చేరుకోకలుగుతుంది. ప్రేమ తపస్సుచేత కృశాంగిని అయిన స్త్రీ కాళిదాసుకు ఇష్టమైన స్త్రీ మూర్తి. ఇటువంటి కృశాంగయష్టి గల ప్రేమమూర్తులుగానే కాళిదాసు శకుంతల, సీత, పార్వతి, యక్షుని భార్యలను చిత్రించాడు. కాళిదాసు రాజుల, మునులవంటి పాత్రలను కాక సామాన్యపాత్రలను, అంటె శాకుంతలం షష్ఠాంకంలోని రాజోద్యోగుల, బెస్తవాని వంటి పాత్రలను తక్కువగా చిత్రించాడు. తక్కువైనా ఆ పాత్రల నైజాన్ని కూడ అతడు సహజంగా చిత్రించాడు. సందర్భానుకూలంగా అతడు ఆనాటి సాంఘికజీవితాన్ని, పట్టణ జీవితంలోని చెడును, రాజోద్యోగుల దురాశను చిత్రించాడు.

## కాళిదాసు కవిత్వం

కాళిదాసు శృంగారచిత్రణలో అందెవేసిన హస్తం కలవాడు. కరుణాది రసాల కన్న శృంగార రసమన్న అతనికి అభిమానం. సరళ సరస స్వభావం గల కాళిదాసు హృదయానికి జగత్తంతా రాగమయంగా కన్పించటంలో ఆశ్చర్యం లేదు. నాటకాలకు ఉచితమైంది వైదర్భీశైలి. రంగస్థలం మీద నాటకం ప్రదర్శింప బడ్తున్నప్పుడు సామాన్య జనులకు పాత్రల సంభాషణలు గాని శ్లోకాలు గాని సులభంగా వెంటనే అర్థమయ్యేటట్లు వుండాలి. అందుకని నాటకాలల్లో ప్రౌఢశైలి పనికిరాదు. తర్వాత తర్వాత కవులు సులభ శైలిని విడిచిపెట్టి నాటకాలకు అనుచితమైన ప్రౌఢశైలి వైపుకు మొగ్గును చూపారు. కాళిదాసు

మాత్రం సుకుమారమైన సులభ శైలినే తన నాటకాలల్లో అంతటా ప్రయోగించాడు. అర్థ వ్యక్తతాగుణం, దానితోపాటు రమ్యమైన పదసంయోజనం, సుందర భావ కల్పనలు, సరళమైన అలంకారాల సౌందర్యం కాళిదాసులో వున్నట్లుగా మరే కవిలోను లేవనే చెప్పాలి. సూటిగా సరళ సుంరదంగా భావాలను చెప్పే తీరు అతన్ని మహాకవిగా నిలబెట్టినవి.

## అశ్వఘోషుడు

ఇప్పుడు లభించే సంస్కృత సాహిత్యంలో బౌద్ధమత సంబంధమైన నాటకాలు లేవనే చెప్పాలి. బర్మా, చైనా మొదలైన దేశాలల్లో బుద్ధుని జీవిత సంబంధమైన బౌద్ధ సంబంధ కథలమీద ఆధారపడిన నాటకాలు, సంగీత రూపకాలు ప్రదర్శింపబడటం ఈ నాటికి కన్పిస్తుంది. అదే విధంగా బౌద్ధ రూపకాలు భారత దేశంలోను వుండి వుంటవి. అవేవి మనకు లభించలేదు. చంద్ర గోమిన్ వ్రాసిన లోకానంద మనే నాటక మొకటి టిబెట్ భాషలోకి అనువదింపబడి లభిస్తున్నది. మహాసత్త అనే బౌద్ధ పండితుడు వస్సంతర జాతకాన్ని రూపకంగా రచించాడని ఈత్సింగ్ తెలిపాడు. ఇది అలభ్యం. విద్యాధర జాతకం ఆధారంగా శ్రీహర్ష దేవుడు నాగానంద నాటకాన్ని రచించాడు. ఈ నాటకం నాందిలో బుద్ధుని స్తుతివున్నా గౌరి ప్రధాన పాత్ర ధరించటంవల్ల ఇది పూర్తిగా బౌద్ధనాటకం అని చెప్పలేము. అదీగాక ఈ నాటకకథ మహాభారతాదుల్లోను వున్నది. ఇక బౌద్ధ సంబంధమైన నాటకాలను వ్రాసిన ఒకే ఒక కవి ఇప్పుడు మనకు కన్పిస్తున్నాడు. అతడే - అశ్వఘోషుడు. క్రీ.శ. 1910 వరకు అశ్వఘోషుడు కావ్య కర్తగానే మనకు పరిచితుడు. మధ్య ఏషియాలోని తుర్ఫాన్ ప్రాంతంలో లుడర్స్‌కు మూడు సంస్కృత నాటకాల లిఖితప్రతుల అవశేషాలు దొరికినవి. ఇందులో ఒకటి శారిపుత్రప్రకరణం. దీనికే శారద్వతీ పుత్ర ప్రకరణమని పేరు. దీని చివర సువర్ణాక్షీ పుత్రుడు అశ్వఘోషుడు తద్గ్రంథ కర్తగా పేర్కొనబడినాడు. ఈ నాటకంలోని కవిత్వ శైలికి అశ్వఘోషుని కావ్యాలల్లోని కవిత్వశైలికి సామ్యం వున్నది. మిగిలిన రెండు నాటకాలల్లో ఒకటి కృష్ణ మిశ్రుని ప్రబోధచంద్రోదయాన్ని పోలివున్నది. అంటె దానిలో వలెనే దీనిలో ధృతి, బుద్ధి, కీర్తి మొదలైనవి పాత్రలుగా వున్నవి. మూడవది మగధవతి అనే నాటకం. ఇది ఇతివృత్త విషయంలో మృచ్ఛకటికాన్ని పోలివున్నది. దీనిలో మగధవతి అనే వేశ్య కథ వున్నది. ఇది ప్రాకృతభాషలో వున్నది. ఈ ప్రాకృతం ప్రాచీనమైందిగా లుడర్స్ తలంచాడు. ఈ రెండు నాటకాల శైలి శారిపుత్ర ప్రకరణ శైలిని పోలివున్నది. కాబట్టి ఇవి శారిపుత్ర ప్రకరణంతో పాటు అశ్వఘోషుని నాటకాలని లుడర్స్ అభిప్రాయపడినాడు.

## అశ్వఘోషుని నాటకాలు

శారిపుత్ర ప్రకరణంలో 9 అంకాలున్నవి. గౌతమబుద్ధుడు. శారిపుత్ర, మోద్గలాయనులకు బౌద్ధ ధర్మదీక్షను ఇచ్చే ఇతివృత్తం దీనిలో వున్నది. దీనిలో విదూషకుడు కూడ వున్నాడు. అతడు బ్రాహ్మణమతానికి ప్రతినిధిగా కన్పిస్తాడు. బ్రాహ్మణుడైన శారిపుత్రుడు క్షత్రియుడైన బుద్ధుని బోధదీక్షను పొందకూడదని విదూషకుడంటాడు. "శూద్రునిచేత ఇయ్యబడిన మందు కూడ రోగి రోగాన్ని అపనయింపగలుగుతుంది, దాహంతో బాధపడేవానికి నీళ్ళు ఎవరిచ్చినా అవి తాపాన్ని తీరుస్త" వని శారిపుత్రుడు విదూషకునికి సమాధానమిస్తాడు. బుద్ధ శారిపుత్రుల తత్త్వచర్చతో నాటకం ముగుస్తుంది. అశ్వఘోషునినాటికి భరతుని నాటక లక్షణాలు బాగా స్థిరపడినవి. అశ్వఘోషుడు భరత నాటక లక్షణాలను పూర్తిగా అనుసరించి ఈ నాటకాన్ని రచించాడు. ప్రకరణ లక్షణాన్ననుసరించి దీనిలో నాయకుడు బ్రాహ్మణుడు. నాయిక మాత్రం లేదు. నాటకం చివర భరతవాక్యం మాత్రం కొంత భిన్నంగా కన్పిస్తున్నది. "అతఃపరం అపి ప్రియం అస్తి' ' అని అన్ని నాటకాలల్లో చివర ఒక ప్రధానపాత్ర నాయకున్ని ప్రశ్నిస్తుంది. ఆ సంప్రదాయం దీనిలో పాటింపబడలేదు. కాని బుద్ధుని అశీర్వచనాలతో నాటకం ముగుస్తుంది. ఇది భరతవాక్య సంప్రదాయానికి కొంత దగ్గరగానే వున్నది కాని పూర్తిగా భిన్నంగా మాత్రం లేదు.

మధ్య ఏషియాలో ఈ సంస్కృత నాటకాలు దొరికినదాన్నిబట్టి భారతీయ నాటకాలు మధ్యఏషియావరకు తీసుకొనిపోబడినవని తెలుస్తున్నది. ఈ నాటకాలు అక్కడ తప్పక ప్రదర్శింపబడేవని కూడ ఊహించవచ్చును. భారతీయ నాటకాలు అనువాదరూపాలుగా కాక మూల సంస్కృత ప్రాకృతరూపాలల్లోనే ప్రదర్శింపబడి అక్కడి ప్రజలకు అర్థమయ్యేవని వీటినిబట్టి చెప్పవచ్చును. కాని అక్కడికి కేవలం బౌద్ధసంబంధ నాటకాలే తీసుకొనిపోబడి వ్యాప్తిచెందినవో లేక అన్ని నాటకాలు వ్యాప్తిచెందినవో చెప్పలేము. సంస్కృత నాటకాలను ఆదర్శంగా తీసుకొని మధ్య ఏషియాలో తుఖారిన్ మొదలైన భాషల్లో నాటకాలు కూడా వ్రాయబడేవని పండితులు అంటున్నారు.

(అశ్వఘోషునికాలం, జీవితవిశేషాలు మహాకావ్య ప్రకరణంలో చర్చింపబడినవి)

## శూద్రకుడు

మృచ్ఛకటికమనే ప్రకరణం శూద్రకుని రచన అని ప్రచారంలో వున్నది. మృచ్ఛకటికం

సమకాలిక సాంఘిక, ఆర్థిక, ధార్మిక పరిస్థితులను వాస్తవికంగా చిత్రిస్తున్నది. సంస్కృత సాహిత్యంలో ఇటువంటి వాస్తవికచిత్రణగల రచనల సంఖ్య చాల తక్కువ. అందులో ఈ నాటకంలోని పాత్రలన్నీ సామాన్య మానవుల వలె, నిత్యజీవితంలో మనకు ఎదురుపడే వ్యక్తులవలె కన్పిస్తారు. ఇతర రచనల్లో వలె ఆదర్శ వ్యక్తులు దీనిలో కనిపించరు. కవి పాత్రలను అన్ని రంగాల నుంచి తీసుకున్నాడు. రాజులు, బ్రాహ్మణులే కాక విటులు, జూదగాండ్లు, దొంగలు దీనిలోని పాత్రలు. దీనిలోని ఇతివృత్తం పురాణాదుల నుంచి తీసుకోబడింది కాదు. కల్పితేతివృత్తం. కథ కల్పితమయినా సజీవ పాత్రల చుట్టూ వాస్తవిక సన్నివేశాలతో కల్పింపబడింది. పాత్రల సంభాషణలు కూడ మామూలుగా నిత్యం మాట్లాడుకొనే మాటలకు దగ్గరగా వున్నవి. వాస్తవికత, హాస్యం రెండూ నాటకానికి జీవం పోసినవి. ఏదో విదూషకాదుల అంగవైకల్యంతో హాస్యాన్ని పుట్టించటం కాక కవి శబ్దప్రయోగంతో వ్యంగ్యపరిహాసాలను పోషించి సామాజికున్ని నవ్విస్తాడు. ఈ ప్రత్యేక గుణాలచేత మృచ్ఛకటికానికి సంస్కృత సాహిత్యంలో ఒక ప్రత్యేక స్థానమున్నది.

## మృచ్ఛకటికం రచయిత

మృచ్ఛకటికం శూద్రకుని రచన అని దాని ప్రస్తావనలో చెప్పబడింది. శూద్రకుడు సుందరుడని, రాజు అని, పరాక్రమశాలి అని దానిలో చెప్పబడింది, ఇంకా అతడు ఋక్ సామవేదాలను, గణితాన్ని, గజశాస్త్రాన్ని అభ్యసించాడని. వాణిజ్య కళలు తెలిసినవాడని, శివుని అనుగ్రహంచేత దివ్యచక్షువులను సంపాదించినవాడని చెప్పబడింది. అతడు యుద్ధప్రియుడు, సోమరితనం లేనివాడు, వేదజ్ఞులలో శ్రేష్ఠుడు, శత్రువులను జయించినవాడు, బాహు యుద్ధప్రియుడు అని కూడ పరిచయమియ్యబడింది. అటువంటి శూద్రక మహారాజు వంద సంవత్సరాల మీద పదిరోజులు జీవించి అశ్వమేధయాగం చేసి రాజ్యాన్ని కుమారునికి అప్పజెప్పి అగ్ని ప్రవేశం చేసాడని ఈ నాటకప్రస్తావనలో చెప్పబడింది. ఒకవేళ శూద్రకుడే ఈ నాటక రచయిత అయితే "శూద్రకోऽగ్నిం ప్రవిష్టః" అని ప్రస్తావనలో ఎట్లా చెప్పబడుతుందని, కాబట్టి ఇది శూద్రకుని రచన కాదని, వేరొక వ్యక్తి దీన్ని వ్రాసి శూద్రకుని పేరు పెట్టాడని విమర్శకులు తలుస్తున్నారు. అయితే "శూద్రకోऽగ్నిం ప్రవిష్టం" అన్న దాన్ని ప్రస్తావనలో చెప్పడందాన్ని సమర్థించి కొందరు విమర్శకులు ఇది శూద్రకుని రచనే అని చెప్పటానికి ప్రయత్నించారు -

1. శూద్రకుడు తాను అగ్నిప్రవేశం చేయదలచుకున్న రోజును ముందే నిర్ణయించుకొని లెక్కించుకొని నాటక ప్రస్తావనలో చెప్పుకొన్నాడని కొందరు దీన్ని సమర్థిస్తున్నారు.

2. శూద్రకుడు సర్వస్వహరమనే యజ్ఞం చేసాడని దీనిలో యజ్ఞకర్త అగ్ని ప్రవేశం చేయటం శాస్త్రసమ్మతమని ముందే తెలిసినవాడు కాబట్టి శూద్రకుడు నాటక ప్రస్తావనలో చేర్చుకొన్నాడని కొందరంటారు.

3. అగ్ని ప్రవేశమంటె జ్ఞానాగ్ని అని కొందరు అర్థంచెప్పి అతడు జ్ఞానాగ్ని ప్రవేశం చేసాడు కాని మరణం కాదని కొందరంటారు.

ఈ మూడు కారణాలు కాక మరొక కారణం కూడా కావచ్చును - మచ్ఛకటికం శూద్రకుని రచన అయినా దాని ప్రస్తావనలో అతని అగ్ని ప్రవేశ వృత్తాంతం తర్వాత చేర్చబడింది కావచ్చును. శూద్రకుడు వ్రాసి దాన్ని ప్రదర్శింపజేసినప్పుడు గాని శూద్రకుని కాలంలో గాని శూద్రకుని అగ్నిప్రవేశ వృత్తాంతం చెప్పబడిన శ్లోకం లేకపోయి వుండవచ్చును. ఆ శ్లోకం ఇది -

రాజానం వీక్ష్య పుత్రం పరమసముదయే నాశ్వమేధేన చేష్ట్వా
లబ్ధ్వాచాయుః శతాబ్దం దశదిన సహితం శూద్రకోzగ్నిం ప్రవిష్టః

శూద్రకుడు వంద సంవత్సరాలమీద పదిరోజులు బ్రతికి అశ్వమేధయాగం చేసి రాజ్యభారాన్ని కుమారునికి అప్పగించి అగ్నిప్రవేశం చేసింతర్వాత ఈ ప్రసిద్ధ వృత్తాంతం నాటకంలో చేర్చబడివుంటుంది.

శూద్రకుడు మృచ్ఛకటిక రచయిత అని నాటకంలో ప్రస్తావింపబడనా అతడు తద్రచయిత కాదని కొందరు విమర్శకులు తలంచారు. కీథ్ మతానుసారం శూద్రకుడు చారిత్రక పురుషుడు కాక కల్పితవ్యక్తి. స్కందపురాణ, బేతాళ పంచవింశతి, రాజతరంగిణి, కథాసరిత్సాగరం, హర్షచరిత్ర, కాదంబరి, దశకుమార చరిత్రాది కావ్యపురాణాదులు శూద్రకరాజును గురించి ప్రసంగిస్తుండగా అటువంటి వ్యక్తేలేడని అతడు ఐతిహాసిక పురుషుడు కాదని అతని అస్తిత్వాన్ని తోసిపుచ్చటానికి వీల్లేదు.

పిశెల్, కర్మార్కర్‌లు మృచ్ఛకటికం దండి రచనగా అంగీకరించారు. దండి దశకుమారచరిత్ర మృచ్ఛకటికాలల్లో చోరవిటాది పాత్రలు సమానంగా వుంటే వుండవచ్చును. కాని రెండింటి రచనా శైలిలో, భావాలల్లో ఎక్కడా సామ్యం లేదు. అటువంటప్పుడు దండి రచనగా మృచ్ఛకటికాన్ని చెప్పటం సాహసమే అవుతుంది.

డా॥ లెవీ మొదలైన విమర్శకులు చాలామంది మృచ్ఛకటికాన్ని ఒక అజ్ఞాత

వ్యక్తి రచించి శూద్రకుని పేరుతో చలామణి చేసాడని అభిప్రాయపడ్తున్నారు. అట్లా చలామణి చేయటానికి వారు ఈక్రిందికారణాలను చూపుతున్నారు- 1. భాసుని చారుదత్త నాటకాన్ని ఆధారంగా చేసుకొని మృచ్ఛకటికాన్ని రచించాడు. కాబట్టి లోకభీతితో తన పేరును నాటకంలో చెప్పుకోలేదు. 2. చాల ప్రగతిశీలమైన వాస్తవికతను కవి దీనిలో చిత్రించాడు. రాజదండం, ప్రజానిందల భయంతో అట్లాచేసాడు. చారుదత్తుని వంటి బ్రాహ్మణుడు ఒక వేశ్యను వివాహమాడినట్లుగా చెప్పాడు. సనాతన ధర్మావలంబి అయిన బ్రాహ్మణుడు ఈ విధంగా పతనమైనట్లు చూపటంచేత రాజు, ప్రజలు నిందిస్తారనే భీతితో కవి నాటకంలో తన పేరును చెప్పుకోలేదని వీరి అభిప్రాయం. ఈ రెండు కారణాలు ఊహాజనితంగానే కన్పిస్తున్నవి. ఇంతకంటె బ్రాహ్మణ, ధార్మిక పతనాలను రచయితలు నిస్సంకోచంగా, నిస్సందేహంగా చిత్రించి వున్నారు. చారుదత్త నాటకం అనుకరణ కాబట్టి నిరాకరింపబడుతుందని కవి జంకటం వాస్తవిక కారణంగా లేదు. చారుదత్త నాటకం పూర్తిగా లభించక పోవటంచేత మృచ్ఛకటికకారుడు దాన్ని ఎంతవరకు అనుసరించాడో చెప్పలేము. ఒకవేళ అనుసరించినా మృచ్ఛకటికం ఎన్నో విధాల దానికన్న విశాలమైన మేలైన నాటకం. అటువంటప్పుడు సిగ్గుతో కవి తన పేరును దాచుకోనవసరం లేదు. అయితే ఇక మృచ్ఛకటిక రచయిత దండి, అజ్ఞాత వ్యక్తి కాక ప్రస్తావనలో చెప్పబడినట్లుగా శూద్రకుడే తద్రచయిత అని నిర్ణయించినా ఆ శూద్ర కుడెవరు? అన్న ప్రశ్న లేస్తుంది. ఈ విషయ నిర్ణయంలోను అభిప్రాయభేదాలున్నవి.

## శూద్రకు డెవరు?

1. విల్సన్, డా.స్మిత్‌లు స్కంద పురాణాన్ననుసరించి శాతవాహనరాజు సిముకుడు శూద్రకుడని నిర్ణయించారు. రామిల సోమిలులనే కవులు ఇతని ఆస్థాన కవులని, వారే ఈ నాటకాన్ని వ్రాసారని వారు నిర్ణయించారు. కాని సిముకుడు దాదాపు క్రీ.పూ. 200 నాటివాడు, మృచ్ఛకటికం అంత ప్రాచీనమైన నాటకమని చెప్పటానికి వీల్లేదు.

2. స్టైన్ కొనోవ్ ఆభీరవంశరాజు శివదత్తుడు శూద్రకుడని నిర్ణయించాడు.

3. ఆచార్య చంద్రబలీపాండే ప్రత్యేకంగా 'శూద్రకుడు' అనే పుస్తకాన్ని వ్రాసి

శూద్రకుడెవరని నిర్ణయించటానికి ప్రయత్నించాడు. శిలాశాసనాలు, దానపత్రాలు, ప్రశస్తులు, బృహత్కథామంజరి, అవంతి సుందరి, హర్షచరిత్ర, రాజతరంగిణ్యాది కావ్యాలను ఆధారంగా శాతవాహనరాజు వాసిష్ఠీపుత్ర పులమావియే శూద్రకుడని నిర్ణయించాడు. ఈ రాజే మృచ్ఛకటిక నాటకాన్ని, పద్మ ప్రాభృత భాగాన్ని రచించాడని పాండే నిర్ణయానికి వచ్చాడు. పులమావికాలం క్రీ.శ. 102-130.

4. శూద్రకుడు దాక్షిణాత్యుడని, గంగవంశానికి చెందిన మొదటి శివ కుమారుడే శూద్రకుడని (క్రీ.శ. 670-725) అతడు మృచ్ఛకటికాన్ని సగంవరకే వ్రాయగా అతని మనమడు రెండవ శివకుమారుడు పూర్తిచేసాడని డా. సేల్‌తోర్ అభిప్రాయపడినాడు. ఒకానొక రాజు నీచకులజుడు కావటంచేత శూద్రకుడని పిలువబడినాడని వింటర్‌నిట్స్ అభిప్రాయం. ఈ వాదాలన్ని ఊహల మీద ఆధారపడినవే. ఇవేవి సత్యాలని అంగీకరించటం సాధ్యంకాదు.

"శూద్రకు" డన్నది వ్యక్తి నామమా? లేక గణనామమా? అని సందేహం కలుగుతున్నది. శూద్రకుడని వ్యక్తి నామం పెట్టుకోవటం కొంత విచిత్రంగా వున్నది. "శూద్రకు" లని గణరాజ్యం ప్రాచీనకాలంలో వుండేది. అలెగ్జాండరు భారతదేశం మీదికి వచ్చినప్పుడు వీరు అతన్ని ఎదిరించారు. వీరు సింధునదీ పశ్చిమ తటనివాసులుగా గ్రీకు చరిత్రకారులచేత పేర్కొనబడినారు. వీరిని గ్రీకులు "సోద్రోయి" అని పిలిచారు. పాణిని వీరిని శౌద్రాయణులుగాను పతంజలి వీరిని అబ్రాహ్మణులు గాను పేర్కొన్నారు. వీరి జనపదం బ్రాహ్మణ గణ రాజ్యానికి పొరుగున వుండేదని, వీరు అలెగ్జాండరుతో వీరోచితంగా పోరాడినట్లు కూడ గ్రీకుల వ్రాతలవల్ల తెలుస్తున్నది. వీరిలో శూద్రులు, మహాశూద్రులని రెండు తెగలు వుండేవట. వీరు పేరునుబట్టి భారతీయ చాతుర్వర్ణ్యంలో లెక్కింపబడే శూద్రులు కాదని విదేశీయులై వుంటారని, వీరి విచిత్రమైన ఆచారాలను బట్టి శూద్రులనబడే వారని చారిత్రకుల అభిప్రాయం. ఈ శూద్రక గణానికి చెందిన క్షత్రియరాజే మృచ్ఛకటికకారుడై వుంటాడు. జాతిపేరు మీదుగా ఆ నాటకకర్త శూద్రకుడుగా చెలామణి అయివుంటాడు. ఉదయన, విక్రమాదిత్యుల వలెనే శూద్రకుడు ఒక మహావ్యక్తిగా మహారాజుగా లోకప్రసిద్ధిని చెందాడు. అతన్ని గురించి కూడ లోకంలో చాల కథలు ప్రచారంలోకి వచ్చినవి. అందుకే బృహత్కథామంజరి, హర్షచరిత్ర, రాజతరంగిణ్యాదులు అతని పేరును పేర్కొన్నవి. బాణుడు కాదంబరిలో ఒక నాయకుడైన రాజుకు శూద్రకుడని నామకరణం చేసాడు. మృచ్ఛకటికకారుడు

శూద్రకగణానికి చెందిన వీరుడై వుంటాడు. శూద్రకులు విజాతీయులైనా బ్రాహ్మణ ధర్మాన్ని చేపట్టి క్షత్రియవిద్యలతో పాటు వేద శాస్త్రాలను అభ్యసించి వుంటారు. అందుకే మృచ్ఛకటికకారుడు యుద్ధవిద్యలందు, వేద విజ్ఞానమందు ప్రావీణ్యాన్ని సంపాదించాడు.

## శూద్రకుని కాలం

వామనుడు కావ్యాలంకార సూత్రవృత్తిలో రెండు శ్లోకాలను ఉదాహరించి శూద్రకునివని పేర్కొన్నాడు. ఆ రెండింటిలో ఒకటి చారుదత్తంలోను మరొకటి మృచ్ఛకటికంలోను వున్నవి. శూద్రకుడు వామనునిచేత ఉద్ధరింపబడినాడు కాబట్టి అతడు క్రీ.శ. 800కు తర్వాత వాడు మాత్రం కాలేడు. బాణునికి దండికి కూడ శూద్రకుని పరిచయమున్నది. దండి బాణుల నాటికే శూద్రకుడు ఒక ప్రసిద్ధి చెందిన రాజే కాదు, అతన్ని గురించి అనేక విచిత్రమైన కథలు కూడ ప్రచారంలోకి వచ్చినవి. అట్లా కథలు వ్యాప్తిలో వున్నాయంటే క్రీ.శ. 7వ శతాబ్దంనాటికి అతడు చాలా ప్రాచీనుడని చెప్పవచ్చును. బేతాళ పంచవిశంతిలోను శూద్రకుని ప్రసక్తి వున్నది. ఈ కథలు చాల తర్వాత లిఖితరూపంలోకి వచ్చినా వీటి మౌఖిక రూపం ప్రాచీనమైందనే చెప్పాలి. దండి అవంతిసుందరికథను బట్టి శూద్రకుడు ఆంధ్రరాజా స్వాతిని జయించాడు. ఒక సంప్రదాయాన్ననుసరించి శూద్రకుడు విక్రమాదిత్యునికి సమకాలికుడు. స్కందపురాణాన్ననుసరించి శూద్రకుడు విక్రమాదిత్యునికి 27 సంవత్సరాలు ముందు రాజ్యపాలన చేసాడు. ఇతని రాజధాని శోభావతి అని కథాసరిత్సాగరం చెప్తున్నది.

మృచ్ఛకటికకారుడు భాసునికి తర్వాతివాడు, కాళిదాసుకు పూర్వుడని సాహిత్య విమర్శకుల అభిప్రాయం. భాసుని చారుదత్త నాటకాన్ని అతడు అనుసరించాడు. కాబట్టి అతడు భాసుని తర్వాతవాడు. కాళిదాసులో పరిపక్వం పొందిన నాటక ధర్మాలే మృచ్ఛకటికంలో కన్పిస్తున్నవి. కాబట్టి అతడు కాళిదాసు తర్వాత వాడనటం సమంజసం. అటువంటప్పుడు మృచ్ఛకటికకారుడు శూద్రకుడు స్కందపురాణాన్ని బట్టి విక్రమాదిత్యునికి పూర్వుడనే వాదం నిలువదు. విక్రమాదిత్యునికి అంటే క్రీ.పూ. ప్రథమ శతాబ్దికి తరువాతివాడే కావలెను. శూద్రకుడు అశ్వఘోషునికి ముందువాడు. అశ్వఘోషునిదని చెప్పబడే మగధవతి నాటకంలో మృచ్ఛకటికం పోలికలు చాలా వున్నవి. కాబట్టి శూద్రకుడు విక్రమాదిత్యునికి తర్వాత, అశ్వఘోషునికి ముందు క్రీ.శ. ప్రథమ శతాబ్దంలో నివసించాడని నిర్ణయించటం సమంజసంగా వుంటుంది.

# మృచ్ఛకటికంలోని ఇతివృత్తం

మృచ్ఛకటికంలో 10 అంకాలున్నవి. దీని ఇతివృత్తం భాసుని చారుదత్తం మీద ఆధారపడింది. చారుదత్త కథ వంటి కథ ఒకటి బృహత్కథలోను కన్పిస్తున్నది. దానిలో కుముదిక అనే వేశ్య ఉజ్జయినిలో బ్రాహ్మణకుమారుడు శ్రీధరుని ప్రేమిస్తుంది. రాజు అతన్ని బంధించగా కుముదిక అతన్ని విడిపించటానికి ప్రయత్నిస్తుంది. ధనవంతురాలైన వేశ్య బీదవాన్ని ప్రేమించటం రూపణిక కథలోను కన్పిస్తున్నది. మృచ్ఛకటికంలో వసంతసేన భవన వర్ణన కథాసరిత్సాగరంలో మదన మాల కథలో వున్నది. ఇదంతా సోమదేవుడు శూద్రకున్ని అనుకరించి వ్రాసిందే కావచ్చును. కవుల ప్రసిద్ధ కావ్యనాటకాల కథలను పురాణాది గ్రంథాల్లోకి ఎక్కించి ఆ కథల ప్రాచీనతను, పురాణాదుల మహత్త్వాన్ని స్థాపించటానికి ప్రాచీనులు పూనుకొన్నారేమో అనిపిస్తుంది.

మృచ్ఛకటికం ప్రకరణమనే రూపకభేదానికి చెందింది. ప్రకరణానికి కావలసిన లక్షణాలన్నీ దీనిలో వున్నవి. ఈ నాటకంలో నాయకుడు చారుదత్తుడు. అతని వృత్తి వ్యాపారం. తండ్రి తాతలు వ్యాపారంలో గడించిన సంపదను అతడు దానధర్మాలుచేసి నాటకకాలానికి దరిద్రావస్థలో వుంటాడు. ఈ నాటకంలో నాయిక వేశ్య వసంతసేన. శకారుడు వసంతసేనను కాంక్షిస్తాడు. ఒక రోజు వసంతసేన చారుదత్తుని కలుసుకోటానికై ఉద్యానవనానికి బయలుదేరి శకారునికి చిక్కుతుంది. ఆమెను అతడు బలవంతం చేస్తాడు. ఆ సమయంలో అతడు ఆమె మెడను నొక్కి వేస్తాడు. ఆమె మూర్ఛిల్లగా చనిపోయిందనుకొని చారుదత్తుడే ఆమెను చంపినట్లు అభియోగం నడుపుతాడు. న్యాయశాస్త్రానుసారం చారుదత్తునికి మరణశిక్ష విధింపబడుతుంది. అతన్ని వధ్యస్థానానికి తీసుకొని పోతారు. ఇంతలో వసంతసేన సంవాహకుడనే బౌద్ధభిక్షువుచేత రక్షింపబడి వధ్యస్థానానికి వస్తుంది. అదే సమయంలో గోపాల వేషంలో వున్న ఆర్యకుడు పాలకుడనేవాన్ని తోసివేసి తాను రాజు అవుతాడు. ఆర్యకుడు చారుదత్తుని స్నేహితుడు. కాబట్టి అతన్ని క్షమించి వసంతసేనతో అతనికి వివాహం చేయిస్తాడు. చారుదత్తుని మొదటిభార్య ధూత కూడ వసంతసేనను చెల్లెలిగా గ్రహిస్తుంది.

భాసుని చారుదత్తలోని నాలుగు అంకాలకు శూద్రకుడు ఆరు అంకాలను చేర్చి మృచ్ఛకటికాన్ని రచించాడని కొందరు విమర్శకులు తలంచారు. కాని నాటక నామకరణానికి కారకమైన మృత్ శకట వృత్తాంతం, ఆర్యకుడు పాలకున్ని తొలగించే వృత్తాంతం చారుదత్త

నాటకంలో లేవు. అవి శూద్రకుని చేర్పులే. కాబట్టి చారుదత్త కథ ఆధారంగా శూద్రకుడు రాజకీయ నేపథ్యాన్ని చేర్చి కొత్త నాటకాన్ని వ్రాసాడనటమే సమంజసం. వరదాచారి వంటి విమర్శకులు కొందరు మృచ్ఛకటికమే చారుదత్త నాటకంగా సంక్షిప్తం చేయబడిందని తలంచారు. ఈ రెండింటిలో సమాన శ్లోకాలుండటం ఈ వాదాన్ని బలపరుస్తున్నది. కాని కథాసామ్యముండటం చేత లేఖకులు శ్లోకాలను తారుమారు చేసికూడ వుండవచ్చును.

## నాటక నామౌచిత్యం

నాటక కథాసంవిధానానికి "చారుదత్త" లేక "దరిద్ర చారుదత్త" మనే పేరు తగి వున్నది. కాని నాటకకారుడు మృచ్ఛకటికమనే పేరును ఎన్నుకొన్నాడు. మృచ్ఛకటికమంటె మృత్ (మట్టి) శకట (బండి) మని అర్థం. చారుదత్తుని కొడుకు మట్టి బండితో ఆడుకుంటుంటాడు. వసంతసేన చారుదత్తునికి తోడ్పడదలచి తన నగలను మూటగట్టి ఆ బండిలో పెడ్తుంది. వసంతసేనను నగలకొరకు చారుదత్తుడు చంపాడని నగలతో కూడిన ఆ బండిని న్యాయస్థానానికి తెస్తారు. ఈ సాక్ష్యం ఆధారంగా చారుదత్తుని మీద నేరారోపణ బలపడుతుంది. మృత్యుదండం విధింపబడుతుంది. ఈ విధంగా ఈ మట్టిబండి నాటకంలో మహత్త్వపూర్వమైన పాత్రను వహించింది. కాబట్టి శూద్రకుడు తన నాటకానికి కొత్త పేరును సార్థకమైనదాన్ని ఎన్నుకొన్నాడు.

సామాన్యంగా నాటకానికి నాయికా నాయకుల పేరుమీదగాని ఏదైన ఒక సంఘటన ఆధారంగా గాని పేరు పెడ్తుంటారు. కవి ఈ నాటకానికి ఒక చిన్న సంఘటన ఆధారంగా పేరు పెట్టాడు. మట్టిబండి ఆధారంగా నాయకునికి శిక్ష పడింది. ఈ సంఘటన కథ పతాకసన్నివేశాన్ని చేరుకోవటానికి తోడ్పడింది. కాబట్టి మృచ్ఛకటికమనే పేరు తగినట్లుగానే వున్నది. ఇంతకు పూర్వం భాసుడు సూర్యవంశరాజుల ప్రతిమలను ప్రవేశపెట్టి తన నాటకానికి ప్రతిమానాటకమని పేరు పెట్టాడు. అదే విధంగా కాళిదాసు అభిజ్ఞానంగా అంగుళీయకాన్ని సృష్టించి తన నాటకానికి అభిజ్ఞాన శాకుంతలమని పేరు పెట్టాడు. మృచ్ఛకటిక నాటకంలో చారుదత్తుని కుమారుడు తనకు మట్టిబండి వద్దు పక్కింటి బాలునికున్నటువంటి బంగారు బండి కావాలని ఏడుస్తుంటే బంగారు బండి చేయించుకొమ్మని వసంతసేన తన నగలను తీసి ఆ మట్టిబండిలో పెడ్తుంది. ఆ భండిలో నింపిన నగలు చారుదత్తునికి తోడ్పడే బదులు అతని మరణానికి కారణమైనవి. ఆ బండి పేరు మీదుగా కవి ఈ నాటకానికి నామకరణం చేసాడు.

# మృచ్ఛకటికంలోని రాజకీయం నేపథ్యం

మృచ్ఛకటిక నాటకంలో రెండు ఇతివృత్తాలున్నవి. 1) ప్రధానేవృత్తం. ఇది చారుదత్త వసంతసేనలకు సంబంధించింది. 2) నేపథ్యేతివృత్తం. ఇది రాజకీయ విప్లవం, క్రూరుడైన పాలకుడనేవాన్ని చంపి ఆర్యకుడు రాజు కావటం. ఈ రెండు ఇతివృత్తాలు సరిగ్గా అతకక దేనికవే సమానాంతరంగా నడిచినవని కొందరు విమర్శకులు అభిప్రాయపడినారు. కాని సూక్ష్మపరిశీలనతో చూస్తేఈ అభిప్రాయం సరికాదనిపిస్తుంది, రాజకీయేతివృత్తంలో నాయకుడు ఆర్యకుడు. అతడు నాటకమంతటా కనిపించడు. చివర మాత్రమే కన్పిస్తాడు. రెండవ అంకంలో ఆర్యకుడు రాజు అవుతాడని జోస్యం చెప్పబడినట్లు దర్దురకుడు ప్రేక్షకులకు తెలియజేస్తాడు. ఆర్యకుని పక్షంలోని వారు కొందరు బలాన్ని సేకరించటం ఆరంభిస్తారు. శర్విలకుడు వసంతసేన సఖి మదనికను ప్రేమిస్తాడు. శర్విలకుడు ఆర్యకుని ప్రధాని. ఆర్యకున్ని కారాగారంనుంచి విడిపిస్తానని శర్విలకుడు నిశ్చయించుకుంటాడు. సప్తమాంకంలో చారుదత్త ఆర్యకులు కలుసుకొంటారు. నవమాంకంలో చారుదత్తుడు వసంతసేన జాడ చెప్పక సంకోచించటం ద్వారా ఆర్యకుడు తప్పించుకొని పారిపోయే అవకాశం ఏర్పడింది. దశమాంకంలో పాలకుని చావు, ఆర్యకుని పట్టాభిషేకం చెప్పబడింది. ఈ వృత్తాంతాన్ని నాటకకారుడు శర్విలక పాత్రద్వారా చెప్పించాడు. చారుదత్తుడు హత్యాభియోగం నుంచి రక్షింపబడినాడంటె అది అతని స్నేహితుడు ఆర్యకుడు రాజు కావటంవల్లనే సంభవించింది. ఒకవేళ పాలకుడు రాజుగా వుండి శకారుడు రాజాధికారిగా వుండి వుంటే వసంతసేన బతికివున్నదన్నా చారుదత్తునికి ముక్తి లభించివుండేది కాదు. ఆర్యకుడు రాజు కావటం వల్లనే అతనికి మరణశిక్ష తప్పింది. కాబట్టి రెండు ఇతివృత్తాలను కవి చాల నేర్పుగా కలిపి పరస్పరాపేక్షతో సాగినట్లుగా నడిపాడు. భాసుని చారుదత్త నాటకంలో ఈ రాజకీయ నేపథ్యంలేదు. ఇది శూద్రకుడు చేర్చిందే. కాని ఈ ఇతివృత్తం కేవలం కల్పితంకాదు. ఉజ్జయిని రాజు ప్రద్యోతుని కుమారులు గోపాల, పాలకులు. గోపాలుని కుమారుడు ఆర్యకుడు. గోపాలుడు ప్రతిజ్ఞా యౌగంధరాయణంలో మనకు కన్పిస్తాడు. గోపాలుని తర్వాత పాలకుడు రాజై ప్రజాకంటకుడు కావటంతో అతన్ని చంపి గోపాలుని కొడుకు ఆర్యకుడు రాజు అయ్యాడన్నది చారిత్రక సత్యమే. ఇది బృహత్కథలో కూడ చెప్పబడింది. కాని నాటకంలో శూద్రకుడు రాజకీయ ఇతివృత్తాన్ని ఎక్కడా స్పష్టంగా, ప్రధానంగా చేసి చెప్పలేదు. ఆ ఇతివృత్తాన్ని నేపథ్యంగానే, అప్రధానేతివృత్తంగానే నడిపాడు. షష్ఠాంకంనుంచే మట్టిబండి ఇతివృత్తం, రాజకీయేతివృత్తం

రెండింటి ప్రసక్తులుండటంచేత చారుదత్తం నాలుగ అంకాలుగానే లభించటంచేత కొంతమంది విమర్శకులు చారుదత్తం నాలుగు అంకాలతర్వాత శూద్రకుడు నాటకాన్ని పెంచి మృచ్ఛకటికాన్ని వ్రాసాడని అపోహపడినారు. కాని దీనికి బలమైన ఆధారాలు లేవు. శూద్రకుడు చేసిన ఆనాటి సాంఘిక, ఆర్థిక జీవితచిత్రణ భాసునిలో ఎక్కడా కనిపించదు. సాంఘిక ఆర్థిక జీవితచిత్రణ మృచ్ఛకటికంలో ప్రధానంగా జరిగింది. వాటికితోడు రాజకీయేతివృత్తాన్ని కూడ కవి జతపరచాడు. శైలి విషయంలో రెండు నాటకాలకు చాల భేదం వున్నది. కాబట్టి రెండు వేరువేరు నాటకాలనే చెప్పాలి.

రాజబలి పాండే మృచ్ఛకటిక నాటకానికి మూడు సంస్కరణలున్నవని అన్నాడు - ఒకటి - చారుదత్తుని కథగల చారుదత్త నాటకం. రెండు - పాలక ఆర్యకుల రాజకీయేతి వృత్తంగల నాటకం. మూడు - ఈ రెండు నాటకాలను పెనవేసుకొన్న మృచ్ఛకటిక నాటకం. చారుదత్త నాటకమున్నది నిజమే కాని పాలక ఆర్యకుల ఇతివృత్తంగల నాటకమున్నదనటం సత్యదూరమేమో!

## శూద్రకుని నాటకకళ

శూద్రకుని మృచ్ఛకటికం నాటకశాస్త్ర లక్షణాలను అనుసరిస్తు వ్రాసిన నాటకం కాదు. దీని సన్నివేశాల, పాత్రల చిత్రణలో కవి వాస్తవికతనే పోషించాడు కాని శాస్త్రలక్షణాలను దృష్టిలో పెట్టుకున్నట్టు లేదు. దీనిచేత ఈ కవి నాటకకళ భాసుని నాటకకళకు దగ్గరగా వున్నదనిపిస్తుంది. మృచ్ఛకటిక నాటకం ఇతర సంస్కృత నాటకాలకన్న భిన్నంగా కన్పిస్తున్నది. దీనిలోని కథ, పాత్రలు నీతిబోధకంగా కాక సంఘానికి అద్దం పట్టినట్లుగా సహజంగా వున్నవి. ఇది పాశ్చాత్య 'కామెడీ' నాటకాలకు దగ్గరగా వున్నది. క్రీస్తుశకారంభంలో గ్రీకుల రాజ్యాలు భారతదేశానికి పశ్చిమోత్తర దిశలో వుండేవి. వారి సాహిత్య ప్రభావం వల్ల ఏమైనా ఈ అపూర్వనాటకం వాస్తవికచిత్రణతో వ్రాయబడిందేమో అనే అనుమానం కలుగుతున్నది.

మృచ్ఛకటిక నాటకం ప్రదర్శన యోగ్యంగా లేదని, దీనిలో సంధి సంధ్యంగాలతో కూడిన Unity of action లేదని కొందరు విమర్శకులు విమర్శించారు. మరికొందరు విమర్శకులు పాలకుని చంపి ఆర్యకుడు రాజు కావటమే ప్రధానేతివృత్తమని, దానిలో Unity of action వున్నదని నిరూపించ ప్రయత్నించారు. సూచనగా పాత్రల సంభాషణల ద్వారా మాత్రమే చెప్పబడిన ఆర్యకుని వృత్తాంతం ప్రధానమై , ప్రత్యక్షంగా రంగస్థలం మీద

చూపబడిన సంఘటనలు గల చారుదత్తుని వృత్తాంతం ఎట్లా అప్రధానమౌతుందో అర్థం కావటం లేదు. మృచ్ఛకటికంలో చారుదత్త వసంతసేనల ప్రేమకథయే ప్రధానమైంది. ప్రథమాంకంలో చారుదత్తుని మీద వసంతసేనకు కలిగిన ప్రేమోదయం బీజరూపంలో చెప్పబడి తరువాత అంకాలల్లో అది అంకురమై వివాహఫలోన్ముఖమై నడిచింది. ఆర్యకుడు రాజు కావటంవల్ల చారుదత్త వసంతసేనల ప్రేమ వివాహంగా సిద్ధించటానికి దోహదకారి అయింది. ఆ విధంగా పరిశీలించినట్లయితె ఈ నాటకంలో Unity of action లేదని చెప్పలేము. అయినా ఈ నాటకంలో సంధి సంధ్యంగాలు అన్ని నాటకాలల్లో వలె ఒకే మూసలో పోసినట్లు లేకుండ సహజ సంఘటనలతో కథ చకచక సాగింది. దానివల్ల ఈ నాటకం కొత్తదనంతో మనోరంజనాన్ని కలిగిస్తున్నది. ఈ నాటకం ప్రదర్శనకు యోగ్యంగా లేదనటం కూడ నిరాధారం. ఇది భారతదేశంలోనే కాక పాశ్చాత్య దేశాలల్లోను రంగస్థలం మీద ప్రదర్శింపబడి ప్రశంసలను అందుకొన్నది. దీనికున్న అభినేయయోగ్యత మరే నాటకానికి లేదేమో కూడ.

మృచ్ఛకటిక నాటకంలో సన్నివేశాలను, సంభాషణలను కవి చాల నేర్పుతో కూర్చాడు. ఎక్కడా అనవసరమైన సన్నివేశాలు, సంభాషణలు కనిపించవు. పాత్రోచితమైన, వ్యంగ్యార్థభరితమైన, వాస్తవిక జీవితానికి దగ్గరగా వున్న సంభాషణలను కవి దీనిలో రచించాడు. ఇంతటి వాస్తవిక సంభాషణలు మరే నాటకంలోను లేవేమో కూడ. దీర్ఘమైన అనవసరమైన సన్నివేశాలతో సామాజికునికి విసుగు పుట్టకుండా శూద్రకుడు నాటకాన్ని రచించాడు.

## పాత్ర చిత్రణ

వాస్తవిక ప్రపంచానికి దగ్గరగా వున్న పాత్రలుగల కొద్దిపాటి సంస్కృత రచనల్లో ఇది ఒకటి. దీనిలోని పాత్రలు దండి దశకుమార చరిత్ర, పల్లవ మహేంద్రవర్మ మత్త విలాస ప్రహసనాలల్లోని పాత్రలను పోలివున్నవి. వాటిల్లో వలెనే దీనిలో చోరులు, జూదరులు, భిక్షుకులు, చండాలురు, రాజసేవకులు, దాసదాసీలు, రాజోద్యోగులు, సోమరిపోతులు మొదలైన అనేక సామాన్య పాత్రలు గోచరిస్తవి. మృచ్ఛకటికంలో నాయకుడు చారు దత్తుడు బ్రాహ్మణుడు, వివాహితుడు. అతడు సర్వసుగుణ సంపన్నుడైన ఆదర్శ వ్యక్తిగా కాక సామాన్యునిగా కన్పిస్తాడు. చారుదత్తునిలో ఉదారాది గుణాలున్నా ఉదాసీన వ్యక్తిత్వం కలవాడు. విధి ఎటు వంచితే అటు వంగుతాడు. ఒకసారి ఇతనిలో ఏమి చూచి వసంతసేన

ప్రేమించిందా? అని అనుమానం వేస్తుంది. చారుదత్తుడు తన దాతృత్వ గుణంచేత బీదవాడైనాడు. దానితో అతడు ఉజ్జయిని ప్రజల హృదయాలను జయించుకొన్నాడు. దరిద్రుడైనా అతడు ఎప్పుడు విచారించడు. కాని ఇతరులకు ఏదైనా ఇచ్చే పరిస్థితిలో లేనప్పుడు తనను తాను నిందించుకొంటాడు.

మృచ్ఛకటికంలో నాయిక వసంతసేన వేశ్య. అయినా సుగుణవతి, ధనవంతురాలననే గర్వమామెకు లేదు. సరళ హృదయురాలు. కరుణాంతరంగం కలది. సౌందర్యవతి. ఆమెను కోరేవారు ఎందరో వుండగా దరిద్రుడైన చారుదత్తుని ప్రేమించింది. చారుదత్తుని ప్రేమకు పాత్రురాలను కావాలి అని ప్రయత్నిస్తుంది.

మృచ్ఛకటికంలోని విదూషకుడు మైత్రేయుడు ఒక ప్రధాన పాత్ర. ఇతడు నాయకునికి పరమ మిత్రుడు. నాయకుని కొరకు ఏ త్యాగమైనా చేయటానికి సంసిద్ధుడు. తిండిపోతు, తన బుద్ధి మాంద్యంతో ప్రేక్షకులను నవ్విస్తాడు.

చారుదత్తుని కొడుకు రోహసేనుడు, భార్య ధూత, రాజు ఆర్యకుని పాత్రలు చాల చిన్నవైనా కవి వాటిని సూక్ష్మంగా ప్రభావవంతంగా చిత్రించాడు. మృచ్ఛకటిక నాటకంలో అందరిని ఆకర్షించే పాత్ర శకారుడు. ఇటువంటి పాత్ర సంస్కృత సాహిత్యంలో ఎక్కడా కనిపించదు. అతడు రాజుగారి ఉంపుడుగత్తెకు సోదరుడు. దానినెంతో గర్వంగా అతడు చెప్పుకొంటాడు. ఆ బంధుత్వంతో అధికారాన్ని చెలాయిస్తాడు. బుద్ధిహీనుడు, మూర్ఖుడు, క్రూరుడు, పిరికివాడు, విలాస పురుషుడు. అందరిముందు తానెంతో పండితుడనని, వీరుడనని చూపదలచుకొని నవ్వులపాలవుతాడు. అతడు నాటకంలో 'విలన్' వంటివాడు అయినా తన అభినయం, మాటల ద్వారా ప్రేక్షకులకు నవ్వు పుట్టిస్తుంటాడు. ఈ పాత్ర చిత్రణలో సంభాషణలో కవి సహజత్వాన్ని చూపాడు.

## మృచ్ఛకటికంలో ప్రతిబింబించిన సాంఘిక పరిస్థితులు

మృచ్ఛకటిక నాటకంలో సమకాలిక జీవన పరిస్థితులు చక్కగా ప్రతిబింబించినవి. అన్ని రంగాలవారికి చెందిన మనుష్యుల జీవితం దీనిలో చిత్రింపబడింది. వాస్తవిక చిత్రణతో కూడింది కాబట్టి ఈ నాటకం ఆదర్శ జీవితాలను కాక ప్రజాజీవితాన్ని వున్నదున్నట్లుగా ప్రతిబింబింపజేసింది. ఇటువంటి వాస్తవిక సాంఘిక పరిస్థితుల చిత్రణ చాల తక్కువ రచనల్లో కన్పిస్తుంది.

మృచ్ఛకటిక కాలంలో వర్ణవ్యవస్థ బాగా ఏర్పడింది. కాని మధ్యయుగంలో వలె అది గట్టిపడి దుర్వ్యవస్థగా మారలేదు. ఒక వర్ణంవారు మరో వర్ణధర్మాన్ని ఆచరించేవారు. చారుదత్తుడు బ్రాహ్మణుడైవుండి వాణిజ్యం వృత్తిగా గ్రహించాడు. ప్రజలు సంపన్నులుగా కన్పిస్తారు. ఒకరికంటె ఎక్కువ మంది స్త్రీలను వివాహమాడటం ఆచారంగా వుండేది. దాసత్వం కూడా ప్రచారంలో వున్నది. దాసులు స్వామి సంపద. డబ్బుపెట్టి దాసదాసీలను కొనుక్కోవటం, విడిపించుకోవటం వంటివి వుండేవి. డబ్బును అప్పుగా వడ్డీకి ఇయ్యటం ఆనాడు ప్రచారంలో వుండేది.

బ్రాహ్మణ ధర్మమే ఎక్కువ ప్రచారంలో వున్నా బౌద్ధధర్మం కూడ వ్యాప్తిలో వున్నది. శైవులకు, శాక్తులకు సంఘంలో గౌరమున్నట్లుగా బౌద్ధులకున్నట్లు కన్పించదు. ప్రయాణ సమయంలో బౌద్ధభిక్షువు కనబడటం అపశకునంగా భావింపబడేది. దీన్ని బట్టి మృచ్ఛకటిక నాటకకాలంలో బౌద్ధధర్మం రాజాదరణకు, ప్రజాదరణకు దూరమైనట్లుగా కన్పిస్తుంది. శూద్రకుడు నాందీ శ్లోకంలో శివస్తుతి చేయటంచేత అతడు శైవుడని చెప్పవచ్చును. బౌద్ధమన్న అతనికి అభిమానమున్నట్లు లేదు.

న్యాయం అందరికి ఒక్కతీరుగానే వుండేది. ప్రజలు తమ తగవులను న్యాయస్థానంలో పరిష్కరించుకొనేవారు. న్యాయాధీశుడు సప్రమాణంగా పరిశీలన చేసి స్మృతిప్రోక్తమైన శిక్షలను విధించేవాడు. రాజ బంధువులు న్యాయాధికారులుగా నియమింపబడటం, ఒక్కొక్కసారి వారు పక్షపాతంతో వ్యవహరించటం కూడ జరిగేది. మరణశిక్షపొందినవారిని రక్తవర్ణ వస్త్రాలు, మాలలు, ఎర్రని గంధంతో అలంకరించి ఊరేగింపుతో తీసుకొనిపోయేవారు. గూఢచార వ్యవస్థకూడ ఆనాడు సువ్యవస్థితమై వున్నది.

వేశ్యలలో రెండు భేదాలుండేవి. ఒకటి-గణికలు, రెండు-వేశ్యలు. గణికలు సంగీత నాట్యాది లలితకళలల్లో నిష్ణాతులయ్యేవారు. ఆ కళలను ప్రదర్శించి అలరించి డబ్బును సంపాదించేవారుకాని పడుపువృత్తిని చేపట్టేవారుకాదు. ఇక వేశ్యలు రూపసౌందర్యాలను అమ్ముకొని బతికేవారు. వసంతసేన గణికాశ్రేణికి చెందింది. గణికలల్లో చాల ధనవంతురాండ్రు వుండేవారు. బుద్ధుని కాలంలో ఆమ్రపాలి అనే వైశాలినగర గణిక ధనసంపత్తి చాల ప్రసిద్ధమైంది. అదే విధంగా వసంతసేన చాల ధనవంతురాలు. నాటకంలో ఆమె భవనవర్ణన నిజమా అనిపించేంత గొప్పగా వున్నది. గణికలు వివాహమాడటం కూడ జరిగేది. వసంతసేనకు చారుదత్తునితో నాటకంలో వివాహం జరిగింది. స్వయంగా రాజు ఆర్యకుడే ఈ వివాహాన్ని జరిపించాడు. బ్రాహ్మణ శర్విలకుడు మదనికను వివాహమాడాడు. సంఘంలో గణికలకు గౌరవస్థానమే వుండేది.

మృచ్ఛకటిక కాలంలో మధ్యమ, నిమ్న వర్గానికి చెందిన వాళ్ళు జూదమాడటం బాగా వుండేది. జూదమాడటానికి ప్రత్యేకంగా గృహాలుండేవి. జూదగృహానికి సభికుడనే పర్యవేక్షకుడుండేవాడు. జూదంలో మోసం చేసే వారిని, ఓడిపోయినా ధనం చెల్లించని వారిని న్యాయస్థానానికి తీసుకొని పోయేవారు. మృచ్ఛకటికంలో సంవాహకుడు జూదంలో ఓడిపోయి పారిపోగా ద్యూతకారుడొకడు న్యాయస్థానానికి పోతానని అంటాడు. కొందరు ఏం పని చేయక, సోమరిపోతులై దొరికిన కొద్ది డబ్బును జూదంలోపెట్టి ఆడుతుండేవారు. సంవాహకుడు తనను తాను " ద్యూతోపజీవి"గా చెప్పుకుంటాడు.

మృచ్ఛకటిక నాటకకాలంనాడు రాజు పాలకుడు దుర్మార్గుడు. అసమర్థుడు, విలాస జీవితాన్ని గడుపుతుండేవాడు. రాజు ఉంపుడుగత్తె బంధువులు రాజపదవుల్లో వుండేవారు. శకారుడు అటువంటివాడే. శకారుడు కాణేలీ మాతృకుడు (వ్యభిచారిణి పుత్రుడు) అని పిలువబడినాడు. ఇటువంటి బంధువులు ప్రజల మీద అత్యాచారలను చేస్తేవారు. రాజాధికారులను బెదిరించేవారు. తనకు అనుకూలంగా న్యాయం చెప్పకపోతే కొత్తవాన్ని నియమిస్తానని శకారుడు న్యాయాధీశుని బెదిరిస్తాడు. రాజు దుర్మార్గుడు, అసమర్థుడైనప్పుడు ప్రజలు తిరుగుబాటు చేసి అతన్ని తొలగించటం జరిగేది. పాలకున్ని తోసివేయటంలో జూదరులు, చోరులు, విటులు మొదలైనవారు కూడ సహాయపడినారు. రాత్రుళ్ళు రాజమార్గంలో జూదరులు, విటులు, వేశ్యలు సంచరించేవారు. అటువంటి మార్గం గుండా ప్రయాణం చేయటం క్షేమకరంగా వుండేది కాదు.

మృచ్ఛకటికంలో శౌరసేని, అవంతిక, ప్రాచ్యమాగధి, శకారి, చాండాలీ, ఢక్కి మొదలైన ప్రాకృత భేదాలను, అపభ్రంశ భాషలను శూద్రకుడు ప్రయోగించాడు. ఆనాడు సంఘంలో వేరువేరు వర్గాలల్లో వేరువేరు భాషా భేదాలు మాట్లాడబడేవి. కాని ఒకరి భాషాభేదం మరొకరికి సులభంగానే అర్థమయ్యేది.

ఆనాడు సముద్ర వ్యాపారం బాగా అభివృద్ధి దశలో వున్నది. పడవలు, ఓడల ద్వారా విదేశాలతో సముద్ర వ్యాపారం జరిగేది. శూద్రులకు వేదం చదివే హక్కు వుండేది కాదు.

మృచ్ఛకటికంలో చిత్రింపబడిన సమాజం ప్రాచీన కథల నుంచి గ్రహింప బడింది, ఊహా జనితమైందే కాని నిజమైంది కాదని సిల్వా లెవీ అభిప్రాయపడినాడు. కాని శూద్రకుని సమాజ చిత్రణలో ఎక్కడా కల్పన, అవాస్తవికత కనిపించదు. బృహత్కథాదుల్లో ఇటువంటి సమాజమే దర్శనమిస్తున్నది. అటువంటప్పుడు అది కేవలం కల్పన అనటానికి వీల్లేదు. అది అతని సమకాలిక సమాజానికి ప్రతి రూపమైన చిత్రణమే.

## శూద్రకుని కవిత్వం

శూద్రకుని కవిత్వం ప్రసాద మాధుర్యగుణాలు కలది. కాళిదాసు శైలి వలెనే ఇతనిది వైదర్భీశైలి. వాస్తవిక చిత్రణకు ఈ శైలి బాగా తోడ్పడింది. శూద్రకుని భావకల్పనలు సరసమైనవి, ఉదాత్తమైనవి అని కాళిదాసు కవిత్వంతో పోల్చి చెప్పలేము. కాని సహజ చిత్రణలతో కూడిన అతని కవిత్వం మనోరంజకంగా వున్నది. సన్నివేశ కల్పనలు, సహజ వర్ణనలు, వాస్తవిక సంభాషణలు శూద్రకుని ప్రతిభకు నిదర్శనాలు. అతడు గొప్ప కవికాదు కాని గొప్ప నాటకకారుడు అని చెప్పాలి. ప్రాచీన సంస్కృతసాహిత్యంలో శ్రవ్యకావ్యకారులే దృశ్యకావ్యాలను కూడ రచించారు. దృశ్య కావ్యం కూడ కవి కల్పనలతో అందమైన కవిత్వంతో నడిచేది. మృచ్ఛకటికకారుడు భాసుని వలె గొప్పకవి కాక పోవచ్చును. కాని గొప్ప నాటక కారుడు. శూద్రకుడు అక్కడక్కడ ప్రకృతివర్ణనాదులను చేసాడు కాని అవి సందర్భానికి ఉద్దీపన విభావంగా ఎంత అవసరమో అంతగానే రచించాడు. కాని అతడు తన కావ్యకళా ప్రతిభ చూపించటానికి అనవసరంగా పూనుకోలేదు.

శూద్రకుని శైలి సులభమైంది. అంతటా అతని శైలి కుంటుపడకుండా ధారాశుద్ధితో నడిచింది. కొన్నిచోట్ల ఓజోగుణ ప్రధానమైన శైలిని కూడ కవి ప్రయోగించాడు. చతుర్థాంకంలో విదూషకుడు చేసిన వసంతసేన భవనవర్ణన వచనంలో వ్రాయబడింది. ఈ దీర్ఘమైన వచనరచన ఉత్కృష్టంగా వున్నది. పంచమాంకంలోని వర్షవర్ణన కవితా ప్రతిభను చాటుతు అపూర్వంగా వున్నది. ఇటువంటి స్వాభావిక చిత్రణతో కూడిన వర్షర్తువర్ణన ఎక్కడా లేదని గోట్షాల్ వంటి విమర్శకులు తలంచారు. కేవలం ఈ వర్షర్తువర్ణనను ఓల్డెన్‌బెర్గ్ జర్మన్ భాషలోకి అనువదించాడు. వర్ణనల్లో శూద్రకుడు చక్కని మౌలికమైన ఉపమలను రచించాడు -

అమూహి భిత్వా జలదాంతరాణి పంకాంతరాణీవ మృణాళసూచ్య :
పతంతి చంద్రవ్యసనాద్విముక్తా దివో z శ్రుధారా ఇవ వారిధారాః.

"కమల సూచి బురదను చీల్చుకొని బయటికి వచ్చినట్లుగా జలధారలు మేఘాన్ని ఛేదించుకొని బయటపడ్తున్న" వని కవి భావం. మరొక పద్యంలో అభిసారిక అయిన వసంతసేన వర్ణన ఇట్లా సహజంగా రమ్యంగా చేయబడింది -

ఏషా ఫుల్లకదంబనీపసురభౌ కాలే ఘనోద్భాసితే
కాంతస్యాలయమాగతా సమదనా హృష్టా జలార్ద్రాలకా
విద్యుద్వారిద గర్జితైః సచకితా త్వద్దర్శనాకాంక్షిణీ
పాదౌ నూపురలగ్న కర్దమధరౌ ప్రక్షాళయంతీ స్థితా.

"వికసిత కదంబ నీపాల చేత సుగంధితం, వర్షజలం చేత తడిసిన అలకలు కలది, ప్రసన్నమైంది, కామార్తురాలైన వసంతసేన వర్షర్తులో తన ప్రియుని ఇంటికి వచ్చింది. మెరుపుల తళతళలు, ఉరుముల ధ్వనులచేత చకితురాలై నీ దర్శనం కొరకు వచ్చి నూపురాలంకృతమైన బురదకాళ్ళను బయట కడుక్కుంటూ నిలబడింది." అలంకారాలు ఆడంబరం లేని కవి సహజ వర్ణనను పై శ్లోకంలో చూడవచ్చు.

మృచ్ఛకటికంలో శృంగారం ప్రధానరసం. కరుణాదులు అంగరసాలు. నాయిక వసంతసేన సౌందర్యమూర్తి. ఆమె చారుదత్తుని ప్రేమించి వివాహమాడే వృత్తాంతమే ఈ ప్రకరణంలో వున్నది.

ఒక శ్లోకంలో శూద్రకుడు దరిద్రుని స్థితిని గురించి ఇట్లా చెప్పాడు -
దారిద్ర్యాత్ పురుషస్య బాంధవజనో వాక్యే న సంతిష్ఠతే
సుస్నిగ్ధా విముఖీభవంతి సుహృదః స్ఫారీభవంత్యాపదః
సత్వం హ్రాసముపైతి శీలశశినః కాంతిః పరిమ్లాయతే
పాపం కర్మచ యత్పరైరపికృతం తత్తస్య సంభావ్యతే

"దారిద్ర్యం చేత బంధువులు వాని మాటను ఆదరించరు. ప్రియమిత్రులు విముఖులౌతారు. వాని కష్టాలు రోజురోజుకు పెరుగుతవి. వాని తేజస్సు క్షీణిస్తుంది. అతని శీలకాంతి మలినమౌతుంది. ఇతరులు చేసిన కుకర్మలు కూడ దరిద్రుని నెత్తిమీదనే పడ్తవి.'

మృచ్ఛకటికం తర్వాత భవభూతి మాలతీమధవం మొదలైన ప్రకరణాలు వ్రాయబడినవి. కాని మృచ్ఛకటికం మాత్రం అపూర్వమైన ప్రకరణం గానే నిలిచిపోయింది. సహజ వాస్తవికచిత్రణగల ఇటువంటి ప్రకరణాలు మళ్ళీ వ్రాయబడనే లేదు. క్రీ.శ. 17వ శతాబ్దంలో మాత్రం మృచ్ఛకటికాన్ని అనుసరిస్తు మల్లికామారుతం (ఉద్దండకవి), కౌముదీమిత్రానందం (రామచంద్రుడు), ముకుళిత కుసుమచంద్రం (యశశ్చంద్రుడు)

మొదలైన ప్రకరణాలు వ్రాయబడినవి. కాని ఇవేవి మృచ్ఛకటికంతో సమానంగా నిలువగలిగేవి కావు. మృచ్ఛకటికనాటకం భారతీయ, విదేశీయ భాషల్లోకి అనువదింపబడింది. ఇంగ్లీషు, జర్మన్, ఫ్రెంచ్, డచ్, స్వీడిష్, డానిష్, ఇటాలియన్, రష్యన్ మొదలైన అనేక యూరోపియన్ భాషల్లోకి అనువదింపబడి ఈ నాటకం పాశ్చాత్యులను ఆకర్షించి ఆదరణను సంపాదించుకొన్నది. ఫ్రాన్స్, జర్మనీ దేశాల్లో ఇది రంగస్థలం మీద విజయవంతంగా ప్రదర్శింపబడింది కూడ.

## విశాఖదత్తుడు

విశాఖదత్తుని ప్రసిద్ధనాటకం ముద్రారాక్షసం. ఆ నాటక ప్రస్తావనను బట్టి విశాఖదత్తుని తండ్రి పృథుమహారాజు అని, పితామహుడు సామంత వటేశ్వర దత్తుడని తెలుస్తున్నది. కొన్ని లిఖిత ప్రతుల్లో విశాఖదత్తుడు విశాఖదేవుడుగా పృథుమహారాజు 'మహారాజ భాస్కందత్తుడు'గా పేర్కొనబడి కన్పిస్తున్నది. కవి తనను గురించి ఇంకా ఏమి విశేషాలు తెలుపలేదు. చారిత్రక ప్రమాణాలతో పృథుమహారాజు, వటేశ్వరదత్తులు ఎవరో నిర్ణయించటానికి కూడ సాధ్యమయ్యేటట్లు లేదు. వీరి పేర్లనుబట్టి వీరిది 'దత్త' వంశమని విమర్శకులు తలంచారు. తండ్రి తాతల పేర్లకు చేర్చబడిన మహారాజ, సామంత పదాలను బట్టి విశాఖదత్తుడు క్షత్రియుడని, ఒకానొక సామంతరాజు అని తెలుస్తున్నది.

## విశాఖదత్తుని కాలం

ముద్రారాక్షసం భరత వాక్యంలో "పార్థివ శ్చంద్రగుప్తః" అని వున్నది. దాని ఆధారంగా ఈ కవి చంద్రగుప్త మౌర్యుని కాలంవాడని విమర్శకులు తలంచారు. నాటకంలో నాయకుడు కూడ చంద్రగుప్త మౌర్యుడే. కాని నాటకంలో చంద్రగుప్త మౌర్యునికన్న చాణక్య పాత్రకు ప్రాధాన్యమెక్కువ. ఒకవేళ విశాఖ దత్తుడు ఆ రాజు ఆస్థానంలో వుండి ఈ నాటకాన్ని వ్రాస్తే రాజునే ప్రధాన పాత్రగా చేసి వుండేవాడు అని ఎమ్.ఆర్.కాలే ఈ వాదాన్ని త్రోసిపుచ్చాడు.

భరత వాక్యంలోని "చంద్రగుప్తః" స్థానంలో కొన్ని ప్రతుల్లో "దంతివర్మ", "రంతివర్మ' ' అని కన్పిస్తున్నది. రంతివర్మ పేరుతో ప్రసిద్ధరాజులెవరూ లేరు. దంతివర్మ పేరుతో ముగ్గురు ప్రసిద్ధులున్నారు - 1) రాష్ట్రకూటదంతివర్మ( క్రీ.శ. 600 ప్రాంతం.) 2) లాటరాజు దంతివర్మ. (క్రీ.శ. 700 ప్రాంతం.) 3) పల్లవరాజు దంతివర్మ. ( క్రీ.శ. 900 ప్రాంతం.)

వీరిలో పల్లవరాజు ఆస్థానంలో విశాఖదేవుడున్నాడని అతడు క్రీ.శ. 900 ప్రాంతంవాడని కొందరు విమర్శకులు తలంచారు. విశాఖదేవుడు దాక్షిణాత్యుడని తలంచేవారు ఈ వాదాన్ని సమర్థించారు. పల్లవులు పరమశైవులు. విశాఖదత్తుడు భరతవాక్యంలో రాజును విష్ణువుతో పోల్చాడు. విశాఖదత్తుడు వైష్ణవుడు కాబట్టి కొందరు విమర్శకులు ఈ వాదాన్ని తోసిపుచ్చారు.

కాశీనాథ్ త్ర్యంబక్, తైలంగ్ వంటి విమర్శకులు "అవంతి వర్మ" పాఠాన్ని గ్రహించారు. అవంతివర్మలు ఇద్దరు కన్పిస్తున్నారు. ఒకరు-కాశ్మీర రాజు. రెండు-మౌఖరి వంశరాజు. హర్షవర్ధనుని చెల్లెలు రాజశ్రీని వివాహమాడిన గ్రహవర్మ తండ్రి ఈ మౌఖరి అవంతివర్మ. ఇతని ఆస్థానంలోనే విశాఖదత్తుడున్నాడని పై విమర్శకులు అంగీకరించారు. అప్పుడు విశాఖదత్తుడు దాదాపు బాణునికి సమకాలికుడౌతాడు. బీహార్ ప్రాంతంలో పాటలీపుత్ర వైభవంతో విశాఖదత్తునికి బాగాపరిచయమున్నదని, కాబట్టి అతడు మౌఖరి అవంతివర్మ ఆస్థాని అని, గుప్తసామ్రాజ్యం పతనోన్ముఖమై హర్షవర్ధనుని సామ్రాజ్యాంకుర దశలో ఈ నాటక రచన జరిగివుంటుందని విశాఖదత్తుడు క్రీ.శ.7వ శ॥ వాడని అభిప్రాయపడినాడు. మౌఖరి అవంతివర్మ ఆస్థాని విశాఖదత్తుడు అని అంగీకరించినట్లయితె అతడు బెంగాల్ వాడు కాదని, ఉత్తర భారతీయుడు, శైవుడు అని తేలుతున్నదని విధుభూషణ్ గోస్వామి నాటకాన్ని పరిశీలించి చెప్పాడు.

యాకోబి ముద్రారాక్షస ప్రస్తావనలో పేర్కొనబడిన చంద్రగ్రహణాన్ని ఆధారంగా తీసుకొని విశాఖదత్తుని కాలనిర్ణయాన్ని చేయటానికి పూనుకొన్నాడు. చంద్రునితో బుధగ్రహముండటంచేత చంద్రగ్రహణం కాలేదని పేర్కొనబడింది. యాకోబి మతానుసారం అటువంటి అసంభవమైన చంద్రగ్రహణం 2 డిసెంబర్ క్రీ.శ. 860 అవుతుందని, కాబట్టి విశాఖదత్తుడు క్రీ.శ. 9వ శ॥ వాడని నిర్ణయించాడు. కాని పాత్రప్రవేశ చమత్కారం కొరకు కథోద్ఘాతమనే పాత్రప్రవేశపద్ధతిని అనుసరించి కవి అటువంటి అసంభవమైన చంద్రగ్రహణ కల్పనను చేసాడు. అంతేగాని దాన్నిబట్టి కవి కాలనిర్ణయం చేయటం నిరాధారం. కాని చాలామంది విమర్శకులకు విశాఖదత్తుడు క్రీ.శ. 9వ శ॥ వాడని అనటమే సమ్మతంగా కన్పిస్తున్నది. కీథ్, దాస్‌గుప్త మొదలైన విమర్శకులు కూడ విశాఖదత్తుని క్రీ.శ. 9వ శ॥ వానిగానే అంగీకరించారు.

ముద్రారాక్షస ప్రస్తావనలోని "పార్థివ శ్చంద్రగుప్తః" అన్న పాఠాన్నే గ్రహించి కొందరు విమర్శకులు విశాఖ దత్తుడు గుప్తరాజు రెండవ చంద్రగుప్తుని కాలం వాడని, గుప్తుల కింద అతడు సామంతరాజు అని నిర్ణయించారు. "మ్లేచ్ఛైరుద్విజ్యమానా భుజయుగ మధునా" అని చెప్పింది రెండవ చంద్రుగుప్తునిగురించే అని వీరి అభిప్రాయం. రెండవ చంద్రగుప్తుడు హూణవిజేత అని చరిత్ర ప్రసిద్ధమైంది. దాన్నే కవి "మ్లేచ్ఛైరుద్విజ్యమానా" అని సూచించాడని అంటారు. విశాఖ దత్తుడు రెండవ చంద్రగుప్తుని నాయకునిగా చేసి వ్రాసిన "దేవీ చంద్రగుప్త" మనే నాటకం ఈ మధ్య దొరికింది. దానిలో చంద్రగుప్తుడు హూణులను జయించటమే ఇతివృత్తం. ముద్రారాక్షసం భరత వాక్యంలో "మ్లేచ్ఛులచేత కష్టాలను పొందిన భూమి ఇప్పుడు ఈ రాజమూర్తిని ఆశ్రయించింది" అని కవి వర్తమాన పదాన్ని "ఇప్పుడు" అని ప్రయోగించి ఆ రాజు తనకు సమకాలికుడు కావటాన్ని సూచించాడు. విశాఖదత్తుడు గుప్తరాజు రెండవచంద్రగుప్తుని సమకాలికుడు అని డా.కాశీనాథజైస్వాల్, వరదాచారి, వింటర్‌నిట్స్, స్మిత్‌లు సమర్థించారు. కొత్తగా బయటపడిన అతని నాటకం కూడా ఈ వాదాన్నే పూర్తిగా బలపరుస్తున్నది. విశాఖదత్తుడు ప్రసిద్ధ 'దత్త' వంశానికి చెందినవాడని, గుప్తుల కాలంలో వీరు గౌడ (బెంగాల్) దేశాన్ని పాలిస్తు గుప్తులకు సామంతులుగా వుండేవారని కొందరు విమర్శకుల మతం. రెండవ చంద్రగుప్తుని కాలంలో విశాఖ దత్తుని తండ్రి రాజ్యం చేస్తున్నాడని, యువకుడైన విశాఖదత్తుడు సాహిత్యప్రియుడై చంద్రగుప్తుని ఆస్థానంలో వుండేవాడని కొందరు ఊహ చేశారు. మహామహోపాధ్యాయ హరప్రసాద్‌శాస్త్రి విశాఖదత్తుని శైలి గౌడీ రీతిలో వున్నదని కాబట్టి అతడు గౌడ దేశీయుడని చెప్పాడు. " మంచుతో సమానమైన స్వచ్ఛమైన ముత్యా" లని ఒకచోట కవి ఉపమించాడని కాబట్టి ఈ కవి మంచుతో పరిచయం లేని దాక్షిణాత్యుడు కాని గౌడదేశీయుడు కాని కాలేడని, విశాఖదత్తుడు ఉత్తర భారతీయుడని కాశీప్రసాద్ జైస్వాల్ నిర్ణయించాడు. కాని అతడు గౌడదేశ రాజకుమారుడైనా దేశాటనం చేసివుంటాడు. దేశాటనంలో అతడు మంచును చూసి వుంటాడు. అందుకే ఆ ఉపమను గ్రహించాడు. గౌడదేశాన్ని తన తండ్రి పాలిస్తుండగా అతడు గుప్త రాజధాని పాటలీపుత్రంలో కొంతకాలం నివసించి కూడా వుండ వచ్చును.

"మ్లేచ్ఛైరుద్విజ్యమానా" అన్న శ్లోకంలోని "మ్లేచ్ఛ" శబ్దంతో మహమ్మద్ గోరీని గురించి కవి సూచించాడని, విశాఖదత్తుని తండ్రి " మహారాజ పృథు" చౌహాణ వంశీయుడైన 'పృథ్వీరాజు' అని విల్సన్ అభిప్రాయపడినాడు. కాని పృథ్వీరాజు తండ్రిపేరు సోమేశ్వరుడు.

నాటకంలో 'పృథు' తండ్రి వటేశ్వరదత్తుడని ఇయ్యబడింది. అంతేగాక ధనంజయ (క్రీ.శ. 10 వ శ॥), భోజరాజు (క్రీ.శ. 11వ శ॥), రామచంద్రగుణ చంద్రులు (క్రీ.శ. 1200) ముద్రా రాక్షస, దేవీచంద్రగుప్త నాటకాలను ఉద్ధరించారు. కాబట్టి విల్సన్ అభిప్రాయం ప్రకారం విశాఖదత్తుడు చౌహాణ వంశీయుడనటం పూర్తిగా కల్పన మాత్రమే. భర్తృహరి నీతి శతకంలో ముద్రారాక్షసాన్ని ఉద్ధరించాడు. కాబట్టి విశాఖదత్తుడు క్రీ.శ. 700 కు తర్వాతివాడని చెప్పటానికి వీల్లేదు.

ముద్రారాక్షస నాటకంలో చిత్రింపబడిన భౌగోళిక సాంఘిక పరిస్థితులు విశాఖదత్తుడు గుప్తులకాలం నాటి వాడనుటను సమర్థిస్తున్నదని వాచస్పతి గైరోలా అభిప్రాయపడినాడు. విశాఖదత్తుడు పేర్కొన్న దేశ, జాతుల పేర్లనుబట్టి అతని అస్తిత్వం క్రీ.శ. 400-700 నడుమనే అని గైరోలా అన్నాడు. రెండవ చంద్రగుప్తుడు శకులను ఓడించిన వృత్తాంతాన్ని తీసుకొని విశాఖదత్తుడు మొదట నాటకంగా రచించి వుంటాడు. ఆ తర్వాత చంద్రగుప్త నామసామ్యం గల మౌర్యచంద్రగుప్తుని నాయకునిగా చేసి ముద్రారాక్షస నాటకాన్ని రచించి వుంటాడు. విశాఖదత్తుడు రెండవ చంద్రగుప్తుని ఆస్థానంలో అతనికి సమకాలికుడుగా వుండి వుంటాడు లేక చంద్రగుప్తుని శకవిజయం తాజాగా అందరి స్మృతిపథంలో వున్న కాలంలో అంటె చంద్రగుప్తునికి సమీపకాలంలోనో వుండి వుంటాడని చెప్పవచ్చును. అంటె విశాఖదత్తుడు మొత్తంమీద గుప్తులకాలం వాడు, క్రీ.శ. 4,5 శతాబ్దాలవాడని నిర్ణయించి చెప్పవచ్చును.

## విశాఖదత్తుని రచనలు

విశాఖదత్తుని రచనల్లో ముద్రారాక్షసమే లభ్యం. ఇది గాక ఇతడు దేవీ చంద్రగుప్తం వ్రాసినట్లు భోజరాజ, రామచంద్ర గుణచంద్రుల ఉద్ధరణను బట్టి తెలిసింది. రామచంద్ర గుణచంద్రులు తమ నాట్యదర్పణంలో ఈ నాటకంలోని పంచమాంకంలోని ఒక ప్రాకృత గాథను ఉద్ధరించారు. ఈ నాటకం చాలాకాలం అజ్ఞాతంగానే వుండింది. ఈ మధ్య ఈ నాటకంలోని కొంతభాగం లభ్యమైంది. ఈ అసంపూర్ణ సంస్కృత నాటకాన్ని ఆధారంగా తీసుకొని ప్రసిద్ధ హిందీకవి ప్రసాద్ హిందీలో "ధ్రువస్వామిని" అనే నాటకాన్ని వ్రాసాడు. ఈ నాటకంలో గుప్తరాజులు రామగుప్త చంద్రగుప్తుల కథ వున్నది. వీరిద్దరు సముద్రగుప్తుని కొడుకులు. ధ్రువస్వామిని రామగుప్తుని భార్య. శకులతో యుద్ధంచేసి రామగుప్తుడు మరణిస్తాడు. శకులు ధ్రువస్వామినిని కోరుతారు. అప్పుడు చంద్రగుప్తుడు ఉపాయంతో

శకరాజును చంపి శకులను ఓడించి ధ్రువస్వామిని గౌరవాన్ని కాపాడి ఆమెను వివాహ మాడుతాడు. రెండవ చంద్రగుప్తుని నాణాలమీద అతని పేరుతో పాటు ధ్రువస్వామిని పేరు కూడ కన్పిస్తున్నది. ఆమె అందం, తెలివి చంద్రగుప్తున్ని మిక్కిలి ఆకర్షించి వుంటవి. లేదా గుప్తసామ్రాజ్య పరిరక్షణలో ఆమెపాత్ర కూడ వుండి వుంటుంది. ఈ నాటకం బయటపడనంత వరకు సముద్రగుప్తునికి చంద్రగుప్తునికి నడుమ అతని అన్న రామగుప్తుడు రాజ్యం చేసాడన్నది తెలియని సత్యం. ఈ నాటకంవల్ల రామగుప్తుని వృత్తాంతం మరియు చంద్రగుప్తుడు శకులను ఓడించిన సాహసగాథ బయటపడింది. ఈ నాటకం చారిత్రకులకు కూడ ప్రమాణంగా తోడ్పడింది. తర్వాత రామగుప్తుని నాణాలు దొరికినవి. ముద్రారాక్షసంవలెనే ఈ నాటకం ఐతిహాసిక రాజకీయ ఇతివృత్తం కలది అని తేలింది. ముద్రారాక్షసంలో చాణక్యుడు రాక్షసమంత్రిని లోబరచుకొన్న ఇతివృత్తమున్నది. దేవీ చంద్రగుప్త నాటకంలో దేవీ చంద్రగుప్తుల ప్రేమ, చంద్రగుప్తుడు సాహస చాతుర్యాలతో శకులను జయించే ఇతివృత్తమున్నది.

విశాఖదత్తుడు "అభిసారికా వంచితకం" లేక "అభిసారికా బంధితకం" అనే నాటకాన్ని కూడ వ్రాసాడంటారు. ఇందులో ఉదయన వాసవదత్త పద్మావతులకు సంబంధించిన ఇతివృత్తమున్నది. ఇది అలభ్యం. రెండు నాటకాలల్లో రాజకీయనేపథ్యాన్ని ఉపయోగించి వ్రాసిన విశాఖదత్తుడు ఈ ప్రేమ కథగల నాటకాన్ని వ్రాసాడా అని అనుమానం కలుగుతుంది. ఇది అతని రచనో కాదో చెప్పలేము. అదే విధంగా సదుక్తికర్ణామృతంలో విశాఖదత్తుని పేరుతో ఈ కింది శ్లోకాలు ఇయ్యబడినవి -

రామ్యోసౌ భువనేషు విక్రమ గుణైర్యాతః ప్రసిద్ధిం పరామ్
అస్మద్భాగ్య విపర్యయాద్ యది పరందేవో న జానాతి తమ్
వందీ సైష యశాంసి గాయతి మరుద్ యస్యైక బాణాహత
శ్రేణీభూత విశాలతాళ వివరోద్గీర్ణైః స్వరైః సప్తభిః

ఈ శ్లోకాన్ని పరిశీలిస్తే విశాఖదత్తుడు రామకథకు సంబంధించిన నాటకాన్నేదో వ్రాసాడని తెలుస్తున్నదని ప్రా. ధ్రువ పేర్కొన్నాడు. కాని రెండు రాజకీయ సంబంధేతివృత్తాలుగల నాటకాలు వ్రాసినవాడు రామకథను తీసుకొని నాటకాన్ని వ్రసాడా? అని మళ్ళీ అనుమానం కలుగక మానదు.

## ముద్రారాక్షస నాటకం

ఇప్పుడు విశాఖదత్తుని కీర్తిస్తంభానికి ఆధారంగా వున్నది ఈ ఒక్క నాటకమే. ఇతర కవులవలె అతడు దీనిలో నాయికానాయకుల ప్రేమ వృత్తాంతాన్ని ఇతివృత్తంగా తీసుకోలేదు. అసలు దీనిలో నాయికే లేదు. రాజకీయపు టెత్తుగడలతో కూడింది ముద్రారాక్షస కథ. అది అతని రాజకీయ పరిజ్ఞానాన్ని వేనోళ్ళ చాటుతున్నది. రాజులను కూలదోయటం, గూఢచారుల జాలం, ఎత్తుగడలు విఫలించి వక్రించటం, ఎత్తుకు పైయెత్తులు మొదలైన అనేక రాజకీయ బుద్ధి కుశలతతో కూడిన సన్నివేశాలుగల కథను కవి ఎంతో నేర్పుతో దృశ్యకావ్యంగా తీర్చిదిద్ది తన రచనా ప్రతిభను ప్రదర్శించాడు.

ముద్రారాక్షస నాటకంలో ఏడు అంకాలున్నవి. సూత్రధారుడు ప్రయోగించిన చంద్రగ్రహణ శబ్దాన్ని విని మలయకేతువువల్ల చంద్రగుప్తునికి పరాభవం జరుగు తుందనే అర్థాన్ని గ్రహించి క్షుబ్ధుడై చాణుక్యుడు "నేను వుండగా చంద్రగుప్తునికి అనిష్టం చేయటానికి ఎవరు సాహసిస్తారురా" అని క్రోధపూర్ణ కంఠంతో అంటూ రంగస్థలం మీదికి ప్రవేశిస్తాడు. చాణక్యుడు నందవంశ రాజ్యనిర్మూలనం, నందుని అమాత్యుడు రాక్షసున్ని వశం చేసుకొనేంతవరకు అసంపూర్ణంగానే వుంటుందని తలుస్తాడు. చంద్రగుప్తున్ని చంపటానికై రాక్షసునిచేత పంపబడిన విషకన్య ద్వారా పర్వతేశ్వరుని చాణుక్యుడు చంపించి, రాక్షసుని షడయంత్రంవల్ల పర్వతేశ్వరుడు మరణించాడని ప్రచారం చేస్తాడు. ఇంకొక వైపు చాణక్యుడు తన గూఢాచారి భాగురాయణుని తానే పర్వతేశ్వరుని చంపించినట్లు చెప్పటానికై పర్వతేశ్వరుని కొడుకు మలయకేతువు దగ్గరికి పంపుతాడు. ఇంకా అనేక గూఢాచారులను రాక్షస మలయకేతువుల దగ్గర వారికి విశ్వసనీయులైన వ్యక్తులుగా నియమిస్తాడు. రాక్షసుని కుటుంబం అతని మిత్రుడు చందనదాసు గృహంలో వున్నదని తెలుసుకొని చాణుక్యుడు అతన్ని పిలిపించి వారిని అప్పగించమని అడుగుతాడు. కాని చందనదాసు దానికి నిరాకరిస్తాడు. ఇది మొదటి అంకం కథ. రెండవ అంకంలో రాక్షసుని రాజనీతి కుశలత ప్రేక్షకులకు పరిచయమౌతుంది. చంద్రగుప్తున్ని చంపటానికై రాక్షసుడు చేసిన ప్రయత్నాలన్నీ విఫలమౌతవి. ఇప్పుడు ఎట్లా అయినా చాణక్య చంద్రగుప్తుల నడుమ భేదాన్ని పుట్టించాలని రాక్షసుడు ఎత్తు వేస్తాడు. ఇద్దరు గూఢచారులను వైతాళికుల వేషంలో చంద్రగుప్తుని దగ్గరికి పంపుతాడు. వీరు అతనికి అడుగడుగునా గర్వమూ, రోషమూ పుట్టించే స్తుతి చేస్తుంటారు. చాణుక్యుడు తన ప్రతిజ్ఞ నెరవేరిందనే గర్వంతో విర్రవీగుతున్నాడు. మరొకవైపు చంద్రగుప్తుడు రాజ్యప్రాప్తిచేత సంతృప్తుడై వున్నాడు. అటువంటి వారిద్దరి

నడుమ భేదాన్ని పుట్టించి కలహాన్ని కలిగించటం సులభ కార్యమని రాక్షసుడనుకుంటాడు.

మూడవ అంకంలో చాణక్యుడు రాక్షసుని పన్నాగాన్ని తెలుసుకొని ఎత్తుకు పై యెత్తులు వేస్తాడు. నిజంగా తమ నడుమ భేదభావం పుట్టినట్లు ఆచరించమని చాణక్యుడు చంద్రగుప్తునికి చెప్తాడు. చంద్రగుప్తుడు పాటలీపుత్ర నగరంలో కౌముదీ మహోత్సవాన్ని చాటిస్తాడు. కౌముదీమహోత్సవ సమయంలో ప్రజలు, సేన అప్రమత్తులై వున్నప్పుడు రాక్షస, మలయ కేతువులు దండెత్తి వస్తారన్న నెపంతో చాణుక్యుడు ఉత్సవం చేయకూడదని శాసిస్తాడు. దానితో చాణక్య చంద్రగుప్తులకు మిథ్యా వాగ్వివాదం జరిగింది. ఇదే అదను అని వైతాళికులు చంద్రగుప్తుని కోపోత్తేజితుని చేసే స్తుతి చదువుతారు. నిజంగానే చాణక్య చంద్రగుప్తుల్లో భేదబావ మేర్పడిందని అందరూ నమ్ముతారు. నాలుగవ అంకంలో చాణక్యుని గుప్త చరుడు భాగురాయణుడు రాక్షస మలయ కేతువుల్లో భేదాన్ని పుట్టించటానికి ప్రయత్నిస్తాడు. శకటారుడు వచ్చి చాణక్య చంద్రగుప్తుల భేదభావాన్ని గురించి చెప్పగా, చంద్రగుప్తుడు తనకు వశుడైనాడని రాక్షసుడు సంతోషిస్తాడు. రాక్షస మలయ కేతువులు పాటలీపుత్రం మీదికి దండెత్తాలని యోచిస్తారు.

ఐదవ అంకంలో గూఢచారి క్షపణకుడు, మలయ కేతువు దాగి వుండి వింటుండగా పర్వతేశ్వరుని చంపించినవాడు రాక్షసుడే అని భాగురాయణునికి చెప్తాడు. కొన్ని ఆధారాలతో మలయ కేతువు దీన్ని పూర్తిగా విశ్వసిస్తాడు. రాక్షసుని మిత్రద్రోహిగా తలుస్తాడు. దీనితో రాక్షస మలయ కేతువులకు భేదభావ మేర్పడుతుంది. చివరకు చాణుక్యుని పన్నాగంలో చిక్కిన చందనదాసును రక్షించుకోవాలి అని రాక్షసుడు పాటలీపుత్రానికి వస్తాడు.

ఏడవ అంకంలో గుప్తచరులు ఇద్దరు చండాల వేషాన్ని ధరించి చందన దాసును వధ్య స్థానానికి తీసుకొని పోతుంటారు. చందనదాసు భార్య, పుత్రుడు దుఃఖ విలాపం చేస్తూ ప్రవేశిస్తారు. వధ్య స్థానానికి రాక్షసుడు వచ్చి చండాలురను బెదిరించి పారదోలుతాడు. అంతలో చాణక్యుడు చంద్రగుప్తునితో అక్కడికి వస్తాడు. చాణక్యుడు తన రాజనీతి పన్నాగాన్నంతా రాక్షసునికి విప్పి చెప్పి అతన్ని చంద్రగుప్తునికి మహామాత్యుడుగా వుండమని కోరుతాడు. రాక్షసుడు చేసేది లేక చాణుక్యునికి లొంగిపోతాడు.

రాజనీతి చదరంగంలో రాక్షసుడు ఓడిపోతాడు. పాఠకులు చాణక్యుని రాజనీతి కుశలతకు ఆశ్చర్య చకితులౌతారు. అయినా రాక్షసునిమీద సానుభూతి గౌరవ భావాలు కలుగుతవి. రాక్షసుడు ఓడిపోయినా అతనికి గౌరవహాని కలుగలేదు. స్వచ్ఛంద విహారి

అయిన రాక్షసుడు అనే మత్తనాగాన్ని చాణుక్యుడు కుశలుడైన మావటీడు వలె వశపరచుకొని గూటానికి కట్టివేస్తాడు. రాక్షసుడు చాణక్యుని పన్నాగంలో చిక్కుకోటానికి ఇష్టం లేనివాడు. కాని చాణక్యుని రాజనీతి కుశలత అనే తృణాచ్ఛాదితమైన బిలంలో చివరకు రాక్షస నాగం పడిపోక తప్పదు.

## ముద్రారాక్షస నామౌచిత్యం

"ముద్రయా గృహీతం రాక్షసమధికృత్య కృతో గ్రంథః ముద్రారాక్షసమ్" అని ముద్రారాక్షసం యొక్క వ్యుత్పత్త్యర్థం. మృచ్ఛకటికం, అభిజ్ఞాన శాకుంతలం పేర్లు కవిని ఈ నాటక నామకరణానికి ప్రేరేపించి వుంటవి. మట్టి బండికి గల ప్రాధాన్యాన్ని, అభిజ్ఞానరూపంగా ఇయ్యబడిన అంగుళీయకానికి గల ప్రాధాన్యాన్ని దృష్టిలో పెట్టుకొని ఈ నాటకంలో 'ముద్ర' అంటె అంగుళీకయం ద్వారా చాణుక్యుడు రాక్షసున్ని లొంగదీసుకొన్నట్లు కవి కథాకల్పన చేసి అంగుళీయకానికి ప్రాధాన్యాన్ని కల్పించాడు. ఆవిధంగా నాటకానికి ముద్రారాక్షసమన్న పేరు స్థారకమై ప్రేక్షకుల కుతూహలాన్ని, ఆనందాన్ని ఇనుమడింప జేస్తున్నది.

## ముద్రారాక్షసం విశేషత

శూద్రకుని మృచ్ఛకటికానికి సంస్కృత సాహిత్యంలో విశేషమైన స్థానమున్నట్లే ముద్రారాక్షసానికి విశేషమైన స్థానమున్నది. మృచ్ఛకటికం ప్రకరణం, ముద్రారాక్షసం నాటకం. ప్రకరణం కాబట్టి మృచ్ఛకటికం మృదులహాసంతో లలితంగా నడిచింది. ముద్రారాక్షసం రాజనీతి విషయాలలో గంభీరంగా నడిచింది. రాజనీతిని నాటకవస్తువుగా గ్రహించిన నాటకకారుడు ఒక్క విశాఖదత్తుడే కన్పిస్తున్నాడు. ఈ నాటకం వీరరస ప్రధానమైంది. యుద్ధం ద్వారా కాక రాజనీతిజ్ఞులైన పురుషుల రాజనీతి ప్రతిభా సంఘర్షణతో వీరరసం పోషింపబడింది. ఇతర కవులు మహాభారత రామాయణ బృహత్కథాదుల నుంచో లేక కల్పితమైనవో కథలను తీసుకోగా విశాఖ దత్తుడు ఐతిహాసిక సంబంధేతివృత్తాన్ని తీసుకొని నాటకాన్ని వ్రాసిన విధం చాలా ప్రశంసనీయమైంది. రాజనీతి సంబంధమైన, ప్రజాసామాన్యాన్ని అకర్షించలేని అర్థంకాని వస్తువును తీసుకొని విశాఖదత్తుడు ఆకర్షణీయమైన విధానంలో పెట్టాడు. ఇది సంఘటనా ప్రధానమైన నాటకమని చెప్పవచ్చును. రసదృష్టి కన్న కవికి సంఘటనల కూర్పులో, నాయకుని ప్రయత్న

సాఫల్యంలోనే దృష్టి. చాణక్య రాక్షసుల ఎత్తుకు పైయెత్తులను చాలాస్పష్టంగా గందరగోళం లేకుండా కవి కూర్చాడు. ఈ నాటకంలో నాయిక లేదు. నాయికే కాక స్త్రీ పాత్రలు కూడ చాలా తక్కువ. ప్రతిహారి శోణోత్తర, విజయ, చందనదాసు భార్య తప్ప స్త్రీ పాత్రలే లేవు. అంతా పురుష పాత్రలతోనే కథ జరిగింది. అయినా నాటకం ఎక్కడా నీరసంగా లేకుండా నడిచింది. ప్రేమ మధురభావం లేకుండా నాటకమంతా గంభీర రాజకీయ భావాలతో సాగింది. నృత్య సంగీతాదుల ప్రసక్తిగాని ప్రకృత్యాది లలిత వర్ణనలుగాని లేవు. అయినా నాటకం ఎక్కడా విసుగు పుట్టించకుండ నడిచింది. అంతేగాక ఈ నాటకంలో హాస్యవ్యంగ్యాది సంభాషణలు గాని పరిహాస సంఘటనలు గాని లేవు. ఎక్కడా తేలికగా లేకుండా పూర్తిగా రాజకీయ షడయంత్రాలతో గంభీరంగా వున్నది.

## విశాఖదత్తుని నాటక కళ

విశాఖదత్తుడు భాసకాళిదాసాదులవలె ఊహాప్రతిభగల కవికాదు. కాని నాటకకళలో అందె వేసిన చేయి అతనిది. నాట్యశాస్త్రపు సూత్రాలను గుడ్డిగా అనుకరించకుండ నాటక ప్రస్తుతీకరణలో మౌలికమైన ప్రతిభను చూపాడు. నాట్యకళా ప్రదర్శనలో అతడు మేటి. గంభీరమైన రాజకీయేతివృత్తాన్ని తీసుకొని దృశ్యకావ్యంగా అతడు మలచిన తీరు అతిప్రశంసనీయమైంది. ఎక్కడా మధుర ప్రేమహాస్య భావాలకు తావులేని విషయాన్ని నాటకంగా వ్రాసి అతడు ప్రజాదరణను పండితాదరణను సంపాదించాడంటె చాల మెచ్చుకోదగ్గ విషయమే. ముద్రారాక్షసం శ్రవ్యకావ్యంవలె పఠన యోగ్యమైందే కాక ప్రదర్శనకు సుకరంగా వుండి ప్రేక్షకులను తన్మయులను, ఉత్సాహ పూరితులను చేస్తుంది. కథాకథనంలో, సంభాషణలను నడపటంలో సన్నివేశ సృష్టిలో, పాత్రచిత్రణలో కవి చాల ప్రావీణ్యాన్ని చూపాడు. నాటక కథాకథనాన్ని ప్రేక్షకుల కుతూహలాన్ని నిలుపుతూ ఆసక్తిజనకంగా కవి నడిపాడు. రాజకీయ సంఘర్షణను వాస్తవికతాదృష్టితో పోషించాడు. ఒకొకొసారి సంభాషణలు సుదీర్ఘాలై రంగస్థలం మీద అవి ప్రదర్శింపబడినప్పుడు విసుగు పుట్టించకుండా పైగా ఆసక్తిజనకంగా వున్నవి. ఇది శాకుంతలాది నాటకాలవలె సంగీతాత్మకంగా వుండి హృదయాన్ని అలరించేది కాదు. బుద్ధిని బాగా జాగృతం చేసి ఆనందాన్నిస్తుంది.

కార్యాన్విత దృష్టితో ఇది ఒక విశిష్టమైన నాటకం. మొదటి నుంచి నాటకంలోని ప్రతి సంఘటన లక్ష్యాన్ని సాధించేటట్లుగా వున్నది. ఎక్కడా అనవసరమైన పాత్రగాని సంభాషణగాని సన్నివేశంగాని లేదు. రాక్షసున్ని చంద్రగుప్తునికి మంత్రిగా చేయాలనే

చాణుక్యుని ప్రయత్నసాఫల్యంతో నాటకం ముగుస్తుంది. ఒకొక అంకం ఒకొక సంఘటనతో సహజంగా నడిచింది. ఎక్కడా అస్వాభావికత లేదు. ప్రతి సంఘటన కుంఠనం లేకుండా శక్తిమంతంగా చకచక సాగుతుంటుంది. వస్త్వైక్యత (Unity of action) లో ఎక్కడా భంగం రాలేదు.

వీరరసాభివ్యక్తిలో కూడ విశాఖదత్తుడు నేర్పును చూపాడు. మహావీర చరిత్ర, వేణీ సంహారం వంటి నాటకాలల్లో వీరరసాభివ్యక్తి బీభత్సాదులు అంగరసంగా కలది. కాని ఈ నాటకంలో వీరరసం ఉత్సాహం స్థాయిగా కలది. ఎక్కడా యుద్ధం, రక్తపాతం మరణంతో కూడిన బీభత్సదృశ్యాలు ఈనాటకంలో లేవు. ఈ నాటకంలో ద్వంద్వ సంఘర్షణ సైనికులకు కాక రాజనీతి ఉపాయాలకు, గుఢాచారుల కార్యశక్తి నైపుణ్యాలకు జరిగింది. అంటె నాయక ప్రతినాయకులకు సశస్త్రమైన సంఘర్షణ కాక బుద్ధి బలాలకు సంఘర్షణ జరిగింది. ప్రతిజ్ఞాయౌగంధరాయణంలో కొంత వరకు ఇటువంటి కథాయోజన, పాత్రచిత్రణ, రసయోజన కన్పిస్తున్నది. విశాఖదత్తుడు దాన్ని కొంత వరకు ఆదర్శంగా చేసుకొన్నా దాని కన్నా ఎన్నో విధాల ఉన్నతమైన నాటకాన్ని వ్రాసాడు. సమకాలిక రాజకీయ వాతావరణం, అతనికి గల రాజనీతి విశారదత్వం ఈ నాటకరచనకు పురికొల్పివుంటవి. ఈ నాటకం భారతీయ భాషలోనే కాక ఇంగ్లీషు, జర్మన్, ఫ్రెంచ్, ఇటాలియన్ మొ॥న యూరోపియన్ భాషల్లోకి అనువదింపబడి పాశ్చాత్యుల మన్ననలను పొందింది.

## పాత్ర చిత్రణ

ముద్రారాక్షసంలో అన్నిటి కన్న విశిష్టమైంది పాత్రల చరిత్ర చిత్రణ. ఒకొక్క పాత్ర ఒక్కొక్క వ్యక్తిత్వంతో పాఠకుల ముందు నిలుస్తుంది. ఐతిహాసిక వ్యక్తులను చిత్రించటంలో కవి చాల నేర్పును చూపాడు. మనం సామాన్యంగా వారిని ఊహించే తీరులోనే చాణక్య రాక్షస చంద్రగుప్తాది పాత్రలు రూపం ధరించినవి.

విశాఖదత్తుడు కౌటిల్యుని అర్థశాస్త్రాన్ని బాగా జీర్ణించుకొని వుంటాడు. కనుకనే చాణుక్యుని పాత్రచిత్రణను అద్వితీయంగా నిర్వహించాడు. బుద్ధిశాలి నిరీహుడు, వీతరాగుడు, లోక సంగ్రహకర్త అయిన చాణక్యుని పాత్రను కవి చక్కగా చిత్రించాడు. చాణక్యునికి ప్రతిద్వంద్వి అయిన రాక్షసున్ని ఉత్తమ మానవునిగా శక్తిశాలిగా చిత్రించి ఇద్దరి సంఘర్షణతో నాటకాన్ని రక్తి కట్టించాడు. చాణక్యుడు ధృఢవ్రతుడు, నిస్వార్థి, కూటనీతిజ్ఞుడు, పండితుడు, సాహసి, కార్యకుశలుడు. అతడు తను సాధించదలచుకొన్న

దాన్ని ఎన్ని అడ్డంకులు వచ్చినా సరే ఎటువంటి మార్గాన్నైనా అనుసరించి నిర్దయుడై సాధిస్తాడు. ఇక రాక్షసుడు పేరుకే రాక్షసుడు కాని అతడు మృదుహృదయుడు, బంధుస్నేహం కలవాడు, భావుకుడుగా కన్పిస్తాడు. అతని ఈ స్వభావమే చాణక్యుని జాలంలో చిక్కేటట్లు చేసింది. చాణక్యుని వలెనే రాక్షసుడు నిస్స్వార్థి, రాజనీతిజ్ఞుడు. కాని చాణుక్యునివలె అతడు సంపూర్ణ ఆత్మవిశ్వాసం కలిగివున్నట్లు కనిపించడు. అందరినీ అతడు విశ్వసిస్తాడు. చాణక్యుని గుప్తచరులని తెలియక వారిని పూర్తిగా నమ్మాడు. అది అతని పతనానికి కారణమైంది. చాణక్యుడు దైవవిధికన్న తన శక్తి మీదనే అచంచల విశ్వాసం కలవాడు. తృతీయాంకంలో చంద్రగుప్తుడు నందవంశ పతనం దైవికమని అనగా చాణుక్యుడు "మూర్ఖుడే దైవశక్తి యందు విశ్వాసముంచుతాడు" అని కృద్ధుడౌతాడు. గూఢాచారులను ప్రయోగించటంలో అతనికి గల నేర్పు ఎవరికి లేదు. శత్రుపక్షంలో తన గూఢాచారుల జాలాన్ని పరచాడు. విశాల సైనికబలాన్ని కూడ తన సునిశిత బుద్ధిచేత నిర్జించగలననే విశ్వాసమతనికి వున్నది. దూరదర్శి. అతనికి కోపం తొందరగా వచ్చినా కోపంలో కర్తవ్యశూనుడయ్యేవాడు కాదు. చాణుక్యునికి నందవంశమన్న ఎంత శత్రుత్వమున్నదో రాక్షసునికి నందవంశమన్న అంత భక్తి వున్నది. నందవంశం నశించినా రాక్షసునిలో ఆ భక్తి నశించలేదు. చాణక్యుడు ఈ నాటకంలో నాయకుడు కాగా రాక్షసుడు ప్రతినాయకుడు. వీరిద్దరి విరోధం, సంఘర్షణ స్త్రీ కొరకు కాదు. తమ తమ ఆదర్శాల కొరకు వారు పోరాడారు. ఇద్దరూ తమ కార్యసాధనలో నిరీహులుగానే వున్నారు. కాని చాణక్యుడు కార్యసాధనలో కఠినుడుగా కన్పిస్తాడు. రాక్షసుడు మెత్తనివాడు. చాణక్యుడు రాక్షసునివలె ఎవరిని సులభంగా విశ్వసించేవాడుకాదు. చాణుక్యుడు ఏం చేస్తున్నాడో చివరికి చంద్రగుప్తునికి కూడ తెలియదు. చాణక్యుని కఠోర హృదయం ముందు చంద్రగుప్తుడు కూడ జంకుతాడు. అతని మాటను దైవవాక్కుగా భావించి అనుసరిస్తాడు. చాణక్యుడు షడయంత్రాలను రచించటంలో నిపుణుడు. కార్యాచరణలో అతనికి నావాడు నీవాడు అనే విచారణ లేదు. రాక్షసుడు అట్లా కాక కోమల హృదయుడు. చందనదాసుకు తన కారణంగా మరణశిక్ష విధింపబడగా అతన్ని రక్షించటం తన కర్తవ్యమని వస్తాడు. అట్లా రావటం వల్లనే రాక్షసుడు చాణక్యుని వలలో చిక్కుకొన్నాడు. రాక్షసుడు యుద్ధకుశలుడు. అతని యుద్ధకుశలత ముందు చాణక్యుడు నిలువలేడు. అందుకే చాణక్యుడు యుద్ధంవరకు రానియ్యకుండానే కార్యసాధన చేసాడు. రాక్షసుడన్నా, అతని స్వామిభక్తి కార్యకుశలత అన్నా చాణక్యునికి ఆదరణ. అందువల్లనే అతడు రాక్షసున్ని చంద్రగుప్తునికి అమాత్యునిగా నియమించాలనుకుంటాడు. చాణక్యుడు అహంభావం కలవానిగా కన్పిస్తాడు.

రాక్షసుడు వినయం, పరిస్థితులకు లొంగే మెత్తని గుండె కలవాడు. చాణక్య రాక్షసుల ప్రతిద్వంద్విత్వంతోనే నాటకమంతా నడిచింది. చాణక్యుడు ఐతిహాసికపురుషుడనటంలో ఏ సందేహం లేదు. కాని రాక్షసుడు ఎంతవరకు ఐతిహాసికవ్యక్తి అని కొందరు శంకిస్తున్నారు. కాని నందుల దగ్గర రాక్షసుడు మంత్రిగా వుండివుంటాడు. విశాఖదత్తునికాలం వరకు అతన్ని గూర్చి కథలు ప్రచారంలో వుండివుంటవి. ఐతిహాసిక సంఘటననే విశాఖదత్తుడు గ్రహించి వుంటాడు. నందులు జైన మతావలంబులు. నందులవలెనే రాక్షసుడు కూడ జైనుడని చారిత్రకుల అభిప్రాయం. వైదిక మతదూరుడైన జైనుడు కాబట్టి అతన్ని రాక్షసుడని అని వుంటారు.

ముద్రారాక్షసంలో చాణక్య రాక్షసుల తర్వాత చంద్రగుప్తుడు ప్రధాన పాత్ర. ముద్రారాక్షసంలో కార్యసాధకుడు చాణక్యుడు కాబట్టి అతడె నాయకుడని చాలా మంది భావించారు. కాని కార్యఫలాన్ని భోగించేవాడు చంద్రగుప్తుడు కాబట్టి ముద్రారాక్షస నాటకంలో నాయకుడు అతడే అని కొందరు భావించారు. చాణక్యుడు తన కార్యం నెరవేరింతర్వాత నాటకం చివర సమస్త లౌకిక వ్యాపారాలను విడిచిపెట్టదలచుకొన్నట్లు చెప్తాడు. చాణక్యుడే చంద్రగుప్తుని మంత్రిగా వుండవచ్చును. కాని అతనికి అటువంటి లౌకిక పదవుల మీద ఆశవున్నట్లు లేదు. నాటకంలోని కార్య ప్రయత్నాదులు చాణక్యుని చేత నిర్వహింపబడినా ఫలోపభోగం చేసేవాడు చంద్రగుప్తుడు. కార్యసాధన కాక ఫలోపభోగమే ప్రధానంగా తీసుకుంటే చంద్రగుప్తుడే నాటకంలో నాయకుడనబడ్తాడు. కాని నాటకంలో మొదటి అంకం మొదలుకొని చివరి అంకం వరకు చాణక్యుని క్రియాశీలతయే కన్పిస్తుంది. నాటకం చివర రాక్షసున్ని చంద్రగుప్తునికి మంత్రిగా చేయటమనే కార్యసిద్ధి చాణక్యుని వల్లనే కలిగింది. కాబట్టి అతడే నాయకుడని కొందరు విమర్శకుల అభిప్రాయం. నాట్యశాస్త్రానుసారం నాటకంలో నాయకుడు ప్రఖ్యాత కులజుడు, రాజు కావలెను. చంద్రగుప్తున్నే నాయకునిగా తీసుకుంటె అతడు సంప్రదాయానుసారం ప్రఖ్యాత కులజుడు, క్షత్రియుడు కాదు. చాణక్యున్నే నాయకునిగా తీసుకుంటె అతడు బ్రాహ్మణుడు. ఇక నాయిక లేనే లేదు. ఇట్లా అలంకారశాస్త్రానుసారంగా లేకపోవటంచేత ఈ నాటకం ప్రాచీనుల చేత చిన్నచూపు చూపబడినట్లుగా గోచరిస్తున్నది. కాని దానిలోని విశిష్టగుణాలు ఆధునికులను ఆకర్షించినవి. మృచ్ఛకటికం వలెనే ముద్రారాక్షసానికి ఆధునిక కాలంలో గౌరవస్థానం లభించింది.

ముద్రారాక్షస నాటకంలో చంద్రగుప్త మలయకేతువులు చాణక్య రాక్షసుల రాజకీయ చదరంగంలో పావుల వంటివారు. చంద్రగుప్తుడు పూర్తిగా చాణక్యుని చేతిలో వున్నాడు. చాణక్యుని మీద అతనికి పూర్తి విశ్వాసమున్నది. మలయకేతువు పరిస్థితుల ప్రాబల్యంవల్ల చాణక్యుని రాజనీతి కుశలతవల్ల రాక్షసున్ని ఆశ్రయిస్తాడు. చంద్రగుప్తుడు రాజనీతి యుద్ధవిద్యలు తెలిసినవాడు, శాంతుడు, గంభీరుడు. చాణక్యునివల్ల కార్యసాధన జరుగుతుందని అతనికి తెలుసు. అతడు గురుభక్తి కలవాడు. దూరదృష్టి వున్నవాడు. మలయకేతువు చంద్రగుప్తునికి పూర్తిగా విభిన్నుడు. అతనికి ఓర్పు లేదు. ఉద్ధతస్వభావం కలవాడు. విశాఖదత్తుడు చాణక్య రాక్షస, చంద్రగుప్త మలయకేతువులు అనే ద్వంద్వపాత్రలను సృష్టించాడు. ఆ పాత్ర చిత్రణలో అతడు ప్రదర్శించిన భిన్నత్వం సహజంగా వున్నది. ఆ పాత్రలే కాక ముద్రారాక్షసంలో విరుద్ధక, సిద్ధార్థక, నిపుణక, ఆహితుండిక మొదలైన గుప్తచరులు శకటదాసు, చందనదాసు మొదలైన వ్యక్తులు కన్పిస్తారు. ఈ పాత్రలన్నీ సజీవంగా చిత్రింపబడినవి. అన్నీ జీవకళ వుట్టిపడ్తున్నవి. మృచ్ఛకటికం తర్వాత సజీవపాత్రలు మనకు ముద్రారాక్షసంలోనే కన్పిస్తున్నవి. పాములవాడు, యమపటం ధరించిన వీధి గాయకుడు మొదలైనవి ఆనాటి సంఘాన్ని ప్రతిబింబింపజేసే పాత్రలు.

## విశాఖదత్తుని పాండిత్యం - కవిత్వం

విశాఖదత్తుడు కౌటిల్యుని అర్థశాస్త్రాన్ని లోతుగా పరిశీలించినవాడు. నాట్యశాస్త్రంతో అతనికి మంచి పరిచయమున్నది. న్యాయశాస్త్రం, రాజనీతుల్లోను అతనికి బాగా ప్రవేశమున్నది. "సాధ్యే నిశ్చితమన్వయేన ఘటితమ్. . . " అన్న శ్లోకాన్ని అతని పాండిత్యానికి నిదర్శనంగా చూపుతారు. వీటన్నిటికి తోడుగా అతని ప్రతిభ అకుంఠితమైంది.

విశాఖదత్తుని కవిత్వం గంభీరమూ, శక్తివంతమూ అయింది. అతని శ్లోకాలల్లో మంచి ధారాశుద్ధివున్నది. తర్వాత కవుల్లో కనిపించే కృత్రిమత్వం ఇతనిలో లేదు. కాళిదాసులో వున్న సరసకోమల భావాలు విశాఖదత్తునిలో లేవు. నాటకేతివృత్తానికి, భావాలకు తగిన గంభీరమైన, ఓజోగుణంతో కూడిన శైలిని అతడు ప్రయోగించాడు. సందర్భోచిత పదాలను సరళమైనవాటిని, ప్రభావవంతమైన వాటిని కవి వాడాడు. అతడు దీర్ఘసమాసాలను అక్కడక్కడా వాడినా క్లిష్టకల్పనలు అసలేలేవు. విశాఖదత్తుడు స్రగ్ధరావృత్తాన్ని 17 సార్లు ప్రయోగించాడు, గంభీర విషయచిత్రణకు స్రగ్ధర అనుకూలమైంది. శార్దూల విక్రీడితాన్ని కవి 38 సార్లు ప్రయోగించాడు. ఆమర్షాది భావచిత్రణకు శార్దూలం తగిన

వృత్తం. ఆర్యా, శిఖరిణి, మాలిని, మందాక్రాంత, ఇంద్రవ్రజ, సువదన, వసంతతిలక, అనుష్టుపు ఛందస్సులను కవి యథోచితంగా వాడాడు. నాటకంలోని సంభాషణలు కూడా ప్రబలభావస్ఫోరకాలై ఇతివృత్తోచితంగా వున్నవి. చమత్కారోక్తులు లేకున్నా గంభీర విషయ ప్రతిపాదన వున్నది. అక్కడక్కడ విశాఖదత్తుని కవిత్వం కఠినంగావున్నా మొత్తం మీద ప్రసన్నంగానే వున్నది. అక్కడక్కడ అతని కవిత్వం శ్లేషమయంగా కూడా వున్నది. ఉపమాద్యలంకారాలను సందర్భోచితంగా వాడాడు. నాటకం ఎంత గంభీరంగా వున్నా, స్త్రీ పాత్రాదులు లేకపోవటంచేత కోమల భావాదులు లోపించినా, అక్కడక్కడ కవి సుకుమారసుందర భావ రచనను చేయకపోలేదు. ఉదా॥ కు -

వామామ్ బాహులతాం నివేశ్య శిథిలం కంఠే నివృత్తాననా
స్కంధే దక్షిణయా బలాన్నిహితయా ऽ ప్యంకే పతంత్యాముహుః
గాఢాలింగన సంగపీడిత సుఖం యస్యోద్య మాశంకినీ
మౌర్యస్యోరసి నాధునాऽపి కురుతే వామేతరం శ్రీఃస్తనమ్

"రాక్షసామాత్యునికి జంకియే మౌర్య రాజ్యలక్ష్మి చంద్రగుప్తున్ని సంపూర్ణంగా అలింగనం చేసుకోలేకపోతున్నది. ఆమె తన ఎడమ బాహులతను చంద్రగుప్తుని మెడలోవేసినా అది శిథిలమై వున్నది. ముఖాన్ని చంద్రగుప్తుని నుంచి పక్కకు తిప్పుకొన్నది. ఆమె కుడిచేయి బలవంతంగా చంద్రగుప్తుని భుజంమీద పెట్టబడింది. కాని ఆ చేయి మాటిమాటికి జారిపోవటంచేత చంద్రగుప్తున్ని ఆలింగనం చేసుకోలేకపోతున్నది. ఆమె కుడి రొమ్ము చంద్రగుప్తుని వక్షఃస్థలాన్ని అంటుకొని వున్నా గాఢాలింగన సుఖాన్ని అతనికి కలిగించటం లేదు." కవి రూపకల్పన చాల చక్కగా వున్నది. అదేవిధంగా తృతీయాంకంలోని శరదృతు వర్ణన ఆహ్లాదకరంగా వున్నది.

## భట్టనారాయణుడు

విశాఖదత్తుని వలెనే వీరరస ప్రధానమైన నాటకాన్ని వ్రాసినవాడు భట్ట నారాయణుడు. ముద్రారాక్షసం వలెనే భట్టనారాయణుని నాటకం గంభీర ప్రౌఢిమ కలది. ముద్రారాక్షసంలో నాయికలేదు. భట్టనారాయణుని వేణీసంహారంలో నాయిక వున్నా ఆ పాత్రకు ప్రాధాన్యం లేదు.

లోకంలో ప్రచారంలో వున్నదాన్ని బట్టి భట్ట నారాయణుడు కాన్యకుబ్జ(కనోజ్) బ్రాహ్మణుడు. బెంగాల్ రాజు ఆదిసూరుని ఆహ్వానం మీద బెంగాల్‌కు పోయి

-సమేర్పరచుకొన్న ఐదుగురు బ్రాహ్మణుల్లో భట్ట నారాయణుడు ఒకడు. ఇతడు
ోర్ బ్రాహ్మణులకు మూల పురుషుడని అంటారు. ఆదిసూరుడు బ్రాహ్మణాభిమాని.
ాల్‌లో బ్రాహ్మణ జాత్యుద్ధరణకై అతడు బ్రాహ్మణ కుటుంబాలను ఆహ్వానించాడు.
నారాయణునికి 'భట్ట' అని 'మృగరాజ లక్ష్మ' అని బిరుదాలున్నవి. అతడు తన
సంహార నాటకంలో తనను గురించి ఎక్కువ ఏమి చెప్పుకోలేదు. కాబట్టి అతని జీవిత
ాలు లోకంలో ప్రచారంలో వున్నవి తప్ప ఏమి తెలియటం లేదు. భట్టనారాయణుని
నిర్ణయం చేయటం కూడ కష్టమే. వామనుడు (క్రీ.శ. 800) భట్టనారాయణుని
ుకంనుంచి ఉద్ధరణలను ఇచ్చాడు. దండి అతన్ని పేర్కొని వున్నాడు. కాబట్టి
నారాయణుడు క్రీ.శ. 6,7 శతాబ్దాలవాడని చెప్పవచ్చును. ఆదిసూరుడు క్రీ.శ. 7వ
బ్దంవాడని ,భట్టనారాయణుడు కూడా అదే కాలం వాడని కోనో నిశ్చయించి వున్నాడు.
కవి దండికి పూర్వుడు కాబట్టి క్రీ.శ. 550-650 ప్రాంతం వాడని చెప్పటం సమంజసం,
ఐ భట్టనారాయణుడు భవభూతికి, బాణ హర్షులకు కూడ పూర్వుడే అవుతాడు.

## భట్టనారాయణుని రచనలు

దండి కావ్యాదర్శంలో భట్టనారాయణుడు మూడు కృతులను రచించినట్లుగా
ొన్నాడు - కాని ప్రస్తుతం వేణీసంహారం నాటక మొక్కటే అతని రచనల్లో లభిస్తున్నది.
సంహారం మహాభారత కథమీద ఆధారపడిన కథావస్తువు కలది. భీముడు తాను చేసిన
జ్ఞ ప్రకారం, దుశ్శాసన రక్తసిక్తమైన చేతులతో ద్రౌపది యొక్క వేణిని ముడవటమే
నాటకంలోని ఇతివృత్తం. ఇది ఆరు అంకాల నాటకం.

ప్రథమాంకం - ధర్మరాజు సంధి చేసుకొని రమ్మని శ్రీకృష్ణున్ని దుర్యోధనుని దగ్గరికి
ాడని తెలుసుకొని భీముడు, ద్రౌపది క్రుద్ధులౌతారు. సహదేవుడు భీమున్ని
ుపరుస్తాడు. కాని ద్రౌపది ఉత్తేజపూర్ణమైన మాటలను విని భీముడు తన గదాప్రహారంతో
ర్యోధనుని తొడలను విరుగగొడ్తానని, దుశ్శాసనుని వక్షఃస్థలాన్ని చీల్చి రక్తపానం చేసి ఆ
ుతో తడిసిన చేతులతో ద్రౌపది కేశపాశాన్ని ముడుస్తానని ప్రతిజ్ఞచేస్తాడు. ఇంతలో
ిరాయబారం విఫలమై శ్రీకృష్ణుడు తిరిగివస్తాడు. అప్పుడు ధర్మరాజు యుద్ధాన్ని
ిస్తాడు. భీముడు ప్రసన్నుడై యుద్ధభూమికి ప్రస్థానిస్తాడు.

ద్వితీయాంకం - దుర్యోధనుని భార్య భానుమతి, ఒక్క నకులం నూరు సర్పాలను
ినట్లుగా దుస్స్వప్నాన్ని చూస్తుంది. దానికి విచారిస్తూ తత్ శాంతికై సూర్యునికి

అర్ఘ్యమిస్తుంది. అప్పుడు దుర్యోధనుడు అక్కడికి వచ్చి ఆమెను సాంత్వనపరుస్తాడు. తర్వాత వారిద్దరికి ప్రేమాలాపాలు జరుగుతవి. ఇంతలో జయద్రథుని తల్లి వచ్చి జయద్రథుని చంపుతానని అర్జునుడు ప్రతిజ్ఞ చేసినట్లు తెలుపుతుంది. దుర్యోధనుడు యుద్ధభూమికి పోతాడు.

తృతీయాంకం - ధృష్టద్యుమ్నుడు ద్రోణుని చంపిన వార్తను అశ్వత్థామ విని క్రోధితుడౌతాడు. కృపాచార్యుడు అతన్ని ఊరడించి, దుర్యోధనుని దగ్గరికి తీసుకొనిపోయి అశ్వత్థామను సేనాపతిగా చేయమంటాడు. కాని దుర్యోధనుడు అంతకుముందే కర్ణున్ని సేనాపతిగా అభిషిక్తుని చేసివుంటాడు. కర్ణ అశ్వత్థామల నడుమ వాగ్యుద్ధం జరుగుతుంది. కర్ణుడు జీవించివున్నంతవరకు శస్త్రసన్యాసం చేస్తానని అశ్వత్థామ ప్రతిజ్ఞచేస్తాడు. ఇంతలో భీముడు దుశ్శాసనున్ని చంపి తన ప్రతిజ్ఞను నెరవేర్చుకున్నాడన్న వార్త దుర్యోధనునికి చేరుతుంది.

చతుర్థాంకం - సుందరకుడనే దూత ద్వారా కర్ణుని కొడుకు వృషసేనుని మరణవార్త, యుద్ధగతి దుర్యోధనునికి తెలుస్తుంది. దుర్యోధనుడు యుద్ధానికి బయలుదేరుతాడు. అప్పుడు గాంధారీ ధృతరాష్ట్రులు అతన్ని ఆపి పాండువులతో సంధి చేసుకొమ్మని చెప్తారు.

పంచమాంకం - భీమార్జునులు దుర్యోధనుని కొరకు వెతుకుతుంటారు. దుర్యోధనుడు భీమున్ని ద్వంద్వ యుద్ధానికి ఆహ్వానిస్తాడు. కాని అర్జునుడు భీమున్ని ఆపుతాడు. ఇంతలో భీమార్జునులను ధర్మరాజు పిలుస్తున్నట్లుగా వార్త వచ్చి వారు నిష్క్రమిస్తారు. ఇంతలో అశ్వత్థామ ప్రవేశించి దుర్యోధనునితో కలుస్తాడు.

షష్ఠాంకం - కౌరవ పక్షంలో వీరులందరూ నిహతులు కావటంచేత భీతిల్లి దుర్యోధనుడు సరస్సులో దాక్కుంటాడు. అతని జాడను తెలుసుకొని భీముడు వస్తాడు. వారిద్దరికి గదాయుద్ధం జరుగుతుంది. ధర్మరాజు యొక్క గూఢచారి ప్రవేశించి భీముడు దుర్యోధనుని చంపినట్లు చెప్తాడు. అందరు సంతోషంతో ధర్మరాజు రాజ్యాభిషేకం, ద్రౌపది వేణీసంహారోత్సవానికి సిద్ధం చేస్తుంటారు. ఇంతలో దుర్యోధనుని రాక్షస మిత్రుడు ఒకడు చార్వాకమునివేషంలో వచ్చి గదాయుద్ధంలో భీముడు చనిపోయినట్లు చెప్తాడు. ఇది విని తాను చేసిన ప్రతిజ్ఞానుసారం ధర్మరాజు మరణ ప్రయత్నం చేస్తాడు. ఇంతలో రక్తరంజితుడైన భయంకరమూర్తి భీముడు ప్రవేశించగా ధర్మరాజు దుర్యోధనుడనుకొని యుద్ధం చేయటానికి పూనుకొంటాడు. తర్వాత భీమున్ని గుర్తించి అందరు సంతోషిస్తారు.

భీముడు దుశ్శాసనుని రక్తార్ద్రమైన చేతులతో ద్రౌపది వెంట్రుకలను ముడుస్తాడు. శ్రీకృష్ణుని భరత వాక్యంతో నాటకం ముగుస్తుంది.

## భట్టనారాయణుని నాటకకళ

యుద్ధసంఘటనలతో నిండిప్రదర్శనకు అంతగా యోగ్యంగా లేని మహాభారత కథా భాగాన్ని భట్టనారాయణుడు తీసుకొని నాటకేతివృత్తంగా మలచుకోవటంలో చాల నేర్పును చూపించాడు. నాట్యశాస్త్రోక్తమైన సంధి సంధ్యంగాలను కవి దీనిలో చక్కగా పొందుపరిచాడు. ధనంజయ, విశ్వనాథాది నాటక లక్షణకారులు రత్నావళి తర్వాత వేణీసంహార నాటకాన్ని లక్ష్యంగా చాలచోట్ల ఉద్ధరించి వున్నారు. వేణీసంహార నాటకం పేరునుబట్టి, దీనిలో ద్రౌపది కేశపాశాన్ని ముడవటమే ప్రధానేతివృత్తం. రాజ్యప్రాప్తి అవాంతర ఫలం మాత్రమే. ఈ ఫలనిర్వహణాన్ని కవి చాల కుశలంగా నిర్వహించాడు. ప్రథమాంకంలో ముఖసంధి ద్వితీయాంకంలో ప్రతిముఖ సంధులు వున్నవి. తర్వాత తృతీయ, చతుర్థ, పంచమాంకాలల్లో గర్భసంధి విస్తరించింది. షష్ఠాంకంలో అవమర్శ, నిర్వహణ సంధులు నిర్వహింపబడినవి. చార్వాకముని వేషంలో దుర్యోధనుని రాక్షసమిత్రుడు ప్రవేశించటంతో ఫలప్రాప్తి అనిశ్చితమైంది. ధర్మరాజాదులు భీమున్ని గుర్తించటంతో నిర్వహణ సంధి ఆరంభమైంది. ఫలప్రాప్తి జరుగుతుందా లేదా అన్న కుతూహలాన్ని సామాజికుల్లో నిలుపుతూ కవి అవమర్శసంధిని చక్కగా నిర్వహించాడు. దుర్యోధనుడు భీముని చేతిలో మరణించాడని ఒకసారి ప్రేక్షకులకు తెలుస్తుంది. కాని వెంటనే మునివేషధారి వచ్చి కాదు చనిపోయింది భీముడని చెప్పటం, ధర్మరాజు మరణ ప్రయత్నం, రక్తరంజితుడై వచ్చిన భీమున్ని చూసి దుర్యోధనుడనుకోవటం, ధర్మరాజు అతనితో యుద్ధానికి పూనుకోవటం- ఇదంతా సామాజికుల్లో ఫలప్రాప్తి నిశ్చయం కాదనే భావాన్ని కలిగించి ఆ తర్వాత భీమున్ని అందరూ గుర్తించటంతో అద్భుతంగా కథ అడ్డం తిరిగి ఫలనిర్వహణ జరుగుతుంది. దీన్ని కవి చాల అద్భుతంగా చమత్కార పూర్ణంగా నిర్వహించాడు. ఈ నాటకంలో గర్భసంధిని గురించి, అనేక విమర్శలు వున్నవి. దశరూపక, సాహిత్యదర్పణ, కావ్యప్రకాశకారులు వేణీసంహారంలో గర్భసంధి సరిగా లేనట్టుగానే అభిప్రాయ పడినారు. సంధి సంధ్యంగాల శాస్త్రీయ యోజనతోనే కవి వేణీసంహార నాటకాన్ని రచించినా రత్నావళి నాటికలో వలె వాటి యోజన సంపూర్ణంగా సఫలవంతంగా నిర్వహింపబడలేదనే చెప్పాలి. కాని లాక్షణికులు రత్నావళి తర్వాత వేణీసంహారం నుంచే లక్షణోదాహరణాలను ఎక్కువగా తీసుకొన్నారు.

శాస్త్రోక్త లక్షణాలను అనుసరించాలనే కవి కోరికచేతనో ఏమో నాటకంలో కొంత కృత్రిమత కన్పిస్తున్నది. అంతేగాక యుద్ధ సంఘటనలున్న కథను కవి తీసుకొన్నాడు. వివిధ సంఘటనలతో సన్నివేశాలు వేగంగా జరిగివున్నట్లయితే నాటకం ఇంకా బాగా రక్తి కట్టి వుండేది. కథాగతి కుంటుపడినట్లుగా మెల్లగా సాగుతుంది. సుదీర్ఘమైన సంభాషణలు, వర్ణనలు కథాగతికి అవరోధంగా వున్నవి. చతుర్థాంకారంభంలో సుందరకుని సంభాషణ ఉపన్యాసంవలె సుదీర్ఘంగా వున్నది. ఇది అసందర్భంగా వున్నది. అదే విధంగా దీర్ఘమైన వర్ణనలు కథ చక చక జరుగకుండా చేసినవి. రసభావశైలి పాత్రచిత్రణల దృష్టిలో వేణీసంహార నాటకం శ్రేష్ఠమైంది. కాని నాటక కథావస్తుయోజన సరిగా లేదు. ద్వితీయాంకంలోని భానుమతి దుర్యోధనుల ప్రేమాలాపాలు అనౌచిత్యంగా వున్నవి. ఒక వైపు యుద్ధం జరుగుతుంటె ఇంకొకవైపు దుర్యోధనుడు భార్యతో సుదీర్ఘమైన ప్రేమ సల్లాపాలు చేయటం అరుచికరంగా వున్నది. వీరుడైన దుర్యోధనుడు అట్లా చేసాడని కవి చెప్పటం కథాదృష్టితో, పాత్రచిత్రణ దృష్టితోను లోపంగానే వున్నది. లోపభూయిష్ఠమైన ఈ సన్నివేశాన్ని మమ్మటుడు "అకాండే ప్రథనమ్" అని దోషపూర్ణమైందని ఎత్తిచూపాడు. దుర్యోధనున్ని కాముకునిగా చిత్రించే కొరకు కవి ఈ సన్నివేశ కల్పన చేసి వుంటాడు. అయినా అతని పతనానికి దాన్ని కారణంగా మొదటినుంచి పోషిస్తూవస్తే బాగా వుండేది. కాని అట్లా జరుగలేదు. భానుమతి దుస్స్వప్న వృత్తాంతం బాగా వున్నది. ఇది శేక్స్పియర్ సీజర్ నాటకంలోని సీజర్ భార్య దుస్స్వప్న వృత్తాంతాన్ని పోలి వున్నది. మహాభారత కథను తీసుకొని భట్టనారాయణుడు నాటకీయ సన్నివేశాలను శక్తిమంతంగా సృష్టించలేక పోయాడు. కవిత్వం దృష్టితో ఇది ఉత్తమంగా వున్నా నాటకీయత దృష్టితో ప్రభావవంతంగా లేదనే చెప్పాలి. కథలో శిథిలత్వం వచ్చేసింది. వీరరస పోషణకై కవి ప్రయోగించిన దీర్ఘసమాసాలు, కఠినపరుషపదాలు సామాజికులకు సులభగ్రాహ్యంగా లేవు. నాటకమెప్పుడూ సులభగ్రాహ్యంగా వుండాలి. అప్పుడే అది సఫలవంతమైన నాటకమౌతుంది.

భట్టనారాయణుని శైలి వాచ్యార్థప్రధానమైంది. సామాజికుల ఊహకు అవకాశమేలేదు. కాని ఎన్ని లోపాలున్నా వేణీ సంహార నాటకం సంస్కృత సాహిత్యంలో ఒక విశిష్టమైన నాటకమే. శృంగార రస ప్రధానమైన నాటకాలే సంస్కృతంలో ఎక్కువగా వున్నవి. అటువంటప్పుడు కవి దీనిలో వీరరసాన్ని అంగిగా పోషించాడు. నాటక సంవిధానానికి కష్టమైన వస్తువును తీసుకొని నాటకంగా దాన్ని మలచటంలో చాలావరకు సఫలుడైనాడు. మహా భారతంలోని పాత్రలను తీసుకొన్నా చక్కగా వాటికి రూపు రేఖలను కల్పించి

చిత్రించాడు. మహాభారతంలోని సుదీర్ఘమైన కథలోని కొంత భాగాన్ని మాత్రమే తీసుకొని వస్త్వైక్యత, కథైక్యత (unity of action and plot) లను కవి సాధించటంలో కృతకృత్యుడైనాడు. వేణీ సంహార నాటకంలో అనేకచోట్ల కవి చేర్చిన పతాక సన్నివేశాలు (dramatic irony) చాల చక్కగా వున్నవి. ఉదాహరణకు - దుర్యోధనుడు తన ఊరుద్వయం భానుమతికి ఉపవిష్ట యోగ్యమైనవని పలుకగానే కంచుకి ప్రవేశించి "భగ్నం భగ్నం" అని అంటాడు. ఊరు యుగళం భగ్నమని వెంటనే ప్రేక్షకులు తలుస్తారు. దుర్యోధనుని భావి ఊరుభంగ వృత్తాంతం ఇక్కడ సూచింపబడింది. అసలయితే దురోధనుని రథ కేతనం భగ్నమైందని కంచుకి చెప్పదలచుకొన్నాడు. ఇటువంటి పతాక సన్నివేశమే తర్వాత భవభూతి ఉత్తరరామ చరిత్ర నాటకంలో నిర్వహింపబడింది. శృంగార రసంతో, శృంగార నాయికా నాయకులతో విసిగి పోయిన పాఠకులకు ఈ నాటకం వీరరస చిత్రణతో ఒక విభిన్నతను ప్రసాదించి అలరిస్తున్నది.

## వేణీ సంహారంలో నాయకుడు

వేణీ సంహార నాటకంలో నాయకుడెవ్వరనే విషయంలో అభిప్రాయభేదాలున్నవి. కొందరు విమర్శకులు ఈ నాటకంలో నాయకుడు దుర్యోధనుడని అభిప్రాయపడినారు. నాటకారంభం నుంచి అంతం వరకు దుర్యోధనుని చరిత్ర నిబద్ధింపబడిందని, అతని పరాక్రమాన్ని, స్వాభిమానాన్ని కవి ప్రత్యేకంగా చిత్రించాడని అతడే నాయకుడని వారు తలంచారు. కాని ప్రతినాయకునిలోను గుణోత్కర్షను చూపవలెనని లాక్షణికుల మతం. దుర్యోధనునిలో గుణోత్కర్షతో పాటు కామ క్రోధ లోభాది దుర్గుణాలను కవి చూపాడు. కాబట్టి అతడు ప్రతినాయకుడేగాని నాయకుడు కాదు.

చాలామంది విమర్శకులు ధర్మరాజు ఈ నాటకంలో నాయకుడని తలంచారు. భరత వాక్యం ద్వారా ఫల ప్రాప్తిని పొందేది ధర్మరాజు అనటం స్పష్టమౌతున్నదని, కాబట్టి ఫల భోక్త అయిన ధర్మరాజే నాయకుడని, అతడు ధీరోదాత్త నాయకుడని వారి అభిప్రాయం. భారతీయ సంప్రదాయాన్ని బట్టి ధర్మరాజే నాయకుడుగా అంగీకరింపబడినట్లు తెలుస్తున్నది. భట్ట నారాయణునికి స్వయంగా ధర్మరాజునే నాయకునిగా గ్రహించటం అభీష్టమైనట్లు కన్పిస్తున్నది. ఎందుకంటె భరత వాక్యం ద్వారా ఫలప్రాప్తిని అతడే పొందినట్లు కవి చెప్పాడు. అంతేగాక ప్రథమాంకంలో ధర్మరాజు క్రోధాగ్నినే బీజరూపంగా చేసి నాటకాన్ని ఆరంభించాడు. ఈ విషయాలన్నీ నాటకంలో నాయకుడు ధర్మరాజు అనే బలపరుస్తున్నవి. కాని ఆనాటకం

పేరును పరిశీలిస్తే నాటకంలో ప్రధాన ఫలం ద్రౌపది కేశపాశాన్ని ముడి వేయటమని తెలుస్తున్నది.

ఆ ప్రధాన ఫలాన్ని సాధించినవాడు భీముడు. వేణీ సంహారంలోని ప్రధాన సన్నివేశాలన్నీ ద్రౌపదీ భీములకు సంబంధించినవి కాని ధర్మరాజుకు కాదు. నాటకారంభంలో దుర్యోధన దుశ్శాసనులను చంపుతానని ప్రతిజ్ఞ చేసింది భీముడు. ప్రథమాంకం మొదలుకొని చివరి అంకంవరకున్ను భీముడు తన ప్రతిజ్ఞను నెరవేర్చుకొనటంలోనే తత్పరుడై వుంటాడు. ద్వితీయ, తృతీయ, చతుర్థాంకాలల్లో భీముడు రంగస్థలం మీద కనిపించడు కాని భీముని పరాక్రమాన్ని గురించే ఆ అంకాలల్లో ఇతర పాత్రల ద్వారా ప్రేక్షకులకు తెలియవస్తుంది. మరియు నాటకంలో అంగి రసం వీరరసం. వీరరసంలో నాయకుడు ధీరోద్ధతుడై వుండటంలో దోషం లేదు. భారతీయ నాటక సంప్రదాయానుసారం ధీరోదాత్తుడు నాయకుడుగా వుండాలనే దాన్ని బట్టి భట్టనారాయణుడు ధర్మరాజును ఫలభోక్తగా తెచ్చిపెట్టాడేమో కాని లేకపోతే నాటకమంతటా భీముని చర్యలే కన్పిస్తున్నవి. భీముని ప్రతిజ్ఞలు నెరవేరటమే నాటకంలో ప్రధాన కార్యంగా వున్నది. అటువంటప్పుడు భీముడే నాయకుడనటం సమంజసం. ప్రధానఫలమైన ద్రౌపది వేణీసంహారాన్ని సాధించినవాడు భీముడు. అవాంతర ఫలం రాజ్యప్రాప్తి. ధర్మరాజు కేవలం అవాంతర ఫలభోక్త మాత్రమే అయినాడు. కాని ప్రధాన కార్యసాధకుడు కాదు. ముద్రారాక్షస నాటకంలో వలెనే ఈ నాటకంలోను కార్యసాధకుడు, ఫలభోక్త వేరు వేరు వ్యక్తులైనారు. ముద్రారాక్షసంలో కార్యసాధకుడు చాణక్యుడు. ఫలభోక్త చంద్రగుప్తుడు. కార్యసాధనను చాణక్యుడు చంద్రగుప్తునికొరకే చేసాడు. అదేవిధంగా వేణీసంహారంలో కార్యసాధకుడు భీముడు. అతడు కార్యసాధనను ద్రౌపది, ధర్మరాజుల కొరకు చేసాడు. ఫలభోక్త కాక కార్యసాధకుడే ప్రధానమని తలచినట్లయితే ముద్రారాక్షసంలో చాణుక్యుడు నాయకుడైనట్లుగా వేణీసంహారంలో భీముడు అవుతాడు.

## భట్టనారాయణుని కవిత్వం

భట్టనారాయణుని కవిత్వం ప్రౌఢమైంది. వేణీసంహారం దృశ్యకావ్యమైనా కవిత్వం దృష్టితో శ్రవ్యకావ్యం వలెనే వున్నది. మాఘాది కవుల కవిత్వంవలె భట్ట నారాయణుని కవిత్వం గౌడీరీతిలో నడిచింది. అతని కవిత్వం దీర్ఘసమాసభరితమై ఓజోగుణ ప్రధానమైంది. వీరరసపోషణకు ఓజోగుణ శైలి ప్రధానం. కాని ప్రేక్షకులకు భావాలు అర్థంకాక అతని శైలి

నాటకీయ ప్రభావానికి బాధాకరంగా వున్నది. అనుప్రాసల ప్రయోగం ద్వారా , శ్లోకాల ఆరోహణ అవరోహణల ద్వారా కవి రసవ్యంజనను కలిగించాడు. వేణీ సంహారంలో అంగిరసం వీరం. శృంగార, రౌద్ర, భీభత్స, కరుణ, భయానకరసాలు అంగరూపంగా వున్నవి. ఈ నాటకం వీరరసంతో కూడిన గంభీర నాటకం. కాబట్టి హాస్యరసానికి గాని విదూషక పాత్రకు గాని తావు లేదు. ద్వితీయాంకంలో శృంగారం అప్రాసంగికమైంది. ప్రథమాంకంలో ద్రౌపది స్థితి, షష్ఠాంకంలో భీముడు చనిపోయాడని ధర్మరాజు దుఃఖం - ఈ ఘట్టాలల్లో కరుణ రసం పోషింపబడింది. వీరరస ప్రధానమైన ఈ నాటకంలో రౌద్ర బీభత్స భయానక రసాలు తగిన రీతిలో ప్రధాన రసపోషకాలుగా వున్నవి. భట్ట నారాయణునికి ప్రకృతి చిత్రణ మంటె అభిరుచి ఎక్కువ వున్నట్లు లేదు. అయినా ప్రాతఃకాల ఝుంఝువాయు వర్ణనలు నాటకంలో మనోజ్ఞంగా వున్నవి. అలంకారాలను కవి చాల ప్రయోగించాడు. భట్ట నారాయణుని నాటికే సంస్కృత సాహిత్యంలో కృత్రిమశైలి ప్రవేశించింది. కాబట్టి అతని రూపక కవిత్వం కూడ ఆ దోషానికి గురియైంది.

## హర్షదేవుడు

స్థాణ్వీశ్వరాన్ని రాజధానిగా చేసుకొని వింధ్యాచలం మొదలుకొని హిమాలయం వరకు గల భారత దేశాన్ని పాలించిన చక్రవర్తి హర్షవర్ధనుడే నాటకకారుడు హర్షదేవుడు. తన నాటకాలల్లో అతడు తన పేరును హర్షవర్ధనుడని కాక హర్షదేవుడని పేర్కొన్నాడు. హర్షదేవుని రాజ్యపాలనా కాలం విషయంలో చారిత్రకుల్లో ఎటువంటి భిన్నాభిప్రాయాలు లేవు. అతని రాజ్యకాలం క్రీ.శ. 606-648. హర్షవర్ధనుడు ప్రభాకర వర్ధనుని కొడుకు. హ్యుయన్ త్సాంగ్, ఈత్సింగ్ అనే చైనా యాత్రికుల రచనల ద్వారా బాణుని హర్షచరిత్ర కావ్యం ద్వారా హర్షవర్ధనుని జీవిత విశేషాలెన్నో మనకు తెలియవచ్చినవి. హర్షవర్ధనునికి శీలాదిత్యుడని బిరుదం వున్నది. సదాచరణలో, శీలంలో సూర్యుని వంటివాడని బిరుదనామార్థం. హర్షవర్ధనునికి పూర్వం అతని అన్న రాజ్యవర్ధనుడు రాజయ్యాడు. అతడు బౌద్ధమతావలంబి. అంతకుముందు ఈ వంశరాజులు సూర్యారాధకులు. గౌడదేశ రాజు శశాంకుని చేతిలో రాజ్యవర్ధనుడు మరణించాడు. అప్పుడు హర్షవర్ధనుడు రాజయ్యాడు. అతడు దిగ్విజయ యాత్రలు చేసినట్లు హర్షచరిత్ర వల్ల తెలుస్తున్నది. రెండవ పులకేశి అతన్ని ఓడించటంతో అతని రాజ్య విస్తరణం దక్షిణంలో నర్మదానది వరకే జరిగింది. ప్రతి ఐదు సంవత్సరాలకు ఒకసారి హర్షవర్ధనుడు తన కోశాగారంలోని ధనాన్నంతా దానం చేసేవాడట. అతనికి రాజ్యం మీద మోహం వున్నట్లు లేదు. అతనికి

విద్యాసక్తి చాల. కవిత్వం చెప్పటంలో నేర్పు కలవాడు. కవి పండితులన్న ప్రేమాదరణలు కలవాడు. అతని కాలంలో నలందా విశ్వవిద్యాలయం ఉన్నత దశలో వున్నది. ఈ విశ్వవిద్యాలయంలో 10 వేల మంది విద్యార్థులు భారతీయులేకాక చైనా, సింహళం, జావా, కంబోజ, సువర్ణ ద్వీపం, చంపా, తుషార, పారస దేశాల నుంచి వచ్చి విజ్ఞానార్జన చేసే వారు. ధర్మకీర్తి అన్న ప్రసిద్ధ బౌద్ధాచార్యుడు నలందాలో వుండేవాడు. హర్షవర్ధనుడు తన అన్నను చంపిన శశాంకున్ని యుద్ధంలో ఎదిరించి చంపాడు. శశాంకుని దగ్గర బందీగా వున్న అతని చెల్లెలు రాజశ్రీ కారాగారం నుంచి పారిపోయి అడవిలో ప్రాణ త్యాగం చేయటానికి ప్రయత్నిస్తుండగా ఒక బౌద్ధ భిక్షువు ఆమెను రక్షించి హర్షవర్ధనునికి అప్పగిస్తాడు. ఆ బౌద్ధ భిక్షువు తత్త్వబోధతో రాజశ్రీ హర్షవర్ధనులు బౌద్ధ ధర్మదీక్షను గ్రహిస్తారు. మొదట హర్షవర్ధనుడు శివాభిమాని. అతని రాజమహిషి పారశీక రాజవంశానికి చెందిందని, ఆమెను బాణుడు మహాశ్వేతగా చిత్రించాడని, కాదంబరి కావ్యంలోని మరొక నాయిక కాదంబరి చిత్రణలో సౌరాష్ట్ర రాజ వంశానికి చెందిన హర్షవర్ధనుని మరో భార్య ప్రతిబింబించిందని పండితుల అభిప్రాయం. హర్షవర్ధనుడు అస్సాం (అసమ దేశం) మొదలుకొని సౌరాష్ట్ర వరకు హిమాలయాలు మొదలుకొని వింధ్యాచలం వరకు విశాల సామ్రాజ్యాన్ని పరిపాలించిన చక్రవర్తి. రాజకీయాల్లో వ్యస్తుడై వుండి కూడ అతడు సాహిత్యాభి మానంతో రచనా వ్యాసంగాన్ని మానలేదు. అయితే కవి హర్షదేవుడు చక్రవర్తి హర్షవర్ధనుడు కాడని కొందరు శంకించారు.

## నాటకకారుడు చక్రవర్తి హర్షవర్ధనుడు కాదా?

హర్షుని పేరు మీద మనకు మూడు నాటకాలు కన్పిస్తున్నవి. అవి - ప్రియదర్శిక, రత్నావళి, నాగానందం. మొదటివి రెండు నాటికలు. చివరిది నాటకం. ఈ మూడు నాటకాలు హర్షవర్ధనుడు వ్రాసినవి కావని అతని ఆస్థానంలో వున్న కవి వ్రాసి హర్షవర్ధనుని పేరు పెట్టాడని కీథ్ అభిప్రాయం. ఈ నాటకాలల్లో హర్షవర్ధనుని నాటి సంఘటన లేవి ఉల్లేఖింపబడలేదని అతడు అంటాడు. ఈ రచనలు బాణునివి కావచ్చని కీథ్ అనుమానం. ఈ మూడు నాటకాలు హర్షవర్ధనునివి కావన్న అభిప్రాయం అసలు మమ్మటుని ఒక ఉక్తివల్ల సాహిత్యలోకంలో కలిగింది. కావ్యప్రయోజనాలను గుర్తించి చెప్తు మమ్మటుడు "కావ్యం యశసేఽర్థ కృతే" అని "కాళిదాసాదీనామివ యశః, శ్రీహర్షాదేర్ధావకాదీనామివ ధనమ్" అని వ్రాసాడు. దానికి విపరీతార్థాన్ని కల్పించి ధావకుడు నాటకాలు వ్రాసి హర్షుని పేరు పెట్టి డబ్బు సంపాదించాడని వ్యాఖ్యాతలు వ్యాఖ్యానం చెప్పారు. దాని ఆధారంగా కొందరు

ఆధునిక విమర్శకులు ఈ నాటకాలు హర్షునివి కావని విశ్వసించారు. కావ్యప్రకాశం కాశ్మీరప్రతుల్లో కొన్నిటిలో ధావకునికి బదులుగా బాణుడని వున్నదట. కవులు కావ్యరచనలు చేసి రాజుల మెప్పునుపొంది సంపదలను పొందటం మనకు తెలుసు. మమ్మటుడు చెప్పిందానికి ధావకుడో లేక బాణుడో కవిత్వం వ్రాసి రాజును మెప్పించి ధనాన్ని పొందారని అర్థాన్ని తీసుకోవాలి కాని విపరీతార్థాలు తీసి కవుల రచనలను తన పేర పెట్టించుకొని రాజు డబ్బు ఇచ్చాడనటం హాస్యాస్పదం. హర్షవర్ధనుడు కవిప్రియుడు. అతడు బాణాది కవులను ఎంతగానో సత్కరించి ఆదరించాడు. హర్షుడు స్వయంగా కవిత్వం వ్రాయగలిగినవాడని బాణుడు హర్షచరిత్రలో పేర్కొన్నాడు. తర్వాత మమ్మటాది ఆలంకారికులు హర్షదేవుని శ్లోకాలుగా నాటక శ్లోకాలను ఉద్ధరించారు. అటువంటప్పుడు ఆధునిక విమర్శకులకు మూడు నాటకాలు అతని రచనలు కావని అభిప్రాయం కలగటంలో అర్థంలేదు. హర్షుని నాటి సమకాలిక సంఘటనలు ఆ రచనల్లో లేవని కీథ్ అనుమానం కాని కాదంబరిలో చిత్రింపబడిన ప్రజల జీవితం ముఖ్యంగా రాజభవనాల వైభవం, రాజుల జీవితం ఈ నాటకాలల్లో అచ్చం అదే విధంగా చిత్రింపబడి కన్పిస్తున్నది. కాబట్టి ఆ నాటకాలు చక్రవర్తి హర్షునివి కావనే అభిప్రాయం నిరాధారం.

## ప్రియదర్శిక

హర్షవర్ధనుని మూడు నాటకాలల్లో ప్రియదర్శిక మొదటిదనటంలో సందేహం లేదు. రత్నావళి కన్న ఇది నాటక కళ దృష్టితో అపరిపక్వంగా వున్నది. కాబట్టి రత్నావళి కిది పూర్వ రచన. నాగానందం ఈ రెండింటికన్నా ప్రౌఢంగా వున్నది. కాబట్టి అది కవి చివరి రచన అని నిర్ణయించి చెప్పవచ్చును. ప్రియదర్శిక, రత్నావళి నాటికల్లో ఇతివృత్తం ఒక్కటే. ప్రియదర్శిక ఇతివృత్తంలోని లోపాలను సవరించి రత్నావళి నాటికను కవి రచించి వుంటాడు. బౌద్ధమతాన్ని స్వీకరించింతర్వాత హర్షుడు నాగానందాన్ని రచించివుంటాడు. నాగానంద నాందీశ్లోకంలో బుద్ధుని స్తుతివున్నది.

ప్రియదర్శికలో నాలుగంకాలున్నవి. ఇతివృత్తం ప్రేమ కథ. ఈ ఇతివృత్తాన్ని కవి బృహత్కథ నుంచి తీసుకొని వుంటాడు. నాయకుడు వత్సరాజు ఉదయనుడు. కళింగరాజు దృఢవర్మ శత్రువుల చేతిలో పరాజయం చెందగా అతని సేనాపతి విజయసేనుడు అతని పుత్రిక ప్రియదర్శికను తీసుకొనిపోయి ఉదయనుని భార్య వాసవదత్తకు పరిచారికగా అప్పగిస్తాడు. ఒకసారి పుష్పాపచయం చేస్తున్న ప్రియదర్శికను ఉదయనుడు చూస్తాడు.

వారిద్దరికి పరస్పరానురాగం కలుగుతుంది. ఉదయన వాసవదత్తల ప్రేమ కథను నటించేటప్పుడు ప్రియదర్శిక వాసవదత్త వేషం, ఉదయనుడు స్వయంగా ఉదయనుని వేషం వేసుకుంటారు. ఆ నాటక ప్రదర్శన సమయంలో వారిద్దరి ప్రేమ వాసవదత్తకు తెలుస్తుంది. వాసవదత్త ప్రియదర్శికను బంధిస్తుంది. ఇంతలో దృఢవర్మ శత్రువులను జయిస్తాడు. కంచుకి వాసవదత్తకు ప్రియదర్శిక వృత్తాంతాన్ని చెప్తాడు. వాసవదత్త అనుమతితో ఉదయన ప్రియదర్శికల వివాహం జరుగుతుంది.

ప్రియదర్శిక మీద కాళిదాసు మాళవికాగ్నిమిత్రం ప్రభావం చాల వున్నది. అంతేగాక శాకుంతల ప్రభావం కూడ చాల వున్నది. ప్రియదర్శిక పుష్పాపచయ సమయంలో తుమ్మెదల చేత బాధింపబడటం, లతానికుంజంచాటున వున్న ఉదయనుడు వచ్చి ఆమెను రక్షించటం శాకుంతల ప్రథమాంకాన్ని పోలివున్నది. పాత్రలు, కథాసంవిధానమంతా మాళవికాగ్నిమిత్రాన్ని పోలివున్నది. మాళవికాగ్ని మిత్రంలోని నాట్యప్రదర్శన వృత్తాంతం ఆధారంగా కవి దీనిలో నాటక ప్రదర్శనను కల్పించాడు. దీనిలోని సాంకృత్యాయని మాళవికాగ్ని మిత్రంలోని కౌశికిని తలపిస్తున్నది. ద్వితీయాంకంలో సారిక ప్రియదర్శిక హృదయగత ప్రేమను బయటపెట్టే సన్నివేశం రమ్యంగా వున్నది.

## రత్నావళి

ఇది కూడ నాలుగంకాలు గల నాటిక. నాయిక రత్నావళి సింహళ రాజకుమారి. రత్నావళిని వివాహమాడినవాడు చక్రవర్తిత్వం పొందుతాడని జ్యోతిషులు చెప్పిన దాన్ని బట్టి వాసవదత్త, యౌగంధరాయణులు కూడ బలుక్కొని వాసవదత్త మరణించినట్లు పుకారు పుట్టిస్తారు. ఇది విని సింహళరాజు తన కూతురు రత్నావళిని మంత్రి వసుభూతి, కంచుకితో ఉదయనుని దగ్గరికి వివాహార్థం పంపుతాడు. దారిలో ఓడ విరిగిపోతుంది. రత్నావళి సముద్రంలో నుంచి బయటపడి ఏదో విధంగా వాసవదత్తను చేరుకొని సాగరిక పేరుతో ఆమె దగ్గర పరిచారికగా వుంటుంది. రూపవతి అయిన సాగరిక ఉదయనుని కంట బడకుండా వాసవదత్త కాపాడుతుంటుంది. ఒకసారి మదనమహోత్సవ సమయంలో వారు చూసుకొని ప్రేమించుకొంటారు. సాగరిక చెలి సుసంగతతో తన ప్రేమను గురించి చెప్తుంది. ఇంతలో ఇది విన్న పెంపుడు సారిక తప్పించుకొని పారిపోతుంది. దాన్ని వెతుకుతూ వీళ్ళిద్దరు బయలుదేరిపోయి రాజు, విదూషకులను కలుసుకుంటారు. సాగరిక ఉదయనుల ప్రేమాలాప సమయంలో వాసవదత్త అక్కడికి వచ్చి అదంతా విని కోపావేశురాలు

అవుతుంది. ప్రేమికులను కలిపే కొరకు వాసవదత్త వేషంలో సాగరిక, సాగరిక వేషంలో సుసంగత రాజును కలుసుకొనే కొరకు రావాలి అని విదూషకుడు ఉపాయాన్ని ఆలోచిస్తాడు. వాసవదత్తకు ఇదంతా తెలిసి సాగరిక ఉదయనులు కలుసుకోకుండ చేస్తుంది. వాసవదత్త సాగరికను కారాగారంలో బంధించి ఆమెను ఉజ్జయినికి పంపించినట్లు ప్రచారం చేస్తుంది. యౌగంధరాయణుడు ఇంద్రజాలికుని వేషంలో వచ్చి ఇంద్రజాలాన్ని ప్రదర్శిస్తు రాజభవనానికి అగ్ని అంటుకొన్నట్లు సృష్టిస్తాడు. వాసవదత్త గాబరాపడి సాగరికను రక్షించేకొరకు ఉదయనున్ని పంపుతుంది. ఇంతలో మంత్రి వసుభూతి వచ్చి సాగరిక అసలు పరిచయాన్నిస్తాడు. వాసవదత్త సాగరిక ఉదయనుల వివాహానికి అంగీకరిస్తుంది.

ప్రియదర్శిక, రత్నావళి నాటికల్లో హర్షుడు ఒకే విధమైన కథను తీసుకున్నాడు. కీథ్ దీన్ని ఒక లోపంగా చెప్పాడు. ప్రియదర్శిక నాటక సంవిధానం కొంతవరకు శిథిలంగా వున్నది. దానిన సవరించేకొరకు కవి నూతన సన్నివేశకల్పనలను చేసి శాస్త్రీయమైన నాటిక లక్షణాలను పూర్తిగా అనుసరిస్తు పటిష్ఠమైన రత్నావళి నాటికను వ్రాసివుంటాడు.

ప్రియదర్శికలోకన్నా, రత్నావళి నాటికలోని కథ చాల కుతూహలపూర్ణంగా నడిచింది. ఇది లలితంగా మనోరంజకంగా వున్నది. ఈ నాటకం మీద భాసుని స్వప్నవాసవదత్త , కాళిదాసు మాళవికాగ్నిమిత్రంల ప్రభావం చాల కన్పిస్తున్నది. జ్యోతిషుల భవిష్యవాణి, యౌగంధరాయణ వాసవదత్తల ఆలోచన, వాసవదత్త మరణించినట్లుగా ప్రచారంచేయటం మొదలైనవి స్వప్నవాసవదత్తం ఆధారంగా కల్పించినవి. రత్నావళి ద్వితీయాంకంలోని కోతి వృత్తాంతం మాళవికాగ్నిమిత్రంలోని- కోతి రాకుమారిని భయపెట్టిన సంఘటన ఆధారంగా కల్పించింది కావచ్చును. రత్నావళీ ప్రియదర్శికల వృత్తాంతాలు ఒకే మాదిరిగా వున్నా కొన్ని సంఘటనలు భిన్నంగా వున్నవి. రెండు నాటికలు చదివినప్పుడు రెండు విభిన్న నాటికలు చదివిన ఆనందమే కలుగుతున్నది. రత్నావళిలోని ఇంద్రజాలిక వృత్తాంతం కవి మౌలిక కల్పన. ఇది ప్రియదర్శికలో నాటక ప్రదర్శన వృత్తాంతంకన్నా హృదయరంజకంగా అద్భుతంగా వున్నది.

## నాగానందం

హర్షుని నాటకాలల్లో రత్నావళి శ్రేష్ఠమైందని కొందరు భావిస్తే మరికొందరు నాగానందం శ్రేష్ఠమైందని భావించారు. నాగానందం హర్షుని మిగతా రెండు నాటకాలకన్న ప్రౌఢంగా వున్నది. ఈ నాటకం కథాయోజన, రసపోషణలు కవిస్వంతమే. ఇది ఐదు

అంకాల నాటకం. నాటకంలో 5 మొదలు 10 వరకు అంకాలుండవచ్చును. దీనిలో జీమూతవాహనుని కథ చెప్పబడింది. జీమూత వాహనుడు తన తండ్రికి వానప్రస్థాశ్రమానికి తగిన చోటు కొరకు వెతుకుతూ మలయ పర్వతం చేరుకుంటాడు. అక్కడ గౌరీ మందిరంలో సిద్ధరాజ కన్య మలయవతిని, ఆమె సఖులను చూస్తాడు. గౌరీదేవి ఆమెకు స్వప్నంలో కనిపించి ఆమెకు విద్యాధర కుమారునితో వివాహ మౌతుందని వరమిచ్చిందని వారి సంభాషణనుబట్టి తెలుసుకుంటాడు. జీమూతవాహనుడు విదూషకునితో వారి దగ్గరికి పోతాడు. జీమూతవాహన మలయవతులు ఒకరినొకరు చూసుకుంటారు. పరస్పర ప్రేమ కలుగుతుంది. ద్వితీయాంకంలో జీమూతవాహన మలయవతుల విరహం వర్ణింపబడింది. మలయవతి విరహంతో ప్రాణత్యాగం చేసుకోటానికి పూనుకుంటుంది. జీమూతవాహనుడు వచ్చి ఆమెను రక్షిస్తాడు. తృతీయాంకంలో జీమూతవాహన మలయవతుల వివాహోత్సవం వర్ణింపబడింది. చతుర్థాంకంలో జీమూతవాహనుడు మిత్రావసువుతో కూడి సముద్రతటాన విహరిస్తు శంఖచూడుని తల్లి ఏడ్పును వింటాడు. గరుడుని మాటల ద్వారా అతని సర్పభక్షణ వృత్తాంతాన్ని తెలుసుకుంటాడు. అప్పుడు శంఖచూడునికి బదులుగా స్వయంగా తానే బలిస్థానంలో కూర్చుంటాడు. గరుడుడు వచ్చి అతన్ని ఎత్తుకొని మలయ పర్వతం పైకి పోతాడు. పంచమాంకంలో జీమూతవాహనుని తండ్రి జీమూతకేతువు, మిత్రావసువులకు రక్తమాంసాలంటిన జీమూతవాహనుని చూడామణి దొరుకుతుంది. వారు విపత్తును శంకించి అతన్ని వెతుక్కుంటూ బయలుదేరుతారు. శంఖచూడుని ద్వారా జరిగినదాన్ని తెలుసుకొని మలయ పర్వతం చేరుకుంటారు. ఇంతలో గరుడుడు జీమూతవాహనున్ని గుర్తించి పశ్చాత్తాపం చెందుతాడు. పుత్రుని దశను తెలిసి జీమూతకేతువు ప్రాణత్యాగం చేయాలనుకుంటాడు. అప్పుడు గౌరీదేవి జీమూతవాహనుని బతికించి విద్యాధర చక్రవర్తి అవుతాడని వరమిస్తుంది. గరుడుడు ఇక తాను భవిష్యత్తులో సర్ప భక్షణం చేయనని మాట ఇస్తాడు.

హర్షుడు తన నాటకేతివృత్తానికి ఆధారంగా విద్యాధర జాతక కథను తీసుకొన్నట్లు ప్రస్తావనలో చెప్పాడు. కాని అటువంటి జాతక కథ ఇప్పుడు లభించటం లేదు. అందుకే కొందరు విమర్శకులు అతడు మహాభారతంలోని కథను తీసుకున్నాడని చెప్తున్నారు. ఒకవేళ హర్షుని కాలంలో ఆ జాతక కథ ప్రచారంలో వుండేది కావచ్చును. నాగానందం నాందిలో హర్షుడు బుద్ధుని స్తుతించి తన బౌద్ధమతాభిమానాన్ని చాటుకున్నాడు. కాబట్టి బౌద్ధజాతక కథనే అతడు నాటకేతివృత్తంగా గ్రహించి రచించి వుండవచ్చును. హర్షుడు

బౌద్ధమతాభిమాని అయినా హిందూమతాన్ని తిరస్కరించలేదు. అందుకే నాటకంలో నాయికను గౌరీ భక్తురాలుగా చెప్పటమే కాక గౌరి పాత్రను ప్రవేశపెట్టి నాటకాంతంలో ఆమె నాయకునికి సమస్త శుభాలను సమకూర్చినట్లుగా చూపాడు. ఈ నాటక కథవంటి కథ ఒకటి కథా సరిత్సాగరంలో కూడ కన్పిస్తున్నది. కథా సరిత్సాగరానికి మూలమైన బృహత్కథలో ఈ కథ వున్నదో లేదో ఇప్పుడు చెప్పలేము. ఒకవేళ హర్షుని నాటక కథనే కథాసరిత్సాగరకారుడు తీసుకొని తన రచనలో చేర్చుకున్నాడో ఏమో నిర్ణయించటం కష్టం. మొత్తం మీద జీమూతవాహనుని కథ జాతక కథల్లోను, మహాభారతంలోను ప్రసిద్ధమైంది. అట్లా ప్రసిద్ధమైన కథను హర్షుడు తీసుకొని నాటకంగా మలచాడు. హర్షుడు స్వయంగా వితరణశీలి, ధర్మబద్ధుడు, సచ్ఛీలం కలవాడు. అటువంటి జీమూతవాహనుని వృత్తాంతం అతన్ని చాలా ఆకర్షించి వుంటుంది. అందుచేతనే దాన్ని అతడు నాటకంగా మలచివుంటాడు. అట్లా తీసుకొన్న కథను నాటకేతి వృత్తంగా మలచుకోవటంలో హర్షుడు మంచి ప్రావీణ్యాన్ని చూపాడు. ఐదు అంకాలల్లోనే జీమూతవాహనుని ప్రణయ, వివాహ, ప్రాణత్యాగ వృత్తాంతాలను కూర్చాడు. కథ ఎక్కడా కుంటుపడకుండా చకచక సాగుతుంది. ప్రతి సన్నివేశం, సంభాషణలు శక్తిమంతంగా ముందుకు సాగుతవి. పాఠకులకుగాని ప్రేక్షకులకు గాని కుతూహలాన్ని పూర్తిగా నిలుపుతూ నాటకం సాగుతుంది. అడుగడుగునా రసాన్ని చిప్పిలచేస్తూ హర్షుడు నాటకాన్ని నడిపాడు.

## నాగానందంలో అంగిరసం

కావ్యనాటకాలల్లో ఏదైన ఒక్క రసం అంగిరూపంలో, మిగిలినవి అంగరూపంలో పోషింపబడాలని లాక్షణికుల మతం. కవులు అదే విధంగా ఒక్క రసాన్ని ప్రధానంగా చేసి విభావానుభావాదుల వర్ణనలతో ఆద్యంతం పోషించారు. అయితే నాగానందంలోను అదే జరిగింది. కాని ఆ ప్రధానరసమేది అన్న నిర్ణయం చేయవలసి వచ్చినప్పుడు పండితుల్లో అభిప్రాయభేదమేర్పడింది. కొందరు నాగానందంలో శాంత మంగిరసమన్నారు. మొదటి మూడు అంకాలల్లో శృంగారం పోషింపబడింది. శృంగారం శాంతానికి విరోధి రసం. కాని ఆనందవర్ధన, అభినవగుప్త, మమ్మటాదులు శృంగార శాంతరసాల విరోధ పరిహారాన్ని గురించి చర్చించివున్నారు. నాగానంద ప్రథమాంకంలో శాంతరసమే వున్నదని, తర్వాత కొంతదూరం శృంగారరసం పోషింపబడిందని, తర్వాత జీమూతవాహనుడు శంఖచూడునికి బదులు తనను తాను అర్పించుకొనే వృత్తాంతంలో శాంతమే ప్రధానమైందని, జీమూతవాహనుడు శాంత శమగుణాలుగల ధీరశాంతుడని ఈ విమర్శకుల అభిప్రాయం.

ఈ నాటకంలో శృంగార శాంతాలకు అంగాంగిభావమే వున్నది కాని వైరభావం కాదని వీరి మతం.

శాంతరసానికి శమం లేక తృష్ణా క్షయ సుఖం స్థాయిభావం. శమమనగా నిర్వికార చిత్తస్థితి. శాంతం అహంకార ప్రశమైక రూపమైందని (అస్యచ శాంతస్య అహంకార ప్రశమైకరూపతయా స్థితేః) ఆనందవర్ధనుడన్నాడు. అహంకార ప్రశమమమనగా "నిరీహత్వం' ' అని అభినవగుప్తుడు వ్యాఖ్యానించాడు. అప్పుడు శమమన్నా తృష్ణాక్షయసుఖమన్నా ఒక్కటే అవుతుంది. నాగానందంలో నాయకుడు జీమూతవాహనుడు నిరీహుడు, నిర్వికారచిత్తుడు కాడు. మాతాపితలన్న అతనికి అధిక భక్తి, భూతదయ, త్యాగోత్సాహం అతనిలో కన్పిస్తున్నవి. నేను అటువంటి వాడను ఇటువంటివాడను అనే అహంకారం అతనిలో వున్నది. ఆతడు మలయవతిని చూడగానే ప్రేమించి ఆమెను కాంక్షించాడు, వివాహమాడాడు. ఇంకా ఆతనికి నాటకం చివర రాజ్యాధికారరూపమైన లౌకికఫలం లభించింది కాని మోక్షం కాదు. నాగానందంలో శాంతం అంగిరసంగా పోషింపబడినట్లయితే ధనంజయుడు దృశ్యకావ్యంలో శాంతాన్ని అంగిరసంగా పోషించటాన్ని నిషేధించి వుండేవాడు కాదేమో.

కొందరు విమర్శకులు నాగానందంలో అంగిరసం కరుణమని అంగీకరించారు. కరుణకు శోకం స్థాయిభావం. నాగానందం మొదటి మూడు అంకాలల్లో శోకస్పర్శయే లేదు. మిగిలిన రెండు అంకాలల్లో గల శోకం శంఖచూడుని తల్లిని, జీమూతవాహనుని మాతాపితలను, నాయికను ఆశ్రయించిందే కాని నాయకుని ఆశ్రయించి కాదు కాబట్టి కరుణను అంగరసంగానే కాని అంగిరసంగా అంగీకరించటం కుదరదు.

కొందరు విమర్శకులు నాగానందంలో అంగిరసం వీరమని అంగీకరించారు. వీరరసం దాన, ధర్మ, దయా, యుద్ధ, త్యాగాది భేదాలతో చాల విధాలుగా వున్నది. వీటిల్లో యుద్ధవీరం తప్ప మిగిలిన వీర భేదాలన్నీ నాగానందంలో వున్నవి. నాయకుడు ఉత్సాహి. పితృసేవ అన్నా, సర్వస్వదానమన్నా, భూతదయఅన్నా, ప్రాణత్యాగమన్నా అతడు ఉత్సాహం చూపుతాడు. అతని ఉత్సాహం దృఢమైంది. నాగులను రక్షించి వారికి ఆనందాన్ని కలిగించాలని ఆతడు ఉత్సహించి కృతకృత్యుడైనాడు. కాబట్టి నాగానందంలో ఉత్సాహం స్థాయిగాగల వీరమే అంగిరసంగా వున్నదని చెప్పాలి కాని వేరేకాదు. మొదటి మూడు అంకాలల్లోని శృంగారం వీరానికి అంగరూపంగా పరిణమించి పోషించింది. శృంగారమేకాక ఈ నాటకంలో హాస్య, అద్భుతాది రసాలు కూడ అంగరూపంలో వున్నవి.

## హర్షుని నాటక కళ

హర్షుని నాటకాల్లోని సన్నివేశాది కల్పనలో మౌలికత చాల వున్నది. నాటకలక్షణాలను అనుసరించి దృశ్యాలను పొందుపరచటంలో అతనికతడే సాటి. హర్షుడు కాళిదాసు నాటకకళను చాలాచోట్ల అనుకరించాడు. అయినా అతని మౌలిక కల్పనలెన్నో నాటకాలల్లో వున్నవి. రత్నావళిలో ఇంద్రజాలిక వృత్తాంతం, సారికా వృత్తాంతం, వేష విపర్యయ వృత్తాంతం అద్భుతంగా వున్నవి. నాగానందం కథను నాటకంగా మలచటంలో అతడు చాల మౌలికతను ప్రదర్శించాడు. ఆ కథను విజయవంతంగా, రసవంతంగా నాటకంగా తీర్చిదిద్దగలిగాడు. హర్షుని ప్రియదర్శిక, రత్నావళి నాటికలు తేలికగా హాస్యాత్మకంగా వుండి ప్రేక్షకులకు మనోరంజనాన్ని కలిగిస్తున్నవి.

హర్షుని నాటకాలు ఆలంకారికులకు చాల ప్రియమైనవి. ధనంజయ, విశ్వనాథాది ఆలంకారికులు తమ నాటక లక్షణాలను వివరించే సందర్భంలో సంధిసంధ్యంగాలను పేర్కొనే సందర్భంలో వేణీ సంహారంతోపాటు రత్నావళి నుంచి అనేక ఉద్ధరణలను ఇచ్చి లక్ష్యంగా చూపారు. కాబట్టి నాటక కళాదృష్టితో రత్నావళి సఫలవంతమైన నాటికగా పేర్కొనదగి వున్నది. ప్రియదర్శిక, రత్నావళి నాటికలు ప్రదర్శనాయోగ్యమైన రమ్యమైన చిన్న రూపకాలు. శాస్త్రీయమైన లక్షణాలను పూర్తిగా అనుసరించిన నాటకకారుల్లో హర్షుడే మొదటివాడని చెప్పాలి.

గ్రహించిన కథలను సన్నివేశాలుగా విభాగించుకొని పాత్రల యోజన, సంభాషణల యోజనను హర్షుడు చాల కుశలంగా చేసుకొన్నాడు. సంభాషణలు దీర్ఘంగా లేవు. సరళ సులభశైలిలో వున్నవి. నాటకాలల్లోని సన్నివేశాలు సామాజికుల కుతూహలాన్ని నిలుపుతూ నడిచినవి. హర్షుని నాటకాలు భారతీయ భాషల్లోనే కాక ఇంగ్లీషు, జర్మన్, ఫ్రెంచ్ మొ॥న భాషల్లోకి అనువదింపబడినవి.

## హర్షుని కవిత్వం

నాటక సాహిత్యంలో కాళిదాస భవభూతుల తర్వాత గణింపదగినవాడు హర్షదేవుడు. హర్షుని శైలి సరళం. కోమలం. సహజ సుందరమైంది. ప్రసాద మాధుర్య గుణాలతో కూడింది. అతడు కాళిదాసును అనుసరించి వైదర్భీ శైలినే ప్రయోగించాడు. తరువాత నాటక కారుల వలె కఠిన ప్రౌఢశైలిని ప్రయోగించలేదు. హర్షుడు నాట్యశాస్త్రంలోనే కాక

సంగీతశాస్త్రంలోనే కాక సంగీతశాస్త్రంలోను మంచి ప్రవేశం కలవాడు. అతని సంగీతశాస్త్ర ప్రవేశాన్ని నాగానందంలో చూడవచ్చును. హర్షుడు లలిత కళాప్రియుడు. అందుకే అతని నాటకాలు చాల మధురంగా నడిచినవి. హర్షుడు నాటక కళా విషయంలో కాళిదాసాదులను అనుకరించినా స్వయం ప్రతిభతో మిళితమైందే కాని గుడ్డి అనుకరణ కాదు. హర్షుడు వర్ణనాప్రియుడు. సందర్భోచితంగా వర్ణనలను చేసాడు. మధ్యాహ్న, సాయంకాల, వన, ఆశ్రమ, వివాహోత్సవ, వసంతోత్సవాది వర్ణనలు స్వాభావికంగా వున్నవి.

హర్షుడు భవభూతివలె గంభీర స్వభావం కలవాడు కాదు. మృదు స్వభావుడు. రసిక హృదయుడు. కాబట్టే రత్నావళ్యాది నాటకాలల్లో మృదు మధురమైన శృంగారాన్ని సమర్థవంతంగా పోషించాడు. ప్రకృతి చిత్రణతోపాటు ప్రణయ చిత్రణాన్ని కవి చాల సహజంగా సుందరంగా చేసాడు. హర్షుడు పండితుడే కాక సూక్ష్మేక్షిక కలవాడు. అందుకే అతని వర్ణనలు స్వాభావికతతో కూడివున్నవి. హర్షుని నాటకాలల్లో నాటకకళ, కవిత్వంతోపాటు పాత్రచిత్రణ కూడ ఉత్కృష్టంగా వున్నవి. ధీరలలితుడైన ఉదయనుని, ధీరోదాత్తుడైన జీమూత వాహనుని, ముగ్ధలైన ప్రియదర్శిక, రత్నావళ్యాది పాత్రలను కవి బొమ్మగీసినట్లుగా స్పష్టరేఖలతో చిత్రించాడు. అతని నాటకాల్లో విదూషకుడు కూడా వున్నాడు. విదూషకుని హాస్యం నాట్య శాస్త్రానుసారిగా వున్నది.

హర్షుడు గొప్ప కవిగా, గొప్ప నాటకకారునిగా అతని నాటకాలల్లో దర్శనమిస్తున్నాడు. అతని నాటికలు రాజశేఖరాది కవులకు ఆదర్శమైనవి. నాటికల రచనలో అతడు చూపిన సంపూర్ణ ప్రావీణ్యం ప్రశంసనీయమైంది.

# భవభూతి

## భవభూతి పేరు

సంస్కృత సాహిత్యంలో కాళిదాసు పక్కన గౌరవస్థానాన్ని సంపాదించిన వాడు భవభూతి. కొందరు ప్రాచీనులు కాళిదాసుకన్న భవభూతికే ఉన్నత పీఠం వేసారు కూడ. "ఉత్తరే రామ చరితే భవభూతి ర్విశిష్యతే" అన్న ఉక్తి దీనికి తార్కాణంగా పుట్టిందే. భవభూతి అన్నది కవి అసలు పేరా? లేక తరువాత వచ్చిన పేరా? అన్న విషయంలో పండితుల్లో అభిప్రాయ భేదాలున్నవి. మిరాశీ భవభూతి అన్నదే అతని అసలు పేరు అని "శ్రీకంఠ" అన్నది బిరుద నామమని అభిప్రాయపడినాడు. "శ్రీకంఠ పద లాంఛనః

భవభూతిర్నామ" అని నాటక ప్రస్తావనలో కవి చెప్పుకొన్నాడు. " లాంచన" అంటె బిరుదనామమని అర్థమని "కవిరాజ లాంఛనస్య వాక్పతి రాజస్య" అని గౌడవహోకర్త పేర్కొన్నదాని బట్టి "లాంఛన" పదానికి బిరుదనామమనే స్పష్టమౌతున్నదని ఆయన వివరించాడు. కాబట్టి "శ్రీకంఠ అన్న బిరుదనామం గల భవభూతి" అన్న అర్థమే పై నాటక ప్రస్తావనలోని వాక్యానికి సరియైన అర్థమని, భవభూతి పూర్వజుల్లో "సింహభూతి" అన్న పేరు కన్పిస్తుందని అదే విధంగా ఈ కవి పేరు "భవభూతి" అని మిరాశి చెప్పాడు. "శ్రీకంఠ" అన్న బిరుదనామానికి" ఎవరి కంఠంలో శ్రీ వున్నదో అతడు" అని అర్థం. శ్రీ అంటె వాగ్దేవత. అప్పుడు శ్రీకంఠుడంటె వశ్యవాక్కు కలవాడు అని అర్థం చెప్పి ఇది బిరుదనామంగా సార్థకమైందని ఆయన పేర్కొన్నాడు. కాని భవభూతి తండ్రిపేరు నీలకంఠుడు. కాబట్టి భవభూతి అసలు పేరు శ్రీకంఠుడనటం సరియైందని కొందరు విమర్శకులు తలంచారు. నాటక వ్యాఖ్యాతలు భవభూతి తండ్రిపేరు నీలకంఠుడు. కాబట్టి భవభూతి అసలు పేరు శ్రీకంఠుడనటం సరియైందని కొందరు విమర్శకులు తలంచారు. నాటక వ్యాఖ్యాతలు భవభూతి అన్నది బిరుదనామంగానే పేర్కొన్నారు. శ్రీకంఠుడు "భవభూతి" అన్న పదాన్ని రమ్యంగా ప్రయోగించటంచేత అతనికి భవభూతి అన్నది ప్రసిద్ధంగా బిరుదనామంగా వచ్చిందని ఆర్యాసప్తశతి వ్యాఖ్యాత అనంత పండితుడు చెప్పాడు -

కాం తపస్వీ గతోzవస్థామితిస్మేరా వివస్తనౌ
వందే గౌరీ ఘనా శ్లేష భవభూతి సితాననౌ.

పై శ్లోకం శ్రీధరదాసు కూర్చిన సదుక్తికర్ణామృతంలో ఇయ్యబడింది. పై శ్లోకం ఈ క్రింది విధంగాను ప్రచారంలో వున్నది -

తపస్వీ కాంగ తోzవస్థా మితి స్మేరాననా వివ
గిరిజాయా స్తనౌ వందే భవభూతి సితాననౌ.

"సాంబా పునాతు భవభూతి పవిత్రమూర్తిః" అన్న శ్లోకంలో 'భవభూతి' పదాన్ని అందంగా వాడాడని అందుకే అతనికి భవభూతి అన్న పేరు వచ్చిందని మహావీర చరిత్ర వ్యాఖ్యాత వీరరాఘవుడు తెల్పాడు. "నామ్నా శ్రీకంఠః ప్రసిద్ధయా భవభూతి" అని మాలతీ మాధవంలో జగద్ధరుడు చెప్పాడు. "భవభూతిరితి వ్యవహారే తస్యైవ నామాంతరమ్" అని మాలతీమాధవంలో త్రిపురారి పేర్కొన్నాడు. వ్యాఖ్యాతలందరు ఏకకంఠంగా శ్రీకంఠుడన్నది

తల్లిదండ్రులు పెట్టిన పేరని 'భవభూతి' ప్రసిద్ధంగా బిరుదంగా వచ్చిన పేరని చెప్తున్నారు. శ్రీకంఠుడన్నది లోకంలో వ్యక్తులు పెట్టుకొనే పేరుగా వున్నది. కాబట్టి 'శ్రీకంఠ' అన్నది బిరుదనామం కాక అదే అసలు పేరు అని చెప్పాలి. "శ్రీకంఠ పదలాంఛనో" లోని 'లాంఛన' కు పేరు అని కూడ అర్థం చెప్పవచ్చును. అప్పుడు "శ్రీకంఠుడని పేరుగల భవభూతి అని ప్రసిద్ధనామం గల" అని "శ్రీకంఠ పదలాంఛనో భవభూతిర్నామ"కు అర్థం చెప్పుకోవాలి.

## భవభూతి కాలం

భవభూతి కాలాన్ని నిర్ణయించటంలో ఎటువంటి కష్టం లేదు. భవభూతి వాక్పతిరాజుతోపాటు కన్యాకుబ్జాన్నేలిన యశోవర్మ ఆస్థాన కవి. ఈ యశోవర్మ కాశ్మీరరాజు లలితాదిత్యుని చేతిలో ఓడిపోయాడని కల్హణుడు రాజతరంగిణిలో తెల్పాడు -

కవి వాక్పతిరాజశ్రీ భవభూత్యాది సేవిత:
జితో యయౌ యశోవర్మాతద్గుణ స్తుత వందితామ్.

రాజతరంగిణి బట్టి, చైనా యాత్రికుల వ్రాతలను బట్టి లలితాదిత్యుని కాలం క్రీ.శ. 724-761 అని తెలుస్తున్నది. యశోవర్మ కొడుకు ఆమరాజు క్రీ.శ. 750 లో బప్పభట్టిచేత జైనదీక్షను పొందినట్లు జైనుల వ్రాతలవల్ల తెలుస్తున్నది. అంటే క్రీ.శ. 754లో బప్పభట్టిని ఆమరాజు 'సూరి' బిరుదాన్నిచ్చి గౌరవించాడు. అంటే క్రీ.శ. 754 నాటికి ఆమరాజు రాజయ్యాడని చెప్పవచ్చును. లలితాదిత్యుడు క్రీ.శ. 736 కన్న మొదలే యశోవర్మను జయించాడని డా॥ స్టైన్ నిర్ణయించాడు. క్రీ.శ. 725లో యశోవర్మ సింహాసన మధిష్ఠించినట్లు చైనీయుల వ్రాతల ఆధారంగా మిరాశి నిర్ణయించి అతని రాజ్యకాలం క్రీ.శ. 725-753 అని అన్నాడు. యశోవర్మ హర్షవర్ధనుని తర్వాత కన్యాకుబ్జదేశాన్ని పరిపాలించాడు. క్రీ.శ. 735 లో వాక్పతిరాజు గౌడవహో కావ్యాన్ని పూర్తిచేసాడు. భవభూతి, వాక్పతి రాజులు యశోవర్మ ఆస్థానకవులని కల్హణుడు పేర్కొన్నాడు. వాక్పతిరాజు భవభూతి కవిత్వాన్ని ప్రశంసించటమే కాక చాలచోట్ల అనుకరించాడు. దీన్ని బట్టి వాక్పతిరాజుకు భవభూతి సాహిత్య విద్యాగురువు అని కొందరు భావించారు. వాక్పతిరాజు ఈ క్రింది శ్లోకంలో భవభూతిని భూరిప్రశంస చేసాడు -

భవభూతి జలధి నిర్గత కావ్యామృత రసకణా ఇవ స్ఫురంతి
యస్య విశేషా అద్యాపి వికటేషు కథా నివేశేషు.

దీన్నిబట్టి వాక్పతిరాజు కన్న భవభూతి వయస్సులో పెద్దవాడు, అప్పటికే (అంటే క్రీ.శ. 735 నాటికి) కవిగా స్థిరపడి పేరును సంపాదించినవాడై వుంటాడని నిశ్చయించవచ్చును. అంటె క్రీ.శ. 735 నాటికే భవభూతి రచనావ్యాసంగం ఉచ్చస్థితికి చేరుకున్నదని తెలుస్తున్నది. బాణ దండ్యాచార్యులు భవభూతిని పూర్వకవుల స్తుతిలో చేర్చలేదు. కాబట్టి వారికన్న భవభూతి అర్వాచీనుడని తెలుస్తున్నది. కాణే అభిప్రాయంలో భవభూతి రచనా వ్యాసంగకాలం క్రీ.శ. 660-680. మిరాశి ప్రకారం క్రీ.శ. 700-730. మొత్తంమీద భవభూతి యశోవర్మకు (క్రీ.శ. 725-753) సమకాలికుడు. దండికి ఆర్వాచీనుడు. అప్పుడు భవభూతి క్రీ.శ. 680-750 ప్రాంతం వాడని నిర్ణయించవచ్చును.

క్రీ.శ. 800 ప్రాంతం వాడైన వామనుడు భవభూతి శ్లోకాలను ఉద్ధరించాడు. అంటె అప్పటికి భవభూతి కవిగా గుర్తింపు పొంది ప్రసిద్ధికెక్కాడని చెప్పవచ్చును. క్రీ.శ. 940 నాటి వాడైన సోమదేవుడు భవభూతిని మహాకవిగా పేర్కొని అతన్ని వ్యాస, కాళిదాస, భారవి, భర్తృమేంఠుల సరసన చేర్చి ప్రశంసించాడు.

## భవభూతి పరిచయం

ఇతర కవులకన్న భవభూతి తన పరిచయాన్ని ఎక్కువగానే ఇచ్చుకొన్నాడు. నాటక ప్రస్తావలనలనుబట్టి అతడు దక్షిణాపథంలో విదర్భ దేశంలోని పద్మపుర నివాసి, కృష్ణ యజుర్వేద తైత్తిరీయ శాఖకు చెందినవాడు, కాశ్యపగోత్రీయుడు. ఉదుంబర బ్రాహ్మణుడు. తాత పేరు భట్టగోపాలుడు. తండ్రి పేరు నీలకంఠుడు, తల్లి పేరు జతుకర్ణి. భవభూతి పూర్వజుల్లో ఐదవ తరంవాడు 'మహాకవి' అని పేరు కలవాడు, గొప్ప విద్వాంసుడు, వాజపేయ యజ్ఞం చేసిన వాడు. ఒక వ్రాతప్రతిలో అతని పేరు సింహభూతి అని ఇయ్యబడింది. భవభూతి వంశంవారు సోమపీథులు, దృఢవ్రతులు, బ్రమ్మవాదినులు. దీన్నిబట్టి భవభూతి శుద్ధ వైదిక బ్రాహ్మణుడని తెలుస్తున్నది. నాటకాలను బట్టి భవభూతి కాళిదాసు వలెనే శివాభిమానిగా కన్పిస్తాడు. కాని అతన్ని శ్రీరాముని చరిత్ర ఆకర్షించింది. అయినా భవభూతి శుద్ధ పరబ్రహ్మను సేవించిన వైదిక మతానుమాయి అనే చెప్పాలి. భవభూతి తన గురువు పేరు జ్ఞాననిధి అని పేర్కొన్నాడు.

## భవభూతి జన్మస్థలం

భవభూతి స్వయంగా తాను విదర్భ దేశంలోని పద్మపుర నివాసినని చెప్పుకున్నాడు. అది ఇప్పుడు ఆమ్‌గావ్ సమీపంలో వున్నదని, ఈ కుగ్రామం ఒకప్పుడు వాకాటక రాజులకు

కొంతకాలం రాజధానిగా వుండేదని వి.వి.మిరాశి నిర్ణయించాడు. మాలతీమాధవ నాటకం పద్మావతిలోని కాల ప్రియనాథుని సమక్షంలో ప్రదర్శింపబడినట్లు ఆ నాటకంలో చెప్పబడింది. అయితే ఆ పద్మావతి, అతని జన్మస్థలం పద్మపురం ఒక్కటే అని, అది ఈనాటి గ్వాలియర్ ప్రాంతంలోని "పదమపావాయ" అని కొందరు విమర్శకులు అభిప్రాయపడినారు. కాని భవభూతి పద్మపురం విదర్భ దేశంలోనిదని చెప్పినట్లు కొన్ని ప్రతుల్లో స్పష్టంగా వున్నది. అటువంటప్పుడు గ్వాలియర్ ప్రాంతంలోని "పదమపావాయ" పద్మపురం కావాటానికి వీల్లేదు. భవభూతి పద్మపురం నుంచి పద్మావతికి తరలిపోయి అక్కడ కాలప్రియనాథుని సమక్షంలో తన నాటకాలను ప్రదర్శింపజేసి వుంటాడని మరి కొందరు విమర్శకులు తలంచారు.

## కాలప్రియనాథు డెవరు?

తన మూడు నాటకాలు కూడ కాలప్రియనాథుని సమక్షంలో ప్రదర్శింపబడినట్లు భవభూతి చెప్పుకున్నాడు. కాలప్రియనాథుడు ఉజ్జయినిలోని మహాకాలుడే అని చాలామంది విమర్శకులు నిశ్చితంగా వుండిపోయి దాన్ని గురించి పట్టించుకోలేదు. కాని ఉజ్జయినిలో మహాకాలునికి కాలనాథ. కాలపూజిత అని పేర్లున్నవి. కాని కాలప్రియనాథుడని ఎక్కడా లేదు. కాలప్రియనాథుడన్న పేరు సూర్యునికి ప్రసిద్ధంగా వున్నది. " కాలప్రియ" అన్న ప్రదేశంలో వెలసిన ప్రభువు, దేవుడు అని దానికి అర్థం. కాలప్రియక్షేత్రాన్ని రాజశేఖరుడు కావ్య మీమాసంలో "యోగాధిపురస్య దక్షిణః స కాలప్రియస్యోత్తరః అని పేర్కొన్నాడు. కాలప్రియక్షేత్రం ఇప్పుడు "కాల్పి" అని పిలువబడుతున్నది. ఈ కాల్పి పద్మావతి (పదమపావయ)కి ఎక్కువ దూరంలో లేదు. ఈ క్షేత్రం యమునానది తీరంలో వున్నది. భవిష్య, వరాహ పురాణాలల్లో ఈ క్షేత్రప్రసక్తి వున్నది. ఈ క్షేత్రం భవభూతికి పూర్వం భవభూతి తర్వాత కొంతకాలంవరకు కూడా ప్రసిద్ధ క్షేత్రంగా వుండేదని భారతదేశంలోని మూడు ప్రసిద్ధ సూర్యక్షేత్రాలల్లో ఇది ఒకటి అని మిరాశి పురాణాల, శాసనాల ఆధారంగా నిర్ణయించాడు. ఈ కాలప్రియ క్షేత్రంలోనే భవభూతి నాటకాలు ప్రదర్శింపబడినవని భవభూతి కీర్తి ఇక్కడ నుంచే రాజు యశోవర్మ వరకు చేరివుంటుందని చెప్పవచ్చును. యశోవర్మ భవభూతిని ఆదరించి తన ఆస్థానంలో వుంచుకొని గౌరవించి వుంటాడు.

## ఉంబేకుడు-భవభూతి ఒక్కరేనా?

మీమాంసదర్శనంలో గొప్ప ఆచార్యుడు ఉంబేకుడు. అతడు కుమారిల భట్టు శ్లోకవార్తికకు సుప్రఖ్యాతమైన వ్యాఖ్యానాన్ని రచించాడు. ఈ వ్యాఖ్యానం వల్ల ఉంబేకునికి

మీమాంస దర్శనంలో కుమారిలునంత స్థానం లభించింది. అయితే ఆ ఉంబేకుడు, కవి భవభూతి ఒక్కరే అని కొందరు విమర్శకులు అభిప్రాయపడినారు. మరికొందరు దాన్ని ఖండించారు. ఉంబేక భవభూతులు ఒక్కరే అని ప్రతిపాదించిన మొదటి వ్యక్తి శంకర్ పాండురంగ పండిట్. ఒకానొక మాలతీమాధవ ప్రతిలో "ఇతి శ్రీ భట్ట కుమారిల శిష్యకృతే మాలతీ మాధవే తృతీయోంకః" అని వున్నట్లు ఆయన తాను గౌడవహోకు వ్రాసిన పీఠికలో తెలిపాడు. "కుమారిలుని ప్రసాదంచేత లభించిన వాగ్వైభవం గల ఉంబేకాచార్యులు వ్రాసిన మాలతీ మాధవం ...." అనికూడ ఒకచోట ఆ ప్రతిలో వున్నదని ఆయన తెలిపాడు.

చిత్సుఖాచార్యుని తత్త్వప్రదీపికకు నయనప్రసాదిని అన్న వ్యాఖ్యానం వ్రాసిన ప్రత్యగ్రూప భగవాన్ తన వ్యాఖ్యానంలో ఎన్నోసార్లు ఉంబేకుని పేర్కొన్నాడు. ఒకచోట ఉంబేకుడు, భవభూతి అభిన్న వ్యక్తులని తెల్పాడు ("భవభూతిరుంబేకః"). భవభూతికి ఒక నాటక రచనలవల్లనే పేరురాలేదని చిత్సుఖుడు కూడ అన్నాడు.

పై ఒకటి రెండు ఆధారాలను బట్టి మీమాంసా దార్శనికుడు ఉంబేకుడు, పదవాక్య ప్రమాణజ్ఞుడైన భవభూతి ఒక్కరే అని విమర్శకులు కొందరు విశ్వసిస్తున్నారు. కాని డా. భండార్కర్‌కు ఇంకా ఇతరులకు మాలతీమాధవ లిఖిత ప్రతలు ఎన్నో లభించినవి. కాని ఆప్రతులల్లో ఎక్కడా ఉంబేకుని ప్రసక్తి లేదు. శంకర్ పాండురంగ పండిట్‌కు లభించిన ఒక్క ప్రతిలోనే అట్లా కనిపించటం ఆశ్చర్యంగా వున్నది. భవభూతి తన గురువు "జ్ఞాననిధి' ' అని పేర్కొన్నాడు. కుమారిలున్నే భవభూతి జ్ఞానానికి నిధి వంటివాడు కాబట్టి " జ్ఞాననిధి' ' అని పేర్కొన్నాడని కొందరు విమర్శకుల అన్నారు కాని ప్రసిద్ధమైన ఆచార్యుడు తనకు గురువుకాగా అతని పేరును చెప్పకుండా "జ్ఞాననిధి" అని భవభూతి పేర్కొని వుండేవాడు కాదని కాబట్టి "జ్ఞాననిధి" కుమారిలుడు కాదని మిగతా వారు ఖండించారు. అంతేగాక భవభూతికి వాగ్వైభవం కుమారిలుని వల్ల లభించి వుంటె దాన్ని తప్పక స్పష్టంగా అతడు తన రచనల్లో అంతటా పేర్కొనివుండేవాడు. తర్వాత భవభూతికి మొదటినుంచి నటులతో ఘనిష్ఠ సంబంధమున్నట్లు అతని మహావీర చరిత్ర, మాలతీమాధవం నాటకాలను బట్టి తెలుస్తున్నది. అతనికి నాటకసమాజాలతో కూడ బాగా పరిచయమున్నట్లు కన్పిస్తుంది. అంటె అతనికి నాటకాలన్నా నాటక ప్రదర్శనలన్నా సహజాభిమానమున్నట్లున్నది. అందు చేతనే అతడు నాటకరచనను చేపట్టి వుంటాడు. అటువంటప్పుడు భవభూతియే దార్శనికుడైన ఉంబేకాచార్యుడని నిర్ణయించటం సత్యదూరంగా కన్పిస్తున్నది.

## భవభూతి మహారాష్ట్రీయా? ఆంధ్రుడా?

భవభూతి కృష్ణయజుర్వేద తైత్తిరీయశాఖకు చెందినవాడు. కాశ్యపగోత్రుడు. ఈ శాఖకు చెందిన బ్రాహ్మణులు మహారాష్ట్రుల్లో వున్నారు. ఆంధ్రుల్లోను వున్నారు. ఉత్తరరామ చరిత్రకు వ్యాఖ్యాత ఘనశ్యాముడు "హంత మాతర్జీవామి" (ద్వితీయాంకం) అన్న ప్రయోగాన్ని వివరిస్తు "ద్రావిడ స్త్రీ స్వభావోక్తిః ఏవంవదతా కవినా నిజం ద్రావిడత్వం ప్రకటితామిత్యహ్యామ్' ' అని అన్నాడు. ఇంకా "వత్సయోపితుః" (తృతీయాంకం) దీన్ని వివరిస్తు "వత్సయోః కుశలవయోఃపితుః నిజభర్తుః రామభద్రస్యేత్యర్థః ఏతేన కవినా నిజం ద్రావిడత్వం ప్రకటితమిత్యూహ్యామ్" అని ద్రావిడానికే ప్రత్యేకమైన అర్థరీతులు భవభూతిలో వున్నవని అన్నాడు. ఒకవేళ ఆ అర్థరీతులు ద్రావిడానికి ప్రత్యేకమైనవి కాక పోయినా వ్యాఖ్యాత ఘనశ్యామునికి భవభూతి ద్రావిడుడు అని తెలుసు అందుకే ఆ విధంగా చెప్పివుంటాడు. విదర్భదేశం ఆంధ్రదేశానికి సరిహద్దుల్లోనే వున్నది. ఎందరో ఆంధ్రులు ఈ సరిహద్దుదేశంలో స్థిరపడి వుంటారు. వాకాటకరాజుల కాలంలో పద్మపురం మహోన్నత దశలో వున్నది. వాకాటకరాజులు బ్రాహ్మణ మతస్థులు. వైదిక మతానుయాయులైన ఆంధ్ర బ్రాహ్మణులెందరో పోయి ఆ రాజుల ప్రాపున వుండి వుంటారు. పద్మపురంలో భవభూతి వంశ పరంపరకు చెందిన మహారాష్ట్ర బ్రాహ్మణులు ఇప్పటికి వున్నారని డా. భండార్కర్ అన్నాడు. అసలు విరద్భదేశంలో మహారాష్ట్ర భాష ప్రచలితంగా లేదు. మరి మహారాష్ట్ర బ్రాహ్మణులు అదీ భవభూతి వంశీయులు డా. భండార్కర్‌కు కనబడటం ఆశ్చర్యంగా వున్నది. ఒకవేళవున్నా ఆంధ్రబ్రాహ్మణులు అక్కడ తరతరాలనుంచి స్థిరపడిపోయి అక్కడిభాష మాట్లాడటంతో అక్కడివారమని ఇప్పుడు చెప్పుకోవటంలో ఆశ్చర్యమేమి లేదు. భవభూతి "ఉదుంబరనామానో బ్రాహ్మవాదినః" అని ఉదుంబర అనే పేరుగల బ్రాహ్మణులకు చెందినవాడనని చెప్పుకొన్నాడు. ఉదుంబరను ఇక్కడ ఇంటిపేరుగా కాక వేరువిధంగా ఎట్లా తీసుకోవటానికి వీల్లేదు. గోత్రప్రవరశాఖ సూత్రాలేకాక తెలుగు బ్రాహ్మణులల్లో ఇంటి పేరు కూడ ఉంది. "ఉదుంబర నామనో" (ఉదుంబర పేరు గలవారు) అని భవభూతి చెప్పిందానికి వేరే అర్థమేమి చెప్పటానికి సాధ్యం కాదు కాబట్టి "ఉదుంబర" పదాన్ని కవి ఇంటిపేరుగానే గ్రహించటం సమంజసం. ఈ విధంగా ఇంటి పేర్లుండటం మహారాష్ట్రుల్లో లేదు. అటువంటప్పుడు భవభూతి తెలుగువాడే అనటంలో ఎటువంటి సందేహం వుండకూడదు.

## భవభూతి రచనలు

భవభూతి రచనలుగా మూడు నాటకాలు ప్రసిద్ధమైనవి - మహావీరచరిత్ర, మాలతీమాధవం, ఉత్తరరామచరిత్ర. ఉత్తరరామ చరిత్ర అతని పరిపక్వ రచన అనటంలో ఎటువంటి సందేహం లేదు. కాని మొదటి రెండు నాటకాలల్లో ఏది ముందు వ్రాసాడన్న విషయంలో పండితుల్లో అభిప్రాయబేధమున్నది. రామాయణ కథనంతా నాటకాలుగా వ్రాయదలచి భవభూతి మహావీర చరిత్రను మొదట వ్రాసాడని అది ప్రజాదరణ పొందకపోవటంతో నిరాశచెంది కల్పిత కథతో కూడిన మాలతీమాధవాన్ని రచించాడని అంటారు. మాలతీమాధవం కొంత ఆదరణను సంపాదించింది. తర్వాత ఆత్మవిశ్వాసంతో భవభూతి ఉత్తరరామ చరిత్రను వ్రాసాడంటారు. అట్లాకాదు, రచనాభ్యాసం కొరకు మొదట అతడు కల్పిత కథగల మాలతీమాధవం వ్రాసాడని, తర్వాత రామాయణాన్ని నాటకాలుగా మలచదలచి మహావీరచరిత్ర. ఉత్తరరామచరిత్రలు వ్రాసాడని, వాటిల్లో మహావీరచరిత్ర అంతగా ఆదరణ సంపాదించలేదని అంటారు. మాలతీమాధవం మొదటి రచన కాబట్టే కవి దానిలో తన పరిచయాన్ని దీర్ఘంగా ఇచ్చాడు; మహావీరచరిత్రలో తాను "వశ్యావాచః, కవేర్వాక్యమ్" అని ఆత్మవిశ్వాసంతో రెండవ రచన కాబట్టి చెప్పుకొన్నాడని వీరి అభిప్రాయం. కాని మాలతీమాధవం కన్న ముందు కవి ఏదో రచన చేసి వుంటాడు. దాన్ని సామాజికులు మెచ్చుకోలేదు. అందుకే "కేనామ కేచిదిహ" అన్న శ్లోకంలో వాపోయాడు. అంతేగాక తర్వాత రచనల్లో వున్న భావప్రౌఢత, పాత్ర చిత్రణానైపుణ్యం మహావీరచరిత్రలో లేదు. కాబట్టి భవభూతి నాటక త్రయంలో మహావీరచరిత్రనే మొదటి రచనగా అంగీకరించటం సమంజసంగా వుంటుంది.

భవభూతికి రామాయణ కథ అంటె మహాప్రీతి. తన మూడు నాటకాలల్లో రెండు నాటకాలను రామాయణ కథేతివృత్తంతోనే రచించాడు. భవభూతి ఆశ్రయదాత యశోవర్మ సాహిత్య ప్రియుడు, కవిపోషకుడే కాక అతడు స్వయంగా కవి. అతడు రాముని చరిత్రను తీసుకొని రామాభ్యుదయమనే నాటకాన్ని వ్రాసాడని దశరూపకాదుల్లోని ఉద్ధరణలను బట్టి తెలుస్తున్నది. యశోవర్మ రామచరిత్రాభిమానిగా కన్పిస్తున్నాడు. అందుకే అతడు భవభూతిని ఆదరించి వుంటాడు. భవభూతి మూడు నాటకాలు కూడ కాలప్రియనాథోత్సవ సందర్భంలోనే ప్రదర్శింపబడినట్లు వాటి ప్రస్తావనలను బట్టి తెలుస్తున్నది. కాబట్టి భవభూతి మూడు నాటకాలను వ్రాసింతార్వాత, వృద్ధావస్థలో యశోవర్మ గౌరవాదరలణాలను పొందాడని విమర్శకులు అభిప్రాయపడుతున్నారు. లేకపోతే యశోవర్మ ఆస్థానంలో వుండి

భవభూతి నాటకాలను వ్రాసి రాజు సమక్షంలో కాక కాలప్రియనాథోత్సవంలో వాటిని ప్రదర్శింపజేసాడంటె అది అంత సమంజసంగా లేదని వారి అభిప్రాయం. నాటకకారునిగా కీర్తిని సంపాదించుకొన్న భవభూతిని గూర్చి వినియశోవర్మ భవభూతిని ఆదరించి వుంటాడు.

భవభూతి ముక్తకాలను కొన్నిటిని ఆలంకారికులు, శ్లోక సంగ్రహకర్తలు ఉద్ధరించారు. భవభూతి మూడు నాటకాలను యశోవర్మ ఆస్థానంలో చేరకముందే వ్రాసాడని, ఆ ముక్తకాలను అతడు యశోవర్మ ఆస్థానంలో వున్నప్పుడు వ్రాసి వుంటాడని మిరాశి అభిప్రాయం. "తథైవ విచిత్ర వక్రత్వం విజృంభితం.... భవభూతి రాజశేఖర విరచితేషు బంధసౌందర్య సుభగేషు ముక్తకేషు పరిదృశ్యతే" అని వక్రోక్తి జీవితంలో కుంతకుడన్నాడు కూడ.

## మహావీర చరిత్ర

ఈ నాటకంలో 7 అంకాలున్నవి. 7 అంకాలల్లో 5వ అంకంలోని 46వ శ్లోకం వరకు లభించిన లిఖిత ప్రతులన్నీ ఒక్కతీరుగా వున్నవి. తర్వాత భిన్నిస్తున్నవి. అట్లా భిన్నించే ప్రతులను దక్షిణాది, ఉత్తరాది, ప్రతులని రెండుగా విభజించవచ్చును. ఉత్తరాది ప్రతిని వినాయకుడనేవాడు వ్రాసాడు. దక్షిణాది ప్రతిని సుబ్రహ్మణ్యుడు వ్రాసాడు. ఏ కారణంచేతనో 5వ అంకం 46 వ శ్లోకం తర్వాత నాటకం కొంత నష్టం కావటంచేత ఈ కవులు నాటకాన్ని వేరువేరుగా పూర్తిచేసి వుంటారు. ఒకవేళ భవభూతి అంతవరకే వ్రాసి ఆపాడేమో కూడ చెప్పలేముకాని ఈ ఊహ అంత బలంగా లేదు. ఎందుకంటె నాటకాన్ని 5వ అంకంలో కవి ఆపివేసి మరో నాటకాన్ని వ్రాయటానికి పూనుకోవటం అసంభావ్యంగా కన్పిస్తుంది.

భవభూతికి వాల్మీకి అన్నా రామాయణమన్నా గౌరవం అందుకే రామాయణ కథను నాటకాలుగా వ్రాయటానికి పూనుకొని పూర్వ రామాయణ కథను మహావీర చరిత్రగా రచించాడు. దీనిలో చాలావరకు కవి వాల్మీకి కథనే అనుసరించినా రెండు మూడు మార్పులను చేసాడు - 1) సీత ఊర్మిళలు వివాహానికి పూర్వం విశ్వామిత్రుని ఆశ్రమానికి వచ్చి రామలక్ష్మణులను చూస్తారు. సీతారాములకు మొదటి చూపులోనే ప్రేమోదయం కలుగుతుంది. రాముడు విశ్వామిత్రుని ఆశ్రమంలోనే శివధనుస్సును విరుస్తాడు. 2) మాల్యవంతుడు రావణుని మంత్రి. అతడు రామున్ని అణచివేయాలని ఎత్తుకు పైయెత్తులు వేస్తుంటాడు. అతని ప్రేరేపణతోనే పరశురాముడు, వాలి రామునిమీదికి వస్తారు.

శూర్పణఖ ప్రభావంతో మంథర రామున్ని అడవులకు పంపుతుంది. ఈ నాటకంలో కైకేయి ఉదాత్తమైన పాత్ర. ఈ మార్పువల్ల కథ కొత్తమలుపు తిరిగింది. కథాసంవిధానంలో ఐక్యతను (unity of plot) తేవటానికి కవి మాల్యవంతుని పాత్రను సృష్టించివుంటాడు. మొత్తం మీద నాటకీయత కొరకు చేసిన ఈ రెండు మార్పులు కథనంతా మార్చివేసినవి. ఇవి ప్రేక్షకులకు రుచించలేదేమో. అందుకే ఈ నాటకం ప్రజాదరణకు దూరమైంది. అదీగాక నాటకం ప్రౌఢశైలిలో వుండటం చేత అందరి అవగాహనకు దూరమై వుంటుంది.

మహావీర చరిత్రలో కవి రామున్ని ఒక మానవ మహావీరునిగానే చిత్రించాడు. అందుకే నాటకానికి మహావీర చరిత్ర అని పేరుపెట్టాడు. దీనిలో ప్రధాన రసం వీరం. వీర రస పోషణ నాటకంలో చక్కగా జరిగింది. కథా సంవిధానంలో లోపంవున్నా పాత్ర చిత్రణ, రస పోషణలో కవి నేర్పును చూపాడు. వీర రౌద్రబీభత్స దృశ్యాలల్లో కవి శార్దూలవిక్రీడిత, స్రగ్ధరావృత్తాలను, శృంగార కరుణసన్నివేశాలల్లో వసంత తిలక, మాలిని, మందాక్రాంతాలను వాడాడు. వీరాది రస పోషణకు సమాసభరితమైన శైలిని శృంగారాది రసోపోషణకు లలితమైన శైలిని కవి ప్రయోగించాడు.

వాల్మీకి కాళిదాసుల రామాయణ కథలకన్న కొంచెం భిన్నంగా భవభూతి మహావీర చరిత్ర నాటక కథను నడిపి కొత్తదనాన్ని చూపాడు. ఆ కొత్తదనాన్ని మెచ్చుకొనే సహృదయత సామాజికుల్లో, ఆలంకారికుల్లో లేకపోయింది. అదే నాటకాన్ని అసఫలం చేసింది. ప్రసిద్ధ కథలో తాను తెచ్చిన కొత్తధనాన్ని ఆదరించలేదని కాబోలు భవభూతి తర్వాత మాలతీమాధవం వంటి కల్పితకథను చేపట్టి ప్రజాదరణకు ప్రయత్నించి వుంటాడు. దాని ప్రస్తావనలో "యేనామ కేచిదిహ" అన్న శ్లోకంలో ఎప్పుడో అప్పుడు ఎక్కడో అక్కడ తనకు గుర్తింపు, ఆదరణలు లభిస్తాయని అతడు ఆశించాడు. మహావీరచరిత్ర నిరాదరింపబడటంతో అతని హృదయం బాధపడి తన ప్రతిభ ఎన్నడైనా ఎక్కడన్నా గుర్తింపబడక పోదు అని వాపోయివుంటాడు.

## మాలతీ మాధవం

ఇది ప్రకరణం. అంటే కల్పితేతివృత్తంతో తేలికగా నడిచే రూపకం. మహావీరచరిత్ర వంటి వీరరస ప్రధానమైన గంభీర నాటకం అసఫలం కావటంతో సర్వజనాదరణను పొందే శృంగార రసంతో కూడిన అద్భుత సంఘటనలతో నిండిన మాలతీమాధవ ప్రకరణ రచనకు భవభూతి ప్రయత్నించి వుంటాడు. దీనిలో 10 అంకాలున్నవి. పద్మావతిపుర మంత్రి భూరి

వసువు. భూరివసువు కూతురు మాలతి. మదనోత్సవ సమయంలో ఆమె మాధవుని చూచి ప్రేమిస్తుంది. మాధవుడు కూడా ఆమెను ప్రేమిస్తాడు. ఇద్దరూ కలుసుకోవాలని ప్రయత్నిస్తారు. కామందకి అనే బౌద్ధ సన్యాసిని మాలతీ మాధవుల వివాహానికి ప్రయత్నిస్తుంది. ఇంకొకవైపు భూరి వసువు మాలతి వివాహాన్ని నందనునితో చేయాలనుకొంటాడు. శివమందిర సమీపంలోని అశోకవనంలో మాలతీ మాధవులు కలుసుకునేటట్లు కామందకి ఏర్పాటు చేస్తుంది. మాధవుడు ముందే వచ్చి దాక్కొంటాడు. ఇంతలో మాలతి సఖితో అక్కడికి వస్తుంది. వాళ్ళిద్దరు కలుసుకోకముందే బోనులో నుంచి తప్పించుకొని వచ్చిన సింహం అక్కడికి వస్తుంది. దాంతో అందరూ అటు యిటు పరుగెత్తుతారు. అప్పుడు అక్కడికి మకరందుడు వచ్చి దాన్ని చంపి మూర్ఛిల్లుతాడు. మూర్ఛ నుంచి తేరుకొని మాలతితో వచ్చిన ఆమె సఖిని మదయంతికను చూసి ప్రేమిస్తాడు. ఇంతలో అఘోరఘంటుడనే కాపాలికుడు కరాళదేవికి బలిగా మాలతిని ఎత్తుకొని పోతాడు. మాలతి భయంతో అరుస్తుంది. అక్కడే శ్మశానంలో వున్న మాధవుడు వచ్చి అఘోరఘంటున్ని చంపి మాలతిని రక్షిస్తాడు. తన గురువు అఘోరఘంటున్ని చంపాడని కపాలకుండల ప్రతీకారం తీర్చుకోవాలని అనుకుంటుంది. కామందకి మకరందునికి మాలతివేషం వేయించి భూరి వసువు ఇంటికి పంపుతుంది. అక్కడ ఆమెకు నందనునితో వివాహం జరుగుతుంది. నిజమైన మాలతికి మాధవునితో శివమందిరంలో వివాహం జరుగుతుంది. వధువు మాలతి రూపంలో వున్న మకరందుని చేతిలో నందనుడు బాగా తన్నులు తింటాడు. దానితో ఉక్రోషంతో నందనుడు వెళ్ళిపోతాడు. అప్పుడు వదినకు నచ్చచెప్పాలని మకరందిక వస్తుంది. మాలతి వేషంలో వున్నది మకరందుడని తెలిసి సంతోషిస్తుంది. తర్వాత మదయంతికను ఎత్తుకొని పోయాడనే నేరంమీద రాజభటులు మకరందున్ని బంధిస్తారు. తన మిత్రున్ని రక్షించేందుకు మాధవుడు మాలతిని ఉద్యానవనంలో ఒంటరిగా విడిచిపెట్టిపోతాడు. తగిన అదనుకొరకు వేచివున్న కపాలకుండల వచ్చి మాలతిని ఎత్తుకొని శ్రీపర్వతం తీసుకొనిపోతుంది. మాధవ మకరందులు రాజభటులతో పోరాడుతారు. సాహస పరాక్రమాలకు మెచ్చి రాజు వారిని విడిచివేస్తాడు. తర్వాత కామందకి బుద్ధి నైపుణ్యంతో మాలతిని రక్షిస్తుంది. మాలతీ మాధవుల, మదయంతిక మకరందుల వివాహంతో నాటకం సుఖాంతమౌతుంది.

సోమదేవుని కథాసరిత్సాగంలోని, క్షేమేంద్రుని బృహత్కథామంజరిలోని మదిరావతి కథే భవభూతి మాలతీమాధవానికి మూలస్రోతస్సు అని విమర్శకుల అభిప్రాయం. కాని

మూల బృహత్కథలో ఈ మదిరావతి కథ వున్నదో లేదో తెలియదు. ఒకవేళ బాణుని కాదంబరి కథను సోమదేవుడు గ్రహించి కథా సరిత్సాగరంలో చేర్చినట్లుగానే భవభూతి కథను కూడ చేర్చాడేమో చెప్పలేము. అయినా ఇటువంటి కథల్లో కొన్ని సమాన ధర్మాలుంటవి. మాంత్రికుడు నాయికను ఎత్తుకొని పోవటం, మారువేషాలు చాలా కథల్లో కన్పిస్తవి. కొన్ని కథల ఆధారంగా మరొక కొత్త కథ సృష్టింపబడవచ్చును కూడ. కథా నిర్మాణంలో, మాధవ మకరందుల కథలను రెండింటిని సమానాంతరంగా నడపటంలోను భవభూతి నైపుణ్యాన్ని చూపాడు. పాత్ర చిత్రణ కూడ సజీవంగా వున్నది. మాలతి, మాధవ, మకరంద, కామందకి, మదయంతిక, లవంగిక, సౌదామిన్యాది పాత్రలు వైవిధ్యంతో చిత్రింపబడినవి. బౌద్ధ సన్యాసిని కామందకి మాళవికాగ్ని మిత్రంలోని బౌద్ధ సన్యాసిని కౌశికి పాత్రను తలపిస్తున్నది. కౌశికి కన్న కామందకి బుద్ధి చాతుర్యం కలది. నాయికా నాయకుల ప్రేమ ఫలించటంలో ఆమె పాత్ర చాల వున్నది. ప్రకరణమైనా దీనిలో విదూషక పాత్ర లేదు. శృంగార మంగి రసం. బీభత్స రౌద్రాదులు అంగరసాలు. మాలతీమాధవ కథాసంవిధానాన్ని అనుసరిస్తు తర్వాత మల్లికామారుతాది ప్రకరణాలు వ్రాయబడినవి.

## ఉత్తర రామ చరిత్ర

ఈ నాటకం నాటికి భవభూతి వ్యక్తిత్వంలో చాల మార్పు వచ్చినట్లు కన్పిస్తుంది. అతని వాక్కు ఇంకా పరిపక్వతను సంపాదించుకొన్నది. ప్రతి మాటను తూచి తూచి ప్రయోగించాడు కవి. వ్యర్థమైన మాట ఏదీ కనిపించదు. వాల్మీకి ఉత్తర రామాయణకథను తీసుకొని భవభూతి ఈ నాటకాన్ని రచించాడు. కథా సంవిధానంలో, నాటక శిల్పంలో కవి చూపిన నేర్పు అద్వితీయం. అందుకే "ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే" అని పేరును సంపాదించుకొన్నాడు. అంటె అతని మూడు నాటకాలల్లో కెల్లా ఉత్తర రామచరిత్ర విశిష్టంగా వున్నదని ఒక అర్థం. కాళిదాసాదుల నాటకాల కన్న ఉత్తర రామచరిత్ర విశిష్టంగా వున్నదని మరొక అర్థం.

వాల్మీకి కథ సీతామరణంతో విషాదాంతం కాగా భవభూతి సీతారాములను కలిపి సుఖాంతం చేసాడు. పద్మపురాణంలో రామాయణ కథ సుఖాంతంగానే వున్నది. దాన్నే భవభూతి తీసుకొన్నాడేమోనని డా. బెల్వల్కర్ అభిప్రాయం. కాని వి.వి. మిరాశి అభిప్రాయం ప్రకారం పద్మపురాణకారుడే ఉత్తర రామచరిత్ర కథను తీసుకొన్నాడు. కాళిదాసు శాకుంతలాన్ని అనుసరించి భవభూతి సుఖాంత కల్పన చేసి వుంటాడు. నిజమైన

స్వచ్ఛమైన ప్రేమ పరాజయం కావటం ఆయనకు నచ్చి వుండదు. అందుకే ఆ ప్రేమకు విజయాన్ని కల్పించాడు.

ఉత్తర రామ చరిత్ర 7 అంకాల నాటకం. **ప్రథమాంకం :-** రాముని ముగ్గురు తల్లులు అరుంధతితో ఋష్యశృంగానికి ద్వాదశ వర్ష యజ్ఞంలో పాల్గొనటానికి పోతారు. జనకుడు మిథిలకు తిరిగి పోవటంతో పితృ వియోగ దుఃఖంతో వున్న సీతను రాముడు ఊరడిస్తాడు. సీతకు వినోదం కలిగించటానికై లక్ష్మణుడు రాముని గత చరిత్ర చిత్రింపబడిన చిత్రపటాలను చూపిస్తాడు. ఆ చిత్రపటాలను చూసి సీత మళ్ళా అరణ్య ప్రాంతాన్ని సందర్శించాలని గంగాస్నానం చేయాలని కోరికను ప్రకటిస్తుంది. గర్భవతి సీత కోరికను నెరవేర్చమని రాముడు లక్ష్మణునికి చెప్తాడు. ఇంతలో దుర్ముఖుడు వచ్చి సీతను గురించిన లోకాపవాదాన్ని చెప్తాడు. రాముడు బాధపడ్తాడు. లక్ష్మణుడు సీతను అరణ్యానికి తీసుకొనిపోతాడు.

**ద్వితీయాంకం :-** ఆత్రేయి, వాసంతి మాటల ద్వారా సీత వాల్మీకి ఆశ్రమంలో కుశలవులను కన్నదని వారికి పుట్టుకతోనే జృంభకాస్త్రం సిద్ధించిందని తెలుస్తుంది. తమసానదీతీరంలో క్రౌంచపక్షిని వధించిన వ్యాధునికి వాల్మీకి శాపమిచ్చినట్లు, బ్రహ్మ ప్రత్యక్షమై వాల్మీకిని రామాయణ కావ్యాన్ని రచించమని ఆదేశించినట్లు, రాముడు సీత స్వర్ణప్రతిమను పత్నీ రూపంగా గ్రహించి అశ్వమేధయాగం చేసినట్లు ఆత్రేయి మాటల వల్ల తెలుస్తుంది. రాముడు శంభూకుని వధించి వానికి దివ్య రూపాన్నిచ్చినట్లు కూడ ఇక్కడే చెప్పబడింది.

**తృతీయాంకం :-** మురళ, తమసల సంభాషణము బట్టి లక్ష్మణుడు సీతను వనంలో విడిచిపెట్టి వెళ్ళిన తర్వాత ఆమె దుఃఖావేగంతో గంగానదిలో దుమికిందని ఆమెకు కవల పిల్లలు పుట్టారని తెలుస్తుంది. గంగాదేవి ఆ బాలురను వాల్మీకాశ్రమంలో తెచ్చి విడిచిపెడ్తుంది. లోకంలో ఎవరికీ సీత కనపడదని గంగాదేవి చెప్తుంది. సూర్యార్చన కొరకు పూలు తెంపుతూ సీత రంగస్థలం మీదికి ప్రవేశిస్తుంది. రాముడు కూడ ప్రవేశించి సీత కొరకు విలపిస్తు మూర్ఛిల్లుతాడు. తమస చెప్పటం వల్ల సీత రామున్ని స్పర్శిస్తుంది. ఆ స్పర్శతో మూర్ఛతేరుకొని రాముడు తిరిగి అయోధ్యకు పోతాడు.

**చతుర్థాంకం :-** రాముని ముగ్గురు తల్లులు, అరుంధతీ వశిష్ఠులు వాల్మీకి ఆశ్రమానికి వస్తారు. అక్కడ వారు కుశలవులను చూచి ఎవరని అడుగుతారు. తాము

వాల్మీకి శిష్యులమని ఆ బాలురు చెప్తారు. లక్ష్మణుని కొడుకు చంద్ర కేతువు ద్వారా రక్షింపబడే అశ్వమేధాశ్వాన్ని లవుడు అపహరిస్తాడు.

**పంచమాంకం:-** లవుడు చంద్రకేతువు సైనికులకు ఓడిస్తాడు. అప్పుడు లవుని చేత ప్రయోగింపబడిన జృంభకాస్త్రం అందరిని ఆశ్చర్యచకితులను చేస్తుంది.

**షష్ఠాంకం :-** లవునికి చంద్రకేతువుకు ఘోరయుద్ధం జరుగుతుంది. చివరికి రాముడు కూడా వస్తాడు. కుశలవుల పరిచయం అతనికి కలుగుతుంది. ప్రేమతో అతడు వారిని అలింగనం చేసుకుంటాడు. వారిలో సీత రూపచిహ్నాలను రాజ చిహ్నాలను చూసి ఆశ్చర్యపోతాడు. ఇంతలో వశిష్టుడు మొదలైన వారంతా అక్కడికి వస్తారు.

**సప్తమాంకం:-** దీనిలో గర్భాంకమనబడే అవాంతరనాటక కల్పనను కవి చేసాడు. గత సంఘటనలన్నీ ఇందులో చూపబడుతవి. సీతను గురించి తెలుసుకొని అందరూ ఆమెకు నమస్కరిస్తారు. సీతారాముల సంయోగంతో నాటకం సుఖాంతమౌతుంది.

ఉత్తరరామాయణంలో రాముని వృత్తాంతాన్ని తీసుకొని కవి నైపుణ్యంతో నాటకంగా మలిచాడు. దానికి కవి కల్పనాకుశలత తోడ్పడింది. నాటకీయత కొరకు కవి ఆత్రేయి, తరళ, వాసంతి, తమస వంటి పాత్రలను కల్పించాడు. అదే విధంగా మూలకథలో కవి నాటకకథాసంవిధానం కొరకు కొన్ని కొత్త సన్నివేశ కల్పనలను చేసాడు. మహావీరచరిత్రలోను భవభూతి నాటకసంవిధానం కొరకు కొత్త సన్నివేశ కల్పనలు చేసివున్నాడు. అదేవిధంగా ఈ నాటకంలోను కవి సాహసంతో కొత్త సన్నివేశ కల్పనలను చేసాడు. అయితే మహావీరచరిత్రలోని కల్పనలను సామాజికులు అంతగా ఆదరించినట్లుగా లేదు కాని ఉత్తరరామచరిత్రలోని కల్పనలను సామాజికులు ఆదరించి మెచ్చుకొన్నారు. ముఖ్యంగా తృతీయాంకంలో సీతారాముల సమావేశ కల్పన భవ్యమైన దాంపత్య ప్రేమను చిత్రిస్తు గొప్పగా వున్నది. అదేవిధంగా కథను సుఖాంతం చేసేఘట్టం కల్పన కూడ భవభూతి ప్రతిభాజనితమే. పాతాళలోకంలో సీత భూదేవి గంగలతో వుండటం, సీత ఎవరికి కనపడకుండ వుండటమన్న కల్పనలు కూడ భవభూతి స్వంతమే. ఈ నాటకంలో భవభూతి సీతారాముల పాత్ర చిత్రణలో ప్రదర్శించిననేర్పు అద్వితీయం. మహావీరచరిత్రలో రాముడు మహావీరుడు కాగా ఇందులో రాముడు ఆదర్శుడైన రాజు, భర్త, తండ్రి, గృహస్థునిగా కన్పిస్తాడు. చిన్నచిన్న సంఘటనలు, సంభాషణలల్లో సీతారాముల శీలాన్ని, ఉదాత్తగుణాలను, వ్యక్తిత్వాలను, పరస్పర పవిత్ర ప్రేమను కవి ప్రకటించాడు. భవభూతి

రాముడు, వాల్మీకి రాముని అంత కఠినుడు కాడు. వాల్మీకి రాముడు సీతను అరణ్యంలో విడిచిపెట్టి రమ్మనగా భవభూతి రాముడు ఆమెను వాల్మీకి ఆశ్రమ ప్రాంతంలో విడిచిపెట్టి రమ్మన్నాడు. మహావీరచరిత్రలో గాని ఉత్తరరామచరిత్రలో గాని సీత సున్నితమైన హృదయం కలదానిగానే కన్పిస్తుంది. భవభూతి మహావీరచరిత్ర, ఉత్తర రామచరిత్రల చేత ప్రేరేపితులై వీటిని ఆదర్శంగా తీసుకొని మూల రామాయణ కథలో మార్పులు చేస్తు నూతన కల్పనలతో తరువాత కవులు అనర్ఘరాఘవం, ప్రసన్నరాఘవం, ఉదాత్తరాఘవం, కుందమాల, బాలరామాయణం, ఛలితరామం, ఆశ్చర్యచూడామణి మొదలైన ఎన్నో నాటకాలను వ్రాసారు.

మొత్తంమీద భవభూతి కథాసంవిధానం, రసపోషణ కొరకై చేసిన మార్పులు బాగున్నవి. కాని కొన్ని చోట్ల అతడు చాల చిన్న విషయంలో జాగ్రత్త తీసుకోకుండ పొరపాట్లు చేసాడు - 1) ప్రథమాంకంలో - పట్టాభిషేకానంతరం జనకుడు వెళ్లిపోగా సీత విచారంతో వున్నదని వూరడించటానికి రాముడు వస్తాడు. రావణున్ని చంపిన రెండు, మూడు వారాలకే రాముని పట్టాభిషేకం అయోధ్యలో జరిగింది. ఆ ఉత్సవానికి వచ్చిన బంధుమిత్రులు వెళ్లి పోవటం నుంచి ఉత్తర రామచరిత్ర ప్రథమాంకం కథ ఆరంభమైంది. అప్పుడే సీత నిండుచూలాలని కవి సూచించాడు. లక్ష్మణుడు ఆమెను వాల్మీకి ఆశ్రమప్రాంతంలో విడిచిపెట్టగానే గంగానదిలో దూకుతుంది. అట్లా దూకినప్పుడే ఆమె ప్రసవించినట్లుగా కూడ చివరి అంకంలో కవి చెప్పాడు. వాల్మీకి రామాయణంలో పట్టాభిషేకం తర్వాత కొన్ని నెలలకు సీతాపరిత్యాగ వృత్తాంతం జరిగినట్లు చెప్పబడింది. 2) బాలుడైన చంద్రకేతువును అశ్వమేధాశ్వానికి రక్షకుడుగా పంపటం కూడ అంత సమర్థనీయంగా లేదని విమర్శకుల అభిప్రాయం. 3) వాల్మీకి రామాయణంలో కన్న రాముడు ఎక్కువ విరహ దుఃఖాన్ని అనుభవించినట్లు భవభూతి చూపాడు. ధీరోదాత్తుడైన రాముడు ఆ విధంగా విలాపం చేయటాన్ని కొందరు విమర్శకులు విమర్శించారు. కాని రాముని విరహ దుఃఖాన్ని చూపటంలో ఎక్కడా హద్దులుమీరి అనౌచిత్యాన్ని కవి ఆశ్రయించలేదని మాత్రం చెప్పవచ్చును. ఇక బాలున్ని చంద్రకేతువును పంపటం లవుడు బాలుడు కాబట్టి సమవుజ్జీగా వుంటారని కవి ఈ కల్పనచేసి వుంటాడు. ఇకపోతే సీత పట్టాభిషేక సమయానికే నిండుచూలాలని కవి సూచనమాత్రంగా చెప్పటంచేత సామాజికులకు ఆ పొరపాటు పెద్దగా కనిపించలేదు. భవభూతి ఇతర భవ్య కల్పనలముందు, అతని ప్రతిభాపూరిత రచనలో ఆ పొరపాటు దాగిపోయింది.

## భవభూతి కరుణరసప్రీతి

ఉత్తరరామ చరిత్రలో అంగిరసమేది అని నిర్ణయించేటప్పుడు అభిప్రాయ భేదం కన్పిస్తున్నది. విమర్శకులు కొందరు దీనిలో అంగిరసం విప్రలంభ శృంగారమన్నారు. మరికొందరు కరుణమన్నారు. నాయికానాయకుల దూరదేశ గమనం, శాపం మొదలైన వాటివల్ల కలిగే ఎడబాటు, తత్ఫలితంగా అనుభవించే దుఃఖం కరుణలుకరుణవిప్రలంభ మవుతుందని కరుణ అప్పుడు సంచారీ భావమవుతుందని జగన్నాథుని అభిప్రాయం. ఒకవేళ నాయికానాయకులు మరణించినా లేక వారిలో ఏ ఒక్కరు మరణించినా అది కరుణమౌతుంది. ఏ దేవత కరుణవల్లనైనా జీవిస్తే అప్పుడది కరుణవిప్రలంభమే అవుతుంది. విశ్వనాథుని అభిప్రాయం కూడా అదే. ఉత్తర రామచరిత్ర నాటకాంతంలో నాయికా నాయికులకు పునర్మిలనం జరిగింది. వాల్మీకి లాగ భవభూతి రామాయణ కథను దుఃఖాంతం చేయలేదు. సీతారాముల కథ దుఃఖాంతమైందని క్రౌంచ పక్షి వధ వృత్తాంతంవల్ల అవగతమౌతున్నది. వాల్మీకి సీతారాముల కథను కరుణరసమంగిగానే రచించాడు. కాని భవభూతి సీతారాములు తిరిగి కలుసుకొన్నట్లుగా కల్పన చేసాడు. సీతారాములు కలుసుకుంటారనే ఆశ చివరివరకు లేకపోవటంవల్ల మొదటంతా సామాజికులు కరుణరసాన్నే అనుభవిస్తారు కాని నాటకాంతంలో సీతారాముల కలయికను చూసిన తర్వాత ఆ కరుణం అంగరసంగా కరుణ విప్రలంభం అంగిరసంగాను అవుతుందని కొందరు పండితులు అభిప్రాయం. బాణుని కాదంబరిలో మహాశ్వేత పుండరీకుల వృత్తాంతంలో మహాశ్వేత దుఃఖం కరుణ విప్రలంభమని విశ్వనాథుడు నిర్ణయించాడు. ఆకాశవాణి మాటలవల్ల పుండరీకుడు పునర్జీవితుడవుతాడని తెలుస్తుంది. అతని రాక కొరకు ఎదురుచూసే మహాశ్వేత దుఃఖం కరుణరసంగా కాక కరుణ విప్రలంభంగా పరిణమించింది. కాని ఉత్తర రామచరిత్రలో సీతారాములు కలుసుకుంటారనే ఆశ ఏవిధంగాను వారికి లేదు. అది శాశ్వతంగానే పరిగణింపబడింది. నాటకం చివర వారి కలయిక హఠాత్తుగా జరిగింది. అది సామాజికులకు కొంత ఉపశమనాన్ని కలిగించినా అది రతి కింద మారటానికి సమర్థవంతంగా లేదు. కరుణరసం యొక్క స్థాయిభావం దుఃఖమే ఇంకా ప్రధానంగా వుంటుంది. అంతేగాక మొదటినుంచి కవి సీతారాముల దాంపత్య ప్రేమను శృంగార భావస్పర్శగాని కామవాసనగాని లేని దానిగా పోషిస్తూ వచ్చాడు. "ఇయం గేహే లక్ష్మీ ఇయమమృత వర్తిర్నయనయోః.....", "కిమపి కిమపి మందం మందమాసత్తి యోగాత్...." మొదలైన రాముని మాటల్లో ఎక్కడా శారీరకమైన ప్రేమ చెప్పబడలేదు. స్నేహసిక్తమైన సీతారాముల

ప్రేమ సామాజికుల్లో అలౌకికతనే నింపివేస్తుంది. అట్లా స్నేహబంధితులైన వారికి ఎడబాటుకలగటం, వారి పరస్పర విరహం, దుఃఖం ప్రేక్షకుల్లో కరుణరసాన్నే ఉద్గమింపజేస్తుంది. చివరకు వారి కలయిక కూడ రతిభావాన్ని సామాజికుల్లో స్థాయిభావంగా నిలవటం లేదు. మాటిమాటికి వారి ఎడబాసే స్మరింపబడి దుఃఖాన్ని కలుగజేస్తున్నది. రాముని స్నేహాతిసిక్తమైన ప్రేమ, విరహదుఃఖం సామాజికుల్లో శోకభావాన్నే మాటిమాటికి ఉద్భవింపజేస్తుంది. కాని రతి భావాన్ని కాదు. అభిజ్ఞాన శాకుంతలంలో దుష్యంతునికి అభిజ్ఞాన రూపమైన వుంగరాన్ని చూచిం తర్వాత శకుంతల స్మరణకు వస్తుంది. అప్పుడు అతడు ఆమె కొరకు విరహవ్యథను చెందుతాడు. అది శృంగార ప్రధానమైన నాటకం. కాబట్టి ఇది విప్రలంభ శృంగారం మనబడుతుంది. కాని రాముని విరహవ్యథ స్వచ్ఛమైన స్నేహ ప్రధానమైంది. కాబట్టి ఉత్తర రామచరిత్రలో అంగిరసం కరుణమనే చెప్పాలి.

భవభూతికి కరుణం అభిమాన రసంగా కన్పిస్తున్నది. వాల్మీకి ఉత్తర రామాయణ కథలో సీతపాత్రకు ప్రాధాన్యమిచ్చి దాన్ని సీత చరిత్రగా నడిపాడు. భవభూతి రామునికి ప్రాధాన్యమిచ్చి రాముని చరిత్రగా నడిపాడు. అంటె ఉత్తర రామ చరిత్ర నాయక ప్రధానమైంది. రాముని ధర్మప్రీతి దానివల్ల అతనికి ప్రియాతిప్రియమైన సీత నుంచి ఎడబాటు కల్గటం, అతని మనోవ్యథ, అసహ్యమైన విరహం వీటన్నిటిని భవభూతి వాల్మీకి కన్న సూక్ష్మంగా చిత్రించాడు. రావణుడు సీతను అపహరించుకొని పోయినప్పుడు రామునికి వియోగదుఃఖం కలిగింది. ఆ వియోగం శృంగార ప్రధానమైంది. మళ్లా సీత లభిస్తుందనే ఆశ వున్నది. కాని ఈ సీతావియోగం చేతులార తెచ్చుకొన్నది. ధర్మరక్షణ కొరకు జరిగింది. ఈ వియోగం శాశ్వతమైంది. నిరవధికమైన ఈ వియోగం కరుణరసానికి ఆలంబనమైంది. రాముడు ధర్మమూర్తిగా కాక ప్రేమ మూర్తిగా, స్నేహమూర్తిగా భవభూతి నాటకంలో దర్శనమిస్తాడు. మహావీరచరిత్రలో భవభూతి రామున్ని ఒక వీరునిగా చిత్రించాడు. అదే రాముడు ఉత్తరరామ చరిత్ర నాటికి పరిణత మనస్కుడైనాడు. ఇప్పుడాతడు రాజు, భర్త, తండ్రి, అయినా అతడు వాల్మీకి రామునివలె ధర్మ నిర్వహణతో బండబారిన హృదయం కలవాడు కాదు. స్నేహార్ద్ర హృదయంతో విలపించాడు. వాల్మీకి సీత పొందిన సామాజికుల సానుభూతినంతా ఉత్తరరామచరిత్రలో రాముడు పొందాడు. రాముడు ఈ నాటకంలో మూర్తీభవించిన కరుణమూర్తి అయినాడు. అరుదైన కరుణరసాన్ని అంగిరసంగా సమర్థవంతంగా పోషించి భవభూతి అజరామరమైన కీర్తిని సంపాదించుకొన్నాడు.

అయితే భవభూతి కరుణరసాన్ని అంగిగా చేసుకొని ప్రాచీన నాట్య సంప్రదాయాన్ని ఉల్లంఘించాడని చెప్పవలసి వుంటుంది. అట్లా ఉల్లంఘించాడని అంగీకరించటానికి ఇష్టపడనివాళ్ళు భవభూతి కరుణాన్ని కాక విప్రలంభ శృంగారాన్ని అంగిగా పోషించాడని కూడ అంటున్నారు. ధనంజయ, విశ్వనాథాదులు నాటకంలో శృంగార వీరరసాలను అంగిరసాలుగా పోషించాలని అంగీకరించారు. విశ్వనాథుడు శాంతాన్ని కూడ అంగిరసంగా అంగీకరించాడు. మిగతా రసాలను అంగరసాలుగానే పోషించాలని వారి మతం. ఈ ఆలంకారిక మతానికి విరుద్ధంగా భవభూతి ఉత్తరరామ చరిత్రలో కరుణ రసానికి పట్టం కట్టాడు. భవభూతి మొదటి రెండు నాటకాలల్లో ఆలంకారిక మతానుసారమే వీర శృంగార రసాలను అంగిరసాలుగా గ్రహించాడు. కాని ఉత్తరరామచరిత్రలో మాత్రం అతడు కొత్త మార్గాన్ని అనుసరించి కరుణరసాన్ని అంగిగా పోషించాడు. వాల్మీకి రామాయణం నుంచే అతనికి ప్రేరణ లభించి వుంటుంది. ధర్మ, ప్రేమల మధ్య నలిగిపోయిన రాముని అంతర్వేదనాపూర్ణ జీవితాంశం భవభూతిని ఆకర్షించి వుంటుంది. ఆ కథాంశాన్ని ఇతివృత్తంగా తీసుకొని అతడు కరుణ రసప్లావితమైన నాటకాన్ని వ్రాసాడు. ఇక్కడ వాల్మీకి రామాయణంలో లాగ కరుణరసాలంబన సీత కాక రాముడైనాడు. ధనంజయ, విశ్వనాథులు నాటకంలో కరుణ రసాన్ని అంగిగా చెప్పలేదు. కాని ఒక వేళ భవభూతికి పూర్వులైన ఆచార్యులెవరైనా అంగిగా అంగీకరించారేమో చెప్పలేము. భరతుడు ఒక్కడు మాత్రం నాటకంలో కరుణ రసం ప్రధానంగా వుండవచ్చునని కాని అది అద్భుతరసంతో పరిసమాప్తి చెందవలెనని చెప్పివున్నాడు. భరతుని వచనానుసారమే కావచ్చును భవభూతి నాటకం చివర అద్భుత రసాన్వితమైన గర్భాంక నాటకాన్ని కల్పించాడు. కాబట్టి భవభూతి కరుణరసాన్ని అంగిరసంగా గ్రహించటం పూర్తిగా లక్షణ విరుద్ధం కాదనే చెప్పాలి. ఆనందవర్ధనుడు రసాలల్లోకెల్లా కరుణం మధురతరమైందని ప్రశంసించి వున్నాడు -

శృంగారే విప్రలంభాఖ్యే కరుణే చ ప్రకర్షవత్
మాధుర్య మార్ద్రతాం యాతి యతస్తత్రాధికం మనః

భవభూతి వాచ్యంగా కూడ కరుణమే తన నాటకంలో ప్రధాన రసమని చెప్పి వున్నాడు. అంతర్గూఢ వ్యథతో కూడిన రాముడు కరుణరస పుటపాకం వంటివాడని భవభూతి అంటాడు -

అనిర్భిన్నో గభీరత్వాదంతర్గూఢ ఘనవ్యథః
పుటపాక ప్రతీకాశో రామస్య కరుణోరసః

భవభూతి కరుణ రసాభిమాని. కరుణరసం యొక్క గొప్పతనాన్ని ఎరిగిన వాడు. కరుణరస మహత్త్వాన్ని అతడు తన నాటకంలోనే ఇట్లా కీర్తించివున్నాడు-

ఏకో రసః కరుణ ఏవ నిమిత్త భేదాత్
భిన్నః పృథక్ పృథిగి వాశ్రయతే వివర్తాన్
ఆవర్త బుద్బుద తరంగమయాన్ వికారాన్
అంభో యథా సలిలమేవహి తస్సమగ్రమ్.

"కరుణ రస మొక్కటే రసం. మిగిలిన రసాలన్ని దాని యొక్క భేదాలే. ఒక్క రూపంగల జలమే ఆవర్త, బుద్బుద, తరంగ రూపాలను ధరిస్తూ తన మూల రూపం చెడకుండా వుంటుందో అదేవిధంగా కరుణరసం ఇతర విభావాదులవల్ల అనేక రకాలుగా రూపం ధరిస్తుంది. అయినా మూలరూపాన్ని మాత్రం విడువదు." ఈ శ్లోకాన్ని బట్టి భవభూతి కరుణ రసాభిమానేకాదు కరుణమొక్కటే రసమని అంగీకరించాడని తెలుస్తున్నది. శృంగారాది రసాలన్నీ కరుణ రూపాలే అని భవభూతి వాదం. రసానుభవ సమయంలో చిత్తద్రుతి (మనస్సు కరుగుట) జరుగుతుంది. చిత్తద్రుతి ముఖ్యంగా కరుణరసానుభవ సమయంలో జరుగుతుంది కాబట్టి కరుణమొక్కటే రసమని భవభూతి వాదంగా కన్పిస్తుంది. వాల్మీకికి మొట్టమొదట పక్షిదుఃఖాన్ని చూచినప్పుడు కవిత్వం బయటికి వచ్చింది. దాన్నే ఆనందవర్ధనుడు "శ్లోకః శోకత్వమాగతః" అని సిద్ధాంతం చేసాడు. భవభూతి అదే అంగీకరించి కరుణ మొక్కటే ప్రకృతి రసమని మిగిలినవన్ని వికృతరసాలని కరుణ రసానికి పట్టంకట్టాడు. భవభూతి కరుణరసాభిమాని కాబట్టే ఉత్తరరామచరిత్రలో దాన్ని అంగిగాచేసి పోషించాడు. అంతేగాని ఏదో ప్రమాదవశాత్తు ఉత్తరరామ చరిత్రలో కరుణ మంగిగా గ్రహింపబడలేదు. సంపూర్ణ రస పరిచితి జ్ఞానంతోనే భవభూతి కరుణరస పోషణ చేసాడు.

ఉత్తరరామచరిత్ర కథ ప్రథమాంకం నుంచే కరుణరసావిర్భావం బీజరూపంగా ఆరంభమై క్రమక్రమంగా వికాసం చెందుతూ వచ్చింది. ప్రథమాంకంలోని చిత్రసందర్శన సమయంలో సీత పంచవటిలో తాము అనుభవించిన దుఃఖాన్ని స్మరించుకొని పరితపిస్తుంది. తర్వాత దృశ్యంలో సీత రాముని తొడమీద శయనిస్తుంది. అప్పుడు అతడు ఆమెను చూచి "కిమస్యా న ప్రేయోయది పరమసహ్యస్తు విరహః" అని అనుకుంటాడు. విధి తన విలాసాన్ని చూపి ఆ విరహావస్థనే రామునికి ప్రసాదిస్తుంది. ఇక రెండవ అంకం నుంచి

సీతారాముల వేదనాభరిత జీవితం ఆరంభమౌతుంది. తృతీయాంకంలో కరుణరసం తన పరాకాష్ఠనందు కొన్నది. ధీరోదాత్తుడైన రాముడు తన హృదయాన్ని విప్పి సఖి సీత కొరకు విలాపం చేస్తాడు. మూర్ఛిల్లుతాడు. అతని వేదన రాళ్ళను కూడా కరిగించేటటువంటిదిగా కవి చిత్రించాడు. ధీరోదాత్త నాయకుడైన రాముడు ఆ విధంగా విలపించటం అనౌచిత్యంగా వున్నదని కొందరు తలచారు. కాని ఎంత ధీరోదాత్తుడైనా ఏకాంతంలోనైనా హృదయాన్ని విప్పి ఎప్పుడో అప్పుడు ఏడువక తప్పదు. "పూరోత్పీడే తడాగస్య పరీవాహః ప్రతిక్రియా" - "తటాకం నిండిపోయినప్పుడు కాలువలద్వారా నీళ్ళు బయటికి రావటమే దానికి కుశలం" హృదయంలో నిండి పోయిన శోకాతిరేకం కన్నీరు కార్చటంవల్ల కొంత ఉపశమిస్తుంది. ఇన్నాళ్ళు రాముని హృదయంలో దుఃఖం నిండి పోయి వున్నది. అయోధ్యా నగరంలో తన బంధు పరివారం ముందు అతడు ఏడ్వలేడు. అక్కడ అతని దుఃఖానికి మర్యాద అనే కట్టలు వేయబడినవి. శంభూకవధ కొరకై అతడు అరణ్యానికి వచ్చాడు. ఆ కార్యనిర్వహణ తర్వాత అతడు పంచవటిలో ప్రవేశించాడు. తాను సీతతో గడిపిన సంతోషదినాలు జ్ఞాపకానికి వచ్చినవి. ఆ జ్ఞాపకాలు అతని దుఃఖకవాటాలను తెరచేసినవి. ఇక్కడ భవభూతి ప్రవేశపెట్టిన సీత యొక్క స్పర్శ కల్పన అపూర్వమైంది. చల్లని స్నేహసిక్తమైన సీతాస్పర్శయే రామున్ని మూర్ఛనుండి తేర్చి దుఃఖోపశమనాన్ని కలిగిస్తుంది. ఈ అంకంలో సీతారాములకు పరస్పరమున్న అలౌకిక ప్రేమను కవి అద్భుతంగా చిత్రించాడు. సీత మీద ఎంత ప్రేమ వున్నా ధర్మం కొరకు తాను ఆమెను పరిత్యాగం చేయవలసి వచ్చిందని రాముడు వాసంతికి చెప్తాడు. ప్రజల ఆనందం కొరకు తాను ఆ పనిచేసానని రాముడు అంటాడు. తృతీయాంకం ఉత్తరరామ చరిత్ర నాటకంలో ప్రముఖమైంది. కరుణరస పోషణ ఈ అంకంలో ఉన్నతశిఖరాలను అందుకొన్నది.

సంస్కృతసాహిత్యంలో కరుణరసం అంగిరసంగా ఒక్క ఉత్తరరామచరిత్ర నాటకంలోనే పోషింపబడి కన్పిస్తున్నది. ఆ పోషణ కూడ భవభూతి ఉత్తమంగా నిర్వహించాడు. కరుణరసాభివ్యంజనతో అతని కృతి అమరకృతిగా కీర్తిని సంపాదించుకొన్నది. "కారుణ్యం భవభూతిరేవ తనుతే" అన్న కీర్తి భవభూతికి సాహిత్యలోకంలో వచ్చింది.

## ఉత్తర రామచరిత్ర ఒక "ట్రాజెడి"

ఉత్తరరామచరిత్ర గ్రీకు ట్రాజెడీల కోవకు చెందిందని చెప్పవచ్చును. నాటకం చివర ప్రధానపాత్రలన్నీ చావటం, చంపబడటం గ్రీకుట్రాజెడీ నాటకాల లక్షణం కాదు. ఈ

అభిప్రాయం తర్వాత తర్వాత ఏర్పడినటువంటిది. కాని గ్రీకులో ట్రాజెడీ అంటె ఉదాత్తేతివృత్తం కలది. విధివక్రించటం చేత నాయకుడు బాధల ననుభవించటం దీనిలో కన్పిస్తుంది. విధియొక్క కబంధహస్తాన్ని తప్పించుకోవటం మానవుల చేతిలో లేదు. ఉత్తర రామచరిత్రలో విధి ధర్మరూపాన్ని ధరించి వచ్చింది. రాముడు ధర్మరక్షణకు ప్రజల ఆనందంకొరకు ప్రియాతిప్రియమైన సీతను, ఎవరి విరహం తనకు ప్రపంచంలో సహింపరానిదని అనుకున్నాడో ఆమెనే చేతులారా పరిత్యజించవలసి వచ్చింది. అట్లా తనకుతానే త్యజించిన సీతతో మళ్ళా సంయోగం భవిష్యత్తులో అసంభవమైంది. ఆ వియోగం రామునికి భరింపరానిదైంది. అతని మనోవ్యథ, హృదయపీడ కరుణాత్మకమైంది. అసాధ్యమైన పరిస్థితులవల్ల సీతారాముల కలయిక సంభవమయ్యేదికాదు. ఇది ఎవరి మనస్సులనైనా పిండివేస్తుంది. శాకుంతల నాటకంలో విధి వక్రించటంచేత శకుంతలా దుష్యంతులకు విరహదుఃఖం కలిగింది. అదికూడ ఉదాత్తేతివృత్తం గల 'ట్రాజెడి' నాటకమే. ఉత్తరరామచరిత్రలోని సీతారాముల విరహం స్నేహాత్మకమై కరుణరసంగా పరిణమించింది. శకుంతలాదుష్యంతుల విరహం శృంగారాత్మకమై విప్రలంభశృంగారంగా పరిణమించింది. అందుచేత కరుణరసాత్మకమైన సీతారాముల కథ ఇంకా గ్రీకు 'ట్రాజెడీ' ప్రక్రియకు దగ్గరైంది.

## భవభూతి ప్రణయ చిత్రణ

భవభూతి స్వచ్ఛమై, పవిత్రమైన ప్రణయాన్ని చిత్రించాడు. అతని స్వచ్ఛమైన ప్రణయ చిత్రణకు మూలాధారాలు రామాయణ మహాభారతాలే అని చెప్పాలి. కాళిదాసు శకుంతలాదుష్యంతుల హద్దులు లేని ప్రేమను భవభూతి ఆదర్శంగా తీసుకోలేదు. వివాహబంధంగా పరిణమించే ప్రేమను, సంయమితమైన దాంపత్య ప్రేమను అతడు చిత్రించాడు. మహావీర చరిత్ర వీరరస ప్రధానమైంది. మాలతీమాధవంలో స్త్రీ పురుషుల ప్రేమ కష్టాలనన్నిటిని దాటి వివాహబంధంతో ముగిసింది. మాలతీమాధవంలో కూడ భవభూతి ఉన్ముక్తమైన స్వేచ్ఛా ప్రణయాన్ని చిత్రించలేదు. ఉత్తరరామ చరిత్రలో అతడు చిత్రించిన సీతారాముల ప్రణయం కామప్రవృత్తి గల ప్రణయం కాదు. అది దివ్యమైన దాంపత్య ప్రణయం. నిజమైన ప్రణయం ఎటువంటిదో భవభూతియే నిర్వచించి ఇట్లా చెప్పాడు -

అద్వైతం సుఖ దుఃఖయో రనుగతం సర్వాస్వవస్థాసు యత్
విశ్రామో హృదయస్య యత్ర జరసా యస్మిన్న హార్యోరసః
కాలేనావరణాత్యయాత్ పరిణతే యత్స్నేహసారే స్థితం
భద్రం ప్రేమ సుమానుషస్య కథమప్యేకం హితత్ప్రాప్యతే.

"నిజమైన ప్రేమ సుఖదుఃఖాలల్లో ఒక్క తీరుగా వుంటుంది. విపత్తిలో గాని ఆపదలోగాని సమానంగా వుంటుంది. హృదయానికి అనిర్వచనీయ సుఖశాంతిని కలిగిస్తుంది. వృద్ధావస్థ వచ్చినా సరసతకేమి లోటు వుండదు. చాలా కాలం కావటం చేత లజ్జాసంకోచాల ఆవరణ తొలగిపోవటం చేత పరిపక్వమైన స్నేహం మాత్రమే మిగులుతుంది." భారతీయ సంప్రదాయ గతమైన గృహస్థ జీవితంలోని భార్యాభర్తల ప్రేమను భవభూతి భవ్యంగా చిత్రించాడు. స్నేహమూలమైన పరిపక్వమైన దాంపత్యప్రేమ చిత్రణను మరేకవి ఇంతగా సాధించలేకపోయాడు. మాలతీమాధవ రచనా కాలం నాటికే భవభూతి ఆదర్శ ప్రణయాన్ని గురించి ఒక నిశ్చితాభిప్రాయం కలవాడైనాడు -

ప్రేయో మిత్రం బంధుతా వా సమగ్రా
సర్వే కామాః శేవధి ర్జీవితం వా
స్త్రీణాం భర్తా ధర్మదారా శ్చ పుంసా
మిత్యన్యోన్యం వత్సయోర్ జ్ఞాతమస్తి.

"భార్యాభర్తలు ఒకరినొకరు మిత్రం, బంధువు అని అనుకుంటారో, ఒకరికోసంఒకరు సమస్త కోరికలను, సంపత్తిని చివరకు ప్రాణాలను కూడ త్యజించటానికి సిద్ధమౌతారో, స్వార్థ గంధం లేనిది, స్థిరమైంది, రానురాను అధికమవుతూ ఇద్దరికి ఆనంద దాయకమయ్యేదే ఆదర్శ దాంపత్య ప్రణయ" మని భవభూతి అభిప్రాయం. ఈ ఆదర్శ దాంపత్య ప్రణయాన్నే అతడు తర్వాత ఉత్తరరామచరిత్రలో సీతారాములలో చిత్రించి ఆజరామరం చేసాడు. ఇటువంటి ఆదర్శ దాంపత్య ప్రేమ సంతానం చేత మరింత గట్టిపడుతుంది. సంతాన విహీనమైన కాముకతతో కూడిన దాంపత్యజీవితం భవభూతికి ఆదర్శం కాదు. నిఃస్వార్థమైన స్వచ్ఛమైన ప్రణయమే అతనికి ఆదర్శం. సంతానం దంపతుల స్నేహానురాగాలను దృఢం చేసే ఆనందగ్రంథి అని అతడు అంటాడు -

అంతఃకరణ తత్త్వస్య దంపత్యోః స్నేహ సంశ్రయాత్
ఆనందగ్రంథి రేకో ऽయ మపత్యమితి కథ్యతే.

ఆదర్శ భారతీయ దాంపత్య జీవితాన్ని భవభూతి తన నాటకంలో చిత్రించి వున్నాడు. అతడు చిత్రించిన ప్రణయం బాహ్యమైన రూపాన్ని ఆశ్రయించినట్టిది కాదు. అది అంతస్సౌందర్యాన్ని ఆశ్రయించినట్టిది. అందుకే భవభూతి ఎక్కడా సీత అవయవ సౌందర్యాన్ని వర్ణించటానికి పూనుకోలేదు. "ఇయం గేహే లక్ష్మీరియ మమృత వర్తిర్నయనయో!..." అని రామునిచేత సీత స్నేహశీలతనే వర్ణింపజేసాడు కవి. కాని శాకుంతలంలో దుష్యంతుడు శకుంతల సుకుమార బాహ్య సౌందర్యాన్ని అంగాంగ సౌష్టవాన్ని వర్ణించినట్లుగా కవి ఎక్కడా రామునిచేత వర్ణింపజేయలేదు. అంతస్సౌందర్యాన్ని ఆశ్రయించింది కాబట్టే భవభూతి చెప్పే దాంపత్య ప్రణయం రూప యౌవ్వనాలు నశించిన వృద్ధావస్థలో తరగదు. పైగా ఇంకా పరిపక్వతను చెంది ప్రౌఢమవుతుంది. అంతస్సౌందర్యాన్ని అభిమానించిన ప్రీతి లేక ప్రేమ స్వరూపాన్ని భవభూతి ఇట్లా ఉదాత్తంగా చిత్రించాడు -

వ్యతిషజతి పదార్థానాంతరః కో హేతు :
న ఖలు బహిరుపాధీన్ ప్రీతయః సంశ్రయంతే
వికసతి హి పతంగస్యోదయే పుండరీకమ్
ద్రవతి చ హిమరశ్మావుద్గతే చంద్రకాంతః

ప్రేమ బహిర్ కారణాలచేత పుట్టేదికాదు. సూర్యుడు ఉదయించగానే కమలాలు వికసిస్తవి. చంద్రుడు ఉదయించగానే చంద్రకాంతశిలలు ద్రవిస్తవి. అట్లా ఎందుకు జరుగుతుందో మనం చెప్పలేము. ప్రేమ సమస్త ప్రాణులల్లో, సమస్త పదార్థాలల్లో ఒకేతీరుగా వుంటుంది. అది స్వాభావికమైంది. స్వయం ప్రేరేపితమైంది. అది అనిర్వాచ్యమైంది. దాని రహస్యాన్ని కేవలం హృదయమే తెలుసుకోగలుగుతుంది- "స్నేహ శ్చ నిమిత్త సవ్యపేక్ష శ్చ ఇతి విప్రతిషి ద్వయేతత్." ఇట్లా భవభూతి ప్రణయ కారణాలను లోతుగా ఆలోచించి ప్రకృతిలో పదార్థాలకు ఎట్లా అవినాభావ సంబంధమున్నదో చూపి రెండు హృదయాలు బంధింపబడటానికి కూడ అదే అనిర్వచనీయ సంబంధమున్నదని వివరించాడు.

భవభూతి చిత్రించిన శృంగారం సరళమైంది. స్వాభావికమైంది. కామ వాసన లేంది. రాముడు తాను సీతతో జనస్థానంలో పర్ణకుటీరంలో గడిపిన రాత్రులను ఇట్లా స్మరిస్తాడు -

కిమపి కిమపి మందం మంద మాసక్తియోగాత్
ఆవిరళిత కపోలం జల్పతో ర్రక్రమేణ
అశిథిల పరిరంభ వ్యాపృతై కైక దోష్ణో :
అవిదితగతయామా రాత్రిరేవం వ్యరం సీత్.

ఇందులో పరిరంభణ, చుంబనాది శృంగార చేష్టలేవి చెప్పబడలేదు. సీతారాములు చెక్కిలికి చెక్కిలి చేర్చి ఒకరి చేతుల్లో ఒకరు వుండి మాటలు చెప్పుకుంటుంటే వారికి సమయజ్ఞాన ముండేదికాదు, ఎప్పుడో రాత్రులు గడిచిపోయేవి. అంటే రాత్రులే ముగిసేవి కాని వారి మాటలు ముగిసేవి కావని అర్థం. ఇటువంటి స్వచ్ఛమైన ప్రేమగల దంపతులకు విరహం సంభవిస్తే అది అసహ్యమవుతుంది. ఇట్లా పాత స్మృతులు ఎప్పుడైతే రామున్ని వేధించినవో అప్పుడు ఇక అతడు గాంభీర్యాన్ని ధరించలేకపోయాడు. రాముని విరహతీవ్రతను భవభూతి ఇట్లా వర్ణించాడు.

దళతి హృదయం శోకోద్వేగాద్ ద్విధా నతు భిద్యతే
వహతి వికలః కాయోమోహం న ముంచతి చేతనామ్
జ్వలయతి తనూమంతర్దాహః కరోతి న భస్మసాత్
ప్రహరతి విధిః మర్మచ్ఛేదీ న కృంతతి జీవితమ్.

"సీతా విరహ దుఃఖంతో రాముని హృదయం పగిలిపోవాలనుకున్నా పగిలిపోవటం లేదు. వ్యాకులమైన రాముని శరీరం మూర్ఛను పొందుతున్నది కాని చేతనావస్థను విడిచిపెట్టటం లేదు. హృదయంలో మండే సీత వియోగ దుఃఖాగ్ని శరీరాన్ని కాల్చేస్తున్నది కాని భస్మం చేయటం లేదు. క్రూరవిధి రాముని మర్మ స్థలాలను చేధిస్తున్నాడు. కాని అతని జీవితాన్ని అంతం మాత్రం చేయటం లేదు". రాముని హృదయవిదారకమైన విరహ దుఃఖాన్ని పాఠకుల హృదయాలను కదిలించేటట్లుగా చాల సహజంగా కవి వర్ణించాడు. ప్రణయ తీవ్రతలో రాముడు పొందే విరహదుఃఖాన్ని కూడ కవి పాఠకుల హృదయాలను ఛేదించేటట్లుగా వర్ణించాడు-

హాహాదేవి స్ఫుటతి హృదయం స్రంసతే దేహబంధః
శూన్యం మన్యే జగదవిరళ జ్వాల మంతర్జ్వలామి
సీ దన్నంధేతమసి విధురో మజ్జతీ వాంతరాత్మా
విష్వఙ్మోహః స్థగయతి కథం మందభాగ్యః కరోమి.

రాముడు తన గాంభీర్యాన్ని విడిచిపెట్టి సామాన్య మానవుని వలె రోదించాడు. "హా దేవి నీ విరహంతో నా హృదయం పగిలిపోతున్నది శరీరం శిథిలత నొందుతున్నది. ప్రపంచం శూన్య మౌతున్నది, నా హృదయాన్ని జ్వాలలు వేచుతున్నవి. నా దుఃఖితాత్మ గాఢాంధకారంలో కూరుకొని పోతున్నది. నలుదిశలా అంధకారం నన్ను ఆవరిస్తున్నది. మంద భాగ్యుడనైన నేను ఏం చేయాలి? ఎక్కడికి పోవాలి? " సాధారణంగా ఇటువంటి ప్రణయ తీవ్రతను, విరహ వేదనను కవులు స్త్రీలల్లో చిత్రిస్తారు. కాని భవభూతి రామునిలో చిత్రించి రాళ్ళనుకూడ ఏడ్పించాడు. అందుకే గోవర్ధనాచార్యుడు ఇట్లా అన్నాడు -

భవభూతేః సంబంధాత్ భూధరభూరేవ భారతీ భాతి
ఏతత్కృత కారుణ్యే కిమన్యథా రోదతి గ్రావా.

## భవభూతి ప్రకృతి చిత్రణ

కాళిదాసు ప్రకృతియొక్క లలిత మనోహరమైన రూపాన్ని తీసుకొని వర్ణించాడు. భవభూతి ప్రకృతియొక్క భయంకర రూపాన్ని తీసుకొని వర్ణించాడు. ఇద్దరి వర్ణనలు సహజంగా వున్నవి. భవభూతి జన్మస్థలం విదర్భ దేశంలోని పద్మపురం చుట్టుప్రక్కల పర్వతారణ్యాలున్నవి. ఇక్కడ కొంత కాలం కింద వరకు కూడా పెద్దపులులతో, పాములతో నిండిన దట్టమైన అరణ్యాలుండేవి. ఆ పరిసరాలల్లో పెరిగిన భవభూతి ఉత్తరరామ చరిత్రలో దండకారణ్య భయంకర రూపాన్ని సహజంగా వర్ణించగలిగాడు. భవభూతి కాళిదాసు వలెనే ప్రకృతి ప్రేమి. కాని కాళిదాసు సుందర దృశ్యాలను మాత్రమే వర్ణించగా భవభూతి సుందర దృశ్యాలతోపాటు భయంకర దృశ్యాలను కూడ వర్ణించాడు. సంస్కృత సాహిత్యంలో దాదాపు కవులందరూ ప్రకృతియొక్క మనోహర సుందర కోమల రూపాన్నే తీసుకున్నారు. వారి దృష్టి భయావహమైన ప్రకృతి వైపుకు పోలేదు. ఒకవేళ అక్కడక్కడా కవులు భయంకర రూపాన్ని గ్రహించి వర్ణించినా భవభూతి అంత సహజంగా ఎవరూ వర్ణించలేదు. భవభూతి ప్రకృతి వర్ణనను కేవలం ఆలంబన విభావనరూపంగా వర్ణించాడు. ఎక్కడా అసందర్భంగా, అనావశ్యకంగా ప్రకృతి వర్ణనలను అతడు చేయలేదు. అతడు వర్ణించిన ప్రకృతి దృశ్యాలన్ని దృశ్యరూపంగా పాఠకులకు గోచరించేటట్లుగా చిత్రపటం గీసి చూపినట్లుగా వర్ణించాడు. అతని ప్రకృతి చిత్రణలు అన్ని అతడు స్వయంగా దర్శించినటు వంటివి. అందుకే ఆ వర్ణనలన్నిటిని కవి అంత చిత్రాత్మకంగా రచించగలిగాడు.

భవభూతి స్వాభావికంగా గంభీరుడు. దుఃఖితాత్ముడు. అతనికి ప్రకృతి సౌమ్యంగా లలిత సుందరంగా కాక దాని నిజ స్వరూపంలో భయంకరమై గోచరించింది. భవభూతి చేసిన దండకారణ్యా వర్ణన -

నిష్కూజస్తిమితాః క్వచిత్క్వచిదపి ప్రోచ్చండసత్త్వస్వనాః
స్వేచ్ఛాసుప్త గభీరభోగభుజగశ్వాస ప్రదీప్తాగ్నయః
సీమానః ప్రదరోదరేషు విలసత్ స్వల్పాంభసోయాస్వయం
తృష్యద్భిః ప్రతిసూర్యకైరజగర స్వేదద్రవః పీయతే.

"దండకారణ్యం ఒకవైపు నిశ్శబ్దంతో నిండివున్నది. మరొకవైపు క్రూర మృగాల గర్జనలతో వ్యాపించివున్నది. ఒకచోట సుప్తభయంకర సర్పాల శ్వాసలతో ప్రజ్వలితమై అరణ్యంలో నిప్పు అంటుకొన్నది. అక్కడక్కడ చిన్న చిన్న గుంటల్లో నీళ్ళు మెరుస్తున్నవి. వేరొకచోట అతిపిపాసాకులమైన తొండలు జలాభావం చేత అజగరసర్పాల స్వేదజలాలను తాగుతున్నవి." భయావహమైన ప్రకృతియొక్క ఈ ప్రచండరూపం పాఠకుని ఒళ్ళును జలదరింపజేసేటట్లుగా వున్నది. మాలతీమాధవం పంచమాంకంలోని శ్మశానవర్ణనలోను భవభూతి ఇటువంటి భయంకరదృశ్యాన్నే చిత్రించివున్నాడు. ఉత్తరరామచరిత్రలో దండకారణ్యవర్ణనలో భవభూతి భయంకరప్రకృతి చిత్రణ భయావహంగానే కాక మనోహరంగా కూడ వున్నది -

గుంజత్కుంజ కుటీర కౌశిక ఘటాఘుత్కారవత్కీచక
స్తంబాడంబర బద్ధ మౌలి కులః క్రౌంచాభిధోయం గిరిః
ఏతస్మిన్ ప్రచలాకినాం ప్రచలితా ముద్వేజితాః కూజితైః
ఉద్వేల్లంతి పురాణ రోహిణ తరుస్కంధేషు కుంభీనసాః

"అస్పష్ట శబ్దాలు గల కుంజ కుటీరాలల్లోని గుడ్ల గూబల ధ్వనుల చేత కూడిన కీచక కాండాల శబ్దాల చేత నిశ్శబ్దం కావింపబడిన కాకుల సమూహంతో కూడిన క్రౌంచ పర్వతం మీద మయూరాల కేకలతో భీతిల్లిన సర్పాలు రోహణ వృక్షస్కంధభాగాల దగ్గర అటు యిటు చరిస్తున్నవి.

కండూలద్విప గండ పిండ కషణోత్కంపేన సంపాతిభిః
ఘర్మ స్రంస్రిత బంధ నైశ్చ కుసుమైరర్చంతి గోదావరీమ్

ఛాయాపస్కిరమాణ విష్కిర ముఖవ్యాకృష్ట కీట త్వచః
కూజత్క్లాంత కపోత కుక్కుట కులాః కూలే కులాయద్రుమాః

"నీడ కొరకై గోదావరీ తీర వృక్షాలను చేరిన కీటకాలు వృక్షాల బెరడులను తొలుస్తున్నవి. ఎండ వేడి చేత తపించే పావురాలు, అడవి కోళ్ళు ఆ చెట్ల మీద చేరి ధ్వనులు చేస్తున్నవి. నదీతీర ప్రదేశంలోని చెట్లకు ఏనుగులు దురదతో తమ చెక్కిళ్ళను రాయటం చేత ఆ చెట్లు కదలి రాలిన, వేడి చేత శిథిల వృంతాలు గల పూలతో గోదావరిని పూజిస్తున్నవి."

భవభూతి ప్రకృతిని భయంకరంగా చిత్రించిన తావులు ఎక్కువవున్నా లలిత సుందరమైన ప్రకృతికూడ అతనికి సుపరిచితమే. ఉత్తమరామ చరిత్రలో వాసంతి, తమసా, మురళి అనే నదులకు రూపధారణ చేసి కవి పాత్రలుగా ప్రవేశపెట్టాడు. నదులను జీవమూర్తులుగా దర్శించిన భవభూతి హృదయం ఒకొకసారి ప్రకృతియొక్క కోమలరూపాన్ని కోమలమైన పదాలల్లో వర్ణించి వున్నాడు -

ఇహ సమద శకుంతా క్రాంత వానీర వీరుత్
ప్రసవ సురభి శీత స్వచ్ఛతోయా వహంతి
ఫలభర పరిణామ శ్యామ జంబూనికుంజ
స్ఖలన ముఖరభూరి స్రోతసో నిర్ఝరిణ్యః

"నిర్ఝరిణులు ప్రవహిస్తున్నవి. వాటి తీరప్రదేశంలో వానీర లతలు వ్యాపించి వున్నవి. ఆ లతల మీద మధురకంఠాలు గల పక్షిగణాలు విహరిస్తున్నవి. ఆ పక్షులు కూర్చోవటంచేత పూలు రాలి ప్రవాహంలోపడి వాటి సువాసనలచేత జలాలు సుగంధిత మౌతున్నవి. పర్వతాల నుంచి ప్రవహించే ఆ నిర్ఝరిణుల నీళ్ళు సహజంగా శీతలమూ, స్వచ్ఛమూ అయినవి. వాటి ధారలు పండిన నల్లని ఫలాలతో కూడిన జంబూ వృక్షనికుంజాలను తాకటంచేత మిక్కిలి ధ్వనిస్తూ అనేక మార్గాలుగా ప్రవహిస్తున్నవి". ఒక్క శ్లోకంలో భవభూతి ఏదో ఒక చిన్న దృశ్యాన్ని గాని లేక వేరువేరు చిన్నచిన్న దృశ్యాలనుగాని అలంకార చమత్కారాన్ని ప్రయోగించి అందరు కవులవలె వర్ణించలేదు. ఒక సువిశాలమైన దృశ్యాన్ని సినిమా స్కోపులాగ అతడు అలంకారాల చమత్కార సహాయం లేకుండానే వున్నది వున్నట్లుగా పదాల రంగులతో చిత్రించి పాఠకుల ముందుంచుతాడు. స్పష్టమైన భావాలు, సరళమైన పదాలు ఈ ప్రకృతి దృశ్య చిత్రణలను వాస్తవికం చేయటానికి తోడ్పడినవి.

## భవభూతి నాటకకళ

భవభూతి రచనలు మూడు నాటకాలే. అతడు కాళిదాసువలె దృశ్యకావ్య రచనతోపాటు శ్రవ్యకావ్య రచనను చేపట్టలేదు. ఇదే ఆతని నాటకకళా ప్రీతిని ప్రస్ఫుటం చేస్తున్నది.

పూర్వ రామాయణ కథను నాటకంగా మలవటానికి భవభూతి మహావీర చరిత్రలో ప్రయత్నించాడు. అయితే విశాలమైన కథను వస్త్వైక్యం (unity of plot and action)తో కూర్చటంలో భవభూతి కొంతవరకు సఫలుడైనాడు. ఈ నాటకంమీద భాసుని అభిషేక, బాలచరిత్ర నాటకాల ప్రభావం కన్పిస్తున్నది. పాత్రచిత్రణ చక్కగా జరిగినా చాల సంఘటనలుగల పెద్ద కథను తీసుకోవటం వల్ల భవభూతి నాటక కళాదృష్టితో కౌశలాన్ని చూపించలేకపోయినాడనే చెప్పాలి. నాటకసంవిధాన దృష్టితో ఇది శిథిలంగా కన్పిస్తున్నది.

మాలతీమాధవం కథ కల్పితమైంది. ఈ ప్రకరణంమీద భాసుని అవిమారక నాటక ప్రభావం కన్పిస్తున్నది. కథ కల్పితమైనా ఇతర అనేక కథల ప్రభావం దీని మీద కన్పిస్తున్నది. భవభూతికన్న ముందు మృచ్ఛకటిక ప్రకరణం వ్రాయబడింది. మృచ్ఛకటికంవలె తేలికగా మాలతీమాధవం నడువలేదు. మృచ్ఛ కటికంలోని హాస్యధోరణి దీనిలో అసలే లేదు. మాలతీమాధవం కథ గంభీరంగా శృంగార బీభత్సరసాదుల సమావేశంతో నడిచింది. కథాసంవిధానంలో పునరుక్తులు బాగా వచ్చినవి. కథ అనావశ్యకంగా పొడిగింపబడి మెల్లగా నడుస్తుంది. మహావీరచరిత్ర వలెనే మాలతీమాధవం కూడ రంగస్థలంమీద అంతగా రాణించదగినట్లుగా లేదు.

ఉత్తరరామచరిత్ర నాటికి భవభూతి నాటక కళ ఉన్నత శిఖరాలనందుకొన్నది. ఈ నాటకం కేవలం పఠనయోగ్యంగానే కాక రంగస్థలంమీద ప్రదర్శించటానికి వీలుగా వున్నది. ప్రదర్శనకు యోగ్యంగానే కాక ప్రదర్శింపబడి ప్రేక్షకులను రసమగ్నులను చేసేటట్లు వున్నది. దీనిలో భవభూతి ఉత్తర రామాయణ కథను చాల నైపుణ్యంతో నాటకేతివృత్తంగా మలిచాడు. రాముని జీవితంలోని ప్రధాన ఘట్టాలను తీసుకొని కవి చక్కగా దృశ్యాలుగా విభజించి నాటకంగా ప్రస్తుతీకరించాడు. నాటకారంభంలో భవభూతి రామునిచేత ఈ విధంగా శపథం చేయించాడు-

స్నేహం దయాం తథా సౌఖ్యం యది వా జానకీమపి
ఆరాధనాయ లోకస్య ముంచతో నాస్తిమే వ్యథా

ఈ శ్లోకంలో నాటక బీజం కన్పిస్తున్నది. ఈ బీజంనుంచే రామునిచరిత్ర నాటకంలో అంకురించి విస్తరించింది. వాల్మీకి సీతచరిత్రను వ్రాయగా భవభూతి రాముని చరిత్రను ఈ నాటకంలో వ్రాసాడు. దుఃఖాంతమైన రామాయణ కథను సుఖాంతం చేయటం కూడ నాటక సంప్రదాయానికి అనుగుణంగానే జరిగింది. సుఖాంతం చేయటానికై భవభూతి సృష్టించిన గర్భాంక నాటకం అద్భుతంగావున్నది. ప్రథమాంకంలో చిత్రపటదర్శనం ద్వారా పూర్వకథా పరిచయం చేసే కల్పన కూడా నాటక కళా దృష్టితో చాల విశిష్టంగా వున్నది. సీతాపరిత్యాగం హఠాత్తుగా ప్రవేశపెడ్తే బాగుండదు. పూర్వ కథా పరిచయం ప్రేక్షకులను భావికథోన్ముఖులను చేసింది. రాముడు సీతావియోగం పరమ అసహ్యామైంది ("కిమస్యా న ప్రేయోయది పరమ సహ్యాస్తు విరహః) అని అనుకొంటున్నప్పుడే ప్రతీహారి ప్రవేశించి "దేవ! ఉపస్థితః" అని అనటం, దుర్ముఖుడు ప్రవేశించి సీతాజనాపవాద విషయం చెప్పటం మొదలైన పతాకసన్నివేశాన్ని భవభూతి చక్కగా రచించాడు. ఇక్కడ Irony కన్పిస్తుంది. ఏ విరహమైతే తనకు అసహ్యమని రాముడనుకుంటున్నాడో అది దుర్ముఖుని రూపంలో అప్పుడే ప్రవేశించటం Irony. విష్కంభమనే అర్థోపక్షేపకాన్ని కవి చాల నైపుణ్యంతో అంకాల నడుమ ప్రయోగించాడు. ప్రథమ ద్వితీయాంకాల నడుమ 12 సంవత్సరాలు గడచిపోయినవి. ఆ వ్యవధానాన్ని కవి చాల చక్కగా చూపాడు.

ధర్మాచరణ, కర్తవ్య నిష్ఠత, త్యాగం, దాంపత్యప్రేమ, గార్హస్థ్యజీవితం- వీటన్నిటి చిత్రణ ఉత్తర రామచరిత్ర నాటకంలో భవ్యంగా జరిగింది. భారతీయ సంస్కృతి ధర్మాలు గొప్పగా చిత్రింపబడినవి. దీన్నంతా నాటకంలో చిత్రించి భవభూతి అపూర్వ ప్రయోజనాన్ని సాధించాడు.

భవభూతి నాటక సంభాషణలు కూడ దీర్ఘంగా లేక సముచితంగా వున్నవి. సందర్భానుకూలంగా ప్రకృత్యాది వర్ణనలను కవి నాటకాలల్లో ప్రవేశపెట్టాడు. పాత్రలకనుగుణమైన శైలిలో కవి సంభాషణలను రచించాడు. భవభూతి సంభాషణలు వాచ్యరూపంలో సూటిగా పాఠకహృదయాలకు హత్తుకునేటట్లుగా సరళంగా వున్నవి. అతని కరుణ రసభరితమైన వాక్యాలు పాఠక హృదయమర్మభేదకాలుగా వున్నవి. అతని సంభాషణలు వెంటనే పాఠక హృదయాలను రసప్లావితం చేసేటటువంటివి.

భవభూతి నాటకాలు ప్రదర్శనకు యోగ్యంగాలేవని కొందరు విమర్శకుల అభిప్రాయం. ఉత్తరరామ చరిత్రలో సీత పాతాళ ప్రవేశం, కుశలవుల యుద్ధం మొదలైన ఘట్టాలు ప్రదర్శించటానికి క్లిష్టమైన ఘట్టాలని వారి అభిప్రాయం. నాటక కళాభిజ్ఞులు ఈ ఘట్టాలను కుశలతతో ప్రదర్శించవలసి వుంటుంది. కాని ప్రదర్శనకు యోగ్యంగా లేవని మాత్రం చెప్పలేము. ఉత్తరరామచరిత్ర భారతీయభాషల్లోకే కాక ఇంగ్లీషు, జర్మన్, ఫ్రెంచ్ మొదలైన యూరోపియన్ భాషల్లోకి అనువదింపబడింది.

## భవభూతి కవిత్వం

భవభూతి గంభీర ప్రకృతి కలవాడు. అతని కవిత్వమూ గంభీరంగానే వుంటుంది. కవి కావ్యరచనకు మూడు గుణాలు అవసరమని భవభూతి పేర్కొన్నాడు-

యత్ప్రౌఢత్వముదారతా చ వచసాం యచ్చార్థతో గౌరవమ్
తచ్చేదస్తి తతస్తదేవ గమకం పాండిత్య వైదగ్ధ్యయోః

1) భాషలో ప్రౌఢత్వం 2) వాక్కులో ఉదారత 3) అర్థ గురుత్వం. ఈ మూడు గుణాలు భవభూతిలో మూర్తీభవించినవనే చెప్పాలి. ఈ మూడు గుణాలచేతనే కృతి పాండిత్య వైదగ్ధ్యపూర్ణ మనబడుతుంది. భవభూతి పాత్రానుగుణమైన, రసానుకూలమైన శైలిని వాడాడు. అందుకే అతని శైలి ఒక చోట మధుర సారళ్యాలతో సమాసాలు లేని వైదర్భీరీతిలో కన్పిస్తుంది. మరోచోట మధుర ఓజోపూర్ణమై సమాసభరితమైన గౌడీరీతిలో కన్పిస్తుంది. విషయానుకూలంగా ఒకే శోకంలో వైదర్భీ గౌడీ రీతులను రెండింటిని కవి ప్రయోగించాడు. చంద్రకేతువు యుద్ధ వర్ణన-

యథేందావానందం వ్రజతి సముపోఢే కుముదినీ
తథైవాస్మిన్ దృష్టిర్మమ కలహకామః పునరయం
ఝణత్కార క్రూరక్వణిత గుణగుంజద్గురుధనుః
ధృత ప్రేమా బాహుర్ వికచ వికరాలవ్రణ ముఖః

దీర్ఘ సమాసాలతో కూడిన గౌడీరీతిని భవభూతి యుద్ధాది వర్ణనల్లో వీరబీభత్సరసాదుల పోషణకై ప్రయోగించాడు. పదప్రయోగంతోనే అతడు రసాన్ని స్ఫురింపజేయగలడు. శబ్దవిన్యాసం ద్వారా భావస్ఫోరకత్వాన్ని కలిగించటం భవభూతి కవితా గుణాలల్లో ఒకటి. చంద్రకేతువు వీరవిజృంభణ ఈ క్రింది శ్లోకంలో ఎట్లా ప్రతిబింబించిందో చూడవచ్చును-

ఆగర్జద్ గిరికుంజ కుంజర ఘటానిస్తీర్ణ కర్ణ జ్వర
జ్యానిర్ఘోషమ మందదుందుభిరవైరాధ్మాత ముజ్జృంభయన్
వేల్లద్భైరవ రుండ ఖండనికరై ర్వీరోవిధత్తే భువమ్
తృష్యత్కాల కరాళ వక్త్రవిఘస వ్యాకీర్య మాణామివ.

శ్లోకాలల్లోనే కాక సందర్భాన్ని బట్టి వచనంలోను దీర్ఘసమాసాలను భవభూతి ప్రయోగించాడు. అదేవిధంగా సందర్భాన్ని బట్టి కవి కోమల పదావళిని కూడ ప్రయోగించాడు-

పితరతి గురుః ప్రాజ్ఞే విద్యాం యథైవ తథా జడే
నతు ఖలు తయోః జ్ఞానే శక్తిం కరోత్యపహంతి వా
భవతి హి పునర్భూయాన్ భేదః ఫలం ప్రతి తద్యథా
ప్రభవతి శుచిః బింబగ్రాహే మణి ర్న మృదాదయః

అని కుశలవుల కుశాగ్రబుద్ధిని ఆత్రేయి ప్రశంసిస్తుంది. మెత్తని మాటలతో వాసంతి రామున్ని ఉపాలంభించిన సందర్భంలో కవి రచన-

త్వం జీవితం త్వమసి మే హృదయం ద్వితీయం
త్వం కౌముదీ నయనయో రమృతం త్వమంగే
ఇత్యాదిభిః ప్రియశతై రనురుధ్య ముగ్ధాం
తామేవ శాంత మథవా కిమతః పరేణ.

ఈ విధంగా భవభూతి విషయానుకూలమైన, రసానుకూలమైన, పాత్రానుకూలమైన భాషాశైలిని ప్రయోగించి తన రచనా కౌశలాన్ని ప్రదర్శించాడు. శక్తిమంతమైన పదప్రయోగంతో భవభూతి కవిత్వం సుందరమైంది. అతడు వేదశాస్త్రజ్ఞుడు. శబ్ద బ్రహ్మావిత్. వశ్యవాక్కు కలవాడు. భాషమీద అతనికి సంపూర్ణాధికారమున్నది. భాష కవి భావాలను అనుసరిస్తు పరిగెత్తింది. ఎక్కడా కుంటుపడలేదు. వాగ్దేవి అతనికి వశంవద యైనట్లు గోచరిస్తుంది.

భవభూతి భావరస స్ఫోరక పదవిన్యాసాన్ని తిలకమంజరీ కర్త ధనపాలుడు ఇట్లా ప్రస్తుతించాడు-

స్పష్ట భావరసా చిత్రైః పదన్యాసైః ప్రవర్తితా
నాటకేషు నటస్త్రీవ భారతీ భవభూతినా.

ప్రకృత్యాది దృశ్యాలను పాఠకుల కనులముందు నిలిచేటట్లుగా భవభూతి వర్ణించాడు-

ఏతే తే కుహరేషు గద్గద నదద్గోదావరీవారయో
మేఘాలంబిత మౌలి నీలశిఖరాః క్షోణీభృతో దాక్షిణాః
అన్యోన్య ప్రతిఘాత సంకుల చలత్కల్లోల కోలాహలైః
ఉత్తాలాస్త ఇమే గభీరపయసః పుణ్యాః సరిత్సంగమాః

చంచలమైన మహోతరంగాల కోలాహల ధ్వనితో నిండిన వేగంగా ప్రవహించే నదుల సంగమాన్ని భవభూతి పై శ్లోకంలో చిత్రపటంలోవలె చిత్రించాడు. ప్రకృత్యాది దృశ్యాలనే కాక పాత్రలను కూడ మూర్తీభవించేటట్లుగా కవి వర్ణించి వున్నాడు. లవుని వీరమూర్తిని కవి ఇట్లా వర్ణించాడు-

దృష్టిస్తృణీ కృత జగత్త్రయ సత్త్వసారా
ధీరోద్ధతా నమయతీవ గతిర్ధరిత్రీమ్
కౌమారకేZపి గిరివద్ గురుతాం దధానః
వీరోరసః కిమయ మేత్యుత దర్ప ఏవ.

"అతని దృష్టిముందు ముల్లోకాల సారభూతమైన శక్తి తృణంవలె వున్నది. అతని దీరోద్ధతమైన నడక భూమిని కంపింపజేస్తున్నట్లున్నది. బాలకుడైనా పర్వత గరిమ అతనిలో వున్నది. మూర్తీభవించిన వీరరసమా లేక సాక్షాత్తు దర్పమేనా? అని అనిపిస్తున్నది." ఇదే విధంగా భవభూతి రసాభివ్యక్తిని తన పదప్రయోగ విన్యాసం, శైలి ద్వారానే కలిగిస్తువుంటాడు. అర్థానికి అనుగుణంగా పదాలను ప్రయోగించటంలో అతడు సమర్థుడు. చంద్రకేతువుతో యుద్ధంచేస్తు లవుడు వీరోచితంగా తన ధనుస్సును గురించి ఇట్లా అంటాడు-

జ్యాజిహ్వయా వలయితోత్కట కోటి దంష్ట్ర
ముద్గారిఘోర ఘనఘర్ఘర ఘోష మేతత్
గ్రాస ప్రసక్త హస దంతకవక్త్రయంత్ర
జృంభావిడంబి వికటోదరమస్తు చాపమ్

"ఎక్కు పెట్టిన నా ధనుస్సు ప్రాణులను కబళించటానికి ఆతురతతో నవ్వే యమరాజు ముఖరూపమైన యంత్రం యొక్క ఆవలింత వలె, దీని మౌర్వి నాలుకవలె

వున్నది. యమరాజు ముఖం వలెనే నా ధనుస్సు భయంకరమైన ఘర్ఘరధ్వనులను చేస్తున్నది. యమరాజు యొక్క భయంకరమైన ముఖం ఏ విధంగా ప్రాణుల ప్రాణాలను హరిస్తుందో అదేవిధంగా నా ధనుస్సు యుద్ధంలో అనేక యోధులను సంహరిస్తుంది." పై శ్లోకంలో సమాసత, కఠినాక్షర ప్రయోగం, ఘట్రారా వృత్తులు వీరరసస్ఫూర్తిని కలిగించేటట్లుగా వున్నవి. భవభూతి కరుణ, శృంగారరసాల పోషణ లోనే కాక వీర రౌద్ర భయానక బీభత్సరసాలను కూడ సమర్థవంతంగా పోషించాడు. మహావీరచరిత్ర తృతీయాంకంలో పరుశురాముని మాటల్లో రౌద్ర రసాభివ్యక్తి జరిగింది. మాలతీమాధవం పంచమాంకంలో శ్మశాన వర్ణనలో బీభత్స భయానకరసాల సమావేశాన్ని చూడవచ్చును-

ఉత్కృత్యోత్కృత్య కృత్తిం ప్రథమమథ పృథూత్సేధభూయాంసి మాంసా
న్యంసస్ఫిక్పృష్ఠపిండాద్యవయవ సులభా న్యుగ్రపూతీని జగ్ధ్వా
ఆర్తః పర్యస్తనేత్రః ప్రకటితదశనః ప్రేతరంకః కరంకాత్
అంకస్థాదస్థి సంస్థం స్థపుట గటమపి క్రవ్యమవ్యగ్రమత్తి

గౌడీరీతిలో నడిచిన పైశ్లోకంలోని శైలి రసాన్ని చిప్పిలేటట్లుగా చేస్తున్నది. సమాస బాహుళ్యం, క్లిష్ట పదావళి, రసానుకూలమైన శబ్ద ప్రయోగాలను శ్లోకంలో చూడవచ్చును. "శ్మశానంలోని ప్రేతం మొదట శవం తోలును ఒలిచేసింది, తర్వాత భుజపృష్ఠభాగాలల్లోని వుబ్బిపోయిన, దుర్గంధంతో కూడిన మాంసాన్ని తింటున్నది. అట్లా తిని కండ్లను బాగావిప్పి, పండ్లను మెరిపిస్తు తన ఒడిలో పెట్టుకున్న శవం ఎముకలకు అంటుకొనివున్న మాంసాన్ని గీకిగీకి ఆనందంతో తింటున్నది." రోమాంచకారి అయిన ఈ భయానక దృశ్యాన్ని కవి చాల సహజంగా చిత్రించాడు. భవభూతి ప్రతివర్ణన సంభావ్యంగా కన్పిస్తుంది. అసంభావ్యత, కృత్రిమత్వం, ఊహామాత్ర చిత్రణలు ఎక్కడాలేవు. అందుకే అతని వర్ణనలు సహజంగా, రమ్యంగా వున్నవి. భయంకర దృశ్యాలను కన్నులకు కట్టేటట్లు మరేకవి ఇంత సహజంగా వర్ణించలేదు.

భవభూతి వర్ణనల సందర్భంలో 'ఫోటోగ్రాపు' పద్ధతినే ఎక్కువ వాడాడు. అంటె దృశ్యాన్ని వున్నదాన్ని వున్నట్లుగా మాటల్లోపెట్టి పాఠకుల ముందుంచటం. అందుకే భవభూతి శైలి వాచ్యార్థ ప్రధానమైంది. అంటె అతనిది వర్ణచిత్రాల శైలి కాదు. 'ఫోటో' శైలి. ఒక దృశ్యాన్ని రంగులతో చిత్రించినట్లుగా అలంకార వ్యంగ్యార్థ చమత్కారాదుల సహాయంతో భవభూతి వర్ణించడు. ఫోటో తీసినప్పుడు ఒక దృశ్యం ఎట్లా వున్నది వున్నట్లుగా వస్తుందో అదే

పద్ధతిలో భవభూతి వున్న దృశ్యాన్ని వున్నట్లుగా వర్ణిస్తాడు. అయితే భవభూతి పూర్తిగా అలంకారాలను ఉపయోగించక పోలేదు. సందర్భానుకూలంగా అతడు స్వభావోక్తి ఉపమలను వాడాడు. ఇవిగాక ఉత్ప్రేక్ష, నిదర్శన, రూపక, అర్థాంతరన్యాస, దృష్టాంత, అప్రస్తుతప్రశంసలను వాడాడు. అక్కడక్కడ శబ్దాలంకారాలను కూడ చూడవచ్చును.

భవభూతి ఛందోయోజన కూడ చాల చిక్కగా వున్నది. అతని ఛందః ప్రయోగకౌశలం అద్భుతమైంది. విషయానుకూలంగా అతడు ఛందస్సులను ప్రయోగించాడు. లలిత భావాలను ప్రకటించేటప్పుడు అనుష్టుపులను, శృంగార చిత్రణా సందర్భంలో ఇంద్ర వ్రజ, మాలిని, ఉపేంద్ర వ్రజలను, రౌద్ర బీభత్స భయానక దృశ్యాలను వర్ణించేటప్పుడు శార్దూల విక్రీడిత, స్రగ్ధరలను భవభూతి ప్రయోగించాడు. భావానుకూలంగా వివిధ ఛందస్సులను వాడినా శిఖరిణీవృత్తం భవభూతికి అభిమానవృత్తం. కరుణ రసాభివ్యక్తికి భవభూతి ఎక్కువ శిఖరిణీ వృత్తాన్నే వాడాడు. క్షేమేంద్రుడు తన సువృత్త తిలకంలో భవభూతి శిఖరిణీవృత్తాన్ని ఇట్లా ప్రశంసించివున్నాడు.

భవభూతేః శిఖరిణీ నిరర్గళ తరంగిణీ
రుచిరా ఘనసందర్భే యా మయూరీవ నృత్యతి.

మానవ హృదయంలోని సూక్ష్మాతి సూక్ష్మభావాలను చిత్రించటంలో భవభూతి నిపుణుడు. మానవ హృదయ వికారాల భిన్నావస్థల చిత్రణను అతని నాటకాలల్లో అడుగడుగునా దర్శించవచ్చును.

భవభూతి హాస్యరసాన్ని తప్ప మిగతా రసాలను అన్నిటిని సందర్భానుకూలంగా పోషించాడు. వీర, కరుణ రసాలను పోషించటంలో అతడు సిద్ధహస్తుడు. భవభూతి రసపోషణా కౌశలాన్ని ఒకానొక కవి ఇట్లా పొగిడాడు-

భవభూతి కవేర్వాచ స్స్వదన్తే రసరంజితాః
సుమనోభా స్సుధాస్యంది బంధమాధుర్యబంధురాః

భవభూతి కవిత్వం అందరి అభిమాన గౌరవాలనందుకొన్నది. అభినవ గుప్త, మమ్మట, విశ్వనాథ, జగన్నాథాది ప్రసిద్ధాలంకారికులు భవభూతి శ్లోకాలను ధ్వని రస గుణాదులకు ఉదాహరణలుగా ఉద్ధరించారు. అజ్ఞాతకవి భవభూతి కవిత్వాన్ని ఇట్లా ప్రశంసించాడు-

సుబంధౌ భక్తిర్నః క ఇహ రఘుకారే న రమతే
ధృతి ర్దాక్షీపుత్రే హరతి హరిచంద్రోఽపి హృదయమ్
విశుద్ధోక్తిః శూరః ప్రకృతిమధురా భారవిగిరః
తథాప్యంతర్మోదం కమపి భవభూతి ర్వితనుతే.

సుబంధు, కాళిదాసు, పాణిని, హరిచంద్ర, శూర, భారవి కవుల కవిత్వం ఒక్కొక్కటి ఆకర్షిస్తుంది. కాని భవభూతి కవిత్వం మాత్రం అపూర్వానందాన్నిస్తుందట! రాజశేఖరుడు తన బాలభారతంలో భవభూతిని వాల్మీకి అవతారంగా చెప్పాడు-

బభూవ వల్మీకభవః కవిః పురా
తతః ప్రపేదే భువి భర్తృమేంఠతామ్
స్థితః పునర్యో భవభూతి రేఖయా
స వర్తతే సంప్రతి రాజశేఖరః

"వాల్మీకి భర్తృమేంఠ కవిగా, తర్వాత భవభూతిగా, ఆ తర్వాత రాజశేఖరునిగా జన్మించాడట!" ఉదయ సుందరికారుడు సోడ్ఢలుడు భవభూతి సాహిత్య మార్గంలో కవులు అనే సార్థవాహులకు మార్గాన్ని చూపే పతాకాన్ని ధరించిన నాయకునివంటి వాడని కీర్తించాడు-

మాన్యో జగత్యాం భవభూతిరార్యః సారస్వతే వర్త్మని సార్థవాహః
వాచం పతాకామివ యస్య దృష్ట్వా జనః కవీనా మను పృష్ఠమేతి.

## భవభూతి పాండిత్యం - వ్యక్తిత్వం

భవభూతి వేద వేదాంగాలను అభ్యసించిన శ్రోత్రియుల వంశంలో పుట్టాడు. అతని పూర్వజులు యజ్ఞయాగాది కర్మలు స్వయంగా చేసినవారు. భవభూతి తాను "పద వాక్యప్రమాణజ్ఞుడ" నని చెప్పుకొన్నాడు. 'పద' అంటే వ్యాకరణం, "వాక్య" అంటే మీమాంస శాస్త్రమని పండితుల అభిప్రాయం. అతని నాటకాల ప్రస్తావనలను బట్టి అతడు వేద, ఉపనిషత్, సాంఖ్య, యోగాదులను అధ్యయనం చేసినవాడని తెలుస్తున్నది. అతనికి బ్రాహ్మణ గ్రంథాలు, గృహ్యధర్మ శాస్త్రాలు సుపరిచితాలు. న్యాయ తంత్రాలను కూడ తెలిసినవాడు. అభినవగుప్తుడు తన తంత్రాలోకం గ్రంథంలో భవభూతి త్రిశికాశాస్త్ర వివృత్తిని వ్రాసినట్లు తెల్పాడు-

అసదేతదితి ప్రాహుర్గురవ స్తత్వ దర్శినః
శ్రీ సోమానంద కళ్యాణ భవభూతి పురోగమాః
తథాహి త్రీశికా శాస్త్రవివృత్తేతోZభ్యుదుర్బుదాః.

భవభూతికి నాట్య, అర్థ, కామశాస్త్రాదుల్లో మంచి ప్రవేశమున్నది. పురాణాలను బాగా తెలిసినవాడు. భవభూతి భరతుని రససిద్ధాంతాన్ని అంగీకరించి గౌరవించినవాడు. అతడు తన మూడు నాటకాలల్లో మూడు రసాలను అంగి రసాలుగా పోషించాడు. అంతేగాక సందర్భానుకూలంగా ఆయా రసాలను పోషించాడు. భవభూతికి ఆయుర్వేదశాస్త్రంలో మంచి పరిచయమున్నది. ఎన్నో చోట్ల ఆయుర్వేదశాస్త్ర సంబంధ పారిభాషిక పదాలను ప్రయోగించాడు. భవభూతి ఉత్తర రామచరిత్రలో తాను "వశ్యవాక్, పరిణత ప్రజ్ఞః, శబ్దబ్రహ్మాన్" అని చెప్పుకొన్నాడు. దీన్నిబట్టి అతనికి భాషమీద మంచి అధికారమున్నట్లు తెలుస్తున్నది. భవభూతి తన పూర్వజులు ఎంత సదాచార సంపన్నులో మాలతీ మాధవంలో ఇట్లా చెప్పుకొన్నాడు-

తే శ్రోత్రియాస్తత్వ వినిశ్చయాయ భూరిశ్రుతం శాశ్వతమాద్రియంతే
ఇష్టాయ పూర్తాయచ కర్మణేZర్థాన్ దారానపత్యాయ తపోZర్థమాయుః

ఈ గుణాలనన్నిటిని పుణికి పుచ్చుకొన్నవాడు భవభూతి. తన వంశజులు సోమపీథులు, బ్రహ్మవాదినులేకాక "పంక్తిపావను"లని అతడు చెప్పుకొన్నాడు. పంక్తిపావనులంటె మనుస్మృతిలో ఇట్లా చెప్పబడిందని మిరాశి తెలిపాడు-

అగ్ర్యాః సర్వేషు వేదేషు సర్వ ప్రవచనేషు చ
శ్రోత్రియాన్వయజాశ్చైవ విజ్ఞేయాః పంక్తి పావనాః

"నాలుగు వేదాలను, ఆరు వేదాంగాలను చదువుకొన్న, పది తరాల నుంచి వేద పఠనానికి పేరెన్నిక గన్నవారు పంక్తిపావనులు" అనబడుతారు. వైదిక మతం ఆంధ్ర దేశంలోనే ఎక్కువ రాజాదరణను ప్రజాదరణను క్రీ.శ. 14వ శ॥ వరకు పొందింది. కుమారిలుడు ఆంధ్ర దేశంలో జన్మించి వైదిక మతోద్ధరణకు పూనుకొన్నాడు. ఆంధ్ర దేశంలో బౌద్ధ జైన వీరశైవ వైష్ణవ మతాలున్నా అన్నిటికి పై చేయిగా వైదిక ధర్మమే ప్రచారంలో వుండేది. ఆంధ్ర బ్రాహ్మణుల్లో వైదిక శాఖ అనేది ఒకటి వున్నది. పంక్తి పావనుల వంశంలో పుట్టిన భవభూతి ఆంధ్రుడు వైదిక బ్రాహ్మణుడే అయి వుంటాడనటం సత్యదూరం కాదేమో ననిపిస్తుంది.

భవభూతి శివాభిమానియా? కాదా? అని పండితుల్లో వాదన వున్నది. భవభూతి మహావీరచరిత్ర నాందిలో శివపార్వతుల స్తుతిని చేయటం, పరశురామున్ని శివ భక్తునిగా మాటిమాటికి చెప్పటం, మాలతీమాధవం నాందిలో శివస్తుతిని చేయటం- అతడు శైవుడనటాన్ని సూచిస్తున్నదని తోడర్‌మల్, కాణే, కర్మార్కర్ వంటి విమర్శకులు అభిప్రాయపడినారు. శారదారంజన్ రే అభిప్రాయానుసారం భవభూతి రామభక్తుడు. మహా వీరచరిత్రలో రామున్ని ఎన్నో సార్లు పరమాత్మ రూపునిగా వర్ణించాడని, అతడు రాముడంటే భక్తి గౌరవాలు కలవాడని, కాబట్టి అతని చరిత్రను రెండు నాటకాల్లో చిత్రించాడని ఆయన అన్నాడు. భవభూతి కాళిదాసు వలెనే రాముని చరిత్రచేత ముగ్ధుడైవుంటాడు. అతడు రామున్ని మహావీరునిగా, ఉదాత్త చరిత్రునిగానే చిత్రించాడు. కాని అవతార రూపునిగా చిత్రించలేదు. శివునితో పాటు సరస్వతి, సూర్య, బ్రహ్మ, గణేశులను కూడ భవభూతి స్తుతించాడు. కాబట్టి వేదోపాసకుడు, అద్వైతి అని చెప్పాలి.

స్వాభావికంగా భవభూతి చాల సున్నిత హృదయుడుగా కన్పిస్తాడు. చాల తొందరగా బాధపడ్తాడు. అందుకే తన మొదటి నాటకం గౌరవం పొందలేదని మథనపడినాడు. కాని అతడు నిరాశావాది, ఆత్మ విశ్వాసం లేనివాడు కాదు. ఆశావాది, తన ప్రతిభమీద నమ్మకం కలవాడు. కాబట్టి "కాలోహ్యయం నిరవధిర్విపులాచ పృథ్వీ" అని అన్నాడు. అతని రచనలను బట్టి ముఖ్యంగా ఉత్తరరామ చరిత్రనుబట్టి భవభూతి పవిత్రమైన ప్రేమతో నిండిన కుటుంబ జీవితాన్ని గడిపాడని చెప్పవచ్చును. ఉదాత్త భారతీయ దాంపత్య స్నేహాన్ని, దంపతుల ఆదర్శ హృదయాలను భవభూతి భవ్యంగా చిత్రించాడు. దాంపత్య ప్రేమచిత్రణ అతని చేతిలో పరాకాష్ఠనందుకొన్నది. భవభూతి నిజ భార్యా వియోగంతో ఉత్తర రామచరిత్ర నాటకాన్ని వ్రాసాడని ఐతిహ్యం. సీతారాముల వియోగ దుఃఖాన్ని అంత మర్మభేదంగా చిత్రించ గలిగాడంటే స్వానుభూతి దోహదం చేసివుండవచ్చును. ఇది ఎంతవరకు నిజమో ఆధారాలు లేక చెప్పలేము. భవభూతి దాంపత్య ప్రేమనే కాక పుత్ర ప్రేమ, సఖ్య ప్రేమను కూడ చక్కగా చిత్రించాడు. మాధవ మకరందుల ప్రేమ, రామునికి కుశ లవులను చూడగానే కలిగిన భావాలు దీనికుదాహరణలు. ప్రేమ భవభూతికి పవిత్రమైంది. అది కేవలం శారీరక సంపర్కం ప్రధాన గమ్యంగా కలదికాదు. సీతారాములు కలిసివున్నప్పుడు కాని వారు వియోగం పొందినప్పుడు కాని వారి నడుమ కవి చిత్రించిన ప్రేమ అలౌకికమైంది, ఆదర్శమైంది. "ఏవో తెలియని కారణాలు మనుష్యులను ఒక్కటిగా బంధిస్తవి, ప్రేమకు బహిరకారణాలుండవ"ని భవభూతి అంటాడు-

వ్యతిషజతి పదార్థానాంతర: కోZపి హేతు:
న ఖలు బహిరుపాధీ(న్ప్రీతయ: సం(శయంతే

మహావీర చరి(త మాలతీమాధవ (ప్రస్తావనలను బట్టి అతడు నటులతో స్నేహం చేసినట్లు తెలుస్తున్నది. మాలతీమాధవంలో సూ(త్రధారుడు భవభూతిని "కవి మి(త్రదేయ మస్మాకమితి" అని అంటాడు. "భవభూతిర్నామ కవి: నిసర్గ సౌహృదేన" అనటం చేత అతడు స్వభావం చేతనే సౌహృదయం, స్నేహభావం కలవాడని తెలుస్తున్నది.

భవభూతి హాస్యరస పోషణలో విఫలుడయ్యాడని విమర్శకుల అభి(ప్రాయం. అతని నాటకాలల్లో ఎక్కడా విదూషకుడు లేడు. (ప్రకరణంలో (ప్రతి అంకంలో విదూషకుడు కనిపించాలని లక్షణం చెప్తున్నది. కాని మాలతీమాధవ (ప్రకరణంలోనూ అవకాశమున్నా కవి విదూషక పా(త్రను (ప్రవేశపెట్టలేదు. దాన్ని బట్టి అతడు గంభీర వ్యక్తిగా కన్పిస్తాడు. (శో(త్రియ కుటుంబంలో పుట్టిన భవభూతి విదూషకుని వికృత చేష్టలతో, మాటలతో హాస్యాన్ని కల్పించటానికి ఇష్టపడలేదేమో. కొన్నిచోట్ల అతడు సున్నితమైన పరిహాసం చేయగలిగాడు. ఉత్తర రామచరి(త (ప్రథమాంకంలో లక్ష్మణున్ని సీత ఊర్మిళను గురించి అడిగేటప్పటి సంభాషణ దీనికుదాహరణ.

## భవభూతి - కాళిదాసు

కాళిదాసు భవభూతులను సమకాలికులుగా చేసి ఎన్నో కథలు పుట్టినవి. ఆ కథలన్నీ వారివారి అభిమానులు వారివారి ఆధిక్యతను నిరూపించటానికి కల్పించినవి కావచ్చును.

1) భవభూతి ఉత్తర రామచరి(త్రను (వ్రాసి కాళిదాసుకు చూపించి అభి(ప్రాయమడిగాడట. భవభూతి (ప్రథమాంకంలో దండకారణ్యంలో రాముడు సీతతో గడిపిన రా(త్రులను "కిమపి కిమపి......" అన్న శ్లోకంలో వర్ణిస్తూ చివరి పాదాన్ని "అవిదిత గత యామా రా(త్రిరేవం వ్యరంసీత్" అని చెప్పాడు. 'ఏవం' లోని అనుస్వారాన్ని తీసివేయమని కాళిదాసు చెప్పాడని దానితో, భవభూతి తీసివేసాడని ఒక కథ. 'ఏవం' అని వున్నట్లయితే "గాఢమైన కౌగిలింతలో వున్నప్పుడు రా(త్రులు ముగిసేవి" అని అర్థం వస్తుంది. దాన్నే 'ఏవ' అని చేసినట్లయితే "గాఢమైన కౌగిలింతలో వున్నప్పుడు రా(త్రులే ముగిసేవి" అన్న అర్థంతో పాటు "రా(త్రులే ముగిసేవి కాని మన మాటలు ముగిసేవి కాదు" అనే రమణీయార్థం

స్ఫురిస్తుంది. ఇది ఎవరో కాళిదాసు వ్యంగ్యార్థమంటె అభిమానం కలవారు సృష్టించిన ఐతిహ్యామై వుంటుంది.

2) బల్లాలుని భోజప్రబంధంలో కాళిదాస భవభూతులు భోజుని ఆస్థాన కవులుగా చెప్పబడినారు. భోజుడు ఒకసారి ఒక దృశ్యాన్ని చూపి వర్ణించమని అడుగగా కాళిదాస భవభూతులు ఇద్దరూ వర్ణించారు. వారిద్దరి శ్లోకాలల్లో ఏది ఉత్తమమైందని వివాదమొచ్చింది. భోజుడు ఆ శ్లోకాలను రెండు తాటాకుల మీద వ్రాయించి తరాజులో పెట్టి భువనేశ్వరీదేవి సమక్షంలో భవభూతి చేతికిచ్చి తూచమని అడిగాడు. భవభూతి శ్లోకమున్న పళ్లెం పైకి పోతుండగా చూచి దేవి భువనేశ్వరి, తన భక్తుని గౌరవం కాపాడేందుకై, తన చేతిలోని కమల మధువును చిలకరించింది అప్పుడు ఆ పళ్ళెం బరువుతో లేవలేదు. అప్పుడు కాళిదాసు ఇట్లా అన్నాడట-

అహో మే సౌభాగ్యం మమ చ భవభూతే శ్చ భణితం
ఘటాయా మారోప్య ప్రతిఫలతి తస్యాం లఘుమతి
గిరాందేవీ సద్యః శ్రుతికలిత కల్హార కలికా
మధూలీ మాదుర్యం క్షిపతి పరిపూర్త్యై భగవతీ.

అప్పుడు భవభూతి కాళిదాసుకు నమస్కరించాడట!

కాళిదాసు భవభూతులు ఇద్దరు కూడ సంస్కృత సాహిత్యంలో గొప్ప కవులు. వ్యాస వాల్మీకుల తర్వాత లౌకిక సాహిత్యంలో స్థానాన్ని సంపాదించిన మహాకవులు! వారిద్దరి ఆధిక్యతను గురించి ఆధునికుల్లోనే కాక ప్రాచీనుల్లోను అభిప్రాయ భేదాలేర్పడినవి. వారిద్దరి సమర్థకుల, విరోధుల అభిప్రాయాలను చెప్పే ఒక శ్లోకమున్నది-

కవయః కాళిదాసాద్యాః భవభూతి ర్మహాకవిః
తరవః పారిజాతాద్యాః స్నుహీవృక్షో మహాతరుః

"కాళిదాసాదులు కేవలం కవులు. భవభూతి మాత్రం మహాకవి" అని భవభూతి సమర్థకులు అన్నారు. దానిమీద కాళిదాసు సమర్థకులు "సరే! కాని స్వర్గంలో పారిజాత వృక్షాదులు కేవలం వృక్షాలే. స్నుహీవృక్షం మాత్రం మహావృక్షం" అని వ్యంగ్యంగా కాళిదాసు గొప్పతనాన్ని స్థాపించారు. స్నుహీవృక్షం ఏ భాగం కూడ ఔషధంగా పనికిరాదు. అందుకే ఆయుర్వేద శాస్త్రజ్ఞులు వ్యంగ్యంగా దాన్ని మహావృక్షమన్నారు. భవభూతి స్నుహీవృక్షంవలె

నికృష్టమైన వాడని కాళిదాసు పారిజాతాది కల్పవృక్షాలవంటివాడని అర్థం. కాళిదాస భవభూతులు ఇద్దరూ మహాకవులే, మహానాటకకారులే. ఇద్దరికీ సామ్యాలు భేదాలు కూడ వున్నవి-

1. కాళిదాసు మృదుహృదయం కలవాడు. భవభూతి గంభీర ప్రకృతి కలవాడు.

2. కాళిదాసు కవిత్వం వైదర్భీరీతిలో నడిచింది. భవభూతి వైదర్భీరీతిని ప్రయోగించినా అతనిది సామాన్యంగా గౌడీరీతి. కాళిదాసు కవిత్వంలో దీర్ఘ సమాసాలుగాని క్లిష్టపదాలుగాని లేవు. అతని కవిత్వమంతా పదలాలిత్యం కలది. ప్రసాద మాధుర్యగుణాలతో కూడింది. భవభూతి కవిత్వం దీర్ఘసమాసాలు, క్లిష్టపదాలు కలది. అక్కడక్కడా అప్రసిద్ధ పదప్రయోగాలు కూడా వున్నవి, ఓజోగుణ ప్రధానమైంది.

3. కాళిదాసు కవిత్వం వ్యంగార్థ ప్రధానమైంది. భవభూతి కవిత్వం వాచ్యార్థ ప్రధానమైంది. తక్కువ శబ్దాలల్లో కాళిదాసు వ్యంజనావృత్తి సహాయంతో అధికమైన రమ్యమైన అర్థాలను స్ఫురింపజేస్తాడు. వాచ్యార్థ ప్రకటనం ద్వారా సౌందర్యాన్ని సాధించినవాడు భవభూతి. అతడు ఎక్కువ శబ్దాలను ప్రయోగిస్తాడు. భావాన్ని సంక్షిప్తంగా చెప్పలేదు. వివరంగా చెప్తేనే అతనికి తృప్తి. నాటక సంవాదాలు కూడ కాళిదాసులో కన్నా భవభూతిలో విస్తరంగానే వున్నవి.

4. కాళిదాసు భవభూతులు ఇద్దరూ ప్రకృతి ప్రేమికులే! కాళిదాసు సుకుమార లలితమైన ప్రకృతిని వర్ణించాడు. భవభూతి కోమలమైన, భయంకరమైన రెండు ప్రకృతి స్వరూపాలను వర్ణించినా అతని భయంకర ప్రకృతివర్ణనలు మనోహరంగా వున్నవి. కాళిదాసు వర్ణనలు సరళంగా, మధురంగా వున్నవి. లలిత పదావళిలో వర్ణించాడు. చివరకు తారకాసురుని దుండగాలను కూడ అతడు కుమారసంభవంలో లలితంగా సుకుమార భావయుక్తంగానే వర్ణించాడు. భవభూతి శక్తిమంతమైన పదావళిని ప్రయోగిస్తాడు. వీర బీభత్స భయానక రససన్నివేశాలను దీర్ఘసమాసాలతో, క్లిష్టపదాలతో, కఠినవర్ణ సమావేశంగల శబ్దాలతో ప్రౌఢంగా వర్ణించాడు. భవభూతి కవిత్వం వాచ్యార్థ ప్రధానమైనా శిథిలంగా లేక ప్రౌఢ గంభీరంగా వున్నది.

5. కాళిదాసు భవభూతులు ఇద్దరూ అలంకారాలను తక్కువగా కావలసినంత మాత్రంగానే రచించారు. కాళిదాసు సాదృశ్యమూలకమైన ఉపమానాదులను ఎక్కువ

వాడాడు. కాళిదాసు తీసుకొన్న ఉపమాద్రవ్యాలు లలిత సుకుమారమైనవి. నిత్యజీవితంలో మనకు సుపరిచినమైనవి. భవభూతి ఎక్కువ అమూర్త ఉపమలను తీసుకొన్నాడు. భవభూతి ఉపమలు వస్తుదర్శనానికి ఎక్కువ ఉపయోగపడలేదు. అతడు అలంకారాల సుందరయోజన చేయలేక పోయాడు. వాచ్యార్థంలోనే అతడు దిట్ట. ఇక అతనికి అలంకార చమత్కారాదులు రుచించినట్లుగా లేదు.

6. భవభూతి స్త్రీల బాహ్య సౌందర్యాన్ని ఎక్కడా వర్ణించలేదు. అతని దృష్టి ఎప్పుడూ అంతస్సౌందర్యం మీదనే పడుతుంది. కాళిదాసు శకుంతలను ఒక ప్రకృతి కాంతవలె కోమల అంగాంగ సౌందర్యాన్ని వర్ణించాడు-

అధరః కిసలయరాగః కోమలవిటపానుకారిణౌ బాహూ
కుసుమమివ లోభనీయం యౌవన మంగేషు సన్నద్ధమ్

అదే విధంగా యక్షుని భార్యను "శ్రోణీభారా దలసగమనా పక్వబింబా ధరోష్ఠీ..." అని వర్ణించాడు. శారీరక సౌందర్యాన్ని అతడు రమ్యంగా వర్ణించాడు. కాని భవభూతి సీతను "ఇయం గేహే లక్ష్మీరియమమృతవర్తిర్నయనయోః....." అని మాత్రమే వర్ణించాడు. ఏ నాటకంలోను భవభూతి శారీరకాంగ వర్ణనను చేయలేదు. ఎక్కువ కెక్కువ అతడు కపోలాలను, కచభారాన్ని మాత్రం వర్ణించాడు. పవిత్రమైన అంతస్సౌందర్యమే భవభూతిని ఆకర్షించింది, కాని శారీరిక సౌందర్యం కాదు. అందుకే శకుంతలకన్న సీత పవిత్రమూర్తిగా మనముందు నిలుస్తుంది.

7. కాళిదాసు చిత్రించిన ప్రణయం కామవాసనచేత దూషితమైంది. భవభూతి చిత్రించిన ప్రణయం రెండు ఆత్మలను బంధించేది. అది స్నేహసిక్తమైంది. అది ఉన్మక్త ప్రణయంకాదు. చిరకాల వివాహబంధం చేత స్థిరపడింది. కాళిదాసు శాకుంతలంలో శకుంతలా దుష్యంతులకు మొదటి చూపులోనే ప్రేమ కలగటం, గాంధర్వవివాహం ఉన్మక్త ప్రణయానికి ప్రతీకలు. వారు తర్వాత పశ్చాత్తాపాగ్నిలో తపించినట్లుగా కవి కల్పించినా, పుటంలో పెట్టిన బంగారం వన్నె కెక్కినట్లుగా ఆ ప్రేమ పవిత్రమైందని చిత్రించినా, అది ఉత్తర రామచరిత్రలోని సీతారాముల ప్రేమవలె గంభీరం, స్థిరం, శాశ్వతం, అనశ్వరంగా కనిపించదు. సీతారాముల ప్రేమ యౌవన వాసనలతో కూడింది కాదు. అది కాలంతో పాటు పరిపక్వతను చెందే స్నేహ మయమైంది.

8) కాళిదాసు భవభూతులిద్దరూ మహాకవులు, మహానాటక కారులే! కాళిదాసు కల్పనా ప్రధానమైన కవి. భవభూతి సహజ చిత్రణ చేసే కవి. అతడు సంపూర్ణ భావనా లోకంలో చరించడు.

9) కాళిదాసు నాటకాలు లాక్షణికుల లక్షణాలల్లో ఒదిగి వున్నవి. భవభూతి నాటకాలల్లో కొంత విశృంఖలత కనిపిస్తుంది. నాటక లక్షణాలకు విరుద్ధమైన విషయాల నెన్నిటినో అతడు తన నాటకాలల్లో ప్రవేశ పెట్టాడు. ఉదా॥కు మాలతీ మాధవంలో రంగస్థలం మీదికి వ్యాఘ్రం రావటం, శ్మశాన దృశ్యం, మనుష్య మాంసాన్ని అమ్మటం మొ॥వి. ఉత్తర రామచరిత్రలో చిత్రపట దర్శనం, గర్భాంక నాటకం రెండు భవభూతి ప్రతిభా జనితమైన నాటక 'టెక్నిక్కు'లే.

10) కాళిదాసు ప్రకృతిని సూక్ష్మ దృష్టితో పరిశీలించి చిత్రించాడు. కాని అతడు పాత్రల హృదయాలను సూక్ష్మంగా చిత్రించలేకపోయాడు. భవభూతి మానవ ప్రకృతిని సూక్ష్మంగా పరిశీలించటంలో దక్షుడు. పాత్రల సూక్ష్మ హృదయ భావాలను కూడ అతడు చిత్రించాడు.

11) కాళిదాసు తన నాటకాలల్లో నాటకోచితంగా విదూషకుని ప్రవేశపెట్టి హాస్యాన్ని పోషించాడు. అతడు తద్ద్వారా తన కోమల వినోద ప్రకృతిని ప్రకటించాడు. భవభూతి విదూషకుని పాత్రను ఏ నాటకంలోను ప్రవేశ పెట్టలేదు. అది అతని గంభీర ప్రకృతికి నిదర్శనం.

12) కాళిదాసు శృంగార రసాభిమాని. భవభూతి కరుణ రసాభిమాని. కాళిదాసు తన మూడు నాటకాలల్లోను శృంగారాన్నే అంగిగా పోషించాడు. భవభూతి తన మూడు నాటకాలల్లో మూడు వేరువేరు రసాలను ప్రధానంచేసి పోషించాడు. భవభూతి సంభోగశృంగారానికన్న వియోగ శృంగారాన్ని ప్రీతితో వర్ణిస్తాడు. భవభూతి కరుణ రసాభిమాని అయినా వీర రౌద్ర బీభత్స భయానక రస పోషణలో సమర్థుడు. కాళిదాసు వీరరస పోషణలో వీగిపోయినాడనే చెప్పాలి. వీరరస సన్నివేశం వచ్చినప్పుడు అతడు దాటవేసాడే కాని దాన్ని చక్కగా చిత్రించలేదు. ఉదా॥కు విక్రమోర్వశీయంలో పురూరవుడు రాక్షసునితో యుద్ధం విశదంగా చెప్పబడనేలేదు. అదేవిధంగా శాకుంతలంలో దుష్యంతుడు మునుల యాగాన్ని రక్షించే ఘట్టంలో అతడు రాక్షసులతో పోరాడినట్లుగా కవి విస్తరించలేదు. కాళిదాసు శృంగార, హాస్య, కరుణ రసాలను మాత్రమే పోషించటంలో సమర్థుడు. భవభూతి కరుణ శృంగారాలతోపాటు వీర రసాదులను కూడ సమర్థవంతంగా పోషించాడు.

13) కాళిదాసు కవిత్వం, భావాలు కళాత్మకంగా సరళమైన భాషలో వ్యక్తీకరింపబడినవి. భవభూతిలో కళాత్మకత కన్న భావతీవ్రత, భావావేశం, నిసర్గత కన్పిస్తవి. ప్రభావవంతమైన భాషలో భవభూతి భావాలను వ్యక్తం చేసాడు. భవభూతి కవేగాక శ్రోత్రియుడు, దార్శనికుడు కావటంచేత అతని కవిత్వం గంభీర ప్రౌఢిని సంపాదించుకొన్నది.

14) భవభూతికి కాళిదాసుకు స్వభావంలో, కవిత్వంలో చాలా భేదాలున్నవి. అయినా కాళిదాసు భవభూతికి అభిమానకవిగానే కన్పిస్తాడు. వాల్మీకి తర్వాత కాళిదాసే భవభూతి ఆదరాభిమానాలను చూరగొన్నాడు. వాల్మీకి రామాయణమంటె భవభూతికి ప్రీతి. అదే విధంగా కాళిదాసు శాకుంతల నాటకం అతన్ని చాల ఆకర్షించింది. అందుకే అంత ఉన్నతమైన నాటకాన్ని తానూ వ్రాయాలని తహతహపడినాడు. ఈ తహతహతోనే అతడు ఉత్తర రామచరిత్ర నాటకాన్ని వ్రాసాడు. అందుకే ఉత్తర రామచరిత్రలో శాకుంతల నాటకానుకరణలు తప్పలేదు. శాకుంతలం ఉత్తరరామ చరిత్ర నాటకాల కథావస్తువుల్లో చాలా సామ్యాలను చూడవచ్చును. రెండు నాటకాలల్లో నాయకులు నాయికలను చాలా ప్రేమించారు. ఒకరు దైవ విధిచేత పరిత్యజిస్తే మరొకరు ధర్మవిధి కొరకు పరిత్యజించారు. అలౌకికశక్తి సహాయంతో భర్తృపరిత్యక్తయైన శకుంతల హేమకూటం చేరుకుంటుంది, సీత రసాతలం చేరుకుంటుంది. తర్వాత ప్రియావియోగంతో నాయకులు విరహవ్యథను చెందుతారు. రాముని విరహదుఃఖాన్ని భవభూతి కరుణాత్మకంగా చిత్రించాడు. దుష్యంతుని విరహదుఃఖవర్ణన ఎక్కువగా లేదు. దుష్యంతుడు శకుంతల చిత్రపటాన్ని వ్రాసుకొని దాన్నిచూస్తూ దుఃఖిస్తాడు. రాముడు పంచవటికిపోయి అక్కడ విరహవ్యథను పొందినట్లుగా భవభూతి చిత్రించాడు. వియోగానంతరం ఇద్దరు నాయికలు పుత్రవతులైనారు. ఆ పుత్రులవల్లనే వారికి భర్తలతో పునస్సమాగమం కలిగింది. స్థూలరూపంగా చూస్తే రెండు కథాయోజనల్లో సామ్యం కనిపిస్తున్నది. కాళిదాసు మహాభారతంలోని నీరసమైన శకుంతల కథను తీసుకొని వాల్మీకి సీతవృత్తాంతాన్ని అనుకరించి శకుంతల చరిత్రను నాటకంగా వ్రాసాడు. భవభూతేమో వాల్మీకి ఉత్తరరామాయణంలోని సీత కథనే తీసుకొని నాటకంగా వ్రాసాడు. అందుకేనేమో రెండు నాటకాలల్లో స్థూలంగా చూస్తే సామ్యం కన్పిస్తున్నది. సూక్ష్మంగా పరిశీలిస్తే వీటిల్లో అనేక భేదాలున్నవి. ముఖ్యంగా పాత్రల మనోభావాలు పూర్తిగా భిన్నమైనవి. దుష్యంతుడు లంపటుడు, చంచలుడు. రాముడు ధీరుడు, నిష్కాముడు, స్నేహశీలి. శకుంతల ముగ్ధ, స్వతంత్ర ప్రవృత్తి గలది, ఆత్మగర్వం కలది. సీత ప్రౌఢ, ధీరురాలు, ఆత్మవిశ్వాసం కలది. కాముక ప్రవృత్తిగల శకుంతలా దుష్యంతుల ప్రేమకన్న

సీతారాముల దాంపత్యప్రేమ ఆదర్శనీయంగా వున్నది. కాని ఇద్దరు కవులు ఆయా పాత్రలను సృష్టించటంలో అపూర్వ ప్రతిభనే ప్రదర్శించారు. మహాభారతంలోని శాకుంతల కథను తీసుకొని కాళిదాసు శాకుంతల నాటకాన్ని సృష్టించగా ఉత్తర రామాయణ కథను తీసుకొని భవభూతి ఉత్తర రామచరిత్ర నాటకాన్ని సృష్టించాడు. భారతీయ ఆదర్శ గృహిణి, గృహస్థ జీవితం, దాంపత్యప్రేమ వీటినే ఇద్దరు పరోక్షంగా చిత్రించి చూపి అమరులైనారు.

## భవభూతి మీద కాళిదాసు ప్రభావం

కాళిదాసు అంటె భవభూతికి ఎటువంటి వైరం లేదు. కాళిదాసు మీద అతనికి గౌరవాభిమానాలు వున్నవి. అందుకే ఎన్నోచోట్ల భవభూతి కాళిదాసు చిత్రించిన నాయికా నాయకులను స్మరించాడు. మాలతీమాధవంలో మాలతిని మాధవునితో పారిపొమ్మని నచ్చజెప్తు కామందకి శకుంతలా దుష్యంతుల, ఊర్వశీ పురూరవుల ప్రేమ వివాహాన్ని దృష్టాంతంగా చూపుతుంది. ఇది కాళిదాసు నాటకాలను దృష్టిలో పెట్టుకొనే భవభూతి వ్రాసాడు. అదే విధంగా మాలతీమాధవంలో కామందకి పాత్ర కాళిదాసు మాళవికాగ్నిమిత్రంలోని కౌశకి పాత్రను స్మరింప జేస్తుంది. మాలతీమాధవం నవమాంకంలో మాధవుడు విరహ వ్యథతో మేఘాన్ని తన ప్రియురాలికి సందేశాన్ని తీసుకపొమ్మని వేడుకొంటాడు. ఇది తప్పక కాళిదాసు మేఘసందేశ ప్రభావమే. ఈ వేడుకోవటం యక్షునిలాగానే మాధవుడు "మందాక్రాంతం"లో వేడుకొంటాడు.

ఉత్తరరామ చరిత్ర మీద శాకుంతల నాటక ప్రభావం చాల వున్నదని చెప్పవచ్చును. రాముడు కుశలవులను తన కుమారులుగా గుర్తించటం శాకుంతలంలో దుష్యంతుడు సర్వదమనున్ని తన కుమారునిగా గుర్తించటాన్ని అప్రయత్నంగా స్మరింపజేస్తుంది. మహాభారతంలోని శకుంతల కథను తీసుకొని కాళిదాసు వాల్మీకి సీతాచరిత్ర చిత్రణచేత ప్రభావితుడై మార్పులు చేర్పులుచేసి శాకుంతల నాటకాన్ని రచించాడు. ఆ శాకుంతల నాటకం తిరిగి భవభూతి సీతారాముల చరిత్ర చిత్రణకు మార్గదర్శకమైంది. కాళిదాసు రఘు వంశం (14వ సర్గ)లో రావణ వధ తర్వాత సీతారాములు అయోధ్యలో సుఖ జీవతాన్ని గడుపుతూ తమ అరణ్యవాస దినాలను చిత్రాలుగా గోడలమద చిత్రింపజేస్తారు. ఉత్తర రామచరిత్ర ప్రథమాంకంలోని చిత్రపట దర్శన దృశ్యాన్ని భవభూతి రఘువంశంలోని ఈ విషయాన్నే దృష్టిలో పెట్టుకొని కల్పన చేసి వుంటాడు.

ఈ విధంగా భవభూతి కాళిదాసును ప్రత్యక్షంగాను, పరోక్షంగాను అనుకరించి అతనిమీద తనకున్న అభిమానాన్ని చాటుకున్నాడు. అయినా భవభూతి మార్గం భవభూతిది, కాళిదాసు మార్గం కాళిదాసుది.

# మురారి

## మురారి కాలం

రామాయణ కథను నాటకంగా మలచిన కవులల్లో మరొక కవి మురారి. అతని నాటకం అనర్ఘ రాఘవం. మురారి తండ్రి శ్రీవర్ధమానకుడు, తల్లి తంతుమతి, మౌద్గల్య గోత్రజుడు అని అతని నాటకప్రస్తావనను బట్టి తెలుస్తున్నది. వింటర్‌నిట్స్ మురారిని క్రీ.శ. 1050-1135 కాలంవానిగా నిర్ణయించాడు. రత్నాకరాది కవులు మురారిని స్మరించారు. దీన్ని గమనించక అతడు ఈ కాల నిర్ణయాన్ని చేసివుంటాడు. కొన్ని సాక్ష్యాధారాలను బట్టి మురారి కాలనిర్ణయాన్ని చేయటానికి వీలవుతున్నది. భవభూతి ఉత్తరరామ చరిత్రలోని శ్లోకాల అనుకరణలు మురారి అనర్ఘరాఘవంలో కన్పిస్తున్నవి. రత్నాకరుడు తన హరవిజయంలో మురారిని ప్రశంసించాడు. రత్నాకరుడు ఆనందవర్ధనునికి సమకాలికుడు, కాశ్మీరరాజు అవంతివర్మ ఆస్థానపండితుడు. అంటె రత్నాకరుడు క్రీ.శ. 9వ శతాబ్దం ఉత్తరార్ధంవాడు. పై రెండు ఆధారాలనుబట్టి మురారి క్రీ.శ. 750-850 నడిమివాడని చెప్పవచ్చును. మురారి దాక్షిణాత్యుడని కొందరు, బెంగాల్ బ్రాహ్మణుడని కొందరు విమర్శకులు తలంచారు. దక్షిణదేశంలో ముఖ్యంగా ఆంధ్రులకు మురారి అభిమానకవిగా కన్పిస్తాడు. అతని నాటకం ఆంధ్రుల్లో విస్తృతంగా ప్రచారంలో వుంది. ఒక వేళ మురారి ఆంధ్రుడైవుండి బెంగాల్‌కు వలస పోయాడేమో. మురారి తన నాటకం సప్తమాంకంలో నర్మదానదీ తటానవున్న మాహిష్మతీ నగరాన్ని కలచురిరాజుల రాజధాని అని విశేషంగా పేర్కొనటంచేత అతడు మాహిష్మతీ నగరవాసి అని కీథ్ అభిప్రాయపడినాడు. "మురారేః తృతీయ పంథాః" అని ప్రసిద్ధి వుంది. మీమాంసాదర్శనంలో రెండు విభిన్న మతాలున్నవి. ఒకటి- కుమారిల భట్టు మతం. రెండవది- ప్రభాకరుని మతం. ఈ రెండూ కాక మురారిది వేరే ఒక మతముండేదని అతడు ప్రసిద్ధ మీమాంసకుడని ఈ ఉక్తిని బట్టి తెలుస్తున్నది. కాని అతని గ్రంథాలేవి దొరకడం లేదు. అందుకని అవహేళనగా నామమాత్రజ్ఞాతున్ని "మురారేః తృతీయ పంథాః" అని అంటారు. అయితే మొత్తంమీద ఆ మురారి నాటకకర్త మురారి కాదు. మురారికి "మహాకవి, బాలవాల్మీకి" అన్న బిరుదాలున్నవి. రామాయణ కథను నాటకంగా వ్రాయటంచేత అతనికి బాలవాల్మీకి అన్న బిరుదం లభించి వుంటుంది.

## మురారి రచనలు

అనర్ఘరాఘవం ఏడు అంకాల నాటకం. భవభూతి మీది స్పర్ధతో, అతని మహావీరచరిత్రకు పోటీగా మురారి ఈ నాటకాన్ని వ్రాసివుంటాడని పండితుల అభిప్రాయం. కావ్యజగత్తులో భారవితో స్పర్ధ వహించి మాఘుడు కావ్యరచన చేసివున్నాడు. స్పర్ధతో మించాలని మాఘుడు భారవి కవిత్వాన్ని అనుకరించినట్లుగానే మురారికూడ అనేకచోట్ల భవభూతిని అనుకరించాడు. కాని మాఘునికున్న పాండిత్య వైభవంగాని, భవభూతికున్న పదవిన్యాసం గాని మురారిలో లేవు. మురారి కథాయోజనలో భవభూతి మహావీరచరిత్రనే అనుసరించాడు-

**ప్రథమాంకం:-** దీర్ఘమైన ప్రస్తావన తర్వాత ప్రథమాంకం ఆరంభమౌతుంది. దశరథ విశ్వామిత్రుల సంభాషణ దీనిలో వున్నది. విశ్వామిత్రుడు యాగరక్షణకై రామలక్ష్మణులను తీసుకొని పోవటంతో ఈ అంకం ముగుస్తుంది.

**ద్వితీయాంకం:-** రావణాదులను గురించి పరిచయం విష్కంభంలో ఇయ్యబడింది. రాముడు తాటకను వధించటం, రామలక్ష్మణులను తీసుకొని విశ్వామిత్రుడు మిథిలకు ప్రయాణం కావటం దీనిలో చెప్పబడింది. ఈ అంకంలో దీర్ఘమైన మధ్యాహ్న, సూర్యాస్తమయ, రాత్రి వర్ణనలున్నవి.

**తృతీయాంకం:-** రావణుడు సీతను వివాహమాడదలచినట్లు విష్కంభం ద్వారా తెలుస్తుంది. రాముడు శివధనుస్సును విరుస్తాడు. అప్పుడు రావణుని పురోహితుడు శేష్కలుడు వచ్చి దీనికి ప్రతీకారం జరుగుతుందని రామున్ని బెదిరిస్తు నిష్క్రమిస్తాడు.

**చతుర్థాంకం:-** రావణుని మంత్రి మాల్యవంతుడు సీతను రావణుని కిచ్చి వివాహం చేయించాలన్న తన యోజన నిష్ఫలమైనందుకు చింతామగ్నుడై వుంటాడు. శూర్పణఖ వచ్చి సీతారాముల వివాహవార్తను తెలుపుతుంది. సీతారాములకు వియోగం జరుగాలని, సీత రావణుని హస్తగతం కావాలని తలంచి కైకేయి ద్వారా రామునికి వనవాసమయ్యేటట్లు చెయ్యమని మాల్యవంతుడు శూర్పణఖను ప్రేరేపిస్తాడు. ఇక్కడే పరుశురాముడు మిథిలకు చేరినట్లు తెలుస్తుంది. దీన్నంతా కవి విష్కంభం ద్వారా ప్రేక్షకులకు తెలియజేసాడు. చతుర్థాంకంలో రామ పరశురాముల సంభాషణ వున్నది. వారిద్దరికి యుద్ధం జరుగుతుంది. ఇంతలో దశరథాదులు ప్రవేశిస్తారు. దశరథుడు రామునికి రాజ్యాభిషేకం చేస్తానని

చెప్తాడు. అప్పుడు కైకేయి రెండు వరాలను తెలుపుతు మంథర ప్రవేశిస్తుంది. మంథర మాటలువిని దశరథుడు మూర్ఛిల్లుతాడు.

**పంచమాంకం:-** జాంబవంత, శ్రమణులకు జరిగిన సంభాషణతో కూడిన విష్కంభం ద్వారా రాముడు వనవాసం పోయినట్లుగా అక్కడ అనేక దుష్ట రాక్షసులను చంపినట్లు తెలుస్తుంది. రావణుడు సీతను అపహరించుకొని పోవటం, జటాయువు అతన్ని అడ్డగించటం, రామలక్ష్మణులు సీత కొరకు వెతుకుతుండగా వాలి రామున్ని ఎదిరించటం, వాలి వధ, సుగ్రీవ పట్టాభిషేకం ఈ అంకంలో వున్నవి.

**షష్ఠాంకం:-** రావణుని గూఢచారులు శుక, సారణులు మాల్యవంతునికి రాముడు సముద్రం మీద సేతుబంధాన్ని చేసే వృత్తాంతాన్ని తెలుపుతారు. నేపథ్యంలో కుంభ, ఇంద్రజిత్తుల యుద్ధ ప్రస్థానం సూచింపబడింది. ఆ తర్వాత రత్న చూడ, హేమాంగదులనే విద్యాధరులు ప్రవేశించి రామరావణ యుద్ధాన్ని వర్ణిస్తారు. రావణుడు చంపబడుతాడు.

**సప్తమాంకం:-** సీతారాములు, లక్ష్మణ, హనుమంత, సుగ్రీవ, విభీషణాదులు పుష్పక విమానం మీద అయోధ్య చేరుకుంటారు. మార్గ మధ్యంలో సుమేరు చంద్ర లోకాదుల వర్ణనలు వున్నవి. రఘువంశం 13వ సర్గలోని వర్ణనలను అనుసరించి, మహావీరచరిత్ర సప్తమాంకంలో వలెనే మురారి నగర పర్వత నది వన ఉపవనాదుల వర్ణనలను చేసాడు. వసిష్ఠుడు, భరతుడు రామునికి స్వాగతం చెప్తారు. రాముని రాజ్యాభిషేకంతో నాటకం ముగుస్తుంది.

## మురారి నాటక కళ

చాలాచోట్ల మురారి భవభూతి మహావీర చరిత్రను అనుకరించి కథా సంఘటనలను కూర్చినా అతని నాటకం సఫలవంతం కాలేదు. రామాయణ కథనంతా ఏడు అంకాల నాటకంగా మలచదలుచుకునే విషయంలో మురారి భవభూతి వలెనే పొరపాటు చేసాడు. అయినా భవభూతి నాటకాన్ని ముందుంచుకొని దానికన్న మెరుగైన నాటకాన్ని వ్రాయలేక పోయాడు. నాటకకళా ప్రావీణ్యాన్ని గాని పాత్ర చిత్రణా కౌశలాన్ని గాని ప్రదర్శించలేకపోయాడు. నాటకీకరణ కొరకు మురారి రామాయణ కథలో అక్కడక్కడ మార్పులను చేసాడు. కాని అవి అంత చెప్పుకోదగ్గవిగా లేవు. నాటకంలో విష్కంభాదుల్లోని సంభాషణల తోనే చాలా వరకు కథను కవి ప్రేక్షకులకు తెలిసేటట్లు చేసాడు. రంగస్థలం

మీద సంఘటనలు చాల తక్కువ ప్రదర్శింపబడినవి. దానిచేత నాటకం రక్తికట్టక విసుగుపుట్టించేటట్లుగా తయారయింది. కథాగతిలో వేగం లేదు. కథ కుంటుపడుతూ శిథిలంగా నడిచింది. వస్త్వైక్యం (Unity of plot and action) ఎక్కడా సాధింపబడలేదు. వర్ణనలు కూడ చాల చోట్ల సుదీర్ఘంగా వుండటంచేత నాటకానికి కావ్య స్వరూపం వచ్చింది. మురారి నాటికి నాటకాలు కూడ శ్రవ్య కావ్యాలవలెనే చదువుకోవటానికే గాని రంగస్థలం మీద ప్రదర్శింపబడి ఆనందింపబడటం తగ్గుముఖం పట్టినట్లుగా తోస్తున్నది. అందుకే నాటకాలల్లో నాటకకళ మీద కన్న కవులు కావ్యపక్షం మీదనే దృష్టిని నిలిపారు.

## మురారి కవిత్వం

మురారి భవభూతి పదవిన్యాసాన్ని, మాఘుని పదలాలిత్యాన్ని అనుకరించ టానికి ప్రయత్నించినా అతని కవిత్వం ఏమి రక్తి కట్టలేదు. సంభాషణలను కూడ అంత బాగా కవి వ్రాయలేకపోయాడు. మురారి చాలా చోట్ల అప్రసిద్ధ పదాలను వాడాడు. ఆ పదాలు మాఘునివంటి వైయాకరణునికే అర్థమౌతవని కీథ్ అభిప్రాయం. మురారి పాండిత్యం చెప్పుకో తగ్గది. 'చిత్త శుక్తితో అనేక స్వాతి బిందువుల రూపమైన శాస్త్రాలను తాగి అక్షర రూపమైన ముత్యాలహారాన్ని రచించా'నని మురారి తన నాటక రచనను గూర్చి ప్రస్తావించి వున్నాడు. అక్కడక్కడ మురారి తన శాస్త్ర పాండిత్యాన్ని వచోయుక్తి నైపుణిని ప్రదర్శించినా అతడు మాఘ శ్రీహర్షులంత ఉద్దండ పండితుడు కాడు. అయినా ప్రాచీన లాక్షణికులు మురారి ప్రౌఢశైలిని ప్రశంసించి వున్నారు.

దేవీం వాచ ముపాసతేహి బహవస్సారంతు సారస్వతం
జానీతే నితరా మసౌ గురుకుల క్లిష్టో మురారిః కవిః

"సరస్వతీ దేవిని చాలామంది ఉపాసిస్తారు కాని సారస్వత సారం క్లిష్టమైన గురుకుల నివాసం చేసిన మురారికే తెలుస్తుంది".

కాని ఆధునికులు మురారి పాండిత్యాన్ని గ్గాని శైలినిగాని మెచ్చుకోలేదు. అతని శైలిలో ప్రౌఢత్వం గాని మాధుర్యం గాని లేదనే విమర్శించారు. అనర్ఘరాఘవం వీరరస మంగిగాగల నాటకం. వీరరసస్ఫూర్తి కొరకు కావచ్చును మురారి దీర్ఘ సమాసాలుగల ఓజోగుణ ప్రధానమైన శైలిని ప్రయోగించాడు. విషయవిస్తారం గల శార్దూల విక్రీడితాలనే అతడు అంతటా ఆదరించాడు. అతనికి భౌగోళిక జ్ఞానం అంతగా లేనట్లుగా, అతని నగర పర్వతాది వర్ణనలు చెప్తున్నవి.

## శివస్వామి

కాశ్మీరరాజు అవంతివర్మ (క్రీ.శ. 855-883) ఆస్థాన కవి. శివస్వామి అనేక నాటకాలను, నాటికలను రచించినట్లుగా కల్హణుడు రాజతరంగిణిలో పేర్కొన్నాడు. కాని అవేవి లభించలేదు.

## అనంగ హర్ష మాత్ఱరాజు

ఈ కవి రచించిన నాటకం "తాపస వత్సరాజం". ఈ నాటకాన్ని ఆనందవర్ధనుడు (క్రీ.శ. 850) పేర్కొనటం చేత ఈ కవి క్రీ.శ. 850 కి పూర్వుడని చెప్పవచ్చును. ఈ నాటకంలో ఆరు అంకాలున్నవి. వాసవదత్త మిథ్యా మరణ వార్తను విని వత్సరాజు ఉదయనుడు దుఃఖితుడై వనంలో తిరుగాడుతుంటాడు. ఆ తర్వాత జీవితం మీద విరక్తి కలిగి సన్యాసి అవుతాడు. చివరకు నదిలో దుమికి మరణించాలని అనుకుంటాడు. వాసవదత్త కూడ జీవితంతో విసిగి నదిలో దుమికి ప్రాణత్యాగం చేయాలనుకొని అక్కడికే వస్తుంది. వాళ్ళిద్దరు కలుసుకొంటారు.

## మాయురాజు

రాజశేఖరుడు ఈ కవిని పేర్కొనటం చేత ఇతడు క్రీ.శ. 900 కు పూర్వుడని తెలుస్తున్నది. ఈ కవికి భవభూతి పరిచయ మున్నది కాబట్టి భవభూతికి తర్వాత వాడని చెప్పవచ్చును. ఇతని నాటకకృతి ఉదాత్త రాఘవం. తాపసవత్సరాజం వ్రాసిన మాత్ఱరాజే ఈ నాటకాన్ని వ్రాసాడని కొన్నాళ్ళు విమర్శకులు అభిప్రాయపడినారు. కాని రాజశేఖరుడు ఇతన్ని కలచురి వంశ రాజుగా పేర్కొన్నాడు. దానితో ఇతడు వేరే క్షత్రియకవి అని తెలిసింది. ఈ నాటకం అలభ్యం. ధనికుడు ఈ నాటకం నుంచి ఉద్ధరణలు ఇచ్చాడు. ఈ ఉద్ధరణలనుబట్టి మూలకథలో కవి చాల మార్పులు చేసినట్లు తెలుస్తున్నది.

## భీమటుడు

రాజశేఖరుడు (క్రీ.శ. 900 ప్రాంతం) ఈ కవిని పేర్కొనటంచేత ఇతడు తత్పూర్వుడని చెప్పవచ్చును. ఈ కవి కలంజరపతి, చందేల రాజవంశానికి చెందినవాడు. ఇతడు ఐదు నాటకాలను వ్రాసాడు. స్వప్నదశాననం, ప్రతిజ్ఞా చాణక్యం, మనోరమావత్సరాజం అనే

మూడు నాటకాలే మనకు పరిచితమైనవి. ఇవి అలభ్యాలు. మిగిలిన రెండు నాటకాల పేర్లుకూడ తెలియవు. ఇతని నాటకాలల్లో స్వప్నదశాననం శ్రేష్ఠమైన నాటకమని తెలుస్తున్నది.

## శక్తిభద్రుడు

శక్తి భద్రుడు శంకరాచార్యుని శిష్యుడు అని అంటారు. అంటె క్రీ.శ. 800 ప్రాంతం వాడు. ఇతని నాటకం ఆశ్చర్య చూడామణి. నాటక ప్రస్తావనలో దక్షిణాపథంవాడను అని చెప్పుకొన్నాడు. ఇతడు కేరళ దేశస్థుడు కావచ్చును. ఇతని నాటకంలో ఏడు అంకాలున్నవి. దీనిలో రామాయణ కథమీద ఆధారపడిన ఇతివృత్తమున్నది. పేరునుబట్టి దీనిలో ఆశ్చర్య పూర్ణమైన సంఘటనలున్నట్లుగా తెలుస్తున్నది. కవి రామాయణ కథలో చాల మార్పులను చేసి అద్భుతమైన సన్నివేశాలను సృష్టించి అద్భుతరసాన్ని పోషించాడు. ఈ నాటకంలో రాముని అంగుళీయకం, సీత చూడామణి - ఈ రెండు అద్భుత మహిమలు కలవిగా చెప్పబడినవి. రావణుడు రాముని వేషాన్ని ధరించి సీతను ఎత్తుకొని పోయినట్లుగా కవి కల్పన చేసాడు. నాటక కథ పంచవటిలో ఆరంభమై సీత అగ్ని పరీక్షతో ముగుస్తుంది. ఋషులు సీతకు ఒక చూడామణిని ఇస్తారు. రాముడు మాయలేడి రూపంలో వున్న మారీచుని తరిమి ఆశ్రమానికి రాగా అక్కడ శూర్పణఖ సీత వేషంలో వుంటుంది. గాయపడిన మారీచుడు రాముని వేషంలో వస్తాడు. నిజమైన రాముడు తన్నగా రాముని వేషంలో వున్న మారీచుడు మరణిస్తాడు. శూర్పణఖ కూడ నిజరూపంతో నిలుస్తుంది. ఈ నాటకంలో అద్భుత మహిమలు గల చూడామణి ప్రధాన పాత్ర వహిస్తుంది. అందుకే ఈ నాటకానికి కవి ఆశ్చర్య చూడామణి అని పేరు పెట్టాడు. రాముని అంగుళీయకం, సీత చూడామణి ప్రసక్తులు వాల్మీకి రామాయణంలో వున్నవి. కాని అక్కడ అవి అద్భుత మహిమలు కలవిగా చెప్పబడలేదు.

శక్తి భద్రుని కవిత్వం సరళంగా వున్నది. ప్రసాద మాధుర్య గుణభరితమైంది. వైదర్భీ రీతిలో కవితా శైలి నడిచింది. భవభూతి తర్వాత వ్రాయబడిన రామాయణ కథమీద ఆధారపడిన నాటకాలల్లో ఆశ్చర్య చూడామణి ఒక్కటె రంగస్థల ప్రదర్శనకు యోగ్యంగా వున్నది. అందుకే కుప్పుస్వామి దీనిని భవభూతి ఉత్తరరామచరిత్ర తర్వాత చెప్పుకోదగిన నాటకంగా పేర్కొన్నాడు. కేవలం అద్భుత రసస్ఫూర్తే అంతటా ఈ నాటకంలో కన్పిస్తున్నది. కాని వేరే విశేషత లేదనే చెప్పాలి.

శక్తిభద్రుడు ఉన్మాద వాసవదత్త, వీణా వాసవదత్త అనే నాటకాలను రచించినట్లు తెలుస్తున్నది. కాని అవి దొరకలేదు. శక్తిభద్రుడు కేరళదేశంలో వెలసిన సంస్కృత నాటక కారుల్లో ప్రథముడని తెలుస్తున్నది.

## కులశేఖర వర్మ

ఈ కవి కేరళ దేశాన్నేలిన రాజు. ఇతడు నాటక సంప్రదాయాన్ని కేరళలో వికసింపజేసిన వాడని అంటారు. ఇతని కాలం క్రీ.శ. 800 ప్రాంతం. కొందరు ఇతన్ని క్రీ.శ. 10వ శ॥ వానిగా కూడా చెప్తారు. సుభద్రాధనంజయం, తపతీసంవరణం అనే నాటకాలను రచించాడు. కాని కవి అద్భుత రసపోషణకై అద్భుత సంఘటనలను చాల కల్పించి వున్నాడు. ఇది ఐదు అంకాల నాటకం. తపతీ సంవరణం ఆరు అంకాల నాటకం. ఇది కూడ అద్భుత సంఘటనలతో నిండి వున్నది. శక్తి భద్రుడు, కులశేఖర వర్మ ఇద్దరూ కూడ అద్భుత రసపోషణకై ప్రసిద్ధమైన కథల్లో కూడ చాల మార్పులను చేసి ఆశ్చర్యకరమైన సన్నివేశాలను సృష్టించి నాటకాలను వ్రాసారు. ఇవి రంగస్థలం మీద ప్రదర్శింపబడటానికి సుయోగ్యంగా వున్నవి. అంటె ఈ నాటకాలు ప్రేక్షకులను అద్భుతరసమగ్నులను చేయటానికి పుట్టినవనే చెప్పాలి. విశ్వనాథునికి అంటె క్రీ.శ. 14వ శతాబ్దానికి పూర్వుడైన నారాయణుడు అద్భుత రసాన్ని గుర్తించి దానికి విభావానుభావాదులను ఏర్పరిచి రసాలల్లో స్థానాన్ని కల్పించాడు. సత్త్వగుణాధిక్యంవల్ల మనకు బాహ్య ప్రపంచాన్ని మరపించే ఆనందం అద్భుతరసంవల్ల కలుగుతుందని అతడన్నాడు. విస్మయం దీనికి స్థాయి భావం. లోకోత్తర చమత్కారం దీనికి ప్రాణం. చమత్కారంవల్ల మనస్సు విస్తరిస్తుంది. తద్వారా విస్మయం జనిస్తుంది. అద్భుతరసం గల నాటకాలు దక్షిణదేశంలో కేరళలో ఇంకా కొన్ని రచింపబడినవి.

## హనుమన్నాటకం

ఆనందవర్ధనుడు (క్రీ.శ. 850) ఈ నాటకం నుంచి ఉద్ధరణలను ఇచ్చాడు. కాబట్టి ఈ నాటకం (క్రీ.శ. 850) కి పూర్వ రచన అని నిశ్చయంగా చెప్పవచ్చును. దీన్ని సాక్షాత్తు హనుమంతుడే వ్రాసాడని అందుకే దీనికి హనుమన్నాటకమనే పేరు కలిగిందని ఐతిహ్యం. దీనికి మహా నాటకమని కూడ పేరు. వాల్మీకి రామాయణాన్ని వ్రాస్తున్నాడని తెలుసుకొని హనుమంతుడు తన నాటకం ఆ కావ్యమహత్త్వాన్ని నశింపజేస్తుందని తలంచి ఆ నాటకాన్ని

సముద్రంలో పారవేశాడట. ఆ నాటకం ధారానగర రాజా భోజునికి దొరకగా అతడు దాన్ని శిలలమీద చెక్కించాడట. ఇప్పుడు ఈ నాటకం రెండు వ్రాతప్రతుల రూపంలో లభిస్తున్నది. ఒకటి- బెంగాల్ ప్రాంతానికి చెందిన మధుసూదనుడు కూర్చిన తొమ్మిది అంకాల నాటకం. రెండు- పశ్చిమ భారతానికి చెందిన దామోదరమిశ్రుడు కూర్చిన పద్నాలుగు అంకాల నాటకం.

హనుమన్నాటకంలో గద్యం చాల తక్కువ. శ్లోకాలే ఎక్కువ. ఈ శ్లోకాలు కొన్ని భవభూతి, మురారి, రాజశేఖరాదుల రామాయణ నాటకాలల్లోనుంచి తీసుకొన్నవి. ఈ నాటకం క్రీ.శ. 850 కి పూర్వం నుంచే ఏదో రూపంలో ప్రచారంలో వుండి కాలక్రమంగా శ్లోకాలు అదనంగా చేర్చబడి పెరుగుతూవచ్చి బృహద్రూపాన్ని ధరించి పద్నాలుగు అంకాల నాటకంగా మారి వుంటుంది. ఆనందవర్ధనుని నాటికే ఇది 'మహానాటక' రూపాన్ని పొందిందని అతని ఉద్ధరణలనుబట్టి చెప్పవచ్చును. ఈ నాటకంలో ప్రాకృత భాషాప్రయోగం చేయబడలేదు. విదూషక పాత్ర కూడ లేదు. మోహనదాసు అనే రామభక్తుడు దీనికి వ్యాఖ్యానం కూడ వ్రాసాడు.

## క్షేమీశ్వరుడు

క్షేమీశ్వరుడు రాజశేఖరునికి ఆశ్రయదాత అయిన కనౌజురాజా మహీపాలుని ఆస్థానకవి. ఇతడు రాజశేఖరునికి సమకాలికుడై వయస్సున అతనికన్న చిన్నవాడై వుంటాడు. అప్పుడు ఇతని కాలం క్రీ.శ. 900 ప్రాంతం. ఈ కవి మహీపాలుని ప్రీతికొరకు చండకౌశికమనే నాటకాన్ని వ్రాసాడు. మార్కండేయ పురాణంలోని హరిశ్చంద్రుని కథ ఆధారంగా ఈ నాటకం వ్రాయబడింది. దీనిలో ఐదు అంకాలున్నవి. ఈ నాటకంలో కవి భయంకరమైన శ్మశాన భూమిని చిత్రించాడు. అక్కడక్కడ భవభూతి భయంకర వర్ణనలను పోలిన వర్ణనలు దీనిలో వున్నవి. క్షేమీశ్వరుని రెండవ నాటకం నైషధానందం. దీనిలో ఏడు అంకాలున్నవి. మహాభారతంలోని నలోపాఖ్యానం ఈ నాటకానికి ఇతివృత్తం. క్షేమీశ్వరుని శైలి ప్రసాదగుణ భరితమైంది. వీటిల్లోని నాటకకళ చెప్పుకోదగ్గట్టుగా లేదు.

## రాజశేఖరుడు

### రాజశేఖరుని జీవిత విశేషాలు

రాజశేఖరుని గురించి మనకు చాలా విషయాలు తెలియవచ్చినవి. అతడు తన పరిచయాన్ని ఇతర కవులకన్న ఎక్కువగానే తన గ్రంథాలలో ఇచ్చుకొన్నాడు. రాజశేఖరుడు

పండిత వంశంలో జన్మించాడు. అతని తండ్రి దుర్దకుడు, స్వయం ప్రతిభతో మంత్రి పదవిని అధిష్ఠించాడు. తల్లి శీలవతి. అతని ప్రపితామహుడు అకాలజలదుడనే కవివరుడు. అంతకు పూర్వం వీరి వంశంలో తరళుడు, సురానందుడనే కవులు జన్మించారు. అకాలజలదుడు ప్రసిద్ధమైన కవి. అతని శ్లోకాలను సుభాషిత గ్రంథాలల్లో దాక్షిణాత్యుడనే పేరుతో లభిస్తున్నవి. రాజశేఖరుడు బాల్యంనుంచే కవిత్వం చెప్పి 'బాలకవి' అనే బిరుదాన్ని సంపాదించాడు. అతడు తాను యాయావరకులానికి చెందినవాడనని చెప్పుకొన్నాడు. యాయావరకులం క్షత్రియుల్లోను, బ్రాహ్మణుల్లోను వున్నారని, రాజశేఖరుడు క్షత్రియుడని, అందుకే చౌహాణ క్షత్రియ వంశానికి చెందిన కన్యను అవంతి సుందరిని వివాహమాడాడని కొందరు విమర్శకులు తలంచారు. రాజశేఖరుడు కన్నౌజురాజు మహేంద్రపాల, మహీపాలురకు గురువుగా వున్నాడు. బ్రాహ్మణులే గురువుగా వుంటారు కాబట్టి అతడు బ్రాహ్మణుడని మరికొందరు విమర్శకులు తలంచారు. ఆ కాలంలో బ్రాహ్మణులు క్షత్రియ కన్యలను వివాహమాడటం తప్పుగా భావింపబడక పోయేది. అవంతి సుందరి మంచి పండితురాలు, విదుషీమణి కాబట్టే ఆమె తన రుచికి అనుకూలంగా పండితుడైన రాజశేఖరున్ని వివాహమాడి వుంటుంది. రాజశేఖరుని రచనా వ్యాసంగానికి ఆమె ప్రేరణ అయినట్లు కన్పిస్తున్నది. కావ్యమీమాంసలో రాజశేఖరుడు చాలచోట్ల అవంతిసుందరి అభిప్రాయాలను వుట్టంకించి వున్నాడు. అదే అతనికి ఆమెమీదగల ఆదరాభిమానాలను ప్రకటిస్తున్నది. యాయావరీయులు ఒక్కచోట స్థిరరూపంగా వుండక గృహస్థులైనా సన్యాసులవలె అటుయిటు తిరుగుతూ భజనలు చేస్తూ జీవితాన్ని గడిపేవారు. రాజశేఖరుడు అటువంటి జీవితాన్ని గడుపలేదు కాని అటువంటి సంప్రదాయాన్ని పాటించిన బ్రాహ్మణకులంలో పుట్టినవాడు. రాజశేఖరుడు కన్నౌజురాజు మహేంద్రపాలుని విద్యాగురువు. మహేంద్రపాలుని రాజ్యకాలం క్రీ.శ. 890-907. మహేంద్రపాలుని ఆస్థానంలో సభాపండితుడుగా గురువుగా వున్నాడంటె అతని వయస్సు కనీసం అప్పటికి 25-30 సంవత్సరాలైనా అయివుంటుంది. మహేంద్రపాలుని తర్వాత అతని కొడుకు మహీపాలుని (క్రీ.శ. 910-940) ఆస్థానంలోను, ఆ తర్వాత కేయూరవర్షుని ఆస్థానంలోను రాజశేఖరుడున్నాడు. కబట్టి రాజశేఖరుని కాలం క్రీ.శ. 860-940 నడుమ అని చెప్పవచ్చును. రాజశేఖరుడు భవభూతి, వామన, ఆనందవర్ధనులను పేర్కొన్నాడు. అభినవగుప్త, క్షేమేంద్ర, మమ్మటులు రాజశేఖరుని ఉద్ధరించారు. ఈ విధమైన పూర్వాపరాలను పరిశీలిస్తే రాజశేఖరుడు క్రీ.శ. 860-940 మధ్యవాడనటం సమంజసం.

రాజశేఖరునికి సమకాలికమైన చాలా రాజ్యాలతో, రాజులతో పరిచయమున్నట్లుగా కన్పిస్తున్నది. అతడు తన రచనలల్లో ఆంధ్ర ద్రవిడ కుంతల విదర్భ లాట చేదిరాజ్యాలను వర్ణించాడు. అతని రచనల్లో నాయికానాయకులు పై దేశాలకు సంబంధించినవారే. అతనికి ఆ రాజ్యాలతో గల పరిచయాన్ని క్షేమేంద్రుడు తన ఔచిత్యవిచార చర్చలో ఇట్లా తెలిపాడు-

కర్ణాటీ దశనాంకిత: శితమహారాష్ట్రీ కటాక్ష క్షత:
ప్రౌఢాంధ్రీ స్తనపీడిత: ప్రణయినీ భ్రూభంగ విత్రాసిత:
లాటీబాహు వివేష్ఠితశ్చ మలయ స్త్రీ తర్జనీ తర్జిత:
స్యోయం సంప్రతి రాజశేఖరకవి: వారణసీం వాంఛతి.

రాజశేఖరుడు తన అంతిమకాలాన్ని వారణాసిలో గడిపినట్లు పై శ్లోకం వల్ల తెలుస్తున్నది. రాజశేఖరుడు విదర్భదేశాన్ని సరస్వతీ జన్మభూమిగా, వాఙ్మయ విలాసభూమిగా విశేషాభిమానంతో వర్ణించటంచేత విదర్భప్రాంతమే అతని జన్మభూమి అని చెప్పవచ్చును. రాజశేఖరుని ప్రపితామహునికి "మహారాష్ట్ర చూడామణి" అనే బిరుదం వుండటంచేత రాజశేఖరుడు మహారాష్ట్ర ప్రాంతంవాడని విమర్శకులు కొందరు తలంచారు. కావ్య మీమాంసలో కావ్యపురుషుడు విదర్భలో జన్మించినట్లుగా, విదర్భలోని వత్సగుల్మ ప్రాంతంలో కావ్యపురుషుడు కావ్యవధువును వివాహమాడినట్లుగా రాజశేఖరుడు చెప్పాడు. వత్సగుల్మం క్రీ.శ. 4,5 శతాబ్దాల్లో వాకాటక రాజులకు రాజధానిగా వెలసింది కాని రాజశేఖరుని నాటికి పూర్వ వైభవాన్ని కోల్పోయింది. అయినా ఆ నగరంమీద అభిమానాన్ని చూపిన రాజశేఖరుడు అక్కడే జన్మించినవాడై వుంటాడు.

రాజశేఖరుడు మొదట కన్నౌజునేలిన గుర్జరప్రతిహారరాజు మహేంద్రపాలుని ఆస్తానంలో ఆ తర్వాత అతని కుమారుడు మహీపాలుని ఆస్థానంలో సభాపండితుడుగా, విద్యాగురువుగా వున్నాడు. రాష్ట్రకూటరాజు ఇంద్రుని ఆక్రమణలో ప్రతీహారవంశం నశించగా రాజశేఖరుడు కన్నౌజు నుంచి త్రిపురానికిపోయి అక్కడ కలచురిరాజు కేయూరవర్షుని ఆశ్రయించాడు. త్రిపురంలో అతడు విద్ధశాలభంజిక నాటకాన్ని, కావ్య మీమాంస అనే అలంకార గ్రంథాన్ని రచించాడు. రాజశేఖరుడు తన పాండిత్యవైభవంచేత జీవితకాలంలోనే విశేష సమ్మానాన్ని అందుకొన్నాడు. సమకాలీన కవులు కృష్ణ శంకరవర్మ, అపరాజితాదులు అతని పాండిత్య కవిత్వ ప్రతిభలను ప్రస్తుతించివున్నారు. రాజశేఖరుడు పండితుడే కాక కవికూడ. కవియేకాక ఆలంకారికుడు, సాహిత్య మర్మజ్ఞుడు. అతడు సాహిత్య నాటక కళలే

కాక భౌగోళిక, సాంస్కృతిక, ధార్మిక పరిస్థితులను ఎరిగినవాడు. రాజశేఖరుడు పండితుడు, కవి, సాహిత్య మర్మజ్ఞుడేకాక గొప్ప ఉదారుడైన వ్యక్తి. కావ్య మీమాంసలో తన అభిప్రాయాలనే కాక ఇతర పండితుల అభిప్రాయాలను అతడు వుట్టంకించాడు. తన భార్య అవంతిసుందరి పాండిత్యాన్ని ఆదరించి గౌరవించి ఆమె సాహిత్య సంబంధాభిప్రాయాలను కూడ వుట్టంకించాడు. ఇంకా వికటనితంబ, భట్టారిక, సుభద్రాది కవయిత్రులను కూడ ప్రశంసించి వున్నాడు. ఎక్కడా పాండిత్య గర్వంతో అతడు ఎవరిని గట్టిగా విమర్శించలేదు. కవి ప్రసిద్ధుడైనా, అప్రసిద్ధుడైనా, ఉచ్చవర్ణమైనా, నీచవర్ణమైనా అతడు సమదృష్టితో లింగభేదాన్ని చూపకుండా సమాదరించి వారి అభిప్రాయాలకు తన రచనలో స్థానాన్నిచ్చాడు.

## రాజశేఖరుని రచనలు

రాజశేఖరుడు "నః షట్ ప్రబంధాన్" అని రామాయణ నాటక ప్రస్తావనలో తెలిపినదాన్ని బట్టి అతడు ఆరు కృతులను రచించాడని అంటారు. వాటిల్లో ఐదు కృతులు మాత్రమే లభిస్తున్నవి. అందులో నాలుగు నాటకాలు-బాల రామాయణం, బాలమహాభారతం, కర్పూరమంజరి, విద్ధశాలభంజికలు. ఐదవది అలంకారకృతి- కావ్యమీమాంస. బాలరామాయణంలో అతడుతాను "షట్ ప్రబంధకర్త"నని చెప్పుకొన్నాడంటె ఆ కృతికి పూర్వం అతడు రచనలు చేసాడని కొందరు విమర్శకులు తలంచారు. "షట్ ప్రబంధా" లంటె ఆరు రచనలు అని కాదని షట్ ప్రబంధమనేది కావ్యం పేరు అని వి.వి. మిరాశి అభిప్రాయ పడినాడు. కావ్య మీమాంసలో రాజశేఖరుడు తన భువనకోషాన్ని ఉల్లేఖించాడు. అది ఇప్పుడు అలభ్యం. భువనకోషం ప్రత్యేకకృతి కాదని కావ్యమీమాంసలో కవి రహస్య అధికరణం అనే అంతిమ అధ్యాయమని వి.వి. మిరాశి అభిప్రాయం. హేమచంద్రుడు మరియు ఉణాది సూత్రవృత్తికారుడు ఉజ్జ్వలదత్తుడు రాజశేఖరుని హరవిలాసం నుంచి ఉద్ధరణలు ఇచ్చారు. అది కూడ ఇప్పుడు అలభ్యం. ఇంకా అతడు రత్నమంజరి అనే నాటకాన్ని వ్రాసినట్లు కృష్ణమాచార్యులు తెలిపాడు. కాని దీన్ని గురించి ప్రసక్తి ఎక్కడా లేదు. ఈ విధంగా రాజశేఖరుని రచనలెన్నో మొత్తంసంఖ్యను నిర్ణయించటం ఇప్పుడు సాధ్యం కాదు. కాని ఇప్పుడు మనకు అతనివి ఐదురచనలు మాత్రమే లభిస్తున్నవి. రాజశేఖరుని నాటకాలల్లో కర్పూరమంజరి మొదటిదని కొందరు, బాలరామాయణం మొదటిదని కొందరు అభిప్రాయపడినారు. బాలరామాయణం, బాలభారతం రెండింటిలో కవి తనను "మహామంత్రీపుత్రు"డనని పేర్కొనటంచేత, తర్వాత రచనల్లో ఇది లేకపోవటంచేత అవి

తండ్రి జీవించి వుండగా వ్రాసాడని చెప్పవచ్చును. కావ్యమీమాంస ప్రౌఢంగా, వ్యవస్థితరూపంలో వున్నది. అది అసంపూర్ణంగా కూడ వున్నది కాబట్టి అది వార్ధక్యంలో వ్రాసిందని; మరణంచేతనో ఏమో కవి దాన్ని పూర్తిచేయలేక పోయాడని పండిత విమర్శకుల అభిప్రాయం. కన్నౌజులో వున్నప్పుడు అతడు బాలరామాయణ, భారతాలను, కర్పూరమంజరిని రచించాడని, త్రిపురంలో వున్నపుడు విద్ధశాలభంజికను, వృద్ధావస్థలో కావ్యమీమాంసను రచించి వుంటాడని పండితుల అభిప్రాయం.

## బాలరామాయణం

నిర్భయుడనే రాజు కోరిక మీద రాజశేఖరుడు ఈ నాటకాన్ని రచించాడు. బాలరామాయణాన్ని వ్రాయటం చేతనే కావచ్చును, తాను వాల్మీకి అవతారాన్నని రాజశేఖరుడు బాలభారతంలో పేర్కొన్నాడు. బాలరామాయణంలో సీతా స్వయంవరం మొదలుకొని రావణవధానంతరం రాముడు అయోధ్యకు తిరిగి వచ్చేవరకు గల రామాయణకథ కూర్పబడింది. దీనిలో 10 అంకాలున్నవి. అందుకే దీనికి మహానాటకమని కూడ పేరు. అంకంలో నిబద్ధింపబడిన విషయాన్ని బట్టి కవి ఒక్కొక్క అంకానికి ఒక్కొక్క పేరు పెట్టాడు-

1. ప్రతిజ్ఞా పౌలస్త్యం, 2. రామరావణీయం, 3. విలక్ష లంకేశ్వరం, 4. భార్గవభంగం, 5. ఉన్మత్త దశాననం, 6. నిర్దోష దశరథం, 7. అసమ పరాక్రమం, 8. వీరవిలాసం, 9. రావణవధ, 10. సానంద రఘునాథం.

**ప్రథమాంకం:-** సీతా స్వయంవరానికి రావణుడు మిథిలకు వచ్చి జనకుని తనకు సీతను ఇయ్యమని ప్రార్థిస్తాడు. జనకుడు నిరాకరించగా క్రుద్ధుడై సీతను వివాహమాడుతానని ప్రతిజ్ఞ చేస్తాడు.

**ద్వితీయాంకం:-** రావణుని పరిచారకుడు పరశురాముని దగ్గరికి పోతాడు. రావణుని సందేశాన్ని విని పరశురాముడు క్రుద్ధుడౌతాడు. పరశురామ రావణులకు యుద్ధం వరకు వస్తుంది.

**తృతీయాంకం:-** సీతా విరహ పీడితుడైన రావణుని వినోదార్థం సీతా స్వయంవరం ప్రదర్శింపబడుతుంది. దానిలో రాముడు ధనుర్భంగం చేసి సీతను వివాహమాడటం చూసి రావణుడు పునః క్రోధితుడవుతాడు.

**చతుర్థాంకం** :- శివధనుర్భంగం తర్వాత రామ పరుశురాములకు యుద్ధం జరుగుతుంది. పరశురాముడు పరాజితుడౌతాడు. స్వర్గంలో వున్న దశరథుడు ఆకాశమార్గం నుంచి ఇది చూచి ఆనందితుడౌతాడు.

**పంచమాంకం** :- సీతా విరహవ్యథతో రావణుడు లీలోద్యానంలో విహరిస్తుంటాడు. సీత కాష్ఠప్రతిమతో మనోవినోదం చేసుకుంటాడు. ఇక్కడ ఋతు, సరితాది ప్రకృతివర్ణనలు కూర్చబడినవి. రావణుని ప్రేమాలాపం విక్రమోర్వశీయంలోని చతుర్థాంకాన్ని పోలివున్నది.

**షష్ఠాంకం** :- శూర్పణఖ మాల్యవంతులు కైకేయి దశరథుల రూపంలో అయోధ్యకు పోయి రామున్ని వనవాసానికి పంపుతారు.

**సప్తమాంకం** :- రామ, సముద్రుల సంవాదం వున్నది. విభీషణుడు రాముని శరణు పొందుతాడు. సేతుబంధం చేసి రాముడు లంకలో ప్రవేశిస్తాడు.

**అష్టమాంకం** :- రామ రావణుల యుద్ధం. కుంభకర్ణ, ఇంద్రజిత్తుల వధ జరుగుతుంది.

**నవమాంకం** :- రావణుని వధ జరుగుతుంది.

**దశమాంకం** :- సీత అగ్ని ప్రవేశం చేస్తుంది. రాముడు అయోధ్యకు తిరిగి రావటంతో కథ ముగుస్తుంది. రాముడు విమానం మీద అయోధ్యకు పోయే సందర్భంలో కవి భౌగోళిక వర్ణన చేసాడు.

రామాయణకథను రాజశేఖరుడు చాల మార్పులతో నాటకంగా కూర్చాడు. దీనిలో రావణునికి, అతని విరహవ్యథకు ఎక్కువ ప్రాముఖ్యమియ్యబడింది. ఇతర ప్రధాన సంఘటనలన్నీ అప్రధానం చేయబడినవి. రావణుని మీద ప్రేక్షకులకు సానుభూతి కలిగేటట్లుగా కవి చిత్రించాడు. రాముని పాత్ర కన్న దీనిలో రావణ పాత్రకే ప్రాధాన్యమున్నది. మొత్తం మీద రాజశేఖరుడు రామాయణ కథకు ఒక కొత్త రూపాన్ని ఇచ్చాడు. కవి కవిత్వ దృష్టితో సఫలుడైనా నాటక కళాదృష్టితో అసఫలుడైనాడనే చెప్పాలి. అనేక వర్ణనలు దీనికాక కారణం, స్రగ్ధర, శార్దూల విక్రీడితం వంటి దీర్ఘఛందస్సులను ప్రయోగించాడు. కవిత్వం మాత్రం నవీన కల్పనలతో రమ్యంగా వున్నది. కథాగతి శిథిలంగా వున్నా కథాకల్పన నవీనంగానే వున్నది.

## బాలభారతం

ఈ నాటకానికి ప్రచండ పాండవమని కూడ పేరు. ఇది అసంపూర్ణంగా వున్నది. రెండు అంకాలు మాత్రమే లభిస్తున్నవి. ఈ అంకాలల్లో ద్రౌపదీ స్వయంవరం, ద్యూతక్రీడ, ద్రౌపదీ వస్త్రాపహరణ వృత్తాంతాలున్నవి.

## కర్పూరమంజరి

ఈ నాటకం సట్టకమనే రూపక భేదానికి చెందింది. సట్టకం నృత్య ప్రధానమైంది. దీన్ని కవి తనభార్య అవంతిసుందరి కోరికమీద రచించాడు. దీనిలో నాలుగు అంకాలున్నవి. భాషాభేదం తప్ప సట్టకం అన్నివిధాల నాటిక అనే రూపక భేదానికి చెందిందే.

**ప్రథమాంకం** - వసంతోత్సవ సమయం. రాజు చంద్రపాలుడు, రాణి విభ్రమలేఖ, విదూషకుడు రంగస్థలం మీదికి వస్తారు. విదూషకునికి పరిచారిక విచక్షణకు వసంతవర్ణనలో పోటీ ఏర్పడుతుంది. విదూషకుడు కోపగించుకొని పోయి భైరవానందుడనే సిద్ధుని తీసుకొని వస్తాడు. సిద్ధుడు తన యౌగిక చమత్కారాలను చూపిస్తు విదర్భ రాజకుమారి కర్పూరమంజరిని ప్రకటింపజేస్తాడు. రాజు ఆమెమీద ఆసక్తుడౌతాడు. కర్పూరమంజరి - రాణి విభ్రమలేఖకు చిన్నమ్మ కూతురు. కర్పూరమంజరిని కొన్ని రోజులకొరకు రప్పించమని రాణి సిద్ధున్ని కోరుతుంది. సిద్ధుడు అట్లాగే చేస్తాడు.

**ద్వితీయాంకం** - కర్పూరమంజరి కూడ రాజును ప్రేమిస్తుంది. విచక్షణ ద్వారా తన ప్రేమను రాజుకు తెలియజేస్తుంది. హిందోలన చతుర్థిరోజు రాజు కర్పూరమంజరిని చూస్తాడు.

**తృతీయాంకం** - రాజు తాను కర్పూరమంజరిని స్వప్నంలో చూసిన వృత్తాంతాన్ని విదూషకునికి వినిపిస్తాడు. ఇంతలో విరహవ్యథతో కూడిన కర్పూరమంజరి తన సఖి కురంగికతో అటు వస్తుంది. రాజు కర్పూరమంజరి ఏకాంతంలో కలుసుకుంటారు. ఈ వార్త రాణికి తెలుస్తుంది.

**చతుర్థాంకం** - కర్పూరమంజరిని రాణి నిర్బంధంలో వుంచుతుంది. సిద్ధునికి దక్షిణారూపంగా లాటరాజకుమారి ధనసారమంజరితో రాజు వివాహం జరిపిస్తానని రాణి వాగ్దానం చేస్తుంది. ఈ వివాహవార్తను లేఖద్వారా రాణి రాజుకు తెలుపుతుంది.

ధనసారమంజరియే కర్పూరమంజరి అని తర్వాత తెలుస్తుంది. వివాహానంతరం ఈ రహస్యం బయటపడ్తుంది. చివరకు కథ సుఖాంతమౌతుంది.

రాజశేఖరుని నాటకాలల్లో ఇది శ్రేష్ఠమైందని విమర్శకుల అభిప్రాయం. దీనిలో చక్కని నాటకకళతోపాటు చక్కని కవితాశోభ కూడ వున్నది. ఇది శృంగార ప్రధానమైన నాటకం. నాయకుడు ధీరలలితుడు. నాయిక ముగ్ధ. కవి సందర్భానుసారంగా వైదర్భి, గౌడి, పాంచాలీ రీతులను ప్రయోగించాడు. ఋతు, ప్రకృతి వర్ణనలు సహజసుందరంగా వున్నవి. విదూషకుని మాటలల్లో శిష్టహాస్యం వున్నది. అన్నివిధాల ఈ నాటకం చక్కగా వున్నా ఇతివృత్తంలో కొత్తదనం లేక మాళవికాగ్నిమిత్రాది నాటకేతివృత్తాలను అనుకరిస్తున్నది. ఈ నాటికలో శౌరసేనీ ప్రాకృతం ప్రయోగింపబడింది. రాజశేఖరునికి ప్రాకృతభాష మీద మంచి అధికారమున్నది. ప్రాకృతభాషను ప్రయోగించి కవి ఒక కొత్త పంథాను తొక్కాడు. ఇది చాల లోకప్రియమైన నాటిక. సంగీతాత్మకమై జనసామాన్యభాషతో సుయోగ్యంగా వుండడటమే దీని లోకప్రియత్వానికి కారణమని చెప్పవచ్చును.

## విద్ధ శాలభంజిక

ఇది కర్పూరమంజరి వంటి కథాక్రమంతో కూడిన ప్రేమ వృత్తాంతంగల నాటకమే. సంస్కృతభాషలో కూర్పబడటం చేత ఇది నాటిక అనే రూపక భేదానికి చెందింది. **ప్రథమాంకం** - చంద్రవర్మ అనే రాజు తన కూతురు మృగాంకవతిని మృగాంకవర్మ అనే పేరుతో కొడుకు అని ప్రకటించి బాలకవేషంలో విద్యాధర మల్లుని రాణి దగ్గరికి పంపుతాడు. విద్యాధరమల్లుని మంత్రి భాగురాయణునికి మృగాంకవర్మ బాలుడు కాదని బాలిక అని, ఆమెను వివాహమాడినవాడు చక్రవర్తి అవుతాడని జ్యోతిష్కులు చెప్పారని తెలుస్తుంది. అందుకే అతడు మృగాంకవర్మను రాజు దగ్గర వుండేటట్లు నియమిస్తాడు. ఒక సుందరి కనిపించి, అతడు పట్టుకొనబోయేసరికి ముక్తాహారాన్ని విసిరివేసి మాయమైనట్లుగా విద్యాధరమల్లునికి కల వస్తుంది. ఆ కలను రాజు విదూషకునికి చెప్తాడు. స్వప్నంలో చూచిన సుందరి బొమ్మ (విద్ధ శాలభంజిక) ను చిత్రశాలలో ప్రతిష్ఠిస్తాడు. అతడు ఆ బొమ్మ సమీపంలో వున్నప్పుడు మృగాంకవర్మ వస్తాడు. కాని రాజు అతడు స్త్రీ అని గుర్తించలేకపోతాడు.

**ద్వితీయాంకం** - కుంతల రాజకుమారి కువలయమాలతో మృగాంకవర్మ వివాహం చేయాలని రాణి అనుకుంటుంది. ఒకరోజు మృగాంకవర్మ నిజరూపంలో ఉద్యానవనంలో క్రీడిస్తుండగా రాజు ఆమెను చూసి ప్రేమిస్తాడు.

**తృతీయాంకం** - విదూషకుని ప్రయత్నంతో రాజు మృగాంకవతిని కలుసుకొంటాడు. వారిద్దరు పరస్పరం అనురాగబద్ధులవుతారు.

**చతుర్థాంకం** - రాణి ఈర్ష్యాపీడితురాలై తన ప్రతిద్వంద్విగా తలచి మృగాంకవర్మ వివాహం చేసేస్తుంది. చంద్రవర్మకు ఇంతలో పుత్రుడు జన్మిస్తాడు. పుత్ర వేషధారి కూతురును రాజుకు ఇచ్చి వివాహం చేయాలనుకుంటాడు. చివరకు ఏమీ చేయలేక రాణి మృగాంకవతితో పాటు కువలయమాలను కూడ రాజుకు ఇచ్చి వివాహం చేస్తుంది.

ఈ నాటికలోని కథ చమత్కారంగా వినూత్నంగా వున్నది. అయినా నాటకం రక్తికట్టలేదు. నాటకీయత ఎక్కువగా లేదు. సరళగీతం వలె కథ సాఫీగా నడుస్తుంది. ఈ నాటకం మీద మాళవికాగ్నిమిత్రం, రత్నావళి నాటకాల ప్రభావం స్పష్టంగా కన్పిస్తున్నది. నాయికను వివాహమాడితే చక్రవర్తిత్వం ప్రాప్తిస్తుందన్న దాన్ని ఆధారంగా చేసుకొని స్వప్నవాసవదత్త, ప్రియదర్శిక, రత్నావళ్యాది నాటకాలల్లో నాయకుడు నాయికను వివాహమాడుతాడు. అదే పద్ధతిలో ఈ నాటక కథ నడిచింది. ఇతర నాటకాలల్లో వలెనే ఈ నాటకంలోను రాజశేఖరుడు నాటక కళ కన్న కవిత్వకళనే ఎక్కువ ప్రదర్శించాడు. ఈ నాటకంలో కవిత్వం సుందరంగా వున్నది. ఈ నాటక కథ పూర్తిగా కవి కల్పన కాదని, దీనిలో సమకాలిక చరిత్ర కొంత వున్నదని విమర్శకులు తవ్వి తీశారు.

## విద్ధశాలభంజికలో ఐతిహాసికమహత్త్వం

రాజశేఖరుడు కన్నోజు నుంచి వచ్చింతర్వాత త్రిపురను పాలించే కలచురి వంశ రాజు యువరాజ దేవుని ఆస్థానంలో వున్నాడు. యువరాజదేవునికి కర్పూర వర్షుడని మరోపేరు. ఇతన్నే కవి విద్యాధరమల్లునిగా చిత్రించాడు. విద్యాధర మల్లున్ని ఒకచోట కవి కేయూరవర్షునిగా కూడ పేర్కొన్నాడు. కర్పూరవర్షుడన్న పేరునే కేయూరవర్షుడుగా కవి మార్చాడు. అంతేగాక విద్యాధర మల్లున్ని ఒకచోట యువరాజదేవునిగాను సంబోధింపజేసాడు. అసలయితే ప్రతీహారరాజు మహీపాలుని కూతురు విలాసవతిని యువరాజదేవుడు వివాహమాడాడు. దాన్నే కవి నాటికలో విద్యాధరమల్లుడు పాంచాల రాజపుత్రిక విలాసవతిని వివాహమాడినట్లు చెప్పాడు. సమకాలీన శక్తిశాలురైన రాజులందరు యువరాజదేవునికి తమ కన్యలనిచ్చి వివాహ సంబంధాన్ని ఏర్పరుచుకొన్నారు. బిలహరీ శాసనాన్ని బట్టి అతని మంత్రిపేరు భామకమిశ్రుడని తెలుస్తున్నది. భామకమిశ్రున్నే కవి భాగురాయణునిగా

మార్చాడు. నాటికలోని కుంతలాధిపతి వీరపాలుడు రాష్ట్ర కూటవంశరాజు బద్దిగ అమోఘవర్షుడని విమర్శకులు గుర్తించారు. ఈ మూడవ బద్దిగ అమోఘవర్షుడు రాజు కావటంలో యువరాజ దేవుడు చాల తోడ్పడినాడు. ఈ ఐతిహాసిక సత్యాలను భూమికగా తీసుకొని రాజశేఖరుడు నాటికను రచించాడు. అసలు గోవిందుని జయించిన ఉత్సవ సందర్భంలోనే కవి ఈ నాటికను వ్రాసి ప్రదర్శింపజేసాడని విమర్శకుల అభిప్రాయం. మాళవికాగ్నిమిత్రంలో వలెనే కవి నాటకం చివర చారిత్రకాంశాలను చేర్చాడు.

## రాజశేఖరుని నాటక కళ

రాజశేఖరుడు శ్రవ్యకావ్యాలను కాక దృశ్యకావ్యాలనే వ్రాసాడు. అయినా అతనికి నాటకకారునిగా కాక కవిగా ఆలంకారికునిగానే గొప్ప పేరు వచ్చింది. బాల రామాయణంలో అతడు రామాయణ కథలో చాల మార్పులుచేసి కొత్త రూపాన్ని ఇచ్చాడు. రావణునికి ప్రాధాన్యమిచ్చి కవి ఒక సాహసయుతమైన కల్పన చేసాడనే చెప్పాలి. కర్పూరమంజరి నాటకాన్ని ప్రాకృత భాషలో వ్రాయటంకూడ రాజశేఖరుని వినూత్న ప్రయత్నమే. ఇట్లా పూర్తిగా ప్రాకృత భాషలో వ్రాయబడిన నాటకాలు చాల అరుదైనవి. కర్పూరమంజరిని అనుకరిస్తు ఒకటి రెండు సట్టకాలు వ్రాయబడినవి. ఈ నాటకంలోని సిద్ధుని పాత్ర కూడ కొత్త రకంగా వున్నది. సమకాలికమైన మంత్రతంత్రాలను నేర్చిన సిద్ధయోగుల సంప్రదాయాన్ని ఈ పాత్ర ప్రతిబింబింపజేస్తున్నది. సిద్ధుని మంత్రశక్తిద్వారా నాయిక కనిపించటం, ఆమె రప్పింపబడటం కల్పనలు కొత్తగా చమత్కారంగా వున్నవి. విద్ధశాలభంజికంలో నాయికకు పురుష వేషాన్ని వేసే కల్పన కూడ కొత్తగానే వున్నది. రాజశేఖరుని నాటకసన్నివేశ కల్పనల్లో ఎంతో కొంత కొత్తదనం వున్నా నాటక కళాపక్షం వాటిల్లో శూన్యమనే చెప్పాలి. కథాయోజనలో ఏమి పసదనంలేదు. సంఘటనలు చాల మెల్లగా శిథిలత్వంతో ముందుకు సాగుతవి. అతని నాటకాలు ప్రదర్శనకు అంతగా యోగ్యంగా లేవు. ఒకవేళ ప్రదర్శింపబడినా అంత రక్తి కట్టేటట్లుగా లేవు. నాటక కళ లోపించినా వర్ణనల శోభ రాజశేఖరుని నాటకాలల్లో అంతటా కన్పిస్తుంది. తాను నాటక రచనా విధానంలో సఫలుడు కాలేకపోయానని, తనలో ఉక్తివైచిత్రి అంటె కవితాగుణం నాటక కళ కన్న ఎక్కువ వున్నదని రాజశేఖరునికి స్వయంగా తెలుసును. దాన్ని బాలరామాయణ ప్రస్తావనలో ఇట్లా తెలిపాడు-

బ్రూతే యః కోఽపి దోషం మహదితి సుమతిర్బాల రామాయణేస్మిన్
ప్రష్టవ్యోఽసౌ పటీయానిహ భణితిగుణో విద్యతే వా నవేతి.

## రాజశేఖరుని కవిత్వం

రాజశేఖరుడు ఒక నిపుణుడైన కవి. అతని నాటకాలు కవితాదృష్టితో ఉత్కృష్టమైనవి. రస భావానుకూలమైన భాషను ప్రయోగించటంలో అతనికి చాల నేర్పు వున్నది. ఛందస్సులను కూడ విషయానుకూలంగా ప్రయోగించాడు. శార్దూల విక్రీడితాన్ని రచించటంలో అతనికి నేర్పు వున్నది. క్షేమేంద్రుడు సువృత్త తిలకంలో "శార్దూల క్రీడితై రేవ ప్రఖ్యాతో రాజశేఖరః, శిఖరీవ పరం వక్రైః సోల్లేఖైరుచ్చ శేఖరః" అని ప్రశంసించి వున్నాడు. రాజశేఖరుని శ్లోకాలల్లో మాధుర్యగుణంతో కూడిన సంగీతాత్మక గుణం వున్నది. శబ్దవిన్యాసంలో రాజశేఖరుడు భవభూతితో సమానమైనవాడు. సరసమైన సూక్తులను, లోకోక్తులను రాజశేఖరుడు సందర్భానుకూలంగా ప్రయోగించాడు. పదలాలిత్యానికి కూడ రాజశేఖరుని కవిత్వం ప్రసిద్ధమైంది. ప్రకృత్యాది వర్ణనలనే కాక రాజశేఖరుడు పాత్రల రూపురేఖల వర్ణనలను కూడ చిత్రాత్మకంగా రచించాడు. అలంకారాలను కవి యథాయోగ్యంగా ప్రయోగించాడు. సూక్ష్మ దృష్టితో తాను పరిశీలించి సంపాదించిన లోకజ్ఞానానికి పాండిత్యాన్ని జోడించి రాజశేఖరుడు అపూర్వ కవిత్వాన్ని సృష్టించాడు. కాళిదాసు, భవభూతి, బాణాది కవుల పక్కన రాజశేఖరున్ని చేర్చి కవులు అతని కవిత్వాన్ని ప్రశంసించి వున్నారు. యాయావరకవి రాజశేఖరుని రచనలు మునిజనుల చిత్తవృత్తివలె సమాధిగుణం కలవి, ప్రసన్నం చేసేవి అని తిలకమంజరికర్త ధనపాలుడు ప్రశంసించాడు-

సమాధిగుణశాలిన్యః ప్రసన్న పరి పక్త్రిమాః
యాయావర కవేర్వాచో మునీనామివ వృత్తయః.

ఉదయసుందరి కర్త సోడ్ఢలుడు "రాజశేఖరుని కవిత్వాన్ని విద్వద్వరులల్లో మూర్ధన్యులైనవారు ప్రశంసిస్తార"ని అన్నాడు-

యాయావరః ప్రజ్ఞవరో గుణజ్ఞైశంసితః సూరిసమాజ భవ్యః
నృత్యత్యుదారం భణితే రసస్థా నటీవయస్యోద్ధరసా పదశ్రీః

రాజశేఖరుడు సంస్కృత భాషజ్ఞుడే కాదు. రాజశేఖరుడు నాటి ప్రాకృత, అపభ్రంశాది భాషలను బాగా తెలిసినవాడు. ప్రాకృత, అపభ్రంశాది జనసామాన్య భాషలంటె అతనికి అభిమానమున్నది. సంస్కృతంలో కవిత్వం చెప్పేవాడు మహాకవి అయితే వివిధ భాషల్లో సమానంగా కవిత్వం చెప్పేవాడు కవిరాజు అని రాజశేఖరుని అభిప్రాయం. ఆ కవిరాజు

రాజశేఖరుడే! బాల రామాయణ ప్రస్తావనలో అతడు ప్రాకృతం సంస్కృతానికి జనని అని పేర్కొన్నాడు. అదే నాటకం దశమాంకంలో ప్రాకృత భాష చెవులకు సోకిన తర్వాత ఇతర భాషలు రుచించవని రాజశేఖరుడు అన్నాడు. అదే విధంగా అపభ్రంశ భాషలను అతడు "సుభవ్య అపభ్రంశః" అంటాడు. కావ్యరచనకు అవి బాగా ఉపయోగిస్తాయని చెప్పాడు. "సరస రచనం భూత వచనమ్" అని అతడు భూత భాషను ప్రశంసించాడు. ఈ విధంగా జనసామాన్య భాషలను గౌరవించిన సంస్కృతజ్ఞుడు మరొకడు కన్పించడంటె అతిశయోక్తి కాదు. తర్వాత హేమచంద్రుడు రాజశేఖరుని ప్రాకృతభాష ఆదర్శమైందని అంగీకరించాడు.

## దిఙ్నాగుడు

దిఙ్నాగుడు కుందమాల నాటకాన్ని రచించాడు. కాళిదాసు ప్రతిద్వంద్వి అని ప్రచారంలో వున్న ప్రసిద్ధ బౌద్ధదార్శనికుడు దిఙ్నాగుడు, కవి దిఙ్నాగుడు వేరు వేరు వ్యక్తులు. ఈ నాటకకారుని కాలం క్రీ.శ. 1000 ప్రాంతమని పండితుల అభిప్రాయం. ఇతని నాటకం నాట్యదర్పణంలో ఉద్ధరింపబడింది. ఈ కవి భవభూతి వలెనే ఉత్తర రామాయణ కథను తీసుకొని కుందమాల నాటకాన్ని రచించాడు. రాముని పట్టాభిషేకానంతరం సీతా పరిత్యాగంతో కథ మొదలై సీతారాముల పునర్మిలనంతో అంతమౌతుంది. చాలాచోట్ల కవి భవభూతిని అనుకరించాడు. భవభూతి వలెనే కరుణరసాన్ని అంగిరసంగా పోషించాడు. వాల్మీకి రామాయణ కథలో దిఙ్నాగుడు మార్పులు చేసి స్వకల్పనలను చేర్చాడు. ఇది ఆరు అంకాల నాటకం. రాముని ఆదేశం మీద లక్ష్మణుడు సీతను గంగాతటంలో విడిచిపెట్టగా వాల్మీకి ఆమెను తన ఆశ్రమానికి తీసుకొనిపోతాడు. అక్కడ ఆమెకు కుశలవులు జన్మిస్తారు. వాల్మీకి వారికి రామాయణ కథను గానరూపంలో నేర్పుతాడు. రాముడు అశ్వమేధయాగం చేస్తు వాల్మీకిని ఆహ్వానించే కొరకు ఆశ్రమానికి వస్తాడు. రాముడు గోమతి నదిలో కొట్టుకొనిపోయే కుందమాలను చూచి అది సీత కట్టిన మాల అని గుర్తించి దుఃఖిస్తాడు. సీత దాక్కొనివుండి దీన్ని చూస్తుంది. ఈ దృశ్యాన్ని కవి చాల కరుణాత్మకంగా చిత్రించాడు. ఇది భవభూతి ఉత్తర రామచరిత్ర తృతీయాంకంలోని సీతస్పర్శ, రాముని విరహవిలాపాన్ని తలపిస్తున్నది. భవభూతిని ఆదర్శంగా తీసుకొనే కుందమాలకారుడు ఈ ఘట్టాన్ని చిత్రించాడనాలి. ఇంతలో వాల్మీకితో కుశలవులు రామాయణాన్ని గానంచేస్తు అక్కడికి వస్తారు. చివరకు రాముడు సీత, కుశలవులను కలుసుకొంటాడు. దానితో కథ

సుఖాంతమౌతుంది. చాలావరకు దిఙ్నాగుడు భవభూతిచేత ప్రేరేపితుడైనా కుందమాలలో చక్కని నాటకీయతను సృష్టించాడు. అతని కవిత్వం సరళ సుబోధకంగా వున్నది. అతని శైలి ప్రసాదగుణయుక్తమై వైదర్భి రీతిలో నడిచింది. కరుణరస పోషణలో కవి భవభూతిని అనుకరించినా తన నైపుణ్యాన్ని చూపకపోలేదు. మొత్తం మీద కుందమాల నాటకీయ సంవిధానం చక్కగా వున్న నాటకం. కవి భవభూతిని అనుకరించినా మౌలికతను ప్రదర్శించాడు.

## ఛలిత రామనాటకం

ఈ నాటక రచయిత పేరు తెలియదు. ఇది రాముని చరిత్రతో కూడిన మరో నాటకం. ఈ నాటకాన్ని దశరూపకావలోకంలో ధనికుడు పేర్కొన్నాడు. కాబట్టి దీని రచన క్రీ.శ. 10వ శ॥కి పూర్వమే జరిగిందని చెప్పవచ్చును. రాముని పట్టాభిషేకం, సీతాపరిత్యాగం, కుశలవుల జననం, సీతారాముల పునర్మిలనం మొదలైన ఘట్టాలతో కూడిన ఉత్తర రామాయణ కథ దీనిలో చిత్రింపబడింది. దిఙ్నాగుని వలెనే ఈ కవి భవభూతి ఉత్తరరామచరిత్రచేత ప్రేరేపితుడై ఈ నాటకాన్ని రచించి వుంటాడు. ఇది ఆరు అంకాల నాటకం. లవణాసురిని గూఢచారులు చితాముఖ, సుమాయులు కైకేయి మంథరలుగా వచ్చి సీత శీలాన్ని గురించి చెడ్డగా రామునికి చెప్తారు. రాముడు అది నమ్మి సీతను పరిత్యజిస్తాడు. ఈ విధంగా రాముడు మోసగింపబడటం చేత ఈ నాటకానికి ఛలితరామమని పేరు పెట్టబడింది. లవణాసురుడు రామున్ని మోసగిస్తాడు. రాముడు చివరకు అతన్ని జయించటంతో కథ ముగుస్తుంది. ఈ విధంగా కవి కథలో వస్త్వైక్యాన్ని (Unity)సాధించాడు. భవభూతి ఉత్తరరామచరిత్ర ప్రభావం దీని మీద బాగా కన్పిస్తున్నది. కొత్త కల్పనలను కూడ కవి చేర్చాడు. దీనిలో లవుడు బందీగా అయోధ్యకు తీసుకొని పోబడ్తాడు. అక్కడ సీత బంగారు బొమ్మను చూసి తన తల్లి బొమ్మ ఇక్కడ ఎందుకున్నదని అడుగుతాడు. ఆ తర్వాత నాటకభాగం అలభ్యం. దీని ముగింపు సుఖాంతమని ఊహచేసినా ఆ ముగింపు ఎట్లా నిర్వహింపబడిందో చెప్పలేము.

## క్షేమేంద్రుడు

క్రీ.శ. 1050 ప్రాంతంవాడు. క్షేమేంద్రుడు కవి. ఆలంకారికుడే కాక నాటకకారుడు కూడ. అతడు చిత్రభారతం, కనకజానకి నాటకాలను రచించినట్లు సాహిత్యశాస్త్ర

గ్రంథాలల్లో పేర్కొనబడింది. ఇవి అలభ్యాలు. పేర్లనుబట్టి ఇవి మహాభారత, రామాయణ కథల మీద ఆధారపడినవని చెప్పవచ్చును.

## బిల్హణుడు

క్రీ.శ. 1080 ప్రాంతంవాడు. కర్ణసుందరి అనే నాటకాన్ని రచించాడు. దీనిలో అన్హిలవాడ రాజైన కామదేవ త్రైలోక్యమల్లుడు కర్ణాటసుందరి మియనల్ల దేవిని వివాహమాడే ఇతివృత్తమున్నది.

## కృష్ణమిశ్రుడు

క్రీ.శ. 1050 - 1116 ప్రాంతంవాడు. చందేలరాజైన కీర్తి వర్మ (క్రీ.శ. 1100) ఆస్థానకవి. ఆరాజా కోరికమీద ఈ కవి ప్రబోధ చంద్రోదయ నాటకాన్ని రచించాడు. "బుద్ధి అనే చంద్రుని ఉదయం" దీనిలోని ఇతివృత్తం కాబట్టి కవి దీనికి ప్రబోధచంద్రోదయమని పేరుపెట్టాడు. దానిలో మాయ, ప్రవృత్తి, మనస్సు, వివేకం, విద్య, శాంతి, లోభాదులు పాత్రలు. ఇట్లా ప్రతీకాత్మకమైన ధృతి బుద్ధి కీర్త్యాది పాత్రలతో అశ్వఘోషకవి ఒక నాటకాన్ని రచించి వున్నాడు. కాని ఆ నాటకం సంపూర్ణంగా మనకు లభించలేదు. అశ్వఘోషుని నాటకాన్నే ఆదర్శంగా తీసుకొని ఈ కవి ఈ నాటకాన్ని రచించాడని నిశ్చితంగా చెప్పలేము. ఈ నాటకం కీర్తివర్మ ఆస్థానంలో ప్రదర్శింపబడింది కూడ. కీర్తివర్మ చేదిరాజు కర్ణునితో యుద్ధంచేసి విజయాన్ని సంపాదించాడు. కాని ఆ యుద్ధంలో జరిగిన రక్తపాతం అతన్ని దుఃఖితుని చేసింది. అప్పుడు అతని దుఃఖాన్ని దూరం చేసేకొరకు అతని గురువు, రాజకవి కృష్ణమిశ్రుడు ఈ నాటకాన్ని రచించాడని అంటారు. ఈ నాటకాన్ని అనుకరిస్తు ఇటువంటివి చాలా నాటకాలు తర్వాత వచ్చినవి. ఈ నాటకం ప్రదర్శనకు యోగ్యంగా వుండి చాలా ప్రచారాన్నందుకొన్నది. దీని గద్య పద్యాత్మకమైన అనువాదాలెన్నో వచ్చినవి.

ఈ నాటకం అద్వైత వేదాంతాన్ని బోధిస్తున్నది. మోహరాజు మొదట పురుషున్ని తన వలలో వేసుకొంటాడు. వివేకుడు మోహరాజును ఓడిస్తాడు. అప్పుడు పురుషునికి ఆత్మసాక్షాత్కారం కలుగుతుంది. శాశ్వతజ్ఞానం ప్రాప్తిస్తుంది. అద్వైత వేదాంతంతోపాటు విష్ణుభక్తినికూడ కవి ప్రబోధించాడు. ఉపనిషత్తుల విద్య, విష్ణుభక్తి ఈ రెండు జ్ఞానరూపి చంద్రుని ఉదయానికి కారణమౌతాయని కవి ఈ నాటకంలో చెప్పాడు. ఇంత గంభీరమైన, నీరసమైన విషయాన్ని కవి చాల సరళంగా సరసంగా ఈ నాటకంలో చిత్రించాడు. జైన

బౌద్ధాది సంప్రదాయాల సంభాషణలను కవి చాల చక్కగా రచించాడు. అదేవిధంగా దంభ అహంకార పాత్రల సంభాషణలు హాస్య రస స్ఫూర్తితో రమ్యంగా వున్నవి. కవి శైలి ప్రసాద గుణభరితమై వైదర్భీరీతిలో నడిచింది. కవిత్వం ధారామయంగా వున్నది. ప్రతీకాత్మకమైన నాటకాలల్లో ఇది శ్రేష్ఠమైన నాటకం.

## జయదేవుడు

జయదేవుడు రామకథ ఆధారంగా 'ప్రసన్న రాఘవ' మనే నాటకాన్ని వ్రాసాడు. గీతగోవిందకర్త జయదేవుడు ఈ జయదేవుడు వేరు వేరు వ్యక్తులు. ఇతని తండ్రిపేరు మహదేవుడు. తల్లిపేరు సుమిత్ర. ఇతడు కుండినపురనివాసి. సాహిత్య దర్పణకారుడు ఈ కవి శ్లోకాలను ఉద్ధరించటంచేత ఇతడు క్రీ.శ. 1200 ప్రాంతంవాడని చెప్పవచ్చును. జయదేవుడు న్యాయశాస్త్ర పండితుడు. తత్ పాండిత్యంచేత ఇతడు పక్షధర మిశ్రుడని బిరుదాన్ని సంపాదించాడు. ఇంకా ఈ కవి సాహిత్య శాస్త్రజ్ఞుడు. చంద్రావలోకనమనే అలంకారాల వివరణ గల గ్రంథాన్ని ఇతడే రచించాడు.

ప్రసన్న రాఘవంలో ఏడు అంకాలున్నవి. కవి భవభూతి మహావీరచరిత్రను చాలాచోట్ల అనుకరించాడు. మరియు మూలరామాయణకథలో స్వంత కల్పనలను కూడ చేర్చాడు. దీనిలో రావణుడేకాక బాణాసురుడు కూడ సీతను యాచిస్తాడు. రావణవధానంతరం రాముడు అయోధ్యకు తిరిగి రావటంతో కథ ముగుస్తుంది.

జయదేవుని కవిత్వం సరళసుందరమైంది. శ్లోకాలు గేయాలవలె లలితంగా నడిచినవి. నాటకమంతా ప్రసన్న శైలిలో వున్నది. నాటకకళా దృష్టితో గొప్ప నాటకం కాకపోయినా కవిత్వం ఉత్కృష్టంగానే వున్నది. ఈ కవికి పిల్లమురారి అని ఆంధ్రదేశంలో పేరున్నది.

## ఉమాపతిధరుడు

ఈకవి జయదేవుని సమకాలికుడు. పారిజాతహరణమనే నాటకాన్ని వ్రాసాడు.

## విగ్రహరాజు

ఈ కవి మహారాజు. క్రీ.శ. 12వ శతాబ్దంవాడు. భారవి కిరాతార్జునీయ మహాకావ్యాన్ని హరకేళి పేరుతో నాటకంగా రచించాడు.

## వత్సరాజు

క్రీ.శ. 1116-1203 నడుమ పాలించిన కలంజర వంశపురాజు పరమర్ది దేవుని మంత్రి. ఇతడు రుక్మిణీహరణమనే ఈహామృగాన్ని, కర్పూరచరిత్రమనే భాణాన్ని, హాస్యచూడామణి అనే ప్రహసనాన్ని, సముద్ర మథనమనే సమవకారాన్ని, త్రిపురదాహమనే డిమాన్ని రచించాడు. నాట్యశాస్త్రంలో సముద్ర మథన, త్రిపుర దాహ రూపకాలు పేర్కొనబడినవి. పురాణ ప్రసిద్ధమైన ఆ కథలను తీసుకొని ఈ కవి అదేపేర్లతో రూపకాలను రచించాడు.

## కాంచనాచార్యుడు

ఈ కవి క్రీ.శ. 12వ శతాబ్దంవాడు. ధనంజయ విజయమనే వ్యాయోగాన్ని రచించాడు. అర్జునుని ఉత్తర గోగ్రహణం, అభిమన్యు ఉత్తరల వివాహం- ఇతివృత్తంగా తీసుకొని ఈ వ్యాయోగం వ్రాయబడింది.

## శంఖధరుడు

ఈ కవి క్రీ.శ 12వ శతాబ్దంవాడు. లటక-మేళకమనే ప్రహసనాన్ని రచించాడు. ఈ కవి కాన్యకుబ్జ రాజు గోవిందచంద్రుని ఆస్థానకవి. సంస్కృతంలో లటకమేళక ప్రహసనం ఉత్తమమైంది. దీనిలో ధూర్తుల సమ్మేళనం చూపబడింది. హాస్యరసాత్మకంగా వున్నది.

## రామకృష్ణుడు

ఈ కవి గుజరాతు ప్రాంతంవాడు. క్రీ.శ. 12వ శతాబ్దంవాడు. గోపాల కేళీ చంద్రికమనే నాటకాన్ని వ్రాసాడు. కృష్ణుని విహార కేళులు దీనిలో వర్ణింపబడినవి. శ్లోకాలు గీతాలవలె మధురంగా వున్నవి. కావ్యం, నాటకానికి మధ్యమార్గంగా ఇది వున్నదని వింటర్‌నిట్స్ అభిప్రాయం. సంగీతరూపకంగా అభినయానికి యోగ్యంగా వున్నది.

## శంకరకవి

ఈ కవి క్రీ.శ. 12వ శతాబ్దంవాడని హెచ్. హెచ్. విల్సన్ అభిప్రాయం. ఇతడు కాశీనివాసి. శారదాతిలకమనే భాణాన్ని రచించాడు. రసిక శేఖరుడనేవాడు కోలాహల పురవీథుల్లో తిరుగుతూ తానుచూచిన దృశ్యాలను వర్ణిస్తాడు. ఆకాశభాషణం సహాయంతో

అతడు తన సంభాషణలను నడుపుతాడు. గుర్జర, మహారాష్ట్ర, నేపాళ, పాండ్య, చోళ, కర్ణాట, ఆంధ్రస్త్రీలను కవి వర్ణించాడు. జంగాలను, వివిధ రంగాలకు చెందిన వ్యక్తులను కవి వర్ణించాడు. సమకాలిక జీవితాన్ని ప్రతిబింబింప జేసేటట్లుగా ఈ భాణంలోని వర్ణనలున్నవి.

## యశశ్చంద్రుడు

ఈ కవి ముద్రిత కుముదచంద్రమనే ప్రకరణాన్ని రచించాడు. క్రీ.శ. 1124 ప్రాంతంలో వున్న శ్వేతాంబర జైనాచార్యుడు దేవసూరికి, దిగంబర జైనాచార్యుడు కుముదచంద్రునికి జరిగిన శాస్త్రవాదం ఈ నాటకంలోని ఇతివృత్తం. ఆ శాస్త్రవాదంలో కుముదచంద్రుడు ఓడిపోయి అతని నోరు కట్టు పడుతుంది. అందుకే నాటకానికి ముద్రిత కుముదచంద్రమని పేరు.

## రామభద్రముని

ఈ కవి కూడ జైనుడు. క్రీ.శ. 12వ శతాబ్దంవాడు. జయప్రభసూరి శిష్యుడు. ప్రబుద్ధరౌహిణేయమనే ప్రకరణాన్ని రచించాడు.

## జినమండనుడు

ఈ కవి కూడ జైనుడు. గుజరాతు రాజు కుమారపాలుడు, కృపాసుందరిని వివాహమాడే కథను తీసుకొని కవి కుమారపాల ప్రబంధ నాటకాన్ని వ్రాసాడు. ఈ వివాహం క్రీ.శ. 1159లో జరిగింది. ఇది చారిత్రక సంఘటన.

## మదన బాల సరస్వతి

ఈ కవి విజయశ్రీ లేక పారిజాత మంజరి అనే నాటికను రచించాడు. దీనిలో 4 అంకాలున్నవి. ఇతడు పరమార అర్జునవర్మ గురువు. అర్జునవర్మ చాళుక్యరాజు కూతురును వివాహమాడే ఇతివృత్తం దీనిలో వున్నది.

## యశఃపాలుడు

ఈ కవి జైనుడు. ఇతడు చాళుక్యరాజు కుమారపాలుని తర్వాత రాజ్యానికి వచ్చిన అజయపాలుని (క్రీ.శ. 1229-1232) మంత్రి. హేమచంద్రాచార్యుని ప్రభావంతో

కుమారపాలుడు జైనధర్మాన్ని స్వీకరించే ఇతివృత్తాన్ని తీసుకొని ఈ కవి మోహరాజ పరాజయమనే నాటకాన్ని వ్రాసాడు. ఈ నాటకం కుమార విహారంలో మహావీరస్వామి ఉత్సవంలో ప్రదర్శింపబడింది. దీనిలో ఐదు అంకాలున్నవి. సత్, అసత్‌లను పాత్రలుగా చేసి కవి నాటకాన్ని రచించాడు. కొన్ని పాత్రలు ప్రబోధచంద్రోదయంలో వలె ప్రతీకాత్మకంగా వున్నవి. మిగిలినవి మానవ పాత్రలు. ఈ నాటకం సరళశైలిలో వ్రాయబడింది. ఈ నాటకం ప్రబోధ చంద్రోదయమంత ఉత్తమంగా లేదని పండిత విమర్శకుల అభిప్రాయం.

## రామచంద్రుడు

ఈ కవి జైనుడు. హేమచంద్రాచార్యుని శిష్యుడు. గుజరాతు రాజు అజయపాలుని (క్రీ.శ. 1229-1232) ఆస్థానకవి. ఈ కవి 100కి పైగా గ్రంథాలను రచించాడు. వాటిల్లో నలవిలాసం, నిర్భయ భీముడు, సత్యహరిశ్చంద్ర, కౌముదీ మిత్రానందం, రాఘవాభ్యుదయం, యాదవాభ్యుదయం మొదలైనవి ప్రసిద్ధ నాటకాలు. నిర్భయ భీముడన్నది వ్యాయోగం.

## వేదాంత దేశికుడు

ఇతడు ప్రసిద్ధ విశిష్టాద్వైతాచార్యుడు (క్రీ.శ. 1268-1369). ఇతడు అనేక రచనలు చేసాడు. వాటిల్లో సంకల్ప సూర్యోదయమనేది నాటకం. దీనిలో మోహపరాజయం, వివేకోదయం చెప్పబడినవి. దీనిలో శాంతరసం మనోవికారాలను శమింపజేసి ఆనందానుభూతిని కలిగించేదని ప్రశంసింపబడింది. శృంగార వీరాద్భుతరసాలు దంభపూర్ణమైనవని చెప్పబడింది. దార్శనిక సంబంధమైన ప్రతీకాత్మక నాటకం. ఇది కొంత నీరసంగా నడిచింది.

## రెండవ ప్రతాపరుద్రుడు

రెండవ ప్రతాపరుద్రుడు (క్రీ.శ. 1296-1323) కాకతీయరాజు. ఆంధ్రదేశంలోని వరంగల్లు (ఏకశిలానగరం) ఇతని రాజధాని. ఇతడు రాణి రుద్రమదేవి (క్రీ.శ. 1258-1296) మనుమడు. ఆమె తర్వాత రాజ్యాధికారానికి వచ్చిన వాడు. ఈ రాజు సాహిత్యప్రియుడు. ఇతని ఆస్థానంలోనే ప్రసిద్ధాలంకారికుడు విద్యానాథుడు వున్నాడు. ఈ రాజు సాహిత్యప్రియుడే కాక స్వయంగా కవి. యయాతిచరిత్ర అనే నాటకాన్ని రచించాడు. ఈ నాటకాన్ని రుద్రమదేవి పెదనాన్న మొదటి ప్రతాపరుద్ర దేవుడు వ్రాసాడని కొందరు

విమర్శకులు తలంచారు. కాని తద్రచయిత సాహిత్యపోషకునిగా ప్రసిద్ధిగాంచిన రెండవ ప్రతాపరుద్రుడనటం సమంజసం. రెండవ ప్రతాపరుద్రదేవుడు రాజు కాక పూర్వం కుమార రుద్రదేవుడనే పేరుతో అమరుక శతకానికి వ్యాఖ్యానం కూడ వ్రాసాడు. తెలుగులో భాస్కరరామాయణంలో కొంత భాగాన్ని వ్రాసిన రుద్రదేవుడు రామాయణంలో ఎక్కువ భాగాన్ని వ్రాసిన భాస్కరునికి ఈ రాజు శిష్యుడని అంటారు. అప్పుడు రెండవ ప్రతాపరుద్రుడు సంస్కృతాంధ్రాలల్లో కవిత్వం చెప్పగలిగినవాడని తెలుస్తున్నది.

యయాతి చరిత్ర ఏడు అంకాల నాటకం. దీనిలో యయాతి తన భార్య దేవయాని దగ్గర దాసిగా వున్న వృషపర్వరాజు కూతురు శర్మిష్ఠను ప్రేమించి వివాహమాడే ఇతివృత్తమున్నది. ఈ కథ మహాభారతంలోనిది. కథలో మార్పులు చేయకుండానే కవి నాటకంగా మలిచాడు. ఆ దృష్టితో ఆలోచించినట్లయితె నాటక సంవిధానం చక్కగా వున్నది. అయితె ఈ నాటక సంవిధానం, పాత్రల చిత్రణమీద కాళిదాస, హర్షదేవుల నాటకాల ప్రభావం చాల కన్పిస్తున్నది. కవిత్వం సరళ సుందరంగా వున్నది. దీనిలోని శ్లోకాలను అప్పయ దీక్షితుడు కువలయానందంలో ఉద్ధరించి వున్నాడు.

## విద్యానాథుడు

రెండవ ప్రతాపరుద్రుని ఆస్థానకవి. ప్రతాపరుద్రయశోభూషణమన్న ఆలంకారిక శాస్త్రగ్రంథకర్త. ఆ అలంకార గ్రంథంలో నాటక ప్రకరణంలో నాటక లక్షణాలకు లక్ష్యంగా ఈ కవి ప్రతాపరుద్ర కళ్యాణమనే నాటకాన్ని వ్రాసాడు. దీనిలో ప్రతాపరుద్రుని పట్టాభిషేకేతివృత్తం వున్నది.

## విశ్వనాథుడు

ఈ కవి వరంగల్లు కాకతీయుల ప్రాపున వెలసిన కావ్యకర్త అగస్త్యుని మేనల్లుడు. ఇతడు పండిత కవి (క్రీ.శ. 1315 ప్రాంతం) గంగాదేవి ఇతన్ని తన మధురా విజయంలో తన గురువుగా కీర్తించి వున్నది. ఈ కవి సౌగంధికాహరణమనే వ్యాయోగాన్ని రచించాడు. ఇది ఒకే అంకం కలది. భీముడు ద్రౌపదికొరకు సౌగంధికా పుష్పాన్ని తెచ్చే ఇతివృత్తం దీనిలో వున్నది. ఇది మహాభారతంలోని కథ. భీముడు హనుమంతుని ఎదిర్చే ఘట్టంలో కవి వీరాద్భుతరసాలను పోషించాడు. సౌగంధికాహరణం వ్యాయోగ లక్షణాలు కలదైనా కవి దీన్ని ప్రేక్షణకమని పేర్కొన్నాడు. భోజుడు మొదటి సారిగా ప్రేక్షణకాన్ని ఉపరూపక భేదంగా

గుర్తించి వున్నాడు. సాగరనంది మతానుసారం ప్రేక్షణకంలో వివిధ ప్రాకృత భాషల ప్రయోగముంటుంది. వాటిల్లో శౌరసేని ప్రధానంగా ప్రయోగింపబడుతుంది. దీనిలో ముఖ, నిర్వహణ సంధులే వుంటవి. దీనిలో సూత్రధారుడు వుండడు. ప్రవేశిక విష్కంభాలుండవు. సాహిత్య దర్పణకారుడు కూడ ప్రేక్షణక లక్షణాలను చెప్పాడు. ఇందులో నాయకుడు ఉత్తమ వంశజుడు కావాలని లేదు. అయితె ఈ లక్షణాలేవి సౌగంధికాహరణంలో కనిపించటం లేదు. వ్యాయోగలక్షణాలే దీనిలో సంపూర్ణంగా వున్నవి. కాబట్టి ఇది వ్యాయోగమే అని చెప్పాలి. సాహిత్యదర్పణకారుడు వ్యాయోగానికి ఉదాహరణగా సౌగంధికాహరణాన్నే ఉల్లేఖించాడు.

## నరసింహుడు

నరసింహకవి కాకతీయ ప్రతాపరుద్రుని సమకాలికుడు. అంటె క్రీ.శ. 14వ శతాబ్దం పూర్వార్ధం వాడని చెప్పవచ్చును. వరంగల్లులో లభించిన ఒక శిలా శాసనాన్నిబట్టి ఇతడు కాకతీయరాజులు గణపతి దేవునికి, రుద్రమదేవికి రాజగురువైన విశ్వేశ్వర శివాచార్యుని కొడుకని తెలుస్తున్నది. ఇతడు తనను తాను నరసింహర్షి అనికూడ పేర్కొన్నాడు. పాశుపత శైవాచార్యులు పండిత, ఋషిపదాలను తమ పేర్ల చివర పెట్టుకోవడం వున్నది. వరంగల్లుకోట తోరణద్వారం మీద లిఖితమై లభించిన ఈ కింది శ్లోకాన్నిబట్టి అతడు "ఋక్వ్యాయ", ఎనిమిది సర్గలుగల కాకతీయ చరిత్ర, ఇంకా కొన్ని శాస్త్రగ్రంథాలను రచించినట్లు తెలుస్తుంది.

ఋక్వ్యాయారచితా నిరర్గళగిరాయేనాధిక స్థేయసీ
శాస్త్రగ్రంథకృతా నృసింహకృతినా హ్యాద్రద్ధి గందచ్ఛిదా
అప్యైకేనహి కాకతీయ చరితే తేనాష్టశిష్టాదృతాః
కాష్ఠాఘూట నిసర్గ నిర్గతయశః సర్గేణ సర్గాః కృతాః

ఋక్వ్యాయ అన్నది ఋగ్వేదానికి లఘువ్యాఖ్య కావచ్చునని పండితుల అభిప్రాయం. కాకతీయ చరిత్ర కాకతీయ రాజుల చరిత్ర కావచ్చును. అది అలభ్యం. అతడు వ్రాసిన శాస్త్రగ్రంథాలు కూడ దొరకలేదు. మరోచోట దొరికిన శిలాలిఖిత శ్లోకాన్ని బట్టి అతడు దశవిధరూపక రచనలో ప్రగల్భుడని తెలుస్తున్నది.

అప్రాప్త సభాస్తంభోప్య విపన్న హిరణ్యకశిపు రపి
అవికృత ముఖోపి దశ సుప్రగల్భితో రూపకేషు నరసింహః

కవి తననుతాను నామసామ్యాన్నిబట్టి శ్లేషద్వారా నరసింహావతారంతో పోల్చుకొని పైశ్లోకంలో చెప్పుకొన్నాడు. విష్ణువు కష్టపడి పదిరూపాలు పూర్తిచేసుకో లేకపోయాడు కాని నరసింహుడు దశవిధ రూపకాలల్లో ప్రగల్భుడయ్యాడట. అతనిది ఒక్క కాదంబరి కళ్యాణమన్న నాటకమొక్కటి ఇప్పుడు దొరుకుతున్నది. దీనిలో ఎనిమిది అంకాలున్నవి. బాణుని కాదంబరి కావ్యకథనే ఈకవి నాటకంగా మలిచాడు. కాదంబరి నాటకంలో మహాశ్వేత పుండరీకుల ప్రేమకథ అంతర్నాటకంగా చెప్పబడింది. ఈ కవి కవిత్వం సరసంగా వున్నది. పూర్వ కవుల ప్రభావం ఈ నాటకం మీద కన్పిస్తున్నది. ఇది ప్రచురితమై లభిస్తున్నది.

నరసింహకవి మలయవతి అన్న గద్యకావ్యం వ్రాసినట్లు తెలుస్తున్నది. కాని అది అలభ్యం. ఈ కవి 62 శ్లోకాలల్లో సిద్దదంపతుల ప్రేమకథను వ్రాసి వరంగల్లు సమీపంలో ఒక గుట్టమీద శిలపైన లిఖింపజేసాడు. అది "సిద్ధోద్వాహం" పేరుతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పురావస్తు శాఖవారు 1968లో ప్రచురించారు. దీనిలో కవి కవిత్వం ధారాశుద్ధితో కూడి చక్కని ఉపమానాలతో ఆపాత మధురంగా వున్నది. కాకతీయులకాలంలో వేదశాస్త్ర పండితులు శాస్త్ర గ్రంథాలతో పాటు కావ్యనాటకాలనుకూడా రచించటం కన్పిస్తుంది.

## వామనభట్ట బాణుడు

ఈ కవి కొండవీడు రాజ్యాన్నేలిన పెదకోమటి వేమారెడ్డి (క్రీ.వ. 1403-1420) ఆస్థానకవి. ఈ కవి విద్యారణ్యుల శిష్యుడు. శృంగార భూషణ బాణాన్ని వ్రాసి పంపా క్షేత్రంలోని విరూపాక్షుని వసంతోత్సవ సమయంలో ప్రదర్శింపజేసాడు. మొదటి దేవరాయలు వేయించిన సంస్కృత శాసనాన్ని ఒకదాన్ని (క్రీ.శ. 1380) ఈ కవి రచించాడు. దానిలో తాను కవీశ్వరుడనని, వ్యాకరణ మీమాంస న్యాయశాస్త్రాలల్లో పండితుడనని చెప్పుకొన్నాడు. (ఈ కవి జీవితవిశేషాలను చారిత్రక కావ్య ప్రకరణంలో చూడవచ్చును.) ఈ కవి కనకలేఖాపరిణయమనే నాటికను కూడా వ్రాసాడు. ఈ నాటిక మొదటి దేవరాయల మంత్రి లక్ష్మీశుని ప్రాపున వ్రాయబడింది. దీన్నిబట్టి ఈ కవి మొదట విద్యానగర రాజుల ప్రాపున కూడ కొంతకాలం వున్నాడని తెలుస్తుంది. ఆ తర్వాత కొండవీటి రాజులను ఆశ్రయించి పెదకోమటి వేమారెడ్డి జీవితచరిత్రను వేమభూపాల చరిత్ర అనే ఆఖ్యానంగా వ్రాసివుంటాడు. ఆ తర్వాత కవి హంససందేశమనే లఘు కావ్యం, రెండు కోశ గ్రంథాలను నలాభ్యుదయం, రఘువీర చరిత్ర మనే మహా కావ్యాలనే కాక

పార్వతీ పరిణయం, కనకలేఖాకళ్యాణం, బాణాసుర విజయమనే నాటకాలను కూడ రచించాడు. ఇవీగాక ఉషాపరిణయమనే నాటకం ఈ కవి కృతి అని ప్రసిద్ధ చారిత్రకులు మల్లంపల్లి సోమశేఖర శర్మ తెలిపారు. బాణాసుర విజయనాటకంలో దానికి ఉషా పరిణయమనే పేరున్నట్లు తెలుపబడలేదు. కాని ఇతివృత్తం, నామాన్ని బట్టి ఈ రెండు నాటకాలు ఒక్కటే కావచ్చునని అనిపిస్తున్నది.

వామనభట్టు బాణుడు బాణాదులవలె గద్య కవి. కాళిదాసాదులవలె మహా కావ్య కర్తే కాక నాటకకారుడు కూడ. ఇతడు పండితుడు కవే కాక నాటక కళాభిరుచి కూడ కలవాడు.

శృంగార భూషణం భాణమనే రూపక ప్రక్రియకు చెందింది. ఇది ఏకాంకిక. విలాసశేఖరుడు అనంగమంజరి అనే వేశ్య ఇంటికి పోతుంటాడు. దారిలో అతడు చూసిన వింతలు విశేషాలను వర్ణిస్తాడు. ధనవంతులను, బీదవాళ్ళను, విటులను, వేశ్యలను, శృంగార రహస్యాలను, గొర్రెపొట్టేళ్ళ పోరాటాన్ని, కోళ్ళ పందాన్ని, జూదాన్ని, మల్లయుద్ధాన్ని, ఖడ్గ యుద్ధాన్ని, స్త్రీల కందుక క్రీడను, ఉయ్యాలలూగటాన్ని మొదలైన వెన్నిటినో కవి వర్ణించాడు. ఈ వర్ణనలన్ని చక్కని సులభశైలిలో వ్రాయబడినవి. విశ్వనాథుడు చెప్పిన లక్షణానుసారం భాణంలో నాయకుడు విటుడై వుంటాడు. అతడు ఆకాశ భాషణాదుల సహాయంతో సంభాషణ జరుపుతాడు. దీనిలో విటుల చరిత్ర వర్ణితమౌతుంది. విటుడు స్వానుభవాలను, గాని ఇతరుల అనుభవాలను గాని చెప్తాడు. వీర శృంగారరస ప్రధానమైంది. ఇతివృత్తం కల్పితమైంది. ముఖ నిర్వహణ సంధులు మాత్రమే నిర్వహింపబడుతవి. ఇందులో హాస్యం ప్రధానం కాదు. భరత, ధనంజయులు భాణంలో హాస్యం వున్నట్లు చెప్పలేదు కాని విశ్వనాథ, అభినవ గుప్తులు హాస్య అద్భుత రసాలు కూడ వుండవచ్చునని చెప్పారు. మొత్తంమీద ఈ లక్షణాలనన్నిటిని కవి ఈ శృంగారభూషణ భాణంలో పాటించాడు. శృంగార భూషణ భాణంలోని వివిధ వర్ణనలు సమకాలిక జీవితానికి అద్దం పడ్తున్నవి.

పార్వతీ పరిణయం ఐదు అంకాల నాటకం. దీనిలో శివపార్వతుల కళ్యాణం వర్ణింపబడింది. కవి కుమారసంభవ కథను తీసుకొని నాటకంగా మలిచాడు. నాటక కళాదృష్టితో సామాన్యంగా వున్నా కవిత్వం మధురంగా, సరసంగా వున్నది. కవి బాణాది కవుల భావాలను అనుకరించాడు.

కనకలేఖా కళ్యాణ నాటకం ప్రసక్తి మొదట విశ్వేశ్వరానంద వేదిక్ రిసర్చ్ ఇన్‌స్టిట్యూట్, హోషియార్‌పూర్ వారు క్రీ.శ. 1964లో ప్రచురించిన లిఖిత ప్రతుల క్యాటలాగులో కన్పిస్తున్నది. దీనివైపు దృష్టిని మళ్లించినవారు మల్లంపల్లి సోమశేఖర శర్మ. తరవాత ఆడయార్ లైబ్రరీలో లభించిన రెండు లిఖిత ప్రతుల ఆధారంగా ఈ నాటకం ఒక రూపానికి తేబడింది. ఆంధ్ర సంస్కృత సీరీస్‌లో మొదటి పుస్తకంగా ఒక రూపానికి తేబడింది. ఆంధ్ర సంస్కృత సీరీస్‌లో మొదటి పుస్తకంగా ఆంధ్రా యూనివర్సిటీవారు దీన్ని క్రీ.శ. 1978లో ప్రచురించారు. ఇది నాలుగు అంకాలుగల నాటిక. దీనిలో ఇతివృత్తం కల్పితమైంది. విజయవర్మ అనే రాజకుమారుడు వీరవర్మ కూతురు కనకలేఖను ప్రేమించి వివాహమాడే కథ దీనిలో వున్నది. విజయవర్మ వేటకని సిద్ధారణ్యానికి పోతాడు. ఏనుగును వేటాడుతూ పోయి కనక లేఖను చూసి ప్రేమిస్తాడు. విజయవర్మకు విరూపాక్షుడనే సిద్ధుడు కలిసి అతని ప్రేమ ఫలిస్తుందని చెప్తాడు. సిద్ధుడు చెప్పినట్లుగా ఒక సరస్సులో దూకి అతడు తన రాజధాని నగరాన్ని చేరుకుంటాడు. అతడు ఉద్యానవనంలో వుండగా ఒక ఆటవికుడు అతనికి గుర్రాన్ని, ఒక చిత్రఫలకాన్ని తెచ్చియిస్తాడు. ఆ చిత్రఫలకంద్వారా కనకలేఖ తన ప్రేమను తెలుపుతుంది. అప్పుడు కనకలేఖ బొమ్మను గీసుకొని విజయవర్మ దానితో వినోదిస్తున్నప్పుడు రాణి ప్రవేశించి విదూషకుని వల్ల అసలు విషయం తెలుసు కొంటుంది. విజయవర్మ కనకలేఖ కొరకు విరహవ్యథ చెందుతుండగా చూసి సిద్ధుడు వారిని కలుపుతాడు. ఇంతలో రాణి అక్కడికివస్తుంది. కనకలేఖ పొదలో దాక్కుంటుంది. తర్వాత రాజుచూస్తే కనకలేఖ అక్కడ వుండదు. సిద్ధుడువచ్చి కనకలేఖ ఆమె మెడలోపడిన హారం మూలంగా హంసగా మారిందని చెప్తాడు. ఆ హారం తీసేసింతర్వాత హంస తిరిగి కనకలేఖగా మారుతుంది. సిద్ధుడు విజయవర్మ కనకలేఖల వివాహాన్ని చేయిస్తాడు. రాణి, కనకలేఖలు ఇద్దరు తన శిష్యులైన వసుభూతి, వీరవర్మల కూతుళ్ళని సిద్ధుడు చెప్తాడు. వసుభూతి వీరవర్మలు విద్యాధరులు కాని శాపవశంచేత మానవ శరీరాలను ధరిస్తారు. వీరవర్మ వచ్చి అల్లునికి బహుమానాలిస్తాడు. రాణి కనకలేఖను అంగీకరిస్తుంది. దానితో కథ సుఖాంతంగా ముగుస్తుంది.

ఈ నాటకంలో ఒక సిద్ధుని పాత్ర తప్ప కథా సంవిధానంలో ఏమి కొత్తదనం లేదు. అన్ని నాటికల కథల వలెనే ఇది వున్నది. రాజు వేటకని పోయి అక్కడ నాయికను చూడటం అభిజ్ఞాన శాకుంతలాన్ని పోలివున్నది. విజయవర్మ విరహవేదన వర్ణన విక్రమోర్వశీయాన్ని పోలివున్నది. పూర్వకవుల రచనలు భట్టబాణుడు అనుకరించినా అక్కడక్కడ మౌలికతను

కూడ చూపాడు. ఏనుగును వేటాడటం, ప్రియురాలి చిత్రపటంతో రాజు వినోదించటం, కనకలేఖ మౌగ్ధ్యం మొదలైనవాటిని కవి చక్కగా వర్ణించాడు. ఈ నాటకంలో శృంగారం ప్రధానరసం. హాస్యాద్భుతరసాలు అంగరసాలు.

బాణాసురవిజయం లిఖితప్రతి ఒక్కటే లభించింది. ఇది ఐదు అంకాల నాటకం. శ్రీకృష్ణుడు బాణాసురున్ని జయించటం, ఉషానిరుద్ధుల వివాహం దీనిలోని ఇతివృత్తం. శోణితపుర వర్ణన, ఉషావిరహం చక్కగా వర్ణింపబడినవి. వీర, శృంగార రసాలు ఈ నాటకంలో పోషింపబడినవి.

## నాగనాథుడు

ఈ కవి రాచకొండ రాజు అనపోతనాయకుని (క్రీ.శ. 1367) ఆస్థానకవి. ఇతడు మదనవిలాస భాణాన్ని రచించాడు. రాచకొండలోని కళ్యాణ నారాయణుని వసంతోత్సవ సమయంలో ఈ భాణం ప్రదర్శింపబడింది. ఈ భాణం కొంతభాగం మాత్రమే గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరీ, మద్రాసులో దొరికింది. కవి శైలి సుందరంగా వున్నది.

## అనపోత నాయకుడు

ఈ రాజు రాచకొండను ఏలిన రాజు (క్రీ.శ. 1360-1385). ఇతడు కవి పండిత పోషకుడే కాక స్వయంగా కవి. అభిరామరాఘవమనే నాటకాన్ని వ్రాసాడు. ఇది రసార్ణవ సుధాకరంలో ఉద్ధరించపబడింది. కాని ఇది అలభ్యం.

## సింగభూపాలుడు

రాచకొండ రాజు అనపోతనాయకుని కొడుకు. ఇతన్ని రెండవ సింగభూపాలుడంటారు. క్రీ.శ. 1386-1412 ఇతని రాజ్యకాలం. రసార్ణవసుధాకరమనే అలంకార శాస్త్ర గ్రంథాన్ని, సంగీత రత్నాకరానికి సంగీత సుధాకరమనే వ్యాఖ్యానాన్ని ఇతడు రచించాడు. ఈ రాజు సంగీత సాహిత్యప్రియుడు. ఇతని ఆస్థానంలో చమత్కార చంద్రికారుడు విశ్వేశ్వరుడు వున్నాడు. ఈ రాజు కవి పండిత పోషకుడే కాక స్వయంగా ఆలంకారికుడు మరియు కవి, నాటకకారుడు. కువలయావళి లేక రత్న పాంచాలిక అనే నాటిక ఇతని కృతి. ఇది నాలుగు అంకాల నాటిక. దీనిలో శ్రీకృష్ణుడు కువలయావళిని

వివాహమాడే కథ వున్నది. ఈ నాటిక రాచకొండలోని ప్రసన్న గోపాలుని వసంతోత్సవ సమయంలో ప్రదర్శింపబడింది. బ్రహ్మ ఆదేశానుసారం భూమి కువలయావళి అనే యువతి రూపాన్ని ధరిస్తుంది. ఆమె పెంపుడు తండ్రి నారదుడు ఆమెకు తగిన వరున్ని వెతుకుతున్నట్లు నటిస్తు ఆమెను ద్వారకలో రుక్మిణి దగ్గర వదులుతాడు. నారదుడు ఆమెకు ఒక ఉంగరాన్ని ఇస్తాడు. ఆ ఉంగరం ధరించినప్పుడు ఆమె పురుషులకు రత్న పాంచాలికవలె కన్పిస్తుంది. ఒకసారి ఉద్యానవనంలో క్రీడిస్తుండగా ఉంగరం ఎక్కడో పడిపోతుంది. అప్పుడు శ్రీకృష్ణుడు ఆమెను చూస్తాడు. ఉంగరాన్ని వెతికి ఆమెకు ఇస్తాడు. ఇద్దరు పరస్పరం ప్రేమించుకుంటారు. ఈ విషయం సత్యభామకు తెలుస్తుంది. ఆమె రుక్మిణికి చెప్తుంది. అప్పుడు రుక్మిణి కువలయావళిని దాచేస్తుంది. ఒక రాక్షసుడు ఆమెను ఎత్తుకొని పోతాడు. ఆమెను రక్షించే కొరకు రుక్మిణి శ్రీకృష్ణుని సహాయం కోరుతుంది. నారదుడు వచ్చి బ్రహ్మ ఆదేశాది వృత్తాంతాన్ని చెప్తాడు. కువలయావళిని శ్రీకృష్ణునికిచ్చి రుక్మిణి వివాహం చేస్తుంది. పురాణ ప్రసిద్ధమైన కథను తీసుకొని కవి నాటకంగా మలిచాడు. ఈ నాటకం మీద స్వప్నవాసవదత్త, మాళవికాగ్నిమిత్ర నాటకాల ప్రభావం స్పష్టంగా కన్పిస్తున్నది. ప్రధాన రసం శృంగారరసం. శైలి సరళసుందరంగా వున్నది.

## విశ్వేశ్వరుడు

ఈ కవి ప్రసిద్ధాలంకారికుడు. చమత్కార చంద్రికాకారుడు. ఇతడు వీర భద్ర విజయమనే డిమాన్ని రచించినట్లు రసార్ణవసుధాకరంలోని ఉద్ధరణను బట్టి తెలుస్తున్నది.

## భాస్కరుడు

ఈ కవి ఉన్మత్త రాఘవమనే నాటకాన్ని వ్రాసాడు. విశ్వనాథుడు సౌగంధికాహరణాన్ని ప్రేక్షణకమని పేర్కొన్నట్లుగానే ఈ కవి ఉన్మత్తరాఘవాన్ని ప్రేక్షణమని చెప్పాడు. కాని దీనిలో ప్రేక్షణక లక్షణాలు లేవు. ఈ నాటకం ప్రస్తావనలో విద్యారణ్యుడు పేర్కొనబడినాడు. కాబట్టి ఇతడు విజయనగర కవి అని తెలుస్తున్నది. స్త్రీలకు నిషిద్ధమైన ఒక ఉపవనంలో సీత ప్రవేశించగా ఆమె లేడిగా మారుతుంది. సీతా వియోగంతో రాముడు ఉన్మత్తుడౌతాడు. అగస్త్యుని వల్ల సీత తిరిగి రామునికి లభిస్తుంది. ఈ నాటకేతివృత్తం విక్రమోర్వశీయ చతుర్థాంకాన్ని తలపిస్తున్నది.

## వేంకటాధ్వరి

ఈకవి క్రీ.శ. 1350 ప్రాంతం వాడు. ప్రద్యుమ్నానందమనే నాటకం ఇతని కృతి. ఇది ఆరు అంకాల నాటకం. ప్రద్యుమ్నుడు వజ్రనాభుని చంపి రతిని వివాహమాడే ఇతివృత్తం దీనిలో వున్నది.

## విరూపాక్షుడు

ఈ కవి విజయనగర రాజు రెండవ హరిహరరాయల కొడుకు. విరూపాక్షుడు కొద్దికాలం విజయనగరాన్ని తండ్రి తర్వాత పరిపాలించాడు. (క్రీ.శ. 1404-1406). ఇతడు ఉన్మత్త రాఘవం, నారాయణీ విలాసమనే నాటకాలను రచించాడు. నారాయణీవిలాసాన్ని బట్టి ఇతడు అనేక కృతులను రచించినట్లు తెలుస్తున్నది. కాని అవేవి లభించలేదు. ఉన్మత్తరాఘవాన్ని కవి ప్రేక్షణకమని పేర్కొన్నాడు. కాని దీనిలో ప్రేక్షణక లక్షణాలు లేవు. ఇది నాటకమే. ఈ నాటకం తిరువన్నామలైలోని అరుణాచలనాథుని రథోత్సవసమయంలో ప్రదర్శింపబడింది. సీత అపహరింపబడగా రాముడు సీతా విరహంతో ఉన్మత్తుడై కన్పిస్తాడు. అందుకే భాస్కరుని నాటకానికి వలె ఈ నాటకానికి ఉన్మత్త రాఘవమని పేరు పెట్టబడింది. రాముడు ఉన్మత్తుడై వుండగా లక్ష్మణుడు రావణుని చంపి సీతను తెచ్చింతర్వాత రాముడు వూరడిల్లుతాడు. ఈ నాటకంమీద కూడ విక్రమోర్వశీయం చతుర్థాంక ప్రభావమున్నది. ఈ నాటకంలోని కథ రామాయణ కథకు భిన్నంగా కల్పన చేయబడింది. లక్ష్మణుడు రాముని భక్తునిగా చిత్రింపబడినాడు.

నారాయణీవిలాసం ఐదు అంకాల నాటకం. దీనిలో సముద్రమథన వృత్తాంతం వున్నది. నారాయణుడు మోహినిరూపంలో వస్తాడు. అదే నారాయణీవిలాసం.

## మోక్షాదిత్యుడు

క్రీ.వ. 1328 ప్రాంతంవాడు. భీమవిక్రమమనే వ్యాయోగాన్ని రచించాడు.

## జగదీశ్వరుడు

ఈ కవి హాస్యార్ణవమనే ప్రహసనాన్ని రచించాడు.

# జ్యోతిరీశ్వరుడు

ఈ కవి క్రీ.శ. 15వ శతాబ్దంవాడు. విజయనగర రాజు నరసింహరాయల ఆస్థానకవి. ధూర్త సమాగమమనే ప్రహసనాన్ని రచించాడు.

# శ్రీకృష్ణదేవరాయలు

శ్రీకృష్ణదేవరాయలు (కీ.వ. 1509-1529) విజయనగర రాజ్యాన్నేలిన చక్రవర్తి. ఈ రాజకవి కవిపండిత పోషణలో, కవిత్వ పాండిత్య ప్రతిభలోను విక్రమాదిత్య, హర్షవర్ధన, భోజరాజాదుల కోవలోనికి చెందినవాడు. ఆముక్తమాల్యాద ఇతని తెలుగు ప్రబంధం. మదాలస చరిత్ర, సత్యవధూ ప్రీణనం, సకల కథా సారసంగ్రహం, జ్ఞాన చింతామణి, రసమంజరి అనేవి ఇతని సంస్కృతకృతులు. సకలకథాసారాసంగ్రహం పురాణ కథల సంగ్రహం. దీన్ని ఈరాజకవి తన గురువు వ్యాసతీర్థుని ప్రేరణమీద వ్రాసాడు. జాంబవతీకళ్యాణం అనే నాటకాన్ని ఈ రాజకవి వ్రాసాడు. ఇది ఐదు అంకాల నాటకం. దీనిలో శ్యమంతకమణి వృత్తాంతమున్నది. శ్రీకృష్ణుడు జాంబవంతుని దగ్గర నుంచి శ్యమంతకమణిని, జాంబవతి కన్యను పొందే ఇతివృత్తాన్ని కవి చక్కగా నాటకంగా పొందుపరిచాడు. చాలాచోట్ల కవి అభిజ్ఞానశకుంతలాన్ని అనుకరించాడు. ఈ నాటకం పంపాక్షేత్రం లోని విరూపాక్షుని వసంతోత్సవ సమయంలో ప్రదర్శింపబడిందని ప్రస్తావననుబట్టి తెలుస్తున్నది.

# కృష్ణదత్తుడు

ఈ కవి క్రీ.శ. 15వ శతాబ్దంవాడు. ఒరిస్సా నేలిన పురుషోత్తమదేవుని ఆస్థానకవి. పురంజయ చరిత్ర అనే కావ్యాన్ని కువలయాశ్వీయమనే నాటకాన్ని వ్రాసాడు. ఇది ఏడు అంకాల నాటకం. దీనిలో మదాలస కువలయాశ్వుల కథ వున్నది.

# రామదేవుడు

క్రీ.శ. 15వ శతాబ్దం కవి. రామాభ్యుదయం, పాండవాభ్యుదయం, సుభద్రా పరిణయమనే నాటకాలను రచించాడు.

## మధురాదాసు

క్రీ.శ. 15వ శతాబ్దం వాడు. వృషభానుజమనే నాటకాన్ని వ్రాసాడు. దీనిలో రాధాకృష్ణుల ప్రేమకథ నిబద్ధమైంది.

## జీవరామ యాజ్ఞికుడు

క్రీ.శ. 15వ శతాబ్దంవాడు. మురారివిజయం ఇతని నాటకం.

## సామరాజదీక్షితుడు

క్రీ.శ. 16వ శతాబ్దం కవి. శ్రీదామచరిత్ర అనే నాటకాన్ని వ్రాసాడు. ఇది ఐదు అంకాల నాటకం. భాగవతంలోని సుదాముని (కుచేలుని) కథ దీనిలోని ఇతివృత్తం.

## సుందరమిశ్రుడు

క్రీ.శ. 16వ శ॥ ఉత్తరార్ధంవాడు. అభిరామమణి అనే పేరుతో రాముని చరిత్రను నాటకంగా వ్రాసాడు. దీవిలో ఏడు అంకాలున్నవి. పూరిలోని జగన్నాథుని సమక్షంలో ప్రదర్శింపబడింది. కవిత్వం అందంగావున్నా నాటకకళ లేదని విల్సన్ అభిప్రాయం.

## గోస్వామి పరమానందదాసు

క్రీ.శ. 1579లో ఈకవి చైతన్య చంద్రోదయమనే నాటకాన్ని వ్రాసాడు. చైతన్య దేవుడనే రాజు ఇతనికి "కర్ణపూరు"డనే బిరుదాన్ని ఇచ్చాడు. ఈ నాటకం పది అంకాల నాటకం. దీనిలో మూర్త, అమూర్త పాత్రలున్నవి. మహాప్రభు, అతని శిష్యులు మానవపాత్రలు. ఇవిగాక భక్తి, విరాగ, కలి, అధర్మం మొదలైనవి పాత్రలు ఈ నాటకంలో వున్నవి. ఇది ప్రబోధచంద్రోదయయాదులవలె ప్రతీకాత్మక నాటకం.

## అప్పయ్య దీక్షితుడు

క్రీ.శ. 1520-1593 ప్రాంతంవాడు. ప్రసిద్ధ పండితుడు, ఆలంకారికుడు, వసుమతీచిత్రసేన విలాసమనే నాటకాన్ని వ్రాసాడు.

## శేష శ్రీకృష్ణుడు

క్రీ.శ. 16వ శతాబ్దం చివర లేక 17వ శతాబ్దం మొదట్లో వున్నాడు. ఈ కవి కంసవధ అనే నాటకాన్ని వ్రాసాడు. దీనిలో కృష్ణుడు కంసుని వధించే ఇతివృత్తమున్నది. ఇది ఏడు అంకాల నాటకం.

## రూపగోస్వామి

ఈ కవి ప్రసిద్ధ వైష్ణవుడు, ఆలంకారికుడు. క్రీ.శ. 16వ శతాబ్దం ప్రథమార్థంవాడు. ఇతడు ఆలంకారికుడే కాక నాటకకారుడు కూడ. పది అంకాలుగల లలితమాధవం ఏడు అంకాలుగల విదగ్ధమాధవం అనే నాటకాలను రచించాడు. ఇవన్నీ కృష్ణచరిత్ర సంబంధమైనవి.

## రామభద్రుడు

క్రీ.శ. 1638 ప్రాంతంవాడు. జానకీపరిణయమనే ఏడు అంకాల నాటకాన్ని వ్రాసాడు. కవిత్వం సుందరంగా వున్నది.

## అతిరాత్ర యజ్వ

కుశకుముద్వతి ప్రణయకథను ఐదు అంకాల నాటకంగా రచించాడు. కుశుడు రాముని కొడుకు. కుముద్వతి నాగకన్య. వారిద్దరి ప్రణయకథ నాటకంలోని ఇతివృత్తం.

## నీలకంఠుడు

నైషధీయచరిత్రను నలచరిత్ర అనే నాటకంగా వ్రాసాడు. దీనిలో ఏడు అంకాలున్నవి.

## చంద్రశేఖరుడు

క్రీ.శ. 17వ శతాబ్దం ఉత్తరార్ధంవాడు. మధురానిరుద్ధం ఇతని నాటకం. ఎనిమిది అంకాల నాటకం. దీనిలో ఉషా అనిరుద్ధుల ప్రేమకథ వున్నది. కవిత్వం అందంగావున్నా నాటకం ప్రదర్శన యోగ్యంగా లేదని విల్సన్ అభిప్రాయం.

## రత్నఖేట శ్రీనివాస దీక్షితుడు

ఈ కవి జింజినేలిన సూరప్ప నాయకుని ఆస్థానకవి. పండిత వంశంలోనివాడు.

ఇతడు నూటికిపైగా రచనలు చేసాడు. భావనాపురుషోత్తం ప్రతీకాత్మక నాటకం. భైమీపరిణయం ఇతని మరో నాటకం.

## మహదేవుడు

నీలకంఠవిజయకర్త బాలకృష్ణుని శిష్యుడు మహదేవుడు. క్రీ.శ. 17వ శతాబ్దంవాడు. అద్భుతదర్పణం ఇతని నాటకం. ఇది పది అంకాల నాటకం. దీనిలో రామాయణ కథ చాల మార్పులతో కూర్చబడింది. లంకలో జరిగిన సంఘటనలు అద్దంలో దర్శింపబడటంచేత కవి నాటకానికి ఈ పేరు పెట్టాడు.

## గోకులనాథుడు

క్రీ.శ. 17వ శతాబ్దం వాడు. అమృతోదయం నాటకకర్త.

## సోమరాజదీక్షితుడు

క్రీ.వ. 17వ శతాబ్దంవాడు. ధూర్త నర్తకం ఇతని ప్రహసన రూపకం.

## భూమినాథుడు

క్రీ.శ. 17వ శతాబ్దంవాడు. ఈ కవి చిత్తవృత్తి కళ్యాణం, జీవముక్తి కళ్యాణ మనే ప్రతీకాత్మక నాటకాలను, శృంగార సర్వస్వమనే భాణాన్ని రచించాడు.

## భూ దేవ శుక్ల

క్రీ.శ. 17వ శతాబ్దంవాడు. ధర్మవిజయమనే ప్రతీకాత్మక నాటకాన్ని వ్రాసాడు.

## ఉద్దండి

క్రీ.శ. 17వ శతాబ్దంవాడు. మల్లికామారుతమనే ప్రకరణాన్ని రచించాడు. భవభూతి మాలతీమాధవాన్ని కవి అనుకరించి దీన్ని రచించాడు.

## ఆనందరాయుడు

క్రీ.శ. 18వ శతాబ్దంవాడు. ఈ కవి తంజావూరు రాజు శరభోజి మంత్రి. విద్యా

పరిణయం, జీవానందమనే ప్రతీకాత్మక నాటకాలను వ్రాసాడు. ఇవి చక్కని నాటకీయతతో కూడినవి. ఇవి ఏడు అంకాల నాటకాలు. విద్యా పరిణయంలో శివభక్తి మోక్షసాధనగా చిత్రింపబడింది. జీవానందంలో శారీరక వ్యాధులతో కూడిన జీవికి మోక్షోపాయం చూపబడింది.

## నల్లావరి

క్రీ.శ. 18వ శతాబ్దంవాడు. చిత్తవృత్తి కళ్యాణం, జీవన్ముక్తి కళ్యాణం అనే ప్రతీకాత్మక నాటకాలను రచించాడు.

## విశ్వనాథుడు

ఈ కవి క్రీ.శ. 18వ శతాబ్దంవాడు. ఈ కవి మృగాంకలేఖ అనే నాటికను రచించాడు. దీనిలో నాలుగు అంకాలున్నవి. ఈ కవి గోదావరీ తీరస్థుడే కాని కాశిలో నివాసమేర్పరచుకొన్నాడు. ఈ నాటిక విశ్వనాథోత్సవ సమయంలో ప్రదర్శింపబడింది. కామరూపరాజు కూతురు మృంగాంకలేఖ. కళింగరాజు వేటకు పోగా ఆమె లభిస్తుంది. మృగాంకలేఖను పట్టపురాణి విలాసవతి దగ్గర వుంచగా ఖంఖపాలుడనే రాక్షసుడు ఎత్తుకొనిపోతాడు. కళింగరాజు ఆమెను రక్షించి వివాహమాడుతాడు. విక్రమోర్వశీయం, మాలతీమాధవం నాటకాల ప్రభావం ఈ నాటకంమీద కన్పిస్తున్నది.

## శంకర దీక్షితుడు

ప్రద్యుమ్నవిజయం ఇతని నాటక కృతి. ఇది ఏడు అంకాల నాటకం. దీనిలో ప్రభావతీ ప్రద్యుమ్నుల వివాహ కథ చెప్పబడింది. దీనిలోని హంస హంసి పాత్రలను చక్కగా కవి చిత్రించాడు.

## విశ్వేశ్వరుడు

క్రీ.శ. 18వ శతాబ్దంవాడు. పండితుడు, ఆలంకారికుడు. నవమల్లిక అనే నాటికను వ్రాసాడు. ఇది రత్నావళిని అనుకరిస్తున్నది. ఈ కవి శృంగార మంజరి అనే నాటకాన్ని కూడా వ్రాసాడు. ఇది రాజశేఖరుని కర్పూరమంజరిని పోలి వున్నది.

## రామేశ్వరుడు

క్రీ.శ. 18వ శతాబ్దం కవి. చంద్రాభిషేకం ఇతని నాటకకృతి. చాణక్యుడు నందులను రాజ్యభ్రష్టులను చేసే ఇతివృత్తం దీనిలో వున్నది. దీనిలో ముద్రారాక్షస నాటక ఛాయలు వున్నవి.

## శ్రీధర పేరుభట్టు

ఈ కవి తంజావూరు రాజులు శరభోజి, తులాజీల ఆస్థానకవి (క్రీ.శ. 1711-1735) సంస్కృత వ్యాకరణ పండితుడు. ఐదు అంకాలుగల వసుమంగళ నాటకాన్ని రచించాడు. తెలుగులో రామారాజభూషణుడు వ్రాసిన వసుచరిత్ర ప్రబంధాన్ని ఈ కవి నాటకరూపంలో సంస్కృత భాషలోకి రూపొందించాడు. ఉపరిచరవసువు గిరికను వివాహమాడే మహాభారతాంతర్గత కథ దీనిలో వున్నది.

## పద్మనాభుడు

ఈ కవి క్రీ.శ. 19వ శతాబ్దంవాడు. త్రిపుర విజయమనే వ్యాయోగాన్ని రచించాడు.

## రామచంద్రకవి

క్రీ.శ. 19వ శతాబ్దంవాడు. శృంగార సుధార్ణవమనే భాణాన్ని రచించాడు.

## శంకరలాల్‌కవి

ఈ కవి క్రీ.శ. 19వ శతాబ్దంవాడు. సావిత్రి చరిత్ర, ధ్రువాభ్యుదయం, భద్రయువరాజా, వామన విజయం, పార్వతీ పరిణయం మొదలైన నాటకాలను రచించాడు.

## మూలశంకర మణిక్‌లాల్

క్రీ.శ. 19వ శతాబ్దంవాడు. ఛత్రపతి సామ్రాజ్యం, ప్రతాప విజయం, సంయోగిత స్వయంవరం ఇతని నాటకాలు.

## చంద్రకాంత తర్కాలంకార

క్రీ.శ. 1887లో కౌముదీసుధాకరమనే ప్రకరణాన్ని వ్రాసి ప్రచురించాడు.

## గోపీనాథుడు

కౌతుక సర్వస్వమనే ప్రహసనాన్ని వ్రాసాడు. దీనిలో రెండు అంకాలున్నవి. సోమరితనానికి, సుఖాలకు అలవాటుపడిన రాకుమారుల ఇతివృత్తం దీనిలో వున్నది. దుర్గాపూజోత్సవ సందర్భంలో ప్రదర్శింపబడింది. కాబట్టి కవి బెంగాల్ వాడు అని చెప్పవచ్చును. కాలం క్రీ.శ. 19వ శతాబ్దం కావచ్చును.

## వైద్యనాథ వాచస్పతి భట్టాచార్య

ఈ కవి క్రీ.శ. 19వ శతాబ్దం పూర్వార్థం వాడు. ఇతడు చిత్రయజ్ఞమనే నాటకాన్ని వ్రాసాడు. ఐదు అంకాల నాటకం. దక్షుని యజ్ఞవృత్తాంతం దీనిలో వున్నది. బెంగాల్‌లోని 'జాత్ర' అనే నాటక పద్ధతిని కవి దీనిలో అనుసరించాడు.

## కృష్ణమాచారి

షేక్స్పియర్ కవి 'మిడ్ సమ్మర్ నైట్స్ డ్రీమ్" అనే నాటకాన్ని ఈ కవి 'వాసంతికా స్వప్నం' పేరుతో క్రీ.శ. 1892 లో సంస్కృతీకరించాడు. ఈ కవి కుంభకోణ నివాసి.

## అంబికాదత్త వ్యాస

అంబికాదత్త వ్యాసకవి (క్రీ.శ. 1858-1900) వారాణసి నివాసి. అతడు కావ్యాలనే కాక " సామవతం" అనే నాటకాన్ని రచించాడు. ఇది ప్రచురితమైంది. ఈ నాటకం ప్రశస్తమైందని విమర్శకుల అభిప్రాయం.

## పేరి కాశీనాథశాస్త్రి

ఈ కవి క్రీ.శ. 1853-1920 ప్రాంతంవాడు. పాంచాలికా లక్షణం, ద్రౌపదీ పరిణయం, యామినీ పూర్ణతిలకమనే నాటకాలను రచించాడు. ఈ కవి ఆంధ్రప్రదేశ్‌లోని విజయనగర సంస్థానాధిపతులు గజపతుల ఆశ్రయంలో వుండే వాడు. గజపతి వంశంలో ఆనంద గజపతి మొదలైనవారు సంస్కృతాభిమానులు, పండితులు. మాక్స్‌ముల్లర్ ఋగ్వేద సంపుటాల ద్వితీయ ముద్రణ వ్యయాన్ని ఆనంద గజపతి మహారాజా భరించి తోడ్పడినాడు. "వాచస్పత్య నిఘంటు" వును ప్రచురించటానికి తారానాథ తర్కవాచస్పతికి ధనసహాయమిచ్చి ప్రోత్సహించాడు.

## ముడుంబి నరసింహాచార్యులు

ఇతడు కూడ ఆనంద గజపతిరాజు ఆశ్రయాన్ని పొందిన కవి. ఇతని కాలం క్రీ.శ. 1841-1927. ఈ కవి 14 కావ్యాలను, 50 స్తోత్రాలను, 2 నీతి గ్రంథాలను కాక వాసవీపరాశరీయమనే నాటకాన్ని వ్రాసాడు. ఇది ప్రకరణం. దీనిలో విద్య, ఉపనిషత్తులనే ప్రతీకాత్మక పాత్రలు కూడ వున్నవి.

క్రీ.శ. 20వ శతాబ్దంలోను సంస్కృత నాటకాలు వ్రాయబడుతూనే వున్నవి. ఈ నాటకాల్లో కొన్ని ప్రాచీన నాటక లక్షణాలు కలవి. కొన్ని ఆధునిక పాశ్చాత్య నాటకాల ప్రభావంచేత వ్రాయబడినవి. రంగస్థల ప్రదర్శన కొరకే కాక రేడియోలో ప్రసారం చేసేకొరకు సంస్కృత నాటకాలు ప్రత్యేకంగా వ్రాయబడినవి ప్రాచీన నాటకాలు రేడియోలో ప్రసారం చేయబడటమే కాక ప్రత్యేకంగా రేడియో కొరకు మార్పులు చేర్పులతో వ్రాయబడినవి. మహాపురుషులు గాంధీ మొదలైనవారి జీవిత చరిత్రలు, దేశభక్తి, సాంఘిక సమస్యలు ఇతివృత్తంగా తీసుకొనబడి నాటకాలు కూడా వ్రాయబడినవి.

## సంస్కృత నాటకాల పతనోన్ముఖత

"కావ్యేషు నాటకం రమ్యమ్" అని సాహిత్యంలో నాటకాలకు ప్రాచీనులు ప్రముఖ స్థానాన్ని ఇచ్చారు. "నాట్యం భిన్నరుచే ర్జనస్య బహుధాప్యేకం సమారాధనమ్" - నాటకం భిన్నరుచులు కలవారిని, భిన్న తరగతులకు చెందిన వ్యక్తులకు ఒకేసారిగా తృప్తులను చేస్తుంది. అదీగాక నాటకాలు భిన్నవిజ్ఞానానికి, భిన్న కళలకు, భిన్న విద్యలకు చోటైనది. కాబట్టి ఇది ప్రజలను విజ్ఞానవంతులుగా చేయటానికి, వారి మానసిక శక్తిని వికసింపజేయటానికి, వారి చరిత్రను తీర్చిదిద్దటానికి తోడ్పడుతుంది. భరతుడు ఇట్లా తెలిపాడు -

న తజ్జ్ఞానం నత చ్ఛిల్పం న సావిద్యా నసాకళా
నసయోగేన తత్కర్మ నాట్యేస్మిన్ యన్న విద్యతే.

సంస్కృత నాటకాలల్లో కేవలం యధార్థ జీవిత చిత్రణ, యధార్థ పాత్రల చిత్రణలు ప్రాధాన్యం కాదు. రసాభివ్యక్తిలోనే సంస్కృత కవుల దృష్టి వుంటుంది. రసాభివ్యక్తి వల్ల ప్రేక్షకులను వారు పాత్రలలో లీనమయ్యేటట్లే కాదు, ఆ పాత్రలు తామే అనే భావనను కలిగించి ఆనందాంబుధిలో ముంచి తన్మయులుగా చేయటం జరుగుతున్నది. ఇటువంటిది పాశ్చాత్య నాటకాలల్లో కనిపించదు. రసాభివ్యక్తిలోనే భారతీయ కవుల దృష్టి వుండటంచేత

కథావస్తువు, పాత్రల చిత్రణ, సన్నివేశ కల్పన, నాటకీయతలమీద వారి దృష్టి అంతగా నిలువలేదు. అందుకే వాటిల్లో కొత్తదనాన్ని తేలేకపోయారు. ప్రధాన రసాభివ్యక్తి నుంచి ఎక్కడ తొలగిపోతామో అనే భయంతో ప్రాచీన కవులు తమ పూర్వ కవుల మార్గాన్ని లాక్షణికుల లక్షణాలను అంటిపెట్టుకొని నాటకాలను రచించారు. దీనివల్ల కొంత కాలానికి సంస్కృత నాటకాలు కొత్తదనం, మార్పు లేక అచ్చులో పోసినట్లు ఒకేవిధంగా వ్రాయటం జరిగింది. పాత్రల పేర్లు వేరైనా సన్నివేశాలు రసపోషణా విధానం ఒక్కరకంగా వుండటం ఆరంభమైంది. కొత్తదనాన్ని ప్రయోగించటం, తీసుకరావటం అసాధ్యమైంది. దానితో సంస్కృత నాటకాల వికాసానికి అవరోధం ఏర్పడింది.

సంస్కృత భాష ఒకప్పుడు ప్రజలకు బాగా అర్థమయ్యేది. పండితులు, చదువుకొన్నవారు సుసంస్కృత రూపంతో శుద్ధ ఉచ్చారణతో కూడిన సంస్కృత భాషనే మాట్లాడేవారు. చదువుకోనివారు, సామాన్యులు శుద్ధ ఉచ్చారణలేని వారు వికృతం చెందిన భాషలను అంటె ప్రాకృత భాషలను మాట్లాడేవారు. ఉదా॥ కు తెలుగు భాషలో ఎన్నో మాండలికాలున్నవి. సామాన్యులు ఆయా ధ్వనిబేధాలతో, యాసలతో ఆ భాషను మాట్లాడుతారు. ఇవన్నీ పోగా తెలుగులో ఒక Standard (ప్రామాణిక) భాష అనేది వుంటుంది. సుసంస్కృతులైనవారు, విద్యావంతులు మాట్లాడే భాష అది. అదే సాహిత్యభాషగా ప్రయోగింపబడుతుంది. అదేవిధంగా హిందీలో చూస్తున్నాం. హిందీలో ఖడీబోలి అనే విద్యావంతులు మాట్లాడేభాషే సాహిత్యంలో ప్రయోగింపబడే భాష. ఇదిగాక సామాన్యులు మాట్లాడే ఎన్నో మాండలిక భేదాలు కూడ వున్నవి. అయితే ఈ వివిధ ధ్వని ఉచ్చారణలతో, యాసలతో కూడిన మాండలిక భాషలు మాట్లాడేవారు నిత్యజీవితంలో తమ తమ మాండలికాలనే వాడుకొన్నా, సుసంస్కృతమైన Standard భాష వారికి సులభంగానే అర్థమౌతుంది. అట్లా అర్థం చేసుకోవటంలో వారికేం కష్టముండదు. అదే విధంగా సుసంస్కృతులైన Standard భాష మాట్లాడేవారు వివిధ మాండలికాలను అర్థం చేసుకోగలుగుతారు. అందులో వారికేం కష్టముండదు ఇదే పద్ధతిలో పూర్వం సంస్కృత ప్రాకృత భాషల సంబంధముండేది. ప్రాకృత భాషలు వివిధ ధ్వని ఉచ్చారణా భేదంతో, యాసల భేదంతో కూడినవి. వీటన్నిటికి Standard భాషగా సంస్కృతం వుండేది కాబట్టి నాటకాలల్లో నిత్యజీవితానికి దగ్గరగా వుండేటట్లుగా సహజత్వం కొరకు కవులు ఆయా పాత్రలకు ఆయా ప్రాకృతభేదాలను, సంస్కృతభాషను ప్రయోగించేవారు. నాటకాలను దర్శించే ప్రేక్షకులకు ఆ భాషలు సులభంగానే అవగాహన యోగ్యంగా వుండేవి. కాని

రానురాను భాషల మధ్య అగాథం ఎక్కువైంది. ప్రాకృత భాషలు ఇంకా వికృతం చెంది అపభ్రంశ భాషలుగా ఇంకా తర్వాత దేశభాషలుగా మారి స్థిరపడసాగినవి. ప్రాచీన ప్రాకృత భాషలు ప్రజల అవగాహనకు దూరమైనవి. అదేవిధంగా సంస్కృతభాష కేవలం ప్రత్యేకంగా అధ్యయనం చేసిన వారికే అర్థం కాసాగింది. కాని అందరికి అర్థం కావటం మానేసింది. సంస్కృతం కేవలం శాస్త్రాధ్యయన భాషగా మారసాగింది. సామాన్యులకు సంస్కృత కవులు వ్రాసే నాటకాలు ఒకప్పుడు సులభంగా అర్థమయ్యేవి ఆదరించేవారు. ఇప్పుడు అర్థంకాక వారి ఆదరణకు దూరమైనవి. ఎప్పుడైతే రాజుల, ప్రజల జీవితంలో మార్పు వచ్చిందో ప్రాచీన నాటకాలల్లో చిత్రింపబడిన జీవితక్రమం ప్రజల అవగాహనకు దూరమైంది. సంస్కృత కవులు ఈ మార్పులను గుర్తించి తమ రచనల్లో మార్పును తేలేదు. వారు ఇంకా ఊహాజనిత కల్పనలతో అదే జీవిత క్రమాన్ని చిత్రించసాగారు. దానితో సామాన్యులకు భాష అర్థంకాక పైగా ఆ నాటకాల్లోని కథావస్తువు, పాత్రలు తమ జీవితాలకు సంబంధం లేనివి కావటంచేత వారి అవగాహనకు నాటకాలు దూరమైనవి. దానితో ఇంకా కవులు సంస్కృత నాటకాలు వ్రాస్తున్నా వాటిని ప్రదర్శించేవారు. ఆదరించే వారు లేకుండా పోయారు. క్రమ క్రమంగా వాటి రచన కూడ సన్నగిల్లింది.

ప్రజల భాషలో, జీవితక్రమంలో మార్పు రావటమేకాక రాజకీయంగా కూడ దేశంలో చాలా మార్పు వచ్చింది. విజాతీయులు దేశాన్ని ఆక్రమించుకొన్నారు. వారి భాషా సంస్కృతులు భిన్నమైనవి. ఇక్కడి సాహిత్యంమీద వారికి అభిరుచిలేదు. వారికది విజాతీయమైంది. ఇక్కడి భాషా సంస్కృతులతో వారి భాషా సంస్కృతులు కలసిపోయి ఒక కొత్త సమ్మిశ్రణరూపమైన భాషా సంస్కృతులు వచ్చినవి. దానితో పాత సాహిత్యం, రచనా విధానాలు ప్రజల ఆదరణకు దూరమైనవి. ఆ విధంగా సంస్కృత నాటకాలు సామాన్య ప్రజలకు దూరమై పతనోన్ముఖమైనవి.

భారతీయ నాటకాలను గురించి చెప్తు కీథ్ ఇట్లా అన్నాడు - "This art was essentially aristocratic, the drama was never popular in the sense in which the Greek drama possessed that quality". భరతడు నాట్యోత్పత్తిని వివరిస్తు వేదశాస్త్రాలు చదువులేని శూద్రుల కొరకు నాట్యం సృష్టింపబడిందని చెప్తాడు. దీన్ని బట్టి వేదాలు చదివే అధికారం గాని వాటిని అర్థంచేసుకునే శక్తిగాని లేనివారికి ధార్మిక నైతిక బోధన చేయటానికే నాట్యోత్పత్తి జరిగింది. అంటే పండితుల కొరకు కాక నాట్యం సామాన్య

జనుల కొరకు ఉద్దేశింపబడిందని తెలుస్తున్నది. అటువంటప్పుడు సంస్కృత నాటకాలు గ్రీకు నాటకాలవలె ప్రజాసామాన్యానికి ఉపయోగపడలేదని అవి కేవలం పై తరగతివారి కొరకే ఉపయోగపడినవన్న కీథ్ అభిప్రాయం సరియైందని చెప్పలేము. ప్రజలు నాటకాలను తప్పక దర్శించాలనే నియమం గ్రీకు దేశంలోవలె భారతదేశంలో లేదు. కాని వసంతోత్సవ, దేవోత్సవాది సమయాలల్లో నాటకాలు బహిరంగ ప్రదేశాలల్లో ప్రదర్శింపబడి జనులందరిచేత దర్శింపబడేవి. గ్రీకు దేశంలో 1500 మంది వరకు కూర్చొని నాటకాన్ని దర్శించగల నాటకశాలలు వుండేవి. భారతదేశంలో 500 మంది వరకు కూర్చునేవి మాత్రమే నిర్మింపబడినవి. భారతదేశంలో నాటకాలు రాజుల సామంతుల ఆదరణలో ప్రదర్శింపబడేవి. అటువంటప్పుడు నాటకాలు ఒకొకసారి పరిమితమైన ప్రేక్షకుల ముందు సుసజ్జితమైన నాటకశాలల్లో ప్రదర్శింపబడేవి. గ్రామంలో గ్రామాధికారో, ధనవంతుడో యజమానిగా వుండి నాటక క్రతువును నడిపించేవాడు. అటువంటప్పుడు బయలుప్రదేశంలో గ్రామ ప్రజలందరు దర్శించగలిగేటట్లుగా ప్రదర్శన జరిగేది. నాటకాలు సంస్కృతభాషలో వుండటంచేత, ఆ భాష ప్రజాసామాన్యానికి అర్థం ఇప్పుడు కానట్లే అప్పుడు కాలేదనే అభిప్రాయంతో కీథ్ అట్లా వ్రాసివుంటాడు. కాని ఒకప్పుడు ప్రాకృతభాషలు మాట్లాడే జనులకు వాటి సంస్కృతరూపమైన శిష్ట వ్యవహారభాష సంస్కృతం బాగానే అర్థమయ్యేది. ప్రజలందరూ ఆ నాటకాలను దర్శించి ఆనందానుభవంతోపాటు ధార్మికనైతిక విషయాలను నేర్చుకునేవారు. కాని క్రీ.శ. 10 శతాబ్దం తర్వాత ప్రజలభాషల్లో మార్పు వచ్చింది. ప్రాకృత భాషలు ఇంకా వికృతమై అపభ్రంశభాషలుగా ఇంకా దేశ భాషలుగా మార్పుచెంది వాటిల్లోను సాహిత్యసృష్టిఆరంభమైంది. అప్పుడు సంస్కృత నాటకాలు ప్రజాసామాన్యానికి దూరమైనవి. రాజకీయ అస్థిరత్వం దీనికి తోడ్పడింది. క్రీ.శ. 9,10 శతాబ్దాల తర్వాత వ్రాయబడిన నాటకాలల్లో నాటక కళ లోపిస్తూ వచ్చింది. సంస్కృత భాషలో జీవకళపోయి కవుల ప్రయోగంలో కృత్రిమభాషగా తయారైంది. ప్రదర్శనకు అవకాశాలు లేక నాటకాలల్లో నాటకకళ లోపించి నాటకాలు శ్రవ్యకావ్యాలుగా మారినవి. మహమ్మదీయుల ఆక్రమణ కూడ నాటకకళకు గొడ్డలిపెట్టు అయింది. ఇస్లాంమతం నాట్యసంగీత కళలను ప్రోత్సహించేది కాదు. దానితో నాటకకళ పతనం ఆరంభమైంది. ఏవో కొన్ని హిందూరాజ్యాలల్లో హిందూరాజుల పోషణలో నాటకాలు వ్రాయబడి, ప్రదర్శింపబడినా అవి నాలుగుగోడల నడుమనే పరిమితమైనవి. కానీ జనసామాన్యానికి మాత్రం ఉపయోగపడలేదు. నాటకకళ దానితో జీవకళను కోల్పోయి పూర్వవైభవాన్ని పొందలేకపోయింది. అదే సమయంలో ఆయా

ప్రాంతాలల్లో దేశినాటక పద్ధతులు వికసించినవి. బెంగాల్‌లో జాత్రలు, తెలుగుదేశంలో కూచిపూడి భాగవతాలు, కన్నడ తమిళ దేశాలల్లో యక్షగానాలు, కేరళలో కథకళి నృత్యనాటికలు వ్యాప్తి లోకి వచ్చి అక్కడ సంస్కృత నాటకాలకు ఆదరణ లేకుండాపోయింది. అవి ప్రజలభాషలో వుండి వారి అవగాహనకు యోగ్యమైనవి కాబట్టి అవే ప్రజాదరణను పొందినవి. అర్థంకాని సంస్కృత నాటకాలు పూర్తిగా పతనం చెందినవి.

క్రీ.శ. 1870లో హెచ్. హెచ్. విల్సన్ సంస్కృత నాటకాలు మొత్తం 60 వరకున్నట్టుగా పట్టిక తయారు చేసాడు. క్రీ.శ. 1890 లో లెవీ 372 సంస్కృత నాటకాల పట్టికను తయారు చేసాడు. మాంటెగ్ మేరీ ఫూలెర్ "A Bibliography of the Sanskrit Drama" లో 500 సంస్కృతనాటకాల పట్టికను తయారు చేసాడు. ఇంకా సంస్కృతంలో నాటకాలు అక్కడక్కడ పండితులచేత వ్రాయబడుతూనే వున్నవి. అంతేగాక ప్రాచీన అలభ్య సంస్కృత నాటకాల లిఖిత ప్రతులు బయటపడుతున్నవి. ఇంత సువిశాలమైన సంస్కృత నాటక సాహిత్యం తన ప్రభావాన్ని భారతీయ దేశభాశల్లోని నాటకాల మీదనే కాక విదేశాల్లోని నాటకాల మీద కూడ చూపింది.

భారతీయ నృత్య నాట్యకళ చాల ప్రాచీనమైంది, వైభవోపేతమైంది. దీని ప్రభావాన్ని సుదూర ప్రాచ్య దేశాలల్లో చూడవచ్చును. శ్రీలంక, బర్మ, సుమత్రా, జావా, బాలి, మలయా, కంపూచియా, థాయిలాండ్, వియత్నాం, కొరియా దేశాలల్లోని నాట్యాలల్లో భారతీయ నాట్యాభినయం, హస్తముద్రలు, ఆహార్య ప్రభావాలు కన్పిస్తున్నవి. ఇతివృత్తంలో అవి భారతీయ సాహిత్యాన్ని ఆధారంగా తీసుకొన్నవి. ముఖ్యంగా బౌద్ధ సంబంధ కథలు, రామాయణ మహాభారత గాథలు నృత్య నాటకాలుగా ఆ దేశాలల్లో అభినయింపబడేవి. ఇప్పటికి అవి అభినయింప బడుతున్నవి. చైనా, జపాన్ నాటకకళ మీద కూడ భారతీయ నాట్యకళా ప్రభావం వున్నదని విజ్ఞుల అభిప్రాయం, ఇండోనేషియాలోని "వయంగ్ ఓరంగ్' అన్న నాటకవిధానం మీద భారతీయ సంస్కృత నాటకాల ప్రభావం చాల కన్పిస్తున్నది. వాటికి రామాయణ మహాభారత పురాణాదుల్లో నుంచి వారు ఇతివృత్తాలను తీసుకొన్నారు. ఆ నాటకాల్లో సంస్కృతం మాట్లాడే విదూషక పాత్ర వున్నది. బర్మా నాటకా ల్లోను విదూషకపాత్ర వుంటుంది. ఈ దేశాలల్లోని నాటకాలల్లో వాద్య సంగీత నృత్య గీతాలకే ప్రాధాన్యం. మధ్య ఏషియా, మంగోలియా దేశాలల్లో సంస్కృత నాటక లిఖిత ప్రతులు ఎన్నో లభించినవి. దాన్నిబట్టి అక్కడ సంస్కృత నాటకాలు ప్రదర్శింపబడేవని చెప్పవచ్చును. ఆ

నాటకాల ప్రభావం అక్కడి ప్రజల మీద, నాట్యకళమీద కూడ తప్పకపడి వుంటుంది. ఈ విధంగా క్రీ.పూ. కొన్ని శతాబ్దాల కిందనే పుట్టిన ప్రాచీనమైన అతివైభవోపేతమైన ప్రభావవంతమైన భారతీయ నాటకకళ క్రీ.శ. 10వ శతాబ్దం నుంచి క్షీణదశను అందుకొన్నది. రాజకీయ సాంస్కృతిక సామాజిక భాషాపరమైన మార్పులెన్నో సంస్కృత నాటకాల పతనానినికి కారణమైనవి. ఒకప్పుడు వివిధరకాలైన, విభిన్నమైన ఇతివృత్తాలు తీసుకొని సంస్కృత నాటకాలు వ్రాయబడేవి. రానురాను కవులు ఎంతసేపు రామాయణ కథాదులను తీసుకొని మళ్ళా మళ్ళా నాటకాలు వ్రాయసాగారు. అందుకే భవభూతి తర్వాత కొల్లలుగా రామాయణ కథాధారితమైన నాటకాలు వచ్చినవి. కాని అవేవి ప్రజాదరణనను పొందలేక పోయినవి. కవులు ఇతివృత్తంలో కవిత్వంతో నాటక కళలో కొత్తదనాన్ని తీసుకరాకుండా ఎంతసేపు ప్రాచీన కవుల ఇతివృత్తాలను, కవిత్వాన్ని, నాటక కళను అనుకరిస్తు వచ్చారు. శాస్త్రలక్షణాలను తప్పిపోకుండా అనుసరించసాగారు. శాస్త్రలక్షణాలు ప్రాచీనకవుల నాటకాలను లక్ష్యంగా తీసుకొని ఏర్పడినవి. ఎంతసేపు ఆ సీమితమైన శాస్త్రలక్షణాలను పట్టుకొని వుండటం వల్ల మౌలికత, కొత్తదనం లోపించసాగినవి. అవే పాత్రలు, అవే కథలు, అవే సన్నివేశాలు, అవే సంభాషణలు, అవే కవితాభావాలు, అవే వర్ణనలు, అవే రస పోషణలు ప్రేక్షకులకు విసుగు పుట్టించేవిగా తయారైనవి. వాటిని చూడాలనే, చదువాలనే కుతూహలం సామాజికుల్లో నశించింది. దానితో సంస్కృత నాటకాలు పూర్తిగా క్షీణదశను చేరుకొన్నవి అయినా ఈ నాటి వరకును ఎవరో ఒకరు సంస్కృతంలో ఏదో ఒక విధమైన నాటకాలను వ్రాస్తూ ఆ పరంపరను కొనసాగిస్తూనే వున్నారు. కాని వాటిల్లో మునుపటి జీవకళ మాత్రం కన్పించటం లేదు.

# లఘు కావ్యాలు

## ఖండకావ్యం - కోషం

సాహిత్య దర్పణకారుడు పద్య కావ్యాలను మూడు విధాలుగా విభాగించాడు - 1. మహాకావ్యం, 2. ఖండకావ్యం, 3. కోషం. సర్గ బంధాత్మకమై, పంచసంధియుక్తమై, వర్ణనలు కలిగి, ఒక్క అంగిరసం, వివిధ అంగరసాలతో కూడింది మహాకావ్యం. ఖండకావ్యం మహాకావ్యం యొక్క ఒక ఖండం మాత్రమే అనదగింది- "ఖండకావ్యం భవేత్ కావ్యస్యైకదేశానుసారి చ" అని విశ్వనాథుడు ఖండకావ్యాలకు "మేఘ దూతాది:" అని ఉదాహరణగా పేర్కొన్నాడు. ఇక కోషమంటె పరస్పరాపేక్ష లేని శ్లోక సమూహమని విశ్వనాథుని అభిప్రాయం. అంటె ముక్తక కావ్యాలే కోష విభాగానికి చెందినవి. ఖండకావ్య, ముక్తక కావ్యాలను కలిపి"లఘు కావ్యాలు" అని పిలుస్తుంటారు. లఘు కావ్యాలను కొందరు లాక్షణికులు "క్షుద్రకావ్యా"లని కూడ పిలిచారు. 'క్షుద్ర' అంటె నీచమైన అని అర్థాన్ని తీసుకొని లఘు కావ్యాలు మహాకావ్యాలవలె ఉదాత్తమైనవి కావని కొందరు భావించారు. కాని అది పొరపాటు. 'క్షుద్ర' శబ్దానికి "అల్ప, లఘు" అన్న అర్థాలు తీసుకోవాలి. లఘు కావ్యాలు రూపంలో మహాకావ్యాలకన్న చిన్నవైనవే కాని అనుదాత్తమైనవి కావు. పాఠకులను రంజింప జేయటంలో అవి మహాకావ్యాలకన్న ఎక్కువ సమర్థవంతంగా కూడ వున్నవి. కాబట్టి అవి ఏవిధంగాను నీచమైనవి కావు. ఆధునిక సాహిత్యకారులు లఘు కావ్యాలను "గీతి కావ్యాలు" గా కూడ పేర్కొన్నారు. ఇంగ్లీషు సాహిత్యంలో lyrical poetry అని వున్నది. అవి కేవలం చదువుకోవటానికి కాక పాడుకోవటానికి కూడ అనువైనవి. lyrie అనే ఒక విధమైన తీగవాద్యాన్ని వాయిస్తూ ఆ కవిత్వాన్ని పాడేవారు. అందుచేత ఆ కవిత్వానికి lyrics అన్న పేరు ఏర్పడింది. మేఘసందేశాది ఖండ కావ్యాలను, ముక్తకాలైన శతకస్తోత్రాదులను lyrical poetry కోవకు చేర్చి పాశ్చాత్య సంస్కృత సాహిత్య చరిత్రకారులు చెప్పారు. lyrical poetry అన్న పదాలను అనువదించి భారతీయ సంస్కృతసాహిత్య చరిత్రకారులు లఘు కావ్యాలను గీతి కావ్యాలు అని కూడా అనటం మొదలు పెట్టారు. కాని ప్రాచీన లాక్షణికుల అనుసారం ఖండకావ్యాలను, ముక్తకాలను లఘుకావ్యాలు అనటమే సమంజసం.

ఇతివృత్తాలను పురాణేతిహాసాల నుంచి గ్రహించి కవులు మహాకావ్యాలను రచించారు. అటువంటి ఇతివృత్తాన్ని ప్రఖ్యాతేతివృత్త మంటారు. కవి ప్రఖ్యాతేతి వృత్తాన్నే కాక కల్పితేతి వృత్తాన్ని కూడ గ్రహించటమున్నది. ఎట్లా అయినా ఇతివృత్తం సత్పురుషాశ్రయమై వుండాలి. దివ్యమైన, ఆదర్శ భూతమైన సద్వృత్తాన్నే కవులు గ్రహించాలని లాక్షణికుల అభిమతం. అంటె మహాకావ్యంలో ఉన్నత కుల సంభవుల, సంఘంలోని ఉచ్చకోటికి చెందిన వారి చరిత్ర చిత్రణమే కనిపిస్తుంది. కాని సామాన్య ప్రజాజీవిత చిత్రణకు స్థానంగాని అవకాశంగాని లేకుండా పోయింది. సంస్కృత సాహిత్యంలో ఏర్పడిన అటువంటి లోటును తీర్చటానికి అన్నట్లుగా లఘుకావ్యాల సృష్టి జరిగింది. ప్రజాసామాన్యం యొక్క జీవన విధానం లఘుకావ్యాలల్లో పూర్తిగా చిత్రింప బడింది. కవి తన హృదయానుభూతులను వ్యక్తీకరించటానికి లఘుకావ్య ప్రక్రియ మంచి భిత్తికగా ఉపయోగపడింది.

మహాకావ్య లక్షణాలను లాక్షణికులు నిర్దేశించి చెప్పినట్లుగా ఖండకావ్యాల, ముక్తక కావ్యాల లక్షణాలను నిర్దేశించి చెప్పలేదు. కాని వాటికి మహాకావ్యాలకున్న స్వరూప భేదాధ్యయనం ద్వారా తల్లక్షణాలు స్పష్టం కాగలవు.

## ఖండకావ్యానికి మహాకావ్యానికి గల భేదం

ఖండకావ్యం ఆకారంలో చిన్నది. అందుకే అది లఘుకావ్యం. మహాకావ్యం ఆకారంలో పెద్దది. అందుకే అది మహాకావ్యం. ఖండకావ్యంలో మహాకావ్యంలో వలె కథ వుండదు. కవి ఏదో ఒక కథా భాగాన్ని గ్రహించి పోషిస్తాడు. దీనిలో కవి భావానుభూతులకే ప్రాధాన్యం కాని కథకు కాదు. ఒక విధంగా కథ వుండదనే చెప్పాలి. కవి హృదయానుభూతులు నిత్యజీవితానికి చాల సమీపమైనవిగా వుంటవి. మార్మికమైన, హృదయ భేదకమైన భావాలు దీనిలో వుంటవి. కవి ప్రకటించిన హృదయానుభూతులు, నైపుణ్యంగల ధానుష్కుడు ప్రయోగించిన బాణాలవలె తగిలి లక్ష్యాన్ని చీల్చివేస్తవి. ఈ లక్షణాలతో కూడిన ఖండకావ్యాలు ఆధునిక కవిత్వానికి దగ్గరగా వున్నట్లు కన్పిస్తవి. మహాకావ్యంలోని విశాలమైన ఇతివృత్తం ఎక్కువ దీర్ఘమైన ద్వంద్వ సంఘర్షణలతో, ఆదర్శభావ చిత్రణలతో, సత్యధర్మాల విజయచిత్రణలతో సాగిపోతుంటుంది. మహాకావ్యం పాఠకుని ఆలోచింపజేసేది కాని ఊపేది కాదు. మహాకావ్యంలో ఆవశ్యకమైన కథా వస్తువు సంభాషణలు, చరిత్ర చిత్రణలు ఖండకావ్యంలో సంపూర్ణంగా కాక కొంత వరకే వుంటవి. కవిత్వం విషయంలో అంటె భాష శైలి రసభావాల దృష్టితో ఖండకావ్యం మహాకావ్యంతో సమానమైందే. మహాకావ్యం

ప్రధానేతివృత్తం, ప్రాసంగికేతి వృత్తాలతో, దీర్ఘవర్ణనలతో వస్తువిస్తరణ కలిగివుంటుంది. కథలో సంధి సంధ్యంగాల చేత పాఠకుల ఔత్సుక్యాన్ని పుట్టించి నిలపటానికి కవికి అవకాశం వుంటుంది. కథా సంవిధానంలో పటుత్వం వుంటుంది. సంఘటనల సంయోజనంలో కవి నేర్పును ప్రదర్శిస్తాడు. దీర్ఘమైన సంవాద సన్నివేశాలతో కథ నెమ్మదిగా నడుస్తుంది. ఖండకావ్యంలో ఇటువంటి కథాయోజన కనపడదు. లఘుసంఘటనల మీద ఆధారపడి లఘు కావ్యం వుంటుంది. ఒకొకసారి కేవలం హృదయావేదనల ప్రకృతి, స్థలాదుల వర్ణనలతో నిండి వుంటుంది. మేఘసందేశం, ఋతుసంహారం, గీతగోవిందం ఇటువంటి ఖండకావ్యాలే.

మహాకావ్యాలల్లోని సర్గవిభజన ఖండకావ్యంలో వుండదు. మహాకావ్యంలో ప్రతి సర్గానికి వృత్తాలు మారుతుంటవి. అంటె మహాకావ్యం వృత్తవైవిధ్యం కలిగి వుంటుంది. అటువంటి వృత్తవైవిధ్యం ఖండకావ్యాలల్లోగాని ముక్తకాలల్లో గాని వుండదు. లఘుకావ్యాలల్లో కవి ఒక వృత్తాన్నే గ్రహించి ప్రయోగిస్తాడు. మేఘసందేశం పూర్వమేఘం, ఉత్తర మేఘం అని రెండు భాగాలుగా విభాగింపబడింది. ఇటువంటి లఘువిభజన అక్కడక్కడ లఘుకావ్యాలల్లో వున్నా మహాకావ్యంలోవలె సర్గవిభజన ఖండకావ్యంలో లేదు.

మహాకావ్యంలో వలె ఖండకావ్యంలో అనేక పాత్రలుండవు. ఖండకావ్యంలో పాత్రలు చాల తక్కువ, ఒకొకసారి వుండక పోవచ్చును, వున్నా ఒకటి రెండు కన్న ఎక్కువ వుండవు. ఆ పాత్రల చరిత్ర చిత్రణకు మహాకావ్యంలో వలె అవకాశముండదు. కాని వాటి సజీవ చిత్రణను కవి సంక్షిప్తంగా చేయటం కన్పిస్తున్నది.

ఆదర్శ చిత్రణ, యుగధర్మ బోధన మహాకావ్య ప్రధాన లక్షణాలు కాగా సహజ సమాజ మానవ వస్తుచిత్రణలు లఘుకావ్యాల ప్రధాన లక్షణం.

ఖండకావ్యంలో రసభావాల కూర్పు వుంటుంది. కాని మహాకావ్యంలో వలె రసవిస్తరణకు అవకాశం లేదు.

మహాకావ్యంలో కన్న ఖండకావ్యంలోని భాష, శైలి సరసం, లలితం, మధురం. ఖండకావ్య కవిత్వానికి సరళం, సంగీతాత్మకం అన్న రెండు గుణాలు ప్రధాన లక్షణాలు. మహాకావ్యంలో వలె ఖండకావ్యంలో దీర్ఘకఠిన సమాసాలు, క్లిష్టాలంకారాలుండవు. శైలి ధారాళంగా వుంటుంది.

ఖండ, ముక్తక కావ్యాల్లో ప్రతిశ్లోకం మాధుర్యగుణభరితమై, భావసంభరితమై, కోమల పదగుంఫితమై వుంటుంది. ఇటువంటి గుణాలు గల శ్లోక సంఘటన మహాకావ్యంలో అక్కడక్కడ కన్పించవచ్చును. కాని అటువంటి కోమల భావయుక్త రచన ఖండ, ముక్తక కావ్యాలల్లో ప్రతిశ్లోక లక్షణంగా వుంటుంది. ఖండ, ముక్తక కావ్యాలు మహాకావ్యాల కన్న సరసమై, మర్మస్పర్శియై, సహజమై, రమణీయమై, సర్వజనహృదయాకర్షకమై వున్నవి. వీటికి రమణీయత్వం సహజ వస్తు భావ చిత్రణలచేత కలిగిందని చెప్పవచ్చును. వీటిలోని జీవవంతమైన గుణం మానవజీవితానికి దగ్గరగా వుండడటమే!

ఖండ కావ్యాలకు మహాకావ్యం వలెనే నామకరణం చేయటం కన్పిస్తున్నది. కాని ముక్తక కావ్యాలకు వాటిల్లోని శ్లోకాలల్లో కన్పించే సామాన్య వస్తువేదో చూచి దానికి తగిన పేరు పెడ్తుంటారు. ఒకొకసారి ముక్తకాల ఛందస్సు పేరును బట్టి, శ్లోకసంఖ్యను బట్టి నామకరణం చేయటం జరుగుతుంది. యాభై శ్లోకాలుంటె దాన్ని పంచాశిక అని, నూరు శ్లోకాలుంటె శతకమని, ఏడువందల శ్లోకాలుంటె సప్తశతి అని పేర్లు పెట్టారు. చౌరపంచాశిక, భర్తృహరిశతకం, గాథాసప్తశతి ఆర్యాసప్తశతి మొదలైనవి. గాథా సప్తశతిలో ఏడువందల గాథలు-అంటె ప్రాకృత పద్యాలున్నవి. అదేవిధంగా ఆర్యాఛందస్సులో ఏడువందల శ్లోకాలున్నవి కాబట్టి ఆర్యాసప్తశతి అని పేరుపెట్ట బడింది. తర్వాత సప్తశతి లేక సత్‌సాయి అన్నది అపభ్రంశ హిందీభాషలో శృంగార రసపూరిత ముక్తక రచనాప్రక్రియకు పేరుగా స్థిరపడింది. అపభ్రంశ హిందీలో అనేక సత్‌సాయి రచనలు వచ్చినవి. తెలుగులో కవులను శృంగార రసంతో కూడిన సత్‌సాయి ప్రక్రియ కన్న శతక ప్రక్రియ ఎక్కువ ఆకర్షించింది. తెలుగు సాహిత్యారంభం నుంచి శతకాలు వ్రాయబడినవి. ప్రతి కవి తన కవిత్వాభ్యాసాన్ని ముక్తక పద్యాలతో చేస్తాడు. తెలుగుకవులు శతకరచనతో కవిత్వాభ్యాసాన్ని చేసినట్లు విమర్శకులు తలంచారు. అందుకే తెలుగు సాహిత్యంలో అనేక సంఖ్యలో శతకాలు కన్పిస్తున్నవి.

## ముక్తకాలు

ముక్తకాలు లక్షణంలో మహాకావ్యం కన్న భిన్నమైనవే కాక కొన్ని విషయాల్లో ఖండకావ్యం కన్న భిన్నమైనవి. ఖండకావ్యంలో మొదటి నుంచి చివరి వరకు నిర్వహింపబడే వస్తుసామ్యత ముక్తకాలల్లో కూడ వుంటుంది. కాని ముక్తకాలల్లో కథాసూత్రం వుండదు. వీటిల్లో ఒక్కొక్క శ్లోకం సంపూర్ణార్థంతో స్వతంత్రమై వుంటుంది. స్వతంత్రమైన శ్లోకాలల్లోని

విషయవస్తువును బట్టి శృంగార శతకం, వైరాగ్యశతకం, కరుణావిలాపం మొదలైన పేర్లు పెట్టడం కన్పిస్తుంది. మహాకావ్యంలో, కొంతవరకు ఖండకావ్యంలోను విభావానుభావాదులచే సంధి సంధ్యంగాల చేత అంగిరసం విస్తరించటం కన్పిస్తుంది. కాని ముక్తకాలల్లోని ప్రతిశ్లోకం పాఠకులల్లో రసోత్పత్తిని కలిగించటానికి సమర్థమై వుంటుంది. ఒక్కొక్క శ్లోకంలోని కవి భావాలు, హృదయానుభూతులు పాఠకుల భావాల, హృదయానుభూతులతో లయమై రసానందాన్ని కలిగిస్తవి. ఆధునిక భారతీయభాషల్లో ఆధునిక కవిత్వం పాశ్చాత్య సాహిత్య ప్రభావంతో పుట్టిందనే అంటున్నాము. కాని ఆదునిక కవిత్వ లక్షణాలన్ని ముక్తక ప్రక్రియలో వున్నవే కొత్తవేమి కాదు. హృదయానుభూతులు, భావవ్యక్తీకరణలో ప్రతీకాత్మత్వం మార్మికత్వాలను ఆశ్రయించటం, సమకాలిక పరిస్థితులకు స్పందించి వాటిని చిత్రించటం - ఇవన్నీ ఆధునిక కవిత్వంలో వలెనే ముక్తక కావ్యాలల్లోను కన్పిస్తున్నవి.

మహాకావ్యకవి వలె ముక్తకకవి కఠిన దీర్ఘసమాసభరిత శైలిని, క్లిష్టాలంకార చమత్కారవైభవాన్ని ప్రదర్శించక సరసమధురమైన శబ్దరచనను గ్రహిస్తాడు. సరళ సరసమైన శైలి ప్రజాసామాన్యానికి తొందరగా అర్థం కావటం చేతనే ముక్తకాలు ప్రతిఒక్కరి నోటిలోను ఆడుతుంటవి.

ఖండ, ముక్తక కావ్యాలల్లో వాసనాత్మకమైన శృంగార చిత్రణమే అంతటా వున్నదని, స్త్రీ పురుషుల ప్రేమ అశ్లీలంగా కూడ చిత్రింపబడిందని కొందరు విమర్శకులు తలంచారు. కాని ఈ విమర్శ పరిశీలన ముందు నిలిచేది కాదు. ఖండ, ముక్తక కావ్యాలల్లో శృంగార వర్ణనలే ప్రాధాన్యం వహించిన మాట నిజమే కాని ఆ శృంగారం వాసనాత్మకమైంది మాత్రం కాదు. మేఘసందేశంలోని యక్ష దంపతుల ప్రేమ ఎక్కడా అశ్లీలత లేకుండా ఉదాత్తంగా చిత్రింపబడింది. యక్షుడు కర్తవ్యనిష్ఠుడైన భర్తగా, ప్రేమికుడుగా కన్పిస్తాడు. యక్షిణి భర్త ప్రేమనుపొందిన గృహిణిగా, భర్త ఆగమనానికై వేచివున్న విరహిణిగా వర్ణింపబడిందే కాని వేరే కాదు. మహాకావ్యాలల్లోని అంగాంగ వర్ణనలతో కూడిన స్త్రీ వర్ణనలవంటి అశ్లీల వర్ణనలు లఘు కావ్యాలల్లో కనిపించవు. వీటిల్లో సున్నితమైన ప్రేమభావాలకు, అనుభూతులకు ప్రాధాన్యం. ఈ భావానుభూతులు ఎప్పుడు ఉదాత్తత అన్న గీతను దాటిపోయినట్లు కనిపించవు. ముక్తక కావ్యాలల్లో స్త్రీయొక్క వివిధరూపాల చిత్రణ భవ్యంగా జరిగింది. మహా కావ్యాలల్లో వలె ముక్తక కవులు అంగాంగ వర్ణనలతో స్త్రీ బాహ్యరూపాన్ని కాక స్త్రీల ఆంతరరూపాన్ని చిత్రించటానికి ప్రయత్నించారు. స్త్రీ ముఖాన్ని, బాహువులను, వక్షోజాలను

కాక ఆమె హావభావ చేష్టాదులనే ముక్తకకవి మనోహరంగా వర్ణించాడు. ప్రణయిని, విరహిణి, మానిని అయిన స్త్రీ రూపాలను ముక్తతకవులు అనితరలభ్యంగా చిత్రించారు. అసలు వారు చిత్రించని స్త్రీ మనోవృత్తియే లేదనిపిస్తుంది. స్త్రీ యొక్క సర్వాంతర్భావాలను, ఆకాంక్షలను, మనోగత భావ కల్పనలను, స్త్రీయొక్క సర్వదశలను, సర్వవయో అవస్థలను కవి సూక్ష్మేక్షికతో చిత్రించాడు. ఇటువంటి స్త్రీ ఆంతరరూప సౌందర్యాన్ని మహాకావ్య కవులు చిత్రించటంలో విఫలులయ్యారని చెప్పాలి.

ముక్తక కావ్యాల్లోని నాయిక ప్రధానంగా శృంగార నాయిక. స్త్రీ సుకుమార శృంగార రూపాన్ని ఉదాత్తంగా, సహజంగా, మనోహరంగా ముక్తకకవి చిత్రించాడు. ముక్తకాలల్లోని నాయిక విరహోత్కంఠితయై ప్రియుని కొరకు ఎదురుచూస్తుంది. ఖండితయై పరస్త్రీ గమనం చేసివచ్చిన ప్రియున్ని నిందిస్తుంది, పరస్త్రీల మీద ఈర్ష్య చూపుతుంది. కలహాంతరితయై అపరాధం చేసిన ప్రియునిపై కోపగించి తర్వాత పశ్చాత్తాపం చెందుతుంది. ప్రోషితభర్తృకయై దూరదేశం పోయిన ప్రియుని రాకకై నిరీక్షిస్తుంది. విప్రలబ్ధయై ప్రియుడు రానప్పుడు విరహం చెందుతుంది. అభిసారికయై ప్రియుని చేరుకుంటుంది. వాసకసజ్జయై ప్రియుని రాకను తెలుసుకొని సంతోషిస్తుంది. స్వాధీన పతికయై భర్త సామీప్యానికి ఆనందిస్తుంది. ఈ వివిధ రూపాలను ముక్తకకవి సహృదయ రంజకంగా వర్ణించాడే గాని ఎక్కడా అశ్లీలత లేదు. స్త్రీ పురుషుల మధ్య వుండే లౌకిక ప్రేమను ముక్తకకవి సహజంగా వర్ణించాడు. అంతేగాని ఎక్కడా కృత్రిమత్వం లేదు. గీతగోవిందం వంటి రాధాకృష్ణుల ప్రేమ వాసనాత్మకమైన ప్రేమగా కాక దివ్యప్రేమగా చిత్రింపబడింది. రాధాకృష్ణులు ఆత్మ పరమాత్మలకు ప్రతీకలై నిలిచారు. కాబట్టి ముక్తక కావ్యాలల్లో శృంగారం, ప్రేమ ఎక్కడ హద్దులను దాటి అశ్లీలతలో అడుగుపెట్టలేదు. మనోహరమైన లౌకిక ప్రేమచిత్రణలే అంతటా కన్పిస్తున్నవి.

సంస్కృత సాహిత్యంలో లఘుకావ్యాలను ఒక పరమరమణీయమైన, సరసమైన అంగంగా గ్రహించాలి. మహాకావ్యం విశాలమై మొదటినుంచి చివరి వరకు చదవితేనే అవబోధమై ఆనందాన్ని కలిగిస్తుంది. ముక్తకం అట్లా కాదు. ఏ శ్లోకాన్ని చదివినా పూర్వాపరసంబంధం లేక వెంటనే రసాభివ్యక్తిని కలిగించి ఆనందాన్నిస్తుంది. ప్రతి పుష్పం తన ప్రత్యేక సౌందర్యాన్ని ప్రదర్శించేటట్లుగా నిపుణుడైన మాలాకారుడు కట్టిన మాలవంటిది ముక్తకకావ్యం.

లఘుకావ్యాలు మానవుని రాగాత్మక, విరాగాత్మక ప్రవృత్తిని ప్రతిబింబింపజేస్తున్నవి. కాబట్టి వీటిల్లో శృంగార, భక్తి, కరుణ, శాంతరసాలకే ప్రాధాన్యం కాని రౌద్రబీభత్స భయానకవీరాది రసాలకు స్థానంలేదు. మానవుని ప్రేమసంబంధమైన కోమలభావాలకు, వైరాగ్యపూర్ణమైన సరళభావాలకు మాత్రం స్థానం వున్నది. కోమల సరళభావాలను కవి తీవ్రమైన, సరళమైన, సరసమైన, ప్రభావవంతమైన శబ్దాలద్వారా చిత్రిస్తాడు. భర్తృహరి శృంగార శతకం, అమరుని శతకం, ఆర్యాసప్తశతి వంటివి శృంగార ప్రధానమైన ముక్తకకావ్యాలు. భర్తృహరి వైరాగ్య శతకం, జగన్నాథుని శాంతవిలాసము వంటివి వైరాగ్య, ఆధ్యాత్మిక భావాలచేత కూడినవి. జగన్నాథుని కరుణావిలాసం వంటివి సున్నితమైన, మర్మస్పర్శభావాలతో కూడిన కరుణరసాత్మకమైన శతకాలు. ఇక భక్తిరస పూర్ణమైన శతకాలెన్నో వున్నవి. శతకాలేకాక స్తుతి, స్తోత్రకావ్యాలు కూడ ఎన్నో వున్నవి. బాణమయూరుల చండీ, సూర్య శతకాలు, ఆనందవర్ధనుని దేవీశతకం, కాళిదాసుని శ్యామలాదండకం, శంకరాచార్య వేదాంతాచార్యుల స్తుతికావ్యాలు ఎన్నో భక్తిరసపూరితమైన ముక్తక కావ్యాలున్నవి.

ఆయా వస్తు విషయాలనుబట్టి ముక్తక కావ్యాలను ఈ క్రింది విధంగా విభాగించవచ్చును- 1) శృంగార 2) ఆధ్యాత్మిక 3) నీత్యుపదేశక. పోషిత రసాన్నిబట్టి ఇట్లా విభాగించవచ్చును. 1) శృంగార రసాన్వితాలు 2) శాంత రసాన్వితాలు 3)భక్తిరసాన్వితాలు 4) కరుణరసాన్వితాలు.

లఘుకావ్యాలల్లో కవి సర్వస్వతంత్రుడు. మహాకావ్యం కొంతవరకు నియమిత లక్షణానుసారం రచింపబడుతుంది. నాయికానాయకచిత్రణలో, వర్ణనల్లో, శైలి, రసాభివ్యక్తిలో మహాకావ్యకవి లక్షణకారుల అభిప్రాయాలను, నియమాలను పాటించవలసివుంటుంది. లఘుకావ్యాల కవులకు అటువంటి నియమిత లక్షణాలను పాటించవలసిన అగత్యం లేదు. అంటె అతనిమీద లాక్షణికాంకుశం పనిచేయదు. అందుకే లఘుకావ్యాలు నిసర్గ కవితా సౌందర్యానికి నిలయమైనవి. కవి తన హృదయానుభూతులను ప్రకటించటంలో పూర్తిగా స్వాతంత్ర్యాన్ని చూపుతాడు. తాను కోరిన వస్తువును, సంఘటనలను కవి గ్రహించి హృదయావేశంతో తన అనుభూతులను అభివ్యక్తీకరిస్తాడు. కవి హృదయం యొక్క అచ్చమైన భావవ్యక్తిని మనం లఘుకావ్యాలల్లో చూడవచ్చును. వీటిల్లో కేవలం హృదయానుభూతులకే చోటులేదు. కళాపక్షంలో సైతం ఇవి ఉత్కృష్టకావ్యాలు. కోమల పదావళి, సరసమధురమైన శబ్దసంయోజన, భావానుగుణమైన భాష, పదలాలిత్యం,

స్వాభావికమైన అలంకార రచన, తీవ్రమైన నిసర్గసుందరమైన భావాలు, వివిధ రసాల సహజసుందర అభివ్యక్తీకరణ, కొద్దిలోనే సంపూర్ణ రసాభివ్యక్తి, ఔచిత్యపోషణ, అలంకారికుల నియమాలకు, కవి సమయాలకు లోబడని వస్తువు, పాత్రల సజీవ చిత్రణలతో లఘుకావ్యాలు మహాకావ్యాలకన్న విశిష్టమై ఉత్తమస్థానాన్ని సంపాదించుకొంటున్నవి.

# ఘటఖర్పరుడు

## ఘటకర్పరుని పరిచయం

ఘటకర్పరుడు విక్రమాదిత్యుని (క్రీ.పూ. 1వ శ॥) ఆస్థానంలోని నవ రత్నాలల్లో ఒకడు అని ప్రతీతి. దానిచేత అతడు కాళిదాసుకు కూడ సమకాలికుడే. ఘటఖర్పర భాసులు ఇద్దరూ ఒకేవ్యక్తి అనికూడా కొందరు ప్రస్తుతించారు. హేమచంద్రుని కావ్యానుశాసనంలో ఇట్లా చెప్పబడింది- "సంప్రతి పరాకాష్ఠామారూఢేన భాసేన తతూర్వా స్వకీయా దశానవిస్మృతా యతోऽనేన పూర్వచరితం ఘటఖర్పరేణ ఉదకవహనమేవ ప్రతిజ్ఞాతమ్ ప్రతిజ్ఞాం చే మామ సహమానాః పరే కవయః పరిహసితు మనసో విక్రమార్య సభ్యమేనం భాసం తజ్జాతిస్మారక ఘటఖర్పర నామ్నా వ్యాజహ్రుః క్రమేణ చ స ఏవ వ్యపదేశో భాసమహాకవేః సుప్రసిద్ధః సంపన్నః"- భాసుడే ప్రతిజ్ఞావశంచేత ఘటఖర్పరంతో నీళ్ళు మోయటంవల్ల, అతని కులం కూడా నీళ్ళుమోసే కులం కాబట్టి అతన్ని పరిహాసం చేసేందుకై ఘటఖర్పరుడని పిలువబడసాగాడు. ఘటకర్పరుడన్న పేరు భాసునికి ఉపనామంగా ఏర్పడి ఆ పేరుతోనే అతడు ప్రసిద్ధుడైనాడు." ఒకవేళ ఈ కథనంతా మనం విశ్వసించకున్నా, హేమచంద్రుని కథనాన్ని బట్టి ఘటఖర్పరుడు భాసునివలెనే శూద్రకులజుడని, ఘటఖర్పుడన్నది ప్రతిజ్ఞావశంచేత కలిగిన ఉపనామమని తెలుస్తున్నది. ఈ కవి కుండలతో నీళ్ళు మోయటానికి కారణం ఘటఖర్పర కావ్యంలోని 23 వ శ్లోకంలో ఇట్లా చెప్పబడింది-

ఆలంబ్యచాంబు తృషితః కరకోశపేయమ్
భావానురక్త వనితా సురతైః శపేయమ్
జీయేయ యేన కవినా యమకైః పరేణ
తస్మై వహేయముదకం ఘటఖర్పరేణ.

"ఎవరైతే యమక ప్రయోగంలో తనను మించుతారో వారికి నేను ఘట ఖర్పరంలో

నీళ్ళను మోస్తాను" - అని కవి ప్రతిజ్ఞ చేసాడు. దానిచేత అతనికి ఘటఖర్పరుడనే పేరుకలిగి వుంటుంది. ఘటఖర్పరునికి, కాళిదాసుకు కవిత్వ వైరముండేదని ప్రతీతి. కుమార సంభవంలో కాళిదాసు చెప్పిన "ఏకోహి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీందో: కిరణే ష్వివాంకః" అన్న ఉక్తిలో ఘటఖర్పరుడు అనౌచిత్య దోషాన్ని తన నీతిసారగ్రంథంలో ఎత్తి చూపుతూ ఇట్లా అన్నాడు-

ఏకోహి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీందొరితియో బభాషే
నూనం నదృష్టం కవినాపితేన దారిద్ర్యదోషో గుణరాశినాశీ. నీతిసార:5.17

రఘువంశంలో కాళిదాసు కొద్దిగా యమకాలంకారాన్ని ప్రయోగించగా ఘటఖర్పరుడు పూర్తిగా యమక కావ్యాన్నే రచించాడు. ఘటఖర్పరుని యమక కావ్యం కాళిదాసు మేఘసందేశం కన్న పూర్వందని విమర్శకుల అభిప్రాయం. మేఘసందేశంలో యక్షుడు తన భార్యకు మేఘం ద్వారా సందేశాన్ని పంపగా దీనిలో భార్య తన భర్తకు మేఘం ద్వారా సందేశాన్ని పంపుతుంది. రెండు సందేశాలు వర్షర్తు ఆరంభంలోనే పంపబడినవి. మేఘసందేశంలో యక్షుని విరహం ఒక సంవత్సరకాలానిది కాగా ఘటఖర్పర కావ్యంలో భార్యాభర్తల విరహం మూడు నెలలది మాత్రమే. ఘటఖర్పరుడు మేఘసందేశంలో లాగ మేఘం వెళ్ళ వలసిన దారిని వర్ణించలేదు.

## ఘటఖర్పరుని కావ్యం

ఘటఖర్పర కావ్యంలో 23 శ్లోకాలున్నవి. వాటిల్లో "ఏతన్ని శమ్య".... అన్న 22వ శ్లోకం ప్రక్షిప్తమని విమర్శకుల అభిప్రాయం. ఈ శ్లోకానికి అభినవగుప్తాదులు వ్యాఖ్యానాన్ని వ్రాయక పోవటమే ఈ ఊహకు కారణం. అభినవ గుప్తుని అనుసారం ఈ కావ్యంలో 21 శ్లోకాలు మాత్రమే వున్నవి. మరొక వ్యాఖ్యాత దివాకరుడు 20 శ్లోకాలకు మాత్రమే వ్యాఖ్యానాన్ని వ్రాసాడు. కాబట్టి ఘటఖర్పర కావ్యంలో 20 మొదలుకొని 23 శ్లోకాలవరకు వున్నవని చెప్పాలి. ఘటఖర్పర కావ్యం సందేశ కావ్యాలల్లో మొదటిది తర్వాత కాళిదాసు మేఘసందేశం ఆ తర్వాత ఎన్నో సందేశ కావ్యాలు కొల్లలుగా వ్రాయబడినవి. సందేశ కావ్య రచన మొదట్లో ఎంత సూక్ష్మంగా జరిగి తర్వాత ఎట్లా వికాసం చెంది ఖండకావ్య స్వరూపాన్ని ధరించిందో ఘటఖర్పర, మేఘసందేశ కావ్యాలను పరిశీలిస్తే తెలుస్తుంది.

ఘటఖర్పర కావ్యం క్రీ.శ. 1828లో జర్మనీ దేశంలో దుర్సే సంపాదకత్వంలో

ప్రచురింపబడింది. ఘటకర్పరకావ్యం ప్రసిద్ధమైంది. సంస్కృత సాహిత్య ప్రియులందరూ దీనిచేత పరిచితులే అయినా తర్వాత ఈ కావ్యాన్ని ఎవరూ ప్రచురించలేదు. క్రీ.శ. 1959లో డా॥ జతీంద్ర బిమల్ చౌధరి సంపాదకత్వంలో వ్యాఖ్యానాలతో కలకత్తానుంచి "సంస్కృత మాతకావ్యసంగ్రహ" సీరీజ్‌లో ప్రచురించబడింది. డా॥ చౌధరి ఎన్నో కావ్య వ్రాతప్రతులను, వ్యాఖ్యానాల ప్రతులను పరిశీలించి సంస్కరించి దీన్ని ప్రచురించాడు. ఈ గ్రంథానికి అభినవగుప్త, భరతమల్లిక, శంకర, తారాచంద్ర, గోవర్ధన, కమలాకర, రమాపతిమిశ్ర, కుచల కవి, దివాకర, వింధ్యేశ్వర ప్రసాద, ఆదకమల్ల, వైద్యనాథ మొదలైనవారు వ్యాఖ్యానాలు వ్రాసారు. ఇంత చిన్న పుస్తకానికి ఎన్నో వ్యాఖ్యానాలుండటం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఈ వ్యాఖ్యానాలల్లో కొన్ని అలభ్యాలు. దీని వ్యాఖ్యాత అభినవగుప్తుడు ప్రసిద్ధ అలంకారికుడైన అభినవగుప్తుడే. అభినవగుప్తుడు ఘటకర్పర కావ్యాన్ని కాళిదాసు కావ్యంగా భావించాడు" - కించ అస్య కర్తామహాకవిః కాళిదాస ఇతి అనుశ్రుతమ్ అస్మాభి" (20వ శ్లోకవ్యాఖ్యానం)

ఘటఖర్పరుని మరో రచన నీతిసారం. నీతిసారం లభ్యమౌతున్నది. కాని దీని శుద్ధ ప్రతి ఇంకా ముద్రితం కాలేదు.

ఘటకర్పర కావ్యంలోని యమకం చాల సుందరమైంది. కవి నోటి నుంచి అప్రయత్నంగా వచ్చినట్లు సహజ శోభ కలిగివున్నది కాని ప్రయత్నంతో సాధించి వ్రాసినట్లుగా లేదు. ఉదాహరణకు ఒక శ్లోకం-

మేఘావృతం నిశి న భాతి నభో వితారమ్
నిద్రాభ్యుపైతి చ హరిం సుఖసేవితారమ్
సేంద్రాయుధశ్చ జలదోz ద్యర సన్ని భానామ్
సంరంభమావహతి భూధర సన్నిభానామ్.

## తర్వాత కావ్యాల మీద ఘటఖర్పర కావ్యప్రభావం

ఘటకర్పర కావ్యం మేఘసందేశం వంటి కావ్యాలకు ప్రేరణను ఇచ్చిందని చెప్పవచ్చునేమో. మేఘసందేశం వలె ఈ కావ్యం ప్రసిద్ధమైంది కాకున్నా తర్వాత కవుల మీద ఇది చూపిన ప్రభావం నిర్లక్ష్యణీయమైందేమి కాదు. ముఖ్యంగా కవి మదనుడు ఘటఖర్పర కావ్యం చేత చాల ఆకర్షితుడైనాడు. అతడు తన కృష్ణలీల కావ్యంలో ఘటఖర్పర కావ్యంలోని ఒక్కొక్క శ్లోకంలోని ఒక్కొక్క పాదాన్ని వున్నదున్నట్లుగా తీసుకొని మిగిలిన మూడు

పాదాలను తాను చేరుస్తు శ్లోకాలను రచించాడు. అంటె కవి మదనుడు ఘటఖర్పర కావ్య శ్లోకంలోని మొదటి పాదాన్ని తన శ్లోకంలో మొదటి పాదంగా గ్రహించి మిగతా మూడు పాదాలను అతడు రచించాడు. అదే విధంగా రెండవ పాదాన్ని తన శ్లోకంలో రెండవ పాదంగా గ్రహించి మిగతా ప్రథమ, తృతీయ, చతుర్థ పాదాలను తాను రచించాడు. ఘటఖర్పర కావ్యంలో 21 శ్లోకాలకు కవి మదనుడు తన కృష్ణలీల కావ్యంలో 84 శ్లోకాలను రచించాడు. ఈ విధంగా సమస్యాపూర్తివలె ఒక కవి శ్లోక పాదాలను తీసుకొని మరొక కవి కావ్యాన్ని వ్రాయటం ఘటఖర్పరుని కావ్యానికే కాక మేఘ సందేశానికి కూడా జరిగింది. కాని మూలకృతిలోని యమకాన్ని కూడ మదనకవి విడువకుండా పాటించటం దీనిలోని విశేషత. కృష్ణలీల కావ్యంలో కృష్ణుని జననం, లీలలు, గోపికలు కృష్ణుని కొరకు విరహబాధ ననుభవించటం, గోపికల రాసలీలలు వర్ణింపబడినవి. ఈ కవి దక్షిణ భారతీయుడు. ఈ కవి క్రీ.శ. 16వ శ॥ చివరివాడు. అక్కడక్కడ కావ్యంలో అర్థాన్వయంలో క్లిష్టత వున్నా కృష్ణలీల కావ్యం మొత్తం మీద ఆకర్షణీయంగానే వున్నది.

## కాళిదాసు

## ఋతుసంహారం

కాళిదాసు ఖండకావ్యాలు రెండు లభిస్తున్నవి - ఋతు సంహారం. మేఘ సందేశం. మేఘసందేశానికి పూర్వమే ఋతుసంహారం వ్రాయబడిందని పండితుల అభిప్రాయం. శైలిలోని భేదాన్ని బట్టి ఇది సత్యమే అనిపిస్తుంది. మేఘసందేశంలో వలె దీనిలోను ఇతివృత్తం లేదు. ఋతువుల వర్ణనే దీనిలోని వస్తువు. దీనిలోని ప్రతి శ్లోకం ఋతు వర్ణనతో కూడి స్వతంత్ర రూపం కలదే అయినా ఋతువులను వర్ణించటంలో ఒక క్రమం పాటింప బడింది. దాని వల్ల ఇది ముక్తక కావ్యం కన్న ఖండకావ్య లక్షణాలు కలిగి వున్నది. దీనిలో 144 శ్లోకాలున్నవి. ఆరు సర్గలున్నవి. ఒక్కొక్క సర్గలో ఒక్కొక్క ఋతువు వర్ణింపబడింది. దీన్ని వర్ణనాత్మకమైన ఖండకావ్యమని చెప్పవచ్చును.

## ఋతుసంహార కర్తృత్వం

ఋతుసంహారం కాళిదాసు కృతి కాదని కొందరు విమర్శకులు తలంచారు. మల్లినాథుడు రఘువంశ, కుమార సంభవ, మేఘసందేశ కావ్యాలకు వ్యాఖ్యానాలను వ్రాసాడు కాని ఋతుసంహారానికి వ్రాయలేదు. అంతేగాక ఇంకెవ్వరూ తమ

అలంకారశాస్త్రాలల్లో ఋతుసంహారం నుంచి ఉద్ధరణలను ఉదాహరణలను ఇయ్యలేదు. ఋతుసంహారం అతి సరళం, నాతి సుందరం, కాళిదాసు ఇతర కృతుల కన్న ఇది భిన్నంగాను కొంత కవితా వైదగ్ధత లేనిదిగాను వున్నది - ఈ కారణాలన్నిటి చేత దీన్ని కాళిదాసు కృతిగా అంగీకరించటానికి కొందరు విమర్శకులు నిరాకరించారు. కాని పాశ్చాత్యసాహిత్య కారులందరూ దీన్ని కాళిదాసు కృతిగానే అంగీకరించారు. భారతీయ కావ్య భండాగారంలో వారు దీన్ని ఒక అపూర్వమైన కృతిగా భావించారు. సహజసుందర ప్రకృతి వర్ణనలతో నిండినదీ కావ్యం. ప్రతి ఋతువును కవి సూక్ష్మంగా పరిశీలించి సరళ శైలిలో వర్ణించాడు. ఇటువంటి సామర్థ్యం కాళిదాసుకు తప్ప మరో కవికి లేదని ఇది తప్పక కాళిదాసు రచనయే అని విమర్శకులు చాలామంది తలంచారు. వల్లభదేవుడు సుభాషితావళిలో ఋతుసంహారం నుంచి రెండు శ్లోకాలను ఇచ్చి కాళిదాసు రచనగా పేర్కొన్నాడు. కాళిదాసుకు ఋతువర్ణన, ప్రకృతివర్ణన అంటె ప్రీతి. కుమారసంభవం, రఘువంశం, మేఘసందేశ కావ్యాలల్లోనే కాక విక్రమోర్వశీయం, శాకుంతలం నాటకాలల్లోను అతడు సందర్భానుకూలంగా ఋతువులను, ప్రకృతిని వర్ణించాడు. మిగతా కృతుల కన్న ఇది సరళంగా, అపరిపక్వంగా కన్పించటానికి కారణం ఒకవేళ ఇది కాళిదాసు ఆరంభరచన కావటం చేత కావచ్చును.

## ఋతుసంహారంలోని వర్ణనలు

ఈ కావ్యంలో కవి ఎక్కడా రాజుల ప్రసక్తిని తేలేదు. రాజప్రాసాదాలల్లోని జీవితాన్ని కూడ వర్ణించలేదు. కాబట్టి కాళిదాసు రాజుల ప్రాపకాన్ని పొందనప్పుడే దీన్ని వ్రాసాడని విమర్శకులు భావించారు. సమకాలిక ఆర్థికస్థితి, ప్రజాజీవనం, లలితకళలు దీనిలో చక్కగా ప్రతిబింబించినవి, పై తరగతి వారి కళాత్మక దృక్పథాన్ని కావ్యంలో దర్శించవచ్చును. దానితోపాటు కవి చేసిన సహజవర్ణనలు ఆహ్లాదాన్ని కూరుస్తున్నవి. సూక్ష్మపరిశీలనకు ఊహాసౌందర్యం మెరుగుపెట్టింది. ఉదా॥ కు-

కాశాంశుకా వికచపద్మ మనోజ్ఞ వక్త్రా
సోన్మాదహంస రవ నూపురనాద రమ్యా
ఆపక్వశాలి రుచిరానత గాత్రయష్టిః
ప్రాప్తా శరన్నవ వధూరివ రూపరమ్యా.

శిశిర ఋతువు - తెల్లని కాశకుసుమాలు పెండ్లికూతురు ధరించిన తెల్లని వస్త్రంగా వున్నవి. వికసించిన పద్మం ఆమె ముఖశోభను పోలివున్నది. హంసల నాదాలు ఆమె

ధరించిన నూపురధ్వనులు. ధాన్యభారంచేత వంగిన శాలి స్తనభారం చేత వంగిన గాత్రయష్టివలె వున్నది" అని శిశిరఋతు సమయంలోని ప్రకృతిని ఒక పెండ్లికూతురుగా కవి దర్శించాడు. సహజ వర్ణనకొక ఉదా॥-

ఆకంపయన్ కుసుమితాః సహకార శాఖా
విస్తారయన్పర భృతస్య వచాంసి దిక్షు
వాయుర్వివాతి హృదయాని హరన్న రాణాం
నీహారపాత విగమాత్సు భగో వనాంతే.

ఇటువంటి సహజ వర్ణనలల్లో పాఠకులు తల్లీనమైపోతారు. భావాలల్లో పాండిత్య స్ఫోరకతవల్ల కలిగే కృత్రిమత ఎక్కడా లేదు. చిత్రించినట్లుగా ఒక్కొక్క దృశ్యాన్ని కవి వర్ణిస్తాడు.

వాల్మీకి కిష్కింధాకాండంలో వర్ష శిశిర ఋతువులను వర్ణించి వున్నాడు. వాల్మీకి యందు గురుత్వభావం గల కాళిదాసు ఆ వర్ణనలన బాగా చదివి వుంటాడు. వాటి ప్రభావంతోనే ఋతుసంహారాన్ని వ్రాసి వుంటాడు. ఒక ప్రియుడు తన ప్రియురాలికి వర్ణించి చెప్తున్నట్లుగా ఋతువర్ణనలు కూర్చబడినవి. ఆరు ఋతువులల్లో వసంతర్తువును కవి దీర్ఘంగా వర్ణించాడు.

## ఋతుసంహార అనువాదాలు

ఋతుసంహారం వివిధ భారతీయ భాషల్లోకే కాక లాటిన్, ఇంగ్లీషు, జర్మన్ మొదలైన యూరోపియన్ భాషల్లోకి అనువదింపబడింది. క్రీ.శ. 18వ శతాబ్దానికి చెందిన విశ్వేశ్వరుడు కాళిదాసు ఋతుసంహారాన్ని అనుకరిస్తు "షడృతు వర్ణన" అనే లఘు కావ్యాన్ని రచించాడు.

## కాళిదాసు ఇతర రచనలు

"శృంగార తిలకం, పుష్పబాణ విలాసం, రాక్షసకావ్యం" అన్న ముక్తక కావ్యాలు కూడ కాళిదాసు కృతులుగా పేర్కొనబడుతున్నవి. శృంగార తిలకం శృంగార ప్రధానమైంది. అది పేరులోనే సూచితమైంది. దీనిలో ప్రేమ సౌందర్య వర్ణనలు మనోహరంగా చేయబడినవి. దీనిలో 31 శ్లోకాలున్నవి. పుష్పబాణ విలాసం సుందరుల మనోహరమైన వర్ణనలున్నవి.

దీనిలో 26 శ్లోకాలున్నవి. రాక్షసకావ్యంలో వనవర్ణన వున్నది. ప్రియుడు ప్రియురాలితో వనవిహారం చేస్తు వనసౌందర్యాన్ని వర్ణించి చెప్తాడు. దీనిలో 20 శ్లోకాలున్నవి. ఈ మూడు ముక్తక కావ్యాలల్లోని శైలి ప్రసాద మాధుర్యగుణాలు కలిగింది. అక్షరరమ్యత, భావాల సొంపు, సరళమైన భావప్రకటనలు వీటిల్లో కన్పిస్తున్నవి. అందువల్ల ఈ కృతులు కాళిదాసువని భ్రమకలుగుతున్నది. కాని కాళిదాసునామాంకితులైన అర్వాచీన కవులెవరో వీటిని కాళిదాసు శైలిని అనుకరిస్తు వ్రాసివుంటారు. శ్యామలా దండక మన్న ప్రసిద్ధమైన స్తోత్రాన్ని కాళిదాసు వ్రాసాడని లోకంలో ప్రచారంలో వున్నది. దీనిలో దుర్గాస్తోత్రమున్నది.

# మేఘసందేశం

## మేఘసందేశ పరిచయం

మేఘసందేశాన్ని ఉత్తర భారతంలో మేఘదూతమని పిలుస్తారు. ఇది కాళిదాసు రచన అనటంలో ఎటువంటి సందేహం లేదు. మేఘసందేశం ప్రపంచ సాహిత్యంలోనే సర్వోత్కృష్ట రచన అని చెప్పవచ్చును. మానవ హృదయాంతరంలోని సూక్ష్మభావాలను కవి వెల్లడించటమే కాక భౌతికమైన ప్రకృతిని, భౌగోళికమైన నదులను పర్వతాలను పట్టణాదులను పల్లెలను చాల చక్కగా వర్ణించాడు. దీనిలో అంగిరసం విప్రలంభ శృంగారం. హృదయస్పర్శియైన విప్రలంభాన్ని కవి వర్ణించాడు. యక్షుడొకడు అలకాధిపతి కుబేరుని కోపానికి గురియై ఒక సంవత్సరకాలం భార్యావియోగంతో రామగిరి ఆశ్రమ ప్రాంతంలో జీవితాన్ని గడుపుతుంటాడు. వర్షాకాలారంభంతో అతనికి భార్యావియోగం సహింపరానిదవుతుంది. ప్రియావియోగానలంలో కాలిపోతూ యుక్తాయుక్తం తెలియక ఆకాశంలోని మేఘాన్ని తన భార్య దగ్గరికి దూతగా వెళ్ళమని యక్షుడు వినయపూర్వకంగా ప్రార్థించి మొదట తన భార్య వుండే అలకానగరానికి పోయే దారిని వర్ణించి చెప్తాడు. మేఘసందేశంలో యక్షుడు యక్షిణికి పంపే సందేశం దాదాపు 20 శ్లోకాలల్లో మాత్రమే వున్నది. మిగతా కావ్యమంతా అలకానగర మార్గం, అలకానగరం, యక్షుని గృహం, విరహరూపిణి అయిన యక్షిణి వర్ణనలు కావ్యంలో ప్రాధాన్యాన్ని వహించినవి. యక్షుడు మేఘానికి అలకానగరం దారి చెప్తూ "కించిత్ పశ్చాద్ వ్రజ లఘుగతి ర్భూయ ఏవోత్తరేణ" అని అనటం చేత యక్షుడు ప్రవాసాన్ని గడిపే రామగిరి దక్షిణదేశంలో వున్నదని స్పష్టమౌతున్నది. ఈ మార్గవర్ణనలో కాళిదాసు మొట్టమొదట ఆమ్రకూటాన్ని వర్ణించాడు. తర్వాత వింధ్యాచల ప్రత్యగ్రభాగంలో విస్తరించిన నర్మదానదిని, ఇంకా దశార్ణదేశానికి రాజధానియైన వేత్రవతి

నదీతీరస్థ విదిశా నగరాన్ని వర్ణించాడు. విదిశానగర సమీపంలోవున్న కదంబ పుష్పాలచేత నిండిన నీచగిరి అనే పర్వతం మీద విశ్రమించమని మేఘాన్ని యక్షుడు కోరుతాడు. ఆ తర్వాత వంకర మార్గమైన (అంటె తిప్పుడు తోవ అయినా) సరే ఉజ్జయిని పోయి అక్కడి రాజప్రసాదాలను దర్శించమని యక్షుడు మేఘానికి చెప్తాడు. విరహానలంతో వేగిపోతూ భార్య దగ్గరికి సందేశాన్ని చాల తొందరగా పంపాలని ఆతురతతో వున్నా యక్షుడు "వక్రఃపంథా యదపి భవతః ప్రస్థితస్యోత్త రాశామ్ సౌధోత్సంగ ప్రణయవిముఖో మాస్మభూరుజ్జయిన్యాః" అని మేఘాన్ని కోరుతాడు. అంతేగాక ఉజ్జయినిలోని సుందరుల చంచలాపాంగాలను దర్శించకుంటె మేఘుని జన్మ వృథా అవుతుందని కూడా అంటాడు. ఇక్కడ ఉజ్జయినీ నగర విశేషాలను కాళిదాసు 15 శ్లోకాలల్లో వర్ణించాడు. ఇంత విస్తరంగా వేరే ఏ ప్రదేశాన్ని వర్ణించలేదు. ఇది అతనికి ఉజ్జయిని మీదవున్న అభిమానాన్ని చాటుతున్నది. ఉజ్జయిని తర్వాత గంభీరానది, స్కందుడు నివసించే దేవగిరి పర్వతం, చర్మణ్వతీనది, చర్మణ్వతి సమీపంలో వున్న దశపురనగరం, బ్రహ్మావర్తదేశం, సరస్వతీనది, కురుక్షేత్రం, కనఖలనగరం, గంగానది, హిమాలయాలను క్రమంగా కాళిదాసు వర్ణించాడు. హిమాలయాలను, కైలాస పర్వతాన్ని కవి 11 శ్లోకాలలో వర్ణించాడు. ఆ తర్వాత ప్రియుని ఒడిలో ప్రియురాలివలె హిమాలయాల్లో వున్న అలకానగరాన్ని కవి వర్ణించాడు. ఈ మార్గ వర్ణనాక్రమాన్ని పరిశీలిస్తే యక్షుడు ప్రవాసాన్ని గడిపే రామగిరి మధ్యప్రదేశ్‌లో నర్మదానదికి దక్షిణదిశలో వున్నదనటం నిశ్చయంగా చెప్పవచ్చును.

## రామగిరి ఏది?

మధ్యప్రదేశ్‌లోని ఈనాటి రామగఢ్‌యే కాళిదాసు పేర్కొన్న రామగిరి అని కొందరు విమర్శకులు చెప్తున్నారు. సీతారామ లక్ష్మణులు తమ వనవాస సమయంలో అక్కడ ఆగినట్లుగా పాద చిహ్నాలు అక్కడి వారు చూపిస్తుంటారు. ఈ రామగఢ్‌కు వాయవ్య దివలో అమరకంటకం వున్నది. అమరకంటకమే అమరకూటమని విమర్శకుల అభిప్రాయం. యక్షుడు మేఘానికి ఉత్తరానవున్న అలకానగరం తోవ చెప్తు మొదట మాలక్షేత్రం దాటి అమరకూట శిఖరాన్ని చేరుకొమ్మని ఆ తర్వాత నర్మదను చేరుకుంటావని చెప్తాడు. దీన్నిబట్టి అమరకూటం ఈ నాటి రామగఢ్‌కు ఉత్తర దిశలో వుండాలి కాని వాయువ్య దిశలో వుంటె కుదరదు. కాబట్టి ఈ నాటి రామగఢ్ కాళిదాసు రామగిరి కాలేదని వి.వి. మిరాశి వంటి విమర్శకులు నిరాకరించారు. నాగపూర్‌కు 28 మైళ్ళ దూరంలో వున్న రామటేక్ అన్నదే

కాళిదాసు వర్ణించిన రామగిరి అని ఆయన స్థాపించాడు. సహజ ప్రకృతి రామణీయకత గల అందమైన రామటేక్‌లో వాకాటకరాణి ప్రభావతీ గుప్త వేయించిన రాగిశాసనం దొరికింది. రామటేక్‌లోని రామచంద్రునికి ఆమె చేసిన దానశాసనమది. ఇక్కడ వనవాస సమయంలో సీతారామలక్ష్మణులు ఆగినట్లుగా ఐతిహ్యమున్నది. ఇప్పుడు రామటేక్‌లో పెద్ద దిబ్బ వున్నచోట తవ్వితే ప్రభావతిగుప్త దానం చేసిన రామచంద్రుని ఆలయం బయట పడవచ్చునని మిరాశిగారి అభిప్రాయం. రామటేక్ నుంచి యక్షుడు చెప్పిన మాలక్షేత్రం, అమరకూటాలు ఉత్తర దిశలోనే వుంటవి. కాబట్టి నాగపూర్ సమీపంలోని రామటేక్‌యే కాళిదాసు పేర్కొన్న రామగిరి అని అంగీకరించటం సమంజసంగా వుంటుంది.

## మేఘసందేశ కావ్య రచనా ప్రేరణ

ఒకానొకప్పుడు భార్యా వియోగంతో బాధపడుతున్నప్పుడు కాళిదాసుకు ఇటువంటి సందేశ రూపమైన కావ్యాన్ని వ్రాసే ప్రేరణ, కవితావేశం కలిగిందని కొందరు విమర్శకులు భావించారు. కాళిదాసు విరహ వేదనే యక్షునిలో ప్రతిబింబించిందని, ఏదో ఒకవిధమైన అంతః ప్రేరణ లేకపోతే ఇటువంటి సహజచిత్రణతో కూడిన హృదయాభివ్యక్తి సాధ్యంకాదని వారు తలంచారు. ఇందులో కొంత నిజం వున్నదేమో. కవి హృదయానుభూతులను రేపింది కొంతవరకు అతని స్వానుభవమే కావచ్చును. కాని కాళిదాసుకు పూర్వం కావ్యేతిహాసపురాణుదుల్లో ఇంకా ముందుకు పోతే వేదాలల్లోను సందేశ ఘట్టాలున్నవి. మహాభారతంలో నలదమయంతుల కథలో హంసదౌత్యం, రామాయణంలో హనుమంతుని దౌత్యం ప్రసిద్ధమైనవి. ఋగ్వేదంలోని సరమదౌత్యఘట్టం ప్రసిద్ధమైంది. వీటన్నిటిలో రామాయణంలోని హనుమత్సందేశ ఘట్టం కాళిదాసు మీద అధిక ప్రభావాన్ని చూపివుండవచ్చును. రామాయణ సుందరకాండంలో వర్షర్తు సందర్భంలో రాముడు సీతా వియోగ బాధను పొందినట్లుగా విర్ణంచబడింది. సీతా వియోగంతో కూడిన రాముడు తన అంగుళీయకాన్నిచ్చి హనుమంతుని దూతగా పంపిస్తాడు. వాల్మీకి అంటె అభిమానంగల కాళిదాసును ఆ సందేశఘట్టం చాలా ఆకర్షించి వుంటుంది. అతని అంతర్వేదనకు ఆ ఘట్టం రచనా ప్రేరణను ఇచ్చి వుంటుంది. హనుమత్సందేశ ఘట్టంలోని వాల్మీకి శ్లోకాల భావప్రభావం ఉత్తర మేఘంలో కన్పిస్తున్నదని కూడ వరదాచార్యులు గుర్తించాడు. అంతేగాక కాళిదాసుకు బద్ధవైరి అని ఐతిహ్యంగల ఘటఖర్పరుడు ఒకానొక స్త్రీ తన విరహబాధను భరించలేక మేఘం ద్వారా భర్తకు సందేశాన్ని పంపిన ఒక సందేశ కావ్యాన్ని వ్రాసాడు. ఆ

కవితోగల స్పర్ధతోనో లేక హనుమత్సందేశాదులను అనుసరిస్తూనో కాళిదాసు మేఘసందేశం వంటి సుందర కావ్యరచనను చేసాడు. మేఘసందేశ రచన తర్వాత తత్పూర్వ సందేశ కావ్యాలు సూర్యునిముందు దివిటీలైపోయినవి.

## మేఘసందేశ శ్లోక సంఖ్య

మేఘసందేశ కావ్యంలోని శ్లోకసంఖ్యను గూర్చి పండిత విమర్శకుల్లో ఏకాభిప్రాయం లేదు. వ్రాత ప్రతుల్లోని శోకసంఖ్య భిన్నించటమే కాక వ్యాఖ్యాతలు కూడ వ్యాఖ్యానాలు వ్రాసేటప్పుడు భిన్న శ్లోక సంఖ్యను గ్రహించారు. పూర్ణ సరస్వతి 110 శ్లోకాలకు వ్యాఖ్యానం వ్రాయగా వల్లభదేవుడు 111 శ్లోకాలకు, భరతసేనుడు 114 శ్లోకాలకు, మల్లినాథుడు 121 శ్లోకాలకు వ్యాఖ్యానాలు వ్రాసారు. మేఘ సందేశంలోని వృత్తం మందాక్రాంతం. మందాక్రాంత వృత్తం సార్థక నామధేయం కలది. గుర్వక్షరాలతో మందమందంగా నడిచే మందాక్రాంతం కరుణాది, రసాలకు సరిపోతుంది. వృత్తం పెద్దది కాబట్టి విషయబాహుళ్యం కలది. ఇటువంటి ఈ వృత్తం వియోగదుఃఖాన్ని అనుభవిస్తున్న ప్రియుని మనఃస్థితి చిత్రణకు తగివున్నది. కాళిదాసు ప్రయోగించటం వల్ల ఈ వృత్తానికి తర్వాత తర్వాత బాగా ప్రచారం వచ్చింది.

మేఘసందేశంలోని ప్రతి ఒక్క శ్లోకంలో వర్ణిత దృశ్యాన్ని, వస్తువును ఒక చిత్రపటంగా గీయవచ్చును. కనులకు కట్టేటట్లుగా దృశ్యాన్ని కవి వర్ణించాడు. ఒక శ్లోకాన్ని చదివి దానిలోని వస్తువును పాఠకుడు మనః పటలం మీద తనవిదీరా దర్శిస్తూ, దానిలో రమిస్తూ మరొక శ్లోకాన్ని చదవటానికి ముందుకు సాగుతాడు. ఈ రమించే సమయం ఆయా సహృదయుని బట్టి ఎంత సమయమైనా కావచ్చును. వర్ణచిత్రాలు గల ప్రదర్శనశాలను దర్శించేటప్పుడు ప్రేక్షకులు ఎవరికి కావలసినంత సమయాన్ని వారు తీసుకొంటారు. అట్లా ప్రదర్శనశాలను దర్శించటానికి ఎంత సమయమైనా పట్టవచ్చును. అటువంటి ప్రదర్శనశాల వంటిదే మేఘ సందేశకావ్యం. అందుకే "మేఘే మాఘే గతం వయః" అనే ఉక్తిలో అతిశయోక్తి లేదు. మేఘసందేశంలోని అందమైన శ్లోకాలను ఏవో కొన్ని ఎత్తిచూపటానికి వీల్లేదు. ప్రతి ఒక్క శ్లోకం అందమైందే. ప్రతి ఒక్కటి రమణీయ భావ సంపదతో, వర్ణనల సొంపుతో కూడినదే. ప్రతి ఒక్క శ్లోకం పాఠకుని హృదయాన్ని రసప్లావితం చేస్తుంది.

## మేఘసందేశకావ్య ప్రభావం - సందేశ కావ్యాలు

కాళిదాసు తర్వాత మేఘసందేశాన్ని ఆదర్శంగా పెట్టుకొని వాయుసందేశం,

భృంగసందేశం, పారావత సందేశం, చక్రవాక సందేశం, కీర సందేశం వంటివి చాల రచింపబడినవి. కాని అవేవి ఇప్పుడు లభించటంలేదు. భామహుడు వీటిని తన కావ్యాలంకారంలో విమర్శించివున్నాడు. అయినా కూడ కవులు ఇంకా తర్వాత కూడ సందేశ కావ్యాలు రచిస్తూనే వచ్చారు. క్రీ.శ. 11వ శ॥ తర్వాత వ్రాయబడినవి దాదాపు 50 సందేశ కావ్యాలున్నవని తెలుస్తున్నవి. వీటిల్లో కొన్ని అసంపూర్ణంగా వున్నా చాలామట్టుకు సంపూర్ణంగానే లభిస్తున్నవి. వీటిల్లో కోకిల, చాతక, చక్రవాక, హంస, కీరాలను దూతలుగా చేసిన సందేశ కావ్యాలేకాక ఉద్ధవుని దూతగా చేసిన సందేశ కావ్యంకూడ వున్నది. ఈ కావ్యాలల్లో వియోగబాధ, శృంగారమే ప్రధానమైనా కొన్నిటిలో భక్తితత్త్వం కూడ వున్నది. చాలామట్టుకు వీటిల్లో మందాక్రాంతమే ప్రయోగింపబడింది. వీటి మీద మేఘసందేశ కావ్యవస్తువు, శైలి, భావాల ప్రభావాన్ని స్పష్టంగా చూడవచ్చును. కొందరు కవులు మేఘసందేశ శ్లోకాల చివరి పాదాన్ని తీసుకొని సమస్యాపూరణ పద్ధతిలో మొదటి మూడు పాదాలను వ్రాసి సందేశ కావ్యాలను వ్రాసారు. జైనకవి జినసేనుడు (క్రీ.శ. 810) ఈ పార్శ్వనాథుని చరిత్ర నిబద్ధమైంది. శృంగార రసభరితమైన శ్లోకపాదాలను వైరాగ్యార్థంలో మార్చుకొని కవి వ్రాసిన నేర్పు ప్రశంసనీయమైంది. విక్రముడనే (క్రీ.శ. 15వ శ॥) మరోకవి ఇదే పద్ధతిలో నేమినాథ చరిత్రను వ్రాసాడు. జినసేనుని అనుసరించి మేఘసందేశంలో 120 శ్లోకాలున్నట్లు తెలుస్తున్నది. జైనులే కాక వైష్ణవ కవులు కూడ మేఘసందేశాన్ని ఆదర్శంగా తీసుకొని ఎన్నో సందేశ కావ్యాలను వ్రాసారు. అనుకరణలే కాక మేఘసందేశంలోని యక్షుని భార్య భర్తకు ప్రతి సందేశాన్ని మేఘం ద్వారా పంపినట్లుగా "యక్షోల్లాస" మనే ఖండకావ్యం వ్రాయబడింది. యక్షోల్లాసాన్ని క్రీ.శ. 19వ శతాబ్దంవాడైన శిష్టు కృష్ణమూర్తి వ్రాసాడు. ఈ కవి ఆంధ్రప్రదేశ్‌లోని పిఠాపురం మహారాజా వారి ఆస్థానంలోని వాడు. ఈ కావ్యంలో రెండు సర్గలున్నవి. ఈ కావ్యం చివర యక్షుని భార్య కుబేరున్ని వేడ్కొని భర్త ప్రవాస శిక్ష అవధిని తగ్గిస్తుంది. కావ్యం యక్షదంపతుల కలయికతో ముగుస్తుంది. క్రీ.శ. 19వ శతాబ్దంవాడు మైసూరు నివాసి రామశాస్త్రి కూడ యక్షుని భార్య యక్షునికి మేఘం ద్వారా ప్రతిసందేశాన్ని పంపినట్లుగా "మేఘప్రతిసందేశ" మనే కావ్యాన్ని వ్రాసాడు.

## మేఘసందేశ టీకలు - అనువాదాలు

మేఘసందేశానికి దాదాపు 40 టీకలున్నవి. ఇంత చిన్న కావ్యానికి, సుప్రసన్నమైన వైదర్భీరీతిలో వ్రాయబడిన కావ్యానికి ఇన్ని టీకలుండటమే దాని వ్యాప్తి, ప్రఖ్యాతులను

తెలియజేస్తున్నది. అనేక వందల సంవత్సరాల నుంచి మేఘసందేశం భారతీయుల హృదయాలను ఆనందభరితం చేయటమేకాక ఆధునిక కాలంలో విదేశీయ కవులను, పండితులను కూడ ఆకర్షించింది. మేఘసందేశం అనేక ఆధునిక భారతీయ భాషల్లోకే కాక ఇంగ్లీషు, జర్మన్, ఫ్రెంచ్, చైనా భాషల్లోకి అనువదింప బడింది. క్రీ.శ. 1906లో టిబెట్ భాషానువాదం ఆధారంగా జర్మన్ భాషలోకి అనువదింపబడింది. తర్వాత క్రీ.శ. 1847లో మాక్స్ ముల్లర్ సంస్కృతం నుంచి మేఘసందేశాన్ని జర్మన్ భాషలోకి అనువదించాడు. విల్సన్ మొదలైన ఆంగ్లేయులు మేఘసందేశాన్ని ఇంగ్లీషులోకి అనువదించారు. భారతీయ కవులేకాక పాశ్చాత్య కవులు కూడ మేఘసందేశ కావ్యకళకు ముగ్ధులైనారు. విల్సన్ ఆంగ్లానువాదాన్ని చదివి జర్మన్ జాతీయకవి గొయిటె ఆనందించి "మేఘదూత"కు తన హృదయాన్ని ఎవరు ఇయ్యకుండా వుంటారని తన కవిత్వంలో ఒకచోట ప్రశంసించి వున్నాడు. అలెగ్జాండర్ ఫన్ హుంబోల్ట్, ష్రాయిడర్, జి. మేయర్ వంటి కవి మేధావులు మానవ హృదయాన్ని ప్రేమను చిత్రించే అమూల్యమైన సుందరకావ్యంగా మేఘసందేశాన్ని కీర్తించారు. గొయిటెకు మిత్రుడు, ప్రసిద్ధ కవి అయిన ఫ్రెడిరిష్ షిల్లర్ "మారియా స్టువర్ట్ ' అన్న తన గ్రంథంలో బందీ అయిన స్కాటురాణి మారియా (మేరీ) బందిఖానా నుంచి సంతోషంతో నిండిన తన యవ్వన కాలాన్ని గడిపిన దక్షిణ దిశ వైపుకు పోయే మేఘాలను పలుకరించినట్లుగా మేఘసందేశం చేత ప్రభావితుడై కల్పన చేసాడు. మేఘసందేశ కావ్య ప్రభావంతో వ్రాయబడిన కొన్ని ప్రసిద్ధమైన కావ్యాలను పరిశీలిద్దాం-

## మేఘసందేశాన్ని అనుకరించిన సందేశ కావ్యాలు : ధోయి

కాళిదాసు మేఘసందేశం తర్వాత లభ్యమైన సందేశ కావ్యాలలో ధోయి వ్రాసిన పవనసందేశమే ప్రాచీనమైంది. పవన సందేశంలోని చివరి శ్లోకాలనుబట్టి ధోయికవి గౌడదేశాన్నేలిన లక్ష్మణసేనుని ఆస్థానకవి అని అతని నుంచి అతడు గజచామరాదులను బహుమూల్య వస్తువులను బహుమానంగా పొందాడని తెలుస్తున్నది. లక్ష్మణసేనుడు క్రీ.శ. 1170 ప్రాంతంలో బెంగాల్‌ను పరిపాలించాడు. ఈ రాజు ఆస్థానంలోనే జయదేవ, గోవర్ధన, ఉమాపతి ధర, శరణ కవులున్నారు. ధోయికి శ్రుతిధరుడని బిరుదమున్నట్లు తెలుస్తున్నది.

మేఘ సందేశాన్ని అనుసరిస్తు ధోయి పవనసందేశ కావ్యాన్ని వ్రాసాడు. దీనిలో 104 శ్లోకాలున్నవి. క్రీ.శ. 1905 లో ఈ కావ్యం మనోమోహన చక్రవర్తి ద్వారా బెంగాల్

ఏషియాటిక్ సొసైటీ పత్రికలో ప్రచురించబడి సంస్కృత సాహిత్యజ్ఞులకు పరిచయమైంది. తర్వాత ఇది మూడు లిఖిత ప్రతుల ఆధారంతో కలకత్తా సాహిత్య పరిషత్తు వారిచేత గ్రంథరూపంగా ప్రచురింపబడింది. పవన సందేశంలో నాయకుడు లక్ష్మణసేనుడే. నాయిక గంధర్వకన్య కువలయతి. నాయిక పవనున్ని దూతగానేసి నాయకునికి ప్రణయ సందేశాన్ని పంపే ఇతివృత్తం ఈ కావ్యంలో వున్నది. ధోయి కవి మేఘసందేశంలోని వస్తువునే కాక పదాలను శైలీ భావాలను కూడ గ్రహించి ప్రయోగించాడు. కాళిదాసు వలెనే మందాక్రాంత వృత్తాన్ని కవి ప్రయోగించాడు. మలయాచలం మీద విహరించటానికని వచ్చిన లక్ష్మణసేనున్ని మలయవతి చూచి ప్రేమిస్తుంది. లక్ష్మణసేనుడు కూడ ఆమెను ప్రేమిస్తాడు. లక్ష్మణసేనుడు వెళ్ళిపోయిం తర్వాత విరహతప్తయై మలయవతి పవనుని ద్వారా లక్ష్మణసేనునికి సందేశాన్ని పంపుతుంది. మొదట మేఘసందేశంలో వలెనే మార్గనిర్దేశం వున్నది. మలయాచలం దక్షిణ దేశంలో పాండ్య మండలంలో వున్నది. పాండ్య, ఉరగపుర, తామ్రపర్ణి, కావేరి, కళింగాదుల వర్ణనలు దీనిలో నున్నవి. సమకాలిక భౌగోళిక, రాజకీయ పరిస్థితులు దీనిలో ప్రతిఫలించినవి. అన్ని విధాల మేఘసందేశాన్ని అనుకరించే పవన సందేశకావ్యంలోని ఒక శ్లోకం- దీనిలో విరహంవల్ల కృశించిన మలయవతి వర్ణనవున్నది-

ముష్టిగ్రాహ్యం కిమపి విధినా కుర్వతా మధ్యభాగం
మన్యే బాలా కుసుమ ధనుషో నిర్మితా కార్ముకాయ
రాజన్నుచ్చై ర్విరహజనిత క్షామభావం వహంతీ
జాతా సంప్రత్యహ హసుతను సాచ మౌర్వీలతేవ.

## వేదాంతదేశికులు

వేదాంతదేశికులు (క్రీ.శ. 1268 - 1369) అనేక కావ్యాలు వ్రాసాడు. వాటిల్లో హంస సందేశమనే సందేశకావ్యం కూడ వున్నది. హంససందేశం మేఘసందేశాన్ని అనుకరిస్తున్నది. రాముడు మలయ పర్వతం మీదవుండి లంకలో వున్న సీతకు హంసద్వారా సందేశాన్ని పంపుతాడు. హంసకు దారి చెప్తు కర్ణాటక, ఆంధ్రదేశాలను దాటి అంజనాద్రిని చేరుకుంటావని రాముడు అంటాడు. అంజనాద్రి సమీపంలో కనముఖరీనది ప్రవహిస్తున్నది. తర్వాత తుండీర, సత్యవతీ క్షేత్రాలు చేరుకుంటావు, అక్కడినుంచి కంచి సమీపంలోని హస్తిశైలం, వేగవతీనది కన్పిస్తవి. ఆ తర్వాత చోళదేశం, శ్వేతశైలం, చంద్రపుష్కరణీ, వృద్ధాచలం, పాండ్యదేశం, తామ్రపర్ణి, సుచేల పర్వతం, వీటన్నిటిని దర్శిస్తూ పోయి సముద్రాన్ని దాటి

లంక చేరుకుంటావని రాముడు హంసకు దారిని నిర్దేశిస్తాడు. లంకలో అశోకవనంలో శింశుపావృక్షం కింద సీత వుంటుంది- అని సీత జాడను రాముడు హంసకు తెలుపుతాడు. ఈ కావ్యంలో వేదాంతపరమైన అర్థాలు కూడ వున్నవని వ్యాఖ్యాతలు ప్రకటించి వున్నారు. కావ్యరసాన్ని ఆస్వాదించే వారికి శుష్కమైన వేదాంత సూత్రాలు కన్పించకపోవచ్చును.

పాదుకా సహస్రనే ముక్తకకావ్యాన్ని కూడ వేదాంతదేశికుడు వ్రాసాడు. దీనిలో 1000 శ్లోకాలున్నవి. దీన్ని ఒక్కరాత్రిలో కవి వ్రాసాడని ప్రతీతి. ఈ కావ్యం దక్షిణదేశంలో బాగా వ్యాప్తిలో వున్నది. సుందరమైన కావ్యం. ఇదే గాక ఈ కవి గరుడదశకం, రఘువీర గద్యం, అచ్యుత శతకం మొదలైన లఘుకావ్యాలను వ్రాసాడు. భర్తృహరి నీతిశతకాన్ని అనుకరిస్తు "సుభాషిత నీతి" అనే నీతి బోధను చేసే ముక్తకకావ్యాన్ని వ్రాసాడు. ప్రజలను సన్మార్గంలో పెట్టే విషయాలెన్నో దీనిలోవున్నవి. "వైరాగ్య పంచకం" అని మరో లఘు కావ్యం ఈ కవిదే.

## ఉద్దండుడు

క్రీ.శ. 1400 ప్రాంతం వాడు. మేఘసందేశ కావ్యాన్ని అనుకరిస్తు ఈ కవి కోకిల సందేశాన్ని రచించాడు.

## వామన భట్ట బాణుడు

వామన భట్ట బాణుడు (క్రీ.శ. 1420) పెదకోమటి వేమారెడ్డి ఆస్థానకవి. వేమారెడ్డి జీవిత చరిత్రను వేమభూపాల చరిత్ర అనే గద్యకావ్యంగా కూర్చాడు. (చూడుము - చారిత్రక కావ్యాలు). భట్ట బాణుడు బాణుని శైలిని దానిలో కొంతవరకు అనుకరించాడు. అటువంటి ప్రౌఢశైలిని అనుసరిస్తు హంససందేశమనే ఖండకావ్యాన్ని రచించాడు. మద్రాసు గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్టు లైబ్రరీలో ఈ కావ్యానికి రెండు లిఖిత ప్రతులు లభించినవి. తర్వాత సంస్కృత దూత కావ్య సంగ్రహ సీరీజ్‌లో నాల్గవ కావ్యంగా డా॥ జతీంద్ర బిమల్ చౌదరి సంపాదకత్వంలో ఈ కావ్యం కలకత్తానుంచి క్రీ.శ. 1941 లో ప్రచురించబడింది. ఈ కావ్యం రెండు భాగాలుగా విభజింపబడింది. మొత్తం 131 శ్లోకాలున్నవి. మందాక్రాంత వృత్తాన్నే కవి గ్రహించాడు. వస్తు విషయంలోను ఈ కావ్యం మేఘసందేశానికి చాల దగ్గరగా వున్నది. మేఘసందేశంలో సందేశ వాహకుడు మేఘం కాగా దీనిలో హంస. అంతే భేదం. దక్షుడనే పేరుగల యక్షుడు తన ప్రియురాలు కందర్పలేఖకు

సందేశాన్ని పంపటం దీనిలో ఇతివృత్తం. యక్షుడు చేసిన నేరానికి కైలాసంనుంచి పంపివేయబడి దక్షిణదేశంలోని మలయ పర్వతం మీద నివసిస్తుంటాడు. అతని ప్రవాస శిక్షాకాలం కూడ ఒక సంవత్సర కాలమే. మలయపర్వతం నుంచి అలకానగరంలోని తన ప్రియురాలికి యక్షుడు సందేశాన్ని పంపుతాడు. ముందుగా యక్షుడు అలకానగరి దారిని చెప్తాడు. తామ్రపర్ణి, మధుర, కావేరి, శ్రీరంగం, చోళదేశం, చిదంబరం, కంచి, పుణ్యకోటి, హస్తిగిరి, కంపానది, అంజనాద్రి, కాళహస్తి, సువర్ణముఖీనది, ఆంధ్రదేశం, కృష్ణ తుంగభద్ర గోదావరి నదులు, వింధ్యాద్రి, నర్మద, యమున, గంగ, వారణాసి, అయోధ్య, సరయూ గండకీ నదులు, కురుక్షేత్రం, హిమాలయాలు, క్రౌంచపర్వతం, కైలాసం, అలకానగరాలు క్రమంగా వర్ణింపబడినవి. వీటి వర్ణనలో కవి మేఘసందేశంలోని శైలి, భావాలను ముమ్మూర్తులా అనుకరించాడు. హంస సందేశం మొదటి భాగంలో పూర్వ మేఘంలోలాగ అలకానగరి దారి వర్ణనవున్నది. రెండవ భాగంలో ఉత్తర మేఘంలోవలెనే యక్షుని మందిరపు జాడలు, విరహిణి అయిన ప్రియురాలి వర్ణన, చివరకు సందేశం చెప్పబడినవి. వామనభట్టబాణుని శైలికి ఉదాహరణలు- మధురా నగర వర్ణన-

త్వద్దృశ్యా సా భవతి మధురా శ్రీమతీ రాజధానీ
సంపద్భేదై ర్ధనద నగరీ విభ్రమం దర్శయంతీ
దేవో యస్యాః సవిధ తటినీ సేతు నిర్మాణ హేతో
స్త్వైరం మూర్ధ్నాముద - ముదవహత్స్వర్నదీ మాలికేవ

యుక్షడు తన భార్య విరహాన్ని వర్ణిస్తూ ఇట్లా అంటాడు-

చిత్రేకర్తుం వ్యవసిత మతిస్తూలికాయాం ధృతాయాం
భగ్నారంభో నయన సలిలై శ్చేతసి త్వాం లిఖామి
తత్రాపి ద్రాగరతి రధికోల్లాసినీ మే విహంత్రీ
యత్ సత్యం నో వరతను విధిః సంగమే సాభ్యసూయః

## సుందరగణి

సుందరగని క్రీ.శ. 1484లో శీలసందేశమనే ఖండ కావ్యాన్ని రచించాడు. దీనిలో ధార్మిక, నైతిక విషయ బోధన వున్నది.

# రూపగోస్వామి

రూపగోస్వామి క్రీ.శ. 1490-1563 నడుమ జీవించాడు.. శ్రీ చైతన్యుని శిష్యుడు. బెంగాల్‌లో వైష్ణవ మతవ్యాప్తికి ఇతని కృషి చాలా వున్నది. ఆరుగురు వైష్ణవాచార్యులల్లో ఇతడొకడు. ఇతని సోదరుడు సనాతనుడు కూడ కొన్ని రచనలు చేసాడు. రూపగోస్వామి ఉజ్జ్వల నీలమణి గ్రంథంలో భక్తిని దశమరసంగా స్థాపించిన ఆలంకారికుడు కూడ. రూపగోస్వామి చాల చరనలు చేసాడు - విదగ్ధ మాధవ, లలిత మాధవ, దానకేళికౌముది. భక్తి రసామృత సింధు, రాధాకృష్ణ గణోద్దేశ దీపిక, నాటక చంద్రిక, సంక్షేప భాగవతామృతం, పద్యావళి, స్తవమాల మొ॥వి. ఇవేగాక ఇతడు తన సోదరుడు సనాతమునితో కలసి చేసిన రచనలు కూడ వున్నవి. రూపగోస్వామిపై రచనలనే కాక మేఘసందేశాన్ని అనుసరిస్తు హంస సందేశం, ఉద్ధవ సందేశం అనే రెండు ఖండకావ్యాలను రచించాడు.

హంస సందేశంలో రాధకు సఖి అయిన లలిత రాధ విరహావస్థను తెలుపుతూ హంస ద్వారా మథురలో వున్న శ్రీకృష్ణునికి సందేశాన్ని పంపే ఇతివృత్తం వున్నది. బృందావనం నుంచి మథుర వరకుగల దారి మొదట వర్ణింప బడింది. కృష్ణుని మీద రాధకున్న భక్తి ప్రేమలుకావ్యంలో చక్కగా వ్యక్తీకరింపబడినవి. హరి భక్తి ప్రణయంలో వున్నవారికి ఎవరియందైనా విశ్వాసం కలుగుతుందని కవి హంసను దూతగా ఎన్నుకోవటాన్ని సమర్థించాడు-

నతస్యా దోషోzయం యది చ విహగం ప్రార్థితవతీ
న కస్మిన్ విశ్రంభం దిశతి హరిభక్తి : ప్రణయితా.

బృందావనంలో కృష్ణుడు న్నప్పుడు రాధాకృష్ణులు కలిసి విహరించిన చోట్లను కరుణరసస్ఫూర్తితో కవి వర్ణించాడు. మథురకు దారి, హంస గుర్తించటానికై శ్రీకృష్ణుని నఖశిఖ వర్ణనలన్నవి. పుర వధువులతో కూడి వున్నప్పుడు కృష్ణునికి గోపికలను గూర్చి చెప్పవద్దని లలిత హంసను హెచ్చరిస్తు ఇట్లా అంటుంది-

విలోకేథాః కృష్ణం మదకల మరాళీ రతికళా
విదగ్ధ వ్యాముగ్ధం యది పురవధూ విభ్రమభరైః
తదా నాస్మాన్ గ్రామ్యాన్ శ్రవణ పదవీం తస్యగమయేః
సుధాపూర్ణం చేతః కథమపి న తక్రం మృగయతే.

శిఖరిణీ వృత్తాన్ని కవి ప్రయోగించాడు. శైలీ, భావాలల్లో అక్కడక్కడ మేఘసందేశం ప్రభావం కన్పిస్తున్నది. కావ్యశైలిలో కవి రాధాకృష్ణుల ప్రేమను రసవంతంగా వర్ణించాడు. అతడు ప్రయోగించిన శిఖరిణీవృత్తం కరుణరసానికి తగినట్లుగా వున్నది. వివిధ లిఖిత ప్రతులను బట్టి ఈ కావ్యంలో 101 నుంచి 142 వరకు శ్లోకాలున్నవని తెలుస్తున్నది.

ఉద్ధవ సందేశం కూడ హంససందేశం వంటి కావ్యమే. ఇతివృత్తం భాగవతపురాణ సంబంధమైంది.

## రఘునాథదాసుడు

రఘునాథదాస కవి క్రీ.శ. 16వ శతాబ్దం ప్రాంతంవాడు. క్రీ.శ. 17వ శతాబ్దానికి చెందిన నరసింహదాసు ఈ కవి రచించిన హంస సందేశ కావ్యాన్ని బెంగాలీ భాషలోకి అనువదించాడు. మూల సంస్కృత ప్రతి అలభ్యం, రూపగోస్వామి రచనలో వలెనే దీనిలో రాధయొక్క సఖి లలిత హంసద్వారా శ్రీకృష్ణునికి సందేశాన్ని పంపుతుంది.

హంసను దూతగా చేసిన సందేశ కావ్యాలు ఇంకా కొన్ని వున్నవి. విద్యావిధాన కవీంద్రాచార్య సరస్వతి, పూర్ణసరస్వతులు హంస సందేశ కావ్యాలను వ్రాసారు. పూర్ణ సరస్వతి వ్రాసిన హంస సందేశకావ్యం క్రీ.శ. 1930లో త్రివేంద్రం సంస్కృత సీరీజ్‌లో ప్రచురింపబడింది. పూర్ణ సరస్వతి కాళిదాసు మేఘసందేశానికి వ్యాఖ్యానం కూడ వ్రాసాడు. ఇవేగాక అజ్ఞాతకవులు వ్రాసిన రెండు హంస సందేశ కావ్యాలు తెలియవచ్చినవి. ఇందులో ఒకటి త్రివేంద్రం సంస్కృత సీరీజ్‌లో ప్రచురింపబడింది. ఇది వేదాంత విషయాలతో కూడి వున్నది. దీనిలో 101 శ్లోకాలున్నవి. శివభక్తుడొకడు తన ఆత్మను హంసరూపంగా శివుని దగ్గరకు పంపుతాడు. ఆత్మ పరమాత్మతో కలవాలనే తపన దీనిలోని విషయం. రెండవ అజ్ఞాతకవి యొక్క హంససందేశ కావ్యం మద్రాసు గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీలో వున్నది. ఇది అసంపూర్ణంగా వున్నది. దీనిలో ప్రణయేతివృత్తం వున్నది. ప్రియుడు తన ప్రియురాలికి హంసద్వారా సందేశాన్ని పంపుతాడు.

## మేఘసందేశాన్ని అనుకరించిన కావ్యాల పట్టిక

ఇంకా ఎన్నో సందేశకావ్యాలు ఆధునికకాలం వరకు వ్రాయబడినవి వున్నవి. వాటిని ఒక్కొక్కదాన్ని వివరించటం సాధ్యం కాదు. కింద పట్టికలో వాటి పరిచయాన్ని చూడవచ్చును-

| కవి | కావ్యం | కాలం |
|---|---|---|
| అవధూతరామయోగి | సిద్ధసందేశం | క్రీ.శ. 13వ శ॥ |
| మాధవకవీంద్ర | ఉద్ధవసందేశం | ,, ,, |
| వినయప్రభు | చంద్రసందేశం | ,, ,, |
| విష్ణుదాసు | మనోసందేశం | క్రీ.శ. 15వ శ॥ |
| విష్ణుత్రాత | కోకసందేశం | క్రీ.శ. 16వ శ॥ |
| పరమేశ్వర | చకోరసందేశం | ,, ,, |
| రుద్ర న్యాయవాచస్పతి | పికసందేశం | క్రీ.శ. 17వ శ॥ |
| వాదిరాజు | పవనసందేశం | ,, ,, |
| శ్రీకృష్ణసార్వభౌముడు | పాదాంకసందేశం | ,, ,, |
| సిద్ధనాథుడు | పవన సందేశం | ,, ,, |
| కృష్ణనాథుడు | వాతసందేశం | ,, ,, |
| వాసుదేవుడు | భృంగసందేశం | ,, ,, |
| జంబుకవి | చంద్రసందేశం | ,, ,, |
| బోలానాథుడు | పంథసందేశం | ,, ,, |
| రామదయాళ్ | అనిలసందేశం | ,, ,, |
| శతావధానకవి శ్రీకృష్ణదేవ | భృంగసందేశం | క్రీ.శ. 18వ శ॥ |
| లంబోదర వైద్యుడు | గోపీ సందేశం | ,, ,, |
| త్రిలోచనుడు | తులసీ సందేశం | ,, ,, |
| వైద్యనాథుడు | తులసీ సందేశం | ,, ,, |
| హరిదాసు | కోకిల సందేశం | ,, ,, |
| త్రైలోక్యమోహనుడు | మేఘసందేశం | క్రీ.శ. 19వ శ॥ |
| నిత్యానందశాస్త్రి | హంస సందేశం | ఆధునికుడు |
| కాళీప్రసాదు | భక్తి సందేశం | సమయం తెలియదు |
| రామారామకవి | మనో సందేశం | ,, ,, |
| శ్రీశైల వేంకటాచార్యుడు | కోకిల సందేశం | ,, ,, |

పై సందేశ కావ్యాలల్లో దాదాపు అన్నింటిలో మందాక్రాంతవృత్తమే ప్రయోగించినా, వినయప్రభు చంద్రసందేశంలో మాలినీవృత్తం, విష్ణుత్రాత కోకసందేశంలో వసంత తిలకవృత్తం, రామారాముని మనోసందేశంలో శిఖరిణీ వృత్తం ప్రయోగింపబడినవి. ఇంకా ఇవేగాక కాకసందేశం, పాదపసందేశం, బకసందేశం, మృగసందేశం మొదలైనవెన్నో సందేశకావ్యాలు వ్రాయబడినవి.

## చండాలవిద్య

ఈ కవయిత్రి కాళిదాసుకు సమకాలికురాలని చెప్పబడుతున్నది. కాళిదాసుతో పాటు ఈమె విక్రమాదిత్యుని ఆస్థానంలో వుండేదంటారు. సదుక్తికర్ణామృతం అన్న కావ్యసంగ్రహంలో ఈమె కాళిదాస విక్రమాదిత్యులతో కలిసి రచించిన శ్లోకం ఇయ్యబడింది-

క్షీరో దాంభసి మజ్జతీవ దివస వ్యాపార భిన్నం జగ
త్తత్ క్షోభాజ్ జల బుద్బుదా ఇవ భవంత్యా లోహితాస్తారకాః
చంద్రః క్షీరమివ క్షరత్య విరతం ధారా సహస్రోత్కరై
రుద్గ్రీవై స్తృషితై రివాద్య కుముదైర్జ్యోత్స్నాపయః పీయతే

శ్లోకంలోని భావం సుందరంగా వున్నది కాని కాళిదాసు కర్తృత్వం కూడా దీనిలో వుండటంచేత చండాలవిద్య కవితా ప్రావీణ్యాన్ని అంచనా కట్టటం సాధ్యంకాదు. కాళిదాసుతో ఈమెపేరు జోడింపబడటంచేత ఈమె ప్రసిద్ధ కవయిత్రి అని చెప్పవచ్చును. ఈమె కావ్యమేది తెలియరాకపోవటంచేత లఘుకావ్యాలల్లో చేర్చటం జరిగింది.

## గాథాసప్తశతి

### గాథాసప్తశతి పరిచయం

సంస్కృతభాషలోనే కాక ప్రాకృతభాషలోను ముక్తకకావ్యాలున్నవి. ముక్తక గేయాలు సంస్కృతంలోకాక మొదట ప్రజల భాషల్లోనే (అంటె ప్రాకృతభాషల్లోనే) వ్రాయబడివుంటాయని వింటర్‌నిట్జ్ అభిప్రాయం. ముక్తక కావ్యాలు చాలామట్టుకు ప్రాకృత, అపభ్రంశభాషల్లో వున్నాయని చెప్పవచ్చును. అందుకే గోవర్ధనాచార్యుడు గాథాసప్తశతిని అనుకరించి వ్రాసిన ఆర్యాసప్తశతిలో ఇట్లా అన్నాడు- వాణీ ప్రాకృత సముచిత రసా బలేనేవ సంస్కృతం నీతా" - ప్రాకృతభాషలోనే సముచితంగా రసవంతంగా వుండే వాణిని బలాత్కారంగా

సంస్కృతంలోకి తెచ్చాను. ప్రాకృత ముక్తక సాహిత్యాన్ని జానపదసాహిత్యంగా పరిగణించవచ్చును. ఎందుకంటె సామాన్య ప్రజలు వ్రాయకపోయినా ప్రజాసామాన్యపు హృదయావేశాల వ్యక్తీకరణ, నిసర్గమైన భావాలు వీటిల్లో కన్పిస్తున్నవి. వీటిల్లో అతిప్రసిద్ధమైంది హాలుని గాథాసప్తశతి. 'గాథ' అనేది ప్రాకృతవృత్తభేదం. 'సప్తశతి' అనగా ఏడువందలు అని. ఏడువందల గాథలు దీనిలో కూర్చబడటం చేత ముక్తక కావ్యానికి గాథాసప్తశతి అని పేరు గలిగింది. 'గాథ' అనే ప్రాకృత వృత్తం సంస్కృతం నుంచి వచ్చిందే అని కోల్‌బ్రూక్ అభిప్రాయం. సంస్కృతంలోని 'ఆర్యా' ఛందస్సుకు ఇది దగ్గరగా వున్నది. అందుకే గోవర్ధనుడు 'గాథ' స్థానంలో 'ఆర్యా' ఛందస్సును గ్రహించాడు. ఈ గాథలను ఒక్కచోట కూర్చినవాడు శాతవాహనుడని, హాలుడని లోకంలో వ్యాప్తిలో వున్నది. హాల శాతవాహనుడనేవాడు క్రీ.శ. 17-21 ప్రాంతంలో వున్న ఒక ఆంధ్రరాజు. ప్రాకృత ప్రేమికుడు. ఆర్.జి. భండార్కర్, వేబర్, కీథ్ వంటి విమర్శకులు హాలశాతవాహనుడు కూర్చాడనటాన్ని సందేహించారు. ఆతని కర్తృత్వం పరంపరామాత్రమే కాని సత్యంకాదని భండార్కర్ త్రోసిపుచ్చాడు. గాథాసప్తశతిని హాలుడే కూర్చినాడనటానికి ఆధారాలు లేవని వేబర్ అన్నాడు. కాని బాణ, రాజశేఖరాదులు, గాథాసప్తశతి వ్యాఖ్యాతలు, సంప్రదాయం శాతవాహనుడు అందులో హాల శాతవాహనుడు గాథాసప్తశతికారుడని చెప్పుతుండగా ఏ ఆధారం లేకుండా దాన్ని అనుమానించవలసిన అవసరం లేదు.

శాతవాహన చక్రవర్తులు సంస్కృతాన్ని కన్నా ప్రాకృతాన్ని విశేషంగా ఆదరించారు. అందులో తమ దేశప్రజల భాష అయిన మహారాష్ట్రీ ప్రాకృతమన్న వారికి ఆదరణ ఎక్కువ గాథాసప్తశతిలోని గాథలన్నీ మహారాష్ట్రీ ప్రాకృతంలోనే వున్నవి. మహారాష్ట్రీ ప్రాకృతం క్రీస్తు శకారంభం నాటికే పూర్ణ వికసిత రూపాన్ని ధరించి ప్రజలభాషగాను, సాహిత్య భాషగాను రూపొందింది. దండి మొదలైన ఆలంకారికులు ప్రాకృతభాషలన్నిటిలో మహారాష్ట్రీ ప్రాకృతం కావ్యరచనకు అర్హమైందని అంగీకరించారు.

గాథాసప్తశతిలోని గాథలన్ని హాలుడు రచించినవి కావు. గాథలను రచించిన వారిలో వాసవ, మృగాంక, మకరంద, కుందపుత్ర, కుసుమాయాధవంటి కవులేకాక శశిప్రభ, మాధవి, వంటి కవయిత్రులు కూడ వున్నారు. కోట్ల కొలది గాథలనుంచి కవివత్సలుడైన హాలుడు ఏడువందలను సంగ్రహపరిచాడని గాథాసప్తశతిలోని మూడవ గాథవల్ల తెలుస్తున్నది-

సత్త సతాఇం కఇవచ్ఛలేణ కోడీఅ మజ్ఝ ఆరంభి
హాలేణ విరఇ ఆఇం సాలంకారాణం గాహాణమ్.

(సప్తశతాని కవివత్సలేన కోటేర్మధ్యే
హాలేన విరచితాని సాలంకారాణాం గాథానామ్)

వేబర్ అనుసారం గాథాసప్తశతి యొక్క పాఠప్రతులు కనీసం ఆరు లభిస్తున్నవి. ఈ పాఠప్రతులు ఒకదానికొకటి చాల భిన్నంగా వున్నవి. కాని అన్ని ప్రతుల్లోను 430 గాథలు మాత్రం సమానంగా కన్పిస్తున్నవి. మిగిలిన గాథలు విభిన్నంగా వున్నవి. మూలగాథలు 430 మాత్రమే అని మిగిలిన గాథలు ఆయా కవి లేఖకులచేత ప్రక్షిప్తాలైనవని విమర్శకులకు ఊహించటానికి అవకాశమేర్పడింది. హాలుని గాథాసప్తశతిని బాణుడు ఈ కింది విధంగా తన హర్షచరిత్రలో ప్రశంసించాడు.

అవినాశినమగ్రామ్య మకరోత్ సాతవాహనః
విశుద్ధ జాతిభిః కోశం రత్నైరివ సుభాషితైః

గాథాసప్తశతి సుభాషితరత్నకోశం వంటిదట! గాథాసప్తశతికి 'గాథాకోశ' మని పేరు వున్నట్లు మేరుతుంగాదులు పేర్కొన్నదాన్నిబట్టి తెలుస్తున్నది. 400, 500 గాథలతో ఇది "గాథాకోశ" మనే పేరుతో కూర్చబడి తర్వాత వివిధ కవుల గాథలు చేరి 'సప్తశతి'గా మారివుంటుందేమో చెప్పలేము. జైన కవులు దీన్ని "గాథాచతుష్టయ"మని పేర్కొని దీన్ని నాలుగు లక్షల గాథల సంగ్రహగ్రంథంగా చెప్పారు. గాథాసప్తశతి, గాథాకోశం వేరు వేరు గ్రంథాలని కొందరు తలంచారు. కాని నాలుగు లక్షల గాథలుగల గ్రంథమేది లభ్యం కాలేదు. వి.వి. మిరాశి వంటి విమర్శకులు ఈ వాదాన్ని ఖండించి గాథాసప్తశతికే గాథాకోశమని పేరున్నదని బలపరిచారు. గాథా సప్తశతి ప్రతుల్లో హాలశాతవాహనుని (క్రీ.శ. మొదటి శతాబ్దం) తర్వాత నివసించిన ప్రసిద్ధ ప్రాకృత కవులైన ప్రవరసేన, సర్వసేన, ఈశాన, వాక్పతిరాజుల మరియు అవంతివర్మ, దామోదరుల వంటి కాశ్మీర రాజుల, మయూర, భట్టవల్లభ వంటి సంస్కృత కవుల పేర్లతో గాథలు ఇప్పుడు లభ్యమయ్యే గాథాసప్తశతి పాఠప్రతుల్లో వున్నవి. ఇవన్నీ ప్రక్షిప్తాలనటం స్పష్టం. ఇప్పుడు లభ్యమయ్యే పాఠప్రతులన్నిటిని కలిపితే 2000 గాథలున్నవి. పాఠప్రతులన్నిటిలో ప్రారంభగాథలన్ని హాలుడు ఇంకా ఆరుగురు కవులవి వున్నవి. ఆ ఆరుగురి కవుల పేర్లు క్రమంగా ఇవి- బోదిత (వోదిస), చుల్లుహ, అమరరాజ, కుమారిల, మకరందసేన, శ్రీరాజులు. దీన్నిబట్టి హాలుడు ఈ ఆరుగురి కవుల సహాయోగంతో మాత్రమే గాథాసప్తశతిని కూర్చాడని విమర్శకుల అభిప్రాయం. తర్వాత దాని ప్రసిద్ధివ్యాప్తులతో ప్రక్షిప్తాల సంఖ్య కూడ కాలక్రమంగా

పెరుగుతూ వచ్చింది. గాథాసప్తశతి చాల ప్రచారంలో వుండి సర్వజనామోదంగా వుండేదని దానికిగల టీకల సంఖ్యయే చెప్తున్నది. దీనికి దాదాపుగా 24 టీకలు కన్పిస్తున్నవి. వీటిల్లో ఎక్కువ మాననీయమైంది, సరసమైంది గంగాధరుని టీక. గాథా సప్తశతిలోని శృంగారార్థాలను ఇతడు చక్కగా వివరించారు. వివిధ టీకాకారులు వివిధ రకాలుగా గాథలకు అర్థాలను చెప్పటానికి ప్రయత్నించారు. సాగదీసి అర్థాలను చెప్పటంవల్ల అనేక టీకలల్లో సహజార్థానికి, ఔచిత్యానికి భంగం వాటిల్లింది.

వేబర్ అనేక పాఠప్రతులను పరిశీలించి శుద్ధప్రతిని తయారుచేసి క్రీ.శ. 1881లో "డెస్ సప్తశతకమ్ డెస్ హాల" అనే పేరుతో జర్మనీలోని 'లైప్జిగ్' పట్టణం నుంచి ప్రచురించాడు. ఈ ప్రతిని తయారుచేయటంలో వేబర్ ఇతరుల టీకను ఉద్ధరించినా, గంగాదరుని టీకను ఎక్కువ ఉపయోగించుకొన్నాడు. తర్వాత ప్రచురింపబడిన గాథాసప్తశతి ప్రతులన్నిటికి వేబర్ ప్రచురించిన ఈ పుస్తకమే ఆధారమైంది. గాథాసప్తశతికి ఒక ప్రామాణిక రూపాన్ని ఇయ్యటంలో వేబర్ చేసిన కృషి ఎంతైనా చెప్పుకోదగింది.

## గాథాసప్తశతికి గల విశేషత

గాథాసప్తశతి పండిత పామరులను సమానంగా ఆకర్షించిన గ్రంథం. హాలుడు స్వయంగా తన కావ్యాన్ని "అమృతకావ్య" మని పేర్కొన్నాడు. దీనిలోని గాథల నెన్నిటినో ఆనందవర్ధనుడు వ్యంగ్యార్థలక్షణోదాహరణలుగా గ్రహించాడు. గాథాసప్తశతిలో చాలామట్టుకు గాథలు రసార్థధ్వని సంపదలతో కూడివున్నవి. గాథాసప్తశతిలోని శృంగారం అశ్లీలమైందని కొందరు విమర్శకులు తలంచారు. కాని సూక్ష్మధ్వని వైభవంచేత పాఠకుని హృదయ ముద్రూతలూగుతుందే కాని ఎక్కడా అశ్లీలత్వం అశ్లీలత్వంగా కొట్టవచ్చినట్లు కన్పించదు. చాలాచోట్ల సుందర సుకుమార ప్రణయ చిత్రణలు, సహజ ప్రకృతిచిత్రణలు కూడ వున్నవి. గాథాసప్తశతిలో ఆనాటి ప్రజాజీవితం ముఖ్యంగా గ్రామీణ ప్రజాజీవితం చక్కగా సహజంగా ప్రతిబింబించింది. దీనిలోని నాయికలు సాధారణంగా పల్లె స్త్రీలు. విరహిణి, ప్రణయిని, అభిమానవతి, కుపిత అయిన స్త్రీల హృదయభావాలు సుందరంగా చిత్రింపబడినవి. నాయికలు పరకీయప్రౌఢలే కాక స్వకీయముగ్ధా స్త్రీలు కూడ వున్నారు. స్త్రీల అమాయకత్వాన్ని, ప్రేమను, కోపాన్ని, అభిమానాన్ని, చాతుర్యాన్ని, మాయలాడితనాన్ని కవి సహజంగా చిత్రించాడు. ఎన్నో సరసమైన శృంగార ఘట్టాలు వర్ణింపబడినవి. సుందర శబ్దాల, నిసర్గమైన సరసమైన భావాల కూర్పును ఇందులో చూడవచ్చును.

## గాథాసప్తశతి ప్రభావం

సంస్కృత ముక్తక కావ్యాలమీద గాథాసప్తశతి ప్రభావం ఎంతైనా వున్నది. అమరుక శతకం, ఆర్యాసప్తశతి, శృంగార శతకాది ముక్తక కావ్యాలు గాథాసప్తశతి ప్రేరణ చేతనే వ్రాయబడినవి. ఆర్యాసప్తశతి పేరు గాథాసప్తశతిని అనుసరించియే వుంచబడింది. 'సప్తశతి' ని "సత్‌సయి" అని ప్రాకృతంలో అంటారు. తర్వాత కాలంలో అపభ్రంశ, హిందీ భాషలల్లో అనేక "సత్‌సయి" ముక్తక కావ్యాలు వ్రాయబడినవి. ఇవి శృంగార రసప్రధానమైనవి. అసలు ఆ భాషల్లో శృంగారరస ప్రధానమైన ముక్తకాలకు "సత్‌సయి" అన్నది పేరుగానే స్థిరపడిపోయింది.

గాథాసప్తశతి సంస్కృత భాషలోకి అనువదింపబడటమే కాక అనేక దేశ భాషల్లోకి అనువదింపబడింది. ఆధునిక కాలంలో ఇంగ్లీషు, జర్మన్ వంటి యూరోపియన్ భాషల్లోకి అనువదింపబడింది.

## అశ్వఘోషుడు

ఈ కవి బుద్ధ చరిత్ర సౌందరనందాదులనేకాక కాళిదాసువలె ఒక స్తోత్రాన్ని కూడ రచించాడు. దానికి "గండీ స్తోత్రగాథ" అని పేరు. **హర్షవర్ధనుడు** నాటకాలనే కాక "సుప్రభాత స్తోత్రం, అష్టమహాశ్రీ చైత్యస్తోత్రా"లను రచించాడు. ఇవన్ని బౌద్ధమత సంబంధమైనవి. **సిద్ధసేన దివాకరుడనే** జైనముని (క్రీ.శ. 500) "కళ్యాణమందిర స్తోత్ర" మని తీర్థంకరులను స్తుతిస్తు రచించాడు. **శాంతిదేవుడు** (కాలం తెలియదు) "బోధిచర్యావతారం" అనే బౌద్ధ సంబంధమైన గ్రంథాన్ని రచించాడు. దీనిలో ధార్మిక, దార్శనిక బోధనలతోపాటు నీతిబోధ కూడ వున్నది. ఈ బోధలను శాంతిదేవుడు కావ్యశైలిలో చేసాడు. ఇది కొంత క్లిష్టంగా వుండటం చేత దీనికి టీకలు కూడ వ్రాయబడినవి. ఉపదేశాత్మకమైన ఈ కృతి చాల వ్యాప్తిలో వున్నది.

## సుందర పాండ్యుడు

సుందర పాండ్యుడు క్రీ.శ. 500 ప్రాంతంవాడు. మధురా నివాసి. "నీతి ద్విషష్టిక' ' ఇతని లఘుకావ్యం. దీనిలో 116 శ్లోకాలున్నవి. ఇవి నీతిని బోధిస్తున్నవి. జనాశ్రయుడు (క్రీ.శ. 600) తన "ఛందోవిచితి" లో ఈ శ్లోకాలను ఉదాహరించాడు. కుమారిల, శంకరాచార్యుల వంటి మతాచార్యులు కూడ ఇతని శ్లోకాలను ఉద్ధరించారు. సుభాషిత

గ్రంథాలల్లో సుందర పాండ్యుని పేర శ్లోకాలు మరికొన్ని కన్పిస్తున్నవి. అవి ఈ 116 శ్లోకాలకన్న భిన్నంగా వున్నవి. దాన్నిబట్టి ఈ కవి ఇంకా కృతులను రచించాడని చెప్పవచ్చును. ఇతని కవిత్వం సరళంగా, సహజంగా వున్నది. స్వానుభూతుల అభివ్యక్తితో ఇతని కవిత్వం రమ్యమైంది.

## మానతుంగాచార్యుడు

మానతుంగుడు జైనమతావలంబి. బాణునికి సమకాలికుడని చెప్పబడుతున్నాడు. ఇతడు రచించిన భక్తాతురస్తోత్రాన్ని ఇప్పటికి జైనులు పూజా సమయంలో చదువుతారు. ఈ స్తోత్రానికి ఒక టీక కూడ వున్నది. ఈ స్తోత్రాన్ని శ్వేతాంబర, దిగంబర సంప్రదాయాలకు చెందిన జైనులు చదువుతారు. ఈ రెండు సంప్రదాయాలకు సంబంధించిన టీకలు దీనికి వున్నవి. మానతుంగున్ని కీథ్ ఉత్తమమైన కవి అని కీర్తించాడు. ఈ స్తోత్రంలో కవి ఋషభదేవుని శంకరునిగా, పురుషోత్తమునిగా స్తుతించాడు.

## చంద్రకాంత భిక్షుణి

భిక్షుణి అనే పేరుచేత ఈమె బౌద్ధ సన్యాసిని అని తెలుస్తున్నది. నేపాల్ దేశవాసిని. జీవిత కాలాన్ని నిర్ణయించటానికి ఆధారాలు లేవు. ఏషియాటిక్ సొసైటీ బెంగాల్ వారి కేటలాగుల్లో ఈమె పేరుమీద రెండు స్తోత్ర గ్రంథాలు కన్పిస్తున్నవి. ఇవి ఒకే గ్రంథానికి గల రెండు పేర్లు అని తేలింది. అవలోకితేశ్వరుని మీద ఈమె స్తోత్రాన్ని రచించింది. అవలోకితేశ్వరుని పవిత్రమూర్తిని ఈమె దీనిలో వర్ణించింది. ఇది అష్టకం - అంటె 8 శ్లోకాలున్నవి. మహాయాన శాఖకు చెందిన భిక్షుణి ఈమె. అవలోకితేశ్వరుని మీద ఈమెకు చాల భక్తి.

## బాణుడు

హర్షవర్ధనుని (క్రీ.శ. 606-648) ఆస్థానంలో వున్న బాణకవి చండీశతకమనే ముక్తక కావ్యాన్ని కూడ వ్రాసాడు. దీనిలో చండి అంటె దుర్గ స్తుతి వున్నది. దీనిలో 48 శ్లోకాలున్నవి. స్రగ్ధరావృత్తాన్ని కవి ప్రయోగించాడు.

చండీశతకరచనకు కారణాన్ని గూర్చి కొన్ని కథలు ప్రచారంలో వున్నవి - బాణుడు మయూరభట్టు కూతురును వివాహమాడాడట. ఒకరోజు బాణుని భార్య ప్రణయకోపం

పూనింది. బాణుడు ఎంత వూరడించినా ఆమె కోపం తీరలేదు. ప్రభాత సమయం సమీపిస్తున్నది. బాణుడు ఆమెను ప్రసన్నురాలిని చేసుకోవాలని కింది శ్లోకాన్ని చెప్పాడు-

గతప్రాయారాత్రిః కృశతను శశీ శీర్యత ఇవ
ప్రదీపోఽయం నిద్రావశ ముపగతో ఘూర్ణత ఇవ
ప్రణామాంతో మానస్త్యజసి న తథాపి కృధమహో

అని మూడు పాదాలను చెప్పి బాణుడు ఆగిపోయాడట. అప్పుడు అక్కడే పొంచి మయూరకవి "కుచ ప్రత్యా సత్త్యా హృదయమపి తే చండి కఠినమ్" అని పూరించాడట, దానితో బాణుడు కోపించి మయూరుని కుష్ఠురోగపీడితుడవు కమ్మని శపించాడు. మయూరుడు కూడ క్రుద్ధుడై బాణుని తిరిగి శపించాడు. మయూరుడు సూర్య శతకాన్ని వ్రాసి శాపవిముక్తిని పొందగా బాణుడు చండీ శతకాన్ని వ్రాసి శాపవిముక్తిని పొందాడంటారు. మరొక కథ ప్రకారం బాణుని భార్య మయూరునికి సోదరి. మయూరుడు కొన్ని శ్లోకాలను వ్రాసి వాటిని బాణునికి వినిపించాలని అర్ధరాత్రి అని లెక్కచేయకుండ పోయాడట. అక్కడ భార్యను సాంత్వపరుస్తూ బాణుడు చెప్పిన శ్లోకం మూడు పాదాలను విని నాల్గవ పాదాన్ని తాను చెప్పి పూరించాడు. దానికి బాణుని భార్య కోపించి మయూరుని శపించిందట. ఇంకా మరొక కథ ప్రకారం బాణుని భార్య మయూరుని కూతురు. కూతురు సౌందర్యాన్ని వర్ణిస్తూ మయూరుడు ఎనిమిది శ్లోకాలను చెప్పాడు. అవి మయూరాష్టకం అని ప్రసిద్ధమైనవి. ఆ శ్లోకాలను విని ఆమె తండ్రిని శపించిందట. ఈ కథలల్లో సత్యమెంత దాగివున్నదో చెప్పలేము. కాని చారిత్రకంగా బాణమయూరులు సమకాలికులు. ఇద్దరు హర్షవర్ధనుని ఆస్థానాన్ని అలంకరించినవారు.

చండీ శతకంలో శైలి ఓజోగుణ పూర్ణమైంది. చండీ రూపురాలైన పార్వతికి అనురూపమైన పదవిన్యాసాన్ని కవి దీనిలో ప్రదర్శించాడు. చండికి వాహనం స్రగ్ధర. స్రగ్ధరాగమనం గల స్రగ్ధరా వృత్తాన్నే కవి దీనిలో ప్రయోగించాడు. విషయానుగుణమైన వృత్తాన్ని ఎన్నుకోవటంలో బాణుడు ఎంతో ఔచిత్యాన్ని చూపాడు. చండీ శతకం ఆకారంలో చిన్నదైనా బాణుని కవితా పాండిత్యాన్ని ప్రకటించేదిగా వున్నది. భావ గాంభీర్యంతో కూడిన చండీశతకం స్తోత్రకావ్యాలల్లో విశిష్ట స్థానాన్ని కలిగివున్నది.

# మయూరభట్టు

మయూరుడు బాణుని వలెనే హర్షవర్ధనుని (క్రీ.శ. 606-648) ఆస్థానకవి. హర్షవర్ధనుడు అతని పూర్వులు సూర్యారాధకులు. మయూరుడు సూర్యుని స్తుతి గల సూర్యశతకాన్ని రచించాడు. మయూర బాణులు శ్రీ హర్షుని ఆస్థాన కవులని రాజ శేఖరుడు చెప్పాడు-

అహో ప్రభావో వాగ్దే వ్యాయన్మాతంగ దివాకరః
శ్రీహర్షస్యా భవద్ సభ్యః సమో బాణ మయూరయోః

బాణమయూరులతోపాటు రాజశేఖరుడు మాతంగ దివాకరుడనే కవిని పేర్కొన్నాడు. కాని అతని కృతులేవి లభ్యం కాలేదు. నవసాహసాంక చరిత్రనుబట్టి బాణమయూరులకు కవితా స్పర్ధ వుండేదని తెలుస్తున్నది-

సచిత్ర వర్ణ విచ్ఛిత్తి హరణో రవనీపతిః
శ్రీహర్ష ఇవ సంఘట్టం చక్రే బాణమయూరయోః

మమ్మటుడు కావ్యప్రకాశంలో కావ్యప్రయోజనాన్ని గూర్చి ప్రసంగిస్తు కావ్యపఠనంవల్ల దుఃఖనివృత్తి జరుగుతుందని మయూరుడు సూర్యస్తుతి చేసి దుఃఖనివృత్తిని పొందాడని చెప్పాడు. లోకంలో వ్యాప్తిలో వున్న కథనుబట్టి మయూరుడు కుష్ఠురోగ దుఃఖంచేత పీడితుడై సూర్యస్తుతితో కూడిన సూర్యశతకాన్ని వ్రాసి రోగ దుఃఖనివృత్తుడైనాడని తెలుస్తున్నది. సూర్యోపాసన వల్ల కుష్ఠురోగం నయమవుతుందని అంటారు. అయితే మయూరునికి బాణుడిచ్చిన శాపం వల్ల వచ్చిందటనం హేతువాదానికి నిలిచేదికాదు. జగన్నాథుడు మయూరుని కుష్ఠురోగం శాపంవల్ల కాక పూర్వజన్మ ఫలంవల్ల సంక్రమించిందని చెప్పాడు. దీన్నిబట్టి మయూరుడు కుష్ఠురోగ పీడితుడై సూర్యశతకాన్ని వ్రాసాడనటం నిజమని తెలుస్తుంది.

సూర్యశతకంలో 100 శ్లోకాలున్నవి. కవి స్రగ్ధరావృత్తాన్ని ప్రయోగించాడు. శైలి ఓజోగుణ ప్రధానమైంది. గౌడీరీతిలో వున్నది. అర్థాలంకారాలతోపాటు కవి యమకాలను కూడ ప్రయోగించాడు. మయూరుని కవిత్వం ప్రౌఢమైంది. దీనిలో మొదటి 43 శ్లోకాలల్లో సూర్యకిరణాల వర్ణన, సూర్యునిస్తుతి వున్నది. తర్వాత 5 శ్లోకాలల్లో సూర్యరథం, అశ్వాల వర్ణన, 12 శ్లోకాలల్లో సూర్యసారథి అరుణుని వర్ణన 11 శ్లోకాలల్లో సూర్యరథవర్ణన, 7

శ్లోకాలల్లో సూర్యబింబవర్ణన, 3 శ్లోకాలల్లో శివ, విష్ణు బ్రహ్మల స్వరూపుడుగా సూర్యునిస్తుతి వున్నవి. మరొక శ్లోకంలో సూర్యుడు సమస్తదేవతల కన్న శ్రేష్ఠుడుగా వర్ణింపబడినాడు. మూడు శ్లోకాలల్లో సూర్యుడు వెలిగేటప్పుడు భూమి మీద జరిగే పరిణామం, మరొక శ్లోకంలో సూర్యుని సార్వభౌమత్వం వర్ణింపబడినవి.

## నీతి బోధక గ్రంథాలు

"నీతిద్విషష్ఠిక" వంటి నీతి కావ్యాలు ధర్మం, నీతులను బోధించటానికై పుట్టినవి. వీటిల్లో గంభీరమైన దార్శనిక విచారాలు కూడ చేరినవి. ఎటువంటి వ్యవహారంచేత లౌకిక జీవితాన్ని మానవుడు సఫలం చేసుకోవచ్చునో ఈ గ్రంథాలు చెప్తున్నవి. సామాజిక, ధార్మిక, ఆర్థిక సంబంధమైన వ్యవహారాల రీతులను ఈ నీతిగ్రంతాలల్లో చూడవచ్చును. 'నీతి' అన్నపదానికి "తీసుకొని పోయేది, చేర్చేది" అని అర్థం. అంటె మానవున్ని సన్మార్గంలోకి తీసుకొనిపోయేది, సదాచరణవైపుకు చేర్చేది నీతి అని చెప్పవచ్చును.

## నీతిశాస్త్ర చరిత్ర

నీతి సంబంధ వచనాలు వేదాలల్లోను, ఉపనిషత్తులల్లోను, సూత్ర గ్రంథాలల్లోను లభిస్తున్నవి. తర్వాత మహాభారత, రామాయణాలల్లో అనేక ఆఖ్యానాలు, ఉపాఖ్యానాలు కేవలం ధర్మ, నీతి బోధలకే సృష్టించబడినవి. ముఖ్యంగా మహాభారతంలో ఇటువంటి ఆఖ్యానాలను ఉపాఖ్యానాలను చాలా చూడ వచ్చును. ఈ కథలు నీతి, రాజనీతి, ధర్మం, లౌకిక వ్యవహారం, సదాచరణ, దార్శనిక భావాలను బోధిస్తున్నవి. మహాభారతంలో నీతిబోధయే కాక అనేక నీతి గ్రంథాల ఉల్లేఖనం కూడ కన్పిస్తున్నది. దేవతలు రాక్షసుల అత్యాచారాలచేత పీడింపబడి బ్రహ్మ దగ్గరికి పోయి తమను ఉద్ధరించమని కోరగా బ్రహ్మ ఒక లక్ష అధ్యాయాలు గల నీతిశాస్త్రాన్ని రచించి వారికిచ్చాడని మహాభారతంలో చెప్పబడింది. స్వాయంభువ మనువు కూడ ఒక నీతి శాస్త్రాన్ని రచించాడు. తర్వాత బృహస్పతి, శుక్రాచార్యులు కూడ నీతిశాస్త్రాలను రచించారు. శుక్ర నీతిసారానుసారం బ్రహ్మ చెప్పిన నీతిశాస్త్రంలో ఒక కోటి శ్లోకాలున్నవి. దానిని శివుడు దశసహస్ర అధ్యాయాలుగా సంక్షిప్తంచేసి రచించాడట. ఇంద్రుడు తిరిగి దాన్ని పంచసహస్ర అధ్యాయాలుగా, బృహస్పతి త్రిసహస్ర అధ్యాయాలుగా సంక్షిప్తంచేసి రచించారు. బృహస్పతి సంక్షిప్తంచేసిన గ్రంథానికే బార్హస్పత్య నీతి అనిపేరు. తర్వాత శుక్రాచార్యులు సహస్రాధ్యాయాలల్లో దీన్ని తిరిగి

రచించాడు. కౌటిల్యుడు అర్థశాస్త్రంలో ప్రాచీనమైన ఐదు నీతి శాస్త్రాలను పేర్కొన్నాడు- ఇవేగాక ఇంకా అనేక అజ్ఞాతరచనల నుంచి శ్లోకాలను కౌటిల్యుడు ఉదహరించాడు.

## కౌటిల్య నీతి శాస్త్రం

ఇప్పుడు లభ్యమయ్యే నీతిగ్రంథాలల్లో కౌటిల్యుని అర్థశాస్త్రం మొదటిది. ఇప్పుడు లభించే బృహస్పతి, శుక్ర, మను, వశిష్ఠ, పారాశర్యాది నీతిశాస్త్రాలు కౌటిల్యుని కన్న ప్రాచీనమైనవని నిర్ణయించి చెప్పలేము. అదీగాక తద్రచయితలను ఐతిహాసిక వ్యక్తులుగా పరిగణించి కాలనిర్ణయం చేయటం సాధ్యం కాదు. అదీగాక ఇప్పుడు వారి పేర్లతో ఉన్న గ్రంథాలు వారి మూల రచనలు అవునో కాదో కూడ చెప్పలేము. చంద్రగుప్త మౌర్యునికి (క్రీ.పూ.4వ శ॥) ఆచార్యుడు, మంత్రి కౌటిల్యుడు. కుటిలనీతిలో ప్రవీణుడు కాబట్టి కౌటిల్యుడని పేరు కలిగిందంటారు. వారి పూర్వజుల్లో కుటిలుడనేవాడు ప్రసిద్ధుడైనాడు కాబట్టి వారి వంశజులకు కౌటిల్యుడని పేరు వచ్చిందని ఒక ఐతిహ్యం. "కుటం-కుటపూర్ణ ధాన్యం నాతి గ్రహోతి ఇతి కుటలః"- అని అర్థం. ఋగ్వేదంలో కుట శబ్దం కుటుంబానికి వాడబడింది. అప్పుడు "కుటలః" అంటె కుటుంబ పోషణార్థం ధనసంగ్రహం చేసేవాడని అర్థం చెప్పవచ్చునని కొందరు తలంచారు. 'కౌటల్య' శబ్దమే 'కౌటిల్య'గా మారిందని వారి అభిప్రాయం దండి, కామందకులు అర్థశాస్త్ర రచయిత విష్ణుగుప్తుడని పేర్కొన్నారు. అతని తండ్రి పేరు చణకుడుఃకావటంచేత అతనికి చాణక్యుడనే పేరు కలిగిందని అతని అసలు పేరు విష్ణుగుప్తశర్మ అని విమర్శకులు భావిస్తున్నారు. కౌటిల్యుడు చంద్రగుప్తుని కొరకే ఈ అర్థశాస్త్రాన్ని వ్రాసాడని ప్రచారంలో వున్నది. "ఇయ మిదానీమాచార్య విష్ణుగుప్తేన మౌర్యార్థం షడ్భిః శ్లోక సహస్రైః సంక్షిప్తా" అని దండి చెప్పాడు. అర్థశాస్త్రం మౌర్యుల నాటి రచన అని అనటంలో ఎవరికి ఎటువంటి సందేహం లేదు. అశోకుని శాసనాలల్లోని భాష, పారిభాషిక పదాలు, విషయాలు అర్థశాస్త్రంతో సామ్యం కలిగి వున్నవని పండితులు పరిశీలించి చెప్పారు.

కౌటిల్యుడు గొప్ప శాస్త్రజ్ఞానం, రాజనీతికుశలత, లోకజ్ఞానం కలవాడు. అతడు అర్థశాస్త్రంలో చెప్పిన అర్థనీతి, రాజనీతి, దండనీతి, వ్యవహారనీతి మొదలైనవి ఈనాడు కూడా పనికివచ్చేవిగా వున్నవి. అర్థశాస్త్రంలో ప్రధానంగా అర్థనీతి చెప్పబడినా ప్రసంగానుకూలంగా నీతి, సదాచరణ, ధర్మాచరణ, వ్యవహారజ్ఞానం అనేకచోట్ల బోధింపడింది. అర్థనీతికే కాక లోకవ్యవహారనీతికి కూడ ఇది ప్రామాణిక గ్రంథం. లోకోక్తుల రూపంలో

అర్థశాస్త్రంలోని ఎన్నో శ్లోకాలు, పాదాలు వ్యాప్తిలో వున్నవి. నీతిబోధకంగా వ్యాప్తిలోవున్న కొన్ని శ్లోకాలు-

ఆపదర్థే ధనం దారాన్ రక్షేద్ ధనైరపి
ఆత్మానం సతతం రక్షేద్ దారైరపి ధనైరపి
మాతాశత్రుః పితా వైరీ యేన బాలోన పాఠితః
నశోభతే సభామధ్యే హంసమధ్యే బకోయథా.
యావత్స్వస్థో హ్యాయం దేహోయావత్ మృత్యుశ్చ దూరతః
తావదాత్మహితం కుర్యాత్ ప్రాణాంతేకిం కరిష్యతి

కౌటిల్యుని పేరుమీద అర్థశాస్త్రమే కాక "చాణక్యశతకం, చాణక్య నీతిసారం, రాజనీతిసారం, రాజనీతి సముచ్చయం, వృద్ధ చాణక్య" అనే నీతి శతకం. చాణక్య నీతిసారంలో సదాచరణ బోధింపబడింది. ఈ రచనలన్ని ప్రసిద్ధ నీతివేత్త అయిన చాణక్యుని పేరుతో తర్వాత పండితులెవరో రచించివుంటారు.

## కామందక నీతిసారం

కామందకుడు క్రీ.శ. 4వ శతాబ్దం వాడు కావచ్చునని విమర్శకులు నిర్ణయించారు. ఇందులో నీతిసంబంధమైన శ్లోకాలున్నవి. నీతి కథా గ్రంథాలల్లో కామందకం నుంచి ఎన్నో శ్లోకాలు ఉద్ధరింపబడినవి. దీనిలో శైలి హృద్యంగా సరళంగా వున్నది. దీనిలో పరోపకారం, ఉదారత, న్యాయం, విద్య, సత్యం, త్యాగం మొదలైన విషయాలను గురించి సూక్తులు చెప్పబడినవి.

## శుక్రనీతిసారం

శుక్రవిరచితమైన నీతిసారం రాజనీతి సంబంధమైంది. అక్కడక్కడ నీతి సంబంధమైన శ్లోకాలెన్నో వున్నవి. అర్థశాస్త్రంలో కౌటిల్యుడు బృహస్పతి, శుక్రులను ప్రశంసించి వున్నాడు. కాని ఇప్పుడు మనకు లభ్యమయ్యే శుక్రనీతిసారం అంత ప్రాచీనమైందని చెప్పటానికి వీల్లేదు. ఇది కౌటిల్యుని తర్వాత రచన అని పండిత విమర్శకుల అభిప్రాయం. శుక్రుడనే పేరుగల పండితుడు వ్రాసిన గ్రంథమై వుంటుంది. లేక ఎవరో పండితుడు వ్రాసి శుక్రుని పేరు మీదుగా శుక్రనీతిసారమని నామకరణం చేసివుంటాడు. ఇది క్రీ.శ. 8వ శ॥

రచన అని అల్టేకర్ నిర్ణయించగా కొందరు విమర్శకులు దీన్ని క్రీ.శ. 16వ శ॥ రచనగా భావించారు. కాని దీనిలోని సామాజిక, చారిత్రక చిత్రణలను పరిశీలిస్తే ఇది గుప్తుల కాలం నాటి రచనగా నిర్ణయించవచ్చును. ఒకవేళ హర్షవర్ధనుని నాటి రచన కూడా కావచ్చును.

శుక్రనీతిసారం అధ్యాయాలుగా విభజింపబడింది. భాష సరళసులభంగా వున్నది. సామాన్యులకు కూడ అర్థమౌతుంది. విధి నిషేదాత్మక రూపంగా అనేక ఉపదేశాలు దీనిలో ఇయ్యబడినవి. కొన్ని ఉదాహరణలు-

షడ్ దోషాః పురుషేణేహ హాతవ్యాభూతిమిచ్ఛ తా
నిద్రాతంద్రా భయం క్రోధ ఆలస్యం దీర్ఘసూత్రతా
దానైః మానైశ్చ సత్కారైః సుపూజ్యాన్ పూజయేత్ సదా
కదాపి నోగ్రదండఃస్యాత్ కటుభాషణతత్పరః
దీనాంధ పఙ్గుబధిరా నోపహాస్యాః కదాచన
ఆనృశంస్యం పరో ధర్మః సర్వప్రాణభృతాం యతః.

మను, యాజ్ఞవల్క్య, నారద, పరాశర, శుక్ర, బృహస్పతుల నీతిశాస్త్రాల ప్రసక్తి మనకు అర్థశాస్త్రంలో లభిస్తున్నది. దీన్ని బట్టి నీతి గ్రంథరచనా పరంపర అతి ప్రాచీనమైందని తెలుస్తున్నది. భారతీయ కావ్యనాటకాది సాహిత్యమంతా ఉపదేశాత్మకంగానే వున్నది. అయినా ప్రజల జీవితం సన్మార్గంలో ప్రశాంతంగా నడవటానికై ప్రత్యేకంగా నీతిగ్రంథాలు వ్రాయబడినవి. సంఘంలో, రాజ్యంలో నీతి ధర్మం సదాచరణ రాజనీతి భద్రత అర్థసంబంధమైన రక్షణకొరకు సంఘాన్ని అన్ని విధాల సక్రమంగా నడపటానికి ఈ నీతి గ్రంథాల అవసరం ఏర్పడి వుంటుంది. ఈ గ్రంథాలను బట్టి ప్రాచీన భారతీయ సామాజికోన్నతిని, విచారౌన్నత్యాన్ని, విశ్వకళ్యాణాభిరుచిని ఊహించవచ్చును. క్రమక్రమంగా నీతి గ్రంథాలలో నీతి సదాచరణ ధర్మం మొదలైనవే కాక వైరాగ్య బోధన కూడ చేరింది. ఇహలోక సుఖాలకు దూరమై అన్ని కోరికలను చంపుకొని వైరాగ్యాన్ని పొందాలని ఇవి ఉపదేశించినవి. అటువంటి వాటిల్లో భర్తృహరి వైరాగ్యశతకము ప్రముఖమైంది. భర్తృహరి శతకాన్ని అనుసరించి తర్వాత ఎందరో ఇటువంటి శతకాలను రచించారు. అటువంటి నీతి, వైరాగ్య కృతులు ముక్తకప్రక్రియకు చెందినవి కాబట్టి వాటిని ఈ లఘుకావ్యాల ప్రకరణంలో చేర్చటం జరిగింది.

# భర్తృహరి

భర్తృహరి వ్రాసిన నీతి, శృంగార, వైరాగ్య శతకాలు శతకత్రయమనే పేరుతో ప్రసిద్ధమైనవి. మానవులందరికి జీవితంలో ప్రతి అవస్థలో ప్రేరణను ఇచ్చేవి ఈ మూడు శతకాలు. మానవుని ప్రారంభదశలో నీతిని బోధించేది నీతి శతకం. యౌవనావస్థ కొరకు శృంగార శతకం, వృద్ధావస్థ కొరకు వైరాగ్య శతకం ఉపయోగపడగలవు. ఈ శతకత్రయాలను వ్రాసిన భర్తృహరి ఎవరు, ఏకాలంవాడు అన్న విషయంలో బోలెడంత అభిప్రాయభేదమున్నది.

## భర్తృహరి ఎవరు?

ప్రాచీన భారతీయ సంప్రదాయాన్ననుసరించి భర్తృహరి విక్రమాదిత్యుని అన్న. భర్తృహరి తన భార్య పింగళ దుశ్చర్యను సహించలేక విరక్తుడై అరణ్యానికి వెళ్ళిపోయెనట. దీన్ని బలపరిచే శ్లోకం-

విప్రేణాభూత పూర్వంఫలమధితపసాలంబి సూర్యప్రసాదాత్
లబ్ధ్వా తస్మాత్ స్వయం తత్ప్రచురతర జరాపంచతా కుంచనాఢ్యమ్
హిత్వామోహం స్వకాన్తాస్వతివిమలధియా తం నిషేవ్యాక్త భవ్యో
యోగీంద్రో భర్తృహర్యాహ్వాయ ఇహకురుతేz ద్యాపి విద్యావిలాసమ్.

ఒకానొక బ్రాహ్మణుడు తనకు సూర్యప్రసాదంచేత లభించిన ఫలాన్నొకదాన్ని ప్రభువైన భర్తృహరికి ఇచ్చాడు. అతడు దాన్ని తన ప్రియ భార్యకు ఇచ్చాడు. ఆమె దాన్ని తన జారునికిచ్చింది. అతడు దాన్ని తన వేరొక ప్రియురాలికిచ్చాడు. ఈ సంగతి తెలిసి భర్తృహరి లోకం మీద విరక్తి చెంది విరాగియై అరణ్యానికి వెళ్ళిపోయాడు. భర్తృహరి శతకపీఠికలో రామచంద్ర బుధేంద్రుడు పేర్కొనిన శ్లోకమిది. ఒకవేళ భర్తృహరి విక్రమాదిత్యుని అన్నయే అయినట్లయితే అతని కాలం క్రీ.పూ. ప్రథమ శతాబ్దమని చెప్పవలసి వుంటుంది.

క్రీ.శ. 1691 ప్రాంతంలో భారతదేశానికి వచ్చిన ఈత్సింగ్ అన్న చైనా యాత్రికుడు అప్పటికి 40 సంవత్సరాల ముందు భర్తృహరి జీవించి వున్నాడని, అతడు బౌద్ధుడని తెలిపాడు. ఈ పండిత భర్తృహరి మహాభాష్యానికి వ్యాఖ్యానం మరియు వాక్యపదీయమన్న వ్యాకరణ గ్రంథాన్ని వ్రాసినవాడు. అప్పుడు వైయాకరణుడు భర్తృహరి క్రీ.శ. 651 లో మరణించాడని నిర్ణయించవచ్చును. ఈ భర్తృహరి ఏడు సార్లు సన్యాసాన్ని తీసుకొని తిరిగి

లౌకిక సుఖాల మోహంతో తిరిగి వచ్చాడనీ ఈత్సింగ్ చెప్పి భర్తృహరి తన లౌకిక సుఖవాంఛను నిందిస్తూ చెప్పిన శ్లోకాన్ని ఉద్ధరించాడు. ఈ కథనాన్ని ఆధారం చేసుకొని వైయాకరణుడు భర్తృహరి, శతకకర్త భర్తృహరి ఒక్కరే అని వింటర్‌నిట్స్ అభిప్రాయపడినాడు. కాని భర్తృహరి ప్రసిద్ధమైన శతకరచనలను గూర్చి ఈత్సింగ్ ప్రసంగించలేదు, పైగా శతకకర్త భర్తృహరి బౌద్ధుడుగా అసలే కన్పించడు. అతడు శైవుడుగా వేదాంతిగా కన్పిస్తాడు. ఒకవేళ బౌద్ధుడు కాకముందు భర్తృహరి శైవ బ్రాహ్మణుడై వుండి రాజాస్థానాన్ని ఆశ్రయించి సుఖాలను అనుభవించి ఉంటాడు. అప్పుడే అతడు శతకాలను వ్రాసివుంటాడు. తర్వాత విరాగియై బౌద్ధమతాన్ని తీసుకొన్న తర్వాత వైయాకరణుడై వుంటాడు. అందుకే ఈత్సింగ్ భర్తృహరి శాస్త్ర రచనలను గూర్చి ప్రసంగించాడు కాని శతకాలను గూర్చి ప్రసంగిచలేదని అయినా ఒకచోట భర్తృహరి మానవనీతిసూత్రాలను రచించినట్లుగా ఈత్సింగ్ చెప్పిందాన్నిబట్టి శతకరచయిత ఇతడే అని నిర్ణయించవచ్చునని వింటర్‌నిట్స్ నిర్ణయించాడు. అప్పుడు భర్తృహరి సమయాన్ని క్రీ.శ. 650 పూర్వమని నిర్ణయించవచ్చునని వింటర్‌నిట్స్ అన్నాడు.

మరొక సంప్రదాయాన్ననుసరించి భర్తృహరి గోరక్షనాథుడనే శివసిద్ధయోగి శిష్యుడు. మత్స్యేంద్రనాథ, గోరక్షనాథులు నాథసంప్రదాయమనే యోగసంప్రదాయ ప్రవర్తకులు. వీరు మొదట బౌద్ధసిద్ధ సంప్రదాయానికి చెందినవారు. తర్వాత శివున్ని ఆలంబనదేవతగా గ్రహించి యోగ సంప్రదాయాన్ని బోధించినవాడు మత్స్యేంద్రుడు, దాన్ని ప్రచారం చేసినవాడు గోరక్షనాథుడు. బౌద్ధసిద్ధ సంప్రదాయంలో 84 మంది సిద్ధగురువులున్నారు. నాథసంప్రదాయంలో 9 మంది గురువులున్నారు. వారిని నవనాథులని పిలుస్తారు. నాథ సంప్రదాయం క్రీ.శ. 7వ శ॥ నుంచి క్రీ.శ. 14వ శ॥ వరకు భారతదేశమంతటా వ్యాపించింది. దీనిలో యోగానికి ప్రాధాన్యముంది. నాథ గురువులు నీతిని వైరాగ్యాన్ని బోధిస్తూ తిరిగేవారు. మూఢ విశ్వాసాలను కులభేదాలను వీరు ఖండించారు. సామాన్యజనుల్లో ఇది బాగా వ్యాపించివుండేది. గోరక్షనాథ పేరుతో చాలా ప్రాంతాల్లో చాలా మంది చలామణి అయ్యారు. అటువంటప్పుడు ఏ గోరక్షనాథునికి భర్తృహరి శిష్యుడో నిర్ణయించి చెప్పలేము. అప్పుడు భర్తృహరి కాలం క్రీ.శ. 7వ శ॥ నుంచి క్రీ.శ. 14వ శ॥ నడుమ ఎప్పుడైనా కావచ్చును.

భట్టి కావ్య రచయిత భట్టి ఈ భర్తృహరి ఇద్దరు ఒక్కరే అని ఒక వాదమున్నది. వాళ్ళిద్దరి శైలిలో ఎక్కడా సామ్యంలేదు. భట్టికావ్యరచయిత - భట్టిని మల్లినాథాదులు భర్తృహరి పేరుతోపాటు వేరుగా పేర్కొన్నారు. ఒకవేళ భట్టి కావ్యరచయిత పేరు

భర్తృహరియే అయినా అతడు శతకత్రయకర్త భర్తృహరి వేరు వేరు వ్యక్తులని వారి గ్రంథాధారాలను బట్టి తెలుస్తున్నది. బలమైన ఆధారమేది లేందే వీరిద్దరు ఒక్కరనే వాదాన్ని అంగీకరించలేము.

సంప్రదాయాన్ననుసరించి భర్తృహరి మొదట సుఖసంసార జీవితాన్ని గడుపుతూ ఏదో ఒక సంఘటన చేత ప్రభావితుడై సంసారజీవితాన్ని విడిచి విరాగియై, సన్యాసియై అరణ్యవాస జీవితాన్ని గడిపాడని తెలుస్తున్నది. సంప్రదాయ కథనం, ఈత్సింగ్ చెప్పిన కథనం రెండు కూడ దీన్ని బలపరుస్తున్నవి. శతకత్రయం, వ్యాకరణ గ్రంథాలను పరిశీలిస్తే అతడు ఈత్సింగ్ చెప్పినట్లుగా బౌద్ధ సన్యాసిగా కాక శివాభిమానిగా, మీమాంసకుడుగా కన్పిస్తాడు. కాని మొత్తంమీద శతకత్రయకర్త మరియు వ్యాకరణకారుడు ఇద్దరు భర్తృహరులు ఒకే వ్యక్తి అని అంగీకరిస్తే భర్తృహరి కాలం దాదాపుగా క్రీ.శ. 600 - 650 నడుమ అని నిశ్చయించవచ్చును.

## భర్తృహరి శ్లోకాలకు గల విశేష ప్రచారం

శతకత్రయంలోని భర్తృహరి శ్లోకాలు సరళమైనవి, భావగాంభీర్యం కలవి. దీర్ఘ సమాసాలు లేకుండ సుందర, మధుర, సరళ, సరసమైన భాషలో వ్రాయబడినవి. ఈ శతకత్రయం నుంచి ఒక్క శ్లోకమైనా కంఠస్థంగా రాని సంస్కృతజ్ఞుడు వుండడు. ఈ శ్లోకాల్లో భావాలు సంక్షిప్తంగా సూత్ర ప్రాయంగా వుండి పాఠకుల హృదయాలల్లోకి దూసుకొనిపోతవి. భర్తృహరి ప్రయోగించిన అలంకారాలు సహజమైనవి, అక్లిష్టమైనవి. మరియు విషయగ్రాహ్యతకు తోడ్పడేటట్లుగా వున్నవి. కవి సూక్ష్మేక్షికను ప్రదర్శించేవిగా వున్నవి. భర్తృహరి శ్లోకాలు భారతదేశంలో ప్రాచీనకాలం నుంచి మిక్కిలి ప్రచారంలో వుండటమేకాక ఆధునిక కాలంలో పాశ్చాత్యుల దృష్టిని విశేషంగా ఆకర్షించినవి. క్రీ.శ. 1651 ప్రాంతంలో డచ్ మిషనరీకి చెందిన అబ్రహం రాజర్ వీటిని డచ్ భాషలోకి అనువదించాడు. తర్వాత ఇవి లాటిన్, గ్రీకు, జర్మన్, ఫ్రెంచ్, ఇంగ్లీషు భాషల్లోకి అనువదింపబడినవి. అనేక భారతీయ దేశభాషల్లోకి కూడ శతకత్రయం అనువదింపబడింది.

## భర్తృహరి శతకత్రయం

శతకత్రయంలో మొదటిది నీతిశతకం. దీనిలో 109 శ్లోకాలున్నవి. శృంగార వైరాగ్య శతకాల్లో ఒక్కొక్క దానిలో 100 శ్లోకాల చొప్పున వున్నవి. శతకత్రయంలో శృంగార

శతకమొక్కటే భర్తృహరి రచన అని కొందరు విమర్శకులు తలంచారు. మరికొందరు విమర్శకులు మూడు శతకాలను వేరు వేరు కవులు వ్రాసారని తర్వాత ఒక్కచోట సంగ్రహ పరుపబడినవని తలంచారు. సంప్రదాయాన్ని అనుసరించి మహాభారతాన్ని వ్యాసుడు, అర్థశాస్త్రాన్ని కౌటిల్యుడు వ్రాసారని ఎట్లా నమ్ముతున్నామో అదే విధంగా శతకత్రయాన్ని భర్తృహరే వ్రాసాడని విశ్వసించాలని ఎస్. కే. డే. అభిప్రాయపడినాడు. అన్ని ముక్తక కావ్యాలల్లో వలెనే దీనిలోను ప్రక్షిప్త శ్లోకాలుండి వుంటవి.

నీతిశతకంలో భర్తృహరి యొక్క జీవిత పరిశీలనాశక్తిని చక్కగా చూడవచ్చును. దీనిలో పండితుల ప్రశంస, మూర్ఖుల నింద, సదాచారం, మహాపురుషుల సత్పురుషుల వర్తనం, ధనంవల్ల మానవునిలో కలిగే మార్పులు, పరోపకారం, సేవాధర్మం, దుర్జనుల నింద మొదలైనవి వున్నవి. శృంగార శతకంలో స్త్రీ ప్రశంస, స్త్రీ సౌందర్యం, సంయోగ శృంగారం, వేశ్యానింద, వివిధ ఋతువులల్లో మానవుని కామాసక్తి మొదలైనవి వర్ణింపబడినవి. వైరాగ్య శతకంలో మానవుని తృష్ణ, అజ్ఞానం, విషయ త్యాగం, ఆత్మగౌరవం, పరబ్రహ్మధ్యానం, కాలమహిమ, వ్యర్థజీవితం, కాశీవాససుఖం మొదలైనవి వర్ణింపబడినవి.

## శంకరాచార్యులు

శంకరుడు క్రీ.శ. 8వ శ॥ ఉత్తరార్ధంవాడని అంటారు. శంకరాచార్యుడు ప్రసిద్ధమైన అద్వైతాచార్యుడు. ఇతడు గొప్ప దార్శనికుడు. బ్రహ్మసూత్రాలు, భగవద్గీత, ఉపనిషత్తులకు వ్యాఖ్యానాలను వ్రాయటమే కాక సంస్కృతంలో ఇంకా అనేక కృతులను రచించాడు. ఇతని పేరుమీద అనేక స్తోత్రకావ్యాలు లభిస్తున్నవి. ఆ స్తోత్రాలన్నిటిని ఈ శంకరాచార్యులే వ్రాసాడని నిశ్చయంగా చెప్పలేము.

### శంకరాచార్యుల స్తోత్ర కావ్యాలు

1. **విష్ణుపాదాది కేశాంత వర్ణన స్తోత్రం** - దీనిలో విష్ణుస్తుతి వున్నది. దీనిలో 51 శ్లోకాలున్నవి.

2. **అంబాష్టకం** - పార్వతి స్తుతి వున్నది. కవితా శైలిలో వున్నది. 8 శ్లోకాలున్నవి.

3. **శివాపరాధ క్షమాపణ స్తోత్రం** - సంసారం బుద్బుదప్రాయం, జీవితం నిస్సారమైందని బోధించే శ్లోకాలున్నవి.

**4. దేవ్యాపరాధ క్షమాపణ స్తోత్రం** - దుర్గాస్తుతి వున్నది.

**5. భవాన్యష్టకం మరియు ఆనంద లహరీ** - ఇవి కూడా పార్వతి స్తుతితో కూడినవి. ఇవి ఫ్రెంచ్, ఇంగ్లీషు భాషల్లోకి అనువదింపబడినవి.

**6. చతుష్షష్ఠ్యుపచార మానస పూజా స్తోత్రం** - దీనిలో సోపచార పూజా పద్ధతి చెప్పబడింది.

**7. పంచ చపంటికా స్తోత్రం** - ఇది చాలా ప్రసిద్ధమైన స్తోత్రం. "భజగోవిందం భజగోవిందం భజమూఢమతే" అన్న బాగా వ్యాప్తిలో వున్న పదం దీనిలోదే.

**8. శివానందలహరీ** - దీనిలో శివుని స్తుతి వున్నది. దీనిలో మొత్తం 100 శ్లోకాలున్నవి. 99 శ్లోకాలవరకు విని శివుడు శంకరాచార్యుల ముందు ప్రకటమైనాడట. దీనిలో చక్కని ఆలంకారిక శైలి వున్నది. కవితా దృష్టితో దీన్ని ఒక ఉత్తమమైన స్తోత్రకావ్యంగా చెప్పవచ్చును. దీనిలో రసాలంకారాల సంయోజనాన్ని ఆద్యంతం చూడవచ్చును. భక్త్యావేశంతో కూడిన ఈ కావ్యం మనోహరంగా వున్నది. రసానుగుణమైన వివిధ ఛందస్సులు ప్రయోగింపబడినవి.

**9. మోహముద్గరం** - దీనిలో 18 శ్లోకాలున్నవి. దీనిలో విష్ణుస్తుతి వున్నది. ప్రపంచం మాయ, మోహపరాజయంతో వివేకం ఉదయిస్తుంది. అని దీనిలో బోధింపబడింది. దీన్ని విలియమ్ జోన్స్ ఇంగ్లీషులోకి అనువదించాడు. దీనికి జర్మన్ అనువాదం కూడ వున్నది.

**10. శతశ్లోకీ** - దీనిలో 101 స్రగ్ధరా శ్లోకాలున్నవి. దీనిలో వేదాంత బోధ చక్కని ఆలంకారిక శైలిలో చేయబడింది.

ఇవేగాక శంకరుని పేర ఇంకా లఘుకావ్యాలు కన్పిస్తున్నవి - శివపాదాది కేశాంత వర్ణన స్తోత్రం, అన్నపూర్ణ దశకం, అన్నపూర్ణాష్టకం, కనకధారాస్తవం, రామభుజంగ స్తోత్రం, లక్ష్మీనృసింహ స్తోత్రం, దక్షిణామూర్త్యష్టకం, శివభుజంగ స్తోత్రం, సౌందర్యలహరీ మొ॥వి.

## మూక కవి

శంకరాచార్యులకు మూక కవి సమకాలికుడు. ఈ కవి మూగవాడు. అందుకే మూకకవి అని అతనికి పేరు కలిగింది. కంచి లోని కామాక్షీదేవి కరుణచేత అతడు

మాట్లాడగలిగాడట. ఆమె ఇచ్చిన వాక్శక్తితో అతడు మూక పంచశతిని రచించాడు. దీనిలో 500 శ్లోకాలున్నవి. వీటిల్లో దేవీస్తుతి వున్నది.

## అమరుక కవి

ఈ కవికి అమరుడు, అమరుకుడని పేరు. ఈ కవి ముక్తక కావ్యానికి తన పేరు మీదుగా అమరు లేక అమరుక శతకమని పేరు. దీనిలో దాదాపుగా 115 శ్లోకాలున్నవి. వామన (క్రీ.శ. 800). ఆనంద వర్ధనులు (క్రీ.శ. 850) తమ అలంకార గ్రంథాలల్లో ఈ కవి శ్లోకాలను ఉదాహరించారు. కాబట్టి ఈ కవి కాలం తప్పక క్రీ.శ.800 లకు పూర్వమే అవుతుంది. కవితా శిల్పాన్ని బట్టి విమర్శకులు ఈ కవిని క్రీ.శ. 650 ప్రాంతంవాడుగా నిర్ణయిస్తున్నారు. అమరునికి, శంకరాచార్యులకు సంబంధించిన కథ వ్యాప్తిలో వున్నదాన్నిబట్టి ఈ కవి శంకరాచార్యులకు సమకాలికుడవుతాడు. దాన్ని బట్టి ఈ కవి క్రీ.శ. 800 పూర్వుడనే కాల నిర్ణయం సమంజసంగానే వున్నది.

## అమరుక కవి పరిచయం

అమరుకుడు రాజు అని ప్రసిద్ధి. శంకరదిగ్విజయ గ్రంథంలో శంకర, అమరుకులను గూర్చి ఇట్లా చెప్పబడింది - శంకరాచార్యులు మండనమిశ్రుని భార్య భారతితో శాస్త్రార్థంలో ఓడిపోయాడు. ఆమె అడిగిన కామశాస్త్ర సంబంధ ప్రశ్నకు శంకరుడు జవాబు చెప్పలేకపోయాడు. శంకరుడు ఒక నెల రోజుల గడువు అడిగాడట. భారతి దానికి అంగీకరించింది. శంకరుడు యోగశక్తితో తన శరీరాన్ని విడిచిపెట్టి అమరుకుని శవంలో ప్రవేశించాడు. అమరకుడు కాశ్మీర రాజు. అతనికి నూరుగురు భార్యలున్నారట. శంకరుడు అమరుని శరీరంలో ప్రవేశించి నూరుగురు భార్యలతో శృంగార జీవితాన్ని గడిపి తన అనుభవాలను కావ్యరూపంలో ప్రకటించాడని అదే అమరుక శతకమని తర్వాత శంకరుడు ఈ శ్లోకాలను ఆధ్యాత్మికార్థాన్ని కూడ చెప్పాడని అంటారు. ఈ కథలో సత్యబీజాలెంతవరకున్నవో చెప్పలేము. ఒకవేళ కాశ్మీర రాజైన అమరుకుడు మొదట శృంగారిగా వుండి లౌకిక సుఖాల్లో తేలుతూ వుండి తర్వాత శంకరాచార్యుల బోధలతో సన్యాసి అయినాడేమో? రవిచంద్రుడనే అమరుకకావ్య వ్యాఖ్యాత ఒకడు ఈ శ్లోకాలను ఆధ్యాత్మికార్థాన్ని చెప్పటానికి ప్రయత్నించాడు. కాని అది సాగదీసి బలవంతంగా చెప్పినట్లుగానే వున్నది కాని సహజంగా లేదు.

## అమరుక శతకంలోని శ్లోక సంఖ్య

అమరుక శతకంలోని శ్లోక సంఖ్య విషయంలో అభిప్రాయభేదమున్నది. అది శతకం కాబట్టి 100 శ్లోకాలే వున్నవని కొందరన్నారు. కాని భర్తృహర్యాదుల శతకాల్లో శతాధిక సంఖ్యలో శ్లోకాలుండటంచేత అమరుక శతకంలోను 100 పైన శ్లోకాలుండి వుంటవని కొందరన్నారు. అర్జునదేవుడు అమరుకశతకంలోని 102 శ్లోకాలకు వ్యాఖ్యానం వ్రాసి 5 ప్రక్షిప్తాలని చూపాడు. రుద్రమదేవుడనే మరో వ్యాఖ్యాత 114 శ్లోకాలను వ్యాఖ్యానం చేస్తు మూడు శ్లోకాలు ప్రక్షిప్తాలని చూపాడు. పెదకోమటి వేమారెడ్డి 101 శ్లోకాలకు వ్యాఖ్యానం వ్రాసాడు. ప్రక్షిప్త శ్లోకాలకు తాను వ్యాఖ్యానం వ్రాయనని కావ్యారంభంలోనే ఆయన ప్రతిజ్ఞ చేసాడు. యస్.కే.డే. అభిప్రాయానుసారం అమరుక శతకం పాఠప్రతుల్లో 96 నుంచి 115 వరకు శ్లోకాలున్నవి. వీటిలో 51 మాత్రమే సమానంగా అన్ని ప్రతుల్లో కన్పిస్తున్నవి. ప్రస్తుతం చౌఖంబావారు ప్రచురించిన పుస్తకంలో పరిశిష్ట శ్లోకాలతో సహా 163 శ్లోకాలను ప్రచురించారు. 163 లో 61 శ్లోకాలు పరిశిష్టాలని చూపారు.

## అమరుక శతకానికి వ్యాఖ్యానాలు - అనువాదాలు

అమరుక శతకం చిన్నదైనా, సరళమైనదైనా దీనికి దాదాపుగా 11 వ్యాఖ్యానాలున్నవి. వాటిల్లో ప్రాచీనమైంది అర్జునదేవునిది. అర్జునదేవుడు ప్రసిద్ధుడైన భోజరాజు వంశీయుడు. ధారానగరరాజు. సుభటవర్మ కుమారుడు. అతని కాలం క్రీ.శ. 1215 - ప్రాంతం, తర్వాత వ్యాఖ్యాతలల్లో కొండవీటి రాజు పెదకోమటి వేమారెడ్డి ప్రముఖుడు (క్రీ.శ. 1430 ప్రాంతం). ఇంకా రామానంద నాథుడు, కోక సంభవుడు, రామరుద్రుడు, రుద్రమదేవుడు (ఇతడు కాకతీయరాజు యయాతి చరిత్ర నాటకకారుడు రెండవ ప్రతాపరుద్రుడు), రవిచంద్రుడు, జ్ఞానానంద కళాధరుడు మొదలైనవారు వ్రాసిన వ్యాఖ్యానాలు అమరుకశతకానికి కన్పిస్తున్నవి.

అమరుకశతకం గాథా సప్తశతివలె శృంగారభరితమైన ముక్తకకావ్యం. గాథాసప్తశతిని అనుసరించిన సంస్కృత ముక్తకకావ్యాలల్లో ఇది ఒకటి. అమరుక శతకంలో ప్రధానంగా శార్దూలవిక్రీడితవృత్తం ప్రయోగింపబడింది. అక్కడక్కడ మాలిని, శిఖరిణి, హరిణి మొ॥న వృత్తాలు కూడ ప్రయోగింపబడినవి. సామాన్యంగా ముక్తక శతక కావ్యాలల్లో ఒక్కవిధమైన వృత్తాన్నే ప్రయోగించటం ఆచారం కాని అమరుకశతకంలో వివిధ వృత్తాలు కన్పిస్తున్నవి. వివిధ వృత్తాలు వేరు వేరు కవులు వ్రాసినవని విమర్శకులు కొందరు తలంచారు.

శార్దూలవిక్రీడిత వృత్తంలో వున్నవే అమరుక కృతాలని బాణమయూరుఙలు కూడ శార్దూలవిక్రీడితాన్నే ప్రయోగించారని, వారివలెనే అమరుకుడు శార్దూలవిక్రీడితాన్ని ప్రయోగించాడని అవుఫ్రెఫ్ట్ అభిప్రాయపడినాడు. అమరుకశతకం అనేక భాషల్లోకి అనువదింపబడింది. "38 లీడ్శెన్ ఫన్ అమరు" పేరుతో ఫ్రెడిరిష్ రుకెర్ట్ జర్మన్ భాషలోకి అనువదించాడు. తర్వాత ష్రాయిడర్, హన్స్ లిండాఖ్ వంటి వారు కూడ జర్మన్ భాషలోకి అనువాదాలు చేసారు.

## అమరుకుని కవిత్వం

అమరుకశతకం శృంగార ప్రధానమైంది. ముఖ్యంగా విప్రలంభ శృంగారం దీనిలో చిత్రింపబడింది. ప్రణయం, కలహం, మానం, సాంత్వనం వీటినే కని కావ్యవస్తువుగా గ్రహించాడు. శైలి వైదర్భీ, ప్రసాద మాధుర్యగుణ భరితమైంది. అక్కడక్కడ ఓజోగుణయుతమైన గౌడీరీతి కూడ వున్నది. కాని మొత్తం మీద సరసత్వం అంతటా గోచరిస్తున్నది. ఎక్కువ అలంకారాలు లేవు. రీతి సిద్ధాంతాచార్యుడు వామనుడు అమరుకుని శ్లోకాలనెన్నిటినో లక్ష్యోదాహరణలుగా ఇచ్చాడు. అమరుకుని ఒక్కొక్క శ్లోకం ఒక్కొక్క రసగుళిక వంటిది. ప్రతిశ్లోకం వ్యంగార్థ సౌందర్యంతో కూడింది ప్రతిశ్లోకం సరసమై, సరళమై, ధ్వని ప్రధానమై లోక ప్రసిద్ధిని పొందింది. ఒక్కొక్క శ్లోకం తక్కువ శబ్దాలల్లోనే విస్తృతార్థాన్ని బోధించేదిగా వున్నది. అమరుక "కవేరేకః శ్లోకః ప్రబంధ శతాయతే" అని ఆనందవర్ధనుడు అమరుకుని ఒక్కొక్క శ్లోకం ప్రబంధశతంవలె వున్నదని ప్రశంసించాడు. ధ్వన్యాత్మకమైన సుందర పదావళిని కూర్చటంలో అమరుకుడు అద్భుతమైన నేర్పును చూపాడు. మమ్మటుడు కావ్యప్రకాశంలో ధ్వని భేదాలకు ఉదాహరణలుగా అమరుకుని శ్లోకాలను ఇచ్చాడు శ్లోకాలన్ని భావరసార్థాల వ్యంగ్యవైభవంతో కూడి ఎందరో ఆలంకారికుల దృష్టిని ఆకర్షించినవి.

అమరుకుడు ప్రణయిని అయిన స్త్రీ హృదయాన్ని బాగా తెలిసినవాడు. నాయికా నాయక భేదాలు, వారి వివిధ చేష్టలను, సంచారీ భావాలను అతి సుందరంగ చిత్రగత దృశ్యాలుగా శబ్దవర్ణాలతో చిత్రించాడు. "శూన్యం వాస గృహం విలోక్య...' ఉత్సుకత, వ్రీఢ అనే సంచారీ భావాలుగా శూన్య గృహం ఉద్దీపన విభావంగా సంభోగ శృంగార రసపూర్ణమైన శ్లోకం చాల ప్రసిద్ధమైంది. దీనిలో నాయిక ముగ్ధా అదే విధంగా ప్రణయాత్మకమైన విప్రలంభపూర్వకమైన సంభోగ శృంగారానికి ఉదాహరణ-

ఏకస్మిన్ శయనే పరాఙ్ముఖతయా వీతోత్తరం తామ్యతో
రన్యోన్యం హృదయస్థితే ప్యనునయే సంరక్షతోర్గౌరవమ్
దంపత్యోః శనకైర పాంగవలనాన్మి శ్రీభవచ్చక్షుషో
ర్భగ్నో మానకలిః సహస రభసం వ్యావృత్త కంఠగ్రహః

"నాయికా నాయకులు ఒకే పడక మీద పెడముఖంగా నిశ్శబ్దంగా పడుకొని వున్నారు. ఇద్దరు ఖిన్నులై వున్నా ఇద్దరికి ఒకరి నొకరు అనునయించుకో వలెనని వున్నది. అయినా తమ గౌరవాన్ని నిలుపుకునేటందుకై ఇద్దరు మాట్లాడకుండా వున్నారు. కడగంటి చూపులు కలిసినవి. అంతటితో వారి కలహం అంతరించింది. ఇద్దరూ నవ్వుతూ బిగికౌగిలిలో బంధింపబడినారు". శఠనాయకుడు ప్రియురాలిని ఊరడిస్తున్నాడు. దీనిలో ఈర్ష్యాత్మకమైన విప్రలంభ శృంగారం పోషింపబడింది-

కపోలే పత్రాలీ కరతలనిరోధేన మృదితా
నిపీతో నిశ్వాసైరయమమృత హృద్యోధరరసః
ముహుః కంఠేలగ్న స్తరలయతి వాష్పః స్తనతటం
ప్రియోమన్యుర్జాతస్తవ నిరనురోధేన తు వయయ్

"ప్రియురాలా! నీ చేతులను చెంపలకు చేర్చుకోవటంచేత అక్కడ రచింపబడిన పత్రభంగిమలు తుడిచి వేయబడినవి. దీర్ఘ విశ్వాసాలు నీ అధర రసామృతాన్ని ఇంకింపజేస్తున్నవి. కంఠంలోని గాద్గద్యంచేత వక్షస్థలం వణికి పోతున్నది. నా అనురోధం నీవు వినలేదు. ఇప్పుడు నీకు ప్రియం నేను కాదు ఈ క్రోధమే!"

## విజయాంక లేక విజ్జిత

విజయాంక, విజ్జికలు ఇద్దరు కవయిత్రులు వేరు వేరు అని కొందరు విమర్శకులు తలంచారు. దానికి ఆధారాలు లభించేంతవరకు వాళ్ళిద్దరు ఒక్కరే అని భావించటం మంచిది. విజయాంక కర్ణాట దేశాన్నేలిని రెండవ పులికేశి కుమారుడు చంద్రాదిత్యుని భార్య. క్రీ.శ. 660 ప్రాంతం. ఈమెను విద్య అని కూడ పేర్కొంటారు. ఈమె శ్లోకాలను ముకుళభట్టు (కీ.శ. 925 ప్రాంతం) ధనికుడు "ఉదాహరణలుగా ఇచ్చారు. కాని ఈమె వ్రాసిన కావ్యమేది మనకు లభించలేదు. ఆలంకారికులు ఉదాహరించిన శ్లోకాలనుబట్టి ఈమె ముక్తక కావ్యాన్ని రచించిందని అనుమానం కలుగుతున్నది. మమ్మటుడు ఈమె శ్లోకాన్ని ఉదాహరించాడు -

ధన్యాసియా కథయసి ప్రియ సంగమేపి
విస్రబ్ధ చాటుశతకాని రతాంతరేషు
నీవీం ప్రతి ప్రణిహితేతు కరే ప్రియేణ
సఖ్యః శపామి యది కించిదపి స్మరామి.

విజ్జికయొక్క వైదర్భీశైలిని రాజశేఖరుడు ప్రశంసించి వున్నాడు. అతడు ఆమెకు సాహిత్య రంగంలో కాళిదాసు తర్వాత స్థానాన్నిచ్చాడు -

సరస్వతీవ కర్ణాటీ విజయాంకా జయత్య సౌ
యా విదర్భగిరాం వాసః కాళిదాసాదనంతరమ్.

విజ్జికకు తన కవితా ప్రావీణ్యం మీద గర్వం. అందుకే తనను తాను సరస్వతి అవతారంగా చెప్పుకొన్నది -

నీలోత్పలదలశ్యామాం విజ్జికాం మామజానతా
వృథైవ దండినా ప్రోక్తం సర్వశుక్లా సరస్వతీ.

"నీ లోత్పలదళం వలె శ్యామవర్ణం గల నన్ను గూర్చి తెలియక దండి సరస్వతిని 'సర్వశుక్లా' అని వ్యర్థంగా చెప్పాడు." అని అన్నదాన్నిబట్టి ఈమె దండికి సమకాలికురాలో లేక కొంచెం తర్వాత కాలంలో వున్నదనో చెప్పవచ్చును. ఆలంకారిక శాస్త్రాల్లో, శ్లోకసంగ్రహ గ్రంథాల్లో లభించే ఆమె శ్లోకాలను పరిశీలిస్తే ఈమె కవితాగర్వం వ్యర్థమైంది కాదనిపిస్తుంది. ఈమె కవిత్వం సంస్కృత ఉచ్చకోటి కవుల కవిత్వంతో సాటిరాగలదు. ప్రసన్న మాధుర్యాలు ఈమె కవిత్వానికి ఆభరణాలు. భాషమీద ఈమెకు మంచి అధికారమున్నది. అనుప్రాసమాధుర్యంతో ఈమె కవిత్వం సంగీత విలాసాన్ని తెచ్చుకున్నది. అక్కడక్కడ శ్లేషచమత్కారాన్ని చూపించింది. ప్రసిద్ధ కవయిత్రుల్లో ఈమె ఒకతి.

## కుల శేఖరుడు

ప్రసిద్ధ ఆళ్వారులల్లో కులశేఖరుడు ఒకడు. అతడు కేరళరాజు. క్రీ.శ. 700 ప్రాంతం వాడు. ఇతడు ముకుందమాల అనే ముక్తక కావ్యాన్ని వ్రాసాడు. ముకుందమాల భక్తి ప్రధానమైంది.

## వికట నితంబ

వికటనితంబ కవయిత్రి శ్లోకాలు చాల శ్లోకసంగ్రహ, ఆలంకారిక గ్రంథాలల్లో ఉద్ధరింపబడినవి. "లావణ్యా సింధూర అపరైవ కేయం అత్ర" మొదలైన ఈమె శ్లోకాలను ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకంలో ఉద్ధరించాడు. అప్పుడు ఈ కవయిత్రి కాలం ఆనందవర్ధనునికి అంటె క్రీ.శ. 850 కి పూర్వమని చెప్పవచ్చును. వికటనితంబ భర్త మరణానంతరం తిరిగి వివాహం చేసుకున్నట్లు భోజుని శృంగార ప్రకాశంలోని కింది శ్లోకాన్ని బట్టి తెలుస్తున్నది.

కాలే మాషం సస్యే మాసం వదతి శకాసం యశ్చ సకాశమ్
ఉష్ట్రేలుంపతి షంవారం వా తస్మై మ దత్తా వికటనితంబా.

ఈ కవయిత్రి శ్లోకాలు అనుప్రాసాద్యలంకారాలతో కూడి మధురంగా వున్నవి. సుకుమార భావాలను కూర్చింది. రాజశేఖరుడీమెను ఇట్లా ప్రస్తుతించాడు-

తే వికట నితంబేన గిరాం గుంఫేన రంజితా:
నిందంతి నిజకాంతానాం సమౌగ్ధ్యమధురం వచః

## దామోదర గుప్తుడు

కాశ్మీర కవి ఇతడు జయాపీడుని (కీ.శ. 8వ శ॥ ఉత్తరార్ధం) మంత్రి. ఇతని కృతి 'కుట్టినీమతం'. వేశ్యయొక్క విద్యలు నేర్పులు చెప్పబడినవి. కవి అలంకార కామశాస్త్రాల పాండిత్యాన్ని ప్రదర్శించాడు. కవికి శబ్దపాండిత్యం బాగావున్నది. కల్హణుని వంటివారు దామోదరున్ని కవిగా పేర్కొన్నారు. ఆధునికులు దీన్ని అశ్లీలగ్రంథంగా భావించారు.

## భల్లట కవి

భల్లట కవి కాశ్మీర దేశీయుడు. శంకరవర్మ (క్రీ.శ. 883-902) ఆస్థానంలో వున్నాడు. ఆతని కృతి భల్లట శతకం. దీనిలో 100 శ్లోకాలున్నవి. దీనిలో శృంగారం ప్రధానంగా లేదు. నీతి, ధర్మబోధలను కూడ కవి చేశాడు. ఇందులో నీతి పద్యాల సంఖ్య ఎక్కువగా వున్నది. అయినా కవి శృంగార చిత్రణను చాల భవ్యంగా చేసాడు. ఒక్క వృత్తాన్నే ప్రయోగింపక కవి వివిధ వృత్తాలను ప్రయోగించాడు. ఇతని అనేక శ్లోకాలను

మమ్మట, ఆనందవర్ధన అభినవగుప్తులు తమ ఆలంకార శాస్త్రాలల్లో ఉద్ధరించారు. క్రీ.శ. 850 నాటికే భల్లటశతకం వ్యాప్తిలో వున్నదని తెలుస్తున్నది. భల్లటుడు క్రీ.శ. 750 ప్రాంతం వాడై వుంటాడు. రాజతరంగిణికారుడు భల్లటుని పేర్కొన్నాడు.

భల్లటుని శ్లోకాలు అనేకం సుభాషితగ్రంథాలల్లో చేర్చబడటమేకాక మమ్మట విశ్వనాథ. జగన్నాథాది ఆలంకారికులు భల్లటుని కవిత్వం ధ్వన్యాత్మకమై శ్రేష్టమైందిగా గుర్తించారు. ఇతని కవిత్వంలోని అన్యోక్తులు అపూర్వమైనవి. భల్లటుని కవిత్వం ప్రసాదమాధుర్య గుణాలతో కూడి వైదర్భీరీతిలో నడిచింది. అలంకారాల సౌందర్యాన్ని కూడ చూడవచ్చును. మమ్మటుడు తన అలంకార ప్రకరణంలో ఉదాహరణలుగా భల్లటుని శ్లోకాల నెన్నిటినో ఇచ్చాడు. భల్లటుడు సంస్కృత సాహిత్యంలో కాళిదాస, భారవి, మాఘ, చోర, భవభూతి, మురారి, శ్రీహర్ష, దండి. సుబంధు బాణాది కవుల కోవకు చేరిన కవిగా ప్రశంసింపబడినాడు -

మాఘశ్చోరోమయూరో మురరిపు రపరోభారవిః సారవిద్యః
శ్రీహర్షః కాళిదాసః కవిరథ భవభూత్యాదయో భోజరాజః

శ్రీదండీ డిండిమాఖ్యః శ్రుతిముకుటగురుర్భల్లటో భట్ట బాణః
ఖ్యాతాశ్చాన్యేసుబంధ్వాదయ ఇహకృతిభిర్విశ్వమాహ్లాదయంతి.

భల్లటుడు ఏ విషయాన్నైనా సూటిగా హత్తుకొనేటట్లు చెప్తాడు. అన్యోక్తులతో అతడు చేసే నైతికబోధ పాఠకుల హృదయాలల్లోకి చొచ్చుకొని పోతుంది. అందుకే అతని కావ్యం లోకప్రియమైంది. అప్రస్తుతప్రశంసతో కూడిన ఒక శ్లోకం -

పరార్థేయః పీడామనుభవతి భంగేऽపి మధురో
యదీయో సర్వేషామిహ ఖలు వికారోऽప్యభిమతః
న సంప్రాప్తో వృద్ధింయదిస భృశమక్షేత్రపతితః
కిమిక్షోర్దోషోऽయం న పునరగుణాయామరుభువః

విరహతప్త అయిన ఒక నాయిక దామినిని ఇట్లా నిందిస్తుంది-

వాతావాంతు కదంబరేణువహలా నృత్యంతు సర్పద్విషః
సోత్సాహ నవతోయదానగురవో ముంచంతు నాదం ఘనాః

మగ్నాం కాంతవియోగదుఃఖదహనే మాం వీక్ష్యదీనానామ్
విద్యుత్ భో స్ఫురసి త్వమప్యకరుణే స్త్రీ త్వేపితుల్యే సతి.

"వాయు, మయూర, మేఘాలు పుల్లింగాలు కాబట్టి నిర్దయతోనన్ను బాధపెడ్తున్నవి. పురుషులు చివరకు పురుషులే కదా! ఓ దామినీ! నీవు స్త్రీవై వుండి ఎందుకింత నిర్దయురాలవైనావో ఆశ్చర్యంగా వున్నది."

## ఆనందవర్ధనుడు

ప్రసిద్ధ ఆలంకారికుడు. క్రీ.శ. 850 ప్రాంతం ఇతని కాలం. ఆనందవర్ధనుడు దేవీశతకాన్ని వ్రాసాడు. దీనిలో 100 శ్లోకాలున్నవి. దీనిలో దేవీస్తుతి వున్నది. శబ్దాలంకారాలతో శ్రవణసుభగంగా వున్నది.

## రత్నాకరుడు

క్రీ.శ. 850-894 ప్రాంతంవాడు 'హరవిజయ' మహాకావ్యకర్త. పండితుడు. ఇతడు "వక్రోక్తిపంచాశిక" అనే ముక్తకకావ్యాన్ని వ్రాసాడు. దీనిలో 50 శ్లోకాలున్నవి.

## ఉత్పలదేవుడు

అభినవగుప్తుని గురువు క్రీ.శ. 925 ప్రాంతంవాడు. పండితుడు. శివుని స్తుతిస్తు "స్తోత్రావళి"ని రచించాడు. దీనిలో 21 స్తోత్రాలున్నవి. ఇవి ఆలంకారిక శైలిలో వున్నవి. శివుని అనుపమ సౌందర్యం, అనంతగుణాలు దీనిలో స్తుతింపబడినవి.

## శీలాభట్టారిక

కాశ్మీరదేవపు కవయిత్రి. రాజశేఖరుడు శీలాభట్టారిక కవిత్వాన్ని ఉత్తమమైందిగా పేర్కొన్నాడు. కవయిత్రుల కవితానైపుణ్యాన్ని నిష్పక్షపాతంగా రాజశేఖరుడు గుర్తించినట్లు మరెవ్వరూ గుర్తించలేదు. మిహిరభోజరాజు రాజశేఖరునికి సమకాలికుడు. ఈ భోజరాజుతో ఈమెకు ప్రణయసంబంధమున్నట్లు తెలుస్తున్నది. కాబట్టి ఆమె సమయం క్రీ.శ. 9వ శమని చెప్పవచ్చును. ఈమె ప్రతిభావంతురాలైన కవయిత్రి. క్రీ.శ. 1363 ప్రాంతంవాడైన శారఙ్గధరుడు తన శారఙ్గధరపద్ధతిలో శీలాభట్టారిక పరిచయాన్ని ఇట్లా ఇచ్చాడు -

శబ్దార్థయోః సమోగుంఫః పాంచాలీరీతి రిష్యతే
శీలాభట్టారికా వాచి బాణోక్తిషు చ సా యది.

దీన్నిబట్టి శీలాభట్టారికది పాంచాలీ రీతిలో నడచిన చక్కని శబ్దార్థగుంఫనతో కూడిన కవిత్వమని తెలుస్తున్నది. శీలాభట్టారిక వ్రాసిన కావ్యమేది మనకు లభ్యం కాలేదు. ఎంతోమంది కవయిత్రుల పేర్లు మనకు తెలుస్తున్నవి. వారి కవిత్వాలను ఆలంకారికాదులు ప్రశంసించి కూడ వున్నారు. అయినా వారు వ్రాసిన మహాకావ్య, లఘుకావ్యాలేవి మనవరకు రాలేదు. సరియైన ఆదరణ, వ్యాప్తి లేకపోవటం చేత కవయిత్రుల కృతులు నశించి వుంటవి. ఉదాహరణ శ్లోకాలను బట్టి శీలాభట్టారిక ముక్తకకావ్యాన్ని రచించినట్లుగా తెలుస్తున్నది. మమ్మటుడు శీలాభట్టారిక కింది శ్లోకాన్ని ఉత్తమ కావ్యోదాహరణగా ఇచ్చాడు -

యః కౌమారహరః స ఏవ హి వరస్తా ఏవ చైత్రక్షపాః
తే చోన్మీలితమాలతీ సురభయః ప్రౌఢాః కదంబానిలాః
సాచైవాస్మి తథాపి తత్ర సురతవ్యాపార లీలావిధౌ
రేవా రోధసి వేతసీ తరుతలే చేతః సముత్కంఠతే.

ఈ కవయిత్రిది మరొక లబ్ధశ్లోకం -

దూతి! త్వంతరుణీయువాసచపలః శ్యామాస్తమోభిర్దిశః
సందేశశ్చ సరహస్య ఏష విపినో సంకేతకా వాసకః
భూయోభూయ ఇమే వసంత మరుతశ్చేతో నయంత్యన్యథా
గచ్ఛ క్షేమసమాగమాయ నిపుణం రక్షంతుతే దేవతాః

"నాయిక నాయకుని దగ్గరికి దూతిని పంపాలి. కాని దూతి కూడ యువతి, నాయకుడు యువకుడు, చంచలుడు సంకేత స్థలంలో నాయకుడు ప్రతీక్షిస్తున్నాడు. దూతితో పంపిన సందేశం రహస్యమైంది. కామవర్ధకమైన వసంత వాయువులు వీస్తున్నవి. అంతటా చీకటి. ఈ సమయంలో దూతిని పంపిన పరిణామం ఏమవుతుందో తెలియదు. కాని సందేశం తప్పక పంపవలసి వున్నది. ఇప్పుడేమి చేయాలి అని ఆలోచిస్తు చివరకు దూతిని పిలిచి నా హితం కొరకు నీవు పోవలసివున్నది. దేవతలు నిన్ను రక్షింతురు గాక! అని నాయిక అంటున్నది." దీనిలో నాయిక అంతరంగ తర్కవితర్కాన్ని కవయిత్రి చక్కగా చిత్రించింది. ఈమె కవిత్వం ధారాశుద్ధి కలిగి సంగీత గుణాన్ని కలిగివున్నది.

## యామునాచార్యుడు

యామునాచార్యులు వైష్ణవాచార్యుడు. రామానుజుని గురువు. ఇతని కాలం క్రీ.శ. 10వ శ॥ ఇతడు " ఆళ్వాందారస్తోత్రా" న్ని వ్రాసాడు. భక్తి భావాలు చక్కగా అభివ్యక్తీకరింప బడినవి. ఈ స్తోత్రం ఉత్తమమైన కవిత్వ సంపదతో కూడింది. ఇదే గాక " చతుః శ్లోకీ, స్తోత్రరత్నాలు" కూడ అతని రచనలే అని అంటారు.

## అభినవగుప్తుడు

అభినవగుప్తుడు క్రీ.శ. 10వ శ॥ వాడు. ధ్వన్యాలోకానికి లోచనమనే వ్యాఖ్యానాన్ని వ్రాసిన ప్రసిద్ధ ఆలంకారికుడు. "ప్రత్యభిజ్ఞా వృహతీవృత్తి" అనే శైవ దర్శన గ్రంథాన్ని వ్రాసాడు. గొప్ప దార్శినికుడు. నాట్యశాస్త్రానికి ఇతడు అభినవ భారతి అనే వ్యాఖ్యానాన్ని వ్రాసాడు. క్షేమేంద్రుడు ఇతని శిష్యుడు. మమ్మటునికి సాహిత్య గురువుకూడ. అభినవ గుప్తుడు "భైరవస్తోత్ర" మనే స్తోత్రకావ్యాన్ని కూడ రచించాడు.

## రామానుజాచార్యుడు

ప్రసిద్ధ వైష్ణవాచార్యుడు, విశిష్టాద్వైత సిద్ధాంతాలను స్థాపించినవాడు. ఇతడు 'గద్యత్రయ' మనే మూడు నీతి కావ్యాలను వ్రాసాడు, అవి - శరణాగత గద్యం, వైకుంఠ గద్యం, శ్రీరంగ గద్యం. ఇవి భక్తిభావ పూర్ణమైనవి. క్రీ.శ. 1017-1125 ప్రాంతం వాడు.

## శ్రీవత్సాంకుడు

రామానుజుని సమకాలికుడు, శిష్యుడు. "పంచస్తవ" మనే పేరుతో ఐదు స్తోత్రకావ్యాలను వ్రాసాడు. ఇతని కుమారుడు పారాశరభట్టు "శ్రీరంగ రాజస్తవం" "శ్రీగుణరత్నకోశ" మనే స్తోత్ర కావ్యాలను వ్రాసాడు.

## చౌరపంచాశిక

### చౌరపంచాశిక కర్తృత్వం

విక్రమాంకదేవ చరిత్రము వ్రాసిన బిల్హణుడు (క్రీ.శ. 11 ఉత్తరార్ధం) చౌరపంచాశిక కర్త అని చెప్పబడుతున్నది. బిల్హణుడు పాంచాల రాజకుమారికి గురువుగా నియమింపబడి

ఆమెను ప్రేమించాడని రాజు ఈ ప్రణయాన్ని తెలుసుకొని కవికి మృత్యుదండనను విధించాడని అప్పుడు కారాగారంలో బిల్హణుడు తన గుప్తప్రణయాన్ని చివరిసారిగా స్మరిస్తూ శ్లోకాలను వ్రాసాడని అవే చౌరపంచాశిక పేరుతో ప్రసిద్ధమైనవని లోకంలో ఐతిహ్యం ప్రచారంలో వున్నది. ఈ శ్లోకాలను విని రాజు హృదయం కరగి రాజకుమారిని బిల్హణునికిచ్చి వివాహం చేసాడని అంటారు. కాశ్మీర ప్రతుల్లో రాజకుమారి పేరు చంద్రలేఖ అని పేర్కొనబడింది. ఆమె అందులో మహిళపట్టణరాజు కూతరు. దక్షిణ దేశ ప్రతుల్లో రాకుమారి పేరు యామినీపూర్ణ తిలక అని వున్నది. ఇటువంటి ప్రేమకథ చౌరసుందర కవిని గూర్చి కూడ వ్యాప్తిలో వున్నది. చౌరపంచాశిక బెంగాళీ అనువాద గ్రంథంలో మరియు కొన్ని లిఖిత ప్రతుల్లో చౌరపంచాశిక సుందరకవి కృతిగానే పేర్కొనబడింది. రామతర్క వాగీశుడనేవాడు (క్రీ.శ. 1798 ప్రాంతం) దీనికి టీకను వ్రాస్తు సుందరకవిని గూర్చి ఇట్లా చెప్పాడు - సుందరకవి చౌరపల్లి రాజ కుమారుడు. వీరసింహరాజు కూతురు విద్యతో అతడు రహస్య ప్రేమను నడిపాడు. అప్పుడు రాజుకు తెలిసి మృత్యుదండనను విధించాడు. మృత్యువు కొరకు ఎదురుచూస్తూ సుందరకవి ఈ పంచాశిక శ్లోకాలను రచించాడు. వీటిని విని రాజు హృదయం మార్చుకొని కూతురు వివాహం చేసాడు.

కొందరు విమర్శకులు బిల్హణుడు, చౌరకవి ఇద్దరు ఒక వ్యక్తే అని భావించారు. కాని క్రీ.శ. 15 శతాబ్దం వాడైన తెలుగుకవి జక్కన తన విక్రమార్కచరిత్రలో బిల్హణ. చౌరకవులను భిన్నంగానే ప్రస్తుతించి వున్నాడు. బిల్హణుడు విక్రమాంక దేవచరిత్ర 18వ సర్గలో తన జీవితచరిత్రను చెప్పుకొన్నాడు. అందులో ఎక్కడా అతని గుప్తప్రేమ. మృత్యుదండన ప్రసక్తులు సూచన మాత్రంగా కూడ లేవు. కాబట్టి బ్యూలర్, కీథ్‌లు ఈ కథను విశ్వసించలేదు. దీనిలో చారిత్రక తథ్యం లేదని నిరాకరించారు. ఒకవేళ బిల్హణుని స్వీయానుభూతులు ఈ కావ్యంలో చెప్పబడినట్లయితే స్వీయానుభూతులతో కూడిన కవిత్వంలో వుండే మర్మభేదిత్వగుణం,సూక్ష్మమనోభావ చిత్రణలు దీనిలో లేవని వారు అభిప్రాయపడినారు. దుర్గాశంకర్ వంటి విమర్శకులు చౌరపంచాశిక బిల్హణుని రచన కాదని చౌరకవి రచనే అని తేల్చారు. "బిల్హణచరిత్ర" అన్న పద్యకావ్యంలో బిల్హణుని ప్రేమకథ చెప్పబడింది. కాని ఈ కావ్యం చాల తర్వాత రచన. అది బిల్హణుని గూర్చి లోకంలో వ్యాప్తిలో వున్న కథల ఆధారంగా వ్రాయబడిందే.

"చౌరుపంచాశిక" అంటే "చౌరుని యాభై శ్లోకాలు" అని అర్థం. చోరుడనే కవిని జయదేవుడు కూడ పేర్కొన్నాడు చోరకవి విరచిత శ్లోకాలు కాబట్టి వీటికి "చౌరపంచాశిక"

అన్న పేరు కలిగిందని సాహిత్య విమర్శకులు తలంచారు. ఇదే సమంజసమైంది. కవి తాను రహస్యంగా రాజకుమారితో గడిపిన ఘట్టాలను వర్ణించటం చేత దీనికి " చౌర సురత పంచాశిక'' అన్న పేరు తగినట్లుగా వుంటుందని కీథ్ అభిప్రాయం.

## చౌరపంచాశికలో శ్లోక సంఖ్య

చౌరపంచాశిక శ్లోకాలు చాల ప్రచారంలో వున్నవి. దీనిలోని రమ్యమైన, సరళబోధకమైన శైలి వస్తువులచేత ఈ కావ్యం చాల లోకప్రియమైంది. అందుకేనేమో చౌరపంచాశిక లిఖిత పాఠప్రతులు అనేకం అభిస్తున్నవి. పాఠప్రతుల్లోని శ్లోకాల సంఖ్య కూడ చాల భేదిస్తున్నది. అంటె ప్రక్షిప్తశ్లోకాలు ఎన్నో కాలక్రమంగా దీనిలో చేరినవి. అన్ని ప్రతుల్లోని శోకాలను పరిశీలిస్తే ఏడు శ్లోకాలు మాత్రమే సమానంగా వున్నవట! కాశ్మీర, దక్షిణ దేశ ప్రతులను మాత్రమే గ్రహిస్తే 34 శ్లోకాలు సమానంగా వున్నవి. మిగిలిన 16 శ్లోకాలు భిన్నంగా వున్నవి. ఇన్ని ప్రక్షిప్తాలతో కూడిన ఈ ప్రతులే ఈ కావ్యవ్యాప్తిని, లోక ప్రియత్వాన్ని చాటుతున్నవని వింటర్‌నిట్జ్ అంటాడు.

## చౌరపంచాశిక కవిత్వం

చౌరపాంచాశిక కావ్యం వైదర్భీశైలిలో కూర్చబడింది. భావం, భాష, శైలి ఈ మూడింటి రమ్యసమావేశాన్ని ఈ కావ్యంలో మనం చూడవచ్చును. ప్రతి శ్లోకం "అద్యాపి' ' అన్న పదంతో ఆరంభమౌతుంది. ప్రతి శ్లోకంలోని భావం సున్నితంగా, సహజ స్నిగ్ధతతో కూడి వున్నది. కాళిదాసు మేఘసందేశాన్ని కవి అనుకరించటానికి ప్రయత్నించినట్లు కన్పిస్తున్నది. తాడపత్రీకర్ చౌరపంచాశిక భూమికలో ఆ కావ్యం మేఘసందేశంకన్న "vivid and Romantic" అని తెలిపాడు. మేఘ సందేశంలోకన్న దీనిలో ఎక్కువ శృంగారమున్నది. ఇందులో కవి శృంగారాన్ని ఎటువంటి మర్యాద అనే అడ్డులు లేకుండ వర్ణించాడు. బట్టబయలైన సుకుమార శృంగార వర్ణనలు సుందరశైలి వల్లనే కావ్యత్వాన్ని సంపాదించుకొని లోకప్రియమైనవి. మేఘసందేశంలో వలెనే దీనిలో విప్రలంభశృంగారం పోషింపబడింది. కాని మేఘసందేశంలో వున్న ఉదాత్తత, గంభీరతలు దీనిలో లేవని కొందరి అభిప్రాయం. మేఘసందేశంలోని మానవ, ప్రకృతి సజీవ చిత్రణలు దీనిలో లేవు. దీనిలోని ప్రణయ చిత్రణ సామాన్య జనాకర్షకంగా వున్నది. ముఖ్యంగా వసంతతిలక వృత్తంలో వ్రాయబడిన శ్లోకాలల్లో ప్రణయ చిత్రణ చక్కగా వున్నదని కీథ్ అభిప్రాయం. కవి కామశాస్త్రంలో తనకున్న ప్రవేశాన్ని బాగా ప్రకటించాడు. నఖశిఖపర్యంత వర్ణన, వివిధ సురతవర్ణనలు కవి

కామశాస్త్ర కుశలతను చాటుతున్నవి. భావాల, శబ్దాల పునరావృత్తి అక్కడక్కడా వున్నదంటె అది ప్రక్షిప్త శ్లోకాలవల్లనే. మొత్తం మీద ఈ కావ్యం పాఠకులకు హృదయోల్లాసాన్ని కలిగించకమానదు. కవి సహజ రమ్యమైన వర్ణనలకు ఉదాహరణలు-

అద్యాపి తాంస్తిమితవస్త్ర మివాంగ లగ్నామ్
ప్రౌఢ ప్రతాప మదనానల తప్త దేహామ్
బాలామనాథశరణా మనుకంపనీయామ్
ప్రాణాధికాం క్షణమహం నహి విస్మరామి.

ఈ రోజు కూడ ప్రాణాధికమైన నాప్రియురాలిని, కామాగ్ని సంతప్త అయి తడసిన వస్త్రంలాగ నా శరీరాంగాలను కౌగిలించుకొన్న దానిని ఒక క్షణం కూడ మరువలేకుండ వున్నాను. నానుంచి వేరుచేస్తే ఆమె అనాథశరణురాలు, దయనీయరాలు అవుతుంది".

అద్యాపి తామవహితాం మనసాచలేన
సంచింతయామి యువతీం మమ జీవితాశామ్
నాన్యోపభుక్తనవయౌవనభారసారాం
జన్మాంతరే z పి మమసైవ గతిర్యథాస్యాత్

"ఈ రోజుకూడ నా స్థిరహృదయంతో ఆ యువతిని గురించే ఆలోచిస్తున్నాను. ఆమె నా జీవితానికి ఆశ. ఆమె నవయౌవనసారాన్ని నేనుతప్ప ఎవరు ఆస్వాదించలేదు. మళ్ళీ జన్మలోకూడ ఆమె నాకు లభించాలని నేను ధ్యానిస్తున్నాను."

అక్కడక్కడ అశ్లీలమనిపించే భావాలున్నా మరణదండనకై ఎదురు చూస్తున్న వ్యక్తి గడచిపోయిన ప్రణయజీవితాన్ని, ప్రియురాలిని స్మరిస్తు సంకోచభావం లేకుండ చెప్పిన విషయాలు పాఠకహృదయాలను స్పర్శించి కదిలించేటట్లుగా వున్నవి. కరుణ విప్రలంభం దీనిలో ప్రధానరసం. పాఠకహృదయాలను ఆర్ద్రం చేయటానికి సమర్థనీయంగా వున్నది దీనిలోని కవిత్వం.

## క్షేమేంద్రుడు

క్షేమేంద్రుడు అభినవగుప్తుని శిష్యుడు. క్రీ.శ. 1050 ప్రాంతంవాడు. కవి, ఆలంకారికుడు. సమయమాతృక, కళావిలాసం, దర్పదళనం, చతుర్వర్గ సంగ్రహం,

సేవ్యసేవకోపదేశం, చారుచర్యక్షేమేంద్రుని లఘు కావ్యాలు, సమయమాతృక దామోదరగుప్తుని కుట్టనీమతాన్ని అనుకరిస్తున్నది. దీనిలో వేశ్యల మాయలు చెప్పబడినవి. మిగతా కావ్యాలల్లో నిత్యజీవితానికి అవసరమయ్యే కళలు, నీతి, ధర్మాలు, మంచి ప్రవర్తన మొదలైనవి బోధింపబడినవి. అక్కడక్కడ సందర్భానుకూలంగా పౌరాణికకథలు కూడ చెప్పబడినవి.

## కవి శంభు

శంభు కాశ్మీరరాజు హర్షదేవుని (క్రీ.శ. 1089-1101) ఆస్థానకవి. ఇతడు "రాజేంద్ర కర్ణపూర" మనే చారిత్రక కావ్యాన్ని రచించాడు. ఇతని లఘుకృతి అన్యోక్తిముక్తాలత. దీనిలో 108 శోకాలున్నవి.

## మురళ

ఈ కవయిత్రి శ్లోకాలు జల్హణుని (క్రీ.శ. 12వ శ॥) సూక్తి ముక్తావళిలో, శారఙ్గధర పద్ధతిలో (క్రీ.శ. 14వ శ॥) ఇయ్యబడినవి రెండు లభిస్తున్నవి. ఒక శ్లోకంలో విరహం, మరొక శ్లోకంలో సమాగమం వర్ణింపబడినవి. ఈమెది సరళ సులభశైలి. వర్ణనలు స్వభావోక్తి మార్గంలో నడిచినవి. ఈమె ప్రసిద్ధ కవయిత్రిగా గోచరిస్తున్నది. ధనదదేవుడు పేర్కొన్న ప్రసిద్ధ కవయిత్రులల్లో ఈమె పేరు కూడ వున్నది -

శీలావిజ్ఞామారుళా మొరికా ద్యాః
కావ్యం కర్తుం సంతి విజ్ఞాఃస్త్రియో ్యపి
విద్యాం వేత్తుం వాదినో నిర్విజేతుం
దాతుం వక్తుం యః ప్రవీణః సవంద్యః

## మోరిక

ధనదదేవునిచేత స్తుతింపబడిన మరొక కవయిత్రి మోరిక. సూక్తిముక్తావళి, శారఙ్గధరపద్ధతి, సుభాషితావళిలో ఈమె శ్లోకాలున్నవి. శ్లోకాలన్నటిలో ఇతివృత్తం ప్రణయం. సహజ వర్ణనలో ఈమె మురళతో సాటిరాగలదు. ఈమె శైలి సరళసుందరం. ఈ ఇద్దరు కవయిత్రుల శ్లోకాలు జల్హణుని సూక్తిముక్తావళిలో వుండటం చేత వీరి కాలం క్రీ.శ. 1150 పూర్వమని చెప్పవచ్చును.

# బిల్వమంగళుడు

బిల్వమంగళునికి లీలాశుకుడని నామాంతరం. ఇతడు క్రీ.శ. 11వ శతాబ్దం వాడు. ఇతని కృతి శ్రీకృష్ణ కర్ణామృతం. దీనిలో 310 శ్లోకాలున్నవి. ఈ శ్లోకాలు కృష్ణభక్తిపూర్ణమైనవి. బాగా వ్యాప్తిలో వున్నవి. కొందరు శ్లోకాలను రోజు పారాయణం చేస్తుంటారు. ఎన్నో శ్లోకాలను అభినయం కొరకు కూడ ఉపయోగిస్తుంటారు. దీనిలోని కవిత్వం అతిమధురం సరసం. లీలాశుకుడే తర్వాత జయదేవుడుగా జన్మించాడని కథ వ్యాప్తిలో వున్నది. ఇతని కృతిలో శృంగారలీలకు ప్రాధాన్యం లేదు.

# గోవర్ధనాచార్యుడు

## గోవర్ధనుని పరిచయం

లక్ష్మణసేనుని (క్రీ.శ. 1116) మరొక ఆస్థాన కవి గోవర్ధనాచార్యుడు. ప్రాకృత గాథాసప్తశతిని అనుకరిస్తు ఈ కవి సంస్కృతంలో ఆర్యాసప్తశతిని రచించాడు. దీనిలో ఆర్యా ఛందస్సులో వ్రాసిన 700 శ్లోకాలున్నవి. ఇది ముక్తకకావ్యం. అకారాదివర్ణక్రమంలో శ్లోకాలు కూర్చబడినవి. ఈ శ్లోకాలు అతి సరళ మధుర సరస లలిత శైలిలో కూర్చబడి ముక్తకసాహిత్యంలో ప్రత్యేక స్థానాన్ని సంపాదించు కొన్నవి. ఆర్యాసప్తశతిని అనుకరిస్తు హిందీలో బిహారీలాల్ 'సత్‌సాయి'ని కూర్చాడు. అది హిందీలో ప్రశస్తమైన మధురకావ్యంగా నిలిచింది. ఈ హిందీకృతిని అనుకరిస్తు పరమానందుడు "శృంగారసప్తతిక" ను సంస్కృతంలో రచించాడు.

జయదేవుడు గీతగోవిందంలో ధోయి, గోవర్ధన కవులను ప్రశంసించి వున్నాడు-

శృంగారోత్తర సత్ప్రమేయ రచనైరాచార్య గోవర్ధన
స్పర్ధీకో ఽపి న విశ్రుతః శ్రుతిధరోధోయీ కవిక్ష్మాపతిః

ధోయీ కవి ఏకసంథాగ్రాహి అట. గోవర్ధనుడు శృంగార రసరచనలో సాటిలేనివాడు - అని జయదేవుని ప్రశంస. ధోయి గోవర్ధన జయదేవులు లక్ష్మణ సేనుని ఆస్థాన కవులని గయలో లభించిన ఈ కింది శాసన శ్లోకం వల్ల తెలుస్తున్నది-

గోవర్ధనశ్చ శరణో జయదేవ ఉమాపతిః
కవిరాజశ్చ రత్నాని సమితే లక్ష్మణస్యతు.

గోవర్ధనుడు శృంగార రచనలో అద్వితీయుడని జయదేవుడు పేర్కొనటంచేత జయదేవునికి ఈషత్పూర్వమే గోవర్ధనుడు కావ్యరచన చేసాడని తెలుస్తున్నది. గోవర్ధనుడు క్రీ.శ. 11వ శతాబ్దంవాడని వింటర్‌నిట్స్ అభిప్రాయం.

## గోవర్ధమని కవిత్వం

శృంగార ముక్తరచన గోవర్ధనుని వరకు ప్రాకృత భాషలోనే విరివిగా సాగుతుండేది. నిమ్నగామిని అయిన యమునను బలరాముడు గగనతలానికి చేర్చి నట్లుగా ప్రాకృతంలో వున్న రసమయవాణిని సంస్కృతంలో ప్రవేశపెట్టానని గోవర్ధనుడు కావ్యారంభంలో చెప్పుకొన్నాడు -

వాణీ ప్రాకృత సముచితరసా బలేనైవ సంస్కృతం నీతా
నిమ్నానురూప నీరా కళింద కన్యేవ గగనతలమ్.

గోవర్ధనుడు ఆర్యాసప్తశతి శ్లోకాలను వ్రాసి తన శిష్యులైన సోదరులిద్దరికి చెప్పాడట. ఆ శిష్యులు వాటిని తమ శిష్య పరంపర ద్వారా వ్యాప్తిని చేకూర్చారని ఈ కింది శ్లోకం చెప్తున్నది -

ఉదయన బలభద్రాభ్యాం సప్తశతీ శిష్య సోదరాభ్యాం మే
ద్యౌరివ రవిచంద్రాభ్యాం ప్రకాశితా నిర్మలీకృత్య.

గోవర్ధనుని ఆర్యావృత్తాలు కోమల పాదవిన్యాసంతో మందమందంగా నడిచేవి. సజ్జనుల హృదయాలను ఆధీనం చేసుకొంటవి. అవి మదనరూప బ్రహ్మజ్ఞానానికి ఉపనిషత్తుల వంటివి.

ఆర్యా సప్తశతిలో వివిధ నాయికానాయకుల వర్ణనలున్నవి. నాయికానాయకుల ప్రేమ, సంయోగవియోగ శృంగారాలు నాయిక మానం, ఈర్ష్య అసూయలు, నాయకుని సాంత్వనలు ఇందలి కవితా వస్తువులు. కవి నాతిమాత్రంగా అలంకారాలను ప్రయోగిస్తు రసవంతంగా రచించాడు. కవి రసవాదిగా కన్పిస్తాడు -

రతిరీతి వీతవసనా ప్రియేవ శుద్ధాపి వాఙ్మదే సరసా
అరసా సాలంకృతి రపి న రోచతే శాలభంజీవ

"సురతవేళలో వస్త్రవిహీనురాలైన, నాయకుని ప్రతి అనన్య రతిభావం గల ప్రియురాలు వలె అలంకార రహితమైన సరసవాణి ఆనందప్రదంగా వుంటుంది. అలంకారాలతో కూడిన రసశూన్యమైన వాణి అలంకారాలతో నిండిన శాలభంజిక వలె రుచించదు". గోవర్ధనుడు అక్కడక్కడ ఉపమ, ఉత్ప్రేక్ష, అనుప్రాసాద్యలం కారాలను సహజ సుందరంగా ప్రయోగించాడు. కాని అనుప్రాసాద్యలంకారాల సమావేశంచేత కావ్యం సహృదయ హృదయాలను రసనిమగ్నం చేయలేదని అతడు అంటాడు. అతడు అలంకారవాదిగా కనిపించడు. అయినా గోవర్ధనుడు ఎన్నో సరళ మనోజ్ఞమైన ఉపమానాలను ప్రయోగించి పాఠకుల హృదయాలను అలంకారమనే స్పృహ కలిగించకుండానే పులకింపజేస్తాడు. అన్యోక్తి అలంకారమన్న అతనికి ప్రీతి, అన్యోక్తులచేత అతని కవిత్వం వ్యంగ్యార్థ వైభవంతో కూడింది.

గోవర్ధనాచార్యుని కవిత్వంలో అతని సూక్ష్మ పరిశీలనా శక్తి, లోకజ్ఞానం, శాస్త్రపరిచయాలు చక్కగా ప్రతిబింబించి కన్పిస్తున్నవి. గోవర్ధనుడు తక్కువ శబ్దాలల్లో ఎక్కువ విషయాన్ని చెప్పటంలో అతి సమర్థుడు. అందుకే రెండు పాదాలు గల ఒక్కొక్క ఆర్యా సప్తశతిని ఒక్కొక్క కావ్యఖండంగా రచించగలిగాడు. ఒకచోట ముగ్ధా స్వకీయనాయికను కవి ఇట్లా వర్ణించాడు -

అతులిత సకలవిభూషాం ప్రాతర్బాలాం విలోక్యముదితాం ప్రాక్
ప్రియశిరసి వీక్ష్యయావకమథ నిశ్వసితం సపత్నీభిః

"ప్రాతఃకాలంలో అస్తవ్యస్తం కాని బాలయొక్క ఆభరణాలను చూచి సవతులు సంతసిల్లారుకాని ప్రియుని తలమీద వున్న లాక్షారసముద్రలను చూచి నిశ్వసించారు." ఎన్నో రమణీయ వ్యంగ్యార్థాలతో కూడినవి ఆర్యాసప్తశతిలోని శ్లోకాలు. గోవర్ధనుని తర్వాత ఆనందవర్ధనుడు వున్నట్లయితే తప్పక వివిధ ధ్వనులకు ఉదాహరణలుగా ఆర్యాసప్తశతి శ్లోకాలను గ్రహించివుండేవాడు. గోవర్ధనునికి ప్రాకృతభాషలో మంచి ప్రవేశమున్నదని ఊహచేయవచ్చును. కావ్యారంభంలో గుణాఢ్యుని ప్రత్యేకంగా వ్యాసుని అంతటివాడని ఒక శ్లోకంలో ప్రశంసించాడు. మరొక శ్లోకంలో వ్యాసవాల్మీకులతో చేర్చి గుణాఢ్యుని గోవర్ధనుడు ప్రస్తుతించాడు. అంతేగాక "ప్రాకృత సముచిత రసా" అయిన వాణిని సంస్కృతంలోకి తెచ్చిన వాడు అతడు. అటువంటప్పుడు అతనికి ప్రాకృతభాషలోని రసభావ పద్ధతులన్నీ పట్టుబడివుంటవి. ప్రకృతిజనుల సహజానుభూతులను, భావావేశాలకు తగినది ప్రాకృతభాష.

మానవస్వానుభూతులతో కూడిన ఆ భాషలోని భావాలు సామాన్య పాఠకులను విశేషంగా ఆకర్షించగలుగుతవి. అటువంటి భావరసాల పద్ధతిని గోవర్ధనుడు సంస్కృతంలో ప్రవేశపెట్టాడు. అంతకుముందే గాథాసప్తశతి పద్ధతిలో అమరుకశతకాదులు వ్రాయబడినవి. కాని ఆర్యాసప్తశతిలో సరళసౌందర్యం అధికంగా వున్నదని చెప్పవచ్చును. ప్రాకృతభాషలోని భావసరళత, సుకుమార సరసత్వాలు గోవర్ధనునికి బాగా పట్టువడినవి. అందుకే శ్లోకసంఖ్య, నామాసామాన్యాలను బట్టేకాక భావసారళ్యం, భావ సరసత్వాల విషయాలల్లోను ఆర్యాసప్తశతి గాథా సప్తశతికి దగ్గరగా వున్నది.

వృద్ధపతి గల స్త్రీ ఒకతె ఖిన్నురాలై వుండటం చూచి సఖి ఆమెతో ఇట్లా అంటున్నది -

ఊఢామునాతి వాహేయ పృష్ఠేలగ్నాపి కాలమచలాపి
సర్వంసహే కఠోరత్వచః కిమంకేన కమఠస్య.

"ఓ సర్వంసహే! (సర్వం సహించేదానా!) వసుమతీ! నీవు ఈ కమఠంచేత భరింపబడుతున్నావు. నీవు అచలవు. కఠోరచర్మంగల ఈ కమఠాంకం వల్ల నీకు ఏమి ఫలం లభిస్తుంది?" ఇటువంటి అన్యోక్తులు ఆర్యాసప్తశతిలో చాలా వున్నవి. దీని ద్వారా వ్యంగ్యార్థం పోషింపబడి కావ్యం మళ్ళామళ్ళా పఠనయోగ్యమౌతున్నది.

ఒక సఖి ఆమె సఖులు ఎంత చెప్పినా ప్రియుని సమీపించలేదు. సఖులు విసిగిపోయి వెళ్ళిపోయారు. అప్పుడు ప్రియుడామెను సమీపించాడు. అతనితో ఆమె ఇట్లా అంటున్నది -

అగృహీతానునయాం మాముపేక్ష్య సఖ్యోగతా బత్తైకాహమ్
ప్రసభం కరోషిమయి చేత్వదుపరి వపురద్య మోక్ష్యామి.

"నా సఖుల అనునయాన్ని నేను వినలేదు. వాళ్ళు నన్ను విడిచి వెళ్ళిపోయారు. నేనిప్పుడు ఒక్కతెను. ఒకవేళ నీవు నన్ను బలాత్కరించినట్లయితె నన్ను నేను నీకు అర్పించుకుంటాను." ఇది సూటిగా కన్పించే అర్థం. దీనికి అర్థాంతరం-" సఖులు నన్ను విడిచి వెళ్ళిపోయారు. ఇది సంతోష విషయం. నేను ఒక్కతెను. నన్ను బలాత్కరించవచ్చును. నేను నీమీదపడి సంభోగ సుఖాన్ని అనుభవించటానికి సిద్ధంగా వున్నాను." ఇటువంటి విపరీతార్థాలు, వ్యంగ్యోక్తులు కావ్యాన్ని సరసంచేసి ముక్తక కావ్యసాహిత్యంలో ఆర్యాసప్తశతికి ప్రత్యేక స్థానన్ని చ్చినవి.

# జయదేవుడు

## జయదేవుని పరిచయం

పవనదూత కర్త ధోయీకవికి ఆశ్రయదాత లక్ష్మణసేనుని (క్రీ.శ.1116 ప్రాంతం) ఆస్థానంలోనే జయదేవుడు వున్నాడు. ఈ కవి ప్రసిద్ధమైన గీత గోవిందమనే ముక్తక కావ్యాన్ని రచించాడు. ఇది రాధాకృష్ణుల భక్తి శృంగారాన్ని అపూర్వంగా చిత్రిస్తున్నది. ఇది సరసమైన, గానయోగ్యమైన మధుర గీతాలతో కూడిన కావ్యం, దీన్ని కవి సర్గలుగా విభజించాడు.

జయదేవుడు భోజదేవుని కొడుకు. బెంగాల్‌లోని వీరభూమి ప్రాంతంలో వున్న కిందుబిల్వమనే గ్రామంలో జన్మించాడు. జయదేవుని భార్య పద్మావతి. జయదేవుడు గొప్ప కృష్ణ భక్తుడని క్రీ.శ. 16 శ॥లో నాభాజీ వ్రాసిన "భక్తమాల" ను బట్టి తెలుస్తున్నది. జయదేవుడు యవ్వనంలో తిరుగుబోతుగా వుండేవాడు. ఒక బ్రాహ్మణుడు తన కూతురును జగన్నాథుని ఆదేశంతో బలవంతంగా అతనికిచ్చి వివాహం చేసాడు. ఇది జయదేవుని రెండవ వివాహం మొదటి భార్య మరణించటంతో ఖిన్నుడైన జయదేవుడు వివాహం చేసుకోక దేశాలను పట్టుక తిరుగసాగాడు. రెండవసారి గృహస్థుడైన తర్వాతనే జయదేవుడు గీతగోవిందాన్ని వ్రాసాడు. దీనిలో కవికి రాధ సౌందర్యవర్ణనలో స్వయంగా కృష్ణుడే తోడ్పడినాడని ఐతిహ్యం. భక్తమాలలో జయదేవుని భక్తి మహిమలు కొన్ని చెప్పబడినవి.

## గీతగోవిందం

జయదేవుడు తన కృతిని గీతగోవింద కావ్యంగా పేర్కొన్నాడు. గీత గోవిందం గీతి కావ్యానికి, రూపకానికి మధ్యమార్గంగా నడిచిందని పిశెల్, లెవీలు అభిప్రాయపడినారు. పిశెల్ అందుకే దీన్ని సంగీత రూపకం (Music drama) అని అన్నాడు. లాస్సెన్ దీనికి గీతరూపకం అని పేరు పెట్టాడు. ష్రాయిడర్ "Refined Jatra" అని అన్నాడు. Jatra అన్నది బెంగాల్‌లో ప్రచారంలో వున్న గ్రామ్యరూపకం. "సంస్కృత గ్రామ్య రూపక" మని గీత గోవిందానికి ష్రాయిడర్ పెట్టిన పేరు. గీత గోవిందంలోని గీతాలల్లో చాలా మట్టుకు ఎనిమిది పాదాలున్నవే వున్నవి. అందుకే దీనిలోని గీతాలకు ప్రసిద్ధంగా "అష్టపదు" లని పేరు. ఈ పదాలు రాగతాళయుక్తంగా పాడుతూ అభినయం చేయటానికి అనువుగా వున్నవి. కావ్యమని దీనికి కవి పేరు పెట్టినా కేవలం శ్రవ్యకావ్యం వ్రాయటం అతని ఉద్దేశం

కాదు. ఆ పదాలను పాడుతూ అభినయం చేయాలనే ఉద్దేశంతోనే అతడు అంత చక్కని భావాత్మకమైన, సంగీతాత్మకమైన పదాలను రచించాడు. కాబట్టి గీతగోవిందాన్ని "సంగీత రూపకం" అని అనటం సమంజసంగా వుంటుంది. అంటే పాశ్చాత్యుల Opera వంటిదని చెప్పవచ్చును.

## గీత గోవిందం మీద జాత్ర ప్రభావం

బెంగాల్ గ్రామ ప్రాంతాలల్లో జాత్ర (యాత్ర) అనే గ్రామ్య రూపక ప్రక్రియ బాగా వ్యాప్తిలో వున్నది. ఈ దేశిప్రక్రియలో సంభాషణలు, గానం, కథావర్ణన, అభినయం వుంటుంది. జయదేవుని గీతగోవింద రచన మీద ఈ ప్రక్రియ ప్రభావం వున్నదని కీథ్ మొదలైనవారు అభిప్రాయపడినారు. అంతేగాక బెంగాల్‌లో కృష్ణభక్తులు కృష్ణుని రాసక్రీడలను, మహిమలను గానం చేస్తు నృత్యం చేసే ఆచారముండేది. ఆ సంప్రదాయ ప్రభావం గీతగోవిందం మీద అధికంగా వున్నదని చెప్పాలి. కవి స్వయంగా కృష్ణభక్తుడు కాబట్టి భక్తి పరవశుడై గీతాలను వ్రాసివుంటాడు. అందుకే గీతగోవిందంలో గాఢ భావానుభూతులు కన్పిస్తవి తీవ్రమైన భక్తి భావోద్రేకానికి గురియై కవి ఈ పదాలను వ్రాయగలిగాడు. అందుకే ఈ పదాలు దివ్యంగా వున్నవి. అక్కడక్కడ గీతగోవిందం గానయోగ్యమైన పదాలు, సంభాషణలు, కథావర్ణనంతో గద్యపద్యమయమై రూపక పద్ధతిలోనే నడిచింది.

## గీత గోవిందంలోని వస్తువు - కవిత్వం

గీత గోవిందంలోని వస్తువు రాధాకృష్ణుల ప్రేమ. వారి ప్రేమ భవ్యంగా చిత్రింపబడింది. ప్రణయిని రాధ ప్రేమ విరహాలు సుందరంగా వర్ణింపబడినవి. రాధ వివిధ నాయికా రూపాలను ధరించి గీతగోవిదంలో దర్శనమిస్తుంది. రాధ కృష్ణుని మీద కోపాన్ని ప్రకటించినా అతడు కన్పించగానే ప్రేమోత్కంఠను ఆపుకోలేక పోతుంది. అతన్ని సమీపించబోతుంది కాని మానం ఆమెను వెనుకకు లాగుతుంది. కృష్ణుడు ఆమె ప్రేమను యాచిస్తు ఆమెను సాంత్వనపరుస్తాడు. తన కోరికను తీర్చమని కృష్ణుడు రాధను యాచిస్తాడు. రాధ ఎంతకు ఊరడిల్లదు. కృష్ణుడు వెళ్ళిపోయింతర్వాత విరహగీతాలు ఆలాపిస్తుంది. ఆమె సఖులు ఆమెను ఊరడిస్తు కృష్ణున్ని రమ్మని పిలుస్తారు. రాధాకృష్ణుల ప్రణయం, కోపం, విరహం, ప్రేమ యాచనలతో ఈ కావ్యం ఒక రూపకంగా సాగిపోతుంది. గీత గోవిందంలో నాయికానాయకుల శృంగారచిత్రణ వున్నది. దీనిలో ఎన్నో శృంగారం

అతిగా వర్ణింపబడిన చోటులు కూడ వున్నవి. దీనిలో శృంగారం విలాసమయంగా కన్పిస్తున్నది. లజ్జావిహీనమైన సురత క్రీడలు కూడా వర్ణింపబడినవి. కాని భక్తులకు ఇదంతా అలౌకికంగా, దివ్యంగా గోచరిస్తుంది. గీతగోవిందంలో అపారమైన అధ్యాత్మికార్థ సంపద వున్నదని అంటారు. దానిచేతనే దీనిలోని రాధా కృష్ణుల ప్రేమ అశ్లీలంకింద పరిగణింపబడటంలేదు. ఈ గీతాలు పూజాసమయాల్లో దేవాలయాలల్లో గానం చేయబడుతున్నవి. బెంగాల్‌లోనే కాక ఈ గీతాలు భారతదేశమంతటా అభిమానింపబడినవి. నాయకుడు కృష్ణుడు పరమాత్మ, నాయిక రాధ జీవాత్మ. పరమాత్మలో లీనం కావలెననే జీవాత్మ ఆతురత ఈ పదాలల్లో ప్రతీకాత్మకంగా చిత్రింపబడింది. రాధాకృష్ణుల కలయిక ఆత్మపరమాత్మల సంయోగంవలె గోచరించి అలౌకిక అనందాన్ని కలిగిస్తుంది. ధ్వనిరూపంగా చిత్రింపబడిన భక్తి సహృదయహృదయాలను హరించి దీన్నొక ఉత్తమ కావ్యంగా నిలుపుతున్నది. దీనిలో భాష, పదాలు మృదువైనవి. పూలవలె సుకుమారమైన, సరసమైన శబ్దాలు, భావాలు ఏర్చి కూర్చబడినవి. ప్రతిపదంలో శ్రుతి మాధుర్యమున్నది. మధురభక్తికి తగిన మధురశైలిలో కవి దీన్ని రచించాడు.

## గీతగోవిందానికి, వ్యాఖ్యానాలు - అనుకరణలు

గీతగోవిందం సరళసుబోధకమైనా దీనికి దాదాపు 35 వ్యాఖ్యానాలున్నవి. గీతగోవింద వ్యాఖ్యానకారుల్లో ఒకడైన ఉదయనుడు జయదేవుని శిష్యుడు. దీన్ని బట్టి జయదేవుని కాలంనాడే గీతగోవిందం బాగా వ్యాప్తిలోకి వచ్చిందని చెప్ప వచ్చును.

ఒరిస్సాలోని నీలాచలం రాజు కూడ ఒక గీతగోవిందాన్ని వ్రాసాడు. దాన్ని పండితులకు చూపించి వారి అభిప్రాయాన్ని అడిగాడట. వారు దాన్ని ప్రశంసించలేదు. అప్పుడు రాజు రెండు గీతగోవిందాలను జగన్నాథుని ముందుంచగా జగన్నాథుడు జయదేవుని గీతగోవిందాన్ని కంఠహారంగా గ్రహించి రాజు కావ్యాన్ని తోసిపుచ్చాడట- ఈ కథ భక్తిమాలలో చెప్పబడింది. ఈ కథను బట్టి ఎంతో మంది గీతగోవిందాన్ని అనుకరించారని వాటన్నిటిలో జయదేవుని కృతికే ఆదరణ లభించిందని తెలుస్తున్నది. తర్వాత కవులెందరో గీతగోవిందాన్ని ఆదర్శంగా తీసుకొని సీతారాముల, శివపార్వతుల ప్రణయాలను చిత్రించారు. హర్యాచార్యుని భావకీగీతం, సంగీత రఘునందనుని గీతగిరీశం. కళ్యాణుని గీత గంగాధరం, భానుదత్తుని గీతగౌరీశం, రామభట్టుని గీతగిరీశం, రూపగోస్వామి లలితమాధవం, ప్రభాకరుని గీతరాఘవం, వంశమణి గీతదిగంబరం, అజ్ఞాత కవిచే వ్రాయబడి జయదేవుని పేర ప్రచారంలో వున్న

రామగీత గోవిందం - మొ॥వి గీతగోవిందం అనుకరణలు. ఇట్లా గీతగోవిందానుకరణ కావ్యాలు 139 వరకున్నవని విమర్శక పండితులు గుర్తించారు. కాని జయదేవుని గీతగోవిందానికున్నంత ప్రచారం, వ్యాప్తి, ఆదరణలు వాటిల్లో దేనికి లభించలేదు. శ్రుతిమధురమైన కోమల పదావళికి గీతగోవిందం మంచి ఉదాహరణ -

లలితలవంగలతా పరిశీలన కోమల మలయ సమీరే
మధుకర నికర కరంబిత కోకిలకూజిత కుంజకుటీరే.

కృష్ణుని రాధావిరహం మధుర మనోహరంగా ఇట్లా వర్ణింపబడింది -

వహతి మలయ సమీరే మదన మపనిధాయ
స్ఫుటతి కుసుమనికరే విరహి హృదయదళనాయ
తవ విరహే వనమాలీ సఖి సీదతి
దహతి శిశిరమయూఖే మరణ మనుకరోతి
పతతి మదనవిశిఖే విలపతి వికల తరాzతి.....

## గీతగోవిదం అనువాదాలు

జయదేవుని గీతగోవిందం ఇతర భాషానువాదాలల్లో మూలమాధుర్యాన్ని, భావసౌకుమార్యాన్ని సంగ్రహించుకోలేదు. మూలసౌందర్యాన్ని అనువాదంలో తీసుకరావటం కష్టం. ఆధునిక కాలంలో విలియమ్ జోన్స్ దీన్ని ఇంగ్లీషులోకి అనువదించాడు. ఈ అనువాదం నిర్దుష్టంగా లేకున్నా దీన్ని జర్మన్ కవి గొయిటే చదివి అద్భుత చిత్తుడైనాడు. దాల్‌బెర్గ్, రుకెర్ట్‌లు గీతగోవిందాన్ని జర్మన్ భాషలోకి అనువదించారు. లాస్సన్ లాటిన్‌లోకి, అర్నాల్డ్ ఇంగ్లీషులోకి అనువదించారు. జయదేవుని జన్మస్థానమైన "కెందూలి" (కిందు బిల్వ) లో ప్రతియేట పౌష్య శుక్లసప్తమినాడు జయదేవుని పదాలను పాడటం, అభినయించటం జరుగుతుందట. అక్కడ అందమైన జయదేవుని సమాధి స్థలం కూడ వున్నదట. ఇంకా ఇప్పటి వరకు జనుల స్మృతిపథంలో వెలసిన జయదేవుడు ధన్యుడు.

## జయదేవుని ఇతర రచనలు

జయదేవుడు గీతగోవిందాన్ని కాక గంగాస్తుతిని వ్రాసాడంటారు. దీనిలోని శైలి మధురంగా వుండి అతని రచనగానే వున్నది. జయదేవుడు "రతిమంజరి"ని కూడ వ్రాసాడంటారు. కాని ఇది నమ్మదగిన విషయం కాదు. జయదేవుడే ప్రసన్నరాఘవం.

చంద్రాలోకం వ్రాసాడని కొందరు విమర్శకులు తలంచారు. కాని ఆ రెండు రచనలను వ్రాసిన జయదేవులిద్దరు ఈ జయదేవునికన్న భిన్న వ్యక్తులని ఇప్పుడు చాలా మంది విమర్శకులు అంగీకరించారు. కొందరు విమర్శకులు ప్రసన్న రాఘవం, చంద్రాలోకం వ్రాసిన జయదేవులు ఒక్కవ్యక్తే అని విశ్వసిస్తున్నారు. ఇదే సరైన అభిప్రాయం కావచ్చును. గీతగోవింద కర్త జయదేవుడు నాటకకారుడు జయదేవుడు భిన్న వ్యక్తులనటం స్పష్టం. గీతగోవింద కర్త జయదేవుడు భోజదేవుని కొడుకు. ప్రసన్న రాఘవ కర్త తాను మహాదేవుని కొడుకునని చెప్పుకున్నాడు. నాటకకర్త గొప్ప నైయాయికుడు. గీత గోవింద కర్త నైయాయికుడని ఎక్కడా చెప్పబడలేదు. అతడేమో కృష్ణ భక్తుడు. నాటకకర్త కృష్ణభక్తుడుగా కనిపించడు. ఈ ఆధారాలచేత నాటక కర్త జయదేవుడు గీతగోవిందకారుడు జయదేవుడు కాడనటం స్పష్టం.

## కల్హణుడు

రాజతరంగిణి కర్త కల్హణుడు (క్రీ.శ. 12వ శ॥) "అర్ధనారీశ్వరస్తోత్ర" మనే స్తోత్ర కావ్యాన్ని వ్రాసాడు. దీనిలో 18 శ్లోకాలున్నవి. శివుని అర్ధనారీశ్వర స్వరూపం దీనిలో స్తుతింపబడింది.

## సోమప్రభువు

సోమప్రభువు క్రీ.శ. 13వ శ॥ ఉత్తరార్థం వాడు. శృంగార వైరాగ్య తరంగిణి ఇతని కృతి. దీనిలో 46 శ్లోకాలున్నవి. కావ్యశైలిలో చక్కగా వ్రాయబడినవి. స్త్రీ వాసన, ప్రేమలను నిందించి వాటి నుంచి ఉన్ముఖులను చేయటానికి కవి ప్రయత్నించాడు.

## జల్హణుడు

జల్హణుడు క్రీ.శ. 12వ శ॥ ఉత్తరార్ధం, క్రీ.శ. 13వ శ॥ పూర్వార్ధంవాడు. కాశ్మీరంలోని రాజపురిరాజు సోమపాలుని చరిత్రను ఈ కవి "సోమపాలవిలాస" మనే కావ్యంగా రచించాడు. జల్హణుడు కాశ్మీరకవి. కాని ఇతడు దక్షిణభారత రాజా కృష్ణునికి మంత్రిగా ఉన్నాడు. కృష్ణుడు క్రీ.శ. 1247లో రాజయ్యాడు. జల్హణుని మరొక కృతి "సూక్తిముక్తావళి". దీనిలో వివిధ కవులు శ్లోకాలు కవితా వస్తువులనుబట్టి విభాగింపబడి కూర్చబడినవి. జల్హణుడు "ముగ్ధోపదేశ" మనే లఘుకావ్యాన్ని కూడ రచించాడు. దీనిలో 60 శ్లోకాలున్నవి. వేశ్యల మాయలు, మోసాలు దీనిలో చెప్పబడినవి.

## మధ్వాచార్యుడు

మధ్వాచార్యునికి (క్రీ.శ. 1199-1303) ఆనందతీర్థులని పేరు. ఇతడు ద్వైత సిద్ధాంతాన్ని స్థాపించిన ఆచార్యుడు. ఎన్నో సంస్కృతకృతులను రచించాడు. అతని కృతుల్లో 'ద్వాదశ స్తోత్రం' ప్రసిద్ధమైంది.

## జగద్ధరుడు

జగద్ధరుడు కాశ్మీర కవి. క్రీ.శ. 14వ శతాబ్దంవాడు. ఇతడు ప్రసిద్ధదార్శనికుడు. గొప్ప వైయాకరణుడు, మీమాంసకుడు, ఇతడు కుసుమాంజలి అనే స్తోత్ర కావ్యాన్ని వ్రాసాడు. దీనిలో 38 స్తోత్రాలు, 1425 శ్లోకాలున్నవి. దీనిలో శివుని స్తుతి ఉన్నది. ఇది శైవదర్శన రహస్యాలతో కూడి వున్నది. అయినా కావ్యమాధుర్యానికి లోటు రాలేదు. ఇది చాల ప్రసిద్ధమైన స్తుతి కావ్యం. దార్శనికరహస్యాలు, ఉత్తమ కవిత్వం, ఉచ్చకోటి భక్తి భావనలు - ఈ మూడింటి సమ్మేళనాన్ని దీనిలో చూడవచ్చును. కవి ఆత్మనివేదనం హృదయ స్ఫూర్తిగా జరిగింది. అక్కడక్కడ శ్లేష, యమక, అనుప్రాసాదులు ప్రయోగింపబడినవి.

## సిల్హణుడు

పేరునుబట్టి సిల్హణుడు కాశ్మీరకవి అని తెలుస్తున్నది. సిల్హణుడు భర్తృహరి వైరాగ్యశతకాన్ని ఆధారంగా గ్రహించి శాంతి శతకాన్ని వ్రాసాడు. దాన, ధర్మ, నీతి సంబంధవిషయాలు దీనిలో చెప్పబడినవి. భర్తృహరి శ్లోకాలను పోలివుండటంచేత కాబోలు సిల్హణుని కొన్ని శ్లోకాలు భర్తృహరిశతకంలోను చేరిపోయినవి. సిల్హణుని ఒక శ్లోకం హర్షదేవుని నాగానంద నాటకంలోను చేరింది. భర్తృహరి ఇష్టదైవం శివుడు కాగా సిల్హణుని ఇష్టదైవం విష్ణువు. శాంతి శతకం లిఖిత పాఠ ప్రతుల్లోని శ్లోకాలు చాల ప్రక్షిప్తాలతో విభిన్నంగా వున్నవి. వీటిల్లో ఏవి సిల్హణునివి కావో, నిర్ణయించటం కష్టం. సిల్హణుడు కాశ్మీరకవి అయినా బెంగాల్‌లో నివసిస్తూ కవిత్వాన్ని రచించాడు.

భర్తృహరి శతకాలను అనుకరిస్తు చాలా మంది కవులు ఇంకా శతకాలను వ్రాసారు. క్రీ.శ. 1434 ప్రాంతంవాడు **ధవదరాజు** భర్తృహరివలెనే శతకత్రయాన్ని రచించాడు. ఇతని కవిత్వం సరసంగా వున్నది. **జనార్దనభట్టు** భర్తృహరి శృంగార వైరాగ్య శతకాలను అనుకరిస్తు రెండు శతకాలను రచించాడు. **అప్పయ్య దీక్షితులు** (క్రీ.శ. 1600) కూడ

భర్తృహరి వైరాగ్య శతకంవంటి వైరాగ్య శతకాన్ని వ్రాసాడు. నరహరి అనే మరొక కవి భర్తృహరి శృంగార శతకాన్ని అనుకరిస్తు శృంగారశతకాన్ని రచించాడు. ఇతని కవిత్వం ప్రసాదమధుర గుణభరితమైంది. ఇతడు శ్రీహర్షుని పేర్కొనటంచేత క్రీ.శ. 12వ శతాబ్దం తర్వాతవాడని చెప్పవచ్చును.

## కుసుమదేవుడు

కుసుమ దేవుడు క్రీ.శ. 1400 ప్రాంతం వాడు. దృష్టాంత శతకం ఇతని కృతి. దీనిలో సామెతల వలె ఉపదేశం ఇయ్యబడింది. ప్రతి విషయానికి ఒక దృష్టాంతాన్ని చూపి కవి వివరించాడు. అందుకే దానికి దృష్టాంత శతకమని పేరు కలిగింది.

## నాగరాజు

నాగరాజు కాలం తెలియదు. భావ శతకం ఇతని కృతి. ఇది పొడుపు కథలవలె కూర్చబడింది.

## దక్షిణామూర్తి

ఇతని కృతి లోకోక్తి ముక్తావళి. ఇది కావ్యమాల సీరిజ్‌లో 11వ గుచ్ఛకంగా ప్రకాశితమైంది. దీనిలో కవి లోకోక్తులను పద్యబద్ధం చేసి నీతిని బోధించాడు.

## గుమానీ కవి

ఈ కవి ఉపదేశ శతకాన్ని రచించాడు. దీనిలో 100 శ్లోకాలున్నవి. ఇందులో సదాచరణ నీతిని గూర్చి ఉపదేశం ఇయ్యబడింది.

## ద్వాద్వివేది

ఈ కవి కాలం క్రీ.శ. 15వ శ॥ ఉత్తరార్ధం. ఇతని కృతి నీతిమంజరి. దీనిలో 200 శ్లోకాలున్నవి. అన్నీ నీతిని బోధించేవి. ప్రతి శ్లోకంలో కవి ఋగ్వేదం నుంచి ఉదాహరణలను తీసుకొని నీతి ఉపదేశం చేశాడు. సాయణభాష్యంలోని కథలను కవి తీసుకొన్నాడు. కొన్ని చోట్ల ఋగ్వేద మంత్రాలను కూడ వుట్టంకించాడు. ఇది ఒక కొత్త మార్గాన నడిచిన లఘు కృతి. బహుశ ఇది క్షేమేంద్రుని చారుచర్యను అనుసరించి చెప్పబడింది కావచ్చును.

చారుచర్యలో పౌరాణిక గాథల ఉదాహరణలతో నీతి ఉపదేశింపబడింది. నీతిమంజరిలో నీతి ఉపదేశానికి ఋగ్వేద కథలు గ్రహింపబడినవి.

## లక్ష్మణాచార్యుడు

లక్ష్మణాచార్యుని కాలం నిర్ణయించటం కష్టం. "చండీకుచ పంచాశిక" ఇతని కృతి. దీనిలో 50 శ్లోకాలల్లో చండీ స్తుతి చేయబడింది.

## తాళ్ళపాక అన్నమాచార్యుడు

అన్నమాచార్యుడు క్రీ.శ. (1409 - 1503) గొప్ప వేంకటేశ్వరభక్తుడు ఇతడు తెలుగులో పదాలను రచించటమేకాక సంస్కృతంలోను పదాలను రచించాడు ఇవి భక్తిరసపూర్ణమైనవి. ఇతడు తిరుపతిలో వేంకటేశ్వరుని సేవలో జీవితాన్ని గడిపాడు. ఇతడు "పదలక్షణ" మనే పదాల లక్షణాలను తెలుపుతూ సంగీత శాస్త్రకృతిని కూడా రచించాడు. కాని ఇప్పుడది అలభ్యం. అన్నమయ్య సంస్కృత పదాలు శృంగార, ఆధ్యాత్మికార్థభరితమైనవి. అతనికృతి ఒకటి ఉదాహరణ -

శృంగారసంకీర్తన - ముఖారిరాగం - జంపెతాళం
పల్లవి - జానామ్యహం తేస రసలీలాం
నానావిధ కపట నాటక సఖత్వం

పరణం - కింకరోషి త్వాంకితవ పరకాంతా న

ఖాంకుర ప్రకటన మతీవ కురుషే
శంకాం విసృజ మమ సర్వం న కరుణం
కింకారణంత్వైః ఖేలన మిదానీం॥

కింభాషయసి మాం కితవ మానస తయా
డాంబిష తయాడంబయసి కిం
గాంభీర్య మానవహసికాతరత్వేన తవ
సంభోగ చాతుర్య సాదర తయాకిం॥

కిమితి మామను నయసికృపణ వేంకటశైల
రమణ భవద భిమత సురత మనుభవ

ప్రమదేన తత్ప్రియం ప్రచురయసి మానహర
మమతయా మదన నిర్మాతానకింత్వమ్.

## చాతకాష్టకం

చాతకాష్టక రచయిత ఎవరో తెలియదు. కాని ఇది చాల వ్యాప్తిలో వున్నది. ఇందులో నీతిబోధతో కూడిన చక్కని కవిత్వమున్నది. చాతకపక్షి కేవలం మేఘం వర్షించే జలాలనే తాగుతుంది, మేఘజలాలు దొరకకపోతే దాహంతోనే వుంటుంది. కాని వేరేజలాలను తాగదు అవి కవి సంప్రదాయం. అటువంటి ఉత్తమమైన పక్షిని ఉదాహరణగా తీసుకొని కవి నీతిబోధను చేసాడు.

## రామచంద్ర కవి

రామచంద్రుడు క్రీ.శ. 1524 ప్రాంతం, "రసిక రంజన" మనే లఘు కావ్యాన్ని రచించాడు. ఈ శ్లోకాలకు రెండు అర్థాలున్నవి. ఒకటి శృంగారార్థం, మరొకటి వైరాగ్యార్థం.

## శృంగార జ్ఞాన నిర్ణయం

శృంగార జ్ఞాననిర్ణయ కర్త ఎవరో తెలియదు. దీనిలో శుకమహర్షి, అప్సరస రంభల నడుమ జరిగిన సంవాదం వున్నది. దీనిలో శృంగార వైరాగ్యాలకు ఘర్షణ చిత్రింపబడింది. వైరాగ్యానికే విజయం లభించింది. సరళసులభశైలిలో వ్రాయబడింది.

## రుద్రకవి

రుద్రకవి క్రీ.శ. 16వ శ॥ వాడు. ఇతడు భావవిలాసమనే లఘు కావ్యాన్ని రచించాడు. తన ఆశ్రయదాత భావసింహుని పేరుమీద కవి ఈ కావ్యానికి పేరు పెట్టాడు. దీనిలో 133 శ్లోకాలున్నవి.

## నారాయణభట్టు

ఈ కవి క్రీ.శ. 1590 ప్రాంతంవాడు. ఇతని కృతి "నారాయణీయం". ఇది ఉత్తమ కవిత్వంతో కూడింది. ఇది పది దశకాలుగా, 12 స్కంధాలుగా విభాగింపబడింది. దీనిలో

1036 శ్లోకాలున్నవి. భాగవత పురాణమే దీనిలోని వస్తువు. కేరళదేశంలో భాగవత పురాణానికి మారుగా దీన్నే నిత్యపారాయణం చేస్తారు. ఈకవి కేరళవాసి. ఇతడు కీళ్ళ నొప్పులతో బాధపడ్తు ఈ కావ్యాన్ని వ్రాసి వ్యాధి విముక్తుడైనాడంటారు.

## మధుసూదన సరస్వతి

క్రీ.శ. 16వ శ॥ వాడు. ఇతడు పండితకవి. ఈ కవి విష్ణువు కేశాదిపాదాంత వర్ణన చేస్తు "ఆనంద మందాకిని" అనే స్తుతి కావ్యాన్ని వ్రాసాడు. కోమలభక్తి హృదయానుభూతులను కవి దీనిలో చక్కగా ప్రస్తుతీకరించాడు. ఇతడు " భక్తి రసాయన" మనే గ్రంథాన్ని వ్రాసాడు. దీనిలో శాస్త్రీయంగా భక్తి స్వరూపం చర్చింపబడింది. రూపగోస్వామి భక్తిని రసంగా నిలబెట్టినా దానికి శాస్త్రీయంగా వివరణను చేసింది ఇతడే అని చెప్పవచ్చును.

## అప్పయ్య దీక్షితుడు

క్రీ.శ. 16వ శ॥ వాడు. పండితుడు. వైయాకరణుడు, ఆలంకారికుడు, ఇతడు వైరాగ్య శతకమనే లఘు కావ్యాన్నే కాక కంచి వరదరాజ స్తుతిని వ్రాసాడు. దీనిలో 100 శ్లోకాలున్నవి. దీనికి కవే స్వయంగా వ్యాఖ్యానాన్ని వ్రాసాడు.

## నీలకంఠ దీక్షితుడు

క్రీ.శ. 1650 ప్రాంతం వాడు. ఇతడు అప్పయ్య దీక్షితుని సోదరుని మనమడు. "ఆనంద సాగరస్తవ" మనే స్తుతి కావ్యాన్ని రచించాడు. దీనిలో దేవీస్తుతి ఉన్నధి. శివున్ని స్తుతిస్తు ఇతడు " శివోత్కర్ష మంజరి" ని కూడ వ్రాసాడు. ఇతని కవిత్వం ఉత్తమమైంది. ఇతడు శివలీలావర్ణవమనే మహాకావ్యాన్ని, నీలకంఠ చంపువును కూడ వ్రాశాడు. కలివిడంబనం, సభారంజన శతకం, శాంతి విలాసం, వైరాగ్య శతకం - అనే లఘు కృతులను కూడ ఇతడు వ్రాసాడు. ఇవి అచ్చైనవి. కలి విడంబనంలో కలియుగ పరిస్థితి, ప్రజల ఆచరణలను, ఆలోచనలను వ్యంగోక్తులతో వివరించాడు. కలి ప్రభావం నుంచి విముక్తులు కమ్మని కవి ఉపదేశించాడు. సభారంజన శతకంలో రాజసభల్లో కవులు మెలగవలసిన పద్ధతులను చెప్పాడు. శాంతి విలాసంలో మానసిక శాంతి, వైరాగ్య శతకంలో వైరాగ్య ప్రవృత్తి వర్ణింపబడినవి. "అన్యాపదేశ నీతి శతకం" కూడ ఇతని కృతియే.

# రామభద్ర దీక్షితుడు

ఇతడు నీలకంఠ దీక్షితుని శిష్యుడు. "రామచాపస్తవం" లేక "రామబాణస్తవం" అనే స్తుతికావ్యాన్ని వ్రాసాడు. ఇంకా ఇతడు "రామాష్టప్రాస", వర్ణమాలస్తోత్ర"మని రాముని స్తుతిస్తూ కావ్యాలు వ్రాసాడు. ఇతడు నాటక కర్త కూడ.

# పండితరాయలు జగన్నాథుడు

## జగన్నాథుని జీవిత విశేషాలు

జగన్నాథుడు తెలుగు బ్రాహ్మణులల్లో వేంగి నాటి శాఖకు చెందినవాడు. జగన్నాథుని తండ్రి కాశిలో నివాస మేర్పరుచుకోవటం వల్ల అతడు అక్కడే జన్మించాడు. తర్వాత ఢిల్లీ చక్రవర్తుల ఆశ్రయంలో ఉండిపోయాడు. కాబట్టి అతనికి దక్షిణభారతంతోగాని ఆంధ్రదేశంతో గాని పరిచయాభిమానా లున్నట్లు లేదు. జగన్నాథుని తండ్రి పేరు పేరుభట్టు లేదా పేరంభట్టు. తల్లి పేరు లక్ష్మి. పేరుభట్టు గొప్ప పండితుడు. అతడు అద్వైత్వాన్ని జ్ఞానేంద్ర భిక్షువు దగ్గర, న్యాయ వైశేషికాలను మహేంద్రుని దగ్గర వ్యాకరణాన్ని శేష వీరేశ్వరుని దగ్గర అభ్యసించాడు. అటువంటి పండితుడైన తండ్రి తగ్గరే మొదట జగన్నాథుడు జ్ఞానాన్ని ఆర్జించాడు. అందుకే తండ్రిని ఆయన "మహా గురుమ్" అని పేర్కొన్నాడు. తర్వాత జగన్నాథుడు కూడ శేష వీరేశ్వరుని దగ్గర శాస్త్ర పఠనం చేసాడు. మనోరమ కుచమర్దనంలో "అస్మద్ గురు పండిత వీరేశ్వరాణామ్" అని పేర్కొని వున్నాడు. ఈ వీరేశ్వరుడు జగన్నాథునికి కూడ గురువే. తండ్రి కొడుకులకు ఒక్క వ్యక్తి గురువు కావటం అసంభవమేమి కాదు.

జగన్నాథుడు ఢిల్లీ రాజు ఆశ్రయంలో తన యవ్వనకాలాన్ని గడిపినట్లుగా భామినీ విలాసంలోని ఒక శ్లోకాన్ని బట్టి తెలుస్తున్నది. ఈ ఢీల్లీ రాజు షాజహాన్ అని అందరు విమర్శకులు అంగీకరించిన విషయమే. ఎన్.కే.డే. మొదలైన విమర్శకులు జగన్నాథుడు షాజహాన్ తండ్రి జహంగీర్ ఆస్థానంలో కూడ వున్నాడని తలంచారు. పండితరాజు మొదట జహంగీర్ ఆస్థానంలో వుండి అతని మరణానంతరం ఉదయపూర్ రాజు జగతసింహుని ఆశ్రయంలో వుండి అతని ప్రశంసిస్తు జగదాభరణ కావ్యాన్ని చెప్పాడని తర్వాత క్రీ.శ. 1628 లో సింహాసన మధిష్టించిన షాజహాన్ ఆస్థానంలో జగన్నాథుడు వచ్చి చేరాడని "పండితరాజ కావ్యసంగ్రహ" పీఠికలో ఆర్యేం ద్రశర్మ తెలిపాడు. జగత సింహుని దగ్గర నుంచి షాజహాన్

మామ, ముంతాజ్ మహల్ తండ్రి ఆసఫ్‌ఖాన్ జగన్నాథుని పిలిపించాడని, అప్పుడే జగన్నాథుడు అతన్ని ప్రశంసిస్తు ఆసఫ విలాసాన్ని చెప్పాడని శర్మ అభిప్రాయం. ఆసఫ్‌ఖాన్ దగ్గర వున్న జగన్నాథుని ప్రశంసను విని షాజహాన్ జగన్నాథుని సన్మానించి "పండిత రాజ" బిరుదప్రదానం చేసి తన ఆస్థానంలో వుంచుకొని గౌరవించాడని ఆసఫ్ విలాసాన్ని బట్టి శర్మ ఊహ చేసాడు. జహంగీర్ మరణం తర్వాత నూర్జహాన్ చేసిన కుట్ర నుంచి తప్పించుకొని షాజహాన్ సకుటుంబంగా పారిపోయి ఉదయపూర్ రాజా ఆశ్రయంలో వుండి తర్వాత తన మామ ఆసఫ్‌ఖాన్ మొదలైన సర్దార్ల సహాయంతో క్రీ.శ. 1628 లో ఢిల్లీ సింహాసనాన్ని అధిష్టించాడు. జగన్నాథుడు జహంగీర్ మరణం తర్వాత షాజహాన్‌తోటే వుండి అతనితో ఉదయపూర్ పోయి అతనితోనే ఢిల్లీకి వచ్చివుంటాడు. షాజహాన్‌కు తోడ్పడిన జగతసింహుని, ఆసఫ్‌ఖాన్‌లను ప్రశంసిస్తు కావ్యాలను వ్రాసివుంటాడు. షాజహాన్ కొడుకు దారా షికోహ్ సంస్కృతంలో గొప్ప పండితుడు. దారాకు బాల్యం నుంచి జగన్నాథుడే గురువు కావచ్చును. క్రీ.శ. 1666 లో ఔరంగజేబు షాజహాన్‌ను బంధించి దారా మొదలైన తన సోదరులను క్రూరంగా చంపి ఢిల్లీ చక్రవర్తి అయినాడు. అటువంటి రాజకీయ క్లిష్టసమయంలో జగన్నాథుడు ఢిల్లీ విడిచిపెట్టి కామరూప (అస్సాం) రాజా ప్రాణనారాయణుని ఆశ్రయంలో చేరి అతని చరిత్రను ప్రాణాభరణ కావ్యంగా వ్రాసివుంటాడు. ఆ తర్వాత వృద్ధావస్థలో కాశీనగరానికి వచ్చాడని కొందరు విమర్శకులు తలంచారు. మరికొందరు అతడు యమునా నదీ తీరంలో మధురలో శేష జీవితాన్ని గడిపాడని తలంచారు. జగన్నాథుడు అక్బరు ఆ స్థానంలో కూడ వున్నాడని ఐతిహ్యం కాని అది అంత నమ్మదగ్గట్టుగా లేదు. పై వృత్తాంతాలను ఆధారంగా జగన్నాథుని జీవిత కాలాన్ని క్రీ.శ. 1590-1667 ప్రాంతంగా నిర్ణయించవచ్చును. కాని క్రీ.శ. 1666 లో షాజహాన్ బందీ అయిన తర్వాత జగన్నాథుడు చాలా కాలం బతికి వుండి మనోరమకుచమర్దనం, శబ్దకౌస్తుభ శాణోత్తేజనమనే గ్రంథాలను రచించి వుంటాడు.

జగన్నాథ, అప్పయ్య దీక్షితులను గూర్చి కొన్ని కథలు వ్యాప్తిలో వున్నవి. కాని అవేవి నమ్మటానికి వీల్లేకుండ వున్నవి. అప్పయ్య దీక్షితుడు (క్రీ.శ. 1553-1626) జగన్నాథుని కన్న వయస్సులో పెద్దవాడు. అందుచేత వాళ్ళకు ప్రత్యక్షంగా వైరం వుండేదనటానికి అంతగా అవకాశం లేదు. ఒకవేళ వృద్ధావస్థలో అప్పయ్య కాశిలో వుంటే అప్పుడు జగన్నాథుడు యువ్వనంలో వుండి వుంటాడు. జగన్నాథుడు జీవిత కాలాన్ని చాలామట్టుకు ఢిల్లీలో గడిపాడు. అప్పయ్య దక్షిణ దేశంలో విజయనగర రాజులు మొదలైన వారిని ఆశ్రయించినవాడు.

కాబట్టి వాళ్ళిద్దరు ప్రత్యక్షంగా కలుసుకొని కక్షలను సాధించినట్లుగా చెప్పలేము. కాని వాళ్ళిద్దరికి ఏమైన పరోక్ష వైరముండేదేమో! ఎందుకంటే - జగన్నాథుడు, అతని తండ్రి ఇద్దరూ శేషవీరేశ్వరుని శిష్యులు. భట్టోజీ దీక్షితుడు శేష వీరేశ్వరుని తండ్రి శేష శ్రీకృష్ణుని శిష్యుడు. భట్టోజి కాశి నుంచి దక్షిణ భారతానికి పోయి అప్పయ్య దీక్షితుల శిష్యుడై తన వ్యాకరణగురువు శేషశ్రీకృష్ణుని విమర్శించాడు. అందుకే జగన్నాథుడు భట్టోజిని గురు ద్రోహిగా పేర్కొన్నాడు. భట్టోజి జగన్నాథుని గురువుకు తండ్రి అయిన శేష శ్రీకృష్ణుని మరియు అప్పయ్య దీక్షితుల శిష్యుడు. దీన్ని బట్టి భట్టోజి, అప్పయ్య ఇద్దరు జగన్నాథుని కన్న వయస్సులో పెద్దవాళ్ళే. ఒకవేళ భట్టోజి వృద్ధావస్థలో వున్నప్పుడు జగన్నాథుడు ప్రౌఢావస్థలో వుండి వుంటాడు. భట్టోజి అప్పయ్యను గురువుగా పొంది మొదటి గురువును ఖండించి ద్రోహం చేసాడు. అందుకే జగన్నాథుడు తన గురువు తండ్రికి ద్రోహం చేసిన భట్టోజిని ఇంకా అతనికి గురుత్వం వహించిని అప్పయ్యను ఖండించి వుంటాడు. జగన్నాథుడు తన రసగంగాధరంలో అప్పయ్య దీక్షితుని ప్రతి అలంకార వివేచనను ఖండించిపెట్టాడు. అంతటితో తృప్తి చెందక ప్రత్యేకంగా అప్పయ్య చిత్రమీమాంసను ఖండిస్తూ ఒక గ్రంథాన్ని వ్రాసాడు. మనోరమ కుచమర్దనమనే పేరుతో జగన్నాథుడు భట్టోజి సిద్ధాంత కౌముదిటీకను ఖండించాడు. తర్వాత జగన్నాథుని "శబ్దకౌస్తుభశాణోత్తేజ" మనే వ్యాకరణ కృతి లభ్యం కాలేదు. కాని లభ్య భాగాలను బట్టి దానిలో అతడు భట్టోజిని ఖండించాడని తెలుస్తున్నది. ఇట్లా జగన్నాథుడు పని గట్టుకొని అప్పయ్య, భట్టోజి దీక్షితుల సిద్ధాంతాలను ఖండించి ఏకియేకి పెట్టాడు. దీనికంతా భట్టోజి చేసిన గురుద్రోహం, జగన్నాథుని గురుభక్తి కారణాలు కావచ్చును.

జగన్నాథుడు ఒక మహమ్మదీయ కన్యను వివాహమాడాడని, ఆమె పేరు లవంగి అని లోకంలో వ్యాప్తిలో వున్నది. ఒకానొక పాదుషా దగ్గర దాసీగా వున్న అతి సుందరి లవంగిని చూచి జగన్నాథుని ముగ్ధుడై ఆ సుందరిని తన కిమ్మని పాదుషాను యాచించాడని, జగన్నాథుడు ఇస్లాం మతాన్ని స్వీకరించిం తర్వాత పాదుషా ఆ సుందరిని అతనికిచ్చి వివాహం చేసాడని ఐతిహ్యాం. జగన్నాథునికి ఆ సుందరితో ఒక కుమారుడు కూడ కలిగాడని అంటారు. ఈ కింవదంతులను బట్టి, భట్టోజి జగన్నాథుని మ్లేచ్ఛుడని అన్నదాన్నిబట్టి జగన్నాథుడు ఇస్లాం మతాన్ని స్వీరించాడో లేదో కాని యవన కన్యను వివాహమాడింది సత్యమేమోనని అనిపిస్తుంది. జగన్నాథుడు యవన కన్యను వివాహమాడటంచేత భ్రష్టుడైనాడని అప్పయ్య దీక్షితుడు అతన్ని నిందించినట్లు ఒక

ఐతిహ్యమున్నది. అప్పయ్యేకాక జగన్నాథుడు చేసిందానికి ఎందరో సనాతన పండితులు అతన్ని భ్రష్టుడైనాడని వెలివేసి వుంటారు కూడ !

మద్వాణి! మాకురు విషాదమనాదరేణ
మాత్సర్యమగ్న మనసాం సహసా ఖలానామ్
కావ్యారవింద మకరంద మధు వ్రతానామ్
ఆస్యేషు ధాస్యతితమాం కతి నో విలాసాన్.

అన్న భామినీ విలాసంలోని శ్లోకాన్ని బట్టి జగన్నాథుడు మ్లేచ్ఛ కన్యను వివాహమాడినందుకు పండితులు నిరసించారన్న సత్యం బయటపడ్తున్నదని కొందరు విమర్శకులు తలంచారు. కాని తన కవిత్వాన్ని ఆనాదరించినట్లు జగన్నాథుడు ఇక్కడ వాపోయాడు కాని, తన చరిత్రను కాదని మరికొంద రంటారు.

జగన్నాథుడు లవంగితో గంగానది గట్టుమీద కూర్చొని గంగాలహరి శ్లోకాలను పఠించాడని 52 వ శ్లోకం చదివేసరికి గంగానది ఉప్పొంగి వాళ్ళిద్దరిని ముంచివేసిందని ఒక ఐతిహ్యం. దీన్ని బట్టి జగన్నాథుడు లవంగి ఇద్దరు ఒక్కసారే మరణించారని తెలుస్తున్నది. మరొక ఐతిహ్యాన్నిబట్టి లవంగి మరణించింతర్వాత జగన్నాథుడు బ్రతికేవుండి ఆమె ఎడబాటువల్ల కలిగిన దుఃఖంతో కరుణ రసాత్మకమైన భామినీ విలాసాన్ని రచించాడంటారు. తర్వాత యవన కన్యను వివాహమాడి భ్రష్టుడైన తనను పండితులు నిందించటంతో గంగాలహరి స్తోత్రాన్ని పఠిస్తూ వర్షాకాలంతో ఉప్పొంగే గంగానదిలో పడి మరణించాడని చెప్తారు. ఢిల్లీలో ఔరంగజేబు పరిపాలనారంభంతో ఏర్పడిన రాజకీయ అల్లకల్లోలాలల్లో జగన్నాథుడు ఢిల్లీని విడిచి తన జన్మస్థలమైన కాశీనగరానికి వచ్చి మరణం వరకు అక్కడే వున్నాడని ఈ ఐతిహ్యాన్ని బట్టి కొందరు విమర్శకులు ఊహించారు. కాని భామినీవిలాసంలోని ఈ కింది శ్లోకంలవల్ల అతడు యౌవనావస్థలో ఢిల్లీ రాజుల ఆశ్రయంలో, వృద్ధావస్థలో మథురలో కృష్ణుని సాన్నిధ్యంలో గడిపాడని తెలుస్తున్నది -

శాస్త్రాణ్యాకలితాని నిత్య విధయః సర్వే పి z సంభావితా
దిల్లీ వల్లభపాణి పల్లవ తలే నీతనంవ వీనం వయః
సంప్రత్యు జ్ఝిత వాసనమ్మధుపురీ మధ్యేహరిః సేవ్యతే
సర్వం పండిత రాజ రాజితలకే నాకారి లోకాధికమ్.

ఢిల్లీని విడిచిపెట్టింతర్వాత జగన్నాథుడు తన జన్మస్థలం కాశికే వచ్చి అక్కడ కొన్నాళ్ళుండి మనోరమ కుచమర్దనం, శబ్దకౌస్తుభశాణోత్తేజ మనే కృతులను భామినీ విలాస కావ్యాన్ని రచించి ఆ తర్వాత అతి వృద్ధాప్యంలో మథురానగరంలో యమునా తీరంలో నివాస మేర్పరచుకొని అక్కడ వున్నప్పుడు అమృత లహరిని వ్రాశాడని చెప్పటం సమంజసంగా వుంటుంది. భామినీ విలాసంలోని కొన్ని శ్లోకాలను బట్టి అతడు కృష్ణభక్తుడని ప్రకటమౌతున్నది.

## జగన్నాథుని లఘు కృతులు

జగన్నాథుడు గొప్ప ఆలంకారికుడు. దార్శనికుడు, వైయాకరణుడే కాక గొప్ప కవి కూడ. రస గంగాధరంలో అనేకచోట్ల లక్ష్యోదాహరణలుగా అతడు తాను వ్రాసిన శ్లోకాలనే ఇచ్చాడు. అవేగాక జగన్నాథుడు అనేక లఘు కావ్యాలను రచించాడు-

1. **గంగా లహరి** - దీనికి పీయూష లహరి అని కూడ పేరు. దీనిలో గంగా స్తుతి 53 శ్లోకాలల్లో చేయబడింది. శిఖరిణి వృత్తాన్ని కవి ప్రయోగించాడు. గంగా స్తుతి కవితామయ భాషలో మనోహరంగా చేయబడింది.

2. **అమృతలహరి** - దీనికి యమునా లహరి అని కూడ పేరు. శార్దూలవిక్రీడతంలో యమునాస్తుతి చేయబడింది. కవిత్వం సరస గంభీరంగా వున్నది.

3. **కరుణాలహరి** - దీనిలో విష్ణుస్తుతి చేయబడింది. వంశస్థ, సుందరి, మాలభారిణి వృత్తాలల్లో కూర్చబడింది. దీనికి విష్ణులహరి అని కూడ పేరు.

4. **లక్ష్మీలహరి** - దీనిలో లక్ష్మీస్తుతి చేయబడింది. 41 శిఖరిణీ వృత్తాలల్లో కూర్చబడింది.

5. **సుధాలహరి** - దీనిలో సూర్యునిస్తుతి వున్నది. 30 స్రగ్ధరా వృత్తాలల్లో కూర్చబడింది.

6. **యమునా వర్ణన** - రసగంగాధరంలో మధ్యమ కావ్యానికి ఉదాహరణగా జగన్నాథుడు యమున వర్ణనగల గద్యాన్ని ఇచ్చాడు. అందుచేత ఇది చంపూ శైలిలో కూర్చబడిందేమో అని అనుమానం కలుగుతున్నది.

7. **ఆసఫ్ విలాసం. 8. ప్రాణాభరణం 9. జగదాభరణం.** ఈ మూడు లఘు కావ్యాలు అఖ్యాయికా ప్రక్రియకు చెందినవి. ఇవేగాక జగన్నాథుడు రతీమన్మథ నాటకం, వసుమతీ పరిణయం, అల్లా ఉపనిషత్తులు వ్రాసాడంటారు.

## భామినీ విలాసం

పండితరాయల లఘుకావ్యాల్లో భామినీ విలాసం ఉత్కృష్టమైంది. ఇది ముక్తక కావ్యం. నాలుగు విలాసాలుగా విభజింపబడింది - 1. ప్రాస్తావిక విలాసం 2. శృంగార విలాసం 3. కరుణ విలాసం 4. శాంత విలాసం. ప్రాస్తావిక విలాసం కొన్ని ప్రతుల్లో అన్యోక్తి విలాసమని పేర్కొనబడింది. దీనిలో అన్యోక్తులు అధికంగా వుండటం చేత అట్లా పేరు పెట్టబడి వుంటుంది. కొందరు విమర్శకులు ఈ అన్యోక్తులను అప్రస్తుతప్రశంసలని గుర్తిస్తున్నారు. కాని అమరుక శతకంలోవలె వీటిని అనోక్తులుగానే గుర్తించాలి కాని అప్రస్తుతప్రశంసలు కాదని మరికొందరు విమర్శకులు తలంచారు.

భామినీ విలాసం మొదటి విలాసంలో 129 శ్లోకాలు, రెండవ విలాసంలో 184 శ్లోకాలు, మూడవ విలాసంలో 19 శ్లోకాలు, నాల్గవ విలాసంలో 46 శ్లోకాలున్నవి. ఆద్యంతం ఒక్క వృత్తాన్ని కాక వివిధ వృత్తాలను కవి వాడాడు. అనుష్టుప్పు, ఇంద్రవ్రజ, ఉపేంద్రవ్రజ, ఉపజాతి, శాలిని, మాలిని, సుందరి, పుష్పితాగ్ర, స్రగ్ధర, మాలభారిణి,ఉపగీతి, వసంతతిలక, పృథ్వీ, శార్దూల, హరిణి, మంజుభాషిణి, ప్రబోధిత, ప్రహర్షిణి, ప్రమితాక్షర, వంశస్థ, ఉద్గీతి, గీతి, స్వాగతం మొ॥న ఛందస్సులను కవి ప్రయోగించాడు.

భామినీవిలాసం ముక్తక కావ్యం కాబట్టి విశ్వనాథుడు దీన్ని కోషగ్రంథంగా పేర్కొన్నాడు. "భామిని" అంటె "కోపనా సైవ భామిని" (కోపించే స్త్రీ) అని అమరకోశం చెప్పిన అర్థం అంటె శృంగార భావ విశేషమైన కోపాన్ని ధరించేదని చెప్పుకోవాలి. కాని ఈ అర్థాన్ని తీసుకొన్నట్లయితే భామినీ విలాసంలో విలాసమేది లేదు. నాలుగు విలాసాల పేర్లనుబట్టి వర్ణ్య విషయాన్ని ఊహించవచ్చును - మొదటి విలాసం అన్యోక్తులతో కూడి వివిధ విషయాల వర్ణనలతో కూడి వున్నది. రెండవ విలాసంలో స్త్రీ వర్ణన, ప్రణయం వర్ణింపబడినవి. మూడవ విలాసంలో ప్రియావియోగ దుఃఖమున్నది. నాల్గవ విలాసం శాంతరసస్ఫోరకమైన వైరాగ్య భావాలతో నిండివున్నది. ఇందులోనే జగన్నాథుని శ్రీ కృష్ణభక్తి ప్రకటమైంది. భామినీ విలాసం మీద భర్తృహరి శతకత్రయ ప్రభావం చాల కన్పిస్తున్నది. భర్తృహరివలెనే జగన్నాథుడు నీతి, శృంగార, వైరాగ్యాలను కావ్యవస్తువుగ గ్రహించాడు. దీనిలోని కొన్ని శ్లోకాలు రసగంగాధరంలో వుండటంచేత దీని రచన రసగంగాధరం రచనకన్న ముందే జరిగిందని చెప్పవచ్చును. కాని భామినీ విలాసంలోని శ్లోకాలన్ని ఒక్కసారి కావ్యరచనోద్దేశంతో చెప్పినవి కాక ఆయా సందర్భాలల్లో చెప్పినవి కావచ్చును. తర్వాత కవి వాటిని ఒక్కచోట జోడించి ముక్తక కావ్య రూపాన్ని ఇచ్చి వుంటాడు - అని కూడ ఊహించవచ్చును.

## జగన్నాథుని కవిత్వం

కరుణ విలాసంలోని 19 శ్లోకాలను కవి భార్యావియోగ దుఃఖంతో వ్రాసాడని కొందరు విమర్శకులు తలంచారు. హృదయ స్పర్శిగా వున్నవని స్వానుభూతి కాబట్టే అవి పాఠకులను మిక్కిలి ప్రభావితం చేస్తున్నవని వారి అభిప్రాయం.

ధృత్వా పదస్ఖలన భీతివశాత్ కరంభే
య్యా ౹రూఢ పత్యసి శిలాశకలం వివాహే
సామాం విహాయ కథమద్య విలాసిని ద్యామ్
ఆరోహసీతి హృదయం శతధాప్రయాతి.

"హేవిలాసినీ! వివాహవేళ కాళ్ళు తడబడుతుండగా నా చేయిని ఆలంబనంగా తీసుకొని శిలాశకలాన్ని తొక్కావు అటువంటి నీవు నన్ను విడిచి స్వర్గానికి ఎట్లా పోయావు? నా హృదయం విరిగి వేయిముక్కలౌతున్నది."

భార్యావియోగం తర్వాత కమనీయ సుందర కవిత్వాన్ని తాను వ్రాయలేకపోతున్నానని, ఇంతకుముందు ప్రియురాలి అమృత విలాసమే కవిత్వంగా పరిణమించేదని కవి ఒక చోట వాపోయాడు -

కావ్యాత్మానా మనసి పర్యణమన్ పురా మే
పీయూష సార సదృశాస్తవ యే విలాసాః
తానంతరేణ రమణీ రమణీయ శీలా
చేతోహరా సుకవితా కవితా కథన్నః

భామినీ విలాసంలోని జగన్నాథుని కవిత్వం మధురంగా, సరసంగా, సరళంగా వున్నది. శబ్దార్థాలంకారాలను కవి రససౌందర్యానికి అడ్డురాకుండ వాడాడు. అనేక వ్యంగ్యోక్తులతో కూడిన ఉత్తమ కావ్యం ఇది. "మధువు, ద్రాక్ష, అమృతం, వామాధర సుధ ఇవన్ని అందరికి ఆనందాన్ని ఇయ్యక పోవచ్చును. కాని నా కవిత్వం అందరికి ఆనంద ప్రదాయిని. జగన్నాథుని ఉక్తిని చదివి ఎవడు ఆనందంపొందడో అటువంటివాడు జీవచ్ఛవం వంటివాడు" -

మధు ద్రాక్షా సాక్షాదమృత మథ వామాధరసుధా
కదాచిత్ కేషాం చిన్నఖలు విదధీ రన్నపి ముదమ్

ధ్రువం తే జీవంతో ప్యహహ! మృతకా మందమతయో
నయేషామానందం జనయతి జగన్నాథ భణితిః.

ఇది కవి స్వయంగా చెప్పుకొన్న శ్లోకం కాక ఎవరో వ్యాఖ్యానకారులు ప్రక్షిప్తంగా చేర్చిన శ్లోకం కావచ్చును.

జగన్నాథుని కావ్యశైలి సరళసుబోధకంగా సరసంగా వుంటుంది. అతని శాస్త్రరచనల్లో కన్పించే దర్పం, అహంకారం, ఔద్ధత్యాలు కావ్యాలల్లో కనిపించవు. అతని శాస్త్రపాండిత్యగర్వం కూడ కావ్యాలల్లో ఎక్కడా అభివ్యక్తం కాదు. ఇది ఆశ్చర్యకరంగా వుంటుంది. జగన్నాథునితో మహోన్నతమైన సంస్కృత సాహిత్య యుగం ముగిసిందనే చెప్పాలి. ఆ తర్వాత పాండిత్యం, మౌలికతలుగల కవి పండితులెవరూ జన్మించలేదనే చెప్పాలి.

## అవతారకవి

కాశ్మీర నివాసి. క్రీ.శ. 17 శతాబ్దం వాడు. ఈశ్వర శతకం ఇతని కృతి. ఇందులో ఈశ్వరుని స్తుతి వున్నది. దానికి రత్నకంఠుడు టీకను కూడ వ్రాసాడు. శ్లేషయమకాదులతో దీనిలోని కవిత్వం చమత్కారపూర్ణంగా వున్నది. భారవి మాఘులవలె కవి పాండిత్య ప్రదర్శన కూడ చేసాడు. ఏకాక్షర, ద్వ్యక్షర, అర్థత్రయవాచక, ముసలబంధాది చిత్ర కవిత్వం కూడ వున్నది.

## గౌరి

ఈ కవయిత్రివి 18 శ్లోకాల వరకు లభించినవి. ఈమె కాలం క్రీ.శ. 17వ శతాబ్దం. లభించిన శ్లోకాలు ఒక్క ప్రేమకే పరిమితం కావు. పౌరాణిక, రాజనైతిక సంబంధ విషయాలను కూడ కవయిత్రి గ్రహించింది. రాజా, యుద్ధం, శత్రురాజాల భార్యల పరిస్థితి, ఆయుధాలు మొదలైన వాటినిగూర్చి గూడ ఈమె శ్లోకాలు చెప్పింది. ఈమె భావాలల్లో మౌలికత కొట్టకొచ్చినట్లు కన్పిస్తున్నది. ఈమె కవిత్వం ఉత్తమమైంది. భాష, అలంకారాలు, ఛందస్సులు వీటి ప్రయోగంలో నేర్పును చూపింది. కవిత్వం కృత్రిమంగా కాక సహజ సుందరంగా, ధారాళంగా వున్నది.

## పద్మావతి

హరిభాస్కరుడు తన పద్యామృత తరంగిణిలో ఈమె రెండు శ్లోకాలను ఉద్ధరించాడు.

వేణీదత్తుడు తన పద్యవేణిలో ఈమెవి 19 శ్లోకాలను ఇచ్చాడు. ఈమె కాలం క్రీ.శ. 17వ శతాబ్దం. గౌరి వలెనే ఈ కవయిత్రి ప్రేమనేకాక వేరువేరు విషయాలను గ్రహించింది. గూర్జర స్త్రీలను గూర్చి ఈమె రెండు శ్లోకాలను చెప్పిందాన్ని బట్టి ఈమె గుజరాత్ నివాసిని అని చెప్పవచ్చును. ప్రకృతి వర్ణనలుగల ఈమె శ్లోకాలు సుందరంగా వున్నవి. ఈ వర్ణనలు, కవిత్వం సహజంగా వున్నవి. ఉత్ప్రేక్షాద్యలంకారాలను సుందరంగా కూర్చింది ఈ కవయిత్రి.

## వేంకటాధ్వరి

ఈ కవి క్రీ.శ. 1650 ప్రాంతం వాడు. లక్ష్మీ సహస్రమనే వేయి శ్లోకాలకృతిని రచించాడు. దీనిలో లక్ష్మీ విష్ణువుల స్తుతి ఉన్నది. భక్తి భావపూర్ణమైంది. స్తోత్రకావ్యం. రసవంతంగా వున్నది. శ్లేష, యమక, ఉత్ప్రేక్ష చమత్కారాలతో నిండి వున్నది. ఇతడే విశ్వగుణాదర్శ చంపువు కర్త. సుభాషిత కౌస్తుభం అతని మరొక కృతి.

## నారాయణ తీర్థుడు

ఈ కవి క్రీ.శ. 1700 ప్రాంతం వాడు. ఇతడు ఆంధ్రదేశంలో తూర్పు గోదావరి జిల్లాలోని కూచిమంచివారి అగ్రహారంలో జన్మించాడు. తర్వాత తమిళ దేశానికి వలసపోయాడు. శివ రామనందతీర్థులు ఇతని గురువు. కృష్ణలీల తరంగిణి ఇతని కృతి. కృష్ణుని చరిత్ర రుక్మిణీకళ్యాణం వరకు దీనిలో వర్ణింపబడింది. ఇది 12 తరంగాలుగా విభజింపబడింది. ఇందులోని శ్లోకాలు సంగీతాత్మకంగా ఉన్నవి. పదాలవలె వీటిని పాడుతుంటారు. నాట్యాభినయానుకూలంగా కూడ భావాలున్నవి. ఇట్లా పాటల రూపంలోను, అభినయార్థం కూడ ఇవి చాల ప్రచారంలో వున్నవి. ఈ కవి మరొక కృతి "హరిభక్తి సుధార్ణవం" - భాగవత పురాణం దశమస్కంధం మీద ఆధారపడింది.

## భాస్కరుడు

ఈ కవి "శివమోహినీ విలాస" మనే పేరుతో 12 సర్గలు గల లఘు కావ్యాన్ని వ్రాసాడు. దీనిలో శివుని, విష్ణువు అవతారమైన మోహిని యొక్క ప్రేమలీలలు వర్ణింపబడినవి. ఈ కవి జయదేవుని అనుసరించి శివమోహినుల ప్రేమలీలలను అష్టపదుల్లో రచించాడు.

## విశ్వేశ్వర పండితుడు

ఈ కవి క్రీ.శ. 18వ శతాబ్దంవాడు. కవీంద్ర కర్ణాభరణం, రోమావళీ శతకం ఇతని కృతులు. ఇతడు మొత్తం 21 గ్రంథాలను రచించాడట. వాటిల్లో అలంకార శాస్త్రాలు కూడ వున్నవి. రోమావళీ శతకం శృంగార ప్రధానమై చమత్కార భావాలతో నిండివున్నది. మందారమంజరి అన్న గద్యకావ్యం ఇతనిదే. ఈ కవి ఉత్తర ప్రదేశంలో అల్మోడా ప్రాంతం వాడు.

## త్యాగరాజు

ప్రసిద్ధ సంగీతజ్ఞుడు, వాగ్గేయకారుడు. ఈ కవి తంజావూరు సమీపంలోని తిరువయ్యార్‌లోని తెలుగు కుటుంబంలో జన్మించాడు. ఇతడు తెలుగులోనే కాక సంస్కృతంలోను పదరచనలు చేసాడు. ఇతని సంస్కృత పదాలను ప్రచారంలోకి తేవలసిన అవసరమున్నది.

ముత్తుస్వామి దీక్షితుడు, శ్యామాశాస్త్రి, త్యాగరాజు ఈ ముగ్గురిని సంగీత ప్రపంచంలో మూర్తి త్రయమంటారు. వీరు సంస్కృతంలో పదాలు వ్రాసారు.

## రామరాజ దీక్షితుడు

క్రీ.శ. 19వ శతాబ్దంవాడు. మధురా నివాసి. త్రిపుర సుందరీ మానస పూజనస్తోత్రాన్ని రచించాడు.

## అల్లా దీక్షితుడు

క్రీ.శ. 19వ శ॥ కవి. ఆనందమందిర స్తోత్రాన్ని రచించాడు. దీనిలో 100 పదాలున్నవి. ఇందులో దేవీస్తుతి వున్నది. కవి మహారాష్ట్ర దేశీయుడు.

## శ్రీనివాసాచార్యులు

క్రీ.శ. 19 శ॥ కవి. జానకీచరణ చామరం అనే స్తోత్ర కావ్యాన్ని రచించాడు.

## కావ్యకంఠ శ్రీవాసిష్ఠ గణపతి

"నాయన" గా ప్రసిద్ధుడు. బొబ్బిలికి 6 మైళ్ళ దూరంలో వున్న కలువ రాయిలో 1878లో పండిత కుటుంబంలో జన్మించాడు. పదవ యేటనే "పాండవ ధార్త రాష్ట్ర సంభవ' ' మనే ఖండకావ్యం వ్రాసిన ప్రతిభాశాలి. వ్యాకరణం, జ్యోతిషం, ఆయుర్వేదం దర్శనాల్లో పండితుడు. మంత్రవేత్త. మహోపాసకుడు. ఇంద్రాణి సప్తశతి, చండీ త్రిశతి వంటి ఎన్నో లఘుకావ్యాలు వ్రాసాడు. విశ్వమీమాంసా, ఆయుర్వేద సంగ్రహం, సదాచార బోధిని, గాయత్రి వ్యాఖ్యానం మొ॥న 75 వరకు గ్రంథాలు రచించారు. "పూర్ణ" అనే నవలను సంస్కృతంలో రచించాడు. "కావ్యకంఠ" బిరుదాన్ని పొందాడు.

## మండపాక పార్వతీశ్వర శాస్త్రి

ఈ కవి (క్రీ.శ. 1833-1897) బొబ్బిలి రాజుల ఆస్థాన కవి. చిత్ర ఆశు కవిత్వంలో ప్రవేశమున్నవాడు. గుణ శ్లోకాది చిత్రరచన, కవితా వినోద కోశం, కాశీశ్వర శతకం, మంగళాష్టక చతుష్టయి, శ్రీ వేంకటగిరి ప్రభు ద్వ్యర్థి శ్లోక కదంబం ఇతని - లఘుకృతులు. చివరి కృతిలో వేంకటగిరి సంస్థానపు రాజాగారి స్తుతి వున్నది.

## బెల్లంకొండ రామ రాయ కవి

ఈ కవి (క్రీ.శ. 1875-1914) గుంటూరు మండలం వాడు. ఇతడు మొత్తం 143 కృతులను రచించాడు. వాటిల్లో 69 స్తోత్ర కావ్యాలున్నవి. అనేక కృతులకు ఇతడు వ్యాఖ్యానాలు కూడ వ్రాసిన పండిత కవి.

## కొక్కొండ వేంకటరత్నం

ఈ కవి (క్రీ.శ. 1842-1916) పండితుడు. ప్రెపిడెన్సీ కాలేజీలో అధ్యాపకుడుగా పనిచేశాడు. జయదేవుని గీతగోవిందాన్ని అనుసరిస్తూ "గీత మహానట" ను రచించాడు. బిల్వనాథ శతకం, అనుమధ్య గీతారత్నం, బ్రహ్మవిద్యా స్తుతి, శ్రీ కాళహస్తీశ్వర స్తుతి మొ॥వి ఇతని ఇతర లఘు కృతులు. ఇతడు మహా మహోపాధ్యాయ బిరుదాంకితుడు.

## చెరుకూరి వేంకటరెడ్డి శాస్త్రి

క్రీ.శ. 19వ శ॥ కవి. ఈతడు గీతగోవిందాన్ని అనుకరిస్తు గీత గిరీశాన్ని రచించాడు. ఇది 12 విభాగాలుగా ఉన్నది. శివ శతకం, నవగ్రహ శతకం అతని ఇతర స్తోత్ర కావ్యాలు.

## వింజమూరి వీర రాఘవాచార్యులు

ఈకవి (క్రీ.శ. 1855-1920) మానస సందేశం, హనుమత్సందేశం అనే సందేశ కావ్యాలనే కాక రామానుజ శ్లోకత్రయి, పానక నరసింహ స్తోత్రాలను రచించాడు. ఇతడు శృంగార దీపకమనే భాణరూపకాన్ని కూడ రచించాడు.

## ఆదిభట్ల నారాయణ దాసు

నారాయణదాసు (క్రీ.శ. 1864-1945) ప్రసిద్ధ హరికథకుడు. ఈ కవి విజయనగరరాజా ఆనందగజపతి ఆశ్రయంలో వున్నాడు. కాశీశతకం, రామచంద్ర శతకం, శ్రీకృష్ణ కథామృతం అనే లఘు కృతులను రచించాడు. శ్రీకృష్ణ కథామృతం సంస్కృతంలో వ్రాయబడిన హరికథ. హరికథ, పౌరాణిక కథలతో పామరులకు ధర్మ నీత్యుపదేశాలను చేసే ఒక ప్రక్రియ. ఈ కవి తారకం అనే ఐదు సర్గలు గల కృతిలో పాణిని సూత్రాలకు లక్ష్యోదాహరణ శ్లోకాలను రచించాడు.

ఈ విధంగా ఇంకా ఇప్పటికిని కవులు, పండితులు లఘు కావ్య రచనలను చేస్తూనే ఉన్నారు. శతక, స్తోత్ర కావ్య ప్రక్రియ ఇంకా రచయితలకు ప్రియమైన ప్రక్రియగానే వున్నది. ప్రాచీన కాలంలో ప్రతి మహాకవి, ఆలంకారికుడు ఖండ ముక్తక, స్తోత్రాది లఘు కావ్యాలను చేపట్టి రచించారు. కవిత్వాభ్యాసం కొరకు వారు అటువంటి లఘు కృతుల రచనను చేపట్టారని కొందరి అభిప్రాయం. కవిత్వాభ్యాసం కొరకే కాక వారు స్వయంగా భక్తులు, దార్శనికులు కావటం కూడా వారిని ఈ రచనలకు ప్రేరేపించి వుంటుంది. తమ ఇష్ట దైవంమీద భక్త్యావేశంతో వారు శతకాలను, స్తోత్రాలను రచించారు. ఒకొకసారి భార్యా వియోగాది వంటి స్వానుభవాలవల్ల పెల్లుబుకిన స్వానుభూతులను కూడ వారు ఈ రచనల్లో అక్షర రూపంలో పెట్టారు. శృంగార, విలాస, వైరాగ్యాది ముక్తక రచనలను కవులు ఈ విధంగానే చేసారు. మొత్తం మీద మహాకావ్యాలకన్న లఘుకావ్యాలు కవుల వ్యక్తిత్వానికి, స్వానుభూతులకు సమీపంగా వుండి భావావేశంతో కూడినవి. సరళ సహజ మౌలిక భావాలతో కూడిన ఈ రచనలు పాఠకులను ఎక్కువ ఆకర్షించినవి. పాఠకుల హృదయానుభూతులతో కవుల భావాలు సులభంగా తాదాత్మ్యతను పొందే అవకాశం ఎక్కువగా ఏర్పడి ఈ రచనలు సామాన్య పాఠకుల్లో కూడ బాగా వ్యాపించి ప్రసిద్ధమైనవి.

# శ్లోక సంగ్రహగ్రంథాలు

అనేక కవుల కావ్యస్థ శ్లోకాలను సంగ్రహించి వర్ణ్యవస్తువునుబట్టి విభజించి గ్రంథాలను కూర్చటం జరిగింది. ఇట్లా వివిధకవుల శ్లోకాలను ఏరుకొని గ్రంథంగా కూర్చటం "గాథాసప్తశతి"లో చూడవచ్చును. మహారాష్ట్ర ప్రాకృతంలో కూర్చబడిన ఈ గాథలు 700 వరకు సంగ్రహింపబడినవి. వివిధ విషయాలు వస్తువులుగా గల గాథలు దీనిలో వున్నవి. ఈ గాథలు ఆ కవుల కావ్యాలనుంచి కాక ప్రత్యేకంగా ఆయా సందర్భాలల్లో చెప్పిన గాథలు. కాబట్టి హాలుని గాథాసప్తశతి శ్లోక సంగ్రహగ్రంథమే అయినా ముక్తక కావ్యప్రక్రియకు చెందింది. తర్వాత కొందరు ఇతరకవుల శ్లోకాలను అంటె ప్రాచీనకవుల కావ్యస్థ శ్లోకాలను కొన్నిటిని ఏరుకొని తీసుకొని ఒక్కచోట కూర్చారు. ప్రతి శ్లోకం ఏ కవిదో ఏకావ్యంలోదో కూడ వారు పేర్కొన్నారు. ఒకొకసారి ఆ కావ్యం మనకు లభిస్తున్నా శ్లోకసంగ్రహంలోని ఆ శ్లోకాలు అందులో లేకపోవటం జరుగుతున్నది. ఇది ఒక వేళ సంగ్రహకారుని పొరపాటువల్ల ఒక కావ్యంలోని శ్లోకాలు మరొక కావ్యంలోనివిగా పేర్కొనబడటంవల్ల లేదా కాలక్రమేణ ఆ శ్లోకాలు ఆ కావ్యంనుంచి తొలగి పోవటంవల్ల కూడ కావచ్చును. ఒకొకసారి కవులపేర్లను ఇయ్యటంలో కూడ శ్లోక సంగ్రహకారులు పొరపాట్లు చేసిన సందర్భాలున్నవి. అక్కడక్కడ ఈవిధంగా శ్లోకసంగ్రహ గ్రంథాలల్లో పొరపాట్లు వున్నా వివిధ విషయాలనుగూర్చి వివిధ కవులు చెప్పిన శ్లోకాలను ఒక్కచోట దర్శించటానికి ఈ గ్రంథాలు తోడ్పడుతవి. తాటాకు పుస్తకప్రతులు దొరకటం దుర్లభమైన కాలంలో ఇటువంటి శ్లోక సంగ్రహ కావ్యాలు పాఠకులకు వివిధ కవుల సుందరార్థాలుగల శ్లోకాలు అందుబాటులో వుండేటట్లు చేసినవి. అంతేగాక ఇప్పుడు నామమాత్రంగా మిగిలిన కవుల శ్లోకాలు వీటిల్లో లభించి వారి కవితాపాటవం ఎటువంటిదో మనకు తెలుసుతున్నవి. ఈగ్రంథాలవల్ల కాలపు పొరల్లోపడి విస్మృతమైన కవులపేర్లు ఎన్నో బయటికి వచ్చినవి. ఆ దృష్టితో ఈ గ్రంథాలు ఎంతో అమూల్యమైనవి. కొందరు కవుల కాలనిర్ణయంలోను ఈ గ్రంథాలు ఇప్పుడు తోడ్పడుతున్నవి.

జయవల్లభుడనే శ్వేతాంబరజైనకవి కూర్చిన " వజ్జాలగ్గం" గాథా సప్తశతి వలెనే మహారాష్ట్రప్రాకృతంలో వున్నది. దీనికి "జవల్లహం" అనికూడ పేరు. ఇది విషయాన్ననుసరించి అధ్యాయా (వజ్జా)లుగా విభాగింపబడింది. నిత్యజీవితానికి కావలసిన ధర్మార్థకామ సంబంధవిషయాలను బోధించే పద్యాలు దీనిలో కూర్పబడినవి. దీనిలో జైనధర్మబోధన ఏమాత్రం లేదు. పుస్తకంలో ఒకవంతు పద్యాలు నీతి సంబంధమైనవి కాగా రెండువంతులు

శృంగార సంబంధమైనవి. ఈ పాకృతపద్యాలల్లో ఎన్నో దేశిపదాలు చోటుచేసుకొన్నవి. దానిచేత దేశిభాషాధ్యయనానికిది తోడ్పడుతుంది. దీని సమయాన్ని నిర్ణయించి చెప్పటం కష్టం.

లభ్యమైన సంస్కృత శ్లోక సంగ్రహ గ్రంథాలల్లో " కవీంద్రవచన సముచ్చయ" మన్నది ప్రాచీనమైంది. క్రీ.శ. 12వ శతాబ్దానికి చెందిన దీని లిఖిత ప్రతి నేపాల్‌లో దొరికింది. ఈ గ్రంథం పేరు గాని సేకరణకర్తపేరుగాని ఆ ప్రతిలో లేదు. ప్రారంభశ్లోకంలో పేర్కొన్న దాన్నిబట్టి దీన్ని "కవీంద్ర వచన సముచ్చయ" మనే పేరుతో ఎఫ్. డబ్లు. థామస్ పరిష్కరించి ప్రచురించాడు. దీనిలో ఒకభాగం బుద్ధుని, మరొక భాగంలో అవలోకితేశ్వరుని స్తుతి వున్నది. మిగతా అంతా అన్ని శ్లోక సంగ్రహ గ్రంథాల్లోవలెనే వివిధ వస్తు విషయాలను వర్ణించే శ్లోకాలు సంగ్రహింపబడినవి. క్రీ.శ. 1000కి పూర్వమున్న కవుల శ్లోకాలు కనబడటంచేత, రాజశేఖరుడు దీన్ని ఉద్ధరించటం చేత ఇది క్రీ.శ. 10వ శతాబ్దానికి పూర్వమే కూర్చబడిందని చెప్పవచ్చును. దీనిలో 525 శ్లోకాలున్నవి.

సోమేశ్వరుడు కూర్చిన " అభిలషితార్థ చింతామణి" అన్న శ్లోక సంగ్రహ గ్రంథానికి "మానసోల్లాస" మని మరొక పేరు. సోమేశ్వరుడు చాళుక్య రాజు రెండవ విక్రమాదిత్యుని కొడుకు. వివిధ విషయాలకు సంబంధించిన శ్లోకాలు దీనిలో కూర్చబడినవి. ఇది ఐదు భాగాలుగా విభాగింపబడింది. రాజు, రాజధర్మాలు రాజనీతి, సంగీతం, చిత్రకళ, మృగయా, జ్యోతిషం, అలంకార శాస్త్రం, వాస్తు శిల్పం, గజాశ్వ శునక సంబంధమైన శ్లోకాలు దీనిలో సంగ్రహింప బడినవి.

బెంగాల్‌లో లక్ష్మణసేనుని ఆస్థానకవి శ్రీధరదాసు "సదుక్తి కర్ణామృత" మనే శ్లోక సంగ్రహ గ్రంథాన్ని కూర్చాడు. దీనిలో 446 కవుల 2368 శ్లోకాలున్నవి. ఇది క్రీ.వ. 1205 లో కూర్చబడింది. శ్రీధరదాసు తండ్రి వటుదాసు కూడ లక్ష్మణసేనుని ఆస్థానంలో వుండేవాడు.

జల్హణుడు "సూక్తిముక్తావళి" ని కూర్చాడు. దీనిలో 243 కవుల 2790 శ్లోకాలున్నవి. వివిధ విషయాలకు సంబంధించిన శ్లోకాలు శాస్త్రీయ పద్ధతిలో అమర్చబడినవి. దీనిని కవి క్రీ.శ. 1257 లో కూర్చాడు.

కళింగరాయ సూర్యుడు (క్రీ.వ. 14వ శ॥) "సూక్తిరత్నహార" మనే శ్లోకసంగ్రహ గంథాన్ని కూర్చాడు. విజయ నగరరాజుల మంత్రి మాధవుని సోదరుడైన వేదభాష్య కారుడు సాయణుడు (క్రీ.శ. 14వ శ॥) "సుధానిధి" అన్న శ్లోక సంగ్రహ గ్రంథాన్ని కూర్చాడు. దీనిలో సాయణుని సోదరుడు భోగనాథుని శ్లోకాలున్నవి.

శారఙ్గధరుడు క్రీ.శ. 1363 లో "శారఙ్గధర పద్ధతి" అనే శ్లోక సంగ్రహ గ్రంథాన్ని కూర్చాడు. ఇది చాల వ్యాప్తిలో వుండి ప్రసిద్ధమైంది. దీనిలో 163 విభాగాలున్నవి. విషయాన్ని బట్టి ఈ విభాగాలు చేయటం జరిగింది. దీనిలో 4689 శ్లోకాలున్నవి. కొన్ని శారఙ్గధరుడు వ్రాసినవి కూడ వున్నవి. దీనిలో 9 మంది కవయిత్రుల శ్లోకాలు కన్పిస్తున్నవి. మొత్తం 264 కవుల శ్లోకాలున్నవి.

క్రీ.శ. 1450 లో సకల కీర్తి "సుభాషితావళి" అనే శ్లోకసంగ్రహ గ్రంథాన్ని కూర్చాడు. సకలకీర్తి అనే పేరుతో ఒక జైన పండితుడు వున్నాడు. ఇతడు అతడే అని నిర్ణయించి చెప్పటానికి ఆధారాలు లేవు. జోనరాజు (కీ.శ. 15వ శ॥ ఉత్తరార్థం) శిష్యుడు శ్రీ వరుడు " సుభాషితావళి" అనే శ్లోక సంగ్రహ గ్రంథాన్ని సంకలనం చేసాడు. దీనిలో దాదాపు 380 కవుల శ్లోకాలున్నవి. ఇదే కాలానికి చెందిన పోతరాయుడు "ప్రసంగ రత్నావళి"ని కూర్చాడు. ఈ గ్రంథంలో వివిధ విషయాలకు సంబంధించిన శ్లోకాలను 72 పద్ధతుల్లో విభజించి సంకలనం చేసాడు. ఇది " ప్రసంగ రత్నావళి సంగ్రహ" మనే పేరుతో సంక్షిప్త రూపంగా కూడ ప్రచారంలో వున్నది.

శారఙ్గధర పద్ధతి తర్వాత ప్రసిద్ధమైన శ్లోక సంగ్రహ గ్రంథం వల్లభదేవుని " సుభాషితావళి" ఇతడు క్రీ.శ. 16వ శతాబ్దంవాడు. దీనిలో 3527 శ్లోకాలు 350 కవులు రచించినవి కూర్చబడినవి. వీటిల్లో కొన్ని వల్లభ దేవుడు వ్రాసినవి కూడ వున్నవి. దీనిలో 119 మొదలుకొని 1127 వరకు మంఖకుని శ్రీకంఠ చరిత్రలోని 11వ సర్గంలోని శ్లోకాలున్నవి. ఈ గ్రంథం విషయాన్ని బట్టి 101 భాగాలుగా విభాగింపబడింది. దీనిలో ఎక్కువ ఉత్తర భారత కవుల శ్లోకాలు కూర్చబడినవి.

శ్రీ కృష్ణచైతన్యుని శిష్యుడు రూపగోస్వామి(క్రీ.శ. 1500) "పద్యావళి" అనే శ్లోకసంగ్రహ గ్రంథాన్ని కూర్చాడు. కృష్ణుని వర్ణన, స్తుతి గల 125 కవుల 686 శ్లోకాలు దీనిలో కూర్చబడినవి. దాదాపు ఇదే కాలానికి చెందిన పెద్దిభట్టు "సూక్తివారిధి" అనే శ్లోక సంగ్రహ గ్రంథాన్ని కూర్చాడు. ఇతడు మహా మహోపాధ్యాయుల కుటుంబానికి చెందినవాడు.

ఇంటిపేరు ఏలేశ్వరంవారు. ఈ గ్రంథానికి "పెద్దిభట్టీయ" మని కూడ పేరు. దీనిలో ఆరు అధ్యాయాలున్నవి. వీటికి వైరాగ్యశతక, దానశతక, రాజశతక, సజ్జనశతక, దుర్జనశతకమని పేర్లు కూడ వున్నవి. ఇందులో విక్రమార్క, భోజరాజులతోపాటు కృష్ణదేవరాయ, వేమభూపాలురు సాహిత్య పోషకులుగా స్మరింపబడినారు.

హరిహరకవి అక్బరు చక్రవర్తి ఆస్థానంలో వుండి " అక్బరీయ కాళిదాసు" అనే బిరుదాన్ని ధరించాడు. ఇతడు "హరిహరసుభాషిత" మనే శ్లోకసంగ్రహ గ్రంథాన్ని కూర్చాడు. హరిహర సుభాషితానికే హరిహరావళి అని పేరున్నట్లు తెలుస్తున్నది. హరిహరుని మరొక శ్లోకసంగ్రహకృతి "సూక్తిముక్తావళి" హరి కవి అని మరోకవి (క్రీ.శ. 1700) "సుభాషిత హారావళి"ని సంకలనం చేసాడు. ఇదే కాలానికి చెందిన శంభోజి "బుద్ధభూషణ" మనే శ్లోక సంగ్రహకృతిని కూర్చాడు.

ఇవేగాక ఇంకా సుమతి "సుభాషితావళి", వేణీదత్తుని "పద్యవేణీ", భాస్కరుని "పద్యామృత తరంగిణి", కవిభట్టు "పద్యసంగ్రహం" మొదలైనవి వున్నవి. క్రీ.శ. 19వ శతాబ్దంలో "సుభాషిత రత్నభాండాగారం", 'సుభాషిత రత్న కర్మాగారం' అనే శ్లోకసంగ్రహ గ్రంథాలు కూర్పబడినవి. క్రీ.శ. 19వ శతాబ్దాంలో ఓటో బ్యోటిలింక్ అన్న జర్మన్ సంస్కృతపండితుడు 8000 శ్లోకాలను సంగ్రహించి జర్మన్ భాషానువాదంతో "Indische spruche" అనే పేరుతో ప్రకటించాడు. ఇందులో చాల శ్లోకాలు నీతిబోధకంగా వున్నవి. క్రీ.శ. 20 శతాబ్దారంభంలో శివదత్తుడు "సుభాషితరత్న భాండాగార" మనే పేరుతో ఒక శ్లోక సంగ్రహ గ్రంథాన్ని కూర్చాడు. ఇంకా ఇప్పటికిని ఎవరో ఒకరు శ్లోకాలను సంకలనంచేస్తు గ్రంథాలను ప్రచురిస్తూనే వున్నారు. ఈ గ్రంథాలు కవితాసౌందర్యాన్ని పాఠకుల ముందుంచుతున్నవి. అంతేగాక వీటిల్లోని శ్లోకాలు భక్తి భావాన్వితమైనవై, నీతి ధర్మ బోధకమైనవై పాఠకుల ఆదరాభిమానాలను పొందుతూనే వున్నవి.

# గద్య కావ్యాలు

## గద్య రచనా పరంపర

"ఋక్ యత్ర అర్థవశేన పాద వ్యవస్థా, గీతిషు సామాఖ్యా, శేషే యజుః" అని యజుస్సుకు జైమిని మహర్షి చెప్పిన వ్యాఖ్యానం. "త్రయీ"లో ఋక్కు - పాదవ్యవస్థతో కూడింది. సామం - గానం చేయబడేది. ఇక మిగిలింది "యజుః' అది అపాదం, అగీతాత్మకం. ఇక అపాదం, అగీతాత్మకమైంది. గద్యమే అవుతుంది. దీన్ని బట్టి వేదాలల్లోనే యజుస్సుల రూపంలో గద్యం కన్పిస్తున్నదని చెప్పవచ్చును. తర్వాత దండ్యాదులు గద్యాన్ని నిర్వచిస్తు "అపాదఃపదసంతానో గద్యమ్" - పాదాత్మకం కాని పదాల కూర్పు గద్యమనబడుతుందన్నారు. వేదాలల్లోనే కాక బ్రాహ్మణ ఉపనిషత్తులల్లోను కొన్ని వృత్తాంతాలు, రాజుల చరిత్రలు గద్యాత్మకమైన కథన రూపంలో వున్నవి. ఇవి "గాథ" లనబడినవి. ఋగ్వేదంలోను నారాశంసి గాథలున్నవి. సంహితలు మొదలుకొని ఉపనిషత్తుల వరకున్న వైదిక సాహిత్యంలో పద్యంతో పాటు గద్యం కూడ స్థానాన్ని సంపాదించుకొన్నది. ఈ గద్యం సరళం. సమాసరహితమై సుబోధకంగా వున్నది. అక్కడక్కడ ఈ గద్యంలో ఉపమ రూపకాది అలంకారాలు కూడ ప్రయోగింపబడినవి. తర్వాత వేదాంగాలల్లోను, ఆయుర్వేదాది గ్రంథాలల్లోను, సూత్ర వాఙ్మయంలోను గద్యం ప్రాధాన్యం వహించింది. గంభీరమైన దార్శనిక గ్రంథాలకు భాష్యాలు గద్యంలోనే వ్రాయబడినవి. వైదిక సాహిత్యంలోని సరళమైన చిన్న చిన్న వాక్యాలతో కూడిన గద్యశైలి గంభీరమైన శాస్త్ర గ్రంథాలల్లో గంభీరమైన రూపాన్నే ధరించింది. క్లిష్టమైన విషయ వివరణ కొరకు గద్యం ప్రౌఢరూపం దాల్చవలసి వచ్చింది. ఈ కాలంలో గద్యశైలి సశక్తమై, గంభీరమై, తార్కికమైన యుక్తియుక్తులతో ప్రౌఢమై ఒక కొత్త రూపాన్ని ధరించింది. దీని తర్వాత పురాణాలల్లోను గద్యం కన్పిస్తున్నది. వీటిల్లోను గద్యం కొంతవరకు సరసరూపాన్ని ధరించింది. ఈ గద్యంలో ప్రౌఢతతో పాటు గాఢబంధత, ఆలంకారిత కూడ ప్రవేశించింది. ఈ విధంగా వైదిక, సూత్ర, భాష్య పురాణాల కాలాల్లో విభిన్న రూపాలల్లో కనిపించే గద్యం లౌకిక వాఙ్మయంలో మరొక భిన్న రూపాన్ని ధరించింది. సరళ సమాసరహితమైన వైదిక గద్యం, ప్రౌఢగంభీరమైన భాష్య, గద్యం, సరసాలంకార సహితమైన పౌరాణిక గద్యం లౌకిక వాఙ్మయంలో సమాససహితం,

శ్లేషాద్యలంకార చమత్కారాల చేత కూడి ఒక విచిత్ర రూపాన్ని ధరించింది. రాను రాను గద్యంలో కృత్రిమత్వం వచ్చిందని విజ్ఞుల అభిప్రాయం.

## గద్యకావ్య రచనా పరంపర

సంస్కృత గద్యకావ్య రచనకు బీజాలు వైదిక గాథలల్లోనే కన్పిస్తున్నవి. తర్వాత కథ, ఆఖ్యాయికాది గద్యకావ్య రచనలు వికసించినవని చెప్పాలి. పతంజలి (క్రీ.పూ. 150) "అధికృత్య కృతే గ్రంథే, బహుళం లుగ్ వ్యక్తవ్యః వాసవదత్తా సుమనో త్తరానచ భవతి భైమరథీ" - అన్న మాటలనుబట్టి అప్పటికే వాసవదత్త, సుమనోత్తర, భైమరథి - అనే ఆఖ్యాయిక కావ్యాలు వ్రాయబడినవని తెలుస్తున్నది. వార్తికకారుడు కాత్యాయనునికి (క్రీ.పూ. 4వ శ॥) అఖ్యాన ఆఖ్యాయికలతో బాగా పరిచయమున్నది. "లుబాఖ్యాయి కాఖ్యో బహుళమ్ అఖ్యానాఖ్యాయి కేతిహాసపురాణేభ్యశ్చ" - అని కాత్యాయనుడన్న దాన్ని బట్టి ఆ కాలంనాటికే ఆఖ్యాన, ఆఖ్యాయికలు బహుళ సంఖ్యలో వ్రాయబడినవని తెలుస్తున్నది. కాని ఇవేవి మనకు ఇప్పుడు లభించటం లేదు. ప్రస్తుతం గద్యకావ్యశైలి మనకు మొట్ట మొదట శిలాశాసనాలల్లోనే దర్శన మిస్తున్నది. క్రీ.శ. 150 ప్రాంతందైన గిర్నార్ శిలాశాసనం రుద్రదాముడు వేయించింది. సరళమైన అలంకృత శైలిలో ఇది వున్నది. ప్రౌఢమైన గద్యకావ్యశైలి కిది ప్రారంభ రూపమని చెప్పవచ్చును. మనకు ఆఖ్యాయికాది గద్య కావ్యాలు లభించకపోయినా క్రీ.శ. 2వ శతాబ్దం నాటిదైన ఈ శాసనాన్ని బట్టి ఆనాటి గద్యకావ్యాల అలంకారశైలి స్వరూపాన్ని ఊహించవచ్చును. దాదాపు ఇదే కాల దైన నాసిక్ శిలాశాసనం ప్రాకృత భాషలో ఉన్నా అది సంస్కృతానువాద రూపమని పండితుల అభిప్రాయం. దీర్ఘసమాసాలు, అనుప్రాస ఉపమాద్యలంకారాలతో కూడిన ఈ శాసనశైలిని ఆ కాలంలో వికసించి ప్రచారంలోవున్న సంస్కృత గద్యకావ్యాల అలంకృత శైలికి ప్రతిబింబంగా తీసుకోవచ్చును. ఆ తర్వాత క్రీ.శ. 350 నాటిదైన హరిషేణ కవికృత ప్రయాగ ప్రశస్తి గద్య పద్యాత్మకమైంది. దీనిలోని గద్యం వైదర్భీరీతిలో నడిచింది. కీథ్ మతానుసారంగా ఉత్తమ కావ్యశైలికిది చక్కని ఉదాహరణ. ఆ తర్వాత క్రీ.శ. 4,5 శతాబ్దాలల్లో వేయబడిన శిలాశాసనాలల్లోని సంస్కృతగద్యం అలంకార బాహుళ్యం కలిగి దీర్ఘసమాసయుక్తమై ఓజోగుణ భరితంగా నడిచింది. క్రమక్రమంగా సంస్కృతగద్యం క్లిష్టరూపాన్ని ధరిస్తూ వచ్చింది. క్లిష్టరూపం నుంచి శ్లిష్టరూపంగా మారింది. లబ్ధగద్యకావ్యాలల్లో సుబంధు వాసవదత్త మొదటిది. సుబంధునాటికి గద్య శైలి పత్యక్షర శ్లేషమయంగా మారి అతిప్రౌఢమై

చమత్కారార్థ పూర్ణమై పండితుల మన్ననలను పొందసాగింది. "ఓజః సమాస భూయస్త్వమేతద్ గద్యస్య జీవితమ్" అని ఆలంకారికుల మతాన్ననుసరించి పద్యానికి ఛందస్సు వలె గద్యానికి సమాసత ప్రాణభూతమైంది.

## గద్యకావ్యభేదం

అగ్నిపురాణకారుడు గద్యకావ్య భేదాలను ఐదింటిని పేర్కొన్నాడు - కథ, ఆఖ్యాయిక, పరికథ, ఖండకథ, కథానిక. కాని వీటిల్లో ప్రధానమైనవి. ప్రత్యేక ప్రక్రియలుగా వికసించి రూపొందినవి రెండే, అవి - కథ మరియు ఆఖ్యాయిక. "అపాదః పదసంతానో గద్యమాఖ్యాయికా కథా ఇతి తస్య ప్రభేదౌద్వౌ" - అని దండి వంటి లాక్షణికులు అంగీకరించిన గద్యకావ్య భేదాలు కూడ రెండే. ఈ ద్వివిధ గద్య ప్రక్రియలు క్రీ.పూ. 4వ శతాబ్దం నాటికే ప్రచారంలో వున్నవి. కవులు ఈ ప్రక్రియల్లో అనేక కావ్య రచనలు చేసారు. కాని మనకు లభించే గద్య కావ్యాల్లో సుబంధు కావ్యమే మొదటిది. కథ, ఆఖ్యాయికలు అలంకార శైలితో కూడి సరసమైన పదరచనతో పద్యకావ్యాల సరసననే వికసించి సహృదయుల ఆదరణను సంపాదించినవి. పద్యకావ్యాలల్లో లేని కథాకథన చమత్కారం వీటిల్లో అదనంగా కన్పిస్తున్నది. ఈ కథాకథన చమత్కారాన్ని ఇవి కథాకావ్యాల నుంచి వారసత్వంగా పొందివుంటవి. పద్యకావ్యాలల్లోని ఉక్తివైచిత్రులు, వర్ణనా చమత్కారాలు ఈ కావ్యాలల్లోను వున్నవి. వాల్మీకి రామాయణకావ్యం మొదలుకొని క్రమక్రమంగా పద్యమహాకావ్య ప్రక్రియ వికసించినట్లుగానే గద్యమహాకావ్య ప్రక్రియ కూడా క్రమక్రమంగా వికసించినటువంటిదే.

## కథ ఆఖ్యాయికల లక్షణాలు

సంస్కృతానాకుల శ్రవ్యశబ్దార్థ పదవృత్తినా
గద్యేన యుక్తోదాత్తార్థా సోచ్ఛ్వాసాఖ్యాయికా మతా

వృత్తమాఖ్యాయతే తస్యాం నాయకేన స్వచేష్టితమ్
వక్త్రంచాపర వక్త్రం చ కాలే భావ్యర్థ శంసిచ
కవేరభిప్రాయ కృతై : కథనై : కైశ్చిదంకితా
కన్యాహరణ సంగ్రామ విప్రలంభోదయాన్వితా

"సంస్కృతభాషలో గద్యంలో కూర్పబడి ఉదాత్త విషయంతో కూడింది ఆఖ్యాయిక. ఆఖ్యాయిక శ్రావ్యమైన శబ్దార్థాలతో కూడి వుండాలి. దానిలో ఉచ్ఛ్వాస విభజన వుండాలి. నాయకుడు స్వయంగా తన వృత్తాంతాన్ని చెప్పుకోవాలి. నడుమ నడుమ భావిసంఘటనలను సూచించే వక్త్ర, అపరవక్త్ర అనే ఛందస్సులు వుండాలి. కన్యాహరణం, స్త్రీ కొరకు యుద్ధం, విప్రలంభం, నాయకుని అభ్యుదయం - వీటితో కూడిన ఇతివృత్తం ఆఖ్యాయికలో వుండాలి" అని భామహుని అభిప్రాయం దండి మతానుసారంగా ఆఖ్యాయికలో వృత్తాంతాన్ని నాయకుడు స్వయంగా చెప్పుకో వచ్చును, లేదా ఇతరులెవరైనా చెప్పవచ్చును. నడుమ నడుమ ఛందస్సులు ఆఖ్యాయికలోనే కాక కథలో కూడ వుండవచ్చునని దండి అభిప్రాయం. ఉచ్ఛ్వాసాది విభజన కథ ఆఖ్యాయికలు రెండింటిలో వుండకూడదని దండి అంటాడు. ఇక కన్యాపహరణాది వర్ణనలు మహాకావ్యాల్లో కూడ వుంటవి. ఆ వర్ణనలచేత కథ ఆఖ్యాయికల్లో భేదాన్ని కల్పించటాన్ని దండి నిరాకరించాడు. దండి దృష్టిలో కథకు ఆఖ్యాయికకు ఏం భేదం పాటించవలసిన అవసరం లేదన్నట్లుగా తెలుస్తున్నది. కాని అగ్ని పురాణకారుడు ఆఖ్యాయికలో నాయకుడు తన వృత్తాంతాన్ని తాను చెప్పుకోవాలి. కన్యాపహరణాది సంఘటనలు వుండాలన్న భామహుని మతాన్ని సమర్థిస్తూ వున్నాడు. కథ లక్షణాలను భామహుడు ఈ విధంగా చెప్పాడు -

నవక్త్రా పరవక్త్రాభ్యాం యుక్తానోచ్ఛ్వాస వత్యపి<br>
సంస్కృతా సంస్కృతాచేష్టా కథా z ప భ్రంశభాక్తథా<br>
అన్యై : స్వచరితం తస్యాం నాయకేన తు నోచ్యతే<br>
స్వగుణా విష్కృతిం కుర్యాదభిజాతః కథం జనః

"కథలో వక్త్ర అపరవక్త్ర ఛందస్సులుగాని ఉచ్ఛ్వాస విభజనగాని వుండదు. నాయకుడు తన వృత్తాంతాన్ని తాను చెప్పుకోడు. కథ సంస్కృతంలో గాని ప్రాకృత, అపభ్రంశాదుల్లోగాని వుండవచ్చును" - అని భామహుని మతం.

దండి కథ అఖ్యాయికల్లో భేదాన్ని అంగీకరించకపోయినా తర్వాత లాక్షణికులు భామహుని మతాన్ని అనుసరించి కథ ఆఖ్యాయికలు భిన్న ప్రక్రియలని భావించారు. శివతత్త్వరత్నాకరకారుడు కథ ఆఖ్యాయికలు భిన్నమని చెప్తూ "కథా కల్పితవృత్తాంతా, సత్యార్థాఖ్యాయికా మతా - "కల్పితేతివృత్తం కలది కథ, సత్యవృత్తాంతం కలది ఆఖ్యాయిక' ' అని చెప్పాడు. ఆఖ్యాయికలోని వృత్తాంతాన్ని నాయకుడుగాని ఇతరులుగాని చెప్పవచ్చునని

దండి, అగ్నిపురాణ కారుడు, విశ్వనాథాదులు అంగీకరించారు. అంటె ఆఖ్యాయికలోని వృత్తాంతం నిజంగా సంభవించిన వృత్తాంతం మీద ఆధారపడి వుండాలి. ఇంకా నాయకుడు తన వృత్తాంతాన్ని తాను ఉత్తమ పురుషలో చెప్పుకోవటం కాని లేకపోతే ఇతరులు నాయకుని వృత్తాంతాన్ని ప్రథమ పురుషలో చెప్పటంకాని జరగాలి అని తెలుస్తున్నది. నాయకుని జీవిత వృత్తాంతాన్ని సత్యసంఘటనలను వివరిస్తుంది కాబట్టి అఖ్యాయిక ఈనాటి "జీవిత చరిత్ర" (Biography) అన్న ప్రక్రియకు చెందుతుంది. నాయకుని చరిత్రను ఇతరులు చెప్తే దాన్ని జీవితచరిత్ర -biography అని, నాయకుడు తన చరిత్రను తాను చెప్పుకుంటే ఆత్మకథ autobiography అని భేదం. ఈ భేదాన్ని ఆఖ్యాయికలో ప్రాచీనలాక్షణికులు కూడ పాటించారు. ఉదాహరణకు హర్షచరిత్ర అన్న ఆఖ్యాయికలో మొదటి రెండు ఉచ్ఛ్వాసాలల్లో కవిబాణుడు తన స్వీయ వృత్తాంతాన్ని ఉత్తమ పురుషలో చెప్పుకొన్నాడు. తర్వాత ఆరు ఉచ్ఛ్వాసాలల్లో మహారాజు హర్షుని చరిత్రను ప్రథమ పురుషలో వివరించాడు. అంటె ఆత్మకథ జీవిత చరిత్ర భేదాలు రెండు హర్షచరిత్రలో దర్శనమిస్తున్నవి, సంస్కృతకవులు ఆఖ్యాయికల్లో రాజుల, చారిత్రక పురుషుల చరిత్రలు తీసుకొని రచించారు. కాబట్టి ఆఖ్యాయిక కావ్యాలను గూర్చి గద్యకావ్య ప్రకరణంలో కాక చారిత్రకకావ్య ప్రకరణంలో చెప్పటం జరిగింది. గద్యకావ్య ప్రకరణంలో కేవలం కథ ప్రక్రియకు చెందిన కావ్యాలను తీసుకోవటం జరిగింది.

దండి వంటి లాక్షణికులు కథ అఖ్యాయికల్లో భేదాన్ని పాటించకపోయినా భామహుని వంటివారు ఆ రెండింటికి స్పష్టమైన సరిహద్దురేఖలను కల్పించారు. కథ ఆఖ్యాయిక ప్రక్రియల భిన్నత్వాన్ని ప్రతిపాదించటానికే అన్నట్లుగా బాణుడు ఆ రెండు ప్రక్రియలకు చెందిన కావ్యాలను వ్రాసి వాటి లక్షణాలను స్పష్టం చేసాడు. బాణుని హర్షచరిత్ర ఆఖ్యాయిక ప్రక్రియకు చెందగా కాదంబరి కథాప్రక్రియకు చెందింది. బాణుని కాదంబరిని బట్టి కథా ప్రక్రియ లక్షణాలను ఇట్లా చెప్పవచ్చును - కథా వస్తువు కల్పితమైంది. కవి కథాకథనచాతుర్యానికి, కల్పనా ప్రతిభకు నిదర్శనంగా కథ వుంటుంది. అవాంతర కథవలె భాసించే వృత్తాంతంతో కథను ప్రధానంగాకూర్చి రక్తి కట్టించవచ్చును. నాయకుడే తన వృత్తాంతాన్ని చెప్పుకోవాలనే నియమం లేదు. ఉచ్ఛ్వాసాది విభజన లేదు. మధ్య మధ్య శ్లోకాలు వుండాలనే నియమం లేదు. కథారంభంలో శ్లోకాలల్లో దేవాతాస్తుతి, గురుస్తుత్యాదు లుండవచ్చును. సందర్భానుకూలంగా ప్రకృత్యాది వర్ణనలుండ వచ్చును. శైలి పంచతంత్రాది కథాకావ్యాల్లో వలె సరళమైంది కాక అలంకృతంగా, ఓజో పూర్ణంగా వుండాలి.

ఉక్తిచమత్కారానికి, భావ వైచిత్రికి శైలిలో ప్రాధాన్యం వుంటుంది. ఈ కథా ప్రక్రియకు చెందిన గద్యకావ్యాలు శైలి. అలంకార చమత్కృతులు, భావవైచిత్రులు, ప్రకృత్యాది వర్ణనలు మొదలైన వాటి దృష్టితో పద్యమహా మహాకావ్యాలతో పోటిపడ్తున్నవి. కాబట్టి గద్య కథా ప్రక్రియను గద్యమహాకావ్యం అని అనటం ఎంతగానో సమంజసంగా వుంటుంది. లబ్ధ గద్యమహాకావ్య కవుల్లో మొదట చెప్పుకోదగినవారు సుబంధు, బాణ, దండి కవులు.

## సుబంధు

### సుబంధు కాలం

సుబంధు గద్యమహాకావ్యం వాసవదత్త. ఈ కవి కాలాన్ని నిర్ణయించటానికి కావ్యంలో ఏమి ఆధారం లేదు. ఒక్కచోట మాత్రం కవి విక్రమాదిత్యుని "సరసీవ కీర్తి శేషం గతవతి భువి విక్రమాదిత్యే" - అని పేర్కొన్నాడు. ఇక్కడ క్రీ.పూ. మొదటి శతాబ్దంవాడైన సాహసాంక విక్రమాదిత్యున్నే కవి పేర్కొన్నాడని కొందరు విమర్శకుల అభిప్రాయం. ప్రాకృతవ్యాకర్త వరరుచికి సుబంధు మేనల్లుడని ఐతిహ్యం. వరరుచి సాహసాంక విక్రమాదిత్యుని నవరత్నాలల్లో ఒకడని ప్రసిద్ధి. వాసవదత్త టీకాకారుడు నరసింహవైద్యుడు సుబంధు విక్రమాదిత్యుని మరణానంతరం వాసవదత్త కావ్యాన్ని రచించినట్లు చెప్పాడు - "కవిరయం విక్రమాదిత్య సభ్యః తస్మిన్ రాజ్ఞి లోకాంతరం ప్రాప్తే ఏతన్నిబంధం కృతవాన్". కాని సుబంధు గుణాఢ్యుని గురించి అతని బృహత్కథను గురించి తనకుగల పరిచయాన్ని ప్రకటించటంచేత అతడు గుణాఢ్యుని (క్రీ.శ. మొదటి శతాబ్దం) తర్వాతవాడని స్పష్టమౌతున్నది. క్రీ.పూ. మొదటి శతాబ్దంవాడైన విక్రమాదిత్యుని ఆస్థాని కాడని తేలుతున్నది. క్రీ.శ. 1859 లో ఫిట్జ్ ఎడ్వర్డ్ హాల్ వాసవదత్తను పరిష్కరించి ప్రచురించాడు. విక్రమాదిత్యుని తర్వాత చాలా కాలానికి సుబంధు నివసించినట్లుగా హాల్ నిర్ణయించాడు. మాళవదేశాన్ని ఏలిన యశోధర్మయే (క్రీ.శ. 533-583) సుబంధు పేర్కొన్న విక్రమాదిత్యుడని కాబట్టి సుబంధు యశోధర్మ మరణానంతరం అంటె క్రీ.శ. 606-612 ప్రాంతంలో వున్నాడని హాల్ తలంచాడు. యశోధర్మ కొడుకు శీలాదిత్యుడు రాజ్యాన్ని కోల్పోయి హూణుల సహాయంతో తిరిగి రాజ్యాన్ని సంపాదించాడు. ఈ శీలాదిత్యుడే మౌఖరి వంశరాజు గ్రహవర్మను చంపి అతని భార్య హర్షవర్ధనుని చెల్లెలు రాజశ్రీని బంధించాడు. శీలాదిత్యుడు క్రీ.శ. 583 లో రాజ్యానికి వచ్చి క్రీ.శ. 606 ప్రాంతంలో రాజ్యవర్ధనుని చేత చంపబడినాడు. సుబంధు యశోధర్మ, శీలాదిత్యుల ఆస్థానంలో వుండగా బాణుడు

హర్షవర్ధనుని ఆస్థానంలో వుండేవాడని లూయీ గ్రే వాసవదత్త పీఠికలో (క్రీ.శ. 1912 ప్రచురణ) తన అభిప్రాయిన్ని ప్రకటించాడు. సుబంధును బాణుడు పేరుపెట్టి పేర్కొనకపోయినా అతని వాసవదత్త కావ్యాన్ని "కవీనామ గళద్దర్పోనూనం వాసవదత్తయా' ' అని గొప్పగా ప్రశంసించాడు. వాళ్ళిద్దరు వైరిరాజుల ఆస్థానంలో వున్నట్లయితే సుబంధు కావ్యాన్ని బాణుడు అంతగా ప్రశంసించి వుండేవాడు కాదేమో. అందులో సమకాలిక కావ్యాన్ని అంత గొప్పగా పొగడటం కాని అనుకరించటం కాని జరుగదు. కాబట్టి సుబంధు యశోవర్మ, శీలాదిత్యుల ఆస్థానకవి అనటం సాధ్యంకాదు. మరికొందరు విమర్శకులు పతంజలి మహాభాష్యంలో (క్రీ.పూ. 2వ శ॥) పేర్కొన్న వాసవదత్త అన్న ఆఖ్యాయిక సుబంధుకావ్యమే అని కాబట్టి సుబంధు క్రీ.పూ. 2వ శ॥కి పూర్వుడని నిర్ణయించటానికి ప్రయత్నించారు. కాని అది సర్వజనాంగీకారయోగ్యమైన వాదం కాదు. పతంజలి పేరొన్న వాసవదత్త ఆఖ్యాయిక కాబట్టి అది సత్యసంఘటనల మీద ఆధారపడివుంటుంది. అంటె చారిత్రకమైన ఉదయనుని భార్య వాసవదత్తకు సంబంధించిన వృత్తాంతం దానిలో వుండివుండవచ్చును. సుబంధు వాసవదత్త "కథ" అనటం స్పష్టం. ఇది కల్పితకథతో కూడింది. కాబట్టి రెండు కావ్యాలు ఒకటని నిశ్చయించలేము. అంతేగాక క్రీ.పూ. 2వ శ॥కి పూర్వమున్న వాడు క్రీ.పూ. 1వ శ॥ వాడైన విక్రమాదిత్యుని స్మరించటం జరగదు.

వాక్పతిరాజు (క్రీ.శ. 700 ప్రాంతం) భాసాదులతోపాటు సుబంధును పేర్కొన్నాడు. కాని బాణుని పేర్కొనలేదు. నాటికి బాణుడు ఇంకా ప్రాచీన కవుల కోవలోనికి చేరలేదని దీన్ని బట్టి తెలుస్తున్నది. సుబంధు మాత్రం అప్పటికే భాసకాళిదాసాదుల పక్కన స్థానాన్ని సంపాదించుకొన్నాడంటె సుబంధు బాణునికి కొన్ని దశాబ్దాలైన పూర్వుడని చెప్పవలసి వుంటుంది. కవిరాజు, మంఖ కవులు బాణుని కన్న ముందు సుబంధును పేర్కొన్నారు. సుబంధు వాసవదత్తను మించటానికే బాణుడు కాదంబరిని రచించాడని లోకంలో ప్రసిద్ధి వున్నది. బాణుడు మరణించటంచేత కాదంబరిని అతని కొడుకు పూర్తిచేసాడు. అంటె బాణుడు హర్ష చరిత్ర రచన తర్వాత చరమకాలంలో కాదంబరి రచనను చేపట్టాడని చెప్పవచ్చును. బాణుడు హర్షచరిత్ర రచన తర్వాత వాసవదత్తను మించవలెననే కాంక్షతో కాదంబరి రచనకు పూనుకొనివుంటాడు. దీన్ని బట్టికూడ సుబంధు బాణునికి దశాబ్దాలైనా పూర్వం వాడని నిశ్చయించవలసివుంటుంది. బాణుని కాలం దాదాపుగా క్రీ.శ. 606-648 అయితే సుబంధు క్రీ.శ. 5వ శతాబ్దం ఉత్తరార్ధంలో జీవించివుంటాడని చెప్పవచ్చును. అప్పుడు ఒకవేళ సుబంధు పేర్కొన్న విక్రమాదిత్యుడు గుప్తవంశానికి చెందిన రెండవ

చంద్రగుప్తుడు అయివుంటాడు. వాసవదత్త టీకాకారుడు నరసింహవైద్యుడు చెప్పినట్లుగా చంద్రగుప్తుని (క్రీ.శ. 357-413) మరణానంతరం కొన్ని దశాబ్దాలకు సుబంధు వాసవదత్తను రచించి వుంటాడనటంలో ఎటువంటి ఆపత్తి వుండదు.

## సుబంధు ప్రశస్తి

"అలబ్ధ వైదగ్ధ్య విలాసముగ్ధయా ధియా నిబద్ధేయమతి ద్వయీ కథా" - అని బృహత్కథ, వాసవదత్తలను బాణుడు కీర్తించాడని పండితుల అభిప్రాయం అంటె బాణుని నాటికే వాసవదత్త కథ విశేషాదరణను, ప్రచారాన్ని పొందిందనటం తథ్యం. వాక్పతి రాజు (క్రీ.శ. 700 ప్రాంతం) గౌడవహో కావ్యంలో భాసకాళిదాసాది కవులతో పాటు సుబంధును పేర్కొన్నాడు -

భాసమ్మి జలణమిత్తె కంతిదేవే అజస్సరహ ఆరే
సోబంధవే అబంధమ్మిహరియందే అ ఆణందో.

కవిరాజు (క్రీ.శ. 1200) తన రాఘవ పాండవీయంలో సుబంధును వక్రోక్తి మార్గ నిపుణునిగా స్తుతించాడు -

సుబంధుర్బాణ భట్టశ్చ కవిరాజ ఇతి త్రయః
వక్రోక్తి మార్గ నిపుణాః చతుర్థో విద్యతే వానవా

మంఖకవి (క్రీ.శ. 1200) శ్రీకంఠచరిత్రలో సుబంధును మేంఠ, భారవి, బాణులతో చేర్చి స్తుతించాడు. శారఙ్గధర పద్ధతి, సదుక్తి కర్ణామృతం, సుభాషిత రత్నావళి, సుభాషిత రత్నభాండాగారాలల్లో సుబంధు ప్రశంసచేయబడింది. వేమభూపాలచరిత్రకర్త వామనభట్టబాణుడు (క్రీ.శ. 15వ శ॥ పూర్వార్ధం) మయూరాదులతో చేర్చి సుబంధును శ్లేషలో ఇట్లా ప్రస్తుతించాడు -

ప్రతి కవి భేద బాణః కవితా తరుగహన విహరణమయూరః
సహృదయ లోక సుబంధుర్జయతి శ్రీభట్టబాణ కవి రాజః

ఆలంకారికుడు వామనుడు (క్రీ.శ. 800 ప్రాంతం) బాణునితో పాటు సుబంధు కావ్యం నుంచి ఉద్ధరణలను ఇచ్చాడు.

# వాసవదత్త ఇతివృత్తం

సుబంధు ఏకైక కావ్యం వాసవదత్త. అతడు ఇతర రచనలను చేసినట్లు తెలియరాలేదు. వాసవదత్త అని పేరు వినగానే ఈ కథ ప్రసిద్ధమైన ఉదయనుని భార్య వాసవదత్త కథ అని అనుకుంటాము. కాని ఈ కథకు ఆ వాసవదత్త కథకు ఏమి సంబంధంలేదు. 'కథ' అన్న గద్యకావ్య ప్రక్రియకు ప్రధాన లక్షణం కల్పితేతి వత్తం కలిగివుండటం. దాన్ననుసరించి ఈ కథాకావ్యంలోని ఇతివృత్తం కల్పితమైంది. కాని ఏ కారణంచేతనో కవి ప్రసిద్ధమైన వాసవదత్త పేరును తన కావ్యనాయికకు పెట్టుకొన్నాడు. ఒక వేళ అందరిని ఆకర్షించటానికి అట్లా చేసి వుంటాడు. ఈ కావ్యంలోని ఇతివృత్తం పెద్దదికాదు. వర్ణనలతో కథ పెంచబడింది. కథాకల్పనలో జానపద కథల ప్రభావం కన్పిస్తున్నది. మాట్లాడే పక్షులు, మాయా గుర్రం, మనుష్యులు రాళ్ళుగా మారటం, ఆకాశవాణి భాషణం మొదలైనవి జానపదుల కథల్లో తరచుగా కనబడే కల్పనలు, అద్భుతాలు. కథాకల్పనలో సుబంధుకు బాణునికున్న నేర్పు వున్నదని చెప్పలేము. కాని బాణునికి సుబంధు కథా కల్పన శైలి విషయాలల్లో ఆదర్శంగా నిలిచాడన్నది మరచి పోకూడదు. వాసవదత్తలోని కథ ఇట్లా నడుస్తుంది. -

కందర్పకేతువనే రాకుమారుడు స్వప్నంలో ఒక అందమైన కన్యను చూచి వెతుక్కుంటూ తన మిత్రుడు మకరందునితో బయలుదేరుతాడు. ఒకరాత్రి వింధ్యాటవిలో చెట్టుకింద పడుకొనివుండగా అతడు శుకసారికల సంభాషణను విని-పాటలీపురపు రాకుమారి వాసవదత్త స్వప్నంలో ఒక అందమైన రాకుమారున్ని చూచి అతన్ని వెతుక్కుంటూ బయలుదేరిందని తెలుసుకుంటాడు. ఆ పక్షుల సహాయంతో కందర్పకేతువు వాసవదత్తను కలుసుకుంటాడు. వాసవదత్త కందర్పకేతువులు స్వప్నంలో చూచుకొన్న జాడలను బట్టి పరస్పరం గుర్తించుకొని ప్రేమించుకుంటారు. కాని వాసవదత్త తండ్రి ఆమె వివాహాన్ని ఒక గంధర్వరాజుతో చేయదలుస్తాడు. అది తెలుసుకొని వాసవదత్త కందర్ప కేతువులు గుర్రాల మీద పారిపోతారు. వాళ్ళిద్దరు వింధ్యాటవిలో ఆ రాత్రి నిద్రపోతారు. తెల్లవారుజామున కందర్పకేతువు లేవకముందే వాసవదత్త లేచి కుతూహలంతో బయలుదేరిపోయి అడవిలో ప్రవేశిస్తుంది. అప్పుడు రెండు కిరాతదళాలు వచ్చి ఆమెను వెంబడించి ఆమె కొరకు పోట్లాడుకుంటారు. వాళ్ళు యుద్ధం చేస్తుండగా తప్పించుకొని, పారిపోయి ఆమె ఒక ఆశ్రమంలో ప్రవేశిస్తుంది. అక్కడ మునిశాపంతో రాయిగా

మారుతుంది. కందర్పకేతువు ఆమె కొరకు వెతుక్కుంటూ వచ్చి ఆమెను కనుక్కోలేక ఆత్మహత్యకు పూనుకుంటాడు. అప్పుడు ఆకాశవాణి వాసవదత్త జాడను కందర్పకేతువుకు చెప్తుంది. కందర్పకేతువు ఆత్మహత్యా ప్రయత్నం నుంచి విరమించుకొని పోయి వాసవదత్తను చేరుకుంటాడు. అతని స్పర్శతో ఆమె తిరిగి మానవరూపాన్ని పొందుతుంది. వాళ్ళిద్దరు కందర్పకేతువు నగరానికి పోయి వివాహం చేసుకొని సుఖంగా వుంటారు.

## వాసవదత్త ఇతివృత్త కల్పన

వాసవదత్త కథను సుబంధు బృహత్కథలోని కథల సంవిధానాన్ని ఆధారంగా పెట్టుకొని అల్లివుంటాడు. వాసవదత్త కథలోని సంఘటనలల్లో బృహత్కథ కథల ఛాయలున్నవి. "అపూర్వాద్యా బృహత్కథా మయా(శుతా (పత్యక్షీకృతా చ కేచిత్ బృహత్కథానుబంధిన ఇవ గుణాఢ్యాః" అని తనకు బృహత్కథతో గల పరిచయాన్ని సుబంధు వెల్లడించివున్నాడు. వాసవదత్త కథలో అక్కడక్కడ కవి శ్లోకాలను కూడ చేర్చాడు. కాని కవితాదృష్టితో పరిశీలిస్తే ఈ శ్లోకాలల్లో విశేషమేమి లేదు. చిన్న కథను తీసుకొని కవి వర్ణనా బాహుళ్యంతో విస్తరింపజేసాడు. దండి వలె కేవలం కథను చెప్పటం అతని ప్రధానోద్దేశం కాదు. అందుచేత అతడు కథకు ప్రాధాన్యమియ్యలేదు. పుర సముద్ర శైల ఋతు నది సూర్యాస్తమయ చంద్రోదయ యుద్ధాది వర్ణనలు కావ్యంలో వున్నవి. వర్ణనలకు అవకాశం లభించేటట్లుగా సుబంధు కథను మలిచాడనటంలో సందేహం లేదు. వర్ణనలను కవి ఆలంకారిక శైలిలో రమ్యంగా రచించాడు. కిరాతార్జునీయాది పద్యమహాకావ్యాలల్లో వలె 'కథ' ప్రక్రియలోను వర్ణనలు ప్రధానమైనవి కాబట్టి 'కథ' ప్రక్రియను గద్యమహాకావ్యమనటం ఎంతో సమంజసం. గద్య పద్య భేదం తప్ప కవిత్వంలోని ఊహావైచిత్రి, భావచమత్కారం, అలంకార సౌందర్యంలో గద్య మహాకావ్యాలకు పద్య మహాకావ్యాలకు ఏమి భేదం లేదు. పద్యమహాకావ్యాలల్లో లేని ఇతివృత్త మౌలికత, కథాకథన చమత్కారాలు గద్యమహాకావ్యాలల్లో అదనంగా వున్నవి.

## సుబంధు కవిత్వం

సుబంధు శ్లేష కవిత్వానికి ప్రసిద్ధి చెందినవాడు. "సరస్వతీ దత్త వరప్రసాదాచ్చక్రే సుబంధుః సుజనైక బంధుః, ప్రత్యక్షరశ్లేషమయ ప్రపంచ విన్యాస వైదగ్ధ్య నిధిం ప్రబంధమ్-" సరస్వతీ వరప్రసాదంచేత శ్లేషను చెప్పనేర్చిన వాడనని సుబంధు స్వయంగా చెప్పుకున్నాడు.

సుబంధు కవిత్వం సమాసజటిలమై శ్లేషాలంకార పరిపూర్ణమై అర్థవై చిత్రి కలది. ఈ శైలియే బాణునికి ఆదర్శమైంది. బాణునిలో సుబంధుశైలి మరింత క్లిష్టమై, సుందర ప్రౌఢమై కనబడుతున్నది. బాణుని శైలి వలెనే సుబంధుశైలి పాండిత్య స్ఫోరకమైంది. వర్ణనలల్లో అతడు తనకుగల పురాణ కథాపరిచితిని బాణునివలెనే ప్రకటించాడు. పండితులకు ఈ శైలి రసానందాన్ని కలిగిస్తుంది. కాని సామాన్య పాఠకులకిది శిరోవేదనను కలిగించవచ్చును. దీర్ఘ సమాస భూయిష్ఠమై, క్లిష్ట శ్లిష్టపద రచనచేత కూడిన సుబంధుశైలి గౌడీరీతికి చెందింది. దీనిలో పాఠకుడు కథాపఠనంలో రమించే దాని కన్నా వర్ణనా చమత్కారం చేత ఆహ్లాదితుడౌతాడు. కథాకథనకౌశలంగాని పాత్ర చిత్రాణా శిల్పంగాని ఈ కావ్యంలో మృగ్యం. కాని ఈ కావ్యం గద్యాలంకారశైలికి ప్రథమోదాహరణం. సుబంధులోని అలంకారశైలియే తర్వాత బాణుడు మొదలైన గద్యకవుల్లో పరిణతావస్థను చేరుకొన్నది.

హాల్ మొదలైన విమర్శకులు కొందరు ఈ కావ్యాన్ని అశ్లీల, అవినీతి బోధక కావ్యంగాను, శైలి విషయంలో నికృష్టమైందిగాను అభిప్రాయ పడినారు. కాని కథాకావ్యాల ప్రధానోద్దేశం కథాకథనం, వాగ్వైచిత్రులతో పాఠకులకు ఆహ్లాదాన్ని కలిగించటం. కాబట్టి దీనిలో నీతి కొరకు వెతకటం వ్యర్థప్రయాసం. ఈ కావ్యం అవినీతి బోధకం మాత్రం కాదు. ఇక శైలి విషయంలో - శృంగార రసభరితమై కొన్ని వర్ణనలు. ముఖ్యంగా నాయికావర్ణన చమత్కారభరితమై విచ్చలవిడిగా కన్పించవచ్చును. కాని ఆ వర్ణనలు అశ్లీలాలు మాత్రం కావు. ఇక శ్లేషాద్యలంకారాలచేత కూడిన ఈ శైలి కొందరికి సమ్మోదాన్ని కలిగించక పోవచ్చును. కాని కథాకావ్యాలల్లో అటువంటి శైలి ఆహ్లాదకరమైనదే. చమత్కార పూర్ణమైన అటువంటి శైలి చాలా మందికి ఆమోదకరమైందే. తర్వాత తర్వాత ఇటువంటి వర్ణనా చమత్కృతులు అలంకార వైచిత్రులు పద్యమహాకావ్యాలల్లోను ప్రవేశించినవి. ఇది సుబంధు బాణుల కవిత్వ ప్రభావం చేతనే కావచ్చును.

ఓజోగుణభరితమైన సుబంధుశైలి వక్రోక్తిభరితమైందని, సుబంధు వక్రోక్తి నిపుణుడని కవిరాజు స్తుతించాడు. శ్లేష వక్రోక్తికి పుష్టినిస్తుందని దండి అంటాడు - "శ్లేషః సర్వాసు పుష్ణాతి ప్రాయో వక్రోక్తిషు శ్రియమ్". అట్లా వక్రోక్తి నిపుణుడైన సుబంధు శ్లేషను తన వక్రోక్తి చమత్కారానికి చాల వాడుకున్నాడు. తన కవిత్వం ప్రత్యక్షర శ్లేషమయమని సుబంధుయే చెప్పుకొన్నాడు. సుబంధు కేవలం శ్లేషాలంకారాన్నే కాక శ్లేషమీద ఆధారపడిన విరోధాభాస, పరిసంఖ్యాదులను కూడ విరివిగా వాడాడు. ఇంకా మాలాదీపక, ఉత్ప్రేక్ష, యమక, ప్రౌఢోక్తి, రూపక, అతిశయోక్తి, కావ్యలింగ, అనుప్రాస, మీలిత, రత్నావళి, సమ, సంభావన, కారణమాల,

లోకోక్తి, స్వభావోక్తి మొదలైన అలంకారాల నెన్నిటినో కవి ప్రయోగించాడు. చంద్రోదయ, చంద్రాస్తమయ, సూర్యోదయ, సూర్యాస్తమయ, రాత్రి, పర్వత, నది ఋతు, పుర మొదలైన కావ్యవర్ణనలను దీర్ఘంగా చమత్కారపూర్ణంగా చేసాడు. నఖశిఖ పర్యంత స్త్రీ వర్ణన చమత్కార పూర్ణంగా చేయబడింది.

లభించిన వాసవదత్త ప్రతులను రెండు విధాలుగా విభజించవచ్చును - ఉత్తరాదిప్రతులు, దక్షిణాదిప్రతులు. ఉత్తరాది ప్రతుల్లో కన్న దక్షిణాదిప్రతుల్లో వర్ణనలు కొంత దీర్ఘంగా వున్నవి. రెండింటి కథలో ఎటువంటి భేదం లేదు. దక్షిణాదిప్రతుల్లో అక్కడక్కడ వర్ణనలు, అలంకారవైచిత్రి పొడిగించబడినవి. దీన్నిబట్టి ఈ కావ్యంలో కాలక్రమంగా ప్రక్షిప్తాలు కూడ చేరినవని చెప్పవచ్చును.

## రొమాన్సు

సంస్కృతంలోని కథామహాకావ్య ప్రక్రియ గ్రీకు రొమాన్సు ప్రక్రియ నుంచి దిగుమతి అయిందని, గ్రీకు సాహిత్యంలోని ఆ ప్రక్రియ ప్రభావం వీటి మీద వున్నదని పీటర్సన్, వేబర్ మొదలైన పాశ్చాత్య విమర్శకులు తలంచారు. లెవీ ఈ అభిప్రాయాన్ని ఖండించాడు. భారతీయ కథామహాకావ్యాలల్లోను, గ్రీకు రొమాన్సు ప్రక్రియలోను కొన్ని సమాన సూత్రాలున్నవి నిజమే కాని అంతమాత్రాన గ్రీకు ప్రభావం భారతీయ గద్యమహా కావ్యాల మీద వున్నదని చెప్పలేము అని లెవీ అంటాడు. ప్రపంచంలోని అన్ని దేశాలల్లోని కథల్లో కొన్ని సమాన సూత్రాలు కన్పిస్తవి. ఆ సమానతలు మానవ మస్తిష్క సృష్టిలోని సమానత ఫలితం వల్ల కలిగింది కావచ్చును. కలలో చూచి ప్రేమించటం, ప్రియుల మధ్య రాయబారాలు, లేఖలు, విరహం, శాపం, ఒక కథలో మరొక కథను ఇరికించటం - ఇవన్నీ ప్రపంచంలోని రొమాన్సు కథల్లో కనిపించే సమాన గుణ ధర్మాలు. గ్రీకు లాటిన్ భాషల్లోని రొమాన్సు ప్రక్రియలో కథకే ప్రాధాన్యం. భారతీయ గద్యమహా కావ్యాలల్లో కథ కన్నా శైలీ చమత్కారానికి, వర్ణనలకు ప్రాధాన్యం. అటువంటప్పుడు గ్రీకు రొమాన్సుల ప్రభావంతో సంస్కృత గద్య మహాకావ్యాలు పుట్టాయని చెప్పటం సత్యదూరమౌతుంది.

## దండి

### దండి కాలం

కొందరు సాహిత్యకారులు దండిని సుబంధుకన్న పూర్వుడుగా తలంచారు. వాక్పతిరాజా (క్రీ.శ. 700) కాళిదాసు భారవాద్యులతో సుబంధును స్మరించాడు. కాని

దండిని అతడు పేర్కొనలేదు. కాబట్టి బాణునివలె దండికూడ సుబంధుకు అర్వాచీనుడని చెప్పవలసి వుంటుంది. మరికొందరు విమర్శకులు శైలిని దృష్టిలో పెట్టుకొని దండిని ప్రథమ గద్యకావ్యకవిగా చెప్పారు. దండి శైలి సరళమైంది. సుబోధకంగా, సమాసత లేకుండ వైదర్భీరీతిలో నడిచింది. మొదట సర్వసామాన్య జనసుబోధకమైన సంస్కృత గద్యశైలి సుబంధు, నాటికి ఈషత్ప్రౌఢమై, శ్లేషమయమైందని .బాణుని నాటికి అతిప్రౌఢమై, సమాసభరితమై పాండిత్యంతో శ్లేషాదులతో క్లిష్టమై విద్వజ్జనరంజక మాత్రమైందని, ఈ ముగ్గురు కవులు సంస్కృత గద్య వికాసానికి ప్రతినిధి కవులుగా వున్నారని వివరించారు. ఇది మంచి అభిప్రాయంగానే కన్పిస్తున్నది. కాని చారిత్రక సత్యాన్ని పరిశీలిస్తే దండి బాణునికన్న ఈషత్పూర్వుడే కాని సుబంధుకన్న పూర్వుడు మాత్రంకాడు. వేబర్, మాక్స్‌ముల్లర్, మాక్‌డోనెల్, యాకోబి వంటి పాశ్చాత్య విమర్శకులు ఇంకా ప్రాచ్య విమర్శకులు దండి బాణునికన్న పూర్వుడనే వాదాన్ని సమ్మతించారు. అవంతిసుందరి కథానుసారంగా దండి భారవికి ప్రపౌత్రుడు. వీరిది అసలు గుజరాతు ప్రాంతమని వేంగీ పాలకుడైన కుబ్జవిష్ణువర్ధనునితో భారవి ఆంధ్రదేశం వచ్చాడని ఐతిహ్యం. ఒకసారి భారవి రాజుతో అరణ్యానికి వేటకు పోయి అక్కడ అత్యుగ్రక్షుధా పీడుతుడై మాంసం తిన్నాడట! ఆ పాప కార్యానికి లజ్జించి భారవి రాజధానికి తిరిగి పోకుండ అరణ్యంలో తిరుగసాగాడు. అక్కడ అతనికి నిర్వాసితుడైన గాంగ వంశరాజు దుర్వినీతునితో స్నేహమేర్పడింది. ఆ రాజు ప్రేరణతో భారవి కాంచీనగర రాజు పల్లవ సింహ విష్ణువును ఆశ్రయించాడట. భారవి అసలు పేరు దామోదరుడు. అతనికి మనోరథుడనే కుమారుడున్నాడు. మనోరథుని నాల్గవ కుమారుడు వీర దత్తుడు. అతని భార్య గౌరి. వారి కుమారుడే దండి. దండి బాల్యావస్థలోనే తల్లిదండ్రులను కోల్పోయాడు. చాళుక్య రాజు రెండవ పులకేశి కాంచీ నగరం మీదికి దండెత్తి రాగా (క్రీ.శ. 635) ఆ అల్లర్లలో దండి కంచిని విడిచిపెట్టి చాలా కాలం వరకు దేశాంతరాలల్లో తిరిగాడట. మొదట నరసింహవర్మ కాంచి సింహాసనాన్ని అధిష్ఠించిన తర్వాత దండి కంచికి తిరిగి వచ్చి అక్కడ స్థిరనివాసమేర్పరుచుకొన్నాడట ఈ వృత్తాంతాన్ని బట్టి దండి జీవిత కాలాన్ని కొంతవరకు నిశ్చయించవచ్చును. క్రీ.శ. 634 నాటికే భారవి ప్రసిద్ధుడై కాళిదాసాదుల కోవలోనికి చెందినట్లుగా ఐహోళె శాసనాన్ని బట్టి తెలుస్తున్నది. అంటె అప్పటికి భారవి జీవించి వంద సంవత్సరాలైనా అయివుంటుంది. అంటె భారవి కాలాన్ని దాదాపుగా క్రీ.శ. 550 ప్రాంతమని చెప్పవచ్చును. భారవికి దండికి నడుమ రెండు తరాలు గడిచినవి. తరానికి 25 సంవత్సరాలు తీసుకుంటే 50 సంవత్సరాలు

కలుపుకొని దండి క్రీ.శ. 600 ప్రాంతం నాటికి జన్మించివుంటాడని చెప్పవచ్చును. పై వృత్తాంతాన్నంతా ఐతిహ్యంగా మాత్రమేభావించి తోసిపుచ్చి నట్లయితె దండి కాలాన్ని నిర్ణయించటానికి మరొక ఆధారమున్నది - రెండవ పులకేశి కోడలు విజ్జిక లేక విజయ ఒక కవయిత్రి. ఆమె దండి కావ్యాదర్శంలోని మంగళాచారణ శ్లోకాన్ని ఉద్ధరించింది. విజయ రెండవ పులకేశి కొడుకు చంద్రాదిత్యుని భార్య. చంద్రాదిత్యుని కాలం క్రీ.శ. 642 ప్రాంతం. అంటె క్రీ.శ. 642 నాటికే దండి కావ్యాదర్శాన్ని రచించాడని విజయ ఉద్ధరణను బట్టి తెలుస్తున్నది. క్రీ.శ. 642 నాటికే దండి గ్రంథకర్త అయినాడంటె అప్పటికి అతని వయస్సు 30, 40 సంవత్సరాలైనా వుండాలి. దీన్నిబట్టి కూడ దండి జననం క్రీ.శ. 600 ప్రాంతమని నిర్ణయించ వచ్చును. వేబర్, మేయర్, కోలిన్స్‌లు దండి దశకుమారచరిత్ర రచన క్రీ.శ. 585 కన్న ముందే జరిగిందని నిర్ణయించారు. కాని అప్పటికే దండి దశ కుమార చరిత్రను రచించివున్నట్లయితే బాణునికి దానితో పరిచయ ముండివుండేది. దాన్నతడు కనీసం పేర్కొనైనా వుండేవాడు. బానునికి దండితో పరిచయమున్నట్లు లేదు. కాబట్టి దండి బాణునికన్న వయస్సులో కొంత పెద్దవాడైనా దాదాపుగా అతనికి సమకాలికుడే అని చెప్పవసి వుంటుంది. దండి బాణునికి అపరుడనే వాదం కూడా వున్నది. కాని ఇది నిరూపించటానికి వీల్లేనిది. ఒకవేళ బాణుని కన్న దండి చాల తర్వాతవాడే అయినట్లయితె బాణుని అపరవర్తులైన కవులందరివలెనే దండికూడ అతని శైలీ ప్రభావానికి గుర్రై వుండే వాడేమో. బాణుని శైలీచ్ఛాయలేవి దండిలో లేవు. అంతేగాక దండి కావ్యాదర్శంలో కథ, ఆఖ్యాయికల లక్షణాలను చెప్పినా వాటి లక్షణభేదాన్ని పూర్తిగా, స్పష్టంగా అతడు చెప్పలేదు. బాణుడు కథ, ఆఖ్యాయికల లక్షణభేదాన్ని సూక్ష్మంగా గ్రహించి వాటికి లక్ష్యాలుగా కాదంబరి, హర్షచరిత్రలను రచించాడు. ఒకవేళ దండి బాణునికి తర్వాత వాడైతే కథ, ఆఖ్యాయికల భేదాన్ని గ్రహించి చెప్పివుండేవాడు. కాబట్టి దండి బాణునికి పూర్వుడని కాక దాదాపుగా సమకాలికుడనే వాదమే సమంజసంగా వున్నది. బాణకవి క్రీ.శ. 7వ శ॥ ఉత్తరార్ధం వాడైతె దండి క్రీ.శ. 7వశ॥ పూర్వార్ధమని చెప్పాలి. దశకుమార చరిత్రలోని భూగోళసాంఘిక పరిస్థితులు హర్షవర్ధనుని కన్న అంటె బాణుని కన్న ప్రాచీనమైనవని కీథ్ అభిప్రాయపడినాడు. బాణుడు ఉత్తరభారతానికి చెందినవాడు. దండి దక్షిణ భారతవాసి. హర్షవర్ధనుని నాటి పరిస్థితులు బాణుని కావ్యాలల్లో ప్రతిబింబించినవి. దండి కావ్యంలో పల్లవులనాటి దక్షిణభారత పరిస్థితులు ప్రతిబింబించినవి. పల్లవరాజు మహేంద్ర విక్రమవర్మ రచించిన మత్తవిలాసమనే ప్రహసనంలో చిత్రింపబడిన సంఘమే దశకుమార చరిత్రలో

ప్రతిబింబించిందని రెండు గ్రంథాలను పరిశీలించినట్లయితే తెలుస్తుంది. మత్తవిలాసకర్త సింహవిష్ణువు ఆస్థానంలోనే భారవి వున్నాడని ప్రసిద్ధి. సింహవిష్ణువు తర్వాత నరసింహవర్మ రాజ్యంచేసాడు. ఈ నరసింహవర్మ ఆస్థాని దండి.

అగాషే దండిని క్రీ.శ. 11, 12 శతాబ్దంవాడని నిరూపించటానికి ప్రయత్నించాడు. కాని క్రీ.శ. 815 ప్రాంతంవాడైన అమోఘవర్షుడు దండిని ఉదాహరించటం చేత దండిని అంత అర్వాచీనునిగా చెప్పటానికి వీల్లేదు.

## దండి రచనలు

"త్రయోదండి ప్రబంధాశ్చత్రిషులోకేషు విశ్రుతాః" అని రాజశేఖరుడు అన్నట్లుగా శారఙ్గధర పద్ధతిలో చెప్పబడింది. ముల్లోకాలల్లో విశ్రుతమైన మూడు గ్రంథాలను దండి రచించాడట. దండి మూడు గ్రంథాలల్లో కావ్యాదర్శం, దశకుమారచరిత్రలనే రెండు గ్రంథాలు ప్రసిద్ధమై ఇప్పుడు లభిస్తున్నవి. దండి మూడవకృతి ఏది అనే విషయంలో పండితుల్లో అభిప్రాయ భేదమున్నది. మృచ్ఛకటికం, ఛందోవిచితి, కళాపరిచ్ఛేదం, మల్లికామారుతం అనే గ్రంథాలల్లో ఒకటని పండితులు నిర్ణయించటానికి ప్రయత్నించారు. మృచ్ఛకటికం నాటకంలో ప్రతిబింబించిన సాంఘిక పరిస్థితులు, దశకుమార చరిత్రలోని సాంఘిక పరిస్థితులను పోలివున్నవని, అవి ఒక్క కాలానికి సంబంధించినవని విమర్శకులు కొందరు తలంచి దండియే తన్నాటక కర్త అని నిర్ణయించారు. మృచ్ఛకటికం దశకుమార చరిత్రల్లో సమానంగా "లింపతీవ తమోంగాని..." అన్న శ్లోకం కన్పిస్తున్నది. దీని ఆధారంగా రెండింటి రచయితలు ఒక్కరే అని, ఆ రచయిత దండి అని విమర్శకులు అభిప్రాయపడినారు. ఒకేశ్లోకం రెండు గ్రంథాలల్లో కన్పించినంత మాత్రాన రెండింటి రచయితలు ఒక్కరే అని నిర్ణయించి చెప్పలేము. మృచ్ఛకటికం రచయిత శూద్రకుడని లోకప్రసిద్ధమై వుండగా దండికి తత్ కర్తృత్వాన్ని అంటగట్టటం సమంజసంగా లేదు. కళాపరిచ్ఛేదం కావ్యాదర్శంలోని అంతర్భాగంగా, చతుర్థపరిచ్ఛేదంగా తర్వాత విమర్శకులు అంగీకరించారు. ఇక మల్లికా మారుతం కూడ దండికృతి కాదని తత్కర్త శ్రీరంగనాథుడు (క్రీ.శ. 1500) అని నిర్ణయింపబడింది. ఛందోవిచితి అన్నది ఛందోగ్రంథం కావచ్చును. కాని ఇది కూడ దండి కృతం కాదని తేలింది. ద్విసంధాన కావ్యాన్ని ఒక దాన్ని దండి వ్రాసాడని భోజరాజు పేర్కొన్నాడు. ఆ గ్రంథం అలభ్యం. ఒక వేళ దీనికర్తదండి, దశకుమారచరిత్ర కర్త దండి ఒక్కరు కాకపోవచ్చును. ప్రస్తుతం లభించిన అవంతి సుందరికథ దండి మూడవకృతి అని

ఇప్పుడు చాలామంది విమర్శకులు స్థిరాభిప్రాయానికి వచ్చారు. కాని ఈ కృతి అసంపూర్ణంగా లభించింది. లబ్ధకథలో ఎనిమిది పరిచ్ఛేదాలున్నవి. కావ్యారంభంలో దండి జీవితచరిత్ర నిబద్ధమై వుంది. ఆ తర్వాత కథ ఆరంభమైంది. దీనిలోని కథ దశకుమార చరిత్రకు భూమిక రూపంగా కన్పిస్తున్నది. అంటె అవంతి సుందరికథ దశకుమార చరిత్రకు పూర్వపీఠిక అనవచ్చును. కావ్యాదర్శంలో అవంతిసుందరికథ యొక్క ప్రసక్తి వుండటంచేత ఇదే కవి ప్రథమకృతి అని చెప్పవచ్చును. దశకుమార చరిత్ర కవి చివరిరచన. దండి అవంతిసుందరి కథ పద్యరూపంగా అవంతసుందరీ కథాసారమనే పేరుతో రూపాంతరం చేయబడింది. దీనిలో ఆరు పరిచ్ఛేదాలున్నవి. దీనిలో బాణుని కాదంబరికథ కూడా సారాంశరూపంగా చేర్చబడింది. కాబట్టి అవంతిసుందరి కథ గద్యకావ్యాన్నే దండి తర్వాత ఎవరో పద్యరూపంగా వ్రాస్తూ కాదంబరికథను సంగ్రహపరచి చేర్చివుంటారు. కావ్యాదర్శం దండి రెండవరచన. దీన్ని గురించి అలంకారశాస్త్ర ప్రకరణంలో చూడవచ్చును.

## దశకుమార చరిత్ర కర్తృత్వం

దశకుమార చరిత్ర దండి రచన కాదని కొంతమంది విమర్శకులు తలంచారు. కావ్యాదర్శంలో కవి ఏ దోషాలనైతే కావ్యంలో పరిహరించాలని చెప్పాడో ఆ దోషాలన్నీ దీనిలో కనిపిస్తున్నవని ఇంకా ఎన్నో చోట్ల అశ్లీలవర్ణనలున్నవని విమర్శకులు దీన్ని దండి కృతిగా అంగీకరించటానికి సమ్మతించలేదు. పరిహరించవలసిన దోషాలను దండి చెప్పాడు. కాని వాటిని కవిగా అతడు పరిహరించాలనే నియమేమి లేదు. దోషాలు అప్రయత్నంగా అతని కావ్యంలో దొర్లివుండవచ్చును. ఇక అశ్లీలాలున్నవంటె కాళిదాసువంటి కవులే కుమారసంభవంలో శివపార్వతుల సమాగమాన్ని వర్ణించి అశ్లీల వర్ణనాదోషాన్ని చేసారు. అటువంటి వర్ణనలు దశకుమార చరిత్రలో వుండటంచేత దండి తద్గ్రంథకర్త కాడని తోసిపుచ్చలేము. దశకుమార చరిత్రను మూడుభాగాలుగా విభజింపవచ్చును. పూర్వపీఠిక, మధ్యభాగం ఉత్తర పీఠిక. పూర్వ పీఠిక 5 ఉచ్ఛ్వాసాలుగా విభాగింపబడింది. మిగిలిన రెండు భాగాలల్లో అటువంటి విభజనలేదు. శైలిదృష్టితో ఒకటవ మూడవ భాగాలు మధ్యభాగం, కన్నా భిన్నంగా నీరసంగా వున్నవి. మొదటిభాగాన్ని రచించిన కవి మధ్యభాగంలోని కథాసంఘటనలను పూర్తిగా అర్థంచేసుకున్నట్లు లేదని విమర్శకుల అభిప్రాయం. ఒకటవ మూడవ భాగాలు అనేక పాఠాంతరాలతో లభిస్తున్నవి. దశకుమారచరిత్రకు వ్రాయబడిన ప్రాచీనమైన మూడు టీకలుకూడ ఒకటవ, మూడవ భాగాలకు అంటె పూర్వపీఠిక, ఉత్తరపీఠికు వ్రాయబడలేదు. ఈ కారాణాలన్నిటిచేత ఈ భాగాలు దండివ్రాయలేదని

కొందరు విమర్శకులు అభిప్రాయ పడినారు. అట్లాకాక ఒకటవ, మూడవ భాగాలు కొంతవరకు నష్టంకాగా అనామక కవి ఎవరో నష్టభాగాలను పూరించాడని, ఆ కారణంచేతనే ఈ రెండు భాగాలలో శైలీభేదం ఏర్పడిందని పాఠభేదాలు కన్పిస్తున్నవని మరికొందరు విమర్శకులు తలంచారు. నష్టభాగాలను పూరించింది ఒక్కకవికాక అనేక కవులై వుంటారు. అందుకే పాఠభేదాలు, శైలీభేదాలు చాల ఏర్పడివుంటవి. దశకుమార చరిత్ర రచనను గురించి మరొకవాదం - అసలు మూలగ్రంథంపేరు అవంతిసుందరీకథ అని, దానిలోని పూర్వపీఠిక నష్టం కాగా ఆ మిగిలిన భాగమే దశకుమారుల జీవనవృత్తాంతం కలది కావటంచేత దశకుమారచరిత్ర అనే పేరుతో ప్రచారం లోకి వచ్చిందని, తర్వాత కాలంలో లభించిన "అవంతి సుందరీకథ" కావ్యం ఈ దశకుమార చరిత్రకు పూర్వపీఠికే అని కొందరు విమర్శకుల అభిప్రాయపడినారు. దశకుమార చరిత్రను కేతన అనేకవి (క్రీ.శ. 1250) తెలుగు భాషలోకి అనువదించాడు. అతడు అనువదించిన పూర్వపీఠిక ప్రస్తుతం మనకు లభించే దశకుమారచరిత్రలోని పూర్వపీఠిక ననుసరించేవున్నది. కాబట్టి ప్రస్తుతం లభించే పూర్వపీఠికదండికృతం కాదని, అవంతిసుందరికథ పూర్వపీఠిక అని నిర్ధారించి చెప్పలేము. క్రీ.శ. 7వ శ॥ పూర్వార్ధం దండి కాలం. క్రీ.శ. 1250 నాటికి దశ కుమార చరిత్రలో కొన్ని భాగాలు నష్టమై పూరింపబడినవని చెప్పవలసివుంటుంది. ఆ తర్వాత ఇంతకాలానికి ఇప్పుడు నష్టమైన పూర్వపీఠిక అయిన అవంతిసుందరి కథ లభించటం కొంతవరకు అసంభవంగానే కన్పిస్తున్నది. దీన్నంతా పరిశీలిస్తే దశకుమారచరిత్ర, అవంతిసుందరి కథలు భిన్నకృతులని నిర్ణయించవలసి వుంటుంది.

అవంతిసుందరికథను గాని దశకుమార చరిత్రను గాని లాక్షణికు లెవరు ఉద్ధరించలేదు. కళింగరాయ సూర్యుడు తన సూక్తి రత్నహారంలో మాత్రం అవంతి సుందరినుంచి ఉద్ధరణలదు ఇచ్చాడు. కాని తత్కర్తను గూర్చి మాత్రం చెప్పలేదు. అవంతిసుందరికథ క్రీ.శ. 12వ శతాబ్దంనుంచి ఉపలబ్ధం కాకపోవటం, దశకుమార చరిత్ర దండిరచన కాకపోవటం - ఈ కారణాలచేతనే లాక్షణికులు ఈ కావ్యాల నుంచి లక్షణోదాహరణలను ఇయ్యలేదని వరదాచారి అభిప్రాయ పడినాడు. దశ కుమార చరిత్ర బాణుని గద్యకావ్యాలముందు నికృష్టమైందని అందుచేతనే లాక్షణికులు దాన్ని ఉద్ధరించలేదని, అవంతిసుందరి కథ, భోజుడు పేర్కొన్న ద్విసంధాన కావ్యం ఇవి మాత్రమే దండి రచలని వరదాచారి అభిప్రాయం - దశ కుమార చరిత్ర కాదంబరి కన్న భిన్నమైన ఇతివృత్తంతో కూడింది. దశకుమార చరిత్రలోని కథలు సాహసప్రధానమైనవి. రంజింపజేసేవి. సరళ

శైలిలో కవి వాటిని రచించాడు. శైలిలో కొంతవరకు ఒడిదుడుకులున్న మాట నిజమే కాని అది నష్టభాగాలను ఇతరకవులు పూరించటంచేత కలిగిందికావచ్చును. అక్కడక్కడ కవి సరసమైన శైలిని, చమత్కార కథాకథనాన్ని చూపించాడు. కాదంబరితో పోల్చి దీన్ని నికృష్టకావ్యమని చెప్పటం సాహసం మాత్రమే అవుతుంది.

## దశకుమార చరిత్ర ఇతివృత్తం

దశకుమార చరిత్రలో దశకుమారుల అంటె పదిమంది యువకుల ప్రేమ, సాహసగాథలున్నవి. మగధరాజైన రాజహంసున్ని మానసారుడనేరాజు ఓడిస్తాడు. రాజహంసుడు పారిపోయి వింధ్యప్రాంతారణ్యంలో నివసించ సాగాడు. అక్కడ అతనికి రాజవాహనుడనే కుమారుడు జన్మిస్తాడు. ఆ రాజు యొక్క తొమ్మిది మంది సహచరులకు తొమ్మిదిమంది కుమారులు జన్మిస్తారు.. ఈ సహచరుల్లో కొందరు రాజులు కొందరు మంత్రులు వున్నారు. ఆ పదిమంది కుమారులు పెరిగి పెద్దవారవుతారు. యువకులై వారు అర్థోపార్జనకై దేశాటనానికి బయలుదేరుతారు. ఎవరి తోవన వారుపోయి కొన్ని సంవత్సరాల గడువు తర్వాత ఒక్కచోట కలుసుకొని తమతమ భ్రమణ వృత్తాంతాలను, తాము చేసిన ప్రేమశృంగారసాహస కృత్యాలను చెప్పుకొంటారు. తర్వాత వీరందరి సహాయంతో రాజహంసుడు మానసారుని మీదికి దండెత్తిపోయి, అతన్ని ఓడించి మగధరాజ్యాన్ని తిరిగి సంపాదించుకొంటాడు. దశకుమారులల్లో అపహారవర్మకథ దీర్ఘంగాను నానావిధ సంఘటనలతో కూడి రమ్యంగా వున్నది. ఈ వృత్తాంతంలోని వేశ్య కామమంజరి వృత్తాంతం పాఠకులను ఆకట్టు కొంటుంది. దశకుమారులు తమ వివిధ కళానైపుణ్యంతో తమ తండ్రులు పోగొట్టుకొన్న రాజ, మంత్రిపదవులను తిరిగి సంపాదించుకొంటారు. ఈ కావ్యంలో కవి సందర్భోచితంగా జూదం, దొంగతనం, హత్యలు, హింస, మోసం, పరకాయ ప్రవేశం, వేశ్యలు, వారిమాయలు, స్త్రీ అపహరణం, స్త్రీ పురుషుల అక్రమ సంబంధాలను వర్ణించాడు. వీటితోపాటు కవి సందర్భానుకూలంగా ఆనాటి సాంఘికజీవనాన్ని సంపూర్ణంగా కన్నులకు కట్టేటట్లుగా వర్ణించాడు. సమకాలిక సాంఘిక జీవనాన్ని చిత్రించే కొద్ది సంఖ్యలో వున్న సంస్కృతకావ్యాలల్లో ఇది ప్రముఖమైంది. ఒక్కరంగానికి సంబంధించిన ప్రజాజీవితాన్ని కాక బహుముఖమైన ప్రజాజీవితాన్ని కవి ఈ కావ్యంలో ప్రతిబింబింప జేసాడు. దశకుమారుల కథలు వారి సాహసశృంగార ప్రసంగాలతో, విచిత్ర సంఘటనలతో చకచక సాగిపోతవి. ప్రతివృత్తాంతం "రొమాన్సు"తో నిండివున్నది. కథలకు, సంఘటనలకు తగిన వ్యంగ్యాత్మక,

వినోదపూర్ణమైన సరళశైలిని కవి ప్రయోగించాడు. అంతటా సహజస్వాభావికతయె కన్పిస్తుంది. ఆ నాటి సంఘంలోని ప్రతి వర్గానికి చెందిన వ్యక్తులు మనకు దీనిలో కన్పిస్తారు. పాత్రచిత్రణలోను కవి సహజ ప్రతిభను చూపాడు. ప్రతిపాత్ర నిత్యజీవితంలోని వ్యక్తులవలె మనమెరిగున్న వాళ్ళవలె కన్పిస్తారు. కపట సన్యాసులు, కపటబ్రాహ్మణులు, ధూర్తకుట్టినులు, దుశ్చరిత్రగల స్త్రీలు, వేశ్యలు, వ్యాపారులు, దొంగలు, జూద గాండ్రు, దుష్టులు, ఇంద్రజాలికులు ఇంకా ఇంకా అనేక విధాలైన పాత్రలు దీనిలో కన్పిస్తవి. ఈ పాత్రలేవి కవి ఊహాజనితాలు కాక నిత్యజీవితంలో అతడు చూచిన వ్యక్తులే అయి వుంటారు. అందుకే ఆ పాత్రలు సజీవవ్యక్తులవలె గోచరిస్తవి. ప్రతి కథ లోను శృంగారం ప్రధానరసంగా, అద్భుతాది ఇతర రసాలు అంగ రూపంగాను పోషింపబడినవి. అక్కడక్కడ శృంగారం అశ్లీలంలోకి దిగింది. కాని ఆ భాగాలను ఎక్కువదృష్టిలో పెట్టుకోక చదివినట్లయితె ఇది ఒక ఉత్తమ గద్యకావ్యమని చెప్పవచ్చును. కావ్యంలో అనేక చోట్ల కవి తన రాజనీతిజ్ఞతను, వ్యవహార జ్ఞానాన్ని, వివిధకళాపరిచయాన్ని ప్రకటించాడు.

## దండి కవిత్వం

సుబంధుబాణుల వలె దండి తన కావ్యాన్ని కఠినశైలి చేత, పాండిత్య ప్రకర్ష చేతను క్లిష్టం చేయలేదు. అతని శైలి సర్వసమ్మోదకరంగా సరళ సుందర మార్గంలో నడిచింది. సర్వజనరంజనమైన కథాశైలిలో దండి తన కథలను కూర్చాడు. కావ్యాదర్శాన్ని బట్టి దండికి వైదర్భి అన్న ఇష్టమైన రీతి అని తెలుస్తుంది. ఆ వైదర్భీరీతిలోనే దండి దశకుమార చరిత్రను వ్రాసాడు. సుబంధు బాణుల కావ్యాలల్లో కనిపించే దీర్ఘ సమాసాలు కాని, దీర్ఘ వాక్యాలు కాని దండి కావ్యంలో లేవు. ప్రసాద అర్థవ్యక్తి గుణాలతో కూడింది దండిశైలి. అప్రసిద్ధ పదరచనగాని శ్లేషభరిత వక్రోక్తులుగాని అతని కవిత్వంలో లేవు. వైదర్భీరీతి నాత్యలంకార శోభితం. దండి కవిత్వంలో సుబంధు బాణులలోవలె అలంకార బాహుళ్యత కన్పించదు. దండి కవిత్వం నాత్యలంకార శోభితమై అమూలాగ్రం కోమలపదావళితోకూడి లలిత మధురంగా వున్నది. "దండినః పద లాలిత్యం" అన్న ఉక్తిలో అతిశయోక్తి లేదని అతని కవిత్వాన్ని పరిశీలించినట్లయితె తెలుస్తుంది. స్నిగ్ధ సుందర పదాలకూర్పు దండి విశిష్టత. కథా కథనంలోను దండి ఉద్దండుడు. కథా కథనంలో ఎక్కడా శిథిలత్వం లేక పాఠకులకు విసుగు పుట్టించకుండ పైగా పాఠకుల ఔత్సుక్యాన్ని అడుగడుగునా నిలుపుతూ అద్భుత విచిత్ర సంఘటనలతో కథ సాగిపోతుంటుంది. కావ్యంలో ఆద్యంతం

ఒక్కటె కథ లేకున్నా, దశకుమారుల వివిధ చరిత్రలున్నా కథను సూత్రం తెగకుండ, కథా కథనం కుంటుపడకుండ కవి నిర్వహించి రచించాడు. సందర్భానికి అవసరమైన, పరస్పర సంబంధంగల సంఘటనలను మాత్రమే గ్రహించి కవి రచించి తన కథా కథన కౌశలాన్ని చూపాడు. ఇన్ని కథలను, సంఘటనలను ఒక్క చోట చేర్చినా కథలో, ఎక్కడా క్లిష్టత్వం లేదు, గజిబిజిగాని రాలేదు. సహజ సంఘటనలతో, వ్యక్తులతో కథ సాగిపోతుంది. పాఠకులకు వినోదంతోపాటు ఈ కావ్యం విజ్ఞానాన్ని కూడ అందిస్తుంది. దండికి రాజనీతి, కామశాస్త్రం, అక్షక్రీడ చౌర్యాది కళలతో గల పరిచయం, అన్నిటికి మించిన అతని వ్యవహార జ్ఞాన కుశలత, మానవ స్వభావ సూక్ష్మపరిశీలనావక్తి ఇవన్నీ అతన్నొక కుశలమైన కథాకథకునిగా నిలబెట్టినవి.

లాక్షణికుడుగానే గొప్పపేరు కాక కవులల్లోను దండికి గొప్ప పేరు వున్నది. పూర్వ కవులల్లో దండికి ఒక విశిష్టమైన స్థానమున్నది. దండిని వ్యాసవాల్మీకి కవుల సరసన చేర్చిన అభిమానులు కూడ వున్నారు-

జాతే జగతి వాల్మీకౌ కవి రిత్యభిధా భవత్
కవీ ఇతి తతోవ్యాసే కవయస్త్వయి దండిని

"వాల్మీకి జననానంతరం ఏకవచనాంత కవి శబ్దంపుట్టింది. వ్యాసుని తర్వాత ద్వివచనాంత ప్రయోగం ఏర్పడింది. దండి జననాంతరం బహువచనాంత రూపం ఏర్పడింది." ఈ విధంగా దండికి వాల్మీకి వ్యాసుల తర్వాత స్థానాన్నియ్యగా మరికొందరు "కవిర్దండీ! కవిర్దండీ! కవిర్దండీ! నసంశయః" అని దండిని ఏకైక కవి శబ్దవాచ్యునిగా ప్రశంసించారు.

## దశకుమార చరిత్రకు మూలం

దండి దశకుమార చరిత్రకు మూలం బృహత్కథలోని కథలని కొందరు విమర్శకులు నిరూపించటానికి ప్రయత్నించారు. కాని అనవసరమైన బలవంతపు సామ్యాన్ని సాధించటానికి ప్రయత్నించేదాని కన్నా దశకుమారుల కథలు దండి స్వయంకల్పితాలని అంగీకరించటం మంచిది. కాని దశకుమార చరిత్ర రచనకు కథాప్రణాళికా రూపానికి ప్రేరణ దండికి బృహత్కథనుంచే లభించిందని చెప్పాలి. కథలో కథను చేర్చటం బృహత్కథను అనుసరించిన

పద్ధతియే. తర్వాత కొన్ని పాత్రల చిత్రణలో, సంఘటనలల్లో బృహత్కథలోని కొన్ని పాత్రల, సంఘటనల ప్రభావం కన్పిస్తున్నది. అది ప్రయత్నపూర్వకమైనదైనా కావచ్చును లేదా అప్రయత్న పూర్వకమైనదైనా కావచ్చును. అంతేగాక దండి. నాటికి నీతిబోధకాలైన పంచతంత్రాది కథలు వ్యాప్తిలోవుండి వుంటవి. వాటిల్లోను కథలో కథను చేర్చే పద్ధతి వున్నది. ఆ నీతి కథల వలెనే దండి నిరాడంబరమైన, సర్వజనసుబోధకమైన సరళ సుందరశైలిలో తన కావ్యకథను వ్రాసాడు. అయినా నీతిని బోధించటం దండి కథల ఉద్దేశం కాదు. బృహత్కథలోని కథలవలె దండికథలు సాహస ప్రేమవృత్తాంతాలతో కూడినవి. దండి గ్రహించిన కథలు, సంఘటనలు చాలామట్టుకు అతని అనుభవంలోనివి. అతడు విన్నవి సేకరించినవే కావచ్చును. కాంచీనగరం పల్లవుల రాజధాని. అది పల్లవుల కాలంలోను అంతకుముందు కూడ వ్యాపారకేంద్రం, విద్యాకేంద్రం. అంతేగాక దక్షిణభారతవర్తకులు క్రీస్తుపూర్వం నుంచే సుదూర ప్రాంతాలకు ఓడల ద్వారా సముద్రప్రయాణం చేస్తూ, ఏండ్ల తరబడి స్వదేశానికి దూరంగా వుంటూ ఎగుమతి దిగుమతి వ్యాపారాలు చేసేవారు. అంతేగాక దక్షిణభారతం రోమను, అరబ్బు మొదలైన విదేశీయవర్తకులకు, ప్రయాణికులకు నిలయంగా వుండేది. అట్లా వర్తకుల నుంచి ప్రయాణికుల నుంచి సాహసపూర్ణ అనుభవాలను, వృత్తాంతాలను దండి వినివుంటాడు. తెలుగులో కథ చెప్పిం తర్వాత "కథ కంచికి మనం ఇంటికి" అని అనటం ఆచారం. ఆ ఉక్తినిబట్టి కాంచీనగరం కథలకు నిలయమని, కథలల్లేవారు పరీక్షకొరకు తమ కథలను కంచికి పంపేవారని అంటారు. అట్లాంటి కథాకేంద్రం, విద్యాకేంద్రం, వర్తక కేంద్రం అయిన కాంచీనగరంలో దండికి కథల సామాగ్రి ఎంతో లభించి వుంటుంది. అంతేగాక దండి స్వయంగా దేశాటనం చేసినవాడు. దేశాటన సమయంలో అతనికి దొంగలతో, జూదగాండ్రతో, మోసగాండ్రతో, దుష్టులతో, విటులతో, వివిధ కళాపారీణులతో పరిచయం, స్నేహం ఏర్పడి వుంటుంది. వాళ్ళ కళారహస్యాలను అతడు అట్లా గ్రహించివుంటాడు. తన అనుభవాల సంపదతో అతడు పాత్రలను, సంఘటనలను, ఇతివృత్తాలను సృష్టించుకొని వుంటాడు.

## దండి శైలి

సుబంధు బాణుల వలె గద్య మహాకావ్యాన్ని వ్రాసి విద్వజ్జన రంజకం చేయాలని దండి అనుకొన్నట్లు లేదు. అతడు సుబంధుబాణుల వలె మహాకావ్యోచితమైన ఆలంకారిక శైలిని కాక కథాకావ్యోచితమైన సరళశైలిని గ్రహించాడు. దండి కావ్యంలో సుబంధు బాణుల

కావ్యాలల్లో వలె మహాకావ్యోచితమైన దీర్ఘ వర్ణనలు గాని ఉక్తివైచిత్రిగల అలంకారాల శోభగాని లేదు. దండి సందర్భోచిత వర్ణనలను అదీర్ఘంగా చేసాడు. అంతేగాని ఊహా చమత్కారాలతో కూడిన కావ్యోచిత వర్ణనలను దీర్ఘంగా ఎక్కడా అతడు చేయలేదు. కాబట్టి దండి కావ్యం బృహత్కథ వంటి కథా కావ్యాలకు దగ్గరగా వున్నది. సుబంధు బాణుల కావ్యాలు ఆలంకారిక శైలితో పద్య మహాకావ్య సరణిలో వున్నవి. దండి శైలి సునిశిత హాస్య వ్యంగ్యాలతో కూడి కథాకావ్య శైలికి తగివున్నది. సుబంధు బాణుల శైలి సరసగంభీరమై మహాకావ్యోచిత రీతికి తగి వున్నది.

## బాణభట్టు

### బాణుని జీవిత విశేషాలు

గద్యకావ్యకవులల్లోనే కాక సంస్కృత కవులల్లోనే బాణునికి ప్రత్యేక స్థానమున్నది. ఇతర సంస్కృత కవుల వలె కాక బాణుని జీవిత విశేషాలను గురించి మనకు చాలా తెలుసును. స్వీయచరిత్రను అతడు తన హర్షచరిత్ర కావ్యంలో స్వయంగా వ్రాసుకొన్న దాన్నిబట్టి అతని వంశం, తలిదండ్రులు. బాల్యం, యవ్వనం, దేశ భ్రమణం, రాజాస్థాన ప్రవేశం, ఆశ్రయదాత, రచనలు వీటన్నిటిని గురించి మనకు చాలా విషయాలు తెలియవచ్చినవి. బాణుడు వత్సగోత్రజుడు. సోన్ నదీ తీరంలో వున్న ప్రృథుకూట గ్రామంలో జన్మించాడు. ఈ గ్రామమీనాడు గయా జిల్లా అంతర్గతమై ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలో వున్నది. వత్సునకు వాత్స్యాయనుడు వాత్స్యాయనునికి కుబేరుడు జన్మించారు. కుబేరుడు గొప్ప వేదపండితుడు. అతని గృహంలో శుక సారికలుకూడా వేదపాఠం చేసేవట! కుబేరునికి నలుగురు కుమారులు. వారిలో చిత్రభానుడు ఒకడు. చిత్రభానుని భార్య రాజదేవి. ఈ దంపతుల కుమారుడే బాణుడు. బాణుని బాల్యావస్థలోనే తల్లి మరణించింది. అతనికి 14 సంవత్సరాలున్నప్పుడు తండ్రికూడ మరణించాడు. అంతవరకు బాణుడు తండ్రిదగ్గరే విద్యాభ్యాసం చేసాడు. తండ్రి మరణానంతరం అతడు దేశభ్రమణానికి బయలుదేరాడు. ఆ దేశభ్రమణంలో అతనికి అనేకరకాలైన వ్యక్తులతో స్నేహమేర్పడింది. అనేక విద్యానుభవాలతో అతడు ఇంటికి తిరిగివచ్చాడు. ఒకరోజా హర్షవర్ధనుడు బాణుని తన ఆస్థానానికి ఆహ్వానించాడు. బాణుడు ఆ ఆహ్వానాన్ని స్వీకరించి స్థాణ్వీశ్వర్యానికి పోయాడు. అక్కడే హర్షుని రాజాస్థానంలో వుండి అనేక రాజ సన్మానాలను అందుకొన్నాడు. తర్వాత

కొంతకాలానికి అతడు స్వగ్రామానికిపోయాడు. అక్కడ బంధుజనులు అడిగిన కుతూహలపూర్వక ప్రశ్నలకు సమాధానంగా హర్షుని జీవితచరిత్రను కావ్యంగా రచించాడు. ఆ తర్వాత అతడు కాదంబరికథను రచించాడు. ఆ కథా రచన పూర్తికాకముందే బాణుడు మరణించగా అతని కుమారుడు దాన్ని పూర్తిచేసాడు.

## బాణుని కాలం

బాణుడు చాలాకాలం శ్రీ హర్షవర్ధనుని ఆస్థానంలో వుండటంచేత అతని జీవితకాలాన్ని నిర్ణయించటం సులభం. హర్షవర్ధనుడు క్రీ.శ. 606 నుంచి 648 వరకు పరిపాలించాడు. హర్షుడు రాజైన కొద్దికాలానికే బాణుడు అతని ఆస్థానంలో చేరాడు. ఆ ఆస్థానంలో వుండగానే అతడు హర్షచరిత్రను రచించాడు. హర్షచరిత్ర తర్వాత కాదంబరిని రచించాడు. శైలీదృష్టితో పరిశీలించినా కాదంబరి అతని కడపటి రచనగా కన్పిస్తుంది. ఒకవేళ హర్షుని మరణానంతరం బాణుడు స్వగ్రామంలో నివసిస్తు కాదంబరి రచనకు పూనుకొన్నాడేమో. క్రీ.శ. 700 ప్రాంతం వాడైన వాక్పతిరాజు సుబంధును పేర్కొని బాణుని పేర్కొనక పోవటం వల్ల అప్పటికి బాణుడు జీవించి వున్నాడని ఇంకా మహాకవుల కోవలోకి ఎక్కలేదని చెప్పాలి. దీన్నిబట్టి కూడ బాణుడు హర్షవర్ధనుని తర్వాత కావ్యరచన చేసి కీర్తిని గడించాడని చెప్పవచ్చును. బాణునికి హర్షుని ఆస్థానంలో చేరినప్పుడు ఎక్కువ వయస్సులేదని ఎస్.కే.డే. అభిప్రాయపడినాడు. అప్పుడు బాణుని కాలాన్ని క్రీ.శ. 590-650 ప్రాంతమని నిర్ణయించవచ్చును.

## బాణుని రచనలు

బాణుడు హర్షచరిత్ర, కాదంబరి కావ్యాలేకాక చండీశతకాన్ని కూడ రచించాడు. (చండీశతకాన్ని గూర్చి లఘుకావ్య ప్రకరణంలో, హర్షచరిత్రను గూర్చి చారిత్రక కావ్యప్రకరణంలో చర్చింపబడింది) ఇవేగాక బాణుడు "ముకుటతాడితమ్" అన్న నాటకాన్ని వ్రాసాడని నలచంపువు వ్యాఖ్యాత చంద్రపాల గుణవిజయగణులు తెల్పారు. కాని ఆ నాటకకర్త బాణుడు ఈ బాణుడు కాదని తేలింది. కాని పార్వతీ పరిణయ నాటకకర్త బాణ నామాన్ని బిరుదంగా ధరించిన వామనభట్టు బాణుడని నిశ్చయంగా తేలిన విషయం.

## కాదంబరి ఇతివృత్తం

కాదంబరి ఇతివృత్తం సాహసాద్భుత చర్యలతో కూడింది కాక ప్రేమ కథలతో

కూడింది. దీనిలో కాదంబరీ చంద్రాపీడుల, మహాశ్వేతపుండరీకుల ప్రేమ వృత్తాంతాలున్నవి. చంద్రాపీడ పుండరీకుల మూడు జన్మల వృత్తాంతాలు దీనిలో కూర్చబడినవి. చంద్రాపీడుడు పూర్వజన్మలో చంద్రుడు తర్వాత జన్మలో శూద్రకుడనే రాజు. పుండరీకుడు ఒక జన్మలో వైశంపాయనుడు మరొక జన్మలో చిలుక. నాయికలైన కాదంబరి మహాశ్వేతల ఒక్క జన్మవృత్తాంతం మాత్రమే చెప్పబడింది. అంటే నాయికల ఒక్క జన్మకాలంలోనే నాయకులు క్రమంగా మూడు జన్మలనెత్తుతారన్నమాట. కాదంబరీ మహాశ్వేతలు గంధర్వ రాకుమారికలు. కాదంబరి చంద్రాపీడుని, మహాశ్వేత పుండరీకుని ప్రేమిస్తారు. పుండరీకుడు మహాశ్వేతను ప్రేమించి, ఆమె విరహాన్ని సహించలేక మరణిస్తాడు. మహాశ్వేత కూడ ఆత్మహత్య చేసుకోదలచుకుంటుంది. కాని ఆకాశవాణి ఆమెకు పుండరీకునితో సమాగమం కలుగుతుందని చెప్పటంచేత ఆ ప్రయత్నాన్ని విరమించుకుంటుంది. కాని అప్పటినుంచి ఆమె సన్యాసినియై పుండరీకుని కొరకు ఎదురుచూస్తూవుంటుంది. చంద్రాపీడుడు తన స్నేహితుడు వైశంపాయనుని మరణవార్తను విని తనుకూడ మరణిస్తాడు. మరణించి శూద్రకమహారాజుగా జన్మిస్తాడు. పుండరీకుడు చంద్రాపీడుని స్నేహితుడు వైశంపాయనుడుగా జన్మిస్తాడు. ఒకసారి మహాశ్వేతను చూచి వైశంపాయనుడు ప్రేమాలాపాలు చేస్తాడు. వైశంపాయనుడే పుండరీకుడని తెలుసుకోలేక మహాశ్వేత అతన్ని చిలుకగా మారమని శాపమిస్తుంది. చిలుకగా మారిన వైశంపాయనుని లక్ష్మీదేవి శూద్రకరాజు దగ్గరికి చేరుస్తుంది. జాబాలి అనే ఋషి కృపచేత పూర్వజన్మ వృత్తాంతాన్ని తెలుసుకొన్న చిలుక దాన్నంతా శూద్రునికి చెప్తుంది. ఆ కథనంతా విన్నతర్వాత శూద్రకుడు ప్రాణాలు విడిచి జాగ్రత్తగా కాదంబరిచేత రక్షింపబడే చంద్రాపీడుని కళేబరంలో ప్రవేశిస్తాడు. చిలుక పుండరీకునిగా మారుతుంది. వాళ్ళిద్దరు తమతమ ప్రియురాండ్రను కలుసుకొని వివాహం చేసుకొని సుఖంగా వుంటారు.

## కాదంబరి కథకు మూలం

ఈ విధంగా జన్మ జన్మాంతరాలతో కూడిన కాదంబరి కథ అద్భుతమైన సంఘటనలతో రమ్యంగా వున్నది. చంద్ర, గంధర్వ, మానవలోకాలకు సంబంధించిన పాత్రలతో, సంఘటనలతో కథ పాఠకులను అద్భుత చిత్తులను చేస్తుంది. ఇటువంటి రమ్యమైన కథను కల్పించిన కవి ప్రతిభ అద్వితీయమైందని చెప్పాలి. ఈ కథ కథాసరిత్సాగరంలోని మకరందికోపాఖ్యానాన్ని పోలివుండటంచేత బాణుడు ఈ కథను

బృహత్కథనుంచి గ్రహించాడని అంటారు. కాని 'కథ' అన్న ప్రక్రియలో ఇతివృత్తం కల్పితమైవుండాలని లాక్షణికులు అందరూ ఏకగ్రీవంగా చెప్పారు. అటువంటప్పుడు బాణుడు తన 'కథ' కావ్యానికి ఇతివృత్తాన్ని ప్రసిద్ధమైనదాన్ని గ్రహిస్తాడా అని అనుమానం కలుగకమానదు. మకరందికోపాఖ్యానం బుద్ధ స్వామి బృహత్కథా శ్లోక సంగ్రహంలోని క్షేమేంద్రుని బృహత్కథామంజరిలో గాని లేదు. ఒక వేళ క్రీ.శ. 11వ శతాబ్దంవాడైన సోమదేవుడు బాణుని కాదంబరి కథనే కొద్ది మార్పులతో కథా సరిత్సాగరంలో చేర్చుకొని వుంటాడు. సుబంధు వాసవదత్తకథను స్వయంగా కల్పించుకొన్నాడు. బాణుడు అంత ప్రతిభాహీనుడైన కవి ఏమికాదు. సుబంధు వాసవదత్త కల్పన మీద బృహత్కథ, జానపద కథల ప్రభావం వున్నట్లుగానే బాణుని కాదంబరి ఇతివృత్త కల్పనలోను వాటి ప్రభావం వుండి వుంటుంది. పండితుడు ఆస్తికనాస్తిక దర్శనాలను అధ్యయనంచేసిన బాణుడు కాదంబరి కథను కేవలం ప్రేమ కథగానే వ్రాయలేదు. మహదర్థాన్ని అంతర్గర్భితంచేసి అతడు ఈ కథను రచించాడు. [1] (దీని కొరకు మేము రచించిన "బాణుని కాదంబరీ పరిశీలనం" అన్న పుస్తకాన్ని చూడగలరు)

కాదంబరిలో సుదీర్ఘమైన వర్ణనలున్నా వర్ణనా బాహుళ్యంతో పాటు కథా బాహుళ్యంకూడ వున్నది. వాసవదత్తలో వలె కథ అప్రధానమై లేదు. దశకుమార చరిత్రలోని కథలు పాఠకులను ఆకట్టుకొన్నట్లుగానే కాదంబరి కథ పాఠకులను ఆకట్టుకొంటుంది. కథ, సంఘటనలు ఎప్పుడు ఏ మలుపు తిరుగుతవో అని పాఠకులు ఉత్సుకతతో కాదంబరి కథను చదువుతారు. అంటె పాఠకుల కుతూహలాన్ని నిలుపగల శక్తి కాదంబరి కథలో వున్నది. పాఠకులను కట్టి వేసే కథాకథనం దీనిలో వున్నది. దీర్ఘమైన వర్ణనలు ఎక్కడా కథకు అడ్డుతగులకుండా వున్నవి. కాని సామాన్య పాఠకుడు అనేక జన్మలతో కూడిన కథను అర్థం చేసుకోలేక, గుర్తు పెట్టుకోలేక చిక్కులపాలు కాక తప్పదు. కాదంబరి కథలోని అద్భుతమైన సంఘటనలల్లో జానపద కథల ప్రభావం తప్పక కన్పిస్తుంది. పక్షులు మాట్లాడటం, మనుష్యులు పక్ష్యాదులుగా మారటం, పక్ష్యాదులు మనుష్యులుగా మారటం, చనిపోయింతర్వాత కళేబరాన్ని జాగ్రత్తగా పెట్టటం, ప్రాణం ఒక శరీరం నుంచి మరో శరీరంలోకి ప్రవేశించటం, స్వేచ్ఛానుసారంగా రూపాలను ధరించటం, శాపాలు, ఆకాశవాణి మొదలైనవెన్నో జానపద కథల్లో కన్పించే సన్నివేశాలు కాదంబరి కథలో కన్పిస్తవి. ఎన్నో అద్భుత సంఘటనలతో కూడి వున్నా కథలో ఎక్కడా స్వాభావికతకు లోపం మాత్రం రాలేదు. ప్రతి సంఘటన యథార్థంగా, రసవంతంగా గోచరిస్తుంది. కవి కథాకథన, కవితా ప్రతిభలు అటువంటివి.

## బాణుని ప్రతిభ

బాణుడు గొప్ప దర్శనశాస్త్ర పండితుడు. అతనికి కావ్య నాటక పురాణేతిహాసాలతో మంచి పరిచయమున్నది. కామ, అర్థ, రాజనీతి, అలంకార శాస్త్రాలను క్షుణ్ణంగా అభ్యసించాడు. శుకనాసోపదేశ ఘట్టం వల్ల అతనికి రాజనీతితోగల పరిచయం ప్రకటమౌతున్నది. వీటన్నితోపాటు అతనికి మంచిలోకానుభవం వున్నది. దేశభ్రమణ సమయంలో అతడు ఎన్నో దేశాలను నగరాలను అరణ్య ప్రాంతాలను సందర్శించాడు. ఆ సందర్భంలో అతనికి అనేక వృత్తులవారితో, అనేక రకాలైన మనుష్యులతో పరిచయం స్నేహం ఏర్పడింది. ఎంతో లౌకికజ్ఞానాన్ని అతడు సంపాదించాడు. మరియు బాణునికి అతిసూక్ష్మ పరిశీలనాదృష్టి వున్నది. "బాణోచ్ఛిష్టం జగత్సర్వం" అన్న ఉక్తిలో కొద్దిగా కూడ అతిశయోక్తిలేదు. సుదీర్ఘ వర్ణనల్లో అతడు చిత్రించని విషయమేలేదు. ప్రకృతిని, మానవ ప్రకృతిని అతిసూక్ష్మంగా వర్ణించాడు. కావ్యంలో ఉచితమైన వర్ణనలల్లో అతని సూక్ష్మ పరిశీలనాదృష్టితో కూడిన శాస్త్రపాండిత్యం, లౌకికజ్ఞానం రెండు చక్కగా ప్రకటమైనవి. రాజాస్థాన మర్యాదను బాగా ఎరిగినవాడు. రాజాస్థానాలను, ఋష్యాశ్రమాలను, సుందర అంతఃపురాలను, ఆటవికుల పల్లెలను సమానప్రతిభతో సహజంగా చిత్రించాడు. అతడు వర్ణించిన సరస్సు, నది, పర్వత, వన, ఉద్యాన, సూర్యోదయ, ఋతు, ఆశ్రమాది వర్ణనలు, వర్ణనల్లోని ఉపమాద్రవ్యాలు కవి ప్రతిభను, పాండిత్యాన్ని వేనోళ్ళ చాటుతున్నవి.

సుదీర్ఘమైన వర్ణనలు, దీర్ఘమైన కథా నిర్వహణతోపాటు బాణుడు పాత్ర చిత్రణానికి కూడ స్థానాన్ని ఇచ్చాడు. ప్రతి చిన్న పాత్ర కావ్యంలో తన ప్రత్యేక వ్యక్తిత్వంతో పాఠకుల కన్నులముందు నిలుస్తుంది. రాజులను వర్ణించినా, ఆటవికులను వర్ణించినా, అంతఃపుర కన్యలను వర్ణించినా, సన్యాసినులను వర్ణించినా కవి యథాతథంగా కన్నులకు కట్టేటట్లుగా వర్ణించాడు. ఔచిత్యాన్ని పోషించాడు. చివరకు వైశంపాయనుని వంటి పక్షి పాత్ర చిత్రణను కూడ కవి చాల సహజంగా చేసాడు. సూక్ష్మపరిశీలనతో కూడిన ఆమూలాగ్ర వస్తువర్ణన సుదీర్ఘమైనా పాఠకులకు విసుగు పుట్టించదు. ఋష్యాశ్రమ, వింధ్యాటవి వర్ణనా సందర్భంలో కవి ప్రకృతి యొక్క లలితరూపాన్ని, భయంకర రూపాన్ని రెండింటిని చిత్రించాడు. కావ్యంలో అంగిరసం శృంగారం. శృంగార వర్ణనలో ఎక్కడా కూడా అశ్లీలత లేదు. స్త్రీ వర్ణనలు దీర్ఘమైనా ఎక్కడా అనౌచిత్యం కన్పించదు. బాణుడు దివ్యమైన, మధురమైన స్త్రీపురుషుల ప్రేమను చిత్రించాడే కాని కామవాసనాయుక్తమైన ప్రేమను కాదు. ముఖ్యంగా

మహాశ్వేత పుండరీకుల ప్రేమ దివ్యత్వం, పవిత్రతతో కూడింది. మహాశ్వేత పేరుకు తగ్గట్టుగానే అమలినమైన పవిత్రరూపంతో పాఠకులముందు నిలుస్తుంది. కాదంబరి చంద్రాపీడుల ప్రేమలో కవి మానవీయతను సృష్టించాడు. కాని చంద్రాపీడుని మరణంతో కాదంబరి ప్రేమకూడ మహాశ్వేత ప్రేమవలె పవిత్ర రూపాన్ని ధరించింది.

## బాణుని శైలి

బాణుని శైలి నాతిదీర్ఘ సమాసతతో కూడి పాంచాలీ రీతికి చెందింది. బాణునికి అపారమైన శబ్దజ్ఞానం వున్నది. శబ్దార్థ సంయోజన బాణుని కవిత్వంలో సుందరంగా వున్నది. ఏ అర్థాన్నైనా కవి సరళంగా, సులభరీతిలో చెప్పగలడు. బాణుని కవిత్వం వక్రోక్తి నిపుణమైంది. శ్లేష వక్రోక్తి సాధనకు బాగా తోడ్పడింది. శ్లేషనేకాక శ్లేషమీద ఆధారపడే విరోధాభాస, పరిసంఖ్యాలంకారాలను కవి విరివిగా ప్రయోగించాడు. ఇవేగాక ఉపమ, ఉత్ప్రేక్ష, రూపక, అతిశయోక్తి, సమాసోక్త్యాది అలంకారాలను కవి ప్రయోగించాడు. బాణుడు వక్రోక్తి నిపుణుడైనా స్వభావోక్త్యలంకారాన్ని ఆదరించాడు. వక్రోక్తిని పోషించేవి శ్లేష అతిశయోక్తులు అని ఆలంకారికుల మతం. వక్రోక్తి మార్గస్థాపకుడైన కుంతకుడు స్వభావోక్తిని అలంకార్యంగానే అంగీకరించాడు. స్వభావోక్తి అలంకారమైతే అలంకార్యమేది? అని అతడు ప్రశ్నిస్తాడు. కాని వక్రోక్తి సాధకుడైన బాణుడు స్వభావోక్త్యలంకారాన్ని ఆదరించి దాని సౌందర్యాన్ని సాధించటం అద్భుతంగా వున్నది. ప్రతి అలంకారానికి ఆధారం (Base)గా బాణుడు స్వభావోక్తినే గ్రహించాడు. అందుకే అతని ఉక్తిలో అసంభావ్యత అనేది కనిపించదు. తర్వాత కవుల్లోని విచిత్రమైన ఊహాశక్తితో కూడిన ఉక్తివైచిత్రి కాక బాణునిలో సహజభావ సంపద కన్పిస్తుంది. ప్రతి వస్తువును, దృశ్యాన్ని, సన్నివేశాన్ని కవి ఒక ప్రతిభగల చిత్రకారుని వలె బొమ్మగా గీసి చూపిస్తాడు. నవార్థం, అగ్రామ్యమైన స్వభావోక్తి, రసస్ఫోరకత్వం, వికటాక్షరబంధం, శ్లేష -వీటన్నిటి సమావేశాన్ని తన కవిత్వంలో చూడవచ్చునని బాణుడు స్వయంగా సూచించాడు.

నవార్థో జాతిరగ్రామ్యో శ్లేషోऽక్లిష్టః స్ఫుటోరసః
వికటాక్షర బంధశ్చ కృత్స్న మేకత్ర దుష్కరమ్

బాణుని శైలి చాల కఠినమైందని వేబర్, కీథ్ వింటర్‌నిట్స్, ఎస్.కె.డే. వంటి విమర్శకులు అభిప్రాయపడినారు. బాణుని కవిత్వం పదాడంబరం, అలంకారాతిశయంతో

కూడిందైనా అతడు ప్రయోగించిన శబ్దాలు అర్థబోధకాలై సూటిగా పాఠకుల హృదయాలల్లో దూరిపోతవి. సంస్కృత భాషాజ్ఞానం చక్కగా కలిగినటువంటివారికి బాణుని కవిత్వమేమి క్లిష్టం కాదు. బాణుడు వస్తువర్ణనలను సుదీర్ఘంగా కాక ఒకొక్కసారి ఒక భావాన్నిగాని ఒక పాత్ర హృదయగత ఆలోచనలనుగాని సుదీర్ఘంగా చెప్పుకుంటూ పోతాడు. అవి కొందరికి విసుగుపుట్టించవచ్చునేమో కాని కొందరికి అవి రమ్యంగా, పాండితీస్ఫోరకాలై ఆనందాన్ని కలిగించవచ్చును.

## బాణుని ప్రశంస

బాణుని అపూర్వశైలి ప్రాచీన సాహితీప్రేమికులను విశేషంగా ఆకర్షించింది. వారు బాణుని అనేకవిధాలుగా ప్రశంసించివున్నారు. గోవర్ధనాచార్యుడు బాణుని సరస్వతి అవతారంగా భావించాడు-

జాతా శిఖండినీప్రాక్ యథా శిఖండీ తథాzవగచ్ఛామి
ప్రాగల్భ్య మధికమాప్తుం వాణీబాణో బభూవేతి

"అధిక ప్రాగల్భ్యాన్ని సంపాదించటానికి శిఖండిని శిఖండిగా మారినట్లుగా పురుష రూపంలో అతి చమత్కారం పొందగోరి వాణి వాణ(బాణ) రూపాన్ని ధరించింది!"

బాణుని శబ్దసంపద అపారమైంది. విశ్వవ్యాపినియైన తన భావకల్పనలను ప్రకటించడానికి కవికి అపారమైన శబ్దసంపద అవసరమైంది. రాజశేఖరుడు బాణుని గొప్పతనాన్ని ఇట్లా స్తుతించాడు.

బాణేనహృది లగ్నేన యన్మందోzపి పదక్రమః
భవేత్ కవి కురంగాణాం చాపలం తత్ర కారణమ్

బాణుని శబ్దాసంయోజన సుందరమైంది. అతని కవిత్వంలో లలితమైన, సుకుమారమైన పదవిన్యాసాన్ని చూడవచ్చును-

శబ్దార్థయోః సమోగుంఫః పాంచాలీ రీతిరిష్యతే
శీలాభట్టారికా వాచి బాణోక్తిషు చసాయది.

బాణం కుచ్చుకుంటే ఉచ్ఛ్వాసం బయటికిరానట్లే బాణుని కాదంబరిని చదివింతర్వాత కవులకు వాణి బయటికిరాదని ఒకానొక కవి ఇట్లా చమత్కరించాడు-

ఉచ్ఛ్వాసోఽపి ననిర్యాతి బాణే హృదయవర్తిని
కింపు నర్వికటాటోప పదబంధా సరస్వతీ

విదగ్ధముఖమండనకర్త ధర్మదాసు బాణుని రసవంతమైన కవిత్వాన్ని ఇట్లా పొగిడాడు -

రుచి రస్వర వర్ణపదారసభావవతీ జగన్మనోహరతి
సాకిం తరుణీ నహి నహి వాణీ బాణస్యమధుర శీలస్య.

"బాణుని కవిత్వం రుచిరమైన వర్ణాలతో, పదాలతో కూడింది, రసభావ పరిపూర్ణమైంది తరుణీనాయిక వలె రసిక హృదయహరణాన్ని చేయటానికి సమర్థవంతమైంది" "అలంకార సమాసభరితమైన బాణుని కవిత్వం వింధ్యాటవి వంటిది. దానిలో విహరించే కవికుంజరుల గండస్థలాలను చీల్చే సింహం బాణుడు"- అంటాడు మరోకవి-

ఆ సర్వత్ర గభీరధీర కవితా వింధ్యాటవీ చాతురీ-
సంచారీ కవి కుంభికుంభ భిదురో బాణస్తు పంచావనః

అపూర్వమైన మౌలికమైన భావాలతో, అర్థాల పిష్టపేషణం లేకుండా బాణుని కవిత్వం నవీనార్థశోభితమైంది.

## బాణతనయుడు

బాణుని మరణంతో కాదంబరికావ్యం అసంపూర్ణంగా మిగిలిపోగా పండితుల కోరికమీద అతని కుమారుడు పూరించాడు. అతడు పుళింద, పుళింధ్ర, పులిన, భూషణభట్టు అనే అనేకమైన పేర్లతో పేర్కొనబడుతున్నాడు. కాని తిలకమంజరి కర్త ధనపాలుడు పేర్కొన్న "పుళింధ్ర" డన్న పేరే నిజం కావచ్చును. బాణుడు మరణశయ్యమీద వుండి ఈ కావ్య రచనాభారాన్ని కుమారునికి అప్పగించాడని కూడ ఐతిహ్యం. బాణతనయుడు ముమ్మూర్తులా తండ్రి శైలిని అనుకరించి కావ్యాన్ని పాఠకుల కెటువంటి లోపం కనపడకుండా అనువదించి ధన్యుడైనాడు.

# ధనపాలుడు

## ధనపాలునికాలం

ధనపాలుడు తిలకమంజరి అనే గద్యకావ్యాన్ని రచించాడు. ఈ కవి క్రీ.శ. 973 ప్రాంతంవాడని వరదాచారి నిర్ణయించాడు. ఈ కవి క్రీ.శ. 925 ప్రాంతంవాడైన

రాజశేఖరున్ని పూర్వకవులతో చేర్చి పేర్కొనటంచేత ఈ కాలనిర్ణయం సమంజసంగా కన్పించదు. అదీగాక ఈ కవి ధారానగరాన్నే లినముంజ, భోజరాజుల ఆస్థానంలో వుండేవాడు. కాబట్టి క్రీ.శ. 1000 ప్రాంతంవాడని చెప్పవచ్చును. తిలకమంజరి కావ్యంలో తిలకమంజరీ సమరకేతువుల ప్రేమకథ వున్నది. ఈ ప్రేమకథ కాదంబరిచంద్రాపీడుల ప్రేమకథను పోలివున్నది.

ధనపాలుడు మొదట వేదవేదాంగాలను అభ్యసించిన బ్రాహ్మణుడు. కాని తర్వాత తన తమ్ముని ప్రభావం చేత జైన ధర్మాన్ని స్వీకరించాడు. ధనపాలుడు భోజరాజు కొరకై ఈ చమత్కారపూర్ణ కావ్యాన్ని రచించినట్లు తెలుస్తున్నది. కవి కావ్య ప్రారంభంలో సజ్జనస్తుతి, దుర్జననిందను చేసాడు. తన వంశాన్ని, ఆశ్రయదాత భోజరాజు వంశాన్ని వర్ణించాడు. కవి వినయ సంపన్నుడుగా గోచరిస్తాడు.

## కాదంబరి ప్రభావం

ధనపాలుడు కాదంబరి ఇతివృత్తాన్నేకాక శైలివర్ణనలనుకూడ అనుకరించాడు. తిలకమంజరి నివాసగృహవర్ణన కాదంబరిలో కుమారీభవన వర్ణనను, అయోధ్యానగర వర్ణన ఉజ్జయినీ నగర వర్ణనను, మేఘవాహనుని దినచర్య వర్ణన శూద్రకుని దినచర్య వర్ణనను పోలివున్నవి. బాణుని ఆలంకారయోజనను ధనపాలుడు అనుకరించాడు. కాని బాణునివలే స్వభావోక్తిని ఆదరించలేదు. అయితే బాణునివలెనే శ్లేష, విరోధాభాస, పరి సంఖ్య, ఉపమ, ఉత్ప్రేక్ష, రూపకాద్యంలంకారాలను ప్రయోగించాడు. ధనపాలుడు బాణుని శ్లేషసౌందర్యం ముందు నిలువలేడు. బాణునివలెనే దీర్ఘవాక్యాలను రచించాడు. ఒక వస్తువును అనేక దృక్కోణాలనుంచి బాణుని వలెనే వర్ణించటానికి పూనుకొన్నాడు. కాని బాణునివంటి ప్రజ్ఞాపాటవాలు లేకపోవటంచేత అతన్ని అనుకరించి మించటం అట్లావుంచి రాణించలేక పోయాడు. బాణునికి ధనపాలునికి నడుమ దాదాపు మూడువందల సంవత్సరాలున్నవి. ఈ మధ్యకాలంలో గద్యకావ్యాలను ఎవరూ చేపట్టి రచించ లేదంటె అసహజంగా కన్పిస్తున్నది. ఒకవేళ ఆ సమయంలో వ్రాయబడిన గద్యకావ్యాలు మనవరకు రాక కాలగర్భంలో కలిసి పోయినవేమో.

## ఓడయ దేవుడు

ఈ కవి కాలాన్ని గురించి అభిప్రాయభేదాలున్నవి. కొందరు ఈ కవిని క్రీ.శ. 9వ

శతాబ్దం వానిగా మరికొందరు క్రీ.శ. 11వ శతాబ్దం వానిగా నిర్ణయించి చెప్పారు. వి. వరదాచారి ఈ కవి క్రీ.శ. 1200 ప్రాంతం వాడని అభిప్రాయపడినాడు. ఈ కవికి "వాదీభసింహు" డని బిరుదనామం. ఈ కవి గద్య చింతామణి అనే కావ్యాన్ని రచించాడు. ఈ కావ్యంలో జీవంధురుడనే రాజ కుమారుని కథ వున్నది. జైనముని ఉపదేశంచేత ఆ రాజకుమారుని కథ వున్నది. జైనముని ఉపదేశం చేత ఆ రాజకుమారుడు జైన సన్యాసిగా మారుతాడు. జైనముని ఉపదేశం కాదంబరిలోని శుకనాసోపదేశాన్ని పోలివున్నది. ఇతివృత్తంలోను కాదంబరి ఛాయలున్నవి. బాణుని శైలిని, వర్ణనలను కూడ అనుకరించాడు. బాణుని వలెనే దీర్ఘ వాక్యాలు రచించాడు. ఒకొకసారి ఒక వాక్యాన్ని ఒక్క సమాసంతో ముగించాడు - "వాత్సాల్యా క్లిష్టవత్సముఖా కృష్యమాణ నిజకుచనిశా మన పునరుక్త శుచ్యా దసోత్సుక వత్సగళ విగళదర్థ గ్రస్తస్వ శ్రవణా సహిష్ణుతాపి హితశ్రవసి." బాణుని వలెనే ఓడయదేవుడు శ్లేష విరోధాభాస, పరిసంఖ్య. ఉపమ ఉత్ప్రేక్షాదులను ప్రయోగించాడు. ఈ కావ్యం 11 లంబకాలుగా విభాగింపబడింది. పన్నాలాల్ సాహిత్యాచార్యుని అభిప్రాయంలో ఈ గద్యకావ్యం ఉత్కృష్టమైంది. ఈ కవి కాదంబరీకారున్ని అనుకరించటానికి ప్రయత్నించినా కవి స్వయం ప్రతిభ, లోకజ్ఞానం, సూక్ష్మ పరిశీలనాశక్తి కావ్యంలో ప్రతిబింబిస్తున్నవి. పాండిత్య ప్రదర్శనతోపాటు కవి యథార్థ జీవిత సంఘటనలను చిత్రించాడు. అక్కడక్కడ కవి వైదర్భీ శైలిని ప్రయోగించాడు. శ్లిష్ట పదాలు, దీర్ఘ సమాసాలున్నా కవి శైలి మధురంగా వున్నది. కవిది ధారాప్రవాహం గలశైలి. ఓడయదేవ కవి "జీవక చింతామణి" అనే తమిళ గ్రంథాన్ని "క్షత్ర చూడామణి" అన్న పేరుతో సంస్కృతీకరించాడు.

## అగస్త్యుడు

కాకతీయ రెండవ ప్రతాపరుద్రునికి (క్రీ.శ. 1204-1325) సమకాలికుడు. బాలభారత కర్త ఈ అగస్త్యుడు. ఈ కవి 'కృష్ణ చరిత్ర' అనే గద్య కావ్యాన్ని రచించాడు. దీనిలో శ్రీకృష్ణుని చరిత్ర భాగవత పురాణానుసారంగా నిబంద్ధింపబడింది. తంజావూరు సరస్వతీమహల్ లైబ్రరీలో దీని ప్రతి ఒకటి వున్నది. ఈ కావ్యం కెనడాలోని టోరంటో యూనివర్సిటీనుంచి ప్రొఫెసర్ టి. వెంకటాచార్యచేత విపుల పీఠికతో ప్రచురించపబడింది. బాణుని తర్వాత గద్య కవులందరి వలెనే అగస్త్యుడు ఈ కావ్యంలో బాణుని భాషను,శైలిని, వర్ణనలను అనుకరించాడు. అయినా అగస్త్యుని గద్యశైలి అతని పద్యశైలివలెనే, సరళ సుందరంగా వున్నది. అక్కడక్కడ కవి కాదంబరిని అనుకరించాడు. అగస్త్యుని సరళ గద్య రచనకు ఉదాహరణ. "నందభవనే

సతస్మిన్ జగత్యభ్యుదయేన సాకం వర్ధమానం కదాచి దంకురిత కతిపయ దశన శోభినా సంసక్తస్త్విన్యవ శీకరేణేవ వదనకమలేన ముదమావహన్నతి స్ఫుటాక్షరై రాలాపైః శ్రుతిసుఖ మాపాదయన్ స గోపికాకరతలేషు విచచార".

## కాదంబరి అనుకరణలు

బాణుని తర్వాత రచింపబడిన గద్య కావ్యాల మీద అతని గద్యరచనా ప్రభావం స్పష్టంగా కనిపిస్తున్నది. అతని భాష,శైలి, అలంకారాలు తర్వాత కవులకు అనుసరిణీయమైనవి. బాణుని గద్య రచనకు భిన్నమైన, మౌలికమైన గద్యరచన మరి సంస్కృతంలో రాలేదు. బాణుని గద్యరచనా ప్రభావం అంత గాఢమైంది. బాణుని కాదంబరికథనే కొందరు కవులు సంక్షిప్త సరళరూపంగా రచించివున్నారు. ఢుండి రాజ వ్యాసుడు (క్రీ.శ. 17వ శ॥) "అభినవకాదంబరిని", మణిరాముడు 'కాదంబర్యర్థసారం'ను, కాశీనాథుడు "సంక్షిప్త కాదంబరి"ని, అనంతాచార్యుడు 'చంద్రా పీడ చరిత్ర'ను, ఆర్.వి. కృష్ణమాచార్యులు, 'కాదంబరీ సంగ్రహాన్ని' 'హర్షచరిత్రాసారాన్ని', రచించారు. అహోబిల నరసింహుడు ఆంధ్ర దేశీయుడు. ఈ కవి త్రిమూర్తి కళ్యాణాన్ని 'అభినవ కాదంబరి' పేరుతో రచించాడు. బాణుని కవిత్వంతో స్పర్ధవహించి కాదంబరిని మించవలెననే కోరికతో ఈ కవి ఈ కావ్యాన్ని రచిస్తూ దానికి కాదంబరి పేరునే పెట్టాడు. నరసింహకవి మైసూరు రాజు మూడవ కృష్ణంరాజు ఒడయర్ ఆస్థాన కవి. ఆ రాజు చరిత్రను కవి ఈ కావ్యంలో వర్ణించాడు.

## ఆధునిక గద్య కావ్యాలు

శ్రీశైల దీక్షితుడు ఆధునిక కవి. "శ్రీకృష్ణాభ్యుదయ" మనే గద్య కావ్యాన్ని రచించాడు. శ్రీకృష్ణుని చరిత్రను దీనిలో నిబద్ధించాడు. యాత్రావర్ణనలతో కూడిన "కావేరీగద్యా"న్ని కూడ ఈ కవి రచించాడు. షేక్స్పియర్ నాటకం "కామెడీ ఆఫ్ ఎర్రర్స్' 'ను "భారతీవిలాసం" అనే పేరుతో సంస్కృత గద్య కావ్యంగా వ్రాసాడు.

ఆర్. కృష్ణమాచార్యులు హిందూస్త్రీ శీలాన్ని చిత్రిస్తు "సుశీల" అనే గద్యకావ్యాన్ని రచించాడు.

జగ్గశ్రీ వకుళభూషణకవి మైసూరు రాజ్యంలోని మేల్కోటె గ్రామ నివాసి. ఈ కవి " జయంతిక" అనే కథాకావ్యాన్ని రచించాడు. బాణుని కాదంబరిని అనుసరిస్తు కవి దీన్ని రచించాడు.

కోంబాకం అనంతచార్యులు "ఉదయన చరిత్ర" అనే ఆఖ్యాయికను రచించాడు. ఇంకా ఈ కవి రఘువంశ చరిత్ర, చంద్రాపీడ చరిత్ర, హర్షచరిత్ర సారాన్ని రచించాడు. చంపూ మార్గంలో కథామంజరిని రచించాడు.

హరిదాసు సిద్ధాంత వాగీశుడు "సరళ" అనే గద్యకావ్యాన్ని రచించాడు.

ఆధునిక యుగంలో ఎందరో సంస్కృతకవులు బాణుని కాదంబరిని అనుకరిస్తు ఆధునిక ప్రక్రియ అయిన నవలలను రచించారు. మరియు దేశభాషల్లోని ఆధునికప్రక్రియ అయిన నవలలను కూడ సంస్కృతీకరించారు. విశ్వేశ్వరపాండే " మందారమంజరి, చంద్రప్రభా చరిత్ర"లు ఇటువంటి నవలలు అనదగిన సంస్కృత గద్యాకావ్యాలు, మేధావ్రత పండితుడు "కుముదినీ చంద్ర", బెంగుళూరు నివాసిని రాజమ్మ "చంద్రమౌళి" నవలాకావ్యాలను రచించారు. హరిచరణభట్టాచార్యుడు బంకించంద్రుని కపాలకుండల అన్న బెంగాళీ నవలను సంస్కృతీకరించాడు. బంకించంద్రుని మరొక నవల "లావణ్యమయి"ని కొల్హాపురనివాసి అప్పాశాస్త్రి సంస్కృతీకరించాడు. జగన్నాథప్రసాదుని "సంసార చక్ర్" అన్న హిందీనవలను అనంతాచార్యుడు సంస్కృతీకరించాడు. కల్పితేతి వృత్తంతో కూడి, ఆలంకారికశైలిలో రచింపబడే "కథ" అన్న కావ్యప్రక్రియ కాలక్రమాన ఆధునిక యుగంలో "నవలా" ప్రక్రియతో చేతులుకలిపి సజీవంగా నిలిచిపోయింది.

# చారిత్రక కావ్యాలు

## భారతీయుల చారిత్రక దృష్టి

ప్రాచీన భారతీయులకు చారిత్రక దృష్టి లేదని ఆధునికులు విమర్శిస్తున్నారు. కాని ప్రాచీన భారతంలో ప్రాచీన గ్రీకు దేశంలో వలె గాని, ఆధునిక యుగంలో వలెగాని, వారిదృష్టి కేవలం చారిత్రక సత్యాలను వున్నదున్నట్లుగా రికార్డు చేయటంకాదు. వారి ఐతిహాసిక దృష్టి భిన్న దృక్కోణంతో కూడింది. ఆ దృక్కోణంతో పరిశీలించినట్లయితె వేదాలల్లో, బ్రాహ్మణ మహాభారత రామాయణాలల్లో, పురాణాలల్లో, బౌద్ధ జైన గ్రంథాలల్లో ఎంతో చరిత్ర నిక్షిప్తమై కనిపిస్తున్నది. అట్లా పరిశీలించిన తర్వాత భారతీయులకు పూర్తిగా చరిత్రను గూర్చి స్పృహ లేదని చెప్పలేము. వేదార్థాలను ఐతిహాసిక దృష్టితో పరిశీలించే వాఖ్యాకారుల సంప్రదాయం వుండేదని తెలుస్తున్నది. వారి అభిప్రాయాలను నిరుక్తకారుడు యాస్కుడు "ఇతి ఐతిహాసికా:' అని పేర్కొని వున్నాడు. "ఇతిహాస మాచక్షతే" అని అతడు ప్రాచీనాచార్యుల కథలను ఉట్టంకించాడు. తర్వాత ఇతిహాస గ్రంథాలుగా పురాణాలకు ప్రాచీనకాలంనుంచి కూడా ప్రత్యేక స్థానమున్నది. నారదుడు ఇతిహాస పురాణాలను పంచమవేదంగా పరిగణించాడు. పురాణాలు చాలా కాలం వరకు మౌఖికంగా వుండిపోయినవి కాబట్టి అవి చెప్పే విషయాలల్లో ఒకొకసారి పరస్పర భేదం ఏర్పడింది. అంతేగాని భారతీయుల చారిత్రకదృష్టికి అవి మంచి నిదర్శనాలైన గ్రంథాలు. వేదార్థాలను సంపూర్ణంగా గ్రహించాలంటే ఇతిహాస పురాణాలను అధ్యయనం చేయాలని అంటారు. కౌటిల్యుడు అర్థశాస్త్రంలో ఇతిహాసాంతర్గతంగా పురాణ, ఆఖ్యాయిక, ధర్మశాస్త్ర, అర్థశాస్త్రాలను చేర్చాడు. వీటన్నిటి సమగ్రమైన అధ్యయనం వల్ల ఇతిహాసాన్ని తెలుసుకోవచ్చునంటాడు. ఈనాడు ఇతిహాస మంటె రాజుల, రాజవంశాల ఉదయ పతనాలు, రాజుల యుద్ధాలు, విజయాలు, ఆక్రమణలు, రాజ్యవిస్తరణ, రాజ్యపరిపాలన, ప్రజల ధార్మిక ఆర్థిక సామాజిక పరిస్థితుల అధ్యయనం. ఈ దృష్టితో పరిశీలిస్తే ప్రాచీన భారతీయుల ఐతిహాసిక రచన సమగ్రంగా లేదు. వారు ధర్మం, సత్యం, నీతి, శీలం వీటికి ప్రాధాన్యతను ఇచ్చి చరిత్ర రచనకు పూనుకొన్నారు. ఒక విధంగా ఆదర్శపురుషుల చరిత్రను చిత్రించటమే కాని సమాజాల చరిత్ర అధర్మానికి, అసత్యానికి, అవినీతికి విజయం లభించినట్లుగా చిత్రించటం వారి ఆలోచనా పద్ధతికి విరుద్ధం. ఇక్కడ వారు జరిగినదాన్ని జరిగినట్లుగా, వున్నదాన్ని వున్నట్లుగా

చెప్పటానికి ఇచ్ఛగించలేదు. అందుకే వారికి చారిత్రక దృష్టి లోపించిందనే అపవాదు చుట్టుకొన్నది. బౌద్ధ జైన గ్రంథాలల్లో అపారమైన దేశచరిత్ర నిక్షిప్తమై బయటికి తీసేవారు లేక పడివున్నది. ఆధునిక కాలంలో ఆర్. సి. మజుందార్, రాధాకుముద్ ముఖర్జీవంటి చారిత్రకులు బౌద్ధజైన గ్రంథాలల్లోని చరిత్రను గంభీరంగా తీసుకొని భారతీయ చరిత్రరచనకు ఆధారంగా గ్రహించారు. బౌద్ధ జైన గ్రంథాలల్లో చరిత్ర పక్షపాతంగా, ఏకపక్షంగా వున్నచోట్లు కూడ వున్నవి. కాని చాలా విషయాలను వారు ఏకపక్షమైనా వున్నదున్నట్లుగా చెప్పారు. కాని వారి గ్రంథాలు చారిత్రక గ్రంథాలు కావు. అవి ధార్మిక గ్రంథాలు. సందర్భానుకూలంగా వారు చారిత్రక పురుషులను, సంఘటనలను పేర్కొనటం జరిగింది. చారిత్రక కావ్యపరంపరలో బౌద్ధకవి అశ్వఘోషుని బుద్ధచరిత్ర మొదటిదని చెప్పవచ్చును. చారిత్రక పురుషుడైన బుద్ధునిచరిత్ర దీనిలో నిబద్ధమైంది. కాని కవి దాన్ని ఐతిహాసిక గ్రంథంగా కాక కావ్యవర్ణనాదులతో, ఆలంకారిక శైలిలో రఘువంశాది కావ్యమార్గంలో వ్రాసాడు. దాని ఇతివృత్తాన్ని కవి లలితవిస్తరమనే బౌద్ధ ధార్మికగ్రంథం నుంచి తీసుకొన్నాడు.

సంస్కృత సాహిత్యచరిత్ర గ్రంథాలల్లో చారిత్రకకావ్యాల ప్రకరణంలో చేర్చబడేకృతులు చాలామట్టుకు కావ్యశైలిలో వ్రాయబడినవి. ఆశ్రిత రాజుల, మంత్రుల, వారి వంశాల చరిత్రలను కవులు రచించారు. వాటిల్లో అతిశయోక్తులతో కూడి ఒకొకసారి సత్యవిషయాన్ని బయటికి పొక్కకుండా వ్రాసినవి చాలా వున్నవి. వాటిల్లో సందర్భోచితంగా ఆలంకారిక, శైలిలో కవులు ప్రబంధ వర్ణనలను చేర్చటం కూడ కనిపిస్తున్నది. కాని వీటితోపాటు చరిత్ర సంఘటనలను చెప్పే కల్హణుని రాజతరంగిణి వంటి అచ్చమైన చారిత్రక గ్రంథాలను వ్రాయటం కూడా జరిగింది. ఇటువంటి చారిత్రక కృతుల రచన కల్హణునితో ఆరంభంకాలేదు. అతనికి ముందుకూడ జరిగింది. కాని అవి కాలగర్భంలో కలిసిపోయినవి.

ఇప్పుడు లభ్యమయ్యే చారిత్రక కావ్యాలల్లో చాలామట్టుకు కావ్యమార్గంలో వ్రాయబడినవే వున్నవి. ఒకొకసారి కొన్ని చారిత్రక కావ్యాలల్లో ఇతివృత్తం నామమాత్రంగానే చరిత్రపురుషునిమీద, చారిత్రక సంఘటనమీద ఆధారపడింది. కవి తన దృష్టి ఎక్కువ శైలి, పదవిన్యాసం, వర్ణనలవైచిత్రి, అలంకార చమత్కారం వీటిని సాధించటం మీదనే నిలుపుతుంటాడు. కవి తన కవితా చాకచక్యాన్ని ప్రదర్శించటమే ప్రధానోద్దేశం. బిల్హణుని విక్రమాంకదేవచరిత్రలో చారిత్రక విషయాల కన్న వర్ణనా చమత్కారానికి ప్రాధాన్యం

కన్పిస్తోంది. ఒకొకసారి కవి తన ఆశ్రయదాత రాజు చరిత్రను వ్రాయటానికి పూనుకొని, ఆశ్రయదాత కీర్తి ప్రతిష్ఠలకు విరుద్ధమైన కటుసత్యాలను చెప్పకుండ వదిలివేయటమో, మార్చి వ్రాయటమో చేసాడు. అప్పుడు చారిత్రకసత్యం మరుగునపడే అవకాశం ఏర్పడుతుంది. తన ఆశ్రయదాత ప్రీతికొరకు అతని చరిత్రను అతిశయోక్తులతో వర్ణించటం కూడ జరుగుతుంది. దీనివల్ల కూడ చారిత్రక సత్యం మరుగునపడే అవకాశం వుంటుంది. ఇంకా కొన్నిసార్లు కవి చారిత్రకమైన సంఘటనలను సత్యదృష్టితో గ్రహించి చెప్పినా, ఆలంకారికమైన వర్ణనాత్మకమైన శైలిలో మరుగుపడి పోతుంటుంది. సమకాలిక రాజకీయ, సామాజిక, ధార్మిక పరిస్థితులను కవి వున్నదున్నట్లుగా వర్ణిస్తాడు. కాని అతిశయోక్తుల్లో మరుగుపడి చారిత్రక సత్యాలను బయటికి లాగవలసిన సూక్ష్మాధ్యయనం అవసరమై వుంటుంది. బాణుని హర్షచరిత్ర కావ్యం ఈ కోవకు చెందింది. ఈ కావ్యంలో చెప్పబడిన అనేక రాజకీయ సాంఘిక విషయాలను డా. వాసుదేవశరణ అగ్రవాల్ "హర్షచరిత్-ఏక్ సాంస్కృతిక్ అధ్యయన్" అన్న గ్రంథంలో విశదీకరించాడు. అట్లా సంస్కృత కావ్యాలను అధ్యయనంచేసి ఐతిహాసిక విషయాలను బయటికి లాగవలసివుంటుంది. కొన్ని చారిత్రక కావ్యాలల్లో కవులు తీసుకొన్న ఐతిహాసిక సంఘటనను ప్రస్తుతీకరించటంలో కావ్య శైలిని ఆశ్రయించినా న్యాయం చేకూర్చారు. ఉదా॥ కు గంగాదేవి వ్రాసిన మధురావిజయం. కవయిత్రి తన భర్త విజయనగర సామ్రాజ్యానికి యువరాజు అయిన కంపనరాయల మధురానగర విజయాన్ని సత్యసంఘటనలతో వివరించింది. కొందరు కవులు అంతగా ప్రసిద్ధులు కాని తమ ఆశ్రయదాతల చరిత్రలను వ్రాసారు. అటువంటివి కొన్ని కావ్యరూపంగా గాని ఐతిహాసికంగా గాని ఎటువంటి ప్రాధాన్యంలేని కావ్యాలు. మరికొన్ని కావ్యాలల్లో కవులు చారిత్రక ప్రధానమైన పురుషుల చరిత్రలను తీసుకొన్నా అప్రధానమైన సంఘటనలనో కేవలం వారి కళ్యాణ మహోత్సవాలనో గ్రహించి వర్ణించిన కావ్యాలెన్నో వున్నవి. ఇటువంటివి ఎక్కువగా "అభ్యుదయ, విలాస, పరిణయం" పేర్లతో వ్రాయబడినవి. వీటికి కావ్యాలుగా సాహిత్యంలో స్థానమున్నా చారిత్రకదృష్టితో ఎటువంటి ప్రాధాన్యతలేనివి. ఈ చారిత్రకకావ్యాలే కాక కొన్ని అలంకార శాస్త్రాలల్లో కవులు లక్ష్యపద్యాలుగా తమ ఆశ్రయదాతలైన రాజుల చరిత్రలను, సాహసకార్యాలను, విజయాలను వర్ణించారు. విద్యానాథుని ప్రతాపరుద్ర యశోభూషణం వంటివి ఇటువంటి గ్రంథాలే. చారిత్రక కావ్యాలన్ని ఒక్క విధమైన కావ్యప్రక్రియను అనుసరించి వ్రాయబడినవికావు. కొందరుకవులు ఆఖ్యాయిక అనే గద్యకావ్యప్రక్రియను అనుసరించి వ్రాసారు. మరికొందరు కవులు పద్యకావ్య ప్రక్రియను, మరికొందరు

చంపూకావ్యప్రక్రియను చేపట్టారు. కాబట్టి కావ్యప్రక్రియను గణించకుండా ఇతివృత్తం చారిత్రకమైనదైతే ఈ ప్రకరణంలో చేర్చటం జరిగింది.

## బాణభట్టు

బాణభట్టు హర్షవర్ధనుని (క్రీ.శ. 606-648) ఆస్థానకవి. బాణునికి లక్షలు కోట్లు విలువచేసే సువర్ణాన్ని హర్షవర్ధనుడు ఇచ్చి సత్కరించాడని సోడ్డలకవి పేర్కొన్నాడు. బాణుడు కాదంబరి కథాకావ్యానికి పూర్వమే హర్షచరిత్రను వ్రాసాడు. హర్షచరిత్రలో కవి హర్షవర్ధనుని జీవితచరిత్రలోని ప్రధాన ఘట్టాలను వర్ణించాడు. ఇది అసంపూర్ణంగా వున్నట్లు, హఠాత్తుగా రచన ఆగిపోయినట్లుగా గోచరిస్తున్నది. కవి కావ్యాన్ని కావాలనే అక్కడ ఆపివేసాడో లేదా ఏ కారణంచేతనో పూర్తిచేయలేక పోయాడేమో చెప్పటానికి వీల్లేకుండవున్నది. కవి దాన్ని పూర్తిచేయలేక పోయాడంటె హర్షవర్ధనుని మరణం దానికి కారణం కావచ్చును.

## హర్షచరిత్ర కావ్యేతివృత్తం

బాణుని కాదంబరి 'కథ' అనే గద్యకావ్య ప్రక్రియకు చెందింది కాగా హర్షచరిత్ర 'ఆఖ్యాయిక' అనే గద్యకావ్య ప్రక్రియకు చెందింది. 'కథ' కల్పితేతివృత్తం కలదికాగా 'ఆఖ్యాయిక' సత్యసంఘటనలు కలది. హర్షచరిత్ర ఆఖ్యాయిక. 8 ఉచ్ఛ్వాసాలుగా విభజింపబడింది. మొదటి రెండు ఉచ్ఛ్వాసాలల్లో కవి తన చరిత్రను, తాను హర్షవర్ధనుని ఆస్థానంలో చేరిన పరిస్థితులను మొదలైనవాటిని వర్ణించుకొన్నాడు. మిగిలిన ఆరు ఉచ్ఛ్వాసాలల్లో హర్షవర్ధనుని చరిత్ర వున్నది. హర్షుని చరిత్రను కవి హర్షుని వంశక్రమ వర్ణనతో ఆరంభించాడు. హర్షుని తండ్రి ప్రభాకరవర్ధనుని, అన్న రాజ్యవర్ధనుని చరిత్రలను కవి విశదంగా చెప్పాడు. హర్షుని సోదరి రాజశ్రీ, మౌఖరి వంశానికి చెందిన గ్రహవర్మ వివాహం, ప్రభాకరవర్ధనుని మరణం, రాణి యశోమతి సహగమనం, రాజ్యవర్ధనుడు హూణులపైకి దండెత్తిపోయి విజయాన్ని సాధించటం, అతడు సింహాసనాన్ని అధిష్ఠించటానికై విముఖుడు కావటం క్రమంగా వర్ణింపబడినవి. ఇంతలోమాళవరాజు, గ్రహవర్మను చంపి రాజశ్రీని చెరపట్టాడని వార్తవస్తుంది. రాజ్యవర్ధనుడు మాళవ రాజు మీదికి యుద్ధానికి పోయి, ఓడించాడు కాని యుద్ధరంగంలో వీరమరణం చెందుతాడు. రాజశ్రీ, చెరసాలనుంచి పారిపోయి ఒక బౌద్ధభిక్షువు దివాకరమిత్రునిచేత రక్షింపబడ్తుంది. సోదరిని వెతుకుతు

బయలుదేరిన హర్షవర్ధనుడు రాజశ్రీని కలుసుకొంటాడు. రాజశ్రీ బౌద్ధసన్యాసినిగా దీక్షను ఇయ్యమని బౌద్ధభిక్షువును కోరుతుంది. కాని హర్షుడు తాను శత్రువినాశాన్ని చేస్తానన్న ప్రతిజ్ఞను నెరవేర్చేంతవరకు తన చెల్లెలికి ధర్మోపదేశం చేయవద్దని తాను శత్రువినాశాన్ని చేసినాక ఇద్దరం కలిసి ఒక్కసారే బౌద్ధసన్యాసదీక్షను గ్రహిస్తామని అంటాడు. ఈ సన్నివేశం తర్వాత సూర్యాస్తమయ, సంధ్య, చంద్రోదయ వర్ణనలతో కావ్యం ముగుస్తుంది. హర్షవర్ధనుని శత్రువినాశాన్ని, పట్టాభిషేకాన్ని వర్ణించక కవి కావ్యాన్ని అసంపూర్ణంగా వదలి వేసాడని కొందరు విమర్శకులు తలంచారు. కావ్యం చివర ఉదయించే చంద్రుణ్ణి హర్షుని కొరకై రజని తెచ్చిన ఉపహారంగా, రాజ్యలక్ష్మి తెచ్చిన వెండి శాసనముద్రగా, భాగ్యాధిష్ఠాత్రిదేవి ద్వీపాలమీదికి దండెత్తిపోయే అతని దగ్గరికి పంపిన శ్వేతదీపం యొక్క దూతగా కవి ఉత్ప్రేక్షించి హర్షుని దిగ్విజయాలను, పట్టాభిషేకాన్ని సూచించాడని, శుభచంద్రో దయంతో కవి కావ్యాన్ని అక్కడే ముగించాడని మరికొందరు విమర్శకుల అభిప్రాయం.

బాణుడు సందర్భానుకూలంగా ఇతర రాజుల వృత్తాంతాలను చెప్పాడు. దీనితో ఆనాటి ఉత్తర భారతదేశ చరిత్రను పూర్తిగా అవగతం చేసుకోవటానికి వీలుగా వున్నది. ఇంకా ఆనాటి రాజకీయ పరిపాలనా వ్యవస్థను, మతసంప్రదాయాలను, సామాజిక పరిస్థితులను కవి సమగ్రంగా వర్ణించాడు. కాబట్టి హర్షచరిత్ర కావ్యం చారిత్రక దృష్టితో చాల అమూల్యగ్రంథం.

## బాణుని శైలి

చారిత్రకమైన యథార్థ సంఘటనలను చెప్పేటప్పుడు ప్రయోగించే సరళమైన నిరలంకారశైలిని బాణుడు ఈ కావ్యంలో ప్రయోగించలేదు. మహాకావ్యశైలి అంటే ఆలంకారిక శైలినే ప్రయోగించాడు. హర్ష చరిత్రలోని శైలి ప్రౌఢమై, సమాసయుక్తమై యున్నది. "ఓజః సమాస భూయస్త్వమే తద్ గద్యస్యజీవితమ్' అన్న ఉక్తిని బాణుని నాటి కవులు. ముఖ్యంగా గద్యకవులు ఆదర్శంగా తీసుకొన్నట్లు కన్పిస్తున్నది. ఆయాచోట్ల కవి కరుణరసాదులను చక్కగా పోషించాడు. కాదంబరిలోవలె బాణుడు హర్షచరిత్రలో శ్లేషను చాల ప్రయోగించలేదు. బాణుని శైలి పాంచాలీ రీతిలో నడిచింది. సందర్భానుకూలంగా బాణుడు దీర్ఘ వర్ణనలను చేసాడు. ఈ వర్ణనలు భవ్యంగాను, సహజంగాను వున్నవి. ఈ వర్ణనలు సమకాలిక జీవన ఔన్నత్యాన్ని ప్రతిబింబిస్తున్నవి. రాజ ప్రాసాదాలు, ఆచార వ్యవహారాలు, వస్త్రధారణ, సైన్యం, సైనికుల యాత్ర మొ॥న వాటి నెన్నిటినో బాణుడు సమగ్రంగా కన్నులకు కట్టేటట్లుగా వర్ణించాడు.

## వాక్పతి రాజు

వాక్పతిరాజు పరమార వంశానికి చెందిన రాజకుమారుడు, క్షత్రియుడు. భవభూతి వలెనే వాక్పతిరాజు కనౌజ్ రాజు యశోవర్మ (క్రీ.శ. 720 ప్రాంతం) ఆస్థాన కవి. వాక్పతిరాజు భవభూతిని గౌరవంగా గురుస్థానాన్నిచ్చి పేర్కొన్నాడు. కాబట్టి వాక్పతిరాజు కన్న భవభూతి వయస్సులో పెద్దవాడై వుంటాడు. యశోవర్మ కవి పోషకుడే కాక స్వయంగా కవి. యశోవర్మ వాక్పతికి కవిరాజ బిరుదాన్నిచ్చి గౌరవించాడు. ఈ కవిరాజు మహారాష్ట్ర ప్రాకృత భాషలో "గౌడవహో" అన్న కావ్యాన్ని రచించాడు. దీనిలో 1209 గాథలున్నవి. ఈ కావ్యంలోనే యశోవర్మ వృత్తాంతం వర్ణించబడింది. ఇది అసంపూర్ణంగా వున్నది. యశోవర్మ కాశ్మీర రాజు లలితాదిత్యుని చేతిలో పరాజితుడైనట్లుగా చెప్పబడింది. యశోవర్మ పరాజయ కారణంగానే కవి కావ్యాన్ని అసంపూర్ణంగా వదిలివేసి వుంటాడు. లభ్యమయే కావ్యం మౌలిక రూపంలో లేదని కొందరు విమర్శకులు తలంచారు. యశోవర్మ లలితాదిత్యునిచేత క్రీ.శ 733 ప్రాంతంలో ఓడిపోయాడని చరిత్ర చెప్తున్నది. కాబట్టి వాక్పతిరాజు క్రీ.శ. 740 ప్రాంతంలో ఈ కావ్యాన్ని ముగించి వుంటాడు.

## గౌడవహో

గౌడవహో కావ్యంలో యశోవర్మ గౌడరాజును జయించే ఇతివృత్తం వున్నది. అందుకే కవి ఈ కావ్యానికి గౌడవహో(గౌడవధ) అని పేరు పెట్టాడు. సందర్భానుకూలంగా కవి ఋతు, వన, సూర్యాస్తమయ, పర్వత, నదీ వర్ణనలను చేర్చాడు. చారిత్రకేతివృత్తం కన్న కావ్యభాగమే ఎక్కువ. పేరునుబట్టి కావ్యం గౌడరాజును యశోవర్మ వధించటంతో ముగియటం లేదు. ఇంకా తర్వాత యశోవర్మ దిగ్విజయాలను కవి వర్ణించాడు. ఈ దిగ్విజయ వర్ణనల్లో ఐతిహాసికతకన్న కావ్యత్వం ఎక్కువగా కన్పిస్తున్నది.

గౌడవహోలో శైలి సుందరంగా వున్నది. శ్లేషచమత్కారాలు తక్కువ. ఉపమ రూపక ఉత్ప్రేక్ష అర్థాంతరన్యాసాద్యలంకారాలను కవి ప్రయోగించాడు. అక్కడక్కడ దీర్ఘసమాసాలతో శైలి కఠినంగా వున్నది.

## మధుమథన విజయం

వాక్పతిరాజు మధుమథనవిజయం అనే మరొక కావ్యాన్ని రచించాడు. ఇది కూడా ప్రాకృత భాషలోనే వున్నది. ఇది గౌడవహో కావ్యంలో పేర్కొనబడింది. కాని ఇప్పుడు

అలభ్యం. ఆనందవర్ధనుడు ధ్వనికుదాహరణలుగా ఎన్నో గాథనలను ఈ కావ్యం నుంచి ఇచ్చాడు. పేరునుబట్టి ఈ కావ్యంలో విష్ణువు మధువనే రాక్షసున్ని చంపే వృత్తాంతమున్నదని చెప్పవచ్చును.

# పద్మగుప్తుడు

## పద్మగుప్తుని పరిచయం

పరిమళ పద్మగుప్తుడని ఈ కవికి పేరు. ఇతడు "పరిమళ కాళిదాసు' అన్న బిరుదాన్ని ధరించాడు. కాళిదాసు ఇతని అభిమాన కవి. అందుచేతనే ఆ బిరుదాన్ని ధరించి వుంటాడు. ధారానగరాన్నేలిన సాహసాంక బిరుదాంకితుడైన సింధురాజు ఆస్థానకవి. సింధురాజు రెండవ వాక్పతిరాజు తమ్ముడు. ప్రసిద్ధుడైన భోజరాజు తండ్రి. ఆ రాజు చరిత్రను కవి నవసాహసాంకచరిత్ర అనే కావ్యంలో నిబద్ధించాడు. కావ్యంలో తనను గూర్చి పద్మగుప్తుడు ఏమి చెప్పుకోలేదు. తన తండ్రి పేరు మృగాంక గుప్తుడని మాత్రం పేర్కొన్నాడు. రెండవ వాక్పతిరాజు కవి, పండితుడు, కవి పోషకుడు. అతనివలెనే సింధురాజు కూడ కవి. కవి బాంధవుడు. వాక్పతిరాజు క్రీ.శ 993-997 మధ్య కర్ణాటరాజు తైలపుని చేతిలో యుద్ధంలో మరణించాడు. ఆ తర్వాత అతని సోదరుడు సింధురాజు సింహాసనాన్ని అధిష్ఠించాడు. అతడు కూడ క్రీ.శ. 1009లో గూర్జరరాజు సోలంకి చాముండరాజు చేతిలో మరణించాడు. పద్మగుప్తుడు తన కావ్యంలో వాక్పతిరాజును స్తుతించటం చేత మొదట అతడు ఆ రాజు ఆస్థానంలోవుండి తర్వాత సింధురాజు ఆదరణలో వున్నాడని చెప్పవచ్చును. సింధురాజు ప్రేరణతో కవి ఈ కావ్య రచనకు పూనుకున్నాడు. సింధురాజు తర్వాత అతని తమ్ముడు ముంజరాజు, ఆ తర్వాత భోజుడు రాజ్యాన్నేలారు. పద్మగుప్తుడు ముంజ ,భోజుల ఆస్థానంలో కూడ వున్నాడని పండితుల అభిప్రాయం. కాని భోజుడు తన గ్రంథాల్లో ఎక్కడా పద్మగుప్తుని ఉద్ధరించలేదు. పద్మగుప్తుని కాలం క్రీ.శ. 10వ శతాబ్ది ఉత్తరభాగం క్రీ.శ. 11వ శతాబ్ది పూర్వ భాగమని చెప్పవచ్చును. ఈ కవి కాశ్మీర ప్రాంతంవాడని, శైవుడని అతని కావ్యవర్ణనలనుబట్టి తెలుస్తున్నది.

## నవసాహసాంక చరిత్ర

నవసాహసాంక చరిత్రలో 18 సర్గలున్నవి. పద్యకావ్యం. క్షేమేంద్రుడు తన

ఔచిత్య విచారచర్చలో పద్మగుప్తుని శ్లోకాలను ఉద్ధరించాడు. కాని వాటిల్లో కొన్ని ఈ కావ్యంలో లేకపోవటంచేత ఈ కవి మరొక కావ్యాన్ని కూడ వ్రాసాడని చెప్పవచ్చును. నవసాహసాంక సింధురాజు, నాగరాజు కూతురు శశిప్రభను వివాహమాడే వృత్తాంతం ఈ కావ్యంలో వున్నది. సింధురాజు వజ్రాంకుడనే నాగుల శత్రువును చంపి, వాని సరస్సులోవున్న బంగారు కమలాన్ని తెచ్చి నాగరాజుకిచ్చి శశిప్రభను వివాహమాడుతాడు. కావ్యశైలిలో కవి కథను రమ్యంగా నడిపాడు. మహాకావ్యోచితమైన వన, ప్రకృతి, మృగయాది వర్ణనలను కవి చేసాడు. శృంగారం ప్రధానరసం. వీరాద్భుతాలు అంగరసాలు.

## శైలి

పద్మగుప్తుని శైలి ప్రసన్న మధురమైంది. కవి అనుప్రాసను ఎక్కువగా ప్రయోగించాడు. పదలాలిత్యం కల శైలి. యుద్ధాది వర్ణనల్లో కవి సమాసయుక్తమైన ఓజోపూర్ణ శైలిని వాడాడు. వర్ణనలు సహజంగా వున్నవి. ఉత్ప్రేక్ష, రూపక, ఉపమ, విరోధాభాస, అర్థాంతరన్యాస, దీపకాద్యలంకారాలను కవి ప్రయోగించాడు. మొత్తం మీద పద్మగుప్తుడు తన అభిమానకవి కాళిదాసును అనుకరించటానికి ప్రయత్నించాడు.

## చారిత్రక సత్యాలు

సింధురాజు పరమారవంశానికి చెందినవాడు. పరమారులు అగ్నికుల క్షత్రియులమని, బ్రహ్మక్షాత్రకులీనులమని చెప్పుకొన్నారు. పదకొండవ సర్గలో కవి పరమారవంశోత్పత్తిని గూర్చి ఇట్లా చెప్పాడు - విశ్వామిత్రుడు వసిష్ఠుని కామధేనువును ఎత్తుకొనిపోగా వశిష్ఠుని భార్య అరుంధతి, ఇంకా మిగిలిన ఋషిపత్నులు విచారించారు. అప్పుడు వశిష్ఠుడు యజ్ఞం చేయగా ఒక పురుషుడు ఉద్భవించి కామధేనువును విశ్వామిత్రుని దగ్గరనుంచి తెచ్చి యిస్తాడు. వసిష్ఠుడు ఆ పురుషునికి పరమారుడని నామకరణం చేస్తాడు. ఆ పరమారుని నుంచే పరమారవంశం ఉద్భవించింది. పరమార రాజులు తమ శాసనాలల్లోను తమ వంశోత్పత్తిని గూర్చి ఇదే కథను చెప్పుకొన్నారు. వంశోద్భవ వృత్తాంతం తర్వాత కవి వంశక్రమాన్ని వర్ణించాడు. ఈ వర్ణనాక్రమం చారిత్రకుల కుపయోగకరంగా వున్నది. 10వ సర్గలో కవి సింధురాజు వాగడ, మురళ, లాట, హూణ దేశాలను జయించినట్లుగా వర్ణించాడు. ఇవన్నీ చారిత్రక విజయాలే అని రాజప్రశస్తులు చెప్తున్నవి. కాని ప్రధానేతివృత్తమైన శశిప్రభతో వివాహం చారిత్రకంగా సత్యమో కాదో చెప్పలేము. విద్యాధరుల సహాయంతో

వజ్రాంకుశ రాజును సింధురాజు జయించి నాగకన్య శశిప్రభను వివాహమాడినాడనటం చారిత్రక సత్యంగా గోచరించదు. ఈ ఇతివృత్తం పౌరాణికమైన రంగుకింద చారిత్రకసత్యం నిక్షిప్తమైవుందని బ్యూలర్, మిరాశివంటి విమర్శకులు తలంచారు. భారతీయ సంప్రదాయాన్ననుసరించి కవి కథను నడిపించాడు. అంతేగాని ఈ కావ్యేతివృత్తం చారిత్రక సత్యశూన్యం కాదు. వజ్రాంకుశుని రాజధాని రత్నావతి నర్మదానది దక్షిణతీరంలో వున్నదని కవి చెప్పాడు. వజ్రాంకుశుడు ఆటవికుల రాజు అయి వుంటాడు. బస్తర్ ప్రాంతాన్నేలిన నాగవంశానికి చెందిన కన్య శశిప్రభ కావచ్చును. సింధురాజుకు సహాయంగా వెళ్ళిన విద్యాధర రాజు శశిఖండుడు శీలాహార వంశానికి చెందిన వాడని విమర్శకుల ఊహ. శీలాహారులు విద్యాధరరాజు జీమూతవాహనున్ని తమ వంశానికి మూలపురుషునిగా తలంచేవారు. వీరి రాజ్యం ఈనాటి కొంకణ ప్రాంతం. నాగరాజు వేడుకోగా సింధురాజు శీలాహారుల సహాయంతో ఆటవికరాజు వజ్రాంకుశున్ని ఓడించివుంటాడు.

## క్షేమేంద్రుడు

క్షేమేంద్రుడు క్రీ.శ. 11వ శ॥ఉత్తరార్ధంవాడు. కవి, ఆలంకారికుడు. కాశ్మీర దేశవాసి. ఈ కవి నృపావళి అనే చారిత్రక కావ్యాన్ని రచించాడని కల్హణుడు పేర్కొన్నాడు. కాని అది అలభ్యం.

అదేవిధంగా **హేలరాజు** 12 వేల శ్లోకాలల్లో పార్థివావళి రచించాడని, దాని ఆధారంగా పద్మమిహిరుడు అశోకుని పూర్వజాలను వర్ణించాడని కల్హణుడు పేర్కొన్నాడు. కల్హణుడు ఛవిల్లాకర, సువ్రతులనే చారిత్రక కృతికారులను పేర్కొన్నాడు. **ఛవిల్లాకరుడు** రాజుల చరిత్రను చెప్పాడట. **సువ్రతుడు** ఇతిహాస గ్రంథాలను సంక్షేపరూపంగా, యథార్థ రూపంగా ప్రస్తుతీకరించాడట. అవి అలభ్యాలు. కల్హణునికి పూర్వం చరిత్రను రికార్డుచేసే పద్ధతివున్నదని ఈ గ్రంథాలే చెప్తున్నవి. కాలగర్భంలో కలిసిపోయిన ఈ చరిత్రగ్రంథాలు లభ్యమయినట్లయితే భారతదేశ చరిత్రగతి నిర్ణయం ఎట్లావుంటుందో చెప్పలేము.

## బిల్హణుడు

### బిల్హణుని పరిచయం

బిల్హణుడు విక్రమాంకదేవ చరిత్ర అనే చారిత్రక కావ్యాన్ని వ్రాసాడు. కళ్యాణ చాళుక్యరాజు ఆరవ విక్రమాదిత్య త్రిభువనమల్లుని చరిత్రను కవి దీనిలో వర్ణించాడు.

బిల్హణుడు కావ్యం చివర 18 వ సర్గలో తనను గూర్చి పరిచయాన్ని ఇచ్చాడు. కవి తల్లిదండ్రులు నాగదేవి. జ్యేష్టకలశులు. కాశ్మీరదేశంలో పుట్టాడు. ఇతని తాత ముత్తాతలు రాజకలశ, ముక్తికలశులు వేదపండితులు, అగ్నిహోత్రులని కల్హణుని రాజతరంగిణిలో చెప్పబడింది. కవి తండ్రి జ్యేష్ఠకలశుడు వైయాకరణుడు. బిల్హణుని విద్యాభ్యాసం కాశ్మీరంలో జరిగింది. బిల్హణుడు ఇంటినుంచి బయలుదేరి దేశ సంచారం చేస్తు మథురవృందావనంలో కొంతకాలం వున్నాడు. అక్కడ పండితులతో శాస్త్రార్థం చేస్తుండేవాడు. కనౌజ్ ప్రయాగ కాశీయాత్రలను కూడా చేసాడు. బుందేలు ఖండంలోని డాహలరాజు కృష్ణుని ఆస్థానంలో ఉన్నప్పుడే రామచరిత్ర అనే కావ్యాన్ని వ్రాసాడు. తర్వాత దేశసంచారం చేస్తూ బిల్హణుడు గుజరాతులోని అన్హిలవాడరాజు కర్ణదేవత్రైలోక్యమల్లుని (క్రీ.శ. 1064-1094) ఆస్థానంలో కొంతకాలమున్నాడు. ఆ తర్వాత రామేశ్వరం సందర్శించి తిరిగివస్తూ కళ్యాణచాళుక్య రాజు విక్రమాదిత్యుని (క్రీ.శ. 1076-1127) ఆస్థానాన్ని చేరుకొన్నాడు. క్రీ.శ. 1083లో విక్రమాదిత్యుడు నర్మదను దాటి మధ్య భారతం మీదికి చేసిన విజయయాత్రను గూర్చి ప్రసంగించకపోవటం చేత బిల్హణుడు తత్పూర్వమే విక్రమాంక దేవచరిత్రను వ్రాసాడని చెప్పవచ్చును.

బిల్హణుడు కర్ణసుందరి అన్న నాటకాన్ని వ్రాసాడు. దీనిలో అన్హిలవాడరాజు కర్ణదేవుని గూర్చి వున్నది. దీనిలో నాలుగు అంకాలున్నవి. రత్నావళినాటిక పద్ధతిలో వ్రాయబడింది. విద్యాధర రాజకుమారి కర్ణదేవుల ప్రణయం, వివాహం దీనిలో చిత్రింపబడినవి. బిల్హణుడు రామచరిత్రను వ్రాసినట్లు విక్రమాంక దేవ చరిత్రలో చెప్పుకొన్నాడు. కాని అది అలభ్యం. బిల్హణుని మరొక కృతి "శివస్తుతి" అనే స్తోత్ర గ్రంథం.

## విక్రమాంకదేవ చరిత్ర

విక్రమాంకదేవ చరిత్రలో 18 సర్గలున్నవి. కావ్యశైలిలో వ్రాయబడిన చారిత్రక కావ్యం. వీరశృంగారాలు ప్రధానరసాలుగా పోషింపబడినవి. వర్ణనలకు కావ్యంలో ప్రాధాన్యత వున్నది. సందర్భానుకూలంగా యుద్ధ, వివాహ, సంధ్య, చంద్రోదయ, మధుపాన, జలక్రీడ, వర్ష, శిశిరాది షడ్రుతువుల వర్ణనలనుచేసాడు. కేవలం చారిత్రక సంఘటనలను వున్నదున్నట్టుగా చెప్పటం కాక కావ్యం వ్రాయటం బిల్హణుని ప్రధానోద్దేశం. కవి శైలి వైదర్భీరీతిలో నడిచింది. కవి దీర్ఘసమాసాలను ప్రయోగించక సరళమధురమైన శైలిలో రచించాడు. రూపక, ఉపమ, ఉత్ప్రేక్ష, అతిశయోక్తి, దృష్టాంత, విరోధాభాస, వ్యతిరేక,

సమాసోక్తి, అర్థాపత్త్యాద్యలంకారాలను ,ప్రయోగించాడు. వీటిల్లో ఉత్ప్రేక్షను బిల్హణుడు ఎక్కువగా ఆదరించాడు.

## చారిత్రక సత్యాలు

విక్రమాదిత్యుడు చేసిన అనేక యుద్ధాలను, సాధించిన విజయపరంపరలను కవి చక్కగా వర్ణించాడు. ఇవన్నీ చారిత్రక సత్యాలనటం నిస్సందేహం. తండ్రి తనను భావిమహారాజుగా ఎన్నుకొన్నా విక్రమాదిత్యుడు రాజ్యాన్ని సోమేశ్వరునికియ్యటం, సోమేశ్వరుడు దుర్మార్గుడు కాగా అతన్ని ఓడించి విక్రమాదిత్యుడు రాజు కావటం ఇవన్నీ చారిత్రక సంఘటనలే. శిలాహారకన్య కరహాటరాజు కూతురు చంద్రలేఖ (ఈమె శాసనాలల్లో చందలదేవిగా చెప్పబడింది) స్వయంవరంలో విక్రమాదిత్యున్ని వరించటం, వారి వివాహం, వనవిహారాదులు విశదంగా వర్ణింపబడినవి. కవి చాలామట్టుకు చారిత్రక సంఘటనలనే గ్రహించినా, చారిత్రక సత్యాలను అతిశయోక్తులతో రచించిన ఘట్టాలు కూడా అనేకం వున్నవి.

## శంభు

శంభు కాశ్మీరరాజు. రాజేంద్రకర్ణపూరమనే చారిత్రక కావ్యాన్ని రచించాడు. దీనిలో కాశ్మీరరాజు హర్షదేవుని (క్రీ.శ. 1088-1100) చరిత్ర నిబద్ధమైంది.

## కల్హణుడు

కల్హణుడు కాశ్మీర దేశీయుడు. ఈ కవి రచించిన రాజతరంగిణి చారిత్రక కావ్యాలల్లో ప్రసిద్ధమైంది, ప్రశస్తమైంది. ఇతడు కాశ్మీరరాజు జయసింహుని (క్రీ.శ. 1127-1149) ఆస్థానకవి. చాల శ్రమకోర్చి చారిత్రక సత్యాలను ఏర్చి కూర్చి ఈ గ్రంథాన్ని రచించాడు. దీనిలో 8 తరంగాలున్నవి. మొదటి మూడు తరంగాలల్లోని ఇతివృత్తాలు కొంతవరకు ఊహాపోహలు, కథలుగా వున్నవి. మిగతా తరంగాలల్లోని విషయాలు చాలా మట్టుకు చారిత్రక సత్యాలే.

రాజతరంగిణిని బట్టి కల్హణుని తండ్రి అమాత్యచంపకుడు. కల్హణుడు చెప్పిందాన్ని బట్టి అతడీ రచనను క్రీ.శ. 1148-49 లో చేసినట్లు తెలుస్తున్నది. ఆ సమయానికి కల్హణుడు ప్రౌఢవయస్సునందుకొని వుంటాడు. కల్హణుని తండ్రి కాశ్మీరరాజు

హర్షుని ఆస్థానంలో మొదట ద్వారపతిగా వుండి క్రమక్రమంగా మంత్రిపదవిని అందుకొన్నాడు. కల్హణుడు శైవుడు. అయినా బౌద్ధమతమంటె అతనికి అభిమానం. కల్హణుని కావ్యరచనా సమయానికి కాశ్మీర దేశంలో అల్లోకల్లోల పరిస్థితులు నెలకొనివున్నవని తెలుస్తున్నది. అతని తండ్రి మంత్రిగావున్న రాజా హర్షుడు దుర్మార్గుడు కావటంచేత ఉచ్చల, సుస్సలుల నాయకత్వంలో తిరుగుబాటు జరిగింది. హర్షుడు హత్యచేయబడినాడు. కల్హణుని తండ్రి పదవీభ్రష్టుడైనాడు. కల్హణుడు ఎప్పుడు రాజోద్యోగాన్ని నిర్వహించినట్లుగా లేదు.

## రాజతరంగిణి

రాజతరంగిణిలో 7826 శ్లోకాలున్నవి. ఎనిమిది తరంగాలల్లో 7వ, 8వ తరంగాలు పెద్దవి. మిగతావి చాల చిన్నవి. శాంతం ప్రధానరసం. శృంగార రౌద్ర కరుణాదులు అంగరసాలు. తానుచెప్పే విషయాలు కొత్తవి కావని, ఇంతకుముందు అనేకమంది కవులు చెప్పినవే అని కల్హణుడంటాడు. ఇతరులు చెప్పినదాన్నే తాను తిరిగి చెప్పినా కొత్తరూపాన్ని ఇచ్చానని కల్హణుడంటాడు. తనకన్న ముందున్న పదకొండు రచనలను ఆధారంగా గ్రహించానని అతడు చెప్పాడు - నీలమత పురాణం, క్షేమేంద్రుని నృపావళి, హేలరాజా పార్థివావళి, ఛవిలకారుని రచన మొదలైనవి. వీటిల్లో చాల ఇప్పుడు లభించటంలేదు, కాలగర్భంలో కలిసిపోయినవి. ఈ రచనలనే కాక కల్హణుడు శాసనాలను, అధికారపత్రాలను, దాన పత్రాలను, ప్రశస్తులను, పరిశీలించి తెలుసుకొన్న విషయాలను తన కావ్యంలో చేర్చాడు. సంఘటనలను చక్కగా చెప్పగల నేర్పు అతనికి వున్నది. ఆదికాలం మొదలుకొని తన జీవితకాలం నాటివరకు గల కాశ్మీరదేశ చరిత్రను, రాజుల వంశాలను, పరిపాలనా విధానాలను క్రమబద్ధంగా కల్హణుడు వర్ణించాడు. సమకాలిక చరిత్రను చెప్పేటప్పుడు స్వీయాభిప్రాయలను నిష్పక్షపాతంగా వ్యక్తంచేసాడు. తన వంశపోషకుడైన హర్షుని దుర్మార్గాలను అతడు కప్పిపుచ్చలేదు. ఆనాటి రాజకీయోద్యోగులను బ్రాహ్మణులను కూడ అతడు కఠినంగా విమర్శించాడు. భిన్న యుగాలనాటి ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక, రాజనైతిక పరిస్థితులను వున్నదున్నట్లుగా వైవిధ్యంతో ఎక్కడా సమకాలిక ప్రభావం లేకుండ కల్హణుడు వర్ణించాడు. రాజతరంగిణి మధ్యయుగంలోని యురోపియన్ల, మహమ్మదీయుల చరిత్రవ్రాసే పద్ధతికి దగ్గరగా వున్నదని సర్ ఔరెల్ స్టయిన్ అభిప్రాయం. క్రీ.శ. 1900లో స్టయిన్ రాజతరంగిణిని ఇంగ్లీషుభాషలోకి అనువదించాడు. క్రీ.శ. 1617లో జహంగీర్ పాదుషా కాలంలో రాజతరంగిణి హైదర్‌మాలిక్

చేత సంక్షిప్తంగా పర్షియన్ భాషలోకి అనువదింపబడింది. ఆధునిక కాలంలో రంజిత సీతారామ పండిట్ దీని సంపూర్ణానువాదాన్ని ఇంగ్లీషు భాషలోకి చేసాడు. ఇంగ్లీషుకన్న ముందే అంటే క్రీ.శ. 1900 కు పూర్వమే రాజతరంగిణి ఫ్రెంచ్ భాషలోకి అనువదింపబడింది. పర్షియన్ భాషలోని ఫిరదౌసి షానామాకన్న రాజతరంగిణి ఎక్కువ ఐతిహాసికత కలదని, షానామాలోవలె కేవలం కథలు పుక్కిటిపురాణాలు దీనిలో లేవని సోమనాథ ధర్ అభిప్రాయం

## కల్హణుని పాండిత్యం - శైలి

కల్హణుడు వ్యాకరణ, అలంకారశాస్త్ర పరిజ్ఞానం కలవాడు. ప్రాచీన కావ్యాలను బాగా పరిశీలించినవాడు. మహాభారత రామాయణాలంటె అతనికి అధిక ప్రీతి. హర్ష చరిత్ర, విక్రమాంకదేవ చరిత్రల ప్రభావం అతని కావ్యం మీద గోచరిస్తున్నది. కల్హణునికి కథ - గాథల మీద వున్న ప్రీతిని అతని సమకాలికుడు మంఖకవి తెల్పి వున్నాడు. రాజుల చరిత్రలను చెప్పేటప్పుడు వారి ఆస్థానంలో పోషణలోవున్న కవులను గురించి అతడు చెప్పాడు. కల్హణుడు తనకున్న అర్థ, రాజనీతి శాస్త్రాల బౌద్ధసాహిత్య పరిచయాన్ని చక్కగా ప్రకటించాడు. పౌరాణిక గాథలతో అతనికి మంచి పరిచయమున్నది.

కల్హణుడు రాజతరంగిణిలో సరళకథనాత్మకశైలిని అవలంబించినా అక్కడక్కడ చమత్కారభరితమైన కావ్యశైలిని ప్రయోగించాడు. విల్సన్, బ్యూలర్, స్టయిన్‌ల అభిప్రాయంలో అతని శైలి అలంకారరహితంగా సరళప్రసన్నంగా వున్నది. సంఘటనలను చిత్రాత్మకంగా, మనోరంజకంగా వర్ణించే నేర్పు కల్హణునికి వున్నది. అక్కడక్కడ చక్కని ఉపదేశాత్మకమైన సూక్తులను అతడు చేర్చాడు. సందర్భానుకూలంగా కల్హణుడు అలంకారాలను కూర్చక పోలేదు. ఉపమ, రూపక, శ్లేషలతో అతని శైలి ఉక్తివైచిత్రిని సంపాదించుకొన్నది. సన్నివేశాలను కేవలం కథనాత్మకంగా కాక కావ్యపద్ధతిలో వర్ణించాడు. చక్రవర్మ తాంత్రికుల మీద విజయాన్ని సాధించి రాజధానికి తిరిగి రావటం, సుస్సలుని విజయం, రాజధాని ప్రవేశం, అనంతుని చితి, అతని భార్య సూర్యమతి సతి కావటం, హర్షుని మరణం మొదలైన ఎన్నో ఘట్టాలను కావ్యాత్మకంగా కవి వర్ణించాడు. ఒక్కొక్క రాజును కావ్యగత పాత్రవలె కాక చారిత్రక సత్యాలతో ప్రత్యేక వ్యక్తిత్వాన్ని చేకూర్చి చిత్రించాడు. అక్కడక్కడ సంభాషణలను చొప్పించి పాఠకులకు విసుగు పుట్టకుండా చేసాడు. రసాభివ్యక్తిలోను కల్హణుడు ఏ లోపాన్ని రానీయలేదు. కల్హణునిది వైదర్భీరీతి-ఒక్కొక్కసారి అతడు కోశగ్రంథాలల్లో లేని కొత్త శబ్దాలను ప్రయోగించాడు. ఒక్కొక్కసారి శబ్దాలు తెలిసినవే అయినా వాటి అర్థం భిన్నంగా

వుంటుంది. కొన్ని సార్లు కేవలం కాశ్మీర దేశంలోనే ప్రచలితమైవున్న పదాలను ప్రయోగించాడు. అయినా కల్హణుని కవిత్వం సుబోధకాత్మంగానే వున్నది.

## చారిత్రక సత్యాలు

రాజతరంగిణిలోని మొదటి మూడు తరంగాలల్లో చెప్పబడిన విషయాలు పూర్తిగా అంగీకరింటానికి వీల్లేదు. కాశ్మీరదేశ రాజకీయ చరిత్ర అశోకునితో ఆరంభమౌతుంది. అశోకునికి పూర్వం 52 రాజుల చరిత్రను కవి ఇచ్చాడు. కాని ఆ చరిత్ర అంతా గాథలతో నిండివున్నది. ఒక్కొక్క రాజు పరిపాలనాకాలం 50, 60 సంవత్సరాలుగా చెప్పబడింది. ఇది అందరి రాజుల విషయంలో సత్యంకాదు. అశోకుని పరిపాలన వర్ణనతో చారిత్రకభాగం ఆరంభమౌతుంది. అశోకుని రాజ్యకాలాన్ని చారిత్రక కాలానికన్న వేయి సంవత్సరాలు ముందు చెప్పినా ఈ అశోకుడు మౌర్య అశోకుడే అనటం తథ్యం. అశోకుడు బౌద్ధమతావలంబియై కాశ్మీరదేశంలో బౌద్ధమతాన్ని ప్రవేశపెట్టాడు. స్తూపాలను, చైత్యాలను నిర్మింపచేసాడు. హ్యూయన్‌త్సాంగు వ్రాతలవల్ల మౌర్య అశోకుడే కాశ్మీరదేశంలో బౌద్ధమతాన్ని ప్రవేశపెట్టాడని స్పష్టమౌతున్నది. తర్వాత కుషాణ రాజుల చరిత్రను కల్హణుడు ప్రస్తుతీకరించాడు. కనిష్కుని బౌద్ధమతాభిమానాన్ని మూడవ బౌద్ధమత సభను అతడు కాశ్మీరుదేశంలో ఏర్పాటుచేయటం మొదలైన వాటిని కల్హణుడు పేర్కొన్నాడు. కనిష్కుని కాలంలో ప్రసిద్ధ బౌద్ధమతాచార్యుడు నాగార్జునుడు ఉన్నాడని కల్హణుని వర్ణన. కుషాణుల తర్వాత మిహిరకులుని వంశ పరిపాలనను గూర్చి కల్హణుడు చెప్పాడు. మిహిరకులుడు శివదేవాలయాన్ని నిర్మింపజేసాడు, బ్రాహ్మణులకు అనేక అగ్రహారాలను దానంగా ఇచ్చాడు. మూడవ తరంగంలో మాతృగుప్తుని పరిపాలనను గూర్చి కల్హణుడు చెప్పాడు. మాతృగుప్తుడు కవిపోషకుడే కాక స్వయంగా కవి. ఇతని ఆస్థానంలోనే మేంఠకవి వున్నాడు. ఆ కవి హయగ్రీవవధను వ్రాసాడు. మూడవ తరంగంలో రాణాదిత్యుడనే కల్పిత పౌరాణికవ్యక్తి పరిపాలననుగూర్చి కల్హణుడు ప్రసంగించాడు. అతడు 300 సంవత్సరాలు పరిపాలించినట్లు చెప్పాడు. నాల్గవతరంగంలో ప్రసిద్ధమైన కర్కోటవంశ చరిత్ర చెప్పబడింది. ఈ వంశరాజుల చరిత్రను కల్హణుడు చారిత్రక సత్యాలతో ప్రస్తుతీకరించాడు. ఈ వంశంలోని లలితాదిత్య, జయాపీడుల విజయాలను, రాజ్యపరిపాలనను కవి విశదంగా వర్ణించాడు. ఐదవ తరంగంలో ఉత్పలవంశరాజుల చరిత్ర వున్నది. ఈ వంశంలో మొదటిరాజు అవంతివర్మ పరిపాలనలో కాశ్మీరదేశచరిత్ర ఉన్నతస్థితి నందుకొన్నది. 6,7,8 తరంగాలల్లో కల్హణుడు కాశ్మీరదేశ చరిత్రను ఐతిహాసిక సత్యాలతో ప్రస్తుతీకరించాడు.

## జల్హణుడు

జల్హణుడు కాశ్మీరదేశీయుడు. ఈ కవి క్రీ.శ. 1150 ప్రాంతం వాడు. కాశ్మీరదేశంలోని రాజపురి రాజైన సోమపాలుని చరిత్రను ఈ కవి సోమపాలవిలాసమనే కావ్యంగా వ్రాసాడు. కాశ్మీరులో మరొక రాజైన సుస్సలున్ని సోమపాలుడు జయించే ఇతివృత్తం ఈ కావ్యంలో నిబద్ధింపబడింది. జల్హణుడు సోమపాలుని ఆస్థానకవి.

## సంధ్యాకరనంది

ఈ కవి క్రీ.శన 1104-1130 మధ్యకాలం వాడు. రామపాలచరిత్ర అనే కావ్యాన్ని రచించాడు. ఈ కావ్యంలో శ్రీరాముని కథతోపాటు బెంగాల్ రాజు రామపాలుని వృత్తాంతం చెప్పబడింది. ఇది ద్విసంధాన కావ్యం. ఐతిహాసిక పురుషుని చరిత్ర వుండటంచేత ఇది చారిత్రక కావ్యాల కోవకు చెందుతుంది.

## హేమచంద్రాచార్యుడు

### కుమారపాల చరిత్ర

ప్రసిద్ధ కవి, వైయాకరణుడు, ఆలంకారికుడు అయిన హేమచంద్రాచార్యుడు గుజరాతులోని అన్హిలవాడ చాళుక్యరాజు కుమారపాలుని చరిత్రను "కుమారపాల చరిత్ర" కావ్యంగా వ్రాసాడు. దీనిలో కవి రాజు చరిత్రతోపాటు సంస్కృత ప్రాకృత వ్యాకరణాలను కూడ కూర్చాడు. కావ్యంలో 28 సర్గలున్నవి. మొదటి 20 సర్గలు సంస్కృతభాషలో సంస్కృత వ్యాకరణ బోధకంగాను, చివరి 8 సర్గలు ప్రాకృత భాషలో ప్రాకృత వ్యాకరణ బోధకంగాను ఈ కావ్యం వ్రాయబడింది. ఈ కావ్యలక్ష్యం చారిత్రకేతివృత్తాన్ని చెప్పటమే. కాని కవి తన పాండిత్య ప్రదర్శకంగా వ్యాకరణాన్ని కూర్చాడు. ఈ కావ్యం భట్టికావ్యం కోవలోకి చెందిన శాస్త్రకావ్యం. అందుకే కవి కావ్యానికి "ద్వ్యాశ్రయ" మని పేరుపెట్టాడు.

కుమారపాలచరిత్ర కావ్యానికి క్రీ.శ 1255 లో అభయతిలకగణి వ్యాఖ్యానం వ్రాసాడు. పూర్ణకలశగణి ప్రాకృత భాగానికి సంస్కృతంలో వ్యాఖ్యానం వ్రాసాడు. ప్రధానరసం వీరం. శృంగార కరుణాదులు అంగరసాలు. ప్రాకృతభాగంలో శాంతం ప్రధానరసమని చెప్పాలి. భట్టికావ్యంవలె శాస్త్రకావ్యమైనా శైలి, రసపోషణలోఏమిలోపం లేదు. వర్ణనలను దీర్ఘంగా కాక కవి సూక్ష్మంగా చేసాడు. 7వ సర్గం అంతా రాత్రి వర్ణనతో

కూడి వున్నది. ఉద్యాన, వన, ఋతు, పర్వత, రాత్రి వర్ణనలు మనోహరమైనవి కావ్యంలో వున్నవి.

## హేమచంద్రుని పాండిత్యం - శైలి

క్రీ.శ. 11వ శతాబ్దపు మహాపండితుల్లో హేమచంద్రసూరి ప్రముఖుడు. సంస్కృత ప్రాకృత భాషలలో సమాన పాండిత్యం కలవాడు. బాణ భవభూతుల వలె ఊహాసౌందర్యంగల కవి కాకపోవచ్చునేమో కాని అతని అనేక రచనలు అతని ప్రతిభను చాటుతున్నవి. హేమచంద్రుడు జైనమతావలంబి. ఆ మతమంటే అతనికి ప్రగాఢాభిమానమున్నది. అయినా వేదాలంటే గౌరవం కలవాడు. సోమనాథేశ్వరుని పూజించాడు. మహాభారత, మనుస్మృత్యాదులను చదివాడు. ఆంధ్ర దేశంలో శైవ వైష్ణవమతాలకు సామరస్యం కూర్చిన ఘనత తిక్కన మహాకవికి లభించినట్లుగా జైన హిందూమతాలకు గుజరాతులో సామరస్యాన్ని కూర్చిన ఘనత ఆయనకు లభించింది. హేమచంద్రుని అపారవిజ్ఞానం చదువరులను ఆశ్చర్య చకితులను చేస్తుంది. కుమారపాలచరిత్ర శాస్త్రకావ్యం కాబట్టి హృదయానికంటె బుద్ధిని ఆనందింపజేస్తుంది. వ్యాఖ్యానం కాని, కోశాధారం కాని లేక ఈ కావ్యాన్ని అర్థంచేసుకోవటం కష్టం. స్వయంగా కోశకారుడైన హేమచంద్రుడు అపార శబ్దజ్ఞానం కలవాడు. ఎన్నో కొత్త శబ్దాలను ప్రయోగించాడు. కవి శైలి గౌడీరీతిలో నడిచింది. కవి వ్యాకరణంమీద దృష్టిని నిలపటం చేత కావ్యశైలి దెబ్బతినక మానలేదు. అయినా రెండు లక్ష్యాలను కవి అసమాన ప్రతిభతో నడిపాడు. ఉదా॥కు అన్హిలపురాన్ని వర్ణిస్తూ కవి మరొకవైపు 'ఏతద్' శబ్దం యొక్క విభక్తిరూపాలను ఇట్లా ఇచ్చాడు-

ఏభిర్నయనయోః ప్రీతిః ఏషాం శ్రీరేభ్య ఉత్సవః
ఏషు ధర్మ ఇతి శ్రీమద్గృహాన్ కోనాస్య వర్ణయేత్

కావ్యంలో కవి అక్కడక్కడ ఉపమ, ఉత్ప్రేక్ష, అతిశయోక్తి, అనుప్రాస, విరోధాభాస, అర్థాంతరన్యాసాద్యలంకారాలను ప్రయోగించాడు.

## చారిత్రక సత్యాలు

350 సంవత్సరాలు గుజరాతు కఠియవాడును పాలించిన చాళుక్యుల చరిత్రను హేమచంద్రుడు కుమారపాలచరిత్రలో కూర్చాడు. చాళుక్యవంశ మూలపురుషునితో ఆరంభించి కావ్యాన్ని కుమారపాలుని చరిత్రతో ముగించాడు. కుమారపాలుడు వృద్ధావస్థలో

జైనమత దీక్షను గ్రహించటంతో కావ్యం ముగుస్తున్నది. హేమచంద్రుని ప్రభావంతోనే ఆ రాజు జైనమత దీక్షను తీసుకొన్నట్లు ఇతర ఆధారాలనుబట్టి తెలుస్తున్నది. కుమారపాలుడు జీవించివుండగానే క్రీ.శ. 1172లో హేమచంద్రసూరి మరణించాడు. గుజరాతు చాళుక్యుల చరిత్రను తెలుసు కోవటంలో ఈ గ్రంథం చాలా ఉపయోగిస్తుంది.

## జయాంకుడు

## పృథ్వీరాజు విజయం

అజ్మీర్, ఢిల్లీ రాజ్యాన్నేలిన చౌహాణవంశ రాజైన పృథ్వీరాజు చరిత్రను ఈ కవి "పృథ్వీరాజ విజయ" కావ్యంగా వ్రాసాడు. ఈ కావ్యప్రతిని బ్యూలర్ కాశ్మీర దేశంలో శిథిలావస్థలో కనుగొన్నాడు. అసంపూర్ణంగావున్న ఈ కావ్యం పృథ్వీరాజు పట్టాభిషేకంతో ముగుస్తున్నది. పృథ్వీరాజు మహమ్మదీయులను జయించే ప్రధానేతివృత్తం నష్టమైంది. అసంపూర్ణమైన ఈ ప్రతి ద్వారా ఈ కవిని గురించి ఏమి తెలియటం లేదు. జయాంకుడు పృథ్వీరాజు ఆస్థానకవి అనటం తథ్యం. కాని అతడు కాశ్మీర దేశీయుడనటం కూడ తథ్యం. అభిమానంతో బిల్హణుని శైలిని అనుకరించటం, 12వ సర్గలో కాశ్మీరదేశాన్ని అభిమానంతో వర్ణించటం, జోనరాజు (క్రీ.శ. 15వ శ॥) అనే కాశ్మీర కవి ఇతని కావ్యానికి వ్యాఖ్యానం వ్రాయటం, రాజానకరుయ్యక, జయరథుల వంటి కాశ్మీరదేశ ఆలంకారికులు ఈ కావ్యాన్ని ఉద్ధరించటం - ఈ కారణాలన్నిటిచేత జయాంకుడు కాశ్మీరదేశీయుడని నిర్ధారితమౌతున్నది.

పృథ్వీరాజు క్రీ.శ. 1191లో శహబుద్దీన్ గోరీని ఓడించాడు. తిరిగి క్రీ.శ. 1193లో అతడు గోరీచేత ఓడింపబడి చంపబడినాడు. కాబట్టి కవి కాలాన్ని క్రీ.శ 12వ శతాబ్దం ఉత్తరార్ధమని, ఈ కావ్యాన్ని క్రీ.శ. 1193కు పూర్వమే వ్రాసివుంటాడని చెప్పవచ్చును. క్రీ.శ. 1193లో పృథ్వీరాజు మరణానంతరం జయాంకుడు కాశ్మీర దేశానికి తిరిగి వెళ్ళిపోయివుంటాడు. అక్కడే ఈ కావ్యం ప్రచారాన్నందుకొన్నదని జోనరాజు వ్యాఖ్యానం వ్రాయటం వల్ల ఊహించవచ్చును. పృథ్వీరాజవిజయ కావ్యంలో 12 సర్గలు లభిస్తున్నవి.

## జయాంకుని పాండిత్యం - శైలి

వేద, పురాణ, మహాకావ్య, న్యాయ, వ్యాకరణ, జ్యోతిషశాస్త్రాలను జయాంకుడు అభ్యసించాడు. అనేక పౌరాణిక మహాభారత రామాయణ గాథలను అతడు పేర్కొన్నాడు. అతని కవిత్వం మీద కాళిదాస, భారవి, మాఘుల ప్రభావాన్ని చూడవచ్చును. భారవి అన్న

అతనికి చాల అభిమానం. అందుకే భారవి కవిత్వం లాంటి ప్రౌఢమైన, అర్థగాంభీర్యం గల కవిత్వాన్ని వ్రాయటానికి ప్రయత్నించాడు. ఈ కవి శైలి పాంచాలి, గౌడీ రీతుల్లో నడిచింది. సందర్భోచితంగా అలంకారాలను ప్రయోగించాడు.

## చారిత్రక సత్యాలు

పృథ్వీరాజు పూర్వజుల చరిత్రను కవి ఐతిహాసిక సత్యాలతో కూర్చాడు. చౌహాణ రాజుల వంశక్రమాన్ని తెలుసుకోవటానికి ఈ కావ్యం ఉపకరిస్తున్నది. చౌహాణవంశంలో కథానాయకుడు పృథ్వీరాజు మూడవవాడు. కవి ఇతన్ని విష్ణువు అవతారంగా చెప్పాడు. కావ్యం చివర పృథ్వీరాజు గోరీలకు జరిగిన యుద్ధం కాని విజయం కాని చ్ప్రెబడలేదు. ఒక వేళ కావ్యం శిథిలమై ఆ భాగాలు నష్టమైనవేమో లేక కవియె పృథ్వీరాజు మొదటిసారి గోరీని జయించిన తర్వాత కావ్యాన్ని ఆరంభించి రెండవవసారి గోరీ చేతిలో పృథ్వీరాజు ఓడిపోయి మరణించగా దుఃఖంతో స్వదేశానికి తిరిగిపోయి కావ్యాన్ని అసంపూర్ణంగా విడిచిపెట్టాడేమో చెప్పలేము.

## అభయదేవుడు

క్రీ.శ. 1200 ప్రాంతం కవి. జయంతవిజయమనే చారిత్రక కావ్యాన్ని రచించాడు. దీనిలో విక్రమసింహ వంశానికి చెందిన జయంతరాజు చరిత్ర వున్నది. ఈ కావ్యంలో 19 సర్గలున్నవి. ఈ కవి జైనుడు.

## సోమేశ్వర దేవుడు
## కీర్తి కౌముది

గుజరాతు చాళుక్యరాజులు లావణ్య ప్రసాద, వీరధవళులకు మంత్రిగా వున్న వస్తుపాలుని చరిత్రను "కీర్తి కౌముది" అనేపేరుతో కావ్యంగా ఈ కవి వ్రాసాడు. సోమేశ్వరదేవుడుకూడ లావణ్యప్రసాద, వీరధవళుల ఆస్థానంలో వున్నట్లు తెలుస్తున్నది తాను లావణ్య ప్రసాదు దగ్గర రాజపురోహితుడనని కవియె చెప్పుకొన్నాడు. క్రీ.శ. 1241 ప్రాంతంలో వస్తుపాలుడు మరణించాడు. వస్తుపాలుడు ఉచ్ఛస్థితిలో వున్నప్పుడే కవి ఈ కావ్యాన్ని వ్రాసినట్లు తెలుస్తున్నది. కాబట్టి ఈ కావ్యరచనాకాలం క్రీ.శ. 1240 ప్రాంతం.

## సోమేశ్వరుని పాండిత్యం - శైలి

ఈ కవి దర్శనాలల్లో నిష్ణాతుడు. ప్రాచీన కావ్యాలు అతనికి సుపరిచితాలు. పండితుడు. కావ్యంలో 9 సర్గలున్నవి - శాంతం ప్రధానరసం. వీర శృంగారాలు అంగరసాలు. చాళుక్యరాజులు, వస్తుపాలుడు చేసిన యుద్ధవర్ణనల్లో వీరరసం, పౌరోత్సవ వర్ణనల్లో శృంగారరసం స్ఫురిస్తున్నవి. సూర్యాస్తమయ, చంద్రోదయ చంద్రిక, ఋతు, యుద్ధాది కావ్యవర్ణనలను కవి చేసాడు. శైలి సరళ సుప్రసన్నంగా వున్నది. దృష్టాంత, రూపక, పరిసంఖ్య, శ్లిష్టోపమ, విభావన, యమక, అపహ్నుతి, శ్లేషాద్యలంకారాలను ప్రయోగించాడు.

## చారిత్రక సత్యాలు

కావ్యారంభంలో 2 సర్గలల్లో కవి మూలరాజుతో ఆరంభించి చాళుక్యరాజుల చరిత్రను కూర్చాడు. వస్తుపాలుని తమ్ముడు తేజపాలుడు - వీళ్ళిద్దరు అశ్వరాజు కుమారులు. ఇద్దరు చాళుక్యరాజుల దగ్గర మంత్రులుగా వున్నారు. వస్తుపాలుడు జైన మతావలంబి. వస్తుపాలుని మేధాశక్తిని, మంత్రశక్తిని కవి సహజంగా వర్ణించాడు.

## అరిసింహుడు
## సుకృత సంకీర్తనం

వస్తుపాలుని చరిత్రను గూర్చి చెప్పే మరోకావ్యం "సుకృత సంకీర్తనం" ఈ కావ్యాన్ని అరిసింహుడు రచించాడు. పేరునుబట్టి అరిసింహుడు రాజపుత్రుడని తెలుస్తున్నది. ఈ కవి శైవుడో, జైనుడో చెప్పటం కష్టం. ఇతని శిష్యుడు అమర పండితుడు. సుకృత సంకీర్తన కావ్యం ప్రతిసర్గ చివర ఐదుశ్లోకాలను ఈ అమర పండితుడు కూర్చాడు. అమర పండితుడు తన పద్మానంద మహాకావ్యంలో అరిసింహుడు తనకు లలితకళలల్లో గురువు అని చెప్పుకొన్నాడు. అమర పండితుని రచన కావ్యకల్పలతాపరిమళాన్ని బట్టి అరిసింహుడు కవితా రహస్యమనే గ్రంథాన్ని వ్రాసినట్లు తెలుస్తున్నది. అరిసింహుడు వస్తుపాలునితో చాలా చనువుగా వున్నట్లు తెలుస్తున్నది. అరిసింహుడు అమరపండితునితో పాటు వస్తుపాలుని ఆశ్రమంలో వున్నట్లు తెలుస్తున్నది. వస్తుపాలుడు ఉచ్చస్థితిలో వున్నప్పుడే ఈ కావ్యం వ్రాయబడి వుంటుంది. అంటె క్రీ.శ. 1219-1240 నడుమ అని చెప్పవచ్చును.

కావ్యం చాళుక్యరాజుల చరిత్రతో ఆరంభమౌతున్నది. హేమచంద్రసూరి, సోమేశ్వరదేవులు గుజరాతు చాళుక్య వంశాన్ని మూలరాజుతో ఆరంభించి వర్ణించగా ఈ కవి మొదట చాపోత్కట రాజులను వర్ణించి తర్వాత చాళుక్యులను వర్ణించాడు. ఈ కావ్యంలో 11 సర్గలున్నవి.

## అరిసింహుని పాండిత్యం - శైలి

అమరపండితుడు చెప్పినదాన్ననుసరించి అరిసింహుడు లలితకళలల్లో మంచి ప్రవేశం కలవాడు. మహాభారతాది పౌరాణిక గాథలతో అతనికి బాగా పరిచయమున్నది. కావ్య శైలి గౌడీరీతిలో నడిచింది. కావ్యనాయకుడు వస్తుపాలుడు ధర్మార్థకామ మోక్షాలను సమానంగా సాధించినట్లు చెప్పబడింది. కావ్యారంభంలో అన్హిలవాడ పట్టణాన్ని కవి రమ్యంగా వర్ణించాడు. వీరరసం ప్రధానంగా గల కావ్యం. కవి సందర్భోచితంగా ఋతు సూర్యోదయాది వర్ణనలను చేసాడు. అలంకారాలను కవి విరివిగా ప్రయోగించాడు. అక్కడక్కడ దీర్ఘసమాసాలున్నా శైలి కఠినమైంది కాదు.

## బాలచంద్రసూరి

## వసంత విలాస కావ్యం

బాలచంద్రసూరి కృత వసంతవిలాస కావ్యంలోను వస్తుపాలుని చరిత్రయే నిబద్ధింపబడింది. వస్తుపాలుని కుమారుడు జైత్రసింహుని కోరికమీద ఈ కావ్యం వ్రాయబడింది. కాబట్టి వస్తుపాలుని మరణానంతరం అంటె క్రీ.శ. 1240 తర్వాత వ్రాయబడివుంటుంది. బాలచంద్రసూరి హరిభద్రసూరి శిష్యుడు. జైనుడు. బాలచంద్రసూరి ఈ కావ్యాన్నే కాక 5 అంకాలుగల కరుణావజ్రాయుధమనే నాటకాన్ని వ్రాసినట్లు తెలుస్తున్నది. వివేకమంజరి, ఉపదేశకందకి అనే వ్యాఖ్యానాలు కూడ వ్రాసిన వ్యాఖ్యాత. వసంతవిలాస కావ్యంలో 14 సర్గలున్నవి.

## బాలచంద్రుని పాండిత్యం - శైలి

బాలచంద్రసూరి పండితుడు. సాంఖ్య న్యాయ వైశేషిక యోగదర్శనాలను క్షుణ్ణంగా తెలిసినవాడు. జైన బౌద్ధ దర్శనాలల్లోను మంచి ప్రవేశం కలవాడు. మహాభారత రామాయణాది పౌరాణిక గాథలను పేర్కొన్నాడు. ఈ కవి కావ్యం శాంత రసప్రధానమైంది. వీరశృంగారాదులు

అంగరాసాలు. దీర్ఘవర్ణనలున్నవి. సందర్భోచితంగా ఋతు, పుర, యుద్ధ, పర్వత, చంద్రోదయ, జలకేళ్యాది కావ్యవర్ణనలను చేసాడు. కవిత్వం వైదర్భరీతిలో వున్నది. అక్కడక్కడ గౌడీరీతి కన్పిస్తున్నది. అనుప్రాస, రూపక, ఉత్ప్రేక్ష, భ్రాంతి, యమకాద్యలంకారాలను ప్రయోగించాడు.

### చారిత్రక సత్యాలు

పైకావ్యాలల్లో వలెనే కావ్యారంభం చాళుక్యరాజుల చరిత్రతో జరిగింది. వస్తుపాలుని అనేక ధర్మకార్యాలను కవి వర్ణించాడు. వస్తుపాలుని తీర్థయాత్రా సందర్శనలు కూడ కావ్యశైలిలో వర్ణింపబడినవి. కావ్యం చివర వస్తుపాలుని స్వర్గ లోకగమనం చెప్పబడింది.

## సకలవిద్యా చక్రవర్తి

సకల విద్యాచక్రవర్తి హోయసలరాజులు రెండవ నరసింహ (క్రీ.శ. 1220×1235) సోమేశ్వరుల (క్రీ.శ. 1236-1256) ఆస్థానకవి. ఈ కవి విద్యాచక్రవర్తి అని బిరుదాన్ని ధరించిన పండిత కుటుంబానికి చెందినవాడు. ఈకవి రెండవ విద్యాచక్రవర్తిగా గుర్తింపబడుతున్నాడు. ఈ కుటుంబంలోని మూడవ విద్యాచక్రవర్తి రుయ్యకుని అలంకార సర్వస్వానికి సంజీవిని అనే టీకను వ్రాసాడు. రెండవ విద్యాచక్రవర్తి గద్యకృతి గద్యకర్ణామృతం. ఇది హోయసల రాజుల చరిత్రను నిబద్ధిస్తున్నది. నీలకంఠశాస్త్రి వంటి చారిత్రకులు హోయసల వంశ చరిత్రకు ఈ గ్రంథం ఎంతో తోడ్పడుతున్నదని గుర్తించారు. ఇందులో ఎన్నో చారిత్రకాంశాలున్నవి. చోళులకు హోయసలులకు జరిగిన యుద్ధం, సోమేశ్వరుడు చాళుక్య రాజకుమారి దేవికను వివాహమాడటం దీనిలో ప్రధానేతివృత్తం. ఈ చారిత్రక గద్యకావ్యాన్ని వ్రాయటంలో విద్యాచక్రవర్తి బాణుని హర్షచరిత్రను ఆదర్శంగా తీసుకొన్నాడు. వస్తువర్ణనలో, శైలిలో కావ్యం హర్షచరిత్రను పోలివున్నది. కావ్యారంభంలో అర్ధ ఐతిహాసిక, అర్ధ పౌరాణిక శైలిలో హోయసల రాజుల చరిత్ర చెప్పబడింది. హర్షచరిత్రలో కన్న గద్యకర్ణామృతంలో ఎక్కువ ఐతిహాసికవస్తువు వున్నది. కవి అక్కడక్కడ వాల్మీకి, కాళిదాస, శ్రీహర్షుల కవిత్వాలను కూడ అనుకరించాడు.

## నయచంద్ర సూరి

### హమ్మీరకావ్యం

చౌహాణరాజు హమ్మీరుని చరిత్రను నయచంద్రుడు హమ్మీర కావ్యంగా వ్రాసాడు. నయచంద్రుడు జయసింహసూరి మనుమడు. జయసింహుడు పండితవాదంలో సారంగుని

జయించాడట. కావ్య సర్గాంత గద్యంలో నయచంద్రుని శిష్యుడు నయసింహుని పఠనార్థం క్రీ.శ. 1496లో ప్రతి వ్రాయబడి నట్లు చెప్పబడింది. దీన్ని బట్టి ఈ కావ్య రచన క్రీ.శ. 14వ శతాబ్దం చివరలో జరిగిందని చెప్పవచ్చును. కావ్యం 14వ సర్గలో కవి తనను గురించి చెప్పుకొన్నాడు. ఈ కవి తండ్రి జయసింహసూరి హమ్మీర మదమర్దన మనే నాటకాన్ని వ్రాసాడు. దానిలో వస్తుపాల తేజపాలుర చరిత్ర వున్నది. అది క్రీ.శ. 13వ శతాబ్దంలో వ్రాయబడింది. ఈ నాటకం, హమ్మీర కావ్యం ఒక్కటే అని ఎన్.జె. కిర్త్సేన్ భ్రమపడినాడు. అదే విధంగా ప్రసిద్ధ చారిత్రకుడు కర్నల్ టాడ్ హమ్మీర కావ్యం లేక హమ్మీర రాసో శారఙ్గ ధరుడు అనే కవి వ్రాసిందని అతడు హమ్మీర రాజుకు సమకాలికుడు, ఆస్థానకవి అని అన్నాడు. కాని శార్ఙ్గధరుడు కాక అతని తాత రఘునాథుడు హమ్మీరుని గురువు. మరియు శారఙ్గ ధరుడు తన 'పద్ధతి'లో హమ్మీరుని వర్ణన గల శ్లోకాలను ఉద్ధరించాడు. ఆ శ్లోకాలు ఈ హమ్మీర కావ్యంలో లేవు. కాబట్టి శార్ఙ్గధరుని హమ్మీర కావ్యం నయచంద్రుని హమ్మీరకావ్యం ఈ రెండు భిన్నమని తెలుస్తున్నది. ఈ కావ్యంలో 14 సర్గలున్నవి.

## నయచంద్రుని పాండిత్యం - శైలి

కవి వేదపురాణమహాకావ్యాలను అధ్యయనం చేసాడు. దర్శనాలను క్షుణ్ణంగా తెలిసినవాడు. రాజనీతి, యుద్ధపుతీరులను తెలిసినవాడు. కావ్యం వైదర్భీరీతిలో వ్రాయబడింది. ప్రసన్న మాధుర్య గుణ భరితమైంది. సందర్భానుకూలంగా కవి పుర, ఋతు, జలక్రీడాది వర్ణనలు చేసాడు. రూపక, ఉత్ప్రేక్ష, ఉపమ, శ్లేష, విరోధాభాస, అతిశయోక్తి, అపహ్నుతి, యమక, అనుప్రాసాద్యలంకారాలను వాడాడు. వీరం ప్రధాన రసం.

## చారిత్రక సత్యాలు

చౌహాణ వంశోత్పత్తితో కవి కావ్యాన్ని ఆరంభించాడు. పృథ్వీరాజా విజయంలో వలెనే అదే క్రమంలో చౌహాణవంశ చరిత్ర చెప్పబడింది. అజ్మేర్, రణస్తంభపురాలను ఏలిన చౌహాణ వంశరాజుల చరిత్రలను ఐతిహాసిక సత్యాలతో ఈ కావ్యం చెప్తున్నది. అల్లావుద్దీన్ మొదట తన సోదరులను హమ్మీరుని మీదికి పంపాడు. వారు ఓడిపోగా తాను స్వయంగా దండెత్తిపోయినాడు. హమ్మీరుని పక్షంవారు నమ్మకద్రోహం చేసారు. ఇది తెలిసి హమ్మీరుడు అంతఃపుర స్త్రీలను అగ్నిప్రవేశం చేయమని చెప్పి కొంతమంది వీరులతో శత్రువులను ఎదుర్కొంటాడు. వారు ఘోరంగా యుద్ధంచేసి ప్రాణాలు కోల్పోతారు.

హమ్మీరుని వీరమరణంతో 13వ సర్గలో ప్రధానేతివృత్తం ముగుస్తుంది. 14వ సర్గలో కవి హమ్మీరుని పరాక్రమాన్ని తన వంశ చరిత్రను గానం చేసాడు.

## గంగాదేవి

### మధురా విజయం

విజయనగర రాజు మొదటి బుక్కరాయల (క్రీ.శ. 1316-1374) రెండవ కుమారుడు కంపరాయల భార్య గంగాదేవి, కంపరాయలకు కంపనరాయలని కూడ పేరు. కంపరాయలు క్రీ.శ. 1361-1374 నడుమ యువరాజుగా వున్నాడు. తండ్రి ఆజ్ఞ మీద తురుష్కుల పాలనలోవున్న మధుర మీదికి కంపరాయలు దండెత్తిపోయి విజయాన్ని సాధించాడు. ఇది క్రీ.శ. 1371లో జరిగిందని చరిత్ర చెప్తున్నది. ఆ ఇతివృత్తాన్ని గ్రహించి గంగాదేవి మధురా విజయాన్ని రచించింది. ఈ కావ్యంలో వీరకంపరాయ చరిత్ర అని కూడ పేరు. ఈ కావ్యంలో 7 సర్గలున్నవి. 7వ సర్గలోని 89-41 శ్లోకాలల్లో కవయిత్రి తాను కంపరాయల రాణినని పేర్కొన్నది.

### గంగాదేవి పాండిత్యం శైలి

గంగాదేవి విదషీమణి. పూర్వ కావ్యాలను చక్కగా అభ్యసించింది. వాటి ప్రభావాన్ని ఆమె కావ్యం మీద చూడవచ్చును. ఆమె తెలుగుకవి తిక్కనను ఆదరంతో స్మరించింది. దాన్నిబట్టి ఆమెకు తెలుగు సాహిత్యంతోను పరిచయమున్నదని చెప్పవచ్చును. మధురావిజయం వీరరస ప్రధాన కావ్యం. కవయిత్రి యుద్ధాలను వీరరస స్ఫోరకమైన శైలిలో రచించింది. సందర్భోచితంగా పుర, ఋతు, జలక్రీడ, సూర్యాస్తమయ, చంద్రోదయాది కావ్యవర్ణలున్నవి. ముఖ్యంగా 5వ సర్గలో వర్ణన లెక్కువ వున్నవి. కావ్యారంభంలో కవయిత్రి గణేశ, పార్వతి, శివ, సరస్వతి, గురువు క్రియాశక్తిని స్తుతించింది. వాల్మీకి వ్యాస కాళిదాస బాణ భారవి దండి భవభూతి కర్ణామృత అగస్త్య గంగాధర విశ్వనాథాది సంస్కృత కవులను తెలుగుకవి తిక్కనను ప్రస్తుతించింది. ప్రతిసర్గ చివర రాబోయే సర్గలోని విషయాన్ని సంక్షిప్తంగా కూర్చింది. ప్రథమ సర్గలోని విజయనగర వర్ణన సుందరంగా సహజంగా వున్నది. కావ్యశైలి వైదర్భీరీతిలో నడిచింది. కాళిదాసు అనుకరణ లెన్నో వున్నవి. భావాలు, భాష సహజసుందరంగా వున్నవి. స్త్రీ సహజమైన కోమలతను కావ్యంలో చూడవచ్చును. దీర్ఘ సమాసాలు లేవు. ఉదా॥ కు హేమంత వర్ణన-

హిమభర విహతః కమలాకరో మృదితకాంతిరభూన్మృగ లాంఛనః
వదనమేవ నరేంద్రనత భ్రువామ భజత శ్రియమ ప్రతిశాసనః

"కమలాలు మంచుతో కప్పబడినవి. చంద్రుడు కాంతిని కోల్పోయాడు. ఒక్క రాజు ప్రియురాలి ముఖమే కాంతి కలదిగా వున్నది."

గంగాదేవి కవిత్వం భావక్లిష్టత్వ, లేక సుప్రసన్నంగా వున్నది. పాఠకుల హృదయాలను అలరించేదిగా వున్నది. కింది సూర్యాస్తమయ వర్ణన మౌలికంగా, సరళసుందరంగా వున్నది-

ప్రతిబింబపరం పరాంబుధే పవనోద్భూత తరంగ సంగినః
నభసో వతరిష్యతోరవే ర్మణి సోపాన ధియం వ్యభావయత్.

"ఆకాశం నుంచి దిగుతూ వున్న సూర్యుని నిశ్చలమైన బింబం, కదిలే అలల్లో ప్రతిబింబించి రత్నాల సోపానంవలె వున్నది."

గంగాదేవి ఉపమ, ఉత్ప్రేక్ష, హేతు, ప్రతీప, అపహ్నుతి, అతిశయోక్తి, వ్యతిరేక, మాలోపమ, భ్రాంతి, అనుప్రాస, యమకాద్యలంకారాలను ప్రయోగించింది. యమకాదులను ప్రయోగించినా కవిత్వంలో ఎక్కడా క్లిష్టత అనేది రాలేదు.

## చారిత్రక సత్యాలు

విజయనగర చరిత్రలోని ఒక ఘట్టాన్ని ఈ కావ్యం తెలుపుతున్నది. విజయనగర రాజ్యస్థాపన క్రీ.శ. 1335-36 లో జరిగింది. హరిహర రాయలు, ఆ తర్వాత బుక్కరాయలు విజయనగరాన్ని పరిపాలించారు. బుక్కరాయలు క్రీ.శ. 1355లో రాజైనాడు. అతనికాలంలో విజయనగరరాజ్యం విస్తరించి సామ్రాజ్యంగా మారింది. బుక్కరాయలకు చాలామంది కుమారులున్నారు. వారిలో కంపరాయలు లేదా కుమార కంపరాయలు దిగ్విజయాలుచేసి కీర్తిని గడించాడు. అతని రాణి గంగాదేవి కావ్యరూపంగా అతనికి కీర్తి స్తంభాన్ని నిర్మించింది. అతడు ఉదయగిరి ప్రాంతానికి అధిపతిగా వుండేవాడు. అతడు తండ్రి కన్న పూర్వమే క్రీ.శ. 1375 ప్రాంతంలో మరణించటంచేత రాజుకాలేక పోయాడు. మధురావిజయ కావ్యంలో బుక్కరాయల రాణి దేవాయి ఒక్కతే చెప్పబడింది. దేవాయికి ముగ్గురు కుమారులు. వాళ్ళలో ఇద్దరి పేర్లు కంపనే. మూడవవాడు సంగముడు. బుక్కరాయలకు చాలామంది రాణులున్నారు. కాని గంగాదేవి కావ్య నాయకుడైన కంపరాయల తల్లిని. గూర్చియె చెప్పి మిగతావాళ్ళను గురించి మౌనం వహించింది. బుక్కరాయల తర్వాత

రాజైన రెండవ హరిహర రాయలు గౌరాంబిక అనే రాణి కుమారుడు బుక్కరాయల దేవాయి కుమారులు ఇద్దరు కంపనలనున హిర్యకంపన, చిక్క కంపన అని పిలువబడినట్లు శాసనాధారాలున్నవి. బుక్కరాయలకు కంపరాయలు అనే అన్న కూడ వుండేవాడు. కాబట్టి హిర్యకంపన రెండవకంపరాయలుగా పిలువబడినాడు. ఇతడు మహామండలేశ్వరాది బిరుదాలను ధరించాడు. కంపన యుద్ధకళలోనే కాక లలితకళల్లోను. మంచి ప్రవేశం కలవాడు, బుక్కరాయల ఆదేశానుసారం క్రీ.శ. 1361లో కంపన తురుష్కుల ఆధీనంలో వున్న తుండీర, మధురా రాజ్యాలను జయించడానికి బయలుదేరాడు. ఈ ప్రాంతాలను జయించి అతడు కొంతకాలం మరకత నగరాన్ని రాజధానిగా చేసుకొని పరిపాలనను చక్కబరుస్తు దాదాపు మూడుసంవత్సరాలు వున్నాడు. క్రీ.శ. 1374లో అతడు అక్కడే పరిపాలకుడుగా వున్నట్లు శాసనాధారం వున్నది. తురుష్కుల చేతుల్లో నలిగిపోయిన హిందూమతోద్ధరణ దృష్టితో ఈ కంపన విజయం చాల మహత్తరమైంది. అంతేగాక విజయనగర రాజ్యవిస్తరణ దృష్టితోను కపంన విజయాలు చాల సహాయపడినవి. క్రీ.శ. 1371లో కంపన తురుష్కుల నెదిరించి మధుర, శ్రీరంగ పట్టణాలను లోబరుచుకున్నాడు. చారిత్రక దృష్టితో మహత్త్వపూర్ణమైన ఈ విజయాలను గంగాదేవి తనకావ్యంలో వర్ణించింది. ఈ కావ్యం క్రీ.శ. 1371-74 నడుమ వ్రాయబడిందని చెప్పవచ్చును.

## వామన భట్ట బాణుడు
## వేమభూపాల చరిత్ర

వామనభట్ట బాణుడు వేమభూపాల చరిత్ర అనే గద్యకావ్యంలో తన ఆశ్రయదాత ప్రభువు, కొండవీటి సామ్రాజ్యాన్ని పాలించిన పెదకోమటి వేమారెడ్డి చరిత్రను కూర్చాడు. వేమారెడ్డి క్రీ.శ. 1403-1420 నడుమ పాలించాడు. ఈ రాజు స్వయంగా సంస్కృతంలో కవి, పండితుడు, వ్యాఖ్యాత, ఆలంకారికుడు, సంగీత శాస్త్రవేత్త మరియు కవి పండిత పోషకుడు. ఈ రాజు ఆస్థానంలోనే ప్రసిద్ధమైన తెలుగుకవి శ్రీనాథుడున్నాడు. అంటె ఈ రాజు సంస్కృతాంధ్ర భాషలను సమానంగా గౌరవించాడని చెప్పవచ్చును. వేమభూపాల చరిత్ర చివర "సర్వోత్కర్షేణ వర్తమానః వేమభూపాలః" అని కవి చెప్పిందాన్నిబట్టి ఈ కావ్యం ఆ రాజు జీవిత కాలంలోనే వ్రాయబడిందని తెలుస్తున్నది. ఈ కావ్యానికి వీరనారాయణ చరిత్ర అని కూడా పేరు. వీరనారాయణుడన్నది వేమభూపాలుని బిరుదనామం. (కవి జీవిత విశేషాలు, ఇతర రచనలను గూర్చి మహాకావ్య ప్రకరణంలో చూడవచ్చును.)

## చారిత్రక సత్యాలు

కవి వేమభూపాలుని వంశ క్రమాన్ని కావ్యారంభంలో వర్ణించాడు. ఆ కారణంచేత వేమభూపాలుని చరిత్రనే కాక అతని వంశ చరిత్రను తెలుసుకోవటంలోను ఈ కావ్యం తోడ్పడుతున్నది. త్రిలింగదేశాన్ని కాముకుడనే రాజు అద్దంకిని రాజధానిగా చేసుకొని పరిపాలిస్తుండేవాడు. అతని వంశంలో ప్రోలయ జన్మించాడు. ఒకరోజు వసంతర్తువులో రాజు సైన్యసమేతంగా వేటకు బయలుదేరాడు. మగ లేడిని వేటాడుతూ అతడు చాలాదూరం పోయాడు. అట్లా పోయిపోయి ఒక ఉద్యానవనంలో ప్రవేశించి, గానం చేస్తు ఉయ్యాల ఊగుతున్న ఒక సుందరిని చూచాడు. మొదటిచూపులోనే వారికి ప్రేమోదయమయింది. ఆమె విక్రమసింహపురి రాజు తుక్కారఘట్ట రాజు కూతురు. ప్రోలయ ఆమెను వివాహమాడాడు. అతనికి ఐదుగురు కుమారులు జన్మించారు. వారు- మాచనరేంద్రుడు, వేమాభూపతి, దొడ్డనరపతి, అన్నభూపడు, మల్ల మహీపాలుడు. మాచనరేంద్రుడు రాజయ్యాడు. వేమభూపతి విజయాలను సాధించి రాజ్యవిస్తరణ చేసాడు. మాచ నరేంద్రునికి ముగ్గురు కుమారులు. వారు - రెడ్డిప్రోత, పెదకోమటీంద్రుడు, నాగేంద్రుడు. మాచ నరేంద్రుని తర్వాత పెదకోమటీంద్రుడు రాజయ్యాడు. పెదకోమటీంద్రుని కొడుకే వేమభూపాలుడు.

## శైలి

వామనభట్టబాణుని అభిమానకవి బాణుడు. తన గద్యకావ్యంలో ఎన్నో చోట్ల కవి బాణుని శైలిని అనుకరించాడు. వేమభూపాలచరిత్ర హర్షచరిత్రవలె ఆఖ్యాయిక ప్రక్రియకు చెందింది. దీనిలో 4 ఉచ్ఛ్వాసాలున్నవి. సందర్భానుకూలంగా కవి కావ్య వర్ణనలను చేర్చాడు. ప్రోలయ వేట, వింధ్యాటవిలోని చండికాలయ వర్ణన, నీత్యుపదేశ ఘట్టాలు బాణుని కాదంబరిలోని ఘట్టాలను తలపిస్తున్నవి. పెదకోమటి వేమారెడ్డి దిగ్విజయాలను, ద్రాక్షారామ భీమేశ్వరున్ని సందర్శించటానికి పోవటాన్ని కవి దీర్ఘంగా వర్ణించాడు. దిగ్విజయ వర్ణనలో కాళిదాసు రఘుమహారాజు దిగ్విజయ వర్ణన అనుకరణ కన్పిస్తున్నది. వామనకవి పూర్వకవుల కావ్యాలను బాగా పరిశీలించినవాడు. చాలాచోట్ల వాల్మీకి భవభూతి దండికవుల కవితాప్రభావాలను చూడవచ్చును. ద్రాక్షారామ క్షేత్రవర్ణనను కవి రమ్యంగా సహజంగా చేసాడు. ఈ వర్ణనా ప్రభావాన్ని శ్రీనాథుని తెలుగుకావ్యం భీమఖండంలో చూడవచ్చును.వామనకవి శైలి మధురంగా వున్నది. వటపత్రశాయి బాలనారాయణుడు ఈ కవి ఇష్టదైవం.

## జోనరాజు

క్రీ.శ. 1450 ప్రాంతంవాడు. కాశ్మీరదేశీయుడు. కల్హణుని రాజతరంగిణి రచనను కొనసాగించినవాడు. కల్హణుడు జయసింహుని వరకుగల కాశ్మీరరాజుల చరిత్రను వ్రాయగా జోనరాజు జయసింహుని మొదలుకొని సుల్తాన్ జయన్ యే అబదిన్ వరకు కాశ్మీరాన్ని ఏలిన రాజుల చరిత్రను రచించాడు.

## శ్రీవరుడు

శ్రీవరుడు జోనరాజు శిష్యుడు. తన గురువు రచనాకార్యాన్ని చేపట్టి కాశ్మీర రాజుల చరిత్రను రచించాడు. అతని కృతికి జౌన రాజతరంగిణి అనిపేరు. ఈ కవి క్రీ.శ. 1469 వరకు కాశ్మీరాన్నేలిన రాజుల చరిత్రలను నిబంధించాడు.

## ప్రాజ్యభట్టు

క్రీ.శ 1468 మొదలుకొని అక్బరు చక్రవర్తి కాశ్మీరాన్ని జయించి మొగల్ సామ్రాజ్యంలో విలీనం చేసుకునేంతవరకు గల కాశ్మీరదేశ చరిత్రను ఈ కవి కొనసాగించాడు. ఈ కవి కృతిపేరు "రాజవళి పతాక".

## ద్వితీయ రాజనాథ డిండిమ కవి

### డిండిమ కవి పరిచయం - సాళువాభ్యుదయం

రాజనాథకవి విజయనగరాన్నేలిన సాళువ నరసింహరాయల చరిత్రను సాళువాభ్యుదయ కావ్యంగా రచించాడు. రాజనాథుడు విజయనగర రాజా రెండవ ప్రౌఢ దేవరాయల (క్రీ.శ. 1424-1446) ఆస్థానంలో డిండిమకవి అని ప్రసిద్ధి వహించిన అరుణగిరి నాథుని కుమారుడు. అరుణగిరినాథ డిండిమకవినే తెలుగుకవి శ్రీనాథుడు శాస్త్రవాదంలో ఓడించి అతని కవిసార్వభౌమ బిరుదాన్ని తాను ధరించాడు. డిండిమ, కవిసార్వభౌమ బిరుదాలను ఈ వంశంలోని వారందరు ధరించినట్లుగా వున్నది. ఎందుకంటె రాజనాథునికి కూడా ఆ బిరుదాలున్నవి. సాళువ నరసింహరాయలు క్రీ.శ. 1486లో విజయనగర సింహాసనాన్ని అధిష్ఠించాడు. సాళువాభ్యుదయంలో ఎక్కడా నరసింహరాయలు విజయనగర సామ్రాజ్యాధిపతిగా చెప్పబడలేదు. చంద్రగిరి పాలకుడుగా మాత్రమే

చెప్పబడినాడు. కాబట్టి ఈ కావ్యరచన క్రీ.శ.1486కు పూర్వమే అతడు మహామండలేశ్వరునిగా వున్నప్పుడే జరిగిందని చెప్పాలి. ఈ కావ్యం ప్రచురితం కాలేదు. మద్రాసు గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరీలో దీని ఒక్క ప్రతిమాత్రం లభిస్తున్నది. ప్రతిలో చాల లోపాలుండటంచేత మరొక ప్రతి వేరొకటి లభించక పోవటంచేత కాబోలు ఈ కావ్యం ప్రచురితం కాలేక పోయింది. ఈ కావ్యంలో 13 సర్గలున్నవి.

## డిండిమ కవి పాండిత్యం - శైలి

ఈ కావ్యంలో నరసింహరాయలు చేసిన యుద్ధాలు ,ధర్మ కార్యాలు ఉదాత్తంగా వర్ణింపబడినవి. శైలి వైదర్భీ రీతిలో వున్నది. కాళిదాసు, భారవి కవితా ఛాయలున్నవి. రూపక, శ్లేష, ఉత్ప్రేక్ష, అర్థాంతరన్యాస, వ్యతిరేక, పరిసంఖ్య, ఉపమ, యమకాద్యలంకారాలను వాడాడు. నరసింహస్వామి కొడుకును వరంగా ఇయ్యగా గుండయ్య, మల్లమాంబికల సంతోషాన్ని కవి ఇట్లా వర్ణించాడు-

సాధ్వీతయా సుతగిరా శరదేవహాసీకాల్యశ్రియాకమలినీవద్రనాథనాల్యా
మాయూర పంక్తిరివ భూతలతైవ చైత్రమాసశ్రియాముదమగాద్వసుధేంద్రపత్నీ

"కుమారప్రాప్తిని గూర్చి విని రాజు మరియు రాణి శరత్కాలంలో కమలం వికసించినట్లుగా, మేఘాన్ని చూచిన మయూర పంక్తివలె, చైత్రమాసంలో రసాల వృక్షంవలె సంతోషాన్ని పొందారు."

కావ్య శైలి సరళ సుందరంగా నడిచింది. రాజనాథుడు వేదపురాణ దర్శన మహాకావ్య జ్యోతిష అలంకార శాస్త్రాలను అభ్యసించినవాడు. మహాభారత రామాయణ గాథల నెన్నిటినో సందర్భానుసారంగా పేర్కొన్నాడు.

## చారిత్రక సత్యాలు

విజయనగరాన్ని సంగమ వంశం తర్వాత సాళువ వంశం పాలించింది. ఆ వంశానికి చెందినవాడు నరసింహరాయలు. సేనాధిపతిగా, మహామండలేశ్వరుడుగా అతడు సాధించిన విజయాలను ఈ కావ్యము చెప్తున్నది. సంగమ వంశానికి చెందిన విరూపాక్షరాయల కొడుకు ప్రౌఢదేవరాయలు స్త్రీలోలుడై రాజ్యమేలుతున్నాడు. ప్రజల కతడన్న అయిష్టంగా వుండింది. ఆ తరుణంలో నరసింహ రాయలు అతన్ని తొలగించి

తాను రాజయ్యాడు. సంగమ వంశంవారు ఆంధ్రులా? కన్నడులా? అన్న విషయంలో చారిత్రకులల్లో భేదాభిప్రాయమున్నది. కాని సాళువ వంశంవారు ఆంధ్రులు అనటంలో అభిప్రాయభేదం లేదు. సాళువ నరసింహరాయల తాత సాళువ మంగిరాజు, కుమార కంపరాయల మధురావిజయ యాత్రలో ప్రధానపాత్ర వహించాడు. నరసింహరాయలు సంస్కృతాంధ్ర కవులను పోషించాడు. స్వయంగా రామాభ్యుదయ కావ్యాన్ని సంస్కృతంలో వ్రాసిన కవి. సాళువాభ్యుదయకావ్యాన్ని బట్టి సాళువ వంశక్రమం తెలుస్తున్నది. తెలుగులో నంది మల్లయ, ఘంటసింగయ అన్న జంటకవులు వ్రాసిన వరాహపురాణం, పిల్లలమర్రి పినవీరన వ్రాసిన జైమినిభారతాలల్లో చెప్పబడిన సాళువవంశక్రమం ఒక్కతీరుగానే వున్నది. మూడవసర్గ నుంచి ఏడవసర్గ వరకు నరసింహరాయల విజయాలు, ఎనిమిదవ సర్గలో అతని మృగయా వినోదం, తొమ్మిదవ సర్గలో అతడు తిరుపతిని సందర్శించి దానాలు చేయటం, పదవ సర్గలో హేమంత గ్రీష్మ వసంత్తు వర్ణనలున్నవి. పదకొండవ సర్గలో కాళహస్తిలో శివరాత్రి ఉత్సవాలల్లో అతడు పాల్గొనడం, పన్నెండవ సర్గలో రాజధాని ప్రవేశం, పదమూడవ సర్గలో రాయల ఉదార ధర్మగుణాలు, సాహిత్య ప్రియత్వం స్తుతింపబడినవి. విజయనగర చరిత్రలోని ఒక ఘట్టాన్ని ఈ కావ్యం చక్కగా ప్రస్తుతీకరిస్తున్నది.

## తృతీయ రాజనాథకవి

ఈ రాజనాథకవి ద్వితీయ రాజనాథుని పౌత్రుడు. క్రీ.శ. 1540 ప్రాంతంలో అచ్యుతరాయాభ్యుదయమనే కావ్యాన్ని రచించాడు. అచ్యుతరాయలు విజయనగర రాజు, ప్రసిద్ధ సాహిత్య సమరాంగణ సార్వభౌముడైన శ్రీకృష్ణ దేవరాయల సవతి తమ్ముడు. కృష్ణదేవరాయల తర్వాత విజయనగర సింహాసనాన్ని అధిష్ఠించాడు. అచ్యుత రాయల (క్రీ.శ. 1529-1542) చరిత్రను కవి ఈ కావ్యంలో వర్ణించాడు. ఈ కావ్యంలో 20 సర్గలున్నవి.

## తిరుమలాంబ

### వరదాంబికా పరిణయం

తిరుమలాంబ వరదాంబికా పరిణయం అన్న చంపూ కావ్యాన్ని రచించింది. ఈ కవయిత్రి విజయనగర చక్రవర్తి అచ్యుతరాయల (క్రీ.శ. 1529-1542) భార్య. ఈ కవయిత్రి వివిధశాస్త్ర పాండిత్యం కలది. ఏకసంథాగ్రాహినని చెప్పుకొన్నది. మానవరూపంలో

అవతరించిన సరస్వతి. కవయిత్రియే కాక కవిపోషకురాలు కూడ. వరదాంబికాపరిణయ కావ్యం ఆమె ప్రతిభకు తార్కాణంగా వున్నది.

సలకంవారి ఆడబడుచు వరదాంబిక, అచ్యుతరాయల వివాహవర్ణన వరదాంబిక పరిణయ కావ్యేతివృత్తం. కావ్యం అచ్యుతరాయల వంశవర్ణనతో ఆరంభమైంది. అచ్యుతరాయల తండ్రి విజయ యాత్రలు వర్ణింపబడినవి. అతడు ఓబమాంబను వివాహమాటం, అచ్యుతరాయల జననం, అతడు సింహాసన మధిష్ఠించటం మొదలైనవి వర్ణింపబడినవి. ఒకరోజు అచ్యుతరాయలు ఉద్యానవనంలో సంచరిస్తు కాత్యాయని ఆలయాన్ని చేరుకుంటాడు. అక్కడ పూజచేస్తున్న వరదాంబికను చూచి ప్రేమిస్తాడు. వరదాంబిక కూడ రాజును ప్రేమిస్తుంది. ఇంతలో విదూషకుడు ప్రవేశించి రాచకార్యం మీద రాజును పిలుచుకుపోతాడు. అయిష్టంగా రాజు అక్కడినుంచి పోతాడు. వరదాంబిక విరహబాధ పడుతుంది. ఆమె సఖులు ఆమె అవస్థకు కారణమడుగగా చెప్తుంది. ఇంతలో దాసీలు వచ్చి ఆమె అన్నలు అమాత్యుల కోరికమీద ఆమెను అచ్యుతరాయలకిచ్చి వివాహం చేయదలచారని చెప్తారు. అచ్యుతరాయల వరదాంబికల వివాహమౌతుంది. వారికి వేంకటేశ్వరస్వామి వరప్రసాదంగా చినవెంకటాద్రి జన్మిస్తాడు. చిన వెంకటాద్రి యువరాజ పట్టాభిషేకంతో కావ్యం ముగుస్తుంది.

కావ్యంలో ఇతివృత్తం చిన్నది. చారిత్రక కావ్యమైనా ఐతిహాసిక సంఘటన ప్రాధాన్యం తక్కువ. అచ్యుతరాయల కన్న అతని తండ్రి విజయ వర్ణనలేకావ్యం సగభాగం వరకు విస్తరించినవి. ఉన్నకొద్ది వృత్తాంతాన్ని కవయిత్రి చక్కగా చెప్పినా, ఆమెకు కథ చెప్పటంలో కన్న వర్ణనలల్లో నైపుణ్యం ఎక్కువ.

## శైలి

సంస్కృత భాష మీద కవయిత్రికి మంచి అధికారమున్నది. రసానుకూలమైన విషయానుకూలమైన శబ్దాలను ప్రయోగించింది. శృంగార వీర రౌద్ర భయానక బీభత్సాదులను సందర్భానుసారంగా పోషించింది. శృంగార మంగిరసం. ఆమె ప్రయోగించిన అనుప్రాస కావ్యానికంతటికి శోభను కలిగిస్తున్నది. అనుప్రాసనే కాక కవయిత్రి శ్లేష, యమకాలను వాడింది. ఉపమ, ఉత్ప్రేక్ష, రూపక, అతిశయోక్తి, విరోధాభాస, పరిసంఖ్య, అప్రస్తుత ప్రశంస, ఉల్లేఖాది అర్థాలంకారాలను వాడింది. తుండీరచోళదేశాలను, కావేరి నదిని, సైన్యాలను, యుద్ధం, వసంతర్తు, ఉద్యానవన జలక్రీడాదులను కవయిత్రి విస్తరంగా వర్ణించింది.

నాయకుడైన అచ్యుతరాయల వర్ణనను నఖశిఖ పర్యంతంగా విస్తరంగా చేసింది. ఒక స్త్రీ పురుష వర్ణనను విస్తరంగా చేయటం వింతగానే వుంటుంది. నాయకవర్ణనను ఇంత విస్తరంగా వర్ణించిన పురుషకవులు కూడ లేరేమో. ఈ కవయిత్రి గద్యంమీద బాణుని ప్రభావం కన్పిస్తుంది. కాదంబరి హర్షచరిత్రల ఆదర్శంగా ఆమె గద్యరచన సాగింది. బాణునివలెనే ఈమె పరిసంఖ్యాలంకారాన్ని చమత్కారయుక్తంగా ప్రయోగించింది. ఈ కవయిత్రి గద్యం ఓజోగుణభరితమై గౌడీరీతిలో నడిచింది. అనుప్రాసయుక్త దీర్ఘసమాసరచనకు ఉదాహరణ-- "నిరంతరాంధకారిత దిగంతర కందళదమంద సుధారసబంధు సాంద్రతర ఘనాఘన వృందసందేహ కరస్యందమాన మకరంద బిందుబంధుతరమాకంద తరుకుల తల్పకల్ప మృదుల సికతాజాల జటిల మూలతల మరువక మిళదలఘు లయకలిత రమణీయ పానీయ శాలికాబాలికా కరారవింద గలంతికా గలదేలా లవంగ పాటల ఘనాసారకస్తూరికాతి సౌరభ మేదుర లఘుతర మధుర శీతలతర సలిలధారా నిరాకరిష్ణుతదీయ విమలవిలోచన మయూఖరేఖాపసారిత పిపాసాయాస పథిక లోకాన్...."

తిరుమాలంబ గద్యంకన్న పద్యం ప్రసన్నంగా వున్నది. సులభ సరళ శైలికి ఉదాహరణ-

సరసి విహరసి త్వం శాత్రవా వార్ధి మధ్యే
త్యము పవన సరణ్యాం తే2లి ఘోరే వనాంతే
కృతకగిరి తటే త్వం కించతే వింధ్యశైలే
కథ మరిషు విగానం కథ్యతామచ్యుతేంద్ర

## రఘునాథ భూపాలుడు

ఈ కవి తంజావూరును పాలించిన రాజు (క్రీ.శ. 1633-1673). సంస్కృతాంధ్ర భాషల్లో పండితుడు. రెండు భాషల్లో సమాన ప్రతిభతో కవిత్వం చెప్పగలిగినవాడు. తెలుగు కావ్యాలనే కాక అతడు సంస్కృత కావ్యాలను కూడ వ్రాశాడు. రఘునాథుడు సాహిత్యంలోనే కాక సంగీతంలోను ప్రవీణుడు. ఇతని కుమారుడు విజయరాఘవ నాయకుడు కూడ పండితుడు, కవి. కాని అతడు తెలుగులోనే గాని సంస్కృతంలో రచనలు చేసినట్లు లేదు. ఈ ఇద్దరు స్వయంగా కవులు పండితులే కాక సంస్కృతాంధ్ర కవులను పండితులను

ఆదరించి పోషించారు. రఘునాథ భూపాలుడు అనేక దిగ్విజయాలను చేసి తన రాజ్యాన్ని విస్తరింపజేసి సుస్థిర శాంతితో రాజ్యపాలన చేసిన ప్రజ్ఞాపాటవాలుగల రాజు. ఇతడు విక్రమాదిత్య, భోజరాజు, శ్రీకృష్ణదేవరాయల వంటి రాజుల కోవలో చేర్చదగినవాడు.

ఈ రాజకవి తెలుగులో అనేక రచనలను చేసాడు. కాని సంస్కృతంలో ఆతనిది ఒక్క కావ్యమే లభిస్తున్నది. తన తండ్రి అచ్యుతరాయల చరిత్రను ఈ రాజకవి అచ్యుతేంద్రాభ్యుదయ మనే పేరుతో కావ్యంగా వ్రాసాడు. ఇది లభ్యం. ఈ రాజు మంత్రి గోవిందదీక్షితుడు. గోవిందదీక్షితుడు వ్రాసిన సంగీతసుధ అన్న సంస్కృత కృతిని రఘునాథనాయకుడు వ్రాసాడని కొన్ని ప్రతులల్లో వున్నది కాని అది సత్యం కాదని విమర్శకుల అభిప్రాయం.

## యజ్ఞ నారాయణ దీక్షితుడు

తంజావూరు రాజు రఘునాథనాయకుని మంత్రి గోవిందదీక్షితుని కుమారుడు, ఆలంకారికుడు, కవి అయిన యజ్ఞనారాయణదీక్షితునికి రఘునాథనాయకుడు విద్యాగురువు. రఘునాథరాయల ఆశ్రయంలో వుండి కవిత్వాన్ని చెప్పాడు. ఈ కవి రఘునాథాభ్యుదయమనే కావ్యాన్ని రచించాడు. దీనిలో రఘునాథరాయల జీవిత వృత్తాంత మున్నది. ఈ కావ్యంలో 16 సర్గలున్నవి. రఘునాథరాయల ధర్మకార్యాలను చెప్తు ఈ కవి రఘునాథవిలాస మనే నాటకాన్ని కూడ రచించాడు. మరియు ప్రతాపరుద్రయశోభూషణం వంటి అలంకారరత్నాకర మనే అలంకార గ్రంథాన్ని రఘునాథుని వర్ణిస్తు లక్ష్య శ్లోకాలతో రచించాడు.

## రామభద్రాంబ

రామభద్రాంబ తంజావూరు రాజు రఘునాథనాయకుని ఆస్థాన కవయిత్రి. ఈమె రఘునాథరాయల ప్రియురాలు. రఘునాథరాయల జీవితచరిత్రను ఈ కవయిత్రి రఘునాథాభ్యుదయమనే కావ్యంగా రచించింది. రఘునాథరాయలను ఈమె శ్రీరాముని అవతారంగా భావించింది. ఈ కావ్యంలో 12 సర్గలున్నవి. రఘునాథుని దిగ్విజయాలు, రాజ్యపాలన చక్కగా వర్ణింపబడినవి. రామభద్రాంబ తెలుగులోను కవిత్వం చెప్పగలదు. తెలుగు పద్యాలకు ప్రత్యేకమైన యతిప్రాసలను ఈ కవయిత్రి సంస్కృత శ్లోకాల్లో ప్రయోగించింది. ఈమె సంస్కృత ప్రాకృత భాషల్లో ఎన్నో సమస్యలను పూరించిందట.

## రాజచూడామణి

ప్రసిద్ధ అద్వైతి, అనేక గ్రంథకర్త అయిన రత్నఖేటదీక్షితుని కుమారుడు. ఈ కవి రఘునాథుని చరిత్రను రఘునాథభూపవిజయ కావ్యంగా రచించాడు.

## విరూపాక్షుడు

విరూపాక్షకవి చోళచంపువును వ్రాసాడు. క్రీస్తు శకారంభంలో కావేరి పట్టణాన్ని రాజధానిగా తమిళదేశాన్ని పాలించిన చోళరాజుల చరిత్ర దీనిలో వున్నది. చోళుల పరిపాలన క్రీ.శ. 3,4 శతాబ్దులల్లో పల్లవరాజుల చేతిలో అంతమైంది. ఆ తర్వాత క్రీ.శ. 9వ శతాబ్దినుంచి చోళవంశం పునరుద్ధరితమైంది. అప్పుడు వారు తంజావూరును రాజధానిగా చేసుకొని పరిపాలించారు. ఈ రాజుల చరిత్రే ఇప్పుడు చరిత్రకు అందుతున్నది. పూర్వ చోళుల చరిత్ర తమిళ సంగమ సాహిత్యంలో లభ్యమౌతున్నది. వీరిని చారిత్రకులు ఐతిహాసిక రాజులుగా గ్రహించటానికి వెనుక ముందాడుతున్నారు. శిలాశాసనాదులనే ప్రధానంగా చారిత్రకాధారాలుగా గ్రహించే చారిత్రకులు వీరి చరిత్రను శాసనాధారాలు లేక పోవటంచేత గ్రహించటం లేదు. చోళచంపువును మొట్టమొదట కనుగొన్న హుల్ష్ దీనిలోని విషయం పౌరాణిక కల్పన అని అభిప్రాయపడినాడు. కాని ఈ పూర్వ (ప్రాచీన) చోళరాజులు చారిత్రక పురుషులు కారని ఏ ఆధారాలు లేకుండా కూడా తోసిపుచ్చలేము. లోకంలో వ్యాప్తిలోవున్న గాథలను, పురాణాలల్లోని వృత్తాంతాలను భారతదేశ చరిత్ర నిర్మాణంలో ఆధారాలుగా గ్రహించవలసిన తరుణం వచ్చింది. ఏది పౌరాణిక కల్పన, ఏది చారిత్రక సత్యం అని వేరుపరచి చరిత్రను నిర్మించే బాధ్యత ఈనాటి వారి మీద వున్నది. ఈ రాజుల చరిత్రను చెప్పేటువంటి స్థలపురాణం అయిన బృహదీశ్వర మాహాత్మ్యం ఆధారంగా విరూపాక్షుడు చోళచంపువు వ్రాసాడు. కాని వి. రాఘవన్ అభిప్రాయంలో ఈ రెండు రచనలు దాదాపు ఒకే కాలానికి చెందినవే. అంటె బృహదీశ్వర మాహాత్మ్యం ప్రాచీన రచన కాక చోళచంపువుకన్న కొద్దికాలం మాత్రమే ముందు రాయబడిందని ఆ రెండు రచనల్లోని శైలి భాషలు ఒకే యుగానికి చెందినవని వి. రాఘవన్ అభిప్రాయం. బృహదీశ్వర మాహాత్మ్యం దాదాపు క్రీ.శ. 16వ శతాబ్ద ప్రాంతం రచన కాగా చోళచంపువును క్రీ.శ. 17వ శతాబ్దం నాటిదని ఆయన నిర్ణయించాడు.

విరూపాక్షుడు శైలి, వర్ణనల్లో బాణుని కాదంబరిని అనుకరించాడు. మంత్రి దేవదత్తుడు దేవచోళుని కిచ్చే ఉపదేశం బాణుని శుకనాసోపదేశాన్ని తలపిస్తున్నది. విరూపాక్షుడు గొప్ప కవిగా పేరు సంపాదించుకోకపోయినా అతని కవిత్వం సరళ సుందరంగా వున్నది.

## నల్లాదీక్షితుడు

ఈ కవికి భూమినాథుడని నామాంతరం. ధర్మవిజయ చంపువును వ్రాసాడు. తంజావూరు భోంసలే వంశరాజు శాహాజీ (క్రీ.శ. 1684-1710) జీవిత చరిత్రను ఈ కావ్యంలో కవి కూర్చాడు. దీనిలో 4 స్తబకాలున్నవి. భోంసలే వంశానికి శ్రీరాముడు మూల పురుషుడుగా చెప్పబడినాడు.

## శ్రీధర వేంకటేశకవి

తంజావూరు భోంసలేరాజు శాహాజీ (క్రీ.శ. 1684-1710) ఆస్థానకవి. ఈ కవి శాహాజీ చరిత్రను తీసుకొని శాహేంద్ర విలాస కావ్యాన్ని రచించెను. దీనిలో 8 సర్గలున్నవి. తంజావూరు మరాఠా రాజుల సంస్కృత సాహిత్య పోషణను గూర్చి కవి వివరంగా చెప్పాడు. వేంకటేశ కవి కవిత్వం సుందరంగా వున్నది. ఇతని కుమారుడు శ్రీధర పేరుభట్టు. రామరాజ భూషణుని తెలుగు కావ్యం వసుచరిత్రను వసుమంగళ నాటకంగా సంస్కృతంలో రచించాడు. దీనిలో 5 అంకాలున్నవి. ఇతడు తంజావూరు శరభోజి, తులాజీ (క్రీ.శ. 1711-1735) ఆస్థానాలల్లో వున్నాడు. చకోర సందేశ మనే లఘుకావ్యాన్ని కూడా వ్రాసాడు.

## ఢుంఢిరాజ వ్యాసయజ్వ

తంజావూరు శాహాజీ చరిత్రను శాహవిలాస కావ్యంగా ఈ కవి కూడా వ్రాసాడు. అభినవ కాదంబరి అనే కావ్యాన్ని కూడా ఈ కవి వ్రాసాడు.

## వివృత్తి శేషాచలపతి

సంస్కృతంలో తెలుగు భాషా వ్యాకరణాన్ని వ్రాయటంచేత ఇతనికి ఆంధ్రపాణిని అన్న బిరుదం కలిగింది. భోసలకోసలీయం అనే ద్వ్యర్థికావ్యాన్ని వ్రాసాడు. దీనిలో శ్రీరాముని చరిత్రతో పాటు కవి, శాహాజీరాజు చరిత్రను జోడించాడు.

## జగన్నాథకవి

నారాయణ అక్కమాంబల కుమారుడు. తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయాన్ని స్థాపించిన సరఫోజి (శరభోజి) చరిత్రను శరభవిలాస కావ్యంగా వ్రాసాడు.

## జగన్నాథ పండితరాయలు

(జగన్నాథుని జీవిత విశేషాలను లఘుకావ్యాల ప్రకరణంలో చూడవచ్చును.) ఈ కవి షాజహాన్ మామ మరియు అతని ఆస్థానంలో సర్దారు అయిన ఆసఫజహాన్ ఖాన్ చరిత్రను "ఆసఫవిలాస" కావ్యంగా వ్రాసాడు. ఇది గద్య కావ్యం. ఆసఫ్‌జహాన్‌కు "ఖాన్‌ఖానా" అన్న బిరుదమున్నది. ఆసఫ్‌ఖాన్‌ను జగన్నాథుడు రసగంగాధరంలోను స్మరించాడు. ఆసఫ్‌ఖాన్ క్రీ.శ. 1641లో మరణించాడు.

ఉదయపూరు రాజా జగతసింహుని చరిత్రను జగదాభరణ కావ్యంగాను, అస్సాంరాజా ప్రాణనారాయణుని చరిత్రను ప్రాణాభరణ కావ్యంగాను ఈ కవి రచించాడు. జగదాభరణం షాజహాన్ కుమారుడు దారాషికోహ్ చరిత్ర అని కాణే అభిప్రాయపడినాడు. కొన్ని ప్రతుల్లో జగతసింహుని పేరున్నచోట "దిల్లీ ధరా వల్లభః" అని వుండటమే ఈ అభిప్రాయానికి కారణం. కాని 'దారా' అనే పేరు ఎక్కడా రాలేదు. అందుచేత దారా చరిత్ర అనటం నమ్మదగ్గట్టుగా లేదు. అంతే గాక "దిల్లీ ధరావల్లభుడు" షాజహాన్ కాని దారా కాడు. ఆసఫ్ విలాసం, జగదాభరణం, ప్రాణాభరణం మూడూ ఒకే రచన అని, పేర్లను మార్చి ముగ్గురిని కవి సంతోషపెట్టాడని కొందరు విపరీతమైన ఊహ కూడ చేసారు.

వివిధ రాజుల,నాయకుల, సామంతరాజుల చరిత్రలను కావ్యంగా వ్రాసే సంప్రదాయం క్రీ.శ. 17, 18 శ॥లల్లో బాగా వ్యాప్తిలో వున్నట్లు లబ్ధ కావ్యాలను బట్టి తెలుస్తున్నది. క్రీ.శ. 7,8 శ॥లకు పూర్వం అంటె బాణుని హర్షచరిత్రకు పూర్వం రాజుల చరిత్రలను వ్రాసే సంప్రదాయం వున్నదో లేదో చెప్పలేము. ఒకవేళ వుండివున్నా అటువంటి చరిత్ర కావ్యాలు నశించాయేమో! కొన్ని శిలా శాసనాలను బట్టి రాజుల ప్రశస్తులను మాత్రం తప్పకుండా కవులు వ్రాసేవారని తెలుస్తున్నది. ఒకవేళ ఈ ప్రశస్తుల ప్రక్రియే రానురాను చారిత్రక కావ్య ప్రక్రియగా వికసించిందేమో!

## రమాబాయి

ఆధునిక కవయిత్రుల్లో శ్రేష్ఠురాలని చెప్పవచ్చును. పండిత కవయిత్రి. ఈమె తండ్రి అనంతసూరి. తల్లి అంబ. మైసూరులో జన్మించింది. కాని ఈమె కీర్తి దర్భాంగ

వరకు వ్యాపించింది. ఆమెను దర్భంగారాజా సత్కరించాడు. ఈ కవయిత్రి లక్ష్మీశ్వర చంపువు అనే చారిత్రక కావ్యాన్ని రచించింది. ఇది క్రీ.శ. 1879 లో ప్రచురితమైంది. ఈ కావ్యంలో 5 స్తబకాలున్నవి. దర్భంగా వర్ణనతో ఈ కావ్యం ఆరంభమౌతున్నది. లక్ష్మీశ్వరుడనే దర్భంగా రాజు చరిత్ర దీనిలో నిబద్ధింపబడింది. పెద్దగా దీనిలో చారిత్రక విలువ గల అంశాలేమి లేవు. కాని ఈమె కవిత్వం సహజ సౌకుమార్య మాధుర్యాలతో చక్కగా వున్నది. ఈమె శైలి పాంచాలీరీతిలో నడిచింది. చివరి స్తబకంలో బంధకవిత్వ నైపుణ్యాన్ని కూడ కవయిత్రి చూపింది. ఈ కావ్యం కవిత్వం దృష్టితో చెప్పుకోదగ్గది.

## పరమానందకవి

కాశీనగర నివాసి. ఈ కవి రచన శిభారతం. ఈ కవి శివాజీకి సమకాలికుడు క్రీ.శ. 1849లో ఈ కావ్యం ముద్రితమైంది. దీనిలో శివాజి చరిత్ర నిబద్ధమైంది. దీనిలో 32 అధ్యాయా లున్నవి. మహాభారతంలోని భీమార్జునుల పరాక్రమం వలె శివాజి పరాక్రమాన్ని కవి కర్ణించాడు. అందుకే కవి శివభారత మని పేరుపెట్టాడు. ప్రాచీన పురాణాల ప్రక్రియకు చెందిన కృతిగా అతడు కావ్యంలో చెప్పుకొన్నాడు.

కవి శైలి సరళసుందరంగా ఉన్నది. సందర్భానకూలంగా కావ్యవర్ణనలను చేసాడు. శబ్దార్థాలంకారాలను వాడాడు. అక్కడక్కడ చక్కని సుభాషితాలను కూర్చాడు. శివాజి చరిత్రను రసవంతంగా వర్ణించాడు. ఈ కావ్యం మరాఠిభాష లోకి అనువదింపబడింది.

శివాజి చరిత్రను ఇతివృత్తంగా తీసుకొని ఆధునిక కవులు చాలామంది కావ్యాలు వ్రాసారు. శివాజీకి సమకాలికుడే అయిన జయరామకవి ఫర్ణాల పర్వతదుర్గాన్ని శివాజి జయించిన ఇతివృత్తాన్ని తీసుకొని "ఫర్ణాల పర్వత గ్రహణాఖ్యానం" అనే కావ్యాన్ని వ్రాసాడు. బెంగాల్ కవి కాళిదాసు "శివాజి చరిత్ర" కావ్యాన్ని రచించాడు. వేంకటేశ వామనకవి (క్రీ.శ. 1925లో మరణించాడు) 'శివావతార ప్రబంధం', పురుషోత్తమ కవి "శివకావ్యం", శ్రీపాదశాస్త్రి హసూర్కర్"ఛత్రపతి శివాజి మహారాజ చరిత్ర"లను రచించారు. శ్రీపాదశాస్త్రి "మహారాణా ప్రతాపసింహ చరిత్ర" ను కూడా వ్రాసాడు.

## అంబికాదత్త వ్యాసుడు

### శివరాజ విజయం

అంబికాదత్తకవి ఆధునికుడు. క్రీ.శ. 1858-1900 నడుమ కవికాలం. శివరాజవిజయమనే గద్యకావ్యాన్ని రచించాడు. ఇది క్రీ.శ. 1901 లో ముద్రితమైంది. ఈ

కవి కాశీనివాసి. ఈ కావ్యంలో ఐతిహాసికవ్యక్తి శివాజి మహారాజు చరిత్ర కూర్చబడింది. ప్రధానంగా క్రీ.శ. 1657-67 నడుమ శివాజి సాధించిన కార్యాలను కవి కావ్యంలో కూర్చాడు. ఒక చరిత్రకారుని వలెనే శివాజి జీవితంలోని సంఘటనలను, వ్యక్తులను చిత్రించాడు. కావ్యంకాబట్టి కవి అక్కడక్కడ మనోహరమైన కల్పనలను చేసాడు. ఈ కావ్యంలో చారిత్రక వ్యక్తులతోపాటు కల్పిత పాత్రలను కూడా కవి ప్రవేశపెట్టాడు.

## కావ్యేతివృత్తం

మహమ్మదీయులు చేసే అత్యాచారాలను నిర్మూలించి స్వతంత్ర హిందూ సామ్రాజ్యాన్ని స్థాపించాలని శివాజి సంఘర్షణను ప్రారంభిస్తాడు. తనకున్న కొద్దిమంది సైనికులతో స్నేహితులతో, పరివారంతో శివాజి విజయయాత్రను ఆరంభిస్తాడు. బీజాపూరు రాజుకు ఈ వార్త తెలుస్తుంది. అఫ్జల్ ఖాన్ అనే నాయకున్ని సేనతో శివాజీమీదికి పంపుతాడు. శివాజి తన బుద్ధి చాతుర్యంతో అతన్ని చంపుతాడు. శివాజి శాయిస్తఖాన్ మీదికి దండెత్తిపోయి అతన్ని చంపుతాడు. తర్వాత శివాజి సూరత్‌ను జయించటం, క్రమంగా మహారాష్ట్ర ప్రాంతాన్నంతా జయించుకోవటం వర్ణించబడింది. శివాజి చరిత్ర ప్రధానేతివృత్తంలో కవి ప్రాసంగికేతివృత్తంగా గౌరీసింహ, సౌవర్ణి అనే కల్పిత పాత్రలతో కూడిన వృత్తాంతాన్ని చేర్చాడు. ఈ అవాంతరకథ చేత ప్రధాన కథాకథనానికి ఎక్కడా భంగం గాని, అసహజత్వం గాని రాలేదు.

## శైలి

అంబికాదత్తు ప్రాచీనగద్యకారులు దండి బాణుల శైలిని అనుకరించటానికి ప్రయత్నించాడు. అక్కడక్కడ కాదంబరిలోవలె సమాసభరితమైన దీర్ఘవాక్యాలున్నవి. అక్కడక్కడ సరళమైన అల్పసమాసయుక్తమైన రచన కన్పిస్తున్నది. బాణునివంటి పాండిత్యం, ఊహావైచిత్రి అంబికాదత్తులో లేకున్నా అతడు కావ్య వస్తువును తన కల్పనాపాటవం, వర్ణనాకౌశలం, స్వాభావిక చిత్రణం ద్వారా సుందరం చేసాడు. కవి సందర్భానుకూలంగా అలంకారాలను ప్రయోగించాడు. అక్కడక్కడ శ్లిష్టపదాలను వాడాడు. రసోచితమైన, పాత్రోచితమైన భాషను, పదాలను ప్రయోగించటంలో కవి నేర్పును చూపాడు. శివరాజవిజయంలో ప్రతి పాత్ర సజీవంగా కన్పిస్తుంది. హిందూముస్లిం పాత్రలను కవి యథోచితంగా చిత్రించాడు. నాయకుడు శివాజి చరిత్రను కవి ఉత్కృష్టంగా చిత్రించాడు.

శివాజి సాహసపరాక్రమాలను, బుద్ధికుశలత, దానశీలత, బ్రాహ్మణపండితుల ఎడల అతనికిగల వినయం, స్త్రీల ఎడల అతడు చూపించిన గౌరవ సమ్మానాలు, అతని నిర్భీకత, కార్యక్షమత, దేశభక్తి, స్వాభిమానం, ఆత్మగౌరవాలను కవి చాల సూక్ష్మంగా వర్ణించాడు. ఉత్తమ నాయకునిలో వుండవలసిన సమస్త గుణాలు అతనిలో వున్నవి. వాటిని కవి చిత్రించి చూపాడు. శివాజి పాత్రనేకాక ప్రతి చిన్న పాత్రను కూడా కవి చక్కగా చిత్రించాడు. కృత్రిమత్వం సంఘటనలల్లో గాని సంభాషణలల్లోగాని పాత్రచిత్రణలో గాని ఎక్కడా లేదు. సంభాషణలను కవి స్వాభావికంగా వ్రాసి తన రచనాచాతురిని ప్రదర్శించాడు.

శివాజి కాలంనాటి సాంఘిక, రాజనీతి మతసంబంధమైన పరిస్థితులను అంబికాదత్తు సహజంగా చిత్రించాడు. భౌగోళికస్థితి విషయంలో కూడ కవి జాగ్రత్త వహించాడు. సందర్భానుకూలంగా కవి పుర, పర్వత, ఆశ్రమ, ఋతు, సూర్యోదయ, సూర్యాస్తమయ, రాత్రి, చంద్రోదయాది కావ్యవర్ణనలను చేర్చాడు. రాజనీతి, సైన్యసంఘటన, యుద్ధాది విషయాలతో కవికి మంచి పరిచయమున్నది.

## రచనోద్దేశం

సనాతన హిందూ రక్షకుడైన శివాజీని ఆదర్శపురుషునిగా, దేశ భక్తునిగా, విజాతీయ శక్తులను ఎదిరించి నిలిచి విజయాన్ని సాధించిన వీరునిగా, ధీరునిగా చిత్రించి భారతీయుల్లో దేశభక్తిని ఉద్బోధించటమే కవి ఈ కావ్యరచన ప్రధానోద్దేశం. ఆధునిక సంఘటనలు, పురాణాదులతో సంబంధంలేని ఐతిహాసికవస్తువును గ్రహించి కూడ భవ్యకావ్యరచన చేయవచ్చునని కవి దీనిలో చూపాడు. అంతేగాక సంస్కృతంలో ఇంకా ఇప్పటికి ఇటువంటి రచనలు చేయగల క్షమత భాషలోగాని భారతీయులల్లో గాని వున్నదని కవి నిరూపించాడు.

శివరాజవిజయంలో ప్రధానరసం వీరం. దాస్యశృంఖలాల్లో మ్రగ్గిన భారతీయులకు శివాజీ చరిత్ర ద్వారా వీరరసోత్తేజాన్ని కవి కలిగించాడు. కర్తవ్యోపదేశాన్ని బోధించాడు.

## సదాశివశాస్త్రి

సింధియా వంశరాజుల చరిత్రను కవి సింధే విజయవిలాస చంపువుగా వ్రాసాడు. కవి క్రీ.శ. 20వ శ॥ వాడు.

# శ్రీధర భాస్కర వర్ణేకర్
## శ్రీ శివరాజ్యోదయం

ఈకవి ఆధునికుడు. జననం క్రీ.శ. 1919. శివాజీ చరిత్రను "శ్రీ శిరాజ్యోదయం" అనే పేరుతో పద్యకావ్యంగా రచించాడు. క్రీ.శ. 1958 లో కవి ఈ కావ్యరచనను ఆరంభించి క్రీ.వ. 1969 లో ముగించాడు. ఇది క్రీ.శ. 1972లో పూనాలో ప్రచురితమైంది. కావ్యారంభంలో సహ్యాద్రి సౌందర్య వర్ణన తర్వాత మహారాష్ట్రదేశం పంఢరపుర వర్ణనలను చేశాడు. ఆ తర్వాత ఆ పుణ్యభూమిలో పుట్టిన జ్ఞానేశ్వర, తుకారామ, రామదాసులను గూర్చి కవి చెప్పాడు. దేశంలో మ్లేచ్ఛ శాసనం ఏర్పడింది. తన్మూల నిర్మూలనకు శివాజీ జన్మించాడు. శివాజీ జననం, అతని వీరలీలలు ఈ కావ్యంలో చక్కగా వర్ణింప బడినవి. పారతంత్ర్యగ్రస్తులై బాధపడుతున్న ప్రజల జీవితాన్ని చూచి శివాజి తన్నిర్మూలనానికై తన నిశ్చయాన్ని ప్రకటించటం, ఆ తర్వాత అతని విజయ పరంపరలు, పట్టాభిషేకం వర్ణింపబడినవి. సందర్భానుకూలంగా కవి ఋతువర్ణనాది కావ్యవర్ణనలను ప్రవేశ పెట్టాడు. చారిత్రక సంఘటనలను కవి అతిశయోక్తులు లేకుండ చెప్పాడు. ఈ కావ్యంలో 68 సర్గలున్నవి. సర్గలల్లో 14 శ్లోకాలు మొదలుకొని 122 శ్లోకాలవరకున్నవి. కవిత్వం సరళంగా ధారాశుద్ధితో వున్నది. ప్రసన్నమాధుర్య గుణాలతో కవి శైలి వైదర్భీ రీతిలో నడిచింది. అంగిరసం వీరం. సందర్భానుకూలంగా కవి చక్కని సుభాషిత వాక్యాలను కూర్చాడు. సంస్కృత భాష ఆధునిక భావ వ్యక్తీకరణకు తగివున్నదని, ఇంకా ఆ భాషలో మహాకావ్య రచనను కొనసాగించ వచ్చునని, సంస్కృత భాషలో జీవం వున్నదని ఈ ఆధునిక కవి నిరూపించాడు.

# చంపూకావ్యాలు

## చంపూకావ్య ప్రక్రియ

"గద్యపద్యమయీ కాచిచ్చంపూరిత్యభిధీయతే" - అని దండి చంపూకావ్య ప్రక్రియను నిర్వచించాడు. శ్రవ్యకావ్య ప్రపంచాన్నంతా లాక్షణికులు మూడు విధాలుగా విభజించారు- గద్య, పద్య, మిశ్రమ. "గద్యం పద్యంచ మిశ్రంచ కావ్యాది త్రివిధం స్మృతమ్" అని అగ్నిపురాణ కారుడు, "శ్రావ్యంతు త్రివిధం జ్ఞేయం గద్యపద్యోభ యాత్మనా" అని దండి శ్రవ్యకావ్య విభజనను గూర్చి చెప్పారు. పద్యకావ్యం కేవలం పద్యమయం, గద్యకావ్యం కేవల గద్యమయం కాగా మిశ్రమం గద్య పద్యమయ మైంది. మిశ్రమ ప్రక్రియకే చంపువు అని పేరు. గద్య, పద్యాత్మకమైన చంపూ ప్రక్రియ పద్యగద్య గుణాలకు నిలయమై వాద్యయుక్తమైన సంగీతం వలె వుంటుంది. తన చంపూ రామాయణంలో భోజుడు చంపూరచనను గురించి ఇట్లా కీర్తించాడు-

గద్యానుబంధ రసమిశ్రిత పద్యసూక్తిః
హృద్యాపి వాద్యకళయా కలితేవ భాతి
తస్మాద్ దధాతు కవిమార్గ జుషాం సుఖాయ
చంపూ ప్రబంధ రచనాం రసనామదీయా.

## చంపూకావ్య ఉత్పత్తి వికాసాలు

సమస్త కావ్య ప్రక్రియలకు వలెనే చంపూకావ్య ప్రక్రియకు బీజాలు మనకు వేదాలల్లోనే కన్పిస్తున్నవి. ఋగ్వేద సంబంధమైన ఐతరేయ బ్రాహ్మణంలోని హరిశ్చంద్రోపాఖ్యానం గద్యపద్య మిశ్రమమైన చంపూమార్గంలో నడిచింది. కృష్ణయజుర్వేదం యొక్క తైత్తిరీయ, మైత్రాయణి, కఠసంహితల్లో గద్య పద్య మిశ్రమ రచన కన్పిస్తున్నది. అథర్వవేదంలో అక్కడక్కడ గద్యశైలి ప్రయోగింప బడింది. ఆరణ్యక గ్రంథాలు సామాన్యంగా గద్యంలోనే నిబద్ధమైనవి కాని ఉపనిషత్తులల్లో కొన్ని పద్యాత్మకం, కొన్ని గద్యాత్మకం కాగా కొన్ని పద్యగద్య మిశ్రితంగాను రచింప బడినవి . ప్రశ్న, ముండక, కఠోపనిషత్తులు ఈ విధంగా చంపూ పద్ధతిలో వ్రాయబడినవి. కఠోపనిషత్తులోని యమ, నచికేతుల సంవాదం గద్య పద్యాత్మకం, మహాభారత రామాయణ కావ్యాలు, భాగవతాది పురాణాలు పద్యాత్మక

మైనవే అయినా అక్కడక్కడ గద్యం ప్రయోగింపబడి చంపూశైలి బృహద్రూపంలో కాకున్నా సూక్ష్మరూపంలోనైనా గోచరిస్తున్నది. పురాణాలల్లో అనేక ఆఖ్యానాలల్లోని గద్యం చూర్ణక విభేదానికి చెందింది. రూపకాలు గద్య పద్యాత్మకంగానే రచింపబడినవి. సంభాషణలు గద్యంలో, వర్ణనాదులు పద్యంలో కూర్చటం రూపకాలల్లో కన్పిస్తున్నది. భాసకాళిదాసాది కవులు రూపకాలల్లో గద్యపద్యాలు రెండింటిలో సమానమైన అలంకృతమైన కళాత్మకమైన శైలినే ప్రయోగించారు. బౌద్ధ కథాసాహిత్యంలో చంపూశైలి బాగా చోటు చేసుకొన్నది. అవదాన శతకం, దివ్యావదానం, జాతకమాల వంటి బౌద్ధకథలల్లో గద్యంతో పాటు పద్యాలు కూడ వున్నవి. తర్వాత పంచతంత్రాది కథాసాహిత్యంలోను గద్యంతో పాటు పద్యాలుకూడ కన్పిస్తున్నవి.

చంపూశైలి యొక్క కళాత్మకమైన పరిణత స్వరూపం క్రీ.శ. 305 ప్రాంతంద్దైన సముద్రగుప్తుని అలహాబాదు శాసనంలో మొట్టమొదట దర్శన మిస్తున్నది. దీని రచయిత హరిషేణుడు. ఈ శాసనంలోని పద్యశైలి వైదర్భీ రీతిలో నడిచింది. గద్యం గాఢబంధత్వరూపాన్ని ధరించి సమాస బహుళతతో సాగింది. ఇదే పద్ధతిని తర్వాత చంపూ కావ్యకవులు అనుసరించారు. రాజుల, ధనాఢ్యుల కీర్తిగుణ ప్రశంసలను కవులు చంపూ శైలిలోనే చేసేవారని ఇటువంటి ప్రశస్తి పూర్వకమైన శిలా శాసనాధారాలను బట్టి చెప్పవచ్చును. వైదిక సాహిత్యం లోని సరళమైన చంపూశైలి క్రీ.శ. 4వ శతాబ్దం నాటికి వికసిత కావ్య స్వరూపాన్ని సాధించు కొన్నదని ఈ శాసనాన్ని బట్టి తెలుస్తున్నది. క్రీ.శ. 10వ శతాబ్దంనుంచి మనకు చంపూశైలిలో కావ్యరచన జరిగినట్లు లబ్ధాధారాలను బట్టి తెలుస్తున్నది. అంతకు పూర్వం చంపూ శైలిలో కావ్యరచన జరిగినా జరిగి వుండవచ్చును. కాని అవేవి మనకు దొరకలేదు. చంపూకావ్య రచన విస్తరంగా జరిగింది క్రీ.శ. 10వ శతాబ్దం నుంచే అని చెప్పవలసి వుంటుంది. క్రీ.శ. 10వ శ॥ నాటికి సంస్కృతంలో మహాకావ్యాలు, నాటకాలు, గద్యకావ్యాలు ఎన్నో ప్రశస్తమైనవి వ్రాయబడినవి. భాస, కాళిదాస, భవభూతి, శూద్రక, భారవి, మాఘ, బాణ, దండి వంటి కవులు ఉద్భవించి చిరయశస్సును పొందారు. భారవి మాఘుల ప్రౌఢ పద్యమహాకావ్యాలతో పాటు సుబంధు బాణుల ప్రౌఢగద్య మహాకావ్యాలు వ్రాయబడినవి. కిరాతార్జునీయ శిశుపాలవధల్లో పద్యశైలి ఉచ్ఛస్థితిని చేరుకొన్నట్లుగానే వాసవదత్త కాదంబరి కావ్యాలలో గద్యశైలి ప్రౌఢరూపాన్ని సంతరించుకొన్నది. వీటి తర్వాత కవులకు కొత్తదనాన్ని చూపాలంటె చంపూశైలియే ఆశ్రయమైంది. దక్షిణ దేశంలో వైష్ణవ సాహిత్యకారులు చంపూశైలిని చేపట్టి దేవతల మహిమాది కథలను, గురువుల

చరిత్రలను రచించారు. రాజుల ఆస్థానాలల్లో ఆశ్రయం పొందిన కవులు రాజుల చరిత్రలను చంపూపద్ధతిలోనే రచించారు. రాజాస్థానాలను ఆశ్రయించుకొని వర్ధిల్లిన శృంగారరస భరిత కావ్యాలెన్నో చంపూ మార్గంలో వ్రాయబడినవి. జైనకవులు జినధర్మ సిద్ధాంత ప్రతిపాదన కొరకు సాహిత్య రచనలను చంపూశైలిలోనే చేసారు. దక్షిణ భారత దేశంలోని తమిళ, తెలుగు, కన్నడ, మళయాళ సాహిత్యాలల్లో చంపూ శైలికే సాహిత్యారంభ కాలం నుంచి ఆదరణ వున్నది. తమిళంలో శివభక్తుల చరిత్రలు, తీర్థక్షేత్ర మాహాత్మ్యాలు చెప్పటానికి చంపూశైలియే గ్రహింపబడింది. తెలుగులో సాహిత్యారంభం నుంచి కూడ సంగీతాత్మకమైన చంపూ పద్ధతియే ఆదరింపబడింది. తిక్కనవంటి కవి కేవలం పద్యాత్మకమైన రచనకు పూనుకొన్నా ఆ పద్ధతి ఆదరణను సంపాదించుకోలేక పోయింది. తిక్కనే స్వయంగా తిరిగి చంపూమార్గాన్ననుసరించి మహాభారతాన్ని అనువదించాడు. సంస్కృత పురాణాదులను ప్రజలకు చదివి చెప్పేటప్పుడు పౌరాణికుడు మూలశ్లోకం చదివి దేశభాషలో గద్యరూపంగా వివరించటం జరిగేది. ఈ కథా ప్రవచన పద్ధతి ననుసరించి గద్యపద్య మిశ్రితమైన శైలికి దక్షిణదేశంలో ఆదరణ లభించి వుంటుంది. అంతేగాక దక్షిణ భారతంలో హరికథ, బుర్రకథల వంటి పద్యగద్యమయంగా పౌరాణిక కథలను, వీరుల గాథలను చెప్పేపద్ధతి బాగా ప్రచారంలో వున్నది. ఈ ప్రక్రియ దక్షిణదేశీయుల సంగీతాత్మకమైన చంపూశైలీ ప్రీతికి తార్కాణంగా వర్ధిల్లిందని చెప్పాలి. చంపూ మార్గ ప్రియులైన దక్షిణ దేశీయులు సంస్కృతంలోను ఈ పద్ధతి ననుసరించి కావ్యరచనలు కొనసాగించారు. అందుకేనేమో దక్షిణదేశంలోనే సంస్కృత చంపూ కావ్యాలు ఎక్కువగా వ్రాయబడినవి. డా. ఛవినాథ త్రిపాఠి తన "చంపూకావ్య కా ఆలోచనాత్మక్ ఏవం ఐతిహాసిక్ అధ్యయన్" అన్న పుస్తకంలో ప్రచురిత, అప్రచురిత చంపూ కావ్యాలు సంస్కృతంలో 245 అని గణించాడు. ఆ 245లో 199 కావ్యాలు దక్షిణభారతంలో వ్రాయబడినవి. దీన్నిబట్టి చంపూశైలి దక్షిణ భారతదేశంలో ఎక్కువ ప్రియమైందని అక్కడే దీనికి ఆదరణ, వ్యాప్తి లభించిందని చెప్పవచ్చును.

## చంపూకావ్య లక్షణాలు

పద్యంలోని సరసత్వాన్ని, గద్యంలోని గంభీరత్వాన్ని చంపూశైలిలో చూడవచ్చును. అంటె చంపూశైలి గద్య పద్య శైలుల సుగుణాలను మేళవించుకొన్న ప్రక్రియ. ఈ విధంగా రెండు శైలుల సుగుణాలను సంతరించుకొన్న చంపూ కావ్యాలు ఉత్కృష్టమైనవి. పద్మ

రాగమణులతో కూర్చిన ముక్తామాల సౌందర్యం వంటిది చంపూశైలి సౌందర్యం. చంపూశైలి ప్రాచీనత వేదాల వరకు పోయినా చంపూకావ్యరచన క్రీ.శ. 10వ శ॥ నుంచే బాగా ప్రచారంలోకి వచ్చింది.

'చంపూ' శబ్దానికి వ్యుత్పత్త్యర్థాన్ని సాధించటానికి కొందరు ప్రయత్నించారు. చురాదిగణంలోని 'చపి' ధాతువుకు 'ఉ' ప్రత్యయాన్ని చేర్చి "చంపయతి, చంపతి ఇతివా చంపూః" అని చంపూ శబ్ద వ్యుత్పత్తిని చెప్పవచ్చు నన్నారు. చపి ధాతువుకు గమన, జ్ఞాన, ప్రాప్తి, మోక్షమనే అర్థాలున్నవి. అప్పుడు చంపూ శబ్దానికి "మోక్షసహోదరమైన ఆనంద ప్రాప్తిని కలిగించేది చంపూ" అని అర్థాన్ని చెప్పవచ్చును. కాని అటువంటి ఆనందాన్ని కలిగించటం చంపూ కావ్యాలకే సీమితం కాక సమస్త కావ్యప్రపంచానికి చెల్లుతుంది. హరిదాస భట్టాచార్యుడు "చమత్కృత్య పునాతి, సహృదయాన్ విస్మితీకృత్య ప్రసాదయతి ఇతి చంపూః" అని చంపూ శబ్దానికి వ్యాఖ్యానం చెప్పాడు. అంటె చమత్కార ప్రధానమై సహృదయులను ఆనందింపజేసేవి చంపూ కావ్యాలని అతని అభిప్రాయం. కొందరు "చంపూ" పదం సంస్కృతం కాదని ద్రావిడపద భవమని చెప్పారు 'సంపూ' పదానికి కన్నడ, తుళు భాషల్లో "కలయిక, మనోహరం" అన్న అర్థాలున్నవి. 'సంపూ'కు 'చంబూ' రూపాంతరం. గద్య పద్యాల కలయికతో కూడిన కావ్యాలకు "సంపూ, చంబూ" పదాల నుంచి ఏర్పడిన 'చంపూ' అన్నపేరు సంస్కృతంలో స్థిరపడింది. చంపూ కావ్యభేదాన్ని మొట్టమొదట పేర్కొన్నవాడు దాక్షిణాత్యుడైన దండియే. గద్య పద్యాల కలయికతో ఏర్పడే కావ్యమార్గం ద్రావిడభాషల్లో విశేషంగా ప్రచారంలో వుండిన దేశీయమైన ప్రక్రియ సంస్కృతంలోకి పాకిందని, 'చంపూ' అన్న పేరు కూడా ద్రావిడపదమైన "సంపూ" భవమే అని చెప్పటం పై వ్యుత్పత్త్యర్థాలకన్న సమంజసంగా వున్నది.

ఒకానొక కవి చంపూ కావ్య లక్షణాలను ఈ క్రింది విధంగా చెప్పాడు-

గద్య పద్యమయీ సాంకా సోఽచ్ఛ్వాసా కవిగుంఫితా
ఉక్తి ప్రత్యుక్తి విష్కంభ శూన్యా చంపూరుదాహృతా.

"చంపూకావ్యాలు గద్యపద్యమయమై, అంకం లేక ఉచ్ఛ్వాస విభజన కలిగి, ఉక్తి ప్రత్యుక్తి అంటె కథోపకథన శూన్యమై, రూపకాలల్లో కనిపించే విష్కంభక రహితమై వుండాలి." కథ కావ్యాలల్లో కనిపించే కథాకథన చమత్కారం చంపూ కావ్యాలల్లో ప్రధానం కాదు. దృశ్యకావ్యాల్లోని విష్కంభాదులు శ్రవ్యకావ్యంలో వుండటానికి వీల్లేదు. ప్రస్తుతం

మనకు లభించే 245 చంపూ రచనలు ఏకలక్షణ లక్షితాలు కావు. అట్లా విభిన్నమైన పోకడలతో కూడిన కావ్యాలను నిర్వచించి లక్షణం ఏర్పరచటం కష్టమే.

మరొక కవి చంపూ కావ్య లక్షణాలను ఇట్లా చెప్పాడు-

గద్యపద్యమయం శ్రవ్యం సబంధం బహువర్ణితమ్
సాలంకృతమ్ రసైః సిక్తం చంపూ కావ్య ముదాహృతమ్

గద్య పద్యమయం, శ్రవ్యకావ్యం, వర్ణనా ప్రాధాన్యం, అలంకారయుక్తం రససిక్తం- ఈ పంచలక్షణాలు కలవి చంపూ కావ్యాలని అతని అభిప్రాయం.

మొత్తం మీద లభించిన చంపూ కావ్యాలను పరిశీలించి స్థూలంగా వాటి సామాన్యలక్షణాలను ఈ విధంగా నిర్ణయించ వచ్చును-

**1. గద్యపద్యమయం**- పద్యకావ్యాలు కాక గద్యకావ్యాలు కాక పద్య గద్య మిశ్రితమైనది చంపూ కావ్యమని అందరూ అంగీకరించిన విషయమే. పద్య కావ్యాలను, గద్య కావ్యాల లక్షణాలను చెప్పినట్లుగా చంపూకావ్య ప్రత్యేక లక్షణాలను వారు చెప్పలేదు. "గద్య పద్యమయీ కాచిచ్చంపూరిత్యభిధీయతే" అని దండి "కాచిత్, అభిధీయతే" అని చెప్పిందాన్ని బట్టి అతనికి చంపూ కావ్యాలతో ప్రత్యక్ష పరిచయం లేనట్లుగానే అనిపిస్తున్నది. క్రీ.శ. 10 వ శ॥ మొదలుకొని చంపూ కావ్యాలు ప్రచురంగా రచింపబడినవే కాని దండి నాటికి (క్రీ.శ. 7వ శ॥) చంపూ కావ్యాలు సంస్కృతంలో విశేష ప్రచారంలో లేనట్లే చెప్పాలి. "గద్యం పద్యం చ మిశ్రం చ కావ్యం యత్పాగతిః స్మృతా" అన్న లాక్షణికుడు భోజరాజు స్వయంగా రామాయణ చంపువును రచించాడు. వాద్య, సంగీత సమ్మేళనం వలె గద్యపద్య మిశ్రమమైన చంపూ శైలి మధురమైందని అతడు కీర్తించాడు.

చంపూ కావ్యాలల్లో ఏ సందర్భంలో గద్యం, ఏ సందర్భంలో పద్యం ప్రయోగించాలి. అనే విషయంలో ఒక నియమం వున్నట్లు కన్పించదు. అయినా కవులు విశేషమైన భావాలను, వర్ణనలను వ్రాసేటప్పుడు పద్యాలను రచించారని స్థూలంగా నిర్ణయించి చెప్పవచ్చును. కొన్నిసార్లు ఒక వస్తువర్ణనను కవులు పద్యంలో చేసి వెంటనే కింద గద్యంలో అదే వస్తువర్ణన చేసిన సందర్భాలు కూడ వున్నవి. అనేకచోట్ల గద్య పద్యాల్లో భావసామ్యం కూడ కన్పిస్తున్నది. పద్యాలు కేవలం కథాగతికి, గద్యాన్ని వర్ణనలకు కొందరు కవులు ప్రయోగించారు. అయినా మొత్తం మీద పద్యరచనలో కాళిదాసు భారవ్యాదుల పద్య శైలిని, గద్యరచనలో

సుబంధు బాణుల గద్యశైలిని చంపూకావ్యకవులు ఆదర్శంగా గ్రహించారనటంలో సందేహం లేదు. అంటె వారి పద్యరచన వైదర్భీ రీతిలో సరస సుందరంగా ప్రసన్నమాధుర్య గుణాలతో నడిచింది. గద్యరచన పాంచాలీ గౌడీ రీతుల్లో గంభీరంగా, పాండిత్య స్ఫోరకంగా, ఓజోగుణ పూర్ణంగా నడిచింది.

**2. కావ్యవిభజన**-పద్యకావ్యాలు సర్గలుగా విభజింపబడగా చంపూకావ్యాలు అంకాలుగా లేక ఉచ్ఛ్వాసాలుగా విభజింపబడినవి. "గద్యపద్యమయీ సాంకా సోచ్ఛ్వాసా చంపూః-" అని హేమచంద్రుడు చెప్పినా చంపూకావ్యకవులు విభిన్నమైన విభజనను పాటించారు . ఆశ్వాస, ఉల్లాస, కాండ, తరంగ, సర్గ, విలాస, లంబక, కల్లోల, మనోరథ, బిందు, పరిచ్ఛేద- అనే పేర్లతో చంపూకావ్య విభజనలు జరిగినవి. దీన్నిబట్టి మహాకావ్యంలోవలె చంపూకావ్య విభజనకు నామకరణ విషయంలో ఒక్క నియమం లేదు.

**3. ఇతివృత్తం-వర్ణనలు**-ఇతివృత్తం విషయంలో చంపూకావ్యకవులకు ఏమీ అడ్డంకులు లేవు. పౌరాణిక గాథలు, మహాభారత రామాయణ గాథలు, మహాపురుషుల, రాజుల, మతగురువుల, భక్తుల చరిత్రగాథలు, కల్పిత కథలు వారికి కావ్యేతివృత్తాలైనవి. డా॥ ఛవినాథ త్రిపాఠి అనుసారంగా మొత్తం 245 చంపూకావ్యాలల్లో 35 రామాయణం 27 మహాభారతం మీద ఆధారపడిన ఇతివృత్తాలు కలవి. ఇంకా మిగతా వాటిల్లో 45 భాగవత పురాణం, 18 శివపురాణం, 6 జైన పురాణం, 48 మహాపురుషుల ఆశ్రయ దాతలైన రాజుల చరిత్రలు, 10 తీర్థయాత్ర వివరణల మీద, 25 దేవోత్సవాల క్షేత్రమాహాత్మ్యల మీద ఆధారపడిన ఇతివృత్తాలు కలవి. ఇంకా చంపూకావ్యాలు అలంకారశాస్త్ర దార్శనిక విషయసంబంధమైనవి కూడ వున్నవి. దీన్నంతా పరిశీలిస్తే మొత్తం మీద చంపూకావ్యకవులకు భాగవతం ఆ తర్వాత రామాయణ మహాభారతాలు అభిమాన మూలస్రోతస్సులుగా వున్నవని చెప్పవచ్చును. కాని రామాయణ కథ, పౌరాణిక గాథలు మొదలుకొని క్షేత్ర మహాత్మ్యాలవరకు ఏదైనా చంపూకావ్యానికి ఇతివృత్తం కావచ్చును. మహాకావ్యంలోవలె నాయికా నాయక యుక్తమైన, పంచసంధి సమన్వితమైన కథాగతి చంపూ కావ్యాలలో పాటింపబడవలెననే నియమమేమీ లేదు.

ఇక వర్ణ్యవిషయాల విషయంలోను పద్య మహాకావ్యంలో వలె నగర శైలబుతు మహార్ణవాదుల నియమమేమీ లేదు. కాని చంపూకావ్య కవులు సందర్భానుకూలంగా మహాకావ్యోచిత వర్ణనలను తమ కావ్యాలల్లో చేసారు. చంపూకావ్య కవులకు కథాకథనం

మీద కన్న వర్ణనల మీద దృష్టి ఎక్కువ. శబ్దార్థ చమత్కారాలతో కూడిన సుదీర్ఘ వర్ణనల నెన్నో వారు చేశారు.

**4. రసం** - పద్య మహాకావ్యంలో వలెనే చంపూ కావ్యాలల్లోను శాంత వీర శృంగార రసాలు అంగిరసాలుగా గ్రహింపబడినవి. ఈ రసాలనే ప్రధానంగా పోషించాలనే పద్యమహాకావ్య రూపకాదుల్లోవలె నియమమేమీ లేదు. కాని చంపూ కావ్యకవులు ఉదాత్తమైన శాంత వీర శృంగారాలనే ప్రధానంగా గ్రహించారు.

గద్యపద్య మహాకావ్యాల సులక్షణాలను గ్రహించిన చంపూ కావ్యాలు క్రీ.శ. పదవ శతాబ్దం నుంచే రచింపబడినా క్రీ.శ. పదమూడవ శతాబ్దం తర్వాత వీటి రచన విరివిగా సాగింది. సంస్కృత సాహిత్య సృష్టి తగ్గుముఖం పట్టిన కాలంలో దక్షిణభారత దేశ కవులచేత ఆదరింపబడి చంపూకావ్య ప్రక్రియ మాత్రం సంస్కృత భాషలో వర్ధిల్లుతూనే వచ్చింది. దక్షిణ దేశ భాషల్లోని సాహిత్య లక్షణాలను కూడ ఈ చంపూకావ్య ప్రక్రియ సంతరించుకొన్నదన్న అతిశయోక్తి కాదు. దక్షిణదేశ ప్రాంతాలకు చెందిన దేవతల, తీర్థక్షేత్ర మాహాత్మ్యాల, మత గురువుల, భక్తుల వృత్తాంతాలు చంపూ కావ్యాలుగా వ్రాయబడినవి. తెలుగులో క్రీ.శ. 16వ శతాబ్దం తర్వాత వెలసిన "విలాస, పరిణయ" కావ్యాల పద్ధతిననుసరించి సంస్కృతంలో చంపూకావ్యాలు వ్రాయబడినవి. క్రీ.శ. 19వ శతాబ్దం మధ్యభాగం వరకు చంపూ కావ్యాలు విరివిగా నిరంతరంగా రచింపబడుతూ వచ్చినవి. సంస్కృత సాహిత్య స్రవంతి ఇంకిపోకుండ చైతన్యంతో ప్రవహించేటట్లు చేసింది ఈ చంపూకావ్య ప్రక్రియ అని చెప్పవచ్చును.

# త్రివిక్రమభట్టు

## త్రివిక్రమభట్టు పరిచయం

త్రివిక్రమభట్టు రచించిన నలచంపువు లబ్ధచంపూ కావ్యాలల్లో ప్రాచీనతమమైంది. నలచంపువుకే "దమయంతీ కథ" అని కూడ పేరు. త్రివిక్రముని తండ్రి దేవాదిత్యుడని, నేమాదిత్యుడని పాఠభేదాలతో కన్పిస్తున్నది. ఎక్కువ వ్రాత ప్రతులల్లో నేమాదిత్యుడే కన్పించటం చేత అదే త్రివిక్రముని తండ్రి పేరుగా గ్రహించాలి.. త్రివిక్రముని పితామహుడు శ్రీధరుడు. త్రివిక్రముడు బాణుని స్మరించాడు మరియు భోజుడు సరస్వతీ కంఠాభరణంలో త్రివిక్రముని ఉదాహరించాడు కాబట్టి ఈ కవి క్రీ.శ. 7వ శ॥ తరువాత వాడని క్రీ.శ. 11వ శ॥కి పూర్వుడని నిర్ణయించవచ్చును. త్రివిక్రముడు మాన్యఖేటాదిపతి అయిన రాష్ట్రకూట రాజు మూడవ ఇంద్రుని ఆస్థానకవి. ఇంద్రరాజు క్రీ.శ. 915వ సంవత్సరంలో రాజైనట్లు

బడోదా ప్రాంతానికి చెందిన నౌసారీ గ్రామంలో దొరికిన తామ్రశాసనాన్ని బట్టితెలుస్తున్నది. ఇంద్రరాజు తాత రెండవ కృష్ణరాజు తర్వాత ఇంద్రరాజే రాజయ్యాడు. కాబట్టి త్రివిక్రమభట్టు రెండవ కృష్ణరాజు, మూడవ ఇంద్రరాజుల ఆస్థానంలో సభాపండితుడుగా వున్నాడని చెప్పవచ్చును. అప్పుడు త్రివిక్రముని కాలాన్ని క్రీ.శ. 10 శ॥ ఉత్తరార్ధమని చెప్పవచ్చును.

త్రివిక్రమభట్టును గూర్చి ఒక కథ ప్రచారంలో వున్నది- త్రివిక్రముని తండ్రి నేమాదిత్యుడు రాజాస్థాన పండితుడు. త్రివిక్రముడు చదువక తిరుగుబోతుగా వుండేవాడు. ఒకసారి నేమాదిత్యుడు గ్రామాంతరం పోయినప్పుడు రాజాస్థానానికి శాస్త్రవాదం చేయటానికై ఒక పండితుడు వచ్చాడు. అప్పుడు రాజు నేమాదిత్యుని కొరకు ఇంటికి కబురుపంపాడు. త్రివిక్రమునికి ఏమి చేయాలో తోచలేదు. సరస్వతీ దేవిని ప్రార్థించగా "నీ తండ్రి తిరిగి వచ్చేంతవరకు నేను నీ నాలుక మీద నివసిస్తా"నని ఆమె మాట ఇచ్చింది. ఆ వరప్రసాదంతో త్రివిక్రముడు శాస్త్రవాదానికై వచ్చిన పండితున్ని ఓడించి రాజసన్మానాన్ని పొందాడు. ఇంటికిపోయి త్రివిక్రముడు నలచంపువు కావ్యాన్ని వ్రాయ నారంభించాడు. ఏడవ ఉచ్ఛ్వాసం సమాప్తి వరకు వ్రాసాడు. ఇంతలో అతని తండ్రి ఇంటికి తిరిగి వచ్చాడు. సరస్వతి ఇచ్చిన మాట ప్రకారం త్రివిక్రముని ముఖంనుంచి తొలగిపోయిందట. ఇక త్రివిక్రముడు కావ్యాన్ని పూర్తిచేయలేక పోయాడని, అందుచేతనే నలచంపువు అసంపూర్ణంగా మిగిలి పోయిందని కింవదంతి. కాని ఈ కథ అంత విశ్వసనీయమైంది కాదు. మరేదో కారణంచేత నలచంపువు అసంపూర్ణంగా నిలిచిపోయి వుంటుంది.

## నలచంపువు ఇతివృత్తం

నలచంపువు ఇతివృత్తాన్ని త్రివిక్రముడు మహాభారతాంతర్గత వనపర్వం నుంచి తీసుకొన్నాడు. నలుడు ఇంద్రాది దిక్పాలుర సందేశాన్ని దమయంతికి వినిపించటం, దాన్ని నిరాకరిస్తు దమయంతి సఖీముఖంగా ప్రత్యుత్తరమియ్యటం, నలుడు తిరిగి వెళ్ళిపోయి విరహసంతప్తుడు కావటంతో ఈ కథ ఆగిపోతున్నది. కథాప్రారంభంలో నలుని వన విహారం, వేట, పథికునితో సంభాషణ, పథికుడు సుందరి వర్ణన చేయటం, అది విని నలుడు ఆకృష్టుడు కావటం, నలుడు పథికుని ఉపహారాలతో సన్మానించి పంపివేయటం వున్నవి. ఒకరోజు నలుడు వనవిహారం చేస్తూ హంసను చూచి స్నేహభావంతో పట్టుకొంటాడు. హంసతోపాటు హంసి కూడ వుంటుంది. నలుడు హంసితో శిష్టోక్తులతో కూడిన మాటలతో సంభాషిస్తాడు. వీరిట్లా మాట్లాడకుంటున్న సమయంలో హంసను విడిచిపెట్టమని, అది దమయంతి నీయందు అనురాగవతి అయ్యేటట్లు సహాయపడగలదని ఆకాశవాణి చెప్తుంది. నలుడు దమయంతి ఎవ్వరని ఆశ్చర్యపడ్డాడు. అప్పుడు హంస దమయంతిని పరిచయంచేసి

ఆమె సౌందర్యాన్ని వర్ణించి చెప్తుంది. ఇక్కడ కవి దమయంతి జన్మవృత్తాంతాన్ని విశదంగా వర్ణించి చెప్పాడు. ఆ తర్వాత హంస కుండిన నగరం పోయి రాజోద్యానవనంలో సంచరించే దమయంతి చేతికి చిక్కుతుంది. అప్పుడు హంస నలున్ని భర్తగా పొందమని దమయంతిని దీవిస్తుంది. నలుడెవరని దమయంతి ఔత్సుక్యంతో అడుగుతుంది. హంస నలుని చరిత్రను వర్ణించి చెప్తుంది. ఇక్కడ కవి నలుని జన్మవృత్తాంతాన్ని విస్తరంగా వర్ణించి చెప్పాడు. ఈ సందర్భంలోనే మంత్రి సాలంకాయనుడు నలునికి చేసిన ఉపదేశాన్ని కవి దీర్ఘంగా రచించాడు. ఇది శ్లేషచతుత్కృతులతో కూడి కాదంబరిలోని శుకనాసోపదేశాన్ని పోలివున్నది. హంసచెప్పిన నలుని వృత్తాంతాన్ని విని దమయంతి నలుని ప్రేమిస్తుంది. హంస తిరిగి నిషధనగరం వెళ్ళి ఈ వృత్తాంతాన్నంతా నలునికి తెలుపుతుంది.

దమయంతి విరహావస్థను చూచి ఆమె తండ్రి భీముడు ఆమెకు స్వయంవరాన్ని చాటిస్తాడు. అనేక రాజులు స్వయంవరానికి వస్తారు. నలుడు కూడా స్వయంవరానికి బయలుదేరుతాడు. మార్గమధ్యంలో ఇంద్రాది దిక్పాలురు వచ్చి తమలో ఎవరినైనా ఒకరిని దమయంతి వరించేటట్లు చేయమని నలున్ని ఆమె వద్దకు రాయబారిగా పంపుతారు. అతని రాయబారం సులభతరం కావటానికి వారు అతనికి తిరస్కరిణీవిద్యను ప్రసాదిస్తారు. దిక్పాలురమాటను నిరాకరించలేక నలుడు దూతగా బయలుదేరుతాడు మార్గమధ్యంలో అతనికి ఒక. పథికుడు కలిసి దమయంతి ఇచ్చిన ప్రేమలేఖను, ఉంగరాన్ని, వస్త్రయుగళాన్ని ఇస్తాడు. నలుడు కుండిన నగరం చేరుకొని భీము డిచ్చిన అతిథిమర్యాదలను స్వీకరించి విశ్రాంతి తీసుకొంటుండగా పర్వతకుడనేవాడు ప్రవేశించి దమయంతి విరహావస్థను వర్ణించి చెప్తాడు. ఇది విని నలుడు చింతుతుడవుతాడు. అయినా దౌత్యాన్ని నిర్వహించటానికే నిశ్చయించుకొని అంతఃపురంలో ప్రవేశిస్తాడు. అక్కడ దిక్పాలుర సందేశాన్ని వినిపిస్తాడు. దమయంతి దిక్పాలురను వరించటానికి నిరాకరిస్తుంది. నలుడు తన అతిథిగృహానికి తిరిగివచ్చి దమయంతీ విరహసంతప్తుడవుతాడు. అంతవరకే కావ్యం మనకు ఇప్పుడు ఉపలబ్ధమౌతున్నది.

మూల మహాభారత కథను త్రివిక్రముడు అనుసరించినా అక్కడక్కడ స్వల్పమైన మార్పులను చేర్పులను చేసాడు. ఆ కల్పనలు మనోహరమైన వర్ణనలకు అవకాశాన్ని కల్పించినవి. దానివల్ల కథాశరీరం పెరిగింది. త్రివిక్రముని నలచంపూకావ్య ప్రేరణచేతనే శ్రీహర్షుడు నైషధ పద్యమహాకావ్యాన్ని రచించాడని లోకంలో వాడుక. కథాసంవిధానంలో శ్రీహర్షుడు కొంతవరకు త్రివిక్రముని అనుకరించాడని చెప్పవచ్చును. నలుని వనవిహారం, హంసద్వారా నలదమయంతులు ప్రేమపాశబద్ధులు కావటం, నలుడు తిరస్కరిణీవిద్య

సహాయంతో దూతగా దమయంతి అంతఃపురం చేరటం మొదలైన కథాక్రమాన్ని శ్రీహర్షుడు త్రివిక్రముని దగ్గర తీసుకొన్నాడు.

త్రివిక్రముడు సందర్భానుకూలంగా వన, మృగయా, ప్రభాత, పర్వత, సంధ్య, చంద్రోదయాది కావ్య వర్ణనలను చేర్చాడు. ప్రతి ఉచ్ఛ్వాసం చివరి శ్లోకంలో కవి "హరచరణసరోజ" మనే శబ్దాన్ని ప్రయోగించాడు. నలచంపువుకు అనేక టీకలు వున్నవి. చండపాల, గుణ వినయగణి, దామోదర భట్ట, నాగదేవుల టీకలే కాక ఒక అజ్ఞాత వ్యక్తి వ్రాసిన టీక కూడా లభిస్తున్నది. ఈ టీకల సంఖ్యను బట్టియే ఒకప్పుడు ఈ కావ్యం చాలా లోకప్రియమైందని తెలుస్తున్నది. ఇప్పటికి చంపూకావ్యాలల్లో ప్రథమ రచన అనే కాక కవిత్వ గుణాన్ని బట్టి కూడా ఈ కావ్యం ప్రముఖమైందే. త్రివిక్రముని తర్వాత నలదమయంతుల కథను తీసుకొని శ్రీ హర్షుడే కాక లక్ష్మీధర, శ్రీనివాస దీక్షిత మొదలైన కవులెందరో కృతులు రచించారు.

## మదాలసచంపువు

త్రివిక్రముని రెండవ కృతి కూడా చంపూ కావ్యమే. మార్కండేయ పురాణ ప్రసిద్ధమైన కువలయాశ్వమదాలసల ప్రణయవృత్తాంతాన్ని తీసుకొని త్రివిక్రముడు మదాలస చంపూకావ్యాన్ని రచించాడు. క్రీ.శ. 1882లో జె.బి. మోదక్ సంపాదకత్వంలో ఇది పూనా నుంచి ప్రచురితమైంది. కువలయాశ్వుడు పాతాళకేతును వధించి మదాలసను పరిణయమాడటం, మదాలసవియోగం, మదాలస పునః ప్రాప్తి దీనిలో వర్ణింపబడినవి. భాషా పౌష్ఠవం, కవిత్వ కళాదృష్టితో ఈ కావ్యం నలచంపువుతో సరితూగలేదు. ఇది ఒకవేళ కవి ప్రథమ కృతి కావచ్చును. కాని కథా దృష్టితో ఈ కావ్యం ఉత్కృష్టమైంది. లోకాదరణను పొందింది. మదాలస కథను తీసుకొని తర్వాత కవులు కావ్యనాటకాలను వ్రాసారు. వీటిలో విజయనగర చక్రవర్తి శ్రీకృష్ణదేవరాయల మదాలస చరిత్ర అన్న సంస్కృతకావ్యం కూడా వున్నది.

## త్రివిక్రముని కవిత్వం

గద్యపద్య రచనలో త్రివిక్రముడు సమానప్రతిభను ప్రదర్శించాడు. సరసమైన శృంగార భరితేతివృత్తాన్ని త్రివిక్రముడు మధురమైన శైలిలో రచించాడు. అతని శైలి గద్యపద్య మిశ్రితమైనా ఎగుడు దిగుడు లేక సవ్యంగా నడిచింది. కీథ్ నలచంపువును లోకసాధారణ కావ్యంగా పరిగణించాడు. కాని శైలి దృష్టితో కథా దృష్టితో ఈ కావ్యం సంస్కృత సాహిత్యంలో ప్రముఖమైందని చెప్పాలి. మూల కథలో కవి తన స్వకపోల

కల్పిత సంఘటనలను, పాత్రలను చేర్చిన తీరు ఆకర్షణీయంగా వున్నది. కథాగతి వేగంగా లేక పోవటం కావ్యంలో ఒక లోపంగా కన్పించవచ్చును. కాని వర్ణనల చమత్కార సౌందర్యంలో మునిగిపోయి పాఠకుడు తన్మయునడై దాన్ని గుర్తించకపోవచ్చును కూడా. అసలు చంపూకావ్యాలు కథా వేగానికి, కథా చమత్కృతికి కాక వర్ణనామచమత్కృతుల కొరకు చదువవలసినవే. త్రివిక్రముడు అపార శబ్దజ్ఞానం, శాస్త్ర పాండిత్యం, కలవాడు. అందుచేత ఆతని కవిత్వం భావప్రకటనలో ఏ లోపం లేకుండ వేగంగా నడిచింది. త్రివిక్రముని కవిత్వంలో శ్లేష, అనుప్రాసలు ఎక్కువగా వున్నవి. ప్రసాదగుణభరితమైన శ్లేషనే కవి ప్రయోగించాడు. సభంగ శ్లేష ప్రసన్నమై, ప్రసాదగుణభరితమైన శ్లేషనే కవి ప్రయోగించాడు. సభంగ శ్లేష ప్రసన్నమై, సరసమైన మసృణత్వ, మృదుత్వ గుణాలతో ఇతని కవిత్వం పఠనీయంగా వున్నది. సుబంధు బాణుల శ్లేష మార్గాన్ని త్రివిక్రముడు అనుసరించాడు. కాని సంబంధు శ్లేష కఠినమై పండిత జనోపయోగమాత్రమై వుండగా త్రివిక్రముని శ్లేష సర్వజన సుగమ్యమైంది. త్రివిక్రముని కవిత్వం మధురగుణంతో నిండినోయి శ్లిష్టమైనా చంపూకావ్యాలల్లో ఉత్తమమైన కృతిగా పేరును సంపాదించుకొన్నది. కావ్యవర్ణనల సందర్భంలో గల తన అలౌకిక వర్ణనాప్రతిభను చాటుకొన్నాడు. శ్లేషానుప్రాణిత ఉత్ప్రేక్ష, ఉపమాది అర్థాలంకారాలను, అనుప్రాస, యమకాది శబ్దాలంకారాలను కవి ప్రయోగించాడు. ప్రభాతవర్ణనలోని ఈ కింది శ్లోకం చాలా రమణీయంగా వుండి "యామున త్రివిక్రము"డనే కీర్తిని తెచ్చి పెట్టింది.

ఉదయగిరి గతాయాం ప్రాక్ప్రభాపాండుతాయా
మనుసరతి నిశీథే శృంగమస్తాచలస్య
జయతి కిమపి తేజః సాంప్రతం వ్యోమమధ్యే
సలిలమివ విభిన్నం జాహ్నవం యామునం చ.

"ప్రాతఃకాలీనమైన కాంతి ఉదయగిరి మీద ప్రకాశిస్తున్నది. రాత్రి అస్తగిరి శిఖరాలనుంచి జారుకుంటున్నది. ఆ సమయంలో గంగా యమునల జలాలు కలిసిపోయినట్లుగా ఒక అలౌకిక తేజస్సు అంతటా ప్రకాశిస్తున్నది."

త్రివిక్రముడు కవి పదప్రయోగనిపుణుడుగా వుండాలంటాడు. పదప్రయోగంలో నిపుణుడు కాని కవి తప్పటడుగులు వేసే, అవ్యక్తాలాపాలు చేసే బాలుని వంటి వాడంటాడు

(1-6).కవి ప్రయోగించిన పదం, ధనుర్ధారి ప్రయోగించిన బాణం హృదయలగ్నమై వ్యామోహితున్ని చేయకపోతే లాభం లేదని త్రివిక్రముని అభిప్రాయం-

కిం కవేస్తేన కావ్యేన కిం కాండేన ధనుష్మతః
పరస్య హృదయే లగ్నం న ఘూర్ణయతి యచ్ఛిరః

# సోమప్రభసూరి

## సోమప్రభసూరి పరిచయం

సోమప్రభసూరి యశస్తిలక చంపువును రచించాడు. ఈ కవి దిగంబర జైన సాధువు. ఈ కవి ఆంధ్రప్రదేశ్‌లోని కరీంనగర్ జిల్లాలో గల వేములవాడను రాజధానిగా చేసుకొని వేములవాడ చాళుక్యులని ప్రసిద్ధిచెందిన రాజవంశంలో ప్రసిద్ధుడైన రెండవ అరికేసరి జ్యేష్ఠ కుమారుడు వాగరాజు ఆశ్రయంలో వున్నాడు. రెండవ అరికేసరి ఆ స్థానంలోనే కన్నడ భాషలో ఆదికవి పంపడు ఆశ్రయం పొంది శాంతిపురాణం, విక్రమార్జునవిజయమనే కావ్యాలను వ్రాసాడు. పంపడు కూడ జైనుడు. దీన్నిబట్టి వేములవాడ చాళుక్యులు జైనమతాభిమానులని తెలుస్తున్నది. సోమప్రభసూరి ఉత్తర భారతీయుడు. దక్షిణ దేశానికి వచ్చి వేములవాడలో నివసిస్తు యశస్తిలక చంపూ కావ్యాన్ని వ్రాసాడు. రెండవ అరికేసరి క్రీ.శ. 955 ప్రాంతం కాబట్టి కవి కాలం కూడ అదే అని నిర్ణయించవచ్చును. ఈ కవి కాళిదాస బాణమయూర భారవి మాఘ రాజశేఖరాది కవులను స్మరించాడు. సంస్కృతంలో మంచి ప్రవేశం కలవాడు. జైన ధర్మప్రచారం ద్వారా మానవ కళ్యాణం చేయటమే కవి కావ్య రచనోద్దేశం.

## యశస్తిలక చంపువు ఇతివృత్తం

యశస్తిలక చంపువులో యశోధర, మారిదత్తులనే రాజుల కథ వున్నది. మారిదత్తుడు యజ్ఞం చేయతలపెట్టి యజ్ఞంలో బలి ఇయ్యటానికి పశువులను సిద్ధం చేస్తాడు. అదే విధంగా బలిపశువులుగా ఒక బాలిక, ఒక బాలున్ని కూడ సిద్ధం చేస్తాడు. సుదత్తుడనే ముని వచ్చి మారిదత్తుడు చేసే యజ్ఞం నిరర్థకమైందని వివరిస్తాడు. అప్పుడు ఆ ముని ద్వారా మారిదత్తుడు మనస్సు మారి జైనమతాన్ని స్వీకరిస్తాడు. ఈ కథలో కవి సమకాలిక జీవితాన్ని చక్కగా ప్రతిబింబింప జేసాడు. ఆనాటి రాజులను, మంత్రులను, సాంఘిక

దుఃస్థితిని, దురాచారాలను కవి వాస్తవంగా చిత్రించాడు. ప్రాసంగికంగా కవి ఆనాటి శైవ వైష్ణవ కాపాలిక చార్వాకాది మత సంప్రదాయాలను వివరించాడు.

సోమప్రభసూరి బాణుని కాదంబరిచేత ప్రభావితుడైనాడనటం స్పష్టం. కాదంబరిలోవలెనే కవి కథాసంవిధానాన్ని కూర్చుకొన్నాడు. కాదంబరి కథలోని సంఘటనల వంటి సంఘటనలే ఈ కవి కావ్యంలో వున్నవి.

## సోమప్రభుని కవిత్వం

సోమప్రభసూరికి బాణుడు ఆదర్శకవి. స్వయంగా పండితుడు. కాబట్టి అతని కవిత్వం బాణుని కవిత్వం వలెనే పాండిత్య స్ఫోరకంగా ఉన్నది. శ్లేషను కవి ఎక్కువగా ప్రయోగించాడు. అక్కడక్కడ శబ్దకాఠిన్యం, అప్రసిద్ధ పద ప్రయోగాలు ఉన్నవి. దీర్ఘమైన వర్ణనలు వున్నవి. కాని మొత్తంమీద సోమప్రభ సూరి కవిత్వం సరసమైన సులభ శైలిలోనే వున్నది. కవిచక్కని సూక్తులను ఎన్నిటినో ప్రయోగించాడు. మంచి లోకోక్తులు కూడ వున్నవి. తర్వాత చంపూకవులు సోమప్రభసూరిని అనేక విధాలుగా అనుకరించటంచేత ఈ కవికి చంపూకావ్య కవులలో ప్రత్యేక స్థానమున్నదని అంగీకరించవలసి వుంటుంది.

## హరిచంద్రుడు

హరిచంద్రుడు జీవంధరచంపువును రచించాడు. ఈ కవి కూడ జైనుడు. జైనముని జీవంధరుని జీవిత వృత్తాంతం ఈ కావ్యంలో నిబద్ధింపబడింది. ఈ కవి మాఘ వాక్పతి కవులను స్మరించటంచేత క్రీ.శ. 900 ప్రాంతం వాడని చెప్పవచ్చును.

జీవంధర చంపూ కావ్యంలో 11 లంబకా లున్నవి. కావ్యంలో కవి జైన సిద్ధాంతాల ఉపదేశాలను చొప్పించాడు. ఈ కవి శైలి మాఘ వాక్పతిరాజులను అనుకరిస్తున్నది. జైనధర్మ ప్రతిపాదనయే కవి కావ్య రచనోద్దేశం.

## సోడ్డలకవి

సోడ్డలకవి "ఉదయ సుందరీ కథ" అనే చంపూ కావ్యాన్ని వ్రాసాడు. ఈ కవి లాటదేశ రాజా చాళుక్య వత్సరాజు ఆస్థాన కవి. క్రీ.శ. 11వ శతాబ్దం వాడు. ఉదయసుందరి చంపువులో మలయవాహనుడనే రాజు ఉదయసుందరిని వివాహమాడే వృత్తాంతమున్నది. ఉదయసుందరి నాగ రాజకుమారి. మలయవాహనుడు ప్రతిష్ఠానరాజు. ఈ కావ్యంలో 8

ఉచ్ఛ్వాసాలున్నవి. పద్యభాగం కన్నా గద్యభాగం ఎక్కువ. దీని ఇతివృత్తం కల్పితం. కథా కల్పనలో బాణుని కాదంబరి ప్రభావం బాగా కన్పిస్తున్నది. సోడ్ఢలునికి బాణుడంటె చాల గౌరవం. బాణుని సర్వేశ్వరుడని ఈ కవి స్తుతించాడు. అంతేగాక బాణుని ఒక పాత్రగా కవి కావ్యంలో ప్రవేశపెట్టి తన కవిత్వాన్ని అతడు ప్రశంసించినట్లుగా కల్పన చేసాడు.

సోడ్ఢలుని కవిత్వం మృదుమధురమైంది. బాణుని గద్యంలోని ప్రసన్నత్వం సోడ్ఢలుని గద్యంలోను కన్పిస్తున్నది. కవి బాణునివలెనే విస్తరంగా సరసమైన వర్ణనలు చేసాడు. సోడ్ఢలుని కవిత్వం లాలిత్యగుణ భరితమైంది.

## భోజరాజు

### భోజరాజు పరిచయం

భోజుడు లాక్షణికుడే కాక కావ్యకర్త కూడ. ఇతడు రామాయణ చంపువు అనే కావ్యాన్ని వ్రాసాడు. భోజుడు పరమారవంశపు రాజు. ధారానగరం రాజధానిగా మాళవ దేశాన్ని పాలించాడు. చారిత్రక ప్రమాణాల ననుసరించి ఇతని కాలం క్రీ.శ. 1018-1063. విక్రమాదిత్యునివలె ఈ రాజు కవిపండిత పోషకుడు, సాహిత్య ప్రేమి, దాత. దేశం నలుమూలల నుంచి కవులువచ్చి భోజరాజును ఆశ్రయించి తమ కవిత్వంచేత అతన్ని మెప్పించి బహుమానాలు అందుకునేవారట! ఎటువంటి కవినైనా నిరాశపరచకుండ భోజుడు సత్కరించేవాడు. "ప్రత్యక్షర లక్షం దదౌ" అని ప్రసిద్ధి. భోజరాజు పేరుతో దాదాపు 21 రచనలు కన్పిస్తున్నవి. వాటిల్లో శైవ సిద్ధాంత, వ్యాకరణ, జ్యోతిష, అలంకార శాస్త్రాది గ్రంథాలున్నవి. అతని కృతుల్లో శృంగార ప్రకాశం, సరస్వతీ కంఠాభరణమన్న అలంకార శాస్త్రగ్రంథాలు ప్రసిద్ధమైనవి. ఆ తర్వాత చంపూరామాయణం ప్రసిద్ధమైంది, ఉత్కృష్టమైంది. ఇది జనాదరణను పొందిన కృతి.

### చంపూ రామాయణ ఇతివృత్తం

భోజుని చంపూరామాయణానికి మూలాధారం వాల్మీకి రామాయణమే. భోజుడు కావ్యారంభంలో ఈ విషయాన్ని చాల నమ్రంగా ఇట్లా చెప్పాడు-

వాల్మీకిగీత రఘుపుంగవ కీర్తిలేశైః
తృప్తింకరోమి కథమప్యధునా బుధానామ్

గంగాజలైర్భువి భగీరథయత్న లబ్దైః
కిం తర్పణం నవిదధాతి నరః పితౄణామ్.

"భగీరథుడు రప్పించిన గంగాజలాలను పితృదేవతలకు తర్పణమిచ్చినట్లుగా వాల్మీకివర్ణిత రామచరిత్ర ద్వారానే సజ్జనులకు తృప్తి కలిగించటానికి ప్రయత్నిస్తున్నాను." ఎటువంటి మార్పులు చేర్పులు చేయకుండ భోజుడు వాల్మీకి రామాయణ కథనే గ్రహించి చంపూపద్ధతిలో చెప్పాడు. చివరకు బాలకాండాన్ని తప్ప మిగతా కాండాలను వాల్మీకి ప్రయోగించిన ఆరంభపదాలనే తీసుకొని భోజుడు కాండాలను ఆరంభించాడు. ఎన్నోచోట్ల వస్తుసామ్యంచేత భావసామ్యం కూడ వున్నట్లు గోచరిస్తున్నది.

## భోజుని కవిత్వం

భోజుని కవిత్వం సరసమధురమైంది. రమ్యమైన వర్ణనలెన్నో కవిచేసాడు. అరణ్యాకాండంలోని హేమంతవర్ణన, కిష్కంధాకాండంలో వర్షర్తువర్ణన, సుందరకాండంలోని సంధ్యావర్ణనలు మనోహరంగా వున్నవి. పద్యరచనలో భోజుడు కాళిదాసును, అక్కడక్కడ మాఘుని అనుకరించాడు. భోజుడు అనుప్రాస, యమకాలను చాలా వాడాడు. దానిచేత అతని కవిత్వం ఆపాతమధురమైంది. భోజుని గద్యరచన సరళంగా వున్నది. చిన్నచిన్న వాక్యాలతో అనుప్రాసయుక్తమై లలిత మధురంగా వున్నది. భోజుని కవిత్వం శబ్దమాధుర్యానికి ప్రసిద్ధమైంది. చంపూరామాయణంలో గద్యభాగంకన్న పద్యభాగమెక్కువ. గద్య పద్యాలు రెండు అలంకార సౌందర్యం, శబ్దమాధుర్యంచేత సమానంగా సుందరమైనవి. భోజుని శైలి వైదర్భీ రీతికి చెందింది. బాణునివలెనే భోజుడు శ్లేషానుప్రాణిత ఉపమా చమత్కారాలను ప్రదర్శించాడు. ప్రసాదగుణభరితమైన భోజుని శ్లేషప్రయోగాలు ఆహ్లాదజనకంగా వున్నవి. ఉదాహరణకు విశ్వామిత్రుని వర్ణన- పద్యప్రబంధమివ దర్శిత సర్గభేదమ్, ప్రాకృత వ్యాకరణమివ ప్రకటిత వర్ణవ్యత్యాసమ్ బుధమివ సోమసుతమ్...." చక్కని పదవిన్యాసం, అంత్యాది ప్రాసతో కూడిన భోజుని పద్యరచనకు ఉదాహరణ-

ఏనాం పురాణనగరీం నగరీతి సాలాం
సాలాభిరామ భుజ నిర్జిత యక్షరాజః
హేలాభిభూత జగతాం రజనీ చరణాం
రాజా చిరాదవతి రావణ నామధేయః

శబ్దవిన్యాసంతోపాటు భోజుడు రసపోషణను కూడ ఆదరించాడు. పతీవియోగంతో పలికే తార మాటలు కరుణరసాత్మకమైనవి-

నాహం సుకేతు తనయా నచ సప్తసాలీ
వాలీ నచ త్రిభువన ప్రథిత ప్రభావః
తారాస్మి వజ్ర హృదయా విశిఖరభేద్యా
ధన్వీకథం భవసి రాఘవ మామవిద్వా.

"నేను తాటకను కాను. సప్తతాళవృక్షాన్ని కాను. త్రిభువన ఖ్యాతిచెందిన పరాక్రమం గల వాలిని కాను. వజ్రహృదయ తారను. నీ బాణాలు నన్ను ఏమి చేయలేవు. హే రామ! నన్ను భేదించేవరకు ధన్వి అనే పేరు నీకు సార్థకం కాదు."

రామాయణ చంపువును భోజచంపువు అనికూడ అంటారు. ఆంధ్రదేశంలో సంస్కృత విద్యార్థి చంపూ కావ్యాల అధ్యయనాన్ని రామాయణ చంపువుతో ఆరంభించే ఆచార ముండేదట. ఆంధ్ర, ద్రవిడ, కర్ణాటక ప్రాంతాలల్లో ఈ కావ్యం ఎక్కువ ప్రచారంలో వున్నది.

చంపూ రామాయణానికి నారాయణ, రామచంద్ర, కామేశ్వర, మానవేద, ఘనశ్యామాదులు వ్రాసిన టీకలున్నవి. ఈ టీకల సంఖ్యయే దీని ప్రసిద్ధిని చాటుతున్నవి.

## లక్ష్మణ సూరి

చంపూ రామాయణంలో బాలకాండం మొదలుకొని సుందరకాండం వరకే భోజుడు రచించాడు. చివరికాండం యుద్ధ కాండాన్ని లక్ష్మణసూరి అనే కవి వ్రాసి పూరించాడు. ఏ కారణం చేత భోజుడు యుద్ధకాండాన్ని వ్రాయలేదో చెప్పలేము. యుద్ధకాండాన్ని ఆరంభిస్తు లక్ష్మణసూరి ఇట్లు చెప్పుకున్నాడు-

భోజేన తేన రచితామపి పూరయిష్య
న్నల్పీయ సాపి వచసా కృతిమత్యు దారామ్
నవ్రీడితో2హ మధునా నవరత్నహార
సంగేన కిన్న హృది ధార్యత ఏవ తంతుః.

"భోజుడు రచించిన రమణీయమైన కృతిని పూరించటానికి నేను సిగ్గుపడటం లేదు. ఎందుకంటే నవరత్న హారంతోపాటు సూత్రంకూడ హృదయం దగ్గర స్థానాన్ని పొందుతుంది." అదే విధంగా తన యుద్ధకాండం కూడ ఆదరింప బడుతుందని కవి విశ్వాసం. అదే విధంగా జరిగింది కూడ.

## లక్ష్మణసూరి పరిచయం - యుద్ధకాండ రచన

ఈ కవి కాలాన్ని నిర్ణయించటానికి ఆధారాలేమీ లేవు. ఈ కవి తండ్రి గంగాధరుడు. తాత దత్తాత్రేయుడు. వీరిద్దరు కూడ చంపూ కావ్యకర్తలే. గంగాధరుడు "మద్రకన్యా పరిణయ" కావ్యాన్ని వ్రాసాడు. "పరిణయ" కావ్యపరంపర క్రీ.శ. 16వ॥ లో ఆరంభమైంది. కాబట్టి గంగాధరుని మరియు లక్ష్మణసూరి కాలాన్ని స్థూలంగా క్రీ.శ. 16వ శ॥ మని నిర్ణయించ వచ్చును. లక్షణసూరి తాను శనగర గ్రామ నివాసినని కావ్యంలో చెప్పుకొన్నాడు. శనగర గ్రామం ఒకటి ఆంధ్రప్రదేశ్‌లో కరీంనగర్ జిల్లా పెద్దపల్లి సమీపంలో వున్నది. అదే అతని నివాస స్థలం కావచ్చును. మాళవ దేశంలోని ధారానగర రాజు వ్రాసిన రామాయణాన్ని ఆంధ్రదేశంలోని తెలంగాణా కవి పూర్తిచేయటం ఒక విచిత్ర సంయోగంలాగ కన్పిస్తున్నది. భోజుని రామాయణం ఆంధ్రదేశంలో బాగా జనాదరణను పొందింది. ప్రతి సంస్కృత విద్యార్థి దాన్ని తప్పక చదివేవాడు. అందుకని ఒక తెలుగు కవి దాన్ని పూరించటంలో ఆశ్చర్యమేమీ లేదు. అదీగాక కేవలం రామాయణంలో యుద్ధకాండాన్ని ఇంకా కొందరు కవులు రచించి వున్నారు. రఘునాథ రాయల ఆస్థాన కవి రాజచూడామణి మరియు ఘనశ్యామకవి, ముక్తీస్వదీక్షితుడు, గరళపురి శాస్త్రి మొ॥న కవులు యుద్ధకాండాన్ని వ్రాసి చంపూ రామాయణాన్ని పూరించారు. కాని అందరిలో లక్ష్మణసూరి యుద్ధకాండమే ఆదరణను సంపాదించు కొన్నది. కాదంబరి కావ్యాన్ని బాణుని శైలిని ముమ్మూర్తులా అనుకరిస్తు అతని కొడుకు పూరించినట్లుగానే లక్ష్మణసూరి భోజుని కవిత్వాన్ని అనుకరిస్తు చంపూ రామయణాన్ని పూరించాడు. యుద్ధకాండం వీరరస ప్రధానమైంది. లక్ష్మణకవి రసానుకూలమైన శబ్దవిన్యాసాన్ని ప్రదర్శించాడు.

లక్ష్మణసూరి మరొక రచన "భారతచంపూ తిలకం". మహాభారతంలో కౌరవ పాండవులకు సంబంధించిన ప్రధాన సంఘటనలను తీసుకొని కవి ఈ కావ్యాన్ని రచించాడు. పాండవుల జననం మొదలుకొని యుధిష్ఠరుని పట్టాభిషేకం వరకు మాత్రమే కథ చెప్పబడింది.

యుద్ధకాండంలోని కవితానైపుణి దీనిలో లేదు. కాబట్టి ఇది లక్ష్మణసూరి మొదటి రచన కావచ్చును. కాని ఎన్నో ఇతర చంపూ కావ్యాలకన్న ఇది శ్రేష్ఠమైందనే చెప్పాలి.

## ఆశాధరసూరి

ఈ కవి క్రీ.శ. 1243 ప్రాంతంవాడు. దిగంబర జైనకవి. జైనతీర్థంకరులలో మొదటివాడైన ఋషభదేవుని కుమారుడు చక్రవర్తి భరతుని జీవితచరిత్రను ఈ కవి "భరతేశ్వరాభ్యుదయ చంపువు" గా రచించాడు. క్రీ.శ. 8వ శ॥ కి పూర్వమే జినసేనుడు ఋషభదేవుని చరిత్రను ఆదిపురాణంగా వ్రాసాడు. దీనిలో భరతుని జీవిత వృత్తం వున్నది. అంతేగాక జైన హరివంశ పురాణంలోను భరతుని జీవితవృత్తాంతం వున్నది. వీటిని ఆధారంగా చేసుకొనే ఈ కవి ఈ చంపూ కావ్యాన్ని రచించివుంటాడు. ఈ కవి శిష్యుడు అర్హదాసు "పురుదేవ చంపువు"ను రచించాడు. పురుదేవుని చరిత్ర అహింసావ్రత ప్రభావాన్ని బోధించేది. ఈ కవి శైలి కోమలమైనది.

## దివాకర కవి

దివాకరుడు క్రీ.శ. 1299 ప్రాంతంవాడు. ఈకవి వాల్మీకి రామాయణాన్ని "అమోఘ రాఘవ" మనే పేరుతో చంపూకావ్యంగా రచించాడు. వాల్మీకితోపాటు కవి కాళిదాసును కూడ స్తుతించాడు.

## అహోబల సూరి

అహోబలుడు యతిరాజవిజయ చంపువును రచించాడు. ఈ కవి విరూపాక్షవసంతోత్సవ చంపువును కూడ రచించాడు. అహోబలుడు విజయనగర సంస్థాపకుడు విద్యారణ్య గురువులకు సమకాలికుడని విమర్శకుల అభిప్రాయం. అప్పుడు ఈ కవి కాలాన్ని క్రీ.శ. 1336 ప్రాంతంగా చెప్పవచ్చును. ఈ కవి విద్యారణ్యుల సహపాఠి. వేదాంత దేశికుల ఆశీర్వచనాన్ని కూడ అర్థించాడు. అప్పుడీతడు క్రీ.శ. 14 వ శ॥ ఉత్తరార్థంలో వున్నాడని నిర్ణయించవచ్చును. ఈ కవి తలిదండ్రులు వేంకటాచార్య లక్ష్మాంబలు.

యతిరాజవిజయ చంపువులో 17 ఉల్లాసా లున్నవి. చివరి ఉల్లాసం అసంపూర్ణంగా వున్నది. విశిష్టాద్వైత సంస్థాపకుడైన యతిరాజు రామానుజాచార్యుల జీవితచరిత్ర ఈ

కావ్యంలోనిబద్ధింపబడింది. ఈ కవి శైలి సరళంగా వుంది. సమాస బహుళత లేదు. అక్కడక్కడ కవి యమకాలంకారాన్ని ప్రయోగించాడు.

విరూపాక్ష వసంతోత్సవ చంపువు విద్యారణ్యులవారి వర్ణనతో ఆరంభమైంది. ఇది నాలుగు కాండాలుగా విభక్తమైంది. మూడవ కాండంలో కొంతభాగం నష్టమైంది. నవరాత్రి సమయంలో విరూపాక్షదేవుని సమక్షంలో జరిగే వసంతోత్సవం ఈ కావ్యంలో వర్ణింపబడింది. శివరూపుడైన విరూపాక్షదేవుని రథయాత్ర, మృగయా, పంపాంబికతో వివాహం, వసంతోత్సవం వర్ణింపబడినవి. అవాంతర కథలు కూడా వున్నవి. కవి ఈ కావ్య గద్యభాగంలో బాణుని గద్యాన్ని అనుకరించాడు. చారిత్రక, సాంస్కృతిక అధ్యయన దృష్టితో ఈ కావ్యం మహత్త్వ పూర్ణమైంది.

## అమలాచార్యుడు

ఈ కవి క్రీ.శ. 14వ శ॥ వాడని విమర్శకుల అభిప్రాయం. హరివంశం, విష్ణు భాగవతాది పురాణాలల్లో వున్న రుక్మిణీ కృష్ణుల వివాహ గాథను తీసుకొని ఈ కవి రుక్మిణీ పరిణయ చంపువును వ్రాసాడు. ఈ కవి శైలి సుందరమైంది.

## కవితార్కిక సింహుడు

ఈ కవి పరవస్తు వేంకటాచార్యుల దౌహిత్రుడే కాక శిష్యుడు కూడ. ఈ కవి వేదాంత దేశికుల జీవితచరిత్రను గ్రహించి వేదాంతాచార్యవిజయ చంపువును రచించాడు. దీనిలో 6 స్తబకాలున్నవి. వేదాంత దేశికుడు అద్వైతవాది. కృష్ణ మిశ్రులతో వాదించి విజయం పొందటం దీనిలోని విషయం. ఈ కవి కాలం క్రీ.శ. 14వ శ॥ తర్వాత. కవి శైలి పదలాలిత్యంతో కూడింది. ఉపమ, ఉత్ప్రేక్ష మాలికలను రచించటంలో కవి బాణుని అనుకరించాడు.

## కవి కర్ణపూరుడు

ఈ కవి అసలు పేరు పురీదాసు లేక పరమానందదాసు. ఇతనికి చైతన్య గురువులు కవికర్ణ పూరుడన్న బిరుదాన్ని యిచ్చారట. ఈ కవి వంగదేశీయుడు. ఆనంద వృందావన చంపువును వ్రాసాడు. కృష్ణుని జననం మొదలుకొని బాల్యక్రీడలు, బాల్యలీలలు దీనిలో వర్ణింపబడినవి. ఈ కావ్యం విశాలమైంది. దీనిలో 22 స్తబకాలున్నవి. సందర్భానుకూలంగా

చంద్రోదయాది వర్ణనలు మనోహరంగా కూర్చబడినవి. కర్ణపూరుడు కవి హృదయం కలవాడు. నృత్యసంగీతాలలో అతనికి ప్రవేశమున్నది. కావ్యాలలో తత్ పరిచయాన్ని చూడవచ్చును. ఈ కావ్యంలో నాయిక రాధ. శృంగారరసం ప్రధాన రసం. నాటకంలో నాయకుడు శ్రీకృష్ణునికి కుసుమాసవుడనే సఖుని కవి విదూషకుని కల్పించాడు. కవి శైలి శృంగారానుకూలమైన వైదర్భీ రీతిలో అనుప్రాసయుక్తమై మృదు మధురంగా నడిచింది. అక్కడక్కడ కవి యమకాలంకారాలను వాడాడు. ఈ కావ్యానికి వృందావన చక్రవర్తి టీకను వ్రాసాడు.

## అభినవ కాళిదాసు

అభినవ కాళిదాసు బిరుదాంకితుడైన ఈ కవి భాగవత చంపువును వ్రాసాడు. ఈ కవి తన పేరునుగాని పరిచయాన్నిగాని కావ్యంలో ఎక్కడా ఇయ్యలేదు. ఈ కవి క్రీ.శ. 11వ శ॥ వాడని కొందరు విమర్శకులు తలంచారు. అభినవ కాళిదాసు బిరుదాంకితుడైన ఈ కవి అసలు పేరు వెల్లాల ఉమామహేశ్వరుడని, ఇతడు విజయ నగరరాజు రాజశేఖరుని ఆశ్రయంలో వున్నాడని బయటపడింది. ఇతని శిష్యుడు కవి కుంజరుడు తన "రాజశేఖరచరిత్ర' 'లో పైవిషయాన్ని తెలియజేసాడు. రాజశేఖరుడు విజయనగర రాజు ప్రౌఢ దేవరాయల (క్రీ.శ. 1446-1455) కొడుకు. కాబట్టి అభినవ కాళిదాసు కాలం క్రీ.శ. 15వ శ॥ మని తెలుస్తున్నది.

భాగవత చంపువు కావ్యేతివృత్తం భాగవత పురాణంలోని దశమ స్కంధంపై ఆధారపడింది. దీనిలో రాధాకృష్ణుల ప్రేమవృత్తాంత మున్నది. రాధను కవి స్వకీయ నాయికగా చిత్రించి రాధా కృష్ణుల వివాహాన్ని కూడ జరిపించాడు. రాధాకృష్ణుల ప్రణయ లీలలు దీనిలో మధురంగా వర్ణింపబడినవి. జయదేవుని శృంగార వర్ణనలను అనుకరిస్తు ఈ కవి రాధాకృష్ణుల ప్రణయాన్ని వర్ణించాడు. ఒక విధంగా దీనిలో భక్తి భావనకన్న లౌకికమైన శృంగారమే అధికంగా కన్పిస్తున్నది.

భాగవత చంపూకారుడు శ్లేషను ఎక్కువ వాడాడు. బాణుని శైలిలో వలెనే గద్యంలో సమాస బహుళత, శ్లేష, వక్రోక్తి, పరిసంఖ్యాద్యలంకారాదుల ప్రయోగం కన్పిస్తున్నది. ఈ కవిపద్యభాగం అనుప్రాస యమకాలతో కూడి మధురంగా వున్నది. ఈ చంపూకావ్యానికి అక్కయసూరి వ్యాఖ్యానం వ్రాసాడు. అభినవ కాళిదాసు "భారత చంపువు"ను కూడా వ్రాసాడు. దీనికి "అభినవ భారతచంపువు" అని పేరు. ఇది ముద్రితం కాలేదు.

# అనంతభట్టు

## అనంతభట్టు పరిచయం

అనంతభట్టు చంపూ భారతం చాలా ప్రసిద్ధమైంది. ఈ కవిది క్రీ.శ. 1602 ప్రాంతమని విమర్శకులు తలంచారు. కాని భాగవతచంపువు వ్రాసిన అభినవ కాళిదాసుకు ఈ కవికి స్పర్థ వుండేదని లోకంలో ప్రచారంలో వుండటంచేత ఈ కవి కూడ క్రీ.శ. 15వ శ॥ వాడని చెప్పటం సమంజసం. అభినవ కాళిదాసుతోటి స్పర్ధతో అనంతభట్టు తాను భాగవత, భారత చంపువులను వ్రాసాడు. కాని అభినవ కాళిదాసు భారతచంపువు, అనంతభట్టు భాగవతచంపువులు అనుపలబ్దాలు. అనంతభట్టు భారత చంపువులో మహాభారత కథను సంక్షేపంగా చెప్పాడు. ఇది చాల లోకాదరణను పొందిన కావ్యం. దీనిలో 1041 పద్యాలు, దాదాపు 200 గద్యాలున్నవి. 12 స్తబకాలుగా కావ్యం విభజింపబడింది. ఇది చంపూ కావ్యాలల్లో బృహాద్గ్రంథం.

## అనంతభట్టు కవిత్వం

అనంతభట్టు మహాభారత కథలో ప్రధాన ఘట్టాలను వేటిని వదలివేయకుండా రచించాడు. ఉపాఖ్యానాలను కవి వదిలివేసాడు. కథారంభం పాండురాజు జననం, అతని వేట, కిందమముని శాపంతో జరిగింది. ఈ కావ్యం వీరరస ప్రధానమైంది. కావ్యారంభమే పాండురాజు వేటతో ఆరంభమైంది. యుద్ధవర్ణనలను కవి సహజంగా వర్ణించి వీరరసాన్ని పోషించటంలో సఫలుడైనాడు. సందర్భానుకూలంగా కవి ప్రకృతి వర్ణనలను, ఋతువర్ణనలను అతిరమ్యంగా చేసాడు. అనుప్రాస భరితమైన ఈ కవిశైలి పదలాలిత్యానికి ప్రసిద్ధి చెందింది-

కింశుకస్య వదనే రుచిరత్వం కింశుకస్య హృదయేఽపి వశిత్వమ్
కింశుకస్య కుసుమేషునదంతీ శంసతిస్మ మధుపాలిరితీవ.

అనంతభట్టు కవిత్వంలో అనుప్రాసే కాక యమక ఉత్ప్రేక్షాదులను కూడా చూడవచ్చును. ఈ కవి గద్యం కుంటుపడకుండ ధారాళమైన నడకతో సాగుతుంది. దీర్ఘసమాసాలు చాలా వున్నవి. కాని సంయుక్తాక్షరాలు, పరుషాక్షరాలు లేక అనుప్రాసతో గద్యం లలితంగా ధారాళంగా ముందుకు సాగుతుంది. అనంతభట్టు యుద్ధవర్ణనలను

శక్తిమంతమైన భాషలో రచించి రసస్ఫోరకతను సాధించాడు. సందర్భానుకూలమైన యుద్ధవర్ణనలను చేసాడు. ఉదా॥కు భీమ కీచకులు రాత్రిపూట నిశ్శబ్ద వాతావరణంలో చాటుగా యుద్ధం చేస్తారు. దాన్ని కవి ఇట్లా వర్ణించాడు-

అక్ష్వేలితారావమ వీరవాదమ్ అవీక్షకఖ్లాఘనచాటు గుంఫమ్
అనుచ్చ నిఃశ్వాస మహుంక్రియాకమ్ అభూతపూర్వం తభూన్నియుద్ధమ్
శిలీముఖైశ్చిత్తజ చాపజుష్టైర్దత్తాని రంధ్రాణి దధన్నిజాంగే
సమీరజాతేన విధూనితోపి సకీచకోనైవ చుకూజ కించిత్.

ఇక సింహనాదాలతో విజృంభించిన కురుక్షేత్ర యుద్ధ వర్ణన-

ససింహనాదే సరితః కుమారే చాపం సమాకృష్య శరైర్విముక్తైః
పరాన్వరీతుం ప్రథమం ప్రవృత్తే వరాన్వరీతుం వవల్శేప్సరోభిః

తెలుగు పద్యాలల్లోవుండే యతిప్రాసల క్రమాన్ని అనంతభట్టు శ్లోకాలల్లో పాటించాడు. ఈ కవి కొన్ని తెలుగు నానుడులను సంస్కృతంలోకి అనువదించి ప్రయోగించాడు-

ఉదితోzపి విరాటభూపతే రుదదాద్భద్ర కథం త్వమీదృశః"

అర్జునుడు ఉత్తరునితో అంటున్నాడు- "నీవు విరాటరాజు వంటివాని కడుపులో ఎట్లా పుట్టావు?" "కడుపులో పుట్టడం" అన్న తెలుగు నుడికారాన్ని కవి సంస్కృతీకరించి ప్రయోగించాడు. అదేవిధంగా మంగళసూత్ర ప్రసక్తి కూడ కవి తెలుగువాడు అని పట్టిస్తున్నది.

భారత చంపువుకు కురవిరామకవీంద్ర, మల్లాది లక్ష్మణస్వామి, నారాయణస్వామి, కుమార తాతాచార్య, నరసింహాచార్య ఇంకా అజ్ఞాతకవుల వ్యాఖ్యానాలు లభిస్తున్నవి.

## జీవరాజు

చైతన్య మహాప్రభువుకు ఈ కవి సమకాలికుడు. భాగవతం ఆధారంగా శ్రీకృష్ణుని చరిత్రను గోపాలచంపువుగా రచించాడు. ఈ కవి మహారాష్ట్ర దేశీయుడు. స్వయంగా కవి కావ్యానికి టీకను కూడ వ్రాసుకొన్నాడు.

## వల్లీ సహాయుడు

క్రీ.శ. 1539 ప్రాంతం వాడు. శంకరాచార్యుల దిగ్విజయాన్ని కవి ఆచార్యదిగ్విజయ చంపువుగా వ్రాసాడు. ఇది 7వ కల్లోలాలతో అసంపూర్ణంగా నిలిచిపోయింది. కవిత్వంలో అనుప్రాస యమకాలు విరివిగా ఉన్నవి. ఈ కవి రెండవ కావ్యం కాకుత్థ్సవిజయ చంపువు. దీనిలో రాముని చరిత్ర నిబద్ధమైంది. దీనిలో 8 ఉల్లాసాలున్నవి. వాల్మీకి రామాయణాన్ని అనుసరిస్తు కవి ఈ కావ్యాన్ని వ్రాసాడు.

## శేషకృష్ణుడు

ఈ కవి క్రీ.శ. 16వ శ॥కి చెందినవాడు. హరివంశ, విష్ణు, పద్మపురాణాలల్లో ఉన్న పారిజాత హరణ కథను తీసుకొని శేషకృష్ణుడు "పారిజాతహరణ చంపువు"ను వ్రాసాడు. కాశీరాజు నరోత్తముని ఆదేశంతో కవి దీన్ని రచించాడు. నారదుడు ఇంద్రలోకంనుంచి పారిజాత పుష్పాన్ని తెచ్చి ద్వారకలో కృష్ణుని కిస్తాడు. ప్రక్కనే వున్న రుక్మిణికి కృష్ణుడు ఆ పుష్పాన్ని ఇస్తాడు. సత్యభామకు ఈ విషయం తెలిసి ఈర్ష్యతో కోపకషాయిత అవుతుంది. కృష్ణుడు ఆమెను అనునయించి పారిజాత వృక్షాన్నే తెచ్చియిస్తానంటాడు. యాదవులతో దండెత్తిపోయి కృష్ణుడు పారిజాత వృక్షాన్ని హరించి తెస్తాడు. ఈ కథను కవి శృంగార ప్రధానంగా రచించాడు. యుద్ధ వర్ణనలో వీరరసం పోషింపబడింది. రుక్మిణీ సత్యభామల ఈర్ష్యలో కవి సవతుల ఈర్ష్యామాత్సర్యాలను చక్కగా ప్రతిబింబింప జేసాడు. మానిని సత్యభామను కవి చక్కగా చిత్రించాడు. శేషకృష్ణుని శైలి ప్రసన్నంగా వున్నది. గద్యభాగంలో కవి బాణుని గద్యాన్ని అనుకరించాడు. బాణుని వలెనే ఈ కవి వస్తువర్ణనను అనేక విధాలుగా తనవి తీరేంతవరకు చేస్తాడు. సరళమైన శ్లేషను కవి ప్రయోగించాడు. బాణుని వలెనే ఈకవి దీర్ఘ వాక్యాలను ప్రయోగించాడు. శేషకృష్ణుడు జగన్నాథునికి గురువైన వీరేశ్వరుని తండ్రి.

## రామానుజదాసు

ఈ కవి వైష్ణవాచార్యుడైన నాథముని చరిత్రను నాథమునివిజయ చంపువుగా రచించాడు. ఈ కవి కాలం క్రీ.శ. 16వ శ॥ ఉత్తరార్ధం. ఈ కావ్యంలో కవిత్వంకన్న విషయ ప్రస్తుతీకరణం, సత్యకథనం ఎక్కువగా వున్నది.

## రామానుజాచార్యుడు

ఈ కవి యతిరాజు రామానుజాచార్యుని భ్రాతృవ్యుడు, శిష్యుడు అయిన దాశరథి వంశంలోని వాడనని చెప్పుకొన్నాడు. రామానుజులవారి చరిత్రను ఈ కవి శ్రీ రామానుజచంపువుగా వ్రాసాడు. దీనిలో 10 స్తబకా లున్నవి. ఈ కవి క్రీ.శ. 16వ శః వాడు. కవితాదృష్టితో ఈ కావ్యం ఉత్కృష్టమైంది. ఈ కవి ఎక్కడా వైష్ణవసిద్ధాంతాలను చెప్పటానికి పూనుకోలేదు. దానిచేత కావ్యం నీరసం కాక వర్ణనల మాధుర్యంతో నిండివున్నది.

## రామానుజ దేశికుడు

ఈ కవి రామానుజునికి పెదతండ్రి. ఇతడు కళ్యాణవల్లీ కళ్యాణ మనే చంపూకావ్యాన్ని వ్రాసాడు. లింగపురాణంలోని గౌరీకళ్యాణ వృత్తాంతం ఈ కావ్య కథకు మూలం.

## భాగవతచంపువు

భాగవతచంపువు హస్తలిఖితప్రతులు తంజావూరు, మద్రాసు లైబ్రరీల్లో దొరికినవి. దీనిలో అచ్యుతదేవరాయల వర్ణన వున్నది. ఈ అచ్యుతదేవరాయలు విజయనగరరాజు శ్రీకృష్ణదేవరాయల సవతి తమ్ముడు. శ్రీకృష్ణదేవరాయల తర్వాత కొంతకాలం విజయనగరాన్ని ఏలాడు (క్రీ.శ. 1529-1546). అచ్యుత రాయల భార్య తిరుమలాంబ, అచ్యుతరాయ వరదాంబికల వివాహాన్ని వర్ణిస్తూ "వరదాంబికాపరిణయ" చంపువును వ్రాసింది. అచ్యుతరాయల చరిత్రను రాజనాథకవి "అచ్యుత రాయాభ్యుదయ"మనే కావ్యాన్ని వ్రాసాడు. (ఈ రెండు కావ్యాలను గురించి చారిత్రక కావ్యప్రకరణంలో చూడవచ్చును.) ఆ రాజనాథ కవియే భాగవతచంపువు కర్త. తంజావూరులోని ఒక ప్రతిలో తత్కర్త రామభద్రుడని వుండటంచేత కావచ్చును, డా. ఛవినాథ త్రిపాఠి ఈ కవి రామాభ్యుదయమనే తెలుగు కావ్యాన్ని వ్రాసిన తెలుగుకవి అయ్యలరాజు రామభద్రుడని తలంచాడు. అయ్యలరాజు శ్రీకృష్ణదేవరాయల ఆస్థానాన్ని అలంకరించిన అష్టదిగ్గజకవుల్లో ఒకడు. ఇతడు తెలుగుకవే కాని సంస్కృత రచనలు చేయలేదు. పెక్కు ప్రతుల్లో వున్నట్లుగా రాజనాథకవే భాగవత చంపువు కర్త. రాజనాథకవి ప్రసిద్ధ డిండిమ వంశానికి చెందినవాడు. ఈ రాజనాథుడు డిండిమ వంశంలోని రెండవ అరుణగిరినాథుని కొడుకు. డిండమవంశంలో ఇతడు రెండవ రాజనాథుడు. భాగవతచంపువును ఈ కవి అచ్యుతరాయల కోరికమీద వ్రాసాడట. భాగవతంలోని కంసవధ వరకు శ్రీకృష్ణుని చరిత్ర ఈ కావ్యంలో చెప్పబడింది.

## సమరపుంగవ దీక్షితుడు

ఈ కవి తీర్థయాత్రా ప్రబంధ చంపువును వ్రాసాడు. "కనకార పాఠ" అని ఇతనికి బిరుదం కలదు. ఈ కవి కాలం క్రీ.శ. 16వ శతాబ్దం ఉత్తరార్ధ భాగం. ఈ కవి కావ్యం 9 ఆశ్వాసాలుగా విభజింపబడింది. ఈ చంపూకావ్యంలో దక్షిణ ఉత్తర భారతంలో అనేక తీర్థయాత్రా స్థలాలు వర్ణింపబడినవి. అక్కడక్కడ కవి మహాకావ్యోచిత వర్ణనలను చేసాడు. దీనిలో రమ్యమైన ప్రకృతి వర్ణనలున్నవి. సందర్భానుకూలంగా శృంగారభక్తి రసాలు వ్యక్తమైనవి. ఈ కావ్యం చంపూ కావ్యాలల్లో లోకాదరణ పొందిన వాటిల్లో ఒకటి. సమర పుంగవ దీక్షితుని మొరొక కావ్యం ఆనందకంద చంపువు. దీనిలో 8 ఆశ్వాసాలున్నవి. దీనిలో శైవ భక్తుల కథలున్నవి.

## దైవజ్ఞసూరి

"సంగీతాగమ కావ్యనాటక పటః సూర్యాభిధానః కవిః" - అని తనను గురించి దైవజ్ఞసూరి కావ్యం చివర చెప్పుకొన్నాడు. ఈ కవి నృసింహ చంపువును రచించాడు. దీనిలో 5 ఆశ్వాసాలున్నవి. వీరరస ప్రధానమైంది. భాగవతంలోని నృసింహావతారకథను గ్రహించి కవి ఈ కావ్యాన్ని రచించాడు. ఈ కావ్యంలో క్రమంగా భయానక, రౌద్ర, వీర, బీభత్స, అద్భుత, హాస్య, కరుణ, శృంగార, శాంత రసాలను పోషించానని కవియే స్వయంగా చెప్పుకొన్నాడు. రసపోషణలో కవి గద్యపద్యాలను సమానంగా ఉపయోగించుకొన్నాడు.

దైవజ్ఞసూరి గోదావరి తీరస్థ వార్ధానివాసి. ఈ కవి లీలావతి, బీజగణితాలకు టీకలను కూడ వ్రాసాడు. లీలావతి టీకను ఈ కవి క్రీ.శ. 1541 లో రచించినట్లు చెప్పుకొన్నదాన్ని బట్టి ఈ కవి కాలాన్ని క్రీ.శ. 16వ శతాబ్దంగా నిర్ణయించవచ్చును.

## శతావధాన భట్టాచార్యులు

ఈ కవి వంగదేశీయుడు. విద్వన్మోద తరంగిణి చంపువును వ్రాసాడు. ఇది శాస్త్రకావ్యం. ఈ కవి కాలం క్రీ.శ. 1521 అని తెలుస్తున్నది. ఈ కవి కావ్యంలో 8 తరంగాలున్నవి. దీనిలో వైష్ణవ, శైవ, శాక్త, అద్వైత, వైశేషిక, న్యాయ, మీమాంస, వేదాంత, సాంఖ్య, యోగ, పౌరాణిక, నాస్తికాది మతాల ప్రతిపాదన, ఖండనలున్నవి. చివర సకల మతాల సమన్వయవాద ప్రతిపాదనకూడా చేయబడింది.

ఈ కవి మరొక కావ్యం మాధవ చంపువు. ఇది శృంగార రస ప్రధానమైంది. మాధవ, కళావతుల ప్రణయ వృత్తాంతం దీనిలో వున్నది. కళావతి విరహంతో హంసను దూతగా ద్వారకకు పంపినట్లుగా కవి వర్ణించాడు. దీనిలో ఋతు విరహాది వర్ణనలు రమ్యంగా వున్నవి.

## పద్మనాభమిశ్రుడు

ఈ కవి పండితుడు, కావ్య మర్మజ్ఞుడు. రేవా రాజ్యాన్నేలిన రామచంద్రుని కొడుకు వీరభద్రుని ఆదేశం మీద చంపూ కావ్యాన్ని వ్రాసి కవి దానికి వీరభద్ర చంపువు అని నామకరణం చేసాడు. వీరభద్రుడు కూడ స్వయంగా కందర్ప చూడామణి అనే చంపూ కావ్యాన్ని రచించాడు. ఈ కవి కాలం క్రీ.శ. 1577 ప్రాంతం. వీరభద్ర చంపువులో ఆరు ఆశ్వాసాలున్నవి. కల్పితేతివృత్తంతో పాటు కవి సమకాలిక చారిత్రక చరిత్రను కూడ చెప్పాడు. శైలి సరళసుందరమైంది. పదలాలిత్యంతో కూడింది.

## నారాయణభట్టు

ఈ కవి క్రీ.శ. 1560-1666 ప్రాంతంవాడు. కేరళ దేశీయుడు. అనేక చంపూకావ్యాలను రచించాడు. మహాభారతంలోని ద్రౌపది స్వయంవర కథను తీసుకొని నారాయణభట్టు పాంచాలీ స్వయంవర చంపువును వ్రాసాడు. శైలి సరళ సుందరం. దీర్ఘ సమాసాలుగాని శ్లేషలుగాని లేవు. అగ్ని స్వాహాల ప్రణయ గాథను కవి స్వాహాసుధాకర చంపువుగా వ్రాసాడు. భాగవతంలోని మత్స్యావతార కథను తీసుకొని ఈ కవి మత్స్యావతార చంపువును కూడా వ్రాసాడు. ఇది 67 పద్యాలు 12 గద్యాలు గల లఘుకావ్యం. మహాభారత సభాపర్వంలోని ధర్మరాజు చేసిన రాజసూయయాగ వృత్తాంతాన్ని కవి రాజసూయ ప్రబంధ చంపువుగా వ్రాసాడు. ఇతని మరొక కావ్యం కోటివిరహ చంపువు. ఇది ఒక ప్రణయ కావ్యం. నాయికా నాయకుల ప్రేమ, విరహాలు రమ్యంగా వర్ణింపబడినవి. నృగమోక్ష చంపువు నారాయణభట్టు మరొక రచన. ఇది భాగవత దశమ స్కంధంలోని నృగోపాఖ్యానం మీద ఆధారపడింది. ఇంకా ఈ కవి సుభద్రాహరణం, పార్వతీ స్వయంవరం, నలాయణీ చరిత్ర, కౌంతేయాష్టకం, దూతవాక్యం, నిరనునాసిక దక్షయాగం మొ॥న చంపూకావ్యాలను వ్రాసినట్లు మత్స్యావతార చంపువు భూమికనుబట్టి తెలుస్తున్నది.

## శ్రీకృష్ణ కవి

శ్రీకృష్ణకవి మందారమరంద చంపువు కర్త. ఈ కవి కాలం క్రీ.శ. 16 శ॥ ఉత్తరార్థం

నుంచి 17వ శ॥ పూర్వార్థం వరకు. ఈ కృతి అసలు ఒక లక్షణగ్రంథం కవి దీన్నొక కావ్యంగా రూపొందించాడు. అంటె ఇది ఒక శాస్త్ర కావ్యం.

## కాళహస్తి కవి

కాళహస్తి కవి అప్పయ దీక్షితుల (క్రీ.శ. 1555-1626) శిష్యుడు. ఈ కవి గురువుకన్న 20, 25 సంవత్సరాలు చిన్నవాడను కుంటె ఇతని జనన కాలం దాదాపు క్రీ.శ. 1575-80 ప్రాంతమని చెప్పవచ్చును. కాళహస్తి కవి రచనా వ్యాసంగకాలం క్రీ.శ. 17వ శ॥ పూర్వార్ధమని చెప్పాలి. ఈ కవి కావ్యం వసుచరిత్ర అనే చంపువు. కవి ఆశ్వాసాంత గద్యంలో చెప్పుకొన్న దాన్ని బట్టి ఇతడు కంచి కామాక్షి భక్తుడని తెలుస్తున్నది. కావ్యం చివర అనుప్రాస మయమైన శైలిలో కామాక్షి దేవిని స్తుతించాడు. తెలుగు సాహిత్యంలో ప్రౌఢ ప్రబంధమైన రామరాజ భూషణుని వసుచరిత్రను ఈ కవి సంస్కృతీకరించాడు. సంస్కృత భాషనుంచి దేశ భాషల్లోకి అనువాదం చేయటం సర్వసామాన్యం కాని ఈ కవి దేశభాషలోని మహాకావ్యాన్ని సంస్కృతంలోకి అనువదించాడు. ఇది ఒక అపూర్వమైన విషయం. తెలుగు ప్రబంధమైన వసుచరిత్ర కథా దృష్టితోను, శైలిదృష్టితోను ఒక మౌలిక రచన. మూల భావచమత్కారాలను సంస్కృతజ్ఞులకు పరిచయం చేయుదలచుకొని దీన్ని అనువదించివుంటాడు. ఇట్లాంటి గౌరవం దేశ భాషాకావ్యాలల్లో తెలుగులోని వసుచరిత్రకే దక్కిందని చెప్పాలి. రామరాజ భూషణుడు క్రీ.శ. 16వ శ॥ ఉత్తరార్ధంవాడు. తెలుగులో రచింపబడిన కొద్దికాలానికే ఇది సంస్కృతీకరించబడింది. కాని కాళహస్తి కవి ఎక్కడా మూల గ్రంథాన్ని గూర్చికాని రామరాజ భూషణుని గూర్చిగాని ప్రసంగించక పోవటం ఆశ్చర్యకరంగా వుంటుంది. తెలుగు కావ్యంలోని పీఠికలోని దేవతాస్తుతి పద్యాలను సంస్కృతీకరిస్తు తెలుగు వాఙ్మయ ప్రపంచాన్ని గురించి చెప్పిన శ్లేష చమత్కారయుక్త పద్యాన్ని కూడా కవి సంస్కృతీకరించాడు. మూల కృతిభర్త వంశాదివర్ణనలను విడిచిపెట్టాడు. మూలంలో మాదిరిగానే ఈ కావ్యం చంపూ పద్ధతిలో ఆరు ఆశ్వాసాలుగా వ్రాయబడింది. మూలంలో వున్న శ్లేష, ధ్వని, గుణీభూతవ్యంగ్య, శబ్దాలంకార,అర్థాలంకారాలను కవి అనువాదంలోను తీసుకొనివచ్చాడు. చాలా మట్టుకు మూలాన్ని వున్నదున్నట్లుగా అనుసరించినా అక్కడక్కడ కవి కొంత స్వాతంత్ర్యాన్ని కూడా చూపాడు. కాళహస్తికవి సంస్కృత కవి అయినా తెలుగు వాడు. కాబట్టి తెలుగు పద్యాలల్లో వుండే యతిప్రాసల సౌందర్యమాధుర్యాలను సంస్కృత శ్లోకాలల్లోను ప్రదర్శించాడు. తెలుగులో పద్యాలు పెద్దవి. విషయ విస్తరణతో కూడినవి.

అట్లా అయినా ఈ కవి తెలుగు వృత్తాలల్లోని వర్ణ్యవిషయాన్ని సంస్కృతశ్లోకంలో కూర్చి చక్కగా చెప్పాడు. కావ్యం అనువాదమైనా నడక కుంటుపడకుండా వున్నది. చాలా మట్టుకు ఒక్క పద్యంలోని భావాన్ని ఒక్కశ్లోకంలోనే చెప్పాడు. మూలంలోని గద్యాన్ని గద్యంగానే అనువదించాడు. తెలుగులోని సీస పద్యపు నాలుగు పాదాలను ఒక్క శ్లోకంగాను, కింది గీత పద్యాన్ని మరొక శ్లోకంగాను అనువదించాడు. ఒక్కొక్కసారి సీసపద్యాన్ని మూడు శ్లోకాలుగాను అనువదించాడు. మూలంలోని ప్రాస సౌందర్యం, అనుప్రాస శ్లేషార్థాలు చెడిపోకుండ కాళహస్తికవి ఎట్లా అనువదించాడో ఈ కింద ఉదాహరణలో చూడవచ్చును-

వేణి చలింపఁగంపిత నవీన మృణాళభుజాగ్ర కంకణ
శ్రేణి నటింప లోనశఫరీ నిబరీ సకటాక్షకాంతి వి
న్నాణము చూప హంసకగణ క్వనంబులు మీర సైకత
శ్రోణి వివర్తితాబ్జ ముఖశోభితయై కడుసంభ్రమించినన్.

వేణీ చచాల బిసవద్భుజ కంకణానాం
శ్రేణీ ననర్త విబభుశ్శఫరీ కటాక్షాః
నాణీయసీ పరిరరాణ చ హంసకాలీ
శ్రోణీ లసత్పులిన సాచితమబ్జ వక్త్రమ్.

## చిదంబరకవి

చిదంబరి కవి కాలం క్రీ.శ. 1586-1614 ప్రాంతం. ఈ కవి భాగవత చంపువును వ్రాసాడు. "రాఘవ యాదవ పాండవీయ"మన్న త్ర్యర్థి కావ్యాన్ని కూడ ఈ కవి వ్రాసాడు. "శబ్దార్థ చింతామణి"లో భాగవత రామాయణ కథలను జోడించాడు. ఈ కవి విజయనగర రాజా వేంకటరాయల ఆస్థానకవి. భాగవత చంపువు మూడు స్తబకాలుగా విభక్తమైంది. ఈ కవి శైలి సరళమైంది. అనుప్రాసతో మధురంగా వున్నది. చిదంబరకవి భాగవత చంపువునే కాక పంచకల్యాణ చంపువును కూడ వ్రాసాడు.

## మిత్రమిశ్రుడు

ఈ కవి ఆనంద చంపువును రచించాడు. ఈ కవి ఓర్ఛారాజ్యాన్నేలిన వీరసింహుని ఆస్థానకవి. క్రీ.శ. 17వ శ॥ ఉత్తరార్ధంవాడు. ఈ కావ్యంలో 8 ఉల్లాసాలున్నవి. భాగవత దశమస్కంధం నుంచి కవి తన ఇతివృత్తాన్ని తీసుకొన్నాడు. కావ్యం ఓజోగుణ ప్రధానమైంది.

## కేశవభట్టు

ఈ కవి నృసింహ చంపువును వ్రాసాడు. నృసింహ చంపువుకే ప్రహ్లాద చరిత్ర అని పేరు. ఈ కవి ఆంధ్రదేశంలోని గోదావరి జిల్లాకు చెందినవాడు. ఈ కవి కాలం క్రీ.శ. 1684 ప్రాంతం. ఈ కావ్యంలో ఆరు స్తబకాలున్నవి. దీనిలో నరసింహావతార కథ వున్నది.

## వేంకటాధ్వరి

వేంకటాధ్వరి నీలకంఠ దీక్షితుని సహపాఠి. నీలకంఠ దీక్షితుడు అప్పయ్య దీక్షితుని సహోదరుని పౌత్రుడు. కాబట్టి ఇతని కాలాన్ని క్రీ.శ. 1637 ప్రాంతమని నిర్ణయించవచ్చును. ఈ కవి రామానుజుని విశిష్టాద్వైతానుయాయి. ఇతడు వడగలై సంప్రదాయానికి చెందినవాడు. వేంకటాధ్వరి నాలుగు చంపూ కావ్యాలను రచించాడు. వరదాభ్యుదయ చంపువులో లక్ష్మీనారాయణుల వివాహాన్ని వర్ణించాడు. ఉత్తర చంపువులో రామాయణ ఉత్తరకాండ కథను గ్రహించాడు. భోజుని రామాయణాన్ని ఈ కావ్యం పూర్తి చేస్తున్నది. భోజుని రామాయణంలో యుద్ధకాండాన్ని లక్ష్మణసూరి వ్రాసి పూరించగా వేంకటాధ్వరి ఉత్తరకాండాన్ని వ్రాసి పూర్తిచేసాడు. భోజుడు, లక్ష్మణసూరి కవులు వాల్మీకిని అనుసరిస్తు రామాయణాన్ని రచించగా వేంకటాధ్వరి స్వతంత్ర రచనగా తీర్చిదిద్దాడు. గద్యపద్యాలకు కవి సమప్రాధాన్యాన్నిచ్చి రచించాడు. వేంకటాధ్వరి మరొక కావ్యం శ్రీనివాస చంపువు. దీనిలో వేంకటేశ్వరుని ప్రశస్తి వున్నది. ఈ కవి కావ్యాలల్లో ప్రసిద్ధమైంది విశ్వగుణాదర్శ చంపువు. కృశాను, విశ్వావసులనే గంధర్వులు విశ్వభ్రమణానికి బయలుదేరుతారు. వారి సంవాదాలు ఈ కావ్యంలో వున్నవి. సామాజిక దురాచారాలను, తీర్థ క్షేత్ర మాహాత్మ్యాలను కవి వర్ణించాడు. శైలి అనుప్రాస మయంగా ధారాళమైన నడకతో నడిచింది. చక్కని ప్రకృతి వర్ణనలు కూడ వున్నవి.

## నీలకంఠదీక్షితుడు

ఈ కవి అప్పయ్య దీక్షితుని సహోదరుని పౌత్రుడు. క్రీ.శ. 17వ శ॥ పూర్వార్ధంవాడు. ఈ కవి నీలకంఠవిజయ చంపువును వ్రాసాడు. దీనిలో ఐదు ఆశ్వాసా లున్నవి. దేవతలు, రాక్షసులు సముద్రమథనం చేసే వృత్తాంతం, శివుడు హాలాహలపానంచేసి లోకాలను కాపాడే వృత్తాంతం ఈ కావ్యంలో వున్నవి. సందర్భానుకూలంగా కవి సమకాలిక రాజకీయ

పరిస్థితులను ప్రతిబింబింప జేసాడు. ఈ కావ్యంలో మొత్తం 279 శ్లోకాలు, దీనికంటె కొంచెం తక్కువగా గద్యభాగాలు వున్నవి. గద్యం అలంకృతశైలిలో వున్నది. నీలకంఠకవి మధురనాయకరాజు తిరుమలనాయకుని (క్రీ.శ. 1628-1659) మంత్రి.

## నృసింహాచార్యుడు

ఈ కవి త్రిపురవిజయ చంపువును వ్రాసాడు. ఈ కవి తంజావూరు రాజు భోంసలే వంశీయుడు, ఏకోజి దగ్గర మంత్రి. శివుడు త్రిపురాలను దహించే కథ ఈ కావ్యంలో వున్నది. శైలి ప్రౌఢమైంది.

## రామచంద్రదీక్షితుడు

కేరళాభరణమ్ అనే యాత్రాప్రబంధ చంపువును ఈ కవి వ్రాసాడు. కవి కాలం క్రీ.శ. 17వ శ॥ ఉత్తరార్ధం. కేరళ దేశీయుడు. చక్కని ప్రకృతి వర్ణనలు దీనిలో వున్నవి.

## రాఘవాచార్యుడు

ఈ కవి వైకుంఠవిజయ చంపువును వ్రాసాడు. అహోబలమఠాధిపతి శ్రీరంగనాథుని శిష్యుడు. క్రీ.శ. 17వ శ॥ ఉత్తరార్ధంవాడు. జయవిజయులనే పాత్రలమధ్య జరిగే సంభాషణగా కావ్యం వ్రాయబడింది. శైలి లలితంగా వున్నది. ఈ కవి ఉత్తర చంపూరామాయణాన్ని వ్రాసాడు.

## చక్రకవి

ఈ కవి ద్రౌపదీపరిణయ చంపువు కర్త. ఈ కవి నీకంఠదీక్షితుని స్మరించాడు. కాబట్టి ఇతడు క్రీ.శ. 17 వ శ॥ ఉత్తరార్ధంవాడు కావచ్చును. దాక్షిణాత్యుడు. ఈ కవి కావ్యంలో ఆరు ఆశ్వాసాలున్నవి. కథ మహాభారత ఆది పర్వంనుంచి తీసుకోబడింది.

## కూచిమంచి తిమ్మకవి

తిమ్మకవి తెలుగులోను ప్రసిద్ధమైన కవి. ఈ కవి సంస్కృతంలో "సుజనమన: కుముదచంద్రిక" అన్న కావ్యాన్ని వ్రాసాడు. ఈ కావ్యంలో సోడ్డలుని ఉదయసుందరికథలో వలె అక్కడక్కడ మాత్రమే శ్లోకాలున్నవి. తిమ్మకవి పిఠాపురం నీలాద్రిరాయుని (క్రీ.శ.

1778-1828) ఆస్థానకవి. ఈ కవి బాణుని కాదంబరిని చాలా చోట్ల అనుకరించాడు. చంపూకావ్య ప్రక్రియ అంటె ఆంధ్రదేశకవులకు చాల ఆదరణవున్నట్లు కన్పిస్తున్నది. సంస్కృత చంపూకావ్యాల్లో చాలా మట్టుకు దక్షిణ దేశంలో వ్రాయబడినవి. దక్షిణదేశంలో కూడ ఆంధ్రప్రాంతంలో చంపూకావ్యాలు ఎక్కువ సంఖ్యలో వ్రాయబడినవి.

## వేంకటాచార్య

ఈ కవి రుక్మిణీకళ్యాణ చంపువును వ్రాసాడు. ఈ కవి తెలుగులోని బమ్మెరపోతన (క్రీ.శ. 15వ శ॥) భాగవతంలోని రుక్మిణీకల్యాణ ఘట్టాన్ని అనుకరిస్తు ఈ కావ్యాన్ని రచించాడు. కాబట్టి ఈ కవి ఆంధ్రుడని చెప్పవచ్చును. కాలనిర్ణయానికి ఆధారాలు లేవు.

## ధర్మరాజు

ఈ కవి తంజావూరు నివాసి. క్రీ.శ. 17వ శ॥ ఉత్తరంవాడు. వేంకటేశ చంపువును వ్రాసాడు. తిరుపతి వేంకటేశ్వరుని వృత్తాంత వర్ణన దీనిలో వున్నది. ఈ కవి బాణుని గద్యాన్ని అనుకరించాడు.

## వేంకట కవి

ఈ కవి బాణాసురవిజయ చంపువును వ్రాసాడు. క్రీ.శ. 18వ శ॥ పూర్వార్ధం వాడు. ఈ కవి కావ్యంలో ఉషా అనిరుద్ధుల ప్రేమ కథ వున్నది.

## అన్నయార్యుడు

తత్త్వగుణాదర్శ చంపువు ఈ కవి కృతి. కవి క్రీ.శ. 18వ శ॥ పూర్వార్ధం వాడు. వేంకటాధ్వరి విశ్వగుణాదర్శచంపువును పోలిన కావ్యం ఇది.

## భానుదత్త కవి

కుమారభార్గవీయచంపువు ఈ కవి కృతి. ఇది చంపూకావ్యాలలో ఒక విశిష్టమైన కావ్యం. దీని కథ శివపురాణ సంబంధమైంది. ఇది బృహత్కావ్యం. 12 ఉచ్ఛ్వాసాలున్నవి. కథ కుమారస్వామి జననంనుంచి తారాకాసురుని విజయం వరకు వర్ణింపబడింది. రచన ప్రౌఢమైంది.

## రాజచూడామణి దీక్షితుడు

ఈ కవి తంజావూరు రాజు, సాహిత్య ప్రేమికుడు, స్వయంగా కవి అయిన రఘునాథ నాయకుని ఆస్థాన కవి. క్రీ.శ. 17వ శ॥ వాడు. రుక్మిణీ కళ్యాణ చంపువు, రామాయణ (యుద్ధకాండం) చంపువు వ్రాసాడు. ఈ యుద్ధకాండం భోజుని రామాయణానికి పూరింపుగా వ్రాసింది.

## రెండవ శరభోజి

రెండవ శరభోజి (క్రీ.శ. 1800-1832) తంజావూరు రాజు. సాహిత్య ప్రియుడు. స్వయంగా కుమార సంభవ చంపువును వ్రాసాడు. ఇతడే తంజావూరులో సరస్వతీమహల్ అన్న పుస్తకాలయాన్ని ఏర్పరచి అనేక హస్తలిఖిత ప్రతులను భద్రపరిచాడు. ఇతని చంపూకావ్యం సరళసుందరంగా వున్నది. కవిత్వం ధారాళమైంది. ఇతివృత్తంలో కాకున్నా కవి కవిత్వం భావాలల్లో చాల చోట్ల కాళిదాసును అనుకరించాడు. భోజుని చంపూశైలిని కూడ అనుసరించాడు.

## శ్రీనివాస కవి

ఈ కవి క్రీ.శ. 18వ శ॥ ఉత్తరార్ధంవాడు. తమిళనాడులో జన్మించిన రాజనీతిజ్ఞుడు, మహావ్యక్తి అయిన ఆనందరంగ పిళ్ళై చరిత్రను ఆనందరంగ చంపువుగా రచించాడు. దీనిలో శైలి సరళసుబోధకంగా వున్నది. కవి బాణుని గద్యాన్ని అనుకరించాడు.

డా॥ ఛవినాథ త్రిపాఠి ప్రకటిత, అప్రకటిత చంపూకావ్యాలు 245 వరకున్నవని చెప్పగా బాబూరామ్ త్రిపాఠి చంపూకావ్యాలు అంతకన్నా ఎక్కువ సంఖ్యలో వుంటవని అభిప్రాయపడినాడు. అంటే ఇంకా వెలుగును చూడని చంపూ కావ్య లిఖిత ప్రతులెన్నో వుంటవని ఆయన అభిప్రాయం. సంస్కృత సాహిత్య వ్యాసంగం ఇంకా సాగుతూనే వున్నది. కాబట్టి సర్వజనాదరణను పొందిన చంపూ శైలిలో వ్రాయబడే కావ్యాల సంఖ్య పెరుగుతూనే వుంటుంది.

# కథాకావ్యాలు

## కథాకావ్యాల ఉత్పత్తి-వికాసాలు

మానవుని మస్తిష్కంలో "కథ" ఉద్భవం ఎప్పుడు జరిగిందో చెప్పటం కష్టం. మానవుని భాష ఎంత ప్రాచీనమో కథకూడ అంత ప్రాచీన మైందని చెప్పవచ్చును. మానవుడు మాటలు నేర్చిన నాటినుంచే తన తోటివారికి, తనకంటె చిన్నవాళ్ళైన వారికి తన అనుభవాలను, తాను చూచిన వింతలను, అద్భుత సంఘటనలను చెప్పటం ప్రారంభించి వుంటాడు. అదే 'కథ' ప్రాదుర్భావానికి నాంది పలికిందని చెప్పాలి.

భారతదేశం ప్రాచీనకాలం నుంచే కథలకు గని వంటిది. పరాక్రమ, సాహస, అద్భుత అనుభవాలతో కూడిన, సముద్ర యాత్రలతో కూడిన కథలకు, విజ్ఞాన నీతిధర్మ బోధక కథలకు, శృంగార కథలకు ఎన్నిటికో భారతదేశం పుట్టినిల్లు. ఈ కథలు అతిప్రాచీన కాలంలోనే దేశాంతరాల వరకు వ్యాపించి ఆ యా దేశాల రంగు వాసనలను పూసుకొని అక్కడే స్థిరపడినవి. ఒక విధంగా ప్రపంచ కథలన్నిటికి భారతీయ కథలే మూలమంటె అతిశయోక్తి కాదు.

భారతదేశంలో కథల ప్రాదుర్భావం ఎప్పుడు జరిగిందో తేల్చిచెప్పటం కష్టం. మనకు అందుబాటులో వుండి లభించే సాహిత్యాన్నే ఆధారంగా తీసుకొని పరిశీలించినట్లయితే ఋగ్వేదంలోనే అనేక ఆఖ్యానాలు కన్పిస్తున్నవి. ఈ అఖ్యానాలు తర్వాత కాలంలో బ్రాహ్మణ ఉపనిషత్తు పురాణ గ్రంథాలలో ప్రపంచింపబడి కన్పిస్తున్నవి. ఋగ్వేద సంబంధమైన ఆఖ్యానా లే కాక ఇంకా అనేక ఇతర కథలు కూడ బ్రాహ్మణాది గ్రంథాలల్లో వున్నవి. మహాభారత రామాయణ కావ్యాలల్లో ప్రధానేతివృత్తాలే కాక సందర్భానుకూలంగా అనేక ఆఖ్యానాలు, ఉపాఖ్యానాలు కన్పిస్తున్నవి. మహాభారతం 25000 శ్లోకాల నుంచి లక్షకుపైగా శ్లోకాల వరకు పెరిగిందంటె అనేక కథలు ప్రక్షిప్తాలుగా చేరటమే ప్రధాన కారణం. ఆ కథలు అన్ని ఒక్క కాలంలో ఒక్కసారి చేర్చబడినవి కావు. అవన్ని కాలక్రమంగా చేర్చబడినవి. బౌద్ధజైన మతాలు వ్యాప్తి చెంది ఆ ధర్మ బోధనలకై సృష్టింపబడిన కథలతో కథాసాహిత్యం మరింత విరాట్ రూపాన్ని ధరించింది. ధర్మనీతి బోధకమైన బౌద్ధజాతక కథలు ఎన్నో ఉద్భవించినవి. వీటిల్లో జానపదుల కథలెన్నో సాహిత్య రూపాన్ని ధరించి నిలిచినవి.

మనోరంజనాన్ని కలిగించటంతో పాటు నీతిధర్మాలను బోధించటమే కథల ఉద్దేశం. మనోరంజనంతో పాటు కథలు రాజనీతిని, వ్యవహార జ్ఞానాన్ని, కార్య కుశలతను బోధించేవిగా కూడ వున్నవి. ఈ కథలలో మనుష్య పాత్రలతో పాటు పశుపక్ష్యాదులు కూడ చేరి వుండటం ఒక విశిష్టత. ఆ యా పశుపక్షులు ఆ యా గుణాలకు ప్రసిద్ధమైనవి. ప్రాచీన కథాకారులు సూక్ష్మబుద్ధితో దీన్ని పరిశీలించారు. అందుకే ఆ యా గుణాలకు ప్రతీకలుగా ఆయా పశుపక్షులను పాత్రలుగా నిలిపి కథలను కూర్చారు. ఉదాహరణకు జిత్తులమారితనానికి నక్క, సాధుస్వభావానికి పావురం, లేడి, కుందేలు వంటివి, బలానికి సింహం ఇట్లా అనేక జంతువులు ప్రసిద్ధమైనవి. అందుకే నక్క, సింహం, పావురం, లేడి, కుందేలు, ఒంటె, పెద్దపులి, కొంగ, గద్ద, గాడిద, ఎద్దు, పాము, ఎలుక, కోతులు ఇంకా ఎన్నెన్నో జంతువులు పక్షులు కథలల్లో చోటు చేసుకొన్నవి. ఒకొకసారి కథలల్లో మనుష్యులు పశుపక్ష్యాదులుగా మారటం, ఒక ప్రాణిలోని ఆత్మ మరొక ప్రాణి శవంలో ప్రవేశించటం, పశుపక్ష్యాదులు మనుష్యుల వలె ఆచరించటమే కాక మాట్లాడటం వంటివి కన్పిస్తవి. ఒక ప్రధాన కథలో మరొక కథ, మరొక కథలో మరొక కథ చేరి వుండటం భారతదేశ కథల ప్రత్యేక లక్షణం. ఉదా॥ బృహత్కథలో నరవాహనదత్తుని కథ ప్రధానమైంది. సందార్భానుకూలంగా అనేక కథలు, తిరిగి కథలల్లో కథలు చేర్చబడినవి. అదే విధంగా పాండవ కౌరవుల వృత్తాంతం ప్రధానంగా గల మహాభారతంలో సందర్భానుకూలంగా అనేక కథలు చేర్చబడినవి. దీనిలో నలదమయంతుల, సావిత్రి, శకుంతలల కథలే కాక ధర్మ నీతి వేదాంత బోధకమైన, పశుపక్ష్యాదులు పాత్రలుగా గల కథలు కూడ అనేకం వున్నవి. ప్రధాన కథలో ఉపకథలను చేర్చటం, ఒక కథలో గొలుసు కట్టుగా మరొక కథను, మరొక కథలో మరొక కథను చేర్చి చెప్పే పద్ధతి ప్రత్యేకంగా భారతదేశానికి చెందిందని చెప్పుకున్నాం కదా! కథలో కథను ఇరికించే పద్ధతి ఐతరేయ బ్రాహ్మణాదుల్లోనే కన్పిస్తున్నది. తర్వాత బృహత్కథ, పంచతంత్ర, హితోపదేశాది కథా కావ్యాలల్లో ఈ పద్ధతి అనుసరింపబడి ప్రాచుర్యాన్ని సంపాదించుకొన్నది. కథను ఇరికించే పద్ధతే కాక ఒక రోజు లేక ఒక రాత్రి ఒక కథ, తిరిగి రెండోరోజు లేక రెండో రాత్రి మరొక కథ- ఇట్లా కొన్ని రోజులు లేక కొన్ని రాత్రులుగా కథలను చెప్పే పద్ధతి కూడ వున్నది. ఉదా॥కు బేతాళ పంచవింశతి, శుకసప్తతి కథలు ఈ పద్ధతిలోనే నడచినవి. బేతాళ పంచవింశతిలో చివర పొడుపుకథ వంటి చిక్కు ప్రశ్నతో ముగిసే 25 కథలున్నవి. శుకసప్తతిలో పెంపుడు చిలుక రాత్రికొకటి చొప్పున 70 రాత్రులు 70 కథలు చెప్పుంది. అదే విధంగా జాతక కథలల్లో బుద్ధుని పూర్వజన్మ సంబంధమైన పృథగ్రూపమైన కథలు

కూర్చబడినవి. వీటిల్లో కొన్ని అతి ప్రాచీనమైనవని, తర్వాత కాలంలో గ్రంథస్థ చేయబడినవని, విమర్శకుల అభిప్రాయం. కథలను చెప్పే కవులు సామాన్యంగా సరళమైన గద్యశైలినే గ్రహించారు. కావ్యగ్రంథాలల్లో వుండే ఆలంకారిక శైలికి వీటిల్లో తావులేదు. ఈ కథాకావ్యాలు, మహాకావ్య నాటకాల కన్న కూడ భారతీయుల సృజనాత్మక ప్రతిభకు తార్కాణంగా, భారతీయాత్మను అచ్చంగా ప్రతిబింబింపజేసేవిగా వున్నవి. వివిధ రంగాలల్లో జరిగిన వివిధ యథార్థ సంఘటనలను ఈ కథలల్లో చూడవచ్చును. మహా కావ్య నాటకాదులవలె ఇవి మూసలో పోసినట్లుగా ఒక్క రూపంలో లేవు. కథలు వేటికవే స్వతంత్ర ప్రతిపత్తి కలవి. ప్రత్యేకత కలవి. వీటిల్లో అనుకరణ, పునరుక్తి దోషాలు కనిపించవు.

## కథాకావ్య భేదాలు

కథాసాహిత్యాన్నంతటిని ప్రధానంగా నాలుగు విభాగాలుగా చేయవచ్చును- 1) ఆలంకారికశైలిలో రచింపబడిన గద్య కథాకావ్యాలు, సుబంధు వాసవదత్త, బాణుని కాదంబరి, దండి దశకుమార చరిత్రలు ఈ విభాగానికి చెందినవి. ఇవి "కథ" అనే గద్య కావ్య ప్రక్రియలో చేరినవి. 2) సాహసాద్భుత కథలు. ఇవి "రోమాంటక్" (కాల్పనిక) కథలు. బృహత్కథ, శుకసప్తతి, విక్రమార్కుని కథల వంటి కథాకావ్యాలు ఈ విభానికి చెందినవి. 3) రాజనీతిని, వ్యవహార జ్ఞానాన్ని బోధించే కొరకు పుట్టిన కథలు. పంచతంత్రాది కథలు దీనిలో చేరుతవి. 4) ధర్మబోధనకై మతసంబంధమైన నేపథ్యంలో పుట్టినవి. బౌద్ధ జైన కథలు ఈ విభాగంలో చేరుతవి.

ఆలంకారిక శైలిలో రచింపబడిన కథా కావ్యాలను గూర్చి గద్యమహాకావ్యాల ప్రకరణంలో వివరింపబడింది. ఇక మిగిలిన మూడు విభాగాలకు చెందిన కథా సాహిత్యం మాత్రమే ఈ ప్రకరణంలో గ్రహించబడింది.

## బృహత్కథ

బృహత్కథ సంస్కృతంలో కాక ప్రాకృత విభేదమైన పైశాచీభాషలో రచింపబడింది. గ్రంథారంభంలో పీఠికారూపంగా ఉదయనుని కథ వున్నది. వాసవదత్త పద్మావతులను అతడు వివాహమాడటం, నరవాహనదత్తు డనే కుమారుడు జన్మించే వృత్తాంతాలున్నవి. ఆ తర్వాత నరవాహనదత్తుని సాహస యాత్రతో ప్రధాన కథ ఆరంభమౌతుంది. అతడు అనేక యువతులను వివాహమాడుతాడు, విద్యాధరులకు రాజు అవుతాడు. ఈ ప్రధాన

కథలో అవాంతర కథలుగా అనేక కథలు కూర్చబడినవి. బృహత్కథలోని అనేక కథలు తర్వాత కవుల కావ్యనాట కేతివృత్తాలకు మూలస్రోతస్సు లయినవి.

## గుణాఢ్యుని పరిచయం

బృహత్కథను గుణాఢ్యుడు రచించాడు. ఈ విషయంలో ఎటువంటి అభిప్రాయ భేదంలేదు. గుణాఢ్యుడు వ్యాసవాల్మీకి కవుల సరసన చేర్చదగిన కవి అని ప్రాచీనులు తలంచారు. ఆర్యాసప్తశతికారుడు గోవర్ధనాచార్యుడు (క్రీ.శ. 12వ శ॥ ) గుణాఢ్యుని వ్యాసుని అంతటివానిగా భావించాడు-

అతి దీర్ఘజీవి దోషాద్వ్యాసేన యశోఽపహారితం హంత
కైర్నో చ్యేత గుణాఢ్యః స ఏవ జన్మాంతరాపన్నః

"వ్యాసుడు చిరకాలం జీవించి అతడే గుణాఢ్యుడుగా జన్మించాడనే కీర్తిని పోగొట్టుకొన్నాడు.' ' "రామాయణ మహాభారత బృహత్కథలు అనే సరసమైన మూడు ప్రవాహాలుగా గంగానది వలె ప్రవహింపజేసిన కవులకు నమస్కారం చేస్తున్నాను." అని మరొక శ్లోకంలో గోవర్ధనాచార్యుడు రామాయణ మహాభారతాల సరసన బృహత్కథను నిలబెట్టాడు-

శ్రీరామాయణ భారత బృహత్కథానాం కవీన్నమస్కుర్మః
త్రిస్రోతా ఇవ సరసా సరస్వతీ స్ఫురతియైర్భిన్నా

కథాసరిత్సాగర కథను బట్టి గుణాఢ్యుడు శ్రుతార్థ అనే బ్రాహ్మణకన్యకు, కీర్తి సేనుడనే నాగరాజుకు గాంధర్వవివాహ ఫలితంగా జన్మించాడని తెలుస్తున్నది. ప్రతిష్ఠానరాజ్యంలోని సుప్రతిష్ఠానగరం అతని నివాసస్థానం. ఈ సుప్రతిష్ఠా నగరం ప్రతిష్ఠానగరమే అంటే ఈనాటి పైఠన్ అని వి.వి. మిరాశీ అభిప్రాయం. సుప్రతిష్ఠానం ప్రతిష్ఠానగరం కాదని, అది మత్స్యపురాణాది ప్రసిద్ధమైన గంగా తీరంలోని ప్రయాగ సమీపంలోని ఝూసి అని ఎస్. ఎస్. ప్రసాద్ అభిప్రాయపడినాడు. ఇది కౌశాంబి నగరానికి 30 మైళ్ళ దూరంలో వున్నది. కౌశాంబి నేలిన ఉదయనుని, అతని కొడుకు నరవాహనదత్తుని సాహస చర్యలను కథా వస్తువుగా గ్రహించటంచేత ఆ ప్రాంతం అతనికి సుపరిచితమైంది కాబట్టి అతని నివాసస్థానం ప్రయాగ సమీపంలోని 'ఝూసి' కావటం సమంజసమని ప్రసాద్ అభిప్రాయం.

గుణాఢ్యుని జీవితకాలాన్ని గురించి విమర్శకులల్లో అభిప్రాయ భేదమున్నది. అతడు శాతవాహనరాజు ఆస్థానంలో వుండెననటం సంప్రదాయానుసారంగా నిశ్చయమైందే.

కాని ఏ శాతవాహనరాజు ఆస్థానంలో వున్నాడనటం వివాదాగ్రస్తమైన విషయం. వేబర్ గుణాఢ్యుని క్రీ.శ. 2వ శతాబ్దం వానిగా అంగీకరించాడు. బ్యూలర్ క్రీ.శ. 1 లేక 2 శతాబ్దమని భావించాడు. సిల్వైన్ లెవీ కూడ క్రీ.శ. 1,2 శతాబ్దాలని అన్నాడు. తర్వాత సిల్వైన్ లెవీ తన అభిప్రాయాన్ని మార్చుకొని గుణాఢ్యుని క్రీ.శ. 2వ శతాబ్దం వానిగా నిశ్చయించాడు. వి.ఏ. స్మిత్ తన 'ఆంధ్ర హిస్టరీ అండ్ కాయినేజ్' అన్న పుస్తకంలో బృహత్కథ రచనాకాలాన్ని క్రీ.శ. 60-70 మధ్య అని నిర్ణయించాడు. స్పెయర్ గుణాఢ్యుని కాలం క్రీ.శ. 5వ శతాబ్దమని భావించాడు. వాసవదత్తా కారుడు సుబంధు బృహత్కథను పేర్కొనటం చేత క్రీ.శ. 6వ శతాబ్దం పూర్వార్ధం కన్న గుణాఢ్యుని కాలాన్ని కిందికి తీసుకురావటానికి వీల్లేదు. తర్వాత గుణాఢ్యుడు పాణిని, కాత్యాయనులకు కొన్ని శతాబ్దాలు తరువాతి వాడవటం స్పష్టం. గుణాఢ్యుని నాటికి ప్రాకృత భాషలు బాగా వికసించి సాహిత్య సృష్టికి తగినవిగా ఏర్పడిన వనటం స్పష్టం. శాతవాహన రాజులు సంస్కృతాన్ని కాక ప్రాకృతాన్ని అభిమానించి పోషించారు. వారు శాసనాలను కూడ ప్రాకృతంలోనే వేయించారు. క్రీ.పూ. ప్రథమ శతాబ్దంలో వెలసిన కుంతల శాతకర్ణి శాతవాహనరాజు లందరిలో ప్రాకృత ప్రేమి కవిపోషకుడు. అటువంటి రాజు ఆస్థానంలోనే గుణాఢ్యుడు ఆదరింపబడి వుండివుంటాడని చెప్పటం సమంజసంగా వుంటుంది. అప్పుడు వి. ఏ. స్మిత్ నిర్ణయించిన క్రీ.శ. ప్రథమ శతాబ్దం కాక క్రీ.పూ. 1వ శ॥ సమంజస మైందనాలి.

గుణాఢ్యుడు సంస్కృత భాషను, ప్రసిద్ధ ప్రాకృత భాషలను విడిచి పెట్టి అప్రసిద్ధమైన పైశాచీ భాషలో బృహత్కథను వ్రాయటానికి గల కారణాన్ని చెప్పే కథ ఒకటి ప్రచారంలో వున్నది. శాతవాహన రాజు కుంతలుడు ఒకసారి రాణితోకూడి జలకేళి చేస్తుండగా అతడు రాణిపై నీళ్ళు చల్లాడు. రాణి "మోదకైస్తాడయ" అని సంస్కృతంలో అన్నది. రాజు ప్రాకృతభాషా నిపుణుడే కాని సంస్కృతం బొత్తిగా తెలియనివాడు. ఆ మాటల అర్థాన్ని తెలుసుకోలేక మోదకాలను (లడ్డూలను) తెప్పించి రాణిపైకి విసరివేయ సాగాడు. రాణి రాజుగారి అజ్ఞానానికి పరిహాసం చేసింది. దానితో రాజు ఉడికిపోయి సంస్కృతాన్ని అభ్యసించదలచి తన ఆస్థాన పండితుని గుణాఢ్యుని ఆశ్రయించాడు. గుణాఢ్యుడు రాజును ఆరు సంవత్సరాలల్లో సంస్కృతజ్ఞుని చేస్తానని చెప్పాడు. ఆ రాజు ఆస్థానంలోనే వున్న శర్వవర్మ అన్న పండితుడు తాను రాజును ఆరునెలల్లోనే సంస్కృతజ్ఞుని చేస్తానని అన్నాడు. ఒకవేళ శర్వవర్మ తాను అన్నట్లుగా రాజును ఆరునెలల్లో సంస్కృతజ్ఞుని

చేసినట్లయితె తాను సంస్కృత, ప్రాకృత, దేశభాషలను త్యజిస్తానని గుణాఢ్యుడు శపథం చేసాడు. శర్వవర్మ ప్రత్యేకంగా కాతంత్ర వ్యాకరణాన్ని వ్రాసి అన్నమాట ప్రకారం ఆరునెలల్లో రాజును సంస్కృతజ్ఞుని చేసాడు. గుణాఢ్యుడు తాను చేసిన శపథం ప్రకారం సంస్కృతాది భాషలను త్యజించాడు. అట్లా త్యజించటం చేతనే భూత భాష అయిన పైశాచిలో బృహత్కథను వ్రాసాడని అంటారు.

## బృహత్కథ రచన

గుణాఢ్యుడు శివుని గణాలల్లో ఒకడని, బృహత్కథను ప్రచారంచేసే కొరకే మానవుడుగా పుట్టాడని అతని పూర్వ జన్మగాథ ఒకటి కథాసరిత్సాగరంలో ఇట్లా చెప్పబడింది - శివుడు కథలను పార్వతికి చెప్తుండగా గణాలల్లో ఒకడైన పుష్పదంతుడు చాటుగా విన్నాడు. పార్వతి ఇది తెలుసుకొని పుష్పదంతుని మానవునిగా జన్మించమని, అతడు విన్న ఏడు కథలను పిశాచ రూపంలోవున్న కాణభూతికి చెప్పింతర్వాత కైలాసానికి తిరగి రమ్మని శపించింది. ఇంతలో పుష్పదంతుని సోదరుడు మాల్యవంతుడు సోదరుని రక్షించేకొరకు మధ్యలో కల్పించుకోగా పార్వతి వాన్ని కూడా మానవునిగా జన్మించమని, కాణభూతి నుంచి ఆ కథలను విన్న తర్వాతనే కైలాసానికి రమ్మని శపించింది. పుష్పవంతుడు వైయాకరణుడు వరరుచిగా జన్మించి మగధనేలిన నందవంశరాజు దగ్గర మంత్రిగా వున్నాడు. వృద్ధుడైన తర్వాత అతడు మంత్రి పదవి నుంచి విరమించుకొని వింధ్యారణ్యానికి పోయి అక్కడ కాణభూతిని కలుసుకొని శివుడు పార్వతికి చెప్పగా విన్న కథలను అతనికి చెప్పి కైలాసానికి వెళ్ళిపోయాడు. మాల్యవంతుడు గుణాఢ్యునిగా జన్మించి శాతవాహనరాజు దగ్గర మంత్రిగా ప్రతిష్ఠానంలో వున్నాడు. గుణాఢ్యుడు రాజును సంస్కృతజ్ఞుని చేయలేక సంస్కృతాది భాషలను త్యజించి మౌనంతో వింధ్యారణ్యాన్ని చేరుకొని అక్కడ భూతభాష పైశాచిని నేర్చుకొన్నాడు. అక్కడ అతడు కాణభూతిని కలుసుకొని అతడు చెప్పిన కథలను విన్నాడు. దానితో కాణభూతి పిశాచరూపం వదిలిపోయింది. గుణాఢ్యుడు కాణభూతి నుంచి తాను విన్న కథలను లోకంలో ప్రచారం చేసేవరకు భూలోకంలోనే వుండిపోయాడు. గుణాఢ్యుడు పైశాచిభాషలో ఆ కథలను వ్రాసి తన శిష్యులు గుణదేవ, నందిదేవుల సలహా ప్రకారం శాతవాహనరాజుకు చూపించాడు. శాతవాహనరాజు పిశాచభాషలో వున్నదని దాన్ని నిరాకరించాడు. గుణాఢ్యుడు తన గ్రంథంతో తిరిగి వింధ్యాటవికి పోయి అక్కడ ఒక పెద్ద చితిని పేర్చి ఒక్కొక్క తాటాకును తీసి పెద్దగా చదువుతూ మంటలో వేయసాగాడు.

ఇంతలో శాతవాహనరాజు తన తప్పు తెలుసుకొని అక్కడికివచ్చి కవి మారణ హోమాన్ని ఆపాడు. అప్పటికే గ్రంథం ఆరువంతులు దగ్ధమై ఒక్కవంతు అంటె నరవాహనదత్తుని వృత్తాంతంగల లక్షపద్యాలు మాత్రం మిగిలినవి. గుణాఢ్యుడు ఆ మిగిలిన ఒక్క కథను తన శిష్యులకు ఇచ్చి శాప విముక్తుడై కైలాసానికి వెళ్ళిపోయాడు. మిగిలిన గ్రంథంతో శిష్యులను శాతవాహన రాజు రాజధానికి తీసుకొనిపోయి వారిని సత్కరించి, ఆ కథకు ఆముఖంగా "కథాపీఠం" రచించాడు. తర్వాత ఆ కావ్యం బృహత్కథగా బాగా వ్యాప్తిలోకి వచ్చింది. కాని ఏ కారణంచేతనో మూల పైశాచీభాష గ్రంథం లోకంలో లేకుండా లుప్తమైపోయింది. బృహత్కథా శ్లోక సంగ్రహం, బృహత్కథామంజరి, కథాసరిత్సాగరం అనే మూడు సంక్షిప్త సంస్కృతానువాద రూపాలు మాత్రం ప్రస్తుతం లభిస్తున్నవి, బృహత్కథ మూల గ్రంథం ఎంతకాలం వరకు ఉపలభ్యంగా వున్నదో నిర్ణయించి చెప్పటం కష్టం. సుబంధు, బాణ, దండి, సోమదేవసూరి, ధనపాల, త్రివిక్రమ భట్టు, ధనిక, భోజ గోవర్ధనాదులు బృహత్కథను గూర్చి ప్రసంగించారు. యశోవర్మ (క్రీ.శ. 720) కంబుజశాసనంలో గుణాఢ్యుడు ప్రాకృతాభిమానిగా పేర్కొనబడినాడు. క్రీ.శ. 6వ శతాబ్దం పూర్వార్ధంనాటి గాంగ వంశ రాజు దుర్వినీతుని కోలారు రాగిరేకు మీద వేయబడిన శాసనంలో దుర్వినీతుడు కిరాతార్జునీయం 15వ సర్గకు టీక వ్రాయటమే కాక బృహత్కథను సంస్కృతీకరించి నట్లు చెప్పుకొన్నాడు. ఈ అనువాదం ఇప్పుడు లభ్యం కావటంలేదు. క్రీ.శ. 6వ శతాబ్దం పూర్వార్ధంలోని కథాకారుడు సుబంధు "అపూర్వాద్య బృహత్కథా మయాశ్రుతా ప్రత్యక్షీకృతాచ. కేచిద్ బృహత్కథానుబంధిన ఇవ గుణాఢ్యాః" అని చెప్పటంచేత అతడు బృహత్కథ మూలగ్రంథాన్ని చూసాడని తెలుస్తున్నది. క్రీ.శ. 7వ శతాబ్దం వాడైన బాణ దండి కవులు కూడ బృహత్కథను పేర్కొన్నారు. వీరికి తప్పక బృత్కథతో పరిచయముండి వుంటుంది. క్రీ.శ. 5వ శ॥ వాడైన బుద్ధస్వామి బృహత్కథను సంస్కృత శ్లోక సంగ్రహంగా రచించాడు. క్రీ.శ. 11వ శ॥ వాడైన క్షేమేంద్ర, సోమదేవులు బృహత్కథకు సంస్కృత రూపాంతరాలను రచించారు. వీరు మూల బృహత్కథను చూచారా లేదా అనే విషయంలో విమర్శకులకు సందేహంగా వున్నది. కాని కథాసరిత్సాగరకారుడు సోమదేవుడు తాను మూల కథను ఎక్కడా విడువకుండ అనుసరిస్తు సంక్షిప్తంగా రచించానని చెప్పుకోవటంచేత మూల బృహత్కథ అతనికి లభించిందనే చెప్పాలి. ఈ ఇద్దరు కవుల గ్రంథాలల్లో భేదం వున్నది. మూలకథను వారు తమ అభిరుచుల కనుగుణంగా మలచి వ్రాయటంచేత ఈ భేదం ఏర్పడి వుంటుందే కాని మూలగ్రంథం ఒక్కటి కాకపోవటం చేత కాదేమో. క్రీ.శ. 1600 ప్రాంతం వాడైన అప్పయ్య దీక్షితులు

బృహత్కథను స్మరించాడు. కాని అప్పటికా గ్రంథం వున్నదో లేదో చెప్పలేము. క్రీ.శ. 17వ శ॥ వాడైన మార్కండేయుడనే ఒకానొక వైయాకరణుడు పైశాచీ బృహత్కథను కలిగివున్నట్లు చెప్పబడింది. కాని అది ఎంతవరకు సత్యమో కచ్చితంగా చెప్పలేము. ఒకవేళ భవిష్యత్తులో ఎక్కడైనా మూల బృహత్కథ బయటపడి మనల్ని ఆశ్చర్యచకితుల్ని కూడ చేయవచ్చునేమో చెప్పలేము. ఇప్పుడు లభ్యమైన ఆధారాలనుబట్టి క్రీ.శ. 11వ శ॥ వరకు పైశాచీ బృహత్కథ ఉపలభ్యంగా ఉండేదని తెలుస్తున్నది. సంస్కృత రూపాంతరాలు ఏర్పడిన తర్వాత పైశాచీ ప్రాకృతం అందరికీ అర్థం కాక ఎక్కువ ప్రచారంలో లేక మూల బృహత్కథ వినష్టమై వుంటుందేమో.

## బృహత్కథానువాదాలు

సంస్కృత బృహత్కథానువాదాలను పరిశీలించినట్లయితే తద్గ్రంథానికి రెండు పాఠభేదా లున్నవని తెలుస్తున్నది - కాశ్మీర ప్రతి, నేపాలీ ప్రతి. బృహత్కథా శ్లోక సంగ్రహం నేపాలీ ప్రతికి, బృహత్కథామంజరి కథాసరిత్సాగరాలు కాశ్మీర ప్రతికి అనువాదాలని విమర్శకులు నిర్ణయించారు. బృహత్కథా శ్లోక సంగ్రహ వ్రాతప్రతి నేపాల్ దేశంలో దొరకటం ఈ ఊహకొక కారణం. క్రీ.శ. 2వ శ॥ లో బృహత్కథ "పెరుంగదై" పేరుతో తమిళభాషలోకి అనువదింపబడింది. బృహత్కథకు ప్రాకృత, పర్షియన్ భాషానువాదాలు కూడ వున్నవి. సంస్కృతంలో బుద్ధ స్వామి బృహత్కథా శ్లోక సంగ్రహమే ప్రాచీనమైన సంస్కృతానువాదం. ఈ కవి క్రీ.శ. 9వ శ॥ వాడని వి. వరదాచారి మొదలైన సాహిత్య చరిత్రకారులు తలంచారు. మరికొందరు విమర్శకులు ఇతడు క్రీ.శ. 5వ శ॥ వాడని అభిప్రాయపడినారు. బృహత్కథా శ్లోక సంగ్రహం సంపూర్ణంగా కాక అసంపూర్ణంగా మాత్రమే లభ్యమై ముద్రితమైంది. లభ్యమైన ప్రతిలో 28 సర్గలు, 4539 శ్లోకాలున్నవి. శైలి ధారాళంగా, ప్రసన్నంగా వున్నది. చాలా మట్టుకు బుద్ధ స్వామి స్వతంత్రించి వ్రాసాడని పండితుల అభిప్రాయం. ఎందుకంటె క్షేమేంద్ర సోమదేవుల అనువాదాలకన్న ఇది చాలా భిన్నంగా వున్నది. బుద్ధస్వామికి దాదాపు సమకాలికుడైన సంఘదాసగణి బృమత్కథను "వాసుదేవ హిండీ" పేరుతో ప్రాకృతానువాదం చేసాడు. కాని దీనిలో చాల మార్పులున్నవి. బృహత్కథలో వలె ప్రధాన పాత్ర దీనిలో ఉదయనుడు కాక వాసుదేవ కృష్ణుడు. కాని చాలా మట్టుకు బృహత్కథలోని కథలనే అనువాదకుడు తీసుకొన్నాడు. దీనిలో 29 లంభకాలు, 1100 పద్యాలున్నవి. రెండు శతాబ్దాల తర్వాత ధర్మదాసగణి "వాసుదేవ హిండీ'

' తర్వాత భాగాన్ని "మధ్యమ ఖండం" పేరుతో రచించాడు. దీనిలో 71 లంబకాలు, 17000 పద్యాలున్నవి.

బృహత్కథకు మరొక సంస్కృతానువాదమైన బృహత్కథా మంజరిని క్షేమేంద్రుడు రచించాడు. ఈ ప్రసిద్ధ కవి పండితుడు కాశ్మీర రాజు అనంతుని (క్రీ.శ. 1029-1064) ఆస్థాన కవి. బృహత్కథామంజరి 19 లంభకాలుగా విభాగింపబడింది. లంభకాలకు కవి నామకరణం కూడ చేసాడు. దీనిలో 7500 శ్లోకాలున్నవి.

సోమదేవుని (క్రీ.శ. 1063-1081) కథాసరిత్సాగరం చాల ప్రసిద్ధమైన, ప్రచారంలో వున్న బృహత్కథానువాద గ్రంథం. దీనిలో 124 తరంగాలు, దాదాపు 22000 శ్లోకాలున్నవి. గ్రీకు మహాకావ్యాలు ఇలియడ్, ఒడిస్సీలు రెండింటినీ కలిపితే దానికి రెండింతలు పెద్దదైంది ఈ కావ్యం. దీని రచన కాశ్మీర దేశంలోనే కల్హణుని రాజతరంగణి కన్న కొంచెం తర్వాత జరిగింది. రాజతరంగిణి చేత ప్రేరేపితుడయ్యే సోమదేవుడు కథాసరిత్సాగరాన్ని వ్రాసివుంటాడు. కాశ్మీర రాజు అనంతుని భార్య సూర్యమతి కొరకు కవి దీన్ని వ్రాసాడు. సూర్యమతి భర్త మరణానంతరం క్రీ.శ. 1081 లో సతీసహగమనం చేసింది. కాబట్టి తత్పూర్వమే దీని రచన జరిగివుంటుందని చెప్పవచ్చును. సోమదేవుని శైలి సరసంగా కాక అలంకారాదులతో భూషింపబడి సుందరమైంది. కథలను పాఠకులకు విసుగు పుట్టించకుండ ఆకర్షణీయంగా కూర్చాడు. కథలను చెప్పటంలో కవికి మంచి నేర్పు వున్నది. క్షేమేంద్ర, సోమదేవుల బృహత్కథానువాదాలల్లో పంచతంత్ర, బేతాళ పంచవింశత్యాదుల్లో కనిపించే కథలు కూడ చోటు చేసుకొన్నవని పరిశీలన వల్ల తేలుతున్నది. బాణాది కవుల కాదంబరి కావ్య కథలను ప్రాచీనమైనవని చెప్పటానికేమో సోమదేవుడు మార్పులు చేర్పులతో కథా సరిత్సాగరంలో చేర్చుకున్నాడు కూడ.

క్రీ.శ. 516 ప్రాంతంలో బృహత్కథ చైనా, టిబెట్ భాషల్లోకి అనువదింపబడింది. ఆధునిక కాలంలో అనేక భారతీయ దేశభాషల్లోకి ఇంకా ఇంగ్లీషు, జర్మన్, ఫ్రెంచ్ మొ॥ న యూరోపియన్ భాషల్లోకి కూడ బృహత్కథానువాదమైన కథాసరిత్సాగరం అనువదింపబడింది.

## పైశాచీభాష

బృహత్కథను గుణాఢ్యుడు పైశాచీ భాషలో రచించాడు. పైశాచీ భాష ఏది అన్న విషయంలో విమర్శకుల్లో ఒక్క అభిప్రాయం కుదరలేదు. పేరును బట్టి ఈ భాష

మనుష్యులు కాక పిశాచాలు మాట్లాడే భాష అని కొందరు తలంచారు. పిశాచాలు అంటే భూతప్రేతాలని కూడ కొందరు భావించారు. అదెంత అశాస్త్రీయమైన అభిప్రాయమో వారు గ్రహించలేదు. పిశాచాలు అంటే భూతప్రేతాలు కావని, పిశాచాలు అంటే ఆర్యేతరులని, పిశాచ భాష ఆర్యభాషా కుటుంబానికి చెందిన భాష కాదని కొంత మంది విమర్శకులు అభిప్రాయపడినారు. పైశాచీ భాష ద్రావిడుల చేత మాట్లాడబడే ఆర్యభాషా భేదమే అని హోర్న్లే తలంచాడు. ఈ అభిప్రాయం సర్వసమ్మతం కాలేదు. పైశాచీ భాష వినటానికి కఠినంగా ఉండటం చేత అంతగా సుసంస్కృతం కాకపోవటం చేత ఆ భాషను మాట్లాడే వారిని పిశాచాలని, ఆ భాషను పైశాచి అని అన్నారని పిశ్చెల్ అభిప్రాయం. పైశాచిభాష ప్రాకృత భేదమే అని ఇప్పుడు పండితులందరు అంగీకరించారు. వరరుచి ప్రాకృత ప్రకాశంలో పైశాచీ భాషా వ్యతిరేక నియమాలను గూర్చి చెప్పాడు. పైశాచీ భాష ప్రాకృత భేదాన్ని పేర్కొన్నాడు. నమిసాధు రుద్రటుని కావ్యాలంకార వ్యాఖ్యానంలో పైశాచీ ప్రాకృతాన్ని గూర్చి ప్రసంగించాడు. ప్రాకృత భాషావేత్త హేమచంద్ర సూరి మొదలైన ప్రాచీనాచార్యుల చేత పైశాచీ భాష ప్రాకృత విభేదంగా అంగీకరింపబడినా ఏ కారణం చేతనో విస్మృతమై, పేరు పైశాచి కాబట్టి పిశాచాలు మాట్లాడే భాషగా పరిగణింపబడ్తూ వచ్చింది.

పైశాచీప్రాకృతం ఏ ప్రాంతంలో మాట్లాడబడేదన్న విషయంలోను విమర్శకుల్లో భేదాభిప్రాయాలు కన్పిస్తున్నవి. ప్రాకృతసర్వస్వంలో లక్ష్మీధరుడు పిశాచ దేశంలో మాట్లాడబడటం చేత దీనికి పైశాచి అన్న పేరు వచ్చిందని అన్నాడు. దండి పైశాచిక భాషను భూతభాషగా పేర్కొన్నాడు- "భూతభాషామయీం ప్రాహురద్భుతార్థాం బృహత్కథామ్'

అనాగరికులైన ఆటవికజాతుల వారినే పిశాచాలు, భూతాలు అని పిలిచేవారని, వారు మాట్లాడే వికృతమైన ఆర్యభాషయే పైశాచీభాష, భూతభాష అని చెప్పాలి. ఈ అభిప్రాయాన్నే రాజశేఖరుడు కావ్య మీమాంసలో గోదావరి తటవర్తి వింధ్యారణ్యంలో ఆటవికులు మాట్లాడే భాషా విభేదం పైశాచి అని అన్నాడు. పైశాచీభాషను కేకయ, శౌరసేన, పాంచాల ప్రాంతాలల్లో మాట్లాడే మాండలిక భాషాభేదమని మార్కండేయుడు తన ప్రాకృత సరస్వంలో పేర్కొన్నాడు అంటె ఆ ప్రాంతాలు ఇప్పటి మథుర మొదలైన మధ్యభారతదేశానికి చెందినవి. పైశాచి శౌరసేని ప్రాకృతం మీద ఆధారపడిందని వరరుచి అభిప్రాయం. తర్వాత హేమచంద్రుడు కూడ ఇదే అభిప్రాయాన్ని ప్రకటించాడు. గ్రియర్సన్ తన "లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా" అన్న పుస్తకంలో పైశాచి ఉత్తర-పశ్చిమ (వాయవ్య) దిశలో మాట్లాడబడే

భాషగా చెప్పాడు. పిశెల్ పైశాచీ భాష ఉత్తర-పశ్చిమ (వాయువ్య) దిశలో ప్రజలు మాట్లాడే భాష అని అంగీకరిస్తూ అది ఇప్పటి దర్దిక్ భాషకు దగ్గరిదని అన్నాడు. పైశాచీ భాష వాయవ్య దిశలోని ప్రజలభాషయే అని వింటర్ నిట్స్ కూడ తలంచాడు. పిశెల్ తన ప్రాకృత భాషా చరిత్రలో పైశాచీ భాష పాంచాల, కేకయ, బాహ్లీక, నేపాళ, కుంతల, గాంధార దేశాలల్లో మాట్లాడబడే భాష అని ప్రాచీన వ్యాకరణకారుల మతమిదే అని తెల్పాడు. ప్రాకృత సర్వస్వంలో లక్ష్మీధరుడు కూడ పైశాచి గాంధార, బాహ్లీక, నేపాళ, కుంతల, పాంచాల మొదలైన అనేక దేశాల్లో మాట్లాడబడే భాషగా చెప్పాడు. పై అభిప్రాయాలను పరిశీలించినట్లయితే పైశాచీ భాష శౌరసేని ప్రాకృతానికి దగ్గరిదని, ప్రాకృతభాషాభేదమే అని, అది నేపాళం మొదలుకొని కుంతలదేశం వరకు గాంధారం మొదలుకొని పాంచాలం వరకు విస్తృతంగా మాట్లాడబడేదని చెప్పవచ్చును. సామాన్య జనుల చేత మాట్లాడబడేదని తెలుస్తున్నది. సంస్కృత ప్రాకృత పాళీ భాషలతోపాటు బౌద్ధభిక్షువులు పైశాచీ భాషను కూడ నేర్చుకొనేవారట. బౌద్ధులు ధర్మ ప్రచారం కొరకు, గ్రంథ రచన కొరకు ప్రజల భాషను చేపట్టారు. దీన్ని బట్టి ఈ భాష నిత్యజీవితంలోని సామాన్య ప్రజల భాష అని తెలుస్తున్నది. ధనంజయుడు అర్ధమాగధితో పాటు పైశాచిని నీచ పాత్రలు మాటాడే భాషగా పేర్కొన్నాడు. భోజుడు పైశాచీ భాషను ఉత్తమ పాత్రలకు నిషేధించాడు. దీన్ని బట్టి పైశాచీ భాష సంస్కృతి గల జనుల పరిధిలోకి రాని సామాన్యజనులు మాట్లాడే భాష అని తెలుస్తున్నది. పైశాచీ భాష విశాలమైన భాగంలో ప్రచారంలో వుండి ప్రజల కర్థమయ్యే సామాన్య భాష కావటం చేతనే గుణాఢ్యుడు ప్రజల కందుబాటులో వుండేటట్లుగా పైశాచీ ప్రాకృతాన్ని తన కావ్యభాషగా ఎన్నుకొని వుంటాడు.

## బృహత్కథ ప్రాముఖ్యం

బృహత్కథ పైశాచీ ప్రాకృతంలో వ్రాయబడినా అది సంస్కృత సాహిత్యం మీద చూపిన ప్రభావం చాలా వున్నది. కాళిదాసు మేఘసందేశంలో “ఉదయన కథా కోవిద గ్రామ వృద్ధాన్” అని ఉదయనుని కథా ప్రసిద్ధిని గురించి ప్రసంగించి వున్నాడు. అట్లా జనుల్లో వ్యాప్తిలో వున్న కథలను తీసుకొని గుణాఢ్యుడు బృహత్కథను రచించివుంటాడు. బృహత్కథ చారిత్రక వ్యక్తులైన ఉదయన, నరవాహనదత్తుల కథలతో కూడివున్నది. ఈ కథలలోని కల్పితాద్భుత వృత్తాంతాల నుంచి చారిత్రక సత్యాలను వేరుచేసి చెప్పటం కష్టం కాని తప్పక ఆ అద్భుతేతి వృత్తాంతాల నడుమ చారిత్రక సత్యాలు నిక్షిప్తమై వుండవచ్చును. ఐతిహాసి

కేతి వృత్తాన్ని కల్పితాద్భుత సంఘటనలతో చేర్చి తమ ఆశ్రయదాతలైన ప్రభువుల చరిత్రలను కవులు వ్రాస్తూ వచ్చారు. బాణుని హర్ష చరిత్రాది చారిత్రక కావ్యాలు ఆఖ్యాయిక ప్రక్రియకు చెందినవి ఇటువంటివే. బృహత్కథా ప్రసిద్ధుడైన ఉదయనుని కథను తీసుకొని భాస, హర్షదేవాది కవులు రూపకాలను రచించారు. ఇక సంస్కృత కథా సాహిత్యం మీద బృహత్కథ చూపిన ప్రభావం అత్యధికమైంది. బృహత్కథను సంస్కృత భాషలోనికి బుద్ధస్వామి, క్షేమేంద్ర, సోమదేవులు అనువాదం చేసారు. తర్వాత బృహత్కథలోని కథలెన్నో పంచతంత్ర ప్రతుల్లోకి, భేతాళపంచవింశతి, శుకసప్తతి వంటి కథా గ్రంథాల్లోకి పాకినవి. చివరకు బౌద్ధ జాతక కథలల్లోను, వాటి కథా సంవిధానంలోను బృహత్కథ ప్రభావం కన్పిస్తున్నది. కథా కావ్యాల మీదనే కాక 'కథ' అనే గద్య ప్రక్రియకు చెందిన గద్యమహాకావ్యాల మీద బృహత్కథ ప్రభావం చాలా కన్పిస్తున్నది. సుబంధు బాణకవులు బృహత్కథను సగౌరవంగా స్మరించారు. బృహత్కథలోని ఉదయనుని భార్య "వాసవ దత్త'' పేరు సుబంధు తన కావ్యనాయికకు పెట్టి కావ్యానికి కూడా అదే నామకరణం చేసాడు. బాణుడు ఉజ్జయినినగర వర్ణన సందర్భంలో "బృహత్కథాకుశలు'' రను గూర్చి ప్రసంగించాడు. కాళిదాసు ఉదయన కథాకోవిదులైన గ్రామ వృద్ధులను గూర్చి చెప్తే బాణుడు బృహత్కథా కుశలురను పేర్కొన్నాడు. అంతేగాక బాణుడు "అతిద్వయీ కథా' ' అని రెండు కథలు అంటె గుణాఢ్యుని బృహత్కథ, సుబంధు వాసవదత్తలను మించిన కాదంబరి "కథ'' ను వ్రాస్తానని చెప్పుకొన్నాడు. గుణాఢ్యుని బృహత్కథ ఈ విధంగా గద్య కథామహాకావ్యాలకు అత్యంతం ఆదర్శమైన గ్రంథమైంది. సుబంధు కూడా "అపూర్వాద్యా బృహత్కథా మయాశ్రుతా ప్రత్యక్షీకృతాచ.......'' అన్న దాన్ని బట్టి బృహత్కథతో అతనికి బాగా పరిచయమున్నదని తెలుస్తున్నది. బృహత్కథలోని కథా సంఘటనలు, కథా సంవిధాన ప్రభావాలు సుబంధు కావ్యం మీద స్పష్టంగా కన్పిస్తున్నవి. అదేవిధంగా దశకుమార చరిత్రలోని కథలను చెప్పే పద్ధతిమీద బృహత్కథ ప్రభావమున్నది. బృహత్కథలో నరవాహనదత్తుని సాహసకృత్యాలు, అతడు వరుసగా ఒక్కొక్క సుందరిని వివాహమాడే అద్భుతేతి వృత్తాలు వున్నవి. అదే విధంగా దశకుమార చరిత్రలోను పదిమంది యువకులు అద్భుత సాహసకృత్యాలు చేయటం, తమ ప్రియురాండ్రను వివాహమాడే ఇతివృత్తాలు చెప్పబడినవి. వాసవదత్త, కాదంబరి కావ్యాలల్లో లాగా దశకుమార చరిత్రలో కథ ఆద్యంతం ఒక్కటి కాదు. బృహత్కథలోవలె వేరువేరు సంఘటనలతో, ఇతివృత్తాలతో దశకుమార చరిత్ర వున్నది. అంటె కథను చెప్పే పద్ధతిలో ఇది బృహత్కథకు దగ్గరగా వున్నది. కథలో

కథను చేర్చటం, కథను పాత్రల ముఖంగా చెప్పించటం మొదలైన కథాకథన పద్ధతి బృహత్కథలో వున్నది. అదే పద్ధతిని కొంతవరకు వాసవదత్త, కాదంబరి కథాకావ్యకారులు కూడ గ్రహించారు. ఇదే పద్ధతి పంచతంత్ర, బేతాళ పంచవింశతి, జాతక కథలల్లోను వున్నది. సుబంధు బాణుల బృహత్కథా ప్రశంసలను పరిశీలిస్తే వారు బృహత్కథను ఆదర్శంగా గ్రహించి ఆలంకారిక శైలిలో కథా కావ్యాలను రచించినట్లుగా తెలుస్తున్నది. బృహత్కథ లభించకపోవటం చేత శైలీ విషయంలో అది వారికెంత వరకు ఆదర్శమైందో చెప్పలేము. కాని కథాసాహిత్యం మీద అది చూపిన ప్రభావం అనన్యమైంది. బృహత్కథలోని కథలు కొన్ని పంచతంత్ర కథల వలెనే ప్రపంచ వ్యాప్తమైనవి. ఆయా దేశాల సాహసగాథలతో కలిసిపోయి ప్రాంతీయపు రంగులను పూసుకొన్నవి.

## అవదాన శతకం

దీనిలో బౌద్ధధర్మ సంబంధమైన కథలున్నవి. బౌద్ధ సంబంధ కథలల్లో ఇది ప్రాచీనతమ మైంది. దీనిలో నూరు కథలున్నవి, అందుకే శతకమని పేరు. “అవదాన” అంటె బౌద్ధసాహిత్యంలో సాహసకృత్యం. మానవుని జీవితం పూర్వ జన్మలోని కర్మ ననుసరించి నడుస్తుందని ఈ కథలల్లో చెప్పబడింది. ఇది గద్య రచనే అయినా అక్కడక్కడ పద్యాలు కూడ వున్నవి. దీని రచయిత ఎవరని నిర్ణయించటం కష్టం. కాని ఈ కథలు చాల ప్రాచీనమైనవని మాత్రం చెప్పవచ్చును. క్రీ.శ. 3వ శతాబ్దంలో ఇది చైనా భాషలోకి అనువదింప బడింది. ఈ కథలల్లో బింబిసార, అజాత శత్రువు వంటి చారిత్రక పురుషులు కూడ పాత్రలుగా కన్పిస్తారు. కాబట్టి క్రీ.పూ. 5వ శతాబ్దం తర్వాత ఎప్పుడో ఈ కథలు కూర్చబడి వుంటవి. అవదాన శతకంలోని కప్పిహిణ కథను తీసుకొని శివస్వామి అనే బౌద్ధ కవి కప్పిహిణాభ్యుదయ మనే మహాకావ్యాన్ని రచించాడు. శివస్వామి భారవి మాఘుల కావ్యాలను అనుకరిస్తు ఈ కథను మహాకావ్యంగా రూపొందించాడు. ఈ కవి కాశ్మీర రాజు అవంతివర్మ ఆస్థానకవి. అంటే క్రీ.శ 9వ శతాబ్దంవాడు.

## దివ్యావదానం

ఇది బౌద్ధమత హీనయాన సంప్రదాయానికి చెందింది. ఇది అవదాన శతకాన్ని అనుకరిస్తున్నది. దీనికి మూలాధారం వినయ పిటకం. క్రీ.శ. 265లో దివ్యావదానంలోని ఒక కథ చైనా భాషలోకి అనువదింప బడింది. దీనిలో కుణాలుని చారిత్రకేతి వృత్తం వున్నది. ఇందులో అశ్వఘోషుడు పేర్కొనబడటం చేత దీని రచన క్రీ.శ. మొదటి శతాబ్దం తర్వాత

జరిగిందని చెప్పవచ్చును. ఇది సంస్కృత గద్యంలో వున్నా అక్కడక్కడ సంస్కృత ప్రాకృత పద్యాలున్నవి.

క్షేమేంద్రుడు (క్రీ.శ. 11వ స॥) అవదాన కల్పలత అనే పేరుతో బౌద్ధ మత సంబంధమైన 106 కథలను రచించాడు. అవధాన శతకం మొదలైన వాటిని ఆధారంగా తీసుకొని క్షేమేంద్రుడు ఈ కథలను కూర్చాడు. దీనికి బోధిసత్త్వావదాన కల్పలత అనికూడ పేరు.

## జాతకమాల

దీనిలో బోధిసత్త్వుని పూర్వజన్మ కథలున్నవి. దీని సంకలన కర్త ఆర్యశూరుడు. దీనిలో దాదాపు 500 కథలున్నవి. ఇది సంస్కృత గద్యంలో వున్నా అక్కడక్కడ శ్లోకాలున్నవి. జాతకమాల క్రీ.శ. 434లో చైనాభాషలోకి అనువదింపబడింది. అంటే దీని రచన క్రీ.శ. 400 పూర్వమే జరిగిందని చెప్పాలి. ఈ కథల్లో బోధిసత్త్వుని పూర్వజన్మ వృత్తాంతాలే వున్నా సందర్భానుకూలంగా బౌద్ధధర్మ సంబంధమైన ఉపదేశాలు కూర్చబడినవి. బౌద్ధ ధర్మోపదేశం చేయటమే కాక నీతి, ధర్మాలను బోధించటం కూడ ఈ కథల ఉద్దేశంగా కన్పిస్తున్నది. శిబి చక్రవర్తి మొదలైన కథల ద్వారా శరణాగత వత్సలత, త్యాగం, కరుణలు బోధింపబడినవి. జాతకమాలలోని భాష ఈషత్ అలంకారమయమై సుందరంగా వున్నది. శ్లోకాలు కావ్యశైలిలో రచింపబడినవి. ఆర్యశూరుడు అశ్వఘోషుని వంటి బౌద్ధకవుల కోవలోకి చేరిన కవి. ఇందులో బౌద్ధ ధర్మసంబంధం లేని జానపద కథలు కూడ చోటు చేసుకొన్నవి.

## సూత్రాలంకారం

సూత్రాలంకారానికి కల్పనామండితక మని కూడ పేరు. ఇది కూడ గద్య పద్యమయంగా వ్రాయబడింది. ఇందులో అవదాన శతకంలోని, జాతకమాలలోని కథలు చోటు చేసుకొన్నవి. ఇది అసంపూర్ణంగా లభించింది. అశ్వఘోషుడు దీని రచయిత అని భావింపబడింది. కాని దీని రచయిత అశ్వఘోషుని తర్వాత జీవించిన కుమార లాతుడని (క్రీ.శ. 150 ప్రాంతం) తెలియవచ్చింది.

## భావ ప్రపంచ కథ

ఇది జైన సంబంధమైనది. దీని రచనాకాలం క్రీ.శ. 906 ప్రాంతం. ఇది సంస్కృత గద్యంలో కూర్చబడినా అక్కడక్కడ శ్లోకాలు కూడ వున్నవి. గద్య శైలి సరళంగా వున్నది.

# బేతాళ పంచవింశతి

బృహత్కథ యొక్క కాశ్మీర పాఠప్రతుల్లో బేతాళపంచవింశతి కథలు కూడ వున్నవని వింటర్ నిట్స్ అభిప్రాయపడినాడు. కాని కాశ్మీర పాఠప్రతులు దొరకక పోవటంచేత వింటర్‌నిట్స్ ఊహ సరియైందో కాదో చెప్పలేము. కాని ఈ పంచ వింశతి అంటె 25 కథలు క్షేమేంద్రుని బృహత్కథామంజరి, సోమదేవుని కథాసరిత్సాగరంలోను చోటు చేసుకున్నవి. నేపాళ దేశీయుడైన బుద్ధస్వామి బృహత్కథా శ్లోకసంగ్రహంలో ఈ కథలు లేవు. బేతాళపంచవింశతి మూల గ్రంథం మన కిప్పుడు లభ్యం కావటం లేదు. ఆ యా కాలాల్లో ఆ యా కవులు వ్రాసిన కథలే ఇప్పుడు బేతాళ పంచవింశతి కృతులుగా లభిస్తున్నవి. క్రీ.శ. 12వ శ॥ వాడైన శివదాసు ఈ కథలను సంస్కృత గద్య పద్యమయంగా కూర్చాడు. తర్వాత జంభలదత్తు గద్య రూపంగాను, వల్లభదేవుడు సంక్షిప్త రూపంగాను బేతాళపంచవింశతి కథలను కూర్చారు. వీటిల్లో శివదాసు రచనలో అక్కడక్కడా క్షేమేంద్రుని శ్లోకాలు కూడ ప్రక్షిప్తంగా చేరినవి. మరొక అజ్ఞాతకవి క్షేమేంద్రుని బృహత్కథా మంజరి నుంచి పంచవింశతి కథలను పద్యరూపంలో వున్నవాటిని గద్యరూపంలో కూర్చాడు. వీటన్నిటిలో శివదాసు రచనే మూల గ్రంథానికి దగ్గరైంది కావచ్చునని పండితుల అభిప్రాయం.

బేతాళపంచవింశతి కథల పుట్టుక చాల ప్రాచీనమైందని, తర్వాత కాలంలో ఇవి గ్రంథస్థం చేయబడినవని విమర్శకులు తలంచారు. ఈ కథలు తాంత్రికమత ప్రభావంతో పుట్టినవి. బౌద్ధ శైవ జైన మతాల ప్రభావం కూడ ఈ కథల మీద కన్పిస్తున్నది. వీటిల్లో కొన్ని కథలు నీతి ధర్మకామశాస్త్ర సంబంధమైనవి. ఈ కథలు చాలా కాలం కిందటనే ప్రపంచం నలుమూలల వ్యాపించినవి. ఇవి మంగోలియన్, టిబెట్ భాషల్లోకే కాక ఇంగ్లీషు, జర్మన్, ఇటాలియన్ మొదలైన యూరోపియన్ భాషల్లోకి అనువదింపబడినవి.

బేతాళపంచవింశతిలో బేతాళుడు చేప్పే 25 కథలున్నవి. బేతాళుడు అతి మానుష శక్తులుగల దయ్యం. ఈ దయ్యం శ్మశాన భూమిలోని శవాలల్లో నివాసం ఏర్పరుచు కుంటుంది. ఏ రూపమంటె ఆ రూపాన్ని ధరించగలశక్తి దానికుంటుంది. మంత్రతంత్రాలతో ఈ బేతాళున్ని వశపరుచుకొని తమకు సేవలు చేసేటట్లు చేసుకుంటారు. ఈ బేతాళ సంప్రదాయం శైవతాంత్రిక మతంలో పుట్టి బౌద్ధుల తాంత్రిక మతంలో కూడ చోటుచేసుకొన్నది. బేతాళుడు చెప్పే 25 కథలు కావటం చేత వీటికి బేతాళ పంచవింశతి అని పేరు వచ్చింది.

ప్రతి కథ ఒక చిక్కుప్రశ్నతో ముగుస్తుంది. విక్రమసేనుడు అనే రాజు దగ్గరకు ఒక యోగి వచ్చి ఒక పండునిస్తాడు. ఆ పండులో మణి వున్నదని, తనకు సిద్ధి లభించాలంటే బేతాళుని సహాయం కావాలని, బేతాళుని శ్మశానం నుంచి తీసుకురాగల పరాక్రమ సాహస ధైర్యాలు రాజులోనే వున్నవని, బేతాళుని తన కప్పగిస్తే మణి రాజుకు ఇస్తానని యోగి చెప్తాడు. అప్పుడు విక్రమసేనుడు అర్ధరాత్రి శ్మశాన భూమికి పోయి బేతాళుని మోసుకొని వస్తుండగా, బేతాళుడు తనకొక చిక్కుప్రశ్న వున్నదని దానికి జవాబు రాజుకు తెలియనట్లయితే అతనితో వస్తానని చెప్తాడు. కాని ఒక వేళ విక్రమసేనుడు జవాబు తెలిసినా తెలియదని చెప్తే తలపగిలి చస్తాడని బేతాళుడు హెచ్చరిస్తాడు. అప్పుడు బేతాళుడు చిక్కు ప్రశ్నతో కూడిన కథలను వరుసగా 25 రాత్రులు చెప్తూ పోతాడు. అన్నిటికి విక్రమసేనుడు సమాధానం చెప్తాడు. 25వ ప్రశ్నలోని చిక్కుప్రశ్నకు విక్రమసేనుడు సమాధానం చెప్పలేకపోతాడు. ఈ కథల్లోని రాజు విక్రమసేనుడు త్రివిక్రమసేనుడని ప్రాచీన కథాకారులు చెప్పగా, దేశభాషలల్లో అతడు విక్రమాదిత్యుడుగా చెప్పబడినాడు. ఈ కథలు సాహసాద్భుతాలతో కూడి పాఠకులకు కుతూహలాన్ని కలిగించేటట్లుగా వున్నవి. భారతీయుల కథాకౌశలానికి ఆటపట్టైన కథలుగా వీటిని పేర్కొనవచ్చును.

## సింహాసనద్వాత్రింశిక కథలు

ఈ కథలు కూడ విక్రమాదిత్యునికి సంబంధించినవి. ఈ కథలకు ద్వాత్రింశత్సాలభంజిక, ద్వాత్రింశత్పుత్తలిక, విక్రమచరిత్ర అనే పేర్లు కూడ వున్నవి. ఈ కథల యొక్క ప్రతులు అనేకం లభిస్తున్నవి. కొన్ని గద్యపద్యమయంగా వున్నవి. ఉత్తర, దక్షిణ భారత పాఠప్రతులేకాక జైన సంప్రదాయానికి చెందిన ప్రతులుకూడ వున్నవి. ఈ కథలను కూర్చినవాడు జైనముని క్షేమంకరుడు. క్రీ.శ. 14వ శ॥ వాడు. ఈ కథలమీద జైనమత ప్రభావం కన్పిస్తుంది. బెంగాల్ ప్రాంతంలోని ప్రతిలో కర్త వరరుచి అని పేర్కొనబడింది. దక్షిణభారత ప్రతి "విక్రమార్క చరిత్ర" అనే పేరుతో గద్య రూపంలోను చెలామణిలో వున్నది. దక్షిణభారత ప్రతియే మూలకథా గ్రంథానికి దగ్గరైందని వింటర్‌నిట్జ్ అభిప్రాయం.

సింహాసన ద్వాత్రింశికలో ద్వాత్రింశిక అంటె 32 కథలున్నవి. ఈ కథలు శివుడు పార్వతికి చెప్పినట్లుగా వున్నవి. ధారానగర రాజు భోజునికి విక్రమాదిత్యుని సింహాసనం

లభిస్తుంది. ఆ సింహాసనాన్ని ఎక్కదలచి భోజుడు సుముహూర్తాన సమీపిస్తాడు. అప్పుడా సింహాసనం 32 మెట్లమీద వున్న 32 బొమ్మలల్లో ఒకటి విక్రమాదిత్యుని సాహస పరాక్రమౌదార్యాలను ప్రకటించే కథను వినిపించి అటువంటి గుణాలు నీలో వుంటె సింహాసనంమీద కూర్చోవచ్చునని అంటుంది. భోజుడు తిరిగి వెళ్ళిపోయి మరుసటిరోజు వస్తాడు. మళ్ళా మరో బొమ్మ కథ చెప్తుంది. ఇట్లా 32 రోజులు 32 బొమ్మలు 32 కథలు చెప్తవి. ఈ కథలోని ధారానగర రాజు భోజుడు క్రీ.శ. 11వ శ॥ వాడు. ఆతని కాలంలోనే అతని ప్రశస్తిని ప్రకటిస్తు ఈ కథలు వ్రాయబడివుంటవి. ఈ కథలు క్రీ.శ. 1574 ప్రాంతంలో అక్బరు ఆదేశంమీద పర్షియన్ భాషలోకి అనువదింపబడినవి. ఈ కథలు అనేక భారతీయ భాషల్లోనే కాక మంగోలియన్, సియామీస్ భాషల్లోకి అనువదింపబడినవి.

## పంచదండచ్ఛత్ర ప్రబంధం

దీనిలోను విక్రమాదిత్యుని అద్భుత సాహసగాథలున్నవి. దీనిలో విక్రమాదిత్యుడు ఇంద్రజాలికశక్తులు కలవాడుగా చిత్రించబడినాడు. దీని కర్త జైనమతావలంబిగా కన్పిస్తాడు. క్రీ.శ. 15వ శ॥ కి పూర్వుడై వుంటాడు. దీనిలో సంస్కృతంతో పాటు మార్వారీ మాండలికభాష కూడ వున్నది.

## మాధవానల - కామకందళ కథ

దీనికర్త ఆనందుడు. విద్యాధరుని శిష్యుడు. దీనిలో మాధవానలుడనే బ్రాహ్మణుడు, కామకందళ అనే వేశ్యను ప్రేమిస్తాడు. విక్రమాదిత్యుని సహాయంతో వాళ్ళిద్దరి సమాగమం జరుగుతుంది. ఇది విక్రమాదిత్యుని దయ, ఉదార గుణాలను ప్రకటించే కథ. ఈ కథ సరళమైన సంస్కృతగద్యంలో కూర్చబడింది. అక్కడక్కడ బేతాళ పంచవింశతిలోని శ్లోకాలు చేర్చబడినవి. కొన్ని పద్యాలు ప్రాకృతభాషలో వున్నవి.

## విక్రమోదయం

దీనిలోను విక్రమాదిత్యుని కథయే వున్నది. దీనిలో విక్రమాదిత్యుడు చిలుకరూపంలో కన్పిస్తాడు. ఇది పద్యరూపంలో కూర్చబడింది. దీనిలోని పదిహేనవ కథ బైబిల్‌లోని ప్రసిద్ధమైన సాల్మన్ తీర్పు కథను పోలివున్నది.

## శాలివాహన కథ

బేతాళ పంచవింశతిని కూర్చిన కవి శివదాసు ఈ కథను రచించాడు. దీనిలో 18 సర్గలున్నవి. పద్యకావ్యమే అయినా గద్యంకూడ కన్పిస్తున్నది. దీనిలో శాలివాహనుని జననం, అతడు విక్రమాదిత్యుని చంపటం మొదలైన కథ వున్నది. శివదాసు కథార్ణవాన్ని కూడ కూర్చాడు. కథార్ణవంలో 35 కథలున్నవి.

## వీర చరిత్ర

దీని కర్త అనంతుడు. దీనిలో 30 అధ్యాయా లున్నవి. ఈ కావ్యపీఠికలో శాలివాహన విక్రమాదిత్యుల వైరకథ చెప్పబడింది. తర్వాత శాలివాహనుని సామంతరాజు శూద్రకుని, అతని కుమారుడు శక్తి కుమారుని వృత్తాంతాలు దీర్ఘంగా చెప్పబడినవి. ఇది విశాలమైన కథాకావ్యం.

## పురుష పరీక్ష

దీనికర్త విద్యాపతి. క్రీ.శ. 14వ శ॥ వాడు. దీనిలో 44 కథలున్నవి. గద్యంలో వున్నా అక్కడక్కడ శ్లోకాలున్నవి. ఒక రాజుకు అందమైన కూతురు వుంటుంది. ఆ కూతురుకు తగిన వరుడు ఎవరని అడుగగా బ్రాహ్మణుడు సత్య దయ సాహస పరాక్రమాది ఉదాత్తగుణవంతులైన పురుషులను గూర్చిన వృత్తాంతాలను చెప్తాడు. విద్యాపతి మైథిలీభాషలో ప్రసిద్ధమైన కవి. దేవీభక్తుడు. భక్తిగీతాలను మైథిలీభాషలో రచించాడు.

## ధూర్తాఖ్యానం

ప్రాకృత భాషలో కూర్చబడింది. హరిభద్రుడు దీని కర్త. పద్యరూపంలో వున్నది.

## కథాకౌతుకం

దీని కర్త వీరవర కవి క్రీ.శ. 15వ శతాబ్దంవాడు. దీనిలో 15 అధ్యాయాలున్నవి. ఈ కథలు యూసుఫ్-జులేకా కథల మీద ఆధారపడినవి. పద్యరూపంలో కూర్చ బడింది.

# శుకసప్తతి

శుకసప్తతిలో చిలుక తన యజమానుని భార్యకు 70 రాత్రులు చెప్పిన 70 కథలున్నవి. మదనసేనుడు వ్యాపారం కొరకు దేశాంతరం పోగా ఆ ఊరి రాజు అందగత్తె అయిన వణిజుని భార్య ప్రభావతితో క్రీడింపగోరి రాయబారం పంపుతాడు. రాజు కోరికను అంగీకరించి ప్రభావతి రాత్రి సమీపించగానే అలంకరించుకొని బయలుదేరబోతుంది. అప్పుడు పంజరంలోని పెంపుడు చిలుక ఆమెను ఆపి ఒక కథ చెప్పి ఆ కథలోని స్త్రీ వలె నీవు పరపురుష గమనాన్ని ఉపాయంతో తప్పిపుచ్చుకో గలుగుతావా? అని ప్రశ్నిస్తుంది. ఆ విధంగా యజమాని తిరిగి వచ్చేంతవరకు చిలుక రోజుకొక కథ చొప్పున 70 కథలు చెప్పి యజమానురాలి శీలాన్ని కాపాడుతుంది.

ఈ కథలను ఎవరు రచించారో నిర్ణయించటం కష్టం. ఇది సంస్కృత గద్యంలో వున్నది. హేమచంద్రసూరికి (క్రీ.శ. 1083-1172) ఈ కథలతో పరిచయముండటం చేత దీని రచన క్రీ.శ. 10వ శ॥ కి పూర్వమే జరిగిందని చెప్పాలి. శుకసప్తతి కథల ప్రతులు అనేకం దొరికినవి. ఈ ప్రతులు చాల భేదిస్తున్నవి కూడ. వీటి ఆధారంగా మూలగ్రంథ స్వరూప మిది అని చెప్పలేము. అనేక భారతీయ భాషల్లోకి, పర్షియన్ మొదలైన భాషల్లోకి అనువదింపబడినా మూలగ్రంథం మాత్రం నిర్ణయించటానికి వీలులేకుండా వున్నది. ఇప్పటివరకు సంస్కృత శుకసప్తతులు రెండు ప్రతులు ప్రచురింపబడినవి. ఒకటి చింతామణి భట్టు చేత ,రెండవది ఒకానొక శ్వేతాంబర జైన సాధువు చేత కూర్చబడినవి. వీటిల్లో జైన సాధువుచేత కూర్చబడింది, సులభశైలిలో కథాకథనం ప్రధానంగా వుండి, స్పష్టంగా, సంక్షిప్తంగా వున్నది. చింతామణి భట్టుచేత కూర్చబడిన ప్రతివర్ణనలతో ఆలంకారికశైలిలో, మనోరంజకంగా వున్నది. ఈ రెండు ప్రతులనే జర్మన్ భాషానువాదంతో క్రీ.శ. 1893, 1898-99 సంవత్సరాలల్లో రిచర్డ్ శ్మిట్ ప్రచురించాడు. ఆలంకారిక శైలిలో కూర్చబడిన ప్రతియే మూల గ్రంథానికి దగ్గరగా వుండవచ్చునని వింటర్ నిట్స్ అభిప్రాయం. శుకసప్తతి కథలు క్రీ.శ. 14వ శ॥లో పర్షియన్ భాషలోకి "తూతినామా" పేరుతో అనువదింపబడినవి. శుక సప్తతి కథలు ప్రాచీన కాలం నుంచే ప్రజాసామాన్యంలో వ్యాప్తిలో వున్నవి కావచ్చును. అట్లా వ్యాప్తిలో వున్న కథలనే తీసుకొని వేరు వేరు రచయితలు వేరువేరుగా వారి వారి శైలులలో చేర్పులతో మార్పులతో కూర్చి వుంటారు. అందుకే ఈ కథలు చాల పాఠభేదాలతో దొరుకుతున్నవి. ప్రాచీనమైన ఈ కథలు కొన్ని పంచతంత్రాది

కథాగ్రంథాలల్లోను ప్రవేశించినవి. ఇంకా ఈ కథ లెన్నో పశ్చిమ ఏషియా, యూరోపు దేశాలల్లో ఎన్నో భాషల్లోకి కూడ ఎక్కినవి. శుక సప్తతి కథలు మలయన్, మంగోలియన్, టర్కిష్, ఇంగ్లీషు, జర్మన్, ఇటాలియన్ మొదలైన ఎన్నో భాషల్లోకి అనువదింపబడి ఇప్పుడు లభిస్తున్నవి. శుకసప్తతిలోని కథలే అరబీ భాషలోను ప్రవేశించి "వేయిన్నొక్క రాత్రుల కథలు, సిందుబాదు నామా" కథలుగా రూపొందినవి. కథలల్లో, కథాకథన విధానంలో వీటికి శుకసప్తతి కథలకు చాల సామ్యాలున్నవి.

శుకసప్తతి కథలల్లో స్త్రీల ధూర్తత, వాక్చాతుర్యం, కపటత మొదలైన గుణాలు మనోరంజకంగా నేర్పుతో చిత్రింపబడినవి. కథను "క్లైమాక్స్" వరకు తీసుకుపోయి ఇప్పుడు ఈ పరిస్థితులల్లో ఇక ఆ స్త్రీ జారత్వం బయటపడక తప్పదని అనుకునే చోట చిలుక కథను ఆపి ప్రభావతిని ఆ స్త్రీ ఎట్లా తప్పించుకొంటుందో చెప్పమని అడుగుతుంది. ఆ తర్వాత ప్రభావతి చెప్పలేకపోతే చిలుక తాను చెప్తుంది. ఈ కథా కథన విధానం బేతాళ పంచవింశతిలో వలెనే వున్నది.

శుకసప్తతి కథలల్లో శృంగారం కొంత శృతిమించినట్లే వుంటుంది. కాని కథలు పాఠకుల కుతూహలాన్ని నిలుపుతూ, అద్భుత సంఘటనలతో మనోరంజకంగా సాగిపోతవి.

## శుకసప్తతి అనుకరణలు

శుకసప్తతిని అనుకరిస్తు కథలు కొన్ని వ్రాయబడినవి. అటువంటి వాటిల్లో "దిన ఆలాపనికా శుకసప్తతి" ఒకటి. "నిత్య సంభాషణలో చిలుక చెప్పిన 70 కథలు" అని దీని అర్థం. ఇది పద్యరూపంలో వున్నది. తెలుగుభాషలో శుకసప్తతి వంటివే "హంసవింశతి' ' అన్న కథలు క్రీ.శ. 18వ శతాబ్దంలో వ్రాయబడినవి. కథా కథన పద్ధతి శుకసప్తతిలో వలెనే వున్నది. కాని దీనిలో కథలు చిలుకచేత కాక హంసచేత చెప్పబడినవి.

## భోజప్రబంధం

దీని రచయిత బల్లాలదేవుడు. క్రీ.శ. 16వ శతాబ్దంవాడు. ఇది పద్యకావ్యమైనా అక్కడక్కడ గద్యమున్నది. దీనిలో భోజరాజుకు సంబంధించిన ఇతివృత్తమున్నది. భోజుడు ధారా నగరాధిపతి. కవి పండిత పోషకుడే కాక స్వయంగా కవి పండితుడు. ముంజరాజు తర్వాత భోజుడు రాజుకావటం, భోజుని సభావర్ణన, పండితగోష్ఠుల వర్ణనలు దీనిలో వున్నవి.

కాళిదాసు దండి బాణ మాఘ భవభూతి మొదలైన కవులందరు భోజుని ఆస్థాన కవులుగా కవి చెప్పాడు. ఇది చారిత్రకంగా అసత్యమైనా దీనిలోని కవిగోష్ఠీ సందర్భం, ప్రత్యుత్పన్నమతిత్వం హాస్యంతో కూడిన సమస్యలు, సమస్యా పూరణాలు మనోరంజకంగా వున్నవి.

## భరటక ద్వాత్రింశిక

దీని రచయిత, రచనాకాలాలను నిర్ణయించటం కష్టం. దీనిలో 32 కథలున్నవి. భరటకు లనగా సాధువులు, ముఖ్యంగా శైవసాధువులు. వారిచేత చెప్పబడిన కథలు కాబట్టి వీటికి భరటక కథలని పేరుకలిగింది. దీనిలో దుష్టులను, మూర్ఖులను గూర్చిన కథలున్నవి. ప్రధానంగా పురోహితులు చేసే దురాగతాలను పరిహసిస్తు కథలున్నవి.

జైనులు కథాసాహిత్యం మీద చాల అభిరుచిని చూపారు. వారు సంస్కృతం లోనే కాక ప్రాకృతం, అపభ్రంశ భాషలల్లోను కథలను కూర్చారు. ఉత్తమ కుమార చరిత్ర, పాపబుద్ధి, ధర్మబుద్ధి కథానిక, చంపక శ్రేష్ఠి కథానిక, పాలగోపాల కథానిక, సమ్యక్త్వ కౌముదీకథాకోశం, కథారత్నాకరం మొదలైన వెన్నో జైన కవులు వ్రాసిన కథాకావ్యాలు లభిస్తున్నవి. ఈ కవుల్లో మహీవిజయగణి క్రీ.శ. 17వ శతాబ్దంవాడు. అతని కథారత్నాకరంలో 258 కథలున్నవి. దీనిలో దుష్టుల, మూర్ఖుల, చతురురాండ్రైన స్త్రీలకు సంబంధించిన కథలున్నవి. ఈ కథలు వేటికవే స్వతంత్రంగా చెప్పబడినవి. ఇంకా చారిత్రక పురుషుల చుట్టు అల్లిన అద్భుత సాహసౌదార్య గుణాలను ప్రకటించే కథా వృత్తాంతాలతో కూడిన కావ్యాలుకూడ వున్నవి - మేరుతుంగుని ప్రబంధ చింతామణి, రాజశేఖరుని ప్రబంధకోశం మొదలైనవి.

# నీతికథలు

## పంచతంత్రం

పంచతంత్రం యొక్క అనేక పాఠాంతర ప్రతులు లభిస్తున్నవి. ఏదో ఒక పంచతంత్రం యొక్క మూలప్రతి నుంచే ఈ వివిధ పాఠాంతర ప్రతులు ఏర్పడి వుంటవి. మూలగ్రంథం మనకు దొరకక పోవటంచేత పంచతంత్రం యొక్క మూలస్వరూపం ఇది

అని నిర్ణయించి చెప్పటం కష్టం. పంచతంత్రం యొక్క మూలగ్రంథం ఇప్పటి గ్రంథాల కంటె బృహద్రూపం కలదా లేక సూక్ష్మరూపం కలదా అని కూడ నిర్ణయించడం కష్టం. మూలగ్రంథం బృహద్రూపంగా వుండి కాలక్రమాన నష్టమై సూక్ష్మరూపం ధరించింది అనేదాని కంటె మహాభారతం వలె దాని రూపం కాలక్రమంగా పెరుగుతూ వచ్చిందనటమే సమంజసంగా వుంటుంది. క్రీ.శ. 570 ప్రాంతంలోనే పంచతంత్రం పహ్లవీ భాషలోకి (పహ్లవీ పర్షియన్ భాష యొక్క మధ్యయుగ రూపం) అనువదింపబడింది. పహ్లవీ భాష నుంచి క్రీ.శ. 570 ప్రాంతంలో సిరియన్ భాషలోకి, క్రీ.శ. 750 ప్రాంతంలో అరబిక్ భాషలోకి అనువదింపబడింది. పహ్లవీ అనువాదం నష్టమైపోవటం చేత, సిరియన్ అరబిక్ అనువాదాలు ఎంతవరకు మూలాన్ని అనుసరిస్తున్నాయని చెప్పలేము. ఈ విధంగా కూడ పంచతంత్రం యొక్క మూలరూపాన్ని నిర్ణయించటానికి వీలులేకుండ పోయింది.

## పంచతంత్రం పేరు - స్వరూపం

పంచతంత్రం యొక్క మూలగ్రంథం పేరు కూడ పంచతంత్రమనే వుండేదా లేక వేరే పేరు ఏదైనా వుండేదా అని కూడ చెప్పలేము. అరబీ భాషలో "కలిల్ వ దిమ్నా" అని కర్కట దమనకులనే ప్రధాన పాత్రల పేర్లతో గ్రంథనామకరణం చేయబడింది. కర్కట దమనకులనే నక్కలు పంచతంత్రంలోని ప్రథమ తంత్రంలోనే కన్పిస్తారు. అయితే ప్రథమ తంత్రం మాత్రమే మూలగ్రంథమా? లేక పహ్లవీ అనువాదం ఒక్క ప్రథమ తంత్రం మాత్రమే జరిగిందా? ఏదీ చెప్పలేము. తంత్రాఖ్యాయిక పేరుతో పంచతంత్ర రూపాంతరమొకటి లభించింది. ఇది అలంకార శైలిలో రచింపబడింది. మొదట కొందరు విమర్శకులు దీన్ని బౌద్ధులు నిర్మించిన పంచతంత్ర ప్రతిగా తలచారు. కాని ఆ అభిప్రాయం సరియైంది కాదని తేలింది. పూర్ణభద్ర, మేఘవిజయగణి అనే జైనులు వ్రాసిన పంచాఖ్యానక పంచాఖ్యానోద్ధార అనే రూపాంతరాలున్నవి. ఇవిగాక సరళసులభ శైలిలోవున్న పంచతంత్ర ప్రతులు ఉత్తర, దక్షిణ భారతదేశంలో లభించినవి. దక్షిణ భారత ప్రతులు తమిళ సాహిత్యాన్నుంచి కథలు చేర్చబడి విశాలకాయాన్ని ధరించినవి. ఇవిగాక విద్యార్థుల కొరకు సరళశైలిలో వ్రాసిన పంచతంత్ర ప్రతులెన్నో కొల్లలుగా లభించినవి. ప్రతి ప్రతిలోను ఏదో కొంత భేదం కన్పిస్తూ వుంటుంది. ప్రతి రచయిత ఏవో కొన్ని కథలను, ప్రాంతీయంగా ప్రచారంలో వున్న కథలను, ఇతర గ్రంథాల నుంచి కథలను కొత్తగా చేరుస్తూపోయాడు. ఇవిగాక నేపాళ దేశంలో నేపాలీ భాషానువాదంతో కూడిన సంస్కృత

పంచతంత్రం దొరికింది. ఈ పంచతంత్రం తంత్రాఖ్యాయికకు దగ్గరగా వున్నదని హెర్టెల్ అభిప్రాయం.

ఈ గ్రంథంలో పంచ అంటె ఐదు తంత్రాలుండటంచేత ఈ పేరు కలిగింది. ఈ ఐదు తంత్రాల పేర్లు - 1) మిత్రభేదం 2) మిత్రలాభం 3) కాకోలూకీయం 4) లబ్ధప్రణాశం 5) అపరీక్షిత్త కారకం. మొదటి తంత్రంలో రెండు నక్కలు సింహం ఎద్దుల నడుమ భేదాన్ని పుట్టించిన వృత్తాంతమున్నది. రెండవ తంత్రంలో మిత్రత్వం, ఐకమత్యంవల్ల కలిగే లాభాలు చెప్పబడినవి. మూడవ తంత్రంలో యుద్ధం దాని కారణాలు, సంధివల్ల ఉపయోగం చెప్పబడినవి. నాలుగవ తంత్రంలో లభించిన వస్తువు అసావధానంచేత నష్టమెట్లా అవుతుందో తెలుపబడింది. ఐదవ తంత్రంలో విచారణ, ముందుచూపులేక చేసిన కార్యమెట్లా వినాశమౌతుందో చెప్పబడింది. అన్ని ప్రాంతాలల్లో పాఠప్రతు (సంస్కరణ) లల్లో ఇవే ఐదు ప్రకరణాలున్నవి. కాని కొన్నిసార్లు కూర్చిన కథలలో రూపంలో, కథల సంఖ్యలో భేదాలున్నవి. నీతి, రాజనీతి, వ్యవహార జ్ఞానాన్ని బోధించటమే ఈ కథల ప్రధానోద్దేశం.

## పంచతంత్ర రచనాకాలం

పంచతంత్ర రచనాకాలాన్ని నిర్ణయించటానికి కూడ ఏ ఆధారాలు లేవు. పంచతంత్రంలోని కథలు క్షేమేంద్రుని బృహత్కథామంజరి, సోమదేవుని కథా సరిత్సాగరంలోను చోటుచేసుకొన్నవి. క్రీ.శ. 570 ప్రాంతంలోనే పంచతంత్రం పహ్లావీ భాషలోకి అనువదింపబడటంచేత దీని రచన క్రీ.శ. 400కు పూర్వమే జరిగిందని చెప్పాలి. పంచతంత్ర రచయిత చంద్రగుప్త మౌర్యుని మంత్రి చాణక్యుడని ప్రచారంలో వున్నది. అప్పుడు ఇది క్రీ.పూ. 900 నాటి రచన అని మహామహోపాధ్యాయ సదాశివశాస్త్రి అభిప్రాయం. పంచతంత్రం క్రీ.పూ. 3వ శతాబ్దానికి పూర్వరచన మాత్రం కాదని వింటర్‌నిట్స్ అభిప్రాయం. మరికొందరు విమర్శకులు భాషాదృష్టితో పరిశీలించి పంచతంత్రం గుప్తులకాలంలో రచింపబడిందన్న నిర్ణయానికి వచ్చారు. మహామహోపాధ్యాయ దుర్గాప్రసాదశర్మ, పంచతంత్ర రచనా కాలాన్ని క్రీ.శ. 8వ శ॥ వరకు తీసుకొనిపోయాడు. పంచతంత్రం ప్రథమభాగంలో క్రీ.శ. 8వ శ॥ నాటి దామోదరగుప్తుని కుట్టినీమతంలోని శ్లోకాలుండటంచేత విష్ణుశర్మ అనే వ్యక్తి క్రీ.శ. 8వ శ॥ ప్రాంతంలో పంచతంత్రాన్ని రచించాడని ఆయన భావించాడు. క్రీ.శ. 6వ శ॥ లోనే

పంచతంత్రం పహ్లావీ, సిరియన్ భాషల్లోకి అనువదింపబడినా క్రీ.శ. 8వ శ॥ తద్రచనాకాలంగా భావించటం సమంజసంగా లేదు.

హెర్టల్, కీథ్ వంటి పాశ్చాత్య విమర్శకులు పంచతంత్ర రచనాకాలాన్ని క్రీ.శ. 200 తర్వాత రచన అని అంగీకరించారు. ఇప్పుడు లభ్యమయ్యే పాఠప్రతులను పరిశీలించినట్లయితే భాషాదృష్టితో పంచతంత్రం గుప్తుల నాటి రచనగానే కన్పించవచ్చును. కాని ఈ ప్రతులు మూలగ్రంథం కావని అందరికి తెలిసిందే కాబట్టి మూలగ్రంథం కూడ గుప్తుల కాలంనాటి రచనగా నిర్ణయించటానికి వీల్లేదు. నీతి ధర్మబోధన సామాన్య ప్రజానీకానికి సులభపద్ధతిలో సరళంగా చేయటానికి బౌద్ధులు, జైనులు కథాప్రక్రియను చేపట్టారు. బౌద్ధ, జైనుల ఆదరణలో కథా సాహిత్యం విరివిగా పెరిగింది. బౌద్ధ జైన మతాల వ్యాప్తితో కథలు కూడ ప్రజా లోకంలో వ్యాపించినవి. హిందూమతానుయాయులు కూడ కథాప్రక్రియను చేపట్టారు. వారు కూడ ఎన్నో నీతి ధర్మ బోధకమైన కథలను వ్రాసారు. బౌద్ధ, జైన మతాల వ్యాప్తితోనే కథలకు విలువ హెచ్చింది. ఆ సమయంలోనే ఎవరో పంచతంత్ర కథలను నీతి, రాజనీతి కార్య కుశలతలను బోధించడానికే కూర్చి వుంటారు. వీటిల్లో కథలన్ని ఒక్క రచయిత చేత అల్లబడినవి కాక అంతకు పూర్వమే ప్రజలల్లో వ్యాప్తిలో వున్న కథలెన్నో గ్రహింపబడి వుంటవి. అట్లా కొన్ని కథలు అతి ప్రాచీనమైనవై మానవుని అభివృద్ధి వికాసాలతో పుట్టి వికసించినవి కావచ్చును. మొత్తంమీద పంచతంత్రం మూలరచన ప్రాచీనకాలంలోనే క్రీస్తుకు పూర్వమే జరిగి వుంటుంది. ఎక్కువకెక్కువ క్రీ.పూ. 5వ శతాబ్దం అంటె బౌద్ధ, జైన మతాల వ్యాప్తి తర్వాత ఈ కథల రచన జరిగిందని మాత్రం చెప్పవచ్చును. కథాసాహిత్యపు సృష్టి, వికాసాల చరిత్రను పరిశీలించినట్లయిన ఈ కాలనిర్ణయమే సమంజసమని తోస్తున్నది. తర్వాత వివిధ కాలాల్లో పంచతంత్రం వివిధ రచయితల చేతుల్లో నూతన కథల ప్రక్షిప్తాలతో పెరుగుతూ, మారుతూ, రూపాంతరాలను పొందుతూ వచ్చిందనటంలో సందేహం లేదు.

పంచతంత్ర రచయిత ఎవరనే విషయంలో చాల అభిప్రాయ భేదాలున్నవి. పంచతంత్ర రచయిత విష్ణుశర్మ అని ప్రతీతి. దక్షిణదేశంలో మహిలారోప్య నగరానికి రాజు అమరశక్తి. అమరశక్తి మూర్ఖులైన తన ముగ్గురు కొడుకులను ఆరునెలల్లో నీతిశాస్త్ర పారగులను చేయాలని ఆస్థాన పండితుడు విష్ణుశర్మను నియోగిస్తాడు. అప్పుడు విష్ణుశర్మ పంచతంత్రాన్ని వ్రాసి ఆ కథల ద్వారా వారిని నీతిమంతులను చేస్తాడు. ఈ విష్ణుశర్మ

అన్నది చంద్రగుప్త మౌర్యుని మంత్రి, అర్థశాస్త్రకర్త అయిన చాణక్యుని పేరే అని అంటారు. కాని చాణక్యుని పేరు విష్ణుగుప్తుడని అంటారే కాని విష్ణుశర్మ అని కాదు. హెర్టెల్, కీథ్‌లు చాణుక్యుని పంచతంత్ర రచయితగా అంగీకరించలేదు. వారి అభిప్రాయంలో పంచతంత్రం క్రీ.పూ. 200 తర్వాత వ్రాయబడింది. చాణుక్యుడేమో క్రీ.పూ. 300 ప్రాంతం వాడు. పంచతంత్ర పాఠప్రతులెన్నో దేశమంతటా దొరికినా దాని రచయిత ఎవరని కచ్చితంగా చెప్పటం సాధ్యంకాదు. ఒకవేళ ఈ కథలు మౌఖిక రూపంలో చాలాకాలం ప్రజల్లో వ్యాప్తిలో వుండి వుండవచ్చును. అట్లా సంప్రదాయ రూపమైన కథలను విష్ణుశర్మ అన్న పండితుడు రాజకుమారుల విద్యాబోధన కొరకు ఒక్కచోట కూర్చి ఒక రూపాన్ని ఇచ్చాడేమో. కాబట్టి సంప్రదాయం ప్రకారం పంచతంత్ర రచయిత ఒకానొక విష్ణుశర్మ అని చెప్పుకొన్నా దానిలోని కథలు మాత్రం వివిధ వ్యక్తుల మేధాసంపత్తినుంచి పుట్టినవని చెప్పాలి.

పంచతంత్ర రచన ఏ ప్రాంతంలో జరిగిందనే విషయంలోను ఏకాభిప్రాయానికి రావటం కష్టం. కొందరు ఇది కాశ్మీర దేశంలో, మరికొందరు దక్షిణ భారతంలో వ్రాయబడిందని అంటారు. వర్ణనల ఆధారంగా ఇది దక్షిణ భారతంలో వ్రాయబడినట్లుగా వున్నదని డా. బాబూరామ్ త్రిపాఠి అంటాడు. తంత్రాఖ్యాయికే మూల పంచతంత్ర స్వరూపానికి దగ్గరగా వున్నదని హెర్టెల్ అభిప్రాయం. తంత్రాఖ్యాయిక దక్షిణభారత పంచతంత్ర ప్రతులకు చాల దగ్గరగా వున్నది.

పంచతంత్రం జైన మతం నేపథ్యంగా, ఆ మత ప్రభావంతో పుట్టిందని కొందరు తలంచారు. బెయిన్ఫీ వంటి విమర్శకులు కొందరు పంచతంత్రం బౌద్ధ మతం నేపథ్యంగా, ఆ మత ప్రభావంతో పుట్టిందని భావించారు. కొన్ని జాతక కథలు పంచతంత్రంలో కన్పించటంచేత బెయిన్ఫీ పై నిర్ణయానికి వచ్చాడు. హెర్టెల్ ఈ అభిప్రాయాన్ని సమర్థించలేదు. ఏ. బార్త్, బ్యూలర్‌లు బెయిన్ఫీ అభిప్రాయం తప్పు అని తలంచారు. ఇప్పుడు లభ్యమయే పంచతంత్రంలో హిందూ మత ప్రభావమే ఎక్కువ కన్పిస్తున్నది. అందులో వైదిక మత ఛాయలు కాక పౌరాణిక హిందూ మతం ఛాయలు కన్పిస్తున్నవి. పౌరాణిక హిందూమతంలోను వైష్ణవాభిమానం కన్పిస్తున్నదని కీథ్, వింటర్‌నిట్జ్‌లు అభిప్రాయ పడినారు. అయినా ధార్మికబోధ చేయటం పంచతంత్ర ఉద్దేశం కాదు. అక్కడక్కడా బ్రాహ్మణులను విమర్శించటం కూడ కన్పిస్తున్నది. పౌరాణికహిందూమతం బాగా వికసించిన సమయంలోనే ఈ పంచతంత్ర గ్రంథం కూర్చబడిందని, దానిలో ప్రతిబింబించిన పరిస్థితులనుబట్టి

తెలుస్తున్నది. కాని పంచతంత్రంలో అక్కడక్కడ చెప్పబడిన సత్య, దయ, త్యాగం, అహింస, పరోపకారాది విషయాలను పరిశీలిస్తే బౌద్ధ, జైన మతాల ప్రభావం వున్నట్లుగాను అంగీకరించవలసి వుంటుంది. దీన్ని బట్టి వైదిక మతం క్షీణించి బౌద్ధ, జైన మతాలు పుట్టిపెరిగిన తర్వాత అంటె క్రీ.పూ. 6వ శ॥ తర్వాత మరియు క్రీ.శ. 6వ శ॥ కి పూర్వం పంచతంత్ర రచన జరిగిందని చెప్పవలసి వుంటుంది.

## పంచతంత్రం యొక్క విశిష్టత

పంచతంత్రం పండిత పామరులను అందరినీ ఆకర్షించింది. అనేక ప్రపంచ భాషల్లోకి అది అనువదింపబడింది. ప్రపంచంలోని 50 భాషలల్లో, జావా మొదలుకొని ఐస్‌లాండ్ వరకు 200 రూపాంతరాలున్నవని హెర్టెల్ "దాస్ పంచతంత్ర ఆయినే గెషిష్టే ఉండ్ ఆయినే ఫెర్ బ్రైటుంగ్" అనే గ్రంథంలో తెలియజేసాడు. ప్రపంచంలో పంచతంత్రం యొక్క వ్యాప్తిని గూర్చి థియోడార్ బెయిన్ఫీ విశేషంగా కృషిచేసి ప్రపంచ దేశాలన్నీ పర్యటించి పరిశీలనలు చేసి బయటపెట్టి వున్నాడు.

పంచతంత్రం ప్రధానంగా ఉపదేశ గ్రంథం. దీనిలోని కథల ద్వారా పాఠకులకు నీతి. రాజనీతి, లోకజ్ఞానం, వ్యవహార కుశలతలు లభిస్తవి. సరళమైన హృదయంగమమైన శైలిలో, సులభ కథాకథన పద్ధతిలో ఈ కథలు విషయబోధను చేస్తున్నవి. ఒకవైపు మనోరంజనాన్ని కలిగిస్తు మరొకవైపు అప్రయత్నంగానే విజ్ఞానాన్ని బోధించే ఈ కథలు అపూర్వమైనవి. పసి బాలుడైనా వీటిని వినటానికి, చదవటానికి కుతూహలపడ్తాడు. గంభీరమైన విషయాలను సైతం సరళంగా బాలురకు బోధించే ఈ కథలు అద్వితీయమైనవి. ఉగ్గుపాలతో బాలబాలికలకు విషయ విజ్ఞానబోధనే కాక పాఠకుని వ్యక్తిత్వం, చరిత్రలను కూడ తీర్చి దిద్దేవి ఈ కథలు.

పంచతంత్రంలో మరొక అత్యాకర్షణీయమైన విషయం దానిలోని పాత్రలు. ఆ కథలల్లో చాలా మట్టుకు పాత్రలు పశుపక్ష్యాదులు. స్వభావ నిర్ణయంచేసి కవి వాటిని ఆయా పాత్రలుగా నిలిపాడు. దీనిలో సజీవ ప్రాణులేకాక నిర్జీవ పదార్థాలు కూడ పాత్ర ధరిస్తవి. ఉదా॥ కు నది, వృక్షం, పర్వతం, గుహ, సముద్రం, మొ॥నవి. వీటిలో మానవీయ వ్యవహారం ఆరోపింపబడింది. పశుపక్ష్యాదుల్లో నక్క, సింహం, ఎద్దు, ఒంటె, పావురం, ఎలుక, పాము, మొసలి, ముంగిస, కొంగ, గద్ద చీమలు మొదలగునవి కన్పిస్తవి. పంచతంత్ర కథలు మధ్య

ఏశియా, పాశ్చాత్య దేశాల్లోని వివిధ భాషల్లోకి పాకి ప్రాంతీయమైన రంగులను పూసుకొని వివిధ రూపాలను ధరించినవి. ఆధునిక కాలంలో పశుపక్ష్యాదులు పాత్రలుగా గలిగి పిల్లలకు మనోరంజనం చేసే ఇంగ్లీషులోని పుస్తకాలకు చలనచిత్రాలకు మూలాధారం ఈ పంచతంత్ర కథల ప్రభావమే.

సామాన్య మానవుడు చివరకు మూర్ఖుడైనా ఈ కథలను చదివి విజ్ఞానాన్ని పొందుతాడనటంలో అతిశయోక్తి లేదు. సరళ పద్ధతిలో మానవ జీవితపు గంభీర వ్యవహారాలను బోధించే మార్గాన్ని కనిపెట్టిన మన పూర్వుల ప్రతిభ అద్వితీయం!

## తంత్రాఖ్యాయిక

తంత్రాఖ్యాయిక రచనాకాలాన్ని గాని రచయితను గాని నిర్ణయించి చెప్పలేము. దీనిలో పంచతంత్రంలోని కథలే కాక ఇతర అనేక కథలు చేర్చబడినవి. అంటే పంచతంత్ర గ్రంథం యొక్క విస్తృత రూపమే తంత్రాఖ్యాయిక. తంత్రాఖ్యాయిక మూల పంచతంత్ర గ్రంథానికి దగ్గరి రూపాంతరమని హెర్టెల్ అభిప్రాయం. పంచతంత్రాని కిది ప్రాచీనమైన రూపాంతరం. ఇది కాశ్మీర దేశంలో ఎక్కువగా ప్రచారంలో వుండింది. పంచతంత్రం బౌద్ధమతం నేపథ్యంగా పుట్టిందని భావించిన బెయిన్ఫే తంత్రాఖ్యాయికలో బౌద్ధమత ప్రచారం లేదని తర్వాత అంగీకరించాడు. బౌద్ధ జైనమత ప్రభావాలేవి కొందరు తలచినట్లుగా తంత్రాఖ్యాయిక కథలల్లో కన్పించటం లేదని వింటర్నిట్స్ అభిప్రాయం. తంత్రాఖ్యాయిక ప్రతులు అనేకం లభించినవి. కొన్ని ప్రతులల్లో సంస్కృత గద్యంతో పాటు అక్కడక్కడ శ్లోకాలు కూడ చేర్చబడినవి. కొన్ని శ్లోకాలు జైన గ్రంథాల నుంచి కూడ తీసుకోబడినవి. మరికొన్ని ప్రతులు నేపాల్ దేశభాష అయిన నేపాలీ భాషానువాదంతో కూడివున్నవి. కథలన్నీ శ్లోకాలల్లో కూర్చబడిన ప్రతులు కూడ లభించినవి. లభించిన తంత్రాఖ్యాయిక ప్రతులలో క్రీ.శ. 1484 నాటిది ఒకటి ఉన్నది. దాన్నిబట్టి వింటర్నిట్స్ తంత్రాఖ్యాయిక రచన క్రీ.శ. 14వ శ॥ ప్రాంతందని నిర్ణయించాడు. కాని లిఖితప్రతి ఒక్కటి పాతది లభించిందాన్నిబట్టి తద్రచనాకాలాన్ని నిర్ణయించి చెప్పటం సమంజసంగా లేదు. ఒకవేళ క్రీ.శ. 1484 కు పూర్వం వ్రాయబడిన ప్రతులు మిగలకుండా నశించి కూడ వుండవచ్చును. చెప్పలేము.

తంత్రాఖ్యాయికలోని శైలి కొంతవరకు ఆలంకారిక శైలిలో నడిచింది. గద్యం

అలంకారాలతో కూడి వున్నది. అక్కడక్కడ దీర్ఘ సమాసాలు కూడ వున్నవి. శ్లోకాలుకూడా కావ్యశైలిలో అక్కడక్కడ శ్లేషాదుల చమత్కారంతో వ్రాయబడినవి. ఆలంకారిక శైలిలో ఎక్కడా కృత్రిమత్వం లేదని వింటర్‌నిట్స్ అభిప్రాయం. మొత్తంమీద శైలి కావ్యమార్గంలో వున్నా కఠినంగా కాక సరళ పద్ధతిలోనే వున్నది. రచయిత పెద్దగా కవి కాకపోవటంచేత ఎక్కడా అతడు కథలను చెప్పటం విడిచిపెట్టి అనవసర వర్ణనల జోలికి పోక సరళసులభ కథాకథన శైలినే అనుసరించాడు. తంత్రాఖ్యాయికలో అనేక శ్లోకాలు కౌటిల్యుని అర్థశాస్త్రం నుంచి ఉద్ధరింపబడినవి. శ్లోకాలేకాక నీతిశాస్త్ర సంబంధమైన సాంకేతిక పదాలు కూడ తీసుకోబడినవి. దీన్నిబట్టి తంత్రాఖ్యాయిక క్రీ.పూ. 3వ శ॥ తర్వాత రచన అని నిర్ణయించ వచ్చును.

## పంచాఖ్యానకం

ఇదికూడ పంచతంత్రం యొక్క రూపాంతరమే. ఇది జైనసంప్రదాయానికి సంబంధించింది. దీన్ని జైనముని పూర్ణభద్రుడు క్రీ.శ. 1199 ప్రాంతంలో రచించాడు. తన ఆశ్రయదాత రాజు సోముని ఆదేశం మీద ఈ కవి ఈ గ్రంథాన్ని రచించాడు. పూర్ణభద్రుడు తాను పంచతంత్రాన్ని వున్నదున్నట్లుగా అనుసరించానని స్వయంగా చెప్పాడు. అయినా అతడు పంచతంత్రమే కాక ఇతర గ్రంథాల నుంచి కూడ కథలను తీసుకొని చేర్చాడు. ఈ కవి తంత్రాఖ్యాయికను కూడ ఆధారంగా తీసుకొన్నాడు. తర్వాత కాలంలో వచ్చిన రూపాంతరాలల్లో ఇది ఉత్తమమైందని వింటర్‌నిట్స్ అభిప్రాయం. ఇది వున్నదున్నట్లుగా జర్మన్, ఇంగ్లీషు భాషల్లోకి అనువదింపబడింది.

## పంచాఖ్యానోద్ధారం

దీని రచయిత జైనముని మేఘ విజయగణి. దీని రచనా కాలం క్రీ.శ. 1659-60 ప్రాంతం. మేఘ విజయగణి ప్రధానంగా గుజరాత్ భాషలో వత్సరాజు (క్రీ.శ. 1591-92) వ్రాసిన "పంచాఖ్యాన చౌపాయి" ని ఆధారంగా తీసుకొని దీన్ని వ్రాసాడని హెర్టెల్ తెల్పాడు. ఇది పద్యశైలిలో వ్రాయబడింది. మేఘ విజయగణి ఇంకా ఇతర కథలను కూడ దీనిలో చేర్చాడు. ఈ కథలన్నీ గ్రీకు-భారతీయ జానపద కథల తులనాత్మక పరిశీలనకు బాగా ఉపయోగిస్తాయని వింటర్‌నిట్స్ తలచాడు. పంచాఖ్యానోద్ధారం ముఖ్యంగా విద్యార్థులను దృష్టిలో పెట్టుకొని వ్రాయబడింది.

## సరళ పంచరత్నం

దీనికి ఆధారం పంచతంత్ర తంత్రాఖ్యాయికలు. ఇంకా ఇతర కథలు కూడ దీనిలో చోటుచేసుకొన్నవి. దీని రచనాకాలం క్రీ.శ. 1000 ప్రాంతం. ఈ కథలల్లో బ్రాహ్మణ, ఋషుల స్థానంలో జైనసాధువులు క్షపణకులు కన్పిస్తారు. దీన్నిబట్టి ఇదికూడ జైనుల రచన అని తెలుస్తున్నది. జైనధర్మ విరుద్ధమైన కథలను విడిచి పెట్టి రచయిత తదను కూలమైన వాటిని తీసుకొని, మరికొన్నిటిని తదనుకూలంగా మార్చి కథలను రచించాడు. దీనివల్ల గ్రంథానికి ఒక కొత్త రూపం వచ్చింది. రచయిత ఎవరో చెప్పలేము. పేరునుబట్టి సరళంగా, సులభంగా అందరికి అర్థమయ్యే టట్లుగా కథలను చెప్పటమే ఉద్దేశంగా కన్పిస్తున్నది.

## హితోపదేశం

హితోపదేశం పంచతంత్రం యొక్క రూపాంతరాలలో ఒకటి. పంచ తంత్రంలోని కథలన్నీ దీనిలో చోటు చేసుకొన్నవి. "పంచతంత్రా త్తథాన్యస్మాద్ గ్రంథాదాకృష్య లిఖ్యతే" అని రచయిత పంచతంత్రాన్ని అనుసరించి రచించినట్లుగా చెప్పుకున్నా అనేక విధాలుగా, అనేక చోట్ల రచయిత స్వతంత్రించే హితోపదేశాన్ని రచించాడు. ఎన్నో కథలను కొత్తవాటిని రచయిత దీనిలో చేర్చాడు. పంచతంత్ర పరిచ్ఛేదాల పేర్లు, క్రమం కూడ దీనిలో మారినవి. అక్కడక్కడ కామందకీయ నీతిశాస్త్రం నుంచి శ్లోకాలు ఉద్ధరింపబడినవి. పంచతంత్రలో వలె ఐదు భాగాలు లేక దీనిలో నాలుగే భాగాలున్నవి. అవి- మిత్రలాభం, సహృద్భేదం, విగ్రహం, సంధి. హితోపదేశంలోని మిత్రలాభం పంచతంత్రంలోని మిత్రలాభానికి, సుహృద్భేదం మిత్రభేదానికి, విగ్రహం కాకోలూకీయ లబ్ధ ప్రణాశాలకు రూపాంతరంగా వున్నవి. హితోపదేశంలోని సంధి పరిచ్ఛేదం స్వతంత్రమైంది. పంచతంత్రంలో కన్న కవి ఎక్కువ కథలను కూర్చాడు. ఎక్కువ కథలే కాక ఎక్కువ ఉపదేశాత్మకత కూడ ఈ కథలల్లో కన్పిస్తున్నది. దీన్నిబట్టి హితోపదేశం అన్నపేరు ఈ పుస్తకానికి తగినట్లుగా వున్నది. ఒకొకసారి రచయిత దృష్టి కథాకథన నిర్వహణంకన్న ఉపదేశ బోధన మీదే ఎక్కువ. అయినా కథాకథనంలో ఎక్కడా లోపం జరుగలేదు. పంచతంత్రంలోకన్న భాష దీనిలో సరళంగా వున్నది. సామాన్యమైన సంస్కృత జ్ఞానం కలవారికి కూడ ఈ

గ్రంథం వెంటనే అర్థమౌతుంది. సంస్కృత భాషా పరిచయం చేసుకోదలచిన వారికి కూడ ఈ గ్రంథం ప్రాథమిక పుస్తకంగా బాగా ఉపయోగిస్తుంది. బాల బాలికలకు కూడ ఇది పఠనయోగ్యంగాను, ఉపదేశాత్మకంగాను వున్నది. సందర్భానుకూలంగా రచయిత లోకోక్తులను ప్రయోగించి రక్తి కట్టించాడు. హితోపదేశానికి దక్షిణ భారత పంచతంత్ర ప్రతియే ఆధారమైందని విమర్శకుల అభిప్రాయం.

హితోపదేశ రచయిత నారాయణుడు. ఈ కవి బెంగాల్‌ను పాలించిన ధవళచంద్రుని ఆస్థానకవి. కవి కాలనిర్ణయం చేయడం కష్టమే అయినా హితోపదేశ హస్తలిఖిత ప్రతి క్రీ.శ. 14వ శ॥ నాటిది దొరకడం చేత దీని రచన అంతకు పూర్వమే జరిగిందని చెప్పవచ్చును. హితోపదేశం అనేక భారతీయ భాషల్లోకే కాక అనేక యూరోపియన్ భాషల్లోకే ఒకటి కంటె ఎక్కుసార్లు అనువదింపబడి వ్యాప్తిని చెందింది. యూరోపియన్ భాషానువాదాలల్లో క్రీ.శ. 1790 లో చేయబడిన ఫ్రెంచ్ భాషానువాదం ప్రాచీనమైంది.

## ప్రపంచ భాషల్లో పంచతంత్రం

పంచతంత్రం సంస్కృతంలో వివిధ పాఠప్రతులతో లభించటమే కాక ఆయా ప్రాంతాలల్లో ఆయా కాలాల్లో వేరు వేరు రూపాలను ధరించి వేరు వేరు పేర్లతో కూడా చలామణి అయింది. తంత్రాఖ్యాయిక, పంచాఖ్యానకం, సరళ పంచరత్నం, హితోపదేశం మొదలైన పేర్లతో వేరువేరు రచయితలచేత వ్రాయబడి రూపాంతరాలతో పంచతంత్రం సంస్కృతంలో వ్యాప్తి చెందింది. ఇంకా అనేక ఇతర కథా గ్రంథాలల్లోని కథలు గ్రహింపబడినవి. అంతేగాక పంచతంత్రం అనేక భారతీయ భాషల్లోకి అనువదింపబడింది. పంచతంత్రంలోని కథలు వ్యాపారుల చేత, యాత్రికుల చేత బౌద్ధ భిక్షువుల చేత తీసుకొని పోబడి ప్రపంచమంతటా వ్యాపించినవని పాశ్చాత్య విమర్శకుల అభిప్రాయం. మలయా మొదలుకొని ఐస్‌లాండ్ వరకున్న ఆసియా, ఆఫ్రికా, యూరోపు ఖండాలల్లో పంచతంత్ర కథలు వ్యాపించినవి. ఆయా దేశాలల్లో ఈ కథలు ఆయా దేశపు దుస్తులను ధరించి, గుర్తించటానికి కూడ వీల్లేనంతగా వ్యాప్తితో వున్నవి. ఆయా దేశపు ప్రాంతపు వ్యక్తుల పేర్లతో రూపురంగుతో ముడివడి పోయినవి. ఉదా॥ కు ఇంగ్లండులోని ఉత్తర వేల్స్ ప్రాంతంలోని బెడ్ గెలెర్ట్ అనే గ్రామానికి వింటర్‌విట్స్ ఒకసారి పోయాడట. అందమైన పర్వతాల చేత చుట్టబడిన ఆ

గ్రామ సౌందర్యానికి ఆయన ముగ్ధుడైనాడు. ఆ గ్రామానికా పేరు ఎట్లా వచ్చిందో తెలుసుకోవాలని అతనికి కుతూహలం కలిగి ఆ గ్రామస్థుని ఒకన్ని అడిగాడు. అప్పుడా గ్రామస్థుడు ఈ కథను చెప్పాడట- " ఆ గ్రామంలో పూర్వ లెవలీన్ పేరుగల వ్యక్తి వుండేవాడు. ఆయన దగ్గర గెలెర్ట్ అనే పేరుగల కుక్క వుండేది. ఒకరోజు ఆయన వేటకు అరణ్యానికి పోయి తిరిగివస్తుండగా మార్గమధ్యంలో రక్తంతో తడిసిన మూతితో కుక్క గెలెర్ట్‌కు ఎదురైంది. లెవలీన్ ఇంటికి పరుగెత్తిపోయి తన పాప పడక ఖాళీగా, రక్తపుమరకలతో వుండటం చూచి పాపను కుక్కే చంపిందని అనుకొని ఆయన కత్తితో ఆ కుక్కను చంపేసాడు. కాని తర్వాత తన పాప క్షేమంగా సమీపంలోనే ఆడుకోవటం, ఆ పక్కనే తోడేలు ఒకటి రక్తంలో మునిగివుండటం చూచి, లెవలీన్ జరిగదిందంతా అర్థం చేసుకొని, తాను చేసిందానికి చాల దుఃఖించి ఆ కుక్కకు స్మృతి చిహ్నంగా చక్కటి సమాధిని కట్టించాడట. ఆ గెలెర్ట్ సమాధి వున్నచోటు కాబట్టి ఆ వూరుకు బెడ్ గెలెర్ట్ అన్న పేరు వచ్చిందట." "తన కుక్కను చంపినట్లు విచారిస్తున్నా"డని వేల్శ్ భాషలో సామెత కూడ వున్నదట. నిజంగా జరిగిన సంఘటనగానే చెప్పబడే ఈ వృత్తాంతం పంచతంత్రంలోని నకుల కథకు రూపాంతరమే అనటంలో సందేహం లేదని వింటర్‌నిట్స్ అభిప్రాయం. ఈ విధంగా ఎన్నో పంచతంత్ర కథలు నమ్మటానికి వీల్లేనంతగా ఆ యా దేశాల నిజ జీవితంలో భాగంగా మారి ప్రపంచంలో వ్యాపించినవి.

పంచతంత్రాన్ని గూర్చి విశేషంగా కృషిచేసినవారు జర్మన్ పండితులు ఇద్దరున్నారు- థియోడార్ బెయిన్ఫే, యోహాన్నెస్ హెర్టెల్. ప్రపంచంలోని వివిధ దేశాలల్లో పంచతంత్ర వ్యాప్తిని గూర్చి బెయిన్ఫే విశేషంగా కృషిచేసి ఎన్నో విషయాలను బయట పెట్టాడు. వివిధ పంచతంత్ర ప్రతులను పరిశీలించి అధ్యయనం చేసి వాటివాటి స్వరూపాలను నిర్ణయించటమే గాక శాస్త్రీయ పద్ధతిలో కృషి చేసి మూల పంచతంత్ర స్వరూపాన్ని కనుక్కోవటానికి కృషి చేసినవాడు హెర్టెల్. పంచతంత్రాన్ని గూర్చి ఈనాడు మనకెన్నో విషయాలు తెలుస్తున్నాయంటే అది ఈ ఇద్దరు పరిశోధకుల కృషిఫలితమే. తర్వాత పంచతంత్రాన్ని గూర్చి విశేషంగా కృషిచేసిన విమర్శకుడు ఫ్రాంక్లిన్ ఎడ్గర్టన్. సవిమర్శనాత్మకమైన ఉపోద్ఘాతంతో, ఇంగ్లీషు అనువాదంతో పంచతంత్రం యొక్క శుద్ధ ప్రతిని ఇతడు క్రీ.శ. 1924లో ప్రచురించాడు. పంచతంత్రం 50 ప్రపంచ భాషల్లోకి అనువదింపబడిందని హెర్టెల్ తేల్చాడు. ఆధునిక కాలంలో కాక ప్రాచీన కాలంలోనే కొన్ని అనువాదాలు జరిగినవి. ఇరాన్ రాజు ఖుస్రూ అనుశేర్వాన్ (క్రీ.శ. 531-579) ఆదేశంతో బుర్జో అనే పండితుడు పంచతంత్రాన్ని పహ్లవీ

భాషలోకి అనువదించాడు. క్రీ.శ. 570 ప్రాంతంలో బూద్ అనే మతగురువు పహ్లవీ పంచతంత్రాన్ని సిరియన్ భాషలోకి అనువదించాడు. పహ్లవీ అనువాదం ఇప్పుడు దొరకటం లేదు కాని సిరియన్ అనువాదం అసంపూర్ణంగా దొరుకుతున్నది. క్రీ.శ. 750 ప్రాంతంలో అబ్దుల్లా ఇబ్న్ అలే మొఖాఫా "ఖలీల్‌వదిమ్న" అన్న పేరుతో దీన్ని అరబీ భాషలోకి అనువదించాడు. సిరియన్ గ్రంథంతో పోలిస్తే ఇది ఎక్కువ కథలతో విశాలంగా వున్నది. ఈ అరబిక్ పంచతంత్రమే తిరిగి సిరియన్ భాషలోకి క్రీ.శ. 10 లేక 11 శ॥ లల్లో అనువదింప బడింది. బహుశ మొదటి సిరియన్ అనువాదం అసంపూర్ణంగా వుండటంచేత ఈ రచన మళ్ళీ చేయబడిందేమో. అరబిక్ పంచతంత్రం క్రీ.శ. 11వ శతాబ్దంలో గ్రీకు భాషలోకి అనువదింపబడింది. గ్రీకు భాషనుంచి క్రీ.శ. 13వ శ॥ లో లాటిన్ భాషలోకి అనువదింపబడింది. క్రీ.శ. 12వ శ॥ లో ఇది హీబ్రూ భాషలోకి అనువదింపబడింది. క్రీ.శ. 1480లో లాటిన్ పంచతంత్రం యొక్క రెండు ముద్రణ ప్రతులు యూరప్‌లో ప్రచలితమై వుండేవి. లాటిన్ నుంచి జర్మన్ భాషలోకి క్రీ.శ. 15వ శ॥లో ఆంటన్ ఫన్ ఫోర్ అనే ఆయన అనువాదం చేసాడు. ఈ అనువాదం జర్మన్ దేశంలో విరివిగా ప్రచారాన్ని పొందింది. జర్మన్ సాహిత్యం మీద ఈ కథల సంపుటి చూపిన ప్రభావం అనంతమైంది. తర్వాత ఇది డేనిష్, ఐస్‌లాండిక్, డచ్ భాషల్లోకి అనువదింపబడింది. లాటిన్, జర్మన్ అనువాదాల ఆధారంగా క్రీ.శ. 1548లో ఇటాలియన్, క్రీ.శ. 1556 లో ఫ్రెంచ్ భాషల్లోకి అనువదింపబడింది. క్రీ.శ. 16వ శ॥ లో థామస్ నార్త్ ఇంగ్లీషులోకి అనువదించాడు. "కలీల వ దిమ్న" అన్న అరబిక్ అనువాదం నుంచి స్పానిష్ అనువాదం మరొకటి క్రీ.శ. 1251 ప్రాంతంలో చేయబడింది. దక్షిణ భారతదేశ పంచతంత్ర ప్రతి మరియు అరబిక్ అనువాదం ఆధారంగా మలయన్ భాషలోకి ఈ కథలు అనువదింపబడినవి. కేవలం సంస్కృత పంచతంత్రం ఆధారంగా ఈ కథలకు ఇండోచైనీస్, ఇండోనీషియన్ అనువాదాలు కూడ వచ్చినవి. సియామీస్ కథలల్లో పంచతంత్రంతో పాటు బేతాళపంచవింశతి కథలు కూడ చేరినవి. క్రీ.శ. 13వ శ॥ లో అరబిక్ నుంచి మరొక హీబ్రూ అనువాదం కూడ వచ్చింది. క్రీ.శ. 1142లో పర్షియన్ భాషలోకి "అన్వారీ సుహాయలీ" అనే పేరుతో పంచతంత్ర కథలు అనువదింపబడినవి. ఈ గ్రంథం పర్షియన్ భాషలో ప్రసిద్ధమైంది. అందమైన శైలిలో వ్రాయబడింది. ఈ పర్షియన్ అనువాదం తిరిగి టర్కీ (క్రీ.శ. 15వ శ॥), జార్జియన్ మొ॥న ఏషియన్ భాషల్లోకి, ఫ్రెంచ్, జర్మన్, స్పానిష్, ఇంగ్లీషు, స్వీడిష్ మొ॥న యూరోపియన్ భాషల్లోకి అనువదింపబడింది. టర్కీభాషలో "హుమాయూన్ నామా" (చక్రవర్తి పుస్తకం) అనే పేరుతో ఈ అనువాద

గ్రంథం వ్రాయబడింది. టర్కీ అనువాదమే ఫ్రెంచి నుంచి తిరిగి జర్మన్, డచ్, హంగేరియన్, మలయన్ మొదలైన భాషల్లోకి అనువదింపబడింది. ఈ విధంగా పంచతంత్ర కథలు ఒక్కొక్క భాషలో వేరువేరు స్రోతస్సుల నుంచి వేరు వేరు అనువాదాలు చేయబడినవి. ఒక్కొక్కసారి ఒక్క స్రోతస్సు నుంచి ఒకే భాషలోకి అనేక అనువాదాలు కూడ చేయబడినవి. పంచతంత్రం ప్రపంచంలోని 50 భాషల్లోకి అనువదింపబడిందని, వివిధ భాషల్లో మొత్తం 200 వరకు రూపాంతరాలున్నవని హెర్టెల్ తెలియజేసాడు. ఈ విధంగా పంచతంత్రం కథలు ఏషియా, యూరోపు, ఆఫ్రికా మూడు ఖండాల్లోను వ్యాపించినవి. కేవలం సాహిత్యం వరకే పరిమితం కాక ఈ కథలు సామాన్య ప్రజల నోళ్ళలోకి కూడ ఎక్కి ప్రాంతీయమైన రూపు, రంగు, వాసనలతో ఆ ప్రాంతపు కథలుగానే చలామణిలో వున్నవి. అనాగరికమైన ఆఫ్రికన్ జాతులల్లో కూడ ఈ కథలు వ్యాప్తిలో వున్నవి. ఆ జాతులతో వ్యాపారాది సంబంధాలు పెట్టుకొన్నవారు ఈ కథలను మోసుకొనిపోయి వుంటారు. గ్రీకు భాషలో అతి ప్రాచీనమైన ఈసప్ కథలలోను, అరబీ భాషలోని "అరేబియన్ నైట్సు" కథలల్లోను పంచతంత్ర కథలు కలిసిపోయినవి, వాటిల్లోని కథలమీద పంచతంత్ర కథల ప్రభావం తప్పక కన్పిస్తున్నది. పంచతంత్ర కథలు పశ్చిమ ఏషియా నుంచి మధ్యయుగాలల్లో యూరోప్‌లోకి వ్యాపించి ఆయా సాహిత్యాల మీద అమితమైన ప్రభావాన్ని చూపినవి. బోకాసియో, స్త్రపరోలా, ఛాసర్, లఫాన్టయిన్ మొదలైన కవుల కథాగ్రంథాల మీద పంచతంత్ర కథల ప్రభావం స్పష్టంగా కన్పిస్తున్నది. జర్మన్ భాషలో గ్రిమ్ సోదరులు సేకరించిన పిల్లల కథల మీదను పంచతంత్ర కథల ప్రభావం చాలా వున్నది. యూరోప్ సాహిత్యంలోనే కాక సామాన్య ప్రజల్లోను ఈ కథలు వర్తకుల, యాత్రికుల రాకపోకలతో, రాజకీయ సంబంధ బాంధవ్యాలతో మౌఖిక సంప్రదాయంగా కూడ వ్యాపించినవి. ఇట్లా వ్యాపించినప్పుడు కథల స్వరూపం చాలా మట్టుకు దేశ, జాతి భేదాలను బట్టి మార్పులను పొందుతూవచ్చిందనటంలో సందేహం లేదు.

పంచతంత్ర కథలు మొదట పహ్లవీభాషలోకి అనువదింపబడి అరబ్బులను ఆకర్షించినవి. అరబ్బీ భాషలోని పంచతంత్ర కథలు మధ్యయుగంలో కాన్ష్టంటి నోపిల్, వెనిస్ వంటి ప్రధాన నగరాలను చేరుకొని క్రమంగా యూరపులోనికి ప్రవేశించి బోకాసియో, స్త్రపరోలా, ఛాసర్, లఫాన్టయిన్‌ల పుస్తకాలల్లోకి ఎక్కినవి. ఆదునిక కాలంలో జంతువులు పాత్రలుగా గల "కామిక్స్" కథలకు, వాల్ట్ డిస్నీ బొమ్మల చలన చిత్రాలకు కూడ పంచతంత్ర కథలే పరోక్షంగాను, అపరోక్షంగాను ప్రేరకాలైనవి.

## పంచతంత్ర కథలకు మూలం

పంచతంత్ర కథలకు మూల స్థానం ఏది? అన్న విషయాన్ని గూర్చి విమర్శకులు విచారించారు. అయితే వారిలో రెండు అభిప్రాయాలు ఏర్పడినవి. కొందరు విమర్శకులు ఈ కథలు గ్రీసు దేశంతో పుట్టి అక్కడి నుంచి భారత దేశానికి పాకినవని అన్నారు. ఓటో కెల్లర్, బెయిన్ఫేలు ఈ అభిప్రాయాన్ని సమర్థించారు. కథలు గ్రీసు దేశం నుంచి భారతదేశం వచ్చి అక్కడి నుంచి ప్రపంచమంతా వ్యాపించినవని వీరి అభిప్రాయం. కాని కొన్ని కథలు తప్పక భారతదేశంలోనే పుట్టినవని కూడా వీరు భావించారు. హెర్టెల్, వాగ్నెర్ వంటి విమర్శకులు కథలకు భారతదేశమే ఉద్భవ స్థానమని అంగీకరించారు. భారతదేశం నుంచే గ్రీసు దేశం పోయినవని వీరి అభిప్రాయం. కథలన్నిటికి భారతదేశం జన్మస్థానమని చెప్పలేము కాని చాలా కథలు భారతదేశంలోనే పుట్టినవని వింటర్ నిట్స్అన్నాడు. గ్రీసు భారతదేశాలల్లో ఈ కథలు ప్రాచీన కాలంలో నీతి, రాజనీతులను బోధించే మాధ్యమంగానే పుట్టినవని వింటర్‌నిట్స్ అభిప్రాయం. ఈ పరిశోధక విమర్శకుల అభిప్రాయాన్ని బట్టి ప్రపంచంలోని కథలు చాలావాటికి భారతదేశమే జన్మస్థానమని చెప్పవచ్చును. గ్రీసుదేశంలోని "ఈసప్ కథలు" ఈసప్ అనేవాడు చెప్పినవి. ఈ కథలు క్రీ.పూ. 5,6 శతాబ్దాలల్లో కూర్చబడినవని అంటారు. క్రీ.పూ. 6వ శతాబ్దం నాటికే జంతువులు పాత్రలుగా గల నీతికథలు భారత దేశంలో కన్పిస్తున్నవి. కాబట్టి గ్రీసు భారత ప్రజల మధ్య విజ్ఞానం ఆదాన ప్రదానాలు ఎక్కువగా జరిగిన కాలంలోనే , అంటే అలెగ్జాండర్ దండయాత్రలకు పూర్వమే నీతికథలు కూడ అటునుంచి ఇటు, ఇటునుంచి అటు ఎగుమతి దిగుమతి అయివుంటవి. అదీగాక ఒక నీతికథ ఆధారంగా మరొక నీతికథ తత్ ప్రేరణతో పుట్టగల అవకాశం కూడ వుంటుంది. కాబట్టి భారతదేశంలో పుట్టిన నీతికథల ఆధారంగా గ్రీసు మొదలైన దేశాలల్లో కొన్ని కథలు పుట్టి అవి ఇక్కడికి వచ్చి, ఇక్కడి నుంచి తిరిగి ప్రపంచ వ్యాప్తిని చెందివుంటవి. భారతీయుల్లో కథలను చెప్పటమే వృత్తిగా గలవారు ప్రత్యేకంగా వుండేవారు. వారికి కథలను చెప్పటం తప్ప వేరే పనిలేదు. వీరేగాక కథలను చెప్పి భిక్షాటనం చేసే సాధువులు కూడ వుండేవారు. వారి ద్వారా ఎన్నో కథలు పుట్టి దేశవిదేశ ప్రజలల్లో వ్యాపించి వుంటవి. భారతీయులకు కథలను అల్లటంలో, చెప్పటంలో, వినటంలో వున్న ఆసక్తినిబట్టి చూస్తే భారతదేశమే చాలా కథలకు జన్మస్థానమని, ఇక్కడి నుంచే ఆ కథలు అతిప్రాచీన కాలంలోనే గ్రీసుసాహిత్యంలోకి పాకినవని చెప్పాలి. అయితే గ్రీసుదేశం చేరి ఈ కథలు

మార్పును చెందటమే కాక అటువంటివే కొత్త కథలు కూడ పుట్టివుంటవి. తర్వాత పంచతంత్ర కథలు పహ్లావీ, సిరియన్, అరబిక్ భాషల్లోకి అనువదింపబడి ప్రపంచమంతటా అన్ని భాషలల్లో, అన్ని జాతులల్లోనికి పాకి వ్యాపించినవి. నీతిని, ముఖ్యంగా వ్యవహార కుశలతను, రాజనీతి శాస్త్రాన్ని సులభంగా, మనోరంజకంగా కథల రూపంలో బోధించే పద్ధతి భారతదేశంలోనే ఆరంభమైంది. పశుపక్ష్యాదులు పాత్రలుగాగల ఈ కథలు కేవలం ఉబుసుపోకకు చెప్పినవి కాక గంభీరమైన సందేశాలతో కూడినవి. ఆఫ్రికాలోని కొన్ని ఆదిమజాతులల్లో పశుపక్ష్యాదులు పాత్రలుగాగల జానపద కథలు వ్యాప్తిలో వున్నవి. కాని వాటిల్లో ఈ కథలలోవలె గంభీరమైన ధర్మనీతి బోధలు కాని రాజనీతి బోధ, లౌకిక వ్యవహార జ్ఞానం కాని కన్పించదు. సామాన్యులకు కూడ విజ్ఞానాన్ని కలిగించే పంచతంత్ర కథలు భారతీయ ప్రతిభామస్తిష్కం నుంచి ఉద్భవించి ఇతర దేశాలకు పాకినవే కాని ఇతర దేశాల నుంచి ఇక్కడికి వచ్చినవి మాత్రం కావు.

# చిత్రకావ్యాలు

## చిత్రకవిత్వం ప్రాచీనత

సంహితల్లోనే చిత్రకవిత్వపు ఛాయలు అక్కడక్కడ కన్పిస్తున్నవి. ప్రహేళికారూపమైన ఋక్కులలో పైకి ఒక అర్థం, ఆంతరంగా మరొక అర్థం వుండి చమత్కారపూర్ణంగా వున్నవి. వీటిలో గంభీరమైన అంతరార్థం ఇమిడి వున్నది. కాని పైకి ఏదో మామూలు అర్థం గోచరిస్తుంది. ఇటువంటి ఋక్కులు పాఠకులను తికమక పెట్టి, ఆలోచింపజేసి అర్థాంతరం గోచరించిన తర్వాత ఆనందాన్ని కలిగిస్తున్నవి. అదే విధంగా సంహితలల్లో అక్కడక్కడ శబ్దచమత్కారాలు కూడ వున్నవి. ఉదా॥కు పురుష సూక్తంలో "యజ్ఞేన యజ్ఞమ యజంత దేవాః" అన్నచోట యజ్ఞంతో యజ్ఞాన్ని సంపాదించవచ్చుననే ఉక్తి పాఠకుల హృదయాలల్లో కుతూహలాన్ని పుట్టిస్తున్నది. అదే విధంగా బ్రాహ్మణ, ఆరణ్యక గ్రంథాలల్లోను ఇటువంటి పదాల చిత్రమైన కూర్పు కన్పిస్తున్నది. తర్వాత లౌకిక సాహిత్యంలో మహాభారత రామాయణ కావ్యాలల్లో పదాల ఆవృత్తి, శ్లేష, యమకాల ప్రయోగంలో చిత్రకవిత్వం గోచరిస్తున్నది. ఆ తర్వాత కాళిదాసు రఘువంశ కావ్యంలో యమకాలను కూర్చటానికి ప్రయత్నించాడు. సుబంధు "ప్రత్యక్షర శ్లేష" చమత్కారాన్ని ప్రదర్శించాడు. దండి దశకుమార చరిత్రలో ఒక ఉచ్ఛ్వాసాన్నంతటిని నిరోష్ఠ్యంగా రచించాడు. బాణుడు శ్లేషయమకానుప్రాసలను చాలా ఆదరించాడు. ఘటఖర్పరుడు యమకకావ్యాన్నే రచించాడు. చంపూకావ్యకవులు శ్లేషయమక చమత్కారాలను విశేషంగా వాడారు. భారవి కిరాతార్జునీయం 15వ సర్గలో పదాంత, పదాది, సముద్గ, శృంఖలాది యమకాలను, ప్రతిలోమానులోమ పాదాలను, నిరోష్ఠ్యాది, ఏకాక్షర ద్వ్యక్షరాది శ్లోకాలను, వర్ణచిత్రాలను, గోమూత్రకాది బంధచిత్రాలను, అర్థత్రయవాచి శ్లేషాలను ప్రయోగించి వున్నాడు. మాఘుడు శిశుపాలవధలో 19వ సర్గలో భారవి చిత్రకవిత్వాన్నంతటిని అనుకరించాడు. శ్రీహర్షుని కవిత్వం శ్లేషచమత్కారమయం. అందులో అతని 'పంచనళి' ప్రసిద్ధమైంది. ఐదు అర్థాలతో కూడిన ఈ ప్రసిద్ధమైన శ్లోకాలు తర్వాత ద్వ్యర్థి, త్ర్యర్థి కావ్యాలను వ్రాయటానికి ప్రేరణను ఇచ్చివుంటవి. ఇంకా ద్వ్యర్థి కావ్యాలను వ్రాయటానికి మూలస్రోతస్సులు భట్టికావ్యాల వంటి శాస్త్రకావ్యాలని చెప్పవచ్చును. భట్టికావ్యంలో ఒకవైపు రామాయణకథ ఇంకొకవైపు వ్యాకరణం

కూర్చబడినవి. శాస్త్రకావ్యాలల్లో కవులు రెండు లక్ష్యాలను అంటె రెండు ఇతివృత్తాలను చెప్పటానికి చేసే ప్రయత్నం తర్వాత శ్లేష ప్రయోగ ప్రవీణులైన కవులను ఆకర్షించి ద్వ్యర్థి కావ్యాల కూర్పుకు ప్రేరణను ఇచ్చిందని చెప్పవచ్చును. సుబంధు బాణ భారవాదుల శ్లేషయమకాలంకార చమత్కృతులు తర్వాత కవులను విశేషంగా ఆకర్షించివుంటవి. అందుకే తర్వాత కవులు రెండు ఇతివృత్తాలను శ్లేషచమత్కార సహాయంతో సాధించి ఒకటి రెండు శ్లోకాలనే కాక కావ్యాలనే వ్రాయటానికి పూనుకొన్నారు. ఈ ప్రక్రియ క్రీ.శ. 10వ శతాబ్దంతో ఆరంభమై తర్వాత రానురాను విశేష ప్రచారాన్ని అందుకొన్నది. ద్వ్యర్థికావ్యాల కూర్పు కేవలం శ్లేషమీదనే ఆధారపడి కాక అనులోమ విలోమ పద్ధతిని అనుసరించి కూడా వ్రాయ బడినవి. శ్లోకాన్ని మామూలుగా చదివితే ఒక ఇతివృత్తం, శ్లోకాన్ని కిందినుంచి మీదికి చదివితే మరొక ఇతివృత్తం గోచరిస్తుంది. భారవ్యాదులు చమత్కారం కొరకు కావ్యంలో ఒక్కచోట అనేకార్థ శ్లోకాలను, అనులోమవిలోమ శ్లోకాలను ప్రయోగించగా తరువాత కవులు పూర్తిగా కావ్యాలనే ఈ పద్ధతిలో వ్రాసి తమ ప్రతిభను ప్రదర్శించటానికి పూనుకొన్నారు.

## చిత్రకావ్యాలను గూర్చి ఆలంకారికుల మతం

ధ్వని సంప్రదాయవాదులైన ఆనందవర్ధన మమ్మట విశ్వనాథాదులు చిత్ర కావ్యాలను ఉత్తమ కావ్యాలుగా పరిగణించటానికి అంగీకరించలేదు. ఇవి ప్రయత్న సాధ్యమైనవి. వీటిల్లో రసమాధుర్యాలు లోపించినవని వారు అభిప్రాయపడినారు. దండి వంటివారు అలంకారవాదులైనా చిత్రకావ్యరచన మధురమైంది కాదనే ("నాతిమధురం") అన్నారు. చిత్రకవిత్వాన్ని గూర్చి విశదంగా చెప్పిన భోజుడు కూడ అవి దుష్కరమైనవి, కఠోరమైనవి, దుర్బోధమైనవని అన్నాడు-

> దుష్కరత్వాత్ కఠోరత్వాత్ దుర్బోధత్వాద్ వినావధేః
> దిఙ్మాత్రం దర్శితం చిత్రే శేషమూహ్యం మహాత్మభిః

సరస్వతీకంఠాభరణమ్ 2-146

ఆలంకారికులు చిత్రకావ్య రచనను ఉత్తమంగా పరిగణించి మెచ్చక పోయినా కవులు చిత్రకవిత్వాన్ని ఉపయోగించి కావ్యాలే వ్రాయటం మొదలు పెట్టారు. ఇవి రసస్ఫోరకాలు కాకపోయినా వీటిల్లో పాఠకుల బుద్ధికి పదనుపెట్టే గుణం ఒకటి వున్నది.

చమత్కారపూర్ణమైన వీటి పఠనం పాఠకులను ఆలోచనలో మునిగేటట్టుగా చేస్తుంది, పాఠకుల శబ్దజ్ఞానానికి పరీక్షపెడ్తుంది. ఈనాడు వార్తా పత్రికల్లో కన్పడే 'పజిల్' లాగ పాఠకుల మస్తిష్కానికి వ్యాయామంలాగ ఉపయోగపడి చిత్రకావ్యాల పఠనం హుషారును కలిగిస్తుంది. అవి మాధుర్యపూర్ణాలు కాకపోయినా పాఠకుల బుద్ధితీక్ష్ణతకు గీటురాయివంటివి. అందుకే రసస్ఫోరకాలు కాకపోయినా చిత్రకావ్యాలు చమత్కారపూర్ణమై అనేకార్థసాధనతో కూడి పాఠకులను అద్భుతచిత్తులను చేసి ఆనందాన్ని కలిగించ గలవు. చిత్రకావ్యాలను వ్రాయాలంటే కవికి శబ్దాధికారం వుండాలి. పదప్రయోగ నైపుణిని ప్రదర్శించాలి. అతని బుద్ధికుశలతమీద కావ్య నిర్వహణ ఆధారపడి వుంటుంది. రెండు విభిన్నమైన కథలు తీసుకొని వాటిని ఘట్టాలుగా విభజించి కొంతవరకు సమానతను సాధించుకొని కవి శ్లేషసహాయంతో కావ్యరచనను సాగిస్తాడు. ఇటువంటి రచన చేయాలంటే కవికి పాండిత్యప్రతిభ కావలసి వుంటుంది. కవి, కవితోపాటు అధ్యేతకూడ పండితులైనట్లయితే చిత్రకావ్యం దోషయుక్తమైందనే ప్రశ్నేరాదు.

ద్వ్యర్థి కావ్యాల రచన దాదాపు క్రీ.శ. 10వ శతాబ్దం నుంచి ఆరంభమైంది. తర్వాత త్ర్యర్థికావ్యాలు వ్రాయబడినవి. ఆ తర్వాత మూడుకంటె ఎక్కువ అర్థాలుగల కావ్యాలు వ్రాయబడినవి. ఇంకా ఇవేగాక విలోమానులోమ కావ్యరచనలు కూడ చేయబడినవి. ఈ రచనలు చాలావరకు దక్షిణభారతంలో వ్రాయబడటం గమనార్హం.

## ధనంజయుడు

ఈ ధనంజయుడు దశరూపకకర్త ధనంజయుడే. ఈకవి ధారనగరాన్నేలిన ముంజరాజు ఆస్థాన కవి. క్రీ.శ. 990 ప్రాంతంవాడు. ఇతడు రాఘవ పాండవీయమనే ద్వ్యర్థి కావ్యాన్ని రచించాడు. దీనిలో రామాయణ మహాభారత కథలు జోడింపబడినవి. ఈ కావ్యంలో 19 సర్గలున్నవి. ప్రతిసర్గ చివరి శ్లోకంలో కవి "ధనంజయ" అని చేర్చాడు. అందుచేత ఈ కావ్యానికి ధనంజయాంకమనే పేరు వున్నది. ఈ కవి దిగంబర జైనుడు.

## విద్యామాధవుడు

ఈ కవి చాళుక్య సోమదేదేవుని (క్రీ.శ. 1123-1138) ఆస్థాన కవి. పార్వతీరుక్మిణీయమనే విలోమ కావ్యాన్ని రచించాడు. దీనిలో పార్వతి రుక్మిణుల వివాహ కథలు జోడింపబడినవి. దీనిలో 9 సర్గలున్నవి.

## కవిరాజు

ఈ కవి అసలు పేరు మాధవభట్టు అని, కవిరాజు అన్నది అతని బిరుదనామ మని కె.బి. పాఠక్ తలంచారు. కాని కవిరాజు తర్వాత 'సూరి' అని కవి చేర్చుకోవటం చేత కవిరాజు అన్నదే అతని పేరు అని, అట్లా పేరు చివరనే 'సూరి' చేరుస్తారని డా. సుబ్బయ్య అభిప్రాయం. కాని కవిరాజు అన్నది వ్యక్తి నామంగా కాక బిరుదంగానే తలంచటం సమంజసమేమో.

కవిరాజు జయంతిపురాన్నేలిన కదంబ వంశరాజు కామదేవుని (క్రీ.శ. 1182-1197) ఆస్థానకవి. రాఘవ పాండవీయమనే ద్వ్యర్థికావ్యాన్ని రచించాడు. దీనిలో రామాయణ మహాభారత కథలు జోడింపబడినవి ఈ కావ్యంలో 13 సర్గలు 668 శ్లోకా లున్నవి. ప్రతి సర్గ చివరి శ్లోకంలో కవి కామదేవుని పేరును చేర్చాడు. అందుచేత ఈ కావ్యాన్ని కామదేవాంక మని కూడ అంటారు. తన కంటె ముందు రాఘవపాండవీయాన్ని వ్రాసిన ధనంజయుని ఆశ్రయదాత ముంజరాజుకంటె తన ఆశ్రయదాత కామదేవుడు అధికుడని కవి ఈ క్రింది శ్లోకంలో చమత్కారపూర్ణంగా చెప్పాడు-

శ్రీవిద్యా శోభినోయస్య శ్రీముంజాదియతీ భిదా
ధారాపతి రసావాసీదయం తావ ద్ధరాపతిః

"శ్రీవిద్యా నామకమైన తాంత్రికసిద్ధిగల ముంజరాజు, లక్ష్మీ సరస్వతుల చేత శోభిల్లు కామదేవునికి భేద మేమంటె అతడు ధారాపతి, ఇతడు ధరాపతి". ఇక్కడ కవి తన రాఘవపాండవీయ కావ్యం ధనంజయుని కావ్యం కన్న గొప్పదని వ్యంగ్యం చేయదలచుకున్నాడేమో. కవిరాజు తనను తాను సుబంధు బాణుల కోవకు చెందినవక్రోక్తిమార్గనిపుణునిగా గర్వంగా చెప్పుకొన్నాడు-

సుబంధుర్బాణ భట్టశ్చ కవిరాజ ఇతిత్రయః
వక్రోక్తిమార్గ నిపుణశ్చతుర్థో విద్యతేన వా

రామాయణ మహాభారత కథలను సమానంగా జోడించడంలో కవి నేర్పును చూపాడు. పాండవులను రాముని ఒక పక్షంగా, కౌరవులను రావణుని మరోపక్షంగా కవి జోడించి కథను నడిపాడు. అక్కడక్కడ రెండు కథలను జోడించే కార్యం వాటి

కథారూపంలో సామ్యం లేకపోవటం చేత అసాధ్యమైంది. అయినా కవి శ్లేష సహాయంతో కుశలతతోనే నిర్వహించాడు. సందర్భానుకూలంగా కవిరాజు మృగయా, యుద్ధ, వివాహ, మంత్రణ, కుమారోదయ, ఋతు, ప్రకృత్యాది వర్ణనలను కూర్చి తన ద్వ్యర్థి కావ్యానికి మహాకావ్య గౌరవాన్ని ఆపాదించాడు. ఒక్కొక్క సర్గలో ఒకే విధమైన వృత్తాన్ని కాక, కవి అనేక విధాలైన వృత్తాలను ప్రయోగించాడు. కావ్యంలో ప్రధాన రసం వీరం. సందర్భానుకూలంగా ఇతర రసాలను పోషించాడు. వియోగ, సంభోగ శృంగారాలను కవి విస్తరంగా వర్ణించాడు. కవిరాజు రెండు కథలను శ్లేష సహాయంతో జోడించినా కావ్యార్థం క్లిష్టం కాలేదు. ప్రసన్నమైన సులభశైలిలో కవి కావ్యాన్ని రచించాడు. కవి సుందర భావకల్పనతో కూడిన ప్రసన్న శైలికి ఉదాహరణ-

విశీర్ణ సంక్రందన చాపలేశచ్ఛవీని కీర్ణాని వనస్థలీషు
సలీలమాదాయ మయూర బర్హాణ్యుత్తంసయంతి స్మ కిరాతనార్యః.

"విరిగి కిందపడిన ఇంద్రధనుస్సు ముక్కల వలె వున్న అరణ్య ప్రాంతంలో అక్కడక్కడ చెల్లాచెదురుగా పడివున్న మయూర పింఛాలను ఏరుకొని కిరాత స్త్రీలు విలాసంగా తమ కర్ణభూషణాలుగా చేసుకుంటున్నారు." చెల్లాచెదురై వున్న మయూర పింఛాలను విరిగిపడిన ఇంద్రధనుస్సు ముక్కలతో పోల్చటం చాల అందమైన భావన. రామాయణం పవిత్రమైన గంగానది వంటిది. మహాభారతం విశాలమైన సముద్రం వంటిది. ఈ రెండింటిని కలిపిన కవిరాజు భగీరథుని వంటివాడట-

శ్రీమద్రామాయణం గంగా భారతం సాగరోపమన్
తత్సంయోజన కార్యజ్ఞః కవిరాజో భగీరథః

## రామచంద్రకవి

రసిక రంజనమనే విలోమ కావ్యాన్ని ఈ కవి రచించాడు. దీనిలో శ్లోకాలను ఒక వైపునుంచి చదివితే శృంగారార్థం, మరొక వైపు నుంచి చదివితే వైరాగ్యార్థం కన్పిస్తుంది. ఈ కవి క్రీ.శ. 1542 ప్రాంతంవాడు.

## వేంకటాధ్వరి

యాదవరాఘవీయమనే విలోమ కావ్యాన్ని ఈ కవి రచించాడు. దీనిలో 30

శ్లోకాలున్నవి. అనులోమ క్రమంలో చదివితే కృష్ణుని కథ, విలోమ క్రమంలో చదివితే రాముని కథ కన్పిస్తుంది. ఈ కవి క్రీ.శ. 16వ శతాబ్దంవాడు. కాంచీ నగర నివాసి. రామానుజ సంప్రదాయానికి చెందినవాడు. గొప్ప దార్శనిక పండితుడు. ఈ కావ్యంలో కవి అనుప్రాసలను చక్కగా ప్రయోగించాడు.

## చిదంబర సుమతి

చిదంబరకవి విజయనగర రాజు వేంకటరాయల (క్రీ.శ. 1586-1614) ఆస్థానకవి. ఈ కవి రాఘవపాండవ యాదవీయమనే త్ర్యర్థికావ్యాన్ని రచించాడు. ఈ కావ్యంలో రామ, పాండవ, శ్రీకృష్ణుల చరిత్రలు మూడు జోడింపబడినవి. రెండు కథలను జోడించటమే కష్టమైన పని అంటే ఈ కవి ఈ మూడు కథలను జోడించి కావ్యాన్ని రచించాడు. ఈ కావ్యంలో 3 సర్గలున్నవి. మూడు కథలను జోడించటం అతికష్టమనుకుంటే ఈ కవి ఐదు కథలను జోడించి "పంచకళ్యాణ చంపువు"ను రచించి తనకు శ్లేషలో గల ప్రావీణ్యాన్ని, శబ్దాధికారాన్ని ప్రకటించు కొన్నాడు. ఈ కావ్యంలో రామ, కృష్ణ, శివ, విష్ణు, సుబ్రహ్మణ్యులు ఐదుగురి వివాహాలు ఒకేసారి శ్లేష సహాయంతో వర్ణింపబడినవి. కాని ఈ కావ్యంలోని విషయం వివాహ వర్ణన కాబట్టి పంచార్థాలున్న శ్లోకాల అవసరం కవికి చాల తక్కువ కలిగిందని చెప్పవచ్చును. ఈ కావ్యంలో రెండు స్తబకాలున్నవి. ఈ కావ్యానికి చిదంబర కవియే స్వయంగా టీకను వ్రాసాడు.

## దైవజ్ఞ సూర్యకవి

ఈ కవి క్రీ.శ. 16వ శతాబ్దం పూర్వార్ధం వాడు. ఇతని పేరులో చేరివున్న "దైవజ్ఞ" అన్నది అతడు జ్యోతిష్కుడని చెప్తున్నది. "సూర్యప్రకాశం, లీలావతి" అన్న జ్యోతిష గ్రంథాలకు ఈ కవి టీకలు కూడ వ్రాసాడు. దైవజ్ఞ సూర్యకవి కావ్యం విలోమ కావ్యాల కోవకు చెందింది. రాముని, కృష్ణుని కథలను జోడించి 36 శ్లోకాలు గల రామకృష్ణ విలోమ కావ్యాన్ని ఈ కవి రచించాడు. మొదటి ఐదు శ్లోకాలలో దైవస్తుతి వున్నది. కవి ఒకే విధమైన ఛందస్సును కాక అనేక విధాలైన ఛందస్సులను ప్రయోగించాడు. ఇంద్రవజ్ర, శాలిని, రథోద్ధత, అనుష్టుపు, విద్యున్మాల అతడు ప్రయోగించిన ఛందస్సులు. తన కవిత్వం ద్రాక్షాపాకంలో వున్నదని కవే స్వయంగా చెప్పుకొన్నాడు. తాను ఎక్కడా అప్రసిద్ధ పదాలను గాని వ్యాకరణ విరుద్ధ ప్రయోగాలను గాని దురూహ్యపదాలను గాని వాడలేదని కవి చెప్పుకొన్నాడు.

ద్వ్యర్థి త్ర్యర్థి కావ్యాలు కేవలం శ్లేష సహాయంతో వ్రాయబడగా విలోమ కావ్యాలు శ్లేషతో పాటు యమక సహాయంతో వ్రాయబడుతవి. విలోమ కావ్యాలల్లోని యమకం ప్రతిలోమ విలోమ, గత ప్రత్యాగత యమకం. భారవి కిరాతార్జునీయంలో ప్రతిలోమానులోమ శ్లోకాలను ప్రయోగించాడు. వాటిని ఆదర్శంగా చేసుకొని కవులు రెండు కథలను బోధించే కావ్యాలనే రచించటానికి పూనుకొన్నారు. ఈ కావ్యాలల్లో పై నుంచి కిందికి అనులోమ పద్ధతిలో చదివినప్పుడు ఒక వృత్తాంతం, కింద నుంచి పైకి విలోమ పద్ధతిలో చదివినప్పుడు మరొక వృత్తాంతం అవగతమౌతవి. దీనికి శ్లేష సహాయంతో రెండు కథలు అవగతమౌతవి. విలోమ కావ్యంలో శ్లోకాన్ని పైనుంచి కిందికి, కింది నుంచి పైకి చదివినా ఒకే పదాలు వుండి చమత్కారాన్ని అతిశయింప జేస్తవి. ద్వ్యర్థి త్ర్యర్థి కావ్యాల కన్న విలోమ కావ్యాలు ఆకారంలో చాల చిన్నవి. రామకృష్ణ విలోమ కావ్యంలోని ఒక శ్లోకం-

"తంభూసుతా ముక్తి ముదారహాసం వందేయతో భవ్యభవం దయాశ్రీః
శ్రీయాదవం భవ్యభతోయ దేవం సంహారదాముక్తి ముతాసు భూతమ్.

పైనుంచి కిందికి చదివినా కింది నుంచి పైకి చదివినా ఒకే పదాలు వున్నవి. పైనుంచి కిందికి చదివినప్పుడు రాముని కథను, కింది నుంచి పైకి చదివినప్పుడు కృష్ణుని కథను కవి సాధించాడు.

## మేఘ విజయగణి

ఈ కవి క్రీ.శ. 1670 ప్రాంతంవాడు. జైనుడు. కాబట్టి జైన మునుల చరిత్రలను ఇతివృత్తంగా తీసుకొని "సప్తసంధాన మహాకావ్యా"న్ని వ్రాసాడు. కావ్యంపేరు సూచిస్తున్నట్లు గానే ఈ కావ్యంలో ఏడు అర్థాలను కవి కూర్చాడు. రెండుమూడు ఐదు అర్థాలను జోడించటమే అతికష్టమనుకుంటె ఈ కవి ఏడు అర్థాలను జోడించి కావ్యరచన చేసాడు. చిత్రకావ్య రచనలో ఇది చివరి మెట్టుమ చేరుకొన్న కావ్యమని చెప్పవచ్చును. ఈ కావ్యంలో ఋషభనాథ, శాంతినాథ, పార్శ్వనాథ, నేమినాథ, మహావీర, కృష్ణ బలరాముల జీవితచరిత్రలు కూర్చబడినవి. మేఘవిజయగణి గొప్ప పండితుడు. జైన దార్శనికుడు.

## హరిదత్తసూరి

ఈ కవి క్రీ.శ. 1700 ప్రాంతంవాడు. రాఘవ నైషధీయమనే ద్వ్యర్థి కావ్యాన్ని రచించాడు. రాముని నలుని కథలు దీనిలో జోడింపబడినవి. సన్నివేశ సామ్యంలేవి

కథలను తీసుకొని కవి కావ్యరచనను చక్కగా నిర్వహించాడు. దీనిలో రెండే సర్గలున్నవి.

క్రీ.శ. 7వ శ॥ నాటికే రెండు లక్ష్యాలను దృష్టిలో పెట్టుకొని శాస్త్ర కావ్యాలు వ్రాయబడినవి. లబ్ధశాస్త్ర కావ్యాలల్లో భట్టి (క్రీ.శ. 7వ శ॥) రావణవధ కావ్యం మొదటిది. దీనిలో శ్రీరాముని చరిత్రతోపాటు కవి వ్యాకరణ నియమాలను నిబద్ధించాడు. కావ్యరచన, వ్యాకరణ బోధన అన్న రెండు లక్ష్యాలను కవి ఒక కృతితోనే సాధించాడు. భట్టికి పూర్వమే భట్టభౌమాదులు ఇటువంటి శాస్త్ర కావ్యాలను వ్రాసారు. కాని అవి లభించలేదు. క్రీ.శ. 12వ శ॥ వాడైన హేమచంద్రసూరి వ్యాకరణ నియమాలను సోదాహరణంగా బోధిస్తూ తన ఆశ్రయదాత రాజు కుమారపాలుని చరిత్రను "ద్వ్యాశ్రయ కావ్యం" లేక "కుమారపాల చరిత్ర" ను వ్రాసాడు. క్రీ.శ. 12వ శ॥ వాడే అయిన సంధ్యాకరనంది పై కవుల వలె ద్విసంధాన కావ్యాన్నే రచించినా దీని రూపం భిన్నమైంది. తన కావ్యంలో కవి శ్రీరాముని చరిత్రతో పాటు తన ఆశ్రయదాత రాజు రామపాలుని చరిత్రను జోడించి ద్వ్యర్థి కావ్యాన్ని రచించాడు. క్రీ.శ. 17వ శ॥ వాడైన నివృత్తి శేషాచలపతి "భోసల కోసలీయం" అన్న కావ్యంలో కావ్యాన్ని రచించాడు. (ఈ మూడు కావ్యాలను గురించి చారిత్రక కావ్యాల ప్రకరణంలో చూడవచ్చును.) భట్టివంటి కవులు వ్యాకరణ నియమాదులను జోడించి శాస్త్రకావ్యాలను వ్రాయగా తర్వాత కవులు తమ ఆశ్రయదాత రాజుల చరిత్రలను జోడించి ద్వ్యర్థి కావ్యాలను వ్రాసారు. క్రీ.శ. 10వ శ॥ నుంచి ద్వ్యర్థి కావ్యాలు, త్ర్యర్థి కావ్యాలు, విలోమ కావ్యాలు రామాయణ మహాభారత కథలను, పౌరాణిక కథలను జోడించి వ్రాయబడినవి. కొందరు కవులు మూడు అర్థాలతో తృప్తిపడక ఐదు, ఏడు అర్థాలుగల కావ్యాలను కూడ వ్రాసారు. ఇటువంటి చిత్ర కావ్య రచనలు సంస్కృతంలో తప్ప ప్రపంచంలో మరే భాషలోను వ్రాయబడలేదని, అసలు అశేష శాబ్దిక సంపదగల సంస్కృతంలో తప్ప వేరే భాషలో ఇటువంటి రచన సాధ్యం కాదని చెప్పాలి. దేశభాషల్లో సంస్కృత భాసా సౌష్ఠవాన్ని సంపాదించుకొన్న తెలుగు భాషలో మాత్రం ఇటువంటి ద్వ్యర్థి త్ర్యర్థి కావ్యరచనలు జరిగినవి.

# అలంకారశాస్త్ర గ్రంథాలు

కావ్యానుశీలనం చేసే శాస్త్ర గ్రంథాలను కావ్య శాస్త్రాలని, సాహిత్య శాస్త్రాలని అంటారు. వీటికే అలంకార శాస్త్రాలని చాల ప్రచారంలో వున్న పేరు. వీటిల్లో కావ్యసంబంధమైన చర్చలు వుంటవి కాబట్టి వీటిని కావ్యవిమర్శనా గ్రంథాలని కూడ అనవచ్చును. ఇంకా వీటిల్లో లక్షణాలు మరియు లక్ష్యభూతంగా కావ్యాల సమీక్షలు వుండటంచేత వీటిని లక్షణ గ్రంథాలని అనటం కూడ వున్నది. ఈ అలంకార శాస్త్రగ్రంథాలు అర్వాచీన రచనలు కావు. కావ్యనాటకాల ఉత్పత్తి వికాసాలతోపాటు కావ్యశాస్త్ర ఉత్పత్తి వికాసాలు కూడ జరిగినవి. కావ్యాల సాధుత్వా సాధుత్వాలను నిర్ణయించటానికి, పెడమార్గాన్ని పట్టే కవిత్వాన్ని సంరక్షించటానికి విమర్శన, లక్షణ రూపాలైన కావ్యశాస్త్రాలు ఉదయించినవి. ఈ గ్రంథాలు కేవలం లక్షణాలను చేప్పేవే కావు. వీటిల్లో కావ్య సమీక్షలు చేయబడినవి. కవిత్వ దోషాదులు, కవిత్వ గుణాలంకార రసాదులు, కవి ప్రతిభాదులు చర్చింపబడి ప్రాచీన కాలంలో కావ్యవిమర్శలు జరుగలేదనే లోటును ఈ అలంకార శాస్త్ర గ్రంథాలు తీరుస్తున్నవి. పాశ్చాత్య విమర్శనా సిద్ధాంతాలచేత ప్రభావితమై ఆధునిక విమర్శనా పద్ధతులు భిన్నమార్గం పట్టినవి. ప్రాచీన కాలంలో కావ్యనాటకాదులను కావ్యశాస్త్ర పద్ధతుల ననుసరించి తూచేపద్ధతులు ఇప్పటి విమర్శనా పద్ధతులకు భిన్నంగా వుండేవి. కొంతవరకు కావ్యవిమర్శ అలంకార శాస్త్రాలల్లో జరిగినా చాలామట్టుకు అవి మౌఖిక రూపంలో పండిత సదస్సుల్లో, గురు శిష్య వర్గంలో జరిగేవి అంతేగాని ప్రాచీన కాలంలో కావ్యవిమర్శలే జరుగ లేదని, అది ఆధునిక కాలంలోనే ఆరంభమైందని అనటం సత్యదూరమౌతుంది. ఇప్పటికి కూడ భారతీయ సాహిత్యాలల్లో కావ్యశాస్త్రాలకు అతీతంగాగాని వ్యతిరేకంగా గాని విమర్శలు జరగటం లేదు.

అతి ప్రాచీనమైన కాలంలోనే అలంకార శాస్త్ర గ్రంథాలు రచింపబడినవి. కావ్యవిమర్శలతో కూడిన అలంకారశాస్త్రం వేదాంగాలల్లో ఒకటి అని, దాన్ని సప్తమాంగంగా చెప్పాలని ప్రసిద్ధాలంకారికుడు రాజశేఖరుని అభిప్రాయం. వేదాంగాల అధ్యయనం వల్లనే వేదాలు అర్థమౌతున్నవి. అదే విధంగా సప్తమాంగమైన అలంకార శాస్త్రాలవల్లనే వేదసాహిత్యం అర్థమౌతుందని అతని అభిప్రాయం. అలంకార శాస్త్రాల వల్లనే వేదసాహిత్యం అర్థమౌతుందని అతని అభిప్రాయం. అలంకార శాస్త్రాలల్లో చర్చింపబడే విషయాలు - కావ్యనాటక లక్షణాలు, కావ్య సిద్ధాంతాలు, కావ్యభేదాలు నాయికా నాయక లక్షణాలు, రసనిరూపణం,

కావ్యగుణ దోషాలు, శబ్దశక్తులు, అలంకారాదులు. మొదట్లో ఆలంకారికుల దృష్టి నాటకాల పైనే వుండేది. తర్వాత కాలక్రమంగా శ్రవ్యకావ్య విశ్లేషణచేసే అలంకారశాస్త్రాలు కూడ వచ్చినవి. కావ్యం అంటే ఏది? కావ్యస్వరూపం, కావ్యమూలతత్త్వమేది? కావ్య ప్రయోజనాలు కావ్య హేతువులు. కావ్యాన్ని దోషాలు లేకుండ గుణయుక్తంగా ఎట్లా వ్రాయాలి? అలంకారాల ప్రాధాన్యం, కావ్యభేదాలు, కావ్య లక్షణాలు మొదలైనవి ఈ అలంకార శాస్త్రాలల్లో వివేచింపబడసాగినవి. మొదట శ్రవ్యకావ్యానికి శబ్దార్థాలు, ఉక్తివైచిత్రి (అలంకారాలు) శబ్దార్థాల సంయోజనాలు (గుణాలు, రీతులు) ప్రధానమైనవని ఆలంకారికులు తలంచారు. ఇవే కావ్యానికి మూలతత్త్వా లని చెప్పారు. ఈ మూలతత్త్వానికే వామనుడు "కావ్యాత్మ" అని నామకరణం చేసాడు. తర్వాత కావ్యాత్మ ఏది? అని మీమాంస జరిగి అనేక సిద్ధాంతాలు బయలుదేరినవి. ప్రతి ఆలంకారికుడు తన ప్రతిభానుసారంగా నూతన మూలతత్త్వాన్ని స్థాపించటానికి ప్రయత్నించాడు. ఒక ఆలంకారికుడు చెప్పిందాన్ని మరొక ఆలంకారికుడు ఖండించి మరొక తత్త్వాన్ని స్థాపించటానికి పూనుకొన్నాడు. ఈ విధంగా అలంకార, గుణ, రీతి, వక్రోక్తి, రస, ఔచిత్య సిద్ధాంతాతాలు స్థాపింపబడటం జరిగింది. విభావానుభావాదుల సమ్మిశ్రణం చేత ధ్వనించే రసమే కావ్యానికి ప్రధాన తత్త్వమని ఆనందవర్ధనుడు తిరిగి, భరతుడు నాటకాలకు చెప్పిన రససిద్ధాంతాన్నే శ్రవ్యకావ్యాలకు పట్టించి నూతన సిద్ధాంతంగా స్థాపించాడు. పిమ్మట జగన్నాథాదులు ఈ ధ్వనిరూపమైన రససిద్ధాంతాన్నే అంగీకరించి వ్యాపింపజేసారు.

ప్రస్తుతం మనకు లభించే అలంకార శాస్త్రాలల్లో ప్రాచీనతమమైంది భరతుని నాట్యశాస్త్రం. ఇది బృహద్గ్రంథం. ఇది కారికల రూపంలో రచింపబడింది.

## భరతుడు

### భరతనామం

అభినయదర్పణకారుడైన నందికేశ్వరుడు బృహస్పతి, ఉపమన్యు అనే ఆలంకారికుల పేర్లను పేర్కొన్నాడు. కాని వారి అలంకారశాస్త్ర గ్రంథాలేవీ మనకు దొరకలేదు. శిలాలినుడు, కృశాశ్వుడనే నటసూత్రకారులను పేర్కొన్నాడు. వారు భరతునికి పూర్వమున్నవారు కావచ్చును. వారి గ్రంథాలు కూడ దొరక లేదు. లభించే అలంకార శాస్త్ర గ్రంథాలల్లో మొదటిది నాట్యశాస్త్రమే. దీని కర్త భరతుడు. భరతున్ని భరతముని అని కూడ అంటారు. గాంధర్వవేద సృష్టికర్తగా భరతమునిని విష్ణుపురాణం పేర్కొంటున్నది. 'భరత' శబ్దానికి

"నటు"డనే అర్థమున్నది. కాళిదాసు విక్రమోర్వశీయ నాటకాన్ని బట్టి భరతుడు ఇంద్రసభలో వుండే నాట్యవేత్త అని తెలుస్తున్నది. బ్రహ్మదేవుడు పంచమవేదమైన నాట్యవేదాన్ని సామాన్యజనుల మనోరంజనానికై సృష్టించి దాన్ని మానవలోకంలో ప్రచారం చేయటానికి భరతమునిని నియోగించాడు. ఈ భరతమునే "ఆది భరతుడు", "వృద్ధ భరతుడు" గా పేర్కొనబడుతున్నాడు. ఇతడూ నాట్యకర్త భరతుడు వేరు వేరు వ్యక్తులని కొందరి అభిప్రాయం కాగా ఇద్దరూ ఒక్కరే అని చాలామంది విమర్శకులు అంగీకరించారు. నాట్యశాస్త్రకర్త భరతుని తర్వాత నాట్యకళావేత్తలైన వ్యక్తులెందరో భరతుడన్న పేరును పెట్టుకొని వుంటారు. అందుకే క్రమంగా నాటక నిర్వాహకుడైన, నాట్యకళాభిజ్ఞుడైన నాటక సూత్రధారునికి భరతుడన్న పేరు లోకంలో స్థిరపడిపోయినట్లుగా కన్పిస్తున్నది. భరతుని పేరు మీదుగానే నాటకం చివర ఏదో ఒక ప్రధానపాత్ర చేత చదువబడే మంగళ వాక్యాలకు 'భరతవాక్య' మనే పేరు కలిగింది. ఒకవేళ ఆ మంగళ వాక్యాలమ ఒకప్పుడు నాటకనిర్వాహకుడైన భరతుడు చదివేవాడేమో.

## భరతుని కాలం

ఆది భరతుడు లేక వృద్ధ భరతుడు నాట్యశాస్త్రకర్త అని నిర్ణయించినా అతని కాలాన్ని నిశ్చయించి చెప్పటం చాల కష్టంగా వున్నది. భారతీయ సంప్రదాయానుసారం భరతుడు చాల ప్రాచీనమైనవాడుగా చెప్పబడుతున్నాడు. త్రేతాయుగంలో బ్రహ్మ నాట్య వేదాన్ని సృష్టించి తత్ప్రచారానికి భరతుణ్ణి నియోగించాడు. కాబట్టి భరతుడు భారతీయ సంప్రదాయానుసారం సత్యయుగంవాడు. ఈ కాలగణనను అంగీకరించని ఆధునిక విమర్శకులు దీన్ని నిరాకరించారు. చారిత్రక దృష్టితో వారు భరతుని కాలనిర్ణయాన్ని చేయటానికి పూనుకొన్నారు. ఎస్.కే.డే. భరతున్ని క్రీ.శ. 800 ప్రాంతంవాడని, మేక్ డోనెల్ క్రీ.శ. 600 ప్రాంతం వాడని తలంచారు. యాకోబి, కీథ్, పి.వి. కాణే మొదలైనవారు భరతుడు క్రీ.శ. 300 నాటి వాడని అభిప్రాయపడినారు. పిశెల్ భరతుడు క్రీ.శ. 6,7 శతాబ్దాల వాడని చెప్పాడు. మహామహోపాధ్యాయ హరప్రసాదశాస్త్రి, మనమోహన్ ఘోష్‌లు భరతుడు క్రీ.పూ. 200 ప్రాంతంవాడని అంగీకరించారు. కాళిదాసు (క్రీ.పూ. ప్రథమ శతాబ్దం) నాటికే నాట్యశాస్త్ర రచన జరిగిందనటం తథ్యం. కాళిదాసు భరతున్ని దేవనాట్యాచార్యునిగా పేర్కొన్నాడు. భరతుడు దేవనాట్యాచార్యుడనే భావం ప్రచారంలో ఆనాడు వున్నదంటే అప్పటికే అతడు చాల ప్రాచీనమైనవాడై వుండాలి. కాళిదాసు నాటికే

భరతుడు చెప్పిన నాట్య లక్షణాలు స్థిరపడి నిర్దుష్ట రూపాన్ని ధరించినవనటం నిశ్చయం. అప్పుడు భరతుడు క్రీ.పూ. ప్రథమ శతాబ్దం నాటికి ప్రాచీన ఆలంకారికుడని చెప్పవచ్చును. క్రీ.పూ. 5వ శతాబ్దం వాడైన పాణిని "నటసూత్రా"లను పేర్కొని వున్నాడు. ఒకవేళ ఈ నటసూత్రాలు భరతుడు వ్రాసిన మూలగ్రంథమే కావచ్చును. అప్పుడు భరతున్ని క్రీ.పూ. 5వ శ॥ కి పూర్వుడని చెప్పవలసి వుంటుంది. యుధిష్ఠిర్ మీమాంసకుడు తన "వ్యాకరణ శాస్త్ర్ - కా - ఇతిహాస్" అన్న గ్రంథంలో భరతుడు క్రీ.పూ. 500 -600 మధ్యకాలం వాడని నిర్ణయించాడు. ఈ కాలనిర్ణయమే ఇప్పటికి సమంజసంగా వున్నది.

## నాట్యశాస్త్రం

నాట్యశాస్త్రం ఇప్పుడొక బృహద్గ్రంథం. భరతుడు వ్రాసిన మూలగ్రంథం ఇంతటి బృహద్రూపంలో వుండివుండదని విమర్శకుల అభిప్రాయం. నాట్యశాస్త్రంలో విషయాన్ని చెప్పటంలో కాని విషయ విభాగంలోకాని ఒక క్రమ పద్ధతి వున్నట్లు కనిపించదు. అది అనేక గ్రంథాల కూర్పులాగ కన్పిస్తుంది. నాట్యశాస్త్రం వేదాంత వ్యాకరణాది శాస్త్రగ్రంథాలవలె సూత్రరూపంలో వుండి తర్వాత విశాల రూపాన్ని ధరించిందని వింటర్‌నిట్స్ అభిప్రాయం. ప్రస్తుతం లభించే నాట్యశాస్త్రం ప్రాచీన నాట్యశాస్త్రగ్రంథం ఆధారంగా క్రమంగా విస్తరించిన గ్రంథమని డి.ఆర్. భండార్కర్ కూడ అభిప్రాయపడినాడు. ఒకవేళ మూల నాట్యశాస్త్రగ్రంథం పాణిని పేర్కొన్న నట సూత్రాలే కావచ్చును. కాలక్రమంగా ప్రక్షిప్తాలు చేరి ఈ సూత్రాలు విస్తరింపబడివుంటవి. నాట్యకళా ప్రవీణులైన భరత నామధేయులెందరో ఈ గ్రంథ విస్తరణకు కారకులై వుంటారు. కాని మూల గ్రంథరూపం ఇదని ఇప్పుడు నిర్ణయించి చెప్పటానికి వీల్లేదు.

భరతుని నాట్యశాస్త్రం నాట్యకళా సంబంధమైన విజ్ఞాన సర్వస్వం వంటిది. ఇది సూత్ర, భాష్య, కారికలు- ఈ మూడు రూపాల్లో వున్నది. దీనిలో 6000 శ్లోకాలున్నవి. అన్నీ శ్లోకాలేకాక అక్కడక్కడ గద్యంకూడ వున్నది. దీనిలో నాట కోత్పత్తి, నాటకభేదాలు, వాటి లక్షణాలు, నృత్యం, అభినయ విధానాలు, నాటకాలల్లోని భాష, సంవాదస్వరూపం, ఇతివృత్త విధానం, గాయనవాదనలు, నాయికానాయక లక్షణాలు, రసనిష్పత్తి, రస స్వరూపం, ప్రేక్షకులు, నాట్యశాలల నిర్మాణ పద్ధతులు, రంగస్థలం, రంగాలంకరణలు మొదలైనవి చర్చింపబడినవి. తర్వాత రచింపబడిన అలంకారశాస్త్ర గ్రంథాలకు ఇది ఉపజీవ్య గ్రంథంగా ఏర్పడింది. నాట్యకళా విజ్ఞానమంతా చెప్పబడిన ఈ గ్రంథం నాట్యవేదం అని

పిలువబడుతున్నది. ఈ నాట్యవేదాన్ని రచించిన భరతుడు మునిస్థానాన్ని పొందటంలో ఏమి ఆశ్చర్యం లేదు. భరతునికి పూర్వంకూడ నాట్య కళావేత్తలు, నాట్యగ్రంథ రచయితలు వుండేవారు. కాని వారి రచన లేవీ మనకు దొరకలేదు. భరతుని నాట్యశాస్త్రమే పండిత జనాదరణను పొంది అధిక ప్రచారంలో వుండి మిగిలింది. ఆ యా కాలాల్లో ప్రక్షిప్తాలను తనలో చేర్చుకుంటూ నశించకుండా నిలిచింది.

## నాట్యశాస్త్రానికి వ్యాఖ్యానాలు

నాట్యశాస్త్రానికి అనేక ప్రాచీన అర్వాచీన వ్యాఖ్యానాలున్నవి. ఉద్భట, లోల్లట, శంకుక, భట్టనాయక, రాహుల, భట్టతౌత, కీర్తిధర, నామదేవ, మాతృగుప్త మొదలైన వ్యాఖ్యాతల పేర్లను అభినవగుప్తుడు పేర్కొన్నాడు. వారి నాట్యశాస్త్ర వ్యాఖ్యానాలు దొరకటంలేదు. అభినవగుప్తుని "అభినవభారతి" అన్న వ్యాఖ్యానమే ఇప్పుడు దొరుకుతున్నది. కాని ఇదికూడ సంపూర్ణంగా దొరకటం లేదు. అయినా ఈ అసంపూర్ణ వ్యాఖ్యానమే ఎక్కువ ప్రచారంలో వున్నది. క్రీ.శ. 11వ శ॥ వాడైన ధనంజయుని దశరూపకం నాట్యశాస్త్రానికి రూపాంతరమనే చెప్పాలి. నాట్యశాస్త్రం ఆధారంగా రచింపబడిన కృతులు - సాగరనంది (క్రీ.వ. 12వ శ॥) నాటక లక్షణకోశం, రామచంద్ర గుణచంద్రుల (క్రీ.శ. 12వ శ॥) నాట్యదర్పణం, శారదాతనయుని (క్రీ.శ.13వ శ॥) భావప్రకాశం, సింగభూపాలుని (క్రీ.శ. 14వ శ॥) నాటకపరిభాష, రూపగోస్వామి (క్రీ.శ. 15వ శ॥) నాటక చంద్రిక, సుందరమిశ్రుని (క్రీ.శ. 17వ శ॥) నాట్యదీపం మొదలైనవి. ఇవేగాక ప్రసిద్ధ కావ్యశాస్త్రకారులకు, వారి గ్రంథాలల్లోని నాటక, రసప్రకరణాదుల రచనలకు నాట్యశాస్త్రమే ప్రమాణాధారమైంది. భోజ విశ్వనాథ, హేమచంద్ర, విద్యానాథాది ఆలంకారికుల కావ్యసంబంధ విషయాలెన్నో నాట్యశాస్త్రాధారమైనవే. ఈ నాటికిని నృత్య నాట్యనాటక అభినయాదుల విషయంలో భారతీయులకు భరతుని నాట్యశాస్త్రమే ప్రమాణగ్రంథం.

## భరతుని తర్వాత వెలసిన ఆలంకారికులు

భరతుని తర్వాత కోహలుడనే ఆలంకారికుని పేరు వినిపిస్తున్నది. అభినవ గుప్తుడు కోహలుని పేర్కొన్నాడు. కొందరు విమర్శకులు కోహలుడు భరతుని కన్న ప్రాచీనుడని తలంచారు. కాని అతడు భరతునికి శిష్యుడో కొడుకో కావచ్చుననే అభిప్రాయమే విమర్శకుల్లో బలీయంగా వున్నది. కోహలుని తర్వాత ధూర్తిల, శాండిల్య, బాదరాయణాది

అలంకారశాస్త్రకర్త లున్నట్లు తెలుస్తున్నది. కాని వారి రచనలేవీ దొరకలేదు. భరతుని నాట్యశాస్త్రం తర్వాత విశేష వ్యాప్తినందుకొన్న గ్రంథం నందికేశ్వరుని అభినయదర్పణం. ఇతన్ని నంది అనికూడ అంటారు. నందికాలం క్రీ.శ. 12వ శ॥ అని విమర్శకులు నిర్ణయించారు. నాట్యశాస్త్రం తర్వాత నాట్యకళపై వ్రాయబడిన ఉత్తమ గ్రంథం ఇది. ఇది అనేక భాషల్లోకి అనువదింపబడింది.

## అగ్నిపురాణం

అలంకారశాస్త్ర రచన అతి ప్రాచీనమైందని, పురాణాల నుంచే దాని పుట్టుక జరిగిందని కొందరు విమర్శకులు అగ్ని పురాణాన్ని ఉదాహరిస్తారు. అలంకారశాస్త్ర సంబంధమైన రూపక భేదాలు, శ్రవ్యకావ్య భేదాలు, గద్యకావ్య భేదాలు, శబ్దార్థాలంకారాలు మొదలైన విషయాలెన్నో విస్తృతంగా అగ్నిపురాణంలో చర్చింపబడినవి. భరతుడు రూపకభేదాలను పదింటిని మాత్రమే వివరించగా అగ్ని పురాణకారుడు రూపక, ఉపరూపక భేదాలను 27 వరకు వివరించాడు. అగ్ని పురాణం, దానిలోని అలంకార శాస్త్ర సంబంధ విషయాలు చాలా ప్రాచీనమైనవని, భరతుని కన్న ప్రాచీనమైనవని కొందరు విమర్శకులు తలంచినా చాలామంది ఆధునిక విమర్శకులు దీన్ని అంగీకరించలేదు. వారు దీన్ని చాల అర్వాచీన రచనగా చెప్తున్నారు. అగ్ని పురాణమంతా కాకున్నా ఆలంకార శాస్త్రాధ్యాయం చాలా తర్వాత కాలంలో చేర్చబడిన ప్రక్షిప్తభాగమని వారు అంటున్నారు. అగ్ని పురాణంలోని సాహిత్య వివేచనను బట్టి అది నాట్యశాస్త్రం తర్వాత రచన అని తేలుతున్నదని, నాట్యశాస్త్రంలోని సిద్ధాంతాలను అగ్నిపురాణం అంగీకరించి గ్రహించిందని కన్హయ్యాలాల్ పోద్దార్ అభిప్రాయం. భోజరాజు క్రీ.శ. 11 శ॥ సరస్వతీకంఠాభరణ ప్రభావం అగ్నిపురాణ సాహిత్య విమర్శ మీద వుండటం చేత అది క్రీ.శ. 11వ శ॥ తర్వాతి రచన అని బలదేవ ఉపాధ్యాయ అభిప్రాయపడినా అగ్నిపురాణం క్రీ.శ. 12వ శతాబ్దకాలంలో ఆలంకారికులచేత ఉద్ధరింపబడటంచేత దీని రచనా కాలం క్రీ.శ. 9 లేక 10 శతాబ్దంగా అంగీకరించ వచ్చునని అన్నాడు. అగ్ని పురాణ కారునికి ధ్వని సిద్ధాంతంతో సంపూర్ణ పరిచయం వున్నదని, అపహ్నుతి, సమాసోక్తి, ఆక్షేప, పర్యాయోక్తి, అప్రస్తుత ప్రశంసాది అలంకారాలల్లో ధ్వని విశేష మున్నదని పేర్కొనటం చేత అగ్నిపురాణం ధ్వన్యాలోకం తరువాత అనగా క్రీ.శ. 900 తరువాత వ్రాయబడిందని పి.వి. కాణే నిర్ణయించాడు. "ధ్వని" శబ్దం అగ్నిపురాణంలో ప్రయోగింపబడినా ధ్వనిసిద్ధాంత జ్ఞాన మున్నట్లు కన్పించదు. ధ్వని శబ్దం వ్యాపకార్థంలోనే ప్రయోగింపబడింది, మరియు

భరతుడు చెప్పినట్లుగా శృంగార, రౌద్ర, వీర, బీభత్స - ఈ నాలుగు రసాలనే అగ్నిపురాణకారుడు అంగీకరించి గ్రహించాడు. భామహ దండ్యాదులు చెప్పిన ఎన్నో కావ్యలక్షణ విశేషాలు దీనిలో లేవు, చాలా విషయాల్లో ఇది భరతుని నాట్యశాస్త్రాన్ని అనుగమిస్తున్నది కాబట్టి ఇది నాట్యశాస్త్రం తర్వాత, భామహ దండ్యాదులకు పూర్వం వ్రాయబడిందని కన్హయ్యాలాల్ పోద్దార్ చాల విషయచర్చ చేసి నిర్ణయించాడు. కావ్య సంబంధమైన అలంకార, గుణ, రీతి, ధ్వని మొదలైన కావ్యాత్మ పరిచయం అగ్నిపురాణంలో కన్పించదు. "వాగ్వైదగ్ధ్య ప్రధానేఽపి రస ఏవాత్రజీవితమ్" అని రసమే కావ్యనాటకానికి జీవితమని భరతుని సిద్ధాంతాన్ని అగ్ని పురాణకారుడు చెప్పాడు. కాబట్టి ఇది భరతునికి తర్వాత, భామహాదులకు పూర్వం రచింపబడిందని ఎక్కువమంది విమర్శకులు అంగీకరిస్తున్నారు.

## మేధావి

భామహుడు తన కవ్యాలంకారంలో మేధావిని రెండు సార్లు పేర్కొన్నాడు. ఉపమ, యథాసంఖ్య, ఉత్ప్రేక్షాలంకారాల వివరణసందర్భంలో భామహుడు మేధావి అభిప్రాయాలను గూర్చి ప్రసంగించాడు. రుద్రటుడు మేధావిని ఒక అలంకారశాస్త్ర కర్తగా పేర్కొన్నాడు. క్రీ.శ. 10వ శ॥ నాటి రాజశేఖరుడు మేధావిరుద్రుడనే ఆలంకారికుని గూర్చి ప్రసంగించాడు. మేధావి రుద్రుడు, మేధావి, ఇద్దరు వేరు వేరు వ్యక్తులని కొందరు విమర్శకులు తలంచినా ఆ రెండు పేర్లు ఒక్కటే అని, ఒకే వ్యక్తి పేర్లు అని చాలా మంది విమర్శకులు అంగీకరించారు. రాజశేఖరుడు మేధావిరుద్రుని అంధకవిగా చెప్పాడు. మేధావి వ్రాసిన అలంకారశాస్త్ర గ్రంథ మేదీ మనకు లభించలేదు. చివరకు దాని పేరైనా మనకు తెలియదు, నామమాత్ర పరిచితుడై అతడు నిలిచాడు. భామహునికి పూర్వం వెలసిన ఆలంకారికులల్లో ప్రముఖమైన వాడని, భామహుడు అతని అభిప్రాయాలను ఉల్లేఖించటం చేత చెప్పవచ్చును.

## భట్టి

భట్టి మహాకావ్య కర్తయే కాక వైయాకరణుడు మరియు ఆలంకారికుడు. భట్టి తన కావ్యంలో 10 నుంచి 13 సర్గల వరకు కావ్యసంబంధ విషయ చర్చలు చేసాడు. పదవ సర్గలో అలంకారాలు, పదకొండవ సర్గలో మాధుర్య గుణం, పన్నెండవ సర్గలో భావికాలంకారం, పదమూడవ సర్గలో భాషా సమాసాలను గూర్చి చర్చించాడు. దీనిననుసరించ భట్టికి అలంకారశాస్త్ర సంబంధ విషయాలతోను మంచి పరిచయమున్నట్లు తెలుస్తున్నది.

అలంకారాల వివేచనలోను మరియు అలంకారాల పూర్వాపరక్రమాలను పాటించటంలోను భట్టి భామహులు ఒకే అభిప్రాయాలను కలిగి వున్నారు. అందుచేత భట్టి భామహునికి ఈషత్పూర్వుడో లేక సమకాలికుడో అయి వుండవచ్చునని విమర్శకులు నిర్ణయించారు.

## ధర్మకీర్తి

ధర్మకీర్తి ప్రసిద్ధ బౌద్ధనైయాయికుడు. దిఙ్నాగుని ప్రమాణసముచ్చయానికి ప్రమాణవార్తిక కారికను, ప్రమాణవార్తిక వృత్తిని కూడ వ్రాసాడు. ఇంకా ఇతడు ప్రమాణవినిశ్చయ, న్యాయబిందు, హేతుబిందు వివరణ, వాదన్యాయ, సంతానాంతరసిద్ధి, సంబంధ పరీక్ష, సంబంధ పరీక్షావృత్తి మొదలైన బౌద్ధ న్యాయగ్రంథాలను రచించాడు. ఇతడు అలంకారశాస్త్రాన్ని కూడ వ్రాసాడు. కాని అది అనుపలభ్యం. ఇతని అభిప్రాయాలను భామహుడు ఉల్లేఖించి వున్నాడు.

## భామహుడు

### కావ్యాలంకారం

భామహుని అలంకారశాస్త్ర గ్రంథం కావ్యాలంకారం. ఇప్పుడు లభ్యమయ్యే అలంకారశాస్త్ర గ్రంథాలల్లో (నాట్యశాస్త్రం తర్వాత) కావ్యాలంకారమే మొదటిది. మరియు శ్రవ్యకావ్య స్వరూప లక్షణాలను చర్చించే కావ్యశాస్త్ర గ్రంథాలల్లో ఇది ప్రప్రథమమైంది. నాట్యశాస్త్రంలో నాట్య, రూపక లక్షణ భేదాలు చాల సూక్ష్మంగా వివరింపబడినవి. అప్పటికి శ్రవ్యకావ్యాల రచన ఎక్కువగా వికసించి ప్రచారంలో లేకపోవటం చేతనో, లేక తత్ ప్రక్రియను గ్రహించక భరతుడు విడిచి పుచ్చటం చేతనో నాట్యశాస్త్రంలో శ్రవ్యకావ్యాల చర్చ ఏమీ లేదు. శ్రవ్యకావ్య వివేచన మనకు కావ్యాలంకారంలోనే మొట్టమొదట కన్పిస్తున్నది. ఇందులో శ్రవ్యకావ్య భేదాలు శ్రవ్యకావ్య స్వరూపం, మహాకావ్యలక్షణాలు, కావ్యగుణ దోషాలు, కావ్యాలంకారాలు వివరంగా చర్చింపబడినవి. శ్రవ్యకావ్యం పాఠకులను అలరించటానికి ఏమేమి తత్త్వాలవసరమో, వేటిని పరిహరించవలసి వుంటుందో ఈ కావ్యశాస్త్రంలో చక్కగా చర్చింపబడినవి. భామహుని కావ్యశాస్త్రంలో ఆరు పరిచ్ఛేదాలున్నవి. భామహుడు దీన్ని కారికల రూపంలో రచించాడు. ప్రథమ పరిచ్ఛేదంలో కావ్యప్రయోజనాలు, కావ్యహేతువులు, కావ్య లక్షణాలు, కావ్య భేదాలను గూర్చి చెప్పబడింది. ద్వితీయ పరిచ్ఛేదంలో గుణ, అలంకారాలు వివరింపబడినవి. చతుర్థ పరిచ్ఛేదంలో గత పరిచ్ఛేదంలోని

అలంకారాలల్లో మిగిలినవి వివరింపబడినవి. పంచమ పరిచ్ఛేదంలో తర్కశాస్త్రం ఆధారంగా షష్ఠ పరిచ్ఛేదంలో వ్యాకరణం ఆధారంగా దోషాలు వివరింపబడినవి. అలంకారాలను, దోషాలను గూర్చి భామహుడు ఎక్కువ వివరించటం చేత అతని దృష్టిలో కావ్యం దోషాలను పరిహరిస్తు శబ్దశుద్ధి కలిగి అలంకారయుక్తమై వుండాలని తెలుస్తున్నది. దీనిలో మొత్తం 400 కారిక లున్నవి. ఉదాహరణ శ్లోకాలు చాలవరకు భామహుడే స్వయంగా రచించాడు.

భరతుని రససిద్ధాంతాన్ని భామహుడు వివరించలేదు. అగ్నిపురాణకారుడు రసమే కావ్యానికి జీవితమని అంగీకరించినట్లుగా భామహుడు అంగీకరించినట్లు కన్పించదు. అతని దృష్టిలో శబ్దార్థాలే కావ్యం. అందులో వైచిత్రి, వక్రోక్తితో కూడిన అర్థసంయోజనం కావ్యానికి అవసరమని అతడు తలంచాడు. అందుకే వక్రోక్తి మూలతత్త్వంగా కలిగిన అలంకారాలు కావ్యానికి అవసరమని అతడు గుర్తించాడు. అంతేగాక కావ్యం దోషరహితంగా గుణసహితంగా ఉండాలని అతని అభిప్రాయం. రసాన్ని భామహుడు రసవదలంకారంగా గుర్తించి వివరించాడు. దీన్నిబట్టి అలంకారమే కావ్యానికి ప్రధాన మని, దృశ్యకావ్యంలోవలె శ్రవ్యకావ్యానికి రసం ప్రధానం కాదని అతని అభిప్రాయమైనట్లు తెలుస్తున్నది. భామహుడు 36 అర్థాలంకారాలను, 2 శబ్దాలంకారాలను వివరించాడు. కావ్యకర్తకు వ్యాకరణజ్ఞానం, శబ్దపరిచితి పర్యాప్తంగా వుండాలని భామహుని మతమైనట్లు అతని చివరి రెండు పరిచ్ఛేదాలనుబట్టి తెలుస్తున్నది. ప్రసాద మాధుర్య ఓజో గుణాలను పేర్కొని భామహుడు ప్రసాదమాధుర్య గుణాలు శ్రేష్ఠమైనవిగా అంగీకరించాడు.

క్రీ.శ. 800 ప్రాంతంవాడైన ఉద్భటుడు భామహుని కావ్యాలంకారానికి ఒక వ్యాఖ్యానాన్ని వ్రాసాడు. ఉద్భటుడు స్వయంగా ప్రసిద్ధాలంకారికుడు. ఉద్భటుని అలంకారశాస్త్ర గ్రంథానికి వ్యాఖ్యానం వ్రాసిన ప్రతిహారేందురాజు ఉద్భటుని కావ్యాలంకార వ్యాఖ్యానం "భామహవివరణా"న్ని గూర్చి పేర్కొన్నాడు. అభినవ గుప్త, రుయ్యకులు కూడ ఈ వ్యాఖ్యానాన్ని పేర్కొన్నారు. కాని ఈ వ్యాఖ్యానం ఇప్పుడు అలభ్యం.

## దండి భామహుల పౌర్వాపర్యం

దండి భామహులల్లో ఎవరు ముందు అనే విషయంలో విమర్శకులల్లో అభిప్రాయభేద మున్నది. కొందరు భామహుడు ముందు అని అంగీకరిస్తే కొందరు దండి ముందు అని అంగీకరించి నిరూపించటానికి ప్రయత్నించారు. జి.జె. అగాషే కావ్యాదర్శకర్త దండి, దశకుమార చరిత్రకర్త దండి వేరు అని, కావ్యాదర్శకర్త దండి భామహునికి పూర్వుడని

నిరూపించటానికి ప్రయత్నించాడు. పి.వి. కాణే కూడ దండి భామహునికి పూర్వుడని అంగీకరించాడు. కాని వింటర్‌నిట్స్, ఎస్.కే.డే. మొదలైనవారు భామహుడే పూర్వుడని అంగీకరించారు. ఉద్భట, వామనులు సమకాలికులు. వాళ్ళిద్దరికి భామహదండ్యాచార్యులు పరిచితమైన వారు. ఉద్భట వామనులు క్రీ.శ. 800 ప్రాంతంవారు. కాబట్టి భామహ దండ్యాచార్యులు క్రీ.శ. 800కు పూర్వులని తెలుస్తున్నది. క్రీ.శ. 7వ శ॥ వాడైన ధర్మకీర్తిని భామహుడు చాలా చోట్ల పేర్కొనివున్నాడు. అందుచేత భామహుడు క్రీ.శ. 7వ శ॥కి తర్వాతవాడని, దాదాపు ఉద్భటునికి సమకాలికుడని, యాకోబి నిర్ణయానికివచ్చాడు. ఉద్భటుని అలంకార శాస్త్రానికి టీక వ్రాసిన నమిసాధు భామహుని పేరును మొదట పేర్కొని తర్వాత దండిని పేర్కొన్నాడు. అతడు వారి పౌర్వాపర్యాలను అనుసరించే పేర్కొనివుంటాడు. అంతేగాక కావ్యాదర్శ టీకా కారుడు తరుణవాచస్పతి (క్రీ.శ. 12వ శ॥) ఒకచోట దండి భామహుని మతాన్ని ఉల్లేఖించాడని చెప్పటంచేత దండి కన్న భామహుడు ప్రాచీనుడని తెలుస్తున్నది. భామహుడు ఉపమాలంకారం యొక్క త్రివిధ భేదాలను వివరించగా దండి మూడింటికంటె ఎక్కువ భేదాలను వివరించాడు. దీన్నిబట్టికూడ దండి అర్వాచీనుడని చెప్పవచ్చును. భామహుడు కథ, అఖ్యాయికల నడుమ భేదాన్ని పాటించి వాటి లక్షణాలను ఇయ్యగా దండి అటువంటి భేదాన్ని పాటించలేదు. కథ, ఆఖ్యాయికల లక్షణభేదాలను ప్రశ్నిస్తూ అఖ్యాయికను కథలోనే చేర్చి చెప్పవచ్చును కదా వేరే కావ్యప్రక్రియగా చెప్పటం ఎందుకని దండి అంటాడు. ఇక్కడ దండి భామహుని విమర్శిస్తూ తన అభిప్రాయాన్ని చెప్తున్నాడా అన్నట్లుగా వుంటుంది. మరికొన్నిచోట్ల భామహుని అభిప్రాయాలను దండి వివేచించి స్పష్టం చేస్తున్నట్లుగాను గోచరిస్తున్నది. దీన్నంతా పరిశీలిస్తే దండి కన్న భామహుడే పూర్వుడనటం సమంజసంగా వున్నది. అలంకారశాస్త్ర క్రమ వికాసాన్ని సూక్ష్మేక్షికతో పరిశీలించినట్లయితే భామహుడు దండికి పూర్వుడనటం సమంజసంగా వుంటుంది. గద్యకావ్య ప్రకరణంలో దండి కాలం క్రీ.శ. 600-650 ప్రాంతమని నిర్ణయించటం జరిగింది. అప్పుడు భామహుడు క్రీ.శ. 6వ శతాబ్దం ఉత్తరార్ధంలో వున్నవాడని చెప్పవచ్చును.

## భామహుని పరిచయం

భామహుని తండ్రిపేరు రక్రిలగోమిన్. ఈ పేరు బౌద్ధ సంబంధంగా కన్పిస్తున్నదని మరియు కృత్యారంభంలో భామహుడు "ప్రణమ్య సార్వం సర్వజ్ఞం మనోవాక్కాయ కర్మభిః' ' అని సర్వజ్ఞనామంచే బుద్ధుని స్తుతించాడని, భామహుడు బౌద్ధుడని కొందరు విమర్శకులు

ఊహించారు. కావ్యాలంకారంలో, ఉదాహరణ శ్లోకాలల్లో ఎక్కడా బుద్ధునిగాని బౌద్ధధర్మ సంబంధ విషయాలను గాని భామహుడు పేర్కొనలేదు. పైగా అతడు బ్రహ్మ విష్ణు శంకర పార్వతి మొదలైన దేవతల స్తుతి శ్లోకాలనే లక్షణోదాహరణలుగా ఇచ్చాడు. మహాభారత రామాయణాలల్లోని పాత్రల చర్చలనే అతడు చేసాడు. వైదిక విధులనే పేర్కొన్నాడు కాని ఎక్కడా అతడు బౌద్ధ ధర్మ ప్రసక్తిని తేలేదు. రక్రిలగోమిన్ అన్న పేరు కేవలం బౌద్ధ సంబంధి అని చెప్పటానికి వీల్లేదు. కాశ్మీరాది ప్రాంతాలల్లో బ్రాహ్మణులూ అటువంటి పేర్లను ధరిస్తారు. భామహుడు కృత్యారంభంలో "సర్వజ్ఞ" అని స్మరించింది బుద్ధున్ని కాక శివున్ని అని గ్రహించాలి. ఎందుకంటె "సర్వజ్ఞ" అన్న పేరు బుద్ధునికి కాక శివునికే ఎక్కువ ప్రచారంలో వున్నది.

## భామహుని రచనలు

భామహుడు కావ్యాలంకారాన్నే కాక వరరుచి ప్రాకృత ప్రకాశానికి 'మనోరమ' అనే పేరుతో వ్యాఖ్యానం వ్రాసాడని అంటారు. "మనోరమ" కర్త భామహుడే అని పిశెల్ అంగీకరించాడు. వృత్తరత్నాకర వ్యాఖ్యానంలో నారాయణభట్టు భామహోక్తమైన ఛందస్సులను కొన్నిటిని ఉదహరించటం చేత భామహుడు ఛందోగ్రంథాన్ని కూడ వ్రాసాడని అనుమానం కలుగుతున్నది. అభిజ్ఞాన శాకుంతలానికి "అర్థద్యోతనిక" అనే వ్యాఖ్యానంలో రాఘవభట్టు భామహుని పేర ఉద్ధరించిన అలంకార ఛందస్సు సంబంధ విషయాలను బట్టి భామహుడు కావ్యాలంకారమే కాక ఛందః శాస్త్రాన్ని కూడా రచించాడని పండితులు ఊహిస్తున్నారు.

భామహుని కావ్యాలంకారం పండితుల విశేషాదరణను పొందింది. ఉద్భట, ఆనందవర్ధన, అభినవ గుప్త, మమ్మటాది ఆలంకారికులు భామహుని మీద గౌరవ భావం కలవారు మరియు అతన్ని అనేకసార్లు ఉద్ధరించి వున్నారు.

# దండి

## కావ్యాదర్శం

దండి అలంకార శాస్త్ర గ్రంథం పేరు కావ్యాదర్శం. కావ్యాదర్శానికి అలంకార శాస్త్ర గ్రంథాలల్లో విశేషస్థానమున్నది. అగ్నిపురాణం, కావ్యాలంకారాల తర్వాత కావ్యాదర్శమే లభ్యమయ్యే అలంకారశాస్త్ర గ్రంథం. కావ్యాదర్శంలో మూడు పరిచ్ఛేదాలున్నవి. ప్రథమ పరిచ్ఛేదంలో కావ్యపరిభాష కావ్య భేదాలు, మహాకావ్య లక్షణాలు, గద్యకావ్య భేదాలు,

తల్లక్షణాలు వివరింపబడినవి. ద్వితీయ పరిచ్ఛేదంలో 35 అర్థాలంకారాలు సోదాహరణంగా వివరింపబడినవి. తృతీయ పరిచ్ఛేదంలో యమక భేదాలు, చిత్రబంధాలు వివరింపబడినవి. తర్వాత విస్తరంగా దోషనిరూపణ జరిగింది. కావ్యాదర్శంలో మొత్తం 360 శ్లోకాలున్నవి.

దండి విశేషంగా అలంకార గుణరీతుల వివేచన చేసివున్నాడు. కావ్యమూలతత్త్వ సిద్ధాంతాలల్లో దండి ఏ సిద్ధాంతానికి చెందినవాడన్న విషయంలో అభిప్రాయభేదమున్నది. దండి దోషనిరూపణను విస్తరంగా చేసి కవిత్వంలో గుణాల ప్రాధాన్యాన్ని ఎత్తి చూపాడు. అందుచేత అతడు గుణసిద్ధాంత వాది అని కొందరు విశ్వసించారు. అలంకార వివేచనను కూడ దండి చాల వివరంగా చేసాడు. అతడు భామహుని వలెనే అలంకారవాది అని మరికొందరి విశ్వాసం. మొత్తంమీద దండి గుణాలంకారవాది అని చెప్పవచ్చును. భామహుడు తడివి విడిచిపెట్టిన విషయాలను ఎన్నిటినో దండి విస్తరించి వివరించాడు. భామహుణ్ణే దండి ఎన్నోచోట్ల సమర్థించినట్లుగా కన్పిస్తుంది. భామహుడు అలంకార శోభాహేతుకమైంది వక్రోక్తి అని చెప్పగా దండి "శ్లేషః సర్వాసు పుష్ణాతి ప్రాయో వక్రోక్తిము శ్రియమ్" అని భామహునితో అంగీకరించాడు. ఉక్తి వైచిత్రి, అతిశయోక్తుల పైననే అలంకారశోభ ఆధారపడిందని భామహ దండ్యాచార్యుల అభిప్రాయం స్వభావోక్తిని విశేషంగా ఆదరించి వివరించినవారిలో దండి ప్రథమాచార్యుడు. నాట్యశాస్త్ర, అగ్ని పురాణంవలె దండి రసవాదానికి ప్రాధాన్యాన్ని ఇయ్యలేదు. శ్రవ్య కావ్యంలో రససిద్ధాంతం పట్టదని అతని అభిప్రాయం కావచ్చును. భామహుని వలెనే అతడు రసాన్నికూడా అలంకారంగానే అంగీకరించాడు. శ్రవ్యకావ్యంలో ఉక్తివైచిత్రికి, గుణాలకు ప్రాధాన్యమని, వాటిచేత అది పఠనీయం అవుతుందని దండి అభిప్రాయం. కాని దోషరహితత్వం కూడ చాల ముఖ్యమని గ్రహించి దండి భామహుని వలెనే దోష నిరూపణకు ప్రాధాన్యమిచ్చాడు.

కావ్యాన్ని దండి ఒక వ్యక్తిగా దర్శించాడు. శబ్దార్థాలు అతని దృష్టిలో కావ్యశరీరం. అలంకారాలు అలంకారాలు, గుణాలు గుణాలు. తర్వాత ఆలంకా రికులు ఈ కావ్య శరీర కల్పనను అంగీకరించి కావ్య ప్రధాన తత్త్వాన్ని కావ్యశరీరానికి ఆత్మగా గుర్తించి తదన్వేషణకు పూనుకొన్నారు.

## కావ్యాదర్శానికి టీకలు

కావ్యాదర్శానికి అనేక టీకలు రచింపబడినవి. వాటిల్లో తరుణ వాచస్పతి టీక ప్రాచీనమైంది. దీనికి అజ్ఞాత రచయిత వ్రాసిన "హృదయంగమ" మనే మరొక ప్రసిద్ధ టీక

వున్నది. కావ్యాదర్శం సియ - వస - లకర (స్వభాషాలంకారం) అనే పేరుతో క్రీ.శ. 9వ శతాబ్దంలో సింహళ భాషలోకి అనువదింపబడింది.

## రుద్రభట్టు

కావ్యాలంకారకర్త రుద్రటుని కన్న ఈ రుద్రటుడు భిన్నమైనవాడు. ఇతని కృతి శృంగార తిలకం. ఇది కావ్యమాల సిరీజ్‌లో మూడవ గుచ్ఛంగా ప్రచురితమైంది. శృంగార తిలకానికి గోపాలభట్టు టీకను వ్రాసాడు. ఈ టీకలో రుద్రభట్టు త్రిపుర వధ అనే కావ్యాన్ని వ్రాసినట్లు చెప్పాడు. కాని అది అలభ్యం. శృంగారతిలకంలో నాయికా నాయకుల భేదాలు, రసాలంకార నిరూపణలు చేయబడినవి. దీనిలో మూడు పరిచ్ఛేదాలున్నవి. దీనిలో శృంగార, కరుణ, వీర, అద్భుత, శాంత, హాస్యాది నవరసాల వివరణ వున్నది. శృంగారతిలకం నుంచి ఉద్ధరణలు శారఙ్గధర పద్ధతి, సూక్తి ముక్తావళి, సాహిత్య దర్పణం, పంచతంత్రాలల్లో కన్పిస్తున్నవి. నాట్య శాస్త్రంలో రూపకసంబంధి రసవివేచన చేయబడింది. రుద్రభట్టు కావ్యసంబంధి రసవివేచన చేశాడు. ఇతడు విశేషంగా శృంగార రసాన్ని వివరించాడు. శృంగార రసాన్ని నాయక రసంగా ఇతడు అంగీకరించాడు. రసవిహీనమైన వాణి నీరసమైందని రుద్రభట్టు అభిప్రాయం. రుద్రభట్టు క్రీ.శ. 7వ శతాబ్దం వాడని విమర్శకుల అభిప్రాయం.

## ఉద్భటుడు

అలంకారశాస్త్ర చరిత్రలో భామహదండ్యాచార్యుల తర్వాత ఉద్భటుడు ప్రసిద్ధి చెందినవాడు. ఉద్భటుడు కాశ్మీర రాజా జయాపీడుని ఆస్థాన పండితుడు. జయాపీడుని (క్రీ.శ. 779-813) పండితపోషణను ప్రశంసించిన కల్హణుడు తన రాజ తరంగిణిలో ఉద్భటుడు ఆ రాజా ఆస్థాన పండితుడని తెలిపివున్నాడు.

విద్వాన్ దీనార లక్షేణ ప్రత్యహం కృత వేతనః
భట్టోభూదుద్భటస్తస్య భూమి భర్తుః సభాపతిః

“కావ్యాలంకార సార సంగ్రహం” ఉద్భటుని అలంకార కృతి. ఇంకా అతడు “భామహ వివరణ”ను వ్రాసాడు. పేరునుబట్టి ఇది భామహుని కావ్యాలంకారానికి వాఖ్యానం అని తెలుస్తున్నది. కాని ఇది అలభ్యం. ఉద్భటుడు భరతుని నాట్యశాస్త్రానికి టీక

కూడ వ్రాసాడు. ఉద్భటుడు కుమార సంభవమనే కావ్యాన్ని కూడ వ్రాసాడు. ఆ కావ్యం నుంచి తన అలంకార గ్రంథంలో లక్షణోదాహరణలను ఇచ్చాడు.

కావ్యాలంకార సార సంగ్రహంలో ఆరు పరిచ్ఛేదా లున్నవి. 79 కారికలున్నవి. ఉద్భటుడు భామహుని అనుసరించి ఈ గ్రంథంలో అలంకారాల వివేచనను చేసాడు. ఒకొకచోట భామహుని కన్న భిన్నంగా అలంకార భేదాలను చెప్పాడు కూడ. ఉద్భటుడు మొత్తం 41 అలంకారాలను వివరించాడు. కొన్ని కొన్ని అలంకార వివరణలను ఉద్భటుడు భామహుని నుంచి తీసుకొన్నా అతని ఉపమ, అతిశయోక్తి ఉత్ప్రేక్షాద్యలంకారాల వివరణలను తర్వాత మమ్మట రుయ్యకాదులు గ్రహించారు. ఉద్భటుని అనుసారం గుణాలు, అలంకారాలు రెండు సమానంగా కావ్య సౌందర్యవర్ధకాలని రుయ్యకుడు ఉల్లేఖించాడు. శాంతరసాన్ని నవమరసంగా నాట్యశాస్త్రంలో చెప్పింది ఉద్భటుడే అని పండితుల అభిప్రాయం. ఉద్భటుడు రీతులను దేశపరమైన పేర్లతో కాక ఉపనాగరిక, గ్రామ్య, పరుష అనే పేర్లతో పేర్కొన్నాడు. ఈ విభజన శబ్ద సంయోజనం మీద ఆధారపడింది. ఉపనాగరిక రీతి పరిష్కృతమైంది. గ్రామ్య రీతి సాధారణమైంది. పరుషరీతి కఠినమైంది. క్రీ.శ. 950 ప్రాంతంవాడైన ప్రతీహారేందురాజు ఉద్భటుని అలంకార శాస్త్రానికి వ్యాఖ్యానాన్ని వ్రాసాడు. ఆనందవర్ధనుడు ఉద్భటుని అభిప్రాయాలను సాదరంగా ఉల్లేఖించాడు. రాజశేఖరుడు "ఇతి ఔదంభరాః ఉద్భటమతానుయాయినః" అని పేర్కొనటం చేత ఉద్భటుని శిష్యప్రశిష్యపరంపర రాజశేఖరుని నాటి వరకు వున్నదని తెలుస్తున్నది. ఉద్భటుని సంప్రదాయం ఔద్భట సంప్రదాయంగా ప్రసిద్ధికెక్కింది. శ్రవ్య కావ్యంలో రసమే "జీవద్రూపం" అని ఉద్భటుడు ప్రప్రథమంగా అంగీకరించినవాడని కొందరు విమర్శకుల అభిప్రాయం. అలంకారాలల్లోని అలంకారాంతర ప్రతిభ చర్చలో శబ్దశక్తి విచారణను చూడవచ్చును. ఉద్భటునికి ప్రాచీనాలంకారికుల్లో మహత్త్వపూర్ణమైన స్థానమున్నది.

## వామనుడు

ఉద్భటునివలెనే వామనుడు కాశ్మీరరాజు జయాపీడుని (క్రీ.శ. 779-813) ఆస్థాని, మంత్రి కూడ. వామనుని అలంకారగ్రంథం కావ్యాలంకార సూత్రవృత్తి. ఇంతకుముందున్న అలంకారశాస్త్రాలన్ని పద్య కారికలల్లో వ్రాయబడివుండగా వామనుడు సూత్ర పద్ధతిలో తన అలంకార కృతిని రచించి ప్రత్యేకతను చూపాడు. సూత్రబద్ధం చేస్తేనే శాస్త్రమన్న ఆలోచనను మనస్సులో వుంచుకొని వామనుడు కావ్య లక్షణాదులను సూత్రబద్ధం

చేసాడేమో. దీనిలో 319 సూత్రాలున్నవి. ఇది ఐదు అధికరణలుగా, పన్నెండు అధ్యాయాలుగా విభాగింపబడింది. తన సూత్రాలకు అర్థాలను వామనుడే స్వయంగా వ్రాసుకొన్నాడు. ఈ సూత్ర వివరణకే వృత్తి అని పేరు. వామనునికి పూర్వం ఆలంకారికులు లక్షణోదాహరణలు తాము స్వయంగా వ్రాసినవి ఇచ్చారు. కాని వామనుడు ఆ యా కవుల కావ్యాల నుంచి ఉదాహరణలను ఇచ్చి తన సిద్ధాంతాలకు వ్యాప్తిని కలిగించాడు.

కావ్యాలంకార సూత్ర వృత్తిలో ప్రథమ అధికరణంలో కావ్య పరిభాష, కావ్య ప్రయోజనాలు, కావ్య హేతువులు, కావ్య రీతులు, కావ్యాంగాల నిరూపణ జరిగింది. ద్వితీయ, తృతీయ, చతుర్థ అధికరణాలల్లో క్రమంగా దోష, గుణ, అలంకార నిరూపణ జరిగింది. పంచమ అధికరణంలో శబ్ద శుద్ధిని గూర్చి వివరింపబడింది. ఇది భామహుని కావ్యలంకారంలోని చివరి పరిచ్ఛేదాన్ని పోలివున్నది. వామనుడు 33 అలంకారాలను వివరించాడు. వాటిల్లో వక్రోక్తి, వ్యాజోక్తులను విశేషంగా వివరించి చెప్పాడు. కావ్యం యొక్క 'ఆత్మ' ను గూర్చి మొట్ట మొదట పేర్కొని చర్చించిన మొదటి అలంకారికుడు వామనుడు. అతడు "రీతిరాత్మా కావ్యస్య"- కావ్యానికి రీతి ఆత్మరూపంమైందని స్థాపించాడు. "కావ్య శోభాకరాన్ ధర్మానలంకారాన్ ప్రచక్షతే" అని దండి అభిప్రాయం. వామనుడు కావ్య శోభ గుణాలవల్ల కలుగుతుందని చెప్పాడు. "కావ్య శోభాయాఃకర్తారో ధర్మా గుణాః" గుణాలవల్ల కావ్య సౌందర్యం కలుగుతుందని, ఆ సౌందర్యాన్ని అతిశయింపజేసేది అలంకారం అని వామనుని అభిప్రాయం. అలంకారాలు లేకున్నా కావ్య సహజ సౌందర్యానికి లోపం రాదని వామనుని మతం. ఒక వ్యక్తికి గుణాలవల్ల ఆత్మ సౌందర్యం సమకూరినట్లుగా కావ్యానికి కూడ సౌందర్యం గుణాలవల్ల సమకూరుతుందని అతడు అంటాడు. అందుచేత వామనున్ని సౌందర్యవాదిగా కూడ పిలుస్తారు.

ఉద్భటవామనులు ఒకే రాజు ఆస్థానాన్ని అలంకరించారు. ఇద్దరు భిన్న మార్గాలను అనుసరించిన ఆలంకారికులు. అంటే వారు తమ కృతుల్లో ఒకరిపేరు నొకరు పేర్కొనలేదేమో. ఉద్భటుడు అలంకారవాది అయిన భామహుని అనుసరించగా వామనుడు కొంతవరకు దండిని అనుసరించి రీతి సిద్ధాంతాన్ని కొత్తగా సృష్టించినవాడు. దండి కావ్యాన్ని వ్యక్తితో పోల్చగా ఒక వ్యక్తివలె కావ్యానికి ఆత్మ వుంటుందని కల్పన చేసి నిరూపించినవాడు వామనుడు.

కాశికాకారుడైన వామనుడు, కావ్యాలంకార సూత్రవృత్తి కర్త వామనుడు ఇద్దరు ఒకే వ్యక్తులా? వేరు వేరు వ్యక్తులా? అనే విషయంలో పండితులల్లో అభిప్రాయ భేదమున్నది. కాశికలోని వామనుని వ్యాకరణ సంబంధ అభిప్రాయాలను ఆలంకారికుడైన వామనుడు సమ్మతించటంచేత ఇద్దరు ఒక్కరే అని పి.వి. కాణే నిర్ణయించాడు. బూల్యర్ కూడ ఇదే అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు.

# రుద్రటుడు

## రుద్రటుని కాలం

రుద్రటుని అలంకారశాస్త్ర గ్రంథం కావ్యాలంకారం. పేరునుబట్టి ఇతడు కాశ్మీర దేశీయుడని చెప్పవచ్చును. రుద్రటుడు సామవేదశాఖి అని, తండ్రి పేరు భట్ట వాముకుడని కావ్యాలంకారానికి నమిసాధు వ్రాసిన టీక ద్వారా తెలుస్తున్నది. రుద్రటునికి ఆనందవర్ధనుని ధ్వని సిద్ధాంతంతో పరిచయమున్నట్లు లేదు. కాబట్టి రుద్రటుని కాలం ఉద్భట వామనుల తర్వాత ప్రతీహారేందురాజు ఆనందవర్ధనులకు పూర్వం అంటె దాదాపు క్రీ.శ. 9వ శ॥ పూర్వార్ధమని చెప్పవచ్చును.

## కావ్యాలంకారం

కావ్యాలంకారంలో 16 అధ్యాయాలు, 748 శ్లోకాలు వున్నవి. దీనిలో 14 ప్రక్షిప్త శ్లోకాలు కూడ చేరినవి. ఈ శ్లోకాలల్లో 495 కారికలు, మిగిలినవి ఉదాహరణలు. ప్రౌఢమైన అలంకారశాస్త్ర గ్రంథాలల్లో కావ్యాలంకారం ఒకటి. తన కావ్యాలంకారంలో రుద్రటుడు కావ్యశాస్త్ర సంబంధ విషయాలన్నిటిని గూర్చి చర్చించాడు. వామనాదులవలె రుద్రటుడు ఏ కొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదించలేదు. కాని శాస్త్రీయ పద్ధతిలో అతడు చేసిన విషయ వివేచన మెచ్చుకోదగ్గది. శబ్ద, అర్థ భేదాలతో అలంకారాలను చక్కగా విభజించి రుద్రటుడు విస్తరంగా శాస్త్రీయ పద్ధతిలో వివరించాడు. ఈ విషయంలో తర్వాత ఆచార్యులు రుద్రటుని అనుసరించారు. అతడు 57 అలంకారాలను వివరించాడు. రుద్రటుడు ఆలంకారవాది. అయినా రసనిష్పత్తిని కూడ వివరించాడు. ప్రేయోరసాన్ని అతడు దశమరసంగా గుర్తించి స్థాపించాడు. ప్రేయోరసానికి రుద్రటుడు స్నేహాన్ని స్థాయీ

భావంగా పేర్కొన్నాడు. సౌహార్దభావం గల వ్యక్తి నాయకుడు. సహృద్వ్యవహారంతో కూడిన నిశ్చల నిర్వ్యాజ మనోవృత్తియే స్నేహం. స్నేహభావంవల్ల ఏర్పడిన ప్రేమ, విశ్వాస, సద్భావనలతో కూడిన కోమలమైన పరస్పరాలాపాలుంటవి. హృదయం ఆర్ద్రం కావటం, ఆహ్లాదజనితాశ్రువులు, సుస్నిగ్ధస్ఫారమైన కనులతో పరస్పరావలోకనం అనుభావాలు. ప్రేయోరసం శృంగారరసం వలె ప్రణయసంబంధి రతి కాక ప్రణయేతర సంబంధి రతి కలది. అప్పుడు పుత్రప్రేమ, దాంపత్య ప్రేమ, ప్రకృతి ప్రేమ, దేశభక్తి, మహాపురుషుల ఎడల సమాదర ప్రేమ మొదలైనవి ప్రేయోరసాంతర్గతమైనవని చెప్పవచ్చును. తర్వాత భోజరాజాదులు ఈ ప్రేయోరసాన్ని గ్రహించి వివరించారు. ఆధునిక కవిత్వంలో పోషింపబడే అమలిన శృంగారం (Platonic love) ఈ ప్రేయోరసంలో అంతర్భవిస్తుంది. రుద్రటుడు వైదర్భి, గౌడి, పాంచాలీ రీతులనే కాక 'లాటి' అనే నాల్గవరీతిని కూడ గుర్తించాడు. తర్వాత భోజుడు రీతులను ఇంకా పెంచాడు. భామహదండ్యాచార్యులు చెప్పిన మహాకావ్య లక్షణాలను రుద్రటుడు భారవిమాఘుల మహాకావ్యాలను పరిశీలించి ఇంకా స్పష్టంచేసాడు.

## కావ్యాలంకారానికి టీకలు

క్రీ.శ. 1069లో నమిసాధు అనే శ్వేతాంబర జైనుడే కాక కావ్యాలంకారానికి క్రీ.శ. 1240 ప్రాంతంలో ఆశాధరుడనే జైనాచార్యుడు కూడ టీకను వ్రాసాడు. నమిసాధు టీక వ్రాయకముందు కావ్యాలంకారం కొంత దుర్బోధకంగా వుండేదని పండితుల అభిప్రాయం.

## భట్టలోల్లటుడు

భట్టలోల్లటుడు భరతుని నాట్యశాస్త్రానికి టీకను వ్రాసాడు. కాని ఇప్పుడది ఉపలభ్యం కాదు. అభినవగుప్తుడు భట్టలోల్లటుని మతాన్ని ఖండించాడు. రాజశేఖరుడు భట్టలోల్లటుని అభిప్రాయాలను ఉల్లేఖించాడు. రాజశేఖరుని అనుసారం లోల్లటుడు అపరాజితుని కొడుకు. రసం రామాదినాయక నిష్ఠమని, నటుల్లో రసం లేకున్నా రసమున్నట్లు భాసిస్తుందని, సామాజికులు ఆ నటులను చూడటం వల్ల వారి హృదయాల్లో రామాదినాయక నిష్ఠమైన రసం స్ఫురిస్తుందని చెప్పాడు. దీనికి ఉత్పత్తివాదమని పేరు. లోల్లటుడు క్రీ.శ. 750-800 ప్రాంతంవాడు.

## భట్టశంకుకుడు

ఇతడు క్రీ.శ. 850 ప్రాంతంవాడు అంటే ఆనందవర్ధనుని సమకాలికుడు. నాట్యశాస్త్రానికి టీకను వ్రాసాడు. కాని అది అనుపలభ్యం. ఇంకా ఇతడు భువనాభ్యుదయమనే కావ్యాన్ని కూడ వ్రాసాడు. అది కూడ దొరకలేదు. శంకుకుడు లోల్లటుని ఉత్పత్తి వాదాన్ని ఖండించి రసం రామాది నాయకుల వేషాలను ధరించే నటనిష్ఠమని చెప్పాడు. నటగత రత్యాది స్థాయిభావాలను సామాజికులు అనుభవించి ఆనందిస్తారని అతని మతం. దీనికి అనుమితివాద మని పేరు.

## భట్టనాయకుడు

భట్టనాయకుడు కాశ్మీరరాజు అవంతివర్మ (క్రీ.శ. 855-884) ఆస్థాన కవి. ఇతడు నాట్యశాస్త్రానికి హృదయదర్పణమనే వ్యాఖ్యానాన్ని వ్రాసాడు. ఇది కూడ అనుపలభ్యం. ఇతడు పై ఆచార్యుల రసనిష్పత్తివాదాలను ఖండించి రసం సామాజిక నిష్ఠమని చెప్పాడు. రసం రామాదినాయక నిష్ఠమైనా, నటనిష్ఠమైనా సామాజికుడు దాన్ని అనుభవించటం జరుగదు. సామాజికులు నాయకాదులతో అభేదం పొంది ఆ రసన్ని తామే అనుభవిస్తారని అతని మతం. దీనికి భుక్తివాదమని పేరు. ఈ ముగ్గురు ఆచార్యులు రససిద్ధాంత వివరణకు చేసిన యోగదానం చాల గొప్పది. తర్వాత భట్టనాయకుని భుక్తివాదాన్ని గ్రహించి అభినవగుప్తుడు రసధ్వనిని నిరూపించాడు. ఈ ధ్వనిరూపమైన రసం పండితులందరి మన్ననలను పొందింది.

## ఆనందవర్ధనుడు
### ధ్వని కారికాకారుడు

ఆనందవర్ధనుడు కాశ్మీరరాజు అవంతివర్మ (క్రీ.శ. 855-883) ఆస్థాన పండితుడు. ఇతని కృత ధ్వన్యాలోకం. దీనికి కావ్యాలోకం అని కూడ పేరు. ధ్వన్యాలోకం ప్రౌఢమైన మౌలిక గ్రంథం కావ్యశాస్త్రంలో ఒక కొత్త మలుపును తెచ్చిన గ్రంథం. యుగప్రవర్తకమైన గ్రంథమే అని చెప్పవచ్చును. ప్రాచీనాచార్యుల కావ్యతత్త్వసిద్ధాంతాలను అన్నిటిని పరిశీలించి ఒక కొత్త దిశలో కావ్య తత్త్వచింతన దీనిలో చేయబడింది. సమాహార రూపమైన ధ్వని సిద్ధాంతాన్ని ప్రతిపాదించింది.

ధ్వన్యాలోకంలో 129 కారిక లున్నవి. వీటికి ధ్వనికారికలని పేరు. ఈ కారికలకు వ్రాయబడిన వృత్తి పేరు ధ్వన్యాలోకం . ఈ ధ్వన్యాలోకానికి 150 సంవత్స రాల తర్వాత అభినవగుప్తుడు లోచనమనే వ్యాఖ్యానాన్ని వ్రాసాడు. మూల కారికలు రచించింది ఆనందవర్ధనుడు కాడని కొందరు పండితులు అభిప్రాయ పడుతున్నారు. ప్రతీహారేందురాజా, కుంతకుడు, మహిమభట్టు, క్షేమేంద్రుడు, హేమచంద్రుడు, విశ్వనాథాది ప్రాచీనాలంకారికులు కారికాకారుడు ధ్వన్యాలోక కారుడు ఒకే వ్యక్తి అన్నట్లుగానే ఉల్లేఖించివున్నారు. ప్రాచీనాలంకారికులల్లో మత భేదమున్నట్లు కనబడదు. కాని ఆధునికుల్లోనే కారికలను, వృత్తి ధ్వన్యాలోకాన్ని రచించింది వేరు వేరు వ్యక్తులనే అభిప్రాయం ఏర్పడింది. అభినవగుప్తుడు కారికాకారుడు, గ్రంథకారుడు అని వేరువేరుగా పేర్కొనటంచేత ఆధునికుల్లో ఇటువంటి అభిప్రాయం కలగటానికి దారి తీసింది. ఆనందవర్ధనుడు ధ్వనివాదం- "పరంపరయా సమామ్నాతః" అని పేర్కొన్నదాన్ని బట్టి ధ్వనికారికాకారుడు అతడు కాదని ధ్వనిస్తున్నదని అంటున్నారు. మరియు ధ్వన్యాలోకారంభంలో వున్న శ్లోకం కూడ వారి అనుమానాన్ని బలపరిచేటట్లుగా వున్నది-

కావ్యస్యాత్మా ధ్వనిరితి బుధైర్యస్సమామ్నాత పూర్వ
స్తస్యాభావం జగదురపరే భాక్తమాహుస్తమన్యే
కేచిద్వాచాం స్థితమవిషయే తత్త్వమూచుస్తదీయం
తేన బ్రూమ స్సహృదయ మనః ప్రీతయే తత్స్వరూపమ్.

"పూర్వవిద్వాంసులు కావ్యాత్మధ్వని అని పేర్కొన్నారు. కొందరు దానిని కాదంటారు కొందరు దాన్ని లక్షణాంతర్గత మని అంటారు. కొందరు వాచామగోచర మని అంటారు. సహృదయుల ప్రీతికై నేను దాని తత్త్వాన్ని నిరూపిస్తాను" - అని చెప్పటంచేత కావ్యాత్మ ధ్వని అని ఆనందవర్ధనుని కన్న పూర్వమే స్థాపింపబడిందని, దానితో అంగీకరించని పండితులుండిరని తెలుస్తున్నదని, అటువంటప్పుడు ఆనందవర్ధనుడు ధ్వని ఉపస్థితిని, స్వరూప స్వభావ భేదాలను సంపూర్ణంగా వివరించి ధ్వని సిద్ధాంతాన్ని సర్వమాన్యంగా చేసి ధ్వని సిద్ధాంత స్థాపకుడనే పేరు గడించి వుంటాడని ఆధునిక విమర్శకులు అభిప్రాయపడ్తున్నారు. రాజశేఖరుని రెండు శ్లోకాలనుబట్టి కూడ కారికాకారుడు ఆనందవర్ధనుడు కాదని తేలుతున్నదని ఆధునిక విమర్శకుల అభిప్రాయం-

ధ్వనినాఽతి గభీరేణ కావ్యతత్త్వ నివేశినా
ఆనందవర్ధనః కస్య నాఽసీదానంద వర్ధనః

"అతి గంభీరమైన కావ్యతత్త్వ నివిష్టమైన ధ్వని యొక్క స్వరూప స్వభావాలను నిరూపించటం చేత ఆనందవర్ధనుడు ఎవరికి ఆనందవర్ధనుడు కాడు?

సత్కావ్యతత్త్వ విషయం స్ఫురిత ప్రసుప్త
కల్పం మనస్సు పరిపక్వ ధియాం యదాసీత్
తద్వ్యాకరో త్సహృదయోదయ లాభహేతో
రానందవర్ధన ఇతి ప్రథితాభిధాన:

"పరిపక్వబుద్ధి గల విపశ్చిత్తుల మనస్సులలో స్ఫురిత, ప్రసుప్తకల్పంగా వున్న కావ్యతత్త్వాన్ని సహృదయానందానికై ఆనందవర్ధనుడు వ్యాఖ్యానించి చెప్పాడు." కావ్యాత్మ ధ్వని అని ఆనందవర్ధనునికి పూర్వమే వున్నదని దాన్ని నిరూపించి సర్వపండితాంగీకార యోగ్యంగా వ్యాఖ్యానించినవాడు ఆనందవర్ధనుడని పై శ్లోకాలను బట్టి తేలుతున్నదని ఆధునికుల అభిప్రాయం. వింటర్‌నిట్స్, యాకోబి, ఎస్.కే.డే., పి.వి. కాణే మొదలైనవారు కారికాకారుడు ఆనందవర్ధనుడు కాదని సమర్థించారు. అయితే కారికాకారుడు ఎవరు? అన్న ప్రశ్న ఉదయిస్తుంది. ఆ అన్వేషణకు కూడ విమర్శకులు పూనుకొన్నారు. కారికాకారుడు "సహృదయ" నామధేయుడని పి.వి. కాణే చెప్పాడు. ఈ కారికాకారుడు ఆనందవర్ధనునికి 150 సంవత్సరాల పూర్వుడని ఎస్.కే.డే. అభిప్రాయం. తర్వాత తర్వాత కారికాకారుని మరచిపోయి ఆనందవర్ధనుని సిద్ధాంత స్థాపకుడని అనటం ప్రారంభించారని అతడన్నాడు. ధ్వని సిద్ధాంతాన్ని వ్యాఖ్యానించి, స్థాపించి దానికి ప్రశస్తమైన స్థానాన్ని కల్పించటం చేత అతడే ధ్వని సిద్ధాంతస్థాపకుడని పేరును సంపాదించుకొని వుంటాడు. ఇంత గంభీరమైన సిద్ధాంతం హఠాత్తుగా ఒక్కసారే ఆనందవర్ధనుని చేత ప్రతిపాదింపబడిందన్నా అసహజమే అవుతుంది. అతనికి ముందే దీన్ని గూర్చిన చర్చలుండి వుంటవి. ఎవరో ధ్వని కారికలను కూడా వ్రాసి వుంటారు. వాటికి వృత్తిని వ్రాసి ప్రచారంలోకి తెచ్చినవాడు ఆనందవర్ధనుడై వుంటాడు.

## ధ్వన్యాలోకం

ధ్వన్యాలోకం నాలుగు ఉద్ద్యోతాలుగా విభజింపబడింది. మొదటి ఉద్ద్యోతంలో ధ్వనిని గూర్చి ప్రాచీనాలంకారికుల అభిప్రాయాలు, తత్ ఖండన, ధ్వని స్వరూపం, ధ్వని భేదాలు, గుణీభూతవ్యంగ్యం తర్కబద్ధంగా విస్తరించి నిరూపింపబడినవి. నాల్గవ ఉద్ద్యోతంలో ధ్వని నిరూపణ ప్రయోజనాన్ని గూర్చి చర్చింపబడింది. ధ్వన్యాలోకానికి అభినవగుప్తుని వ్యాఖ్యానమే కాక ఇతర వ్యాఖ్యానాలు అనేకం వుండేవట. కాని అవి లుప్తమైనవి.

అభినవగుప్తుడు చంద్రిక అనే వ్యాఖ్యానాన్ని పేర్కొని "లోచనం" లేకున్న "చంద్రిక" వున్నా "ఆలోకం" గోచరించదని అన్నాడు. ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకంలో తన కృతులైన దేవీశతకం, అర్జున చరిత్ర మహాకావ్యం, విషమబాణలీల, హరవిజయాలనుంచే లక్షణోదాహరణలను ఇచ్చాడు. అతని కృతులల్లో దేవీశతకం తప్ప మిగిలినవి లభించలేదు. విషమబాణలీల, హరవిజయాలు ప్రాకృత భాషలో రచింపబడినవి.

## ధ్వని సిద్ధాంతం - దాని వైశిష్ట్యం

కావ్యంలో వాచ్య, లక్ష్యార్థాల కన్న భిన్నమైన అర్థాంతరమొకటి భాసిస్తుందని, అది వ్యంగ్యార్థ మని, అదే ధ్వని అనిఆనందవర్ధనుని మతం. ఆ అర్థాంతరం వాచ్యార్థం కన్న లక్ష్యార్థం కన్న చమత్కారజనక హేతువైంది. ఇటువంటి వ్యంగార్థ శోభితమైనదే ఉత్తమ కావ్యమని ఆనందవర్ధనుని అభిప్రాయం. రమణీయమైన ధ్వన్యర్థం కావ్యమర్మజ్ఞులైన సహృదయులకే గోచరిస్తుంది. సుందరి శరీరాన్ని ఆశ్రయించిన ముఖకరచరణాది అంగాలకన్న భిన్నమైన లావణ్యం వంటిది కావ్యధ్వని అని, అది అతి సూక్ష్మమైందని ఆనందవర్ధనుడంటాడు-

ప్రతీయమానం పునరన్యదేవ
వస్త్వస్తి వాణీషు మహాకవీనామ్
యత్తత్ ప్రసిద్ధావయ వాతిరిక్తమ్
విభాతి లావణ్య మివాంగనాసు

"ఘంటను కొట్టినప్పుడు కలిగే శ్రుతికటువైన టంకార ధ్వని కన్న దాని ఝుంకార ప్రతిధ్వని ఆహ్లాదకరమైనట్లుగా గుణ, అలంకార, రీత్యాదుల కన్న రమణీయమైన ప్రతీయమానార్థం సహృదయ జనాకర్షకమైంది - అదే ధ్వని -" అని ఆనంద వర్ధనుడు ధ్వనిరూపాన్ని నిరూపించాడు. వాచ్యలక్ష్యార్థాలు బోధమైన తర్వాత వాటి కన్న వేరుగా ప్రతీయమానమయ్యే అర్థమే ధ్వని. ఆ ధ్వనే కావ్యాత్మ- "ముఖ్యతయా ప్రకాశమానో వ్యంగ్యార్థధ్వనే రాత్మా" అని ఆనందవర్ధనుడు ప్రతిపాదించాడు. ధ్వని లేదనే వారిని, ధ్వని లక్ష్యార్థాదుల్లో సంక్రమించిందని, దాన్ని వేరేగా చెప్పే అవసరం లేదనే వారి అభిప్రాయాలను ఖండించి తర్క పాండిత్యపూర్ణంగా ధ్వని సిద్ధాంతాన్ని ఆనందవర్ధనుడు స్థాపించాడు. ధ్వని భేదాలను అతడు అతిసూక్ష్మంగా విభాగించి తద్భేదాలను సోదాహరణంగా వివరించాడు. ధ్వనిని అభిధామూలధ్వని, లక్షణామూలధ్వని అని ప్రధానంగా రెండుగా ఆనందవర్ధనుడు విభాగించాడు. అభిధామూలధ్వనికి వివక్షితాన్యపరవాచ్యం. లక్షణామూల ధ్వనికి అవివక్షిత వాచ్యం అని

కూడా పేర్లు. వివక్షితాన్య పరవాచ్యంలో వాచ్యార్థం పొసగినా ధ్వనిపరంగా వివక్షింపబడుతుంది. అభిధామూలధ్వని తిరగి సంలక్ష్యక్రమవ్యంగ్యం, అసంలక్ష్య క్రమవ్యంగ్యం అని రెండు విధాలు. సంలక్ష్య క్రమవ్యంగ్యం శబ్దశక్తి మూలక, అర్థశక్తి మూలక, ఉభయమూలక - అని ధ్వని మూడు విధాలు. అసంలక్ష్య క్రమవ్యంగ్య ధ్వని వస్తుధ్వని, అలంకారధ్వని, రసధ్వని అని మూడు విధాలు. విభావానుభావాదుల చేత వ్యంగ్యమయ్యే రసధ్వని ఉత్తమమైందని ఆనందవర్ధన, అభినవగుప్తులు నిరూపించారు. తర్వాత మమ్మట విశ్వనాథ, జగన్నాథాదులు రసధ్వని గల కావ్యాన్నే ఉత్తమ కావ్యంగా చెప్పి వున్నారు. భరతునిరస సిద్ధాంతమే రసధ్వని పేరుతో శ్రవ్యకావ్యాలకు అన్వయించబడింది. ధ్వని సిద్ధాంతంలో రసధ్వనే ఉత్తమమైందని అన్నారు. ధ్వని సంప్రదాయం వ్యంగ్యార్థమనే ముసుగువేసుకున్న రససిద్ధాంతమే అని చెప్పవచ్చును. లక్షణా మూలధ్వనిలో కూడ ఆనందవర్ధనుడు అనేక భేదాలు చెప్పాడు. లక్షణామూలధ్వని, అత్యంత తిరస్కృత వాచ్యం, అర్థాంతర సంక్రమిత వాచ్యం అని రెండు విధాలు. ఈ రెండు మళ్ళీ వాక్యగతం, పదగతం అనే భేదాలచేత నాలుగు విధాలు. ఈ విధంగా వివిధ ధ్వనిభేదాలల్లో పూర్వాచార్యుల అలంకార, గుణ, రీతి మొదలైన కావ్యసిద్ధాంతాలన్నీ ధ్వని అంతర్గతమైనవిగానే ఆనందవర్ధనుడు చెప్పాడు. మరియు అతడు అలంకారాలను భామహాదులవలె కావ్యప్రధాన తత్త్వంగా అంగీకరించలేదు. రసభావ సమన్వితమైన కావ్యాన్నే అతడు ఉత్తమ కావ్యమని, అలంకార రచన ఉత్తమ కావ్యం కాదని చెప్పాడు.

ఆనందవర్ధనుడు ధ్వని సిద్ధాంతాన్ని ప్రచారంలోకి తెచ్చినప్పుడు దాన్ని మొదట పండితులు చాలమంది విమర్శించినా తర్వాత ఆలంకారికులు ఆదరించి ప్రచారంలోకి తేవటంలో దోహదం చేసారు. కావ్యసిద్ధాంతాలల్లో కెల్లా ధ్వని సిద్ధాంతమే గొప్పదైంది, సర్వజనాంగీకారయోగ్యమైంది. అంతవరకు ప్రచారంలో వున్న భామహదండ్యాచార్యుల అలంకారవాదం, వామనుని రీతివాదం వరకు కావ్య సిద్ధాంతాల నన్నింటిని సమన్వయించి ఒక్క గొడుగు కిందికి తెచ్చిందని చెప్పవచ్చును. ఇట్లా ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించటానికి ఆనందవర్ధనుడు మంచి మౌలికమైన ఒక తర్కపూర్ణమైన శైలిని గ్రహించాడు. ఒక నూతన సిద్ధాంతాన్ని ప్రతిపాదించే ఆనందవర్ధనుని ప్రతిభ పాండిత్యాలు గొప్పవి.

## ముకుల భట్టు

ముకుల భట్టు తండ్రి కల్లటుడు. కల్లటుడు ఆనందవర్ధనుని ఆశ్రయదాత అవంతివర్మ సభాపండితుడు. కాబట్టి ముకుల భట్టు ఆనందవర్ధనునికి దాదాపు సమకాలికుడు

లేక కొంచెం తరువాతి వాడని చెప్పవచ్చును. ముకుల భట్టు "అభిధావృత్తి మాతృక" అనే కావ్యశాస్త్రగ్రంథాన్ని రచించాడు. దీనిలో 15 కారికలున్నవి. దీనితో అభిదా, లక్షణాల విశిష్టత నిరూపింపబడింది. ఆనంద వర్ధనుని వ్యంజనావృత్తిని ఉపేక్షించి ముకుల భట్టు వాచ్యార్థానికే పట్టాన్ని కట్టాడు. ఆనందవర్ధనుని వ్యంజనావృత్తిని, ధ్వని సిద్ధాంతాన్ని అంగీకరించక తిరస్కరించిన వారిలో ఇతడొక ఆచార్యుడు. ఆనంద వర్ధనుని ధ్వనివాదాన్ని అంగీకరించిన మమ్మటుడు, ముకుల భట్టు అభిధాలక్షణాల విషయంలో చెప్పిన కొన్ని అభిప్రాయాలను గ్రహించి వున్నాడు.

## రాజ శేఖరుడు

రాజశేఖరుడు కవి, నాటకకారుడే కాక గొప్ప ఆలంకారికుడుకూడ. మౌలికమైన అతని అలంకార కృతి "కావ్యమీమాంస" ఒక విశిష్టమైన కోవకు చెందింది. రాజశేఖరుడు మహారాష్ట్ర దేశీయుడని అంటారు. అతడు కనౌజ్ రాజులు మహేంద్రపాల, మహీపాలుర (క్రీ.శ. 880-925) ఆస్థానంలో వున్నాడు. ఇతడు మహేంద్ర పాలుని విద్యా గురువు కూడ. మహేంద్రపాలుని తర్వాత అతని కొడుకు మహీపాలుని ఆస్థానంలో రాజశేఖరుడు గౌరవింపబడినాడు.

కావ్యమీమాంస ఒక అపూర్వమైన కావ్యశాస్త్ర గ్రంథం. దీని రచనా శైలిని తర్వాత క్షేమేంద్ర, భోజ, హేమచంద్ర, వాగ్భట, కేశవమిశ్రాది ఆలంకారికులు గ్రహించి అనుసరించారు. కావ్యమీమాంసలో 18 అధ్యాయాలున్నవి. వీటిల్లో క్రమంగా-కావ్యపురుషుని ఉత్పత్తి, అష్టాదశవిధ కావ్యవిద్యలను కావ్యపురుషుడు అష్టాదశ శిష్యులకు ఉపదేశించటం, ఆ శిష్యులు ఆ విద్యల మీద గ్రంథాలు వ్రాయటం, కావ్యభేదాలు, సాహిత్య విద్యా వధువును కావ్య పురుషుడు వివాహమాడటం, కవి భేదాలు, కావ్యహేతువులు, భాష, శైలి, కావ్యయోనులు, కవి దినచర్య, కావ్యార్థాహరణోపాయాలు, కవి సమయాలు, కవి రహస్యాలు, పూర్వవృత్తి, అలంకార సిద్ధాంత సమీక్ష, ఉత్తరవర్తి కవుల కవితా సమీక్షకై గ్రహింపవలసిన విషయాలు - మొదలైనవి శాస్త్రీయ పద్ధతిలో చెప్పబడినవి. ఇటువంటి విషయ చర్చలు మరే కావ్య శాస్త్రంలోను మనకు కనిపించవు. కావ్యార్థాపహరణను గూర్చి రాజశేఖరుడు విస్తరంగా చర్చించాడు. అర్థాపహరణ కవులకు తప్పనిసరి అని పేర్కొంటు అతడు 32 విధాలైన అర్థాపహరణ ఉపాయాలను వివరించాడు. రాజశేఖరుడు చర్చించిన విషయాలల్లో ప్రధానమైంది మరొకటి - కవి సమయచర్చ. రాజశేఖరుడు తనకు ముందున్న ఆచార్యుల మతాలను

సమీక్షించటమే కాక వాటిలోని తప్పొప్పులను పరిశీలించి చూపాడు. అప్పటికే రస, అలంకార, గుణ, రీతి, ధ్వని సిద్ధాంతాలు స్థాపింపబడినవి. వాటి నన్నింటిని రాజశేఖరుడు సమీక్షించాడు. అంతేగాక కావ్యపురుషుడు అనే ఒక విచిత్రమైన సృష్టిని అతడు చేశాడ కవుల దిన చర్యలు కవి గోష్ఠులు, రాజులకు కవులకుండే సంబంధం, రాజ సభలు, వాటి స్వరూపాలను రాజశేఖరుడు చక్కగా వివరించాడు. ఈ నూతన విషయ చర్చలచేత కావ్యమీమాంస ఒక కొత్త మార్గాన్ని తొక్కిన అలంకారగ్రంథంగా పరిగణింపబడుతున్నది.

రాజశేఖరుడు ఏ కావ్య సంప్రదాయానికి చెందినవాడు అని నిర్ణయించటంలో విమర్శకులు భిన్నాభిప్రాయాలను ప్రకటించారు. కొందరు అతన్ని అలంకారవాది అని, కొందరు రసవాది అని నిర్ణయించారు. రాజశేఖరుని మీద రుద్రటుని కావ్యాలంకార ప్రభావం బాగా కన్పిస్తున్నది. అలంకార వర్గీకరణలో, కావ్య శక్తుల వివరణలో రాజశేఖరుడు రుద్రటుని అనుసరించాడు. కాబట్టి అతడు అలంకారవాది అన్న భ్రమ కలుగుతుంది. కాని రాజశేఖరుడు కావ్యాత్మగా రీతిని అంగీకరించాడని ఎస్.కె.డే. అభిప్రాయం. గుణాలను మాత్రమే రీతులకు ఆధారంగా వామనుడు గ్రహించటాన్ని రాజశేఖరుడు విమర్శించాడు. సమాసాలు, అనుప్రాసలు రీతులకు ఆధారాలని అతడు నిర్ణయించాడు. అలంకారాలను, రీతులను కావ్యోపయోగ సామగ్రులుగా అతడు గ్రహించాడు కాని వాటిలో ఏ ఒక్కదాన్ని అతడు కావ్యాత్మగా స్వీకరించ లేదని కావ్యమీమాంసను పరిశీలిస్తే తేలగలదు. రాజశేఖరుడు ధ్వని సంప్రదాయాన్ని ఎక్కడ స్పష్టంగా ఉల్లేఖించలేదు కాని అర్థాపహరణ ప్రకరణంలో, కవి భేద విభాజనలో అతడు ధ్వన్యాలోకాన్ని అనుసరించాడు. కవి భేదాలను వివరించేటప్పుడు రాజశేఖరుడు ఉక్తివైచిత్రికి గల ప్రాధాన్యాన్ని అంగీకరించినట్లు తెలుస్తున్నది. కాని కావ్యాత్మగా ధ్వనిని అతడు ఎక్కడ పేర్కొనలేదు. రాజశేఖరుని నాటికి ధ్వనిసిద్ధాంతం పూర్తిగా పండిత సమ్మతిని సంపాదించి వుండదు.

రాజశేఖరుని భార్య అవంతిసుందరి చౌహాన వంశపు క్షత్రియ కన్య. సంస్కృత ప్రాకృతాలల్లో పాండిత్యం కలది. ఆమె అభిప్రాయాలను రాజశేఖరుడు ఎన్నో చోట్ల ఉట్టంకించాడు. రసోచిత శబ్దార్థ సూక్తులను కావ్యంగా పరిగ్రహించాలనే అవంతిసుందరి అభిప్రాయంతో తాను ఏకీభవిస్తున్నట్లు రాజశేఖరుడు ఒకచోట చెప్పాడు. కవి భేదాలను చెప్పు రస కవినే అతడు ఉత్తమ కవిగా గ్రహించాడు. భరతుని నాట్యశాస్త్ర వ్యాఖ్యాతలైన లోల్లట, శంకుక, నాయకాదులు వివరించిన రస తత్త్వ సంబంధ విషయాలనే రాజశేఖరుడు అంగీకరించినట్లుగా కన్పిస్తుంది. నీరసార్థనివేశం కావ్యంలో వుండరాదని రాజశేఖరుని అభిప్రాయం. కాబట్టి రాజశేఖరుడు రస సంప్రదాయానికి చెందినవాడే అని చెప్పవచ్చును.

# అజితసేనుడు

క్రీ.శ. 10వ శ॥ వాడు. అలంకార చూడామణి, శృంగారమంజరి ఇతని అలంకారశాస్త్ర గ్రంథాలు. అలంకారచూడామణిలో అలంకారాల వివేచనం, శృంగారమంజరిలో రస చర్చలు వున్నవి. ఇతడు జైనాచార్యుడు.

# భట్టతౌతుడు

భట్టతౌతుడు అభినవగుప్తుని గురువు. ఇతని కృతి కావ్యకౌతుకం. ఇది అలభ్యం. దీనికి అభినవగుప్తుడు వివరణనుకూడ వ్రాసాడట. క్షేమేంద్రాది ఆలంకారికులు భట్టతౌతుని ఉద్ధరించారు. రసనిష్పత్తికి హేతుభూతం నటులు రామాది నాయకులను అనుకరించటం కాదని భట్టతౌతుడు చెప్పాడని హేమచంద్రుడు పేర్కొన్నాడు. భట్టతౌతుడు శాంతాన్ని నవమరసంగా అంగీకరించటమేకాక శృంగారాని కన్న దానికే ఉన్నత స్థానాన్ని ఇచ్చాడు. భట్టతౌతుని అభిప్రాయాలను అభినవగుప్తుడు లోచనంలో ఉల్లేఖించి వున్నాడు. ఇతని కాలం క్రీ.శ. 9వ శ॥ ఉత్తరార్ధం. ఇతడు గొప్ప మీమాంసకుడు.

# భట్ట ఇందురాజు

భట్ట ఇందురాజు అభినవగుప్తుని గురువులల్లో ఒకడు. ఇతని దగ్గర అభినవగుప్తుడు ధ్వని సంప్రదాయాన్ని అధ్యయనం చేసాడు. భట్టేందురాజు స్వతంత్ర అలంకారశాస్త్ర గ్రంథ మేది మనకు లభించలేదు. కాని క్షేమేంద్రుడు ఇతన్ని తన ఔచిత్య విచారచర్చలో ఉల్లేఖించివున్నాడు. ఇతని కాలం క్రీ.శ. 9వ శ॥ ఉత్తరార్ధం. ఇతడు కవి కూడ. ఇతని శ్లోకాలను అభినవగుప్తుడు లోచనంలో ఉద్ధరించివున్నాడు.

# అభినవగుప్తుడు

## అభినవగుప్తుని రచనలు

అభినవగుప్తుని కాలం క్రీ.శ. 970 నుండి 1050 వరకు. అభినవగుప్తుడు గొప్ప దార్శనికుడే కాక గొప్ప ఆలంకారికుడు కూడ. అతడు స్వతంత్రమైన అలంకార శాస్త్రగ్రంథాన్ని దేన్ని వ్రాయలేదు కాని అతడు నాట్యశాస్త్రానికి వ్రాసిన వ్యాఖ్య "అభినవభారతి", ధ్వన్యాలోకానికి వ్రాసిన వ్యాఖ్య "లోచనం", ఇవి అతన్నొక స్వతంత్రాలోచనలు గల ఆలంకారికునిగా నిలబెడ్తున్నవి. అతడు అప్రతిమాన ప్రతిభా సంపన్నుడైన ఆచార్యుడు.

కొందరు ఆచార్యులు వ్యాఖ్యానాలు మాత్రమే వ్రాసినా స్వతంత్రమైన ఆలోచనలను అభిప్రాయాలన ప్రతిపాదించి గొప్ప కీర్తిని సంపాదించారు. వారిలో అభినవగుప్తునికి అగ్రతాంబూలం లభిస్తుంది. ఆనందవర్ధనుడు ధ్వనిసంప్రదాయ ప్రవర్తకుడైతే అభినవగుప్తుడు దాన్ని ప్రచారంలోకి తెచ్చి వ్యాప్తిని కలిగించిన ఆచార్యుడు. ధ్వన్యాలోకంలో అస్పష్టంగా వున్న విషయాలను ఎన్నిటినో అతడు వివరించిన ఘట్టాలు, విషయపుష్టిని చేసిన సందర్భాలు వున్నవి. రసధ్వని వివరణలో అతడు చూపిన ప్రతిభ చెప్పుకోదగింది. అభినవగుప్తుని రస నిష్పత్తివాదానికి "అభివ్యక్తి" వాద మని పేరు. శైవాద్వైతంలో ప్రతిపాదితమైన ఆనందవాదం ఆధారంగా అతడు రసవివేచన చేసాడు. విభావానుభావాదుల ద్వారా సామాజికుల్లో వాసనారూపంగా వున్న రసం అభివ్యక్తమౌతుందని, రసానందం బ్రహ్మానంద సహోదరమైందని అతడు చెప్పాడు. అభినవగుప్తుడు వ్రాసిన "ధ్వన్యాలోకలోచనం" చాల ప్రౌఢమైంది. తర్వాత మమ్మటాదులు అభినవగుప్తుని వ్యాఖ్యాన సహాయంతోనే ధ్వని సంప్రదాయాన్ని ఇంకా పరిపుష్టం చేసి దానికి వ్యాప్తిని కలిగించారు. నాట్యశాస్త్రానికి అభినవగుప్తుడు వ్రాసిన వ్యాఖ్య కూడ చాల ప్రౌఢమైంది.

## అభినవగుప్తుని పాండిత్యం

అభినవగుప్తుడు 19 మంది గురువుల దగ్గర శాస్త్ర విద్యలను అభ్యసించాడు. భట్ట ఇందురాజు దగ్గర ధ్వని సిద్ధాంతాన్ని, భట్టతౌతుని దగ్గర నాట్యశాస్త్రాన్ని అతడు అభ్యసించాడు. శైవ సంప్రదాయానికి చెందిన ప్రత్యభిజ్ఞ సిద్ధాంతంమీద అతడు గ్రంథాలను వ్రాసాడు. అభినవగుప్తుని తండ్రి నరసింహగుప్తుడు శైవాగమాల్లో పండితుడు. శివ భక్తుడు. అభినవగుప్తుడు తండ్రి దగ్గర కూడ శైవ సిద్ధాంతాలను అభ్యసించి వుంటాడు. అతని తల్లి విమల, తాత వరాహగుప్తుడు. అభినవగుప్తుని పూర్వజులు పంజాబ్‌లోని 'దో ఆబ్' ప్రాంతవాసులు. తర్వాత కాశ్మీరానికి పోయారు. అభినవగుప్తుడు ఆజన్మ బ్రహ్మచారిగా వుండిపోయాడు. అతడు శైవాగమాల్లోనే కాక తంత్ర శాస్త్రంలోను ప్రవేశం కలవాడు. అభినవగుప్తుడు గొప్ప శైవదార్శనికుడు. శైవదర్శన సంబంధమైన 41 గ్రంథాలను అతడు రచించాడు. శైవాగమాల, స్తోత్రాల మీద అతడు వ్రాసిన వ్యాఖ్యానాలు కూడ వున్నవి. పై 41 గ్రంథాల్లో 11 గ్రంథాలు ప్రచురితమై లభిస్తున్నవి. భట్టతౌతుని కావ్యకౌతుకానికి కూడ అభినవగుప్తుడు "కావ్యకౌతుక వివరణ" మనే వివరణను వ్రాసాడు. ఇది అలభ్యం. కాని తర్వాత ఆలంకారికులు ఉద్ధరించిన భాగాలు మాత్రం మనకు మిగిలినవి.

## ధ్వన్యాలోక వ్యాఖ్య

అభినవ గుప్తునికి పూర్వం ధ్వన్యాలోకానికి "చంద్రిక" అనే వ్యాఖ్యానం వుండేది. ఆ వ్యాఖ్యానాన్ని అభినవగుప్తుని పూర్వజుడే వ్రాసాడని, ధ్వన్యాలోకాన్ని వారు వంశపారంపర్యంగా అధ్యయనం చేస్తుండే వారని అంటారు. "చంద్రిక" వున్నంత మాత్రాన ధ్వన్యాలోక ఆలోకనం జరుగదని "లోచనం" కావాలని అభినవగుప్తుడు అన్నాడు. దాన్నిబట్టి చంద్రిక అన్న వ్యాఖ్యానం కన్న అభినవగుప్తుని వ్యాఖ్యానం విశదమైందని చెప్పవచ్చును. ఇతని వ్యాఖ్యానంచేత ధ్వనిసిద్ధాంతం పరిపుష్టమై ప్రామాణిక రూపాన్ని ధరించింది.

కావ్యప్రకాశకారుడు మమ్మటుడు అభినవగుప్తుని ఆచార్యపాదు డని పేర్కొన్నాడు. దాన్నిబట్టి అతడు అభినవాచార్యుని శిష్యుడని తెలుస్తున్నది. క్షేమేంద్రుడు అభినవగుప్తుని తన గురువుగా చెప్పుకున్నాడు. అభినవగుప్తుడు అనేక గురువుల దగ్గర విద్యల నభ్యసించినవాడు. తానూ ఒక ఆచార్యుడై శిష్యపరంపరతో విలసిల్లిన పండితుడు.

## రాజానక కుంతకుడు

అభినవగుప్తుడు లోచనంలో కుంతకునిగాని అతని వక్రోక్తి జీవితాన్ని గాని పేర్కొనక పోవటం చేత అతడు అభినవగుప్తుని తర్వాతవాడని చెప్పవచ్చును. వింటర్‌నిట్జ్ కుంతకున్ని అభినవగుప్తునికి సమకాలికునిగా అంగీకరించాడు. కుంతకుని కాలాన్ని దాదాపుగా క్రీ.శ. 11వ శతాబ్దం పూర్వార్ధమని చెప్పవచ్చును. ఆనంద వర్ధనుడు ధ్వని సిద్ధాంతాన్ని స్థాపించిన తర్వాత దాన్ని అంగీకరించక ఖండించినవారు, నూతన సిద్ధాంతాలను ప్రతిపాదించిన వారు వున్నారు. వారిలో ముకులభట్టు, కుంతక, మహిమ భట్టులు ప్రముఖంగా మనకు తెలియవచ్చినవారు. ధ్వని సిద్ధాంతానికి ప్రతిగా కుంతకుడు వక్రోక్తిసిద్ధాంతాన్ని స్థాపించాడు. అతని కృతి పేరే "వక్రోక్తి జీవితమ్". కావ్యంలో వక్రోక్తి ప్రాధాన్యాన్ని భామహాదులు అంగీకరించి వున్నారు. "వక్రా భిధేయశబ్దోక్తిరిష్టా వాచామలంకృతిః" - వక్రోక్తి గర్భితమైన వాక్యరచన కావ్యానికి అవసరమని భామహుడు గుర్తించి "యత్నోస్యాం కవినా కార్యః" అని అన్నాడు. భామహాదుల ఈ అభిప్రాయాలను గ్రహించి ప్రపంచించి కుంతకుడు వక్రోక్తి సిద్ధాంతాన్ని స్థాపించాడు. భామహుని వక్రోక్తి దండి గుణాలంకార సంప్రదాయమే కాక వామనుని రీతిగుణ సంప్రదాయం కూడ దీనిలో అంతర్భవించింది. వక్రోక్తిసిద్ధాంత ప్రతిపాదనను కుంతకుడు శాస్త్రీయపద్ధతిలో చేసాడు. ఆ ప్రతిపాదనలో అతడు చూపిన

ప్రతిభ గొప్పది. అయితే వక్రోక్తి సిద్ధాంత ప్రతిపాదనలో ధ్వని సంప్రదాయ ప్రభావం తప్పక గోచరిస్తున్నది. ధ్వని సంప్రదాయాన్ని కుంతకుడు ఎక్కడా ఎదిరించలేదు. అతడు ధ్వని విరోధి కాడు. అయినా అతడు ఒక కొత్త సిద్ధాంతాన్ని, ధ్వని సిద్ధాంతాన్ని అంతర్భవింపజేసుకొన్న కొత్త సిద్ధాంతాన్ని, ప్రతిపాదించి క్రొత్త మార్గాన్ని తొక్కాడు. అందుకే కొందరు విమర్శకులు వక్రోక్తి సిద్ధాంతం ముసుగువేసుకొన్న ధ్వని సిద్ధాంతమే అని చెప్పారు. ధ్వనినే కుంతకుడు వక్రోక్తిగా పేర్కొన్నాడని అంటారు. కుంతకుని "వక్రోక్తి" పూర్వాచార్యుల కావ్యతత్త్వ విచారాల నన్నిటిని సమన్వయించే కొత్త సిద్ధాంతం.

కుంతకుని "వక్రోక్తి జీవిమ్"లో నాలుగు ఉన్మేషా లున్నవి. ధ్వన్యాలోకంలో వలెనే నాలుగు అధ్యాయాలుగా విభాగింపబడటం కాక దానిలో వలెనే వక్రోక్తిజీవితంలో కారికలు, వృత్తి అని రెండు భాగాలున్నవి. కారికలను, వృత్తిని కుంతకుడే వ్రాసాడు. మూల కారికల పేరు "కావ్యాలంకారం", వృత్తి పేరు "వక్రోక్తి జీవితమ్" అని గ్రంథారంభంలో కుంతకుడు చెప్పాడు (1-2). ఇప్పుడు లభ్యమయ్యే గ్రంథం సంపూర్ణంగా లేదని పండితుల అభిప్రాయం. ఒక్కొక్కచోట వృత్తి, ఉదాహరణలున్నవి కాని కారికలు లుప్తమైనవి. వక్రోక్తి జీవితంలో రీతి, రస, గుణ, అలంకారాల సమాలోచన వున్నది. స్వభావోక్తి వక్రోక్తుల స్వరూపనిరూపణను కుంతకుడు చేసి స్వభావోక్తి అలంకార్యమని, వక్రోక్తి అలంకృతి అని చెప్పాడు. కావ్యశోభాహేతుక తత్త్వంలో వక్రోక్తి ప్రధానమైందని అతని అభిప్రాయం. కుంతకుడు "కావ్యాత్మ" అని అనక "కావ్యజీవితం" అని అంటాడు. భామహ దండి ఉద్భటాదుల వలె కుంతకుడు రసాన్ని రసవదలంకారంగా అంగీకరించలేదు. రసయోగం చేత అలంకారం విశేషాహ్లాదకరం చమత్కృతం అయినట్లయితే అది రసవదలంకారమని అతడు కొత్త నిర్వచనం ఇచ్చాడు. వక్రోక్తి సిద్ధాంతంలో రసస్థానం ధ్వని సిద్ధాంతంలో మాదిరిగానే మాన్యమైంది.

## వక్రోక్తి భేదాలు

కుంతకుడు ఆరు విధాలైన వక్రోక్తులను వివరించాడు- 1) వర్ణ విన్యాస వక్రత 2) పదపూర్వార్థ వక్రత 3) పదపరార్థ వక్రత 4) వాక్య వక్రత 5) ప్రకరణ వక్రత 6) ప్రబంధ వక్రత. తిరిగి వీటిలోను విభేదాలను కుంతకుడు వివరించివున్నాడు. కుంతకుడు వక్రోక్తి సిద్ధాంతం అంతర్గతంగా కావ్యస్వరూపం, కావ్య ప్రయోజనాలు, కావ్య హేతువులు, కావ్య రీతులను గూర్చి చర్చించి వున్నాడు. పూర్వాచార్యులు పేర్కొన్న వైదర్భి, గౌడి, పాంచాలీ రీతులను దేశపరంగా పిలవటానికి అంగీకరించక వాటిని సుకుమార, విచిత్ర, మధ్యమ

మార్గాలుగా పేర్కొన్నాడు. "రీతి"ని ఇతడు "మార్గం"గా పేర్కొన్నాడు. కాళిదాసాదులు సుకుమార మార్గానికి, బాణ భవభూతులు విచిత్ర మార్గానికి, మాతృగుప్త మయూరరాజాదులు మధ్యమ మార్గానికి చెందిన కవులని కుంతకుడు వివరించాడు. ప్రతి కవి శైలి భిన్న మార్గంలో నడుస్తుందని, కవి వ్యక్తిత్వం అతని శైలిలో ప్రతిబింబిస్తుందని కుంతకుని అభిప్రాయం.

కుంతకుని ఇతర రచనలేవి వున్నట్లు లేదు. సోమేశ్వర, మాణిక్య చంద్ర వంటి ఆలంకారికులు కుంతకుని వక్రోక్తి సిద్ధాంతాన్ని అంగీకరించివున్నారు. కుంతకుడు చెప్పిన ఎన్నో కావ్యసంబంధి ఆలోచనలు ప్రాచీనాధునిక పాశ్చాత్యాలంకారికుల అభిప్రాయాలను పోలివున్నవి. కావ్య నిర్వచనంలో, అలంకార అలంకార్య నిర్ణయంలో, రీతి వివరణలో కుంతకుని అభిప్రాయాలు మౌలికంగా అత్యాధునికంగాను వున్నవి.

## మహిమ భట్టు

ధ్వని సిద్ధాంతంతో సంతృప్తి చెందక, దానితో అంగీకరించక కొత్త సిద్ధాంతాన్ని స్థాపించిన వారిలో మహిమ భట్టు ఒకడు. ఇతని గ్రంథం "వ్యక్తి వివేకం". ఇతడు ప్రసిద్ధ నైయాయికుడు. వ్యక్తి వివేకంలో మహిమ భట్టు ధ్వని సిద్ధాంతాన్ని ఖండించాడు. ఇతడు అసాధారణ మేధావి. ధ్వని అనేది ప్రత్యేకంగా చెప్పనవసరం లేదని, అది అనుమానాంతర్గతమే అని, దాన్ని కావ్య సిద్ధాంతంగా వేరే ప్రతిపాదించే అవసరం లేదని మహిమ భట్టు మతం. ఇతని మతాన్ని అనుమితివాద మంటారు. దీన్ని ఒక ప్రత్యేక కావ్యసిద్ధాంతంగా కంటె ధ్వని ఖండనగా మాత్రమే గ్రహించాలి. వ్యక్తి వివేకంలో మూడు ఖండాలున్నవి. మొదటి ఖండంలో ధ్వనిలక్షణాన్ని చెప్పి అది అనుమానంలో అంతర్భవించినట్లుగా వివరింపబడింది. రెండవ ఖండంలో అనౌచిత్యాన్ని కావ్యదోషంగా గ్రహించి అనౌచిత్య రూపం వివరింపబడింది. మూడవ ఖండంలో తిరిగి ధ్వని అనుమానంలో ఎట్లా అంతర్భవిస్తుందో తర్కపూర్ణంగా చెప్పబడింది. వ్యంగ్యార్థ బోధకమయ్యే రసాన్ని కూడ మహిమభట్టు అనుమానాంతర్భాగంగానే పరిణమింపజేసాడు. మమ్మటుడు కావ్యప్రకాశం పంచమోల్లాసంలో ధ్వనిని స్థాపించేటప్పుడు మహిమభట్టు అభిప్రాయాలను ఖండించి ధ్వని అనుమానంలో అంతర్భవించదని ప్రమాణాలతో నిరూపించాడు. అనుమానం ధ్వని రెండు భిన్నమైనవని మమ్మటుడు యుక్తియుక్తంగా ప్రకటించి చూపాడు. భట్ట శంకుకుని అనుమితి వాదాన్ని మహిమభట్టు అంగీకరించి గ్రహించి తన సిద్ధాంతాన్ని స్థాపించాడు.

మహిమభట్టు రాజశేఖరుని కృతులను పేర్కొన్నాడు. మరియు అతనికి వక్రోక్తి సిద్ధాంతంతోను పరిచయమున్నది. వ్యక్తి వివేకంలో మహిమ భట్టు కుంతకుని కూడ స్మరించివున్నాడు.

కావ్య కాంచన కశాశ్మమానినా కుంతకేన నిజకావ్య లక్ష్మణి
యస్య సర్వ నిరవద్యతోదితా శ్లోక ఏష స నిదర్శితో మయా.

కాబట్టి మహిమభట్టు కుంతకుని తర్వాత వాడని చెప్పవచ్చును. మమ్మటుడు (క్రీ.శ. 1025-1075) మహిమ భట్టును ఖండించటం చేత ఇతడు అతనికి పూర్వుడో దాదాపుగా సమకాలికుడో కావచ్చును. క్షేమేంద్ర, రుయ్యకులకు మహిమభట్టు పూర్వుడు. మహిమభట్టు తత్త్వోక్తికోశమనే మరొక అలంకారశాస్త్రగ్రంథాన్ని రచించాడంటారు. కాని అది అలభ్యం. రుయ్యకుడు మహిమభట్టు వ్యక్తి వివేకానికి వివేకవిచార మనే విమర్శగ్రంథాన్ని రచించాడు. రుయ్యకుడు ధ్వనివాది. మహిమ భట్టు అభిప్రాయాలను తన విమర్శగ్రంథంలో విమర్శించి ఖండించాడు.

## ధనంజయ - ధనికులు

ధనంజయుడు ధారాపతి ముంజరాజు (క్రీ.శ. 974-900) ఆస్థాన పండితుడు. ధనంజయుని కృతి దశరూపకం. ఇది నాట్యశాస్త్రం మీద ఆధారితమైన రచన. నాటక లక్షణాలకు ఇది ప్రామాణికమైన గ్రంథం. దశరూపకంలో నాలుగు ప్రకాశాలున్నవి. 300 కారికలున్నవి. దీనిలో రూపక భేదాలు, తల్లక్షణాలు, నాయికానాయక భేదాలు, భాషా ప్రయోగంలోని నియమాలు, అభినయ భేదాలు, వృత్తులు, రసపోషణ, రస నిష్పత్తి, రసభేదాలు వివరింపబడివి.

దశ రూపకానికి ధనికుడు "అవలోక" మనే వ్యాఖ్య వ్రాసాడు. ధనికుడు ధనంజయుని సోదరుడని ప్రతీతి. ధనికుడు కూడ ముంజరాజు ఆస్థాన పండితుడు. 'అవలోకం' ముంజరాజు మరణానంతరం క్రీ.శ. 1000 ప్రాంతంలో రచింపబడింది. ధనికుడు కావ్య నిర్ణయమనే కావ్యశాస్త్రాన్ని రచించినట్లు అతని అవలోకాన్ని బట్టి తెలుస్తున్నది. కాని లభ్యం కాలేదు.

## దశరూపకవైశిష్ట్యం

ధనంజయ ధనికులు వివరించిన రస నిర్వచనం, రస నిష్పత్తి, నాయికా భేదాలు

మొదలైన వాటిని భానుదత్తుడు గ్రహించి రసతరంగిణి, రసమంజరులను రచించాడు. దశరూపక ప్రభావాన్ని భానుమిశ్రుని మీద కూడ చూడవచ్చును. క్రీ.శ. 12వ శతాబ్దానికి చెందిన గుణచంద్ర రామచంద్రుల నాట్య గ్రంథాలకు దశ రూపకమే ఉపజీవ్యగ్రంథంగా నిలిచింది. విశ్వనాథుని నాయికా నాయక భేదం, దృశ్యకావ్య నిర్వచన ప్రకరణాలు దశరూపకం ఆధారంగా వ్రాయబడినవి. విద్యానాథుడు నాయికానాయక భేదాలను దశరూపకం నుంచే గ్రహించాడు. దృశ్యకావ్యలక్షణాల విషయంలో దశరూపకమే ప్రామాణిక గ్రంథమైంది. నాట్యశాస్త్రం విశాలకాయం కలది. సులభరీతిలో లేదు. దశరూపకం సులభపద్ధతిలో నాటకలక్షణాలను వివరిస్తున్నది. కాబట్టి దశరూపకమే ఎక్కువ అందుబాటులో వుండి ప్రామాణికంగా నిలిచింది. దశరూపకాన్ని కేవలం నాట్యశాస్త్రం యొక్క రూపవిభేదమే అని చెప్పలేము. ధనంజయ ధనికులు సంధిసంధ్యంగాలను, అర్థోపక్షేపకాలను, రూపకాలల్లో రసనిర్వహణను గూర్చి చాల విశదంగా చర్చలు చేసి మౌలికమైన అభిప్రాయాలను కూడ వ్యక్తం చేసివున్నారు. అభినవగుప్తుడు శాంతరసాన్ని స్థాపించి దానికి పట్టం కట్టాడు. ధనంజయ ధనికులు శాంత రసం శ్రవ్యకావ్యంలో నిబద్ధిస్తే నిబద్ధించవచ్చును. కాని దృశ్యకావ్యంలో అది పనికిరాదని అభిప్రాయపడినారు. తర్వాత విశ్వనాథుడు శాంతరసాన్ని దృశ్య కావ్యాలల్లోను పోషించవచ్చునని చెప్పివున్నాడు. ధనంజయుడు ధ్వని విరోధి, ధ్వనిని ఖండించి ఇతడు రసమే శబ్దార్థాల తాత్పర్యమని చెప్పాడు. ధనంజయ ధనికులు భాట్టమీమాంసకులచేత ప్రభావితులైనారని పండితుల అభిప్రాయం. వీరు అభిధా, లక్షణా తాత్పర్యాలనే అంగీకరించారు. దశరూపకానికి ధనికుడే కాక నరసింహభట్ట, దేవపాణి, బహురూపభట్టు, క్షోణీధరమిశ్ర, కురవిరామాదులు కూడ వ్యాఖ్యానాలు వ్రాసారు. వీటిల్లో ధనికుని వ్యాఖ్యానమే ప్రసిద్ధమైంది.

## భోజరాజు

భోజుడు ధారానగరాధిపతి. ముంజరాజు అగ్రజుడు, సింధులుని కుమారుడు. సింధులుడు, ముంజరాజు, బోజుడు ముగ్గురు కూడా పండితకవి పోషకులు. అందులో భోజుడు స్వయంగా కవి, పండితుడు, ఆలంకారికుడు. భోజుడు (క్రీ.శ. 1005-1054) సరస్వతీ కంఠాభరణం, శృంగార ప్రకాశం అనే అలంకారశాస్త్ర గ్రంథాలను రచించాడు. ఇవి రెండు సాహిత్యశాస్త్ర రంగంలో ప్రసిద్ధ గ్రంథాలు. రెండు కూడా బృహద్గ్రంథాలే. సరస్వతీ కంఠాభరణంలో ఏడు ప్రకాశాలున్నవి. దీనిలో కావ్య గుణదోషాలు, అలంకారాలు, నాయికా

నాయక భేదాలు, రసాలు, దృశ్య కావ్య లక్షణాలు వివేచింపబడినవి. దీనిలో భోజుడు చేసిన భాషా విషయచర్చ మహత్త్వపూర్ణమైంది. ఇటువంటి చర్చను రుద్రటుడు తప్ప మరే ఆలంకారికుడు చేసివుండలేదు. రుద్రటుడు దశమరసంగా అంగీకరించిన ప్రేయోరసాన్ని భోజుడు గ్రహించి సరస్వతీ కంఠాభరణంలో వివరించాడు. రుద్రటుడు నాలుగు రీతులను పేర్కొనగా భోజుడు అవంతి, మాగధి, రీతులను అదనంగా చేర్చి ఆరింటిని గ్రహించాడు. శృంగార ప్రకాశంలో 36అధ్యాయాలున్నవి. ఇది సంపూర్ణంగా లభించలేదు. ఇందులో శృంగారరస వివేచన ప్రధానంగా చేయబడింది. 12 అధ్యాయాలల్లో మహాకావ్య, రూపక లక్షణాలు చెప్పబడినవి, మిగతా 24 అధ్యాయాలల్లో రసవివేచన చేయబడింది. మరియు శృంగార రస ప్రాధాన్యం వివరింపబడింది. భోజుడు "శృంగార ఏవ ఏకో రసః-" శృంగార మొక్కటే రసమని ప్రతిపాదించాడు. ప్రాచీనాచార్యులు శృంగారాది పది రసాలను పేర్కొన్నారు. కాని శృంగార మొక్కటే రసమని, మిగిలినవన్ని భావాలని అవస్థావశంచేత అవి ఒకొకసారి స్థాయిరూపాన్ని పొందుతవని, మరొకసారి వ్యభిచారి భావరూపాన్ని పొందుతవని ఇతడు చెప్పాడు. వటయక్షన్యాయానుసారంగా వీరాద్భుతాదులకు రసప్రసిద్ధి కలిగిందని, దాన్ని నివారించటమే తన ప్రయత్నమని అతడు తెలిపాడు.

వీరాద్భుతాదిషుచ యేహ రస ప్రసిద్ధిః
సిద్ధాకుతోపి వటయక్షవదా విభాతి
లోకే గతాను గతికత్వ వశాదుపేతా
మేతాం నివర్తయితు మేష పరిశ్రమో నః.

భోజుడు పూర్వాలంకారికుల అభిప్రాయాలను చాల ఉట్టంకించాడు. అలంకార వివేచనలో భోజుడు దండిచేత చాల ప్రభావితుడైనాడని చెప్పవచ్చును. భోజుడు సాహిత్యలోకంలో కొత్త కావ్యసిద్ధాంతాన్ని ఏది ప్రతిపాదించపోయినా అతడు రసవివేచనలో ప్రకటించిన అభిప్రాయాలెన్నో మాన్యయోగ్యంగా వున్నవి. అభినవ గుప్తుడు శాంత రసానికి పట్టం కట్టాడు. భవభూతి కరుణరసమొకకటే రసమని చెప్పాడు. భోజుడేమో శృంగారానికి ప్రాధాన్యమిచ్చి శృంగారమొక్కటే రసమని స్థాపించాడు. ఆ తర్వాత ఆలంకారికులు మాయ, అద్భుతాది రసాలను ఏకైక రసాలుగా స్థాపించటానికి పూనుకొన్నారు.

సరస్వతీ కంఠాభరణానికి రత్నేశ్వరుడు వ్రాసిన రత్నదర్పణ మనే వ్యాఖ్యానం ప్రసిద్ధమైంది. ఇదీగాక ఇంకా మూడు వ్యాఖ్యానాలు దీనికి వున్నవి.

భోజుడు పై రెండు అలంకారగ్రంథాలనే కాక ఇంకా అనేక గ్రంథాలను రచించాడు. అతని చంపూరామాయణం ప్రసిద్ధమైన రచన. అదేగాక రాజమార్తాండమనే యోగశాస్త్ర గ్రంథాన్ని, రాజమృగాంకమనే జ్యోతిష గ్రంథాన్ని, వ్యవహార సముచ్చయం, చారుచర్య అనే ధర్మశాస్త్ర గ్రంథాలను, శాలిహోత్రమనే అశ్వశాస్త్ర గ్రంథాన్ని, చాణక్య నీతి, పుత్రమార్తాండ, యుక్తికల్పతరువు అనే రాజనీతి శాస్త్ర గ్రంథాలను, సమరాంగణసూత్రధార మనే వాస్తుశాస్త్ర గ్రంథాన్ని, తత్త్వ ప్రకాశం, సిద్ధాంత సంగ్రహం, శివతత్త్వ రత్నకళిక అనే శైవసిద్ధాంత గ్రంథాలను రచించాడు. వీటిల్లో ఎన్ని అతడు రచించినవో, ఎన్ని అతని పేరుమీదుగా చలామణి అవుతున్నవో నిర్ణయించటం కష్టం.

## క్షేమేంద్రుడు

క్షేమేంద్రుడు అభినవగుప్తుని శిష్యుడు, కవి పండితుడు, ఆలంకారికుడు. క్షేమేంద్రుని కాలం క్రీ.శ. 1050 ప్రాంతం. కాశ్మీర రాజు అనంతుని ఆస్థానపండితుడు. క్షేమేంద్రుడు వివిధ విషయాలమీద 33 గ్రంథాలవరకు వ్రాసాడు. కవికంఠాభరణం, ఔచిత్యవిచారచర్చ అతని రెండు అలంకార కృతులు.

కవికంఠాభరణంలో కవిత్వప్రాప్తి, కావ్యవైచిత్రి, అర్థశబ్దరసాలల్లోని దోషాలు, గుణాలు వివరింపబడినవి. దీనిలో ఐదు అధ్యాయాలున్నవి. ఔచిత్య విచారచర్చలో క్షేమేంద్రుడు ఔచిత్యప్రాధాన్యాన్ని ప్రతిపాదించాడు. అనౌచిత్యం కన్న రసభంగకారణం లేదని, ఔచిత్యప్రాధాన్యాన్ని ఆనందవర్ధనాదులు గుర్తించి వున్నారు. దాన్ని తీసుకొని క్షేమేంద్రుడు ఔచిత్యాన్ని ఒక కావ్యసిద్ధాంతంగా నిలబెట్టాడు. శబ్ద, అర్థ, గుణ, అలంకార, రససంబంధమైన ఔచిత్యాలను సోదాహరణంగా అతడు వివరించాడు. అనౌచిత్యదోషాలను చూపేటప్పుడు అతడు ప్రసిద్ధ కవుల కావ్యాలనుంచి కూడ నిర్భయంగా ఎత్తిచూపాడు. ధ్వనిసిద్ధాంత ప్రభావం క్షేమేంద్రునిమీద చాల వున్నది. ఔచిత్యం ఒక కావ్య సిద్ధాంత రూపాన్ని ధరించదని విమర్శకుల అభిప్రాయం. విభిన్నతత్త్వాల మిశ్రణాన్ని మనం ఔచిత్య సిద్ధాంతంలో చూడవచ్చును. ఇది ఒక స్వతంత్రమైన సిద్ధాంతంకంటె ఒక అత్యావశ్యక కావ్య తత్త్వంగా గ్రహించాలి. ఎందుకంటె ఇది ధ్వనిలోనే చివరకు అంతర్భవిస్తున్నది. సువృత్తతిలక మనే ఛందో గ్రంథాన్ని కూడ క్షేమేంద్రుడు వ్రాసాడు.

## మమ్మటుడు

అభినవగుప్తుని ఆచార్యపాదుడని చెప్పటంచేత మమ్మటుడు అతని శిష్యుడని

భావింపబడుతున్నాడు. మమ్మటుడు ఉదాత్తాలంకారానికి భోజరాజు దానశీలతను వర్ణిస్తు శ్లోకాన్ని ఉదాహరించాడు. మమ్మటుని కావ్యప్రకాశానికి మాణిక్యచంద్రుడు క్రీ.శ. 1159 - 1160 ప్రాంతంలో టీకను వ్రాసాడు. రుయ్యకుడు (క్రీ.శ. 1128-1149) కావ్యప్రకాశాన్ని ఉల్లేఖించాడు. అప్పుడు మమ్మటుని కాలాన్ని క్రీ.శ. 1050-1100 అని చెప్పవచ్చును. సాహిత్యశాస్త్రరంగంలో మమ్మటుని కావ్యప్రకాశానికి ప్రత్యేక స్థానమున్నది. అతడు చాలావరకు ఉద్భట, రుద్రట, ధనంజయులను అనుసరించినా అతడు ధ్వనిసిద్ధాంత సమర్థకుడు. ధ్వని సిద్ధాంతాన్ని ఎదిరించిన వారిని అతడు కావ్య ప్రకాశంలో ఖండించాడు. ఆనందవర్ధన, అభినవగుప్తుల తర్వాత ధ్వనిసిద్ధాంతాన్ని కాదని కొత్త సిద్ధాంతాలను స్థాపించిన వారున్నారు. అంటె ఆ ఇద్దరు ఆచార్యుల తర్వాత వెంటనే ధ్వనిసిద్ధాంతం సర్వసమ్మతమై ప్రచలితం కాలేదు. అట్లా ఎదిరించిన వారిని ఖండించి ధ్వని సిద్ధాంతానికి ప్రాచుర్యాన్ని కలిగించటమే మమ్మటుని గ్రంథ రచనోద్దేశమని చెప్పవచ్చును. ఈ ఖండన ఖండనంలో మమ్మటుడు చూపిన యుక్తులు, ప్రమాణాలు ప్రబలమైనవి. ఆ తర్వాత ధ్వని విరోధులున్నా ఎవరు మమ్మటునికి సమాధానమిచ్చి నిలువలేకపోయారు. అట్లా ధ్వనిసిద్ధాంతం ఎదురులేక సర్వజనాంగీకారాన్ని పొందిందంటె మమ్మటుని యుక్తులే కారణం. ఉద్భట, రుద్రట, వామన మహిమభట్టు మొదలైనవారిని అతడు ఖండించాడు. భామహుడు ధ్వనివాది అని మమ్మటుని అభిప్రాయం. తరువాత ఆలంకారికులు రుయ్యక, హేమచంద్ర, పండితరాజ జగన్నాథులు మమ్మటుని అనుసరించారు. మమ్మటుడు పూర్వాచార్యుల మతాలను కఠినంగా ఖండించక సంయమనంతో ఆదరపూర్వకంగా వివేచించి వున్నాడు.

కావ్యప్రకాశం పది ఉల్లాసాలుగా విభాగింపబడింది. 140 కారికలున్నవి. తొమ్మిదవ ఉల్లాసంలో శబ్దాలంకారాలు, పదవ ఉల్లాసంలో అర్థాలంకారాలు వివరింపబడినవి. మొదటి ఉల్లాసంలో కావ్యప్రయోజనాలు, హేతువులు, భేదాలు,కావ్య స్వరూపం వివరింపబడినవి. రెండవ ఉల్లాసంలో శబ్దార్థ స్వరూప నిర్ణయం, శాబ్దీ వ్యంజనను గూర్చి చెప్పబడింది. మూడవ ఉల్లాసంలో ఆర్థీవ్యంజన నిరూపింప బడింది. నాల్గవ ఉల్లాసంలో రసాదిధ్వని విచారం చేయబడింది. ఐదవ ఉల్లాసంలో వ్యంజనాశక్తి ప్రతిష్ఠాపింపబడింది. ఆరవ ఉల్లాసంలో చిత్రకావ్య నిరూపణ చేయబడింది. ఏడవ ఉల్లాసంలో దోష నిరూపణ, ఎనిమిదవ ఉల్లాసంలో గుణనిరూపణ చేయబడింది. మమ్మటుడు "తదదోషౌ శబ్దార్థౌ సగుణా వనలంకృతీ పునః క్వాపి" అని నిర్వచించాడు. దండి వలెనే ఇతడు కావ్యం దోషరహితంగా వుండాలని, గుణ సహితంగా వుండాలని చెప్పాడు. అందుకే దోషాలను అతడు విశదంగా

వివరించి వున్నాడు. "అనలంకృతీ పునః క్వాపి" అని అలంకారాల మీద మమ్మటుడు ఎక్కువ ఆదరణ చూపకున్నా చివరి రెండు ఉల్లాసాలల్లో అలంకార భేదాలను విశదంగానే నిరూపించాడు. మమ్మటుని కావ్యహేతువుల, కావ్యప్రయోజనాల వివేచన చాల మాన్యయోగ్యంగా వున్నది. మమ్మటుని శబ్దశక్తుల వివరణ ప్రామాణికమైంది.

## కావ్యప్రకాశానికి టీకలు

కావ్యప్రకాశానికి మొదట క్రీ.శ. 1159 ప్రాంతంలో మాణిక్య చంద్రుడనే జైనపండితుడు టీకను వ్రాసాడు. ఆ తర్వాత కావ్యక్రాశానికి చాలా టీకలు వ్రాయబడినవి. ఇప్పుడు దీనికి **40,50** వరకు టీకలు దొరుకుతున్నవి. భగవద్గీతకు తప్ప ఇన్ని టీకలు మరేగ్రంథానికి లేవని కాణే అన్నాడు. ఈ టీకలే ఈ కృతి యొక్క వ్యాప్తి, ప్రాశస్త్యాలను ప్రకటిస్తున్నవి. కొన్ని టీకలకు తిరిగి వివరణలు, టీకలు కూడ వ్రాయబడినవి. "కావ్యప్రకాశస్య కృతా గృహేగృహే టీకా తథాప్యేష తథైవ దుర్గమః" -అని ఒక ప్రాచీన వ్యాఖ్యానకారుని ఉక్తి.

మమ్మటుడు "శబ్దవ్యాపార విచార" మని శబ్దశక్తి మీద ఒక గ్రంథాన్ని రచించాడు.

## రాజానక రుయ్యకుడు

రాజానక అనేది రాజాస్థానంలో ఏదో పదవి, ఆ పదవిలో వుండటం చేత ఇతనికి రాజానక రుయ్యకుడని పేరు. రుయ్యకుడు మమ్మటుని కావ్య ప్రకాశాన్ని, బిల్హణుని విక్రమాంక దేవచరిత్రను పేర్కొనటం చేత క్రీ.శ. 1128-1149 ప్రాంతంవాడని చెప్పవచ్చును. రుయ్యకున్ని రుచకుడని కూడ అంటారు. రుయ్యకుడు గొప్ప పాండిత్యం కలవాడు. రుయ్యకుని కృతి అలంకార సర్వస్వం. ఇది సూత్ర రూపంలో రచింపబడింది. దీనికి వృత్తికూడ వున్నది. ఈ వృత్తిని రుయ్యకుడే వ్రాసాడో లేక వేరే ఎవరైనా వ్రాసారో చెప్పలేము. శ్రీకంఠ కావ్యకర్త మంఖకుడు రుయ్యకుని శిష్యుడు. సూత్రాలను రుయ్యకుడు వ్రాయగా దానికీ వృత్తిని మంఖకుడు వ్రాసాడని కొందరు విమర్శకుల అభిప్రాయం. అలంకార సర్వస్వానికి జయరథుడు వ్రాసిన టీక వున్నది.

అలంకార సర్వస్వంలో రుయ్యకుడు అలంకారాల వివేచనను మౌలికంగా చక్కగా చేసాడు. అలంకార లక్షణాలు సూత్రాలల్లో చెప్పబడి, వృత్తిలో సోదాహరణంగా వివరింపబడినవి. అలంకారాల విశ్లేషణ, వివేచనలను రుయ్యకుడు శాస్త్రీయ పద్ధతిలో చేసాడు. తర్వాత అలంకారాలను వివరించేవారికి ఇది ఆదర్శమైంది. ఇతని కృతిలో కేవలం అలంకారాల

వివరణే వున్నది. ఇతర కావ్య తత్త్వాల ప్రసక్తిలేదు. దీనిలో కొత్త అలంకారాలను రుయ్యకుడు చేర్చాడు. ఆలంకారాలను విశదంగా వివరించి చెప్పినా రుయ్యకుడు ధ్వనివాది కాని అలంకారవాది కాడు. మమ్మటుని కావ్య ప్రకాశానికి ఇతడు టీక వ్రాయటమే దీన్ని నిరూపిస్తున్నది. ధ్వని సిద్ధాంతాన్ని ఖండించినవారిని ఈ టీకలో రుయ్యకుడు ఖండించాడు.

రుయ్యకుడు కావ్య ప్రకాశానికి 'సంకేత'మనే పేరుగల టీకనే కాక మహిమ భట్టు 'వ్యక్తి వివేకా'నికి విచార విమర్శను, బాణుని హర్ష చరిత్రకు కూడ టీకను వ్రాసాడు. ఇవేగాక సాహిత్య మీమాంస, నాటక మీమాంస, అలంకారానుసారిణి, సహృదయ లీల అనే గ్రంథాలను కూడ రచించాడు.

## వాగ్భట్టు (ప్రథమ)

వాగ్భట్టు జైనుడు. ఇతడు క్రీ.శ. 1121-1156 నడుమ జీవించి వున్నాడు. ఇతని కృతి వాగ్భటాలంకారం. ఈ గ్రంథం ఐదు పరిచ్ఛేదాలుగా విభాగింపబడింది. దీనిలో క్రమంగా కావ్య లక్షణాలు, కావ్య హేతువులు, కావ్య ప్రయోజనాలు, కవి శిక్ష, కవి సమయాలు, కావ్య భేదాలు, దోషగుణాలు, భాషఅలంకారాలు, రీతులు, చిత్ర బంధకవిత్వం, నాయికానాయక భేదాలు, రసం వివరింపబడినవి. వాగ్భట్టు కావ్యాలను ఛందఃసహితం, ఛందో రహితం, మిశ్రమమని విభజించాడు. అతడు వైదర్భి, గౌడి రెండు రీతులనే గ్రహించాడు. వాగ్భట్టు ఉదాహరణలన్ని స్వయంగానే వ్రాసాడు. అతడు నేమినిర్వాణమనే మహాకావ్యాన్ని రచించాడు. వాగ్భటాలంకారానికి సింహదేవగణి వ్యాఖ్యానాన్ని వ్రాసాడు. వాగ్భట్టు స్వయంగా కూడ తన కృతికి వ్యాఖ్యానాన్ని వ్రాసుకొన్నాడు.

## హేమచంద్రాచార్యుడు

హేమ చంద్రుడు జైనుడు. గుజరాతు రాజు కుమారపాలుని (క్రీ.శ. 1142-1173) గురువు, ఆస్థాన పండితుడు. ఇతని అసలుపేరు సోమదేవుడట. ఇతడు అనేక గ్రంథాలను రచించాడు. వాటిల్లో కావ్యానుశాసన మనే అలంకారశాస్త్ర గ్రంథం ఒకటి. ఇది ప్రముఖమైన అలంకార గ్రంథం. హేమచంద్రుని మీద అభినవ గుప్త మమ్మటుల ప్రభావాన్ని స్పష్టంగా చూడవచ్చును. ఇతడు రస ప్రకరణాన్ని అభినవగుప్తుని అభినవభారతి ననుసరించి రచించాడు. కావ్యానుశాసనం సూత్రబద్ధమైంది. దీనికి అలంకార చూడామణి అనే వృత్తిని హేమచంద్రుడే స్వయంగా వ్రాసాడు. మరియు దీనికి వివేకమనే టీక కూడ వున్నది. ఈ

కృతిలో 8 అధ్యాయాలున్నవి. దీనిలో కావ్య నాటకాల వివేచన చేయబడింది. రస, దోష, గుణ, అలంకార, నాయికా నాయక భేదాలు మొదలైనవి వివరింపబడినవి. హేమచంద్రుడు కొత్త సిద్ధాంతాన్ని ఏది ప్రతిపాదించకపోయినా పూర్వాలంకారికుల సిద్ధాంతాలను చక్కగా సమీక్షించాడు. ఉదాహరణలుగా సంస్కృత, ప్రాకృత శ్లోకాలను ఇచ్చాడు. యాకోబి, బ్యూలర్లు హేమచంద్రుని జీవితాన్ని బాగా పరిశోధించి అతని జీవితచరిత్రను రచించారు.

హేమచంద్రుని సమకాలికుడైన జయమంగళుడు కవిశిక్ష అనే గ్రంథాన్ని, నాగవర్మ కావ్యాలోచన మనే గ్రంథాన్ని రచించారు.

## రామచంద్ర గుణచంద్రులు

రామచంద్ర గుణచంద్రులు హేమచంద్రాచార్యుని శిష్యులు. వీరు నాట్య దర్పణమనే కృతిని రచించారు. ఇది కారికల్లో వ్రాయబడింది. రచయితలు స్వయంగా దీనికి వృత్తిని కూడ రచించారు. వీరిలో రామచంద్రుడు ప్రబంధ శతక కర్తనని చెప్పుకొన్నాడు. రామచంద్రుడు గుజరాతులో సిద్ధరాజా (క్రీ.శ. 1098-1143) కుమారపాల (క్రీ.శ. 1143-1172) అజయపాల (క్రీ.శ. 1172-1175) రాజాల సమకాలికుడు.

నాట్యదర్పణం నాట్యశాస్త్ర సంబంధ గ్రంథం. ఇది నాలుగు "వివేకా"లుగా విభాగింపబడింది. దీనిలో క్రమంగా నాటక, రూపక, వృత్తి, రస, భావాభి నయాదులు వివరింపబడినవి. దీనిలో విశాఖదత్తుని దేవీచంద్రగుప్త నాటకం ఉద్ధరింపబడింది. ఇది ఇప్పుడు కొంతభాగం మాత్రమే దొరికింది. నాట్యదర్పణంలో రసవివేచన చక్కగా వున్నది. నాటకాలను ప్రధానంగా దృష్టిలో పెట్టుకొని రస వివేచన చేయబడింది. రసవిషయకంగా ఎన్నో కొత్త విషయాలను ఈ ఆలంకారికులు చెప్పారు. క్షుత్తు, తృష్ణ, మైత్రి, శ్రద్ధ, దయ, ఉపేక్ష, క్షమ, మార్దవాది కొత్త సంచారీభావాలను వీరు గ్రహించారు.

## మలయజ పండితుడు

క్రీ.శ. 1168 ప్రాంతంవాడు. ఇతని అలంకారకృతి "సాహిత్యసారం".

### రాజరాజు

క్రీ.శ. 12వ శతాబ్దం వాడు. ఇతని కృతి "రాజరాజీయం".

## సాగరనంది

సాగరనంది కాలనిర్ణయం చేయుటం కష్టం. అయినా అతడు రాజశేఖరుని విద్ధసాలభంజికను ఉద్ధరించటం చేత క్రీ.శ. 10వ శ॥ తరువాతివాడని, అమర కోశటీకాకారులు సర్వానంద, సుభూతి చంద్రులు, సాగరనంది విరచిత నాటక లక్షణ రత్నకోశాన్ని ఉద్ధరించటం చేత క్రీ.శ. 1158-59 కి ముందు అని నిర్ణయించవచ్చును. సాగరుడు క్షత్రియుడు. నంది అన్నది అతని వంశనామం. ఆరంభంలో నాట్యప్రవర్తకుడు నాట్యాధిదేవత అయిన శివున్ని ప్రార్థించినా అతడు బౌద్ధుడుగాని, జైనుడుగాని కావచ్చునని విమర్శకుల అభిప్రాయం.

సాగరనంది నాటకలక్షణ రత్నకోశంలో నాట్య సిద్ధాంతాలను, నాటక లక్షణాలను వివేచించాడు. ఇతడు భరతుని నాట్యశాస్త్రాన్ని, అభినవగుప్తుని నాట్యశాస్త్ర వ్యాఖ్యానం అభినవభారతిని అనుసరించి ఈ గ్రంథాన్ని రచించాడు. శాంత రసం నాటకంలో పోషింపదగనిదని ధనంజయుని అభిప్రాయం. ఈ విషయంలో సాగరనంది మౌనం ధరించాడు. నాటక లక్షణాలకు సంబంధించిన సమస్త విషయాలు దీనిలో వివరింపబడినవి.

## జయదేవుడు

గీతగోవిందకారుడు జయదేవుడు, నాటకకారుడు ఆలంకారికుడైన జయదేవుడు వేరు వేరు వ్యక్తులా? లేక ఒక్కరేనా? అన్న విషయంలో పండితుల్లో అభిప్రాయభేదమున్నది. కాని సూక్ష్మపరిశీలనవల్ల వీళ్ళిద్దరు వేరు వేరు వ్యక్తులనే తేలుతున్నది. ఆలంకారిక జయదేవునికి జయదేవ పీయూషవర్షుడని పేరు. ఇతని తండ్రిపేరు మహదేవుడు, గీత గోవిందకర్త జయదేవుని తండ్రిపేరు భోజదేవుడు. కాబట్టి ఈ ఇద్దరు జయదేవులు వేరు వేరు వ్యక్తులే అని తెలుస్తున్నది. ఒకవేళ వీళ్ళిద్దరు అన్నదమ్ముల కుమారులేమో! ఈ జయదేవునివి రెండు అలంకారకృతులు వున్నవి. ఒకటి- చంద్రాలోకం. రెండు- రతిమంజరి. ఇతని నాటకం ప్రసన్న రాఘవం. ఇది ప్రసిద్ధ నాటకం. రతిమంజరిలో నాయికాభేదాలు నిరూపింపబడినవి. చంద్రాలోకం జయదేవుని ప్రసిద్ధమైన అలంకారకృతి. ఇది పది మయూఖాలుగా విభాగింపబడింది. దీనిలో 294 శ్లోకాలున్నవి. కావ్యపక్షమైన విషయాలన్ని దీనిలో చర్చింపబడినవి. కావ్యలక్షణాలు, దోషాలు, అలంకారాలు, రసధ్వని వివరింపబడినవి. అలంకారాలు లేకున్నా శబ్దార్థాలు కావ్యమౌతుందన్న మమ్మటుని ఉక్తిని (అనలంకృతీ పునఃక్వాపి) జయదేవుడు ఖండించి కావ్యానికి అలంకారాలు అత్యవసరమని,

అగ్ని అనుష్ణతతో వుండటం ఎంత అస్వాభావికమో అలంకారాలు లేక కావ్యముండటం కూడ అంత అస్వాభావిక మని చెప్పాడు-

అంగీకరోతి యః కావ్యం శబ్దార్థావనలంకృతీ
అసౌ న మన్యతే కస్మాదనుష్ణ మనలం కృతీ.

జయదేవుడు అలంకారవాది. అలంకార వివరణలో అతడు రుయ్యకుని అనుసరించాడు. పంచమ మయూఖంలో జయదేవుడు అలంకారాలను వివరించాడు. దీని ఆధారంగానే అప్పయ దీక్షితుడు కువలయానందాన్ని రచించాడు. చంద్రాలోకానికి శారదాగముడు మొదలైనవారు వ్రాసిన టీకలున్నవి. చంద్రాలోకంలో ఉదాహరణలన్నీ జయదేవుడు స్వయంగా వ్రాసినవే. ఇతని కాలం క్రీ.శ 12వ శతాబ్దం. జయదేవుడు మొత్తం 89 అలంకారాలను వివరించాడు.

# దేవేశ్వరుడు

క్రీ.శ. 1300 ప్రాంతంవాడు. "కవి కల్పలత" దేవేశ్వరుని అలంకార శాస్త్రగ్రంథం.

# భానుదత్తుడు

భానుదత్తుడు క్రీ.శ. 13వ శతాబ్దంవాడని నిర్ణయింపబడింది. ఇతడు మిథిలాదేశానికి చెందిన గణనాథుని కొడుకు. రసమంజరి, రసతరంగిణి ఇతని అలంకారకృతులు. రసమంజరిలో శ్లోకాలు, వాటికి టీక వున్నవి. దీనిలో నాయికా నాయక భేదాలు వివరింపబడినవి. రసతరంగిణిలో రసమంజరి ప్రసక్తి వుండటం చేత రసతరంగిణి తరువాతి రచన అని చెప్పవచ్చును. దీనిలో రసచర్చ చాల విశదంగా చేయబడింది. దీన్ని ఒక విధంగా భరతుని నాట్యశాస్త్రంలోని 6,7 అధ్యాయాలకు వ్యాఖ్యాన రూపమని చెప్పవచ్చును. ఇది గద్యంలో వ్రాయబడింది. కృష్ణ, రామ సంబంధ వర్ణనలు గల శ్లోకాలను కవి రచించి ఉదాహరణలుగా ఇచ్చాడు. దీనిలో ఎనిమిది తరంగాలున్నవి. రసతరంగిణిలో భానుదత్తుడు శృంగార రస ప్రాధాన్యాన్ని వివరించాడు. భానుదత్తుడు మాయారసాన్ని దశమ రసంగా అంగీకరించాడు. చిత్తవృత్తి ప్రవృత్తి, నివృత్తి రూపాలల్లో రెండు విధాలుగా వుంటుందని, నివృత్తిలో శాంతరసం గ్రహింపబడినట్లుగానే ప్రవృత్తి యందు మాయారసాన్ని అంగీకరించాలని అతడు అంటాడు. రతి, హాస, శోక, క్రోధ, ఉత్సాహ, భయ, జుగుప్స, విస్మయాలు ప్రవృత్తిలోనే పుట్టి

అణగుతాయని, కాబట్టి ఆ స్థాయీభావాలన్నీ మాయా రసానికి వ్యభిచారీ భావాలని అతడు వివరించాడు. మాయారసానికి స్థాయీభావం మిథ్యాజ్ఞానం, సాంసారిక భోగాన్ని ఆర్జించే ధర్మాధర్మాలు విభావాలు. పుత్ర, కళత్ర, సామ్రాజ్య విజయాదులు అనుభవాలు అని అతడు స్థాపించాడు. మాయ అనాది అని అది ఒక్కదానివల్ల పుట్టదని, కాబట్టి అది రసం కాదని చిరంజీవి భట్టాచార్యుడు కావ్యవిలాసంలో భానుదత్తుని మాయారసాన్ని ఖండించాడు. భరతుడు ఎనిమిది సాత్త్విక భావాలను చెప్పగా భానుదత్తుడు జృంభ అనే తొమ్మిదవ సాత్త్విక భావాన్ని పేర్కొన్నాడు. చలమనే 34వ సంచారీభావాన్ని కూడ పేర్కొన్నాడు.

## ధర్మదాసు

ఇతడు బౌద్ధ పండితుడు. ఇతడు విదగ్ధముఖమండనమనే అలంకార కృతిని రచించాడు. ఇది ప్రసిద్ధమైంది. ఇతని కాలం క్రీ.శ. 1293-1309 నడుమ.

## శారదాతనయుడు

క్రీ.శ. 13వ శతాబ్దంవాడు. ఇతని అలంకార కృతి "భావప్రకాశం". దీనిలో 10 అధ్యాయాలున్నవి. శారదాతనయుడు భరతుని అనుసరించి రస వివరణను చేసాడు. రసాన్ని ఇతడు కావ్యాత్మగా గ్రహించాడు. ఇతడు శాంతాన్ని రసంగా అంగీకరించలేదు. భోజుని అనుసరించి శృంగార రసాన్ని వివరించాడు.

## అల్ల రాజు

ఇతడు క్రీ.శ 13వ శతాబ్దంవాడు. "రసరత్న ప్రదీపిక" ఇతని అలంకార కృతి.

## అమృతానందయోగి

క్రీ.శ. 13వ శతాబ్దం వాడు. "అలంకారసార సంగ్రహం" ఇతని రచన.

## విద్యాధరుడు

విద్యాధరుడు ఉత్కళాన్నేలిన నరసింహుని (క్రీ.శ. 1307-1326) ఆస్థానకవి. కాని ఆ వంశంలో ఎనిమిది మంది నరసింహరాజు లుండటంచేత విద్యాధరుడున్నది ఏ నరసింహుని ఆస్థానంలోనో నిర్ణయించటం కష్టం. అయినా అతని కాలం క్రీ.శ. 1279-1314 అని

ఊహించవచ్చును. ఏకావళి ఇతని అలంకార కృతి. దీనిలోని ఉదాహరణ శ్లోకాలు నరసింహరాజును స్తుతిస్తూ విద్యాధరుడు వ్రాసినవి. ఈ కృతి శ్లోకరూపంలో వున్నది. దీనికి విద్యాధరుడే స్వయంగా వ్యాఖ్యానాన్ని వ్రాసాడు. విద్యాధరుడు ఆనందవర్ధనుని ధ్వనిసిద్ధాంత సమర్థకుడు. రసానందాన్ని అతడు బ్రహ్మానంద సహోదరమని చెప్పాడు. అలంకారాల వివరణలో ఇతడు భామహరుయ్యకులను అనుసరించాడు. ఏకావలిలో 8 ఉన్మేషాలున్నవి. దీనిలో రసాలంకారాలే కాక కావ్య స్వరూపం, కావ్య హేతువులు, శబ్ద శక్తులు, గుణరీతి దోషాలు వివరింపబడినవి.

## విద్యానాథుడు

క్రీ.శ. 14వ శతాబ్దారంభకాలంతో ఓరుగల్లు ప్రతాపరుద్రుని (క్రీ.శ. 1296-1326) ఆస్థానంలో వున్నాడు. తన ఆశ్రయదాతను వర్ణిస్తూ శ్లోకాలను లక్ష్యంగా వ్రాసి అతడు ఆ రాజు పేరుమీదుగానే తన అలంకార గ్రంథానికి "ప్రతాపరుద్రయశోభూషణం" అని పేరు పెట్టాడు. లక్ష్య శ్లోకాల విషయంలో ఇది ఏకావళిని అనుకరిస్తున్నది. తర్వాత ఎందరో లాక్షణికులు తమ ఆశ్రయ దాతలను కీర్తిస్తూ ఉదాహరణ శ్లోకాలను లక్ష్యంగా ఇస్తూ అలంకారగ్రంథాలను రచించారు. ప్రతాపరుద్రయశోభూషణంలో 9 ప్రకరణాలున్నవి. వీనిలో శ్రవ్య, దృశ్య కావ్య సంబంధి విషయాలు వివరింపబడినవి. కావ్యస్వరూపం, కావ్య హేతువులు, ప్రయోజనాలు, చిత్రకవిత్వం, దోషగుణ అలంకారరీతులు, నాయికానాయక భేదాలు, రసం, రూపక భేదాలు, తల్లక్షణాలు, ధ్వని, ధ్వని భేదాలు వివరింపబడినవి. విద్యానాథుని అలంకార వివరణలను మల్లినాథుడు తన వ్యాఖ్యానాలల్లో ప్రమాణంగా ఉద్ధరించాడు. విద్యానాథుని ఉపమా లక్షణాలతో అప్పయ దీక్షితుడు అంగీకరించలేదు. మల్లినాథుడు విద్యాధరుని ఏకావళికి తరళ అనే వ్యాఖ్యానాన్ని వ్రాయగా మల్లినాథుని కొడుకు కుమారస్వామి ప్రతాపరుద్రీయానికి రత్నాపణమనే వ్యాఖ్యానాన్ని వ్రాసాడు. విద్యాధర విద్యానాథులు కొత్త కావ్య సిద్ధాంతాలను ప్రతిపాదించక పోయినా అలంకారశాస్త్ర విషయాలను చక్కగా సులభరీతిలో వివరించివున్నారు. అందుకే వారి అలంకార గ్రంథాలు వ్యాప్తిని పొందినవి.

## వాగ్భట్టు (ద్వితీయ)

వాగ్భట్టు అనే పేరుగల మరొక జైన అలంకారికుని రెండవ వాగ్భట్టుగా పేర్కొంటుంటారు. ఇతడు క్రీ.శ. 14వ శతాబ్దంవాడు. కావ్యానుశాసనం ఇతని అలంకారకృతి. ఇది సూత్ర పద్ధతిలో వ్రాయబడింది. దీనికి అలంకారతిలక మనే టీకను కవి స్వయంగా

వ్రాశాడు. కావ్యానుశాసనంలో ఐదు అధ్యాయాలున్నవి. వీటిల్లో క్రమంగా కావ్యభేదాలు, రీతిగుణదోషరసాలంకారాదులు వివేచింపబడినవి. వాగ్భట్టు ఛందోనుశాసనమనే ఛందశ్శాస్త్ర గ్రంథాన్ని, ఋషభదేవ చరిత్ర అనే మహాకావ్యాన్ని కూడ రచించాడు.

## మహాపాత్ర విశ్వనాథుడు

విశ్వనాథుడు క్రీ.శ. 14వ శతాబ్దం పూర్వార్ధంవాడు. ఒరిస్సా ప్రాంతానికి చెందినవాడు. విశ్వనాథుడు మరియు అతని తండ్రి ఇద్దరు ఒరిస్సారాజా దగ్గర ఉన్నత పదవులలో వున్నట్లు తెలుస్తున్నది. విశ్వనాథునికి "సంధి విగ్రహ మహాపాత్రు"డన్న బిరుదమున్నది. ఇతడు మమ్మటుని కావ్య ప్రకాశానికి "కావ్యప్రకాశదర్పణ" మనే టీకను కూడ వ్రాసాడు. విశ్వనాథుని కృతి "సాహిత్య దర్పణం" ప్రసిద్ధమైన అలంకారశాస్త్ర గ్రంథం. సాహిత్య దర్పణంలో 10 పరిచ్ఛేదాలున్నవి. దీనిలో శ్రవ్య, దృశ్య కావ్య లక్షణాలు వివేచింపబడినవి. మమ్మటుని కావ్యలక్షణాలను ఇతడు వివేచించి "వాక్యం రసాత్మకం కావ్యమ్" అన్న నిర్వచనాన్ని చెప్పాడు. విశ్వనాథుడు ధ్వని సిద్ధాంతాన్ని విశదంగా వివేచించినా అతడు ధ్వనివాది కాడు. అతడు రసవాది. రసాన్ని రసధ్వనిగా అంగీకరించి, ధ్వనివాదులు దాన్ని మహత్త్వ హీనం చేసారని తలంచాడు. విశ్వనాథుడు భరతుని రస సిద్ధాంతాన్ని పునఃస్థాపించి రసమే కావ్యాత్మ అని అంగీకరించాడు.

దశరూపకం తర్వాత సాహిత్య దర్పణంలోనే రూపక భేదాలు, లక్షణాలు చక్కగా వివరింపబడినవి. దశరూపకం తర్వాత రూపక లక్షణాలకు ఇదే ప్రామాణిక గ్రంథం. రీతులను, అలంకారాలను కూడ విశ్వనాథుడు విశదంగా వివరించాడు. విశ్వనాథుడు స్వయంగా కవి. కొన్ని ఉదాహరణలను అతడు తాను రచించిన గ్రంథాల నుంచి ఇచ్చాడు. రఘువిలాస మహాకావ్యం, కువలయాశ్వ చరిత్ర అనే ప్రాకృత కావ్యం, ప్రభావతి, చంద్రకళ అనే నాటకాలు, నరసింహరాజ విజయం అనే చారిత్రక కావ్యం- అతని కృతులు. ఇవి అనుపలభ్యాలు.

పేరుకు తగినట్లుగానే సాహిత్య దర్పణం సాహిత్యానికి దర్పణం పడ్తున్నది. అలంకారశాస్త్ర సంబంధ విషయాలను ఎన్నిటినో సాహిత్యదర్పణం విశదంగా స్పష్టంచేసి చక్కగ చెప్తున్నది. కాని విశ్వనాథుడు ఎటువంటి ఆలోచనలకు వివేచనలకు, ఖండనలకు పూనుకోలేదు. అలంకారశాస్త్ర గ్రంథాలల్లో మమ్మటుని కావ్య ప్రకాశం తర్వాత సాహిత్య దర్పణానికే ఎక్కువ ఆదరం, వ్యాప్తి వున్నవి.

విశ్వనాథునిది పండితకుటుంబం. ఇతని తండ్రి చంద్రశేఖరుడు మహాకవి. సాహిత్య దర్పణానికి అనేక టీకలున్నవి. విశ్వనాథుని కొడుకు అనంతదాసు కూడ ఒక టీకను వ్రాసాడు. వాగీశుడు వ్రాసిన టీక చాల ప్రశస్తమైంది.

## కుమారగిరి రెడ్డి

కుమారగిరిరెడ్డి (క్రీ.శ. 1386-1402) కొండవీటి సామ్రాజ్యాన్నేలిన రాజు. ఇతడు వసంతరాజీయ మనే అలంకార శాస్త్ర గ్రంథాన్ని రచించాడు. దీనిలో ప్రత్యేకంగా రూపకాలను గూర్చి వివేచన చేయబడింది. కుమారగిరి బావమరిది కాటయ వేమారెడ్డి. అతడు కాళిదాసు నాటకత్రయానికి "కుమారగిరి రాజీయ" మని తన ఆశ్రయదాత పేరుపెట్టి వ్యాఖ్యానాలను వ్రాసాడు. ఈ వ్యాఖ్యానాలు చాలా ప్రసిద్ధమైనవి. కుమారగిరి రెడ్డి వసంతరాజీయంలోని వివరణల కనుగుణంగా వేమారెడ్డి ఆ వ్యాఖ్యానాలను వ్రాసాడు. వసంతరాజీయం నుంచి వేమారెడ్డియే కాక మల్లినాథ, కుమారస్వామి, నాదెండ్ల గోపమంత్రులు తమ వ్యాఖ్యానాలల్లో ఉద్ధరణలు ఇచ్చారు. ఈ ఉద్ధరణలు మాత్రమే ఇప్పుడు మనకు మిగిలినవి. గ్రంథం నశించింది.

## పెదకోమటి వేమారెడ్డి

కొండవీడును పరిపాలించిన మరొక రాజు పెదకోమటి వేమారెడ్డి(క్రీ.శ. 1403-1420). ఇతడు కుమారగిరి దాయాది. కుమారగిరి తర్వాత కొండవీడును ఆక్రమించి పరిపాలించాడు. ఇతడు సాహిత్య ప్రేమికుడు. ఇతడు వ్యాఖ్యానాలనే కాక అలంకారశాస్త్ర గ్రంథాన్ని కూడ రచించాడు. సాహిత్య చింతామణి ఇతని అలంకార కృతి.

మమ్మటుని కావ్యప్రకాశాన్ని అనుసరిస్తు వేమారెడ్డి సాహిత్య చింతామణిని రూపొందించాడు. దీనిలో 13 పరిచ్ఛేదాలున్నవి. కావ్యోత్పత్తి, కావ్య లక్షణాలు, కావ్యదోషగుణాలు, అలంకారాలు, రీతులు, నాయికా నాయక భేదాలు, కావ్య వస్తువు, దృశ్యకావ్య లక్షణాలు క్రమంగా వీటిల్లో వివరింపబడినవి. ధ్వని అంతర్గతంగానే వేమారెడ్డి రసాన్ని గూర్చి వివేచన చేసాడు. దీన్ని బట్టి ఇతడు ధ్వని వాది అని చెప్పవచ్చును. ఉదాహరణ శ్లోకాలను వేమారెడ్డి తన రచనల నుంచి ఇచ్చాడు. కొన్ని ఇతర కవులు అతన్ని స్తుతించిన శ్లోకాలు కూడ వున్నవి. వేమారెడ్డి సాహిత్య శాస్త్రాన్నే కాక సంగీత చింతామణి అనే సంగీతశాస్త్ర గ్రంథాన్ని కూడ వ్రాసాడు. ఇతడు సాహిత్య సంగీతాలల్లో మిక్కిలి

ప్రవేశమున్న మహారాజు. 'సర్వజ్ఞ చక్రవర్తి' అని ఇతనికి బిరుదం.

## రెండవ సింగభూపాలుడు

పెదకోమటి వేమారెడ్డికి సమకాలికుడైన మరొక రాజు సింగభూపాలుడు. ఇతడు దేవగిరి నేలిన రేచర్ల వంశీయుడు (క్రీ.శ. 1388-1412). వేమారెడ్డి వలెనే కవి పండిత పోషకుడు. స్వయంగా కవి పండితుడు. ఇతడు 'సర్వజ్ఞ' అనే బిరుదాన్ని దరించాడు. ఇతని అలంకారకృతి రసార్ణవసుధాకరం. దీనిలో 3 అధ్యాయాలున్నవి. దీనిలో రసవివేచన వివరంగా చేయబడింది. ఇది మహత్త్వ పూర్ణమైన గ్రంథం. 3 అధ్యాయాలకు "రంజకోల్లాస, రసికోల్లాస, రూపకోల్లాసా" లని పేర్లు పెట్టబడినవి. వీటిల్లో క్రమంగా రూపకోత్పత్తి, రూపక భేదాలు, రసం, నాయికా నాయక భేదాలు, రూపక వస్తువు మొదలైనవి వివేచింపబడినవి. నాట్యశాస్త్రం, దశరూపకం, భావప్రకాశం ఈ రసార్ణసుధాకరానికి ఆదర్శమైన గ్రంథాలు. చమత్కార చంద్రికను వ్రాసిన విశ్వేశ్వరుడు సింగభూపాలుని ఆస్థాని. విశ్వేశ్వరుడే రసార్ణవసుధాకరాన్ని వ్రాసి తన ఆశ్రయదాత పేరు పెట్టాడని కొందరు విమర్శకులు అభిప్రాయ పడినారు. కాని ఇది నిరాధారం. రాజులు వ్రాసిన గ్రంథాలు ఇటువంటి అభిప్రాయాలకు గురికావటం శోచనీయం.

సింగభూపాలుడు సాహిత్యప్రియుడే కాక సంగీత ప్రియుడు కూడ, సారంగ దేవుని సంగీత రత్నాకరానికి సంగీత సుధాకరమనే వ్యాఖ్యానాన్ని వ్రాసాడు. కువలయావళి అనే నాటిక ఇతని మరొక రచన, (దీన్ని గురించి రూపక ప్రకరణంలో చెప్పబడింది). రసార్ణవసుధాకరాన్ని సింగభూపాలుడు సింహాసన మధిష్ఠించకముందే వ్రాసి వుండవచ్చునని విమర్శకుల అభిప్రాయం. ఎందుకంటె రసార్ణవసుధాకరం విశ్వేశ్వరునిచమత్కార చంద్రికలో పేర్కొన బడింది. చమత్కారచంద్రికను సాయణుడు అలంకారసుధానిధిలో పేర్కొన్నాడు. అలంకారసుధానిధి క్రీ.శ. 1360కి పూర్వమే వ్రాయబడింది.

## విశ్వేశ్వరుడు

విశ్వేశ్వరుడు రెండవ సింగభూపాలుని ఆస్థానకవి, పండితుడు. ఇతడు చమత్కార చంద్రిక అనే అలంకార శాస్త్రగ్రంథాన్ని రచించాడు. ఏకావళి, ప్రతాపరుద్రీయంలోవలె దీనిలోను ఉదాహరణ శ్లోకాలు ఆశ్రయదాత సింగభూపాలుని ప్రశంసతో కూడినవి. చమత్కారచంద్రిక 8 విలాసాలుగా విభాగింపబడింది. వీటికి క్రమంగా విశ్వేశ్వరుడు

విషయానుసారంగా నామకరణం చేసాడు. వర్ణవివేక, వాక్యగుణ దోష విచార, అర్థదోష ప్రబంధ విశేషవివేక, గుణరీతి వృత్తి పాకశయ్యావివేక, రసవివేక, శబ్దాలంకార, అర్థాలంకార, ఉభయాలంకారాలని విలాసాలకు గల పేర్లు. చమత్కార చంద్రికలో రసార్ణవసుధాకరం పేర్కొన బడటం చేత ఇది దాని తరువాత రచన అని చెప్పవచ్చును. రసార్ణవసుధాకరంలో రసవివేచన విశదంగా వుండటంచేత కాబోలు విశ్వేశ్వరుడు రసవివేచనను సూక్ష్మంగా చేసి విడిచిపెట్టాడు.

కావ్య సిద్ధాంతాల్లో విశ్వేశ్వరుని చమత్కార సిద్ధాంత మొగటి. విశ్వేశ్వరుడు చమత్కారాన్ని కావ్యమూల తత్త్వంగా ప్రతిపాదించాడు. "నహి చమత్కార విరహితస్య కవేః కవిత్వం, కావ్యస్యవా కావ్యత్వమ్" అని క్షేమేంద్రుడు కవి కంఠాభరణంలో చెప్పివున్నాడు. మరియు చమత్కారం లేకపోతే కావ్యం లావణ్యా హీనమైన స్త్రీ యౌవనం వంటిదని అతడు చమత్కారానికి పెద్ద పీట వేసాడు-

ఏకేన కేనచిదర్ఘమణి ప్రభేణ
కావ్యమ్ చమత్కృతి పదేన వినా సువర్ణమ్
నిర్దోశ లేశమపి రోహతి కస్య చిత్తే
లావణ్యా హీనమివ యౌవన మంగనానామ్

క్రీ.శ. 1729 ప్రాంతం వాడైన హరిప్రసాదుడు విశ్వేశ్వరుని తర్వాత చమత్కారాన్ని కావ్యాత్మగా ప్రతిపాదించాడు. "రమణీయార్థ ప్రతిపాదకః శబ్దమ్ కావ్యః" అన్న తన కావ్య నిర్వచనంలోని "రమణీయ" శబ్దాన్ని వివరిస్తు జగన్నాథుడు "రమణీయతా చ లోకోత్తరాహ్లాద జనక జ్ఞాన గోచరతా, లోకోత్తరత్వం చాహ్లాద గతః చమత్కార పర పర్యాయః" అని లోకోత్తరాహ్లాదకరమైన చమత్కారాన్ని కావ్యంగా గుర్తించాడు. విశ్వేశ్వరుడు కావ్యాన్ని చమత్కారి, చమత్కారి తర, చమత్కారి తమ అని విభజించాడు. చమత్కారి శబ్ద చిత్రం, చమత్కార తరం - అర్థ చిత్రం, గుణీభూతవ్యంగం. చమత్కారి తమం - వ్యంగ్యం ప్రధానంగా కలిగినటువంటి కవిత్వం. విశ్వేశ్వరుడు చమత్కారాన్ని ధ్వనితో సమానంగా నిలబెట్టు తిరిగి ధ్వని సిద్ధాంతాన్నే గ్రహించి మారురూపాన్ని ఇచ్చాడు. ఈ విషయంలో ఇతడు కుంతకునితో పోల్చదగినవాడు. ఇద్దరు ధ్వని విరోధులు కాకున్నా కొత్త సిద్ధాంతాలను ప్రతిపాదించారు.

## విద్యాభూషణుడు

క్రీ.శ. 5వ శతాబ్దం వాడు. "సాహిత్యకౌముది" ఇతని అలంకార గ్రంథం.

## సాయణుడు

వేదభాష్యాలు వ్రాసిన ప్రసిద్ధపండితుడు. సాయణుడు విద్యాతీర్థ భారతీ తీర్థ, శ్రీ కంఠాది గురువుల దగ్గర విద్యను అభ్యసించాడు. అతని సోదరుడు మాధవాచార్యుడు కూడా అతనికి గురువు. సాయణుని అలంకార గ్రంథం "అలంకార సుధానిధి". దీనిలో ఉదాహరణలన్ని సాయణుని ప్రశంసతో కూడివున్నవి. ఆ శ్లోకాలను అతని సోదరుడు భోగనాథుడు ఉదాహరణమాలలో వ్రాసినవి. లభించిన తాళపత్ర ప్రతుల్లో రెండు ఉన్మేషాలు మాత్రమే వున్నవి. ఇవి సంపూర్ణంగా లేవు. సాయణుడు మహిమభట్టును ఖండిస్తు ఆనందవర్ధనుని అనుసరించాడు. సాయణుడు తాను చెప్పిన విషయాలను సమర్థించే కొరకు శాస్త్రోద్ధరణలను కూడ ఇచ్చాడు.

## పుంజరాజు

క్రీ.శ. 15శతాబ్దం ఉత్తరార్ధంలో వున్నాడు. కేరళలోని మలబారు ప్రాంతాన్నేలిన రాజు. ఇతడు తన సోదరునికొరకు రాజ్యాన్ని త్యజించిన వృత్తాంతం ప్రసిద్ధమైంది. ఇతడు ధ్వని ప్రదీపం, శిశుప్రబోధాలంకారమనే అలంకార కృతులను రచించాడు.

## వారాణాసి ధర్మసుధీ

ధర్మసుధీ క్రీ.శ. 15వ శతాబ్దం పూర్వార్ధంలో జీవించాడు. ఇతడు ఆంధ్రదేశంలో కృష్ణా లేక గుంటూరు మండలానికి చెందినవాడు. ఇతడు చాలాకాలం వారాణసిలో జీవించటం చేత ఇతని ఇంటి పేరు వారాణసి అని ఏర్పడింది. ఇతనిది వేదపండిత వంశం. ఇతడు నరకాసుర విజయ వ్యాయోగం, కంసవధ అనే రూపకాలను; సూర్య శతకం, కృష్ణస్తుతి అనే స్తుతి శతకాలను, బాల భాగవతమనే పద్య కావ్యాన్ని, హంస సందేశ మనే ప్రాకృత కావ్యాన్ని రచించాడు. ఇతడు సన్యాసం గ్రహించి రామానంద లేక గోవిందానంద సరస్వతి అన్న పేరుతో శంకరుని బ్రహ్మసూత్ర భాష్యానికి 'రత్నప్రభ' అనే టీకను వ్రాశాడు. "సాహిత్య రత్నాకరం" ఇతని అలంకారశాస్త్ర గ్రంథం. ఇది విద్యానాథుని 'ప్రతాపరుద్ర యశోభూషణా'న్ని అనుసరించి వ్రాయబడింది. ప్రతాపరుద్ర మహారాజు ప్రశంస శ్లోకాలను

ఉదాహరించిన విద్యానాథుని విమర్శించి ధర్మసుధీ శ్రీరామప్రస్తుతితో కూడిన శ్లోకాలను ఉదాహరణలుగా ఇచ్చాడు. దీనిలో కావ్య రూపక సంబంధ విషయాలన్ని చర్చింపబడినవి. దీనికి మల్లాది లక్ష్మణసూరి వ్రాసిన "మందార" మనే వ్యాఖ్య, మధుసూదనమిశ్రుడు వ్రాసిన "నౌక" అనే వ్యాఖ్యలున్నవి. 'నౌక' అనే మరొక వ్యాఖ్య చర్ల వేంకటేశశాస్త్రి వ్రాసింది కూడ దీనికి వున్నది. చర్ల వేంకటేశశాస్త్రి గురువు అనివిల్ల వేంకట శాస్త్రి "అలంకార సింధు" అనే అలంకార గ్రంథాన్ని రచించాడు. ఇతని కొడుకు అనివిల్ల నారాయణశాస్త్రి "సాహిత్య కల్పతరు" అనే అలంకార కృతిని రచించాడు. ఈ ఇద్దరు నూజివీడు మహారాజు మేకా అప్పారావు (క్రీ.శ. 1745) ఆస్థాన పండితులు.

## లొల్ల లక్ష్మీధరుడు

శ్రీకృష్ణదేవరాయల ఆస్థాన పండితుడు. రాయల కొండవీటి సంస్కృత శాసనాన్ని లక్ష్మీధరుడే వ్రాశాడు. మొదట ప్రతాపరుద్రగజపతి ఆస్థానంలో వుండి ఇతడు విజయనగరానికి వచ్చాడు. పండిత వంశజుడు. ఇతడు సరస్వతీ విలాసమనే ధర్మశాస్త్ర గ్రంథాన్ని, కర్ణావసంతం, బర్హావసంతం అనే కావ్యాలను, న్యాయ వివేకం, యోగదీపిక అనే శాస్త్ర గ్రంథాలను, వ్యాఖ్యలను మొదలైనవాటిని రచించాడు. "లక్ష్మీధర" మనేది అతని సాహిత్య శాస్త్ర గ్రంథం.

## శఠకోపాచార్యుడు

అహోబిల మఠాధిపతులకు శఠకోపాచార్యులని పేరు. ఈ ఆచార్యులలో ఇతడొకడు కావచ్చును. ఇతడు శఠకోపాలంకార పరిచయమనే అలంకారకృతిని రచించాడు. ప్రసిద్ధ తెలుగుకవి పెద్దన, మనుచరిత్రలో ఒక శఠకోపయతిని తన విద్యాగురువుగా పేర్కొన్నాడు. అతనికి పెద్దన హరికథాసారమనే కృతిని అంకితంగా ఇచ్చాడు. కాని అది ఈనాడు అలభ్యం. ఆ కృతిభర్త శఠకోపయతి వాసంతికాపరిణయ మనే కావ్యాన్ని కూడ వ్రాసాడట. ఈ విద్యాగురువు శఠకోపయతి ఈ అలంకార కర్త ఒక్కరే కావచ్చును. పెద్దన అతన్ని వైష్ణవమతదీక్షను ఇచ్చిన గురువుగాకాక విద్యాగురువుగా పేర్కొన్నాడు. అలంకారశాస్త్రవేత్త, కావ్యకర్త అయిన ఇతని దగ్గరనే పెద్దన సాహిత్య విద్యలను అభ్యసించి వుంటాడు. అప్పుడు ఇతని కాలాన్ని క్రీ.శ. 15వ శతాబ్దం ఉత్తరార్ధమని చెప్పవచ్చును.

# రూపగోస్వామి

రూపగోస్వామి (క్రీ.శ. 1490-1563) భక్తుడు, కవియేకాక ఆలంకారికుడు కూడ. ఇతని అసలు పేరు అమరుడు. ఇతని కుటుంబం కర్ణాటదేశంనుంచి వలసపోయి వంగదేశంలో స్థిరపడిందని బి. ముజందార్ నిరూపించాడు. ఇతడు రెండు సందేశకావ్యాలను రచించాడు. (వాటిని గూర్చి లఘుకావ్యాల ప్రకరణంలో చూడవచ్చును.)

## భక్తిరస స్థాపన

భక్తి రసామృతసింధు, ఉజ్జ్వలనీలమణి ఇతని ఆలంకార గ్రంథాలు. వీటిల్లో రసవివేచన విశదంగ జరిగింది. ఉజ్జ్వలనీలమణిలో రస, నాయికానాయక భేదాలు చర్చించబడినవి. శృంగారరసం విస్తరంగ వివరింపబడింది. రాధాకృష్ణుల ప్రేమ వర్ణనగల శ్లోకాలను రచించి రూపగోస్వామి శృంగార రసానికి ఉదాహరణలుగా ఇచ్చాడు. భక్తియొక్క విభావాను భావాదులను వివరించి దాన్ని రసంగా స్థాపించాడు. ఇంతకుముందు భగవత్ప్రీతి ప్రేయోరసం కింద చెప్పబడింది. రూపగోస్వామి భగవత్ప్రీతిని ప్రత్యేక రసంగా అంగీకరించి ప్రతిపాదించాడు. రూపగోస్వామి తర్వాత మధుసూదనసరస్వతి కూడ భక్తి రసతత్త్వాన్ని అంగీకరించి వివరించాడు. భక్తి రసం కాదని మృగయ, అక్షక్రీడ మొదలైన హర్షోత్సాహాదులలోనే ప్రీతిభక్త్యాది భావాలు అంతర్భవిస్తాయని ధనంజయుడు చెప్పాడు. మమ్మట జగన్నాథాదులు కూడ భక్తి రసం కాదని త్రోసిపుచ్చారు. రూపగోస్వామి "పృథగేవ భక్తిరసరాట్ సవిస్తరేణోచ్యతే మధురః" అని మధురం, ఉజ్జ్వలం అనే పేర్లలో భక్తిరసాన్ని వివరించాడు. శ్రీకృష్ణ గోపీ విషయకమైన శృంగారరూపమని ఇతడు చెప్పాడు. దీనికి చిత్తద్రవము స్థాయిభావం. ఇతర శృంగారముపాదేయం కాదని, శ్రీకృష్ణ గోపీ విషయకరతి ఉపాదేయమని, అదే భక్తిరస మని అతని మతం. కాని రూపగోస్వామి చెప్పింది ఏకదేశం మాత్రమే. మధుసూదనసరస్వతి తన భగవద్భక్తి రసాయన మనే గ్రంథంలో భక్తికి సంపూర్ణంగా రసత్వాన్ని ఇచ్చి ఉదాత్తం చేశాడు. శృంగారాది రసాలు క్షుద్రరసాలని, మిణుగురు పురుగులకన్న సూర్యకాంతి ఏ విధంగా బలవత్తరమో ఆ విధంగా మిగిలిన రసాలకన్న భక్తిరసం శ్రేష్ఠతరమైందని అతడు చెప్పాడు. దీనిలో భగవంతుడు ఆలంబన విభావం, తచ్చరిత్రలు విభావాలు, భగవదాకార చిత్తవృత్తి లేక భగవద్రతి స్థాయిభావం, నేత్రాదివికారాలు అనుభావాలు, నిర్వేదశంకాహర్షాదులు వ్యభిచారీభావాలు అని అతడు వివరించాడు. ఈ ఇద్దరు భక్తాలంకారికులు తప్ప మరే

ఆలంకారికులు భక్తిని రసంగా అంగీకరించలేదు. అయినా భక్తిరసం సర్వజనాదరణ పొందింది. భక్తిరసం అంగిగా గల ఎన్నో కావ్యాలు వ్రాయబడినవి. కొందరు ఆలంకారికులు భక్తి శాంత రసంలో అంతర్భవిస్తుందని, దాన్ని వేరు రసంగా చెప్పే అవసరం లేదని భావించారు.

## రూపగోస్వామి ఇతర రచనలు

రూపగోస్వామి ఉజ్జ్వల నీలమణికి అతని సోదరుని కుమారుడు జీవగోస్వామి వ్యాఖ్యానాన్ని వ్రాసాడు. భక్తి రసామృత సింధువు పూర్వ పశ్చిమ ఉత్తర దక్షిణ అని నాలుగు భాగాలుగా విభజింపబడింది. తిరిగి అవి లహరులుగా విభాగింపబడినవి. దీనిలో కూడ రసవివేచన చేయబడింది. రూపగోస్వామి మరొక అలంకార కృతి నాటక చంద్రిక. దీనిలో ప్రత్యేకంగా నాటక లక్షణాలు చెప్పబడినవి. భరతుని నాట్యశాస్త్రం, సింగభూపాలుని రసార్ణవసుధాకరాలను, వైష్ణవ సిద్ధాంతాలను రూపగోస్వామి నాటక లక్షణ వివరణకు ఆధారంగా గ్రహించాడు. రూపగోస్వామి స్వయంగా వ్రాసిన లలిత మాధవ నాటకాన్ని చాల చోట్ల ఉద్ధరించాడు. ఈ నాటకప్రతి పూనాలో భండార్కర్ ఓరియంటల్ రీసెర్చ్ ఇనిస్ట్యూట్‌లో వున్నది. కాని ఇంకా ప్రచురితం కాలేదు. ఇంకా తన దానకేళికౌముది అనే భాణికను కూడ రూపగోస్వామి ఉపరూపక భేదాల్లో ఉద్ధరించాడు. రూపగోస్వామి చైతన్య వైష్ణవ సంప్రదాయానికి చెందినవాడు. భక్తుడు, పండితుడు. వైష్ణవ సంప్రదాయంలో అనేకులు ఆలంకారికులు బయలుదేరారు. వారిలో రూపగోస్వామి ప్రముఖమైనవాడు.

## గోస్వామి కర్ణపూరుడు

వైష్ణవ సంప్రదాయంలో చైతన్యుని శిష్య పరంపరలో మరొక గొప్ప ఆలంకారికుడు కవి కర్ణపూరుడు. ఇతడు రూపగోస్వామికి సమకాలికుడు, శిష్యుడు. ఇతని అలంకార కృతి "అలంకార కౌస్తుభం". ఇతని పేరు పరమానందసేనుడు. కర్ణపూరుడన్నది ఉపనామం. రూపగోస్వామి వలెనే ఇతడు వంగదేశీయుడు. క్రీ.శ. 1524లో జన్మించాడు. చైతన్యుని భక్తి సిద్ధాంతాలను, బోధనలను సర్వసుబోధకం చేయడానికై ఇతడు చైతన్య చంద్రోదయమనే గ్రంథాన్ని రచించాడు. కావ్య ప్రకాశంలో వలెనే అలంకార కౌస్తుకభంలో కావ్య తత్త్వాలన్నీ సాంగోపాంగంగా వివరింపబడినవి. ఇది పది కిరణాలుగా విభాగింపబడింది.

శ్రీ కృష్ణ స్తుతి పరమైన, స్వయంగా వ్రాసిన శ్లోకాలను అతడు ఉదాహరణలుగా

ఇచ్చాడు. కర్ణపూరుడు రసమొక్కటే అనే సిద్ధాంతాన్ని స్థాపించాడు. రజస్తమో గుణస్పర్శ లేని శుద్ధ తత్త్వ స్వరూపం గల మనస్సుకు ఆనందమనే ధర్మమున్నది. అదే స్థాయి అని ఇతని అభిప్రాయం. స్ఫటికం జపాకుసుమాది నానాపదార్థాల సంయోగం వల్ల ఒక సారి ఎర్రగా, ఒక సారి పచ్చగా, ఒక సారి నల్లగా కనబడినట్లుగా ఒక్కటే అయిన స్థాయి నానావిధ విభావాదుల సంయోగం వల్ల వీరాద్భుతాది రూపాలను ధరిస్తుందని కర్ణపూరుడు చెప్పాడు. ఘటశరావాది నానావిధ పాత్రలలో అనేక ప్రతిబింబాలు ప్రతిఫలించినా సూర్యుని బింబమొక్కటే అయిన విధంగా ఉపాధిరూపాలైన రత్యాదులల్లో భేదమే కాని ఆనందంలో భేదం లేదని అతడు అంటాడు. రసాలన్నిటికి స్వాదాత్మ ఒక్కటే అని చెప్పే కర్ణపూరుని సిద్ధాంతం శాస్త్రీయంగా వున్నది.

కర్ణపూరుడు ఆనంద వృందావనమనే చంపువును, గౌరగణోద్దేశ దీపికను రచించాడు. ఇతని కొడుకు కవి చంద్రుడు కూడ పండితుడే. కవి చంద్రుని అలంకార కృతి "కావ్య చంద్రిక" దీనిలో 9 ప్రకాశాలున్నవి. సారలహరి, ధాతు చంద్రికలు ఆతని ఇతర రచనలు.

## కేశవ మిశ్రుడు

క్రీ.శ. 16వ శతాబ్దం వాడు. "అలంకార శేఖరం" ఇతని కృతి. ఇది పూర్వాలంకారికుల గ్రంథాలను అనుసరించి వ్రాయబడింది.

## శోభాకరుడు

క్రీ.శ. 1600 ప్రాంతంవాడు. కొందరు విమర్శకులు ఇతన్ని రుయ్యకునికి పరవర్తి, హేమచంద్ర, జయదేవులకు పూర్వవర్తి అని అంగీకరించారు. అలంకార రత్నాకరం ఇతని కృతి. ఇది సూత్ర శైలిలో వ్రాయబడింది. శోభాకరుడు స్వయంగా దీనికి విశదవ్యాఖ్యను వ్రాశాడు. దీనిలో 111 అలంకారాలు వివరింపబడినవి. శోభాకరుడు అసమ, ఉదాహరణ అనే కొత్త అలంకారాలను వివరించాడు. వాటిని రసగంగాధరకర్త అంగీకరించి గ్రహించాడు.

## అప్పయ్య దీక్షితుడు

అప్పయ్య దీక్షితుడు బహుముఖ ప్రజ్ఞాశాలి. అతడు కవి, దార్శనికుడు, వైయాకరణుడు, ఆలంకారికుడు. అతడు మీమాంస, వేదాంత, వ్యాకరణ, కావ్యశాస్త్రాల మీద వ్రాసిన గ్రంథాలు ప్రశస్తమైనవి. ఇతడు నెల్లూరు రాజు చిన్న బొమ్మనాయకుని (క్రీ.శ.

1549-1578) మరియు పెనుగొండ రాజు వేంకటరాయల (క్రీ.శ. 1586-1613) ఆస్థానాలల్లో ఆదరణలను సంపాదించాడు. చిన్న బొమ్మరాజుతో అప్పయ్యకు మంచి స్నేహసంబంధమున్నట్లున్నది. అందుకే తన ప్రాకృతమణిదీపాన్ని చిన్నబొమ్మని రచనగా చెప్పాడు. కాని తిరిగి ఉపసంహారంలో అది తన రచన అని అప్పయ్య చెప్పుకున్నాడు. అప్పయ్య చరమ దశను కాశీలో గడిపినట్లుగా తెలుస్తున్నది. ఇతడు తమిళుడైనా తెలుగు రాజుల ఆస్థానంలో వుండి గౌరవ సన్మానాలను పొందాడు.

అప్పయ్యవి మూడు అలంకార కృతులు వున్నవి - వృత్తివార్తిక, చిత్ర మీమాంస, కువలయానందం. వృత్తివార్తికలో రెండు పరిచ్ఛేదాలున్నవి. దీనిలో అభిధా లక్షణావృత్తుల విశదవివేచన వున్నది. అభిధావృత్తి యొక్క దీర్ఘ దీర్ఘతర వ్యాపారాన్ని అంగీకరించి అతడు వ్యంజానావృత్తిని ఖండించాడు. ఈ గ్రంథం అసంపూర్ణంగా వున్నట్లు అనిపిస్తున్నది. అతడు వ్యంజనను గూర్చి ఆలోచన తప్పక చేసివుంటాడు. అది ఉన్నట్లయితే వ్యంజనను గూర్చి అప్పయ్య అభిప్రాయం మనకు స్పష్టమైవుండేది. అప్పయ్య ధ్వనివాదిగా కాక అలంకారవాదిగా కన్పిస్తాడు. అతని మూడు అలంకార గ్రంథాలు అతని ఈ ధోరణినే బలపరుస్తున్నవి.

చిత్రమీమాంస ఒక అపూర్వమైన గ్రంథం. ఇందులో అర్థచిత్రకావ్యాలను గూర్చి వివేచన చేయబడింది. ఇది కూడ అసంపూర్ణంగా వున్నట్లు తోస్తున్నది.

కువలయానందంలో అలంకారాల వివేచన చేయబడింది. ఇది అలంకారాల మీద చివరి ఆధికారిక గ్రంథం. జయదేవుని అనుసరించి అప్పయ్య అలంకారాల లక్ష్యలక్షణాలను చెప్పాడు. అప్పయ్య చెప్పిన మౌలికాభిప్రాయాలను జగన్నాథుడు ఖండించి వున్నాడు. కువలయానందానికి పది టీక లున్నవి. ఈ టీకల సంఖ్యయే ఆ గ్రంథ వ్యాప్తిని ప్రకటిస్తున్నది. తర్వాత అలంకారాల వివరణ గ్రంథాలకు ఇది ఉపజీవ్య గ్రంథమైంది. కువలయానందంలో అప్పయ్య 118 అలంకారాలను వివరించాడు. ఇది పెనుగొండ నేలిన వేంకటరాయల (క్రీ.శ. 1586-1613) కోరిక మీద రచింపబడింది. ఇది పాశ్చాత్య భాషల్లోకి కూడా అనువదింపబడింది. అప్పయ్య అలంకారాల వివరణను తర్కపూర్ణంగా శాస్త్రీయ పద్ధతిలో చేశాడు.

## అలంకారాల క్రమవికాసం

అలంకారాలు ఎప్పుడు పుట్టినవి అని ప్రశ్నిస్తే కచ్చితంగా సమయాన్ని నిర్ణయించి చెప్పటం కష్టం. మానవుడు మాట్లాడ నేర్చిననాడే ఏదో ఒక విధమైన అలంకారం

పుట్టివుంటుంది. మానవుడు తాను చూచిన, అనుభవించిన వస్తుభావాలను ఎదుటి వానికి స్పష్టంచేసి చెప్పేటప్పుడు, తాను ఏ విధంగా వస్తుభావాలను దర్శించాడో ఆ విధంగానే ఎదుటి వానిచేత దర్శింపజేయాలనే కోరికతో తాను వర్ణించిచెప్పే వస్తుభావాలను ఎదుటి వానికి అతిపరిచితాలైన వస్తువులతో పోల్చి చెప్పివుంటాడు. ఆ పోలికను చెప్పటంతోటే అలంకారావిర్భావం జరిగింది. ప్రపంచంలోని ప్రతిభాషలో ఏదో ఒక విధమైన అలంకారం వుంటుంది. గ్రంథస్థమైన అలంకారోదాహరణలు మనకు ఋగ్వేదంలోనే లభిస్తున్నవి. ఋగ్వేదంలో ఉపమ, రూపకాలంకారాలు అధికంగా కన్పిస్తున్నవి. ఆ తర్వాత బ్రాహ్మణ ఉపనిషదాదుల్లో అలంకారాల ప్రయోగం జరిగింది. పురాణాదుల్లో సాహిత్య సృష్టి విస్తృతమైంది. అలంకారాల ప్రయోగం ప్రచురమైంది. సాహిత్యంలో ప్రచురంగా ప్రయోగింపబడే అలంకారాలను క్రమబద్ధం, శాస్త్రబద్ధం చేయవలసిన ఆవశ్యకత ఏర్పడింది. అట్లా అలంకారాలను శాస్త్రబద్ధం చేసినవారిలో భరతుడు ప్రథముడు. నాట్య శాస్త్రంలో భరతుడు ఉపమ, రూపక, దీపక, యమక అనే నాలుగు అలంకారాలనే వివరించాడు. అగ్ని పురాణకర్త 16 అలంకారాలను వివరించాడు. తర్వాత భామహుడు కావ్యానికి అలంకారాలు ప్రధానమైనవని గుర్తించి వాటిని విశదంగా వివరించాడు. "న కాంతమపి నిర్భూషం విభాతి వనితాముఖమ్" అని అన్నాడు భామహుడు. అతడు 38 అలంకారాలను వివరించాడు. దండి 37 అలంకారాలను గూర్చి చెప్పాడు. వామనుడు 31 అలంకారాలను వివరించాడు. రీతిప్రధా వాది అయినా వామనుడు "కావ్యం గ్రాహ్యమలంకారాత్" అని అంగీకరించాడు. ఉద్భటుడు 41 అలంకారాల వరకు వివరించాడు. రుద్రటుడు 57 అలంకారాల వరకు పెంచాడు. మమ్మటుడు 69 అలంకారాలను గ్రహించి వివరించాడు. వీటిల్లో 8 శబ్దాలంకారాలు, 61 అర్థాలంకారాలున్నవి. ఈ విధంగా క్రీ.శ. 11వ శతాబ్దం వరకు అలంకారాల సంఖ్య 69 వరకు పెరిగింది. మొదట ఉపమా లేక సాదృశ్య మూలకంగా వున్న అలంకారాలు అర్థవక్రతను ఆధారంగా తీసుకొని పెరుగసాగినవి. "లోకాతి క్రాంతగోచరం వక్రోక్తిః" అటువంటి వక్రోక్తియే అలంకారమని భామహుడు అన్నాడు. వక్రోక్తినే దండి అతిశయోక్తి అనే పేరుతో పేర్కొన్నాడు. కవుల ప్రౌఢశబ్దార్థాలతో కూడిన వక్రోక్తివైవిధ్యంతో అలంకారాలు పెరిగినవి. క్రీ.శ. 12వ శతాబ్దంనాటి జయదేవుడు 89 అలంకారాలను వివరించాడు. క్రీ.శ. 14వ శతాబ్దంవాడైన విశ్వనాథుడు కూడ 89 అలంకారాలను వివరించాడు. క్రీ.శ. 16వ శతాబ్దంవాడైన అప్పయ్యదీక్షితులు అలంకార సంఖ్యను 118 వరకు తీసుకొని పోయాడు. అలంకారాలకు జయదేవుని చంద్రాలోకం, అప్పయ్య దీక్షితుల

కువలయానందాలు పఠన యోగ్యమైన గ్రంథాలు. అప్పయ్య ధ్వని లేనటువంటి అలంకారయుక్త కావ్యాలు కూడ సుందరంగా సరసంగా వుంటవని నిరూపించటానికి పూనుకొన్నాడు. కాళిదాసాది కవుల కావ్యాలు కూడా ప్రకృతివర్ణనలతో నిండి ధ్వని కాని గుణీభూత వ్యంగ్యంకాని లేనివి వున్నవి. కాబట్టి ధ్వన్యభావంతో కూడ కావ్యం ఆదరణీయమౌతుందని అప్పయ్య అభిప్రాయం. ఉపమాలంకార సౌందర్యం చేతనే కాళిదాసు కవి కులగురువు అయినాడు. అప్పయ్య నాటికి సంస్కృత సాహిత్యంలో చిత్ర కావ్యాలెన్నో వ్రాయబడినవి. అవి ఆదరింపబడినవి కాబట్టే కవులు అటువంటి కావ్యాల నెన్నిటినో వ్రాసారు. అప్పయ్య తన చిత్రమీమాంసలో చిత్ర కావ్యభేదాలను వివరించాడు. చిత్రకావ్యంలో గుణాలంకారాలకే ప్రాధాన్యం. ధ్వనివాదులు చిత్రకావ్యాన్ని అధమ కావ్యంగా చెప్పారు. అప్పయ్య ధ్వనికావ్యం వలె చిత్ర కావ్యం కూడ మహత్త్వపూర్ణమైందని అంగీకరించిన ఆలంకారికుడు. ధ్వని కావ్యంలో వ్యంగ్యం, ఈషద్ వ్యంగ్యం వుంటుంది. చిత్ర కావ్యంలో వాచ్యార్థమే ఆకర్షకంగా వుంటుందని అతడంటాడు. ధ్వని ఈషన్మాత్రం లేని చిత్ర కావ్యాలను అంగీకరించి అప్పయ్య వాటికి ఉత్తమస్థానాన్ని కల్పించాడు. ధ్వనివాది అయిన జగన్నాథుడు దీనిచేత క్రుద్ధుడై కాబోలు చిత్రమీమాంస ఖండనను రచించాడు. అప్పయ్య దీక్షితుల సోదరుని పౌత్రుడు నీలకంఠదీక్షితుని సోదరుడైన మూడవ అప్పయ్య దీక్షితుడు చిత్రమీమాంస దోషధిక్కారమనే గ్రంథంలో జగన్నాథునికి సమాధానాలు ఇచ్చాడు.

## పండితరాయలు జగన్నాథుడు

జగన్నాథుని (క్రీ.శ. 17వ శ॥) రసగంగాధర మనే అలంకార శాస్త్ర గ్రంథం మౌలికమైంది. ప్రసిద్ధమైంది. కావ్యసంబంధ విషయాలు దీనిలో చక్కగా వివేచింపబడినవి. అలంకారశాస్త్ర సాహిత్యంలో ధ్వన్యాలోకం, కావ్యప్రకాశం తర్వాత ఇదే ప్రశస్తమైన గ్రంథం. రసగంగాధరం ఆననాలుగా విభజింపబడింది. దీనిలో చాల ఆననా లుండేవని, అనేక కావ్యశాస్త్ర విషయాలు చర్చింపబడినవని కాని అవన్ని ఉపలబ్ధం కాలేదని పండిత విమర్శకుల అభిప్రాయం. జగన్నాథుడు రసగంగాధరాన్ని ఉద్గ్రంథంగా వ్రాయదలచుకొన్నాడు కాని ఏ కారణం చేతనో పూర్తి చేయలేకపోయాడని మరికొందరు పండితుల అభిప్రాయం. ఇప్పుడు రసగంగాధరంలో రెండే ఆననాలున్నవి. రెండవది అసంపూర్ణంగా వున్నట్లు కన్పిస్తున్నది. మొదటి ఆననంలో జగన్నాథుడు కావ్యలక్షణాలను సమీక్షించాడు. జగన్నాథుడు ప్రాచీనాచార్యుల కావ్యనిర్వచనాలను పరిశీలించి "రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః కావ్యమ్' ' అని కొత్త నిర్వచనాన్ని ప్రతిపాదించాడు. అన్ని నిర్వచనాలకన్న ఇది మేలైందని అంటారు.

విశ్వనాథుని తర్వాత జగన్నాథుని కావ్యలక్షణమే సర్వజనామోదకరమైంది. జగన్నాథుడు కావ్యలక్షణాల తర్వాత కావ్యభేదాలను గూర్చి చెప్పాడు. ప్రాచీనాచార్యులు మూడు కావ్యభేదాలను- ఉత్తమ, మధ్యమ, అధమ అంటె ధ్వని, గుణీభూతవ్యంగ్య, చిత్ర కావ్యాలని విభజించగా, జగన్నాథుడు నాలుగు విధాలుగా కావ్యాలను విభజించాడు. ఉత్తమోత్తమ, ఉత్తమ, మధ్యమ, అధమ. ధ్వనితో కూడింది ఉత్తమోత్తమ కావ్యం. వ్యంగ్య ప్రధానమై చమత్కారకారిణి అయినది ఉత్తమ కావ్యం. గుణీభూత వ్యంగ్యం కలది మధ్యమకావ్యం. చిత్రకావ్యం అధమ కావ్యం- అని జగన్నాథుని విభజన. చివరి మూడు విభజనలు ప్రాచీనాచార్యుల ననుసరించే చేయబడినవి. ఉత్తమోత్తమమన్న విభజన జగన్నాథుని స్వంతం. కావ్యభేదాల తర్వాత జగన్నాథుడు రసచర్చను విస్తరంగ చేసాడు. జగన్నాథుని రససమీక్ష ఉత్కృష్టంగ వున్నది. తర్క పూర్ణమైన అతని శైలి అతని పాండిత్య ఔద్ధత్యాన్ని ప్రకటిస్తున్నది. రసచర్చ సందర్భంలోనే జగన్నాథుడు శబ్దార్థ గుణాలను, రీతి, ధ్వని భేదాలను వివరించాడు. ఆనందవర్ధనుని ధ్వనిసిద్ధాంతం సర్వసమ్మతమైన సిద్ధాంతంగా పరిణమించింది. అభినవగుప్తుడు రసధ్వనికి పట్టంకట్టి ధ్వని సిద్ధాంతాన్ని భరతుని రససిద్ధాంతంలోకి పరిణమింపజేయ ప్రయత్నించాడు. కాని అది జగన్నాథుని రసగంగాధరంలోనే సఫలమైందని చెప్పాలి. జగన్నాథుడు ధ్వని సమర్థకుడైనా రసవాది. రసగంగాధరం రెండవ ఆననంలో ధ్వని భేదాలు, శబ్దశక్తి, అలంకారాల వివేచనలున్నవి. అలంకారాల వివరణలో జగన్నాథుడు రుయ్యకుని కొంతవరకు అనుసరించాడు. తిరస్కారమనే కొత్త అలంకారాన్ని ఇతడు వివరించాడు.

## రసగంగాధర ప్రాశస్త్యం

రసగంగాధరం సూత్రాలల్లో నిబద్ధింపబడింది. జగన్నాథుడే దీనికి స్వయంగా విస్తృతమైన వ్యాఖ్యానాన్ని వ్రాసాడు. ఉదాహరణలను కూడ జగన్నాథుడే స్వయంగా వ్రాసాడు. ప్రాచీనాచార్యుల అభిప్రాయాలను పరిశీలించి కొత్తదైన మౌలికమైన తన అభిప్రాయాలను ప్రతిపాదించటమే జగన్నాథుని ఈ రచనోద్దేశం. జగన్నాథుడు ప్రౌఢగంభీరమైన నవ్యన్యాయ శైలిలో రసగంగాధరాన్ని ప్రస్తుతీకరించాడు. అలంకారాల వివరణలో అతడు ప్రాచీనాచార్యులను అనుసరించినా కావ్యలక్షణ నిరూపణలో, రసచర్చలో అతడు స్వతంత్రాభిప్రాయాలను వ్యక్తం చేశాడు. జగన్నాథుడు ధ్వని సమర్థకుడైనా ప్రాచీనాచార్యుల అభిప్రాయాలను పరిశీలించేటప్పుడు ధ్వనికారుని, మమ్మటుని అభిప్రాయాలను కూడ విమర్శించటానికి వెనుక ముందాడ లేదు. ఇందులోనే అతని

పాండిత్యగర్వం విశదమౌతున్నది. అలంకారాల వివరణలో రుయ్యకుని, రసచర్చలో విశ్వనాథుని ఒకవైపు అనుసరిస్తూ ఇంకొకవైపు వారి అభిప్రాయాలను కూడ విమర్శించాడు. ప్రాచీన పండిత పరంపరలో జగన్నాథుడే చివరివాడు అని పరిగణింపబడుతున్నది. జగన్నాథుడు కొత్త అలంకార సిద్ధాంతాన్ని దేన్ని ప్రతిపాదించకపోయినా అతడు ప్రాచీనాభిప్రాయాలను పరిశీలించిన తీరులో, తన అభిప్రాయాలను వ్యక్తంచేయుటంలో మౌలికతను చూపాడు. అతడు గొప్ప ఆత్మవిశ్వాసం గల ఉద్దండ పండితుడు. ఆత్మవిశ్వాసం, స్వాభిమానం, అతని మౌలికమైన స్వతంత్రమైన ఆలోచనలు, ప్రాచీనాచార్యుల అభిప్రాయాలను కూడ సవిమర్శకంగా ఆలోచించగల అతని ప్రతిభ, పాండిత్య గర్వాతిశయం అతన్నొక మహావ్యక్తిగా నిలబెడ్తున్నవి. జగన్నాథుని పాండిత్యపూర్ణమై నిరాఘాటంగా ప్రవాహంలాగా నడిచే శైలి అతని వ్యక్తిత్వానికి తగినట్లుగానే వున్నది. అతడు ఉదాహరణలుగా ఇచ్చిన శ్లోకాలు సరసమధురంగా వున్నవి. తన కవిత్వాన్ని గూర్చి అతడు ఇట్లా గర్వోక్తిని పలికాడు-

కవయతి పండితరాజే కవయంత్యన్యేZపి విద్వాంసః
నృత్యతి పినాకపాణౌ నృత్యంత్యన్యేZపి భూతబేతాళాః

"పండితరాజు కవిత్వం వ్రాసాడు. ఇతర కవులూ వ్రాసారు. శివుడు నృత్యం చేస్తున్నాడు, ఇతర భూతబేతాళురు కూడ నృత్యం చేస్తున్నవి." అంటే ఇతర కవుల కవిత్వం జగన్నాథుని కవిత్వంతో సాటివచ్చేది కాదని భావం. భట్టోజి పండితుని పౌత్రుడు నాగేశ పండితుడు రసగంగాధరానికి టీకను వ్రాసాడు. దీన్నిబట్టి ఈ కుటుంబాల నడుమ వున్న శాస్త్రవైరం తర్వాత విస్మరింపబడినట్లు చెప్పవచ్చును. (జగన్నాథుని జీవిత విశేషాలు వివరంగా లఘుకావ్య ప్రకరణంలో ఇయ్యబడినవి.)

## రాజచూడామణి దీక్షితుడు

క్రీ.శ. 1600 ప్రాంతంవాడు. కావ్యదర్పణం ఇతని అలంకార గ్రంథం. స్వయంగా దానికి అలంకార చూడామణి అనే టీకను వ్రాసాడు.

## చెరుకూరి యజ్ఞనారాయణుడు

ఇతడు చెరుకూరి లక్ష్మీధరుని అగ్రజాడు, కొండుభట్టు కొడుకు. వీరిది పండితవంశం. లక్ష్మీధరుడు పెనుగొండ నేలిన తిరుమల రాయల (క్రీ.శ. 1570-1571) ఆస్థానంలో

వుండేవాడు. యజ్ఞనారాయణుడు అలంకార రాఘవం, అలంకార సూర్యోదయమనే అలంకార శాస్త్ర గ్రంథాలను రచించాడు. అలంకార రాఘవంలో ఉదాహరణలు శ్రీరాముని స్తుతిపరంగా వున్నవి.

## యజ్ఞనారాయణ దీక్షితుడు

రఘునాథ నాయకుని మంత్రి గోవింద దీక్షితుని కొడుకు. ఇతడు రఘునాథభూప విజయమనే మహాకావ్యమే కాక అలంకార రత్నాకర మనే అలంకార కృతిని కూడ రచించాడు. ఉదాహరణలు రఘునాథుని ప్రశంసతో కూడినవి. ఇతడు రఘునాథుని (క్రీ.శ. 1604-1632) ఆస్థానంలో వున్నాడు.

## కృష్ణశర్మ

క్రీ.శ. 17వ శ॥ వాడు. ఇతని రచన మందార మండనచంపువు అలంకార శాస్త్రగ్రంథం. ఇది అలంకార రస వివరణలకు విజ్ఞానకోశంగా పరిగణింపబడుతున్నది.

## శ్రీశైల నరసింహాచార్యుడు

లక్షణమాలిక ఇతని అలంకార కృతి. దీనిలో అలంకారాల వివరణ స్వతంత్రంగా చేయబడింది. క్రీ.శ. 17వ శతాబ్ది వాడు. లక్షణమాలికకు ఇతడు స్వయంగా అలంకారేందుశేఖర మనే వ్యాఖ్యానాన్ని వ్రాసాడు.

## సుధీంద్రయోగి

క్రీ.శ. 17వ శతాబ్దివాడు. అలంకారవికాసం ఇతని అలంకారకృతి. అర్థాలంకార నిరూపణ దీనిలో చక్కగా చేయబడింది.

## శ్రీకృష్ణుడు

పరకాల స్వామి అని ఇతనికి పేరు. అలంకారమణిహార మనే అలంకార కృతిని వ్రాసాడు. క్రీ.శ. 17వ శతాబ్ది వాడు.

## కృష్ణభట్టు

క్రీ.శ. 17వ శతాబ్ది వాడు. ప్రశ్నమాల అన్న ఇతని కృతి తత్త్వచర్చలతో కూడి వున్నది.

## విశ్వేశ్వరుడు

అలంకార శాస్త్రాచార్యులల్లో జగన్నాథున్ని కాక కొందరు విశ్వేశ్వరున్ని అంతిమ ప్రౌఢాచార్యునిగా పరిగణిస్తారు. విశ్వేశ్వరుడు ఉత్తరప్రదేశ్ పర్వతీయ ప్రాంతంలోని అల్మోడా జిల్లా పారియా గ్రామ నివాసి. ఇతడు క్రీ.శ. 18వ శతాబ్దం పూర్వార్ధం వాడు. ఇతడు అలంకార కౌస్తుభమనే ప్రసిద్ధ అలంకార కృతిని రచించాడు. దీనిలో శైలి నవ్యన్యాయశైలిని పోలివున్నది. విశ్వేశ్వరుడు కవి, ఆలంకారికుడు, వైయాకరణుడే కాక గొప్ప నైయాయికుడు కూడ. విశ్వేశ్వరుడు మమ్మటుని తర్వాత, విపరీతంగా జయదేవ, అప్పయ దీక్షితులచేత, పెంచబడిన అలంకారాల సంఖ్యను అంగీకరించలేదు. అతడు మమ్మటుని 61 అర్థాలంకారాలనే గ్రహించి మిగతా అలంకారాలను అన్నిటిని వీటిలోనే అంతర్భవింపజేసాడు. ఇతర ఆచార్యులు పెంచిన అలంకారాలను ఇతడు ఖండించాడు. అప్పయ్యను ఖండించిన జగన్నాథునితో ఇతడు అనేకచోట్ల తన సహమతిని ప్రకటించినా కొన్నిచోట్ల జగన్నాథుని అభిప్రాయాలను కూడ ప్రశ్నించాడు. అలంకారాలను ఇతడు చక్కగా విశదంగా వివేచన చేసాడు. ఆ వివేచనలో ఇతడు అనేక అలంకారాలను ప్రసిద్ధమైన అలంకారాలల్లో అంతర్భవిస్తాయే కాని వేరే చెప్పవలసిన అవసరం లేదని చెప్పాడు. ఇంకా కొన్నిటికి అతడు అలంకార స్థానాన్ని ఇయ్యటానికే అంగీకరించలేదు. అలంకార మీమాంస సందర్భంలో ఇతడు జగన్నాథుని రసగంగాధరశైలిని అనుకరించి ఇతరుల అభిప్రాయాలను ఖండిస్తు తన అభిప్రాయాలను స్థాపిస్తు వచ్చాడు. అలంకారకౌస్తుభానికి విశ్వేశ్వరుడు స్వయంగా టీకనుకూడ వ్రాసాడు. కాని అది సంపూర్ణంగా లభ్యంకాలేదు. ఇతడు ఇంకా అలంకార ప్రదీపం, అలంకార ముక్తావళి అనే సరళ సుబోధకమైన ఆలంకారాల వివరణతో కూడిన గ్రంథాలను, రసచంద్రిక అన్న రసవివేచనతో కూడిన గ్రంథాన్ని రచించాడు. "కవీంద్ర కంఠాభరణం"లో ఇతడు చిత్రకావ్యాల ప్రామాణికమైన పరిశీలన చేసాడు. ఇతని అన్న ఉమాపతి కూడ ఆలంకారికుడట. పరికరాలంకారాన్ని గూర్చి ఉమాపతి అభిప్రాయాన్ని విశ్వేశ్వరుడు ఉద్ధరించాడు. ఇతని తండ్రి లక్ష్మీపతికూడ కవి, పండితుడు. వీరిది పండిత వంశం. ఇతడు 34వ ఏట చిన్నవయస్సులోనే మరణించాడు.

## అక్బరు షా

అక్బరు షా తండ్రి శాహరాజు గోలకొండరాజు అబుల్‌హసన్ తానీషాకు రాజగురువట.

అక్బరుషా తపశ్శక్తి కలవాడ నని చెప్పుకున్నాడు. ఇతడు గొప్ప పండితుడు. తండ్రి తర్వాత ఇతడు రాజగురువు పదవిని అలంకరించి వుంటాడు. అక్బరుషా సంస్కృతంలోనే కాక తెలుగులోను పండితుడు. ఇతని అలంకారకృతి శృంగారమంజరి. దీన్ని ఇతడు మొదట తెలుగులో వ్రాసి తర్వాత సంస్కృతంలోకి అనువదించాడట-

తేనాంధ్రభాషయాऽయం రచిత: శృంగార మంజరీ గ్రంథ:
స్వయమకబరేణ భూభృ న్మకుట మణి రంజితాంఘ్రికమలేన,
తద్విరచితాంధ్ర భాషా కలితాం శృంగార మంజరీచ్ఛాయామ్
సేవధ్వం సురవాణీ రచితాం రసతోషితా రసిక భృంగా:

శృంగార మంజరిలో నాయికా నాయక భేదచర్చ, రసచర్చలు చేయబడినవి. ఇది నాయికా విభాగం, నాయక విభాగం, దూతీ విభాగం, రసవిభాగం అని నాలుగు భాగాలుగా విభజింపబడింది. అక్బరుషా గ్రంథానికి భానుదత్తుని రసమంజరి ఆధార గ్రంథంగా తోస్తున్నది. అక్బరు అనే తనపేరును అకవర అని పదచ్ఛేదం చేసి తనపేరుకు బ్రహ్మ, విష్ణువులను మించినవాడనే అర్థాన్ని చెప్పుకొన్నాడు. ఇతనికి బడేసాహెబ్ అని మరో పేరు. దానికతడు మహేశ్వరుడని అర్థం చెప్పాడు. మహమ్మదీయులల్లో సంస్కృతం అభ్యసించినవారే తక్కువ. వారిలో సంస్కృత గ్రంథరచనకు పూనుకొన్నవారు ఇంకా తక్కువ. వారిలో అక్బరుషా ప్రముఖమైన వాడని చెప్పాలి.

## దేవీశంకరుడు

ఇతనికాలం క్రీ.శ. 1761-1768 నడుమ. అలంకారమంజూష ఇతని కృతి. అలంకారాల వివేచన దీనిలో వున్నది. దీనిలోని ఉదాహరణలన్ని పేష్వామాధవరావు (ప్రథమ) మరియు రఘునాథరావు వర్ణనలతో కూడినవి.

## నృసింహ కవి

క్రీ.శ. 18వ శతాబ్దం. అభినవ కాళిదాసు బిరుదాంకితుడు. ట్రావంకూర్ రాజు నంజరాజు ఆస్థానకవి. నంజరాజ యశోభూషణమనే అలంకారగ్రంథాన్ని రచించాడు. దీనిలో ఉదాహరణలన్నీ నంజరాజు ప్రశంసతో కూడినవి. గ్రంథం ప్రతాపరుద్ర యశోభూషణాన్ని అనుకరిస్తున్నది.

## అరుణగిరి కవి

క్రీ.శ. 18వ శతాబ్దివాడు. కేరళ లోని వటక్కుంకూరు రాజా గోదవర్మ ఆస్థానకవి. వటక్కుంకూరు పోర్చుగీసు, డచ్చ్‌ల కాలంలో సంపన్నమైన రాజ్యం. గోదవర్మ యశోభూషణం ఇతని అలంకారకృతి. దీనిలో అర్థాలంకారాలు ప్రతాప రుద్రయశోభూషణానుసారంగా వివరింపబడినవి. దానిలో లాగనే కవి తన ఆశ్రయదాతను ప్రస్తుతిస్తు ఉదాహరణలను ఇచ్చాడు.

## సదాశివమఖి

క్రీ.శ. 18వ శ॥ వాడు. ట్రావంకూర్ రాజు రామవర్మ ఆస్థాన పండితుడు. రామవర్మ యశోభూషణమనే అలంకార గ్రంథాన్ని రచించాడు. ఉదాహరణలు రామవర్మ ప్రశస్తితో కూడినవి.

## కచ్ఛపేశ్వర దీక్షితుడు

ఇతడు రామచంద్ర యశోభూషణమనే అలంకార గ్రంథాన్ని ప్రతాపరుద్ర యశోభూషణాన్ని అనుసరించి వ్రాసాడు.

## కాత్యాయన సుబ్రహ్మణ్య సూరి

క్రీ.శ. 18వ శతాబ్దంవాడు. అలంకారకౌస్తుభం ఇతని అలంకారకృతి.

## కృష్ణసుధీ

క్రీ.శ. 18వ శతాబ్దంవాడు. కావ్య కళానిధి ఇతని అలంకార కృతి.

## బలదేవ విద్యాభూషణుడు

క్రీ. శ. 18వ శ॥ వాడు. చైతన్యప్రభు అనుయాయి. సాహిత్యకౌముది, కావ్యకౌస్తుభం ఇతని కృతులు.

## రత్నభూషణుడు

క్రీ.శ. 18వ శ॥ వాడు. కావ్యకౌముది ఇతని కృతి. వంగదేశీయుడు.

## అనురథ మండనుడు

క్రీ.శ. 18వ శ॥ వాడు. జల్పకల్పలత, ముగ్ధమేధాకరం ఇతని అలంకార గ్రంథాలు. ఇతడు జైనుడు.

## రాజశేఖరుడు

క్రీ.శ. 19వ శ॥ వాడు. ఇతడు దక్షిణదేశీయుడు. 81 స్తబకాలు గల సాహిత్యకల్పద్రుమ మనే అలంకార గ్రంథాన్ని రచించాడు.

## అచ్యుతశర్మ

క్రీ.శ. 19వ శ॥ వాడు. 12 అధ్యాయాలు గల సాహిత్యసార మనే అలంకార కృతిని రచించాడు.

## మురారిదాసుడు - సుబ్రహ్మణ్యం

ఈ ఇద్దరు క్రీ.శ. 19వ శ॥ వారు. యశ్వంతసింహుని ప్రశంసతో కూడిన శ్లోకాలు గల యశ్వంతయశోభూషణమనే అలంకార గ్రంథాన్ని రచించారు. ఆలంకారికులు చాలా మంది విద్యానాథుని ప్రతాపరుద్ర యశోభూషణాన్ని అనుకరిస్తూ తమ ఆశ్రయదాతలైన రాజులను ప్రశంసిస్తూ ఉదాహరణ శ్లోకాలను వ్రాసి అలంకార శాస్త్ర గ్రంథాలను రచించారు.

ఇంకా వీరేగాక కోకొల్లలుగా పండితులు వ్రాసిన అలంకార శాస్త్రగ్రంథాలు ఎన్నో ప్రచురితం కాక ప్రాచీన లిఖిత పుస్తకభండాగారాలల్లో పడివున్నవి. అందులో కొన్ని రచయితల పేర్లు కూడ తెలియనివి వున్నవి. రచయితల పేర్లు తెలియని అలంకార గ్రంథాలు 50 వరకున్నవని ఎస్.కే.డే. పేర్కొన్నాడు. కాని ఇవేవి మౌలికమైన కొత్త ఆలోచనలతోకూడిన రచనలు కావు. అవి గ్రంథ సూచిక పట్టిక (కేటలాగు)ల్లో పేర్కొనదగినవేకాని ప్రత్యేక పరిశీలనకు తగినవిగా లేవు.

# నిఘంటు గ్రంథాలు

నిఘంటువుకు కోశమని పర్యాయపదంగా వాడబడుతున్నది. సంస్కృతంలో కోశమంటె పదాలు - వాటి అర్థాలు ఇయ్యబడిన గ్రంథాలు అని, నిఘంటువంటె సమానార్థక పదాల కూర్పుగల గ్రంథాలు అని అర్థభేద మున్నది. కాని తెలుగులో నిఘంటువని పదాలు - వాటి అర్థాలు ఇయ్యబడిన గ్రంథాలనే అంటున్నారు. హిందీలో పదాలు - వాటి అర్థాలు ఇయ్యబడిన గ్రంథాలకు కోశమనే పేరే ఎక్కువ వాడుకలో వున్నది. ఆధునిక కాలంలో నిఘంటు, కోశపదాలు ఇంగ్లీషులోని dictionary పదానికి సమానార్థక పదాలుగా వాడబడుతున్నవి.

## ప్రాచీన నిఘంటుకారులు

భారతదేశంలోని నిఘంటు గ్రంథరచనాపరంపర అతి ప్రాచీనమైంది. వైదిక కాలంలోనే నిఘంటు గ్రంథాల నిర్మాణం ఆరంభమైంది. మంత్రద్రష్టలైన ఋషులే నిఘంటు కారులైనారు. ప్రాచీన కాలంలో నిఘంటు గ్రంథాలు, వ్యాకరణ గ్రంథాలు ఒక శ్రేణికి చెందిన రచనలుగానే చూడబడేవి. వేదాంగాలల్లో ఒకటైన వ్యాకరణం వేదమంత్రాలల్లోని శబ్దాల ఉత్పత్తిని, స్వరూపాన్ని బోధించేది. వ్యాకరణం నూతన శబ్దకల్పనను చేయడానికి కూడ తోడ్పడుతుంది. అందుకే కావచ్చును ప్రాచీన కాలంలో వైయాకరణులే నిఘంటు గ్రంథకారులుగా కన్పిస్తున్నారు. వ్యాకరణం తర్వాత వేదాంగాలల్లో ఒకటైన నిరుక్తం పదసమూహాన్ని సంగ్రహపరచిన గ్రంథం. ప్రతి శబ్దం ఏదో ఒక ధాతువునుంచి నిష్పన్నమైందని నిరుక్తం, వివరిస్తు పదసమూహాన్ని ఒక్కచోట భద్రపరచింది. ఒక విధంగా నిరుక్తం నిఘంటువుకు టీకారూపమైందని చెప్పవచ్చును. నిరుక్తకారుడు యాస్కుడు కాక ఇంకా 14 మంది నిరుక్తకారులున్నట్లు నిరుక్త వృత్తికారుడు దుర్గాచార్యుడు తెలిపివున్నాడు. అంటె 14గురు ఆచార్యులు ఒక్క నిఘంటు గ్రంథానికి వేరు వేరు నిరుక్త గ్రంథాలను వ్రాసినారో లేక వేరు వేరు నిఘంటు గ్రంథాలకు వేరు వేరు నిరుక్త గ్రంథాలను వ్రాసినారో అయి వుంటారు. ప్రాచీన నిఘంటు గ్రంథాలన్నీ నష్టమైనవి. కొన్నిటి పేర్లు కూడా [illegible] మిగులలేదు. కొన్నిటి పేర్లు మాత్రమే మనకు తెలుసును. గ్రంథాలు [illegible] నష్టమైన నిఘంటు గ్రంథకారుల్లో భాగురి పేరు ప్రముఖంగా [illegible] [illegible] వ్రాయబడిన ఒక టీకలో భాగురీకృతమైన [illegible] [illegible]

"అభిధాన చింతామణి" వ్యాఖ్యలో భాగురి కోశ గ్రంథం పేర్కొనబడింది. సాయణుని "ధాతువృత్తి" లో కన్పించే భాగురి కోశగ్రంథశ్లోకం "అమరటీకా సర్వస్వం"లోను ఇయ్యబడింది. పురుషోత్తమ దేవుని "భాషావృత్తి", స్పష్టిధరుని "భాషావృత్తి టీక" మరియు "ప్రభావృత్తి" గ్రంథాలను బట్టి భాగురికోశం పేరు "త్రికాండ" మని తెలుస్తున్నది. పాణిని పూర్వవర్తులైన వైయాకరుణుల్లో ఒక భాగురి వున్నాడు. ఆ భాగురియే ఈ "త్రికాండ" కోశకర్త అని విమర్శకుల అభిప్రాయం. శౌనకుడు బహ్వృద్దేవతలో ఆచార్య భాగురి అభిప్రాయాలను పేర్కొని వున్నాడు. దీన్నిబట్టి భాగురి త్రికాండకోశమే కాక అనుక్రమణిక గ్రంథం కూడా కూర్చినట్లు తెలుస్తున్నది.

భానుజీ దీక్షితుని "అమరకోశటీక"ను బట్టి వైయాకరణుడు ఆపిశలి కూడ ఒక నిఘంటు గ్రంథాన్ని కూర్చినట్లు తెలుస్తున్నది. ఉణాది సూత్రాలకు వృత్తిని వ్రాసిన ఉజ్జ్వల దత్తు కూడ అపిశల కోశాన్ని పేర్కొన్నాడు. పాణిని ఆపిశలిని తన వ్యాకరణంలో పేర్కొని వున్నాడు.

కేశవ విరచిత నానార్ణవ సంక్షేపాన్ని బట్టి శాకటాయనుడు కూడ ఒక నిఘంటువును కూర్చినట్లు తెలుస్తున్నది. నిఘంటువుల టీకలను బట్టి వ్యాడి కూడ ఒక నిఘంటువును కూర్చినట్లు తెలుస్తున్నది. ఈ వ్యాడి సుప్రసిద్ధ వైయాకరణుడైన వ్యాడి కాక భిన్న వ్యక్తి అని పండితుల అభిప్రాయం.

## ఆధునిక వైదిక నిఘంటు గ్రంథాలు

వేద సంబంధమైన నిఘంటు, నిరుక్తాలు అతి ప్రాచీనమైనవి చాలా వున్నా ఇప్పుడు ఒక్క యాస్కుని నిరుక్తమే దొరుకుతున్నది.. మిగిలినవి కాలగర్భంలో లుప్తమైనవి. ఆధునిక కాలంలో వైదిక కోశ గ్రంథాలు చాల తయారు చేయబడినవి. చమూపతి "వేదార్థ శబ్దకోశ్" గ్రంథ మొకటి లాహోర్ నుంచి ప్రచురించారు. విశ్వబంధు శాస్త్రి "వైదిక శబ్దార్థ పారిజాతం" మరియు ఏడు భాగాలుగా "ఏ కంప్లీట్ ఎటిమోలాజికల్ డిక్షనరీ ఆఫ్ ది వైదిక్ లాంగ్వేజ్" ఇంకా "వైదిక పదానుక్రమకోశ్" గ్రంథాలను కూర్చాడు. మధుసూదన "శర్మ వైదిక కోశ్", హంసరాజ్ మరొక 'వైదికకోశ్' ను కూర్చారు. కేవలానంద సరస్వతి "ఐతరేయ బ్రాహ్మణ్ - ఆరణ్యక్ కోశ్" అన్న గ్రంథాన్ని కూర్చాడు. గయానంద శంభు సాద్లే 'ఉపనిషద్ వాక్య మహాకోశ్'ను రచించాడు. లక్ష్మణ శాస్త్రి 'ధర్మకోశ్' ను మూడు భాగాలుగా కూర్చాడు. భీమాచార్య ఝుల్కీకర్ "న్యాయ కోశాన్ని" కూర్చాడు. భారతీయులు ప్రాచీన

సంప్రదాయాన్ననుసరించి కోశగ్రంథాలను కూర్చగా నూతన శాస్త్రీయ పద్ధతిలో పాశ్చాత్య పండితులు కూడ కోశ గ్రంథాలను కూర్చారు. రోథ్, బోట్‌లింక్, శ్మిట్, మోనియర్ విలియమ్స్, విల్సన్, బెన్ఫే, మాక్‌డోనెల్, పిశెల్, గోల్డనర్, హిల్లేబ్రాంట్, గ్రాస్‌మన్, పోర్ఘగన్, నీసెల్ మొదలైన ఇంగ్లీషు, జర్మన్ విద్వాంసులు వివిధ వైదిక కోశ గ్రంథాలను కూర్చారు.

## లౌకిక సంస్కృత నిఘంటువులు

వైదిక కోశాలవలెనే లౌకిక సంస్కృత కోశ గ్రంథాలు కూడ కూర్చబడినవి. వైదిక నిఘంటువుల పద్ధతిని అనుసరిస్తు ఇవి కూర్చబడినవి. లౌకిక సంస్కృత కోశ గ్రంథాలు వైవిధ్యంతో కన్పిస్తున్నవి. కొన్ని కోశ గ్రంథాలు కేవలం సంజ్ఞాపదాలు కలవి. కొన్ని కేవలం ధాతువులతో కూడినవి, కొన్ని నానార్థక పదాల కూర్పుతో కూడినవి. ఈ విధంగా లౌకిక సంస్కృత కోశాలు వైదిక కోశాలను అనుసరించినా కొంత భిన్న మార్గాన్ని తొక్కి వివిధ రూపాలుగా వికసించినవి.

ప్రాచీనమైన లౌకిక సంస్కృత కోశాలు ఇప్పుడు దొరకటం లేదు. కాత్యాయనుని "నామమాల", వాచస్పతి "శబ్దకోశం", విక్రమాదిత్యుని "శబ్దకోశం" మరియు "సంసారవర్తం'', వ్యాడి "ఉత్పలిని" మొదలైన ప్రాచీనాచార్యుల కోశగ్రంథాలు కాల గర్భంలో కలిసిపోయినవి. లభించిన కోశాలల్లో అమరసింహుని "అమరకోశ"మే ప్రాచీనమైన కోశగ్రంథం. అమరసింహుని కాల నిర్ణయంలో చాల అభిప్రాయ భేదాలున్నవి. అతడు బౌద్ధుడని "యస్యజ్ఞాన దయాసింధో...." అన్న మంగళాచరణ శ్లోకాన్ని బట్టి తెలుస్తున్నది. అతడు విక్రమాదిత్యుని ఆస్థానంలో వున్న నవరత్నాలల్లో ఒకడని ప్రసిద్ధి. విక్రమాదిత్యుడు కాళిదాసు ఆశ్రయదాత విక్రమాదిత్యుడని, అమరసింహుడు క్రీ.పూ. మొదటి శతాబ్దం వాడని భారతీయుల అభిమతం. కాని ఆధునిక విమర్శకులు విక్రమాదిత్యుడు గుప్తవంశ రాజు రెండవ చంద్రగుప్తుడని, అమరసింహుడు క్రీ.శ. 4వ శతాబ్దం వాడని చెప్తున్నారు. మాక్స్ ముల్లర్ అమరసింహుడు క్రీ.శ. 6వ శతాబ్దం వాడని నిర్ణయించాడు. అమరకోశం చైనా భాషానువాదం క్రీ.శ. 6వ శతాబ్దంలో చేయబడింది. కాబట్టి అమరసింహుడు ఆ శతాబ్దం వాడని మాక్స్‌మల్లర్ నిర్ణయించటం సమంజసంగా లేదు. హోర్నెల్ అమరసింహుని కాలాన్ని క్రీ.శ. 624-640 అని నిర్ణయించాడు. పై అనువాదం దృష్టితో ఈ కాలనిర్ణయం సరిగ్గా లేదు. అమరసింహుడు క్రీ.శ. 400 ప్రాంతం వాడని ఓక్ నిర్ణయించాడు.

అమరకోశానికే 'నామలింగానుశాసన' మని మరొక పేరు. అమరకోశం చాల

చక్కగా శాస్త్రీయ పద్ధతిలో వ్రాయబడింది. ఇది ఎక్కువ ఉపయోగకరంగా వుండటంచేత ఎక్కువ వ్యాప్తిలోకి వచ్చింది. దీనితో ప్రాచీన నిఘంటువులు ఎక్కువ ప్రచారంలో లేక లుప్తమై వుంటవి. అమరకోశంలో మూడు కాండాలున్నవి. తిరిగి ఇవి వర్గాలుగా విభజింపబడినవి. ప్రతి వర్గంలో పేర్లు వరుసగా చెప్పబడినవి. దీనిలో లింగభేదాన్ననుసరించి పర్యాయపదాలు ఇయ్యబడినవి. ప్రతి సంస్కృత విద్యార్థి అమరకోశాన్ని కంఠపాఠం చేసే ఆచారం వున్నది. మెలమెల్లగా ఈ ఆచారం లుప్తమౌతున్నది.

అమరకోశం యొక్క వ్యాప్తి దానికిగల టీకలే చెప్తున్నవి. దీనికి మొత్తం 50 వరకు టీకలు కన్పిస్తున్నవి. ఆ టీకల్లో ప్రభా, మాహేశ్వరి, సుధా, రామాశ్రమి, నామచంద్రిక టీకలు చాల ప్రసిద్ధమైనవి. అన్నింటిలోకి క్షీరస్వామి (క్రీ.శ. 1050) వ్రాసిన టీక చాల వ్యాప్తిలో వున్నది. ఈ వ్యాఖ్య సరళ సులభ శైలిలో వుండటమే దీని వ్యాప్తికి కారణం. మల్లినాథుడు, తాళ్ళపాక వెంకటాచార్యులు, అప్పయ్య దీక్షితుడు, నీలకంఠదీక్షితుడు మొదలైన దాక్షిణాత్యులు కూడ అమరకోశానికి టీకలు వ్రాసారు. మల్లినాథుని టీక పేరు అమరపద పారిజాతం. అప్పయ్య దీక్షితుల టీక గురుబాల ప్రబోధిని చాల ప్రచారంలో వున్నది.

పురుషోత్తమదేవుడు (క్రీ.శ. 7వ శ॥) త్రికాండకోశం పేరుతో అమరకోశానికి పరిశిష్ట గ్రంథాన్ని వ్రాసాడు. దీనిలో పాళి, ప్రాకృత పదాలుకూడ చేర్చబడినవి. దీనిలో దాదాపు 800 శ్లోకాలున్నవి. పురుషోత్తముని మరొక కోశగ్రంథం 'హారావళి'. దీనిలో 270 శ్లోకాలున్నవి. దీని మొదటి భాగంలో పర్యాయపదాలు, రెండవ భాగంలో నానార్థాలు ఇయ్యబడినవి. శాశ్వతుడు "అనేకార్థ సముచ్చయ"మనే కోశాన్ని కూర్చాడు. ఇతడు అమరసింహుని సమకాలికుడని అంటారు. దీనిలో దాదాపు 800 శ్లోకాలున్నవి. వరరుచి (క్రీ.శ. 7వ శ॥) కృతమైనకోశగ్రంథ మొకటి మద్రాసు లిఖిత భాండాగారంలో వున్నది. హలాయుధుడు (క్రీ.శ.10వ శ॥) "అభిధానరతన్నమాల"ను కూర్చాడు. దీనిలో దాదాపు 900 శ్లోకాలు, 5 కాండాలున్నవి. హలాయుధుడు రాష్ట్రకూటరాజు మూడవ కృష్ణుని ఆస్థాన పండితుడు. ఇతడు ధారానగరాధిపతి ముంజదేవుని ఆదేశంతో పింగళ ఛందస్సుకు "మృతసంజీవినీ వృత్తి"ని వ్రాసాడు. క్రీ.శ. 11వ శ॥ వాడైన యాదవప్రకాశాచార్యుడు "వైజయంతి" అన్న కోశాన్ని కూర్చాడు. ఇతడు రామానుజాచార్యుల గురువు. ఇది చక్కగా శాస్త్రీయ పద్ధతిలో కూర్చబడింది. శబ్ద, వర్ణక్రమం అకారాది క్రమంలో కూర్చబడింది. దీనిలో 8 కాండాలున్నవి. ఇది హలాయుధుని కోశం కన్న విశాలమైంది.

ద్విసంధానకావ్యకర్త, దశరూపక కారుడు ధనంజయుడు (క్రీ.శ. 990)

ధనంజయకోశాన్ని కూర్చాడు. దీనికి "నామమాల" అని కూడా పేరు. దీనిలో 220 వరకు శ్లోకాలున్నవి. దీనిలో 46 శ్లోకాలుగల "అనేకార్థమాల" కూడా అనుబంధంగా చేరివున్నది. ధనంజయుడు దిగంబరజైనుడు. నిఘంటు నిర్మాణంలో జైనాచార్యులు చాలా కృషి చేసారు. జైనాచార్యుడు హరిషేణుడు "బృహత్ కథా కోశా"న్ని నిర్మించాడు. దీని రచనాకాలం క్రీ.శ. 989 అని చెప్పబడింది. దీనిలో 1250 శ్లోకాలున్నవి. ఇది నిజంగానే బృహద్రూపం కలది. దిగంబర జైన సంప్రదాయంలో "ఆరాధనా కథా కోచ" మనే పేరుతో రెండు నిఘంటు గ్రంథాలు ప్రచారంలో వున్నవి. వాటిలో ఒకటి ప్రభాచంద్రుడు కూర్చాడు. ఇది పద్యబద్ధం. తిలకమంజరికారుడు ధన పాలుడు "పాయిలచ్ఛి నామమాల" పేరుతో ప్రాకృత శబ్ద కోశ గ్రంథాన్ని కూర్చాడు.

క్రీ.శ. 12వ శ॥ వాడైన మహేశ్వరుడు "విశ్వ ప్రకాశ" మనే కోశాన్ని కూర్చాడు. ఇది ప్రసిద్ధమైన కోశగ్రంథం. ఇది క్రీ.శ. 1111లో కూర్చబడిందని చెప్పబడివున్నది. మహేశ్వరుడు వృత్తిచేత వైద్యుడు మరియు కవి కూడ. తాను సాహసాంక చరిత్రకావ్యకర్తనని చెప్పుకొన్నాడు. మహేశ్వరుడే విశ్వప్రకాశానికి అనుబంధంగా "శబ్దభేద ప్రకాశా"న్ని కూర్చాడు. తాను నిర్మించిన సంపూర్ణ కోశం పాఠకులకు ఇతర కోశాలను మోయవలసిన భారాన్ని తగ్గిస్తుందని మహేశ్వరుడు చెప్పుకొన్నాడు.-

సతాం పుస్తక సంభారభారమోక్షః కృతో మయా
నామానుశాసనమిదం సంపూర్ణం తన్వతాద్భుతమ్.

క్రీ.శ. 12వ శ॥ లోనే కేశవస్వామి "నానార్థార్ణవ సంక్షే"పాన్ని "శబ్దకల్పద్రుమా"న్ని నిర్మించాడు. ఇతడు చోళరాజా కులోత్తంగుని కొడుకు రాజరాజు ఆస్థాన పండితుడు. ఇతని నానార్థార్ణవ సంక్షేప కోశంలో ఆరు కాండాలున్నవి. దీనిలో వైదిక శబ్దాలు కూడ చేర్చబడినవి. శబ్దాల వివిధార్థాలు దీనిలో కూర్పబడినవి. అజయపాలుడు "నానార్థరత్నమాల"ను, హేమచంద్రా చార్యుడు "అభిధాన చింతామణి" కోశం, "అనేకార్థ కోశా"న్ని, మల్లభట్టు "ఆఖ్యాత చంద్రిక" ను నిర్మించారు. మేదినీకారుడు "అనేకార్థ శబ్దకోశ" గ్రంథాన్ని కూర్చాడు. ఇది చాల ప్రచారంలో వున్నది. ఇది విశ్వప్రకాశాన్ని పోలివున్నది. మేదినీకారుడు "షట్కృతగాథాకోశ" మనే పేరుతో 600 నీతి శ్లోకాలను వ్రాసినట్లు తెలుస్తున్నది. కాని అది అనుపలభ్యం. మేదినిని మల్లినాథాది వ్యాఖ్యాకారులు పేర్కొన్నారు. కాబట్టి ఒరిస్సా గాంగరాజుల ఆశ్రితుడైన మేదినీకారుడు క్రీ.శ. 12వ శ॥ వాడని చెప్పవచ్చును.

ఇక క్రీ.శ. 13వ శతాబ్దంలో నిర్మింపబడిన కోశగ్రంథా లేవి లభించటం లేదు. క్రీ.శ. 14వ శ॥ చివర విజయనగరరాజు రెండవ హరిహరుని మంత్రి ఇరుగప్ప దండనాథుడు "నానార్థరత్నమాల"ను నిర్మించాడు. క్రీ.శ. 15వ శ॥ వాడైన వామనభట్ట బాణుడు "శబ్దచంద్రిక" అన్న కోశాన్ని కూర్చాడు. దీనిలో 3 ఖండాలు, 5 సర్గలున్నవి. క్రీ.శ. 16వ శ॥ లో శ్రుతసాగరుని "వ్రతకథాకోశం", పద్మసుందరుని "సుందరప్రకాశ శబ్దార్ణవం" నిర్మింపబడినవి. క్రీ.శ. 19వ శ॥లో కేశవపండిత నిర్మిత "కల్పద్రుమ కోశం" చాలాప్రసిద్ధమైంది. దీనిలో 4000 శ్లోకాలున్నవి. పర్యాయపదనిఘంటువుల్లో ఇది గొప్పది. తంజావూరు రాజు శహజీ "శబ్దార్థసంగ్రహం", "శబ్దరత్న సమన్వయం" అనే రెండు కోశ గ్రంథాలను నిర్మించాడు. పాణినీయ ఉణాదిపాఠాన్ని అనుసరించి రామశర్మ "ఉణాదికోశాన్ని", శుభశీలగణి "ఉణాదినామమాల"ను, వేంకటేశ్వర పండితుడు, "ఉణాదినిఘంటుమాల"ను కూర్చారు. వేంకటేశ్వరుడు శహాజీ కాలంవాడు. అదే కాలంలో నల్లాశాస్త్రి శ్రీధర వేంకటేశ్వరుడు "పద మణిమంజరి"ని కూర్చాడు. మల్లుభట్టు "అన్వయసంగ్రహ" కోశాన్ని నిర్మించాడు. ఇవేగాక ఇంకా మహిపుని "అనేకార్థ తిలకం", మహదేవ వేదాంతి "అనాదికోశం", సౌరభి "ఏకార్థ నామమాల-ద్వ్యక్షర నామమాల", రాఘవకవి "కోశవసంతం", భోజుని "నామమాల", త్ర్యంబకమిశ్రుని "విశేషామృతం", కర్ణపూరుని "సంస్కృత-పారశీక ప్రకాశం", హర్షకీర్తి "శారదీయాఖ్య నామమాల", శివదత్తుని "విశ్వకోశం", భానుచంద్రగణి "వివిక్త నామసంగ్రహం", మధురేశుని "శబ్దార్థ రత్నావళి" వల్లభగణి "సారోద్ధారం", రఘునాథ పండితుని "రాజవ్యవహార కోశం" మొదలైన అనేక కోశగ్రంథాలున్నవి. ఇవేగాక ఏకాక్షర, ద్వ్యక్షర, గణిత, జ్యోతిష, వైద్య సంబంధి కోశగ్రంథాలు చాల వచ్చినవి. మాధవకరుని "పర్యాయరత్నమాల" వీటిల్లో మొదటిది. ఈ కోశకారుడు క్రీ.శ. 8,9 శ॥ వాడని వింటర్‌నిట్స్ అభిప్రాయం. దీనిలో 200 వరకు శ్లోకాలున్నవి. దీనిననుసరించి తర్వాత "పర్యాయ ముక్తావళి" కూర్చబడింది. హేమచంద్రాచార్యుని "నిఘంటు శేషం" కూడ వైద్య సంబంధమైనదే, దీనిలో ఔషధుల పేర్లు ఎక్కువగా ఇయ్యబడినవి. "అభిధాన రత్నమాల" మరొక వైద్య కోశగ్రంథం. దీనిలో రసవిషయక పదావళి కూర్చబడింది. క్రీ.శ. 1374లో కూర్చబడిన మదనపాలుని "మదనపాల నిఘంటువు", క్రీ.శ. 1677 నాటిదైన శివదత్తుని "శివకోశం", చక్రపాణిదత్తుని 'శబ్దచంద్రిక' వేంకటేశ్వరుని 'దక్షిణామూర్తి నిఘంటువు' మరియు "ద్రవ్య ముక్తావళి", నీలకంఠమిశ్రుని "పర్యాయార్ణవం" మొదలైనవి వైద్యకోశ గ్రంథాలు. జ్యోతిషకోశ గ్రంథాలల్లో హరదత్తుని

"గణితరత్నమాల" చెప్పుకోదగింది. ఇంకా "సంఖ్యాకోశం", "నవగ్రహకోశం", "రాశజకోశం", "నక్షత్రకోశం" మొదలైనవి జ్యోతిషనిఘంటువులు.

నిఘంటువులకు వ్యాఖ్యాన గ్రంథాలుకూడ వ్రాయబడినవి. వల్లభగణి "సారోద్ధారం' ' హేమచంద్రుని "అభిధాన చింతామణి"కి వ్యాఖ్యాన రూపమైన గ్రంథం.

సంస్కృతభాషకే కాక ప్రాకృత, పాళిభాషాకోశ గ్రంథాలు కూడ మధ్యయుగంలో చాల నిర్మింపబడినవి. మొగ్గల్లాన కృత "అభిధానప్ప దీపిక", సద్ధమ్మ కిత్తికృత ఏకక్ఖర కోసం" పాళీకోశగ్రంథాలల్లో ప్రముఖమైనవి. "అభిధానప్ప దీపిక" అమరకోశం శైలిలో వ్రాయబడింది. ఇది సింహళ, బర్మా దేశాలల్లో బాగా వ్యాప్తిలో వున్నది.

## ఆధునిక నిఘంటు గ్రంథాల రచన

ఆధునిక కాలంలోను నిఘంటు గ్రంథాల రచన కొనసాగుతూనే వున్నది. తారానాథ తర్కవాచస్పతి "వాచస్పత్య" మనే నిఘంటువును కూర్చాడు. ఇది 10,000 పుటల గ్రంథం. రాధాకాంత దేవుడు "శబ్దకల్పద్రుమం", విజయ రాజేంద్రసూరి "అభిధాన రాజేంద్ర కోశం" (ఇది 7 భాగాలుగా వున్నది), సఖానందనాథ్ "శబ్దార్థ చింతామణి" (ఇది 4 భాగాలుగా వున్నది) మొదలైన కోశ గ్రంథాలను కూర్చారు. హర గోవిందదాసు "పాఇఅ-సిద్ద-మహణ్ణవ" అనే ప్రాకృత - హిందీ కోశాన్ని 4 భాగాలుగా నిర్మించాడు. జ్ఞాన చంద్రస్వామి "అభిధాన ప్రదీపిక" అనే నిఘంటువును కూర్చాడు. ఇక సంస్కృత-దేశ భాష శబ్దార్థాలతో కూడిన నిఘంటు గ్రంథాలనేకం కూర్చబడినవి. పాశ్చాత్య పండితులు కూడ ఎన్నో కోశ గ్రంథాలను తయారు చేసారు. వైదిక శబ్దకోశాలను వారు చాల కృషిచేసి శాస్త్రీయ పద్ధతిలో రచించారు. గ్రాస్‌మన్ "ఋగ్వేదకోశం" ఋగ్వేద శబ్దాల అర్థ నిర్ణయంతో కూడిన కోశ గ్రంథం, సంస్కృత-ఇంగ్లీషు, సంస్కృత-జర్మన్ మొదలైన కోశ గ్రంథాలు అనేకం నిర్మింపబడినవి. మోనియర్ విలియమ్స్ "సంస్కృత-ఇంగ్లీషు డిక్షనరీ" చాల ప్రశంసనీయమైన ఆధునిక కోశ గ్రంథం. వి. ఆప్టే కూర్చిన "ప్రాక్టికల్ సంస్కృత్-ఇంగ్లీషు డిక్షనరీ" కోశ గ్రంథాలు కూడ చెప్పుకోదగినవి. ఆధునిక కాలంలో కూర్చబడిన కోశ గ్రంథాలల్లో "సెంట్ పీటర్స్‌బర్గ్ డిక్షనరీ" ప్రశంసనీయమైంది. ఇది చాల విశాలమైంది. ఇది 7 భాగాలుగా ప్రచురింపబడిన బృహత్ కోశం. దీన్ని ఆటో ఫన్ బ్హోట్‌లింక్, రుడాల్ఫ్ ఫన్ రోథ్ అన్న జర్మన్ పండితులు కూర్చి క్రీ.శ. 1852-1875 నడుమ ప్రచురించారు. దీనిలో సంస్కృత శబ్దానికి

సమానాంతరమైన గ్రీక్, లాటిన్, కెల్టిక్ మొదలైన భాషా పదాలు కూడ ఇయ్యబడినవి. దీనికి సంక్షిప్త రూపం కూడ ప్రచురింపబడింది. టి.డబ్ల్యు. రీజ్ డేవిస్, విలియం స్టీడ్‌లు కూర్చిన "పాళీ-ఇంగ్లీషు-డిక్షనరీ" (8భాగాలు), ఫ్రాంక్లిన్ ఏగర్టన్ కూర్చిన "బుద్దిస్ట్ హైబ్రిడ్ సంస్కృత్ గ్రామర్ అండ్ డిక్షనరీ" కూడ చెప్పుకోదగిన కోశ గ్రంథాలు. ప్రాచీన కోశ గ్రంథాలు ఇంగ్లీషు, జర్మన్ మొదలైన పాశ్చాత్య భాషల్లోకి అనువాదం చేయబడినవి. ఆటో ఫన్ బ్యోట్ లింక్ హేమ చంద్రుని "అభిధాన చింతామణి"ని జర్మన్ భాషలోకి అనువాదం చేసి ప్రచురించాడు.

ఇప్పటికి ఇంకా నిఘంటు గ్రంథాల రచనలు జరుగుతూనే వున్నవి. ప్రాచీన కాలంలో నిఘంటువుల్లోని శబ్దాలను విద్యార్థులు నోటికి జ్ఞాపకం చేసేవారు. ఆ సంప్రదాయం మెల్లమెల్లగా మరుగుపడింది. ఇప్పుడు ముద్రణ సౌకర్యం వచ్చింతర్వాత నిఘంటువులు అవసరమైనప్పుడు, సందేహం కలిగినప్పుడు శబ్దార్థ జ్ఞానాన్ని, శబ్ద పరిచయాన్ని ఇయ్యటానికి తోడ్పడే గ్రంథాలుగానే పరిగణింపబడుతున్నవి.

# ఉపయుక్త గ్రంథ సూచిక

ఇంగ్లీషు, సంస్కృత పుస్తకాలు:

1. A History of Ancient Sanskrit Literature
   Max Mueller. London, 1859.

2. A History of Sanskrit Literature
   Arthur A. Macdonell. Munshiram Manoharlal, New Delhi, 1972.

3. A History of Sanskrit Literature
   A. Berriedale Keith. Oxford University Press, New Delhi, 1973.

4. A History of Sanskrit Literature Vol I
   S.K. De. Edi. by - S.N. Dasgupta, 1947, University of Calcutta.

5. An Introduction to the Greek Theatre
   Peter O. Anott, 1962. Macmillan & Co. Ltd London.

6. Bhatti - Kavya : A Study - Satpypal Narang
   Motilal Banarsidas, Delhi, 1969.

7. Bhavabhuti - V. V. Mirashi
   Motilal Banarsidas, Delhi, 1974.

8. Bhavabhuti : His Life & Literature
   S.V. Dixit, Belgaum, 1958

9. Budhacarita : Edi. by - E. H. Johnston
   Oriental Books Reprint Corpn., New Delhi, 1972

10. Contribution of Andhra to Sanskrit Literature
    Foreward by - V. Raghavan, Andhra University, Waltair, 1972.

11. Contributions to the History of the Hindu Drama
Manomohan Gosh, Firma K. L. Mukhopadhyay, Calcutta, 1958.

12. Das Ramayana - Hermann Jacobi, (German)
by Dr. S.N. Ghoshal, 1960, Oriental Institute, Baroda.

13. Ghata Kharpara Yamaka Kavya : Preface
Edi. by - Dr. Jatindra Bimal Chaudhari, Sanskrit Duta Kavya Samgraha No.6, Calcutta, 1956.

14. Hamsa Dutta : Preface - Edi. by Dr. Jatindra Bimal Chaudhari, Sanskrit Duta Kavya Sangraha No. 4, Calcutta, 1941.

15. History of Indian Literature - M. Winternitz
Edi. by - Mrs Ketkar, Oriental Books Reprints Corpn., New Delhi, 1972.

16. Historical Maha Kavyas in Sanskrit - Chandra Prabha
Shri Bharat Bharati Pvt. Ltd., Delhi, 1976.

17. Janakiharana of Kumaradasa : A Study of Critical Text & English Translation of Cantos 16 -12.
by - Dr. C. R. Swaminathan, Edi. by - V. Raghavan, Motilal Basnarsidas, Delhi, 1977.

18. Kalhana : Poet historian of Kashmir - Somnath Dhar
The Indian Institute of Culture, Bangalore.

19. Kalidasa : V. V. Mirashi & N.R. Navlekar
Popular Prakashan, Bombay, 1969

20. Kalidasa : A Study - Prof. G. C. Jhala
The Popular Book Depot, Bombay, 1949

21. Katha SaritSagaram - Somadeva Suri
Edi. by - Pt. Durga Prasad & Kashinath Pandurang Parab, Pandurang Jawaji, Bombay, 1930.

22. Mahabharata : Myth and reality
Edi. by - S.P. Gupta & K.S. Ramachandran
Agam Prakashan, Delhi, 1976.

23. Mudrarakshasam : Edi. by - M.R. Kale
Motilal Banarsidas, Delhi, 1976.

24. Natyasastra - tr. by Manomohan Ghosh
Asiatic Society of Bangal, Calcutta 1951.

25. Panini - Theodor Goldstuecker
Chowkhamba Sanskrit series vol XLVIII. 1965.

26. Preface to Mricchakatika - G. Bhat
The New Order Book Co. Ahmedabad, 1953.

27. Sanskrit Drama - A. Berriedale Keith
Oxford University Press, Delhi, 1970.

28. Sanskrit Poetesses -
Jatindra Bimjal Chaudhuri & Roma Chauduri, Calcutta, 1941.

29. Sanskrit & Prakrit Mahakavyas - Ramji Upadhyaya
Sanskrit Parishad Uni. Sagar, 1962.

30. Saundarananda : Edi. by - E. H. Johnston
Motilal Banarsidas, Delhi, 1975.

31. Studies in Gunadhya - S. N. Prasad
Chawkhamba Orientalia, Varanasi, 1977.

32. Studies in Vedic & Indo-Iranian Religion & Literature
Vol. I,II - K.C. Chattopadhyaya, Edi. by - Vidya Niwas
Misra, Bharatiya Vidya Prakashna, Varanasi, 1976, 1978.

33. The Ancient History of the Near East - H.R. Hall
Methen & Co. Ltd. London, 1963.

34. The Classical Accounts of India - Dr. R.C. Majumdar
Firma K. L. Mukhopadhya, Calcutta, 1960.

35. The History of Indian Literature - Albrecht Weber ·
tr. by - John Mann & Theodor Zachariae, London, 1914.

36. The Theatre of the Hindus - H.H. Wilson
Susil Gutpa Ltd. Calcutta 1955.

37. Vasavadata : Edi. by - Louis H. Gray
(Reprint from 1912 copy) motilal Banarsidas, Delhi, 1962.

ఇవే గాక ఈ పుస్తకంలో వచ్చిన కవుల కావ్య నాటకాదులు.

**హిందీ పుస్తకాలు :**

1. కాళిదాస్ గ్రంథావళి - సంపాదక్ - సీతారామ్ చతుర్వేది.
(సమీక్షాత్మకమైంది), భారత్ ప్రకాశన్ మందిర్, అలీగఢ్, వి.సం. 2019.

2. సంస్కృత్ సాహిత్యకా ఆలోచనాత్మక్ ఇతిహాస్ - డా॥ బాబూరాం త్రిపాఠి
వినోద్ పుస్తక్ మందిర్, ఆగ్రా, 1973

3. సంస్కృత్ సాహిత్య కా ఇతిహాస్ - వి. వరదాచారి
అనువాదక్ - కపిల్ దేవ్ ద్వివేది, రామ్‌నారాయణలాల్ బేణీప్రసాద్, అలహాబాద్, 1971.

4. సంస్కృత్ సాహిత్యకా ఇతిహాస్ - బల్దేవ్ ఉపాధ్యాయ్
శారదామందిర్, వారణాసి, 1968.

5. వైదిక్ సాహిత్య ఔర్ సంస్కృతి - బల్దేవ్ ఉపాధ్యాయ్
శారదా మందిర్, వారణాసి, 1958.

6. సంస్కృత్ సాహిత్య కా సంక్షిప్త్ ఇతిహాస్ - వాచస్పతి గైరోలా.
చౌఖంబా విద్యాభవన్, వారణాసి, 1967.

7. చంపూ కావ్య కా ఆలోచనాత్మక్ ఏవం ఐతిహాసిక్ అధ్యయన్
- డా॥ ఛవినాథ్ త్రిపాఠి, చౌఖంబా విద్యాభవన్, వారణాసి, 1965.

**తెలుగు పుస్తకాలు :**

1. సంస్కృత వాఙ్మయ చరిత్ర 1,2 భాగాలు - మల్లాది సూర్యనారాయణ శాస్త్రి
ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు. 1982(భాగం-1), 1961(భాగం-2)